# సంపూర్ణభక్తవిజయము

(మొదటి సంపుటము)

రచయిత

సాహిత్యభూషణ

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎమ్. ఎ., బి. యల్., బి. టి. పి.

పబ్లిషర్సు: అద్దేపల్లి అండుకో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# అవతారిక

ఇది 840 పేజీలు గల రాయల్‌సైజు పెద్దపుస్తకము. దీనిని, గోదావరీ మండల పేరవరగ్రామ వాస్తవ్యులు ప్రస్తుతము మదరాసు హైకోర్టులో వకీలుగా నున్న బ్ర॥ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు రచించి యున్నారు. సత్యనారాయణమూర్తిగారు ఆఱువేలనియోగి బ్రాహ్మణవంశమందు వేంకమాంబామృత్యుంజయులకు జన్మించినవారు. హారితసగోత్రము. వీరితల్లి పెమ్మరాజు నరసింహాముగారి కుమార్తె. వీరిభార్య బ్ర॥ గిడుగు వేంకట నరసింహాముపంతులుగారి కుమార్తెయగు శారదాంబగారు. ఈమె విదుషీమణియును పతివ్రతాశిరోమణియునని నేను యెఱుంగుదును. ఈమెభర్తమాట కెప్పుడును యెదురాడి యెఱుంగదు. ఆయనయు నామెయందత్యంతానురాగముతో నుండును. వారిదాంపత్యము పువ్వునకుందావిబోలె నవినాభావ సంబంధము గల్గియున్నది. సత్యనారాయణమూర్తిగారు స్వయంకృషివలన వృద్ధిలోనికివచ్చినారు. ఎమ్. ఏ. బి. ఎల్. పరీక్షలందు కృతార్థులై ప్రస్తుతమున మదరాసు హైకోర్టులో వకీలుగా నున్నవారు. వీరు కలకత్తా యూనివర్సిటీలో-ఇంగ్లీషు, ఫిలాసఫీ, హిస్టరీ, ఎకనామిక్సు, పాలిటిక్సు, లాజిక్, లా— వీనిలో నుత్తమపట్టములం బొందినవారు. హిందీ, సంస్కృతము, బంగాళీ, పాళీ, జర్మన్, ఫ్రెంచి మఱియు గొన్నిభాషలలో విజ్ఞానము సంపాదించిరి. కలకత్తా యూనివర్సిటీలో 1926 సం॥రమున 'టాగూరులా ప్రైజు' ను పొందినారు. తెలుగులో ననేకగ్రంథములను వ్రాసియున్నారు. ఆంధ్రప్రచారణీ గ్రంథమాలకును, మ. రా. రా. అద్దేపల్లి లక్ష్మణస్వామిగారి సరస్వతీ గ్రంథమండలికిని పెక్కు-గ్రంథములు వ్రాసియున్నారు. ఆంధ్రమహాపురుషుల జీవితములను గ్రంథము రచించి ఆంధ్ర రీసెర్చి యూనివర్సిటీలో 'సాహిత్యభూషణ' బిరుదమును, విజయనగరములో 'భారతీతీర్థ' బిరుదమును పొందియున్నారు. వీరికి మన పూర్వాఋషులయందును పూర్వచారిత్రములందును ఆదరము మెండు. దేశములో నెక్కడనేది చిత్రముకలదనివిన్నను ధనవ్యయముచేసికొని నటకుంజని తత్తద్విషయములన్నియు సమగ్రముగాగ్రహించి తాము గ్రహించిన

విషయమంతయు లోకమున ప్రకటించు అభిప్రాయము కలవారు. వీరనేక పర్యాయములు కాశ్యాది పుణ్యక్షేత్రములకుంబోయి సేవించి వచ్చియున్నారు. కవులయందును, బండితులందును వీరికి గలగౌరవ మపారము. వీరి గ్రంథములు కొన్ని యూనివర్సిటీపరీక్షలకు పాఠ్యగ్రంథములుగా నెలకొల్పబడినవి. కొన్ని గ్రంథములపై నాయభిప్రాయము నొసంగఁబడినది. పెక్కుమంది విద్వాంసులా గ్రంథములఁ నాదరించియున్నారు. ఆయన సర్వదా ఉత్తమగ్రంథావలోకనము, దేశవిశేషణాన్వేషణము చేయుచుందురు.

ఈసంపూర్ణ భక్తవిజయము పండిత పామరులు పఠించి తరించుటకు సర్వామగు సులభశైలితో వ్రాయఁబడినది. ఇందు దీర్ఘసమాసములుగాని, క్లిష్టార్థములుగాని, అనన్వయ వాక్యములుగాని, అపూర్వ ప్రయోగములుగాని లేక చదువ మొదలిడినచో గంగాప్రవాహమువలె ప్రవహించుచున్నది. భక్తుల చరిత్రములు చదువుకొనుట కెట్టిశైలి యుండవలయునో అట్టిశైలియందుగలదు. ఇట్లుండియు నిందు।సామాన్యముగా గ్రామ్యపదములు నెలకొల్పబడి యుండ లేదు. 294 వ పుటలో "పూర్వజన్మమున నొకడు పొందిన యభివృద్ధి నాటి జన్మాంతమందలి చితియందు గ్రమ్మిపోక తరువాత పుట్టుకకు ముఖ్యమగు మెట్టగు నని యిదివరలో దెల్పియుంటిని. జీవాత్మయొక్క అభివృద్ధికి జగదీశుడు జన్మ జన్మములయందు తరుణములను బ్రత్యేకము చేయుచుండును. గతజన్మమున కడచిన ఘట్టమునుండి తరువాత ఘట్టమును జేరుసమయము నాతిడు మానవున కొనగును" ఇట్లిందలి శైలియుండును. దీనివలన వీరు పూర్వజన్మము కలదనియు తత్తత్కర్మఫలము లుత్తరోత్తర జన్మలందు పొందఁబడుచుండుననియు, నిందు చెప్పియున్నారు. పూర్వజన్మము లేదనువారు వీరి యీవాక్యములం జదివి విజ్ఞానముం గలిగించుకొందురుగాక. విగ్రహారాధన చేయదగినదియేయని యీగ్రంథమున దయానంద సరస్వతీ స్వామికథలో పేర్కొనబడియున్నది. మరియు నాకథలో ధర్మము, అధర్మము, పుణ్యము. పాపము, సత్యము, అసత్యము, విశ్వాసము, అవిశ్వాసము, ఇహము, పరము, జన్మము, మరణము, స్వర్గము, నరకము, విద్య, యవిద్యలోనగు ననేక విషయములు చర్చింపబడినవి. భాస్కరానందసరస్వతీ కథలో యోగము, మూలాధారాది చక్రములు లోనగునవి చక్కగా వ్రాయఁబడినవి. శంకరాచార్యుని చరిత్రములో ఆచార్యుల

వారి "మోహముద్గరము" సుబోధకము గావించిరి. దీపాంకురస్వామి చరిత్రలో హిందూబుద్ధులు, బౌద్ధసన్యాసులం బేర్కొని మనకిరువురు బూజ్యులని నిర్ణయించిరి. శ్రద్ధానందస్వామి చరిత్రమునందును అర్జునస్వామి చరిత్రయందును మనభగద్గీతవంటి యుత్తమ గ్రంథము ప్రపంచమున లేదనియు అది లోకరక్షణదైవత గ్రంథమనియు, సిద్ధాంతీకరించిచెప్పిరి. విష్ణుపురిగోస్వామి చరిత్రలో సనాతనమతవిభూతి యెంతో చక్కగాచెప్పిరి. అర్జునస్వామిచరిత్రలో సేవాధర్మములు, పశ్చాత్తాపము, విశ్వాసము, అనుకూలదాంపత్యము లోనగునవి చిత్రించిరి. గుహుని చరిత్రలో నతని రామభక్తి నత్యంతముగా వర్ణించినారు. నామదేవుని చరిత్రములో మన మహాపురుషులు చచ్చిన వారిని బ్రతికించుట, నీళ్ళపై నడచుట, నిప్పుపై నిలచుట, లోనగు సద్భుతచర్యలు, అసత్యములు గావనియు, క్రీస్తుకూడ నట్టి మహాద్భుతములు చేసినట్లు బైబిలు చెప్పుచున్నదనియు చెప్పి మనపూర్వుల వాక్యములను స్థిరీకరించినారు. మఱియునిత్యాదులనేకధర్మములు, నీతులు, ఆచారములు లోనగునవి నిందు పేర్కొనబడినవి.

ఈ సంపూర్ణ భక్తవిజయమునందు 65 గురు భక్తుల చరిత్ర లుదాహరింపబడినవి. అందతిప్రాచీనములు, ప్రాచీనములు, మధ్యములు, నవీనములు, ఆధునికములు, నగు భక్తులచరిత్రలు కలవు. ఆభక్తులలో బ్రహ్లాదుడు, గుహుడు, కుచేలుడు, ధ్రువుడు, హనుమంతుడు, భీష్ముడు, భద్రాద్రిరామదాసు, దయానందసరస్వతి, తుకారామయోగి, తులసీదాసు, కబీరుదాసు శంకరాచార్యులు, రామకృష్ణపరమహంస లోనగు వారి చరిత్రలతిమనోహరములు భక్తిప్రపూరితములు. ఈగ్రంథాదియందాధునికులలో బేర్కొనంబడెడు త్రైలింగస్వామిచరిత్ర వ్రాయుటంజేసి నాకు కల్గిన యానందమింతయని చెప్ప నశక్యమైనది. ఈ మహాయోగి చరిత్రాంశములు సంపాదించుటకు మన సత్యనారాయణమూర్తిగారెంతో శ్రమపడియుందురనియు వారి యన్వేషణశక్తి మహోత్తరమైనదనియు సంతసించితిని. త్రైలింగస్వామి యను పేరుచేతనే నీతడాంధ్రబ్రాహ్మణుడని తెలియుచున్నది. ఈతడు కాశీలోనున్న కాలములో ననేకాద్భుతకార్యములు చేయుట చూచినవారనేకులు నాతో జెప్పియున్నారు. నేను వారి దర్శనము చేయవలయునని యెంతో ప్రయత్నించితిని కాని నాకా

యదృష్టము పట్టలేదు. నిన్నగాక మొన్న కాశీపురమునుండి, యెన్నో మహాద్భుతము లెల్ల రేఱుంగునట్లొనరించినవాని చరిత్రములోని విషయము లసత్యములు కావనుటకు నెన్నోనిదర్శనములు కలవు. ఎందరో చూచినవా రిప్పటికిని జీవించియుండి మనకు సాక్ష్యమిచ్చుచున్నారు. దీనింబట్టి మనపూర్వ మహర్షులొనరించిన మహాద్భుతకార్యములన్నియు మనము విశ్వసించుటకు గ్రంథాదియందున్న యీత్రైలింగస్వామిచరిత్ర యాధారమగుచున్నది. ఇందున్న భక్తులచరిత్రలన్నియు నుత్తమములైనవే. శ్రీరామకృష్ణపరమహంస చరిత్రము విస్తరించి పెంచివ్రాసియున్నారు. అట్లుచేయుట పరమోత్త మము. ఆధునికులలో చేరిన రామకృష్ణపరమహంసవంటి పరమభక్తుడు తొంటి నుండియు లేడని చెప్పినను మనకు దోషమురాదు. ఆగురుమూర్తిచరిత్ర మంతయు జగత్ప్రఖ్యాతింగావించి మనదేశమునకు మన సనాతనధర్మములకు ప్రఖ్యాతిందెచ్చినవాడు వివేకానందస్వామి. ఆతనిచరిత్ర మీభక్తవిజయమున చేర్పకుండుట గ్రంథమునకు కొంచెము లోపమేయని నానమ్మకము. గ్రంథకర్త గారీలోపమును ద్వితీయ ముద్రణమందుగాని ద్వితీయ భాగమందుగాని సవరించుకొందురుగాక. పోతనామాత్యునిచరిత్ర మెంతో చక్కగా వ్రాసినారు. అందు నడుమనడుమ యతడు రచించిన భాగవతములోని పద్యము లుదాహ రించినారు. అవి బంగారములో మణులు దాపినట్లున్నవి. ఈతని చరిత్రముతో శ్రీనాథుని చరిత్రమునకు సంబంధము కలిగించుటచింత్యము. శ్రీనాథుడు, పోతనయు, సమకాలికులు కారని తెలియుచున్నది. అయినను గ్రంథపరిశోధకు లలో నగ్రగణ్యులగు సత్యనారాయణమూర్తిగారు విచారించియే వ్రాసి యుందురని తలంచుచున్నాను. ఈగ్రంథము వేమనయోగి చరిత్రముతో ముగించినారు. ఆదియందాంధ్రుడు, అంత్యమందాంధ్రుడు; గ్రంథకర్త యాంధ్రుడు, గ్రంథమాంధ్రము—ఆంధ్రులకు సంతోషదాయకము.

ఈభక్తులచరిత్రలలో పాఠకమహాశయులు గ్రహింపవలసిన విషయము లెన్నియోకలవు. అవన్నియు గ్రహించి ఐహికాముష్మికసుఖములం బొందగల రని నానమ్మకము.

రాజమహేంద్రవరము
15—2—1943

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

# విజ్ఞప్తి

కృతికర్త మ. రా. శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి వంశాభివర్ణనమును పాండిత్యాతిశయమును శ్రీకవిరాజు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారిచే అవతారికయందు విపులముగా విశదీకరింపఁబడియున్నవి. వీరు ఆంగీరస, అంబరీష, యువనాస్వ ఋషిప్రవరాన్వితమగు హారితసగోత్రీకులు. వీరి కిలువేలుపు కామేశ్వరమ్మ.

వీరు విద్యాభ్యాసము నిమిత్తము ఉత్తరహిందూస్థానమునకు జని నప్పటినుండియు మాకు సుపరిచితులు. కలకత్తాలో కళాశాలలయందు చదువుచు అచటి బంగాళీ పాళీ మొదలగు భాషలందు పరిశ్రమజేసి నేర్చుకొని తద్దేశోత్తమకవుల ప్రసిద్ధవచనకావ్యముల నాంధ్రీకరించి ప్రచురణార్థము మా సరస్వతీ గ్రంథమండలికి పంపుచుండిరి. బాల్యమునుండియు ననగా విద్యార్థిదశనుండియు సారస్వతోపాసకులయి తద్విషయిక సహాయము మాకు ఎక్కుడుగా కూర్చుచుండిరి.

ఇటులుండగా, ఆంధ్రమున నిదివరలో ప్రచురింపబడిన భక్తుల చరిత్ర గ్రంథములు నేను చదువుట తటస్థించినది. ఆగ్రంథములయందు , ఉత్తర హిందూస్థానభక్త శేఖరుల చరిత్రలు సంఖ్యకు మిక్కిలి తక్కువగా రచియింపబడి యుండుటజూచి యాప్రాంతభక్తవరుల చరిత్రల నెక్కుడుగా రచియించిన పుస్తకమొకటి వ్రాయించి ప్రచురింపవలెనని నాకు కుతూహలము గలిగి నాయభిప్రాయము శ్రీసత్యనారాయణమూర్తిగారి కెఱింగించితిని. ఆయనయు దైవభీతియు ఆస్తికభావమును వేదాంతపరిజ్ఞానము గలిగియున్న పండితాగ్రేసరుడగుటచే నాఆశయమునకు అనుమోదించి తామట్టిగ్రంథము రచియించి యొసంగెద మని వాగ్దానముచేసి పెక్కుసంవత్సరములు దీక్షతో దేశదేశములు, పుణ్యక్షేత్రములు, దివ్యస్థలములు సందర్శించి ఆయాప్రాంతముల యందలి మహాత్ముల సేవజేసి ధనవ్యయమునకును శరీరశ్రమకును ఆలోచింపక తమ యర్ధాంగి దీర్ఘఋజాధీనయయి యుండినను, తమకు యితరవిద్యాభ్యాస

వ్యాపకము లెక్కువగానుండిసను సావకాశము కల్పించుకొని సంపూర్ణభక్త విజయ మను పేరుతో రచియించి సర్వస్వామ్యముఁతో ప్రచురించుకొనుటకు మాకొసంగిన శ్రీ సత్యనారాయణమూర్తిగారికి మాకృతజ్ఞతాపూర్వకవందన శతమ్ములు. భరతదేశౌన్నత్యము ప్రపంచమునకు చాటగల యిట్టిగ్రంథము లింకను రచియించుటకు శ్రీ సత్యనారాయణమూర్తిగారికి భగవంతుడు ఆరోగ్యమును ఆయుస్సును దయచేయుగాక. ఈదంపతులకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యసంపదలు చేకూర్చుగాక యని లోకరక్షకునికి ప్రణామములు ఘటించు చున్నారము.

గ్రంథకర్తగారియందలి మిత్రభావముచేతను మాయందుగల ఆదర భావముచేతను ఈగ్రంథమునకు పీఠికవ్రాసి దయచేయవలసినదని ప్రార్థించిన మాత్రమున, శ్రమయనుకొనక గ్రంథమామూలాగ్రము చదివి వృద్ధులయ్యు తమకితర ముఖ్యకర్తవ్యము లనేకము లుండియు మాకు అవతారిక వ్రాసి యొసంగిన శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజు, కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ, వేదవిద్యావిశారదాది బిరుదవిరాజమాన, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి శతసహస్రవందనములు.

ఈగ్రంథము ముద్రించుటయందును అవసరమగుచోటుల పరిష్కరించుటయందును ప్రారంభమునుండి సమాప్తమగువఱకును మాకత్యంతసహాయ మొనరించిన భీమవరముతాలూకా చెరుకువాడ గ్రామవాసులు, చెరుకువాడ వేంకటరత్నముగారి పుత్రులు శ్రీ వేంకటరామయ్యగారికి భగవంతుడు ఆయురారోగ్యసంపదలొసంగి బ్రోచుగాత.

ఈప్రపంచయుద్ధానంతరమున కాగితములకఱవు తగ్గినపిదప ఈగ్రంథ ద్వితీయసంపుటము ప్రకటింపవలెనని తలంచుచున్నాము.

రాజమహేంద్రవరము — ప్ర కా శ కు లు

చిత్రభాను సంII మాఘ శు ౧౧ శీ సోమవారము — 15 ఫిబ్రవరి 1943

# సంపూర్ణభక్తవిజయము



గ్రంథకర్త

# సంపూర్ణభక్తవిజయము



శ్రీమతి శారదాంబగారు

అంకితము

నాయారాధ్యదేవి
శారదకును
నాయర్ధాంగలక్ష్మి
శారదకును

# విషయసూచిక

# దైవ ప్రార్థనము



సీ. కలిత శుండాదండ గండూషితోన్ముక్త
సప్తసాగర మహాజలధరములు
వప్రక్రియాకేళి వశవతీర్ణసువర్ణ
మేదినీధరరత్న మేఖలములు
పక్వజంబూఫల ప్రకటసంభావనా
చుంబితభూభృత్కదంబకములు
వికటకండూలగండక దేహమండలీ
ఘట్టిత బ్రహ్మాండకర్పరములు
గీ. శాంభవీశంభు లోచనోత్సవకరములు
వాసవా ద్యమృతాశన వందితములు
విఘ్నరాజ మదోల్లాస విభ్రమములు
మించి విఘ్నోపశాంతి గావించుఁగాత.

ఉ. శ్రీయన గౌరినాఁబరఁగు చెల్వలచిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముఁదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యనిపల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

శా. శ్రీమంతంబయి దేశకాలముల నచ్ఛేద్యంబునై దివ్యతే
జోమూర్తంబయి యద్వితీయమయి సంశుద్ధాత్మకంబై కృపా
ధామంబై యలరారుబ్రహ్మమున కంతర్యామికి న్నీకు నేఁ
గై మోడ్పు ల్పచరింతు భక్తిమయదీక్షన్ శ్రీకృపాంభోనిధీ!

శా. శ్రీరామామణిపాణిపంకజ మృదుశ్రీతజ్ఞ పాదాబ్జశృం
గారాకారశరీర చారుకరుణాగంభీర సద్భక్తమం
దా రాంభోరుహపత్రలోచన కళాధారోరుసంపత్సుధా
పారావారవిహార నాదురితముల్ భంజింపు నారాయణా.

శా. ఓ నారాయణ యోమురాసురహరా యోభక్తచింతామణీ
యోనీలాంబుదవర్ణ యోగుణనిధీ యోలోకరక్షామణీ
యోనీరేరుహపత్రనేత్ర కృపనాయుల్లంబులోనుండవే
యోనావేభవబంధముల్ చెఱుపవే యోదేవకీనందనా!

శా. గోవిందాయ నమోనమో భగవతే గోపాలభర్త్రే నమో
దేవేశాయ నమోనమో మురభిదే దిక్పాలకర్త్రే నమో
భావజ్ఞాయ నమోనమో మదహృతే పాపప్రహర్త్రేనమో
జీవస్థాయ నమోయనంగశుభముల్ చేకూఱు మాకెప్పుడున్.

చ. కరము విచారి తద్దయు వికారి మనం బది సారివోలె నే
దిరిగెడుఁగాని నిల్వ దెడ దీని చలత్వము మాని నీపదాం
బురుహములంద సంస్మరణ బొంద దయన్ సురబృంద వంద్య సు
స్థిరముగ నిల్పు తత్త్వవిధిఁ దెల్పు సమస్థితి సల్పుశంకరా.

ఉ. భారతివై సరోజభవుపాల వసించి రమావధూటివై
నీరజనాభుఁ జెంది ధరణీధరనందనవై మహేశ్వరుం
గోరి వరించితమ్మ నినుగొల్వక యూరక యేలగల్గుసం
సారసుఖంబు లీమనుజసంతతికిన్ దలపోయనంబికా.

శా. ఓసర్వేశ్వరి యోమహేశ్వరసతీ యోదివ్యమూర్తిత్రయీ
యోసిద్ధాంబిక యోకదంబవనలీలోద్యానహృద్యా శివా
యోసంసారరుజాపహారనిపుణా యోమంత్రతంత్రాత్మికా
నాసంసేవన చిత్తగించి దయతో నన్నుంగటాక్షింపవే.

గీ. దుర్మదేంద్రియ దుర్వృత్తి ద్రుంచి వంచి
మనము పరమేశ్వరధ్యానమగ్నులగుచు
గడపి తమజీవితములు మోక్షమునుగొన్న
భక్తవరులకు సాష్టాంగవందనములు."

---

౧

# త్రైలింగస్వామి



"అమితాశావశమైన నామది నవశ్యంబైన మోహాంధకా
రము కారుణ్యకటాక్షవీక్షణవిభారాశిన్ విఘాలించి నె
య్యమునం బ్రోచు దయాపయోధి ఘనబృందారణ్యకర్మందిబృం
దమనోలోచనసాధుసేవధి ప్రమోదం బొప్ప నెల్లప్పుడున్."

దక్షిణవిజయనగరమున కనతిదూరమున నున్న హోలియా యనుపల్లెయందు త్రైలింగస్వామి జన్మించెను. ఈతని తండ్రి నృసింహదేవశర్మ తనకుచాల కాలము మగసంతానము కలుగకుండుటచే ద్వితీయవివాహము చేసికొనెను. ప్రథమ భార్య పుత్త్రసంతానములేమికి మిగులచింతించి తత్ప్రాప్తికి పెక్కువ్రతములు చేయుచుండెను. నిత్యము నీశ్వరారాధనమునందే కాలముగడపుచుండెను. కొన్ని నాళ్ల కామె నోములు ఫలించి యామె కొకపుత్త్రుడు జన్మించెను. ఈశ్వరకటాక్షమునబడసినకుమారుడగుటచే, తల్లి వానికి శివారాము డని పేరు పెట్టెను. శివారామునిజనని బుద్ధిమతి; ధర్మపరాయణ; సద్గుణసంపన్న. తల్లిపాలతో గూడ నాత డామెపవిత్రగుణములనుగూడ గ్రోలెను. ఆతడెప్పుడును బొంకినవాడు గాడు. దుర్జనులతో సహవాసము చేసి యెఱుగడు. ఎల్లప్పుడు సత్క్రియలొనరించుచుండువాడు. ఈతడైదేండ్లవాడై యుండగా జనకుడు కాలధర్మము నొందెను. భర్తృవిహీనయయ్యును శివారామునితల్లి యీతనికి విద్యాబుద్ధులు చెప్పించుటయందు దుశ్రద్ధ వహించెను. అల్పకాలముననే బాలుడు అఖిల శాస్త్రములయందును, అసాధారణప్రజ్ఞ నడసెను.

మొదట, వివాహము చేసికొనుట కిష్టము లేనివాడయ్యును మాతృదేవతబలవంతమున నితడు పెండ్లియాడక తప్పినదికాదు. జనని జీవించి యున్నంతకాలము నితడు సంసారసాగరమున నీదులాడుచుండెను. ఇరువదియెనిమిదవయేట నితనికి మాతృవియోగము సంప్రాప్తించెను. అంతటినుండియు నితడు విరాగియై గృహము విడిచి శ్మశానవాటికయందు నివసించి భగవద్ధ్యానము చేయుచుండువాడు. సవతితమ్ముడును బంధుగులును స్నేహితులును

శ్మశానము వీడి గృహమునకు రమ్మని యెన్నివిధముల ప్రార్థించినను వినక దృఢచిత్తుడై శివారాముడు తనసంకల్పము పరిత్యజింపలేదు. తనసంపద నంతయు తమ్ముని కొసగి పాపభూయిష్ఠమయినసంసారమున తా నిక నడుగుపెట్ట ననియు నింతవరకు జననినిర్బంధముచే సంసారపంజరమున బంధింపబడియుంటిననియు నామెను గోల్పోయినయాతరుణము తన కే[illegible]మెవదనియు నతనితో వాక్రుచ్చెను. అంత నతనిసోదరుడు శివారాము [illegible] కాడని నిశ్చయించుకొని, యూరావున నతనినిమిత్త మొకయ[illegible]ర్పించెను. ఆయాశ్రమంబున నానందముతో శివారాముడు యోగాభ్యాసము ప్రారంభించెను.

కొన్నిసంవత్సరము లందుండి యతడు తీర్థసేవాసక్తుడై కదలిపోయెను. మార్గమధ్యమున నతని కొక పరివ్రాజకు డెదురయ్యెను. అతడు కడువృద్ధు అతని మహత్త్వము గురితించి శివారాము డతని శిష్యు డయ్యెను. అప్రయత్నముగ గురువర్యుడు లభించినందుల కత డమందానందము నొంది యాతనిచెంత యోగశిక్ష నభ్యసింపదొడగెను. గురువర్యుడును శిష్యుని సద్గుణములు గ్రహించి యమితముగా నానందము జెంది యతనికి జ్ఞానోపదేశము చేసెను. విజ్ఞానధను డగుశివారామున కయ్యాచార్యుండు త్రైలింగస్వామి యనునామధేయ మిచ్చెను.

ఆచార్యుడు పరమపదము జేరినపిమ్మట త్రైలింగస్వామి సేతుబంధరామేశ్వరమున కరిగెను. అచ్చట శిష్యులు [illegible] ంరి. ఈత డాక్షేత్రము నందే తనజీవన మంతయు గడప నెంచెను. ఈత డాక్షేత్రమునం దొకప్రసిద్ధి వడసినవ్యక్తిని మృత్యువాతనుండి తప్పించెను. ఆగతానాగతముల దెలుపుచుండెను. ఇట్టి యద్భుతచర్యలకు ప్రజ యాశ్చర్యము జెంది యనవరతము నితని దర్శింపవచ్చుచుండిరి. ఆశ్రమ మప్రశాంతము జనసంకులమై యోగనిష్ఠకు భంగము వాటిల్లదొడగెను. అచట నుండుట శ్రేయస్కరము కా దని వెంటనే కదలి యతడు నేపాలుసీమకు పోయెను. అందుకూడ స్వామిజీయొక్క యద్భుతచర్యలు ప్రజాసమూహమును మిక్కిలి యాకర్షించుటచే నితని యోగాభ్యాసమునకు భంగము వాటిల్లెను. అందుచే నేపాళమునుగూడ వీడి యితడు టిబెట్టుదేశము చేరెను. కొంతకాల మచట గడపి పిదప మిగులప్రశాంతమగు మానససరోవరమున కరిగి పరమసంతోషమున నచట ధ్యానసమగ్నుడై కాలము

గడుపదొడగెను. పెక్కుసంవత్సరములు తుషారాద్రిదరిని యితడు విడిసి యోగసాధనమున సిద్ధివడసి మోక్షప్రదమగు వారణాసీక్షేత్రమునకు వచ్చెను. ఆక్షేత్రమున పెక్కుఘట్టములయందు కొంతకాలము గడపి చివర కితడు పంచగంగాఘట్టమున స్థిరవాస మేర్పరచుకొనెను. అచటఁ బల్వురకు యోగశిక్ష నొసగుచు నసామాన్యకృత్యముల నెఱపుచు ప్రజల ను స్తంభింపజేయగలిగెను.

హుగ్లీ జిల్లాయందు (బంగాళమున) శ్రీరామపురమను పట్టణ మొకటి కలదు. అందు జయగోపాలుడు వసించుచుండెను. సంసారము రోసి యాతడు కుటుంబభారము పెద్దకుమారునియందు బెట్టి వారణాసి చేరెను. త్రైలింగస్వామి ప్రతిభ వినినవాడు గావున నిత్యము నమ్మహాత్ముని దర్శింప నేగుచుండువాడు. విరాగులయెడ జయగోపాలునికి భక్తి మెండు. దేవపూజకును సాధుసేవకును పాలును పండ్లును పుష్పములును నెల్లప్పుడును తీసికొనిపోవుచుండువాడు. కొంతకాలమునకు త్రైలింగస్వామిదృష్టి యాతనిపై ప్రసరించెను. మునికుంజరుడు తనయెడ ప్రసన్నుడైనందుల కతడు మిక్కిలి సంతసించెను. తత్తరపాటున నొకనాడాతడు స్వామిజీపాలి కరిగి "గురూత్తమా! నాచిత్త మేలనో నేడు సంక్షుభితమైనది. అమంగళ మేదేని నాటిల్లనున్న దేమో తెలియకున్నది" అని వాక్రుచ్చెను. స్వామిజీ సమాశ్వాసవాక్యముల నాతనిని శాంతింపజేసి "ఇప్పుడే నీగృహవార్త తెలి[illegible] ను ని[illegible]చుక తడయుము" అని పలికి క్షణము నిమీలితనేత్రుడై యుండి యే[illegible]యగోపాలుని కేమియుం దెలుపక భోజనము చేసి సంధ్యాసమయమున తిరిగి రమ్మని యాతనితో పలికెను. సాయంసమయమున కాతడు తిరిగి రాగా యోగివరు డాతని నాదరపూర్వకముగ సమీపమునకు బిలిచి "వత్సా! నేటియుదయమున విశూచిరోగముచే నీపెద్ద కుమారుడు చనిపోయెను. నేటిరాత్రి నీనందనుని నీవు స్వప్నమున గాంచెదవు" అనెను. పిడుగువలె నీదారుణవార్త చెవిని పడినంతనే దుఃఖ మాపుకొనజాలక జయగోపాలుడు గోలుగోలున విలపింపసాగెను. పుత్రస్నేహదుఃఖముచే మిక్కిలి పరితపించు జయగోపాలుని నవలోకించి యోగివరు డుపదేశవాక్యములచే నాతని నిట్లూఱడిల్లఁజేసెను.

"వత్సా! ఈశ్వరుడు తక్క పృథ్వియం దెల్లవస్తువులు ననిత్యములు. ఏది చిరస్థాయికాదో—యేది క్షణభంగురమో—యేదియిప్పుడు గోచరించి పర

క్షణమున నదృశ్యమగునో దానికై వగచుట యజ్ఞానము. ఈయజ్ఞానమే మానవుని మనసును కప్పివేయుయవనిక. అజ్ఞానాంధకారముచే నెవనిహృదయము కప్పబడి యుండునో యతడెన్నడు చిత్తశాంతి నందజాలడు. ఆలోకనమునకు నజ్ఞానమునకు నెంతభేద మున్నదో జ్ఞానమునకును నజ్ఞానమునకు నంతభేద మున్నది. అంధకారము విషాదము నాపాదించును; భ్రమను పుట్టించును. ఆలోకము విషాదమును నశింపజేయును; భ్రమను రూపుమాపును. చీకటిలో నడచువాడు, చెట్టుమోడు విలోకించి మనుజు డనియు, త్రాడు చూచి పా మనియు భ్రమించులాగున, అజ్ఞాన మనుచీకటియందు సంచరించు పురుషుడు అనుక్షణము భ్రమ జెందుచుండును. తమమున నడచుచు నపాయరహితమైన స్థానములయందును కూపమున కూలుచుంటి ననిభయపడు మానవునిలీల అజ్ఞానియెల్లప్పుడు శంకాన్వితస్వాంతు డగుచుండును. జ్ఞానవికాస మందునప్పుడు ప్రపంచమంతయు యథార్థరూపమున వానికి గోచరమగుచుండును. అంధకారమున జనుడు భ్రమ జెంద నేలయని నీ వడుగవచ్చును. తమోరూపమున నున్న తెర యెల్లపదార్థములను గప్పివేయుటచే భ్రమ జనించుచున్నది. విజ్ఞానాలోకముచే నాభ్రమ యనుయవనిక మాయమగును. అపుడు వస్తువుయొక్క నిజస్థితి మనము కనుగొనజాలుదుము. నీహృదయమిపు డజ్ఞానముచే నావరింపబడియున్నది. అందుచే తనయునికొరకు విలపించుచుంటివి. జ్ఞానద్యుతి నీహృదయసీమను దోచినంతనే నీతనయుడు నీ కేమియు కా డని గ్రహింపగలుగుదువు.''

అనంతరము జయగోపాలుడు నిజగృహమ్మునకు జనెను స్వామిజీ చెప్పిన చొప్పున నారాత్రి స్వప్నమం దాతనికి తనయుడు గన్పట్టెను. మఱునాడు కుమారుడు చనిపోయినవార్తయు తంతివార్తమూలమున నతడు గ్రహించెను. స్వామివచించినవిషయము సత్యదూరము కా దని యతడు తెలిసికొనెను.

కాశీలో హరిశ్చంద్రఘట్టమునకు సమీపమున, పాముకాటుచే నొకడు మరణించెను. అతనిబంధువులు శవమును గంగలో బడవైచుటకై నదీతీరమునకు తెచ్చిరి. ఆసమయమున త్రైలింగస్వామి తీరమున కనతిదూరమున నదిలో నీటిపై తేలియాడుచుండెను. మృతుని యర్ధాంగి జవ్వని; సుందరాంగి; నిజేశు డకాలమృత్యువాత బడుట కెంతయు దుఃఖించుచు నదీతీరమున రోదన మొనరించుచుండెను. స్వామి యామెదుఃఖమునుగాంచి దివాలున యొడ్డున కరుదెంచి,

యేమియు బలుకక యించుకసుట్టి గంగలోనుండి తీసి పాముకరచినకాటుపై దాని నునిచి నదీగర్భము జొచ్చి యంతర్ధాన మయ్యెను. శవమును గొనితెచ్చిన వా రెవ్వరీస్వామి నిదివరకు చూచియుండలేదు. యోగి యదృశ్యుడు కాగానే శవమున కించుకచైతన్యము రా దొడగెను. క్రమముగా సజీవుడై లేచి తనయవస్థయు తనయర్థాంగిస్థితియు నవలోకించెను. దాపుననున్నవా రాశ్చర్యమున మునింగిరి. "న న్నేల నిచటికి గొనివచ్చి" రని సజీవుడైన యామానవు డడిగెను. బ్రహ్మానందభరితులై కట్టుత్రాళ్లు విప్పి సూత్రియులంద ఱాతని నాలింగనము జేసికొనిరి. విగతజీవునకు ప్రాణదానమును దురంతచింతాక్రాంత యగునాతని భార్యకు పతిభిక్షయు నొసగినమహాత్మునికి నదీనీరమున ధ్యానమగ్నుడై యున్న సంయమికి, భక్తిపూర్వకముగా నమస్కరించి వా రెల్ల రిండ్లకు జనిరి.

ఆతడు, మిక్కుటముగుశీతబాధ కోర్చి యాహారనిద్రలు పరిత్యజించి నదీనీరముపై దేలియాడుచుండెడు వాడు. మండువేసవియందు తెగకాలుచున్న ఱాతిపై కూరుచుండువాడు. వారణాసి కరుదెంచినదాది యాతడు కొలది మందితో మాత్రమే సంభాషించుచుండువాడు. ఆహారముపై వాంఛ లేక మౌనమున నుండువాడు. దినమున కొకసారి యాతనిశిష్యులు బహుప్రయత్నమున నాతని కాహారము బెట్టుచుండువారు. ఒకసారి కొందఱుదుష్టు లతడు కపటయోగియని తలచి, తగినశాస్తి చేయదలచి యొకపాత్రను సున్నపునీటిచే నింపి పాలని త్రోలుటకై స్వామిజీ కొసంగిరి. ఆదుర్మదులయుద్దేశము గ్రహించి వారి నొకమాఱు తేఱిచూచి, యేమియుం బలుకక చిరునవ్వు నవ్వి యాసున్నపునీటిని త్రాగివైచెను. ఆజలమును గొని తమమోసమును గుర్తించి స్వామిజీ యాగ్రహించు నని యాదుష్టులు భయపడి దూరమున తొలగియుండి యాయోగి చలింపనిమనస్కుఁలవాడై సున్నపునీటిని నిజముగక్షీరములవలె త్రోలుట కనుగొని విస్మయపడి చెంత కరుదెంచి తమయపరాధమును మన్నింపు డని స్వామిని వేడుకొనిరి. కాని స్వామి వారిమాటలు వినుపించుకొనక వారు చూచుచుండగనే తానుద్రావినయాసున్నపునీరు మూత్రమార్గమున విడిచివైచెను. అతని యసాధారణశక్తి గాంచి యాదురాత్ములు నిశ్చేష్టులైరి.

ఆంగ్లేయులపాలనమున నెవరుగాని దిగంబరులై చరించుట శాసనవిరుద్ధము. కాశీపురమున త్రైలింగస్వామి వస్త్రవిహీనుడై చరించుట గాంచి

రక్షకభటులు పలుమాఱు వారించిరి గాని స్వామిజీ వారిపల్కులను పాటించిన వాడు కాడు. ఒకనాడాతడు గంగాతీరమున దిగంబరుడుగా కూర్చునియుండ రక్షకభటు డొక డరుదెంచి స్వామిజీని పోలీసుస్టేషనుకు రమ్మనెను. అ త్తతి నతడు ధ్యానమగ్నుడై బాహ్యజ్ఞానము లేనివాడుగా నుండుటచే వాని కుత్తర మొసగలేదు. తనవంటిఘనునకు సన్యాసి మాఱుపలుకకుండుట అధికారి తిరస్కారముగా భావించి, కోపగించి యారక్షకభటు డతని కొట్టసాగెను. స్వామిజీశిష్యులుకొందఱు పర్వాపర్వాన నచటికి వచ్చి రక్షకభటున కడ్డువచ్చిరి. అంతట నాతి డాగ్రహావేశుడై వడివడి స్టేషనుకడ కరిగి భటాధిపతి కా యుదంతము దెలిపెను. అప్పుడు పలువురు రక్షకభటు లాయుధపాణులై వచ్చి మోటు తనమున స్వామి నీడ్చుకొనుచు స్టేషనుకు బోయిరి. మఱునా డాభటులు స్వామిజీని మేజస్ట్రేటుసన్నిధిమున నిలువంబెట్టిరి. స్థిరచిత్తుడై యేమియుం బలుకక యోగీంద్రుడు నిలువంబడియుండెను. తమయాచార్యుని విడిపింప నాతనిశిష్యు లొకన్యాయవాదిని నియోగించిరి. "మహాశయా! ఈతడు మహాపురుషుడు. ఇతనిచిత్తము నిర్వికారము. వస్త్రధారణ మీామహానీయుని కేల?" నని న్యాయవాది న్యాయమూర్తి నుద్దేశించి పల్కెను స్వామిజీ నిర్వికారచిత్తు డగునో కాదో గ్రహింపదలచి తనభోజనపాత్రమున మిగిలినపదార్థములను భుజింపు మని మేజస్ట్రేటు యోగినుద్దేశించి పల్కెను. న్యాయమూర్తి యుద్దేశ మును గ్రహించి "అయ్యా నేను తినుపదార్థమునందించుక మీరు భుజింతు రేని మీయెంగిలి నేనుగొందు" నని తోడనే మలము వీడి యందఱు చూచు చుండ త్రైలింగస్వామి దానిని భుజించెను. యోగీంద్రుని యమానుషచర్య పరికించి విస్మయము జెంది, దిగంబరుడై యిచ్చవచ్చినతెఱగున నతడు మసలు టకై యనుమతి నొసగి మేజస్ట్రే టాతని విడిచిపుచ్చెను.

కాశీరాజు బంధువుడును యాతనిప్రధానోద్యోగియునగు పృధివీసింగు రామ నగరమునుండి (ఈనగరము వారణాసి కించుకదూరమున నది కావలియొడ్డునం గలదు) పడవపై కాశీకి వచ్చుచుండెను. స్వామిజీ యపుడు నీటిపై పద్మాసనమున తేలియాడుచుండెను. పృధివిసిం గాతని జూచి యాశ్చర్యపడి యాత డెవ్వ రని దాపుననున్నవారి నడిగెను. పడవవాండ్రందఱు త్రైలింగస్వామి నెఱుగుదురు. యాత డొకగొప్పయోగి యని వారు బదులుచెప్పిరి. పృధ్వీసింగు నౌకర్లు

త్రైలింగస్వామిమహిమ వినియుండిరి గాని యాతని నెన్నడు చూచినవారుకారు. తమయేలికసమక్షమున వా రాయోగిని మిక్కిలి ప్రశంసించిరి. పడవను సన్యాసి చెంతకు పోనిమ్మని పడవవాండ్రకు సింగు ఆజ్ఞ యిచ్చెను. వారట్లు గావించి నంతనే పృథివిసింగు నమస్కరించి నావలోనికి దయచేయుడని పలుమా రాయోగీశ్వరుని వేడెను. తోడనే స్వామి నావలోని కరిగెను. పృథివిసింగు సంతోషించినవాడై యామునిశ్రేష్ఠుని పెక్కుప్రశ్న లడిగెను. స్వామి మౌన వ్రతుడై యూరకుండెను గాని పృథివిసింగున కుత్తరము జెప్పినవాడుకాడు. నదీమధ్యమున పడవ పోవుచుండెను. పృథివిసింగుచెంతనున్న యాతనికత్తిని జూడ స్వామిజీ యభిలషించినట్లు కనుపించెను. ఆసంగతి గ్రహించి యొరనుండి కత్తి తీసి రాకుమారుడు స్వామి కొసగెను. కాని దురదృష్టవశమున స్వామి చేతినుండి ఖడ్గము జారి నదీగర్భమున పడిపోయెను. పృథ్విసింగున కాకత్తియొక ప్రఖ్యాతుడగునాంగ్లేయుడు బహుమతిగా నొసగెను. మిక్కిలిప్రియమగు నాబహుమానము నీట బడినంతనే సింగు కోపించినవాడై స్వామిని పలుతెర గుల దూషింపదొడగెను. కాని స్వామి తననుగానియు ట్లూరకొనియుండెను. ఇంతలో పడవ యొడ్డు జేరెను. పృథివిసింగు కోపావేశుడైయుండుట గని స్వామిజీప్రధానశిష్యుడు, యీతయందు నేర్పుగలగువాని నియోగించి ఖడ్గము నిప్పుడే తెప్పించి యొసగెదనని సింగుతో బలికెను. పలికి నావికులను వెద కుటకు ప్రయత్నముచేయుచుండ తనశిష్యునకు ప్రయాస కల్పించినవాడ నగుదునని స్వామి చివాలున పడవపై నెక్కి తనహస్తమును నీటియందు ముంచి మూడువాడియైనకత్తులను పైకి తీసి యందు దారాజును తనఖడ్గము తీసు కొమ్మని కోరెను. ఆయద్భుతమును గాంచి పృథివిసింగు తనయపరాధమును మన్నింపు మని స్వామికి నమస్కరించెను. అపుడు స్వామి సింగుఖడ్గమును సింగున కిచ్చి కడమరెంటిని నీటబారవైచి శిష్యులతో వెడలిపోయెను.

ఒకనాడు పృథ్వీగిరి యనునొకయోగీంద్రునిశిష్యుడు త్రైలింగస్వామి యాశ్రమమునకు వచ్చెను. ఆశ్రమ మపుడు జనసంకులముగా నుండెను. వచ్చిన యాశిష్యునితో నేమో ప్రసంగించదలచి స్వామిజీ యాశ్రమమునుండి యదృశ్యు డయ్యెను. జనులందఱు నబ్బురపడి చూచుచుండ యోగివరుడు తిరిగి వారి కన్నులయెదుట జూపట్టెను.

దయానందసరస్వతి యను సన్న్యాసియొకఁడు కాశీపురమునకు వచ్చి విగ్రహారాధనమును ఖండించుచు హిందూమతమునకు వ్యతిరేకముగా నుపన్యసించుచు హిందువులపలువుర తనమతములోఁ గలుపుకొనుచుండెను. స్వామిజీ తనశిష్యులవలన వార్త విని, యొకకాగితముపై నేమో లిఖించి తనముఖ్యశిష్యుఁ డగుమంగళప్రసాదున కిద్దాని నొసఁగి దయానందసరస్వతికి పంపెను. ఆపత్రమును చదువుకొని యాతఁ డాయూరు విడిచిపోయెను.

ముంగేరుచికిత్సాలయమున పనిచేయునుద్యోగియగు శ్రీఉమాచరణముఖోపాధ్యాయుఁడు, త్రైలింగస్వామిప్రజ్ఞనుగూర్చిన విచిత్రవిషయములు కర్ణాకర్ణిగా విని మానవునకు పునర్జన్మ కలదా లేదా యనువిషయమునుగూర్చి తెలిసికొనుటకై కాశీపురమునకు వచ్చెను. వచ్చినమరునాడు ప్రాతఃకాలమున స్నానముచేసి స్వామిజీని చూచుటకై యతఁ డాతని యాశ్రమమునకు వెళ్లెను. ఆశ్రమమున నతఁడు పాదంబు పెట్టినవెంటనే వెడలిపొమ్మని స్వామిజీ యాతని చేతితో సంజ్ఞచేసెను. ఇంకను నతఁ డచ్చట నిలుచుటకు యత్నముచేయగా నాతనిశిష్యులు స్వామిజీయాజ్ఞ పాలింపుమని యాతనిఁ గోరిరి. విచారగ్రస్తుఁడయి ఉమాచరణముఖోపాధ్యాయుఁ డందుండి తరలిపోయెను. ఆమఱునాడుకూడ నట్లేజరిగెను. తనప్రశ్న కుత్తరము నిడక యాశ్రమమునుండి కదలనని నిశ్చయించుకొన్నవాఁడయి, మూఁడవనాఁ డతఁడు తిరిగి మునికుటీరమునకు వెళ్లెనుకాని తనప్రశ్న తెలుపుటకే యాతని కవకాశము దొరకలేదు. ఇట్లు వారమగుదినములు గతించెను. అయినను తనసంకల్పము విడువక యావంగదేశీయుఁడు స్వామిపర్ణశాలకు పోవుచుండెను. తాను మహాపాపియగుట గుర్తించియే యోగీంద్రుఁడట్లుచేయుచుండెనని యాతఁడు గ్రహించెను. మఱునాఁ డుమాచరణుఁడు మున్యాశ్రమమును చేరగానే యెప్పటియట్లు తొలగిపొమ్మని త్రైలింగస్వామి యాజ్ఞాపించెను. 'నేను మహాపాపిని నన్నుద్ధరింపు'డని పలికి యాఋషీశ్వరునిపాదములుపట్టుకొని యుమాచరణుఁడు వెక్కివెక్కి యేడువఁదొడఁగెను. తానభిలషించినట్లు లామనుజుఁడు పశ్చాత్తాప మనెడునీటిచే తనపాపపంకము కడిగివేసుకొన్నవాఁడని తెలిసికొని, వానియెడ ప్రసన్నుఁడయి స్వామిజీ యాతని శాంతిల జేసి సాయంకాలమున రమ్మని చెప్పి యప్పటి కాతని పంపివేసెను. అపుడు మనస్సు కుదుటబడి యుమాచరణుఁ డింటికి జని యేర్పాటుకాబడినసాయంసమ

యమున మునికుటీరమునకు వెళ్లెను. త్రైలింగస్వామి యప్పుడాతనిని కూర్చుండ నియమించి, "బిడ్డా! తపోబల; యోగబల; జ్ఞానబలములమహిమచే మహాత్ములు నిశ్చయించిన, విషయములన్నియు యథార్థములు. సత్యదూరములు కాజాలవు. పాపపుణ్యము లాచరించి వాటిననుసరించి దుఃఖములను సుఖములను అనుభవించుటకై మానవుడు పునర్జన్మ మెత్తుచుండవలయును." అని యోగివరు డాతనితో బల్కెను. తనభావమును తాను తెల్పకయే యోగివరుడు గ్రహింపగలిగినందులకు వింతపడినవాడై నాటినుండియు నుమాచరణు డాతనియం దెక్కుడు భక్తివిశ్వాసములుగలవా డయ్యెను. మునికుంజరునుద్దేశించి యొకనా డుమాచరణుడు "మహాత్మా! నే నెట్టిపాప మాచరించితినని మీరు నా కింతకాలము దర్శన మిచ్చినారుకా"రనియడిగెను. "వత్సా! నిన్ను చూచి నంతనే నీవొనరించినదుశ్చరితము నేనుగ్రహింపగలిగితిని. దైవబ్రాహ్మణులయెడ నీ కించుకభక్తి యుండుటవలన నిన్నిచట కూర్చుండజేసితిని. పూర్వజన్మమున నీవు చండాలగృహమున పుట్టితివి. అప్పటికయందు దేవతలయెడను బ్రాహ్మణుల యెడను నీ కమితభక్తి యుండెడిది. దానిచే నీ వీజన్మమున విప్రకులమున బుట్టితివి. కాని మహాపాతకము లొనరించినవాడవగుటచే నీయందలి యాభక్తి నశించినది"అని యాతడు చేసినదుష్క్రియలను త్రైలింగస్వామి కన్నులయెదుట చూచినట్లు తెలిపెను. తనరహస్యమును మునిముఖమున విని యుమాచరణు డబ్బురపడెను.

ఆసమయమున 'మేడమ్‌బ్లేవడ్‌స్కీ' 'కర్నల్‌ఆల్కాట్టు'లు బొంబాయి నగరమునకు విచ్చేసి యందు దివ్యజ్ఞానసంఘమును స్థాపించి యోగవిద్యా మహిమను ప్రచారముగావించి యపుడపు డేదేనొక్క యలౌకికకార్యమును గావింపసాగిరి. ఆసంగతి స్వామిజీ కుమాచరణుడు తెలుప, "వత్సా! వారు తెలుపునది యోగసిద్ధిఫలము కాదు. కొంత యింద్రజాలమును వారు ప్రజల యెదుట చూపుచుండిరి. త్వరలో నిజము బయటపడగలదు" అని స్వామిజీ పలికెను.

కొన్నాళ్లకు 'మేడమ్‌కులమ్' అనునామె చెన్నపురియందలి దివ్యజ్ఞాన మందిరమున వసించుచు, బ్లేవట్‌స్కీ, ఆల్కాట్లయుదంతయు బయలుపుచ్చెను. అప్పటినుండియు నాయాగంతుకులు తమవిద్యను ప్రదర్శింపమానిరి.

కలకత్తానగరమున నివసించుప్రసిద్ధన్యాయవాదియొక డారోజులలో కాశీకి వచ్చెను. సన్యాసులయెడ నావిద్యాధికుని కించుకంతయు నమ్మకములేదు. కాశీపురమున వసించు వానిమిత్రుడొకడు త్రైలింగస్వామిని దర్శింప జనుచు, న్యాయవాదినికూడ తీసుకొనివెళ్లెను. స్వామిజీ యపుడు మణికర్ణికాఘట్టమున నివసించుచుండెను. స్వామిజీ, తనను వీక్షించున్యాయవాదిని జూచి దూరముగా తొలగుమని చేసన్న జేసెను. ఆసంజ్ఞను గ్రహింపజాలక వకీ లందే నిలబడి యుండెను. నిజశిష్యునితో నేమేమో చెప్పి యాతనిని వకీలుచెంతకు పంపెను. శిష్యుడును నాన్యాయవాదిని తొలగిపొమ్మన నాత డుగ్రుడై కారణ మడిగెను. శాంతభావమున శిష్యుడప్పుడు 'మహాశయా! శాంతిపొందుడు; మీయుదంతము తెలుపవలసివచ్చినందుకు మన్నింతురుగాక. తాము ఘోరపాప మొనరించు చుంటిరని గురువుగారు తెలిపిరి. మాతృసమానయగు మీయత్తగారికిని మీకును సంబంధము కలదట. మీభార్యపేరు యిందుమతి యట. మీకు వివాహ మయి పదియేండ్లయ్యె నట. మీగుణమును చెలిచుకొని కన్యనొసగిన యామెగుణమునకును చేటు వాటిల్లజేయుచుంటిరట. స్వామిజీని దర్శింప దలతురేని దూరమునుండియే దర్శింపు డనియెను. ఈసంగతి విని న్యాయ వాదియు వానిమిత్రుడును నాశ్చర్యపడిరి. ఆవృత్తాంతము సత్యేతరము కాదని, న్యాయవాది నడిగి యాతనిహితుడు తెలిసికొనెను.

గతశతాబ్దాంతమున పుష్యమాసమున శుక్లయేకాదశిని సాయంకాల మున మహాత్ముడు త్రైలింగస్వామి దేహత్యాగము చేసెను. మాసమునకుముందే తనమృత్యుదివసము నాత డెఱుగజాలెను. ఆనా డుదయమున యోగాసనమున కూర్చుండి ధ్యానమగ్నుడయి కొంతవడి కుండి యామహాపురుషుడు ప్రాణములు బాసెను. ఇతడు 208 యేండ్లు జీవించెను. జ్ఞానాపేక్షులయి తన్ను జేరినవారి కాతడు సనాతనధర్మమహత్వమును తెలుపుచుండువాడు. 'మహావాక్యరత్నా

వళి'యను సంస్కృతమునందలిపెద్దగ్రంథము నీయోగీంద్రుడె రచించెను. ఇది విజ్ఞానరసముచే నిండియుండును.

మరణించుటకు నాలుగేండ్లకుముందు త్రైలింగస్వామి, పంచగంగాఘట్టమున రత్ననిర్మితములైన రెండుశివలింగముల స్థాపించెను ఆచార్యునిచే స్థాపితమైనయాలింగములలో నొకదానికి త్రైలింగేశ్వరు డని నామమిడి మంగళప్రసాదుడు స్వామిని సేవించుచుండును.

నేటికిని వారణాసీపురమున త్రైలింగేశ్వరాలయము చూపట్టుచున్నది. ఆయాలయమం దొకయెడ త్రైలింగస్వామి విగ్రహముకూడ గలదు. యాత్రీకులు తరుచుగా నీపవిత్రస్థలమునుకూడ దర్శించి ధన్యులగుచుందురు.

౨

# భద్రాద్రి రామదాసు



చ. దురిత లతాలవిత్ర! ఖరదూషణకాననవీతిహోత్ర! భూ
భరణకళావిచిత్ర! భవబంధవిమోచనసూత్ర! చారువి
స్ఫురదరవింద నేత్ర! ఘనపుణ్యచరిత్ర! వినీలభూరికం
ధరసమగాత్ర! భద్రగిరిదాశరథీ! కరుణాపయోనిధీ!

జనులహృదయమున నావరించుకొనియున్న అజ్ఞానాంధకారమును తొలగించి ధన్యులను గావించి ధర్మమును లోకమందు స్థిరముగా నిలుపుటకయి మహాపురుషులనేకు లనేకస్థలములయం దనేక నామములతో నుద్భవించి యద్భుత కృత్యములనేకముగా చేసియున్నారు. చేయుచున్నారు. చేయగలరు.

పరమపావనియగు కృష్ణవేణీనదీతీరముననున్న విజయవాడకు సమీపమున నేలకొండపల్లెయను గ్రామ ముండెను. అందు క్రీ. శ. 1650 వ సంవత్సర ప్రాంతమున, లింగన్నయను బ్రాహ్మణుండొకడు వాసము చేయుచుండెను. అతడు సత్పురుషుడు; ఆహితాగ్ని; కర్మిష్ఠి. అతనియిల్లాలు కామమ్మ పతివ్రత. ప్రాణేశ్వరునికి మా రాడి యెరుగని సాధ్వి. సతీపతులు మిగులననురాగముతో కాలము గడుపుచుండిరి గాని వారికి సంతానము కలిగినది కాదు. ఇంట పాడిపంటలకు ధనధాన్యములకు నేమియులోటు లేక దినములు గడుపుచుండిరి. అయినన్ను సంతతి లేనందున లింగన్న మిక్కిలి దుఃఖితుడై భార్యను చేరబిలిచి "ప్రేయసీ! ఎంతభాగ్యము కలిగియున్నను పుత్రభాగ్యము లేకున్నయెడల యేమాత్రమును సంతోషము కలుగ నేరదు. పుత్రులులేనివారికి పుణ్యలోకములు చేకూరవు. 'అపుత్రస్య గతి ర్నాస్తి' యను పండితవాక్యము వినియుంటివి గదా! పున్నామ నరకమునుండి తప్పించుట కొకపుత్రుడైన గృహస్థున కుండవలయునని గ్రంథములు చెప్పుచున్నవి. కావున మనయిలవేల్పగుశ్రీహరిని నిత్యము సేవించి యాతనిప్రసాదమున నొకపుత్రుని పడయుద"మని పలికెను. ఆమెయు నందులకు మిక్కిలిసంతసించి పతితోగూడి చాలదినములు రమానాథుని, సంతతి

కొఱ్ఱకై పూజించెను. పిమ్మట కొన్నినాళ్ల కామెగర్భవతియై యొకసుముహూర్త మున కుమారుని గనెను. తండ్రి యాకుమారునికి జాతకర్మనామకరణాది శుభ కార్యములు జరిగించి గోపన్నయని పేరు పెట్టెను. గోపన్న మాటలునేర్చిన దాది శ్రీహరీ యనియు శ్రీరామా యనియు పలుకుచుండెడివాడు. తమ కుమారుడు దైవభక్తిపరాయణుడగుట గాంచి తలిదండ్రులు మిక్కిలిసంతసించిరి. అయిదవయేడు రాగానే లింగన్న కుమారుని కక్షరాభ్యాసము గావించి విద్యా భ్యాసమునిమిత్త మొకగురువున కొప్పచెప్పెను. గోపన్నయు నచిరకాలముననే సకలవిద్యలు నేర్చి నిజగృహంబునకు మరలివచ్చెను. కాని విద్యావంతుడును, దైవభక్తియుక్తుడును నగుశసుకుమారుని యభివృద్ధి చూచి యానందించు భాగ్య మాజననీజనకులకు లేకపోయినది. వారు కొలదినాళ్ళలోనే పరమపదము నొందిరి. గృహభారమంతయు మీదపడెను. బంధువులయొక్కయు యిరుగు పొరుగువారియొక్కయు బోధవలన గోపన్న వివాహమాడెను. గోపన్న భార్య సౌందర్యవతి; సకలసద్గుణసంపన్న. సంసారభారమును జాగరూకతతో నిర్వ ర్తింపుచు భర్తయనుమతిప్రకారము మెలగుచుండెను. గోపన్నయు భార్యయు తమయింటికి వచ్చునతిథులను నభ్యాగతులను మిగులనాదరించి శక్తికొలది యుప చారము లొనరించి యన్నప్రదానము చేయుచుండువారు. ఇట్లు వారిరువురు పరస్పరానురాగముతో కాలము గడపుచుండ వారికొకకుమారుడు కలిగెను. గోపన్న యాతనికి రాముడని పేరు పెట్టి మిక్కిలిగారాబముతో పెంచుచుండెను.

ఇట్లుండగా నొకనాటియుదయమున నొకభిక్షుకుడు హరికీర్తనములు పాడుచు నృత్యముచేయుచు వీరిగుమ్మముకడ నిలిచి గోపన్నను గాంచి "అయ్యా! అజ్ఞానాంధకారముచే కన్నులు గానక సంసారసుఖములందు మునిగి తేలుచు విషయాసక్తులయి చచ్చుచు పుట్టుచు ని ట్లనేకజన్మల నెత్తుచుండుట సామాన్య మానవప్రకృతి. ఎవరు విషయాసక్తులయి సంసారవ్యామోహమున బడుదురో వారికి ముక్తి లేదు. ముక్తిలేకున్నచో జన్మపరంపర తప్పదు. అట్టిజన్మపరంపర లేకుండ చేసికొనుటకై ఈశ్వరారాధన మత్యావశ్యకము. నీయందు శ్రీరామ చంద్రునకు అనుగ్రహము కలుగును. నీ కీప్రపంచకమున నేమియులోటుగలుగదు. పిమ్మట సాయుజ్యము కూడ చేకూరును. నీవు తారకమంత్రమును జపింపు" మని యామంత్ర ముపదేశముచేసి వెడలిపోయెను.

తరువాత నతడు తారకమంత్రము మిక్కిలిదీక్షతో జపింపసాగెను. మును పటికంటె నెక్కుడుగ దానధర్మము లాచరింపదొడగెను. ఆదాయమునకంటె నధికముగా అన్నదానాదిసత్క్రియలకు వెచ్చపెట్టసాగెను. ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి యింటగలద్రవ్యమంతయు వ్యయమయి తుదకు రోజుగడచుటయే దుర్లభమగునవస్థకూడ వీరికిసంభవించెను. కాని యన్నిటికిని శ్రీరామచంద్రునే నమ్మి ధైర్యచిత్తుడై తదేకదీక్షతో దినములు గడపుచుండెనే గాని ధనార్జన ప్రయత్న మేమియు చేయులేదు ఒకసారియితడు రామకోటివ్రాసి దానికొఱకై సంతర్పణ చేయుచుండెను. బ్రాహ్మణులనేకులు నలుదిశలనుండివచ్చి పంక్తులు దీరి భోజనములు చేయుచుండిరి. ఆసమయమున ప్రమాదవశమున గోపన్నకుమారుడు రాముడు వేడివేడిగంజితోనిండియున్న గుంటలో పడిపోయెను. వెంటనే తల్లి యాతనిని పైకి తీసెనుగాని యప్పటికప్పుడే బాలుడు చనిపోయెను. ఈసంగతి పైకి వెల్లడియైనచో సమారాధన చెడిపోవుననియు నుత్సాహభంగ మగుననియుతలచి కామమ్మ ధైర్యముదిక్కబట్టి మిన్నక యుండెను. బ్రాహ్మణులందఱు తృప్తిగా భోజనములు చేసి లేచినపిమ్మట మెల్లగా నీవార్త గోపన్నకు తెలియవచ్చెను. తోడనే కుమారునిమృతశరీరము నొకచేత ధరియించి రెండవ చేత తంబుర పూని కాళ్లకు గజ్జెలు కట్టకొని రామభజన చేయమొదలుపెట్టెను. ఇట్లు కొంతసేపు నృత్యగీతములతో భజనచేయునప్పటి కాకుమారుడు నిద్రనుండి మేలుకాంచినవానివలె ప్రాణయుతుడై తండ్రిని కౌగలించుకొనెను. భోజనమునకు వచ్చినబ్రాహ్మణులును చూపరులును మిగులనాశ్చర్యమును నానందమును చెంది గోపన్న భక్తిమహత్వమును వేనోళ్ల మెచ్చుకొనిరి.

గోపన్నయు బ్రాహ్మణులకు సంభావనయు తాంబూలచందనాదులునిచ్చి సత్కరించి పంపివేసెను. ఇట్లు తరుచు సంతర్పణలు సమారాధనలు చేయుచుండుటచే గోపన్నకుటుంబము మిక్కిలిబీదస్థితికి వచ్చెను. ఆదీనావస్థకు గోపన్న భార్య మిక్కిలి దుఃఖించుచుండెడిది. అట్లుండ నొకనాడు గోపన్న భార్యను బిలచి "ప్రాణేశ్వరీ, బీదతనంబునకు వగచెద వేల ? శ్రీరామచంద్రమూర్తి కటాక్షముండిన మన కేమియు లోపమురాదు" అని చెప్పి యామె నూరడించెను. అంతటినుండియు కామమ్మ తమదుఃస్థితికి విచారింపక నిత్యము రామనామస్మరణము గావించుచు మగనికి సకలోపచారములు గావించుచు నతిథు

లను పూజించుచు నానందమున కాలము గడపుచుండెను. అంతట కొన్నిదిన ములు గడచినపిదప శ్రీరామనవమిదినమహోత్సవము సమీపమునకు వచ్చెను. ఉత్సవము జరుపుటకు తనచెంత నెంతమాత్రమును ద్రవ్యము లేదు. ఇంటసంబా రములు లేవు ప్రతిసంవత్సరమును మిక్కిలిప్రభతో జరుపుచుండెడివాడు. ఏమిచేయుటకు తోచినది కాదు. పండుగ జరుపక యుండలేడు. శ్రీరామ చంద్రునిసహాయమే తనను గట్టెక్కించ ననుధైర్యము గలదుగాని యింట నిక్కి లి నిష్పచ్చరముగా నున్నందున తానిమి దూలి గోలుకొండకు పోవలయుననియు తానదృష్టవంతుడైనచో నాపట్టణమున శ్రీరామునిపట్టినరోజుసంబరము చేయు టకు తగినంతద్రవ్యమును నవకాశమును చిక్కిపోవనియు మనస్సున నిశ్చయించు కొని వెంటనే యతడు గోలుకొండకు పయనమయ్యెను. అట్లు పయనమయి కొన్నినాళ్ళ కాపట్టణము చేరి యచ్చటనున్న అక్కన్నమాదన్నగార్ల యింటికి జని వారిచే సంభావితుడై తనువచ్చినకార్యము వారికిదెలిపెను. వారును గోపన్నకును తమకును శ్రీరామచంద్రుడే కలడనియు నతనికృపయున్న నెట్టియిక్కట్టులైనను దాటవచ్చుననియు ధైర్యముచెప్పగా, సంతసించి వారియింట నుండెను. పిమ్మట వారిసహాయమున తానీషాదర్శనము చేసి వారిసిఫారసుపైననే తానీషాచే గోపన్న, భద్రాచలముతాలూకాకు తహశ్శీలుదారుగా నియమింపబడెను. అక్కన్నమాదన్నగార్లు తమమేనల్లుడగు నీగోపన్నకు, ఉద్యోగధర్మములును నీతులును కొన్ని గఱపి పల్లకిపై సబహుమానముగా భద్రాచలము పంపివేసిరి.

పురజనులు క్రొత్తతహశ్శీల్దారుగారిని చూచుటకై, యతడుగోలుకొండ నుండి వచ్చినమఱునాడు గోపన్నయింటికి వచ్చిరి. అపుడు వారిని విలోకించి గోపన్న "మీ రిదివరలో సర్కారుకు బాకీయున్న యావత్తుశిస్తుల నిచ్చివేయుడు. నేను మిమ్ములను కోరి సతాయింపను మీరొనరించినచో మీరును నాకును సౌఖ్య ముగా రోజులు జరగిపోవును. మీరు పరిపాలనావిధానమున నాకు సాయపడ లేని యుద్యోగము చేయుట సాధ్యము కాదు. మీరు నాకు సాయపడి నాయుద్యో గమునకు గౌరవము సంపాదింపుడు. శ్రీరామచంద్రు డవతరించినయీగిరిపై వసించుమీకు ధర్మముల నుపదేశింపవలసినది లేదు. మనము అందరమును శ్రీరామచంద్రుని సేవకులము గావున నేకమతస్థులము, మనలో భేదము పుట్ట నవసరములేదు." అని రైతులతో ననెను. దానికి రైతులెల్లరు పరమానందము

నొంది నమస్కారపూర్వకముగా తనయనుమతిని దెలిపి గోపన్నయొద్ద సెలవు దీసికొని యెవరిగృహములకు వా రరిగిరి.

గోపన్న కీయుద్యోగము లభించుటచే లభించుచున్న జీతముతో రామోత్సవములు మునుపటికంటె నెక్కుడుగ జరుప నారంభించెను. పనియున్నపుడు రాచకార్యపుపనులయందును తీరికయైనపు డెల్ల రామనామసంకీర్తనమునం దును నతడు గడపుచుండెను. ప్రజలును రామభక్తిపరాయణులై "యథారాజా తథాప్రజా" యను నార్యోక్తి ననుసరించుచుండిరి. ఉద్యోగాభివృద్ధితో రామోత్సవకౌతూహలాభివృద్ధియు గోపన్న కెక్కుడు కా జొచ్చెను. ప్రజలును నీతనికి కడుంగడు సాయము చేయుచు వచ్చిరి. ప్రజ లీతనిని గోపన్న యనట మాని రామదా సని వ్యవహరింపసాగిరి. గోపన్నయు ప్రజలు నిరంతర మాతనిని రామదాసని పిలచుచుండుటచే తన్నెవరైన క్రొత్తవారు పే రడిగినపుడు రామదాసనియే చెప్పుచుండువాడు.

అప్పటికి భద్రాచలమున వెలసిన శ్రీరామచంద్రమూర్తికి దేవళము లేదు. కొండపై నూరక పడియుండెను. ఎండకు నెండుచు వానకు తడియుచు గాలికి వడకుచు శ్రీరామచంద్రునియవతారమగు విగ్రహమున కావరణముగాని యాచ్ఛాదనముగాని లే కుండుటకు చిత్తమున చింతించి యాదేవునకు తాను దేవళముకట్టించకుండినచో నుత్తమగతులు గలుగవనియు తన కిప్పుడట కట్టించువా రుండరనియు తలంచి యెట్లయిన నాలయము గట్టించితీరవలెనని సంకల్పించుకొనెను. ఆతాలూకాలోని పెద్దపెద్దగృహస్థులకును రైతులకును కబు రంపి పిలిపించి "అయ్యలారా; కామక్రోధాదివిరోధజంతువులచేనిండియున్న సంసారమను మహారణ్యమున పురుషుడు చిక్కుకొని నిరంతరము పుణ్యపాపములకు లోబడి చచ్చుచు బుట్టుచు నెచ్చటను విశ్రమించుటకు తగినతావు దొరకక వ్యాకులచిత్తుడయి మిక్కిలికష్టముమీద, ధనధాన్య, గృహారామ, దారా సుత, పశుభృత్యలౌకికసంబంధమును మానుకొని స్వర్గము మొదలు సత్యలోకము వరకును గలపరలోకములకుం దనుభవింపగలిగిన సుఖములకు ముఖ్యసాధనము లయిన కర్మములను నిరంతరము ఫలాపేక్షలేక భగవత్ప్రీతిగా చేయుచు భగవదనుగ్రహమువలన పవిత్రీభూతమయిన చిత్తమును చెంది శీఘ్రకాలములో శాశ్వతబ్రహ్మలోకనివాసము బడయ గలడు. అట్టిపదవి నందుటకు సమస్త

ప్రాణులును ప్రయత్నము చేయవలసి యున్నది. రాత్రికి కావలసిన విషయముల కొఱకు పగటిపూట యందును, వర్షకాలమున కావలసియుండు వస్తువులను వేసంగియందును, వృద్ధాప్యము సంభవించిన పుత్రులయునవసరములకు యౌవ నమునందును, జాగ్రతపడునట్లు పరలోకమునకుగావలసిన సామగ్రి నిహాలోక మున సంపాదించి యుంచుకొనవలయును. కావున మనమందరము మనకుగల సర్వస్వమును శ్రీరామచంద్రమూర్తికి నిష్కామబుద్ధితో సమర్పించుదుమేని యాతని సాయుజ్యమును పొందగలము. శ్రీరామచంద్రుడు ఎండవానలకు చిక్కి దిక్కులేక కొండపై బడియున్నవాడు. ధనమున్నవారు ధనమును నెల్లరును కాయకష్టములను సమర్పించి యొక దేవాలయము కట్టి శ్రీరామచంద్రమూర్తి నందు ప్రవేశపెట్టుదము'' అని వారికి నచ్చునట్లు హితబోధ యొనర్చి వారి నంగీకరింప జేసెను.

పిమ్మట నొక మంచి శుభలగ్నమున దేవాలయము కట్ట నారంభించిరి. దూరదేశములనుండియు శిల్పులు వచ్చి శ్రీరామచంద్రుని కృపకు పాత్రులయిరి. గ్రామస్థులును రైతులును నడతెగక పనిచేసి యొక్కగడియయైన విరామము లేకుండ శ్రమపడి కొలదిదినములలో దేవళము పూర్తిచేసిరి. ఆకోవెలవైభవము గాంచియు రామదాసుని భక్తిశ్రద్ధలు తలంచియు ప్రజలత్యాశ్చర్యమానసులైరి.

దేవమందిరాదిగృహనిర్మాణములు సమాప్తమగువరకు తాను సేకరించిన ధనమంతయు వ్యయమయ్యెను. ఇక సంప్రోక్షణము ప్రతిష్ఠ మొదలగు కార్య ములకును కల్యాణము మొదలగు నుత్సవములకును చెంత నొకరాగిపైస లేకుం డెను. ద్రవ్య మెట్లు సాధింపవచ్చునని యోచించుచు గోపన్న నిద్రకు లోన య్యెను. ఆనిద్రలో నతనికి శ్రీరామచంద్రమూర్తి కనుపించి సర్కారుపైకము వెచ్చింపుమని హెచ్చరించినట్లు కల వచ్చెను. మేలుకాంచి మరునాడుదయమున కోశాధికారిని పిలచి యాతనివలన కోశమున నారులక్షలు నిలువయున్నదని గ్రహించి తెప్పించి యాపైకముతో తక్కినపనులన్నియు మహావైభవముతో నెఱవేర్చెను.

ఆసంవత్సరము గోలుకొండకు చేరవలసినశిస్తులన్నియు సరిగా చేరుటయు భద్రాచలమునుండి పైకము రాకుండుటయు గని, మాదన్న గోపన్నకడకు సేవకుల నంపి కారణము తెలిసికొని రమ్మనెను. సేవకులును గోపన్నకడకు

వచ్చి యాతని నెన్నివిధములఁ శిస్తుసంగతి ప్రశ్నించినను జవాబు పడయనేరక గోపన్న నృత్యగీతములతోడను రామనామస్మరణములతోడను నోడ లెరుంగకుండుట చూచి యాత డాశిస్తు దుర్వినియోగము చేసె నని నిశ్చయించుకొని గోలుకొండకు మరలి మాదన్న కీవృత్తాంతము నివేదించిరి.

ఆవార్తకు మాదన్న విచారించుచుండగా తానీషా స్వయముగా దివాణమునకు వచ్చి లెఖలు తణిఖీచేసి భద్రాచలమునుండి శిస్తు యెంత మాత్రము వసూలుకాకుండుట గ్రహించి కోశాధ్యక్షు నడిగి గోపన్న భద్రాచలశ్రీరామచంద్రమూర్తికి నాలసూదులు కట్టించుటకై యాద్రవ్యమునంతను వెచ్చపెట్టెనని యతనివలనఁ గ్రహించి మండిపడి గోపన్న నున్నవాని నున్నట్లుగా కట్టి తెం డని సరదారుల నాజ్ఞాపించెను.

సరదారులును తక్షణమే భద్రాచలమువచ్చి గోపన్నను బంధించి గోలుకొండకు ప్రయాణమైరి. పురవాసులెల్లరు నాతనికిసంభవించినకష్టమునకు విచారించి, యనేకవిధముల నాతని నీముప్పునుండి తప్పింపుమని శ్రీరామచంద్రుని వేడుకొనిరి.

రామదాసు, దారిపొడవునను తనకిష్టదైవమగు శ్రీరాముని, తనకభయ మిమ్మనియు; పాలముంచినను నీటముంచినను నతనిదే భారమనియు, కలలో కానుపించి యతడే యాయుపాయము చెప్పినందులకు సంతసించి నిర్భయునిగా నట్లొనరించితిననియు తన నేలువాడని చాలా నమ్మితిననియు నింకను ని ట్లనేకవిధముల తన్మయుడై నృత్యము సేయుచు పాటలు పాడుచు సరదారుల వెంట నడచెను. కొన్నినాళ్ళకు వారు గోల్కొండ చేరుకొనిరి.

చేరినమరునాడు సరదారు లతనిని గొనిపోయి తానీషాయెదుట నిలువబెట్టిరి. అపుడు భద్రాచలముతాలూకాశిస్తు బకాయి పెట్టితి వేల యని యాతడు గోపన్న నడిగెను. "ఆద్రవ్యముసర్వము శ్రీరామునినిమిత్తమయి వినియోగింపబడెను." అని యతడు బదులుచెప్పెను. అంతట తానీషా కోపోద్దీపితుడై కను లెఱ్ఱజేసి మోము జేవురింప "నితనిని తక్షణము బందిఖానాలో వేయుడు; మఱిపైక మేల వసూలుకాదో చూచెద" నని పలికెను. తోడనే సేవకులు గోపన్నను ఖైదులోనికి గొనిపోయిరి. ఖైదులోనున్నపు డతడు వండుకొనుటకు సేవకులు సామగ్రి నిచ్చుచుండువారు. ఆసామగ్రి యట్లుండగా పంచ

భక్ష్యపరమాన్నములతో నిండిన వంటకము సిద్ధమయి గోపన్న యెదుట నుండె డిది. ఇదియంతయు శ్రీరామచంద్రుని కటాక్షముని యెంచి యాపరమేశ్వరునికి నివేదనముచేసి తాను భుజించుచుండువాడు. నిరంతరము రామభజనచేయుచు కారాగృహవాసంబును నత డానందముగనే గడుపుచుండెను. అప్పుడు కారాగార రక్షకులు యేలికకడ కేగి "గోపన్న ఖైదులోనుండియు స్వగృహమున నున్న వానివలె పరమసంతోషమున కాలము వెళ్లబుచ్చుచున్నాడు. మనపైనేము వచ్చునో తెలియదు" దని వచించిరి. ఆమాటలు విని తానీషా "అతసిని మిక్కిలిగా హింసింపుడు. సిగ్గువచ్చునట్లు వీధులవెంట త్రిప్పుడు. బరువైనపనులు చేయిం పుడు. ఎండలో నిలువబెట్టుడు. మీకు చేతనగునన్ని బాధలు పెట్టి చూడు"డని సేవకుల కాజ్ఞాపించెను. యమభటులకంటె క్రూరులగు నాతనిసేవకు లట్లొన రించిరి గాని యేమియు ప్రయోజనము లేకపోయెను. అప్పుడు సేవకులు తిరిగి ప్రభునికడకు వచ్చి వృత్తాంతము మనవిచేసిరి. వెంటనే తానీషా గోపన్నను తనయెదుటికి రప్పించి "మాసొమ్మిచ్చెదవా లేదా" యని సింహగర్జనమును బోలు భీకరరవంబుతో గోపన్న నడిగెను. గోపన్న నిశ్చలచిత్తుడై జంకు గొంకు లేక ధైర్యముతో "నీసొమ్ము భద్రాచలమున రామునియవతారమున వెలసిన సర్వజగన్నాయకునికి సర్వకల్యాణపరిపూర్ణునకు వినియోగింపబడినది. నీవు ధన్యుడవైతివి, అట్టిదానిని తిరిగిగ్రహింపబూనుట పాపహేతువు" అని ప్రత్యుత్తర మొసగెను.

ఈజవాబునకు తానీషా మరింత మండిపడి కరుణ దలపక గోపన్నను ముక్కలుముక్కలుగా ఖండింపు డని సేవకులకు నియోగించెను. సేవకులు సంతోషించి యాతనిని ఖండించుట కెన్నిసారులు ఖడ్గము లతనిమేన విసరినను నతనిశరీరము నిసుమంతయు నొప్పింపవయ్యె. సేవకులును విసిగి వేసారి యేమి చేయుటకును తోచక తిరిగి యతనిని బందిఖానాలో పడవైచి వారిబుద్ధికి తోచి నట్లెల్ల హింసించుచుండిరి.

అతడు కారాగారమున నున్నపుడొకనాడు నీళ్లు తోడుకొనుటకై చేద త్రాటిపై చేయి వైచినంతనే యంతకుము న్నచటప్రాకుచున్న తేలొకటి యతనిహస్తమున నంటపొడిచెను. తేలుమీద చేయివైచి పట్టుకొనుటచే నది

గాటముగా కుట్టినందున బాధ దుస్సహమై రామదాసు క్రిందపడి పొర్లాడ దొడగెను. అతనివేదన గాంచి చెరకావరు లూరిలోనికి బోయి కొన్నిమందులు గొనివచ్చి తేలుకాటుపై రుద్దియు మర్దించియు ననేకవిధముల సేవచేసిరి. కాని బాధ యెంతమాత్రము తగ్గినది కాదు. అపుడు రామదాసు కావలివాండ్రు చూపినదయకు తనకృతజ్ఞతను చూపుచు వారితో నిట్లనియె: "అయ్యా! యీమందులవలన నేమియు ప్రయోజనము లేదు. సర్వవేదనలకు రామనామ స్మరణము పరమౌషధము. రామనామస్మరణమున నన్నివిషములు విరిగి పోవును. బాహ్యాభ్యంతరబాధలకన్నింటికి నది దివ్యచికిత్స. రామా యన్న భవబంధములు తొలగిపోవును. రామా యన్న సమస్తసంపదలు కలుగును. రామా యన్న సర్వార్థములు సిద్ధించును. రామా యన్న మనోవ్యాధు లన్నియు మటుమాయ మగును. మీ రీచెఱసాలయందు నన్ను పెట్టుచున్న బాధలన్నిటిని రామనామామృతపానముచేతనే సహింపగలుగుచుంటిని. శ్రీరామనామమునందలి రుచి మీ కేమియెఱుక. చిక్కనిపాలకంటెను, పంచదారకంటెను, పరిపక్వద్రాక్షఫలములకంటెను, అమృతముకంటెను, మధుర మైనది. అయ్యలారా! మీరును నిరంతరము నీయమృతమును గ్రోలుడు. కాయము లస్థిరములు. నేడు చూచినవాడు రేపు కానరాడు. ప్రపంచము మాయ. ఇహసౌఖ్యములు మీసాలపై తేనియలు. శాశ్వతసౌఖ్య మీయగలుగురామ నామస్మరణామృతపానము నలవాటు చేసికొనుడు. ఆనందములన్నిట రామ నామోచ్చారణ మానందము. అది తాపత్రయముల నుపశాంతి చేయును. మీ రందరొకసారి రామనామము నుచ్చరింపుడు. మీ రంద ఱొక్కసారి యాపవిత్రనామమును గట్టిగ పలుకుడు. నావేదన యుపశమించును. ఈమం దులు పనిచేయవు. ఏదీయొకసరి మీరీరామనామమును నోరార వచింపుడు".

ఈబోధ చెవులసోకినంత నచటిచెఱకావరుల కావేశ మెత్తెను. వా రెల్లరు నోడలు మఱచి యొక్కసారిగా భగవన్నామోచ్చారణము గావిం చిరి. రామదాసు పరమానందభరితు డయ్యెను. ఆనందాశ్రువులు చెక్కులపై జారదొడగెను. మేన హర్షపులక లుత్పన్నము లయ్యెను. అపు డత డొకరామ కీర్తనము నందుకొని పాడదొడగెను. పాడుచు నృత్యము చేయదొడగెను. అది గాంచి తాము నున్న మైమఱచినవారై రాజభటులును నచ్చటి యితరఖైదీలును

నతని ననుకరించిరి. ఇ ట్లనేకసారు లాత డా చెఱసాలయందలి సేవకులను రామ భక్తుల గావించెను.

గోపన్న యట్లా చెఱసాలయందు విసుగువిరామములేక రామభజన చేయుచు తన్ను రక్షింపుమని శ్రీరామచంద్రుని రేయుంబవళులు ప్రార్థించు చుండెను. ఎన్ని దినములు ప్రార్థించినను శ్రీరాముసకు కరుణ పుట్టలేదని లోక మాతయగు సీత నపుడు ప్రార్థింప మొదలుపెట్టెను. తండ్రికంటె తల్లికి సంతతి యందు ప్రేమ మెక్కుడుగ నుండునుగావునను, స్త్రీస్వభావకారుణ్యమునను నామె హృదయము కరిగి జాలినొంది వెంటనే శ్రీరామునితో గోపన్నవిషయ మును నతడుపడుచున్న బాధలును విన్నవించి యతనిని చెఱసాలనుండి విముక్తుని జేయుమార్గ మాలోచింపు డని ప్రార్థించెను.

అపుడు రామలక్ష్మణులిరువురును సేవక వేషములు ధరించి యర్థరాత్రమున తానీషాయంతఃపురము ప్రవేశించి యాతనిని మేలుకొలిపిరి. మేలుకాంచి యతడు సేవక వేషములనున్న రామలక్ష్మణులను చూచి యాశ్చర్యపడి నిశ్చేష్టుడై యుండెను. అపుడు శ్రీరామచంద్రుడు "గోపన్న నెచట యేమి చేయుచుంటి" వని అడిగెను. దానికి సమాధానము తెలుపక "మీ రెవరు ద్వారపాలకరక్షి తంబగు నీశుద్ధాంతంబున కెట్లు వచ్చి" రని తానీషా వారి నడిగెను. తాము గోపన్నగారి సేవకులమనియు గోపన్నగారీయవలసిన బాకీ తీర్మానము చేయు టకు వచ్చితిమనియు చెప్పి ఆరులక్షలరూప్యముల నొసంగి రశీదు పుచ్చుకొని రామలక్ష్మణులు మందిరము వీడివచ్చిరి. తక్షణమే పైకమారులక్షలునుఅదృశ్య మయ్యెను. ఇదియంతయుగాంచి వెంగంది శ్రీరామచంద్రు డితనికి బంటుగా వర్తించుచున్నాడని తలచి తానీషా వడివడి కొలువుకూటమునకు వచ్చి మంత్రులకు వర్తమానము చేసి "గోపన్నను వెంటనే చెఱసాలనుండి విడిపించి, మంగళవేషం బొసంగి మాస్వాంతబండిలో మహావైభవముతో నూరేగించి యిచటికి గొనిరం" డని వారి కానతియిచ్చెను.

ఇది యిట్లుండ కారాగృహమున రామదాసు తనపై శ్రీరామచంద్రు నకు కృపకలుగలేదని నిరాశుడై శరీరత్యాగము చేయునుద్దేశముతో నొక గిన్నెలో విషముపోసుకొని యెదుట బెట్టుకొని,

మ. కరిచేలింది హుళక్కి ద్రావకకి కోకల్ మెచ్చి యిచ్చిందిద
బ్బర కాకాసురునిం గటాక్షమున చేపట్టిం దబద్ధం బహో
శరణన్నం బగవానితమ్మునికి రాజ్యం బిచ్చుటల్ కల్ల యి
త్తతి నన్నేలిన నిక్క మీకథ లనంతా, భావనారాయణా!

యని కన్నులు మూసుకొని ప్రార్థన చేయుచుండగా రామలక్ష్మణు లందు ప్రవేశించి ముందుగా విషకలశమును మాయముచేసి యంతర్ధాన మొందిరి. ప్రార్థనానంతరమున కన్నులు తెఱచి చూచునప్పటి కది మాయమగుట గాంచి యది యంతయు శ్రీరామునికరుణ యని తలచి యాశ్చర్యపడసాగెను. ఇట్లుండ తానీషాచే పంపబడినమంత్రులు మొదలగువారు కారాగృహమున కరుదెంచి గోపన్నకు తానీషాయాజ్ఞ తెలిపి యతని బంధవిముక్తుని గావించి వైభవముతో కొలువుకూటమునకు తీసికొనిపోయిరి. తానీషాయు నతని కెదురువచ్చి కౌగలించుకొని సింహాసనముకడకు గొనిపోయి యం దతని నాసీనుని జేసి తనతప్పు క్షమింపుమని యాతనిని ప్రార్థించెను. అందులకు రామదాసు "నీవుపుణ్యాత్ముడవు; నీయందు శ్రీరామునికి కటాక్షము గలిగెను; పూర్వజన్మమున నెద్దియో పుణ్యకర్మ మాచరించియుందువు; గతించినదానికి వగవ వలదు. ప్రాణి కర్మబద్ధమగుట నిశ్చయము. అందుచేనేను కారాగారబద్ధుడ నైతిని. నీవు దీనికి కారణము కాదు. కేవలము కారణమాత్రుడవు" అనిపలికి యతనినూరడించెను. పిమ్మట ఆయారు లక్షలరూప్యములేగాక నింకను కొంతద్రవ్యమును ననేక రత్నాభరణములును కాంచనంబును గూడ శ్రీరామచంద్రునికి సమర్పితముగా రామదాసున కొసగి భద్రాచలముతాలూకా యతనికి జాగీరుగా ఫరమానా వ్రాసియిచ్చి, యనేక విధముల నతనిస బహూకరించి మహావిభవముతో కొంతపరివారమును తోడిచ్చి భద్రాచలమునకు పంపించెను. భద్రాచలవాసులును నీవార్త మున్నే యెఱింగి నృత్యగీతాదివాద్యములతో గోపన్న కెదురువచ్చి కడుసంభ్రమముతో నతనిని పురములోనికి తీసుకొనిపోయిరి.

రామదాసు ప్రథమమున గిరిపై రామునిదర్శనము చేసుకొని పిదప స్వగృహమున కరిగెను.

అనంతరమతడు పూర్వమువలెనె యెక్కు డుత్సవములును సమారాధనలును సంతర్పణలును చేయుచు నిరంతరరామనామస్మరణపరాయణుండై కాలము గడపుచుండెను.

సంసారము నంటియుండక జిడ్డునాలుకయందువలె సంచరింపుచు లౌక్య వ్యవహారములు నెరపుచు శ్రీరామకృపాకటాక్షముచే దినములు పుచ్చుచున్న రామదాసునకు వృద్ధాప్యము ప్రాప్తించెను. తనను తీసుకొనిపొమ్మని శ్రీరామ చంద్రుని నతఁడు నిశ్చలచిత్తుడయి వేడుకొనసాగెను.

ఇట్లుండ నొకనాడు రాముఁడు గుఱ్ఱమువానిరూపమునను లక్ష్మణుడు సేవ కునిరూపమునను గరుత్మంతుడు గుఱ్ఱమురూపమునను వచ్చి గోపన్న వాకిట నిలచి వైకుంఠమ్మునకు రమ్మని యాతనిని బిలచిరి. తోడనే యాతడు బయటి కరుదెంచి గుఱ్ఱము నెక్కి తన భార్యను కూడ రమ్మని కేక వైచెను కాని యామె కార్యాంతరమునందుండి యాలసించినందున గుఱ్ఱము సాగిపోయెను అట్లా గుఱ్ఱము సాగి భద్రాచలరాముని యాలయసమీపమునకు పోయెను. అపుడు దేవళము తలుపులు తెరువబడెను. గుఱ్ఱమును రామలక్ష్మణులును రామదాసును నందు ప్రవేశించిరి. వెంటనే కవాటము బంధింపబడెను. పదపడి గుఱ్ఱమును రామలక్ష్మ ణులును నదృశ్యులైరి. రామదాసు నివ్వెర గందుచు చూచుచుండెను. ఇది యంతయు నింద్రజాలమువలె నతనికి పొడకట్టుచుండెను. ఇంతలో శ్రీరామ చంద్రమూర్తి విశ్వరూపము దాల్చి ప్రత్యక్షమయి రామదాసును తనలో నైక్యము చేసికొనెను. అంతట, అమృతము, అప్రమేయము, ఆనందమాత్రము, అనవద్యము, ఆద్యము, అనన్యము, అవికారము, అశోకము, అనంతము, అఖండము, అభేదము, అద్వితీయము, అక్షయము, అవ్యయము నయి వెలయు పరబ్రహ్మపదము నొంది గోపన్న యలరుచుండెను.

రామదాసుని పూర్వజన్మవృత్తాంతము.

"పూర్వజన్మమున నిత డొక బ్రాహ్మణుడు. ఇతడు చిలుకను బంజరమున బంధించి పండ్రెండేండ్లు పెంచెను. అపుడు ఆచిలుకకు రామ రామ యనుమాట నేర్పెను. తరుచు చిలుకకు నేర్పుటకొఱకై తా నుచ్చరించుటచేతను, చిలుక యదేపనిగా రామనామము పలుకుచుండగా వీనుల వినుచుండుటచేతను నాబ్రాహ్మణుడే యీజన్మయందు రామదాసై జనియించి ఐశ్వర్య మనుభవించి తుదకు విష్ణుసాయుజ్యమును బొందెను. చిలుకను బంధించినపాపమున కాతడు కారాగారవాసశిక్ష ననుభవించెను." అని సీతామహాలక్ష్మితో శ్రీరామ చంద్రుడు చెప్పెనని యొక గాథకలదు.

# 3
# దయానందసరస్వతి

"ఆయాసప్రద మింద్రియార్థగహనం బాత్రోవ వర్జింపుమీ
శ్రేయోమార్గము సర్వదుఃఖః కరచ్ఛేదార్థమై చేరుమీ
ధ్యేయాద్వైతముఁ బొందుమీ స్థిరతచే దీపింపుమీ చిత్తమా!
మాయాకేళికి వెండియుం జొరకుమీ మాలిన్యమున్ వీడుమీ"

మహాత్ముఁడగు దయానందసరస్వతి క్రీస్తుశకము 1824 సంవత్సరమున ఘూర్జరదేశమందలి కథియవారులో మర్వీనగరమున నుదీచ్యబ్రాహ్మణకులమున పుట్టెను. ఈతనితండ్రి లింగధారి. శివుని పూజింపక యాతఁ డెన్నఁడు నన్నము తినువాడుకాడు. చాలాడబ్బు కలవాడగుటచే నతఁడు పెక్కుప్రదేశములందు శివాలయములు కట్టించెను. కొడుకు జనియించినంతనే సంతసించినవాడై బారసాలకు పలువురుబంధుమిత్రుల బిలచి వైభవముతో నెరవేర్చి కుమారునికి మూలశంకరుడని నామకరణము జేసెను.

మూలశంకరుడు మిక్కిలి ధారణాశక్తిగల బుద్ధిగలవాడు, యాతని కైదవయేడు రాగానే తండ్రి యక్షరాభ్యాసము గావించెను. వేదమునుండియు, వేదభాష్యమునుండియు విశేషవిషయములు చెప్పించెను. ఎనిమిదవయేడు రాగానే యుపనయనముగూడ జరిగించెను. అప్పటినుండి మూలశంకరుడు యినుమడించిన యుత్సాహముతో శాస్త్రములు చదువ నారంభించెను. పదునాలుగేడులు పూర్తికాకమున్నే వేదమందు చాలభాగము పూర్తిగావించెను. ఒకానొకవిషయము జ్ఞానసంపాదనమందలియాతనియాసక్తిని మఱింతయధికము జేసెను.

శివభక్తుడగు వీనిజనకు డీతనిని శివోపాసకునిగా గావింపదలచెను. అటులొనరించుటకు శివరాత్రి ముఖ్యదినమని యాతఁ డెఱిగియున్నవాడగుటచే నాపర్వదినమునకై వేచియుండెను. ఇటు లుండ శివరాత్రియు వచ్చెను. నాటి యుదయమున తండ్రి కుమారు నుద్దేశించి "కుమారా! నేడు పుణ్యదిన

పవలంతయు నుపవసించి రాత్రి జాగరణము సలుపవలెను" అనెను. తండ్రియాజ్ఞ శిరమున ధరించి రాత్రి తండ్రితోగూడ కుమారుడు శివాలయమున కరిగెను. రాత్రి రెండుఝాములు గడచెను. పూజ పూర్తిగావించి పురోహితు డావలి కరిగెను. అపుడెలుకలు కొన్ని గర్భగుడిలోనికివచ్చి నైవేద్యవస్తువులు భక్షించి దేవునిపై నెక్కి యిచ్చవచ్చినట్లు పరువెత్తి యల్లరి చేయసాగెను. ఎలుకల యల్లరిచూచి మూలశంకరుడు తండ్రితో "తండ్రీ! ఇతడేనా దేవాదిదేవుడు? మహాదేవు డితడేనా? శంకరుం డితడేనా?" యనెను. జనకు డాశ్చర్యమునొంది "నీ విట్లడుగుచుంటి వేల?" ననియెను. "ఈవిగ్రహము సర్వశక్తిసంపన్నుడగు పరమేశ్వరుడే యగునెడల చిట్టెలుకలు దానిపై నిటునటు పరుగెత్త నేల?" యని తనయుడు తిరిగి ప్రశ్నించెను. దానికి జనకు డేమేమో ప్రత్యుత్తరము లొసంగెను గాని యతని కవి సముచితములుగ తోపలేదు. తోడనే యానాటి వ్రతమును భంగముగావించుకొని మూలశంకరు డాదేవళమునుండి నిజగృహమునకు వచ్చెను.

ఇట్లుండ కొలదిదినములకు మూలశంకరునిసోదరి యొక్కతె రోగపీడితయై చనిపోయెను. తోబుట్టువుమరణమున కతడు మిగుల దుఃఖించినవాడై పుడమిపై జనియించుట చచ్చుటకే యనియు నివారింపరానిమరణబాధకు ప్రతిజీవియు గురి కావలసినదే యనియు తుచ్ఛములగు సంసారసుఖముల నపేక్షింపరా దనియు శంకరుడు తలచెను. క్రమక్రమముగా నతనిహృదయమున వైరాగ్యాగ్ని రగులదొడగెను. తనయునిమానసము సంసారవిముఖమై యుండుట కనిపట్టి తండ్రి యాతనిని వివాహరజ్జువున వెంటనే బంధింప యత్నము చేసెను. కాని యాతనిప్రయత్నము వ్యర్థమైపోయెను. క్రీ. శ. 1845 వ, సంవత్సరమున నొకనాటిసాయంకాలమున తన కిరువదియొకటవయేడగు నీడున, తల్లిదండ్రులను చుట్టములను స్నేహితులను పుట్టినయూరును విడిచి శంకరుడు వెడలిపోయెను.

అట్లు చని యనేకదేశములు తిరిగి శంకరుడు సిద్ధపురమను నొకపల్లియు చేరెను, మిక్కిలిపేరుచెందిన లాలాభక్తనుయోగి యొకం డాగ్రామమున నపుడు వసించుచుండెను. అతడు నిజముగు యోగియో కపటసన్యాసియో కను గొనుటకై శంకరు డాతనియాశ్రమమున కొంతకాల ముండి, యాతనిని నిక్కమగుసన్యాసిగా తెలిసికొని వానికి శిష్యుడై యతనియొద్ద దీక్షగైకొని యంతటి

నుండియు దయానందశుద్ధచైతన్యుడనుపేర పరుగుచుండెను. శంకరాచార్యుడు స్థాపించిన నాలుగుమఠములందును నాలుగువిధములగు బ్రహ్మచారు లుండు చుండిరి. మఠానుసారముగా నానలువురకు వేరువేరు పేరు లుండెను. ఉత్తరము నందలిమఠ మానందమఠమనియు దక్షిణమందలిది చైతన్యమఠ మనియు తూర్పుపడమరలయందలివి ప్రకాశస్వరూపమఠము లనియుచెప్పబడుచున్నవి. కావున శంకరుడు దక్షిణమఠమునకుసంబంధించిన బ్రహ్మచారియని బోధపడు చున్నది. అతడు తననామమందలి మార్పుతోపాటు తనవేషభాషలయందును మార్పు గావించి మామూలువస్త్రములు కట్టుట మాని కాషాయాంబరములు ధరింపదొడగెను.

సిద్ధపురగ్రామమున ప్రతియేట పుష్యమాసమున నొకగొప్పయుత్సవము జరుగునాచారము కలదు. పెక్కుమందియాత్రికులును సన్యాసులు నప్పు డచట చేరుచుందురు. ధర్మము నెరుంగుటయందు కోరికగలవా డగుటచే దయానం దుడు సన్యాసులు బసచేసినప్రదేశములు వెదకప్రారంభించెను. ఇట్లు వెదకుచు కొందఱుయోగులను దర్శించుచు యొకనా డతడు నీలకంఠ దేవుని యాలయ మున గూర్చునియుండ నతనిజనకు డచటికి పరిజనులతో వచ్చెను. అకస్మికముగా తండ్రిని చూచినంతనే యతడు తెల్లబోయెను. పారిపోయినకుమారుడు హఠా త్తుగా దేవాలయమున గాన్పించినందులకు మిక్కిలి సంతసించినవాడై జనకు డాతనిని బలవంతమున నింటికి గొంపోయెను. పాపము; దయానందు డేమి చేయగలడు. కొడుకు దుడుకుతనమున మరల నిల్లు వీడి పారిపోవుననుభయమున జనకు డాత డావలి కరుగుటకు వీలుగాకుండుకట్టుబాటు లొనరించెను. సంసార సుఖమునకు నీళ్లువదలి యోగిజనదుర్లభమగు శాశ్వతసుఖంబునుగోరి తపించుచు చున్న దయానందుడు తండ్రిచేతులనుండి తప్పించుకొనిపోవుట కనేకయుపా యములు వెదకుచుండెను. అదృష్టవశమున నింటివాకిట కావలికాయుచుండు సేవకుడు నిద్దురచెందియుండ నతడు మెల్లగా నవ్వలికి గారెను. లేచి భటులు తన్ను పట్టుదురేమోయనుభీతి నతడు మిక్కిలిదట్టముగానున్న యొకవృక్షము నెక్కి యాకుకొమ్మలనడుమ దాగెను. అన్నము నిద్రయు మానుకొని యతడు రెండుదినము లందే యుండెను. మూడవనా డర్ధరాత్రమున మెల్లగ చెట్టు దిగి యెచ్చటను తడయక రాత్రింబవళ్లు నడచి నడచి తుద కాతడు అహమ్మదాబాదు

చేసుకొనెను. తరువాత నతడు బరోడాకు జని యచట చైతన్యమఠమున కొన్ని నాళ్లుండి యచ్చోటు విడిచి 'చానదుకల్యాణి'కి నరిగి 'జోయాలానంద' మను నొకనిర్జనస్థలమందును శివానందమను పర్వతశిఖరమందును యోగాభ్యాస మొనరించెను. దైవవశమున నాసమయమున పూర్ణానందసరస్వతి యనుసన్యాసి యొకడు శృంగేరిమఠమును వీడి శివానందగిరికి చేరువ నొకజనశూన్యమగు ప్రదేశమున వాసముచేయుచుండెను. ఆయోగివరుని ప్రభావము వినినవాడై దయానందు డాతనిపాలి కరిగి యాతనికరుణకు పాత్రుడయి యాతనివలన మంత్రోపదేశమును దీక్షను గ్రహించెను. అంతటినుండియు నతడు దయానంద సరస్వతి యని పిలవబడుచుండెను. అప్పటి కతనికి పాతికేండ్లప్రాయముకంటె నధికము లేదు.

క్రీ. శ. 1854 వ సంవత్సరమున హరిద్వారమున కుంభమేళమహోత్స వము జరిగెను. ఆపుణ్యదినమున నానాదేశములనుండి యసంఖ్యాకులగుయోగు లును తీర్థప్రజయు వచ్చుచుందురు. (ఈకుంభమేళము పండ్రెండువత్సరముల కొకపర్యాయము జరుగుచుండును. 1927 వ సంవత్సరమున నేప్రిలు 13 తేదీన ఈమహోత్సవము జరిగినపుడు సుమారు నలుబదిలక్షలయాత్రికు లచటి కరిగిరి. బ్రహ్మానందులను నాంధ్రస్వాములవారు 'హిరికిపారా' సమీపమున విడిసి, దిన మున కొకవెయ్యిమంది కిన్నప్రదానము చేసిరి. విష్ణుపాదక్షేత్రమున స్నాన మాచరింప లక్షలకొలది యాత్రికు లరిగిరి. జనసమూహామునందు పలువురు బ్రహ్మగుండమున మునిగిపోయిరి. దురదృష్టవశమున నచటివంతెన కూలి పోయెను.) జ్ఞానులగు మహాత్ములను చూచుటకై దయానందుడు హరిద్వారమున కరిగెను. క్రీ. శ. 1885 వ సంవత్సరమున, కాశ్మీరము, కాశీ, అలహా బాదు మొదలగు పుణ్యక్షేత్రము లాతడు వీక్షించెను. దయానందసరస్వతి, క్రీ. శ. 1888 వ సంవత్సరమున మధురక్షేత్రమును జేరుకొనెను. మధురయం దున్నపుడు దయానందునికి ముప్పదినాలుగేండ్లు మాత్రమే. అపుడు కృష్ణ ధామమున నొకమహాయోగి వసించుచుండెను. విరజానందుడను నీస్వామిజీ కప్పటికి రమారమి యెనుబదిరెండేండ్లుండును. అయిదేండ్లవయస్సువాడయి యుండ మసూచికమువలన నతడంధు డయ్యెను. అసాధారణప్రజ్ఞావంతుడగు టచే పరులు చదువుచుండగా విని వేదాదిశాస్త్రముల నతడు కంఠపాఠము

గావించుకొనెను. ఆమహాపండితుని చేరి దయానందు డతనికి శిష్యుడై క్రీ. శ. 1895 వ సంవత్సరమువరకు, విరజానందునిమఠమున శాస్త్రపఠనమున యోగాభ్యాసమున కాలము గడపి పిమ్మట ఆగ్రాకు జనెను.

దయానందునికి విగ్రహారాధనమునం దిష్టములేదు. విగ్రహారాధనమును ఖండించుటయే యతనికి ముఖ్యకార్యముగా నుండెను. వేదములయందు తప్ప నితరశాస్త్రములయం దితనికి నమ్మకము లేదు. విద్యార్థియై దయానందుడు విరజానందుని జేరినపు డాఋషి "వత్సా! నీవింతకాలమునుండియు చదివిన గ్రంథములు చాలవరకు మనుష్యరచితములు; మనుజులువ్రాసినగ్రంథముల యందుగల యుత్సాహము తగ్గినగాని, నీమనస్సున పూజ్యులగువారిచే రచి యింపబడినగ్రంథములయందలి విలువలేనిరహస్యములు నాటుకొనజాలవు. కావున నీయొద్దనున్న పుస్తకముల పారవైచి మరల నాకడ విద్య నారంభింపు" మనియెను.

విగ్రహపూజనుగురించి స్వామిజీ కాశీపండితులతో విశేషముగా వాదించెను. క్రీ. శ. 1899 వ సంవత్సరము నవంబరు 17 వ తేదీ మంగళవారము నాడు మధ్యాహ్నము మూడుగంటలకు దుర్గాలయసమీపమందలి యుపవనమున పండితులసభ జరిగెను. ఈ సభలో దయానందు డోడిపోయెను. మూడేండ్లు గడచినపిదప నతడు కలకత్తాకు వెళ్లెను. అచ్చట వివిధప్రదేశము లందు పన్యసించి యనంతరమున నతడు 'ఫరక్కాబాదు'న కరిగెను. దయానందు డాయూరినుండి హిందూదేశమునందలి యనేకభాగములకు బోయి అటుపిమ్మట అజ్మీర్ నగరమున కరిగి యచట పరమపదించెను. విశేషముగా తిరిగి యనేకసన్యాసులతో కలసియుండుటచే దయానందసరస్వతి యోగసమాధినిగురించి పెక్కువిషయములు నేర్చికొనియుండెను. తాను తెలిసికొనినవిషయము లన్నిటిని నాచరింప నెల్లప్పుడు నతడు పాటుపడుచుండువాడు. యోగాభ్యాసమునుగురించి యొకగ్రంథమందు, ఈతడు నాడీచక్రమునుగురించి చదివి యుండెను. ఒకనాడు దయానందుడు మీారదాబాదుసమీాపమున గంగయొద్దున తిరుగుచుండెను. అపు డొకమనుజునిదేహము నీట గొట్టుకొనిపోవుచుండెను. మనుష్యశరీరమున నిజముగా నాడీచక్ర మున్నదో లేదో వీక్షింపదలచి నదీ మధ్యమున కీదుకొనిపోయి శవము నొడ్డునకు తెచ్చి కత్తితో నా శరీరమును

కోసి, శాస్త్రవిషయముల ననుసరించి యతడు దానిని పరీక్షింప దొడగెను. గ్రంథమునందు చెప్పబడిన నాడీచక్ర మాకాయమునం దెచ్చటను కనుపడ లేదు. తోడనే దయానందుడు తనయొద్దనున్న యాగ్రంథమును చించి నదిలో పారవైచెను.

ఆర్యోద్దేశరత్నమాలయను నొకసంస్కృతగ్రంథము నితడు రచించెను. అందలి కొన్నిముఖ్యవిషయము లిందు వివరించుచున్నాను.

(1) ఈశ్వరుడు—ఎవనిగుణకర్మస్వభావమును స్వరూపమును సత్యమై విరాజిల్లుచుండునో; ఎవడు కేవలము చేతనమాత్రవస్తువై, అద్వితీయుడై సర్వశక్తిసంపన్నుడై నిర్వికారుడై సర్వవ్యాపకుడై యనాదియనంతసత్యగుణసంయుక్తుడై యొకడవినాశియై జ్ఞానియై యానందమయుడై న్యాయకారియై దయామయుడై యజన్మాదిస్వభావయుక్తుడై జగదుత్పత్తిస్థితిలయకారణభూతుడై విలసిల్లుచూ, చేసుకొనినపాపపుణ్యముల ననుసరించి జీవులకు దుఃఖమును సుఖము నెవ్వడొసంగుచుండునో యాత డీశ్వరుడు.

(2) ధర్మము—ఎయ్యది యీశ్వరాజ్ఞాపాలనమో ఎయ్యది పక్షపాతరహితమో, ఎయ్యది సర్వభూతహితమో, ప్రత్యక్షప్రమాణములమూలమున నెయ్యది పరీక్షితమో; ఎయ్యది వేదోక్తహేతువో ఎయ్యది సర్వజనపాలనాయోగ్యమో యదియే ధర్మము.

(3) అధర్మము—ఈశ్వరాజ్ఞావ్యతిరేకమును, పక్షపాతయుక్తమును, అన్యాయముతో కూడుకొన్నదియు, పరులకుహానికరమును స్వలాభకారియు మాయతోడను మోసముతోడను నిండినదియు, వేదశాస్త్రవిద్యకు విరుద్ధమును, నగునది యధర్మము.

(4) పుణ్యము—ఎయ్యది విద్యాదిశుభగుణములతో నొప్పుచుండునో ఎయ్యది సత్యభాషణ సత్యాచార సత్యానుష్ఠాన సంయుతమో యదియే పుణ్యము.

(5) పాపము—ఎయ్యది పుణ్యమునకు విపరీతమో ఎయ్యది మిథ్యాభాషణదుష్కార్యపర్యవసానమో యది పాపము.

(6) సత్యభాషణము—ఆత్మనుండి జనించినదై యెప్పుడును అసంభవదోషరహితమై యొప్పు వాక్కు సత్యభాషణము.

(7) మిథ్యాభాషణము—సత్యమునకు దూరమైనమాటయే మిథ్యాభాషణము.

(8) విశ్వాసము—దేనిమూలార్థమును ఫలమును నిశ్చయముగ సత్యయుక్తమో అయ్యది విశ్వాసము.

(9) అవిశ్వాసము—విశ్వాసమునకు విపరీతమును పరమార్థజ్ఞానవిహీనమును నైనది యవిశ్వాసము.

(10) పరలోకము—సత్యవిద్యమూలమున పరమేశ్వరునికటాక్షమును పొంది ప్రస్తుతజన్మమునుండియు పునర్జన్మమునుండియు విముక్తుడయి పరమేశ్వరుని సాన్నిధ్యమును బడసి పరమసుఖము నందులోకము పరలోకము.

(11) అపరలోకము—పరలోకమునకు విరుద్ధమయి నిరంతదురంతదుఃఖదాయక మగునది యపరలోకము.

(12) జన్మ—దేనిమూలమున జీవు డేదేనిశరీరముతో కూడి కర్మబద్ధుడగునో యదిజన్మము.

(13) మరణము—ఒకశరీరము నాశ్రయించి కర్మలనాచరించి జీవు డాదేహమును విడిచిపోవుట మరణము. శరీరవియోగమే మృత్యువు.

(14) స్వర్గము—జీవుడు విశేషసుఖము నందుట స్వర్గమందురు.

(15) నరకము—జీవుడు విశేషదుఃఖము నందుట నరకమందురు.

(16) విద్య—ఈశ్వరునుండి పృథ్విపర్యంతముగల సర్వవస్తుసముదాయమునుగురించిన, సత్యవిజ్ఞానము దేనిమూలమున బడసి తగినయుపకారమును పొందుదుమో అయ్యది విద్య.

(17) అవిద్య—ఏయ్యది విద్యకు విపరీతమో భ్రమాంధకారఅజ్ఞానస్వరూపమో అది అవిద్య.

(18) సత్పురుషుడు—సత్యప్రియుడును ధర్మాత్ముండును విద్వాంసుడును సర్వహితకారియు మహాశయుడు నగుమనుష్యుడు సత్పురుషుడు.

(19) సత్సంగము; కుసంగము—ఏద్దానివలన మాయను పరిత్యజించి సత్యమును గ్రహింతుమో అయ్యది సత్సంగము. ఏద్దానివలన పాపకర్మయందిచ్ఛగలవారమగుదుమో అయ్యది కుసంగము.

(20) తీర్థము—సంసారదుఃఖసముద్రమునుండి జీవుడు దాటుటకు విద్యాభ్యాసము, సువిచారము, ఈశ్వరపూజనము, ధర్మకార్యాచరణము, సత్యము నాశ్రయించుట, బ్రహ్మచర్యము ఇంద్రియనిగ్రహము మున్నగు నుత్తమక్రియ లొనరించుటయే తీర్థము. ఈ పవిత్రకార్యములే పుణ్యక్షేత్రములు, సత్కర్మమే తీర్థము.

(21) స్తుతి—ఈశ్వరునిగురించిగాని, మహాపురుషునిగురించిగాని, యేదేని యున్నతపదార్థమునుగురించిగాని కావించుభాషణము శ్రవణము, సత్యభాషణము స్తుతి యగును.

(22) స్తుతిఫలము—గుణశ్రవణ సత్యభాషణాచరణమున మంచి గుణముతోగూడిన జీవునకు కలుగుప్రీతియే స్తుతిఫలము

(23) నింద—మిథ్యాజ్ఞానమందును, కల్లమాటలయందును, బూటకపు విషయములందును, తొందరపాటు జూపె సుగుణములను త్యజించి దుర్గుణముల నితరులపై మోపుటయే నింద యనబడును.

(24) ప్రార్థనము—నిజమనోరథము పూర్ణమగుటకును, సత్కార్యము సిద్ధించుటకును పరమేశ్వరునిగాని శక్తిసంపన్నుడగు వ్యక్తినిగాని సహాయము గోరుట ప్రార్థన యగును.

(26) ప్రార్థనాఫలము—నిజాభిమానమును పోగొట్టుకొని సద్గుణముల నాశ్రయించి మానవుడు పురుషార్థము నందుటే ప్రార్థనాఫలము.

(26) ఉపాసనము—ఆనందస్వరూపుడగు నీశ్వరునియందు తనయాత్మను మగ్న మొనరించుటయే యుపాసనము.

(27) నిర్గుణోపాసనము—పరమాత్మ, శబ్దస్పర్శరూపరసగంధసంయోగ వియోగలఘుగురు యవిద్య జననమరణదుఃఖరహితుడని యెఱింగి, యాతని నుపాసించుటయే నిర్గుణోపాసనము.

(28) సగుణోపాసనము—ఈశ్వరుడు సర్వజ్ఞుడనియు సర్వశక్తిసంపన్నుడనియు నిత్యానందమయుండనియు సర్వకర్తయనియు సర్వనాథుడనియు సర్వనియంతయనియు సర్వాంతర్యామియనియు, మంగళపూర్ణుడనియు, సర్వానందప్రదుండనియు సర్వజగత్కర్తయనియు, న్యాయకారియనియు, దయాస్వరూపుడనియు సత్యగుణయుక్తుండనియు నెఱిగి, యాతని నుపాసించుట సగుణోపాసన యగును.

(29) ముక్తి—సమస్తకుత్సితకార్యముల నుండియు జననమరణాదిదుఃఖములనుండియు, విముక్తుడయి సుఖస్వరూపుండగు పరమేశ్వరుని జేరి యనంత సుఖ మందుటయే ముక్తి.

(30) ముక్తిసాధనము—సమస్తదుష్కార్యములను విడిచి పైనచెప్పిన రీతిని పరమేశ్వరుని స్తుతియించి, పూజించి ప్రార్థించి ధర్మాచరణము పుణ్యకార్యాచరణము సత్పురుషసాంగత్యము పరోపకారము మొదలగు నుత్తమకర్మలొనరించుట ముక్తిసాధనము.

(31) కర్త—ఎవడు స్వతంత్రముగా కర్మ నాచరించునో, క్రియాసాధనమునకంతకు నెవడు కారకుడో వాడు కర్త.

(32) కారణము—ఎద్దానివలన కర్త యేదేనికార్యము ను చేయజాలునో యెద్దానిచే యేదేనివస్తువును నిర్మింప సమర్థుడగునో, ఎయ్యది లేకుండిన యేపనిగాని చేయుటయు యేపదార్థమునుగాని నిర్మించుటయు సంభవముకాదో అదియే కారణము. కారణము మూడువిధములు. 1 ఉపాదానము. 2 నిమిత్తము. 3 సాధారణము.

(33) ఉపాదానకారణము—మట్టినుండి కుండను చేయు తెరగున యెద్దానిచే యేపదార్థమునుగాని చేయుటకు వలనుపడునో దాని నుపాదానకారణ మందుము.

(34) నిమిత్తకారణము—కుమ్మరి కుండలకు నిర్మాత యగునటుల వస్తునిర్మాతకు నిమిత్తకారణ మందుము.

(35) సాధారణకారణము—ఘటనిర్మాణమున కఱ్ఱ మొదలగు సాధనములు సాధారణకారణము లైనట్లు కార్యనిర్వాహణమునకు కావలసినపరికరములు సాధారణకారణ మనబడును.

(36) కార్యము—ఎయ్యది మరియొకపదార్థముతో గలియుటచే స్థూలరూపమును చెంది యుపయోగమునకు అర్హ మగునో దానిని యాకారణము యొక్క కార్య మందుము.

(37) సృష్టి—కర్తయొక్క రచనయందలి కారణవస్తు వేదేని కలియుటచే, ననేకవిధముల పరిణమించి వర్తమానకాలమున నుపయోగపడునో దానిని సృష్టి యందుము.

(38) జాతి—ఈశ్వరకృతమై పుట్టినదిమొదలు నశించువరకు నొకే రూపమున నుండుసృష్టివిశేషము—ఉదాహరణము: మనుష్యుడు, గోవు, అశ్వము.

(39) మనుష్యుడు— సృష్టియందు జీవులలో మేధాసంపన్నమగు జీవము మనుష్యజీవము. కావున ఆలోచనానుసారము వర్తించు జీవమును మనుష్యుడందుము.

(40) ఆర్యుడు—శ్రేష్ఠస్వభావముకలవాడును, ధర్మాత్ముండును, పరోపకారియు సత్యవిద్యాదిగుణయుక్తుండును నార్యావర్తవాసియు నగువాని నార్యుడందుము.

(41) ఆర్యావర్తము—హిమాచల వింధ్యాచల సింధునదీ బ్రహ్మపుత్రల మధ్యగల విశాలమగు ప్రదేశ మార్యావర్తము.

(42) దస్యుడు—అనార్యుడును నీచుడును చోరుడును హింసాది దుష్క్రియలాచరించువాడును దస్యుడు.

(43) వర్ణము—గుణకర్మలుకలియుటచే గురుతింపబడజాలునది వర్ణము.

(44) వర్ణభేదము—బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల విభజనము వర్ణభేదము.

(45) ఆశ్రమము—మిక్కిలి శ్రమపడి యుత్తమగుణముల నలవరచుకొని సత్క్రియలు మానవు డేసమయమున నాచరించునో అది యాశ్రమము.

(46) ఆశ్రమభేదము—విద్యాదిగ్రహణము జితేంద్రియత్వము వలన, నాత్మయొక్కయు శరీరముయొక్కయు బలవృద్ధికై జరుపుబ్రహ్మచర్యాశ్రమము, సంతానముకొఱకు, సమస్తవ్యవహారసిద్ధికొఱకు జరుపుగృహస్థాశ్రమము, ఈశ్వరవిషయవిచారముకొఱకు జరుపు వానప్రస్థము, సర్వోపకారసిద్ధికై కావించు సన్యాసాశ్రమము. ఇవినాలుగు నాశ్రమభేదములు.

(47) యజ్ఞము—అగ్నిహోత్రము మొదలుకొని యశ్వమేధమువరకు జరుపబడు క్రతువిశేషమేగాక లోకోపకారమునకై గావింపబడు ఘనకార్యములు యజ్ఞము లనబడును.

(48) కర్మ—జీవు డొనరించుదానిని కర్మయందురు. ఇది మూడువిధములు 1. శుభము 2. అశుభము 3. మిశ్రభేదము.

(49) క్రియమాణము—ప్రస్తుతము చేయజాలునది క్రియమాణము.

(50) సంచితము—జ్ఞానమధ్యమమునసుండు క్రియమానకర్మసంస్కారమును సంచితసంస్కార మందుము.

(51) ప్రారబ్ధము—సుఖముగగాని దుఃఖముగాగాని అనుభవింపబడు పూర్వజన్మకృతకర్మమును ప్రారబ్ధ మందుము.

(52) అనాదిపదార్థము—ఈశ్వరుడు, ఆత్మ, ప్రపంచము (పుడమి, జలము, అగ్ని, గాలి, ఆకాశము) ఈమూడును, అనాదిపదార్థములు.

(53) అనాదిపరంపర—కార్యజగత్తు, జీవకర్మ, జీవసంయోగవియోగములు.

(54) అనాది—ఏది యొకప్పుడు పుట్టలేదో యేపదార్థము దేనిదికాదో సదా యేది స్వయంభువో అదియే అనాది.

(55) పురుషార్థము—నిమిషమైనను కాలము వృథపుచ్చక మనోవాక్కాయపూర్వకముగా సత్కార్యసిద్ధికై కావించు నిరంతరకార్యము పురుషార్థము.

(56) పురుషార్థభేదములు—పొందని యున్నతపదార్థములయెడల గల కోరిక, పొందినసామగ్రిని సముచితముగా కాపాడుట, కాపాడినపదార్థము వృద్ధిగావించుట, వృద్ధియైనపదార్థమును సర్వజనహితసాధనమునకును సత్యవిద్యాభివృద్ధికిని వినియోగించుట ఈనాలుగింటిని పురుషార్థభేద మందురు.

(57) పరోపకారము— మనోవాక్కాయ పూర్వకముగా నొరులకు సుఖము కూర్చుటకై చేయుపని పరోపకారము.

(58) శిష్టాచారము—శుభగుణగ్రహణమునకును అశుభగుణత్యాగమునకును కావించుక్రియకు శిష్టాచార మనిపేరు.

(59) సదాచారము—సృష్టిమొదలు నేటివరకు సత్పురుషులు వేదోక్త ప్రకారము జరుపునాచారములును, అసత్యమును వీడి కేవలము సత్యము నందే దృష్టినుంచి కావించుక్రియలును సదాచారములు.

(60) విద్యాపుస్తకములు—ఈశ్వరునిచే నుడువబడి పూర్వకాలపు నాటివైన, సత్యవిద్యామయమయిన నాలుగు వేదములను విద్యాపుస్తకము లందురు.

(61) ఆచార్యుడు—శ్రేష్ఠాచారములను బోధించి సమస్తవిద్యల నేర్పునత డాచార్యుడు.

(62) గురువు—వీర్యదానము మొదలు భోజనాదిసౌకర్యముల నొసగి పాలించువాడుగావున జనకుడు గురువు. సత్యోపదేశముచే హృదయమందలి యజ్ఞానాంధకారమును పారదోలునాతనికిని గురు వనిపేరు.

(63) అతిథి—ఎవ్వానిరాకపోకలనుగురించి నిశ్చయమగు తిథిని తెలుపజాలమో, విద్వాంసుడై సర్వత్రా తిరిగి తిరిగి ప్రశ్నోత్తరవిధమున నుపదేశము లొనరించుచు సర్వజనులకు నెవ్వ డుపకారము చేయచూచునో యాత డతిథి.

(64) పంచాయతనపూజ—సజీవులయిన జననీజనకులను ఆచార్యుని అతిథులను ఈశ్వరుని ప్రసన్నులజేయ, హృదయపూర్వకముగా చేయుపూజ పంచాయతనపూజ.

(65) పూజ—జ్ఞానాదిగుణసంపన్నుని సముచితముగా సత్కరించి సేవించుటయే పూజ.

(66) అపూజ—అయోగ్యబుద్ధిహీనజడపదార్థమునకు సత్కార మొనరించుట అపూజ.

(67) జడము—జ్ఞానాదిగుణరహితవస్తువు జడము.

(68) చేతనము—జ్ఞానాదిగుణయుక్తపదార్థము చేతనము.

(69) భావనము—భ్రమయందు పడక వస్తుగుణానుసారము కావించు నిశ్చయము భావనము.

(70) అభావనము—జడము చేతనమనియు చేతనము జడమనియు నిశ్చయించుట మిథ్యాజ్ఞానమూలమున ఏవస్తువునుగాని విపరీతవస్తువుగా తలచుట అభావనము.

(71) పండితుడు—వివేకముమూలమున సదసత్తులు తెలిసినవాడై ధర్మాత్ముడై సత్యవాదియై సత్యప్రియుడై విద్వాంసుడై సర్వహితకారియైన వ్యక్తి పండితుడు.

(72) మూర్ఖుడు—అజ్ఞానుడై క్రూరుడై దురాగ్రహాదిదోషములతో కూడుకొన్న వాడగువ్యక్తి మూర్ఖుడు.

(73) జ్యేష్ఠకనిష్ఠయాచరణము—పెద్దపిన్నలు సముచితరీతి నొండొరులను సమాదరించుట.

(74) సర్వహితుడు—త్రికరణశుద్ధిగా నొరులకు హిత మొనరించువాడు సర్వహితుడు.

(75) చౌర్యత్యాగము—యజమాని లేక భర్త యాజ్ఞలేక వానిపదార్థమును గొనుట చౌర్య మగును. అద్దానిని త్యజించుట చౌర్యత్యాగము.

(76) వ్యభిచారత్యాగము—నిజపత్నినిగాక యన్యవనితను గూడియుండుట, కాలనియమము గణింపక స్వభార్యను కలియుట, యధికవీర్యనష్టము కలిగించుట, యౌవనుడుకాని కాలమున పెండ్లిచేసికొనుట, మున్నగుక్రియలను వ్యభిచార మందుము. అట్టివి విడచుట వ్యభిచారత్యాగము.

(77) జీవము—ఎయ్యది చేతన, అల్పజ్ఞాన, ఇచ్ఛ, ద్వేష, ప్రయత్న, సుఖ, దుఃఖాదిగుణయుక్తమైనదో అది జీవము.

(78) స్వభావము—అగ్నియందు దాహగుణ మున్నట్లు యేవస్తువునందుగాని యదియంతమగుదనుక దానిని విడువకయుండుగుణమునకు స్వభావ మందుము.

(79) ప్రళయము—జగత్తునకు కర్తయగు యీశ్వరుడే యేకారణముల నుండి సృష్టిగావించి యనేకకార్యము లొనరించి, వానిని పాలించి మరల వానిని కారణములుగ మార్చివైచినపుడు తోచుకారణరూపపరిణామమును ప్రళయ మందుము. కార్యజగత్తు కారణరూపముగ పరిణమించుటయే ప్రళయము.

(80) మాయావి—వంచనము, కపటము, స్వార్థము, దంభము, అహంకారము మొదలగు దోషములను మాయ యందుము. ఈదోషములుకల మానవుడు మాయావి.

(81) ఆప్తుడు—దోషరహితుడై, ధర్మాత్ముడై, విద్వాంసుడై, సత్యోపదేష్టయై సర్వభూతములయెడ కృపాళుడై, యజ్ఞానులహృదయమునుండి యంధకారమును తొలగించి జ్ఞానమును ప్రసాదించునట్టివాడు ఆప్తుడు.

(82) పరీక్ష—వేదవిద్య ఆత్మశుద్ధి సృష్టిక్రమముల సత్యాసత్యముల నిర్ణయించుటకై ప్రయోగింపబడు ప్రత్యక్షాదిప్రమాణము లెనిమిది పరీక్షలు.

(83) అష్టప్రమాణములు—ప్రత్యక్షము, ప్రమాణము, ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము, అనుమానము, ఉపమానము, యివి యష్ట ప్రమాణములు. ఈయెనిమిదిఋజువులమూలముననే మానవుడు సత్యాసత్యములను నిర్ణయింప సమర్థు డగును.

(84) లక్షణము—వస్తువుయొక్క స్వాభావికగుణము దానిలక్షణము. రూపమునుబట్టియే వస్తులక్షణము గుర్తింపనగును.

(85) ప్రమేయము—కన్నులమూలమున కనుగొనబడినదానిని చక్షుః ప్రమేయరూప మనునట్లు, ప్రత్యక్షప్రమాణమూలమున తెలియబడుదానిని ప్రమేయ మందుము.

(86) ప్రత్యక్షము—ఇంద్రియములకును చిత్తమునకును కలుగు చేరిక వలన కలుగుజ్ఞానము ప్రత్యక్షము.

(87) అనుమానము—ఇదివరలో చూచినదేవస్తువుయొక్క భాగము నైనను చూచుచు నావస్తువుయొక్క చూడబడనిభాగమునుగురించి యెఱుంగుట యనుమానము.

(88) ఉపమానము—సాదృశ్యముమూలమున తెలిసికొనుదానిని ఉపమాన మందురు.

(89) శబ్దప్రమాణము—పూర్ణాప్తపరమేశ్వరునియొక్కయు, పూర్వోక్త యాప్తమానవునియొక్కయు నుపదేశము, శబ్దప్రమాణము.

(90) ఐతిహ్యము—లిఖితరూపమున నుండక మొదటినుండియు ప్రజాదరణము బడయు విషయము ఐతిహ్యము.

(91) అర్థాపత్తి—ద్వితీయవాక్యోచ్చారణ మవసరములేకయే ప్రథమమునుండియు మూలముననే యెఱుంగబడునది యర్థాపత్తి.

(92) సంభవము—యోచనానుకూలమై, సృష్టిక్రమయుక్తమై, వాక్యప్రమాణమైనదానిని సంభవ మందురు.

(93) అభావప్రమాణము—వాంఛితవస్తురాహిత్యమునుగుఱించి యోచింప, దానిని బడయుయత్నమున కలుగుజ్ఞానము, అభావప్రమాణము.

(94) శాస్త్రము—ఎయ్యది సత్యవిద్యాప్రతిపాదనయుక్తమై మానవునకు సత్యాసత్యవిచక్షణజ్ఞాన మొసంగునో యది శాస్త్రము.

(95) పురాణములు—ప్రాచీనములై, ఋషికృతములై సత్యార్థయుక్తమైన యొప్పు బ్రాహ్మణమాది మహాగ్రంథములను పురాణము లందుము.

(96) వేదములు—ఈశ్వరోక్తములై సత్యవిద్యాయుక్తములై, జ్ఞాన ప్రదాయకములైన నాలుగుఋషిసంహితములను (ఋగ్వేదము; యజుర్వేదము; సామవేదము; అథర్వవేదము) వేదము లందుము.

(97) ఉపవేదములు—1 ఆయుర్వేదము (వైద్యశాస్త్రము) 2 ధనుర్వేదము (శస్త్రాస్త్రవిద్య) 3 గాంధర్వవేదము (గీతశాస్త్రము) 4 అర్థవేదము (శిల్పశాస్త్రము) ఈనాలుగింటిని యుపవేదము లందుము.

(98) ఉపాంగములు—శిక్షణము, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందము, జ్యోతిషము మున్నగువానిని, యార్యసనాతనశాస్త్రములను, ఉపాంగము లందుము.

(99) వేదాంగములు—మునికృతములైన మీమాంస, వైశేషిక, న్యాయ, యోగ, సాంఖ్య, వేదాంతము లనునారుశాస్త్రములును వేదాంగములు.



౪

# భాస్కరానందసరస్వతి

"ఏపరమేశుపాదయుగ మెప్పుడు గోరి భజించి నేర్పరుల్
లోపలిబుద్ధి నుభయులోకములందుల జిడ్డుఁబాసి యే
తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు రే
నాపరమేశు మ్రొక్కెద సహాఘనివర్తనభద్రకీర్తనున్"

క్రీ. శ. 1833 వ సంవత్సరమున, నాశ్వయుజశుద్ధసప్తమినా డర్ధరాత్రమున కాన్పూరునకు చేరువనుగల మైథేాల్‌పురమున నీతడు జననమొందెను. ఈతనితండ్రి మిశ్రలాలుమిశ్రుడు. సామవేదీయ కనోజీబ్రాహ్మణుడు. మిశ్రలాలు వేదవిద్యాబోధకుడు. పురాణములందును నితనికి మంచిపాండిత్యముండెను. కుమారుని కీతఁడు మతీరాముడని పేరుపెట్టెను. ఎనిమిదవయేట మతీరామున కుపనయనము జేసి యప్పటియాచారమున ననుసరించి తండ్రి యాతనిని విద్యాభ్యాసమునకై గురువుగారిగృహమునకు పంపెను. కుశాగ్రబుద్ధియగు మతీరాముడు కొలదిదినములలోనే అసమానపాండిత్యము సంపాదించెను. పండ్రెండవయేడు రాగానే తలిదండ్రు లీతనికి వివాహ మొనరించిరి. వివాహమైనరెండేండ్లకు మతీరామునకు పుత్రసంతానము కలిగెను గాని పుట్టిన కొలది నాళ్ళలోనే యాశిశువు మరణించెను. తనయునిమరణము మతీరామునిమనమున వైరాగ్యమును జనింపజేసెను. అంత నతడు జననీజనకులను భార్యను వీడి యుజ్జయినికి బోయెను. అచ్చట నొకగురువర్యుని సంపాదించి, యాతనిసమక్షమున 'యోగమార్గనిదర్శక' మను గ్రంథమును బఠియించి యోగాభ్యాసము ప్రారంభించెను. కొలదియేండ్లుమాత్ర మాయుజ్జయినియం దుండి పిమ్మట నతడు గుజరాతు, మాల్వామొదలగుప్రదేశములు తిరుగ నారంభించెను. ఆయాస్థలముల దిరుగుచు నేడేండ్లకు వేదాధ్యయనము పూర్తిగావించుకొని తిరిగి యుజ్జయినికి బోయెను. సుప్రసిద్ధుడగు పూర్ణానందపరమహంస యప్పు డప్పట్టణమున విడిసియుండెను. మతీరాముని శక్తిసామర్థ్యములు పరికించి యాపరమహంస యాతనిని శిష్యునిగా జేసికొనెను. అప్పటినుండియు నతడు మతీరాముని

భాస్కరానందస్వామియని పిలుచుచుండెను. భాస్కరునివయస్సపు డిరువది యేడేండ్లుమాత్రమే. కొలదిదినము లాపురమున నుండి యతడు కాశీ కరిగెను. ఆవారణాసీపురమున దుర్గాదేవియాలయమునకు సమీపమున నున్నయానం దోద్యానవనమున స్వామిజీ తనయాశ్రమము నిర్మించుకొనెను. కొన్ని నెల లాయాశ్రమమున నివసించి భాస్కరానందుడు ఫతేపూర్ సమీపమందలి యశనిపురమనుగ్రామమున కరిగి యచటనుండి తనస్వగ్రామమునుగూడ చూడ జనెను. తరువాత నతడు కౌపీనమాత్రధారియై హిందూదేశమందలి పుణ్య తీర్థములన్నియు దిరిగి, తిరిగి కాశీ చేరెను.

స్వామిజీ బదరికాశ్రమమునకు జనునప్పుడు, దారిలో నెడతెగకపడు మంచుబిందువులవర్షముచే చాలప్రయాసపడెను. సహింపరాని చలిబాధచే నాతనియవయవములు పట్లు తప్పిపోయెను. చనిపోయినవానివలె నతడు మార్గ మధ్యమున పడిపోయెను. అత డొంటరిగాం బ్రయాణముచేయుచున్నందున నట్టి యవస్థయం దతనికి సహాయపడువా రెవ్వరును సమీపమున లేరైరి. స్వామిజీ దారిలో కొన్నిదినము లట్లే పడియుండెను. అట్లుండ నొకపుణ్యాత్ము డా దారినిబోవువాడు త్రోవనడుమ పడియున్నస్వామిని గాంచి, జాలిగొని, బహు భంగుల సేవజేసి యాతని తేర్చి, ప్రాణదాన మొనరించెను. అచ్చటనే యాతని కనంతానందస్వామి దర్శనము దొరకెను. వేదాంతమునం దనంతానందుని ప్రతిభ యద్వితీయమైనది. చాలకాలము హరిద్వారక్షేత్రమున స్వామిజీ తప మాచరించెను. స్వాము లిరువురును గలిసికొని, యీశ్వరతత్త్వమును విచారిం చుచు, పరమానందమున నచట కాలముపుచ్చిరి. భాస్కరానందుడు కొన్ని యేండ్లు హరిద్వారమందలి యనంతానందునియాశ్రమమునందే గడపెను. అప్ప టికి స్వామిజీకి నలువదియేండ్లు. అప్పు డతడు హరిద్వారమును వీడి వారణాసీ పురమునందలి యానందాశ్రమముం జేరుకొనెను.

ఆనందాశ్రమమున ప్రవేశించినపిమ్మట భాస్కరానందుడు కౌపీనమును కూడ దీసివైచెను. అట్లుండ శీతకాలమున నొకనాడు పురమందలివిద్వాంసు లును రాజకులస్థులును కొంద ఱానందోద్యానమున స్వామిజీని దర్శించి "గురు దేవా! శీతగాలి దారుణముగా వీచుచున్నది. ఆచ్ఛాదన మేమియు లేనందున దేహమునకు బాధ గలుగుచుండవచ్చును. చలినుండి శరీరమును కాపాడుకొను"

డని వినయమున నతని ప్రార్థించిరి. పరిత్యజించినపదార్థమును తిరిగి పరిగ్రహించుట న్యాయము గాదని యాతఁ డందుల కుత్తర మొసంగెను. స్వామిజీ మిక్కిలిశాంతచిత్తుఁడు. నిర్జనప్రదేశములందు నివసించుట యాతని కిష్టము. కాని యాతనివాంఛ యెప్పటికిని తీరినదికాదు. ఎంతశాంతము నిర్మానుష్యము నగుచోటికి కరిగినను యాతనిఖ్యాతి దశదిశలు వ్యాపించియుండుటచే తీర్థప్రజవలె ననేకు లాతని చూడఁజనుచు, స్వామిజీయాశ్రమమును గొప్పదేవాలయముగ్గ గావించుచుండెడివారు. ఈతనిధర్మోపదేశములు విని, రారాజు మొదలుకొని పరమదరిద్రునివరకు ప్రజ లీతనిచే నుపదేశనేక్షితులయి శిష్యు లగుచుండువారు. లక్షకుమించిన శిష్యు లుండెడివారని వాడుక కలదు. కేవలము భారతీయులుమాత్రమే గాక, అమెరికా, యూరోపా మొదలగు నితరఖండవాసులును నీతని దర్శించి జ్ఞానామృతమును గ్రోలి సంతసించి చనుచుండువారు.

తపముయొక్కప్రభావమున భాస్కరానందునకు మనుష్యాతీతమగుశక్తి యలవడెను. కాని యతఁడు దానిని సాధారణముగా చూపువాఁడుకాఁడు. అతని యద్భుతశక్తిని వెల్లడిజేయుదృష్టాంతము లొకటిరెండు తెలుపుచున్నాను.

'బడోహార' యనునగరమందలి వేదశరణ యనురాజకుమార్తెయొక్క యభీష్టసిద్ధినిగురించి స్వామిజీ జ్యోతిషముచెప్పెను. అతఁడు చెప్పినరీతిని దుర్ఘటమగుకార్యము సిద్ధించుటచే సుమారు లక్షరూపాయిలు స్వామిజీ కామె బహుమానముగ నియ్యఁబోయెను. స్వార్థత్యాగియగుభాస్కరానందు డాపైకమును చేకొననందున నారాజకుమారి యానందోద్యానముచెంత పెద్దశివాలయమును గట్టించెను. ఆమె స్వామిజీయెడ తనకుగలభక్తి చూపుచు నాయాలయమునం దొకయెడ నాతనివిగ్రహమునుగూడ స్థాపించెను.

శీతలప్రసాదుఁడను నొకవంగదేశీయుఁడు కాశీపురమున నివసించుచుండువాఁడు. అతఁడు స్వామిజీ ప్రియశిష్యులలో నొకఁడు. ఒకనాఁడాతనికుమారుఁడు మేడమీఁదినుండి నేలకూలి చావ సిద్ధమయ్యెను. స్వామిజీయొక్క సామర్థ్య మాతఁడెఱిగియున్నవాఁడగుటచే వైద్యులచెంతకు బరువెత్తక గురువుకడ కరిగి కుమారుని యతనిపాదములసన్నిధిని పడవైచెను. శిష్యునితొట్రుపాటు గని జరిగిన దంతయు గ్రహించి "కుమారా! ఈగంగాజలమును బాలకునినోటఁ బోయుము. నిదురనుండి మేలుకొనినవానివలె లేచి నిన్ను కౌగిలించుకొనును, విచారింపకు"

మని శీతలప్రసాదుఁడో నసెను. శిష్యు డటులొనరింప బాలకుడు మహానంద మున లేచి తండ్రి నాలింగనము చేసికొనెను.

కలకత్తామహానగరమునుండి వంగదేశస్థుడొకడు వారణాసియందలి యానందోద్యానవనమున కరిగి, యోగశిక్షకై భాస్కరానందు నాశ్రయించెను. అతనియభిప్రాయమును తెలిసికొని స్వామిజీ "అయ్యా! దీక్ష గైకొనుటకు నీ కింకను సమయము రాలేదు. మీయింట నెవరితోడను తెలుపక నీవు నాయొద్దకు వచ్చితివి. నీభార్య గర్భవతియై యున్నది. ఆమెయు పుత్రులును నీకొఱకు విచారించుచుండిరి. ఇపు డింటికి మరలిపోయి కొన్నియేండ్లు గడచిన పిమ్మట నాకడకు రమ్ము" అనియెను. యోగీంద్రుని వచనములకు మిక్కిలి యాశ్చర్యము జెంది, మనస్సునందలిభావమును బయలుపరుపక యాతడు ప్రభూ! నాకు దారాపుత్రాదు లుండుట నిక్కవమే. నేను వారియనుమతి వడసియే యిచటికి వచ్చితి" ననియెను.

"వారియనుమతి నీ వడిగియుంటివి కాని నీ విల్లువీడివచ్చుటకు వారు సమ్మతింపలేదు. వారిపై కోపగించి నీవు వచ్చితివి. నీవు సంసారమును వీడుటకు మరియొకకారణము కలదు. అది తెలిపి నిన్ను సిగ్గుపాలుచేయను. నిన్నింకను వాంఛాతృష్ణ వీడలేదు."

"మహాత్మా! నాహృదయమున వైరాగ్యభావము పుట్టుటచేతనే సంసారమును విడిచిపుచ్చి సన్యాసి నౌటకు నిశ్చయించుకొని మీపాదములచెంతకు వచ్చితిని. వేరొకకారణ మేమియులేదు."

"వత్సా! నిక్కము దాపనేల? నీయింటిపొరుగుననున్న యొకానొక సుందరిపై నాసక్తుడవై నీ వామెను జెఱుపదలచితివి. ఆమెయే నీకు జ్ఞాననేత్రము నొసంగినది. ఆమెయొక్క మాటలే నీహృదయమున వైరాగ్యభావము నంకురింప చేసెను."

స్వామిజీయద్భుతశక్తి కాశ్చర్యమునొంది యాపురుషు డతనిపాదములు రెండును గట్టిగా బట్టుకొని "మహాత్మా! యీ పాపాత్ముని రక్షింపు" డని పరిపరి విధముల ప్రార్థించెను. యోగివరు డతనిని ప్రేమపూరితములగువాక్కులచే నూరడించి "వత్సా! నీయిష్టము నెఱవేర్చెదను కాని నీ వింకను కొన్నిసంవత్సరములు గృహస్థాశ్రమమున నుండవలయు" ననియెను. స్వామిజీవచనముల కాతడు

సమ్మతించి యాతని సెలవు గైకొని వెడలిపోయి తరువాత కొన్ని యేండ్లు గడచిన పిమ్మట తిరిగి వచ్చి భాస్కరానందుని గలసికొనెను. ఒకశుభదినమున స్వామిజీ యతనిని యోగవిద్య నభ్యసింపజేసెను. యోగీంద్రునియుపదేశసారాంశ మిందు తెలుపుచుంటిని.

"సంసారమును విడిచి సన్యాసియైన మానవుడు యోగసాధన మొనరించి నంతనే యీశ్వరసాన్నిధ్యముపొందునని తలపరాదు. సంసారియైనను సన్యాసియైనను చిత్తమును చలింపకుండ చేయగలిగినచో సర్వేశ్వరుని కనుగొనజాలుదురు. మానవుడు సకలగుణములకు తావు. అజ్ఞానాంధకారమునందుండుటచే నతడు తనప్రభావమును గురితింపజాలడు. యోగబలసంపన్నుడగు జనున కసాధ్య మేదియును లేదు."

"యోగమనగేమి ?"

"వేదశాస్త్రముల జ్ఞానమని చెప్పబడినదానిని యితరశాస్త్రకారులు యోగమని తెలుపుచుందురు. కొన్నిక్రియల నాచరించుటమూలమున యోగము పొందవలయును. ఆక్రియలలో ముఖ్యమైనది సమాధి. సమాధియనగా, ప్రపంచవిషయములపైకి పరువెత్తుమనస్సు నొకస్థలమున నిలిపియుంచుట. అట్లది నిలిచియుండు కూడలిప్రదేశము, పరమార్థపదార్థము" 'యోగశ్చిత్తవృత్తే ర్నిరోధః' యని భగవానుడగు పతంజలి వాక్రుచ్చెను. చిత్తవృత్తిని నిరోధించుటయె యోగము—చిత్తవృత్తులు అడ్డగింపబడినవై (జీవాత్మ=ప్రాణము; పరమాత్మ=యీశ్వరుడు) జీవాత్మ పరమాత్మ లేక మగుట యని యనదగును. అందువలననే పరమాత్మ జీవాత్మ కలసిపోవుట యోగమని యనుచుందుము."

"యోగశిక్ష బడయవలెనన్న నే నేమి విషయముల నెఱుగవలయును ?"

"యోగాభ్యాసమునకు మొదట గురు వుండుట యావశ్యకము. తరువాత హృదయమును స్థిరముగా నొనర్చుటకై నిజావస్థయందు సంతుష్టి గనవలయును—ఉన్నతమగుకోరికలను విడువవలయును. చిత్తము చంచలమైన యెడల యోగాభ్యాసము సాధ్యముకాదు. చిత్తస్థైర్యము చేకూరినపిదప, కామాదివిరోధిసమూహమునుజయించి ఆశలేనివాడై పరబ్రహ్మయందు చిత్తము నిలిపియుండు టావశ్యకము. అనంతరము, ఆసనము, ముద్ర, ప్రాణాయామము,

ధ్యానము, ప్రత్యాహారము, ధారణము, సమాధియును నవసరములు. యోగా భ్యాస మొనరించుటకు ముందు కొన్నినియమములను పాలించుట యావశ్య కము. ”

“ ఆనియమము లెవ్వి ? ”

“ శాంతి, సంతోషము, అల్పాహారము, అల్పనిద్ర, సర్వవిషయముల యందు నెల్లప్పుడు తగులకుండుట, తృప్తి, ఆశలేకుండుట, మనోదార్ఢ్యము, పర బ్రహ్మయందు చిత్తము నెలకొల్పుట. ఈనియమపాలనానంతరము దేహజ్ఞాన మావశ్యకము. ”

“ దేహజ్ఞానమన నేమి ? ”

“ దేనినుండి జీవాత్మ, పరమాత్మ, ప్రాణము, అపానాదులు నొకదా నితో నొకటి కలసికొనునో దానిని దేహమందుము. దేహమందు 72000 నాడు లున్నవి. వీనిలో, ఇడ, పింగళ, సుషుమ్న లనుమూడును ప్రధానములు. ఇవి యూర్ధ్వమునకు బోవునవి. గాంధారి, ప్రసర, హస్తిజిహ్వా, షశ, అలుం బుష, కుహూ, శంఖినీనాడీసమూహములు శరీరమం దంతటను, కుడియెడమ యవయవములం దున్నవి ; యీపదినాడులనుండియు బహుసంఖ్యగల చిన్ననా డులు పుట్టి దేహమం దంతటను వ్యాపించియున్నవి. శరీరమందు పదితెఱగుల వాయు వున్నది :—ప్రాణవాయువు హృదయమందును, అపానవాయువు గుహ్య మందును, సమానవాయువు నాభియందును, ఉదానవాయువు కంఠమందును వ్యానధనంజయవాయువులు రెండును సర్వశరీరమునందును, నాగవాయువు త్రేను పునందును, కూర్మవాయువు ఉన్మీలనమునందును, కృకరవాయువు తుమ్మునం దును, దేవదత్తవాయువు ఆవులింతయందును నుండును.

“ షట్చ్రక్రము లేవి ? ”

“ మూలాధార, స్వాధిష్ఠాన, మణిపుర, అనాహత, విశుద్ధ, యాజ్ఞలునను చక్రములాఱును దేహమం దున్నవి. వీనినే షట్చక్రము లందుము. యోగము నకు ప్రారంభింపకముందు ఆసనముద్రాదుల నభ్యసింపవలెను. ”

“ ఆసనములన నేమి ? ”

“ కూరుచుండురీతిని ఆసన మందురు. ఆసనముల నభ్యసించునపుడు మనస్సునుండి మనుజునిదుష్టవాంఛలు తమంతటతామే విడిపోవును. ఆసన

ములు చేతనయినంతనే వెన్నెముక స్థిరమగును. వెన్నెముక స్థిరముగాకున్న సమాధి కుదురదు.

"ఆసనము లెన్నివిధములు ?"

"ఆసనము లెనుబదినాలుగువిధములు. వానిలో సిద్ధ, పద్మ, భద్ర, స్వస్తిక యను నాలుగాసనములు ప్రసిద్ధములైనవి. భక్తితోఁగూడుకొన్న హృదయము గలవాఁడై, వాంఛారహితుఁడై యొకరహస్యస్థానమున గూరుచుండి యాసనము వేసికొని యోగాభ్యాస మొనరింపవలయును. లేకున్న మనస్సు స్థిరము కాజాలదు. యోగము నెట్లభ్యసింతురో యితరులకు తెలియరాదు. ఎందుచేత ననగా జ్ఞానహీనులు సరియగుగురుశిక్ష లేక యోగాభ్యాసమునకు మొదలుపెట్టి, మేలునకు బదులు కీడు చెందుచుందురు. అట్లు కీడుబొంది యోగము మాయయనియు సహకారియనియు కూడ తలంచుచుందురు."

"సిద్ధాసన మొనరించు టెట్లు ?"

"వెన్నెముకను నిలిపి కూరుచుండి యొకపాదమూలముతో గుహ్యప్రదేశమును నొక్కి రెండవపాదమూలమును, లింగోపరిభాగమం దుంచవలయును. పిదప స్థిరచిత్తుఁడై నొసలు నెత్తి రెండుకనుబొమలమధ్యప్రదేశమును చూచుచు ప్రాణాయామ మొనరించుచు పరబ్రహ్మానుధ్యానింపవలయును. ఇదియే సిద్ధాసనము వేయు విధానము."

దక్షిణపాదమును యెడమతొడపైనను యెడమపాదమును కుడితొడమీఁదను పెట్టి, యెడమచేతితో పృష్ఠభాగమునుండి యెడమకాలిబొటనవ్రేలిని కుడిచేతితో నట్లే కుడికాలిబొటనవ్రేలిని ఎడమచేతితోను పట్టుకొని వెన్నెముకను నిలిపి రొమ్ముపై గడ్డము నాని ముక్కుచివరచూపునిలిపి ప్రాణాయామానుష్ఠానమున పరబ్రహ్మానుధ్యానింపవలెను. ఇది పద్మాసనక్రమము.

నడుము నిలిపి కుడిపాదమును యెడమతొడ పిక్క నడుమను, యెడమపాదమును కుడితొడ పిక్కనడిమిప్రదేశమునందును నుంచి ప్రాణాయామ మొనరించుచు భగవంతుని ధ్యానింపవలెను. ఇది స్వస్తికాసనము తెలుగు.

వెన్నెముకనిలిపి కూరుచుండి మడమలు త్రిప్పి యండములక్రిందిభాగమున నుంచి యెడమచేతితో వెనుకతట్టునుండి యెడమకాలి బొటనవ్రేలిని కుడిచేతితో నట్లే కుడికాలిబొటనవ్రేలిని పట్టుకొని కంఠమును కొంచెము ముడిచి

వక్షమున గడ్డము నిలిపి నాసికాగ్రమున దృష్టినిలిపి ప్రాణాయామమున నీశ్వరుని ధ్యానింపవలెను. ఇయ్యది భద్రాసన మందురు.

ఈనాలుగువిధములగు యాసనములందు నేదియోనొకయాసనము వేసి మూడుగంటలకాలము ధ్యానమునందు మగ్నుడై యుండునాతడు తనయాసనమున స్థిరవడయును. ఈప్రకారముగా ధ్యానముచేయుచు యోగసాధన మొనరించుచుండ భక్తునికి తనంతతాను సమాధి యలవడును. ఉదయము సాయంసమయము నీరెండుకాలములును యోగాభ్యాసమునకు తగినసమయములు.

"ముద్ర లెన్నివిధములు? వానిపే ళ్ళేమి?"

"ముద్ర లిరువదియైదువిధములు. వానిలో మహాముద్ర, ఖేచరి, శక్తి, చాలని, మహాబంధము, విపరీతకరణి, మహావేధము, ఉడ్డ్యాయనము, మూలబంధము, వజ్రోణి, యివి ప్రధానములు.

ఎడమమడమచే గుహ్యప్రదేశమును గట్టిగా నొక్కి కుడికాలు చాపి చేతిప్రేళ్ళతో కాలిప్రేళ్ళను పట్టుకొని రొమ్మునగడ్డమునాని కనుబొమలనడిమిప్రదేశమున చలింపనిచూపు నిలిపిన మహాముద్రయగును.

నాలుకను పొడిగించి దానిచే కనుబొమలనడిమిప్రదేశమును దాకవలెను. ఇటు లొనరించుట కలవాటుపడినపిదప యేదేనిరహస్యప్రదేశమున కరిగి వజ్రాసనమునకూరుచుండి భ్రూమధ్యమున దృష్టి నిలిపి నాలుకను వెనుకకు త్రిప్పి గొంతుకకుపైనగల రంధ్రమునకుచేర్చి చలింపనిమనస్సుతో నీశ్వరునిధ్యానింపవలెను. ఇది ఖేచరీముద్ర. ఈముద్ర నభ్యసించునాతడు సర్వదా పవిత్రుడై యుండును. మృత్యు వాతని కిచ్ఛాధీనమై యుండును.

వక్షఃస్థలమునందలి పల్లమునగల కమల మనుకోశమున గాఢనిద్రయందుండు కుండలినీశక్తిని మేలుకొలిపి అపానవాయువునందు జొన్పించిన శక్తిచాలనీముద్ర యగును. ఈముద్ర సర్వసిద్ధిప్రదాయిని. దీని నభ్యసించి కుండలినీశక్తిని మేలుకొలుపగలిగినచో బ్రహ్మద్వారము పగిలి బ్రహ్మరంధ్రమార్గము తెరువబడును — వెంటనే జీవునకు ప్రకృతజ్ఞానము కలుగును. తెల్లనిగుడ్డపేలికను నాభిచుట్టను చుట్టి శరీరమంతటను విభూతిపూసుకొని చర్మముపై కూరుచుండి నాసికారంధ్రములగుండా వాయువును పీల్చి దాని నపానవాయువుతో గలిపి

ఆవాయువు సుషుమ్నానాడిలో ప్రవేశింపకుండునంతవరకు గుహ్యప్రదేశమును ముడిచి వాయువు నంతరంగమున బంధింపవలెను. అపుడు కుండలిని మేలుకొని పైకెగసి సహస్రారమున (శిరస్సు పైభాగమున సహస్రదళకమలమువలెనుండు నొకభాగము ఇది యాత్మకు వాసస్థలము) ప్రవేశించి పరమాత్మతో కలియును. కుండలిని మేలుకొలుపబడినచో యేదేనిరహస్యప్రదేశమున ప్రవేశించి శక్తిచాలనీ ముద్రను సాధన మొనరింపవలయును.

కుడికాలు యెడమతొడపై నిడి గుహ్యప్రదేశమును ముడిచి యపాన వాయువును పైకి పోనిచ్చి నాభియందలిసమానవాయువుతో గలుపవలెను. పిదప హృదయమందలిప్రాణవాయువును క్రిందికి మరలించి సమాన అపాన వాయువులతో జఠరమధ్యమున కుంభకము (ఊపిరి బిగబట్టుట) మూలమున బంధించి యుంచవలెను. దీనినే మహాబంధ మందురు. దీనిని సాధించినచో సుషుమ్నమధ్య భాగమున వాయువు వ్యాపింపజాలును. చిత్త మానందసాగరమున నోలలాడుచుండును. దవుడలమూలమునచంద్రనాడియు నాభిమూలమున సూర్యనాడియుగలవు. మేధాకమలము (సహస్రారము) నుండి వెలువడునమృతమును నాభిమూలమందలిసూర్యనాడి పానమొనరించుటచే జీవమునకు మృత్యువు వాటిల్లుచున్నది. చంద్రనాడి యాసుధను పానముచేసినచో జీవమునకు నమరత్వముప్రాపించును. విపరీతకరణీముద్రమూలమున చంద్రనాడిచే నాయమృతము గ్రోలింపవచ్చును. మృత్తికయందు తల నుంచి చేతులు చాపి కాళ్లు పైకెత్తి ప్రాణాయామ మొనరించుట విపరీతకరణిముద్ర యగును.

కంఠమును వంచి రొమ్మున గడ్డమును నిలిపి పరబ్రహ్మను ధ్యానించుటను జ్యాలంధరబంధ మందురు. దీనిమూలమున మేధాసరోజమునుండి (సహస్రారమునుండి) వెలువడుసుధ నూర్ధ్వమునకు మరలింపనగును.

కుంభకయోగముచే నాభిక్రిందగలనాడీసమూహమును నాభిపైభాగమునకు నెత్తుట నుడ్డ్యాయనబంధ మందురు. దీనివలన శరీరము రోగహీనమగును. దేహమందలివాయువు పరిశుద్ధమగును.

మహాబంధము, నుడ్డ్యాయనబంధము ననుష్ఠాన మొనరించి ప్రాణాయామముచే వాయువు బంధించుటను మహావేద మందురు. దీనిమూలమున సుషుమ్న పథమందలివాయువు బ్రహ్మగ్రంథిని భేద మొనరించును.

అరచేతులను నేలపై నిలిపి కాళ్లను శరీరమును పై కెత్తి పరబ్రహ్మను ధ్యానించుట వజ్రోణిముద్ర. ఈముద్రను సాధకము చేసినచో మనుజుడు సుఖు వుగ సిద్ధుడు కాగలడు.

"ప్రాణాయామము గావించు తెర గేమి ?"

"పైన తెలిపినయాసనములలో దేనినైన వైచి ఈశ్వరుని ధ్యానించి దక్షిణహస్తపుబొటనవ్రేలిచే కుడినాసారంధ్రమును మూసి మెల్లగ యెడమ ముక్కుగుండా 'ఓం' మంత్రమును జపించుచు వాయువును పీల్చవలెను. పిదప చివరరెండువ్రేళ్లతో నెడమరంధ్రమును మూసి, పీల్చిన వాయువును లోన నలిపి దానిచే నంతరంగమును శుభ్రముగావించి మనస్సు నీశ్వరచింతయందు లీనము చేసి మొదటికంటె నాలుగురెట్లధికముగ 'ఓం' మంత్రమును జపించి శ్వాస నడ్డగింపవలెను. పిమ్మట "ఓం" మంత్రమును రెండురెట్లధికముగ జపించుచు కుడిముక్కుగుండా మెల్లగ గాలిని వీడవలయును. ఇట్లే రెండవవైపునగూడ గావింపవలెను. అనగా యెడమరంధ్రమును మూసి గాలిని బీల్చి రెండురంధ్ర ములను మూసి వాయువును బంధించి యెడమముక్కును వదలి వాయువును మెల్లగ విడువవలెను. ఇదియే ప్రాణాయామ మభ్యసించువిధము. దీని నభ్యసించినచో దేహము పవిత్రమై జ్యోతిర్మయమై వాయుపూర్ణ మగును. అధమము రెండువందలమారులు, పై జెప్పినచొప్పున లెక్కించుచు ప్రాణాయామ మొనరింపవలెను.

ధ్యానము రెండుతెఱగులు. (1) స్థూలము. (2) సూక్ష్మము. మంత్రము నుచ్చరించుటవలన (ఈశ్వరనామవర్ణమును) గావించుధ్యానము స్థూలజ్ఞాన మన బడును. మానసపటమున బ్రహ్మరూపమును నిలిపి (మంత్రముచ్చరింపక) కావించు ధ్యానము సూక్ష్మధ్యాన మనబడును. ఆసూక్ష్మధ్యానమున భక్తుడు మునిగిన వాడై యోగబలమున ఉచ్ఛ్వాసనిశ్వాసములను మాని ఈశ్వరునియెడ చిత్తము నిలిపియుండుదానిని సమాధి యందురు. సమాధిసమయమున మనస్సునకు ప్రపంచముతో సంబంధ ముండదుకావున నాసమయమున భక్తునకు ప్రపంచ జ్ఞాన మేమాత్రము నుండదు.

స్వామిజీ క్రీ. శ. 1899 వ సంవత్సరమున నాషాఢశుద్ధ ౧౧ భానువా రమున నర్ధరాత్రి సమాధిలోనుండగా ప్రపంచయాత్రను ముగించెను. విశూచి

రోగముచే నతడు మరణించెనని కొందరందురు. నాటిరాత్రి సమాధిస్థై యాతడుకూరుచుండుటకుముందు ఆశ్రమమందలి శిష్యులను బిలచి, "వత్సలారా! ఇదిగో నాకడపటిసమాధి. నేను పరాత్పరుని చేరుసమయ మాసన్నమగుచున్నది. నేటియర్ధరాత్రమునందే నశించుస్వభావముగలయీశరీరమునుండి ప్రాణములు పోవు" ననియెను.

స్వామిజీ పరమపదమును జేరినవెంటనే శిష్యులాతనికాయమును పవిత్రమగునాగంగానదీనీరములయందు స్నానముచేయించి యిసుకతిన్నెపయి దహనసంస్కారము గావించిరి. దహనాంతమున కొంతబూడిదయును కొన్నియస్థికలును తీసి యొకరాతిగిన్నెయందిడి యానందోద్యానమున సమాధిగావించిరి. స్వామిజీశవమును దహనముచేయక గంగాజలంబులందు స్నానముచేయించి రాతితోచేయబడినపెట్టియందుంచి యుద్యానవనమున సమాధిగావించి రని పలువురు చెప్పుకొనుచుందురు. కాన్పూరునివాసి గయాప్రసాదు డనుభక్తుడొకడు స్వామిజీసమాధిపయి నొకదివ్యమందిరముకట్టుటకయి లక్షరూప్యములు దానముచేసెను. ఈమందిరము కాశీపురమున నిపుడు గన్పట్టుచున్నది.

భాస్కరానందస్మృతిచిహ్నరూపముగ వానిముఖ్యశిష్యులు భాస్కరానందసంస్కృతపాఠశాలను, నెలకొల్పిరి. ఈవిద్యాలయమున వేదము, వేదాంతము, న్యాయము, మీమాంస, జ్యోతిషము, వ్యాకరణము మున్నగుశాస్త్రములు కఱపబడుచున్నవి.

జగత్కల్యాణసంధాయకమై, పొందశక్యముగాని 'స్వారాజసిద్ధినాయక' మనుప్రాచీనమగు నొకపెద్దగ్రంథమును సంగ్రహించి భాస్కరానందస్వామి విపులముగా దానికి వ్యాఖ్యానము వ్రాసెను. ఈపుస్తకమునుపఠించినచో నాయోగివరుని యసాధారణపాండిత్యము తేటతెల్లమగును.

---

## ౫

# రామదాసస్వామి



"వేదాధారు సమస్తవేదగురునిఁ వేదాంతవేద్యుఁ లస
ద్వేదారాధితపాదపంకజయుగున్ వేదాంతమూర్తిన్ మహా
వేదభ్రాజితవేద్య బ్రహ్మజనకున్ వేదాంతభావోల్లస
ద్వేదాగ్రేసరతల్పు రాము మహిమాధారున్ ప్రశంసించెదన్."

మహారాష్ట్రదేశమున గోదావరీనదీతీరమున 'బీడ్' పరగణాకు సమీపమునగల 'జంబూ' గ్రామమున సూర్యాజీపంతు అను బ్రాహ్మణుడు నివసించుచుండెను.

ఈతనిభార్య రానూబాయి మిక్కిలి దైవభక్తిగలది. పవిత్రచరిత్ర. ఈశ్వరునికృపవలన క్రీ. శ. 1609 వ సంవత్సరమున రానూబాయి సులక్షణములుగల యొకకుమారుని గనెను. సూర్యాజీపంతు రానూబాయిలిరువురు రామభక్తులు గావున కుమారునకు రామదాసని పేరుపెట్టిరి. బాలకు డేడేండ్ల వయస్సువాడుకాగానే తలిదండ్రు లీతని కుపనయనమును గావించిరి. భక్తిరసము నీతడు తల్లిపాలతోనే త్రాగెను. చిన్నప్పటినుండియు నితడు భగవంతునిసేవయందు తగిలినహృదయముగవాడయ్యెను. ఇతడు యౌవనవంతుడు కాగానే వివాహము చేయుటకు జననీజనకు లాలోచించిరి. సర్వలక్షణసంపన్నయగు నొకబాలికను వారు కోడలిగా గొనుటకు నిశ్చయించుకొనిరి. వివాహముహూర్తము నిశ్చిత మయ్యెను. పంథజీమొదలగువారు కన్యాప్రదాతగృహమునకు తరలివెళ్లిరి. శుభలగ్నము సమీపించుచుండెను. పెండ్లికుమారుడు వివాహవేదికదరి జేరెను. గౌరీపూజకడనుండి పెండ్లికుమార్తె వచ్చుట యాలస్యము జేయుచున్నందున శుభముహూర్తము దాటిపోవునని పురోహితుడు 'జాగ్రత' యని హెచ్చరించెను. పౌరోహితునియామాటకు రామదాసు వేఱుగా నర్థము తీసుకొనెను. బ్రాహ్మణుడామాటలు తన్నుద్దేశించి పల్కెననియు, సంసారబంధ

నము దుఃఖదాయకమనియు ; సుఖమును, శాంతియు నందు గానరావనియు ; వివాహరజ్జువుచే బంధింపబడకు జాగ్రత్త యని పల్కుచున్నాడనియు నాతడు తలచెను. తలచి రామదా సావివాహమండపమునుండి పారిపోయెను. పోవుచుం డగా సర్వాంగసుందరియగు పెండ్లికుమార్తె యాతని కెదురయ్యెను. శుభశకున మయ్యెనని యాతడు మిక్కిలి సంతోషించెను. కల్యాణవేదికనుండి వరుడు లేచి పోవుట గాంచి యెల్ల రాశ్చర్యపడిరి. తండ్రి "ఇదేమినాయనా!" యని యఱచుచు, కుమారుని వెంబడించి, సలువురిలో తనకవమానము కలిగింప వలదనియు, నేకపుత్రపషయ మగుటచే వంశము సిలుపుటకు వివాహ మాడుట యనివార్యమనియు, తనముద్దును తల్లిముద్దును చెల్లింపుమనియు బహువిధముల నాతని వేడికొనెను. "జనకా, భోజనమునకై సిద్ధపడితిని గాని భోజ్యవస్తువు విషసంకలితమైనదని తెలిసి విడిచితిని. కామమనెడు విరోధికి సంతసము కలుగ జేయుటకే జనులు వివాహమాడుచుందురు. సౌందర్యవతియగు భార్యను చేకో నుటకై పురుషుడు మిక్కిలి ప్రయత్నముచేయుచుండును. కట్టుకొనినకాంతల యెడగల ప్రేమను పీడజాలక యామెను సుఖపెట్టుటకై యనేకమార్గములు వెదకుచు, తనజీవితమును వృథాపుచ్చి మృత్యుముఖమున బడును. అణపరాని కాలము వెనుకనుండి శిఖబట్టి లాగుచున్నదని యెఱిగియు వారు కన్నులు తెరువకున్నారు. మీరు బుద్ధిమంతులయ్యును పరమార్థమునకు హానితెచ్చు నవియు ప్రతిబంధకములును నగుమాటలు పల్కుచు, నాకెగ్గుదలచుట మీకు న్యాయముకాదు. తా మింటికి వెడలుడు. శ్రీరామచంద్రుని కనుగొనుటకై నే నరిగెద"నని గంభీరమైనపల్కుల రామదాసు తండ్రికుత్తరు వొసంగెను. కుమారునివాక్యములకు జనకు డాశ్చర్యపడి విరాగియైన వాని నింటికి మరలిం చుట తనకు శక్యముకాదని యెంచి విచారగ్రస్తు డయి వెనుకకు మరలెను. రామదాసు జనకుని పాదపద్మములకు నమస్కరించి తప మాచరింప వెడలి పోయెను.

రామదాసస్వామి మహారాష్ట్రమందలి యొకానొకచక్కని యరణ్యము ప్రవేశించి కొన్నివత్సరము లచట ఘోరతప మాచరించి యందు సిద్ధివడసెను. రామదాసు రామభక్తుడగుటచే భగవంతుడు రామచంద్రునివలె లేతగఱికవంటి యాకుపచ్చనికాంతితో వానికి ప్రత్యక్షమయ్యెను. ఒకప్పుడు రామదాసు పండరీ

పురమునకు వెళ్లెను. ఆపవిత్రస్థలమునగల విష్ణుదేవాలయమునకు దేవసందర్శనార్థ మాతడు చనెను. శ్రీకృష్ణవిగ్రహ మాదేవళమున ప్రతిష్ఠింపబడి యుండెను. శ్రీకృష్ణునివిగ్రహము నెదుట నిలిచియుండియు నతడు రామునే ధ్యానించెను. భక్తవత్సలుడగు శ్రీహరి భక్తునివాంఛనుదీర్ప శ్రీరామచంద్ర రూపమున వానికి కనుపించెను. గుడియందలి శ్రీకృష్ణప్రతిమ కొంత సేపు రామవిగ్రహముగా మారినందుల కచటిభక్తులందరు నాశ్చర్యమగ్నులైరి.

క్రీ. శ. 1633 వ సంవత్సరమున ఫాల్గుణమాసమున రామదాసు తీర్థములు సేవింప బయలుదేఱెను. భరతదేశమందలి పుణ్యప్రదేశము లన్నియు కనుగొని స్వామిజీ యనంతరము నిజదేశమునకు తిరిగి వచ్చెను. దేశాటనము జేయునాళ్ళలో "రామోపాసన" మాహాత్మ్యమునుగురించి యాత డనేకప్రదేశముల నుపన్యాసము లిచ్చెను. క్రీ. శ. 1644 వ సంవత్సరమున వైశాఖమాసమున రామదాసు మహాబలేశ్వరమున నాశ్రమము స్థాపించి యందు శ్రీరామచంద్రునివిగ్రహము ప్రతిష్ఠగావించెను.

రామదాసస్వామి ప్రతిభ విని యాతనిచూచుట కనేకులు వానియాశ్రమము చేర దొడగిరి. అందుచే నాతడు మహాబలేశ్వరము విడచి మరియొక తావునకు జనెను. అచటగూడ జనసమూహ మధిక మగుచుండుటచే యోగదీక్షకు భంగము వాటిల్లుటచే స్వామిజీ యాస్థలమునుగూడ వీడి మహారాష్ట్రమునకు మరలిపోయి యందొక పర్వతగుహాయం దాశ్రమ మేర్పరుచుకొనెను.

రామదాసస్వామి కీర్తిపరిమళము నల్దిక్కులకు వ్యాపించెను. మహారాష్ట్ర మహీపతియగు శివాజీ స్వామినిదర్శింప కొండగుహ కరిగెను. కాని దర్శనము లభించినదికాదు. ఎట్టులేని యామహాత్ముని దర్శింప నిశ్చయించుకున్నవాడై శివాజీ వానియాశ్రమమునకు పలుమారు వెళ్లెను. స్వామిజీ కానరానందున వానిని వెదుక మహారాష్ట్రమహేశు డాతనియునికి కనుగొని రండని వివిధస్థలములకు చారుల నంపెను. చారులును నాసిక మున్నగుప్రదేశములను తిరిగి తిరిగి యోగివరునిజాడలు కనుగొనజాలరైరి. ఇట్లు కొంతకాలము గడచినపిదప శివాజీకి రామదాసు దర్శనము కొండగుహాయందే దొరకెను. వ్రతదీక్ష నభిలషించి యుపదేశము నొసగుడని శివాజీ యాస్వామిజీని వేడెను.

రామదాసుందుల కిష్టపడక "వత్సా! నీ వెల్లప్పుడు రాచకార్యములయం దుండవలయును. మంత్రదీక్ష కేల" యనెను. కాని శివాజీ సామాన్యముగా పట్టు వీడడు. తనప్రార్థన మన్నింపుమని పరిపరివిధముల రామదాసును కోరెను. అంత నా శివాజీ కించుకపాదోదక మొసంగి స్వామిజీ యందుండి యంతర్ధాన మయ్యెను. శివాజీకి గురుభక్తి మెండు. ఏదేనియాపద ప్రాప్తించు సూచనలు పొడచూపినపుడు మహాత్ముడగునాయాచార్యుని ధ్యానించి యాతనికడ కరిగి తనవృత్తాంతము చెప్పుకొని యతని యాశీర్వాదములు బడయుచుండువాడు.

మొగలాయిదండు మహారాష్ట్రముపైకి దండువెడలినపుడు శివాజీ రామదాసస్వామియాశ్రమమున కరుగ, చింతాక్రాంతుడైయున్న యమ్మహారాజును గాంచి "వత్సా! విచారపడకుము. యుద్ధసన్నద్ధుడవు కమ్ము; విజయలక్ష్మి నిన్ను వరించును. నిశ్చయ" మని స్వామిజీ యాతనిని దీవించెను. మునీశ్వరు రూపమున నీశ్వరుడే యట్లు వచించె ననితలచి భక్తితో కూడినహృదయముకలవాడై మహారాష్ట్రకేసరి యాతనిపాదములకు సాష్టాంగదండప్రణామ మాచరించెను. యోగివరుడు వచించినచొప్పున మహారాష్ట్రులకును మొగలాయిలకును జరిగినదొమ్మియుద్ధమున శివాజీకి జయము చేకూరెను.

యోగబలమున రామదాసస్వామి యనేకదివ్యక్రియలు గావించెను. నిర్జలప్రదేశమున వ్రేల్లతో నించుక త్రవ్వి దాహార్తులకు గంగాజలమువలె శుభ్రమగుపానీయము నత డొసగుచుండువాడు. క్రీ. శ. 1677 వ సంవత్సరమున జ్యేష్ఠమాసమున నీతనితల్లి పరలోకమున కరిగెను. మాతృమరణదివసమును ముందే యాతడు గ్రహించి యానాటియుదయమున కాచోటి కరిగెను. చాలకాలముక్రిందట చూచినదగుటచే యాతనితల్లి ప్రియకుమారుని గాంచి మిక్కిలిసంతోషించినదై "నాయనా, కుమార! అభాగిని యగునీమాత నీ కిన్నినాళ్లకు జ్ఞప్తికి వచ్చెనా" యని కొమరు నడిగెను. పరిపూర్ణమగు నారోగ్యస్థితియందున్నయామె యానాడు మరణించుననుట యామెకు తెలియదు. 'అమ్మా, మరల నిన్ను కనుగొనజాలను. గాన మరియొకమారు నీ చరణదర్శన మొనరించి వెళ్ళ దలచితి" నని కుమారు డుత్తర మొసగెను. నాటిసాయంకాలమున పావనగుణశోభితయగు నాయమ్మ విష్ణుసాయుజ్యము నందెను.

నిజగురుసమర్పణార్థమై శివాజీ 'సజ్జనగడ' మున నొకదేవాలయము నిర్మించెను. ఆ దేవాలయము నేడును చూపట్టుచున్నది. రామదాసు పూజించు 'అంబాభవానీదేవి' ఆయాలయమున నెలకొల్పబడినది. స్వామిజీ విగ్రహము కూడ నందు గలదు.

క్రీ. శ. 1681 వ సంవత్సరమున నీమహాత్ముడిహలోకయాత్ర ముగించి పోయెను. రామదాసస్వామి యనేకగ్రంథములను రచించెను. విజ్ఞానగర్భిత ములగు నాతనిశ్లోకములును 'దాసబోధ' యనుగ్రంథరాజమును నేటికిని ప్రసిద్ధికెక్కియున్నవి.

౬

# తుకారామయోగి

•••ооо•••

చ. వలదు పరాకు భక్తజనవత్సల! నీచరితంబు వమ్ముగా
వలదు పరాకు నీబిరుదు వజ్రము వంటిది కాన కూరకే
వలదు పరాకు నాదురితవార్ధికిఁ దెప్పవుగా మనంబులోఁ
దలతునొకా నిరంతరము దాశరథీ! కరుణాపయోనిధీ!

పూనానగరమునకు తొమ్మిదిక్రోసులదూరమున వాయవ్యమూల దేహూ యను పల్లెయందు, క్రీ. శ. 1608 వ సంవత్సరమున తుకారాముఁడు పుట్టెను. ఇతనితండ్రి బహ్లోజీ 'మోరే' యను పేరుగలవాఁడు. శూద్రకులుఁడు. వర్తకము చేయుచు జీవయాత్ర గడుపుచుండువాఁడు. తుకారాముని తల్లిపేరు కనకబాయి. ఆమె పతివ్రత. బహుసంవత్సరములు సంతానము కలుగక దంపతులిరువురు మిక్కిలిచింతించుచుండువారు. తమ కులదేవతయగు విఠోబాను యెల్లప్పుడు బిడ్డలకొరకై కొలుచుచుండెడివారు. కొంతకాలమున కీశ్వరానుగ్రహమున కనకబాయి గర్భవతియై పుత్రుని గాంచెను. తరువాత నిరువురుసుతులు గలిగిరి. పిమ్మట నొకకుమార్తెయు జననమొందెను. పెద్దకుమారునిపేరు శాంతజీ, తుకారాముఁడు రెండవవాఁడు, మూఁడవవాఁడు కనాయిజీ; వాణిజ్యమున బహ్లోజీ చాలా ధనము కూడబెట్టెను. పరాపేక్షలేక సుఖముగా కాలమును గడపుచు నిలువ యుండినద్రవ్యంబునుండి కొంత పేదలకును దీనులకును నొసగుచు దానపరుఁడయి సచ్చరిత్రుఁడై మెలఁగుచుండువాఁడు. పెద్దతనము వచ్చినపిమ్మట ధనసంపాదనము మీఁదను సంసారసుఖముమీఁదను బహ్లోజీకి విరక్తి కలిగెను. కుటుంబభారము పెద్దకుమారునిపై నిలిపి యతఁడు విరాగి కాదలచెను. కాని శాంతజీ మొదటి నుండియు సంసారసుఖముమీఁద నిష్టములేనివాఁడగుటచే నతఁ డందుల కియ్యకొనలేదు. తుకారాము డప్పటికి పదమూఁడేండ్ల ప్రాయమువాఁడు. విషయసుఖములయందు వాంఛ లేకపోయినను జనకుని సంతోషపెట్టుటకయి చిన్నతనము నందే తుకారాముడు సంసారభారములు నెత్తిని పడవైచుకొనెను. తండ్రిగారి వాణిజ్యవృత్తిలో తాను ప్రవేశించి మంచినేర్పుతో వ్యాపారము చేయసాగెను. స్వల్పకాలములోనే విశేషధనము నార్జింపగలిగెను.

తుకారామునకు రుక్మిణీబాయి, జీజాబాయియని యిద్దరుభార్యలు. ఇతని కిపుడు తలిదండ్రులు సజీవులై యుండిరి. పాడియు పంటయు సమృద్ధిగా నున్నవి. నిరంతరము మిక్కిలియనురాగముచే తనను ప్రేమించుసోదరులు కలరు. ప్రేమ మయియగు తోబుట్టువు కలదు. అవసరమగుచో శిరము గోసి యీయగల స్నేహితులు పలువురు గలరు. పతిభక్తి గలిగి మిక్కిలి యడకువతో సేవజేయు నర్ధాంగులు కలరు. ఆరోగ్యము, ఆనందము, సౌఖ్యము, నిరంతర మితనియింట కాపురము సేయుచున్నవి. ప్రపంచయాత్రయందతని కెంతమాత్రమును లోటు లేదు, సంసారపారావార మిట్టి సౌఖ్యకరమగు నలలచే పొంగి పొరలి తుకారా మునకు మిక్కిలి యానందప్రదముగా నున్నసమయమున నా సముద్రమున గొప్పగాలిపుట్టి శాంతమును పోగొట్టి యల్లకల్లోలము జేసెను. తుకారాముని జనకుడు చనిపోయెను. పతివియోగము దుస్సహముగాటచే నతని జననియు మరణించెను. అపు డితడు పదియేడేండ్ల వయస్సువాడు. తలిదండ్రులమరణముచే నీతడు ధైర్యము గోలుపోయినవా డయ్యెను. దానికితోడు గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు జ్యేష్ఠసోదరుని భార్యకూడ పరలోకమున కరిగెను.

చిన్నతనమునుండియు నీత డీశ్వరపూజానిరతుడై, భక్తుడై యుండు వాడు. కాని జననీజనకులు చూపిన యకారణప్రేమచేతను, ద్రవ్యముమూలమున చేకూరునానందముచేతను, సంసారమున జనియించు నైహికసుఖముమూలమునను, వానిభక్తి పరమాత్మజ్ఞానవిషయమున నభివృద్ధిచెందుట కవకాశము కలిగినది కాదు. తలిదండ్రులును వదినెయు మృత్యుముఖమున బడిన తనే విషయాధీనమైయున్న వీనిహృదయము భక్తిమార్గమునకు మరలెను. సంసార సముద్రమందలి సుడిగుండమున బడినంతనే, యందుండి తప్పించుకొనుటకై ప్రయత్నించుచు చిత్తక్లేశము పోగొట్టుకొనుటకై రాత్రింబగళ్లు కలదేవుండగు విఠోబాను కొలుచుటకై యాతడా దేవునియాలయమున కరుగుచుండువాడు. స్వామిచెంతనున్నసమయమున నితడు దుఃఖమును మరచియుండువాడు. దుఃఖములనన్నిటిని పారదోలు హరిసేవయే యాపదలతోనిండియుండు సంసార సముద్రమునుండి తన్ను దాటింపగలదని తుకారాము నమ్మెను.

ఇట్లు కొన్నాళ్లుజరిగెను. భక్తిరసపూరితములును పరమాత్మజ్ఞానబోధకములును నగుగొప్పగ్రంథములను చదువవలయునను కుతూహలము తుకారా

మునికి జనించెను. కాని యాతడు సామాన్యవిద్యాభ్యాసకుడగుటచే, నుత్తమ గ్రంథముల చదివి యందలిపవిత్రమగునీతిని తెలిసికొనజాలువాడు కాకపోయెను. అందుచే నీతడు మరల విద్యాభ్యాసమునకు మొదలిడెను. కొద్దిరోజుల లోనే యీతడు మంచి పాండిత్యము సంపాదింపగలిగెను. భక్తినిబోధించు పుస్తకములయం దీతనిదృష్టి ప్రవేశించెను. హరిపాదపద్మసేవామరందమును చవిచూచినహృదయబంభరమునకు మరియొకపదార్థము రుచించునా! అంగడిమీద కూరుచుండినను వీనిమనస్సు అముష్మికపువస్తువులయం దుండక, భగవద్గీతపై నిలచెడిది. క్రమముగా వర్తకము కృశియింపదొడగెను. యజమాని పరధ్యానముగా నుండుట చూచి యాతనిసేవకులు తొలుత లాభమును తరువాత మూలధనమును తస్కరింపదొడగిరి. ఇట్లింటగలద్రవ్యము నష్టమయిపోయి తుకారాముడు త్వరలోనే యప్పుల పాలయ్యెను. ఈతని దుఃస్థితి పరికించి యితర వర్తకు లాతనితోగలసంబంధము వదులుకొనిరి. తుకారాముని యీయవస్థ క్రమక్రమముగా హెచ్చి భరింపరానిది యయ్యెను. పేదరికమువలనిబాధ కోర్వజాలక, దుఃఖితురాలయి పతివ్రతయగు రుక్మిణీబాయి మృతినొందెను. భార్యనగలమ్మి తుకారాము డించుకద్రవ్యము బడసెను. తమగ్రామమున వర్తకము అనుకూలముగా లేదని గ్రహించి దాపుననున్న యొకపట్టణమున నొకచిన్న కొట్టు నద్దెకుతీసుకొని, నగలమ్మినవిత్తముచే నీతడు చిల్లరదుకాణమును బెట్టెను. తుకారాముని మెత్తదనము కనిపెట్టి ప్రజలు తక్కువవిలువకే యెక్కువసంబారములు తీసుకొనిపోవుచుండువారు. అట్లయినను వారి నీతడేమియు ననువాడుకాడు. అందుమూలమున స్వల్పకాలముననే కొట్టులోనిసామగ్రియావత్తు చెల్లిపోయెను. మరల దినుసులను కొని వర్తకముప్రారంభించెను. మునుపటికంటెను త్వరలో నాసామగ్రియు పరులపా లయ్యెను. అంతటితో భార్యనగ లమ్మగావచ్చినధనము వ్యయ మయ్యెను. ఈతనిమనస్సు మిక్కిలికోమలము. దీనులును, పేదలును, కపటవేషధారులగుదుర్మతులును వీనికడకు వచ్చి వారికష్టములు చెప్పికొన, వారిబాధలు తలచి కంట నీరుపెట్టుకొని వారికివలసినపదార్థము లిత డొసంగుచుండువాడు. "దుకాణమున కూర్చుని తుకారాము డెల్లప్పుడు హరిభజనము ఫలుపుచుండువాడు. సంబారములకై యరుదెంచుమానవు లొసంగుపైకమునకు, వారలను సంతసపెట్టు టుచితమని తలచి చేతికివచ్చినవస్తువులను వారి కొసగు

చుండువాడు. దుకాణమం దేమడిగిన నెంతయడగిన నొసగుటయే వానికర్తవ్య ముగా నుండెడి" దని మహీపతియను నొకవ్యక్తి వాక్రుచ్చెను. ఈమహీపతి సుప్రసిద్ధుడగు నొకమహారాష్ట్రకవి. ఈతడు పదునెనిమిదవశతాబ్దమధ్యభాగ మునందు మహారాష్ట్రసీమయందు కీర్తిమంతుడయి వెలసెను. 'భక్తలీలా మృతము' 'భక్తవిజయము' 'సంతవిజయము' మున్నగు గొప్పగ్రంథముల నితడు రచించెను. ఈగ్రంథములయందు తుకారామునిజీవితమునుగురించిన చిత్రవిషయ ములు చాలాకలవు.

జిజాబాయి పెనిమిటి చర్యలు కనిపెట్టి మిగుల చింతించినదై ధర్మాధర్మ ములను మంచిచెడ్డలను కుమతిసుమతులను తలచి సంసారధర్మము నెరవేర్చుట యుచితమని యాతనికి హితవు చెప్పుచుండెడిది. కాని తుకారాముని మనస్సు కుదుటబడకుండెను. ఒకనాడాతని నుద్దేశించి యామె "స్వామీ! మీచిత్తమును విఠలదేవునిపాదములపై నిలిపి యుంచితిరి. ఈభక్తివలన నెవరికిని యెట్టిమేలును కలుగుచుండుటలేదు. కాని దుర్మతులను దీనులుగా నెంచి, యున్నదంతయు వారికి ధారవోసి దారాసుతులను పడరాని కష్టముల పాలుచేయుచున్నారు. ద్రవ్యోపార్జన మొనరించుకొనగలిగినవారియెడ దయదలచుట న్యాయము కాదు. స్వంతసొమ్ము కొంచెమును లేగు. ఆలినగ లమ్మి యుండఱకు పంచిపెట్టుట ధర్మమా? బిడ్డలును నేనును ఆకలిబాధచే మలమల మాడిపోవుచున్నాము. అప్పుల పాలయి, యితరులమొగములు చూడజాల కున్నాను. పరులమెడ దయదలంచుచున్నారు గాని యింటగల యభాగ్యులదెస కన్నెత్తి చూడ కున్నారు. ఇకనైనను మనకు రాదలచిన ముప్పును తెలిసికొనుడు. నా యలం కారము లమ్మియు కొంత యప్పుచేసియు మీకు వర్తకమునకు కావలసిన పైకము నొసగుచుంటిని. వంచకులకు ధనము ధార పోయకుడు. మనమేలు గోరి యిట్లు చెప్పుచున్నా" నని పలికెను. పత్ని యుపదేశవాక్యములకు తుకా రాము డంగీకరించెను. ఈతని స్వగ్రామమందలి వర్తకులు కొందఱు బాలే ఘట్టమను ప్రదేశమునకు వర్తక మొనరింప చనుచుండిరి. భార్యానియోగమున నీతడును కొంతద్రవ్యము చేతగొని వారివెంట నరిగెను. తోడివర్తకులు చెంత నుండుటచేత, ఈసారి దుర్మతులును వంచకులును మోసగాండ్రును నీతనిని చేరు టకు వీలు చిక్కినదికాదు. కావున నీతనిచేత కొంతపైకము చిక్కెను. ఆపైకము

పట్టుకొని వచ్చుచుండ నొక బ్రాహ్మణుడు వెక్కి వెక్కి యేడ్చుచు మార్గమధ్యమున వాని కెదురయ్యెను. ఆబ్రాహ్మణుని గాంచి మిక్కిలి జాలినొంది తుకారాముడు, "తండ్రీ! యేల యిట్లు వాపోవుచున్నావు? నీ కేమియాపద సంభవించినది?" యని వాని నడిగెను. "అయ్యా! నాది బ్రతికిచెడినజీవనము. దురదృష్టవశమున కలవాడనైయుండియు దరిద్రుడ నైతిని. అవసరమునకై యొకసారి కొంతవిత్త మప్పుచేసితిని. ఋణదాత లెంతపీడించినను తిరిగి యప్పు తీర్పలేకపోతిని. నలువురిలో న న్నిడ్చి యనరానిమాట లాడి వారు నన్ను కొట్టిరి. ఎంత చదువుకున్న నేమి! ఎంతబ్రతుకు బ్రతికిననేమి? నేటికి నా కీదురవస్థ వాటిల్లినది" యనుచు నావిప్రుడు విచారింపసాగెను. ఆతని దుఃఖకరమగు వృత్తాంతము విని తుకారాముడు జాలిగొనినవాడై "మహాత్మా! దుఃఖింపకుడు. ఈ పైకముతీసుకొని మీకు ఋణమిచ్చినదాతల కొసంగు" డని తనచెంతనున్నద్రవ్యమునంతయు నాతని కిచ్చెను. ఇంతటి కోమలహృదయులు పాపభూయిష్టమగు నీప్రపంచమున యుగాంతములయందుగాని జనియింపరు. బ్రాహ్మణుడును మిక్కిలి సంతసించినవాడయి ద్రవ్యము తీసికొని తనయింటికి వెళ్లెను. తుకారాముడు వట్టిచేతులతో నింటికి చనుదెంచెను. మార్గమధ్యమున జరిగిన విషయమును బాటసారులు ముందుగానే జిజాబాయికి తెలిపిరి. భరింపశక్యముగాని దారిద్ర్యముచే బాధనొందుచున్న యాయిల్లాలు క్రోధావ్రత యయ్యెను. ఎన్నివిధముల బోధించినను భర్త తనపని మానకుండుటచే, నెయ్యిపోసిన అగ్నిహోత్రము వలె నామె కోపము వృద్ధిచెందెను. ఉత్తచేతులతో వచ్చిన పెనిమిటిని చూచి నంతనే మండిపడి యామె యాతనిని మిక్కిలి దూషింపదొడగెను. ఆమె కేకలు విని యిరుగుపొరుగువా రేమివిపరీతమో యని వారియింట గుమికూడిరి. అట్లు కూడినయమ్మలక్కలను పేరుపేరున పిలుచుచూ, జిజాబాయి, "అమ్మలారా! అక్కలారా! నాపాపము బ్రద్దలయినది. ఈమూర్ఖుడు పూర్వజన్మమున నాకు పరమశత్రువై యుండియుండును. పూర్వపువిరోధమును సాధింప నీజన్మమున నాకు మగడై పుట్టెను. చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది. ఇంట పిడికెడు బియ్యము లేవు. పిల్లలు మలమల మాడిపోవుచున్నారు. అన్న మన్న మని యేడుచు వారి ముఖములను చూడ నాకడుపు దహించుకపోవుచున్నది. ఇపుడే గంగలో దిగెదను. నాకు మృత్యువే శరణ్యము. ఈదుర్భరబాధ నెంతకాలము సైపను.

ఓవిఠలదేవుడా! యీదురంతచింతలోఁ నీయెడగలభక్తికూడ మరచితిని." అని యఱచి యఱచి స్త్రీస్వభావము ననుసరించి పెద్దపెట్టున నేడువసాగెను. చూడ వచ్చిన స్త్రీలలో నొక్కతె; "ఇదేమిటమ్మా! యింతపోరు పెట్టెదవు? మగనిని కొట్టి మోసాలకు మొట్టు లెత్తిన దట మును పొకయామె నీవంటిదే కాబోలు. భర్తను మూర్ఖుడని తిట్టి నీ వెంత తెలివిగలదాన వైతివి." అని యామెను గద్దించెను. "పాప మామె యేమి చేయును. ప్రాణము విసిగి యిట్లన్నది. పతి నెప్పుడైన యీసడించి యెరుగునా? సహనమునకుమాత్రము హద్దు లేదా?" యని మరియొకస్త్రీ పలికెను. కాని యచట చేరినవారిలో పలువురు జిజా బాయినే దూషించిరి. "పతియెట్టివాడైనను భార్య భక్తిపరాయణయై యుండ వలెను గాని యాతని నిందింపరాదని పలికిరి" "ఎద్దుపుండు కాకికి నొప్పియా? యెవరిబాధ లెవరికి తెలియ నగును. గుట్టు తెలిపినగాని రట్టు బోధపడదు. అమ్మ లారా! మీయిండ్లకు బోడు, మాజోలి మీకేల" యని జిజాబాయి వచించెను.

తుకారామునిదురవస్థ గాంచి యతనియనుజుడు కనాయిజీ తమకుగల యాకొలదియాస్తిని పంచిపెట్టెను. అట్లు పంచియిచ్చుటలో తుకారామున కియ్యవలసినపైకమునకు మారు తమకుటుంబమున కితరులు యీయవలసిన ఋణపత్రములు విలియా వేసెను. ఎంతకాల మోపిక పట్టినను బాకీదారులు సొమ్ము వసూలుపెట్టుటలేదు. తీర్పుమని వారి నడిగి యడిగి విసిగి పోవుచుండెను. తుదకు పైకమునకై పరులను బాధించుట పాతకమని తలచి తుకారాముడు బాకీపత్రములను గంగలో పారవైచెను. భర్తకావించిన యీపనికి జిజాబాయి మిగుల కోపముచెంది యతనిని మిక్కిలి తూలనాడెను. భార్య తనను దూషింపు చుండ వినియు మందహాసము చేయుచుండువాడుగాని మారుమాట వచించు వాడుకాడు.

కొన్నిరోజులు గడచినవి. హరిభక్తిపరాయణుడగు నాతుకారాముడు నిత్యము భజన చేసికొనుచుండువాడు. అర్ధాంగియొక్క వ్యర్థప్రలాపములను లక్ష్యముచేయక యాతడు తనసంకీర్తనము తాను చేసుకొనుచుండువాడు. ఇటులుండ నొకనాడు తుకారాముడు భార్యకు తెలుపకయే యచటికి సుమారు క్రోసుదూరముననున్న యాలింద మనుగ్రామమున కరిగెను. ఇది యింద్రాణీ

నదీతీరమున నున్నది. జ్ఞానదేవుడను యోగివరు డారువందలయేండ్లక్రిందట నిచట నివసించియుండెను. జ్ఞానదేవు డాప్రదేశముననే మరణించెను. అందుచే నాతనిసమాధికూడ నందు గలదు. జ్ఞానదేవుడు తపంబుచేసినప్రదేశము మిగుల రమణీయ మైనది. అటువంటి పవిత్రప్రదేశమున నివసించుటకు తుకారాముడు కోరుచుండువాడు. తరుచుగ నాతడు స్వగ్రామమును వీడి యచటి కరిగి పరమ సంతోషమున భజన చేయుచుండువాడు. తుకారాము డీసారి యందు స్థిర ముగా నివసించునభిప్రాయముతో నుండెను. అచట నొకవ్యవసాయదారుడు తనపొలమును కనిపెట్టుకొని యుండుటకై సేవకునికొఱకు యత్నము చేయు చుండెను. తుకారాము డీసంగతి గ్రహించి, పెట్టుబడిలేకయే వ్యవసాయము చేయుట లాభకరమైనపనిగా భావించి, సేద్యగానిపొలమున పరిచర్యచేయు టకు నిశ్చయించుకొని యాసంగతి యాతనితో మనవిచేసెను. వ్యవసాయ దారుడు సమ్మతించెను. మాసమునకు కొన్నిధాన్యముజీతముగా నొసగుటకు నిర్ణయించుకొని తుకారాముని తీసుకొనిపోయెను. కాపున కొకజొన్నచేను కలదు. ఆచేనులో పిట్టలను తోలుమని యజమాని యాజ్ఞాపించెను. తుకారా ముడు పొలమునకు వచ్చి మంచెపై కూరుచుండి, యిన్నాళ్ళకు నిర్జనమ్మైన ప్రదేశము దొరికినదని పరమానందభరితుడై హరిభజనము చేయ మొదలు పెట్టెను. పక్షులు యిష్టమువచ్చినట్లు చేనుపై వ్రాలి గింజలు కడుపునిండ తిన ప్రారంభించెను. ఘుంతగుండా పోవుచున్న పశువులు పొలములో పడి జొన్న జాడు తినదొడగినవి. చూచుచు నూరకుండెను గాని తుకారాముడు పక్షులను గాని పశువులనుగాని యదలింపలేదు. కాపువా డుదయమున పొలమున కరు దెంచి మైమరచి హరిభజనముచేయుచున్న సేవకునిగాంచి నోటికివచ్చినట్లు తిట్టెను. "అయ్యా! ఆకలిచే బాధపడు నోరులేనిజంతువుల గొట్టుటకు చేతులెటు లాడును" అని తుకారాముడు వచించెను. దానికి కాపువాడు కోపించి గ్రామ పంచాయతీవారియొద్ద తుకారామునిపై నభియోగము తెచ్చెను. కడచినసంవత్స రమున పండినజొన్నకు తక్కువమైనజొన్నలు తుకారాముడు కాపువాని కిచ్చు కొనవలసినదిగా పంచాయతీసభ్యులు తీర్మానించిరి. తీర్మానమునకు సమ్మతించి పంట పూర్తిగా తనకు లభించినందుకు సంతోషించుచు సేద్యకా డింటికి వెళ్లెను. తరువాత చేనుకోయించి కుప్పవెట్టి నూర్చి గింజలను రాశిచేసి కొలు

వగా నిరుటికంటె యెక్కువగా నుండెను. అందులకు కాపువాడు సంతసించియు నావార్త పైకి తెలియనీయక తుకారాముని నింకను గింజలకై పీడించు చుండెను. ఆసంగతి యెట్లో పంచాయతీసభ్యుల చెవుల పడెను. అపుడు వారు కాపువానిని పిలిపించి, పరమభక్తుడును బీదవాడును నగుతుకారాముని పీడించు చున్నందులకు మందలించి గతసంవత్సరమునకంటె యెక్కువగాపండిన యాజొన్నలను కాపువానిచే తుకారామునికిప్పించిరి. కాపువాడు జొన్నలకు పీడించినపుడు విచారముచెందని తుకారాముడు జొన్నలు లభించినందులకు సంతసమును చెందలేదు గాని యాజొన్నల గాంచి యతనిభార్య కడుంగడు సంతసించెను. ఆజొన్నలనమ్మి తుకారాముడు కొమార్తెలకు పెండ్లిండ్లు చేసెను.

తుకారామునకు ముగ్గురు కుమార్తెలు, గంగ; భాగీరథి; కాశి. శంభుజీ యనియు, విఠోభాయనియు నిద్దరు కుమారులును గలరు. పెద్దకుమారిత వివాహయోగ్యమగు వయస్సు ప్రాపించిన దగుటచే తుకారామునిభార్య యతనిని వరునికొఱకు ప్రయత్నము చేయుమని తొందరపెట్టసాగెను. భార్యపోరు మూలమున నత డొకసుముహూర్తమున వరాన్వేషణమునకై బయలుదేరెను. తా నెందరుగుచుండెనో యాత డెరుగడు. కొలదిమైళ్ళ దూరమందున్న యొకా నొకపల్లెగుండా యాత డరుగుచుండెను. వీధిలో కొందఱు బాలకు లాడుకొను చుండిరి. తమకులమునకు జేరినవారిని ముగ్గుర నాబాలకులనుండి యేరి యింటికి కొనిపోయి యొకశుభముహూర్తమున తనకుమార్తెల వారికి ముప్వురకు నిచ్చి వివాహము గావించెను. ఆగ్రామవాసులు తుకారాముని స్వభావ మెఱుంగు దురు. అందుచే వారేవిధమగు నల్లరియు చేయలేదు.

ఒకనాడు పొలమునుండి తుకారాముడు చెఱకుమోపు భుజమున నిడి కొని వచ్చుచుండెను. మార్గమధ్యమున నాడుకొనుచున్న బాలకు లామోపు చూచి యొకచెఱకుముక్క నొసంగుమని యాతని వేడిరి. మెత్తనిహృదయము గల యాబాలురకోరికను త్రోసివేయజాలక తుకారాము డొక్కొక్కరి కొక్కొక్కగడ నొసగెను. చేత నొకటిమాత్రము మిగులగా నతడు దాని నింటికి పట్టుకొనివెళ్లెను. జిజాబాయి కీసంగతి వెంటనే తెలియవచ్చెను. మగ డిల్లుచేరినవెంటనే యాగ్రహించి యెదు రేగి యాతనిచేతనున్న చెఱకుగడ నూడబెఱికి శక్తికొలది దానితో వానిని కొట్టెను. వెన్నున తగిలినదెబ్బవలన

పాప మాతనికి చాలబాధ కలిగెను. చెఱుకుగడ ముక్క లయ్యెను. పకపక నవ్వుచు తుకారాము డాముక్కలను గైకొని భార్యను చేరి "సహధర్మిణీ! నీ వొనరించినపని న్యాయ మైనదియే. నీకొఱ కొకచెఱకుగడను మాత్రము తెచ్చితిని; నీ వొక్క తెవు దానిని గైకొన నొల్లక నాకు భాగము కల్పించుటకై దానిని రెండు ముక్కలు చేసితివి. ఇదిగో నాముక్క నేను తీసుకొను చుంటిని. నీముక్కను నీవు తీసుకొ" మ్మనియెను. భార్యదుర్భాషలను, శిక్షలను నామహాపురుషుడు పలుమారు చిరునవ్వుతో ననుభవించెను.

ఇట్లుండ కొలదినాళ్ళలో తుకారాముని పెద్దకుమారుడు శంభుజీ మరణించెను. తనయునెడ వారికి ప్రేమ మెండు. కుమారుని యకాలమృత్యువు తుకారాముని హృదయమందు ఘోరమగు సంతాపమును కలిగించెను. "సంసారము కేవలము దుఃఖభాజన మైనది. దీనినుండి సుఖము బడయుటకై యెంతేని యత్నము చేసితినికాని నాప్రయత్నము లన్నియు విఫలమైనవి. అగ్నికణమును నేల బెట్టి రాచిన నందు నల్లబొగ్గు బయలుపడురీతిని సంసారసుఖములను తరచినచో నందలిదుఃఖములు బయటపడును. ధనము, ధాన్యము, రత్నములు ని వన్నియు నిష్ప్రయోజనములు. దుఃఖదాయకమగు నీసంసారబంధమున నేల చిక్కుకొనవలయును?" అని తలపోసి తుకారాముడు నిముసమైన నింట నిలువక సంసారమును పరిత్యజించివైచెను.

గృహము విడిచి యతడు పోయిపోయి భాస్వనాథ మనుపేరుగల యొక పర్వతమున కరిగెను. ఆపర్వతాగ్రమున విఠలనాథుని యాలయము కలదు. తుకారాము డిష్టదేవతాపాదపద్మసన్నిధిని నిశ్చలచిత్తుడై పరమేశ్వరుని సేవింపదొడగెను. నిరంతరహరిసంకీర్తనమున కాలము పుచ్చుచు నత డామందిర సమీపమునందు వసించుచు శయనించుచు నుండువాడు. అత డొకనాడు నిద్రపోవుచుండగా కలలో నొకముసలిబ్రాహ్మణుడు తుకారాముని తలపై తన హస్తము నునిచి యాశీర్వదించి కొంచెమునెయ్యి యాతని నడిగి తన పేరు బావాజి యనియు, రాఘవచైతన్య; కేశవచైతన్యులు తనకు దీక్షాగురువులనియు దెల్పి "రామకృష్ణహరి" యను మూలమంత్రమును తుకారామున కుపదేశించి మాయ మయ్యెను. నిదురనుండి మేలుకాంచి తనయదృష్టమునకు మిక్కిలి యుప్పొంగి కలలో లభించిన మంత్రము నుచ్చరించుచు నాకొండ వీడి కొన్నిదినములు ప్రయాణము సలిపి పాండురంగక్షేత్రము చేరెను.

ఆస్వామి సన్నిధానమున తుకారాముడు వేద వేదాంగ శాస్త్రాది ప్రాచీనగ్రంథములను చదువసాగెను. అచిరకాలమున నతడు గొప్పపాండిత్యము సంపాదించెను. మహారాష్ట్రదేశవాసుడగు నామదేవుడను నొకసన్యాసికడ భజన కీర్తనలు వల్లించి నిత్యము తన్మయుడై భజన సలుపుచుండువాడు. అట్లు భజన చేయు నలవాటున నతనికి భజనకీర్తనలు చేయునేర్పు చేకూరెను. క్రమక్రమముగా కీర్తనలు రచియించువిద్యయందు కౌశలము హెచ్చు కాజొచ్చెను. పెదవులు విప్పినంతనే యాశుధారగా కీర్తనలు వెలువడుచుండెడివి అతడు మహోత్సాహమున భజన సలుపుచుండ వినువారును చూచువారును చిత్తరువుల్లు నిశ్చేష్టు లగుచుండువారు. తుకారాముని భజనావిధానమును కన్నులార గాంచి యానందించుటకు భక్తు లెందరో దూరదేశములనుండి పాండురంగస్వామి యావాసమునకు వచ్చుచుండువారు. తుకారాముడు శూద్రకులమున బుట్టినవాడయ్యు నగ్రకులజులకంటె నెక్కుడుగ ప్రజాదరణము బడయుచుండువాడు.

తుకారామునికీర్తి నలుదిక్కుల వ్యాపించెను. అసూయాగ్రస్తుడై 'మస్వాజీబాబాగోస్వామి' యనునొకసన్యాసి తుకారామునియెడ దుష్ప్రవర్తన మాచరింప నెంచి పలువురుదుష్టులను పురికొల్పెను. మస్వాజీ, రామేశ్వరభట్టు మొదలగు దురాచారపరులు పలువిధముల తుకారాముని హింసింప దొడగిరి. తుద కాతనిశాంతియు, దాక్షిణ్యాభావమును, మృదుమధురసంభాషణమును, పరోపకారజీవనమును, నిర్మలమగుభక్తియు గాంచి యాదుష్టులు మిక్కిలి యచ్చెరువు నంది యితరులబోలె తామును నాతనికి శిష్యులు కా జొచ్చిరి.

పూనానగరమునకు కొంతదూరమున నీశాన్యభాగమున భోగాలియను నొకగ్రామము గలదు. అందు రామేశ్వరభట్టను నొకవిప్రుడు వాసముచేయుచుండెను. ఆతడు తుకారాముని తనయొద్దకు పిలిపించి "ఏమోయీ! నీవు శూద్రుడ వయ్యు వేదాధ్యయన మొనరించుచుంటి వేల? అట్లొనరించుట మహాపాతకమున కొడికట్టుట కదా! శాస్త్రపఠనముగాని భజనకీర్తనలు రచించుటగాని చేయ వలదని నే నాజ్ఞాపించుచుంటిని. ఇంతవరకు నీవువ్రాసిన భజనకీర్తనలను నీట బొఱవేయు"మని యాజ్ఞాపించెను. "మహాత్మా! పాండురంగస్వామియాదేశమున నేనీకీర్తనలు రచించుచుంటి" నని తుకారాముడు

ప్రత్యుత్తర మొసగెను. భట్టుగా రామాటలు నమ్మక భజనకీర్తనలు నట్టేట నూరదొక్కుమని యాజ్ఞాపించెను. బ్రాహ్మణాజ్ఞ తిరస్కరింపరాని దని తలచి మారుమాట చెప్పక యించుకైన సంశయింపక తనభజనగ్రంథముల నాత డింద్రాణీనదీజలమున బారవైచెను. తనగ్రంథముల నాతడు ప్రాణసమానముగా చూచుకొనుచుండువాడు. పుస్తకముల కిరుప్రక్కలను పలుచనిరాతిపలకల నమర్చి వస్త్రములచే నాతడు వానిని గట్టిగ కట్టుచుండువాడు. నదీనీరమున పాఱవేయునపుడు గ్రంథములు కట్టుగట్టియే యుండెను. విలువలేని యాభజన గ్రంథములు గంగపా లయినందుల కాయూరివారెల్ల దుఃఖించియు, కోప గించియు తుకారాముని పెక్కుభంగుల దూషింపసాగిరి. "పాండురంగని యాదేశమును దాటితి" నని పలికి దుఃఖితాతుడై యన్నపానీయములను విడిచి విఠ్ఠలదేవుని యాలయముచెంత నాతడు కండ్లుమూసుకొని నెత్తిని చేతులు జోడించి బోరగిలబడెను. పదమూడుదినములు గడచినవి. పదునాలు గవనా డాతనిపుస్తకములకట్ట నదిలో నీరముపై తేలియాడుచుండుట నెవ్వరో చూచి వెంటనే నదిలోనికి దుమికి జాగ్రత్తగా గ్రంథములకట్టను వెలికిదీసి తుకారామున కొసగిరి. ఈయద్భుతవిషయము గాంచి ప్రజలు తుకారాముని మాహాత్మ్యమును గురుతించి యతనిని పూజింపసాగిరి. రామచంద్రభట్టుడును తానుచూపినయపచారమునకు మిగుల విచారించి క్షమింపుమని తుకారాముని వేడుకొనెను.

చరిత్రపాఠకులకు శివాజీపేరు తెలియనిది కాదు. అతడు, పరార్థజీవి; పూతగుణసంశోభితుడు; దింగతవిశ్రాంతకీర్తిమంతుడు; అమృతకాయుడు. అట్టి వాడు తుకారామునిసద్గుణగరిమ నెఱిగి యతనిని తనరాజధానికి రప్పింప నెంచి ప్రశస్తమగు నొకయశ్వమును పలువురభృత్యులను ఛత్రమును నాతనికడ కంపెను. మహారాష్ట్రాధిపుని నియోగమున నొకబ్రాహ్మణుడు తుకారామునిజేరి శివాజీవచనములుగా నాతని రమ్మని పిలచెను. వచ్చినవిప్రుని సత్కరించి సేవకు లను బహూకరించి రేనికి తుకారాము డిట్లుత్తరము వ్రాసిపంపెను.

"మహారాజా! నీ వేల నన్ను దారుణపరీక్షయందు పెట్టుచుంటివి! మానవసంఘమునకు దూరముగ నిశ్శబ్దమగుతావున మునివృత్తి నవలంబించి యుండుటయే నాకోరిక. ఐశ్వర్యమునుగాని ద్రవ్యమునుగాని పేరుప్రతిష్ఠలనుగాని

యిహలోకసంబంధమగు దేనినిగాని వమనమొనరించినపదార్థమువలె జూతును. కోరికయే దుఃఖజనకము. కోరికలేమియు నామనమున చోరనీయకుమనియే నేను పాండురంగని వేడుకొనుచుందును. పండరీపురాధిపునియిష్టముచొప్పున నడచు కొనువాడనై యుంటిని. రాజేంద్రా! నీ చెంతకు వచ్చి నేనపేక్షించున దేమున్నది? ఆకలివేసినపుడు భిక్షాటన మొనరించుటకై పెద్దరాజవీధి కలదు. ఇంక శరీర మునుకప్పుకొనుటకో — తెరువునబడియున్న గుడ్డపీలికలు చాలకపోవు. రాజా! కోరిక జీవనమును నష్ట మొనరింపదా. వాంఛయే దుఃఖమునకు మూలమని గౌతమబుద్ధుడు వచించెను. భూములు, పుత్రులు వాంఛించుటతడే రాజ మందిరములకు పోదలచును. మహారాజా! వినయపూర్వకముగా నీజాబు వ్రాసితిని."

మహాత్ముడగు శివాజీ ఈపత్రమును చదువుకొని "ఈశ్వరప్రసాదమును చవిగొని సంతుష్టుడైన మహాపురుషునకు రాజప్రాసాదములయందలి పంచ భక్ష్యపరమాన్నములు రుచించునా. అట్టిమహానీయునకు రాజాంతఃపురములు ముండ్లతో నిండిన దట్టమగు నటవీప్రదేశములు" అని యనుకొనెను.

యోగసాధనమున తుకారాముడు దినక్రమమున నభివృద్ధిగాంచెను. 'లోహగావా' యనుపల్లెయందు దాత డొకనాడు భజనచేయుచుండ దురదృష్ట వంతురాలగు నొకయిల్లాలు చనిపోయినతనకుమారుని శరీరము తనచేతులయం దిడుకొని తెచ్చి తుకారామునిపాదములపై బడవైచి "మహాత్మా! తాము నిజమగు విష్ణుభక్తులైనచో నాపుత్రునికి ప్రాణదానము చేయగలుగుదురు. మీరట్లొన రింపజాలరేని కపటసన్యాసులనియే తలంచెద" ననియెను. విచారగ్రస్తురాలగు నామెపలుకు లాలించి "ఈశ్వరభక్తులుమాత్రమే చనిపోయినవారిని బ్రతికింప జాలుదురని యామె యభిప్రాయము కాని నా కట్టిభాగ్యము కలుగదే" యని యోచించి తుకారాముడు నారాయణస్తవ మొనరింపసాగెను. అత డట్లు విష్ణుస్తుతి గావించుచుండ మృతుడైనయాశిశువు నిద్రనుండిమేలుకాంచిన వాని వలె లేచి తల్లిని కౌగలించుకొనెనని మహారాష్ట్రులు నేటికిని చెప్పుకొనుచుందురు.

తుకారాముడు భూలోకసంబంధమగు జీవనమునం దెప్పుడు విచారించెనో తెలిసికొనుటకు నిజమగువిషయములేవియుగానరావు. పాండురంగక్షేత్ర

మున వచించుచునే యొకనాడాత డాకస్మికముగా నంతర్ధాన మయ్యెను. అనంతర మెవరును వానిని మరల చూడజాలకపోయిరి.

జనకుడు మాయమయినపిదప తుకారాముని పుత్రుడు విఠోబా శివాజీ పాలింగి దేహుల గ్రామమున విఠ్ఠలదేవునియాలయమును నిర్మించు నుద్దేశము నాతనికి దెలిపెను. తుకారాముని తనయుని బహుభంగుల సత్కరించి, యాయూర దేవాలయము గట్టించి, దేవసేవకై శివాజీ మూడుగ్రామముల నొసగెను.



## ౭

# ప్రహ్లాదుడు

మ. మునివృత్త్యోపకరున్ బ్రభానరహితున్ మోక్షాధినాథున్ సనా
తను గూటస్థుని సర్వవిశ్వమయు చైతన్యాకృతిన్ కృత్స్నచినం
దను సర్వాత్ము ముకుందు లోకవరదున్ నాదాంతతత్త్వాత్ము న
త్యనఘున్ రాము ధరాసుతాధిపతి నాదాతీతు భావించెదన్.

దుష్టులును, శిష్టులును, దురాత్ములును, మహాత్ములును యుగములన్నిట పుట్టుదురు. దుర్మతుల కుచేష్టలును, సుమతుల సత్క్రియలు నెన్నడును వృథా పోలేదు. నేడుకాకున్న రేపు వానిఫలితములు కనపడును. దుష్కార్యము లొనరించి యందువలన బాగుపడితినని మిట్టిపడుచు నొకానొకమానవుడు సంచరించినను దుర్మార్గుడగువాడు తనదుష్టచేష్టలఫలము నెన్నటికైనను అనుభవింపక మానడు. ఉన్నతమగునూహలను మానసమున నిలిపి క్రమక్రమముగా తనయుద్దేశఫలములు నెరవేరుటకు నెట్టికష్టములకైనను లోనై ధైర్యము విడువక, సహనమును గోలుపోవక, చింతాక్రాంతుడుగాక, విపత్తులకు వెనుదీయక కఠినపరీక్షలకు వెనుజూపక, నిప్పునబడి కాంతిచెందు కనకమువలె సుగుణాత్ములు, విలువలేనిప్రఖ్యాతిచే తేజరిల్లి పరమేశ్వరుని కరుణకు పాత్రులుగాక మానరు. సత్యము నసత్యమును, అసూయయు, ప్రేమయు, కోపమును, శాంతమును, కఠినత్వమును, కరుణయు, కలుషమును, పుణ్యమును, జీవనరంగమున పెనగులాడుట యెప్పుడును కలదు. సూర్యకాంతిచే చెల్లాచెదరగుచీకటివలె పుణ్యాలోకమున కలుషమునెడి యంధకారము నశించుటయు, నిజమయినదైన సత్యము ప్రకాశమానమై వెలుగొందుచుండుటయు మనము కాంచుచుందుము. మబ్బుచాటునుండి వెలువడినచందమామవలె పవిత్రమైనభక్తి మిగులశాంతమై కాంతివంతమై ప్రకాశించును. హిరణ్యకశిపుని దుర్మార్గవర్తనమును ప్రహ్లాదుని పూతచరిత్రమును నిందుల కుదాహరణములు.

అన్నయగు హిరణ్యాక్షుని వరాహరూపమున విష్ణువు సంహారింప నాతనిపై పగతీర్చుకొన నిశ్చయించి తనయుద్దేశసిద్ధికై తగినబలపరాక్రమ

మాలు పడయ మందరగిరి కరిగి బ్రహ్మనుగూర్చి హిరణ్యకశిపుడు ఘోరతప మొనరింప గడగెను. మానసము నేకాగ్రతతో చతురాననుపై నిలిపి రాత్రింబవళ్లు మరచి ఎండవానలకు జడియక నిద్రాహారములు మాని, పర్వతశిఖరమున నిమీలిత నేత్రుడై యొంటికాలిపై నిలచి యూపిరి బిగబట్టి యుగ్రతప మొనరించినతటి యారాక్షసుడు అస్థిపంజరమాత్రుడై వల్మీకములచే నావరింపబడినవాడై పోయెను.

అసురవరుని తపమునకు మిక్కిలికోపించి సురేంద్రుడాతనిపై దండెత్తి “వీరు లోకకంటకులు, బ్రహ్మను ముక్కంటిని మెప్పించి దారుణమగు వరములు వడసి మునీశ్వరులకును, దేవతలకును, మానవులకును తీరనిముప్పు వాటిల్ల చేయుట యీదుష్టులపని. ఈరాక్షసులు జీవించియుండుట లోకమునకు చే” టని దట్టమగు పూపొదరింటిని తనతొండమున పెరుకునేనుగువలె, దానవకులమును రూపుమాప జొచ్చెను. అప్పటికిని యాగ్రహము నడంచుకొనజాలక సురపతి రాక్షసపతిభార్యను చెరబట్టెను. లీలావతి యప్పుడు గర్భవతి. మగడులేనితరి తన్ను బాధింపబూనిన మహేంద్రుని క్రూరకృత్యముల కాయిల్లాలు మిక్కిలి సంతాపము నొందెను. అది తెలిసి మునికుంజరుడగు నారదుడచటికి వచ్చి “సురేంద్రా! ఈమానిని గర్భమున భాగవతోత్తముడగు శిశువు పెరుగుచుండెను. ఈతడు దేవతలపాలిటి మృత్యువుకాక సకలసద్గుణసంపన్నుడై దానవులందు తప్పబుట్టును. చూలాలగు నీసీమంతినిని చెఱబట్టకు” మని యింద్రునకు హితోపదేశము చేసి తనయాశ్రమమునకు లీలావతిని గొనిపోయి నారాయణ మహామంత్రము నామె కుపదేశించెను. శుక్లపక్షచంద్రునివలె నామెగర్భమున వృద్ధిచెందుచున్న శిశువు అఖండబుద్ధిశాలియై ఋషిపుంగవుని మంత్రప్రభావము గురుతింప గలిగెను.

రాక్షసనగరమువిడిచి స్వర్గమున కేతెంచినను యింద్రునకు భయము పోలేదు. హిరణ్యకశిపుని తపోజ్వాల లాకస మంటుచుండెను; సముద్రము లల్లకల్లోల మయ్యెను; కొండలు కదలిపోయెను; తారలు క్రింద పడదొడగెను; సూర్యచంద్రులు గతులు తప్పిరి. విశ్వమంతయు తలక్రిందయ్యెను. ఎల్లయెడల హాహాకారములు బయలువెడలెను. అపుడు దేవతలు గుండియలు దడదడలాడ నడుగులు తడబడ బ్రహ్మయొద్ద కరిగి రక్షింపుమని యాతనిని వేడుకొనిరి.

అభయదానమిచ్చి దేవతలను పంపి మునిజనముతో కూడినవాడై బ్రహ్మ మందరపర్వతమునకు బోయి రాక్షసరాజును గాంచి "అసురవరేణ్యా! నిశ్చలచిత్తుడవై చలివనియుద్దేశము నాధారముచేసికొని నీ వొనరించిన మహాతపంబునకు సంతసించితిని. ఇట్టి సామర్థ్యము సామాన్యుల కుండదు. వలసినకోరిక నెఱిగింపు" మనియెను.

యోగనిద్రనుండిలేచి హిరణ్యకశిపుండు బ్రహ్మముందు నమస్కరించుచు నిలచి "దేవదేవా! సృష్టికర్తవై మహిమాన్వితుడవైన నీవు నాయెడ ప్రసన్నుడవై యుండ నాకేమికొదువ. మానవునిచేగాని, మృగముచేగాని, చీకటిలో గాని, వెలుగులోగాని, యస్త్రమునగాని, శస్త్రమునగాని అనిలమునగాని యనలమునగాని మృత్యువు ప్రాపింపకుండుస్థితియు, యెట్టి బలవంతునకునైనను లొంగనివాడనుగా నుండుటకు తగినశక్తియు, ధైర్యమును నా కొసంగుము" అనియెను. ముల్లోకములకు కర్తయగు నాబ్రహ్మదేవుడు ముందురాగల గొప్ప మార్పునెఱిగియు, భక్తుని ప్రశంసను నొప్పొంగి "వత్సా! నీకోరిక యసాధారణమైన దయ్యు నెరవేరగలదు; సన్మార్గవర్తివై మెలగుదువుగాక" యని తన లోకమునకు మఱలెను.

లోకములకన్నిటికి నధినాథులగు త్రిమూర్తులు పరమస్నేహితులని పండితు లనుచుందురు. చతురాననుడు విష్ణుమూర్తికి ప్రియకుమారుడై యెల్లపుడును తండ్రినామమునే కీర్తించుచుండుననియు, శ్రీనాథుడు విశ్వనాథుని పవిత్రనామమును, విశ్వనాథుడు శ్రీనాథుని పవిత్రనామధేయమును నిరంతరము జపించుచుందురనియు పురాణములు తెలుపుచుండును. కాని పురాణములయందు కనుపట్టు గందరగోళమంతయు సందర్భములేని వీరిపనులనుండియే యుద్భవమగుచుండెను. బ్రహ్మగాని యీశ్వరుడుగాని క్రిందుమీదులు చూడక ముందువెనుక లాలోచింపక దుష్టుల గొంతెమ్మకోరికలన్నియు వారిముఖస్తుతుల కుబ్బి ప్రసాదించి, విష్ణుమూర్తికి చేతినిండ పనికల్పించిరి. తామిచ్చినవరములు తమకుగాని, తమభృత్యులకుగాని యాపద వాటిల్లజేయు సమయమున వీరు శ్రీధరు నాశ్రయింపవలసివచ్చుచుండెను. త్రిమూర్తుల నైకమత్యమున నీవిపరీతమేల? తపోబలమున నసమానుడగు నారక్కసి కీదుర్బుద్ధియేల? ఇదియు నొకవింతయే. ఉత్తము లొకప్పుడు నీచకృత్యములను దుర్మార్గులు కొన్ని

వేళల సత్కార్యములను కావించుచుండుట కలదు. మానవునియందును యీ సృష్టియందును యీవిచిత్రమైపరీత్యము గోచరించుచునే యున్నది. పొందు పోరులు, సృష్టి వినాశములు విశ్వపాలనయందు ముఖ్యమగు క్రియలు. బ్రహ్మ ప్రసాదించినవరము వెంటనే ఫలియించెను. హిరణ్యాకశిపునకు జాలిన వీరుడు ముల్లోకములయందు లేకుండెను. కండలుదీఱినశరీరము పనిలేక పడి యుండు టెట్లు? శ్రీహరిపై పగతీర్చుకొనుట కుద్దేశించిన రాక్షసరాజూర కుండుట యెట్లు? తొలుత విష్ణుభక్తులగు గంధర్వాదులను గడగడలాడించుట తనముఖ్యకర్తవ్యమని తలచెను. రాక్షసేశ్వరుని క్రోధాగ్నిజ్వాలలు సురరాజును చుట్టుముట్టెను. ఇంద్రుని వజ్రాయుధము రాక్షసపతి, వాడిచూపుల వేడికి వాడి పోయెను. హిరణ్యాకశిపుని యుద్రేకమున కింద్రుడు కంపించినవాడయ్యెను. రాక్షసబాధ కోర్వజాలక దేవతలందఱు విష్ణుమూర్తిని కరిగి శరణువేడు కొనిరి. రాక్షసబాధాపీడితులగు నింద్రాదులపై నతడు కృపాదృష్టి బఱపి "సుర లారా! భయపడకుడు, కొలదిరోజులలోనే యీదుష్టరాక్షసుని పొగరణచెదను. చింత బాసి మీమీనివాసంబులకు మీరరుగు" డని పలికి దీనులకాలిటి కల్ప వృక్షమగు నాశ్రీమన్నారాయణుండు దేవతలను పంపివేసెను.

లోకములో తలిదండ్రులు తమకన్న సంతతియొక్క యున్నతికిని పతన మునకు కూడ కర్తలగుచుందురు. తలిదండ్రులభావము ననుసరించియు నడత ననుసరించియు సంతతి ప్రవర్తించుచుండును. సృష్టియందు సర్వసాధారణముగా నిట్లు జరుగుచుండును కాని యొకానొకయెడ దీనికి విరుద్ధమును లేకపోలేదు. చల్లనిమబ్బులోనుండి పిడుగులు జనియించినట్లు సజ్జనులకు దుర్మార్గులును మట్టిలో నుండి యుద్భవించు మణులకీతిని చెడ్డవారికి సత్పుత్రులును జనియించుచుందురు. హిరణ్యాకశిపునివంటి క్రూరాత్మునకళ్లే భక్తాగ్రేసరుడగు ప్రహ్లాదుడు జని యించెను.

ప్రహ్లాదునకు పుట్టుకతోడనే విష్ణుభక్తి పుట్టెను. నిదురించునపుడును, మేలుకొనియున్నపుడును, నిలిచియుండినపుడును, నడచునపుడును, తినునపుడును, త్రాగునపుడును, హరినామమునే యాతడుచ్చరించుచుండువాడు. సతతము నాకుమారుని చిత్తము హరిపదపద్మమకరందమును గ్రోలుచుండెడిది. రాత్రిం బవళ్లు హరినామస్మరణమే యతని ప్రధానకార్యము. శ్రీహరియే పరమదైవత

మనియు ప్రపంచమంతయు విష్ణుమయమనియు తలచి ప్రహ్లాదు డెల్లయపుడు తనయుల్లము శ్రీహరియందే లగ్నముచేసి యుంచువాడు.

కుమారునిధోరణి తండ్రికి మిక్కిలి వెగటుగా నుండెను. తనకు జనియించినయక్కుమారున కిట్టివిపరీతబుద్ధి జనియించుట కతడు కడునాశ్చర్యము నొందెను. అయినను మూడులోకములు నవలీల జయింపగలిగినతనకు కుమారుడు స్వాధీనుడగుట యొకలెక్కయా యని దానవపతి మనమున తలపోసి, "తండ్రీ! మధుసూదనుడు కడుదుష్టుడు. నీపెదతండ్రిని పొట్టబెట్టుకొనిన ఘాతుకుడు. పరిపూతమగు మనకులమునకు కంటకుడు. వానిపేరు తలచినచో తీరనిపాపము ఘటిల్లును." అని బాలకుని తొడపై నిడుకొని యదేపనిగా బుజ్జగించి చెప్పుచుండువాడు. తండ్రిప్రియవాక్కులు వ్యర్థమగుటకు నింకను సమయము రాలేదు. అయినను నిరాశుడు గాక అమూల్యవస్తువులును వివిధములగు రుచ్యభక్ష్యములును కడుంగడువింతగొలుపు పదార్థములును కొడుకుచెంత నిడి "నాయనా! యివియన్నియు నీకొఱకై తెప్పించితిని. హరినామస్మరణము మానితివేని యివి యన్నియు నీకిచ్చెద. లేకున్న నిందొకవస్తువైన నీకియ్య" నని, హిరణ్యకశిపుడు పలుకుచుండెడువాడు. కాని జనకునిసామదానములు కుమారునిపట్ల వృథ యయ్యెను. తనపరిభవమునకు మిక్కిలి కోపించి "ఓరీ! తులువా! హరి యనియు గిరి యనియు ప్రేలకుము. తలిదండ్రులమాట పెడచెవిని బెట్టు తనయులకు ముప్పు వాటిల్లును. నావిరోధియగు హరిని దలతువేని నిన్ను ఖైదు చేయుదును. ఇప్పుడైనను నే చెప్పెడిమాట విని నీపిచ్చిధోరణి కట్టిపెట్టు" మని భేదోపాయముకూడ మతిమంతుడగు నారక్కసిరేడు ప్రయోగించెను. తీవ్రమగు బాణములవంటి యాపలుకులు కుమారునిపట్ల రాయితాకినవిధమున నిరర్థకము లయ్యెను. ప్రహ్లాదునిభక్తి దినదినప్రవర్ధమాన మయ్యెను. హిరణ్యకశిపునిక్రోధము మండుచున్న యగ్నికీలలట్లు మండదొడగెను.

అద్భుతమగుదృశ్యము మానసము నుప్పొంగచేయును. శరత్కాలచంద్రుడు ఆకాశమునుండి పండువెన్నెల కాయుచుండ నిజకాంతునిరాకకు పరమానందము నొందు కాంతవలె మిక్కిలి పొంగు సముద్రమును గాంచినపుడును, ఆకాశమనెడు తెల్లనిదుకూలము దాల్చి, ప్రాతఃకాలసూర్యుని మెత్తనికిరణములయందు కాంతిలు చదలంటిన పర్వతాగ్రములు గాంచినపుడును, సాన

బట్టిన నవరత్నములవలె ప్రకాశించు నాకాశమందలి నక్షత్రముల తిలకించి నపుడును స్వాంత మనంతానందముచే నుప్పొంగును. అద్భుతమందు నుడువ శక్యముగాని యానందము జనియించును. ఈ అద్భుతాశ్చర్యమేళనమున నుద్భవించునది భక్తి. ఇది బుద్ధినుండి బయలువెడలునది కాదు. హృదయపాత్రమం దుద్భవించి వెల్లివిరియు నొకప్రవాహము. వేయిసంవత్సరములకు పూర్వము నాగరికతాశూన్యమగు కాలమున మానవుడు దిగంబరుడై సంచరించుచు నుదయసాయంసమయములయందు సూర్యునిదివ్యరూపము గాంచి దేహము మరచి చిందులుద్రొక్కుచు తూర్పు పడమర దిక్కులకు సాష్టాంగపడుచుండు వాడు. ఆశ్చర్యకరమగు నాభాస్కరునికాంతియందు పరమేశ్వరుని మహిమ వానికి గోచరించెడిది. నాగరికత యభివృద్ధి గాంచినకొలది, భగవంతునిగురించిన భావములు చిత్రచిత్రరూపములుగ భక్తునిహృదయమున జననమొందినవి. తండ్రీ! యని హిందూక్రైస్తవులును; తల్లీ! యని శాక్తులును; నాథా! యని వంగవైష్ణవులును; ఈశ్వరుని సంబోధించుచుందురు. తండ్రిని తలచి క్రైస్తవ ఋషీంద్రుడు మైమరచెను. నాథా! యని పిలచుచు చైతన్యుడు పరమానంద మున తాండవమాడుచుండువాడు. అమ్మా! యని రామకృష్ణుడు యొడ లెఱుంగక గంగాతీరమునందలి దక్షిణేశ్వరమున తల్లినిగాంచిన శిశువునుబోలె గంతులువైచువాడు. మానసికదృష్టియెదుట ననారతము శ్రీహరిని పొడగాంచి ప్రహ్లాదుడుకూడ నట్లే

సీ. వైకుంఠచింతావివర్జితచేష్టుడై యొక్కడు నేడుచు నొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢచిత్తుడై యుద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణు డింతయకాని వే రొండు లేదని యెత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షు డనునిధానము గంటి నే ననియుబ్బి గంతులువైచు నొక్కచోట

గీ. బలుకు నొక్కచోట పరమేశ కేశవ ప్రణయహర్ష జనితబాష్పసలిల
మిళితపులకుడై నిమీలితనేత్రుడై యొక్కచోట నిలిచి యూరకుండు.

సీ. శ్రీవల్లభుడు తన్ను జేరిన యట్లైన చెలికాండ్ర నెవ్వరి జేర మఱచు,
నసురారి తనప్రోల నాడిన యట్లైన నసురబాలురతోడ నాడ మఱచు
భక్తవత్సలుడు సంభావించి నట్లైన పరభామలకు మాఱు పలుక మఱచు
సురవంద్యుం దనలోనఁజూచినయట్లైనఁ, జొక్కి నమస్తంబు జూడమఱచు

గీ. హరిపదాంభోజయుగచింతనామృతమున నంతరంగంబు నిండి నట్లైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి జడత లేకయునుండును జడునిభంగి.

కొమారునియందు పుట్టినయీవిష్ణుభక్తి హిరణ్యకశిపునకు నడలును నాశ్చర్యమును విచారమును కలిగించెను. వైరిచింత వల దని యెంతవారించినను బాలకుఁడు వినకుండుట లేదు. తలిదండ్రులయాజ్ఞగాక గురుశిక్షణము కుమారుని సరియైనమార్గమునకు దెచ్చు నని యాశపడి రాక్షసరాజు గురుపుత్రులగు 'చండామర్కు' లను రావించి నమస్కరించి "ఆర్యులారా ! అసురకులమునెడ నవ్యాజప్రేమంబు చూపుచు తపోనిధులగు మీజనకులు మాకు విద్యాభిక్ష పెట్టిరి. వారికరుణపెంపున రాక్షసకులము దినదినాభివృద్ధి నందుచున్నది. బాలకుఁడగుప్రహ్లాదుని భావియౌన్నత్యము మీయాదరానురాగములపై నాధారపడి యున్నది. కులమర్యాదలను తండ్రిపేరుప్రతిష్ఠలను నిలువబెట్టు కుమారుడే కుమారుడు. ఏలనోగాని నాకుమారుడు రాక్షసకులకంటకుం డగుచు శ్రీహరిపై మనస్సు నిలిపి తన్మయుఁడై కేశవ లతనినే కీర్తించుచుండును. ఈధోరణి నెట్టిదైన తరుణముననే యణచవలయునుగాని ముదిరినచో ననర్థము చేకూరగలదు. సదయులై మీరు బాలకునకు సకలవిద్యలు గఱపి హరిచింతనము వానిహృదయమునుండి పారద్రోలి నాచిత్తమున నాటుకొనియున్నచింతావృక్షము నూడబెఱుకుడు." అని తొందరపాటున పలికెను.

గురుపుత్రులును సమ్మతించి ప్రహ్లాదుని గొనిపోయి శిష్యులతో చేర్చిరి.

మాతృగర్భమునం దున్నయపుడే నారదుని యుపదేశమును హృదయమున కింపైనదిగా చేసికొనినబుద్ధిమంతునికి చండామర్కులు బోధించిన వేద వేదాంగములును యుపనిషదాదిశాస్త్రములును నచిరములో నరచేతిలోనియుసిరికవిధమున తేటతెల్ల మాయెను.

వేదముల నరచేతిపుష్పములుగా నొనరించుకొన్నప్రహ్లాదునకు, ననంత బ్రహ్మాండమునకు నాథుఁడైన శ్రీమహావిష్ణువుకూడ సమీపమున చెలగువాడయ్యెను. శాస్త్రజ్ఞానమను గాజుకుప్పెయందు బాలకునివిష్ణుభక్తి ప్రభాసమన్వితమై వెలుగొంద జొచ్చెను.

గురువులయుద్బోధనమున కుమారునిపూర్వపుధోరణి నశించు ననియు, శాస్త్రపఠనము కొడుకును తిన్ననిమార్గమునకు దెచ్చు ననియు తలచి కుమారుని పరీక్షింప దలచి దనుజేంద్రు డొకనాడు పుత్రుని రావించెను.

గురువులవెంట ప్రహ్లాదుఁడు తండ్రిపాలి కరుదెంచి వినయముతో నాతనికి మ్రొక్కెను. "నాయనా! నిన్ను చూచి యెన్నియో దినములైనది. కన్నులు కాయలు కాచినవి. ఇంతవఱకు నీకు మీయమ్మ తలపునకు రాలేదా?" యని తల్లి కుమారుని ముద్దాడెను. "తండ్రీ! నీవు నేర్చినచదువుల నెఱుఁగ గోరెదను. ఏ ఏ శాస్త్రములు వల్లించితివి. రాక్షసకులమునకు పేరుతెచ్చెడువాఁడ వని మురియుచుంటిని. దేవతలను సంహరించి మహేంద్రునిగర్వము సర్వము నంతమొందించి మూఁడులోకములు జయించి దిగంతకీర్తిని బడయజాలుదు వని యాశపడుచుంటి" నని దానవపతి కుమారుని తనయంకతలమున చేరిచి పలికెను.

ప్రహ్లాదుఁ డపుడు జనకు నుద్దేశించి వినమ్రుఁడై "తండ్రీ! నీపలుకులు నాకెంతయు విచారమును కలిగించుచున్నవి. సురలను బాధించి మునులను దుఃఖపెట్టి మానవులను పీడించి ముల్లోకముల నరచేతకు దెచ్చుకొనినంతనే నీకు కలుగు ప్రయోజన మేమి? దానవుఁడుగాని మానవుఁడుగాని యింద్రియములను నిగ్రహించి, యాత్మసామ్రాజ్య మందవలెను. లోకరక్షకుఁ డగుట ప్రధాననియమముగా నుండవలెను, కాని లోకకంటకు డగుట విరుద్ధవర్తన మని బలవంతు డూహింపవలెను. ఇతరుని జయించుటకుముందు మానవుఁడు తనను తాను జయింపవలెను. ఇందుల కాత్మశుద్ధి యవసరము. ఎల్లప్పుడు చిత్తమును తలక్రిందుచేయు చెడుతలపులను పారదోలి పవిత్రమగు పూజామందిరమువోలె హృదయమును పరిశుభ్ర మొనరింపవలయును. అటు లొనరించినగాని శ్రీహరి మానవుని హృదయపద్మపీఠమున కూర్చుండఁడు. అటు లొనరింపకుండినచో మానవుఁడు దురంతదుఃఖమునుండి విముక్తుఁడు కాజాలఁడు. పరిశుభ్రమైన యాత్మగలవాఁ డగుటకు మానవునకు తదేకదృష్టి యవసరము. శ్రీహరిచింతన మందే తదేక దృష్టికలదు—హరిచింతనము లేనిజీవనము, సూర్యబింబరహితమై యంధకారబంధురమైన యాకసముతో సమము. హరిచింత లేనిజీవనము సుగంధములేని పుష్పమువోలె నిరర్థకము. కమలాక్షుని చింతలేని జీవనము గాలి కెగిరిపోవు దూదిపింజవలె నిరర్థకమై ఆకాశమున నెగసిపోవును. శ్రీనాథుని చింత లేనిజీవనము చుక్కానిలేని యోడభంగి, సంసారసముద్రమున బడి యిట్టట్టు కొట్టుకొనిపోయి తుదకు నామరూపములులేక నశించును. జనకా!

సీ. "సంసారజీమూతసంఘంబు విచ్చునే? చక్రిదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీలదావాగ్ని లారునే విష్ణుసేవామృతవృష్టి లేక
సర్వంకషాఘౌఘజలరాసు లింకునే హరిమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడగునే పద్మాక్షనుతిరవిప్రభలు లేక
గీ. నిరుపమానపునరావృత్తనిష్కళంక ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక తామరసగర్భునకునైన దానవేంద్ర!"
సీ. "కంజాక్షునకు గాని కాయంబు కాయమే పవనగుంభితచర్మభస్త్రి గాక
వైకుంఠు పొగడని వక్త్రంబు వక్త్రమే ఢమఢమధ్వనితోడి ఢక్క గాక
హరిపూజనములేని హస్తంబు హస్తమే తరుశాఖనిర్మిత దర్వి గాక
కమలేశు జూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాలరంధ్రములు గాక
ఆ. చక్రిచింతలేని జన్మంబు జన్మమే తరలసలిలబుద్బుదంబు గాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే పాదయుగముతోడి పశువు గాక."
సీ. కమలాక్షు నర్చించుకరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని చూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరి దగిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తమునిమీది బుద్ధి బుద్ధి
గీ. దేవదేవుని చింతించుదినము దినము, చక్రహస్తుని ప్రకటించుచదువు చదువు
కుంభినీధవుచెప్పెడి గురువు గురువు, తండ్రి! హరిజేరుమనియెడితండ్రి తండ్రి"
అని ప్రత్యుత్తరము చెప్పెను.

కుమారునిపలుకులు తండ్రి కాగ్రహము పుట్టించెను. పసిబాలుని కంతటి విష్ణుభక్తి యొరులు నేర్పనిదే యలవడ దని తలచి యించుకశాంతించి బాలకు నుద్దేశించి హిరణ్యకశిపుడు,

శా. "నాకుం జూడగ చోద్య మయ్యెడిగదా! నాతండ్రి యీబుద్ధి దా
నీకున్ లోపల దోచెనో పరులు దుర్నీతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ పలికిరో యీదానవశ్రేణికిన్
వైకుంఠుండు కృతాపరాధు డతనిన్ వర్ణింప నీ కేటికిన్.

మ॥ సురలం దోలుటయో ! సురాధిపతులన్ స్రుక్కించుటో సిద్ధులన్
బరివేధించుటయో మునిప్రవరులన్ బాధించుటో యక్షకి
న్నరగంధర్వవిహంగనాగపతులన్ నాశంబు నొందించుటో
హరియంచున్ గిరియంచు నేల చెడ మోహాంధుండవై పుత్రకా!"

యని పలుక,

"జనకా హరిచింతనము నా కోరులు కరపలేదు. భువనములన్నియు హరియందే యుండ నాతడెట్టివాడని పరులు వచింప నేల! హరి లేనితలపులును హరి లేనిపలుకులును హరి లేని క్రియలును హరి లేనిసుఖములును వ్యర్థములు.

శా. "అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంథంబుల్ హరిభక్తివర్జితుల రిక్తవ్యర్థసంసారముల్.

అని ప్రహ్లాదకుమారుండు మాఱుపలికెను.

ఈసారి రాక్షసరాజు కోపము నాపుకొనజాలకపోయెను. కుమారుని ప్రత్యుత్తరముల కాతడు తోకత్రొక్కిన పామువలె నెగిరిపడబోచ్చెను. నెయ్యి పోసిన యగ్నిహోత్రమువలె మండిపడసాగెను. అతని రక్తనాళములయందు తీవ్రమగు వేడి పుట్టుచుండెను. కొంతసేపటివర కాతడు మాటలాడ లేకపోయెను. ఆగ్రహావేశుడై తుదకు కను లెఱ్ఱచేసి గురుకుమారులపై తీక్షణమగుదృష్టులు సారింపదొడగెను. గురుకుమారులు ఛాందసబ్రాహ్మణులు. చిరకాలమునుండి యసురేంద్రుల నాశ్రయించి పొట్టపోసికొనుచున్నవారు; వీరు చేతులు ముకుళించుకొని 'చిత్తము చిత్త' మనుటదక్క వేరొండువిధ మెఱింగినవారు కారు. ధైర్యము వహించి జవాబు చెప్పుట వారి కెంతమాత్రము చేతకాదు. చండామర్కులు గడగడలాడసాగిరి. ఏమికొంపమునుగునో యని లీలావతి భయపడుచుండెను. అపుడు తీవ్రమగు కంఠస్వరమున నయ్యాచార్యులతో "బ్రాహ్మణులారా ? ఇదియంతయు మీపని. పూజ్యుండగు శుక్రునికుమారులనియు రాక్షసవంశహితకరులనియు నమ్మి కుఱ్ఱవానిని మీకొప్పజెప్ప శత్రుసంకీర్తనము పూర్ణముగా వానితల కెక్కించినారు. విరోధిస్మరణమను విషము బాలకునిచే కడుపు

నింద ద్రావించిరి. మావలన జీవించుచు మాపై ద్రోహము తలచితిరి. మీరు విప్రులయ్యును దుర్మతులు. మీ రిట్టిదుర్జనులని కలలోనైనను తలంపనైతి" నని పురోహితుల తూలనాడ గడంగెను.

అకారణముగా, సహింపరానినిందలు తమపై బడినందులకు మిగులవగచి చండామర్కులు "రాజా! యూరక మమ్మిట్లు తూలనాడుట మీకు న్యాయము కాదు. మీపై ద్రోహ మూనినపాపమునకు మే మొడిగట్టలేదు. ఇంట తిని యింటివాసములు లెక్కించునంతటి కృతఘ్నులము కాము. బాలునినోట వెలువడిననూతనశాస్త్రము మే మెఱుగనే యెఱుగము. మాకే తెలియనిశాస్త్రము మేము వాని కెట్లు బోధింపగలము. హరియను రెండక్షరములు పొరపాటుననైన మేము జన్మము నెత్తినదాది యింతవరకు పలికియుండలేము. శ్రీహరిపై పెద్ద పెద్దయుపన్యాసముల నిచ్చుట మా కెట్లు సాధ్యమగునని మీ రెంచితిరి? ప్రభూ! ఇది యొకరుచెప్పినవిద్య కాదు. ఎట్లో కుమారునిహృదయమున జనియించెను. జనియించుటయేగాక నందు దృఢముగ పాతుకొనెను. ఇప్పుడైన నిరాశ జెందక తల్లివేరుతో పెరికివేయుటకు ప్రయత్నింతుము." అని వినయపూర్వకముగా మనవి చేసికొనిరి.

నిర్హేతుకముగ నిష్కాములగు నావిప్రులమీదపడిన నేరమునకు మిగుల విచారించి ప్రహ్లాదుడు "తండ్రీ! అన్యాయముగా నీ బ్రాహ్మణులను నిందించు టేల? హరియను రెండక్షరములే వీ రెన్నడు నుచ్చరింపలే దట—కాని వేదవిదు లట. వేదాంగములు కంఠోపాట మట. ఉపనిషత్తులు వీరికి క్షుణ్ణముగా తెలియునట. హరి నెరుగనిచదువు సువాసనలేని సుమమువలె నిష్ప్రయోజనము గదా. హరి నెరుగనిచదువు శ్రవణముల కింపు గూర్పనిసంగీత మట్లు నిరర్థకము. హరి నెరుగనిచదువు దీపములేనిగృహమువలె యంధకారబంధురము. హరి నెరుగనిచదువు శిరములేనిశరీరమట్లు నిష్ప్రయోజనము. హరియే ప్రాణికోటికి శరణ్యము. కష్టపరంపరలచే నిండియున్న యీసంసారసముద్రమునుండి దాటింపగలతెప్ప హరి. హరిభక్తి వీరు నాకు నేర్పినదికాదు. అది నేర్పిన వచ్చునది కాదు.

సీ. "మందారమకరందమాధుర్యమునఁ దేలుమధుపంబువోవునే మదనములకు?
నిర్మలమందాకినీవీచికలఁదూఁగు రాయంచ చనునె తరంగిణులకు?.

లలితరసాలపల్లవఖాదియై చొక్కు కోయిల సేరునే కుటజములకు ?
పూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక మరుగునే సాంద్రనీహారములకు ?
గీ. నంబుజోదరదివ్యపాదారవింద చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నిరతంబు చేరనేర్చు, వినుతగుణశీల ! మాటలు వేయు నేల !"
కావున, తండ్రీ ! మన మా శ్రీనాథును ద్దేశించి,

సీ. "నీరదాగమమేఘనిర్ముక్తనవ్యయః పానచాతకం బేగునే చాటిపడెకు ?
పరిపక్వమాకందఫలరసంబులుగ్రోలు కీరంబు చనునె దుస్తూరములకు ?
ఘనరవాకర్ణనోత్కలికమయూరము గోరునే కఠినరఘుల్లీరవంబు ?
గరికుంభపిశితసద్గ్రాసమోదితసింహ మరుగునే శునకమాంసాభిలాష ?
గీ. ప్రబిమలాకారభవదీయపాదపద్మ యుగసమాశ్రయనైపుణోద్యోగచిత్త
మన్య జేరునే తనకుపాస్యమ్ముగాక భక్తమందార ! దుర్భరభవవిదూర !"
యని పక్కువలె" ననియెను.

అనుటయు "ఛీ నోరు మూయుము. దుర్మతీ నీయుపన్యాసములను నుప దేశములను కట్టిపెట్టుము" అని తీవ్రముగా బలికి బాలకుని యావలకు ద్రోసి హిరణ్యకశిపుడు సేవకుల నుద్దేశించి "యీతని పెక్కువిధముల నొప్పించి యీ బుద్ధి మాన్పింపు" డని పలికెను. రాక్షసేశ్వరుని కంఠస్వరము దిక్కుల ప్రతి ధ్వనించెను. ఆగంభీరధ్వని విని 'మరలనీపలుగాకి దండెత్తుచుండెనా ?' యని దేవతలు భయపడ జొచ్చిరి. మునీశ్వరులు యోగనిద్రనుండి యులికిపడి లేచిరి. పర్వతగుహలనుండి గర్జించు సింహములు నలువైపులకు పరువులిడెను. రాజు కన్నులనుండి నిప్పుకణములు రాలుట విలోకించి శీఘ్రముగ భృత్యులు తమరేనికి సంతసంబుకూర్చుటకై, పిచ్చుకమీద బడుగ్రద్దలవలె లేడిపిల్లపై బడుపెద్దపులుల వలె, ప్రహ్లాదకుమారునిపై బడి యాతనిని బట్టుకొని యవ్వలకు గొనిపోయిరి.

ఉన్నతాభిప్రాయసిద్ధికై జీవనమును బలియొనరించునాత డాత్మసామ్రా జ్యము నందవలెను. చిత్తము నిజాత్మకు లొంగినయపుడు శరీరము మనసునకు లొంగియుండుట తప్పదు. కళ్లెముచే నేప్రక్కకు వలసిన నాప్రక్కకు దిరుగు గుఱ్ఱమువలె నింద్రియములు లొంగి, చిత్తము ననుసరించి తమపనుల నెరవేర్ప వలెను. ఈయింద్రియజయము సంపాదించుటకు, నీతిశాస్త్రజ్ఞానమును పరమేశ్వర తత్త్వజ్ఞానమును మానవునకు నవసరములు. వీని నలవరచికొనినవాడే యుత్తమ

పురుషుడు. మానవసులభములైన లోపములను సంస్కరించుకొని క్రమక్రమమున నట్టివాడు సంపూర్ణత్వము నొందజాలును. పూర్ణత్వము నందినవాడే యీశ్వర తుల్యుడు. దానంజేసి మహాత్ముడగుశంకరాచార్యుడు 'సోహం' (అతడేనేను) అని వచించెను. మహాయుద్ధమున విరోధులను జయించుటకంటె, నంతరంగమునందలి యారుగురుశత్రువులను జయించుట కష్టమనియు నట్లుజయించినవాడే వీరు డనియు సంపూర్ణత్వమును బడసిన పురుషపుంగవు డనియు సాఖ్యముని వచించెను. పెక్కు యుద్ధములందు శత్రువులను చంపి సామ్రాజ్యమును సంపాదించితిని, కాని లోని శత్రువులను జయింపజాలనైతిని. అట్లు జయించినక్రీస్తుమహాత్మునిక్రమోల తల వంచి నమస్కరించుచుంటి ననిమహావీరు డగునెపోలియను నుడివెను. తనతో తుల్యుడై తనను చేరగలుగుయీశక్తి యొక్క మానవునికిమాత్రమే పరమేశ రు డిచ్చియున్నాడు. కావున మానవజన్మ ముత్కృష్ట మని తెలిసినవారు చెప్పు చున్నారు. దీనిని తెలిసికొనజాలక ప్రపంచజీవితమునందలి యుత్తమాశయము గ్రహింపక సంచరించుమనుజుడు పశుప్రాయు డనుట కేమియు సందియము లేదు. ఇంద్రియములకు వశుడై చరియించువాడు మానవజన్మమును కోలుపోయి యధోగతిపా లగునని తెలుపుపురాణవాక్యము సత్యదూరము కాదు.

మానసికస్వారాజ్య మందినమహాపురుషుడు శరీరపీడనమునకు చలిం పడు. ధ్యానపరుడై యున్నప్పుడు శరీరసంబంధమగు బాధలు వానిని నొప్పింప జాలవు. దోమలు కుట్టిచంపుచున్నను కదలక గంగయొడ్డున తపోనిమగ్నుడై యున్న వివేకానందస్వామియందు యీయద్భుతశక్తి గోచరించినది. పెద్ద త్రాచుపాము శరీరమునంటి పోవుచున్నను నిశ్చలమానసుడై ధ్యానమున మునిగి కదలిమెదలకయున్న భారతసంయమియందు యీయద్భుతశక్తి కనుపించెను. చీమునెత్తుగులచే వృద్ధియైనవ్రణమునకు శస్త్రచికిత్సచేయుతరుణమున భరింపరాని దురంతమగు బాధ నెరుగక తదేకదృష్టి పరమేశ్వరుని ధ్యానించుచు నిలచిన 'ఆలీమహాత్ముని' (మహమ్మదున కల్లుడు) యందు దీయద్భుతశక్తి గోచరించినది. పాదమునందును యరచేతులందును కంఠమునందును కడుపునను నొసటను మేకులు కొట్టి దురాత్ములు మెల్లమెల్లగా ప్రాణములు తీయుచుండినవేళ, చిత్త మును దేవునియందు హత్తించి "జనకా! వారిని మన్నింపుము. తా మొనరించు నది యేమో వా రెరుగ"రని లోకజనకుని ప్రార్థించినమునిశ్రేష్ఠుడు ఏసునం

దీయద్భుతశక్తి గోచరించెను. ఈశక్తిమూలముననే భక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదుడు

ఉ. శూలములన్ నిశాచరులు స్రుక్కఁగ దేహము నిగ్రహింపఁగా
(బాలుఁడు) నేలపైఁ బడఁడు పాఱఁడు చావఁడు (తండ్రినైన నా
పాలికి వచ్చి) చక్రధరుపక్షము మానితి నంచు పాదముల్
ఫాలము సోఁక మ్రొక్కఁ డనపాయత నుండుట కేమి హేతువో.

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు బావురు గొడ్డఁడు బంధురాజిలోఁ
దూఱఁడు ఘోరకృత్యమని దూఱఁడు తండ్రిని మిత్రవర్గముం
జీరఁడు మాతృసంఘమువసించు సువర్ణగృహంబులోనికిం
దాఱఁడు కావరే! యనఁడు తాపము నందఁడు కంటగింపఁడున్.

చ. పలువురు దానవుల్ పొడువ బాలుని దేహము లేశమాత్రమున్
నొలియదు లోపలన్ రుధిర ముబ్బదు కందదు శల్యసంఘమున్
నలియదు దృష్టివైభవము నష్టముగాదు ముఖేందుకాంతియున్
బొలియదు నూతనశ్రమము పుట్టదు పట్టదు దీనభావమున్.

ఉ. తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుడు మాటిమాటికో
పన్నగశాయి! యోదనుజభంజన! యోజగదీశ! యోమహా
పన్నశరణ్య! యోనిఖిలపావన! యంచు నుతించు గాని తా
గన్నుల నీరు దేఁడు భయకంపనమేతుఁడుగాఁడు భూవరా!

ఉ. బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధువు లోకమాన్యసం
శీలుఁడు వీఁ డవధ్యుఁడని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములన్ తదంగముల సుస్థిరులై ప్రహరించి రుగ్రవా
చాలత నందఱున్ దితిజశత్రుఁడు వల్దనఁడయ్యె నత్తఱిన్.

ఆప్రకారముగా దనుజపతిసేవకులు ప్రహ్లాదు నవ్వాలకు గొనిపోయి యెంత నొప్పించినను చలింప కుండుటగాంచి, రాక్షసరాజు మిక్కిలి కోపోద్దీపితుఁడయి,

సీ. ఒకమాటు దిక్కుంభియూథంబు దెప్పించి కెరలి డింభకుని ద్రొక్కింపఁబంపు
నొకమాటు విషభీకరోరగశ్రేణుల కడువడి నర్భకు గఱవ బంపు
నొకమాటు హేతిసంఘోగ్రానలములోన విసరి కుమారుని వేయ బంపు
నొకమాటు కూలంకషోల్లోలజలధిలో మొత్తించి బాలకు ముంచ బంపు

గీ. విషము బెట్ట బంపు విదళింపగా బంపు దొడ్డకొండచెరుల ద్రోయ బంపు
బట్టి కట్ట బంపు బాధింపగా బంపు బాలు గినిసి దనుజపాలు డధిప.

సీ. ఒకవేళ నభిచారహోమంబు చేయించు నొకవేళ నెండల నుండబనుచు
నొకవేళ వానల నుపహతి నొందించు నొకవేళ రంధ్రంబు లుక్కబట్టు
నొకవేళ తనమాయ నొదవించి బెదరించు నొకవేళ మంచున నొంటినిలుపు
నొకవేళ పెనుగాలి కున్ముఖు గావించు నొకవేళపాతించు నుర్వియందు

గీ. నీరు నన్నంబు నిడనీక నిగ్రహించు గళల నడిపించు రువ్వించు గండశిలల
గదల ద్రేయించు వేయించు ఘనశరముల కొడుకు నొకవేళ నమరారి క్రోధి
యగుచు.

ముష్టిఘాతమ్ములచే నొప్పించినను నంచలింపక పదునైనకత్తులచే పొడిపించినను జంకక పాములచే కరపించినను భయమునొందక, యేమ్ములచే గ్రుచ్చినను బాధనొందక, నిప్పుగుండముల ద్రోయించినను విచారింపక యేనుగులచే ద్రొక్కించినను జంకక సముద్రములో పారవైచినను మనోనిశ్చయమును పోగొట్టుకొనక భూమిలో పాతిపెట్టించినను భక్తిజనితమందహాసము విడువక నవరంధ్రములు మూసివేసినను హరిస్మరణము మానక యున్న ప్రహ్లాదుని గాంచి మిగుల నబ్బురముచెంది యాతనియం దేదో మహాప్రభావ మున్న దని దైత్యస్వామి తెలిసికొనెను. కాని యంతరంగమున తోచినయీపాటి జ్ఞానమును తోడనే యణగిపోయెను. ప్రహ్లాదుని పట్టిపల్లార్పవలయు ననియే యాతడు గట్టిపట్టుపట్టెను. కాని కఠినమగు దండనములు పనిచేయ వనియు కులగురువగు శుక్రాచార్యుడు బాలకునిమనస్సు త్రిప్ప సామర్థ్యము గలవాడనియు చండామర్కులు వచియింప గురుదేవుని రప్పించి వినయముతో నిశాచరవల్లభుడు వానికి మ్రొక్కి "ఆచార్యా! తులసివనమున గంజాయిమొక్క మొలచినట్లు రాక్షసవంశమున ప్రహ్లాదుడు పుట్టెను. త్రిమూర్తులనుసైతము గడగడలాడించి త్రిలోకముల జయింపజాలు నాగర్భమున భీరుడును విరోధివర్గసంస్తవ కుశలుండును నగుకొడుకు పుట్టెను. మహాత్మా! నీయద్భుతప్రజ్ఞచే వీనిమనస్సు త్రిప్పి నావిచారమును దూరముచేయు" మని వేడికొనెను.

రాజునాజ్ఞ శిరసావహించి ప్రహ్లాదుని దోడ్కొనిపోయి ఆచార్యుడు వానికి రాక్షసోచితవిద్యలు నేర్పెను. కాని యావిద్యలు బాలునిమనస్సున

కక్కలేదు. ఎప్పటియట్లు విష్ణుసంకీర్తనము సలుపుచు ప్రహ్లాదుడు తోడిబాలురకుకూడ హరిభజనము నేర్పదొడగెను. అది గాంచి శుక్రుడు కోపగించినవాడై బాలకునిచర్య తండ్రి కెఱింగించెను. దైత్యపతి యాగ్రహావేశుడై కుమారుని జూచి "దుర్మతీ! ఎంత బోధించినను నీధోరణి మానవైతివి. ఏలోకమునందైన నా కెదురాడువారు లేరు. హరిగాని గిరిగాని నన్ను మార్కొన సాహసింపలేదు. ఇక నూరక నీ విల్లు మిట్టిపడ నేల" యనెను. "జనకా, యింట గెల్చిగదా రచ్చ గెలువవలయును. భువనములన్నియు నరచేత పట్టితి నందువుకాని యనవరతము నీయంతరంగమున పుట్టి నిన్ను పీడించు శత్రువులను పట్టజాలకుంటివి. ధర్మమునకు నీరువదలితివి. సత్యమునకు దూరుడవైతివి. క్రోధమునకు లొంగిపోతివి. నశించుస్వభావముగల యీశరీరమును వీడునపుడు యీపేరు ప్రఖ్యాతులును నీయైశ్వర్యములును నీమహారాజ్యమును నీవెంట రావు. నీ కర్మయే నిన్ననుసరించును. నీ వాచరించుధర్మమే నీకు సాయ మగును. నీసత్ప్రవర్తనమే నీకు బాసట యగును. ఇకనైన నాత్మవిజయము నొంద ప్రయత్నింపుము. ఈయద్భుతవిజయమును సులువుగా చేకూర్చునది హరిభక్తి. శ్రీహరి సంకీర్తనమే నీకు మోక్షము నొసగును. శ్రీహరియే ముల్లోకములకు అధినాథుడు" అని ప్రహ్లాదుడు నిర్భయముగా బలికెను.

నిప్పులుత్రొక్కినకోతికి పిశాచము పట్టినట్లు ప్రహ్లాదునివాక్కులు తండ్రి చెవులకు ములుకులై హృదయమునకు శూలములై యాతనియాగ్రహమును హెచ్చించెను. దేహము తెలియక పండ్లుకొఱుకుచు దండతాడితభుజగమట్లు లేచి తనయునిపై కురికి "పలుగాకీ! త్రిభువనములకు నేనే యధినాథుడనై యుండ శ్రీహరియెవరో వేరుగా నున్నాడని ప్రేలుచుంటివి. ఆతనిపరాక్రమ మెట్టిదో పరీక్షింతుగాక ? వా డెందుండెనో చూపుము. నిన్నును వానినిగూడ నిముసమున సంహరించెద" నని కణత లదుర హిరణ్యకశిపు డనెను.

ప్రహ్లాదునిసంతోషమునకు మేర లేకుండెను.

"జనకా! శ్రీహరి యెల్లతావులను గలడు. ఇందు నందననేల! కన్నెత్తి చూచిన నతడు గోచరించును. ఆగ్రహాంధకారమున బడి యాతని నవలోకింపలేకుంటివి. ఒకసారి కన్ను విచ్చి చూడుము. ఏల నన,

మ. "కలఁ డంబోధి గలండు గాలి గల డాకాశంబునన్ కుంభినిన్
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోతచంద్రాదులన్,
గల డోంకారమునన్ త్రిమూర్తుల త్రిలింగవ్యక్తులం దన్నిటన్
గల డీశుండు గలండు తండ్రి ! వెదకంగానేల యీ యాయెడన్."

క. "ఇందు గల డందు లే డని సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన నందందే గలడు దానవాగ్రణి వింటే."

అని మహానందమున నృత్య మొనరించుచు కుమారుడు తండ్రికి ప్రత్యుత్తర మిచ్చెను.

నిప్పుపై నేయిపోసిన ట్లీమాటలు దనుజేంద్రునికోపమును వృద్ధిచేసెను. గ్రుడ్లెఱ్ఱచేసి యాతడు,

"హరి యెల్లచోటులం దుండుచో నీ స్తంభమున చూపుమని తీవ్రవేగమున సభామంటపమందలి స్తంభముపై బలముకొలది చఱచెను.

తోడనే యా స్తంభము పెళపెళ విరిగెను. అగ్నిపర్వతబిలమునుండి వెలువెడునగ్నివోలె యందుండి యుగ్రమూర్తియగు నరసింహుడు క్రోధాగ్నికణములు రాల్చుచు వెలువడెను. అట్టిభయంకరాకారము నట్టిభీకరస్వరూపము గాంచినంతనే రాక్షసరాజునకు గుండె లదరెను. తలతిరిగెను. నాడులు చల్లపడెను. కాయము వణకెను. కాని నిముసములో నిలువరించుకొని పరిపూర్ణప్రజ్ఞుడగు తన కావికారజంతు వెంతయని గర్వించి, దైత్యపతి గద చేబూని నరసింహు నెదుర్కొనెను. అంకట,

"సీ. పంచాననోద్ధూతపావకజ్వాలలు భూనభోంతర మెల్లఁ బూరితముగ
దంష్ట్రాంకురాభీలధగధగాయితదీప్తి నసురేంద్రునేత్రము లంధములుగఁ
గంటకసన్నిభోత్కటకేసరాహతి నభ్రసంఘము భిన్నమై చలింపఁ
బ్రళయాభ్రచంచలాప్రతిమభాస్వరములై ఖరనఖరోచులు గ్రమ్ముదేరఁ

గీ. నటలు జళిపించి గర్జించి సంభ్రమించి దృష్టి సారించి బొమలు బంధించి కెరలి
జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసిపట్టె నరసింహు డాదితిపట్టి (నధిప)"

అట్టు లొడిసిపట్టి తొడపై కూలవేసెను. మానవుడును మృగమునుగాని నృసింహుడు, పగలును రాత్రియుగాని సంధ్యాకాలమున, భూమియు నాకసమునుకాని యొడియందు, బహిరంగమును నంతరమునుగాని సభాద్వారమున

ప్రాణవంతమును ప్రాణహీనమునుకాని వాడియైనగోళ్లచే త్రిలోకకంటకుడగు నీచరక్కసునియుదరము చీల్చి పుష్పహారములవలె నతనిప్రేవులు తనమెడ పైవేసుకొనెను. ముల్లోకములు జయించిన బలవంతుడగు రాక్షసేశ్వరుని చావునకు కుపితులై యసురులు నరసింహుని నెదుర్కొనిరి. కాని యగ్గిలోబడి బుగ్గియగుమిడుతలవలె వారు క్షణములో శ్రీహరిక్రోధానలమున మాడిపోయిరి. నరసింహుని భీకరాకారమును గాంచి, ముల్లోకములు భీతిల్లెను. దేవతలు కంపించిరి. మునీశ్వరు లాశ్చర్యము నొందిరి. లక్ష్మీదేవి ప్రాణపతిని చేర భయము చెందెను. "భక్తవరా! నీమాహాత్మ్యముమూలమున శ్రీమన్నారాయణు డీభీకరరూపము ధరించెను. నీవే శ్రీహరిని ప్రసన్నుని గావించి యాతని కోపము త్యజించునటు లొనర్పు" మని దేవతలు ప్రహ్లాదుని వేడిరి. వేడుటయు నామహాభక్తుడు,

మ. తపమున్ వంశము తేజమున్ శ్రుతము సౌందర్యంబు నుద్యోగమున్
నిపుణత్వంబు బ్రతాపపౌరుషములున్ నిష్ఠాబలప్రజ్ఞలున్
జపయోగంబులు చాల నీశ్వర! భవత్సంతుష్టికై దంతియూ
ధపుచందంబున భక్తి సేయవలయున్ దాత్పర్యసంయుక్తుడై.

మ. అమలజ్ఞానత దానధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర
త్వములన్ యజ్ఞతపోనసూయల గడున్ దర్పించుధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుడు మనోర్థప్రాణవాక్కర్మముల్
నమతన్ నిన్ను నయించెనేని నిజవంశశ్రీకరుం డౌ తుదిన్.

అని శ్రీహరిని స్తుతియింపసాగెను.
నృసింహమూర్తి కోప ముడిగి బాలకా!

శా. సంతోషించితి నీచరిత్రమునకున్ సద్భద్రసంయోగాకర నీ
యంతర్వాంఛితలాభ మెల్ల గరుణాయుక్తుండనై యిచ్చెదన్
జింతన్ జెందకు, భక్తకాముడన నే సిద్ధంబుదుర్లోకవ్యాడన్,
జంతుశ్రేణికి నన్ను జూచిన బునర్జన్మంబు లే దర్భకా!

గీ. సకలభావములను సాధులు విద్వాంసు లఖిలభద్రవిభుడ నైననన్ను
గోర్కు లిమ్మటంచు గోరుదు రిచ్చెద గోరు మెద్దియేని గుణ్య! నీవు.

అని యాతనిని పరీక్షించుటకయి నృసింహమూర్తి యడిగెను. కోరిక లపేక్షించుటకు ప్రహ్లాదుడు సామాన్యమానవుడు కాడు. కోరికయే సర్వదుఃఖ కారణమని యామహాత్ముఁ డెఱుఁగును. కోరిక వీడిననో నిర్వాణ మందజాలునని బుద్ధదేవుడు వచించెను. ధనముకాని కీర్తికాని భూలోకసంబంధమగు దేనిని గాని కోరుమానవుడు సుఖమునకు దూరమగును. అతనికోరికలే, మోక్ష మార్గమున నడువఁబోవు వానికాళ్ళకు సంకెళ్ళగును. మానవుని వాంఛయే యెల్లపుడు నాతని పెనవైచి పీడించు త్రాచుపా మగును. కావుననే ప్రహ్లాదుడు

“మహాత్మా! నే నేమియు కోరను. నిరంతరము నామానసమనెడు తుమ్మెద నీదివ్యనామమధువును గ్రోలఁగలుగున ట్లాశీర్వదింపు” మని శ్రీహరికి ప్రణమిల్లెను. వాంఛారహితుడగు నబ్బాలునిపవిత్రబుద్ధికి మెచ్చి “బాలకా! ఇహలోకమున నీకర్తవ్యమును గుర్తింపుము. నాయెడ భక్తిగలిగియు తోడి వారలకు సద్బోధ మొనరించియు మన్వంతరకాల మవని నేలి పిమ్మట నాయం దైక్యము గొ”మ్మని శ్రీహరి పలికెను. “దుర్వారగర్వాంధకారమున నొడలు తెలియక నీకు విరోధియై నాజనకుడు నీచే చంపబడెను. పరమాత్మా! యాతనికి ముక్తి దయసేయు” మని ప్రహ్లాదుడు కోరగా,

“వత్సా! నీజనకుడు నావలన మరణించుట ముక్తినొందుటకే.”

“సీ. ఘనసూక్ష్మభూతసంఘాతంబులోపల నెల్లవాంఛలు మాని యెవ్వరయిన
నీచందమున నన్ను నియతి సేవించిన మద్భక్తులగుదురు మత్పరులకు
గురిసేయ నీవ యోగ్యుడ వైతి విటమీద వేదచోదితమైన విధముతోడ
జిత్తంబు నామీద జేర్చి యీతండ్రికి ప్రేతకార్యములు సంప్రీతి జేయు
గీ. మతఁడు రణమున నేడు నాయంగస్పర్శనమున నిర్మలదేహుడై నవ్యమహిమ
నపగతాఖిలకల్మషుడై తనర్చి పుణ్యలోకంబులకు నేగు పుణ్యచరిత!”

యని బాలకునితో పలికి యాసంక్షోభమున కంతకును మూలకారణుం డగు బ్రహ్మను మందలించి శ్రీహరి నృసింహావతారమును చాలించెను.

ప్రహ్లాదుడు ప్రజారంజకముగా పుడమి పాలించి మహనీయగుణగరిష్ఠుడై నిరంతరవిష్ణుభక్తితత్పరుడై మెలగి యనంతరము శ్రీమన్నారాయణుని చేరుకొనెను.

౮

# కుచేలుడు

.....o.....

చ. జలనిధికన్యకాఘనకుచస్థలిపచ్చలతాళి, గోపికా
విలసితహారనీలమణి విశ్వజగద్వలయప్రకాశకో
జ్జ్వలమహనీయరత్న మనివారితకాళియభోగిభోగమం
డలగిరివజ్రమై వెలయునందకుమారు భజింతు నామదిన్.

మనుజసంబంధము విడిచి యొంటరియై వసియించు పురుషుండు మహాత్ముడైన గావలయును దురాత్ముడైన గావలయునని మహావిద్వాంసు డొకడు వాక్రుచ్చియున్నాడు. తోడిమానవులతో కలసి భోగభాగ్యములు సుఖదుఃఖములు ననుభవించుటయందు మానవుడు సహాయపడవలయుననియే సృష్టికర్త యుద్దేశము. ఇతరులమాటలు వినుటకు వీనులను యితరులకు చెప్పుటకు నాలుకయు మానవున కొసంగెనుగాని తమలో తాము మాటలాడుకొనుటకు కాదు గదా. స్వప్రయోజనము కాంక్షించి పరుల నుపేక్ష చేసి సంఘసంపర్కమునకు దూరముగా కుమతులు సంచరింతురు. పరమాత్మతో సఖ్యము నపేక్షించి సంసారమును వీడి మహాపురుషులు సంఘసంపర్కమును త్రుంపివేసికొందురు. కావున మహాత్ములున్ను దురాత్ములును సంఘమునకు దూరగులై యుందురను మాట వాస్తవము.

కాలచక్రము తిరుగుచుండుకొలది భావములు మారుచుండును. సంఘజీవనము త్యజించి, ఆత్మముక్తి సభిలషించుసన్యాసి తనశ్రేయస్సు కోరినవాడే. ఆతడు పరోపకారపారీణుడు కానందున పురుషశ్రేష్ఠుడు కానేరడు అనియు జనసముదాయమునందే సంఘసంపర్కమున వసియించుచు పరార్థజీవనము సలుపువాడు మానవమాణిక్యమనియు కొందఱు మహాపురుషులు వచించిరి.

పరులముక్తికై నరకకూపమునందైన దూకుదునని యొక మహాత్ముడు పలికెను. పరోపకారమునిమిత్తము జీవనమును గడపుటకు సంఘమే తగినరంగము. ఈపవిత్రసంఘక్షేత్రమును పరిత్యజింపవలదనియే శ్రీకృష్ణపరమాత్ముడు మానవుల నుద్దేశించి గీతలయందు నుడివెను.

మానవులు పరస్పరభావనమ్మేళనమే వారిని సంఘముగా నుంచు మహాసూత్రము. మానవకుటుంబమంతయు నొకపెద్దసంఘము. ఇట్టి కుటుంబక్షేమమును గోరు మహాత్ములు సదుగా పుట్టుచుందురు. నిష్కామకర్తవ్యమాహాత్మ్యమును పరార్థజీవనపటుత్వమును బోధించి మనుజలోకమును రక్షించుటకయి శ్రీకృష్ణభగవానుడు భూలోకమున నవతరించెను.

శ్రీకృష్ణుని కృపకు పాత్రులైనవారిలో కుచేలు డగ్రగణ్యుడు. వీరిరువురును చిన్నతనమున సహపాఠులు. సాందీపు డను గురువునొద్ద విద్య నభ్యసించినవారు. మేనులు రెండును ప్రాణ మొకటిగ సంచరించినవారు. ఒక కంచమున దిని యొకమంచమున పరుండి సుఖదుఃఖములను సమముగా ననుభవించుచు నీరక్షీరన్యాయమున ప్రవర్తించినవారు. విద్యాభ్యాసమును బ్రహ్మచర్యమును ముగిసినపిదప నొండొరుల వీడి స్వగ్రామముల జేరిరి.

కుచేలుడు గర్భదరిద్రుడు. గురుకటాక్షమున విద్య నభ్యసించి పిమ్మట గృహస్థాశ్రమమున ప్రవేశించెను. కుచేలుని విద్య దినదినాభివృద్ధియైనట్టులు వారి యింటపుట్టిన దరిద్రదేవతయు దినదినాభివృద్ధియే చెందుచుండెను.

"మృతినొందినజనునైనను హితు లెల్లరు డాయుదురు మహీస్థలిలోనన్
మతిఁ దలఁపఁ బేదఁ జేరరు ఒతిమాలిననైన సఖులు బంధుగు లెప్పుడున్."

దారిద్ర్యమువలన సిగ్గు జనించును. సిగ్గువలన సత్యము శిథిల మగును. సత్యహీనతచే తిరస్కారు డగును. తిరస్కృతివడసినవా డగుటచే భీతి చెందును. భీతిచెందినవాడగుటచే ననేకకష్టములపాలగును. కష్టములచే దుఃఖితు డగును. దుఃఖియగుటచే నశించును. పేదరికముకంటె పృథివిలో మానవులకు కష్టము లేదు. బంధువులును దారాదిపుత్రులేకాదు దరిద్రుని దేహమందలి రక్తమాంసములునునతని విడిచిపోవును, దరిద్రులయం దగ్రగణ్యుడగు కుచేలునికి దరిద్రునకు బిడ్డ లెక్కువయను నట్లు సంతానవృద్ధి యగుచుండెను. అయినను తనలేమికి తాను పరితపింపక నిరంతరము భగవత్సేవాపరాయణుడై యెట్లో కాలక్షేపము చేయుచుండువాడు. అతనిసతీమణి తనచెంతకు వచ్చి ధారిద్ర్యదుఃఖమును వెల్లడించునపుడెల్లను మాత్రము "సాధ్వీ! భూతలమందలి పాపములను రూపుమాపి దుష్టజనశిక్షణము శిష్టజనరక్షణము గావించుటకు శ్రీమన్నారాయణుడు శ్రీకృష్ణునిరూపమున నవతరించెను. ఆమహాత్ముని బాల్యస్నేహితుడను. నహా

పాలిని. అత డర్థిజనకల్పవృక్షము. పరమదయానిధి.” అని యేవియోమాటలు చెప్పచుండువాడు. కాని యావట్టియూరడింపుమాటలచే నామెనంతాపాగ్ని చల్లారుచుండెడిదికాదు. ఎందుండియో కష్టపడి కుచేలుడు తెచ్చిన కొద్దిపాటి బియ్యము నడుకవేసి ‘యాకలి యాకలి’ యని యేడ్చుబిడ్డల కర్ధాకలిగా పెట్టి తాము నిరశనులై తరుచు కాలము పుచ్చుచుండిరి. ఇట్లర్ధాశనలు నిరశనలు నగుటచే నంతకంత కింటనందరును శల్యావశిష్టజీవులైరి.

ఇట్లుండ నొకనాడు, చిక్కి శల్యమై చినిగినవస్త్రముల గట్టుకొని నడయాడుచున్న ప్రాణపతిని గాంచి యతనియర్థాంగి “చిన్ననాటిమిత్రుడనియు కరుణాతరంగుడనియు శ్రీమన్నారాయణుని యవతారమనియు శ్రితజనమందారమనియు శ్రీకృష్ణునిగూర్చి పలుకుచుందురుగదా! అజచేత వెన్న బెట్టుకొని నేతికై దేవులాడుట తగునా? మీ రాప్రాణస్నేహితునికడ కరిగి మీ యాదారిద్ర్యబాధ తొలగింపుమని యాతనిని వేడుకొనరాదా” యనెను. ఆమాటలకు సంతసించి సతియుపదేశము సమంజసముగా నున్నదని గ్రహించి, సమ్మతించి వట్టిచేతులతో నామహాత్మునికడ కరుగుట యెట్లని తలపోయుచుండ నాతనియిల్లాలు కొంచెమడుకులు గొనివచ్చి యతని చినుగులయుత్తరీయము కొంగున ముడివైచి వెడలిరమ్మని పలికెను. అంతటనతడు బయలుదేరి, దారిలో “ఈచినిగిపోయినవస్త్రములతో యీమాసినగడ్డలతో యీశల్యావశిష్ట దేహముతో దరిద్రదేవతకు పుట్టినిల్లగు నేను, ఆగర్భశ్రీమంతుడగు శ్రీకృష్ణునికడ కరుగు టెట్లు ; నాదుఃస్థితి నాకే యసహ్యాకరముగా నున్నపుడు పరుల కేహ్యముగా నుండకుండునా? అకటా! నే నారమ్యభర్మహర్మ్యము ప్రవేశించు టెట్లు” అని తలపోయసాగెను.

మానవుని వేషభాషలవలన నతనితత్వము తెలియుననుగుని యాంగ్లేయులలో నొకవాడుకమాట కలదు. పైకి డాంబికముగా వేషమువేసి హృదంతరాళమున ద్రోహస్వభావము కలవారును ; పైకి సామాన్యవేషము ధరించి లోపల నుత్కృష్టభావము గలవారును లేకపోలేదు గాని తరుచుగా వేషభాషలు నిజస్థితిని వెల్లడిచేయునవియే అయి యుండును.

ఇట్లు వితర్కము చేసుకొనుచు, తనదీనదశ తనను వెనుకకు లాగుచుండ కృష్ణునితో తనకుగలిగిన బాల్యస్నేహబలము ముందుకుత్రోయుచుండ నెట్టెట్లో

ముందునకు సాగుచుండెను. ఇట్లు ప్రయాణమునం దంతటను నతడు శ్రీకృష్ణ ధ్యానముతోడనే యుండెను. చిత్తము నన్యాయత్తము గాకయే నడచుచుండి నంతవట్టును కృష్ణునినే ధ్యానించుచుండెను. దుఃఖమునుండి చిత్తమును మరలించుటయందు సామర్థ్యము కలది, యేకాగ్రత; దుశ్చింతలనుండి మనస్సును మరల్ప గలిగినది యేకాగ్రత. ఈ యేకాగ్రదృష్టిసంపాదనమునకే మానవులు నిర్జనప్రదేశముల కరిగి భగవద్ధ్యానపరు లయి జడదారులై నిష్కల్మష హృదయు లగుచుందురు. దుర్భరదారిద్ర్యదుఃఖబాధనుండి కుచేలుని రక్షింప గలిగిన దీయేకాగ్రచిత్తమనుదివ్యౌషధము. ఈయేకాగ్రచిత్తము మనోదార్ఢ్యము నిచ్చును. మనోదార్ఢ్యము లేనినాడు మానవుడు దుఃఖాక్రాంతు డగును దుఃఖభారమున నున్మాదము సంభవించును; ఉన్మాదావస్థ యేమి చేయించినను చేయించును. మనస్సున కేదేనియిక్కట్టు తట్టినపుడు కుచేలుడు శ్రీకృష్ణుని మనంబున దలచుకొని చిత్త మేకాగ్రము చేసుకొనుచుండువాడు. ద్వారకానగరమునకు పోవుచు మార్గమధ్యమున నతడు నిరంతరము శ్రీకృష్ణధ్యానమే చేయుచుండువాడు. మనస్సంతయు కృష్ణభావముచేనిండుకొనుటచే యెల్లకడలు కృష్ణుడు నమై యున్నట్లాతనికి పొడకట్టెను.

బాహ్యాభ్యంతరములసంబంధ మద్భుతమైనదికదా! మానవుడు తొలుత వసించుట నిజాంతరంగమందు గాని తాను చరించు బాహ్యప్రపంచమున కాదు. అతని మానసికప్రవృత్తు లెటులుండునో బాహ్యప్రపంచముకూడ అటులే యుండును. కామిలరోగికి జగమంతయు పచ్చగా కనపించును. మంచివానికి జగమంతయు మంచిగానే తోచును. పూర్వకాలపుఆర్యుడు అద్భుతభక్తిరసము హృదయమున నిండియుండ సూర్యునిదెస మొగంబై పరమసంతోషమున నృత్యము చేయుచుండువాడుగదా. హృదయపాత్రమున భక్తిరస ముప్పొంగినపుడు తన్ను దాను మఱచి రామకృష్ణపరమహంస యనంతసంతోషతరంగములయం దీదులాడువానివలె దక్షిణేశ్వరప్రాంతమున నత్యానంద మందుచుండువాడు గదా! అట్లే శ్రీకృష్ణునిపై దృష్టినిలిపినకుచేలునికి జగమంతయు కృష్ణమయమై కనపట్టుటయం దాశ్చర్య మేమున్నది?

ఇంతలో శ్రీకృష్ణుడు పత్నీపరివృతుడై హంసతూలికాతల్పశాయియై కుచేలుని తపఃఫలమో యన వానికన్నులయెదుట ప్రత్యక్ష మాయెను. ద్వార

పాలకులయడ్డము లేక విచిత్రాలంకారశోభితమగు నాగృహములోనికి తా నెట్లు ప్రవేశింపగలిగెనో కుచేలు డెఱుగడు. ధూళిధూసరితాంగుడై చినిగినగుడ్డలు ధరించినవాడై తా నారమ్యసౌధాంతరము చొచ్చినందులకు సిగ్గుపడినవాడై తల వంచుకొని వెనుకకు మరలుచున్న కుచేలుని గాంచి యానవాలు పట్టి శీఘ్రముగా పానుపు దిగి తొట్రుపాటుతో ముందునకు వచ్చి చిఱునవ్వుతో సంతోషితచిత్తముతో హితుని కౌగలించుకొని "నీరాకనాగృహము పావనము చేసినది, నీదర్శనము చిన్ననాటి యానందదర్శనము. నీకు కుశలమా! నీ యర్థాంగియైన సీమంతినీచూడామణి క్షేమమా? నీ నిసుంగులు సుఖులా?" అని యల్లన నతని తనతల్పము చేరిచి బంగారుపళ్లెరమున నాతనిపాదముల నునిచి రుక్మిణీదేవి పైడిచెంబుతో నీరము పోయ పాదములు కడిగి మిత్రచరణ సరోజసలిలము శిరస్సున జల్లుకొని పాదములు తడియొత్తి పిమ్మట చందనాదులచే నతని సత్కరించి మల్లికాదిపుష్పదామములచే నాతనికంఠ మలంకరించి మణిదీపములచే హారతి యిచ్చి సత్యభామ యాభూసురోత్తమున కతిభక్తి వినర భగవంతుండగు శ్రీకృష్ణుడు నిరుపేదయగు కుచేలుని బహుభంగుల బహూకరించెను.

అభాగ్యులను దారిద్ర్యపీడితులను క్రీగంటనైన చూడనివా రనేకు లెందరున్నారు. ఐశ్వర్యముతో తులతూగి వేషభాషలం దాఱితేరి, దుర్వారగర్వమున నొడలెఱుంగనివారికే గదా సాధారణముగా ప్రపంచమున గౌరవము చేయుదురు. మహితగుణగరిష్ఠులు పూజించునది పేదరికము యడకువ తాల్మి గాని సంపదలు కావు. పరమేష్ఠియగు కృష్ణుడు పుట్టుపేదయగు కుచేలునికి నమస్కరించి యీయమోఘసత్యము లోకమునకు తెలియజేసెను. మనుష్యులకును కిన్నరులకును గంధర్వులకును పూజనీయుమగు మస్తకము గుణవంతుడగు దరిద్రుని పాదపద్మములకు నమస్కరించెను. తన్ను దేవతలు పూజించునట్లే యాతడు కుచేలుని పూజించెను. కావుననే యామహాదృశ్యము విలోకించిన పట్టపురాణులు,

ఉ. ఏమితపంబు జేసెనొకొ యీధరణీదివిజోత్తముండు తొ
ల్బామున యోగివిస్ఫురదుపాస్యకుడై తనరారు నీజగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించియున్నవా
డీమహనీయమూర్తి కెనదే మునిపుంగవు లెంతవారలున్.

చ. తనమృదుతల్పమందు వనితామణియైన రమాలలామ పొం
దును నెడగా దలంపక యమ్రపవరుం డెదురేగి మోదముం
దనరఁగ కౌగిలించి యుచితక్రియలన్ పరితుష్టు చేయుచున్
వినయమునన్ భజించె ధరణీసురు డెంతటి భాగ్యవంతుడో.

మ. పరికింపన్ మృదుహంసతూలికల నవ్యాజానురాగంబునన్
గరమొప్పారఁగ కౌగిలించియును సత్కారంబుగావించి మిం
చి రమాసుందరిపొందునైన నెడగా చింతింప కార్ష్ణుఁ డా
గురుచక్రాయుధు డాదరించె ద్విజముఖ్యుం డెట్టిపుణ్యాత్ముఁడో!"

యని యబ్బురపడజొచ్చిరి.

బాల్యమిత్రుడు యెదుట కూర్చుండగా కృష్ణునిహృదయమున, జరిగిన వృత్తాంతములు స్మృతికి వచ్చెను. "సోదరా! మనిద్దరమందరను విడిచిపెట్టి గురుదేవుని ప్రశంస పొందుటకు పందెమునైచికొని శ్లోకములను పద్యములను యెట్లు వల్లించెడువారమో జ్ఞాపకమున్నదా? పగలంతయు చదివి చదివి ఆచార్యునిసెల వడిగి నదియొడ్డునకు పోయి ప్రకృతిసౌందర్యములు గాంచి పక్షుల గానములు వీనులార వినుచు సంధ్యాకాలమందు ఆకాశమునందలి వివిధవర్ణములు నదిలో ప్రతిఫలింప కనుగొనుచు మనము ప్రొద్దుపుచ్చుచుండు విషయములు జ్ఞప్తికి వచ్చెనా?

చ. "అరయఁగ దాగులింతలను నాడెడివేళల నీవు దొంగవై
సరిచెలికాండ్ర నంటికొనజాలక కన్నుల బాష్పధారలన్
గురియుచు భగ్నచిత్తమున క్షోభము నొందగ తోడివారలున్
బరిపరిరీతి హాసముల బల్కెడివా రది జ్ఞప్తియున్నదే?

ఒకనాడు గురుపత్ని వనమునకరిగి వంటకట్టెయలు తెండని నియోగింప నామె శాసనము శిరసావహించి వనమున కేగ,

సీ. "ఘుమఘుమారావసంకుల ఘోరజీమూతపటలసంఛన్నాభ్రభాగ మగుచు
జటులఝంఝూనిలోత్కటసముద్ధూతనానావిధజంతుసంతాన మగుచు
జడదిగ్వేదండతుండనిభాఖండవారిధారాపూర్ణవసుధ యగుచు
విద్యోతమానోగ్రఖద్యోతకిరణజిద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు

గీ. అడరి జడి గురియగ నిను డస్తమింప భూరినీరంధ్రనిబిడాంధకార మేచి
సూచికాభేద్యమై వస్తుగోచరంబుగానియట్లుండ మనము నవ్వాన దడిసి
గీ. బయలు గొందియు బెనుమిట్టు పల్లమంబురహితసహితస్థలంబు నేర్పరుపరాక
యున్నయత్తఱి మనము నొండొరులచేతులూతగా గొని నడచుచు నుండు
నంత."

మఱునాడు గురుసతి మనల వెదకుచు వచ్చి మాయవస్థకు మిక్కిలి విచారించుచు గురుసేవాధురంధరులమని సంతసించి మనల నేమని యాశీర్వదించినదో మఱచితివా!" యని తనబాల్యక్రీడ లన్నియు ముచ్చటింప సాగెను. మిత్రునిపలుకులకు తలయూచుచు నగుమొగంబుతో "శ్రీకృష్ణా! పరమేష్ఠివగు నీతో గలసి చదువులు నేరిచి కొన్నాళ్ళు నీతోడిసఖ్యసౌఖ్యము ననుభవించుట నాపూర్వజన్మసుకృతము. గురుసానియు శుశ్రూషయనియు నెచ్చెలియనియు విద్యాభ్యాసమనియు పలుకుచుంటివి. జగద్గురుండవగు నీకు వేరుగ గురు డెవ్వరు? లోకపాలకుడవగు నీకు యితరులయాసతి యేటికి; పతితపావనుండవగు నీకు నెచ్చెలియనియు వైరియనియు కలరే? సర్వజనక్షేమకరుడవగు నీకు బంధువు కానివా డెవ్వడు? ఏమియు నెఱుగనివానివలె వర్తించుచు సాధారణమానవులరీతిని యొకప్పుడు సంతసించుచు నొకప్పుడు సంతాపించుచు జగన్నాటకరంగమున జీవననృత్యము సల్పుచుంటివిగాని సృష్టిచిత్రము లన్నిటికిని కర్త నీవే కదా! పరంధామా,

చ. "అడవుల పెద్దకాలము మహావ్రతులై పవనాంబుభక్షులై
బడలుచు నెట్టిమూర్తి గనుభాగ్యము కల్గునో కల్గదో యటం
చెడ గనుచుందు రట్టినిను నే సహపాఠివటంచు నాడుచున్
గడుకొనుసంతసంబు మది గాంచుచు నుంటి న దేమిపుణ్యమో!"

అని కుచేలు డింక నేమేమో పలుకుచుండ ధోరణి మార్చి "సోదరా! నాటికి నేడు యిన్నాళ్లకు నన్ను చూడవచ్చితివి సంతసమే యగును గాని నీ చెలిమికాని కిచ్చుటకై యేదేని యుపహారము గొనివచ్చితివా? రిక్తహస్తములతో వచ్చితి వనితలంపను. నిన్ను జూచినప్పటినుండియు నీతో నేమో సంభాషించుచున్నను నాచూపులన్నియు నీయుత్తరీయపుకొంగువైపునకే మరలుచున్నవి. ఎంతసేపు కనపెట్టుకొని యున్నను నేమియు పెట్టకుంటివి. ఇది

న్యాయమా” యని శ్రీకృష్ణు డనెను. మిత్రునికొఱకై యతడు కొంచెమదు కులు కొనితెచ్చినమాట నిజమే కాని సర్వలోకారాధ్యుఁడును అగర్భశ్రీమం తుఁడును అగునమ్మహాత్మునకట్టిసామాన్యపదార్థము నొసఁగుట కాతనిమనస్సొప్పి నదికాదు. మిత్రునియెడఁగల చనువుచేత నెట్లో యిచ్చుటకు సాహసించినను నపరిచితలగు సత్యభామాది యంతఃపురసీమంతినీజన మెంతసేపు చూచినను కృష్ణునిచెంతనుండి వెడలకుండుటచేతను ముక్కిపోయినయటుకుల గాంచి పరి చారికాజనము పక్కున నవ్వుదురేమో యనుజంకుచేతను ఆబీదబ్రాహ్మణుడు నీళ్లునములుచు నూరకుండెను. కాని తానుతెచ్చినయటుకులమూట తనజీర్ణాంబ రమున నెడమవైపున వ్రేలాడుచుండుట యతడు గురుతింపలేదు. “అన్నా! ఎంతవేడినను నామాటలు పాటిసేయకుంటివి నానో రూరుచున్నది. ఇదిగో ఏదియో తెచ్చియు నా కియ్యక నానోట నూటలూరించుచుంటివి” అని శ్రీకృష్ణుడు చివాలున చెలికానియుత్తరీయపుమూట లాగి ముడి విప్పి యందలి యటుకులను గుప్పిట దీసి పరమాత్ముడు పరమానందమున మెసవెను.

పరమేష్ఠియొల్లని పదార్థ మేమి గలదు. కృష్ణార్పితముగ నేమి యొసంగి నను భగవంతుని కందునుగదా! భక్తిపురస్సరముగా నిడినతృణము మేరువు కంటె నధికముగా పరిణమించును. పూట కన్నములేక బాధపడుచు తాను తినబోవుచున్న పాసినకూడు అలవాటుచొప్పున నొకయవ్వ యొకనాడు కృష్ణా ర్పితమని పల్కి, పారవేయదగినయన్నము నట్లొనర్చుట తగదని యుత్తర క్షణమందే గ్రహించి, దాని నావల పాఱవేయ చేతిముద్ద జాఱెనని శ్రీకృష్ణు డులికిపడెనని చెప్పుచుందురుగదా.

హృదయపూర్వకముగా నొసగిన పరమాత్మ డారగింపని దేది.

గుప్పెడటుకులు దిని రెండవపిడికిలి కొనబోవ నాథునిచేయి పట్టుకొని రమాసతి “మహాత్మా! మీానెచ్చెలి కఖండైశ్వర్యప్రాప్తికి తొలిగుప్పెడటుకులే చాలును. ఇంకను గొంటి రేని యాతనిఋణము తీర్పజాలరు.” అనియెను.

ఆరాత్రి కుచేలుఁడు శ్రీకృష్ణునితో గడపెను. ఆహా! కుచేలు డెంత యదృష్టవంతుడు. వాతాంబుపర్ణాశనులై యినుపకచ్చడములుగట్టుకొని యొం టికాల నిలచి యూపిరి బంధించి శతాబ్దములును సహస్రాబ్దములును మహా మునీంద్రులే దయాసాంద్రునిరూపు చూచుటకు చాలక కుందుదురో అట్టి సృష్టి

కర్త, పరంధాముడు, పరమేష్ఠి, పతితపావనుడు, త్రిజగత్కళ్యాణుడు, పరమాత్మ, శ్రీకృష్ణుడు, కుచేలునిసందర్శనము కాంక్షించి యతనితోడి సాంగత్యమున నానంద మందెనుగదా !

భగవంతుని చేరుటకు మానవు డెంతపాటుపడుచుండునో మానవుని చేరుటకు భగవంతుడును నంతపాటు పడుచుండునని తత్వశాస్త్రము తెలుపుచున్నది. భక్తుడు భగవంతునకు దాసుడైయుండ భగవంతుడు భక్తునకు దాసుడైయుండును. కుచేలునికి శ్రీకృష్ణుడుసలిపినసేవయే యీసత్యమును వెల్లడి చేయుచున్నదిగదా.

శ్రీకృష్ణునిపట్టమహిషులు కుచేలుని కభ్యంగస్నానము గావించి షడ్రసోపేతమగు విందొసంగింప మిత్రునితోగలసి శ్రీకృష్ణు డానందించెను. బాల్యమిత్రులకలయిక గాంచి పరమానందమున శకుంతపక్షులు మధురగానముచేసెను. నెచ్చెలులముచ్చటలు పరికించి చిరునవ్వు నవ్వుచు నాకాశమున నక్షత్రములు కాంతిల్లెను. హితులయంతరంగంబు లిట్లుండెనని తెలుపుటకో యనినట్లు పండువెన్నెల గాయదొడగెను. దివ్యసౌధంపుపైభాగమున పానపులు వేయించి యొకతల్పమున శ్రీకృష్ణుడు కుచేలుని పండుకొనజేసి మంచిగంధ మాతనిమేన నలది యాతనిపాదము లొత్త దొడగెను. సృష్టికర్తయే చెలిమికానికి సేవ చేయుచుండ తానేల కుచేలపరిచర్యాభాగ్యము నొంద రాదనికాబోలు మంద మారుతము వీవ దొడగెను. ఆసేవ తిలకించి యచటి శశికాంతశిలలపై నృత్యముచేయుచు చంద్రికలు హాస మొనరింపసాగెను. అట్టిసుహృత్తరదృశ్యము చూచితీరవలయునే కాని వర్ణింప సాధ్యము కాదు. ఆయద్భుతదృశ్యమును విలోకింప కైలాసము వీడి పార్వతీసమేతుడై పరమేశ్వరుండును సత్యలోకము వీడి శారదాసమన్వితుడై చతురాననుండును యింద్రలోకము వీడి శచీసమేతుడై దేవపతియు నచ్చరలును వియచ్చరగరుడగంధర్వులును నదృశ్యులై గగనపథమం దుండిరి.

ఘోరదారిద్ర్యనరకబాధ యొక్కనిశిలో నింద్రజాలమట్లు స్వర్గసుఖముగా మాఱిపోయెను. వైకుంఠమం దెల్లపుడును వసించువారి కది విసువు పుట్టించును. అందుచేతనే స్థలాంతరాపేక్ష కోరియే భగవంతుం డవతారముల నెత్తుచుండుట మనము చూచుచున్నాము. కుచేలునికి ప్రాపించిన యీమాఱుపు

లోని యనిర్వాచ్యసౌఖ్యము ; యాకస్మికస్వర్గసౌఖ్యము ననుభవించినకుచేలుడు తప్ప నితరులు తెలియఁజాలరు.

అమందానందమున నారాత్రి గడపి కుచేలుడు తెల్లవారగనె లేచి తన యెదుటనున్న పరమేష్ఠిమాట మరచి యెప్పటియట్లు కన్నులు మూసుకొని భగవంతుని ధ్యానించి కాలకృత్యములు దీరిచికొని నెచ్చెలియొక్కయు రుక్మిణీ ప్రభృతులయు సెలవు గైకొని కృష్ణునిసుందిరంబు వీడి సింహద్వారము గడచి సాగెను. శ్రీకృష్ణుండును కొంతదూరము వెంటనంటివెడలి యిష్టోక్తులతో కొంచెము కాలయాపనము చేసి కుచేలుని బిగ్గవు గలించుకొని విడువలేక విడువలేక తన కోట్టలో వీడి నిజాలయమున కరిగెను. "ఇంతకు పత్నీప్రేరితు డనై నాచిన్ననాటిమిత్రునికడ కేల పోతిని? చింపిగుడ్డలను కట్టుకొని ముక్కి పోయినయడుకులు గైకొని చిక్కినశరీరముతో నే నాతనికడ కేల వెడలితిని? నన్ను కాంచి భగవంతుండు పత్నీసమేతుడై బహుభంగుల సత్కరించెను. ఒక రాత్రిలోనే నాకు వైకుంఠము నగపరచెను. కాని పోయివచ్చెదనని నేను పలికి నపుడు నా పేదరికమును పోగొట్టుదునని మాటమాత్రమాతడీయడయ్యె.

చ. "ఇది కొనిపొమ్మటంచు యొకకేనియు వేడుక నీయుఁడాయె సం
పద లొనగూర్చి నన్ను సుఖవంతునిగా నొనరించునంచు నే
నెద తలపోసికొంటి భళిరే! పెలుచన్ గృపణస్వభావమున్
మది గనినందు కిట్టిపని మానక కా దగు చింత లేటికిన్.

అయినను నతనిదోష మేమి. చల్లకు బోయి ముంత దాచినందులకు తప్పు నాదియే. మరల నెప్పటిపేదరికమును నెప్పటికష్టమును నెప్పటిబాధయు నెప్పటివిచారమును నాకై నిపెట్టుకొని యుండునుగదా! కావుననే నవరత్నము లొక్కతావునను నత్తగుల్ల లొక్కతావునను చేరునని లోకులు పలుకుచుం దురు. పరమాత్ముడగు శ్రీకృష్ణుడు మాయలమారి యందురు. ఎంతటిస్నేహితు డయ్యును, నెంతచనవిచ్చి మాటలాడినను నీకింక మంచిరోజులు వచ్చునని యైన నతడు నన్నాశీర్వదింపనైనలేదు. ఐశ్వర్యము నభిలషించి నేను శ్రీనా థుని చేరలేదు. దారిద్ర్యమునుండి దారాసుతులను రక్షించు ననునాశతో నా పతితపావనుని పాదముల చేరితిని. అతని నన పని యేమున్నది. దామోద రుని కీబక్కవానిపై కరుణ పుట్టలేదుకాబోలు. అభాగ్యుని బాగొనరించుట

కాదిదేవునికై నను నలవికా దేమో” అని తలపోయుచు కుచేలుడు స్వగ్రామమునకు పోవుచుండెను.

కొంతసేపటికతడు తనయూరు చేరుకొనెను. ఎండవానలకు తనయందు తా విచ్చి యాదరించుచున్న తనపూరియిల్లు యిప్పు డదృశ్య మాయెను. శ్రీకృష్ణమందిరమును తలపించు నొకదివ్యమందిర మచట చూపట్టెను. ఈ యద్భుతమును విలోకించి వింత చెందుచున్న కుచేలునికడకు దాసీజనంబు హారతులు పట్టుకొనియెదురువచ్చి మహాసంభ్రమమున నతని నాగృహములోని కాహ్వానించిరి. ఈమాయ యేమని కుచేలు డాలోచింపుచుండ మణిమయభూషణంబులు మేన ధరియించి యాతనిభార్యయు నెదురువచ్చి వినయమున ప్రాణనాథునికి నమస్కరించి యాతని ననేకవిధముల పూజించెను. అన్నమో రామచంద్రా యని శల్యావశిష్టులయి యేడ్చుచున్న శిశువులు సుందరాకారులై బలసమేతులై మిక్కిలినంతోషమున గంతులువెట్టుచు పరుగుపరుగున వచ్చి తండ్రిని కౌగలించుకొనిరి. ఇదియంతయు కుచేలుని కింద్రజాలమువలె కనుపట్టెను. “ఆహా! యిదియంతయు దీనబంధుడగు శ్రీకృష్ణభగవానుల మహిమము.” అని యనుకొని మానసమున నాదేవదేవుని కాతడు భక్తిపూర్వకవందన మాచరించెను. కాని కుచేలు డష్టైశ్వర్యముల నపేక్షింపలేదు. అతులసంపదల నందియు తామరాకుపై నీటిబొట్టువిధమున విషయచింతల నంటి యుంటక నిరంతరదైవచింతనాపరాయణుడై యనంతర మాభగవద్భక్తుడు వైకుంఠమున తనచిరమిత్రుని చేరెను.

చ. చదివినవిద్యయా! నిగమసంహిత; చేసినచెల్మియా! మహా
పదమున బ్రహ్మకైన నొకపట్టున దర్శనమీయనట్టి యా
యదుకులభూషణుండయిన యచ్యుతు తోడుత; నిత్యవృత్తియా!
మది హరిపాదసేవ; తరమా! నుతియింపగ నిట్టిపూజ్యులన్?

---

౬

# ధ్రువుడు

•••○•••

శా. "ఓదామోదర! యిందిరాయువతి విస్ఫూర్లేఖతో నూత్నసిం
ధూదామత్రిదశేంద్ర కార్ముకముతో సవ్యాకృపావృష్టితో
నీదేహాంబను మేచకాంబుదము మన్నేత్రద్వయీచాతకా
హ్లాదంబుం బొనరించుగాత! భవతాపాటోపముం బాపుచున్."

భరతదేశము తపోభూమి; మానవునకు జ్ఞానాభిలాష గలిగించు పవిత్ర స్థలము. జ్ఞానము సంపాదించుకొని తేజశ్శాలియగుటకు మానవుడు యేకాగ్ర దృష్టి నలవరచుకొనవలెను. పదునాలుగులోకములు కందరుగ కేవలము శ్రీకృష్ణుని కుక్షియందుమాత్రమే లేవు. ప్రతిమానవుని హృదయమునందును కలవు. కాని సాధారణముగా బాహ్యప్రపంచమందే మసలుచు బాహ్యవిషయములందే మునిగి బాహ్యసంబంధములయందే జీవనము పుచ్చి యాసంబంధము చెడి తాను భూతలమును విడువవలసివచ్చినపుడు మహావిచారమున పడి మరణము మనుజునకు సంభవించెడు చేటులలో మిక్కిలిగొప్పదని మానవుడు తలంచుచున్నాడు. కర్మభూమియందు వసించియు, అనుదినము కొంతకాలము తన యంతరంగమునందున్న మహాప్రపంచమువైపు మనస్సును మరలించిచూచినచో, ఆఅనంతయంతరంగప్రపంచమున నాతడత్యద్భుతములు చూడగలడు. అంతరంగదృష్టి హెచ్చినకొలది భావప్రపంచ మంతకంతకు విశాల మగుచుండును. మానసవీక్షణములు తీక్ష్ణమగుటకును, అంతరంగముచే నమరగీతములు వినుటకును కొంతసేపు బాహ్యప్రపంచమును వీడి కన్నులు మూసికొని మానులును కవులును నూతనలోకములను పొడగాంచుచుందురు. ఋషీశ్వరులును కవీంద్రులును జనసంకులస్థలములనుండి తొలగి ప్రకృతిచిత్రములచే నలంకరింపబడిన వనములకును పర్వతములకును నరిగి కన్నులు మూసి నిమిషములో ఆకాశవీధిని, సముద్రమధ్యమునను, నక్షత్రలోకమునను, పాతాళప్రపంచమునను, తిరుగుచు ఘుంచుకసేపు దృష్టి నొకమొద బద్ధమొనరించి యందు సుఖవాసము చేయు

దురు. యోగీశ్వరులు మనలనిలోకములు లేవు. కవులు చూడనిప్రపంచములు లేవు. కవులు సర్వప్రపంచమును తిరుగుట, శాంతికి నాటపట్టగువనమున నివసించియుండిరే. విజ్ఞానముతో నిండియున్న వేదములును నమ్ముతకవనమున విరాజిల్లు మహాగ్రంథములును వనప్రదేశములయందే జనన మొందినవి. తపోభూములయందే జ్ఞానబీజములు మొలకెత్తి గొప్పవృక్షము లయ్యెను. తపోభూములందేగొప్పగొప్పయాశయములు తల లెత్తినవి. తపోభూములయందే మహత్తర భావములు మొలక లెత్తినవి. భూప్రపంచమున భారతదేశము తపోవనము అని చెప్పియుంటిమి. కావుననే భారతావని, వేదములకు, ఉపనిషత్తులకు, నింకనునితరములగుగొప్పజ్ఞానదాయకములగు గ్రంథరాజములకు పుట్టినిల్లయినది. స్త్రీలును పురుషులును బాలురును వృద్ధులును ప్రాచీనకాలమున భారతీయులు తపోవనములదెస చూడ్కులు సారించుచుండువారు. అయిదేండ్లబాలుడయ్యును, ధ్రువుడు వనప్రదేశమున కరిగి తపోదీక్షయందు మగ్నుడై మహోన్నతభావములను పొంది ఉత్కృష్టపదవి నందెను. ధ్రువుడు పొందినమహోన్నతపదవియే నక్షత్రరూపమున నాకాశమండలమున సూచింపబడినది. ధ్రువుని సామర్థ్యము, ధ్రువునిమనోనిశ్చయము, ధ్రువునియిచ్ఛాబలము గట్టివి.

ఉత్తానపాదు డనురాజున కిద్దరుభార్యలు కలరు. సునీతి పావనగుణశోభిత. రెండవభార్య సురుచి. సర్వాంగసుందరి. సవతిపై నీమె కొండెములు చెప్పి ప్రాణేశ్వరుని తనమాయాజాలమున బడవేసుకొనెను. దానంజేసి రాజు జ్యేష్ఠపత్నియందు విముఖుడై సురుచిపై మిక్కిలిమక్కువ గలిగియుండెను.

సురుచికి ఉత్తము డనుకొడుకు పుట్టెను. పరమేశ్వరుని యనుగ్రహమున సునీతికూడ ధ్రువు డనుసుతుని బడసెను రెండవభార్య కుమారుడే రాజునకు ముద్దుకుమారుడై పెరుగుచుండెను. సునీతిపై గలద్వేషము ఆమెకుమారుడగు ధ్రువునిపై కూడ ప్రసరించెను. కొడుకని యెన్నడు నీతనిని తండ్రి యెత్తి ముద్దాడలేదు. ఒకనా డాటపాటల దేలి గృహమునకు మరలి తండ్రితొడపై కూరుచుండిన యుత్తముని గాంచి తానును కూరుచుండుటకై ధ్రువు డువ్విళ్లూరెను. సురుచి భయమున కొడుకును బిలువక రా జూరకుండెను. అంతట సంశయింపక ధ్రువుడు తండ్రి రెండవతొడపై చేరి కూర్చుండెను. బాలునిసాహసము సురుచికి

హృదయశూలమై "బడుగా! సునీతికడుపున బుట్టిననీ వీయాసనమున కూరు చుండుట కర్హుడవు కావు. శ్రీహరిని సేవించి నాకడుపున పుట్టితివేని నీసోదరు డగు నుత్తమునివలె నందు కూర్చుండగలుగుదువు." అని యించుకయు కని కరములేక జనకునియూరువునుండి ధ్రువుని నామె వెలికి ద్రోసెను. ఇల్లాలిచేతి కీలుబొమ్మయగు నారాజు యేమియు ననలేక మిన్నకుండెను.

జనకుని నిరాదరణమును, సవతితల్లి దుర్నయమును ధ్రువునకు దుస్సహము లయ్యెను. క్రోధమును దుఃఖమును మనమున పెనవేసికొన క్షణమైన నట నిలు వక తల్లిపాలి కరిగి కన్నుల నీరుపెట్టుకొనుచు జరిగినవిషయమంతయు నతడు ఆమెకు విన్నవించెను. గోరుచుట్టుపై రోకటిపోటువలె నిదివరకే కుములు చున్నయామెచిత్తమున కీవిషయము మరింత దుఃఖదాయక మయ్యెను. అవ మానింపబడుటచే జనియించినదుఃఖముచే విచారించుచున్నకుమారుని నెత్తుకొని సునీతి "నాయనా! విలపింపకుము. నిజముగా సునీతివంటి యభాగ్యురాలికడు పున పుట్టుటచే నీ విట్టిదుర్దశకు పాలుపడితివి. కట్టుకొనినకాంతయెడల కాఠి న్యము పూనినను, కడుపునపుట్టినకొడుకుపైనైనను కరుణ జూపకుండుట నీతం డ్రికి న్యాయముగా తోచెను కాబోలు. ముందటిజన్మమున ఘోరపాపములు చేసి యీజన్మమున వాటిఫలము లనుభవించుచుంటిని. నావంటిపాపాత్మురాలి కడుపున పుట్టితివి గావున నీ విట్టియవమానమునకు లోనగుచుంటివి. ఎందుల కైన నేమి శ్రీహరిని ధ్యానింపుమని సురుచి నీ కుపదేశించెను. గొప్పకీడు లను మహాగ్ని చల్లార్ప దగినది హరిధ్యానవారిపూరమే పాపసంఘములను పార దోలునది. హరిధ్యానము. దుష్టచింతలచే జనియించినమహాపాపమనెడు గొప్ప వృక్షమును నరకదగినగొడ్డలి హరిధ్యానము. కష్టము లనుభవించుటచే జని యించుబాధను పోగొట్టుసిద్ధాంజనము హరిధ్యానము. ఆపన్నులకు శరణ్యము హరిధ్యానము. దీనదశయందు నీకును నాకును దిక్కు హరిధ్యానము. హరిని గొలిచి బ్రహ్మాదులు మహాఫలముల నందిరి. శ్రీహరికటాక్షవీక్షణముచే మన కీడు బాయును. కావున తండ్రీ! విష్ణువునుగూర్చి తప మాచరింపు" మని తల్లి కుమారునికి హిత ముపదేశించెను.

జనయిత్రియుపదేశము తల దాల్చి యామె యాశీర్వాదమును పొంది తప మొనరింప ధ్రువుడు అడవిమార్గమునుబట్టి పోయెను. బాలుడు కొంతదూర మరుగుసరికి చీకటి పడియెను. నలుదిక్కులును గాఢాంధకారమయము లయ్యెను, చెంతనున్న పొదలనుండి యాలకోళ్లకూతలు వినవచ్చెను. ధ్రువున కం దెవ్వరును మానవులు గోచరింపలేదు. మరికొంత సేపటికి వన్యమృగములరవములు వినవచ్చెను. పుట్టలనుండి బుస్సు బుస్సుమని పరతెంచుపాములకూతలును వినవచ్చెను. ధ్రువుడు బాలుడు. అయిదేండ్లవాడు. అది నిర్మానుష్యప్రదేశము. దట్టమయిన అరణ్యము. క్రూరమృగసంకులము. అర్ధరాత్రము, కారుచీకటి. అయినను జంకు గొంకులు లేక ధ్రువుడు సాగిపోయెను.

ఇచ్ఛాశక్తికి చాలినది పృథివియందు మరియొకటి లేదు. సంకల్పబలముచే కొండలను పిండిచేయవచ్చును. సముద్రజలమును గ్రోలవచ్చును. ఆకాశమును తాకవచ్చును. సంకల్పబలముచేతనే విశ్వామిత్రుడు సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగెను. సంకల్పబలముచేతనే సావిత్రి పతిప్రాణములను యమునిచేతి నుండి రక్షించుకొనగలిగెను. సంకల్పబలముచేతనే ఘోరకాంతారమున నిర్భయముగా ధ్రువుడు నడచిపోగలిగెను. అట్లు చనిచని యొకానొకచెట్టుసమీపమున నారాత్రి గడపి బాలకుడు మరల మరునా డుదయమున నరణ్యమార్గములబట్టి పోసాగెను. పోవుచుండ త్రిలోకసంచారియు పరమభాగవతోత్తముడును, దేవఋషిశ్రేష్ఠుండును నగునారదుడు ధ్రువుని కెదురై దివ్యదృష్టిచే నాతని యుదంతము తెలిసినవాడై, గుప్పెడుప్రమాణముమాత్రము గలయతనిహృదయమున నింతగొప్పదగు సంకల్పపర్వత మెట్లు లిమిడెనా యని యబ్బురపడి బుడుతని యిచ్ఛాశక్తి గ్రహింప దలచి "వత్సా! చిరుతప్రాయమునందే యిల్లు వెడలి భీకరమగునీయరణ్యమున సంచరించుట తగునా? నీకై తలిదండ్రు లెంత విచారించుచుండిరో గదా!" అని ప్రశ్నించెను. ధ్రువుడు తనచరిత మంతయు యోగీంద్రునకు తెలిపి "మహాత్మా! నారాయణామృతమే సదా గ్రోలునీమానస మనుతుమ్మెద తాను పొందు అనంతానందమున కొంత యీబాలకున కొసంగకుండునా?" జనకునియంకతలమున నించుక తావు బడయకున్నను, జనకుడుగాని త్రిలోకములయందు నితరులెవ్వరుకాని పొందజాలనిపదవిని పొంద నిశ్చయించి

తిని. దానిని బడయజాలుటకు మీరు నన్నాశీర్వదింపు డని, వినయముతో నారదునకు ధ్రువుడు మ్రొక్కెను. కుఱ్ఱని నిశ్చితభావమునకు సంతసించి తిరుగులేని యాశీస్సులు వాని కొసగి దేవఋషి తొలగిపోయెను. ధ్రువు డల్లు కొంతద వ్వరిగి పాపమునకు దూరమైనదియు మిక్కిలి పవిత్రమును నగు నొకఋష్యాశ్రమమును దూరమునుండి పొడగాంచి అచటి కరిగి యోగనిద్రామగ్నులయిన సప్తఋషులను గాంచి కొంతతడ వందు నిలచి భక్తిపురస్సరముగా వారికి మ్రొక్కెను. తాపసులును దివ్యదృష్టిచే బాలకునివృత్తాంతము తెలిసికొని, బాలకునికి విష్ణుమంత్రోపదేశ మొనరించి మధువనమునకు పోయి శ్రీహరిని గూర్చి తప మొనరింపుమని తెల్పిరి. తోడనే మహాప్రసాదమని యోగీంద్రులకు నమస్కరించి ధ్రువుడు త్వరలో కృష్ణనివాసమై పుణ్యావాసమై మహాపవిత్రమైన మధుర కరిగి యమునానదీపులినతలమున కూర్చుండి యేకాగ్రచిత్తుడై శ్రీమహావిష్ణువునుగూర్చి యుగ్రముగా తప మాచరింపదొడగెను. తొలుత పండ్లను తరువాత ఆకులను పిమ్మట నీరమును పదపడి కేవలము వాయువును గొని తదనంతర మూపిరి పీల్చుటయును మాని ధ్రువుడు పరమేశ్వరుని ధ్యానింపసాగెను. ఉగ్రమగు నాతనితపోమహిమచే భూతలము కంపింపసాగెను. దేవతలు గడగడ వడకిరి. తోడనే వారు వైకుంఠ పతికడ కరిగి శరణు చొచ్చిరి. అనిమిషులకు అభయ మొసగి విష్ణుమూర్తి వనమున కరిగి శంఖచక్రగదాయుతుడై ధ్రువునియెదుట సాక్షాత్కరించెను. తనతపోఫలము మూర్తీభవించి కట్టెదుట చూపట్టినంతనే మిక్కిలిసంతోషించినవాడై ధ్రువుడు లేచి మహావిష్ణువునకు నృత్యముతో ప్రదక్షిణ మాచరించి నమస్కరించెను. భక్తిపూరముచే నిండిన యాతనిహృదయమునుండి శ్రీహరికటాక్షము పెంపున గంగానదీతోయములతో సరియైనవేగముగల ధారతో స్తుతిపాఠము వెలువడెను.

చ. “హరిభజనీయమార్గనియతాత్ములై భవదీయరూపమై
పరలిన భక్తియుక్తులగువారల సంగతి గల్గజేయు స
త్పురుషసంగతిన్ వ్యసనదుర్భరసాగర మప్రయత్నతన్
సరస భవత్కథామృతరసంబున మత్తుడనై తరించెదన్.

చ. నిరతము తావకీనభజనీయపదాబ్జసుగంధలుబ్ధులై
వ్వారి మదిబొందగా గలుగువారలు తత్ప్రియమర్త్యదేహము
న్నరయ తదీయ దారతనయాదిసుహృద్గృహబంధువర్గమున్
మఱతురు విశ్వతోముఖ రమాహృదయేశ! ముకుంద మాధవా!
మ. అరవిందోదర! తావకీనచరణధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణనజాతభూరిసుఖముల్ స్వానందకబ్రహ్మమం
దరయన్ లే వట దండభృద్ధతవిమానాకీర్ణులైకూలు నా
సురలోకస్థుల జెప్ప నేల సుజనస్తోమైకచింతామణీ!
చ. వరమతినాప్తబాంధవభవఘ్నసబోధనమేతుఁడై భవ
చ్ఛరణము బొందినట్టి విధినగ్గను సత్తజనుండు బోధమం
దరయగ చూచురీతి గనునట్టి ముముక్షుశరణ్యమైన నీ
చరణములన్ కృతజ్ఞుడగుసజ్జను డెట్లు తలంపకుండెడున్."

అని ధ్రువుండు పల్కినంత మహావిష్ణువు మిగులసంతసించి "వత్సా! బాలకుడవయ్యు నీవు చూపిన మనోనిశ్చయమునకు నే నబ్బురపడినవాడను. ఇచ్ఛాశక్తిచే మానవు డెట్టిపదమును పొందగలుగునో భువనములకు గొప్ప దృష్టాంతము చూప గలిగితివి. బాలకా! నీ మనస్సునందలి గొప్పకోరికను గ్రహించితిని. ఇరువదియారువేలయేండ్లు భూతలమును ప్రజారంజకముగా పాలించి యనంతరము, సులువుగాపొందరానిదియు యితరులచేసాధింపబడని దియు లోకత్రయప్రళయకాలంబునందును నశ్వరంబుగాక వెలుగొందునదియు నైన ధ్రువక్షితియను పదంబు నీ వందుదువు. నీకు సాయుజ్యపదవి యలవడుటకై మంత్రోపదేశ మొనరించినసప్తఋషులు నక్షత్రసమేతులై యెల్లప్పుడు ధ్రువ స్థానమునకు ప్రదక్షిణ మొనరించుచుందురు. బాలకా! సంసారసముద్రము నందు తమజీవననావను నడపుచు యేదిక్కునకు పోనేరక యల్లాడుమానవునకు నభోమండలమునుండి నీదివ్యతేజస్సు మార్గమును చూపి గాఢమగునిశ్చయము యొక్క మహత్వమును ప్రపంచమునం దెల్లయెడల ప్రకాశింపచేయును. ఇంక బాలకా! నీగృహమునకు పొమ్ము." అని పలికి యనేకవిధముల ధ్రువు నాశీర్వ దించి భక్తమందారుడగు శ్రీహరి గరుడవాహనారూఢుడయి వైకుంఠమున కేగెను. ధ్రువుడును యింటిదారి పట్టెను.

తననిరాదరణమునకు మిక్కిలి పశ్చాత్తాపము నొంది నారదమహామునీంద్రుని కరుణచే నూరడింపబడినవాడైన యుత్తానపాదుడు ధ్రువునిరాక విని పరమానందభరితుడై సతీసమేతుడై యుత్తముడు వెంటరా తనయున కెదురేగి, యనంతముదమున నాతని కౌగలించుకొనెను.

జనకునకు సునీతికిని సురుచికిని ధ్రువుడు ప్రదక్షిణ మాచరించి వారికి సాష్టాంగదండప్రణామము లాచరించెను. తనయు నెత్తి ముద్దాడి కౌగలించుకొని యవిరళాశీర్వాదపూరమట్లు కన్నులనుండి జాలువారు ఆనందాశ్రువులచే కుమారుని శిరస్సును తడిపి మూర్కొని నిర్మలనీతివిశారదయగు సునీతి యమందానందమున తేలెను.

తొంటియసూయ మఱచి "నాయనా! చిరంజీవివి కమ్మ"ని ధ్రువుని సురుచి యాశీర్వదించెను. ఉత్తము డగ్రజు నాలింగన మొనరించుకొనెను.

అనంతరము ముసలి యగునుత్తానపాదుడు ధ్రువునకు పట్టము కట్టి తపోవనమున కరిగెను. ఇరువదియారువేలయేండ్లు ప్రజామోదముగా రాజ్యపాలనము చేసి యక్షాది యరివీరుల నోడించి యనంతరము శ్రీహరిసేవకులచే తేబడిన విమాన మం దారూఢుడై ధ్రువస్థానాశీనుడై ధ్రువు డనంతమహిమతో గూడినవాడై ప్రకాశించెను.

---

౧౦

# భీష్ముడు

మ. "లలితాలోకతరంగసంగతము లీలామందహాసప్రభా
పులినంబున్ మురళీనవామృతరసంబున్ రాధికాలోచనో
త్పలసంభావితమాధురీగుణమునై భాసిల్లు శ్రీకృష్ణు ని
ర్మల వక్త్రాంబుసహాకరంబున రమింపన్గోరెదన్ నామదిన్."

ప్రపంచమంతయు నజ్ఞానాంధకారంబుచే నిండియుండినపుడు మానవులు విద్యాగంధములేనివారై సంచరించుచుండెడి రోజులయందు, జనులు బట్టకట్టు కొనుట యెరుంగక అడవిజంతువులవలె సంచరించునాళ్ళలో భరతఖండము మహామహిమతో కూడినదై, యున్నతాదర్శకాంతులచే వెలుగొందుచుండెను. అనేకసహస్రవర్షములనుండి మహాపండితుల కాకరమై భరతదేశము పేరు జెందినది. మహత్తర ఆదర్శములకు పంటభూమియైన యీభారతభూమియందు మహాపురుషులకు కొదువయుండునా! మహనీయగుణగణముచే నొప్పుభీష్ముడు ప్రపంచమహాపురుషులలో నెవ్వనికిని తీసిపోడు. పుట్టువుతోడనే స్వార్థ త్యాగ మీమహాత్ముని రక్తనాళముల ప్రవహించెను. చిన్నతనమునుండియు నితడు పరార్థజీవి యయ్యెను.

భీష్ముడు గంగాశంతనులకు పుత్రుడు. శంతనుడు పరాక్రమశాలి; ప్రజ్ఞా నిధియగు రాజశేఖరుడు. కాని విషయాసక్తుడైన పామరుడు. భార్యపై గల మక్కువమూలమున కరుణమాలి కన్నకుమారుల నామె గంగపాలుచేయు చుండ చూచుచు నూరకుండినంతటి స్త్రీలోలుడు. సంసారసుఖముల మరగిన తండ్రిచెంతగాక లోకపావనియగు గంగచెంత నితడు పవిత్రగుణములను బడ సెను. ఇతడు వసువులయం దెనిమిదవవాడు.

ఎనిమిదవసుతుడగు నీతనినికూడ గంగలో పారవేయుటకు పోవుచుం డగా శంతనుడు సహింపజాలక వలదని యాజ్ఞ పెట్టినంతనే మొదట వివాహ కాలమున నేర్పాటుచేసికొనిన నియమానుసారముగా గంగాదేవి శంతనుని

వ్రాసి చనెను. అట్లు చనుచు కుమారునికూడ తోడ్కొనిపోయి పండితశ్రేష్ఠు లగు శుక్రబృహస్పతులయొద్ద సర్వశాస్త్రములును యోధాగ్రేసరుడగు పరశు రామునియొద్ద నస్త్రవిద్యయు మహాత్ముడగు వసిష్ఠమునికడ వేదవేదాంగము లను, వానికి నేర్పించి పిమ్మట వానిని తండ్రికి నొప్పగించి యామె యదృశ్య యయ్యెను. సర్వలక్షణసంశోభితుండును, మహామహిమాంచితుండును సుగు ణాభిరాముడును అగు భీష్మునకు శంతనమహారాజు యౌవరాజ్య పట్టాభిషేకము కావించెను.

ఇట్లుండ శంతను డొకనాడు వేటకై యమునానదీతీరమునకు చేరువ నున్న వనమున కరిగెను. వేట ముగిసినపిదప శంతనుడు అచ్చటి యిసుకతిన్నె లపై కొంతవిహరింపదొడగెను. అప్పు డతనికి అపూర్వమైన సౌరభము నాసాపు టములకు తర్పణము గావించెను. ఆ యద్భుతసుగంధ మెచటినుండి వచ్చెనా యని యచ్చెరువు నొంది గాలివిసరుచున్న దిక్కున కెదురుగా నడచి కొంత దూరమున నొకనావపై నిండుయవ్వనము నమన్న యొకస్త్రీని యతడు కాం చెను. సౌందర్యమునం దీశనికి తీసిపోని యాజలజనయన, నిరుపేదరాలువలె వేషమునుబట్టి తోచెను. మిగులపలచని యామె కట్టువస్త్రమునుండి యామంద యాన యంగసౌష్ఠవము పూర్తిగా ప్రస్ఫుటమగుచుండెను. ఆకాంత యౌవన మారాజు నాకర్షించెను. ఆమె సౌందర్యమున కాతడు విమోహితు డయ్యెను. వెంటనే శంతను డామెచెంత కరిగి "అబలా! అన్నులమిన్నవై స్త్రీలమేల్బంతివై యలరు నీవెవ్వతెవు. మానినులకు తలమానికంబవయ్యు సామాన్యస్త్రీవలె యీయోడ నేల నడపుచుంటి" వనెను. సిగ్గుచే తలవంచుకొని, అనురాగవీక్ష ణము లాతనిపై బఱపి చిరునగవుతో నామె "రాజేంద్రా! ఈ నదియొడ్డున వసించు జాలరియింట పెరుగుచున్నదానను. ఆతనిపేరు దాశరాజు. నన్ను యోజనగంధి యందురు. నేను మాతండ్రి యానతిచొప్పున వచ్చు పోవువారి నీనదిని దాటింతు" నని చెప్పెను. అదివిని సంతసించి శంతనుడు యోజనగంధి వెంట నాజాలరికడ కరిగి కన్నియను తన కిచ్చి వివాహము చేయుమని యాత నిని వేడెను. అందుల కాతడు "రాజా! కీర్తివంతుడవగు నీవు కోరినయప్పుడు నేను నిరాకరింతునా? నీవంటి మహీపాలు డామెకు పతియగుచుండుట నాకు పరమసంతోషము గదా! నీవంటి యుత్తమోత్తముడు నా కెందు లభించును.

కన్యక నెప్పుడో యొకని కియ్యవలసినదే కదా. నీకిచ్చుటకు నా కేవిధమగు నభ్యంతరము లేదు గాని యొక విషయము నీతో చెప్పవలసియున్నది. నీవలన నాకుమార్తె కుండు కలిగిన కుమారునకు రాజ్యాధికార మొసంగుటకు నీ వొప్పెద వేని నీకోరిక నెఱవేర్పగలవాడ" నని చెప్పెను. శంతను డేమిచేయ గలడు. "నా కిదివరకే యొక కుమారుడు కలడు. అతనికి యువరాజపట్టాభిషేకము గావించితిని. నీ యభీష్టము నెఱవేరుట కవకాశము లే"దని శంతను డా దాశరాజుతో పలికెను. అయిన నుపయోగము లేదని దాశరాజు ప్రత్యుత్తర మొసంగ చేయునది లేక శంతనుడు నిరాశుడై యింటికి జనెను. నిజగృహము చేరినను శంతనునిమనస్సు యోజనగంధిపైననే నిలచి యుండెను. అందుచే నాతడు నిద్రాహారములు మాని చింతించుచు దినములు గడపుచుండెను. ఒకటిరెండుదినములు గడచినవెనుక తండ్రి దుస్థితి కనిపెట్టి భీష్ముడు జనకు నడిగి కారణము తెలిసికొని యాతనికోరిక దీర్ప నిశ్చయించి దాశరాజుపాలి కరిగి "మారాజుగారికి నీకుమార్తెను దేవిగా సమర్పింపు"మని పలికెను. అందులకా దాశరాజు శంతమునితో చెప్పిన సమాధానమునే చెప్పెను. అంతట భీష్ముడు—

"వినుడు ప్రసిద్ధులైన పృథివీపతు లిందఱు నే గుఱుప్రయో
జనమున జేసితిన్ సమయసంస్థితి యీలలితాంగి కుద్భవిం
చినతనయుండ రాజ్యము నుఁ చేయగ నర్హుడు వాడ మాకు నె
ల్లను బతి వాడ కౌరవకులస్థితికారు డుదారసంపదన్"

(భారతము)

అని శపథము చేసెను. ఆ ప్రతిజ్ఞ విని దాశరాజు మిగుల సంతసించి, "శూరాగ్రణీ! మహాపురుషుండవగుట నీవు నీ రాజ్యవిభవమును వీడుట కిష్టపడితివి. కాని నీకుకలుగుపుత్రులందు పుట్టిగుణ ముండుననుట కల్ల. వారీనియమము పాటింతురా? నాకుమార్తెకు జనియించినసంతతివారే వంశపరంపరగా సింహాసనారూఢులు కావలెనని నా కోరిక" అనియెను.

"మీరు వచించిన పలుకులు నిక్కువము. ఇట్టి యవాంతరములు రాకుండుటకై,

'క. ధృతి బూని బ్రహ్మచర్య వ్రత మున్నతి దాల్చితిని ధృవంబుగ ననప
త్యతమైనను లోకము లాయతి నెక్కులు గలవు నాకు ననుభావ్యములై.'

అని భీష్ముడు ప్రతిన గావించెను. అనితరసాధ్యమగు ఆమహాత్యాగము నకు మిక్కిలిసంతోషించి దాశరాజు తనకూతును శంతనున కిచ్చి వివాహము చేసెను. శంతనుడు తనకొఱకై యసాధారణప్రతిజ్ఞలు కావించిన నిజతనూజుని యాతోస్నతికి సంతయుసంతసించి యాతనికి స్వచ్ఛందమరణము కలుగునట్లు వర మిచ్చెను. దేవవ్రతు డిట్టిభీష్మవ్రతములు దాల్చుటవలన నప్పటినుండియు భీష్ము డనుపేర వ్యవహరింపబడుచుండెను.

మొదట నొకవివాహము చేసికొని మెనమండుగురుకుమారుల కనువఱకు గంగాదేవినిగూడి సకలసౌఖ్యముల ననుభవించి ముదుసలియై యున్న తండ్రి మానసము మరియొకస్త్రీపై ప్రసరించి కామోద్రేకము చెంద, వయస్సులోని వాడును వైభవసమేతుడును నగుభీష్ముడు వృద్ధుడగు జనకునికోరిక దీర్చుటకై యసిధారావ్రతము పూనెను. స్వార్థము వదలి తండ్రికొఱకై సకలసౌఖ్యములు విడనాడెను. ఆహా! శంతనునివంటి విషయాసక్తునికిని భీష్మునివంటి జితేంద్రియు నకును నెంతభేదమున్నది! రాజ్యవిభవములను దారాపుత్రులను త్యజించి యర్ధ రాత్రమున నిల్లు వీడి మహారణ్యమున కరిగి యోగియైన సాఖ్యమునికూడ నింతటివాడే.

సత్యవతియందు శంతనునకు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడనునియిరువురు పుత్రులు కలిగిరి. శంతనుడును చిత్రాంగదుడును చనిపోయిన పిమ్మట విచిత్ర వీర్యుడు రాజ్యభారము పూనెను. తరువాత ధృతరాష్ట్రపాండురాజులు రాజ్యాధి కారము పడసిరి. రాజ్యమునంతను తామే యాక్రమించుకొనదలచిన కౌరవు లకును పాండవులకును, దారుణమగు రణము పొసగెను. దుర్యోధనుడు నీతి బాహ్యుడనియు, ధర్మరాజు నీతివిశారదుడనియు నెఱుగుటచే భీష్మునిమనసు కౌంతేయుల పక్షమునందే యుండెను. అయినను కురుసైన్యమునకు సేనాధి పతియైయుండుటచే నాతడు పాండవులతో పోరవలసివచ్చెను.

అవక్రపరాక్రమవంతుడును శూరాగ్రేసరుండునగు శివునినైతము యుద్ధ మున నిర్జించి పాశుపతాదిమహాస్త్రములను బడసినఅర్జునుడునైతము భీష్ముని యెదురుగా నిలచి పోరజాలక తుద కెట్లో పోరియు భీష్ముని కూల్పజాలకపోయెను. ప్రాణమిత్రుడగు అర్జునుడు రెండుమూడుసారులు అపజయముగాంచుట చూచి పార్థసారథి కోపించి చక్రధారచే భీష్ముని ఖండింప రథమునుండి క్రింది కురికెను.

మహాభయంకరమైన భీష్మునివదనము క్షణములో ప్రశాంతమై భక్తిపూరిత మయ్యెను. భగవంతునిచేతులయందు ప్రాణములువాయు మహాభాగ్యము ప్రాప్తించుచున్నదని సంతోషించి బాణాసనము నెక్కుడించి యావల పార వైచి చేతులురెండును జోడించి నుదుట నిలిపి భక్తిబాష్పము లవిచ్ఛిన్నముగా గారుచుండ నాపరమభాగవతోత్తముడు :

'మ. త్రిజగన్మోహన నీలకాంతితనువుద్దీపింప ప్రాభాతనీ
రజబంధుప్రభమైనచేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్తముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడువన్నెకాడు మది నావేశించు నెల్లప్పుడున్.

మ. హయరింఖాముఖధూళిధూసరపరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థున కిచ్చువేడ్క నని నాశస్త్రాళిహాతిన్ జాల నొ
చ్చియు బోరించుమహానుభావు మదిలో జింతింతు నశ్రాంతమున్.

మ. నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలో
బరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచున్
బరభూపాయువులెల్ల జూపులన శుంభత్కేళి వంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుడై.

క. తనవారి చంపజాలక వెనుకకుబో నిచ్చగించు విజయునిశంకన్
ఘనయోగవిద్య బాపిన మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్.

సీ. కుప్పించి యెగసిన కుండలంబులకాంతి గగనభాగంబెల్ల గప్పికొనగ
నురికిన నోర్వక నుదరంబులోనున్న జగములవ్రేగున జగతి కదల
చక్రంబు చేపట్టి చనుదెంచురయమున పైనున్నపచ్చనిపటము జార
నమ్మితి నాలావు నగుబాటు సేయకు మన్నింపుమని క్రీడి మరల దిగువ

గీ. కరికి లఘించుసింహంబుకరణి మెరసి నేడు భీష్ముని చంపుదు నిన్ను గాతు
విడువుమర్జున యనుచు మద్విశిఖవృష్టి దెరలిచనుదెంచు దేవుండు దిక్కునాకు.

మ. తనకున్ భృత్యుడు వీని గాచుట మహాధర్మంబు పొమ్మంచు న
ర్జునసారథ్యము పూని పగ్గములు చే చోద్యంబుగా పట్టుచున్

మానికోల న్వడి బూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహము నొందజేయు పరమాత్మన్ బ్రశంసించెదన్.

క. పలుకుల నగవుల నడపుల నలుకల నవలోకనముల నాభీర వధూ
కులముల మనముల తాలిమి కొలుకులు వదలించు ఘనుని కొలిచెద మదిలోన్.

ఆ. మునులు నృపులు జూడ మును ధర్మజుని సభామందిరమున యాగమండపమున
జిత్రమహిమతోడ చెలువొందు జగదాదిదేవు డమరు నాదు దృష్టియందు.

మ. ఒకసూర్యుండు సమస్తజీవులకు దా నొక్కొక్కడై తోచు పో
లిక నే దేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూనరూ
పకుడై యొప్పుచునుండు నట్టిహరి నే బ్రార్థింతు శుద్ధుండనై.

మ. దయసేయంగదవయ్య కృష్ణ త్రిజగత్కల్యాణ మోక్షంబు గోగిన్
దయసేయంగదవయ్య చక్రమున మత్కంఠంబు నైకుంఠ! వే
గయిసేయంగదవయ్య ధర్మసుతు నేకచ్ఛత్రసంపత్తిచే
గయిసేయంగదవయ్య నీ కిదె నమస్కారంబు నారాయణా!

అని భగవంతుని ప్రస్తుతించెను. ఆహా! భక్తిప్రభావ మెంతటిది. అను రాగబలిమి యేమి సేయింపదు. మహోజ్వలక్రోధాగ్నికీలల నది నిమిషములో అమృతవర్షమువోలె చల్లార్చును. క్షణములో కోపమును కృపగా నది మార్చి వేయును. భీష్మునిభక్తిప్రేమలకు కృష్ణభగవానులక్రోధము చల్లారినది. పదిదిన ములు యుద్ధము చేసినను ముల్లోకములయందు పేరుగాంచిన పాండవులు ఆతను కూల్పలేకపోయిరి. కృష్ణసహితులై పాండవు లపుడు భీష్ముని చెంతకు బోయి యాతడు చచ్చునుపాయము తెలుపుమని కోరిరి. స్త్రీరూపుండును పూర్వజన్మమున స్త్రీయైనవాడును స్త్రీనామధేయుడును మధ్యకాలమున స్త్రీలక్ష ణములు బాసి మగతన మందినవాడును అగువానితో యుద్ధము సేయననియును నందుచే శిఖండిని ముం దిడికొని యుద్ధమును బ్రారంభించిన దాను మరణింతు ననియు భీష్ముడు చెప్పెను. పాండవు లట్లొనరించిరి. తీవ్రబాణహతుడై నేల కూలి, అర్జును డమర్చిన శరతల్పమున శయనించి, జనకునిచే స్వచ్ఛందమరణ వరము బొందినవాడు గావున నుత్తరాయణము వేచి, యది తనకు మరణోచిత సమయంబని నిశ్చయించి,

శా. ఆలాపంబులు మాని చిత్తము మనీషాయత్తముం జేసి దృ
గ్జాలంబున్ హరిమోముపై బరపి తత్కారుణ్యదృష్టిన్ వెని
ర్మూలీభూతశరవ్యథానిచయుఁడై మోదించి భీష్ముండు సం
శీలం బొప్ప నుతించె గల్మషగజశ్రేణీహరిన్ శ్రీహరిన్.

అట్లు నుతించి మాఘశుద్ధ ౧౧ నాఁడు మహనీయగుణాభిరాముండును నవక్రవిక్రముండును బుద్ధిశాలియు మహాప్రజ్ఞుఁడును కీర్తివంతుఁడును నగుగంగా నందనుఁడు కృష్ణాదిమహాపురుషులు చెంత నుండ భూలోకమునుండి దివ్యలోకమున నదృశ్యుఁ డాయెను.

భీష్ముఁడు స్వార్థత్యాగమందే పుట్టి స్వార్థత్యాగమందే మరణించెను. శరీరసౌఖ్యము విడిచి శాశ్వతబ్రహ్మచర్యదీక్ష నెరపి ప్రతిజ్ఞ పాలించి జితేంద్రియుఁడై మహాత్ముఁ డాయెను. ధర్మమే యాతనిధర్మము. ధర్మార్థమై జీవించు జీవనమే జీవనమని యామహాత్ముఁడు గ్రహించి, ధర్మసంస్థాపనార్థము స్వార్థమును లెక్కసేయక వాడిబాణముల నెదుర్కొని మహోన్నతాదర్శవ్రతహోమమున తనప్రాణముల నాహుతిగావించెను. భీష్ముఁడు శరతల్పమున మాఘమాసమును గోరి దినములు లెక్కజూచుకొనుచుండగా యుద్ధానంతరమున నతని చూచుటకు శ్రీకృష్ణభగవానులును పాండవులును పోవుచున్నసమయమున శ్రీకృష్ణుండతని నుద్దేశించి ధర్మరాజుతో నిట్లనియె:

సీ. జన్మంబు నెంతుమా సకలాఘసంహారితక్షమమగు గంగ గర్భమున బుట్టె;
సత్యంబు నెంతుమా జనకుని పెండ్లికై తానన్నమాట యుందనుక నిలిపె;
పౌరుషం బెంతుమా పార్థివాంతకుఁడైన పరశురాముని నాజి భంగపఱచె;
వ్రతనిష్ఠ నెంతుమా పార్థుచే గూలి పుణ్యాదినంబువరకు తా నట్టె నిలచె;

నిందు నొక్కొక్కటియె కడు నెన్న దగిన విన్నియును కల్గుభీష్ముని కెవరు సాటి
మ మ్మటుంచుము భవనైకవరాన్యులైన మూడుమూర్తు లీయనఘుతో
మొనయ గలవె!

# ౧౧

# హనుమంతుడు



ఉ. "ఉరుసంసారసముత్తరంబు నిగమాంతోచ్చారితంబున్ సమ
స్తరిపుధ్వంసము జన్మపావనముఁగా సత్సంగ వేళాసము
చ్చరితంబున్ వ్యసనాహిదష్టజనరక్షాదక్షమై శర్వదం
బరుదా శ్రీరఘురామమంత్రమును జిహ్వా, భక్తిఁ గీర్తింపుమా."

సీ. "శైశవమ్ముననె భాస్కరుఁ గ్రమింగె నితని తేజమున కేఘనుఁ డింక సదృశు డనుచు
హనుతటోద్ధతి వజ్ర మడచె నీతనితనుద్రఢిమ కే మిక బోల్పదగు నటంచు
నురుధాటి కడలిలో మెరసె నీతనిగభీరతకు నెయ్యది యింక బ్రతి యటంచు
వాలాగ్రమున గిరుల్ వ్రాల్చె నీతనిధైర్యసంపద కిక నెవ్వి సాటి యనుచు
గీ. జానకీరామచంద్రు లేశౌర్యవంతు పటుగుణస్ఫూర్తు లప్పటప్పటికి నెంతు
రామహాశాంతు నతిదాంతు నరికృతాంతు నతులమతితంతు హనుమంతు
నభినుతింతు."

సీ. "వైరాగ్యమహిమ కీవడుగు నివాసంబు ; వినయంబునకు నీతఁ డునికిపట్టు
శమదమోన్నతుల కీచతురు డాధారంబు ; దాక్షిణ్యమునకు నీతండు చోటు
సౌశీల్యమున కీప్రశాంతశాలి బిడారు ; పరహితక్రియకు నీపరము దిక్కు
విక్రమస్ఫురణ కీవీరవర్యుడు తావు ; గాంభీర్యగరిమ కీఘనుడు ప్రాపు
గీ. బ్రహ్మవిద్యకు నిమ్మేటి పట్టుగొమ్మ ; ఘనతపోధనమునకు నీయన నిధాన
మతులధైర్యంబునకు నీమహాత్ము డిమ్మ ; రామ నీభక్తి కీపుణ్యారాశి నెలవు."

బ్రహ్మచర్యమందును, స్వార్థత్యాగమందును, పరహితవర్తనమునందును భీష్మునివగిది భరతదేశమునందు పేరుగాంచిన మహావీరులలో హనుమంతు డొకడు. బలమునం దితనిమించినవారు లేరు. భక్తియందు నారదాదిమహాఋషులకంటె నెక్కువవాడు. విక్రమమున నౌదార్యమున శ్రీరామునితో సము డనిపించుకొనెను.

ఇతడు అంజనీదేవికిని వాయుదేవునకును జనియించినవాడు. శివుడు హనుమంతునియవతారమున భూలోకమున పుట్టె నని పురాణములయందు చెప్పబడియున్నది. కుమారుడు పుట్టినంతనే యంజనీదేవి పండ్లు తెచ్చుటకై యరణ్యమునకు పోయెను. సూర్యుడు తూరుపుకొండపై యప్పుడె చూపట్టెను. బాలసూర్యబింబము ఫలమని తలచి యాంజనేయు డాగిరిపై నురికి, యపుడు గ్రహణసమయమగుటచే సూర్యునిమ్రింగుచున్న రాహువును గాంచి పం డని యాతనిని పట్టుకొనుటకు ప్రయత్నింప నారాహువు యింద్రునిచెంతకు బోయి మొర పెట్టుకొనెను. మహేంద్రు డాహనుమంతుని దాకుటకు నైరావతము నాతనిపై పురికొలిపెను. దాని నొక తెల్లనిపండుగా తలచి యాంజనేయు డా తెల్లయేనుగుపైకి దుమికెను. అది చూచి మహేంద్రుడు కోపించి వజ్రాయుధ మున నావానరకిశోరము నెడమకణతపై కొట్టెను. ఆదెబ్బకు సమీరనందనుడు చివాలున నేలగూలెను. తనయునిజాడ గాంచి వాయుదేవు డాతని నొకకొండ చెంతకు గొనిపోయి శైత్యోపచారములచే నాతని తేర్ప యత్నించి తనముద్దు కుమారుని కిట్టియాపద వాటిల్లచేసిన దుర్మార్గులయెడ కోపించి వాయుబంధన మొనరించెను. అట్లు వాయువును బంధించుటచే, యాజకులు అగ్నిహోత్ర మున హవ్యములు వ్రేల్చుటకై చాపినహస్తములు చాపినయట్లు నిలచిపోయినవి; దేవతలు నభోమార్గమున ద్రిప్పుచున్నయానములు నడక మానినవి; స్నానము చేయుటకు నదీనీరమున మునీశ్వరులు ముంచినశరీరములు ముంచినయట్టు లుండె. పశువులు మృగములు మానవులు పుడమిపై పెట్టినపాదములు పెట్టినయట్టు నిలచిపోయె సూర్యబింబ మొకయెడ స్తంభించెను. అందుచే కాలగతియు తప్పిపోయెను. సత్కర్మలు నశించె. వేదపాఠ ముడిగె. గాలి లేకుండుటచే సమస్తసృష్టియందును గగ్గోలు పుట్టెను. మునులును దేవతలును బ్రహ్మకడ కరిగి ప్రపంచమునకు జీవరాసులకు సంభవించిన విపత్తును తొలగింపుమని వేడుకొనిరి. దివ్యదృష్టివలన జరిగినదంతయు గ్రహించి బ్రహ్మదేవుడు దేవతలతో గూడి వాయుదేవు డున్నకొండచరియకు నరిగి వానికుమారునికి ప్రాప్తించిన కీడునకు విచారించి వాయుదేవునెదుట మహేంద్రుని నాత డొనరించినదోషము నకు మందలించి, లోకపావనకరమగు తనకరముచే హనుమంతునిదేహము నిమి రెను. తోడనే యామర్కటకిశోరము క్రొత్తతేజస్సు చెంది నిదురనుండి లేచిన

వానివలె లేచి కూరుచుండెను. ముద్దులొలుకుచున్న కుమారుని తనయంకతల మున బెట్టుకొని బ్రహ్మ లాలింపసాగెను. కుమారుడు బ్రతికినందులకు సంతసించి వాయుదేవు డప్పటియట్లు తనమూర్తిని ప్రపంచమునంతట వ్యాపింపచేసెను. దేవేంద్రాదులు బ్రతుకుజీవుడా యనుకొనిరి. సమస్తప్రాణులు తెప్పిరిల్లెను. బ్రహ్మదేవు డపుడు దేవతలనుద్దేశించి "నెచ్చెలులారా! ఈశాఖామృగశేఖరుడు మహాబలసంపన్నుడు. లోకకంటకులగు రాక్షసులుపలువురు యీతనిచే చత్తురు. వీనివలన లోకమునకు శుభము చేకూరును. తేజశ్శాలియై అజేయు డగుటకు మీ రెల్లరు నీవాయునందనునికిఁవరము లొసగు" డనియెను.

"తే. అనిన, సురలెల్ల నౌమే లని రపుడు వజ్రి
తనకఠారంబు దాకియు హనువు వెలయు
కతన హనుమంతుడనుపేరు కాంచు నతడు
వజ్రహతి నొవ్వ డిక నని వర మొసంగె."

బ్రహ్మదండంబుచేతను బ్రహ్మాస్త్రంబుచేతను హాని కలుగక దీర్ఘాయుష్మంతుడై వెలయునని బ్రహ్మయు, త్రిశూలకాద్రాదిసాధనముల కజేయుడగునని శివుండును, తనదండంబును పాశంబును నీతని నొంచకుండునని యముడును, తన తేజ బునందు నూరవవంతు తేజంబును గొని సకలవిద్యలు తనవలన నెరుగగల వాడని సూర్యుండును, పాశమునను నీటను పడకుండునట్లు వరుణుడును, తనచేత నశియింపకుండునని యగ్ని దేవుండును, తనగదచేత నొప్పింపబడడని ధనదుడును, యేయాయుధముచేతను నొప్పింపబడకుండునని విశ్వకర్మయు వరంబు లొసంగి యాశీర్వదించి నిజావాసములకు జనిరి.

ఇట్లు బ్రహ్మాదిదేవతలవలన వరములొందినతనయుని నంజనీదేవికి నొప్ప గించి పవనుడు వెడలిపోయెను. సూర్యునికరుణచే హనుమంతుడు సకలవిద్యల యందు నారితేరెను.

"శా. భానుం డద్భుతకీ:మండె నంత నిజరూపం బూని యీవానరుం
డా నీరేరుహబంధుతేరి కెదురై యాకాశమార్గంబునన్
తా నెంతేవడి బోవుచున్ శ్రుతులు శాస్త్రంబుల్ పఠించెన్ బరి
జ్ఞానగ్రాహకలావిశేషములకున్ జందాంతు డుద్యాంగకన్"

విద్యయందేగాక వాయునందనుడు బలపరాక్రమములందు మహోన్నతి కందెను. కావుననే,

"సీ. గురిమీర రోదసీకుహర మొక్కటముంప నుప్పొంగుప్రళయ పయోధికంటె
జగములన్నియు నొక్కసారి భస్మముచేయ ననలెడుకల్పక్షయాగ్ని కంటె
బహుపర్వతారణ్యపటలి జూర్ణముసేయ గడగుసంవర్తాశుగంబు కంటె
బ్రహ్మాండభాండంబు బట్టి బ్రద్దలుసేయ దివిరెడు విలయభైరవుని కంటె

గీ. నధికగాంభీర్య మతులితం బగుప్రతాప మనవధికవేగ మద్భుతంబైన రౌద్ర
మియ్యనిలపుత్రునకె కలదితని నోల వాలిగీలియు నిలుతురే వసుమతీశ"

సుగ్రీవుడను వానరశ్రేష్ఠుడు హనుమంతుని బలపరాక్రమములు మెచ్చి యాతని తనకు మంత్రిగా చేసికొనెను.

ఇంతలో నన్నయగు వాలికిని సుగ్రీవునకును కలహము వచ్చెను. ఆయుద్ధమున తమ్ముడు రాజ్యమును రాజ్యముతోపాటు భార్యనుకూడ పోగొట్టకొనెను. అన్నగారిబాధ సహింపజాలక సుగ్రీవుడు ఋష్యమూకమున కరిగి యనుచరులతో దుర్గమమగు నాపర్వతమున నివసించెను. అపుడు రామలక్ష్మణులు సీతను వెదకికొనుచు నాపర్వతసమీపమును చేరిరి. రాముడును సుగ్రీవుడును రొండొరుల యిక్కట్టులు తెలిసికొని యన్యోన్యమైత్రిచే తమకుసంభవించిన విపత్తునుండి తప్పించుకొనుటకు నిశ్చయించుకొనిరి. సుగ్రీవుడును రామునియెడ ననమాన మగుస్నేహభావము జూపెను. పిమ్మట వాలిని జంపి వానరసేనకు సూర్యనందను నధిపతి గావించి శ్రీరామచంద్రుడు వానిభార్యను కూడ వాని కప్పగించెను. తరువాత కొంతకాలమునకు హనుమంతలక్ష్మణులచే ప్రోత్సహింపబడి సుగ్రీవుడు సీతాన్వేషణార్థమై సేవకులను దశదిశలకు పంపెను. ఆంజనేయులు రామముద్రిక గైకొని దక్షిణదిక్కునకు బోయి, సంపాతివలన జానకివృత్తాంత మెఱిగి సముద్రము దాటి లంకకు జేరెను. లంకను కలయవెదకి చివరకు హనుమంతుడు లోకమాతయగు సీతను గాంచెను. మసిబొగ్గులయందు మాణిక్యము వలె మబ్బునందు చంద్రరేఖవలె వికృతాకారులగు రాక్షసస్త్రీలనడుమ సీతను చూచెను. వీలు కనిపెట్టి యాంజనేయుడు తనరాక నామె కెరుకపరచి శ్రీరాముని యుంగర మామె కొసగి యామెవిచారమును పోగొట్టెను.

తిరిగి లంకవిడువక ముందు వాయునందనుడు తనబల మించుక రాక్షసేశ్వరునికి చూపదలచియచటివృక్షసమూహముల నాతడు పెరికి పారవైచెను. లంకయందు పుట్టిన యీసంక్షోభమునకు రావణుడు కోపించి జంబుమాలిని యక్షయకుమారుడు మొదలుగాగల మహావీరులను హనుమంతుని మీదికి పంపెను. ఉక్కుబొమ్మపై పడినసూదిపోటులవలె రాతిబొమ్మపై రువ్వినరాళ్ళవలె మహావీరునిపై బడినవాడియమ్ములు నిష్ప్రయోజనములయ్యెను. నేల యీనినట్లు లంకయంతయు రక్కసిదండుతో నిండుకొనియెను. క్షణములో వాయుకుమారుడు రాక్షససేనను రూపుమాపెను. కోతియొక్క యుద్రేకమునకు మండిపడి యీమర్కటమును మంటకెర జేయుడని నిశాచరపతి రక్కసిమూకకాజ్ఞ యిచ్చెను. ఆయాలోచన బాగున్నదని సంతసించి పోగరెక్కినరక్కసులు చమురున తడిపినవస్త్రములు హనుమంతునితోకకు చుట్టి నిప్పువెట్టిరి; వాయునందనునకు వాయువు సహాయపడెను. లంకనంతకును హనుమంతుడు నిప్పురగుల్కొల్పెను. ఆకాశమంటుమేడ లగ్ని పాలయినవి. మణిరాసులు భస్మమయిపోయెను. పయిడి బూడిదపా లయ్యెను. ఒక్కవానరునివలన తనలంకకు వాటిల్లినచేటు దలచి దశకంఠుడు మిక్కిలి చింతించెను. హనుమంతుడు సీతాదేవి శిరోరత్నమును గొని శ్రీరామచంద్రునికడకు తిరిగి వచ్చి యామెక్షేమము నెఱింగించి యాతనిదుఃఖము నపనయించినవా డయ్యెను.

అటుపైని శ్రీరామచంద్రుడు వారాసి కడ్డుగ వంతెన గట్టి కోతిమూకసాయమున లంక చేరి రాక్షసులను ద్రుంచెను. మేఘనాధుని శక్తియనుబాణమునకు గురియై నేలగూలిన లక్ష్మణుని సంజీవి తెచ్చి సమీరకుమారుడే బ్రతికించెను. వాయుపుత్రునిసహాయముననే శ్రీరాముడు రాక్షసులను సంహరించి విభీషణుని లంకకు పట్టాభిషిక్తుని గావించి తనయర్థాంగిని గూడి పుష్పకవిమానము నెక్కి యాకాశమార్గమున ప్రయాణమయి నభోవీధినిగల చిత్రచిత్ర దృశ్యముల గాంచుచు క్రిందనున్న సముద్రతరంగములశోభ నవలోకించుచు ప్రకృతిసౌందర్యములు పరికించుచు ప్రముదితహృదయుడై యయోధ్య జేరి పట్టాభిషేకసమయమున నాహనుమంతుని బహుభంగుల సత్కరించి యనేక వరముల నొసగెను. ఆంజనేయుండును వరముల నంది చేతులుజోడించి ఫాలతలముననిలిపి భగవంతుడగు శ్రీరామచంద్రు నిట్లు ప్రస్తుతించెను.

"సీ. నియతి రామాయంచు నీనామము జపించు భాగ్యశాలికి వేదపాఠ మేల?
నిను నొక్కపరియైన గనుగొన్న సుజ్ఞాననిధికి బ్రహ్మజ్ఞాననిష్ఠ యేల?
నీభక్తి యొనరించు నిపుణు జేరి భజించు స్థిరబుద్ధికి తపంబు సేయ నేల?
నీకటాక్షముదారి నిమిషమాత్రము చేరి చెలగుమేటికి తీర్థసేన యేల?
తే. నీవినుతి సేయువానికి నిక్కువముగ చింతసేయంగ నణిమాదిసిద్ధు లేల?
జానకీనాథ! నీపాదజలము గ్రోలు ఘనగుణాఢ్యకి దేవత్వకాంక్ష యేల?
సీ. మొదట నెవ్వనిపాదముల బుట్టి నదులలో ఘనకీర్తి గాంచె గంగాస్రవంతి
మునిముఖ్యు లెవ్వానిమూర్తిగానగలేక తపియింపుదురు మహాతపముబూని
యెవ్వానివాక్యంబు లీరేడుజగముల శిక్షించు గౌరవశ్రీ వహించి
మహిమ నెవ్వనియనుగ్రహము కించిజ్ఞుల సర్వజ్ఞులుగ జేసి సవదరించు,
గీ. నట్టి హరివైన నీకు నర్ఘ్యం బొసంగి కన్ను లలరంగ చూచితి కాంక్ష దీఱ
పలుకులునువింటి నీకృప బడయగంటి నద్యధన్యోస్మి యనుకొంటి నాత్మ
యందు."

హనుమంతుడు సముద్రమును దాటెననియు పెద్దపెద్దపర్వతముల నెత్తి పారవైచెననియు కోట్లకొలది రాక్షసులను తనవాలమునకు చుట్టి చంపెననియు శరీరమును పెంచి తూర్పుకొండపై నొకపాదమును పడమటికొండపై నొకపాదమును పెట్టి నిలచెననియు, శ్రీరామసంకీర్తనముచే చంద్రకాంతశిలలను కరగింప జేసి నారదుని తుంబురుని సిగ్గుపడజేసెననియు, పుట్టినక్షణముననే, బహుయోజనములదూరమునందున్న సూర్యమండలముచెంత కుఱికెననియు, దోమయంతయి సురసకాయమునుండి పైకివచ్చెననియు, మైళ్లకొలదిపొడవు తోకను బెంచువాడనియు, రామాయణకావ్యమున గన్పట్టుచున్నది. హనుమంతుని గూర్చిన యీవృత్తాంతములు నిక్కమో విశేషముగా నత్యుక్తితోకూడుకొన్న కవిచాతుర్యమో తెలిసికోవలసియున్నది. కలియుగమున వాటిల్లజాలని సంఘటనలు పూర్వయుగములందు సులువుగ సంఘటిల్లెడివని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఆద్యంతములేని యీ కాలమున కలియుగ మెట్టిదో త్రేతాయుగము నట్టిదే; త్రేతాయుగ మెట్టిదో ద్వాపరమును కృతమును నట్టివే. సృష్టియందు భగవంతుడు భేదభావము నెందుకు చూపును. ఏయుగమునందైనను మానవుడు మానవుడే, ఇప్పటివలె నెప్పుడును పురుషు డంతఃశత్రువులతో పోరవలసినవా

డకొట్టను. ధర్మాధర్మములకును పాపపుణ్యములకును నప్పుడును పోరు చెలరేగు చుండెను. కురుపాండవులరణమును రామరావణులయుద్ధమును ననంతకాలమున జరుగు సంక్షోభములు. రామునివంటి మహాపురుషులును కృష్ణునివంటిపురుషోత్తములును, రామకృష్ణులతోడనే యంతరించుచో వారిపవిత్రజీవనములును వారి మహత్తరఆశయములును నిరర్థకములు గదా! కలియుగమున జన్మించిన బుద్ధుడు పూర్వయుగములయందలి మెట్టిమహాత్మ్యనకును తీసిపోడు. సుమారు రెండువేలసంవత్సరములక్రిందట పుట్టిన యేసుక్రీస్తు సత్యయుగమహాపురుషులలో నెవ్వరికిని తీసిపోడు. కాలము గడచుకొలది నాగరికత యుందదుగువేయు కొలది విజ్ఞానప్రపంచము విశాల మగుకొలది మానవుడు మహత్తరాశయ చరితార్థమునకై జీవనము గడపుచు రామునికంటెను కృష్ణునికంటెను నధికుడు కావలయునని యూహింపవచ్చును. రామునిగొప్పతనము రాముని కాలమున నెఱిగినవారిసంఖ్య యల్పము. శ్రీకృష్ణుని యున్నతిగుణములను గ్రహించిన మనుజులాతనికాలమున నెందఱుండిరి? కృష్ణుని చంపదలచినదుర్మతులు లేరా? అట్లే దేవదత్తుడు గౌతమబుద్ధుని దునుమాడ యత్నింపలేదా? యేసు మహాపురుషుడని యాతడుజీవించియున్ననాళ్లలో నెందరు తెలిసికొనిరి? క్రీస్తు శిష్యులలో నొకరు వానియెడ ద్రోహము పూనలేదా? మానవునియుత్కృష్టత ప్రసిద్ధికెక్కుటకు శతాబ్దములును సహస్రాబ్దములును పట్టును. సంశయములనెడి కారుమబ్బులు సమయమునను నాకాశమునుండి తొలగినగాని మధ్యాహ్నసూర్యుని వలె, యాయుత్కృష్టత కాంతిల్ల నేరదు.

వ్యాసవాల్మీకులు లేనిచో ధర్మరాజాదులయొక్కయు శ్రీరామాదుల యొక్కయు గొప్పతనమును నేడెవ్వ రెరింగియుందురు. అశ్వఘోషుడు పుట్ట కున్న బుద్ధునిమహాత్వ మెందఱకు తెలిసియుండును.

కాల మనంతమైనది. అందెట్టి యద్భుతములైన పుట్టుచుండును. భూత కాలమునందువలెనే వర్తమానభావికాలము లందుకూడ నద్భుతములు గోచ రింపవచ్చును. కవి, మహాపురుషులచరిత్రము వ్రాయుచో నతనిహృదయమున భక్తిపూరము పొంగిపొరలును. ఉత్సాహానదులు పెల్లుగా నబ్బును. ఉన్నది యున్నట్లు వ్రాయుట భౌతికశాస్త్రకారుని పని. ఉన్నదానిని పెంచి, ఉత్ప్రేక్ష, అత్యుక్తిఅలంకారములతో తెలుపుట కవి పని. మహాపురుషునిజీవితమును

వ్రాయునపుడు మహాకవి యాతనిచరిత్రయందెన్నియో యద్భుతములను పుట్టించును. అంతియేకాక మానవులందఱకు బాగుగా తెలియుటకై, కఠినమగు భావములు వెల్లడిచేయునపుడు కవిచంద్రునకు చాలస్వతంత్రత కలదు. భావమున్నది యున్నట్లులు తెలిపిన మనసున నాభావము లవలీలగ చొరజాలవు. ప్రవేశించినను చిరకాల ముండజాలవు. కావుననే భావము వెల్లడిచేయుపట్టుల యందు అలంకారము లవసరము. శ్రీకృష్ణుడు గోపికలతో విలాసక్రీడలు సల్పెనని కవి వ్రాసెను. ఈభావ మున్నది యున్నట్లు సత్యముగ నమ్మి గోపాలునినడత మంచిది కాదని భావింపవచ్చునా? మధురయందు దాడుకొను పండ్రెండేండ్లగడువని బాలునివిషయమై యట్లూహించుట యవివేకముగదా! జీవాత్మ పరమాత్మల యనురాగము దెల్పుటకై ప్రయోగించిన కవిచాతుర్యమును సత్యముగా భావింప తగదు.

కాలిక్రింద మహాకాయుని నొడిసిపట్టి నాలుక పైకి జాపి రక్తముకారుచున్నశిరస్సును చేత ధరించి మహాకాళి కరాళముఖియై చూపట్టును. ఘోరపాపములను భగవతి పట్టి యిట్టు పల్లార్చునని తెల్పుటకయి తత్వశాస్త్రవేత్తలును కవిసార్వభౌములును కాళి కట్టిరూప మొసగిరి.

మహనీయుండగు హనుమంతునిగురించి కవిబ్రహ్మయగు వాల్మీకి తెలిపిన విషయముల మన మీచూపుతో చూడవలయును. రామాయణము బూటకము కాదు. హనుమంతునివంటి మహావీరులు లేకపోలేదు. హనుమంతునిభక్తి; హనుమంతుని శౌర్యము; హనుమంతుని బ్రహ్మచర్యము; హనుమంతుని యాత్మదమనము; హనుమంతుని జితేంద్రియత్వము; ఈమహాగుణములకు అసాధ్యమగు కృత్యము లేదనియే వాల్మీకికవివరేణ్యుని యభిప్రాయము. సముద్రము లఘించుట, కొండలనెగురగొట్టుట మొదలగు నసాధ్యక్రియలు వాయునందనునకు సుసాధ్యములయ్యెనని తెల్పుచు, నీయభిప్రాయమునే యీ ఋషీశ్వరుడు సహజకవితానైపుణ్యమున తెలియపరచెను.

మహాదాదర్శము లెందుందునో హనుమంతు లందే యుందురు. మహాత్త్రరాశయములకు ప్రాపు అయిన భరతదేశమందు యీమహావీరునివంటి మహిమోపేతులు పుట్టుట యాశ్చర్యము కాదు.

౧౨

# గురునానకు

"చెవులన్ వ్రేలుకదంబమంజరులచే చిన్నారిచెక్కుల్ జ్వల
న్నవసంధ్యారుణితాభ్రకాంతి చెలువందన్ మందహాసప్రభా
లవమున్ వెన్నెలతళ్కు జూప మృదులాలంకారుడై వేదనం
స్తవనాగోచరుడైన శౌరియసితచ్ఛాయల్ విలోకించెదన్"

రావీనదియొడ్డున వాటియను ప్రఖ్యాతిచెందిన యొక పట్టణప్రాంతమున తాల్వానందియను గ్రామము కలదు. అందు కాలూవేదియను క్షత్రియుడొకడు వాసము చేయుచుండెను. వేదియనుపదము ఆ వంశమునకు ప్రత్యేకవిశేషణము. పెక్కుకుటుంబములయందలి పురుషులనామములతుద నిట్టి దేద్దియో విశేషణ ముండును. దీనినిబట్టి యావ్యక్తియొక్క ప్రత్యేకజాతి తెలియబడుచుండును. అతని పూర్వులు పూర్వము లాహోరునందు వసించుచుండువారు. (వాల్మీకి యాశ్రమమున జానకి కుశలవులను కనినపిదప వారు పెరిగి పెద్దవారై బాహు బలసంపన్నులై రాజ్యమును విరివియొనరించి తమపేరులతో నూతననగరములను నిర్మించిరి. లవునిచే కట్టించబడిననగరము 'లావర్' యనియు కుశునిచే కట్టించ బడిననగరము 'కుశర్' యనియు పరగుచుండెడివి. ఇపు డాపేరులు లాహోరు, కశోరులుగా మార్పుచెందినవి). సూర్యవంశజుడగు శ్రీరామచంద్రునిసంతతి కీవేదవంశము చెందెనని వాడుకకలదు.

కులరావు లాహోరున కధిపతి. ఆతని సోదరుడు కులపత్ కుశరుపట్టణ మున కేలిక. తన రాజ్యమును వృద్ధిచేయుతలంపుతో కులపత్ తనసోదరుని యుద్ధమున నోడించి యాతనిరాజ్యము నాక్రమించుకొనెను. సమరపరాజయము గాంచిన కులరావు తలదాచుకొనుటకై దక్షిణసీమకు పారిపోయెను. అచట అమృతుడను భూపతి యాతనిని వాత్సల్యమున చూచి, తనకుమార్తె నిచ్చి యతనికి వివాహము చేసెను. అమృతునకు పుత్రసంతతి లేనందున నతనియనం తర మాదేశమునకు కులరావు ప్రభు వయ్యెను. కులరావు కుమారుడు సోదీ రావు, బలపరాక్రమ సంపన్నుడు. విక్రమశాలి. తండ్రికి జరిగిన యవమాన

మును దలంచి యతడు లాహోరుమీదికి దండెత్తి కులపతి నోడించి తనజనకుని రాజ్యమును తిరుగ స్వాధీనము చేసికొనెను. అంతట కులపతి వారణాసికి పోయి తనజీవిత శేషమును వేదపఠనమున వినియోగించెను. ఆ వేదాధ్యయనమున పర పీడనము పరమపాపనమనియు నితరులను పీడించువాడు నరాధముడనియు తెలిసి కొని, తన సోదరునియెడల తా నొనరించిన యకృత్యమునకు సంతాపము చెంది లాహోరు చేరి సోదరుని కుమారుడగు సోదీరావును తనను క్షమింపుమని వేడి కొని, కొన్నినాళ్లానగరమున గడపి యతనికి పట్టాభిషేకము గావించి తాను స్వీయసీమ కరిగెను. కులపతి వేదాధ్యయన సంపన్నుడయి దివ్యజ్ఞానమును బడయుటచే నంతటినుండియు 'వేది' యనునుపాధి నీవంశస్థులు పొందిరి.

కాలూవేది త్రిపతాయను నొకసులక్షణసంపన్నయగు కన్యను పెండ్లి యాడెను. కొన్నియేండ్ల కామెయం దొకకూతురు కలిగెను. కుమార్తెపేరు జానకి. మఱికొన్ని సంవత్సరములు గడచినపిమ్మట నొక కార్తీకపూర్ణిమనాటి యర్ధరాత్రమున, 1469 వ సంవత్సరమున నాతని కొకతనయుండును పుట్టెను. తనయోత్పత్తికి కాలూవేది పరమసంతోషమును చెందెను. బ్రాహ్మణులను రావించి బాలుని వారికి చూపెను. పసిపాపని యసాధారణసౌందర్యమును శరీర చిహ్నములును పరికించియు జననతిథినక్షత్రాదుల ననుసరించియు వారు కాలూ వేదితో "నీపూర్వజన్మపుణ్యమువలన సర్వలక్షణలక్షితుడగు కొమారుని బడయ గలిగితివి. ఈతడు నీకులమును పవిత్ర మొనరించు" నని పలికి యాత నికి 'నానకనిరంకారి' యనునామధేయ మిచ్చి వెడలిపోయిరి.

నానకునకు చిన్నతనమునుండియు బ్రాహ్మణులన్నను, సన్యాసులనినను మిక్కిలిభక్తి. జనకు డాతని కైదవయేట నక్షరాభ్యాసము గావించెను. అసా ధారణబుద్ధిశాలి యగుటచే నచిరకాలమున నతడు పెక్కుభాషలయందును పెక్కుశాస్త్రములయందును గొప్పపాండిత్యము సంపాదించెను. ఇట్లు గురుని కడ విద్యలనభ్యసించుచు నొకనాడు హఠాత్తుగా నాచార్యునితో నత డిట్లనియె. "శునో పాండె కె యాలిఖో జంచలా। లెఖ రామ్‌నామ్ గురుముఖ గోపాలా॥" (ఓయిపండితుడా! అర్థములేని యీవిద్యల నేల నేర్పెదవు. గురువునేర్పదగినది రామకృష్ణనామస్మరణమేకదా!)

ఒకనాడు నదియందు స్నానముచేయుచు నానకు బ్రాహ్మణులుకొందఱు తర్పణములు విడచుట గాంచి తానును దోసిలినిండ నీరు గ్రహించి యొడ్డున నానీరమును విడువదొడగెను. అది గాంచి బ్రాహ్మణులు యత డొనరించుపని యేమి యని నానకును ప్రశ్నించిరి. "మీ రేమిచేయుచుంటిరో ముందు నాకు తెలిపినచో నేను మీప్రశ్న కుత్తర మొసగెద." నని యతడు బదులు చెప్పె. పరలోకగతులైన తమపూర్వులకు జలదాన మొసగుచుంటిమని వారు బదులు పలికిరి. "ఇచటికి కొంతదూరమునందున్న మాతోటకు నీరు పోయుచుంటి" నని నానకు జవాబు చెప్పెను. "గట్టుమీద నీవు పోయుచున్ననీరు తోట కెట్టు లందగలదు పిచ్చివానివలె కానిపించుచున్నావు." అని బ్రాహ్మణులు వాక్రుచ్చిరి. ఇచటికి కొలది దూరములో నున్నతోటచెట్లకు యీనీరు చేరజాలకుండిన యెడల పరలోకమందలి మీపితృదేవతలకు మీదోసిళ్లయందలియుదక మెట్లు చేరగలదు ?" అని నానకు ప్రశ్నించెను. "ఓయీ ! నీ వింకను బాలకుడవు నీవు నేర్చుకొనవలసినవిషయము లనేకము లున్నవి. మేము వదలుచున్నజలము మంత్రముచే పవిత్రము చేయబడినది. మంత్రబలముచే లోకసామాన్యముగాని క్రియ లనేకము నిర్వహింపబడును. నీ వది యెఱుగవు. అందువలననే మమ్ము లను చూచి నీవు పరిహాసింప సాహసించితివి." అని యావిప్రులు నానకును మందలించిరి. తా నింకను తెలిసికొనవలసినవిషయము లనేకము లున్నవని యావిప్రులపలుకులవలన గ్రహించి యప్పటినుండియు నతడు ధర్మశాస్త్ర గ్రంథము లనేకములు మిక్కిలి శ్రద్ధతో చదువ ప్రారంభించెను.

ఇట్లుండ కాలూవేది తనయున కుపనయనము గావించెను. తొలుత నానకు జందెము ధరించుట కిష్టపడలేదు. కాని పూర్వాచారపరాయణులగు పండితులును తల్లిదండ్రులును నచ్చజెప్పగా నతడు ధరించెను. జందెమును ధరించు సమయమున నాతడు పురోహితు నుద్దేశించి "మహాశయా ! యీ దారము మెడను దగుల్చుకొనిన కలుగులాభ మేమి ? దర్పిష్ఠులు సలిపి నరకకూప మునబడువాని నిది పైకిలాగునా ? భక్తిసూత్రముచే నింద్రియములను గట్టి వైచి సత్యమను దండమును చేత పూనిన యెడల పుణ్యాలోకమున చోటు లభింపదా ? " అనియెను. బాలునినోటినుండి పెద్దకబురులు వచ్చుట చూచి యతని జననీజనకులును బ్రహ్మాయు మిగుల కోపించిరి.

బాల్యకాలమునుండియు నానకు సంసారవిముఖుడగుటగాంచి యెట్లైన నాతని మనసు మరలింప నిశ్చయించి వానిజనకుడు నానావిధములగు సంసార కృత్యములయందును నతనిని నియోగింపదొడగెను. కాని యాపనులయందు బాలునిమనస్సు ప్రవేశించెడిదికాదు. ఒకనాడు కాలూవేది కొంతయుప్పును వానికిచ్చి యమ్మిరమ్మని దెలిపి తోడుగా మరియొకనినికూడ పంపెను. కొందరు సన్యాసు లాకలిచే బాధపడుచు దారిలో వారి కెదురైరి. సన్యాసుల దీనదశకు మిక్కిలి జాలినొంది నానకు కూడవచ్చువానితో "అయ్యా! లాభముకొరకై మనము వర్తకము చేయబోవుచుంటిమి. కాని యీలాభము భూలోకసంబంధ మైనదే కదా. కొలదిదినములలో నది ఖర్చు అయిపోవును. పరలోకసంపదను మనము సంపాదించినచో అది వెచ్చముకాదు. ఈఉప్పు నీప్రాంతమున విక్ర యించి వచ్చినడబ్బు యీసన్యాసులయాకలి పోగొట్టుటకయి ఖర్చుపెట్టితిమేని వినాశములేని పరలోకసంపదనుకూడ సంపాదింపజాలుదు" మనియెను. అతడును దానికి సమ్మతించెను. ఉప్పు నమ్మినద్రవ్యము సన్యాసులసంతర్పణమునకు సరి పోయెను. పిమ్మట యింటివైపున కాతడు మరలెనుగాని తండ్రికోపించునను భయ మున నిటునటు నడయాడదొడగెను. కొడుకుచేసినపని ముందే పని కాలూ వేది కుమారుని మిక్కిలి దూషించెను. ఎవ్వానిచిత్తము ధర్మచింతయందు మునిగియుండునో యెవ్వానిహృదయము భక్తిరసముతో నిండియుండునో యాతనిమనోగతి నెవ్వ రాపగలరు. జనకుని కేకలు లెక్కసేయక నానకు రెట్టిం చినయానందముతో సత్క్రియలను చేయుచునే యుండెను.

వర్తకమునకు తనయుడు తగడని తలచి కాలూవేది నీచకృత్యమని తల పక యింటిదూడలను పొలమున మేపి తీసుకొనిరమ్మని యతని కాజ్ఞాపించెను. తండ్రియాజ్ఞ తలధరించి నానకు ప్రతిదినము పశువులను పొలమునకు తోలుకొని పోదొడగెను. పశువులను మేపుచు భరింపరానియెండచే నలసి యతడొక చెట్టు నీడ నిదురించెను. గోగణము అటునిటుతిరిగి చేరువగానున్న యొక పండినచేనున పడి మేయదొడగెను. ఆ పొలముకాపు చూచి యామాద నవ్వాలకుతోలి పశులకాపరిని నోటికివచ్చిన త్లిల్ల తిట్టి తగువిధమున వానికి బుద్ధి చెప్పుటకయి యాతని వెదకెను. కనుచూపుమేరలో చెట్టునీడ నిద్రించువాతడే సోమరియగు పశువులవాడని గ్రహించి కర్రచేతబట్టి కాపువా డతనివైపు పరువెత్తెను.

పోయి చూచునప్పటికి గాఢనిద్రపోవుచున్న యాతనిపై యాకులసందునుండి పడుచున్న యెండవేడి దగులకుండ నొక కాలభుజంగము విశాలమగు తన పడగ నాతనిపై నెత్తియుంచెను. కాపువా డాభయంకరదృశ్యము గాంచి యావలకు జనెను.

నానకుతండ్రియే యాగ్రామకరణము. గ్రామస్థులందరు నతనిచెంత కొక నాడరుదెంచి "అయ్యా! మీకొడుకునకు మతిచెడినట్టున్నది. అతడు పూర్తిగా పిచ్చివాడు కాకయుండే తాము జాగ్రత్తపడుట మంచిది. త్వరలో నతనికి పరిణయము గావించినపక్షమున వానిచిత్తము తిన్నబడునని మాయుద్దేశము"అని వచించిరి. కాలూవేది వారియభిప్రాయము సరియైన దని తలచి విటలపరగణా యందు వసించు మాలాయనాయను క్షత్రియుని కుమార్తెను కొలదిదినము లలో తన కుమారునకు వివాహముచేసెను. మెడలువిరిచి కొడుకునకు నాగలి కట్టిపెట్టినను సంసారసుఖములదెస కతని హృదయము మరల్పజాలకపోయెను.

నానకుసోదరి జానకికి తమ్మునిపై ననురాగము మెండు. దౌలత్ ఖాన్ లోడీక్రింద నౌకరీచేయు జయరాము డనునతనికి కాలూవేది తనకుమార్తెనిచ్చి పెండ్లిచేసెను. సంసారపరాఙ్ముఖుడై యున్నతమ్మునకు పలువిధముల హితోపదేశము చేసి తనభర్తతో చెప్పి యతనికి జానకి నవాబుగారి కచేరియందు చిన్నపని నిప్పించెను. క్రమేణా నానకునకు శ్రీచందుడు లక్ష్మీదాసు ననునిద్దరు కుమారులు కలిగిరి. సంసారబంధమున కట్టుబడియుండి దౌలత్ ఖాన్ లోడీక్రింద కొంతకాలము నానకు పనిచేసెను. తనజీతమునం దధికభాగమును నతిథులకు నభ్యాగతులకు సాధువులకు పకీరులకు దీనులకు వినియోగించుచుండువాడు. ద్రవ్యము కొంచెముమాత్రమే నిజకుటుంబరక్షణ కుపయోగించుచుండువాడు.

కచేరీయందు పనిచేయుచున్నను నానకుమన మెల్లపుడు నాత్మవిషయిక చింతయందే యుండెడిది. అందుచే నధికారు లతనిని యుద్యోగమునుండి తీసివైచిరి. ఇంటియం దుండునపుడు నానకుచుట్టములును మిత్రులును నతనిని విషయసుఖములదెస మరలించుటకు యత్నములు సేయుచుండువారు. వారి యుపదేశములకు నత డిట్లుత్తర మిచ్చుచుండువాడు. "అయ్యా! కరుణించి నాకిట్టియుపదేశములు చేయకుడు. విషయసుఖముల కొరి ప్రపంచకృత్యముల కెడ మనస్సును వెళ్ళనిచ్చి వృథాగా కాలహరణము చేయుటకుబదులు ఆధ్యా

త్మికచింతయం దాకాలము వినియోగించుట యుచితము కాదా ? విషయ చింతల కొకసారి హృదయమున చోటు కల్పించితిమేని యది చిత్తమునంతను నాక్రమించుకొనును. ఒకేసమయమున నిహపరచింతలు సలుపుటకు నాచిత్త మంతవిశాలమైనది కాదు.

క్రమక్రమముగా నానకునకు నీశ్వరునియెడగలభక్తి యధికమయ్యెను. ఎల్లప్పుడు ధ్యానపరుడై యుండుటచే నేది యొనర్చుటకును నత డసమర్థుడై యుండువాడు. అందువలన నాతనితలిదండ్రులు మిక్కిలి దుఃఖితు లగుచుండు వారు. ఒకనా డాతనిజనకుడు పలుతెరగుల బోధించి వ్యవసాయము చేయవల సిన దని వానిని నియోగించెను. అందుకు నానకు "తండ్రీ! నాకు మిగుల ప్రశస్తమగు పొల మొకటి దొరికినది. అందుండి క్రొత్తమొలకలు క్రమక్రమ ముగా పుట్టుచున్నవి. అవి పెరుగుటకు నేను శక్తివంచనలేక ప్రయత్నము చేయవలెను. అందుచే నిపుడు మరియొకపొలమువైపు దృష్టి నిలుపజాలను." అని బదులు చెప్పెను. అపుడు తండ్రి "తనయా! నీపరుస యెంతయు నాకు వింతగా దోచుచున్నది. ఎంతపొలము దొరికిన దనెదవు? అది యెచ్చట దొరికి నది? మన కెన్నియో భూము లున్నవి. వ్యవసాయము చేసితి వేని సస్యము సమృద్ధిగా పెరుగును." అని వచింప "సత్పురుషులసాంగత్యమువలన నామనస్సు వ్యవసాయదారు డయ్యెను. నాజీవనమే యాతడైతు వ్యవసాయముచేయు క్రొత్తపొలము. సుందికర్మయను నాగలి సర్వదా యాపొలమును దున్ను చున్నది. అనురాగజలముచే నది నీరు పెట్టబడుచున్నది. హరినామమను బీజము లందు నాటబడుచున్నవి. సంతోష మనుసాధనము పొలమున నెత్తుపల్లములు లేకుండునట్లు చేయుచున్నది. పిమ్మట భక్తి ఫలసాయమను రాశి చేయుచున్నది. భక్తవత్సలుడగు భగవంతుడు నాయెడ కరుణాళుడై నిరాకారమైయున్న తనగృహమున నాకు తావొసగెను" అని కుమారుడు జవాబిచ్చెను.

ఈమాటలు తండ్రి కర్థము కాలేదు. కమతమున ప్రవేశించుట కుమా రున కిష్టము లే దని తెలిసికొని "కుమారా! కృషిచేయుటకు నీచిత్త మొల్ల కుండినపక్షమున వర్తకమునైన చేయు"మనెను. "జనకా! నేను వర్తకము చేయుచునే యున్నాను. నామనస్సు బజారు. హరినామరత్నముల నందు ప్రోగు పెట్టుచుంటిని. సాధువులతోడను, సత్పురుషులతోడను ననవరతము క్రయ

విక్రయములు సలుపుచుందును. ఈవర్తకమున నాకెంతేని లాభము వచ్చుచున్నది''యని కుమారుడనెను. "కుమారా! నీయుపన్యాసము నాతల కెక్కుటలేదు. వ్యవసాయముగాని వాణిజ్యముగాని చేయుటకు నీకు మనస్కరింపకుండినచో నేదేని యుద్యోగమైన చేయు''మని జనకుడతనితో ననెను. "నేను భగవంతునిక్రింద నౌకరి చేయుచునే యున్నాను. ఎడతెగని సేవయే నేనొనరించునౌకరి. నిరాకారుండగు నాప్రభువుయొక్క కృపాదృష్టి నాపై కురియుచో ధన్యుడ నగుదు''నని నానకు ప్రత్యుత్తర మొసగెను.

ఈశ్వరప్రేమయను మహాసముద్రమున లోతుగా దిగినకొలది నానకు బాహ్యజ్ఞానశూన్యుడై చూచువారి కున్మత్తునివలె కనుపడుచుండెను. పుత్రునకు పిచ్చియెత్తినదని యూహించి వృద్ధుడునాయుర్వైద్యమున ప్రసిద్ధిజెందిన యొక వైద్యుని రావించెను. నిరంతరధ్యానపరుడై భగవంతుని చెలిమికలిమిని సుఖమనుభవించుచు, నానకొకప్రదేశమున నొడలు మరచియుండెను. తనయుని కడకు కాలూవేది చికిత్సకుని తీసికొనివచ్చెను. దేహమంతట వస్త్రము కప్పుకొని నానకొకగదిలో మూల పరుండియుండెను. వైద్యుడాతనిచెంత కరిగి నాడి పరీక్షించుటకై యాతనిహస్తమును పట్టుకొన నానకాతనితో "మహాశయా! తమ రేమి పరీక్షించుచుండిరి? నాశరీరపీడనమును తెలిసికొనుటకు ప్రయత్నముచేయక మున్ను నాహృదయమును నంటియున్న బాధను తొలగింపు''డని యనెను.

ధర్మసారమును గ్రోలవలె ననుకొందరలో నాతడు హిందూమహమ్మదీయమతములయందలి పెద్దపెద్దగ్రంథములను చదివెను. కాని యంతటితో నతని చిత్తము తుష్టి చెందలేదు. ఎల్లకడలయందును, ప్రబలమైయున్న మూఢవిశ్వాసమును, బాహ్యక్రియాకాండమును చూచి నిక్కపుగుతత్త్వమును గ్రహింపకుతూహలియై సన్యాసివేషము ధరించి భారతదేశమందలి వివిధస్థలములు తిరిగెను. అతడొకసారి మక్కాకు జని, బడలికచే నొకమసీదుదిక్కునకు కాళ్లు సాచి పరుండెను. అపుడొకమహమ్మదీయు డతనిని చూచి "అరేకాఫర్! అల్లాయొక్క గృహముదిక్కుగ పాదము లుంచి పరుంటి వేమి. నీవు దుర్మార్గుడవువలె నున్నావు. మంచిచెడ్డ లెరుంగవా? బుద్ధి లేదా?'' యనియెను. "సోదరా! దేవునిదెస కాళ్లు రాకుండ పరుండుటకు వీ లగుదిక్కు నీవు చూప

గలవా ? సర్వవ్యాపకు డగునశ్వేశ్వరునిదిక్కునకు పాదములు జాపకుండ నుండు టెట్లు?" అని వానికి ప్రత్యుత్తర మీయ నామహాత్ముఁడీయు దూరకుండెను.

తాను తిరిగినదేశములయందెల్ల నపవిత్రతయు బాహ్యక్రియాచరణాడంబరమును, మాయవేషములును, మోసమును పరికించినవాడై, బాహ్యవేషమును, జాత్యభిమానమును మొదలంట నశింపజేసి, మానవులు పరస్పరద్వేషములు మాని పరిశుద్ధాత్ములై, ధర్మచింతాపరాయణులై సాధువర్తనులై విషయనిగ్రహులై సత్పథవర్తనులై పుణ్యకర్మాచరణులై, వర్తించునట్లు చేయుటకై తగినప్రబోధము చేయుతలంపుతో మరల స్వదేశము చేరుకొనెను.

బలభాయి, భగీరథ, మాసుఖ, మర్దానా మొదలగుభక్తులు నానకునకు శిష్యులు. క్రోడీయా యనుశిష్యుడు కర్తారపురమున నొకచక్కనియిల్లు కట్టించి, దానిని స్వీకరించి యందు వసింపు మని గురువును వేడికొనెను. కాని నానకుండులకు చాలకాలమువరకు సమ్మతింపలేదు. శిష్యుడు పలుమారు దీనముగా వేడికొనుటచే నతనిమనస్సును నొప్పించుట కిష్టములేక తుదకు తలిదండ్రులను భార్యాపుత్రాదులను నటకు రప్పించి యాగృహమున వసించెను.

కర్తాపురమున నున్నతఱి నానకుమానసము పూర్తిగా వైరాగ్యమువైపు మరలిపోయెను. గృహస్థాశ్రమమును వదలి యతడు సన్యాసియాశ్రమము స్వీకరించెను. (బ్రహ్మచర్యము ; గార్హస్థ్యము ; వానప్రస్థము; భైక్ష్యము నని యాశ్రమములు నాలుగు. ఉపనయనానంతరమున ద్విజుడు బ్రహ్మచర్యమును వివాహమైనపిదప గార్హస్థ్యమును పిమ్మట సంసారభారము కుమారునిపై బెట్టి యడవిలో నివసించుట వానప్రస్థమును కడపటివయస్సున కోరికలన్నియు వీడి సన్యాసజీవనమును గడుపవలయును. ఏయేజాతివా రేయేయాశ్రమముల నెట్లు స్వీకరింపవలయునో యావివరము వామనపురాణమందు వ్రాయబడియున్నది.) అతడెవ్వరికడ దీక్ష నవలంబించెనో తెలిసికొనుట కాధారములు లభింపలేదు కాని యోగాభ్యాసమున మిక్కిలిప్రవీణుడై యుండెను. రెండుమూడుదినములు నిద్రాహారములు మాని యోగాసనమున కూర్చుండ గలశక్తి యాతని కుండెడిది. సూల్తానపురమున నదియందు స్నానముచేయుచు మూడుదినము లాతడానదియందే యుండెను. నీరువెలువడి తపస్సునకై యాతడు చేరినవృక్షతలమును "బాబాకీబేర్" అనియు, యోగనిద్రకై యాతడు చేరినకారడవిని "ఖోరీ—సాహెబ్" అనియు లోకులు నేటికిని చెప్పుకొనుచుందురు.

హిందూముసల్మానులయందు ఐకమత్యమును సోదరభావమును నెలకొల్పుటకయి రెండుజాతులకు నొకేమత ముపదేశించుటకొఱకు శిష్యులను వెంటబెట్టుకొని యితడు దేశసంచారము బయలుదేరెను. మూల్తానునగరమున నొక గొప్పయుత్సవము జరుగుచుండెను. ఆయుత్సవమునం దతడు ధర్మోపదేశముచేయ ప్రారంభించెను. అన్నిమతగ్రంథములయందలి విషయములును వాక్రుచ్చుచు కొరానువిషయయుమాత్ర మతఁ డుచ్చరింపకుండుటచే ఇబ్రహాంలోడీ కోపించి యాతనిని చెఱసాలయం దుంచెను. సుమారేడుమాసము లతఁ డందే యుండెను. అనంతరము, బేబరువలన ఇబ్రహీము పానిపట్టుయుద్ధమున 1526 సంవత్సరమున నోడిపోయి చనిపోయినందున నానకు చెఱనుండి విముక్తి గాంచెను.

నానకు దేశసంచారము చేయుచు నొకసమయమున నొకగ్రామసమీపమున బస చేసి బుద్ధుడను నొకమనుజుని నచటికి సమీపమునునన్న యొక కొలనికి బోయి కొంచెము పానీయములు తెమ్మని కోరెను. ఆత డాకొలనికడ కేగి యది జలశూన్యమై యెండిపోయియుండుట చూచి విచారించుచు తిరిగి వచ్చి నానకునకు విన్నవించెను. నాన కప్పు డతనితో తిరిగి పోయి చూచినచో నాసరస్సు నిర్మలజలముచే నిండియుండు నని చెప్పగా నాతఁ డం దరిగి నానకు చెప్పిన ట్లాకొలంకు స్వచ్ఛవారిపూర్ణమై యుండుట గాంచి యాశ్చర్యము నొంది, పానీయము దెచ్చి నానకున కిచ్చి యంతటినుండియు నప్పురుషు డతనికి ముఖ్య శిష్యుడుగా నుండెను. అంతవరకును నీరు లేకుండుటచే మిగులచిక్కుపడుచున్న చుట్టుపక్కలగలపల్లెటూరిజన మెల్ల నది గాంచి యబ్బురపడి యోగివరుని ప్రభావమును మిక్కిలి కొనియాడిరి. ఈవింత జరిగినప్రదేశమే అమృతసరమని నేడు లోకప్రసిద్ధమై వెలయుచున్నది. ఈఅమృతసరము సిక్కుమతస్థుల ప్రధాన తీర్థస్థానము. ఆప్రాంతము లయందలి జనులు చాలమంది నానకు శిష్యులైరి. సిక్కుల నాల్గవగురువగు రామదాసు 1574 వ సంవత్సరమున నాసరోవరమును విశాలముగా త్రవ్వించి దానినడుమ నొకదేవాలయము గట్టించెను. పిమ్మట 1802 వ, సంవత్సరమున నది యంతయు శిథిలావస్థయం దుండుట తిలకించి రణజిత్ సింగు చాలాధనమును వినియోగించి యాసరస్సును, దేవమందిరమును బాగుచేయించి దేవాలయమును బంగారుచే సింగారము గావించెను. అప్పటి నుండియు నది సువర్ణదేవాలయ మనుప్రఖ్యాతి చెందెను. (దీనినే ఆంగ్లేయులు Golden temple అని పిలుతురు.)

అమృతసరస్సు మిక్కిలి విశాలమైనది. ఎల్లప్పుడు స్వచ్ఛమైన జలముచే నిండియుండును. దీనినడుమనున్న దేవాలయము మిక్కిలి పెద్దదియును గాదు, మిక్కిలి చిన్నదియును కాదు. ఉదయమందును సాయంకాలమందును చెఱువునీట మందిరము ప్రతిఫలించి చూపరులకు మిక్కిలి సౌందర్యవంతముగా కనుపించును. గట్టునుండి దేవాలయమువరకు స్ఫటికశిలావినిర్మితమైన సేతువు కలదు. జగత్ప్రసిద్ధివడసిన తాజమహాల్ నందును లాహోరునందలి జహాంగీరు జుమ్మామసీదులందును గల స్తంభములబోలు నెత్తగు కంబ మొకటి యీ యాలయపార్శ్వమున గలదు. దాని నెక్కి చూచినచో నచటికి 32 మైళ్ళ దూరమున నున్న లాహోరుపట్టణమును యింకను దూరమున నున్నపంజాబు పల్లెలును కూడ కనుపించును. గర్భాలయమున ఎత్తగు బంగారుఅరుగులపై నానకు గురుగోవిందు మున్నగు సిక్కుగురువులచే రచింపబడిన యమూల్య గ్రంథము లనేకములు జాగ్రత్తగా కాపాడబడుచున్నవి. సిక్కులు వాటిని పూజించుచుందురు. సిక్కుభక్తుల భక్తిపూర్వక నృత్యగానములతో నాలయ మెప్పుడును కన్నులపండు వొనరించుచుండును.

ఈయాలయమునుబోలు బంగారుదేవాలయము మరియొక టిటీవల హిందువులచే నమృతసరమున కట్టబడినది. పండిత మదనమోహనమాలవ్యా యీ దేవాలయము కట్టించుటకు చాలాద్రవ్యము తెచ్చెనని చెప్పుదురు.

స్వయంకృషిచే నానకు త్రికాలవేది యయ్యెను. తీర్థయాత్రకై యాతడొకనాడు పయనమైపోవుచుండగా దారిలో దేహమునిండ విభూతి దాలిచి మెడనిండ రుద్రాక్షపేరులు ధరియించి నుదుట తిలకము చక్కగా దిద్ది రెండవ బ్రహ్మయని జనులకు దోచెడువేషముతో నొకబ్రాహ్మణు డెదురై యచటికి చేరువనుగల తనుకట్టించిన ధర్మశాలకు నానకును రమ్మని వేడికొనెను. నానకు దివ్యదృష్టిచే యావిప్రుడు యాత్రీకులను బ్రతిమాలి వినయముతో తనధర్మశాలకు కొంపోయి వారి నందు విడియించి రాత్రి వారు నిదురించుతరి వారిని జంపి వారిసొత్తును నగలను నపహరించుచుండె నని గ్రహించి యావిప్రునితో "ఓయీ! నద్వంశమున జన్మించియు నీవు పరమదుర్మార్గుడవైతివి. బ్రహ్మణవేషమును దాలిచి బ్రహ్మరాక్షసికంటెను క్రూరుడవై ప్రవర్తించుచుంటివి. ఇకముందైనను నీదుష్టప్రవర్తనమును మాని నీతివర్తనుడవు కమ్ము" అని యతనికి బుద్ధి

చెప్పెను. తనదుష్ప్రవర్తనమును గ్రహించిన నానకుయొక్క దివ్యజ్ఞానమహిమ కాబ్రాహ్మణుడు వింత నొంది, తనదుష్టచేష్టితములకు మిక్కిలి విచారించి యంతటినుండియు మంచిమార్గమున నడతు నని యాతనికి మాటయిచ్చి తన దారిం జనియె.

పిమ్మట నానకు రామేశ్వరమువైపు కదలిపోయెను. పోవుచు మహానదీ తీరమున కటక్ సమీపమున నొకవనమున బసచేసెను. అతనిప్రధానశిష్యు లిరువురు వెంటనుండిరి. శిష్యులిరువురును మంచిపాటకులు. అతని కుపచారము చేయుచు శ్రావ్యముగ భజనకీర్తనలు పాడుచుండువారు. నానకు రచించిన భజనకీర్తనలు లోకప్రఖ్యాతి గాంచినవి. తన్మయుడై శిలలుసైతము కరగునట్లామహనీయుడు భజన సేయుగలుగువాడు. ఆతడు తీర్థయాత్ర సలుపుచు విడిసిన తావులయం దెల్ల వేలకొలది ప్రజలు దర్శనమునకు వచ్చి యాతనిభజన కీర్తనలు విని పావను లగుచుండిరి. నానకు విడిసినయా వనమునకు కటకుపురవాసులు గుంపులుగుంపులుగా వచ్చి పరమానందభరితు లగుచుండిరి. ఆసమయమున కటకమునందు చైతన్యభారతియను మహారాష్ట్రీయమతాధిపతి యొకడుండెను. అతడు భైరవభక్తుడు. అతనికి భైరవుడు మిగులప్రసన్నుడయి వలయు సపర్యలు చేయుచుండును. నానకుమహాత్త్వ మాతనికి వినవచ్చి హృదయశూలమయ్యెను. అసూయాగ్రస్తుడై యాతడు భైరవుని బిలిచి "మహానదీతీరమందలి యుపవనముననున్న నానకును సపరివారము సంహరించి రా" మ్మని యాజ్ఞాపించెను. భైరవు డాయిష్టభక్తుని యాన శిరసావహించి యుపవనమున కరిగెను గాని, యందు ప్రవేశింప లేడయ్యెను. మరల మరల నందు కాలుపెట్ట యత్నము సలిపెను గాని విఫలమనోరథు డగుచుండెను. ఎన్నిసారు లట్లు తనపూనిక వ్యర్థమయినను మానక వనమున నతడు ప్రవేశించుటకు యత్నము చేయుచునే యుండెను. నానకు భైరవుడిట్లు తరుచు వచ్చిపోవుచుండుట తెలిసికొని, యాతడెందుకై వచ్చుచుండెనో కనుగొని రమ్మని తనశిష్యు నొకని పంపెను. శిష్యుండును నాచార్యుముదల గైకొని భైరవుని జేరి యాతనిరాకకు కారణ మేమని యడిగెను. భైరవుండును సంశయింపక తాను చైతన్యభారతి యాదేశమున నానకును సపరివారముగా సంహరింపదలచి వచ్చుచుంటి ననియు, తా నెవ్వడీవనమున కాలుపెట్టినను తనదేహము నిప్పులో ప్రవేశించుచున్నట్లు బగ్గుబగ్గున

మండదొడగు ననియు, ఆతాపము చల్లారినపిదప మరల నందు చొచ్చుటకు యత్నము చేయుచుందుననియు యెప్పటికిని తనయుద్దేశము నెరవేరకున్న దనియు జవాబు చెప్పెను. ఆయుదంత మంతయు శిష్యుడు గురువున కెరింగించెను. అంతట నానకు భైరవుని తనచెంతకు బిలిపించెను. పిలిపించి "అయ్యా! భైరవా! నీవు నీబలమును నిర్దోషులపై ప్రయోగింప దలచుటచే నీయెడ లిట్లు మండినది. మహానీయుండవగు నీవు యిట్టిచెడుకర్మలకు చేయిచేసుకొనుట మిగుల విషాదకరమగు నంశము. ఇకముందైన నిట్టిపాడుపనులు మానివేయుట మంచి" దని యాతనికి హితవుపదేశించెను. భైరవు డామాటలు విని సంతసించి నానకునకు నమస్కరించి తాను తలచినయపరాధమునకు మన్నింపుమని యాతనిని వేడి, చంపుటకై తానుతెచ్చినగద నచట పారవైచి మాయ మయ్యెను. నాన కాగదను చేత పూని మహారాష్ట్రాధిపతి యీసుచే తల చిన దుష్క్రియగాని యది భైరవునకు తోచినది కా దనియు భైరవుడు నైజ మున మంచివాడనియు శిష్యులకు తెలిపి యాగదను భూమిపై పాతి పెట్టెను. వెంటనే యది చిగురించి చెట్టయి వృక్షమయి పుష్పములతోడను కాయల తోడను పండ్లతోడను నిండిన దాయెను. ప్రజలావింత చూచి యబ్బురపడ సాగిరి.

నానకు శిష్యులతో కూడుకొని పిమ్మట జగన్నాథము చేరి స్వామిని దర్శించుటకై యాలయమునందు ప్రవేశించెను. అచ్చటి యురియాబ్రాహ్మణు లతనిని తురకవానిగా పొరపడి యవ్వలకు తరిమివైచిరి. అపుడు నానకు వెలు పలకు జనుదెంచి శిష్యులతో నిట్లనియె. "వత్సలారా! ఈ యవమానమునకు మీరు చింతిల్లకుడు. కోడి పెంటపోగునందు రత్నమునుగాంచి కందిగింజ కాద నుకొని కాలితో నావలకు ద్రోసినయంతమాత్రమున రత్నమున కేమిలోటు. మనకు నివేదితప్రసాద మిచ్చుటికి వచ్చును."

అప్పటికి రెండుయామములు దాటెను. సూర్యుడు పడమటిముఖము పట్టెను. ఎదుటనున్న వినీలజలనిధియందు భానుడు తనకాంచనద్యుతులు ప్రతి ఫలింపజేసి కన్నులు మిరుమిట్లు గొలుపుచుండెను. అది గాంచి నానకుహృద యము సంతోషతరంగితమై యిట్లు పాడదొడగెను.

గగనమయథాల్ రవిచంద్ర దీపక్ బోలె,
తారకామండల జనక మోతి ।
ధూపమలయానిల పవన చౌరికరె,
సకలవనరాయ్ ఫులంత్ జ్యోతిః ।
క్యాయిస్ ఆరతి హూ య్ భవఖండన్ తేరి ఆరతి,
అనహాత శబ్దబా జంత భేరీ ॥
సహాంసమూారతి నన్ ఏకపద్ తోహి,
సహాంసపదవిమల నన్ ఏకపద్ గంధ
బిన్ సహాంస తవగంధఏవ చలిత మాహి ।
సబ్ సె జ్యోతి జ్యోతిహి సోఙ్,
తి న్ కె చాన్ నె సర్వమె చాన్ నె హూయ్,
గురుసాక్షి జ్యోతిప్రకట్ హూ,
జోతిన్ భావె సో ఆరతి హూయ్,
హరిచరణ్-కమల-మకరంద శోభితమన్ ।
అనుదిన్ మోహె యా పియాసా,
కృపాజల దేవ్ నానక్ సరంగో హూజాయ్
తెరెనామ్ వాస్ ।

గానము ముగించి నానకు జగదీశ్వరుని మనంబున నిల్పి "తండ్రీ! ఎన్నెన్ని ప్రదేశములయందు నా కెన్నెన్ని కీడులు సంభవించినను, నీవు నాప్రాణమానములు కాపాడితివి. నేడు కూడ నట్లే రక్షింతువని నమ్ముచుంటిని. నీప్రసాదమును కన్నులనద్దుకొని భక్షించుభాగ్యము నా కీయూర నేడు లభింపజేయవా!" యని ప్రార్థించుచు యోగనిద్రయందు మగ్నుడయ్యెను. అతడానిద్రయందుండగా నర్ధరాత్రమున నీలగిరిజగన్నాథుడు మనుష్యరూపము దాలిచి యొక బంగారుగిన్నెయందు పాయసము గొనితెచ్చి నానకు కిచ్చెనట. ఆప్రసాదమును భక్తిపూర్వకముగా గ్రహించి పిమ్మట జగన్నాథునితో "జగన్నాథస్వామీ! ఈనిశీథమున నీవు నాకు ప్రసాదమును తెచ్చియిచ్చినసంగతి లోకులు నమ్మరెట్లు. నేను దొంగతనమున దీసిని దెచ్చితినని పొరపాటు అభిప్రాయము పడినను పడ గలరు. నాగౌరవము కాపాడుటకును దైవభక్తి దైవమునందువిశ్వాసము

ప్రజలయందెక్కుడగుటకును నే నొకయుపాయమును సూచించెదను. ఈప్రదేశమునందు గంగాతోయము లేదు. అనుగ్రహించి నా కాపవిత్రోదక మొసగు" మనియెను. జగదీశ్వరుడందులకు సమ్మతించి యచట నేలపై నొకతన్ను తన్ని యంతర్హితు డయ్యెను. తక్షణమే భూమినుండి గంగాజలము పైకుబికి వచ్చెను. మరునాడుదయమున నర్చకులు దేవాలయమందలి జంగారుగిన్నె కనుపడక మిగుల తొట్రుపడి, చివర కది నానకుచెంత నుండుటయు, ఆతడున్నయెడ గంగోదక ముద్భవించుటయు విలోకించి విస్మయచిత్తు లయిరి. ఆదివ్యకూపము తటాకముగా వృద్ధియై గుప్తగంగయనుపేర నిపుడు ప్రసిద్ధి చెందియున్నది. సిక్కుల రాజగు రణజిత్ సింహునితండ్రి మహాసింహుడు జగన్నాథమున కరిగినపు డా గుప్తగంగకు మెట్లు కట్టించెను. యాత్రార్థము జగన్నాథమున కరుగువారు సముద్రమునందు స్నానమాచరించినట్లే యీగుప్తగంగయందును స్నాన మాచరించుచుందురు. ఇపు డచట నొకపెద్దమఠ మున్నది. సిక్కులు ప్రత్యేకముగా నచట నతిథిసత్కార మందుదురు.

ఒకనాడు దౌలత్ ఖాన్‌నవాబు నానకునాదీసికొని మసీదునకు పోయెను. అచటిభక్తులెల్లరు లేచి నిలువబడి దైవప్రార్థనము చేయుచుండ నానకుయూరక నిలచియుండెను. అది గాంచి నవాబు "అయ్యా! ఉపాసన మొనరింపక మీ రట్లేల నిలువబడియుండి" రని యడిగెను. మీ రెట్లు ప్రార్థించుచుండిరో పరీక్షించుచున్నాను. కన్నులు మూసికొని అల్లాను సంబోధించుచున్నను మీ యుల్లములు మీమీయంతఃపురములందే యున్నవి. ఇంక మీకాజీగారిహృదయము రోగపీడితయగు నతనికుమార్తెమీద నున్నది. మీయీశ్వరారాధన మిట్లున్నదని విచారించుచుంటి" నని నానకు జవాబు చెప్పెను. ఆమాటలు విని యచటిమహమ్మదీయులెల్లరు నాశ్చర్యసమన్వితులైరి. అప్పటినుండియు ముసల్మానులుకూడ నానకునెడ భక్తివిశ్వాసము లెక్కుడుగా చూపదొడగిరి.

క్రీ. శ. 1539 సంవత్సరమున తన ముఖ్యశిష్యుడగు అంగదునకు తన ప్రాపంచికపరికరముల నిచ్చి యామహాపురుషుడు తనకు డెబ్బదియొకటవ దగు వయస్సున కర్తారపురమున యోగాభ్యాసమందే దేహయాత్ర ముగించి సాయుజ్యముక్తి నొందెను. నానకునకు లేహాను డను నొకశిష్యుడు కలడు. అతడు గురువునెడ మిక్కిలి భక్తివిశ్వాసములు గలవాడు. ఆచార్యునెడ కడు

వినయముతో ప్రవర్తించుచుండువాడు. గురువునాజ్ఞ నెరవేర్చుట కాతడు నిద్రాహారములే కాదు ప్రాణమైన విడుటకు సదా సంసిద్ధుడై యుండువాడు. ఒకనా డొకనదీతీరమున శిష్యులతో గూడ నానకు విహరించుచు నదీజలముపై గుడ్డ కప్పబడియున్న శవ మొకటి కొట్టుకొనుపోవుచుండుట తిలకించి శిష్యులకు చూపి వారిలో నెవ్వరైన నాశవమును భక్షింపగలరా యని ప్రశ్నించెను. దానికి లేహానుడు చివాలున నదిలోనికి దుమికి "శవము నేవైపునుండి భక్షింపవలెను" రని గురువరు నడిగెను. "పాదములకడనుండి భక్షింపు" మని నానకు బదులు చెప్పెను. లేహాను డపుడు శవమును మెల్లగ నొడ్డునకు లాగి దానిపై కప్పబడి యున్న వస్త్రములు తొలగించెను. అపుడు మృతకళేబరమునకు మాఱుగా నచట మధురములగు నాహారపదార్థములతో నిండియున్న యొకపాత్ర ప్రత్యక్షమయ్యెను. లేహానుని వినయవిధేయతలకు శక్తిసామర్థ్యములకును మెచ్చి నానకతనిని తనతో సమానమైనవానిగా భావించి యతనికి 'అంగదు' డను పేరపు డొసగెను.

కబీరుమృతశరీరమునకై కలహించినవిధమున నానకు మరణానంతరము హిందువులును మహమ్మదీయులును నతనిశవమునకై పోరాడిరి. తమవివాదమును తీర్చుటకై మధ్యవర్తి నొకనిని గుదుర్చుకొనిరి. అత డరుదెంచి శవముపై కప్పబడినవస్త్రమును దీయ నం దేమియు కానరా దయ్యె. నానకుశరీరము మాయ మైపోయెను. అది గాంచి యచటిజనులు విస్మయము నొందిరి. పైన కప్పబడిన యావస్త్రమును రెండుముక్కలు చేసి హిందువులును ముసల్మానులును పంచికొనిరి. ఆప్రదేశమున నేడును నానకుయొక్క ఆశ్రమము కలదు. సిక్కులాప్రదేశమును మిక్కిలిపవిత్రవంతముగ చూతురు. మహోత్సవ మచట నేటేట జరుగుచుండును. నానకు కావించినమహోపదేశముల నన్నింటిని యాతనిశిష్యులు సంగ్రహించి "ఆదిగ్రంథ" మనుపేర ప్రచురించిరి. సిక్కులు దాని ననవరతము భక్తిశ్రద్ధలతో పూజించుచుందురు.

ఆదిగ్రంథము భక్తిరసముతో నిండియుండుభజనకీర్తనలతోడను, పద్యములతోడను నిండియుండును. నానకుయొక్క యుపదేశములును కీర్తనలును పద్యములేగాక యితరభక్తులయొక్క బోధనలును నందు గలవు.

సిక్కుమతము నవలంబించువారికి పదుగురు గురువులు కలరు. నానకే మొదటిగురువు. (సిక్కుమతమును స్థాపించి నానకు గురు వనుపేరు స్వీకరించెను.

అందువలననే సిక్కుమతాచార్యులకు గురువు లనుప్రతీతి కలిగెను) నానకు శిష్యు డంగదుడే రెండవగురువు. అంగదునిశిష్యుడు అమరదాసు మూడవ వాడు. అమృతసరమున 'గురుదర్బార్' ప్రతిష్ఠించిన రామదాసు నాల్గవ గురువు. రామదాసుపుత్రుడు అర్జునుడు తరువాతిగురువు. ఇతడే నానకుమున్నగు నాచార్యులయుపదేశములను సంగ్రహించి 'గ్రంథసాహేబ్' అనుపేర నొక గ్రంథము ప్రకటించెను.

'ఆగ్రంథ'మే యిట్లు విపులముగ వ్రాయబడినది. అర్జునునికుమారుడు హరగోవిందు డాఱవగురువు. హరగోవిందునికుమారుడు హర్ రాయ్ యేడవ గురువు. ఎనిమిదవగురు వీతనితనయు డగుహరకిషనుడు; తేగబహదూర్ తొమ్మిదవగురువు. తేగబహదూర్సుతుడు గురుగోవిందుడు పదియవగురువు. ఇతడే సిక్కులను యోధులుగా చేసెను. ఇతనితరువాత గురుపదము నొందు టకుతగినవ్యక్తి గానరానందుల నాపదవి యంతరించెను.

"జపజీ" యనుభజనకీర్తనలు 'ఆదిగ్రంథ'మునకు వన్నె దెచ్చినవి. నియమనిష్ఠలు గలబ్రాహ్మణులు గాయత్రీమంత్రమును జపింపక మంచినీళ్లయి నను పుచ్చుకొననివిధమున సిక్కుభక్తులు ప్రాతఃకాలముల నీకీర్తనములు కొన్ని పాడుకొనక దినచర్యలు ప్రారంభింపరు. ఈకీర్తనము లాధ్యాత్మికభావముచే నిండియుండును.

మాదిరికై "సాహిత్యసంహితము"నుండి కొన్నికీర్తన లిచట తెలుపబడును.

"సాచాసాహేబ్, సాచానావ్ భాఖయాభావ్ అపార్,
ఆఖై మంగ్‌గె దెదేదాత్ కరె దాతార్ ?
ఫెర్ కి ఆగె రాఖమె జిత్ దిసై దరబార్ ?
ముహను కి బోలన్ బోలియె జిత్ సున్ ధరె పియార్,
అమృత బేలా సచ్ నావుబడ్డ్ యాయ్ విచార్
కరమీ ఆవై; కప్డా నదరీ మోఖ దుయార్
నానక్,, ఎవై జానియే సభ్ ఆపె సచియార్"

అర్థము :—పరమాత్మ సత్యస్వరూపము—దానిపేరు సత్యము; దాని భావ మనంతము. పరమాత్మ నుద్దేశించి చేయు ప్రార్థన లన్నియు నఫలీకృతము లగును. ఏమిచేసిన పరమాత్మ సాక్షాత్కరించును? చెవుల కింపుగ నతనిని

కీర్తింపవలెను. ప్రతిదిన ముదయమున నతనినామ ముచ్చరింపవలెను. అతని మహామహిమను మననము చేసికొనవలెను. కర్మలామూలమున జీవుడు పంచభూతాత్మికమైన శరీరమును స్వీకరించి జ్ఞానరూప మగువస్తువును గ్రహించి మోక్షములు చెందును. అట్టిజ్ఞాన మలవడినచో చూచునదియు చూడబడునదియు గూడ సత్య మని గ్రహింపవలెను :—

"తీరథ్ నాబా, జేతుద్ భావా, విన్ భానే కినాయి కరి
జే తీసి రసర్ ఉపాయ్ రేఖా, బినుకర్ మాకిమి వెలయి
మత్ బిచ్ రతన్ జబాహర్ మాణిక్,
జెయిల్ గురాకీ శిఖసునీ, గురాయిక్ దేహిబుఝాయి
సభన్ జీయాకా ఎకదాతాసోమె బిసరి నజాయి"

అర్థము :—పరమాత్మజ్ఞానమువలన గాక ఆత్మతీర్థమున స్నానమాచరించుట యెవ్వనికిని సాధ్యము కాదు. అనుభవముమూలముననే యాతీర్థమును బడయుట సాధ్య మగును. ప్రతిజీవమును, ఆత్మకర్మమూలమున గాక మరియేవిధముననను పరమాత్మతో గలసికొన జాలదు. మానవులందఱి యంతరంగములందు జ్ఞానమణిమాణిక్యములు ప్రకాశించుచున్నవి. కాని సద్గురుకృపచేతనే మానవు డారత్నమును పొందగలుగును. పరమాత్మానుభవమును మాటలతో దెలుపుట సాధ్యము కాదు. ఉత్తమగురువుయొక్క కరుణచే మానవుడు జ్ఞానశరీరమును బడయుగలుగును. భగవంతుడు సర్వజీవదాత యనువిషయము నెన్నడును మఱువరాదు.

నానకుచరిత్రమునందు మహాద్భుతములు పెక్కులు గోచరించినవి. సామాన్యగద పాతినతోడనే వృక్షమగుట. అర్ధరాత్రమున దేవాలయమందలి బంగారుగిన్నె జగదీశ్వరు డితనికి దెచ్చియిచ్చుట మున్నగు ప్రత్యక్షప్రమాణములుకానిసంఘటనలను నమ్ముటకు సంశయము పుట్టును. గొప్పయంశమునేదేని దెలుపునపుడు గోరంతలు కొండంతలు చేసి చెప్పుట ప్రపంచసాహిత్యసాంప్రదాయమున గలదు. మూఢవిశ్వాసములని నమ్మక త్రోసివేసిన పూర్వకాలపుపరకాయప్రవేశ మాది వింతలు యిప్పుడు నవీనభౌతికశాస్త్రకారులు సత్యమూరములు కా వని చెప్పటచే నొప్పుకొనుచున్నరీతినే యీమహాభక్తుల జీవితములయందలి యద్భుతచర్యలును అనృతములు కా వని క్రమక్రమమున నమ్మదగుకాలము వచ్చును.

---

౧౩

# మహాత్మా తులసీదాసు

మ. "ఉరుసంసారసముత్తరంబు నిగమాంతోచ్చారితంబున్ సమ
స్తరిపుధ్వంసము జన్మపావనముగా సత్సంగవేళాసము
చ్చరితంబున్ వ్యసనాహిదష్టజనరక్షాదక్షమై శర్వదం
బకుదా శ్రీరఘురామమంత్రమును జిహ్వా! భక్తి గీర్తింపుమా!"

ప్రయాగకు పడమరదిక్కునను చిత్రకూటమునకు తూర్పుదిక్కునను రాజపుర మనునొకగ్రామము కలదు. భానుదత్తు డనునొక కన్యాకుబ్జబ్రాహ్మణు డందు నివసించుచుండెను. అతనిభార్య హులసీయను నొకసౌందర్యవతి యగు యువతి. సతీపతులు పరమానురాగమున కాలము గడుపుచుండ కొన్నాళ్ళకు వారి కిరువురుకుమారులు కలిగిరి. 'శ్యామసబల' మను గ్రంథమును రచించి నది వీరిపెద్దకుమారు డగునందదాసు. తులసీదాసు రెండవకుమారుడు. క్రీ. శ. 1535 వ సంవత్సరమున నితడు జన్మించెను. తులసీదా సెనిమిదేండ్ల వా డయి యుండ తండ్రి భానుదత్తుడు చనిపోయెను. విద్యాభ్యాసమునకై తల్లి పంపగా నతడు కాశీ చేరెను. పదిపండ్రెండేం డ్లాపుణ్యక్షేత్రమున శాస్త్రాధ్యయనము గావించి తిరిగి స్వగ్రామము చేరి యతడు వివాహము చేసికొనెను. తులసీదాసు మిక్కిలి విషయలోలుడై యనుక్షణము భార్యచెంతనే కూర్చుండుచు, యామెతో మాటలాడుచు, యామె నంటియుండువాడు. ఆమె నెడబాసి యొక్క నిముస మొంటరిగ నుండజాలువాడు కాడు. మామగా రొకసారి కొమార్తెను పుట్టినింటికి గొనిపో దలచి వచ్చి తులసీదాసు సదుగా భార్యను విడువజాలని హేతువుచేత నత డందుల కిష్టపడలేదు. మామగారు విచారించి స్వగ్రామము నకు వెళ్ళి కొన్నినెలలు గడచినపిదప తనకుమారుని తిరిగి సోదరిని తీసికొని రమ్మని రాజపురమునకు పంపెను. కుమారుడును విఫలమనోరథుడై యింటికి మరలవలసినవా డయ్యెను. ఇ ట్లెన్నిపర్యాయములు ప్రయత్నము చేసినను తులసీదాసు తనభార్యను పుట్టినింటికి పంపినవాడు కాడు. అంతే పెట్టిపుట్టితి

వని, ఆయిల్లాలు పావము విచారించి యూర కుండెడిది. ఇట్లుండ నొకసారి తులసీదాసు కార్యాంతరమున పొరుగూరికి పోవలసివచ్చెను. ఆజాడ కనిపెట్టి యాతనిమామగారు తిరిగి తనకుమారుని తులసీదాసునింటికి కుమార్తెను తీసుకొనిరమ్మని పంపెను. తులసీదాసుతల్లి పెద్దదిగావునను, పుట్టినింటివారి యచ్చట ముచ్చట తెలిసియున్నది గావునను, తోడబుట్టినవానితో కోడలిని పుట్టినింటికి పంపెను. తులసీదాసు తిరిగివచ్చి, తన నయనచకోరములను దనుపు నా చంద్రవదన యింట లేకుండుటచే గృహమంతయు నంధకారమయమయినట్లు తోచి మిక్కిలి ఖిన్నుడై కాలుకాలినపిల్లివలె యింట నాతురతతో నడయాడజొచ్చెను. కుమారునిరీతి నవలోకించి, పుట్టినింటివారు పలుమారువచ్చి తిరిగి పోవుట యుచితముగాదని యామెసోదరుడు తిరిగివచ్చినందున నతనితో నామెను వారియూరు పంపితి నని తల్లి యతనితో చెప్పెను. తల్లిమాటలు వినీ వినినతోడనే తులసీదాసుదుండి తక్షణమే బయలుదేరి యత్తవారిల్లు చేరుకొనెను. తనకొఱకై పరుగుపరుగున వచ్చినప్రాణపతిని విలోకించి యించుకసనహ్యతతో నతసభార్య "నాథా! వస్త్రమాంససంకలితమైన యీతోలుబొమ్మపట్ల మీరు చూపు గాఢానురాగము త్రిలోకాధినాథు డగు శ్రీరామచంద్రమూర్తియెడ చూపితి రేని యిహపరలోకములరెంటను పరమానందము పొందగలరు" అని పలికెను. జ్ఞానదాయకము లగు నామెపలుకులు చెవులు పడినంతనే తులసీదాసు, కండ్లు తెరచినవా డయ్యెను. క్షణమైన నత డాయత్తవారి యింట నిలువనొల్లక వెంటనే వారణాసికరిగి యందు త్రిలోకపావనియగు గంగాభవానిని సేవించుచు శాస్త్రపఠనముగావించుచు శ్రీరామచంద్రధ్యానమును గావించుచు ప్రొద్దులు గడపదొడగెను. ఆకాశీపురమున నతడున్ననాళ్ళలో, ప్రథముకాలకృత్యము నెరవేర్చుకొనటకై ప్రతిదిన మత డొకప్రదేశమున కరుగుచు తిరిగివచ్చునపుడు పాత్రయందు మిగిలినజలము నొకముండ్లపొదలో పోయుచుండువాడు. ఆపొదలో నొకపిశాచము వసించుచుండెను. ఆపిశాచ మాజలము గ్రోలి తృప్తి చెందుచుండెడిది. ఒకనా డతడు నీరము డొంకలో పోయకయే వెడలిపోవుచుండుట గాంచి యాపిశాచము వెలుపలికి వచ్చి తన కానాడు జల మేలపోయులే దని తులసీదాసు నడిగెను. కలశమున నాదినమున నీరు మిగుల కున్నందున పోయు లే దని యాతడు జవాబు చెప్పెను. అప్పు

డాపిశాచ మతనియెడ ప్రసన్నమై "నీవేదేని కోరుకొ" మ్మని పలికెను. శ్రీరామ చంద్రమూర్తిదర్శనము గలిగింపు మని తులసీదా సాపిశాచము నడిగెను. తా నందులకు శక్తి చాలనిదై యాపిశాచ మతనిని కర్ణఘంట మనునొకపల్లెయందు వసించు నొకానొకబ్రాహ్మణుని దర్శింపు మని యతనికి ప్రత్యుత్తర మొసంగి మాయ మయ్యెను. పిమ్మట తులసీదా సాగ్రామమునకు జని యావిప్రుని సందర్శించి యాతనిచేసన్మానితుడై తా నచటికి వచ్చినకారణ మెఱింగించెను అంత నవ్విప్రుడు తులసీదాసునకు రామమంత్ర ముపదేశించి చిత్రకూటమునకు వెళ్లి దాని నచట పునశ్చరణ మొనరింపు మని యాదేశించెను. తులసీదాసు గురు నానతి శిరమున దాల్చి చిత్రకూటమం దాఱునెలలు రామమంత్రము జపించి యామహామంత్రసిద్ధి పడసెను. (మందాకినీనదీసమీపముననున్న యాచిత్రకూటపర్వతముచెంత తులసీదాసు జప మొనరించినమందిరము కలదు.)

భగవంతుడు భక్తునికోరిక నెరవేర్చుటకై మానవరూపమున తులసీదాసునకు దర్శన మొసగె నని ప్రతీతి కలదు. ఒకనాడు తాను చిత్రకూట పర్వతమెక్కి యందు గలప్రకృతిసౌందర్యమును వీక్షించుచు పోవుచుండువాడు కొండమార్గమున ధనుర్బాణములు ధరించి గుఱ్ఱములనెక్కి వెళ్లుచున్న అనమానరూపలావణ్యవంతుల నిరువుర పురుషులను గాంచెను. అపు డతడు సామాన్యమానవు లనియే వారినిగూర్చి తలచెనుగాని యారాత్రి స్వప్నమున వారు రామలక్ష్మణు లని యతడు తెలుసుకొన గలిగెను.

రామమంత్రమున సిద్ధి గాంచినపిమ్మట తులసీదాసు చిత్రకూటపర్వతము విడిచి బృందావనమున కరిగెను. బృందావనమున నతడెందరిగిచూచినను యేస్థలమున కరిగి కాంచినను యేచోటి కరిగి విన్నను రాధాకృష్ణస్తవమేకాని సీతారామస్తవము వినరాలేదు. ఆకారణమున తులసీదా సిల్లు వీడి యవ్వలి కరుగక రామస్మరణము చేసికొనుచుండువాడు. ఒకసారి కొంటెతనమున నొక మిత్రుడు తులసీదాసును మదనగోపాలస్వామి యాలయమునకు గొంపోయెను. కొనిపోయి యందున్న శ్రీకృష్ణుని విగ్రహమును జూపి శ్రీరామచంద్రుని దర్శింపుమనియెను. శ్రీకృష్ణుని చేతియందున్న పిల్లనగ్రోవిని తులసీదాసు చూచి యిట్లు పాడెను.

"కహాఁకహాఁఛబి ఆజ్ కీభాలేచ్ నహాఁ నాథ్
తులసీ మస్తకతవతవనోయేధనుష్‌బాణ్ లేవ్ హాథ్
భక్తవఛల్ భగవాన్‌కీవేద్‌విదితయిహగాథ్
మురళీ ముక్‌టే దురావుకేనాథ్ భయేరఘునాథ్"

"హేనాథా! నేటి నీయపూర్వశోభను వర్ణించుటకు నామాటలు చాలవు. కాని ధనుర్బాణములను గేలున గైకొనకున్న నీమ్రోల తులసీదాసు నతమస్తకుడు కాజాలడు."

అంతట వేదవిదితప్రసిద్ధుడును భక్తవత్సలుడును నగుశ్రీహరి యానుడువులు ఆలించి శిరమున విరాజిల్లుపట్టుకుచ్చును మోవియందలి వేణువును తీసి ధనుర్బాణములను దాల్చెను.

బృందావనమున కొంతకాలము గడపి పిమ్మట నతడయోధ్యకు జనెను. అయోధ్యయందే తులసీదాసు రామాయణమును రచించెను. రామాయణ రచనాకాలము నాతడిట్లు నిర్దేశించెను.

"1631 వ సంవత్సరమున (హిందూస్థానీయులగణనాకాలము) చైత్ర మాసమున నవమీమంగళవారమున హరిపదధ్యాన మొనరించుచు అయోధ్యాపురమునం దీరామాయణమును ప్రకాశపరచితిని"

అయోధ్యయందు కొన్నిదినములు వసించి తరువాత నతడు తిరిగి వారణాసి కరిగెను. అత డాపురమున నున్ననాళ్ళలో నొక డొకబ్రాహ్మణుని జంపెను. ఆహంతకుడు నిత్యముతనయెదుట తానొనరించినపాపము రూపుదాల్చి నట్లు కనుగొనుచుండువాడు. ఒకక్షణమైన నతడు మనశ్శాంతి నెరుగకుండెను. తా నొనరించినఘోరదురితమునుండి తప్పించుకొనుట కేదేని మార్గ ముండిన కనుగొందమని కాశీపురమునం దెల్లయెడల దిరుగుచుండువాడు. తాను పవిత్రు డగుట కేదేని తెరువు చూపుమని కనపడినపండితునెల్ల నడుగుచుండువాడు. "ఇట్టిమహాపాతక మనుభవింపవలసినదే గాని ప్రాయశ్చిత్తము లే" దని పలికి యాపండితు లంద రాతనిని దూరము తోలుచుండెడివారు. దుస్సహహృదయ వేదనమును భరింపజాలక తుద కతడు గంగానదియందు పడి చచ్చుటకై నిశ్చయించుకొని యామార్గమున పోవుచుండ తులసీదా సతని కెదు రయ్యెను. తోడనే యాతడు తులసీదాసునకు నమస్కరించి తన్నుద్ధరింపు మని వేడెను.

రామనామమును జపింపుమని దా నతని కుపదేశించెను. ఏకాగ్రచిత్తుడై కొంత కాల మతడు రామనామము జపింపగా "ఆర్యా! నీవు పాపవిముక్తుడ వైతివి. రమ్ము. మనమిద్దరము కలసి భోజనము చేత" మని తులసీదాసు వానితో పలికెను. హంతకునితో కలసి తులసీదాసు భోజనము చేయుచుండగా విలోకించి కాశీపండితులు పలువురు అట్టియకృత్యమునకు కారణ మేమని దాసు నడిగిరి. "రామనామస్మరణమున నతడు కలుషమునుండి విముక్తు డయ్యెను. వలసిన చో మీరు పరీక్షింపవచ్చు" నని దాసు బదులుచెప్పెను. "విశ్వేశ్వరునియెదుట గల నంది యీహంతకునిచేతిగడ్డి తినినచో నితడు పవిత్రు డయ్యె నని మేము నమ్మెద" మని పండితులు ప్రాకుచ్చిరి. తులసీదా సందులకు సమ్మతించి హంతకుని, పండితులను, విశ్వేశ్వరాలయమునకు గొనిపోయి నందివిగ్రహము నెదుర నిలచి గరికపోచలను గొన్నింటి నాహంతకునిచేతి కిచ్చి నందినోటి కంది మ్మని పలికెను. అత డట్లొనరింప నారాతినందియు సజీవవృషభమువలె గరిక తిన నారంభించెను. అచటి వారెల్ల రాశ్చర్యము నొందిరి. ఇది యంతయు తులసీదాసు మహిమయనియు నతడు యీశ్వరాంశసంభూతుడనియు నమ్మి యప్పటి నుండియు కాశీపండితులందరు నతనియందు ప్రగాఢభక్తి చూపదొడగిరి.

తులసీదాసు నెడగల భక్తిచూపుచు నతనిభక్తులు కొందరు, వెండి బంగారములతో గిన్నెలు చేయించి పానీయమును ఫలములను నాతనికి వానితో నొసగుచుండువారు. తులసీదాసున కిష్టదైవమగు శ్రీరామచంద్రునకుకూడ కొన్నియమూల్యాలంకారములు వా రొసగిరి. ఆసామగ్రినంతయు నపహరింప దలచి చోరుడొక డొక నాటిరాత్రి దాసుమందిరము ప్రవేశించెను. దా నపుడు ధ్యానమగ్నుడై యుండెను. అదియే సమయమని యాచోరుడు స్వర్ణపాత్రముల దరి జేరెను. అపు డనుపమరూపలావణ్యాసంపన్ను డొకదివ్యపురుషుడు ధనుర్బాణ సమేతుడై వచ్చి చోరునిపై దృష్టి సారించెను. అది కాంచి భయము జెంది దొంగవాడు పారిపోయెను. కాని తులసీదాసు మందిరమందలి యావిలువగల వస్తువులమీదనే వానిమనసు లగ్నమయి యుండెను. అందుచే తిరిగి మరునాటి రాత్రి యత్నము చేయ దలచి మందిరము జొచ్చినతోడనే యాదివ్యపురుషు డాతనికి తిరిగి గన్పట్టెను. అట్లాచోరు డెన్నియోసారులు భూషణాదుల నపహరింప చూచెను గాని యాతనిప్రయత్నము నెఱవేఱినది కాదు. అంతట నొక

నాటిప్రాతఃకాలమున నాచోరుడు తులసీదాసును గని "స్వామీ నిత్యము రాత్రులయందు కావలా కాయుచుండుమనుజు డేడీ యిపు డెందున్నవా" డని యడిగెను. "నాయనా! నాయింట కాపుండువా రెవరో నే నెరుగను. అత డెట్లుండును. చెప్పగలవా!" యని తులసీదా సాతని నడిగెను. అడుగుటయు నాచోరుడు, నీలమేఘశ్యామవర్ణుండును ధనుర్బాణపాణియు నగునొకదివ్యపురుషుని రూపమును వర్ణించెను. శ్యామలకాయు డగుపురుషుడు తనయిష్టదైవమగుశ్రీరామచంద్రుండు గాక యొరుడు గా డనియతడు గ్రహించి తనయింటగల పాత్రసామగ్రిని కాపాడుటకై దేవుడు రాత్రియంతయు మేలుకని యుండవలసివచ్చుచున్నందులకు మిక్కిలి సిగ్గుచెంది యాయాభరణాదులను పాత్రలను తులసీదాసు తస్కరునకును దీనులకును దరిద్రులకును నిచ్చివేసెను. ఆశ్చర్యాన్వితుడై నిలవబడియున్న దొంగనుచూచి "ఓయీ! నీవు మిగుల నదృష్టవంతుడవు. ఏయోగసాధనము నొనరింపకయే భగవంతుని దర్శింప గలిగితివి. నీయంతటి పుణ్యాత్ము లెవరును కారు. నీవు కోరిన యీవెండిబంగారు సామగ్రులు నీయిచ్చవచ్చినట్లు ఖర్చుపెట్టుకొనుము." అని తులసీదాసు వచించెను. చోరుడును తులసీదాసు వాక్యములవలన తెలివి తెచ్చుకొనినవాడై తన యకార్యకరణమునకు మిక్కిలి వగచి దా నొసగినసామగ్రి నచటనే విడచి, తన యింటగల ద్రవ్యమును వస్తువులనుగూడ బీదసాదల కొసగి తులసీదాసునకు శిష్యుడై యుండెను.

వారణాసీపురమున వసించుబ్రాహ్మణబాలిక యొకతె భర్త యకాల మృత్యువువాత బడుటచే తానుకూడ సహగమన మాచరించి యిహలోక యాత్ర ముగింప దలచి గంగయొడ్డున గలస్మశానమున కరుగుచు మార్గమధ్యమునకనుపించిన తులసీదాసునకు సాష్టాంగదండప్రణామ మాచరించెను. పరధ్యానమున నున్నదా నపుడు బాలికదురవస్థ గుర్తింపక సౌభాగ్యవతివై సుఖమనుభవింపుమని యామెను దీవించెను. ఆబాలికతోకూడ నున్న స్నేహితురాండ్రు "స్వామీ! యీమెభర్త యింతకుముందే పరలోకగతు డయ్యెను. శవమును దహనసంస్కారమునిమిత్తము బంధుగులు గంగయొడ్డునకు గొనిపోయిరి. ఈయభాగ్యురాలు సౌభాగ్యవతి యెట్లగును.?" అని దాసు నడిగిన ఆ మాటలు విని విస్మితుడై తులసీదాసు వారివెంబడి శ్మశానమునకు నరిగి నేలపై

బడియున్న శవమును గాంచి తనపవిత్రమగు హస్తములచే శవదేహమును నిమి రెను. తోడనే మృతుడు నిద్రనుండిలేచినవానివలె లేచి యచట చేరినవారినంద అను విస్మయమానసుల గావించెను. కాశీపురవాసులందఱు నావిద్ధూరము విని గుంపులుగుంపులుగా స్వామియాశ్రమమునకు వచ్చి యాతనిపాదరజము శిరమున దాల్ప దొడగిరి.

అత్యద్భుతచర్యల నాచరించుచున్న తులసీదాసుని సామర్థ్యమునుగురించి విని ఢిల్లీశ్వరు డాతనిని తత్పురమునకు గొనిపోయి యతనిప్రజ్ఞావిశేషములు ప్రదర్శింపుమని దాసుని వేడెను. "మహాశయా! నేను సామాన్యమానవుడను. మీ కెట్టిప్రజ్ఞావిశేషములు చూపగలను. నాయిష్టదేవత నామస్మరణము చేయుట మాత్ర మెరుగుదును" అని దాసు పాదుషాకు త్తరమిచ్చెను. తన నానన్యాసి యవమానపరచెనని తలచి యాతనిపై గినిసి ఢిల్లీశ్వరు డాతనిని కారాకారబద్ధుని గావించెను. తోడనే యెందుండియో పెక్కుకోతులు ఢిల్లీపురమునకు వచ్చి యల్లరి చేయసాగెను. కోతిమూక పాదుషాయంతఃపురము ప్రవేశించి శుద్ధాంత కాంతలకు వెఱపు గొలిపెను. కొలువునందు గలజనులెల్ల రపుడు పాదుషాకడ కరిగి "మహాప్రభూ! ఇది యంతయు తులసీదాసు మహిమ. యతనిని చెరనుండి విముక్తుని గావింపకున్నచో మన కీవానరములబాధ తప్పదు. దండు మిక్కిలి యధిక మగుచున్నది" అని మొర వెట్టిరి. ఢిల్లీశ్వరుని పెద్దరాణికూడ నతనిని వదలివేయు డని పతిని వేడుకొనెను. తోడనే ఢిల్లీంద్రుండు తులసీదాసును వదలివైచెను. కోతిమూకయు మాయ మయ్యెను.

తులసీదాసు కేవలము సాధకుడు కాడు. అతనిరచనాశక్తి యద్భుతము. అతడురచించిన హిందీరామాయణ ముత్తరహిందూస్థానమున మిగుల ప్రసిద్ధి చెందిన యుత్తమగ్రంథము. ఆప్రాంతములయందు భగవద్గీతలవలెనే యీ రామాయణమునుగూడ నిత్యము పారాయణము చేయుచుండు మహాపురుషులు కలరు. తులసీదా సింకను ననేకగ్రంథములు రచించెను. "సంకటమోచనము;" "రామలత;" "వైరాగ్యసందీపని;" "పార్వతీమంగళము;" "వినయపత్రిక;" "దోహావళి;" మొదలగునవి యందు ముఖ్యములై హిందీసారస్వతమున కలంకారములై యున్నవి.

1680 (హిందీ) సంవత్సరమున, శ్రావణమాసమున శుక్లపక్షమున వారణాసీమహాపుణ్యక్షేత్రమున తులసీదాసు పుడమిని బాసిపోయెను. ఆపురమున అసీఘట్టమున బాలార్కకుండమను నొకచిన్నతటాకము కలదు. ఈ కుండమునకు సమీపమున తులసీదాసుని యాశ్రమము నేటికిని గానవగును. కాశీక్షేత్రమున కరుగుహిందుస్థానీయాత్రికులు సాధారణముగా నీయాశ్రమము చూడక మానరు.

పూర్వము మనదేశమున జీవచరిత్రములు వ్రాయువాడుక లేనందున మహాపురుషుల చరిత్రములు వ్రాయుట కిపుడు తగినప్రమాణములు లేకుండెను. అందుచే కర్ణాకర్ణిగా వినినవిషయములుకొన్ని, పురాణములయందు లిఖియింపబడినవిషయములుకొన్ని తీసికొని జీవనచరిత్రలు వ్రాయబూనుటవలన పండితులు భిన్నాభిప్రాయులు కావలసివచ్చుచున్నది.

తులసీదాసునిజీవితము పెక్కుపత్రికలయందును గ్రంథములయందును రచియింపబడినది. అందలి కొన్నివిషయములుకూడ నిందు దెలుపుచుంటిని.

"సంయుక్తరాష్ట్రమందలి బాందాజిల్లాలోని రాజపుర మాతనిజన్మస్థానము. క్రీ.శ. 1533 వ సంవత్సరమున జన్మించెను. గండయోగమునపుట్టుటచే తలిదండ్రు లాతని వెంటనే పరిత్యజించిరి. ఈవిషయమునే తానురచించిన 'వినయ' పత్రికయందు తులసీదా సిట్లు వ్రాసెను.

"జననీజనక త్యజ్యో జనమిపరమ విన—విధివాం సిరఔ అవడేరే" అనగా "పుట్టినంతనే తలిదండ్రులు నన్ను విడిచివేయునంతటి దురదృష్టవంతునిగా నన్నీశ్వరుడు పుట్టించెను" విడువబడిన శిశువును నరసింహదా సనుసన్యాసియొక డొకపొదలో గాంచి సర్వలక్షణలక్షితు డగునాశిశువు పెట్టురోదనమునకు మనసు కరిగి వానిని పొదలోనుండి తీసి చంకబెట్టుకొని తనమఠమునకు గొనిపోయి కడుజాగరూకతతో బెంచెను. దయామయు డగునాయోగి తులసీదాసును రామభక్తిపరాయణుని గావించెను. బాలుడును రామచరితామృతపానమును సదా గ్రోలుచుండువాడు. తగుప్రాయము వచ్చినతోడనే యోగివరుడు తులసీదాసుని మంత్రదీక్షితుని గావించెను. పిమ్మట తులసీదా సానృసింసింహయోగికడనే శాస్త్రాధ్యయన మారంభించి స్వల్పకాలముననే పండితు డయ్యెను.

తులసీదాసు మిగులసుందరుడు. దీనబంధుపాఠకుడను నొకబ్రాహ్మణుడు తులసీదాసురూపగుణముల కలరి సర్వసద్గుణాలంకృతమైన తనకుమార్తె నాతని కిచ్చి వివాహము గావించెను. వివాహానంతరము గురుమందిరమును వీడి తులసీదాసు భార్యాసమేతుఁడై సుఖముగ జీవనము సల్పుచుండువాడు. దాసుభార్య పేరు రత్నావళి."

"అంతర్వేదిప్రాంతమున తరియను నొకపల్లెటూరుకలదు. అందు శుక్ల యుపాధిగల కన్యాకుబ్జబ్రాహ్మణు డొకడు వాసముచేయుచుండెను. తులసీదా సాతనికుమారుడు. చిన్నతనమందే దాసు జనకుని గోల్పోయెను. అయినను కొంతయాస్తికలవాడగుటచే తొలుత నంతకష్టపడ నవసరము లేకపోయెను. పిమ్మట నతడు కాశీపురాధీశునికడ మంత్రియయ్యెను. అగ్రదాసుశిష్యుడగు జగన్నాథదా సతనికి ఆచార్యుడయ్యెను. సౌందర్యవతియగు నొకకన్యను పెండ్లియాడి కొంతకాల మాత డామెతో సుఖముగా కాలము గడపెను. కాలక్రమమున తులసీదాసున కొకకుమారుడు పుట్టెను. భార్య నతడు ప్రాణములతో సమముగా ప్రేమించుచుండువాడు. ఆమెను వదలి యొక్కక్షణమైన వసింపజాలువాడుకాడు. నిత్యము నతడుకాశీపొలిమేర దాటి చాలదూరము పోవుచుండువాడు! అసీనది దాటి దక్షిణదిశగ కొంతదూర మరిగి శౌచక్రియ నిర్వర్తించుకొని కలశమందలి యపవిత్రజలమును వారణాశికి గొనిపోవ నొల్లక యచటగల యొకమామిడిచెట్టునకు పోయుచుండువాడు. చెట్టుపై గలపిశాచ మొకటి యాతనినుద్దేశించి వలయువరము కోరు మనెను. దా సావచనములు విని దిగులు చెందక "మీరెవరిందేల వసించుచున్నా"రని ప్రశ్నించెను. "ఆర్యా! పూర్వజన్మమున నే నొకబ్రాహ్మణుడను. వింధ్యపర్వతసమీపమున చిన్నపల్లెటూరు నానివాసస్థలము. అచటి నృపాలునకు పురోహితుడనై యుండి విశేషధనము నార్జించి హాయిగ కాలము గడపుచుంటిని. పుణ్యాకాంక్షివై యానృపాలు డొనరించు దానములన్నిటిని నేనే స్వీకరించి ధనధాన్యములతో నిల్లు నిండవేసికొనుచుంటిని. ఎంతయైశ్వర్యము గడించినను పట్టెడన్నమైన నొరులకు పెట్టి యెఱుగను. బీదసాదల దీనుల నెన్నడును కన్నెత్తియైన చూచి యెఱుగను. పరుల కుపకారము సేయకున్నను యూరకొనక యుండువాడను గాను. వారి కపకారములు చేయదలచుచుండువాడను,

నిర్దోషులను, ధర్మస్వభావులను, విద్వాంసులను దూషించుచు రాజుచే వారి కెగ్గుచేయించుచుండువాడను. నాచుట్టములకును, నావలెనేదురాత్ములైనవారికిని నావిహితులకును, మాయమాటలు చెప్పి రాజుగారిఖజానానుండి ధన మిప్పించు చుండువాడను. ఇంతయేల నాజీవన మంతయు వంచనాపూర్ణమై యుండెను. త్రికరణశుద్ధిగా నెన్నడు నెవ్వటికుపకారము చేసియెఱుగను. కాని యొకనాడొక పేదవిప్రుడు 'దాహము దాహ' మనుచు మాగుమ్మముమీద పడి మొఱ పెట్టుచుండెను. కఱ్ఱ తీసికొని యలవాటుచొప్పున నానాడు వాని బెదరించుట మాని గ్రుక్కెడు నీరమే కదా యని వానివేడికోలు మన్నించి దాహము తీర్చి తిని. జన్మమెత్తినపిదప నేను చేసిన సత్కార్య మది యొకటియే. ఆపుణ్యము వలననే ప్రతిదినము నేనీచెట్టుదాపున మీవలన పానీయము బడయుచుంటిని" అని యాపిశాచము బదులుచెప్పెను "వింధ్యాచలప్రాంతమున వసించుచు మీరిచటి కెట్లు రా గలిగితిరి."

"ఒకప్పుడు మారాజు కాశీయాత్రకై ప్రయాణమయ్యెను. నేనుగూడ వానితో బయలుదేరితిని. కాశీదిక్కున కరుదెంచుచు నీ చెట్టుసమీపమునకు వచ్చునరికి నన్నొకపాము కఱచెను. పాముకాటుచే ప్రాణముల బాసితిని. అపు డొకవైపుననుండి యమదూతలును రెండవవైపుననుండి శివదూతలును నన్ను గొనిపోవ వచ్చిరి. 'ఇతడు మహాపాపి; మేమీతనిని నరకకూపమున బడ ద్రోయుదు' మని యమదూతలనిరి. 'ఈతడు పాపాత్ముడే కానిండు. పాపి యయ్యు విశ్వేశ్వరుని దర్శించుటకై వారణాసి కరుదెంచుచు మార్గమధ్యమున ప్రాణములబాసినవాడు. మహాపాపియగుటచే నీతడు కాశీక్షేత్రమును చేరజా లక పోయినను కాశీత్రోవలో నీతడు మరణించుటచేత మీ రాతని ముట్ట రాదు. ప్రయత్నించినను మీ కది యసాధ్యము. భూతయోనియందు జని యించి యీతడిందే వసించి తానుగావించిన దుష్టకర్మకు శిక్షగా, అన్నపా నీయములకు దూరగుడై మహాయాతన పడి యనంతరము హరిభక్తుం డగు నొక బ్రాహ్మణునివలన జలము బడసి ముక్తి బడయజాలును' అని శివదూత లనిరి. విప్రవరా! వారణాసీమహిమచే నే నింతకాల మీచెట్టునాశ్రయించి వసించుచుంటిని. మీ రొసగిన పానీయములను గ్రోలితిని గాన భూతజన్మము నుండి ముక్తిని గాంచగలుగుదును."

తులసీదాసు జీవనచరిత్ర ముగింపకమున్న, పద్యరూపకముగ నాతడు రచించిన కొన్నియుపదేశముల నిందువ్రాయుచుంటిని.

(1) దయాధరమ్‌కి మూలహై వరల్‌మూల అభిమాన్
తులసీ మత్‌ఛోడియె దయా, జవు కంఠాగతజాన్.

ఆంధ్రము—ధర్మమునకు మూలము దయ, నరకమునకు మూలము అభిమానము. కావున కంఠగతప్రాణుండవయ్యు నో తులసీదాసా! దయావృత్తిని పరిత్యజింపకుము.

(2) ఏక్ రాహమె హోతేహై, తులసీ మూత్, ఆవుర్ పుత్
రామ్ భజేతో పుత్ హై, నహీంతో—మూత్ కా మూత్.

ఆంధ్రము—హేతులసీదాసా! మూత్రమును పుత్రుడును నొకేమార్గమునుండిబహిర్గతమగును. కాని యేపుత్రుడు భగవంతుండగు శ్రీరామచంద్రుని భజన సేయునో అతడే పుత్రుడు. అట్లొనరింపనివాడు, అనగా అధార్మికుడునుమూర్ఖుడును నైన పుత్రుడు మూత్రముకంటె నధముడు.

(3) రామ్‌రామ్ సబ్ కోయికహై, ఠక్ ఠాకుర క్యాచోర్
వినాప్రేమసే రీఝత్ నహీ తులసీ నందకిశోర్.

ఆంధ్రము—హేతులసీదాసా! దుష్టులేమి శిష్టులేమి; చోరులేమి సజ్జనులేమి; అందఱును రామనామమును జపించుచుండుట సత్యమే; కాని వారందఱు నొకేరీతి ఫలప్రాప్తిని పొందజాలరు. ప్రేమయు భక్తియు లేనిదే నందకిశోరుడగు శ్రీకృష్ణుడు ప్రసన్నుడు కాజాలడు.

(4) తులసీయియే సంసార్ మే, కహాభక్తిఖేట్
తినబాత్ సే నట్‌పట్ హై, దామ్‌డిచామ్‌డిపేట్.

ఆంధ్రము—హేతులసీదాసా! అర్థమును ఉదరమును విషయసుఖములను మాత్రమే నరులు పరిగణించుచుండ పుడమియందు భక్తిసాక్షాత్కారమెట్లు సాధ్యమగును?

(5) సబ్ హీ ఘట్ మే హరివసే జే ఒ గిరి సుతమే జ్యోతి
జ్ఞానగురు చక్ మక్ వినాకైసే ప్రకట్‌హోతి.

ఆంధ్రము—సర్వజీవులశరీరమందు శ్రీహరి ఆత్మరూపమున వసించుచుండెను, రాతిముక్కయందగ్నియున్నను చకుముకిరాతినగాని యది ప్రకా

శము కానట్లు జ్ఞానముచేతను గురూపదేశమువలనను గాక ఆయాత్మ ప్రకాశమానము కాజాలదు.

(6) ఏక్ ఘడి అధిఘడి అధిహుమెఅధ్
తులసీసంగత్ సంతకి హరెకోటిఅపరాధ్.

ఆంధ్రము—హేతులసీదాసా! ఒక ముహూర్తముగాని యర్థముహూర్తముగాని అర్థార్ధముహూర్తముగాని సాధుసంగమమం దుండువాడు కోటికోటియపరాధములనుండి విముక్తుడగును.

(7) శోతే శోతే క్యా కరోభాయి ఉఠొ భజొ మురార్
ఆసే దిన్ ఆతె హైలంబాపాసార్.

ఆంధ్రము—హేసోదరా! పరుండి యేమి చేయుదువు? లేచి శ్రీకృష్ణ భగవానుని భజన గావింపుము; కాళ్లు సాచుకొని పరుండవలసినదినము ముందు రానై యుండనే యున్నది.

(8) తులసీ యియేసంసార్ మే పాంచో రతన్ హైసార్
సాధుసంగ హరికథా దయా దీన ఉపకార్.

ఆంధ్రము—హేతులసీ! ఈజగతియందత్యుత్తమమైన రత్నము లైదు కలవు. అవి యేవియన, సజ్జనసంగము; హరిభజనము; భూతదయ; వినయము; పరోపకారము.

(9) సబ్ వన్ తులసీభేయో, సబ్ పాహడ్ శాలగేరామ్
సబ్ పానిగంగాభేయో, జెసీఘట్ మేవిరాజ్ రామ్.

ఆంధ్రము—ఎవ్వానిహృదయమున శ్రీరాముడు విరాజిల్లుచుండునో ఆతనికి వనములన్నియు తులసీవనములవలెను శిలలన్నియు సాలగ్రామములట్లును, నీరములన్నియు గంగాసలిలములరీతిని గానగును.

(10) తులసీ మితే వచన్ సో సుఖ ఉపజత్ చహు ఉర్
వసీకరణమంత్ర హై పరిహార వచన్ కఠోర్.

ఆంధ్రము—హేతులసీదాసా! మధురాలాపమునుండియే సుఖము పుట్టును—తీయనిమాటలే వశీకరణమంత్రములు. అందుచే కఠోరవచనములను రానీయకుండుట ఉచితము.

(11) తుమ్ జయ్‌యున రామ్‌పర్ తుమ్‌సే తైయసారామ్
దహినే జూవ్‌తో డహినే జాయ్ వామే జావుతో వామ్.

ఆంధ్రము—అనుకూలభావమున భజన చేసితివేని భగవంతుడు నీయెడ ననుకూలుడై యుండును. ప్రతిచేసితివేని యాతడు నీయెడ ప్రతికూలుడై యే యుండును.

(12) జో జాకో శరణ్ లియే, సొరఖేతాకోలాజ్
ఉలట్ జలేమఛలీ చలే, వహిజాయ్ గజరాజ్.

ఆంధ్రము—శరణాపన్నుడైనవాని నార్తత్రాణపరాయణుడు రక్షించును. అతనిమానము కాపాడును. ఎట్లనిన జలమున శరణుజొచ్చినచేప లవలీలగ ప్రతికూలప్రవాహమున బోజాలును. కాని పెద్దశరీరముగల గజరాజట్లు పోజాలదు.

(13) తులసీ జగత్‌మే ఆయియే, సబ్‌సే మిలియాంధాయ్
నాజానేకోన్ భేక్ సే నారాయణ్ మిల్‌జాయ్.

ఆంధ్రము—తులసీదాసా! జగతిలోనికి వచ్చి అందఱితో కలసి మెలసి యాతడు తిరుగుచుండును. ఏల ననగా నారాయణు డేరూపమున వచ్చి యాతనికి దర్శన మొసగునో యతడెఱుగడు.

(14) నిర్గుణ్‌హియ్ సోపితా హమారా, సగుణ్ హెయ్‌మాహతారి
కాకెనిదో కాకెవందోదుయోపాల్లాభారి.

ఆంధ్రము—ఎవ్వాడు నిర్గుణుడో యతడు నాజనకుడు. ఎవర్తుక సుగుణయో యాపె నాజనని. అందుచే యొకరిని నిందించినను మఱొక్కరికి వందన మొనరించినను నిందావందనములు రెండును సమానములే.

(15) దివసేమోహినీ రాత్‌కోవాహినీ పలక్‌పలక్ లహుచోషే.
దునియాసబ్ బావురాహుక్ ఘర్‌ఘర్‌వాహినీపోషే.

ఆంధ్రము—పగటివేళను మోహినిగా నుండి రాత్రివేళ నాడుపులియై శరీరమునగలనాళములనుండి రక్తమును పీల్చివేయుదానిని జగతియందలి ప్రజలందఱు వెఱ్ఱివారై యింటింటనొక్కొక్కపులిని పెంచుచున్నారు.

(16) శ్రీమంత్ కో కంటక్ ఫుంకే డరద్ పుచ్ఛేసబ్ కోయ్
దుఖియా సావాండ్ సేగీ కే, బాత్ నాపుఛేకోయ్.

ఆంధ్రము—ధనవంతునకు సామాన్యమైనముల్లు గుచ్చుకొన్నచో నెల్లరును దానిని గుఱించి వాని నడుగుదురు. కాని నిస్సహాయుడై నదరిద్రుడు కొండమీదినుండి పడినను అతని నెవ్వరును పలుకరింపరు.

(17) తులసీ జగమేఆకర్ కర్ వేదో నోకామ్
దేనేకోటుక్ రోభాలో, వేనేకోహరినామ్.

ఆంధ్రము—హేతులసీదాసా! జగతిలోని కరుదెంచి రెండుపనులు చేయుము. ఆకలిగొన్నవాని కొకరొట్టెముక్క నొసగుము—ఇది దానమును గురించిన పని ; ఇక గ్రహణమును గురించినదానిలో హరినామమును గైకొనుట పరమలాభము.

(18) తులసీ యీాయేజగ్ మేఆయ్ కే, కోన్ భజోసోమ్ రత్

ఆంధ్రము—హేతులసీదాసా! పుడమిని పుట్టినవారిలో స్త్రీయొక్క పాలిండ్లదెసను బంగారముదెసను చేయి జాపనివా రెవ్వరును లేరు.

(19) కైకహే హరిదూర్ హై, హరిహై హృదయేమా
అంతస్ టాటీ కపట్ కే, తాసోసూ ఝునా.

ఆంధ్రము—కొందరు హరి దూరమున దున్నా డందురు. కాని శ్రీహరి మనహృదయమందే యున్నాడు. కపటివలె నంతరంగమున నతడు దాగి యుండుటచే అతనిని గురుతింపజాలకున్నాము.

(20) జయ్ సే పుతలీకాట్ కో, పుతలీమాస్ మయ్ దారీనా
అస్థినాడిమలమూత్రమయయంత్రిత నిందితభారీ.

ఆంధ్రము—కట్టబొమ్మవలె నుండి మాంసమయమై నాడులతోడను నెమ్ములతోడను నిండి మలమూత్రసమన్వితమై అతినిందితయంత్రమట్టు లుండి అవివేకులను మోహింపజేయు స్త్రీయందు శోభించున దేమియు లేదు. (స్త్రీలోలుడై నిముసమాత్రమయిన భార్యను విడిచియుండజాలని తులసీదాసు విరాగి యైనపిదప స్త్రీనిగురించి యిట్లుపలికెను.)

ఉన్నతాశయములకై పాటుపడినవారి జీవనములు కాల మనునాకస మున ప్రకాశమానమగు దీపసముదాయములై దుఃఖాంధకారమున బడి తడవు లకు నుత్తమపురుషార్థజీవనమునకై మార్గము చూపును. పుట్టినతోడనే యెవ్వ రును, మహాపురుషులు కాజాలరు. దారిద్ర్యము, అవమానము, మోసము, దుఃఖము, తాండవనృత్యము చేయుచు వారిమార్గముల కడ్డు నిలచును. అట్టి సమయమున దిగులు పొందక వానినెదుర్కొని అంతరంగమందలి విరోధు లతో వారనవరతము పోరవలెను. యుద్ధమున విరోధులను చంపుట సులువే గాని చిత్తమనుయుద్ధభూమియందలి విషయసుఖము లనువిరోధులను జయిం చుట కష్టము. జితేంద్రియులై యాత్మసామ్రాజ్యము సంపాదించు మహాపురు షులజీవనములను చదివితిమేని యిక్కట్టులనుండి గట్టెక్కుటయే గాక తమకు సంభవించిన కష్టములనే తమయుద్దేశసిద్ధికై తోడుపడుచేయూతల గావించు కొనుటకు వారవలంబించునుపాయములను గ్రహించి వారిశక్తిని వారిసాహస మును వారిధైర్యమును వారిస్థైర్యమును గ్రహింతుము. అన్నివేళల నవి పట్టు పడకున్నను పట్టుపఱచుకొనుటకైన ప్రయత్నింతుము. శ్రీరామునివిక్రమ మును కృష్ణునిసాహసమును శివాజీని మహాయోధునిగా గావించెను. అందుచే మహాపురుషుల సృష్టికి మహాపురుషులజీవితచరిత్రలు ముఖ్యమనుట అతిశయోక్తి కాదు. ప్రపంచమం దెకడగాని పుట్టనిమహాత్ములు భారతదేశమున జనియిం చిరి. భారతభూమియందు మహాపురుషులు పూర్వయుగమునందు గలరు. ఈ యుగమునందును గలరు. భవిష్యద్యుగమునను గలుగుదురు. ఇట్టిమహనీయుల యున్నతాదర్శములను వారియుత్కృష్టదృష్టాంతములను అనుకరించి విమల జీవు లయి ప్రజలు మహాపురుషు లగుదు రనుట వాస్తవము.

సత్యమేజయము. సత్యమే యిహపరసాధనము. సత్యమే దైవము. ఒకమహాపురుషునిగురించి వ్రాయుతఱి యనృతమయిన ప్రశంసకు లోనుగాక నిక్కమే వచించిన నొక్కనికిసాధ్యమైనకృత్య మింకొకని కేల సాధ్యము కా దనుభావము మానవులయం దుదయించును. ఆవగింజంత నిజమునకు ఆకాశ మంత అబద్ధము చేర్చితిమేని కథ విచిత్రముగా నుండునుగాని మనుజుని యాత్మో న్నతికి తోడ్పడుననియు, జీవితచరిత్రలయుద్దేశము ఫలించుటకు సహాయపడు ననియు తలంపరాదు. యథార్థముపై నాధారపడినచరిత్రయే చరిత్రము. మహా

పురుషులజీవితము లన్నియు మహాద్భుతములతో నిండియుండును. మహోన్నతభావముల భాస్వరకాంతులే యీఅద్భుతములు. ఈయద్భుతములు మహిమతో కూడియున్నవై యున్నవి. రూపముదాల్చిన పవిత్రతాసత్యములు, ఇంద్రియానుభవములును, తార్కికవిధానమును మాత్రమే జ్ఞానసంపాదనమునకు మార్గములు కావని తత్వజ్ఞానశాస్త్రజ్ఞులు తెలుపుదురు. మహాసత్యములు మెరుపుతీగలవలె మహాపురుషులమానసాకాశమున సహజజ్ఞాన కిరణములతో తళుక్కుతళుక్కు మనును. ఇట్టితళుకులందే — ఇట్టియద్భుతములందే స్వర్గసౌందర్యము విరాజిల్లును. ఇట్టియద్భుతములందే యాదర్శకిరణకాంతులు ప్రసరించును. ఇట్టియద్భుతములందే సత్యప్రతిభ ప్రకాశించును. ఇట్టియద్భుతములందే యీశ్వరాననము తేజరిల్లును.

---

౧౪

# మహాత్మా కబీరుదాసు



"మ. యవనవ్యాధపుళిందహూణశకసంకాభీరచండాల సం
భవులున్ దక్కి నపాపవర్తనులు నేభద్రాత్ము సేవించి భా
గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతనులై కల్యాణులై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నాకుమదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్."

కాశీక్షేత్రమునకు చేరువను గలయొకపల్లెయందు మహాత్ముండగు కబీరుదాసు పదునైదవశతాబ్దాంతమున జన్మించెను. కబీరు 1205 వ సంవత్సరమున పుట్టెనని యొకహిందుస్థానీయుడు వ్రాసెను. క్రీ. శ. 1505 వ సంవత్సరమునం దాతడు పరమపదించెను. అందుచే కబీరు మూడువందలయేండ్లు జీవించినట్లు తలంపవలసి యున్నది. అతడంత కాలము సజీవుడై యుండెననుట విశ్వాసనీయము కాదు. కాని యాతడు 1505 వ సంవత్సరమున జీవించియుండెనని నిర్ణయింపవచ్చును. కబీరు మహమ్మదీయమతమును విడిచి వైష్ణవమతమును స్వీకరింప వానిజనని యది తప్పుగా నెంచి కొడుకుపై సికిందరుషాహాయొద్ద నభియోగము తెచ్చె ననుటకు నాధారములు కలవు. సికిందర్ క్రీ. శ. 1500 వ సంవత్సరమున సింహాసనారూఢు డయ్యె నని హిందూదేశచరిత్ర తెలుపుచున్నది. అందుచే కబీ రపుడు జీవించియుండెననుట నిర్వివాదము. కబీరుపుట్టుకనుగురించి యొకచిత్రకథ కలదు. వితంతువైన బ్రాహ్మణస్త్రీయొకర్తె యొకమునివరునకు పరిచర్య సలుప నామెసేవ కలరి యాఋషి "బోటీ! కొడుకుతల్లివి కమ్ము" మ్మని యామె నాశీర్వదించెను. అందుల కావితంతువు మిగులతల్లడిల్లి "మహాత్మా! నేను పతిని గోలుపడినయభాగ్యురాలను. ఇపుడు సంతానవతినగు టెట్లు? అయినను లోకులముందు నిందపాలగుదును. మరియొకదీవన యేదియేని ప్రసాదింపు డనియెను. "కాంతా! నావాక్యమును నేను త్రిప్పజాలను. నీవు పవిత్రురాలవై సంఘమందు వసింతువు. పదుగురు నిన్ను దూరుటకు మారు నీయెడ భక్తి

గలిగి నిన్ను గౌరవింతు" రని చెప్పి మునివరుడు నిష్క్రమించెను. తరువాత కొన్ని నాళ్ల కాయువతికి కుమారుడు పుట్టెను. లోకులలో తలవంపులు వచ్చునని భీతి చెంది వెంటనే యామె శిశువును గొనిపోయి చేరువనుగల కాసారసమీపమున నున్న డొంకలో పారవైచెను. 'ఇటా' యను మహమ్మదీయ నేతపనివాడొకడు దైవవశమున నాదారిని చనుచు చంటిబిడ్డని యేడుపు విని చుట్టుప్రక్కల వెదకి డొంకయందు బాలభాస్కరునివలె ప్రకాశించు శిశువును గాంచి, తనకు కొడుకులులేనికొఱత దీర్చుటకై సర్వేశ్వరు డీశిశువును దయసేసె నని తలంచి శిశువును గొనిపోయి తనయిల్లాలి కిచ్చి యామెనుకూడ పరమానందభరితురాలను చేసెను. ఆదంపతు లాతనికి కబీ రని పేరు పెట్టిరి

పెరిగి పెద్దవాడు కాగానే యాతడు నేతపని నేర్చుకొనెను. కులవృత్తియం దీతడు ప్రవీణత గాంచె నని హిందూస్థానీగ్రంథములు తెలుపుచున్నవి. కాని కబీరు మహాభక్తు డగుట భక్తిధురంధరమును గ్రోలుటయేగాని కులవృత్తి వైపు దృష్టిసారింప లేదనియు తల్లి బలవంతముమీద నాతడు నేత నేయబూని సూత్రమధ్య విడిచివేయుచుండువా డని విడిచినభాగము శ్రీరామచంద్రుడు నేయుచుండువా డనియు ఆ నేసినవస్త్రమును విక్రయించి తెమ్మని తల్లి యంగడికి పంపినపుడు ముష్టివాని వేషమున కబీరుని పరీక్షింప శ్రీరాము డరుదెంచి వస్త్రమును దయసేయుమని కబీరును ప్రార్థింప మెత్తనిహృదయముగలవాడగు నాతడు తానమ్మకమునకు గొనిపోయినవస్త్రము నొకమారు సగముచొప్పున నామారుబిచ్చగాని కొసగి తల్లి కోపించునను భయమున నొకపాడు దేవళమున నక్కి రామభజనసేయుచుండ నదియెఱిగి తల్లియచటి కరిగి యతని బిలచి, తన్మయుడై భజనపలుపుతనయుడు పలుకనందున మిక్కిలికోపించి వానిని దండమున కొట్టెననియు నాదెబ్బలు అవ్వల వేచియున్న శ్రీరామచంద్రునకు తగిలెననియు కబీరుయొక్క నిశ్చలభక్తికి రామచంద్రుడు సంతోషించి ప్రత్యక్షమై యాతని నాశీర్వదించి వెంటనే యాతనిజననికికూడ భక్తిమార్గము చూపెననియు నితరగ్రంథములు తెలుపుచున్నవి. కాలక్రమమున నతనికి పెండ్లియయ్యెను. కబీరుభార్య పతివ్రతయై రామభక్తిపరాయణయై యుండెను. వారికి కమాల్ అను కొమరు డుండెను. అతడు వారికి పుట్టినపుత్రుడు కాడు. ఆకొమరునివిషయమున నొకవిచిత్రకథ కలదు. ఒకనాడు రాత్రివేళ కబీరు కాశీ

నగరసమీపమున గంగయొడ్డున రామస్మరణచేయుచు తిరుగుచుండెను. అపుడు స్మశానవాటికయందు విచ్చలవిడిగ పరువులెత్తునక్కలు మిక్కుటముగ నారువ జొచ్చెను. దైవశక్తిసంపన్నుఁ డగునాకబీరు పశుపక్షిమృగాదులధ్వనులయందలి రహస్యములను తెలిసికొనజాలువాఁడు. నక్కలయరుపులువిని "గంగపై శవమూ రక తేలిపోవుచున్నది. అదృష్టవశమున నది యొడ్డుచేరెనేని కడుపార శవ మాంసము మెక్కెద"మని నక్కలనుకొనుచున్న వని కబీరు గ్రహించి నీటిదెస చూచి మృతకళేబర మొకటి కొట్టుకొనిపోవుట చూచి దానిని గట్టునకు తెప్పింప గలిగెను. శవ మొడ్డు చేరినతోడనే చేపలు "మననోటికడనుండి యాహారము బడగొట్టి శవమును దరి కేర్చినవాఁ డెవఁడు? ఇదిదుర్న్యాయము గాదా!" అని యనుకొనెను. అదియు నెఱిగి, నక్కలకుగాని చేపలకుగాని యాశవమును దక్కించు టుచితము గాదనియోచించి తనయద్భుతశక్తిచే కబీరు దానికి ప్రాణము పోసి 'కమాల్' అనిపేరుపెట్టి గృహమునకు గొనిపోయి భార్య కొసగి యంతటినుండియు నతనిని పుత్రునిగాభావించుకొనియెను. అల్పవయస్సు నందే కబీరుహృదయము భక్తిరసావేశమయ్యెను. కులవృత్తివలన సంపాదించినపైకము నాతఁడు, కూటిపేదలకు నొసగుచుండువాఁడు. ఆకాలమున రామానందస్వామి యనునొకమహాపురుషుఁ డుండువాఁడు. రామమంత్రము నుపదేశింపుడని కబీ రాస్వామిపాలి కరిగి వేడికొనెను. రామానందుఁ డాతనిప్రార్థనమును మన్నింపక "బ్రాహ్మణునకేగాని యితరుల కుపదేశము గావింప" ననియెను. అందుకు మిగులఁ గష్టించి కబీరు తనమనోరథము తీర్చుకొనుటకు అనేక మార్గములు విచారించెను. తుద కాతనిచిత్తమున నొకయుపాయము తోఁచెను.

ప్రతిదినము జాముర్రాత్రియుండగనే రామానందస్వామి గంగాస్నాన మొనరించుచుండువాఁడు. అది యెఱిగి యాతఁడు స్నానమాచరించు రేవున కరిగి కబీరు శవమువలె పండియుండెను. దైవవశమున నపుడాకాశము మబ్బు గ్రమ్మియుండెను. అందుచే నల్దిక్కుల చీకటులు క్రమ్ముకొనియెను. ఎప్పటివలె రామానందస్వామి స్నానార్థమరుదెంచి, చీకటిలో యిసుకనేలపైనున్న కబీరును గాంచక యాతనిని తన్నెను. అప్పుడు శవ మేదియో కొట్టుకొనివచ్చి యందు పడియుండెనని యోచించి 'రామరామా' యనుచు స్వామి ప్రక్కకు తొలగెను. మహాత్మునినోటినుండి యామాటలువెలువడినంతనే యతనిపద

తాడనమును చవిచూచినకబీరు మహానందమునలేచి నమస్కరించి "గురు దేవా! యిదియే నాజీవితమునందు సుముహూర్తము. మీపదస్పర్శయు రామమంత్రోపదేశమును నొక్కమారే నాకులభించె" నని పలికి స్వామిజీ పాదములకు తిరిగి నమస్కరించి యందుండి వెడలిపోయెను. ఇల్లుచేరి కబీరు తల క్షురము చేయించుకొని మాలను ధరించి నుదుట తిలకమును దిద్దుకొనెను. కొడుకుధరించిన నూతనవేషమును గాంచి తల్లి మిగులకోపించి "నిన్నిట్లు వెఱ్ఱివానిని చేసిన దేవ" రని ప్రశ్నించెను. "అమ్మా! నేనువెఱ్ఱివాడను గాను, మహాత్ముడగు రామానందస్వామికి శిష్యుడనైతి" నని యాతడు బదులుచెప్పెను. తనకుమారుని మోసపుచ్చి రామానందస్వామి యతనిని మతభ్రష్టు గావించె నని తలచి యామె, సికిందరుపాహాకడ కరిగి మొరపెట్టుకొనెను. పాదుషా, తోడనే కబీరును తనచెంతకు పిలిపించెను. పరమభాగవతోత్తము డగునాతడు తిలకము దిద్ది తులసితావళము ధరించి ఢిల్లీశ్వరుని సమక్షమున కరిగెను. "నేల వరకు వంగి సలాము గావింపు" మని కొలువునగలవారు కబీరున కాజ్ఞాపించిరి. "రామునకుదక్క మరొకప్రభువునకు సలాముచేయు"నని నిర్భయముగ కబీరు పలికెను. అతనిజవాబునకు మిగులకోపించి "నీకింతబింకమా?" యని రాజాత నిని చెఱసాలలో బంధించెను. పిమ్మట ఢిల్లీశ్వరుడు కబీరుని ప్రభావ మెరిగి మత విషయమున నాతనితో తర్కించి యోడిపోయి యిట్టియసాధారణప్రజ్ఞాధురం ధరుని చెరసాలలో నుంచుట పాపమని గుర్తించి యతని వదలిపెట్టి మత ప్రచారమునకై యతనికి స్వేచ్ఛ యొసగెను.

రామానందుడు యవనుని ముట్టుకొనడని ప్రజలనుకొందురు. వైష్ణవ మతమున, రామానుజ, విష్ణుస్వామి, మాధవాచార్య, నింబాదిత్యులశాఖలు నాలుగుకలవు. అందు రామానుజసంప్రదాయము శ్రేష్ఠమయినది. రామా నందుడు రామానుజాచార్యుని ముఖ్యశిష్యుడు. తనశిష్యుడని కబీరు వచించిన విషయము తనకు తెలిసినపుడు రామానందు డాగ్రహావేశుడయి పాదుకతో నతని తలపై కొట్టెనని కొందరు తెలుపుదురు. శాంతమూర్తి యగు రామచం ద్రుని భక్తులందు ప్రసిద్ధి వడసినరామానందస్వామి యిట్టిక్రౌర్యమునకు గడంగె నని విశ్వసించుట కవకాశము కనుపించుట లేదు. కబీరు నాతడు శిష్యునిగా గయికొనెనని విని ప్రజలాశ్చర్యాన్వితులై నిజము తెలిసికొనగోరి రామానం

దునికడ కరిగిరి. ఆచార్యు డా పలుకులు విని యబ్బురపడి కబీరును పిలిపించి యడిగెను. అంత నాభక్తుడు "స్వామీ! స్నానముల రేవున తమపదములచే నన్ను తాకి రామరామాయని తామపలికిననాడే తమచరణతలమున నుపదేశ భాగ్య మందితిని." అని వినయమున నుత్తరమిచ్చెను. కబీరుని గాఢభక్తికి సంతసించి రామానందస్వామి యాతనిని తనశిష్యునిగా చేకొనెను.

రామానందునకు పండ్రెడుగురుశిష్యులు కలరు. వారిలో కబీరు ముఖ్యుడు. కబీరు మేధాసంపద యద్భుత మయినది. రామానందుని శిష్యుడైనది మొదలు హిందూశాస్త్రముల నాతడు మిక్కిలిశ్రద్ధతో చదువుచుండువాడు. అందుచే నాతడు త్వరలో పండితుడు కాగలిగెను. ధర్మమునుగురించిన ప్రశ్న యేదయిన దోచినచో దానిని చర్చించుటకై గురువుచెంత కరుగుచుండువాడు. కాని యాచర్చయందు ఆచార్యుడే పరాజితు డగుచుండువాడు. పైపై వేషము లాతనికి కిట్టవు. "జడలును బూడిదయు ధరించినంతనే యోగసాధన మలవడెనని తలపరాదు. నిజ మగుభక్తిమూలముననమాత్రమే ఈశ్వరారాధనము సాధ్యమాగు"నని యతడు చెప్పుచుండువాడు. కబీరు పలుకులు పలువురకు కోపము దెప్పించుచుండెడివి. అందుచే నతని కనేకులు విరోధు లైరి. భక్తవత్సలు డగుశ్రీరామచంద్రునిదయచే నాత డెట్టియికట్టులనైనను దాటజాలువాడు. కబీరుని వంచింపదలచి కొందఱు తులువలు భాగవతులకు కొందఱకు కబీరువ్రాసినట్టులు బహుమతులందుకొనుటకు రండని యాహ్వానపత్రములు వ్రాసిరి. అదియెరిగి పరమేష్ఠి కబీరురూపము దాల్చి ప్రతిభక్తునకు నుచితసత్కారములు చేసి పంపివైచెను. ఇంట బియ్యము లేకున్నను యతిథులెందఱు వచ్చినను కబీరును నతనిభార్యయు వారిని బహువిధముల బహూకరించుచుండువారు. అభ్యాగతులకు వండి వడ్డించుటకు వలయుసంబారముల కొని తెచ్చుటకై యొకసారి కబీరుభార్య యొకదుకాణమున కరిగెను. అంగడివాడాసామగ్రి నామెకోరికప్రకార ముచితముగా నిచ్చుటకు సమ్మతించి మదోన్మత్తుడై నిజహృదయ మామె కెఱింగించెను. కాని ద్రౌపదీమానసంరక్షణము గావించినపరమేష్ఠి వర్తకునిమనస్సు త్రిప్పి యామెమానము కాపాడెను. ఇట్లే నరిరొకయు గడివాడును నాసాధ్విపై మోహావేశుడు కాగా రక్షకభటుని రూపమున రామచంద్రుడు ప్రత్యక్షమై యామానవతీమణి మానము దక్కిం

చెను. వర్తకుడును తనదుష్టచేష్టితమును గుర్తించి యాసీమంతినికి నమస్కరించి కబీరుపదముల నాశ్రయించి మహాభక్తు డయ్యెను.

ఒకప్పుడు తమయింటికి వచ్చిన యభ్యాగతులకు వండిపెట్టుటకు తగిన పదార్థములు గృహమున లేనందున వానిని తమగ్రామమందలి కోమటియింట దొంగతనమున సంపాదింపవలెనని కబీరుడును కుమారుడును బయలుదేరినట్లు కొన్ని గ్రంథములయం దున్నది. కోమటియింటికి కన్నముత్రవ్వి తండ్రి నవ్వల నిలువుమని చెప్పి కుమారుడు లోనకరిగి కావలసిన పదార్థములు తీసుకొని జనకునకు వాని నందిచ్చి వారందుండి వెడలినంతనే దొంగలు వచ్చి కన్నమున నింట ప్రవేశించి గుట్టుపెట్టి నిద్రించువర్తకుని ద్రవ్యమునంతను గొనిపోదురేమో యని యోచించి యావర్తకుని మెల్లగా లేపి కన్నమునుండి యావలకు జరిపోవుటకు కుమారుడు ప్రయత్నించెనట. కాని నిదురనుండి లేచిన వర్తకుడు కన్నమున నుండగనే యాతనిని పట్టుకొనుటచే, నానవాలు తెలియకుండుటకై తనశిరమును ఖండించుకొని పొమ్మని తండ్రి నాతడు వేడ కబీరట్లొనరించెనట. మఱునాడు రాజాజ్ఞచే కుమారుని మొండెమును శూలారోపణము లొనరింప రక్షకభటులు బయలువెడలిరి. మార్గమున పోవుచుండ నా మొండెము దారిలో తమయింటినుండి వెళ్లుచున్న యతిథులకును తండ్రికిని నమస్కరించెనట. అది చూచి యాయతిథులు మిక్కిలి యాశ్చర్యమునొంది కబీరు నడిగి జరిగినవృత్తాంత మంతయు గ్రహించి కుమారునిశిరమును మొండెమునకు తగిలించి యీశ్వరుని స్మరింప నతడు సజీవుడై నిలచి చూపఱుల నాశ్చర్యమగ్నుల చేసెనట.

ఈ పై జెప్పిన విచిత్రవిషయము నిజమో మహాత్ముని యసాధారణ భక్తి ప్రశ్నలను దెలుపుటకయి కల్పింపబడిన చిత్రకథయో నిర్ణయించుటకు తగినఆధారములులేవు. కాని యతిథులను సత్కరించుటకయి కబీరును కుమారుడును దొంగతనమునకు బయలుదేరి రనుట నమ్మదగినదిగాలేదు. ఒకయుద్దేశ్యము యొక్క మంచిచెడ్డలను నిర్ణయించుటకు భావగుణమును సాధనగుణమును యోజింపవలెనని శత్వశాస్త్రమందలి భాగ మగునీతిశాస్త్రమందు చెప్పబడి యున్నది. క్రిస్పిన్ అను ఆంగ్లయోగి పేదలకొసగుటకై నాటకశాలల గుఱ్ఱములచెంత పొంచియుండి ధనికుల పాదరక్షలను దొంగిలించువాడట. పేదలకు

సహాయము చేయవలెనను భావము మంచిదియే. కాని యట్లొనరించుటకై యాయోగి యవలంబించి మార్గము దొంగతనమగుటచే గర్హితము. భావమును సాధనమును కూడ నుచితములైన గాని యీరెండింటి కలయికయైన యుద్దేశ్యము మంచిది కానేరదు. ఈనైతిక నియమమునుబట్టి తర్కించినచో నాయోగి యుద్దేశ్యము చెడ్డదనియే నిశ్చయింపవలయును. ఆయోగి అభిప్రాయమును కబీరుయొక్కయు కుమారునియొక్కయు నభిప్రాయములును నొకే విధమయినవి. కబీరు అట్టికృత్యము చేయబూనెననుటచే సంశయింపవలసి యున్నది. తనపశువును చంపి దానిచర్మమున చెప్పులుకుట్టించి ప్రజలకు దానమొనరించుటయుకూడ నిట్టిదే.

శాస్త్రవిషయములందు జరుగు తర్కవితర్కములందు రామానందుడే తరుచు కబీరుచే నోడిపోవుచుండుటచే వారియిరువురికలయిక విశేషకాలము నిలువలేదు. గురువునుండి విడిపోయి కబీరు తనమతము నెల్లతావుల ప్రచారముచేయ దొడగెను. రామానందుడు జాతిభేదములను పరిగణించువాడు. కాని కబీరుఅట్టిభేదములను లక్ష్యముచేయక ధర్మోపదేశ మొనరించుచుండువాడు. అచిరకాలముననే దేశమునందెల్లకడల కబీరునకు శిష్యులుచేరిరి. 'కబీరుపంథావలంబుర' మని వారు పేరుపెట్టుకొనిరి. కటకమున, బొంబాయి రాజధానిలోను, శ్రీక్షేత్రమున విహారరాష్ట్రమునందును కబీరు చాలా మతములను నెలకొల్పెను. కబీరుపంథావలంబులమతములు నేడును హిందూదేశమున వంద్రడలు గోచరించుచున్నవి. కాశీక్షేత్రమందలి 'కబీరుచౌరా' యాపండ్రడింటలను ప్రసిద్ధమయినది.

కబీరొకనాడు రాజమార్గమున బోవుచు నొకవీధియరుగుమీద యువతియొకతె తిరుగలిలో బియ్యము విసరుచుండుట గాంచి చింతాకులమానసుడై యిట్లు యోజింపదొడగెను. "సంసారమనియెడు పెద్దతిరుగలియందు బడుచూనవు లిట్లే నలిగి నరకపథగాములగుదురు కదా! కాని తిరుగలిలో పడిన బియ్యమన్నియు పిడిపిండి గాకుండుట చూడ యించుక ధైర్యము కలుగుచున్నది. తాతిడుమ నున్నరంధ్రములోని గురుసుచుట్టును గలబియ్యము నలుగక యెప్పటియట్లున్నవి. సంసారచక్రమునకు నడుమ గలయీశ్వరు నాశ్ర

యుంచువారు గురును సంటియుంచు ఐక్యమువలె సంసాయము బొందక సుఖులై పిమ్మట విష్ణుసాయుజ్యమును కరుగ నేర్తురు

దేశభ్రమణ మొనరించుచు పల్లెటూళ్లయందు కొంతకాలము గడపి తన యాశ్రమమునకు కబీరొకప్పుడు మరలినపుడు ఆతని శిష్యులు "మహాత్మా! జనపదములం దేమి వింతలు వినోకించితి?" అని ప్రశ్నించిరి విచారగ్రస్థుడయి యాతడు "వత్సలారా! యేమని చెప్పుదును పల్లెటూళ్ళన్నియు ఘోర దుర్దశయందు మునిగియున్నవి. బ్రాహ్మణులు వేదములను స్మరింపక జ్ఞానవిహీను లగుచున్నారు. హీనజాతులవారు శాస్త్రచర్చ జరుపుచు జ్ఞానధను లగుచున్నారు. మోసమునందు ప్రవీణులగువారు సుఖముగా జీవనము గడపుచున్నారు. కాని సుగుణవర్తులు క్షుత్బాధచే ప్రాణములు పోగొట్టుకొనుచున్నారు. పతివ్రతలు ధరించుటకు సామాన్యవస్త్రమేనియు లభించుట కష్టమగుచున్నది. వ్యభిచారిణు లగుస్త్రీలు బహుమూల్యవస్త్రాలంకారములను ధరించి సౌఖ్యముగా కాలము పుచ్చుచున్నారు. పండితులయెడ దేశములు విను వా రెవ్వరును లేరు. వా రెదురైనతఱి తలయెత్తి చూచువారు లేరు. నీచులును దబ్బరకాండ్రును మోసకాండ్రును సంఘమున పెద్దలుగా గణింపబడుచున్నారు. పాలు పాలని కేకలు వేయుచు వీధులవెంట పాల నమ్మువారు సంచరించుచున్నను గొనువా రెవ్వరును గోచరింపరు. కాని కల్లుదుకాణములయందు పలువురు చేరి త్రాగి మత్తులై ప్రవర్తించుచున్నా" రనియెను.

కబీరుశిష్యులలో పద్మనాభు డనునొక బ్రాహ్మణయువకుడు మిగులప్రజ్ఞావంతుడుగా నుండెను. వైశ్యభక్తుడొకడు పూర్వజన్మమున నొనరించిన పాపము కారణముగ కుష్ఠురోగియై యెంతయత్నించినను తన్నావ్యాధి విడువకుండుటచే నిరాశ చేసికొని గంగాగర్భమున పడి ప్రాణముల పోగొట్టుకొన యత్నము చేయుచుండగా పద్మనాభు డతనిదుడుకుతనము వారించి మృదువగునుపదేశవాక్యములచే నాతని నూరడించి భవతారక మగుతారకమంత్రమును ముమ్మారుచ్చరించి యాతనికుష్ఠురోగమును భవరోగమునుకూడ నశింపచేసెను.

కబీరు కొన్ని యుద్గ్రంథముల రచించెను. వానిలో 'బీజక్' అనుగ్రంథము ప్రధాన మైనది. ధర్మమునకు సంబంధించిన యాతనిగంభీరాభిప్రాయములు అందు కడునేర్పున లిఖియింపబడి యుండెను. కబీరుని యాచార్యు డగురామా

నందునను శైవమతోద్ధారకులలో విఖ్యాతిగాంచిన గోరక్షనాథుడు నతనికి ప్రతికక్షులయి నిలచుచుండువారు. ఈమహాపురుషులతో నాతడునలిపిన తర్క వితర్కములు విపులముగా 'రామానందకీగోష్ఠి, గోరక్షనాథకీగోష్ఠి' యను రెండు గొప్పగ్రంథములయందు వివరింపబడెను.

పదునాలుగవశతాబ్దమధ్యభాగమున గోరక్షపురమునకుసమీపమున గల 'మగర్' అనుపల్లెయందు మహాత్ముడగుకబీ రిహాజీవనమును చాలించెను. మృతుడైనపిదప వానికాయముపై శిష్యులు వస్త్రముగప్పి యంత్యక్రియలకై వలయునేర్పాటులు చేయదొడగిరి. కాని వారిలో వారికి వివాదము పొసగెను. గురువర్యునికాయము దహన మొనరింతమని హిందూశిష్యులనిరి. ఆచార్యుని శరీరమును భూగర్భమున సమాధిచేయుట యుచితమని మహమ్మదీయశిష్యులనిరి. వారట్లు కలహించుకొనుచు శవముపై గల వలువ నెత్తి చూడ మృతకళేబరమదృశ్యమయ్యెను. శవమునకుమారుగ పుష్ప మందు గోచరించెను. శిష్యులవివాద మంతట నంతరించెను. హిందువు లాపుష్పమందలి యర్థభాగమునుగొని కాశ్మీరమం దుచితరీతి దానికి దహనసంస్కారములు గావించిరి. రెండవతునకను గొని తురకలు మగర్ గ్రామమునందే సమాధిగావించిరి.

కబీరురచించిన కొన్నిపద్యములు.

(1) కబీర్ భలి భేయిమోగురు మిలే, నిహింతోహోతీ హాని
దీపక్ జ్యోతి పతంగజై ఓ పరత ఫూజా జాని

కబీర్:—క=మస్తకము, బ=కంఠము, ఈ=శక్తి, ర=వహ్ని; అద్భుతమేధా, శక్తిజ్ఞానము, తేజముకలిగిన పురుషపుంగవుడు కబీరు.

గురువు:—అంధకారమునుండి జ్ఞానములోనికి గొంపోవువ్యక్తి ఆత్మ.

గురువు లభించుటమంచిదయ్యెను. లేకున్న హాని యయ్యెడిది. అనగా జన్మమృత్యువులనుండి తప్పిపోజాలువాడను గాను. భవసాగరమునుండి తొలగించుఆత్మజ్ఞానము పడయకుండువాడను. దీపశిఖ పండని యెంచి యందు పడి చచ్చుశలభములవలె విషయసుఖములతళుకుబెళుకులకు మోసపోయి సంసారాగ్నికీలలో పడి మానవులు తీరనిహాని తెచ్చుకొందురు. కాని ఆచార్యుడు దొరకినందున భ్రమయందు పడక ఘోరహానినుండి తప్పించుకొన గలిగితిని.

(2) కబీర్ జ్ఞానసమాగమ్ ప్రేమసుఖ్ దయాభక్తివిశ్వాస్
గురు సేవాతే పాయియే సత్ గురుశబ్ద సే వాస్.

కబీర్! ఆత్మజ్ఞానముమూలముననే మానవుడు ప్రేమసుఖమును బడయును. ఆత్మజ్ఞానముమూలమున సుఖియై యతడన్యులకు సుఖముజేకూర్పగ జేయు యత్నమునే దయ యనుందుము. గురువాక్యముమూలమున నతడు సుఖము పడసి యొరులయెడ దయ చూపుతటి సుఖ మందుచుండును. దయ మూలమున వానిభక్తి వృద్ధిచెందును. భక్తి క్రమక్రమముగా వృద్ధి చెంది విశ్వాసము జనించును. విశ్వాసమేధృవజ్ఞానము. ధృవజ్ఞానమే బ్రహ్మ. కావున మానవుడు విశ్వాసమూలమున ఆత్మోన్నతిని, బ్రహ్మజ్ఞానమును బడయును.

(3) జిన్ జిన్ సంబల్ నాకియా అస్పుర్ పాటన్ పాయ్
ఝూల్ పరేదిన్ ఆఖనే సంబల్ కి యానజాయ్.

ఉత్తమమయిన మానవజీవనముపొంది, సమయముండగనే పరలోకసుఖముసకై యేమియు యత్నము గావింపకున్నయెడల, జీవనసూర్యుడు గ్రుంకిన పిమ్మట మనుష్యుడేమిచేయజాలును.

(4) జేజెన్ భీజె రామరస్ వికసిత కవహు న రుఖ్
అనుభవ భావన దర్శై తే నరసుఖ నదుఃఖ్.

భక్తిరసమున మునిగినవ్యక్తి యెన్నడును మలినముకాజాలడు. చిక్కిపోనేరడు. అతడు సర్వదా ప్రసన్నుడై యుండును. కోరిక యతని తాకనేరదు. సుఖముగాని దుఃఖముగాని యాతనియం దెట్టిమార్పును కలుగజేయవు.

(5 సాధు భయాతో క్యా భయా జో నహిం బోల్ విచార్.
హాతె పరాంగ ఆత్మాజీవ్ లీ యే తలబార్.

సత్యాసత్యములు విమర్శింపక మాటలాడునాతడు సాధువేషము వేసినను ప్రయోజన మేమి. నాలుకరూపమున నున్న కత్తిచే నాత డితరుల యాత్మల నొప్పించును.

(6) జాకో గురుహై ఆధార చలాకహ కరాయ్
అంధే అంధచైలియా దేఉ కూప్ పరాయ్.

గురువే అంధుడైయుండ ఆతనిశిష్యు లేమిచేయుదురు. అంధు డంధునిచే నడుపబడుచూ నిరువురును నాశ బడుదురు.

(7) పూరాసాహబ్ సెయియే సబ్ విధిపూరాహోయ్
ఒఛెనే హొలుగాయియే మూలౌ ఆవై ఖోయ్.

ఏవ్యక్తి పరిపూర్ణు డగుపరమేశ్వరునిపై ఆధారపడునో అత డన్నివిధముల పరిపూర్ణుడు కాజాలును. కాని అనిత్య, అసారపదార్థములదెస మనసు పోనిచ్చునాతడు పూర్తిగా వినాశము చెందును.

(8) భక్తి పియారీ రామకీ జయ్ శెప్యారీ ఆగి
సారా పాటన్ జరీ గయా ఫిరిలావై మాగి.

అగ్ని స్పర్శచే దేశమంతయు నశించిపోజాలినను లోకులు నిప్పును విడువనట్లు ఈశ్వరభక్తిమూలమున సాంసారికసుఖము కోలుపడుచున్నను సాధుపురుషులు సర్వదా భగవత్ చింతాపరాయణు లైయుందురు.

(9) సావన్ కె రా మెహరా జన్ ద్ పరా అసమాన్
సబ్ దునియా వైష్ణవ్ భయీ గురున లాగ్యే కాన్.

వర్షము కురియకపోవుటచే పంటలు పండ నట్లు, ఉపదేశముల నూరక విని వానిని హృద్గత మొనరించుకొనకపోయినచో ధర్మసమాజమందు చేర జాలుదురు గాని లోకులు సద్గురు (ఈశ్వర) దర్శన మందజాలరు.

(10) అర్బ ఖర్బ లోదర్బ హై ఉద యఅస్తగా రాజ్
భక్తి మహాత మనతులై యసబ్ కౌనే కాజ్.

ధనికు లసంఖ్యాకులై యుదయాస్తాచలములవరకు వ్యాపించియున్న పుడమికంతకు యేలికలైనను మహాత్ము లగుభక్తులతో సరిపోలరు. అట్లగుడు నిక్కముగా విలువలేనివిత్తముదెస దృక్కులుసారించు టేల ?

(11) సాచ్ బరోబర్ తపనహి ఝుఠ బరోబర్ పాప్
జాకె భితరె సాచ్ హై తాకె భీతర్ ఆప్.

సత్యముతో సమమైనపుణ్యమును, మిధ్యతోతుల్యమగు పాపమును లేవు. ఎవ్వానియంతరంగము సత్యభావముచే పరిపూర్ణమై యుండునో అం దీశ్వరుడు వసించును.

---

౧౫

# హరిదాససాధువు

సీ. వరధర్మకామార్థ వర్జితకాములై
విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు చేరి కాంక్షించువారి క
వ్యయదేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ
ముక్తాత్ము లెవ్వాని మునుకొని చింతింతు
రానందవార్ధిమగ్నాంతరంగు
లేకాంతు లెవ్వాని నేమియుఁ గోరక
భద్రచరిత్రంబుఁ బాడుచుందు
గీ. రామహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు నున్న తాత్ము
బ్రహ్మమయినవానిఁ బరుని నతీంద్రియు
నీశు దూరు సూక్ష్ము నే భజింతు.''

హరిదాససాధువు యే దేశవాసియో, యాతడు చిన్నతనమున నెట్లు గడపెనో యెఱుంగుటకు తగినయాధారములు లేవియు కానరావు. కాని యాతని శిష్యు డగు రామతీర్థుడు తనయాచార్యుడు మహారాష్ట్రదేశమున జన్మించెనని తెలిపినట్లు కొన్నిచరిత్రలయందు గానబడుచున్నది. హరిదాసు పదిపదాఱు వత్సరముల ప్రాయమువా డయియుండ వారియింటికి సమీపమున నొక గొప్ప సన్న్యాసి మఠ మేర్పరచుకొని వసించుచుండెను. ఆగ్రామవాసులతోపాటు హరిదాసును తఱచు సన్న్యాసిని దర్శించుచుండువాడు. ఇంట్లు చేరువయగుటచే నా సన్న్యాసికి హరిదాసుపై నెక్కుడుమక్కువ గలిగెను. కొలదిదినములలో నతడు దాసును శిష్యునిగా చేసికొనెను. దా సతనిచెంత నుపదేశమును పొంది యోగదీక్షాపరతంత్రుడై, తనయాచార్యునితోఁగూడి జాడ తెలియరాకుండ నెచటికో జనెను. తల్లిదండ్రులును బంధుమిత్రులును వెదకివెదకి విసివిరి కాని యతనిని కను

గొనజాల రైరి. పిమ్మట కొన్నినాళ్ల కతడెద్దియో కొండగుహాయందు గురువుతోగూడి యోగాభ్యాసము చేయుచుండె నని తెలియవచ్చెను.

కొన్నియేండ్లాకొండగుహాయందు గడపి యత డమృత సరోమునకు వచ్చెను. అచిరమున నతని కనేకులు శిష్యులైరి. అతని యద్భుతమగు యోగాభ్యాసశక్తికి శిష్యులు నిర్ఘాంతపోవు చుండెడివారు. క్రమక్రమముగా నాతని పేరు పాంచాలదేశమంతట వ్యాపించెను. పలువు రాంగ్లేయులుకూడ నతనిశక్తి గని యాశ్చర్యాన్వితు లగుచుండువారు.

కఠోరపరిశ్రమ చేసి హరిదాసు యోగాభ్యాస మొనరించి సిద్ధి పొందెను. నిదురకాని, ఆహారముకాని లేకయాత డనేకమాసము లుండజాలువాడు. భూగర్భమున నాలుమాసములు కప్పబడియుండియు నతడు సజీవుడైయుండెను.

1835 వ సంవత్సరమున మార్చి మొదటితేదీని పాంచాల దేశమందలి జెసల్మీరనునగరమున హరిదాసు మృత్తికాగర్భమున నొకచిత్రమగు సమాధిని ప్రారంభించెను. అపుడు లెఫ్టినెంటు బైలో యనునత డందుండెను. దాసు సమాధిని గురించి యాత డిట్లు వ్రాసెను.

“హరిదాసు పెద్దలోతైన గోతియందు తనసమాధిని మొదలు పెట్టెను. పురుగు లాతని దేహమును తినివేయకుండ శిష్యు లాతని దేహమును కాషాయ వస్త్రముచే గట్టిగా కప్పివైచిరి. తరువాత బలమగు రెండుజాతిపలకలచే వారాగోతిని మూసిరి. అంతటితో తృప్తి చెందక నాపట్టణాధీశుడు యింకను కట్టుదిట్ట మొనరింపు మని తనమంత్రిని నియోగించెను. అత డపుడాజాతిపలకలపై దట్టముగా మట్టిపూత వేయించి యాగోయిగలయింటికి తాళమువేయించి ద్వారములకడ పెద్దరాళ్లు పాతించి యప్పటికిని తృప్తినొందక శిష్యు లేదేని యుపాయమున లోపల ప్రవేశింతు రేమో యనునను మానమున విచ్చుకత్తులు చేబూనిన రక్షకభటుల నాప్రదేశమునకు నలువైపుల కాపుంచెను.

హరిదాసిట్లు మృత్తికాగర్భమున నొక నెలరోజు లుండెను. ఏప్రియలు మొదటి తేదీని పురాధీశుడు దాసును వెలికిదీయ నిశ్చయించెను. నాటివింత చూచుటకు దేశదేశాంతరములనుండి యనేకులు గుమిగూడిరి. మంత్రి సమాధి మందిరమును నలుప్రక్కల పరిశీలించి జాతిపలకలను పగులగొట్ట సేవకుల నాజ్ఞాపించెను. పిమ్మట తాళము తీసి యావరణములో ప్రవేశించి గోతిపై వట

చిన పలకలను పరీక్షించి సంశయాస్పద సుగుగుసుతు లేవియు గానక మట్టి తీయించి శిలలను కూడ మెత్తించివైచెను. యోగివరు డెప్పటివలె సమాధి యందానీనుడై యుండెను. శిష్యులు మెల్లగా నాతని గోతినుండి పైకి తీసి కాషాయాంబరమును విదల్చివైచిరి. స్వామిజీ నిశ్చేష్టుడై యుండెను. కనులు మూతపడి యుండెను. కాలు సేతులు ముడవబడి యుండెను. పలువురు లోక దానికొకటి యంటి యుండెను. అయ్యాకృతి పరికించి చూపరులెల్ల రాతడు మృతి చెందెననియే తలచిరి. కాని శిష్యులు కొన్నిగంటలసే వాతని దేహము నకు సేవ చేసినంత నే యాశరీరమున కొంచెము కదలిక పుట్టెను. క్రమక్రమ ముగ స్వామిజీ కాలు సేతులు చాప జాచెను. కనులును దెరచెను. కాని దుర్బ లతచే లేచి నిలువ జాలకపోయెను. దాసుశుష్క దేహమున మరల నాయువు చూపట్టుటచే హిందువులేమి మహమ్మదీయులేమి యెల్లరును వాని యసాధా రణయోగాభ్యాసమహిమ కచ్చెరు వంది యతనిని కేవల మీశ్వరాంశసంభూ తునిగా భావించి భక్తితాత్పర్యములు మనమున నిండుకొన నతనికి సాష్టాంగ ప్రణామ మాచరించిరి.”

ఈవిచిత్రకథను విని స్వామిజీయద్భుతశక్తిని స్వయముగా పరీక్షింప దలచి రాజారణజిత్ సింహుడు హరిదాసును లాహోరునకు రావించెను. నిండు సభకు జడదారి వచ్చినంతనే యతనశక్తి చూపు మని తే డాతని వేడెను. తేనిప్రార్థనము ను పెడచెవిని బెట్ట జాలక హరిదా సందుల కంగీకరించెను. రావీ నదియొడ్డునగల యొకసుందరవనమును సమాధిప్రదేశముగా నిర్ణయించెను. ఆయుద్యానవనమునకు నలుప్రక్కల నెత్తైనగోడలు కలవు. ఆవనమున హరి దాసు ప్రవేశించెను. రణజిత్ సింహుడును నతనితనయుడును మనుమడును సేనా నియు మొదలగువా రాతోట జొచ్చిరి. పూర్వానుష్ఠానములను ముగించి సమాధిలో ప్రవేశించుసమయమున హరిదాసు రణజిత్ సింగుతో “మహారాజా! నలువదిదినములు గడచినపిమ్మట యీపెట్టిలోనుండి నన్ను లేవ నెత్తుడు.” అని పలికెను. రాజు సరే యనినంతనే హరిదాసు యోగావలంబన మొనరించెను. యోగాసనమున నాతడు కూర్చుండినపిమ్మట కొన్నినిముషములలోనే మైమర చెను. అపుడు రాజాజ్ఞ ననుసరించి భటులు హరిదాసు నొక పెట్టెయం దుంచి తాళమువైచిరి తోటనడుమ తగినంతగోయి త్రవ్వించి యాపెట్టె నం దుంచి

పూడ్చివైచిరి. అంతటితోఁ జాలించక రణజిత్‌సింగు గోతిపై నుంచిబలమైన తాళ్ళను స్థాపించి దానిపై నొత్తుగ మట్టిపోయించి యవల నాగట్టుపై జల్లించి వనద్వారమును బంధించి కఠినులగుభటుల నందు కాఁ పుంచెను. ముప్పది తొమ్మిదిదినములు గడచిపోయెను. నలువది యవదినమున మధ్యాహ్నవేళ రణజిత్‌సింహుడు 'పొలిటికల్ ఏజం టగుకెప్టెన్‌వార్డు' 'డాక్టర్ మేక్‌గ్రెగర్' 'డాక్టరుమెరే' 'జెనరల్ వెంజురా' మొదలగు మహనీయులసముక్షమున సమాధిని బాగా పరిశోధించి, సందేహజనక మగునటు లేమియు గనుబడక యున్నందునను గోతిపై జల్లినయవలు మూరెడువరకు మొలకలెత్తియున్నందునను, గోయిత్రవ్వించి పెట్టెను పైకి తీయించి పరీక్షించెను. ఎప్పటివలె తాళము గట్టిగా పెట్టె నంటి యుండెను. తాళము తీసి మూత తెఱచి చూచుతఱి తపసి తొల్లియట్లు యోగాసనమునఁ గూర్చుండి యుండెను. 'రణజిత్సింగు మేక్‌గ్రెగరు'ను, 'డాక్టరుమెరే'యును సాధువును పరీక్షించిరి. అతనిశరీర మంతయు చల్లపడి యుండెను. నాడి చలనము లేదు. గుండెలు పరీక్షింప నందుండి యేవిధమైనధ్వనియు చెవులకు వినవచ్చుటలేదు. చాలసేపు హరిదాసుశరీరమును పరిశీలించి ఱెప్పలు వెనుకకు ద్రిప్పి పరికించి యతడు చనిపోయె ననియు దుండగమునకుసాహసించి పాప మాతడు మృతి చెందెననియు వారు తెలిపిరి. శిష్యులు చెఱునగవు నవ్వి గురువుశరీరమునకు శుశ్రూష చేయ దొడగిరి. కొంతసేపటికి స్వామిదేహమున గదలిక పుట్టెను. అతడు కన్నులు తెఱచెను. కాలుసేతులు గదపి యేదియోపలికెను. వైద్యు లాతని మరల పరీక్షించి వింతపడిరి. అమితానందభరితుడై రణజిత్‌సింహుడు స్వామియెడ గల భక్తిగౌరవములు వెలిబుచ్చుచు గొన్నిఫిరంగులను పేల్పించెను. హరిదాసునందు మఱికొం దద్భుతశక్తు లుండెడివి. నేలమీద నడచినట్లె యెంత దూరమైన నతడు నీటిపై నడచి పో జాలువాడు. గాలిలో జాలదూరము పైకి లేవ జాలువాడు. హరిదాసు జననవిషయమువలెనే యతని మరణవిషయమును సరిగా తెలిసికొనుటకు నిదర్శనములు గనుపించుటలేదు. అతఁ డేవయసున్న నెందు తనజీవనమును చాలించెనో యెఱుంగుటకు నాధారములు గానరాలేదు. కాని హరిదాసు నూఱేండ్ల కధికముగా జీవించెనని ప్రజలు చెప్పుకొనుచుండెడివారు.

## ౧౬

# రఘునాథదాసు

మ. "అడవిం జీఁకటిఁ బోవువాని కుదయంబై నట్టిసూర్యాకృతిన్
జడధిన్ గ్రుంగఁగ నావడగ్గతిన మోజన్ బేదకున్ లిబ్బి చో
ప్పఁడురీతిన్ దృషఁ దీర్పఁగా జడిమొగుల్ పైకొన్న చందాన నొ
వ్వఁడరన్ మాన్పెడు వెజ్జునట్లు హరిడాయన్ వచ్చి నన్ బ్రోచుతన్."

మహాత్ముం డగుచైతన్యుఁడు వంగదేశమున హరిభక్తిని వెదజల్లుచున్నరోజులలో హిరణ్యదాసు గోవర్ధనదాసు లనునిద్దరుసోదరులు గౌడనవాబుకడనుండి 'సప్తగ్రామ' మనుగ్రామమును బడసిరి. ఆకాలమున నాపల్లె వర్తకమున మిగుల పేరు చెందెను. పదునాలుగవశతాబ్దమున ఢిల్లీశ్వరుని ప్రతినిధిహుసేన్‌సాహా వంగసీమను పాలించుచు గౌడనగరమును ముఖ్యపట్టణముగా చేసికొనెను. శ్రీమద్రూపసనాతను డపుడు వానికడ మంత్రిగ పనిచేయుచుండెను. దాసుసోదరులు సప్తగ్రామము సంపాదించుటకు ముఖ్యహేతువు యీతడే. అందుచే దాసు లిరువురును రూపసనాతనునియెడ కృతజ్ఞులై యుండిరి. బాగా డబ్బుగలవారలయ్యు సోదరులిరువురు సద్గుణసంపన్నులయి ధర్మమార్గానువర్తులయి యుండువారు. తమపైకమును విశేషముగా సత్కార్యములందు వెచ్చించువారు. అతిథిసత్కారము వారి కెంతయు ప్రీతికరముగ నుండెడిది. వీరిగృహ మనవరతము పండితులతోడను గురువులతోడను భక్తులతోడను నిండియుండెడిది.

చిన్నవాఁ డగుగోవర్ధనదాసునకు 1417వ సంవత్సరమున రఘునాథుఁడు పుట్టెను. బాలకునికి యుక్తవయస్సు రాగానే తండ్రి యాతనిని గురువునింటికి పంపుచువచ్చెను. సుప్రసిద్ధపండితు డగుబలరామాచార్యుడు రఘునాథునికి గురువు. మహమ్మదీయులయందు జనియించి హిందూమతము నవలంబించి హరిదా సనుభక్తుఁడొకడు బలరామాచార్యునింట నివసించుచుండువాడు. మతభ్రష్టు డయ్యె నని తోడిమహమ్మదీయులును దుర్మతులును హరిదాసును మిగుల బాధింప మొదలు పెట్టిరి. మార్గమధ్యమునను బురదనేలలందును నాతడు పడి

యుండువాడు. అట్టివానిని గాంచి కరుణాళుడై బలరాము డాతనికి తనయింట తా వొసంగెను. ఎల్లప్పుడు దైవభక్తిపరాయణుడై హరినామసంకీర్తనమున ఉన్మత్తునివలె హరిదాసు మెలగుటగాంచి పలువు రాతని పిచ్చివానిగ భావించిరి.

బలరామాచార్యులయింట చదువుకొనుబాలకులు హరిదాసు వెఱ్ఱివాడనితలచి, అతనిపై బురద, గోమయము, బూడిద, దుమ్ము విసరుచు పిచ్చివాడని యఱచుచు నల్లరి చేయుచుండువారు. రఘునాథుడు తోడిబాలకులతో జేరక హరిదాసుపాదములకడగూర్చుండి యాతనితన్మయతీవనము గాంచి యాశ్చర్య పడుచుండువాడు. చదువుసంధ్యలయం దెంతమాత్రము శ్రద్ధ చూపక యాచార్యు డింటలేనిసమయమున హరిదాసుచెంతకు బోయి యతనితో హరి భజన మొనరించుచుండువాడు. గోవర్ధనదాసుబంధుమిత్రులు రఘునాథుని చర్య చూచి "ఈతురకపిచ్చివానిమూలమున రఘునాథుడు కూడ పిచ్చివాడగు" నని యెంచి హరిదాసును పెక్కువిధముల బాధపెట్టుచుండువారు. ఆబాధల కోర్వజాలక హరిదాసు సప్తగ్రామమును వీడి శాంతిపురమున కరిగెను.

హరిదాసు సప్తగ్రామము వీడి పోయినను రఘునాథునిచిత్తమునుండి భక్తి భావము తొలగిపోలేదు. చిన్నవా డయ్యును నతడు వైరాగ్యమునందే యభి లాషగలవా డగుచుండెను. ధనసంపన్నుడయ్యు సుఖముగ భోజనము చేసి పరి చారకులచేత సేవలు చేయించుకొనుచు నింటనుండ నొల్లక విరాగివలె తిరుగు చుండువాడు.

చైతన్యుడు శాంతిపురమున నున్నతఱి రఘునాథు డచటికి బోయి యామహాత్మునికి సేవ చేసి పరితృప్తి చెందెను. బాలకుడు సన్యాసివలె తిరుగు చుండుట చూచి చైతన్యు డతని కిట్లుపదేశించెను. "బాలకా! లోకమునం దెవ్వరు నొక్కమారుగ సంసారసాగరమును దాటజాలరు. తాను సన్యాసి యని పరులు చెప్పుకొనుటకయి కాషాయివస్త్రములను కట్టుకొని తిరుగుసన్యాసి ధర్మమార్గమునుండి జారినవాడై మహాపాపి యనిపించుకొనును. పైకి విషయ సుఖముల ననుభవించుచున్నను చిత్తమున వైరాగ్యభావమును పెంపు పొందించుమహనీయుడే నిజ మగుయోగి యగును. నీవు యిపు డింటికి జని సంసారసుఖ మనుభవించుచు నంతరంగశుద్ధి నందుచుండుము. ఇది ధర్మమం దభి లాషగలవాడు చేయవలసినవిధి. నీ విట్లాచరించితివేని యీశ్వరుడు నీకొడల

ప్రసన్నుడయి నీకు ముక్తి నొసగును. జగదీశుని శరణు వేడినమానవుడు స్వవిషయయోన్నతినిగూర్చి చింతింప నక్కర లేదు. నీ మనస్సు నీశ్వరచరణకముల సాన్నిధ్యమున నుంచుకొని స్వగృహమునకు మరలుము."

చైతన్యునియుపదేశము లభించినందులకు సంతసించినవాడై దాని ననుసరించి వర్తిప నిశ్చయించుకొని రఘునాథు డింటికి మరలెను. గృహకృత్యముల నెఱపుచు కొంతకాల మాతడు సుఖముగ నింట జీవనము చేసెను. ఇట్లుండ నొకనాడు నిత్యానందస్వామి యనునొకయోగి కలకత్తాకు నాలుగుమైళ్లదూరమున 'పానిహాట' యనుప్రదేశమున నున్నాడనియు హరినామసంకీర్తనమొనరించుచు దైవభక్తి నతడుపదేశించుచుండెననియు విని, యచటికరిగి యాతని గాంచి వాని విలువలేనియుపదేశముల నాకర్ణింప పోవ నన్నాజ్ఞ యిమ్మని జనకుని నాతడు వేడెను. గోవర్ధను డాతనికోరిక నంగీకరించెను గాని తల్లి యేకపుత్రుని సన్యాసికడకు పంపుట కొప్పుకొనలేదు. భార్యనుద్దేశించి గోవర్ధనుడు "రఘునాథునిప్రాణము ధర్మగతమై యుండగా నాతని నింట నుంచుమని నిర్బంధించుట మంచిది కాదు. నిర్బంధించితి మేని వాని యుద్వేగ మధికమై చాలా చిక్కులు సంభవించు' ననియెను. పిమ్మట తల్లిదండ్రుల యనుమతి గైకొని రఘునాథుడు నిత్యానందస్వామికడ కరిగి యాతని దర్శించి నమస్కరించి "ప్రభూ! నే నతిదీనుడను. చైతన్యదేవుని పాదపద్మములను సేవింపవలెనను కోరిక నాచిత్తమున నుదయించెను. నాకోరిక సిద్ధించునట్లు నన్నాశీర్వదింపు" డనెను. "వత్సా! నీవాంఛ గొప్పది. చైతన్యునిమూలమున ముక్తిలాభమును పొందుదువు" అని యాతడు రఘునాథుని దీవించెను.

నిత్యానందస్వామిదీవనల నంది యింటికి వచ్చి పట్టుదలతో వ్రతము ప్రారంభించి భగవంతు నారాధింపసాగెను. ఇట్లు కొన్నినాళ్లు గడచెను. ఒకనాడు రాత్రి రెండుయామములప్పుడు తన యతులైశ్వర్యమునువీడి రతీదేవిని బోలు భార్యను, నవమానములు మోసి కనిపెంచిన జననీమతల్లిని దుఃఖమునగూర్చి తండ్రిని శోకసాగరమునముంచి, తన చిరవాంఛితధర్మమార్గలాభమునకై రఘునాథుడు శ్రీక్షేత్రాభిముఖముగ నరిగెను. మార్గమధ్యమున ననేకపాట్లు పడి నిద్రాహారము లెఱుగక నడచినడచి కొంతకాలమునకు 'పూరీ' ధామమును చేరుకొనెను. చైతన్యాదిస్వాము లాతని గాంచి పరమానందమున నతని కౌగలించుకొనిరి,

మార్గమధ్యమున రఘునాథుడు చాల బాధ పడెనని తెలిసికొని చైతన్యుడు తనసేవకు డగు గోవిందు నుద్దేశించి "రఘునాథుడు త్రోవలో చాలా కష్టపడెను. చాలదినము లుపవాసములు చేసి యిచటి కరుదెంచెను. అతనికి కొన్నిరోజులు సేవ చేయు" మని పలికి సముద్రస్నాన మాచరించిరమ్మని రఘునాథునితో వచించెను. స్నానముచేసి దేవదర్శనాదిక్రియలను కావించి రఘునాథు డింటికి మరలినంతనే గురువర్యుని భోజనావశిష్టపాత్రమును గోవిందు డాతనిముందు పెట్టెను. భక్తులగు వైష్ణవులకు ప్రసాదాన్నముకంటె విలువయైన పదార్థము మఱియొకటి లేదు. గౌరాంగ (చైతన్య) దేవుని దర్శనార్థమయి ప్రయాణమున నానాశ్రమల కోర్చి మృతప్రాయుడుగా నున్న రఘునాథుడా ప్రసాదాన్నము బడసి యమందానంద మొందెను.

వరుసగ నైదుదినములు గురునింట నన్నము వడసి రఘునాథు డిట్లు తలపోయ దొడగెను. "మహాప్రసాదము కడుపునింపుకొనుటకై కాక ఆత్మరక్షణకై గ్రహించుట యుచితముగాని నేనేమొనరించుచుంటిని? ప్రసాదమును మెక్కుచు దేహమును పుష్టి చేయుచు మహాపరాధ మొనరించు చుంటిని."

ఆఱవనాడు సముద్రస్నాన మాచరించి జగన్నాథుని దర్శింప దేవాలయమున కరిగెను. మందిరసమీపమున పగలంతయు హరిసంకీర్తన మొనరించి సాయంకాలమున సవలకు బోయి యొకదుకాణముకడ బిచ్చమెత్తి యాకలి దీర్చుకొనెను. రఘునాథునికై యెప్పటియట్లు ప్రసాదమును సిద్ధమొనరించి గోవిందు డెంతకు నత డింటికి మరలకుండుటగాంచి వానికై వెదకి భిక్షాన్నము నాతడు తినుట చూచి రఘునాథుని యుద్దేశ మెఱిగి సంగతియంతయు చైతన్యునకు తెలిపెను. ఈవృత్తాంతము వినినంతనే చైతన్యు డపరిమితానందము నొందెను. మిక్కిలి ధనవంతుడగు మహాశయుడు పగలంతయు దేవళముముందును ద్వారమందును నిలచి హరిసంకీర్తనమున దేహము మఱచి తిండికై యత్నింపక బిచ్చపుకూడు తినుచుండెను. ఇట్టి సాటిలేని వైరాగ్యభావమునకు దృష్టాంతము నెందు చూడగలము?

మందిరముచెంత బిచ్చమెత్తుట కూడదని తలచి కొన్నినాళ్లు జరిగిన పిమ్మట సత్రముకడ కరిగి భజనసలుపుచు తమంతటతాము ప్రజలొసగుకూడును కుడుచుచుండువాడు. ఇట్లు కొన్నిదినములు గడిచిపోయెను. బిచ్చమెత్తికూడ

పొట్టనింపుకొనుట కూడనిపని యని తలచి యాత్రీకులు పారవైచిన యెంగిలి మెతుకులను నేఱుకొని ప్రాణముల నిలుపుకొనుచుండువాడు. పాసిపోయిన యన్నము కుళ్లినయన్నము పెంటప్రోవులమీద నుండుటగాంచి మెల్లగ రఘునాథు డాయన్నమును దీసి కడిగి భుజించువాడు. రఘునాథుడొనరించు నేపని యైనను గౌరాంగునకు తెలియకుండునది కాదు. రఘునాథు డెంగిలిమెతుకులు దినుచు శరీరమందిరమును నిలుపుకొనుచుండె నని విని గుడిసెలో నాలసింప నోల్లక చైతన్యు డాతడున్న చోటికి బరువిడిపోయి యుత్సాహవేగమున నతని నాలింగనముచేసికొని "వత్సా! నీవిట్టివస్తువును దినుచు నాకు కొంచమైన బెట్టుటలే దేల ?" యని పలికి అసలే యెంగిలియై రఘునాథునివలన మరింత యెంగిలియైన యన్నమునం దొకముద్దను తీసి నోట బెట్టుకొనెను. గౌరాంగుడు రెండవముద్ద నెత్తుసమయమున రఘునాథు డాతనిచేయిపట్టుకొని "ప్రభూ! యే మొనరించుచుండిరి? ఇట్టియన్నమును తము తిన జెల్లునా ?" యనెను.

చైతన్యునియనంతరము రఘునాథుడు బృందావనమున కరిగి 'రాధాకుండ' మున వసింపదొడగెను. కొంతకాల మాకుండమున నతడు హరిభజన చేయుచు జీవనమును గడపి దేహత్యాగ మొనరించెను. రఘునాథుడు రచించిన పొత్తములుకొన్ని నేటికిని వంగదేశవైష్ణవభక్తులు పఠించుచుందురు. అందుప దేశామృతము; మనఃశిక్ష; శ్రీచైతన్య స్తబక కల్పవృక్షము; విలాప కుసుమాంజలి; శ్రీప్రేమాంబుజమకరందాఖ్య స్తవరాజము; మిగుల ప్రసిద్ధమైనవి.

ఒకరి సదభిప్రాయముగాని, దురభిప్రాయముగాని; ప్రశంసగాని, నిందగాని; ఆదరముగాని, అవమానముగాని; లక్ష్యముగాని, వెక్కిరింతగాని, లెక్కింపక నిజాదర్శమును సఫలతనొందించుకొనుటకై యెట్టికష్టములు వచ్చినను లక్ష్యము సేయక, దుఃఖమును దరిజేరనీయక ఆదర్శమార్గమునుండి తొలగకుండునాతడే యుత్తమపురుషు డగును. అమేయ ధనరాసులను కాల దన్నివైచి రంగుగోచిధరించి యెట్లో యెందో లభించు యెంగిలిమెతుకుల మెక్కుచు నింద్రియదుర్మదంబు ద్రుంచి ధనమువలెనే కీర్తికూడ నైహిక మని గ్రహించి సంపూర్ణమగు నాత్మస్వారాజ్యము నంది రఘునాథుడు నిక్కంపుయోగి యయ్యెను. కావుననే యామహాత్ము డాదర్శసంయమి యని వచింపబడెను.

---

౧౭

# యవనహరిదాసు



"దళదిందీవరనీలనీరదసముద్యద్భాసితాకార! శ్రీ
లలనాకౌస్తుభచారువక్ష! విబుధశ్లాఘోద్భవస్థాన! కో
మల నాభీచరణారవింద జనితామ్నాయాద్యగంగా! లస
జ్జలజాతాయతనేత్ర! నిన్ను మదిలోఁ జర్చింతు నారాయణా!"

మానవులందు నూటికి తొంబదుగురు అజ్ఞానులుగా నుండి జ్ఞానులగు పదుగురను అజ్ఞులుగా తలచి వారిని పీడించుచుందురు. కాలక్రమమున గాని పీడితులే జ్ఞానులనువిషయము తెల్లము కాదు. 'సోక్రటీసు' 'యేసు' మున్నగు మహనీయులచరిత్రములు యీవిషయమును నిరూపించుచున్నవి. యేసుపొందిన యవమానము సత్యాచరణమును భూతలమున మరియేమానవుడును నించుకయు చవిచూచి యెఱుఁగడు. యేసువాక్కులు వినియు వాలకము పరికించియు నతని దేశస్థులు వెక్కిరించువారు. ఱలుగాఁ లాతని మోమున నుమిసిరి. సత్త్వకొలఁది లెంపలువాయించిరి. వాడిముండ్లను కిరీటమువలెగూర్చి తలపై గ్రుచ్చిరి. బోరగిల పండవేసి త్రాళ్లచే మోదిరి. ముఖమున బురద పూసిరి. తుదకు శిలువపై నిలువ బెట్టి వాడిమేకుల నెమ్ముకలయందు గొట్టి మెల్లమెల్లగా నతని ప్రాణములను పిండివైచిరి. ముఖమున బడినదుమ్ము కాంతివంతమగు బంగారు రజమగుటకును మోము నంటినయుమ్మి యనంతజ్ఞానామృతాంజన మగుటకును, వడ్రంగికడుపున పశుశాలయందు బుట్టిననిరుపేద లోకోత్తరపురుషుడని గుర్తించుటకును సమయము వచ్చెను. ఇట్టిమహనీయులం దనేకు లొరులకన్నుల పడకనే కడముట్టుదురు. కొందఱిమానవులు వారిమాహాత్మ్య మెఱుంగకున్నను జగదీశు డట్టివారిని నిజాంకతలమున బెట్టుకొనును. పలువురదౌష్ట్యమునకు గుఱియయ్యు నిజాదర్శపథములనుండి తొలగక మహాపురుషులైనవారిలో యీయవనహరిదాసొకడు.

ఈతడు క్రీ. శ. 1314 వ, సంవత్సరమున మార్గశిరమాసమున నదియా జిల్లాయందలి 'బుడాన్' గ్రామమున గౌరీ, సుమతిఠాకూర్ లనుదంపతులకు జన్మించెను. హరిదా సాఱేండ్లప్రాయము నందినపుడు తండ్రి పరలోకగతు డయ్యెను. తల్లి సహగమనమొనరించి పతివెంట స్వర్గలోకము జేరెను. బాల కుడు దిక్కులేనివా డయ్యెను. మార్గములయందు బడి మిక్కిలి వంతలపడు చున్నయీబాలకు డొకనాడు తురకలచేతులకు చిక్కెను. వా రాతనిని తమ మతమందు గలుపుకొనిరి. చిన్నతనమునుండియు నతడు మహమ్మదీయమత గ్రంథములను మిగుల శ్రద్ధతో చదువదొడగెను. చిఱుతప్రాయమునందే ధర్మాను రాగమున నతడు మిక్కిలియభిలాషగలవా డయ్యెను. అద్వైతుడనునొకయో గీంద్రు డద్భుతప్రభావసంపన్నుడని యెఱిగి యాతనిప్రసాదము పడయ హరి దాసు శాంతిపురమున కరిగెను. తురకకు హిందూమతధర్మమును బోధించు టకు స్వామీజీ యిష్టపడలేదు. కాని హరిదాసు భక్తివిశ్వాసములను పరికించి యోగి యుచ్చెరువంది యాతనికోరిక నెఱవేర్చెను. 'ఫూలియా' పల్లెకు కొంత దూరమునగల యరణ్యమందాతడు తనకుటీరమేర్పఱచుకొని హరినామమును జపించుచుండువాడు.

హరిదాసు విష్ణుభక్తుడయి కాలము గడపుచుండుట గాంచి మహమ్మదీయులు కోపించి యాతని నెట్లయిన తిరిగి తమమతమున కలుపుకొనుటకై శక్తివంచనలేక యత్నించిరి కాని వారికోరిక వ్యర్థయయ్యెను. తమయిష్టము ననుసరించి నడువక హిందూభక్తుడయి మెలగుట గిట్టక వాని నెట్లైన దండింప నిశ్చయించి మహమ్మదీయమతగురువు లాతనిని నవాబుకడకు గొనిపోయిరి. నవాబు నిర్దయుడై హరిదాసుని భటులచే కొట్టించెను. గాట మగునాదెబ్బల కాతని దేహమునుండి రక్తము కాలువలుగట్టెను. పాప మాతడు దురంతవేద నముచే బాధపడి యొడలు తెలియక నేలగూలెను. వానినుండి ప్రాణములు బహిర్గతములయ్యెనని యెల్లరును తలంచిరి. వానిని గోతియందు పాతిపెట్టు డని మతగురువులు పరిచారకుల కాజ్ఞాపించిరి. వా రాతనిని గోతియందు పెట్టు తఱి హరిదాసునకు స్పృహవచ్చెను. పరిచారకు లా వార్త గురువులకు విన్న వించిరి! బ్రతికియున్న మనుజుని పాతిపెట్టుట ధర్మముకాదని తలచి తురుష్కు లాతనిని నదియందు పడవైచిరి. నీట చాలదూరము కొట్టుకొనిపోయి తుద

కొట్టులో యాతడు ప్రాణములతో గట్టు చేరెను. ఏదిక్కును లేక నిదురాహారములకు మోమువాచి తలదాచుకొనుటకు తావుగానక యాతడల్లాడుచుండ, జాలిగొని సప్తగ్రామవాసి యగుబలరామాచార్యుడను నొక యాచార్యుడతనిని తనయింటికి గొనిపోయి సంరక్షింపసాగెను. ఆ యాచార్యుడు హరిభక్తుడు. హరిదాసుభక్తి కాతడు మిగుల న[illegible]రుచుండువాడు. హిందువులును మహమ్మదీయులును బద్ధవైరులై యుండి మహమ్మదీయు డింట నడుగిడినంతనే యిల్లును యింటియందలి ప్రతివస్తువును నపవిత్రములగు నని ప్రజ లూహించు రోజులలో మహమ్మదీయులతో నించుక చెలిమిచేసినంతనే హిందువులు భయపడవలసినంత విపరీతభయంకరసమయమున బలరామాచార్యుడే జంకును గొంకును లేక పరుపేదయై దిక్కులేనిపక్షియగు నన్యమతస్థునకు నిజహృదయమందిరమున చోటిచ్చి పవిత్ర క్రియాకరణసంజనిత సంతసమున తోడిజాతీయుల దూషణములను లెక్కసేయక శూరుడై నిక్కంపు మహాపురుషు డనిపించుకొనెను.

మతభేదమున వాటిల్లుననర్థములు చెప్ప శక్యముకాదు. ఈయనర్థమునకొక్కమనుష్యుడే యుత్తరవాది. జాతిభేదములను మతభేదములను సూచించు శబ్దములు భగవంతునినిఘంటువునందు గానరావు. తనమూర్ఖతయు, తమ యహంకారమును తమదురాగ్రహతయు, భగవంతునిమొదలకూడ నారోపించి మతముపేర ధర్మమును విడినాడి మానవుడు విరుద్ధాచారమున కొడిగట్టుచు నుండును.

హరిదాసుహరిసంకీర్తనము మహమ్మదీయమతగురువుల హృదయమున క్రోధాగ్నియై రవిలి వారియాయువును మాడ్చివేయ గమకించెను. దిక్కులేని తురక వానికి యింట దిక్కుచూపినందులకు పండితులు బలరామాచార్యుని మిక్కిలి దూషించిరి. ఆచార్యునియనురాగము హరిదాసునకు పెట్టనికోటగోడ వలె నుండ నతడు నిరపాయముగ నందు వసించుచు నొక్కొక్కప్పుడు కన్నుల నుండి బాష్పకణములు వెలార్చుచు మఱియొకపుడు కనులు మూసికొని యేదియో పలవించుచు నింకొకయపుడు నవ్వుచు వేరొకపుడు గంతులువేయుచు తన్ను దాను మఱచి వర్తించుచుండెను. హరిదాసును గాంచినవారెల్ల రతడున్మాదుడనియు నాయున్మాదు నింట నిడుకొనీ కాపాడు బలరామాచార్యుడు మఱియు పిచ్చివాడనియు వింతవింతగా చెప్పుకొనుచుండువారు.

సప్తగ్రామ జమీందారునికుమారుడు రఘునాధుడు బలరామాచార్యుని కడ విద్య నభ్యసించుచు హరిదాసుభక్తికి విమోహితుడై చదువుసంధ్యలు మాని తురకసన్యాసినిగూడి తానుకూడ హరినామసంకీర్తన గావించుట చూచినంతనే యాతనితండ్రి యాచార్యు ననేకరీతుల మందలింప దొడగెను. ఇది యెఱిగి తనకు తావాసంగిన మహాత్ముననకు తనమూలమున గొప్పచిక్కు రానైయున్నదని గ్రహించి గురువునకు కృతజ్ఞత తెలిపి హరిదాసు శాంతిపుర మున కరిగి గంగానదీతీరమున వాసము చేయదొడగెను. నూతనోత్సాహమున ననంతానందమున స్వామిజీ యచట హరికీర్తన మాచరించుచుండువాడు. ప్రతిదినము లక్షమారులకంటె నెక్కువగ హరినామస్మరణ చేసినగాని యాతడు గ్రుక్కెడునీరైనను గ్రోలువాడుకాడు. ఈవిశుద్ధాత్మునిభక్తి గాంచి ప్రజ లెన్నోనివిధముల నతనికి సేవసేయుట కువ్విళ్ళూరుచుండువారు.

ఇట్లుండ దుష్టుడగు జమీందారుడొకడు హరిదాసు సాధనమునకు విఘ్న మాపాదింపదలచి యొకనాటి యర్ధరాత్రమున భోగస్త్రీనొకర్తె నాతని కుటీరమునకు పంపెను. మెఱపుతీగవలె ప్రకాశించుచు, తనకుటీరమున ప్రవేశిం చిన సుందరి నంతగా పరికింపక హరిదాసు తనకీర్తనమును తాను పాడుకొనుచు నుండెను. ఆవారకాంత హరిదాసును తనవలలో పడవైచుకొనుటకు శక్తివంచన లేక యత్నించెను. వారాంగన పన్నినమాయలకును యోగివరుని తన్మయత్వ మునకును యామె మందహాసమునకును యాతని చిరునగవునకును యెట్టినంప ర్కము కలుగదాయెను. ఆసుందరివలలో బడుటకా హరిదాసు, మునీశ్వ రుడుగాని మునిగ్రుచ్చుగాడు. స్వామిజీభజన ముగియువరకు వేచి యతని నెట్లు యిన, పాపకూపమున ద్రోయు, నావెలవెలంది నిశ్చయించుకొనెను. కాని యెంతసేపు కనిపెట్టుకొనియున్నను నతనిభజన ముగియులేదు. కునుకుచు నొక మాఱు గొణుగుచు నొకమాఱు తిట్టుకొనుచు మఱియొకమాఱు, నిట్లు వెల యాలు రేయియంతయు నాకుటీరమున నాగి విచారగ్రస్తయయి యుదయమున నింటికి బోయెను. మఱునాడుకూడ వేశ్య హరిదాసుగుడిసె కరిగి కొంచెమునే పేమేమో పెడర్థపుమాటలు పలికి స్వామిని వేళాకోళము చేయు మొదలిడి వానివలెనే భజన ప్రారంభించెను. ఎంతసేపు భజనచేసి మధురస్వరమున పాడి నను స్వామిజీ యామెవైపు చూడలేదు. ఇక నీపలుగాకిని చూడ నొల్లనని

పలుకుచు వేడినిట్టూర్పు పుచ్చుచు నావెలవెలది స్వగృహమునకు పోయెను. కాని స్వామిజీ నెటులైన దుష్టప్రవర్తనునిగా చేయ నిశ్చయించుకొనిన జమీందారు మఱికొంతప్రకమును వారాంగనకిచ్చి మూడవనాడు తిరిగి యామెను హరిదాసు నాశ్రమమునకు పంపెను. ఆమెయు నందగిరి స్వామిజీతో పాడుచు నాడుచు చూపుతూపులచే నాతనిమనస్సును కరగింప బ్రయత్నించు చుండెను. ఇట్లు యత్న మొనరించుచుండ నాకస్మికముగా నామెహృదయమున నొకనూతనజ్ఞానము పుట్టెను. వేళాకోళములు భక్తిపారవశ్యముగా మారెను. పరమానందమున నావెలయాలు తన్మయత్వమున హరిభజన ప్రారంభించెను. హరిదాసందులకు మిగులసంతోషించి యామెకు మంత్రోపదేశ మొనరించెను. పశ్చాత్తాప విమలోదకమున నామెపాపపంకము కడిగివేయబడెను. హరినామ ధ్యానమున నొడలుమఱచి హరిసంకీర్తన మొనరించుచు హరిదాసువలెనే యామె జీవితశేషమును గడపెను.

ఈకథ యద్భుతజ్ఞానగర్భితమై యున్నది. ఉపన్యాసమం దాటితేటి గురుగంభీరస్వరమున గొప్పగొప్ప ఆదర్శములను బోధించు మహనీయులు కొందఱు కలుషమయ జీవితము నడపుచుండుట కలదు. ఉపన్యాసము లెంతెంత మేధాశక్తిని వెలిబుచ్చుచున్నను క్రియలు నీతిబాహ్యప్రవర్తనమునే వెలి బుచ్చుచుండును. ఎవని మాటలు క్రియలు నొకరూపమున నొకమార్గమున నుండునో యతడుత్తమపురుషుడు. ఈ నియమము ననుసరించి పరీక్షించితిమేని లోకమున నిపుడు మహాపురుషులని పేరుపడినవారిలో చాలామందిని తీసివేయ వలసియుండును. కాని హరిదాసువంటి యుత్తమపురుషులు కాల మనునాకస మ్మున కాంతియుతమగు నక్షత్రములవలె ప్రకాశింతురు. ఘోరకలుషమున దిగ బడి తననుగూడ దింపదలచిన యభాగినిని సాధులక్షణశోభితనుగా నతడు గావించెనుగదా!

పిదప హరిదాసు నవద్వీపమునకు వెడలి యచట వైష్ణవులతో గలసి మెలసి చరించుచుండువాడు. ఆతనిభక్తిప్రేమలను గాంచి యబ్బురపాటు చెంది నవద్వీపవాసు లాతనిని పెక్కుభంగుల సేవించుచుండువారు. శ్రీచైతన్యుడు

'నీలాచలమున' (జగన్నాథక్షేత్రము) వసించుచుండెనని విని సాధువైష్ణవసమూహము వెంటరా నచటికరిగి చైతన్యునిసమ్ముఖమున పరమసంతోషముతో నితడు జీవనము గడవదొడగెను. శ్రీచైతన్యునకుముందే యవనహరిదాసు పరమపదించెను. అంత్యసమయమున శిష్యులతోగూడ చైతన్యుడు వానిచెంత నుండి హరినామసంకీర్తనము గావించెను. హరిదాసాయద్భుతసంకీర్తనమున పాలుగొని శ్రీహరినామమునుచ్చరించుచు నిహజీవనమును చాలించెను.

మృతకళేబరమును సింధునదీతీరమునకు గొనిపోయి హరిభజనకీర్తనస్వనముల దిశలు మాఱుమ్రోగుచుండ నచట యిసుకనేలయందు శ్రీచైతన్యుడు దానిని సమాధి గావించెను.



౧౮

# లోకనాథబ్రహ్మచారి

శా. శ్రీరామామణిపాణిపంకజస్మృదుశ్రీతజ్ఞ పాదాబ్జ! శృం
గారాకారశరీర! చారుకరుణాగంభీర! సద్భక్తమం
దా! రాంభోరుహపత్రలోచన! కళాధారోరుసంపత్సుధా
పారావారవిహార! నాదురితసంఘాల్ భంజింపు నారాయణా!

వంగాబ్దంబున 1131వ. సంవత్సరమున పడమటివంగసీమయందు బ్రాహ్మణకులమున లోకనాథబ్రహ్మచారి జనియించెను. పదియేండ్ల వయస్సువాఁడగు వఱకును నితఁడు స్వగ్రామమగుపల్లెటూరియందుగల వీథిబడియందే చదువు నేర్చుకొనెను. పిమ్మట నొడుగు చేసి యాతనితండ్రి యతనిని గురుగృహమునకు పంపెను. పూర్వకాలమున బ్రాహ్మణబాలురు విద్య గురుగృహమునందు వసించియే నేర్చుకొనుచుండువారు. ఉపాధ్యాయులును శిష్యులకు నన్నము బెట్టి యిచ్చి పోషించుచు విద్యగఱపుచుండువారు. ఈయాచార మిప్పటికిని నచట నచట వేదవిద్యాభ్యాసకులపట్ల కనుపించుచున్నది.

ఈతనిగురువు భగవాన్ చంద్రగంగులి. అతఁడు షడ్దర్శనములందును నద్వితీయపాండిత్యము గడియించినవాఁడు. వేద ప్రామాణ్యాప్రామాణ్యవాదములు, జీవేశ్వరభేదాభేదవాదములు, యీశ్వరాస్తిత్వానాస్తిత్వవాదములు, నూతగా దత్త్వమన్వేషింప గడంగి పూర్వమునులు రచియించిన మతవిషయికశాస్త్రములు దర్శనము లనబడినవి. ఇవియాఱు. సాంఖ్యము; వైశేషికము; మీమాంస; యోగము; న్యాయము; వేదాంతము. కొన్నినాళ్లు గురుగృహమున శాస్త్రాభ్యాసము గావించి లోకనాథు డాచార్యునితోకూడ నిల్లు విడచి బయలుదేరెను. వేణీమాధవు డనునురియొకశిష్యుడుకూడ నితనికి తోడయ్యెను. శిష్యులనిద్దరిని వెటబెట్టుకొని యాచార్యుడు కలకత్తా చేరెను. ఆరోజులలో కలకత్తాయంతయు నరణ్యప్రదేశముగా నుండెడిది. సాధువులనేకు

లచట జేటి యోగాభ్యాసము చేయుచుండెడివారు. అడవినడుమ నివసించుచు శిష్యులిరువురును గురునియాజ్ఞప్రకారము కఠోరబ్రహ్మచర్యవ్రతము నాచరింప గడగిరి.

ఈ వ్రతానుష్ఠానమున లోకనాథు డాత్మసంయమనమం దారితేరెను. పూర్వజన్మజ్ఞానముకూడ నాతని కలవడె ననియు తనపూర్వజన్మనుగురించి యాతడు తెలిపినయుదంతము నిజమయిన దని ఋజువుమూలమున కనులు తెలిసికొని యాశ్చర్యము నొంది రనియు వాడుక కలదు.

శిష్యులనిరువుర వెంటబెట్టుకొని యాచార్యుడు నానాస్థానములయందును తిరిగితిరిగి తుదకు కాశీ చేరెను. అచట కొంతకాల ముండి మణికర్ణికాఘట్ట మున నతడు యోగమార్గమున ప్రాణముల వదలెను. ప్రాణములు వీడుటకు మున్ను తనశిష్యులనిద్దఱ త్రైలింగస్వామి కొప్పగించెను.

లోకనాథుడును వేణీమాధవుడును, కొంతకాలము త్రైలింగస్వామికడ యోగశిక్ష నభ్యసించి, యందు ప్రవీణులగుటకుతగినసాధనము నొనరింప హిమాచలముల కరిగిరి. హిమాచలమునందలి యొకగుహలో కొన్ని సంవత్సరములు వసించి కఠోరయోగసాధన మొనరించి యందుసిద్ధిగాంచిరి. పిమ్మట నాపర్వతములు విడిచి వారిరువురు చంద్రనాథమునకు వెడలిరి. వేణీమాధవు డచటినుండి కామాఖ్య యనుపట్టణమునుగూర్చి చనెను. లోకనాథుడు 'వారదీ' పల్లియ కరిగెను.

ఈపల్లె ఢక్కాజిల్లాయందు మేఘనీనదియొడ్డున గలదు. స్వామి యానదియొడ్డుననే తనకుటీరము నేర్పాటు చేసికొనెను. ఆపల్లెయందే యతడు చాలా కాల ముండుటచే నా గ్రామవాసులందఱు వానిని వారదీబ్రహ్మచారి యని పిలుచుచుండువారు.

లోకనాథుడు పూర్వజన్మస్మృతి నెఱిగియుండెనని యిదివరలో వ్రాసియుంటిమి. యోగాభ్యాసమున నత డెన్నియో యద్భుతవిద్యలయందు నేర్పరియయ్యెను. ఇష్టానుసారమున తనశరీరమునుండి జీవమును నతడు బహిర్గతమొనరింప జాలువా డనియు పరకాయప్రవేశ మొనరించియు తిరిగి తన దేహమున

చేరుచుండువాడనియు జంతువులమనస్సునందలి యభిప్రాయములను సులువుగా గ్రహించువాడనియు, అన్యులశరీరమందలి వ్యాధులను తనకాయమునందు ప్రవేశపెట్టుకొని వారిని రక్షించుచుండువాడనియు మోము చూచినను చూడకున్నను యితరులమనోభావములను పూర్ణముగా నెఱుగగలవాడనియు ప్రసిద్ధి వడసెను.

అనేక దేశములనుండి యనేకులు యీనదియొడ్డున నున్న స్వామివారి యాశ్రమమునకు వచ్చి యతనిని దర్శించి ధన్యులగుచుండువారు. ఇట్లుండగా నాగ్రామమున నొకానొకపురుషుడు దురంత మగుక్షయవ్యాధిచే బాధపడుచు తన నెట్లయిన నారోగమునుండి విముక్తుని గావింపు మని స్వామిజీని వేడికొనెను. ఆతనిబంధుమిత్రులును నట్లు దీనముగా స్వామిజీని ప్రార్థించిరి. ఆదీనుని రోగరహితుని చేయవలె నన్న తా నావ్యాధిని తనదేహమున ప్రవేశపెట్టుకొనవలసి యున్నది. అన్యునకై తనశరీరమును బలిపెట్టుట మహత్తరకార్యముగా నెంచి తోడనే యాతడు క్షయరోగపీడితునిబాధను తనశరీరమున జొన్పించెను. కాని దైవోపహతులను నభాగ్యులను రక్షించుట, లోకనాథుని బోలు నద్భుతాధ్యాత్మికశక్తిసంపన్నులకుకూడ నసాధ్యము. క్షయవ్యాధి బాధనుండి తొలగింపబడినను కొలదిదినములలో మరొకరోగమున కాపురుషుడు వశ మయి మృతి చెందెను.

ఇంక లోకనాథుడు భరింపరాని క్షయరోగబాధచే పీడింపబడుచుండువాడు. వారదిగ్రామమునందే తాను జీవితశేషమును దుర్భరవ్యాధిపీడితుడై గడుపవలెనని గుఱుతించి యోగావలంబనమున ప్రాణములను విడిచి స్వర్గపురమును చేరెను. భీష్మునివలె స్వేచ్ఛామరణశక్తి నిత డలవరచుకొనెను. నూటయిరువదియాతేండ్లాతడు జీవించెను.

మానసికసంపదగాని, ఆధ్యాత్మికయున్నతిగాని సంపాదించుకొనుటకు మానవు డెంతేని సాధన మొనరింపవలెను. మేధాశక్తియందు అనర్ఘప్రతిభ నొందినమహాశయులును, జితేంద్రియులై యారాధ్యులైన మహాత్ములును, అపరాధములందును, అపజయములందును ఆత్మోన్నతికి అనివార్యమగు మనోనిగ్ర

హామము సహనము దృఢనిశ్చయము మొదలగువాని సలవరచుకొని మెట్టకేలకు దమయుద్దేశము నెఱవేర్చుకొనిరి. కత్తిమీద సాముచేసినగాని యెవడును మహత్తర మగునాశయము నంద జాలడు. అగ్నికుండమును దాటినగాని యానందప్రవాహము కనుపడదు. పుట్టువుతోడనే మానవుడు విజ్ఞానఖని యగుచో మనుష్యజన్మ కోరబడునది కాదు. మనుజునియందు దాగియున్న గొప్పతనమును బయలుపుచ్చుటకు ప్రధానమైనది ప్రయత్నముగాని సత్వర ఫలసిద్ధికాదు. ప్రయత్నము లేకుండ యలవడు సిద్ధి రుచిహీనమై మహాశ్లాఘా న్యమై యపేక్షింప దగనిదిగా నుండును. సిద్ధిని తలపక ప్రయత్నముదెస కర్త వ్యముదెస దృష్టినిలుపుమని శ్రీకృష్ణభగవానుడు తెలిపియుండెను గదా! ఈ మహత్తరభావమునే ప్రపంచమున పలువురుమహాపురుషులు పలుసమయము లందువచించిరి. సిద్ధియందు భేదము లుండును. ప్రయత్నము ననుసరించి సిద్ధియు నుండును. ఈసిద్ధి మానవునకు నలవరచుటకే జగదీశు డొక్కొక్కతఱి వాని కపజయము కలిగించుచుండును. అపజయము ప్రయత్నమును పురికొల్పును. సత్వరసిద్ధినొందువానికంటె యపజయముల నెదుర్కొని సిద్ధిపడసినయాతడే యధికుడన జెల్లును. ఎన్నిమారు లపజయము మూర్కొనినను ధైర్యము విడువక ప్రసపూనికను మరి తదృఢ మొనరించి విశ్వామిత్రుడు సృష్టికర్తతో సముడు కాజాలెను. ఈతనితో సముఖులైనవారు ఋషులయందును కడునరుదుగ నుండిరి. భగవంతునకు సాధ్యమైనది మానవున కసాధ్యము కాదని నిరూపింప జాలుటకు వలయునిర్వాచ్యశక్తి కొందరి కలవరచినవి, అపజయము నిరంతర ప్రయత్నము నని వచించుట సత్యవిరుద్ధము కాదు. అపజయములందును నవ రాఘమునందును కూలబడినవారిని వేళాకోళముచేయువారు పెక్కు రుందురు. ఇట్టివా రజ్ఞానకూపమున దిగబడినయభాగులనుట తప్పుకాదు. నేడు కూల బడుట రేపు ద్విగుణీకృతమైన యుత్సాహముతో లేచుటకొఱకే. నేడపరాధ మొనరించుట రేపు తమదోషమును గురుతించి పశ్చాత్తాపమున దానిని తొల గించుకొనుటకే. భావదృష్టిచే తమలోపమును గురుతించి యొకమారు కూలి నను సంకొకసారి లేచుచు తనుతో తాము ఘోరయుద్ధము చేసికొని కాల క్రమమున జయమును పొంది కొందఱు మనుష్యత్వసిద్ధి నందుదురు. క్రమమైన యత్నమున మానవుడు తనయందలిమాలిన్యమును పోగొట్టుకొని పరిశుద్ధమైన

యాత్మకలవా డగును. నిర్విఘ్నముగ తొలుతనే కార్యము సాధింపబడునేని వానియందలి సాధనసామర్థ్యము లణగియే యుండును. ప్రతిఘటనము లేనిదే దృఢప్రయత్నము కనపడదు. కొలదిమారులు పరిభవము మనస్సును నొప్పించినగాని యందు నిదురించియుండుశక్తులు తలయెత్తజాలవు. ప్రతిఘటన పరిభవ పరాజయ ప్రయత్నములే తపమనిచెప్పబడును. ఇం దాటితేలినవారే మహాత్ములును మహాపురుషులును కా గలిగిరి. పలుగాకియై దారులుకొట్టుచు హింసావృత్తియందు కాలముపుచ్చుకిరాతుని మహనీయగుణగరిష్ఠు డగువాల్మీకిని చేసిన దీతపమే. పలుసమయములందు అల్పుని నధికుని చేసిన దీతపమే. పుట్టినతోడనే మానవు డెవ్వడును తపసికాజాలడు. విజ్ఞానానుభవములును, దరిద్రదుఃఖములును మనుష్యస్వాంతమును దున్ని దానిని ఫలవంత మొనరించును. బాధలయందు చిక్కినమానవుడు, భగవంతుని నిర్దయు డని జగదీశుని దూషింపక, తనపురోభివృద్ధి కోరియే భగవంతుడు వాని నాపాదించుచుండెనని గురుతించి యతని యద్భుతోద్దేశమును గ్రహించి కృతజ్ఞతాపూరితహృదయుడై వర్తింపవలెను. ఒక్కొకప్పుడు మనము కోరునుపకారము చేకుఱుట కాలక్రమమున మన కెంతేనిచేటు మూడుట యనియు; ఆయుపకారము చేకుఱకుండుటయే గొప్పయభ్యుదయము లభించుట యనియు విమర్శించిచూచితి మేని గ్రహింపగలుగుదుము. క్రమసిద్ధి కొన్నొక్కవేళ సత్వరసిద్ధి సహాయముగాక నాశనకారి యగుచు డును. నేడు దుఃఖము తీర్చుట నేడు దుఃఖ మాపాదించుట యగును. నేడు దుఃఖము నొసగుట రేపు పరితోషమున సంతుష్టిని గూర్చుట యగుచుండును. మనస్సునకు చల్లదనము నిచ్చునను భవము సదా సుఖముగాక దుఃఖమనియు, హృదయమునకు బాధకలిగించునను భవము సదా దుఃఖముగాక మారువేషమున గోచరించుసుఖమనియు మన మపుడపుడు తెలిసికొనుచుందుము. సుఖదుఃఖముల నిజమగుస్థితి గ్రహించుటకు మానవునకు సమయము వచ్చును.

దుఃఖరహితమై కష్టరహితమైన జీవనమున దవము మృగ్యమైయుండును. మానవజీవనమున కిదియే కిరీటము. మనుజుడందు తొలుదొల్త నాహుతి యగును. పవిత్రమై మహత్తరమైన నీయాహుతియందు గతకలుషము

లన్నియు నుండిపోవును. ప్రకాశమాన మగు నీనుంటయందు స్నానమాచరించిన పాపాత్ముడు మహాత్ముడగును.

లోకనాథుడు గురునొద్ద దీక్ష వడసియు బాల్యస్నేహితురా లగు నొకసుందరిపై చిత్తమును హత్తియుంచువా డనియు నొకసారి కలుషపంకమున గూలె ననియు నొకచిత్రకథ కలదు. దోషసంకలితమైన మానసమును పరిశుద్ధముచేయుటకు లోకనాథునకు సమయము వచ్చెను. ఇంద్రియదుర్మదంబు ద్రుంచి, మహాపురుషుడగుటయే గాక, సామాన్యసాధువులకు సాధ్యముగాని సామర్థ్యమును సంపాదించి మానవుడు పొందజాలునంత మానసికోన్నతిని నిజ జీవనమున ప్రకటించి యాత డాదర్శస్వామి యయ్యెను.

---

౧౯

# మా నీ బా బా

సీ॥ విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వాని
వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనమున గార్యములం దభిజ్ఞుడై
తాన రాజగుచు జిత్తమున జేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె
నెవ్వడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావులనీళ్ల కాచాదుల
నన్యోన్యబుద్ధి దా నడరునట్లు
గీ॥ త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము
భంగి దోచు స్వప్రభానిరస్త
కుహకు డెవ్వ డతని గోరి చింతించెద
ననఘు సత్యు బరుని ననుదినంబు.

క్రీ. శ. 1856 వ సంవత్సరమున నదియాజిల్లాయందలి అజుదియా గ్రామమునందు శివనాథఘోషునకు మానీబాబా జననమొందెను. శివనాథ ఘోషు పరమహరిభక్తుడు. నాడిమాన్యములుగాని ద్రవ్యముగాని లేనివాడు. బీదసంసారి. అట్లగుటచే పొట్టచేతపట్టుకొని జీవనాధారమున కుపాయము వెదకి కొనుచు స్వగ్రామమువీడి పాట్నాయను పట్టణము జేరెను. అచట నెద్దియో వృత్తి నవలంబించి కొంతపైక మార్జించుచుండువాడు. ఈతని కిరువురుపుత్రులు కలరు. పెద్దవాడు ప్యారీలాలు. రెండవయాతనినామధేయము కుంజలాలు. ఇద్దరన్నదమ్ములును పాట్నాయందుగల గవర్నమెంటు పాఠశాలలో చదువు చుండిరి. ఈపాఠశాలయందలి పంతుళ్లలో నొకడు బ్రహ్మసమాజమతావలంబియై యుండువాడు. ప్యారీలాలు బుద్ధిమంతుడుగను దైవభక్తిగలవాడుగను ఉండుట గ్రహించి యాతడప్పుడప్పు డాతనికి తత్త్వబోధ చేయుచుండువాడు.

"ప్రాయమునందే ధర్మమార్గానువర్తివై యుండుము. ఎపుడు మరణము తన్నాహ్వానించునో యెవ్వడు నెఱుగజాలడు. వానరాకడ ప్రాణపోకడలు తెలిసికొన జాలము. నీపేరుప్రతిష్ఠలుగాని ప్రజ్ఞావిశేషములుగాని రహస్యవిషయములుగాని పరోపకారమునిమిత్త మొనరించిన క్రియావృత్తాంతము గాని యెవ్వరికిని తెలుపకు" మని తొలుత నాగుగువు ప్యారీలాలున కుపదేశించెను.

"ఓర్పుమూలమున క్రోధమును, సాధుగుణముమూలమున నసాధువులను, ఉపకారముమూలమున నపకారమొనరించు వారిని, సత్యముమూలమున నసత్యమును, జయింపుము. ఎవ్వాడు పరసతిని తల్లివలెను పరద్రవ్యమును గవ్వవలెను యితరప్రాణులను తనప్రాణమువలెను జూచు నాతడే నిజముగుజ్ఞాని. రథములాగు గుఱ్ఱములను సారధి కళ్లెముతోడ స్వాధీనపరుచుకొనులాగున విషయవాంఛలను రేకెత్తించునింద్రియములను జ్ఞానవంతుడు వశమొనరించుకొనగలుగును."

"పరలోకమున సాయుపడుటకై తలిదండ్రులుగాని భార్యాపుత్రాదులుగాని బంధుమిత్రులుగాని కూడరారు. కూడవచ్చునది కేవలము ధర్మము మాత్రమే. మనుష్యు డేకాకియై పుట్టును. ఏకాకియైచచ్చును. ఏకాకిగానే నిజసత్కార్యములఫలమును దుష్కార్యములఫలమును అనుభవించును. బంధుమిత్రులు కట్టెను నిప్పునకైన తగులబెట్టెదరు. లేదా గోతనైన పూడ్చివేయుదురు. తమపనిముగించి యెవరిదారిని వారు యిండ్లకు పోవుదురు. కాని ధర్మ మొక్కటిమాత్రము వెంటనంటియే యుండును. కావున నీకు తోడుపడుధర్మము‍ను క్రమక్రమముగ నలుపుము. ధర్మముయొక్కసహాయమున దుస్తరమగు సంసారాంధకారసముద్రమును ప్రాణులు దాట గలుగుదురు."

చిన్నతనమునందే ప్యారీలాలు జ్ఞానామృత మిట్లు క్రోలజాలెను.

తోడిబాలురట్లుగాక సోదరులిరువురు దైవచింత నలుపుచుండువారు. క్రమక్రమముగా గంభీరమగు భావములు మానసమున ప్రకాశించి వారిజీవనములను వికసింపచేయ జొచ్చెను. బ్రహ్మసమాజమువారుకూడ జగదీశు నుద్దేశించి యిట్లు ప్రార్థన నలుపుచుండువారు.

"దీనవత్సలా! మేము మీ చరణముల నాశ్రయించితిమి. మాయెడల ప్రసన్నుడవు కమ్ము. సంసారపాపతాపమును క్షణము మఱచి నీయుపాసనమును కోరి కలిసికొంటిమి. కలుషమయిన మాహృదయమును శాంతింప జేయుము. నిన్ను మఱచి యెన్నిమారులో పాపచింతకు చిత్తమున చోటిచ్చితిమి. మా తప్పులు మన్నింపుము. మా సిగ్గుల తొలగింపుము. నీవు శాంతిరూపుడవు. హృదయధనంబవు. జీవనసర్వస్వమవు. నిన్ను మాహృదయసింహాసనమున నాసీనుగావించి మనస్సు నానందమయము నొనరించుకొందుము."

"ప్రభూ! నీ తేజము ప్రకాశమానమైనది. నీదివ్యకాంతులు దిగంతముల ప్రకాశింపజేయుచున్నవి. పుడమియంతయు నీయాలోకమున స్వర్ణదీప్తి దాల్చి వెలుగొందుచున్నది. నీవు దీనులకు కరుణ జూపుదువు. తెరు వెరుగక అల్లాడు వారికి మార్గము జూపుదువు. నీవుప్రాణమునకు ప్రాణంబవు. జీవనమునకు జీవనంబవు. అంతరంగమున కంతరంగంబవు ఆత్మకు నాత్మవు. హృదయమునకు రక్తమవు. గ్రుడ్డివానికి చేతిప్రాపువు. అనాధులకు నాధుడవు. అసహాయులకు సహాయమవు. జీర్ణకాయులకు శక్తిప్రదాతవు. దిక్కులేనివారికి దిక్కుజూపు చుందువు. హే! దీనబంధూ! మోహాంధకారమున బడి నిన్ను మఱచితిమి. తాపత్రయబంధములనుండి మమ్ము తొలగింపుము. పుడమియందే చెప్పటను, నిన్నుబోలు చెలిమికానిని గాంచలేము. జీవనమందును మరణమందును దోడ్పడు వాడవు నీవ. నీవనాదివి. అనంతమవు. అపారంబవు. అగమ్యంబవు అల్పుడగుమానవుడు నీమహిమ లెట్లెఱుగగలడు. మనష్యుడు కీటానుకీటకము ఇసుక రేణువట్లు దారిలో పడియుండును. నీవా! యేలికల కేలికవు. అనంతబ్రహ్మాండమున కధిపతివి. అసంఖ్యానీకములగు ప్రపంచములు నీపదతలమునకు ప్రదక్షిణ మొనరించుచున్నవి. పాపపటలమునుండి మమ్ము రక్షింపుము. హే! అంతరాత్మ! హేపరమేశ్వర! నీవే సత్యమవు. ప్రపంచమందలి కోలాహలమునుండి పారివచ్చి నీయంకతలమున కూరుచుండి మనోవేదనలు మఱచితిమి. హేమాతా నీవు చెంగటనే యున్నను మాతృహీనులవగిది, మార్గమధ్యమున భ్రమించుచుంటిమి. జనయిత్రీ! యొకసారి ప్రసన్నముఖవై మాపై నీకరుణాకటాక్షవీక్షణములు పఱపుము. ఆకట నకనకపడుచున్నపు డన్నమును, దాహము గొనియున్నపుడు మంచినీళ్లును, మానోటి కందించుచు నేఘడియయందేని

కావలెనో యవియెల్ల మాకొసంగుచుంటివి. మాతా! నీవదనముదెస చూచి నంతనే యెట్టికటికగుండెయైనను గరగిపోవును. వేదనాయుతములగు మాశిరస్సుల నీచరణతలమున నిడి శాంతిమయస్వాంతులమగుటకు ఆశీర్వదింపుము.

దీనవత్సలా! అంధకారమునుండి మమ్ము వెలుగులోనికి గొనిపొమ్ము. నీయపారకరుణచే మమ్ము దనుపుము. ఓం శాంతిః, శాంతిః, శాంతిః.”

బ్రహ్మసమాజమతమున జేరినంతనే వీరిరువురును హిందూమతమునుండి వెలివేయబడిరి. తమ్మునకు చదువుచెప్పించుటకు వలయుద్రవ్యము సంపాదించుటకయి తనచదువు మానుకొని ప్యారీ లుపాధ్యాయపదవి యందు ప్రవేశించెను. ‘జలపాయిగుడిపాఠశాల’ యందతడు కొంతకాల ముండి రంగపురము నందలి యాంగ్లవిద్యాలయమున ప్రధానోపాధ్యాయునిగా పిమ్మట ప్రవేశించెను. ఈపదవియం దాతడు చాలకాలము గడపివైచెను.

ఉపాధ్యాయుడై యుండగా నాతడు వివాహము చేసికొనెను. రంగపురమందు వసించుచుండి వానికడ నతని భార్యయు నొకసోదరియు వసించుచుండువారు. సంసారబంధమున గట్టబడియుండియు జ్ఞానసంపాదనమునం దిచ్ఛగలవాడై, గంభీరనిశీథమున నిద్రమేల్కాంచి యాతడు ధ్యానయోగముల నభ్యసించుచుండువాడు. చాలాసేపు నిద్రపట్టిపోవు ననువెరపుచేతను, నతడు సన్ననిరెయొకబల్లపై మేనువాల్చువాడు. దినమునకు మూడునాలుగుగంటల కాలముకంటె నెక్కువ నిద్రపోవువాడుకాడు. ఆతడు రుచ్యభోజ్యము నెన్నడు గుడువ నిచ్ఛగింపడు. సామాన్యాహారమునే భుజించుచుండువాడు. చాలాదినము లాత డుపవాసవ్రతము లాచరించుచుండువాడు. సంసారమందుండి గృహస్థధర్మము నెఱపుచు నిత్యకృత్యములు ముగిసినపిదప విశేషకాలమాతడు భవిష్యత్తునందలి జీవనోన్నతికై పాటుపడుచుండువాడు.

విధి భక్తులనే విశేషముగా పీడించుచుండును. సామాన్యభక్తు లీపీడనమున హతాశు లగుచుందురు. తమ కట్టిపీడను కల్పించినకట్టడిదైవమును దిట్టుచు గోరంతలు కొండంతలుగ నెంచి దీర్ఘచింతయం దాశను, ఉత్సాహమును, ఉపాయకౌశలమును పోగొట్టుకొని మాననమున దురంతనరకబాధ పొందుచు జీవనమును తుచ్ఛమని భావించి చావు బ్రతుకులనడుమ నలుగుచుందురు. కాని మహనీయులు తమకు కీడు వాటిల్లినపుడు దానియందు మహత్తర

మైనభావములను తెలిసికొందురు. తండ్రి దండింపగా కోపించుబండపిల్లవాని వలె గాక జగదీశునిశిక్షయందు వారు గొప్పయుద్దేశమును, భావికల్యాణమును గుణించుచు. ఒక్కొక్క కష్టము వాడిగునుపమై మనస్సనెడుగనిని ద్రవ్యయందుండి విజ్ఞానమనుకనకమును వెలికి దీయును. పెద్దపెద్దగ్రంథములయందలి యక్షరపంక్తి యొసగుజ్ఞానముకంటె కష్టపరంపరలొసగు విజ్ఞానము వేయిరెట్లు మహత్తర మయినది.

తీక్ష్ణమేధాశక్తి, దృఢనిశ్చయము, నైతికదార్ఢ్యము, ఆధ్యాత్మికోన్నతి, నియమసంబద్ధజీవనము, దైవభక్తి, తత్త్వజ్ఞానవిమర్శ, మహాదాదర్శచింతనము, నివి మనుష్యబోధవలన నలవడునవి కావు. ఒకవేళ మనుష్యబోధవలన నలవడినను నవి దృఢముగా హృదయమున వేళ్లు పాతుకొనజాలవు. దుఃఖము, దారిద్ర్యము, కీడు, యీ మూడును త్రిమూర్తులకంటె నధికబలసంపన్నములు. ఇవి యొసగుజ్ఞానబోధన మేయవతారము నొసగజాలదు. మానవులందు కొందరిని మహాపురుషులచేయుకొరకే యీగురుత్రయమును భగవంతుడు వారికి ప్రత్యక్షము చేయించును. కంట నీరుపెట్టక యెవ్వండును మహాపురుషుడు కాలేడు. ఒకప్పుడు కష్టపడక యెవ్వండును సుఖమును చూడగొనలేదు. అపజయములచే బొప్పి గట్టకుండ నెవ్వడును జయమును పొందలేదు.

పండ్రెండేండ్లు కాలముగడపినపిదప నొకనాడు ప్యారీలాలు తనయర్ధాంగిని గోలుపోయెను. దారుణముగు వేదనముచే బాధపడివడి యాయిల్లాలు గతించెను. భార్యావియోగము ప్యారీలాలునకు దుర్భరవేదనమయ్యెను. ఆదుస్సహవిచారమునందే వైరాగ్య మంకురించి పెరిగి పెద్దదయి వానిజీవనమున విజ్ఞానసుగంధమును తొలుకాడ చేసెను.

ప్యారీలాలుభార్యగతించినకొన్నాళ్లలో నాతనిబంధుగు డొకడు సుందరి యగుతనకూతు నాతని కిచ్చి పెండిలిసేయ ప్రయత్నించెను. ప్యారీలా లంగీకరింపక “నన్నేల దుర్గతులపాలు చేయ యత్నింతువు. మానవుడు సర్వదా సంసారలీలయందు దున్మత్తుడై యున్నాడు. స్వార్థము కాంక్షించి, నిజోన్నతికై యాతడెన్నెని యెత్తులు వేయుచుండును. రాసులుగా ధనము నార్జింతు ననియు నేవిధమున తోడిమానవుల ప్రశంస నందుదు ననియు తలపోయుచు బంగారువంటిజీవనమును హేయభావములచే పాడుచేసుకొనును. ధర్మముకొరకై

క్షణమైన నతడు యోచింపడు. విషయేచ్ఛల కధీనుడై దుర్గతుల కాతడు పాలగుచుండును. కామక్రోధములకు దాసుడై యాతడు చేయనికార్య మేమియు నుండదు. ఏవేళ మృత్యువు మానవు నెగదన్నుకొనిపోవునో యెవ్వ డెఱుంగును. ఎంతవాపోవుచు పాదతలమునబడి వేడినను నామె కరుణింపదు. ధర్మమును దృష్టియం దుంచుకొని మానవుడు దైనికకృత్యములకు గడంగవలయును. కొంత కాలము కుటుంబజీవనము గడపితిని. ఇపు డాయాశ్రమమును మార్చవలసిన యవసరము వచ్చినది” అనెను.

ప్యారిలాలుతమ్ము డధ్యయనమును ముగించి, ధనసంపాదనకు గడంగెను. ఇంటిబాధ్యత యంతయు తమ్మునిపై బెట్టి యన్న యోగసాధనార్థము చిత్రకూట పర్వతమున కరిగెను.

మూడేండ్లాతడు చిత్రకూటమునందుండి పిదప “నోంకారనాథ్” అను కొండ కరిగెను. ఈపర్వతము ప్రకృతిసౌందర్యములతో నిండి యుండును. యోగనిష్ఠయందు కాలము గడపుటకై పలువురు సన్యాసులు తఱచుగ నచటి కరుగుచుందురు. ఓంకారనాథపర్వతమున రమ్యమగు నొకప్రదేశమును గాంచి ప్యారీలా లందు తప మొనరింప ప్రారంభించెను. ఒక సంవత్సర మాతడు స్వల్పాహారముతోడను, అనాహారముతోడను, నల్పనిద్రతోను, అనిద్రతోను, యెండయందును, వానయందును, ఘోరమగుతప మొనరించెను. యోగాసనమునుండి యాతడు లేచుట నెవ్వరు చూచినదిలేదు. అతని కఠోరయోగ సాధనము గాంచి లక్ష్మీనారాయణు డనుమార్వాడీవర్తకు డొకడు నివసించుటకు మిక్కిలి సదుపాయముగా నుండు వసతుల నేర్పఱచి కుధరమం దొకగుహను స్వామికొఱ కేర్పాటు చేయించెను. ఆ గుహయందు యోగనిష్ఠ కనుకూలమగు నవకాశము లెక్కుడుగా నుండుటచే స్వామి, యందు పూర్వముకంటె నధికముగ తపోనిష్ఠయందు మగ్నుడయ్యెను. ఎవరితోడను మాటాడక సంపూర్ణముగ నాతడు మౌనవ్రతము నవలంబించుచుండువాడు. ప్రజలు మూగుదురనియు తన వ్రతమునకు భంగము కలుగుననియు భయపడి యాతడు గుహనుండి బైటికి వచ్చువాడుకాదు. కార్యములు నిర్వర్తించుకొనుటకై యాత డెప్పు డెచటి కరుగువాడో యెవ్వరును నెఱుగరు. ఇట్లారునెలలు గడచిపోయెను. ప్రజలందరాతని మౌనీబాబాయని పిలుచుచుండువారు. (మౌనవ్రతము యోగసాధ

నసుయొక్క ప్రధానాంగము. దాని మూలమున చిత్తముయొక్క శక్తి హెచ్చును. అనవసర వాదమునుండియు నతివాగుడు నుండియు నది మానవుని గాపాడును. నీచులతో చెలిమియు, వాగ్వ్యయమును తగ్గిపోవును.)

మూడి త్తడిచెంబులును నొక చర్మపుముక్కయు నొక రాతిపలకయు తప్ప నితర మేమియు నాతనికడ లేవు. తోలుముక్కపయి పరుండునపుడు రాతిపలకను తలక్రింద నంచుకొనువాడు.

యోగివరుని చూచిపోవుటకై తఱచుగ ననేకు లాతనిగుహాద్వారమున గుమిగూడుచుండువారు. కొందరు గొప్పరోగమునుండి విముక్తినొందుటకును, కొందరు స్వార్థసిద్ధికి వలయుబలము నందుటకును, జ్ఞానోపదేశమున దుఃఖోపశమన మందుటకును ఆతనికి శిష్యులై పవిత్రమగు జీవనమున కాలము పుచ్చుటకును నచటి కరుగుచుందురు. ఎవ్వరచటి కరిగినను కార్యము నెఱవేఱినవారై తిరిగిపోవుచుందురు. ఆమార్వాడీవర్తకుడు "నేను మిగుల నిరుపేదనై యుండువాడను. యోగీశ్వరుని కృపావిలోకనములు నాపై ప్రసరించినంతనే నాజీవనమున్నతిని గాంచనారంభించెను. నాయైశ్వర్యమునకంతకు మౌనీబాబాయే కారణ" మని తెలుపుచుండువాడు. ఓంకారనాథాలయమున వసించు మహంతు (దేవస్థానములకు ధర్మకర్తృత్వము జరిగించు బైరాగి) "నేనీజీవనమున నెందఱనేని పరివ్రాజకులను జూచియుంటిని కాని మౌనీబాబానుబోలు మహాత్ముని జూడలే" దని వచించుచుండువాడు.

నిజశరీరసుఖమును కొంచెమేని యోచింపక కఠినముగా యోగసాధన మొనరించుచుండువాడు. శరీరమునుగురించిన యోచన యతనిమనస్సున నెప్పుడు ప్రవేశింపలేదు. ఇంచుక క్షీరమును, యించుక మారేడాకుల పసరును, గ్రోలి యాతడు ప్రాణములు నిలుపుకొనుచుండువాడు. కాలక్రమమున నాతని శరీరము చిక్కి యెముకల ప్రోవై పోయెను. ఇక నాతడు విశేషకాలము జీవించలేడు. క్రీ. శ, 1896 వ సంవత్సరమున, శాంతిదాతయగు పరమేశ్వరుని యూరుతలమున నిజమస్తక మిడికొని యోగసాధనమున ప్రాణముల విడిచెను.

---

## ౨౦

# శ్రీ రూపసనాతనగోస్వాములు

ఉ. న్యాయికి భూసురేంద్ర మృతనందనదాయికి రుక్మిణీ మన
స్థ్సాయికి భూతసమ్మదవిధాయికి సాధుజనానురాగసం
ధాయికిఁ బీతవస్త్రపరిధాయికిఁ బద్మభవాండభాండని
ర్మాయికి గోపికానివహమందిరయాయికి వేడ్క మ్రొక్కెదన్.

1303 వ శకమున కర్ణాటదేశమున సర్వజ్ఞు డను నొకరా జుండువాడు. అతడు భారద్వాజగోత్రుడు. యజుర్వేదీయబ్రాహ్మణుడు. అతడు పదునొకండేండ్లు మాత్రము రాజ్య మేలి చనిపోయెను. అతని కొక్కడేకుమారుడు. వానిపేరు అనిరుద్ధుడు. 1314 వ శకమున గర్ణాటకమున కత డధీశ్వరుడాయెను. అనిరుద్ధున కిరువురుతనయులు. పెద్దవాడు రూపేశ్వరుడు. హరిహరుడు రెండవవాడు. 1338 వ సంవత్సరమున ననిరుద్ధుడు మరణించెను. జనకుని యంత్యక్రియలు నిర్వర్తించి సింహాసనమునకై సోదరులిరువురు కలహించిరి. ఆ కలహమున రూపేశ్వరు డోడిపోయి దారాపుత్రాదులతో గౌడదేశమున కరిగి యా సీమయేలిక నాశ్రమభిక్ష వేడుకొనెను. గౌడదేశరాజు అనిరుద్ధుని ప్రాణస్నేహితు డగుటచే నతని యన్నయగు రూపేశ్వరున కాశ్రయ మిచ్చి యాదరానురాగముల నాతని చూచెను. 1355 వ సంవత్సరమున రూపేశ్వరుడు కాలధర్మము నొందెను. ఆతనియనంతర మాతనితనయుడు పద్మనాభుడు గౌడాధీశుని మంత్రియయ్యె. 1369 వ సంవత్సరమున నాతడు మంత్రిత్వమును విడచి, గంగాతీరమున వసించుటకై 'నైహాటీ' యను పల్లెకు వెళ్లెను. పద్మనాభునకై దుగురుపుత్రులు కలరు. పురుషోత్తముడు, జగన్నాథుడు, నారాయణుడు, మురారి, ముకుందుడు. విద్యాబుద్ధులయందు క్రమక్రమముగా వీరు ప్రవీణులు కాజొచ్చిరి. ముకుందుని కుమారుని పేరు కుమారుడు. సనాతన రూపవల్లభులు కుమారుని కుమారులు, మొదట వీయిరువురకు తండ్రి యమరుడనియు సంతోషుడనియు పేరులు

పెట్టెను. కాని పిమ్మట నాపేరులు మార్చి చైతన్యుడు రూపసనాతనులని వారిని పిలుచుచుండువాడు.

విద్యాబుద్ధులయందు సనాతనుడు పేరువడసెను. శ్రీరూపుడుకూడ నాతనికి తీసిపోక యుండెను. విద్యావాచస్పతియను నొకపండితవర్యునికడ సనాతనుడు విద్యనేర్చికొని శ్రీరూపునకు గురు వగుచుండువాడు.

1411 వ శతాబ్దమునుండి 1433 వఱకు సయ్యదుహుస్సేనుషా యను యవనుడు గౌడసింహాసనాధీశుడై యుండెను. సనాతనశ్రీరూపుల బుద్ధివిశేషములు విని వారిని తనకొలువునకు బిలిపించి తగునుద్యోగములందు నియోగించెను. వారును శీఘ్రకాలముననే తమప్రజ్ఞను చూపి అధీశ్వరునిమన్ననకు పాత్రులయిరి. రాజు సనాతనునకు 'సాకరీమల్లిక్' యనియు శ్రీరూపునకు 'దబీర్ ఖాసీ' అనియు బిరుదుల నొసగి మంత్రిపదవులు వారి కొసగెను. (సాకర్ అను పదమునకు జ్ఞానవంతుడనియర్థము. మల్లిక్ అన శ్రేష్ఠులు; దబిల్ ఖాసీ అన నుత్తమ లేఖరి. శ్రీరూపుని యక్షరములు ముత్యములకోవవలె నుండునని చైతన్యుడువచించెను.) బిరుదుల నందునపుడు సోదరులిరువురు మిగులప్రశస్తమయిన రెండు జాగీరుల (రాజు బహుమానముగా నిచ్చుభూమి) నందిరి. మ్లేచ్ఛులసంసర్గమున మ్లేచ్ఛులైరని తలచి కులస్థులు వారిని వెలివేసిరి. ఆకాలమున తురకలతో కలసితిరుగుటయే దోషముగా నెన్నబడుచుండెడిది. అయినను రాజునిర్బంధమున హిందువులు పలువు రాతని సేవింపుచువచ్చిరి. కాని సంఘమునుండి వారు దూరముగా నుండవలసివచ్చుచుండెడిది. పుట్టుతురకలకంటె హిందువులు వీరి నధములుగా చూచుచుండిరి. కొన్నియేండ్లుగడచినపిమ్మట సనాతనశ్రీరూపులు చైతన్యస్వామినాశ్రయించి జ్ఞానభిక్షను వేడిరి. గురుకటాక్షము నందినంతనే వారిరువురిస్వాంతములు నూత్నభావములచే వెలుగొందెను.

అన్నదమ్ములిరువురు రాజకార్యములయందు మగ్నులయి యుండియు భక్తితత్పరులయి మెలగజొచ్చిరి. ఒకనాటినడిరేయి కుంభవృష్టిగ వర్షము కురియుచుండ తీవ్రముగా ఝంఝామారుతము వీచుచుండ చెట్లువిరిగి నేలగూలుచుండ నానావిధజంతుసంతానములు పొదలమాటున దాగుచుండ శ్రీరూపుడు రాజకార్యనిర్వహణమునకై యిల్లు వీడి యొకమార్గమున పోవుచుండెను. అతడట్లు చనుచు నొకపేదవానిగుడిసెను సమీపించెను. వర్షపునీటిలో బయట

నొకవ్యక్తి మెల్లగ జనుచుండుట గాంచి గుడిసెయందలి పేదరాలు భయపడి "ఇట్టినిశీధమున నిట్టిభయంకరసమయమున నెవ్వరు బయటతిరుగుదురు?" రని పతిని ప్రశ్నించెను. "ఇట్టిగాఢాంధకారములో నీవానలో నేదియో జంతువు గాక మరియొకవ్యక్తి బయట నెట్లు సంచరింపగలదు!" "జంతువైనను నిట్టివేళ నవల కదుగుటకు సాహసింపదు. ఏధనవంతునిసేవకుడో పోవుచుండ వచ్చును."

గుడిసెలోని సతీపతులప్రసంగము శ్రీరూపుని చెవులకు వినవచ్చెను. వెంటనే వానికి తెలివివచ్చెను. వచ్చి "డబ్బు నాశించి రాజు సమాదరణమును గాంక్షించి పశువుకంటె నధముడనై యిప్పుడు నేను సంచరించుచుంటిని" అని యాతడు తలపోయ దొడగెను. ఈయాలోచనమండియే వానిమనస్సున వైరాగ్యతరంగము లొక్కసారి యుప్పొంగెను. తక్షణమే యాతడు గృహమునకు మరలి వృత్తాంతమంతయు సోదరునకు తెలిపెను.

తరువాత శ్రీరూపుడు గృహమునువీడి చైతన్యస్వామిజీని కలసికొని నీలాచల, శాంతిపుర, బృందావన ప్రయాగల కాతనితో తిరిగెను. సనాతనుడు కూడ నుద్యోగమునకు నీళ్లువదలి తమ్మునివలెనె నవల కరుగ దలచుచుండెను. రాజకార్యముల చేయుచుండెను గాని యతనిమనస్సు వైరాగ్యమునందే ప్రవర్తించుచుండుటచే యని పూర్వమువలె తృప్తికరముగా చేయుటలేదు. మంత్రి జబ్బుగానుండె నని తలచి రాజు రాజవైద్యులను సనాతనునికడకు పంపెను. మంత్రీశ్వరునిశరీరము నావైద్యులు పరీక్షించి యందేమిరోగము కనిపెట్టరైరి. మంత్రిచిత్తము విరక్తిమార్గమున దగిలియుండుట గ్రహించి ఱేడు స్వయముగ నాతనియింటికి వచ్చి వానిమనస్సు ద్రిప్ప ననేకవిధముల బ్రయత్నించెను. కాని లాభము లేకపోయెను. ఇక నాతనిని యిట నిలుపుట దుస్సాధ్యమని యోచించి విచారగ్రస్థుడయి పాదుషా యాతనిని చెఱయందుంచెను.

ఇట్లుండ 'వొరిస్సా' ఱేడగుప్రతాపరుద్రునకు హుస్సేనునకును వివాదములు సంభవించెను హుస్సేను 'ఒరిస్సా' మీనపై దండెత్త నిశ్చయించి బుద్ధిసాగరుడగుమంత్రీశ్వరుని కూడ రమ్మని వేడెను. "రాజా! ఈయుద్ధము మిగుల నన్యాయమైనది. యుద్ధమునకు సిద్ధపడుట నిరుపేదలను నిర్దోషులను తుత్తునియలు చేయుట! దేశమున నత్యాచారదారిద్ర్యములను వృద్ధిచేయుట. ఈ

కలుషక్రియకు తాము తలపడ రాదు. నన్ను కూడ రమ్మని కోరుట మీ కుచితము కా' దని సనాతనుడు తేనిప్రార్థనను త్రోసివైచెను.

వాడు నీ పలుకులకు మిగులకోపించి యొంటరిగా వెడలిపోయెను. ఆతడు వెడలిపోయిన వెనుక సనాతనుడు చెఱనుండి తన్ను వదలిపెట్టుమనియు లోకోపకారకమగు జీవనమును గడుప తనను విడిచిపెట్టుట పుణ్యకార్యమనియు కారాధిపతితో పలికి బహుళభంగులనాతని వేడికొని సనాతను డవ్వల బడెను. కారారక్షకునకు తనయావదాస్తి నిచ్చివేసెను. ఈశాను డనునొక సేవకుడు సనాతనుని వెంట బయలుదేరెను. బంగారునాణెములను విశేషముగ నా సేవకుడు కూడ తీసుకొనిపోయెను. అది యెఱిగి కొందఱుదొంగలు వారివెంట బడిరి. సనాతనుని డది గ్రహించి విత్తమంతయు దొంగల కిప్పించి యా సేవకుని వెనుకకు బొమ్మని తానొక్కరుడు బృందావనమున కరిగెను. శ్రీరూపు డపుడు గౌరాంగునితో ప్రయాగక్షేత్రమున వసించుచుండెను. గౌరాంగుని (చైతన్యుని) కరుణ పెంపున శ్రీరూపుని మనసున నాటికొనిన భక్తిబీజము క్రమక్రమముగ కల్పతరువు కాదొడగెను. ఆచార్యుని యాదేశము శిరమున దాల్చి శ్రీరూపుడు ప్రయాగ విడచి బృందావనమున కరిగెను. చైతన్యస్వామికూడ త్రివేణీ క్షేత్రమును వీడి కాశి కరిగెను.

బృందావనమున కరుగుతెత్తి, 'హాజీపూర్' యుద్యానవనమున కొండొక చెట్టుక్రింద సనాతనుడు కూర్చుండి హరినామసంకీర్తన మొనరించుచుండ నాతనిబావమఱది యచటికి వచ్చి యతనివైఖరికి మిగులనచ్చెరువు నొందెను. రాజసమానుడై మహిమాన్వితుడై తులలేనియైశ్వర్యమున నోలలాడుసనాతనుడు కాషాయగుడ్డలు ధరించి విభూతి నలందుకొని చెట్టుమొదట కూర్చుండి యుండెను. ఆతని నెటని స్వగృహమునకు గొనిపోవ నాతనిబావమరది పరిపరి విధముల ప్రయత్నించెను. కాని యాతనిప్రయత్నములు ఫలించినవి కావు. దున్సహమగుశీతలమునగూడ నాత డేవస్త్రమును గప్పుకొనక శరీరసౌఖ్యమున కేవిధమునను పాటుపడక యుండుట గాంచి సోదరీపతి తనయొద్దనున్న శాలువ నాతని కీయ బోయెను. కాని సనాతనుడు దానిని గైకొనలేదు. బహుభంగుల బ్రతిమాలి పెక్కు తెఱగుల నొక్కించి మెట్టకేలకు వాని నంగీకరింపజేసి బావమఱది యాతని కొకకంబళము నొసగెను.

తరువాత సనాతను డందుండి వారణాసి కరిగెను. చైతన్యు డపు డచటనే వసించుచుండెను. సనాతనుడు చైతన్యస్వామిని కలసికొనెను. స్నేహితుని కలిసికొని చైతన్యు డమితానందుడయి ప్రియమార వాని నాలింగనముచేసికొనెను. కాశీక్షేత్రమున నిరువురును కొన్నినాళ్ళు తన్మయచిత్తులయి వసించిరి. సనాతనుడు కంబళిని కప్పుకొనియుండుట పరికించి చైతన్యుడు "సుఖవాంఛను సనాతను డింకను పరిత్యజింపకపోయె" నని తలపోసెను. ఆచార్యునిమనోభావము గ్రహించి సనాతనుడు కంబళ మొకబిచ్చగాని కొసగి యాచించితెచ్చిన గుడ్డపీలికనొకదానిని గోచీగా ధరించి గురునొద్ద నుసలుచుండువాడు. సనాతనుడు కఠినవ్రతము మనమునం దిడుకొనుట గాంచి చైతన్యుడు మిక్కిలిసంతోషించి యాతనిని వేనోళ్ళుల గొనియాడి "సోదరా! వైద్యవిద్యయందు ప్రవీణుడగు వాడు రోగమునం దించుక మిగిల్చియుంచునా?" అనెను.

రెండుమాసములు సనాతనునకు భక్తితత్వమునుగురించి గంభీరముగ బోధించి చైతన్యుడు నీలాచలమున కరిగెను. గురునియాజ్ఞ శిరమున దాల్చి సనాతనుడు బృందావనమునకు జనెను. సుబుద్ధి యనుభక్తు డాతని కలసికొని తనగృహమందే వసింపుమని బహుభంగుల వానిని వేడుకొనెను.

ఈసుబుద్ధిరాయ లొకప్పుడు గౌడాధీశ్వరుడయి యుండువాడు. సయ్యదు హుసేనుఖాను యీతనిక్రింద నొకయుద్యోగి గానుండెను. సుబుద్ధిరాయలు హుసేనునెడల మిగులచనువున మెలగుచుండెను. హుసేనొకప్పుడు నిర్లక్ష్యముగ ప్రవర్తించుట గమనించి సుబుద్ధి వానిఫాలమున నొకదెబ్బ వైచెను. కాలచక్రమున సుబుద్ధికి చెడ్డరోజులు వచ్చెను. అతడు తనరాజ్యమంతయు గోలుపోయెను. హుసేను నవాబాయెను. తొంటియేలిక కాతడు శ్రద్ధాభక్తులు చూపుచునే యుండువాడు. కాని యాతనిభార్య జరిగినపాపవిషయమును జ్ఞాపకమం దుంచుకొని పతికి యాతనిమోమునగలదెబ్బమచ్చను చూపి సుబుద్ధిపై పగసాధింపుమని వానిని హెచ్చరింపుచుండెడిది. భార్యమాటలు వినక "ఆతడు సుగుణవంతుడు. వానిభూమియందు మసలుచు వానియన్నమును దినుచుంటిని. నీప్రోత్సాహమున నతని సింహాసనభ్రష్టుని చేసి పుణ్యము గట్టుకొంటిని. ఇంకను నాతనికి చేయవలసినయుపకార మేముండు" నని హుసేను పలుకుచుండువాడు "ఈప్రతీకారము చాలదు. అతడింకను పూర్ణముగ పాడు గావలెను. వాని

జోగిని చేసినగాని నేను జీవింపను. లోతునీళ్ళలోబడి ప్రాణములు విడుతును" అని యామె అనుచుండెడిది. భార్యాలోలు డగువాడుస్సేను, యామెపోరు పడ లేక సరే యని సుబుద్ధినోట తురకవానిచేతినీళ్లు పోయించెను. జాతిచ్యుతు డయి యాతడు తనకున్న కొలదిపాటియాస్తిని కూడ పరిత్యజించి సన్యాసియై వారణాసి కరిగెను. అట్లు కాశీపురమున కరిగి, యచటిపండితవర్యులను దర్శించి జరిగినవృత్తాంతమును నివేదించి వలయు ప్రాయశ్చిత్తము చేయింపు డని వారిని వేడెను. పండితశ్రేష్ఠులు దీనికిప్రాణత్యాగమే ప్రాయశ్చిత్తమని నుడివిరి. అంతట సుబుద్ధి నిట్టూరుపు నిగిడించి యచ్చోటు వీడి చైతన్యుని కడ కేగి రక్షింపుమని యామహాత్ముని వేడెను. "వయస్యా! నీవు బృందావనమున కరిగి కృష్ణనామ సంకీర్తనమున కాలము గడుపుము. ఎట్టి ఘోరపాతకమునకైన కృష్ణనామ స్మరణమే ప్రాయశ్చిత్త" మని గౌరాంగుడు వచించెను. సుబుద్ధి తక్షణమే బృందావనమున కరిగి, నిద్రాహారములు మాని పరిశుద్ధమనస్కుడగు జడదా రియై కృష్ణభగవానుని రాత్రింబవళ్లు సేవించుచుండువాడు. ఎట్లో కొన్ని బియ్యము తెచ్చి యతిథియభ్యాగతులను సత్కరించుచుండువాడు. మధురా మాహాత్మ్య మను హిందీగ్రంథమును సంగ్రహముగా మొదట నాతడే ప్రకాశింప జేసెను.

రెండుదినములుమాత్రము సనాతను డాభక్తవరు డగుసుబుద్ధినింట వసించి పిదప నొకచెట్టుక్రింద నతడు వాసముచేయజొచ్చెను. సుబుద్ధి ప్రతిదినము వనమున కరిగి యెండుమోడులను గొట్టి తెచ్చి గ్రామమున నమ్మి తనపొట్టకై యించుకసొమ్ము వెచ్చబెట్టి మిగిలినదానిని దీనులకు బంచి యిచ్చువాడు. సనా తనుడు బృందావనమున కరుదెంచినపుడు తనసత్కారము గైకొమ్మని వాని నాతడు బహుభంగుల వేడి యుండెను. బృందావనమున వసించుచు సనాతనుడు సుబుద్ధివలెనే కృష్ణసంకీర్తన మొనరించుచు, వానివలెనే వనమున కరిగి కట్టె యలు దెచ్చి విక్రయమొనరించి శరీరధారణ మొనరించుకొనుచు నిరుపేదలను కాపాడుచుండువాడు. ఇట్లుండ నొకనాడు యమునానదికి స్నానార్థము పోవు సమయమున సనాతనుడు వెలలేని యొకమాణిక్యమును గాంచెను. దొరకినమా ణిక్య మేముష్టివానికైన నియ్యవలెనని, యొడ్డున నాతడు చాలసేపు కనిపెట్టు కొనియుండెనుగాని, బిచ్చగా డెవ్వడు గానబడకుండుటచే మణి నిసుకయందుంచి

స్నానముచేయుటకు నీరమున దిగెను. స్నానసంధ్యలాతడు నిర్వర్తించి, ధ్యానమున కుద్యుక్తుడై యుండ నొకబ్రాహ్మణు డచటికి పరుగుపరుగున వచ్చి జలమునందు నిలువబడియున్న సన్యాసిని గాంచి యంజలిఘటించి యాతనితో "మహాత్మా! నేను మిగుల నిరుపేదను. ఆలుబిడ్డల నతికష్టమున పోషించుకొనుచుంటిని. నాదీనావస్థను తలచుచు నిద్రపోవ నిన్న రాత్రి నేనొక కల గంటిని. నేటియుదయమున నదీనీరముల స్నానముచేయు మహాత్ముడొకడు నా దరిద్ర దశను పోగొట్టునని కల గంటిని. నాపై కరుణించి యీ బీదతనమునుండి నన్ను రక్షింపు డని వేడెను. "అయ్యా! గట్టున యిసుక నేలయందే మీ ధనరత్న మున్నది. దానిని గైకొను" డని సనాతను డుత్తర మొసగెను. బ్రాహ్మణుడు రత్నముకొఱకై యిసుకగుట్టయందు వెదకెను కాని రత్న మెందును గానక సన్యాసి నుద్దేశించి "స్వామీ! నిరుపేదవారునితో పరిహాసము సలుపుచుంటి రేల? ఇందు ధనరత్నము లేదు. ఊరక నన్నానకొలిపి నన్ను మరింత బాధించుచుంటి రేల?" అనెను. విప్రుని వచనముల కించుక చింతించి "మహాశయా! శ్రమకు క్షమింపుడు. రత్నము కప్పవడినచోటు చూపుదు" నని సనాతను డనుచు నీరమునుండి వెలికి వచ్చి రత్న మున్న తావు చూపి "అయ్యా! నేను స్నాన మొనరించితిని. ఇపు డావస్తువు నంటజాలను. తామే యచ్చటి యిసుకయందు చేయిపెట్టినచో రత్నము చిక్కు" నని యెను. ఇసుకనడుమ ప్రకాశమానమగు నామణిని గాంచి పెన్నిధిదొరకిన యాపేద మిక్కిలి సంతసించి మణిని గైకొని స్వగృహమునకు పోయెను. మార్గమున నం దతనిపాదములు తడబడసాగెను. మనమునపుట్టిన యుత్సాహ మధికమగుటకుమారు తగ్గుచుండెను. వికసితమైన వానిమోముదామర వాడిపోజొచ్చెను. బ్రాహ్మణుని మనస్సంతయు తలంపులతో నిండిపోయెను. "వెలలేని యీమణిని తీసికొని నే నపరిమితానందము చెందితిని. కాన్కయీజడదారి దీనిని మిగులతుచ్ఛముగ నెంచెను. చేజిక్కిన యమూల్యమణిని విక్రయించి యాత డతులైశ్వర్యమున తులతూగజాలువాడు గదా. చేతికి దొరకిన యీమణిని తాను వెచ్చింపకుండుటయేగాక దాని నంటుటకైన నిష్టపడక యిసుకగుట్టలో నన్నే వెదకికొమ్మనెను. ఆతని కంట గానిదైన వస్తువును నేను కీటకమువలె శిరమున దాల్ప నెంచుచుంటిని. నాకంటె నీచుడును తుచ్ఛుడును, భూమియందు మరెవ్వడు గలడు? ఏవస్తువును గ్రహించి

యీ వెలలేని మాణిక్యమును హేయముగా దలంచెనో నేనుగూడ నట్టివస్తువును నంపాదించుటకై యికముందు నాజీవనమును ధారపోయుదును." అని తలచి మాణిక్యము నొకచోట పారవైచి బ్రాహ్మణుడు తిరుగ నదియొడ్డునకు పోయి సనాతనుని పదముల వ్రాలి యామహాత్ముని కరుణకు పాత్రుడయి జ్ఞానలాభము నందెను.

ఒకనాడు దిగ్విజయుం డగుపండితు డొకడు శ్రీరూపసనాతనులకడ కరిగి శాస్త్రచర్చ సలిపి తన్ను జయింపు డని వారిని రువురను సవాలు చేసెను. సోదరు లందులకు సమ్మతింపక పండితునితో నేచర్చయు సలుపకయే జయపత్రమును లిఖించి యాతనికొసంగిరి. ఆపత్రముపై సంతకము చేయు మని పండితుడు జీవుని (ఇతడు రూపసనాతనుల సోదరపుత్రుడు) గోరెను. జీవుడు బ్రాహ్మణుని గర్వము నకు గినిసియు రూపసనాతనుల యవమానమును సహింపజాలకయు పండితుని నుద్దేశించి నన్ను గెలిచియే జయపత్రమును గొనిపొమ్మని పలికి శాస్త్రచర్చకై యాతని నాహ్వానించెను. చర్చయందు పండితుడు పరాజితు డయ్యెను. శ్రీరూపు డది యెఱిగి జీవుని మందలించి "జయాపజయములను, మానాభిమానములను పరిత్యజించి వైరాగి వైతివి. జయాభిలాషియైన యాపండితునిమోల పరా జయమును స్వీకరించి యాతనికి గౌరవదానము చేయుట నీకు కర్తవ్యము. నీయం దింకను దీనతాభావము తక్కువ యైయున్నది. పవిత్రసనాతనధర్మ మందలి మహత్త్వమును నీవింకను గ్రోలియుండలే" దనియెను.

ద్రవ్యదారిద్ర్యములును దూషణభూషణములును, జయాపజయములును కీర్త్యపకీర్తులును సామాన్యమానవుని మానసపరిస్థితిని మార్చును గాని మహా పురుషులమానసముల నేమియు చేయజాలవు. మడిమాన్యములను సంసారసుఖ ములను మాత్రమే పరిత్యజించినవాడు త్యాగికాడు. ఇహలోకసంబంధమగు కీర్తిని జయమును వాంఛలను బరిత్యజించినవాడు నిజ మగుత్యాగి. ఇట్టిత్యాగి పొందునానందమునకు మేరలేదు. మృత్యు వీతని జేర వెఱచును. యముడు దరికి రాజంకును. కోరికలులేనివానికి దుఃఖముండదు. మహాద్భుతశక్తిసంపన్నులగు వారినిగూడ నేలబెట్టి కొట్టినయరిషడ్వర్గము (కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరము.) యిట్టిత్యాగి మానసాగారమున బంధింప బడియుండినపు డెవ్వ రీతని నేమి చేయగలరు. లోకకల్యాణమును కోరి చంచు

మహాపురుషు లొక్కొక్కమా రపజయపరంపరను తల దాల్చియు నానంద ముందుదురు. జ్ఞానధురీణులే వీరిజీవనానుభవములనుండి పరమార్థముగ్రహించి ధన్యు లగుదురు. కాఠిన్యముకంటె మృదులత్వమే బలవత్తరమయినదనియు హింసించునాతనికంటె హింసింపబడునాతడే బలశాలియనియు, జయముకన్నకు నపజయమే మహత్తరమైన దనియు తొందరకంటె శాంతియే గొప్ప దనియు నిట్టిత్యాగులెఱుంగుదురు. సముద్రముయొక్క పైభాగ మెంతయల్లకల్లోల ముగ నుండినను సముద్రగర్భము గంభీరమై ప్రశాంతమై యుండుపోల్కి మహాత్ముల మనోభావములు సౌమ్యమై విరాజిల్లుచుండును. బాహ్యదృష్టికిని యంతః పరిశీలనమునకును చాలభేదము గలదు. ప్రతిమానవుడును మానసికోన్నతి పొందిననాడు దుఃఖావమానములును దూషణదారిద్ర్యములును జయాపజయములును దిక్కులేక పుడమి విడచి పోవును.

సనాతను డొకసారి గౌరాంగస్వామిని చూచుటకై బృందావనమునుండి శ్రీక్షేత్రమునకు పయనమయ్యెను. మార్గమం దతనికి నేహ్యాకరమగుకుష్టువ్యాధి జనించెను. మిక్కిలి రోతపుట్టించు నారోగముచే దేహము కుళ్ళిపోవుచుండుటచే నట్టియవస్థలో చైతన్యుని దర్శింప నొల్లక నీలాచలమునకు జనక శ్రీజగన్నాథ దేవుని రథచక్రముక్రింద పడి ప్రాణములబాయుట కాతడు నిశ్చయించుకొనెను. ఇంతలో గౌరాంగు డచటి కరుదెంచెను. సనాతనునియుద్యమును పరికించి తొందరగా ముందునకు వచ్చి యాతనిని కౌగిలించుకొన ప్రయత్నించెను. కాని వెంటనే సనాతనుడు వెనుకకుజంకి "ప్రభూ! నన్నుముట్టకుడు నేనతి నీచుడను. కుష్టురోగమున మఱింతనీచుడ నైతిని. నన్ను మన్నించి చెంతకు రాకుడు" అనియెను. చైతన్యుడు వానిమాటలు లెక్కసేయక యతనిని బిగ్గ కవుంగలించుకొని "సోదరా! నీశరీరము మిగుల పవిత్రమయినది. నా కది పవిత్రతమమైనకాయము. దాని నంటక దూరముగా నుండుట నాధర్మము నతిక్రమించుట యగు" ననెను.

మహాపురుషులవాక్యములును క్రియలును అనుభవములును సద్భుతజ్ఞాన గర్భితములై యుండును. చిరపరనానుభవజ్ఞానముచేతను చిరప్రపంచానుభవ జ్ఞానముచేతను వారిహృదయములు గంభీరభావసమన్వితములై యుండును. మహాపురుషులహృదయములు భావమణులచే నిండిన పేటికలు. విజ్ఞానసదుల

కాశరములు. అద్భుతానుభవములగు గనులు. మహాపురుషులు యథాలాప ముగ నాడినపల్కులయందును మహాభావములు వ్యక్తమగుచుండును. చైతన్యు డాడినపల్కులు సనాతనున కెంతయు ప్రీతిగొలిపెను.

తనదివ్యజ్ఞానముచే గౌరాంగుడు సనాతనుడు తలచుకొనినదారుణకృత్య మును గ్రహించి వాత్స్యల్యముతో నాతని నుద్దేశించి "సోదరా! స్వామిరథ మున కడ్డుగ పడి ప్రాణముల బాయనెంచితివి. ఆత్మహత్య మహాపాతకము. అందువలన గానిదుర్గతులు లేవు. ఆత్మహత్య గావించుకొని యెవ్వడును నేయు గమునందును జగదీశుని గుర్తించి యెఱుగడు. నీవును నట్టిదారుణక్రియకు గడంగి, కృష్ణభగవానునికృపకు దూర మగుదువు. శ్రీనాథునికటాక్షము పొందుటకు ముఖ్యమార్గములు భక్తియు భజనయును. బృందావనమునకు జని కృష్ణలీలామాధుర్యమును పూర్ణముగ ననుభవించి యితరులకు పంచిపెట్టుము. ఇదియె నీకర్తవ్యము" అనెను.

గౌరాంగస్వామియాదేశానుసారము సనాతనుడు బృందావనమునకు మరలెను.

బృందావనమున నివసించుసోదరుల యుదంతమును చైతన్యుడు మిగుల నాతురపాటున నందుండిమరలు యాత్రీకుల నడిగి తెలిసికొని సంతోషపడుచు నుండువాడు "నిరాశ్రయులయి వారిరువురు చెట్టుక్రింద నివసించియుందు రనియు మధుకరవృత్తిచే తెచ్చినయన్నమున కొంచెముమాత్రము తాముగుడిచి ప్రాణ ములను నిలుపుచుండిరనియు కాషాయరంగుగోచీలును, కక్షపాలలును (సన్యా సులు తఱచుగా చంకకు దగిలించుకొను నొకదినుసుసంచులు) రెండుమూఁడు లును వారియాస్తి యనియు నడిరేయి నెపుడో యించుకసేపు నిద్రించి తక్కిన సమయము జలమునందును, హరిస్మరణయందును, తత్త్వశాస్త్రప్రబోధయందును గడుపుచుందు" రనియు యాత్రీకులు శ్రీరూపసనాతనులవృత్తాంతమును గౌరాం గునకు తెలుపుచుండువారు.

బృహద్భాగవతామృతమును; హరిభక్తివిలాసమును; దిగ్దర్శిని యను దానిటీకను; లీలాస్తవమును, భాగవతమందలి దశమస్కంధముయొక్క గంభీ రార్థమును వెలిబుచ్చుగొప్పగ్రంథమును; వైష్ణవతోషిణినిని సనాతనుడు తఱచు

చదువుచుండువాడు. భక్తిసారామృతము; మధురామహాత్మ్యపదావళి; హంస దౌత్యము; ఉద్ధారసందేశము; అష్టాదశకచ్ఛందః స్తవమాల; ఉత్కలికావళి; ప్రేమేందుసాగరము; నాటకచంద్రిక; లఘుభాగవతతోషిణి; విదగ్ధమాధవము; లలితమాధవము. దానకేళీయుదంతము మొదలగు ప్రసిద్ధ గ్రంథములను శ్రీరూపుడు పఠించుచుండువాడు. విదగ్ధమాధవము వంగశకము 1447 సంవత్సరమందును దానకేళీయుదంతము 1463 సంవత్సరమందును లిఖింపబడెను. కృష్ణతత్త్వమును, హరిభక్తియు వైష్ణవనిత్యకర్త్వోదంతమును నీగ్రంథములయందు గడువిపులముగా తెలుపబడియుండెను.

శ్రీరూపసనాతనులు బృందావనక్షేత్రమందే విష్ణుసాన్నిధ్యమున కరిగిరి. అన్నివిద్యలయందును ప్రవీణులయి, అతులసంపదలయందు నోలలాడుచు సర్వజనమాన్యులయినపురుషులు ఆశలు విడచి, కోరికలు నేలపాలుచేసి లక్ష్మికి వీడుకోలు చెప్పి కృష్ణప్రేమమాధుర్యమును గ్రోలుచు నిష్కళంకపువైరాగులు కాజాలుదురనుటకు రూపసనాతనులయద్భుతజీవనచరిత్రమే తార్కాణము.



# ౨౧

# మహాత్మా పవుహారీస్వామి

ఉ. కన్నులుగల్గువాఁడు మఱికానని వానికిఁ ద్రోవఁజూపగా
జన్న తెఱంగు మూఢునకు సన్మతి దాగురుఁడౌట సూర్యుఁడే
కన్నులుగాఁగ భూతములఁగాంచుచునుండు రమేశ! మాకును
దృఙ్నయమూర్తివై గురువవై యాలసద్గతిజాడఁ జూపవే!

జౌన్‌పూరుజిల్లాలోని ప్రేమపురమున నయోధ్యానాథ తివారి యను వైష్ణవు డుండెను. అతడు రామానుజమతస్థుడు. శుద్ధవర్తనుడు. అతనియన్న పేరు లక్ష్మీనారాయణుడు. లక్ష్మీనారాయణుడు సంసారమును విడచి గాజీపుర పట్టణమునకు దగ్గరనున్న కుర్థా యను పల్లెటూర వసియింప నరిగెను. భాగీరథీ నదీతీరమందలి యొకచక్కనివనమున నీగ్రామ ముండెను. గ్రామసమీపమున వనమునందలి యొకవృక్షముక్రింద నతడు తనకుటీరము నేర్పఱచుకొని యోగాభ్యాసమందును హరికీర్తనమునందును కాలము గడపుచుండువాడు. గంగానది యిపుడు కుర్థాగ్రామమునకు దూరమున ప్రవహించుచున్నది గాని పూర్వము నూఱేండ్లకుముందు గ్రామమువారనుండి పోవుచుండెడిది.

అయోధ్యానాథునకు ముగ్గురుసుతులు. పెద్దవాడు గంగారాముడు. రెండవవాడు హరిభజనదాసు. మూడవకుమారుడు బలరాముడు. రెండవ వాడగుహరిభజనదాసు చిన్నపుడే మశూచిజాడ్యమున కుడికన్ను కోలుపోయెను. కన్నుపోయినయాకుమారునియెడ తల్లిదండ్రులు విశేషానురక్తులై శుక్రాచార్యు డని పిలుచుచుండిరి. హరిభజనుడు క్రీ. శ. 1840వ సంవత్సరమున ప్రేమపురమున జనియించెను. హరిభజనుడు పదేండ్లప్రాయమువాడై యుండ పెదతండ్రి లక్ష్మీనారాయణుడు కుర్థాయందలి తనకుటీరమున వ్యాధిగ్రస్థుడయ్యెను. తెవులుమూలమున నతడు చాలబలహీను డయ్యెను. కాలికిబెట్టిన కంటికిని కంటికిపెట్టిన కాలికిని వచ్చు యావ్యాధివలన నతడు మిక్కిలి పీడింపబడుచుండెను. కొన్నాళ్ల కతనిదృష్టిశక్తికూడ నశించెను. అన్నగారియవస్థకు కడుంగడువిచారించి యయోధ్యానాథుడు తనపెద్దకుమారుని నచటికి సేవ

చేయుటకై పంపెను. కాని లక్ష్మీనారాయణుడు వానిశుశ్రూషల నంగీకరింపక గంగారాముడు నీచేతికందుచున్నవాడు. నీకు సాయపడగలకుమారుని నాకడ నుంపు మేల? రెండవవాడగుశుక్రాచార్యుని యాశ్రమమునకు పంపు' మని తమ్మునితో పలికెను. అయోధ్యానాథుడు తనరెండవకుమారుడు చిన్నవాడనియు నన్నగారికుపచారము చేయజాలడనియు పెద్దకుమారునినే తనచెంత నుంచుకొమ్మనియు నన్నను పరిపరివిధముల వేడుకొనెను గాని యాత డందుల కియ్యకొనలేదు. అగ్రజునివాంఛను త్రోసిపుచ్చ నేరక యాతనిసన్నిధికి శుక్రాచార్యునే తండ్రి పంపెను. తరువాత నొకసారి యుపనయనముచేయునిమిత్తము తీసుకొనివచ్చి యయోధ్యానాథుడు తిరిగి వెంటనే యాశ్రమమునకు నతని పంపివేసెను.

పెదతండ్రిగారియాశ్రమమునందు వసించుచు శుక్రాచార్యుడు విద్యాభ్యాసము మొదలుపెట్టెను. ప్రాతఃకాలముననే లేచి గంగాస్నాన మొనరించి యధ్యయనము మొదలుపెట్టి పదిగంటలవరకు పఠియించి పిమ్మట నంటకై యరుగువాడు. వంటచేసినతరువాత పెదతండ్రికిని యాతనిశిష్యులకును పెట్టి వారికిపలయు నితరసపర్యలుముగించి తానన్నము తినువాడు. ఈవిధముగా నొకవత్సరము గడపి పిదప గాజీపురసమీపమునందలి హుసేనుపురమున వసించు శివరత్న శాస్త్రి యను పండితునియొద్ద ప్రతిదినమునంస్కృతము నభ్యసించుచుండువాడు. కొంతకాల మచట సంస్కృతము నేర్చుకొని శంకరగ్రామమున వసించుప్రసిద్ధజ్యోతిష్కుడగు నందపండితుని జేరి "బాలబోధము" "శీఘ్రబోధము" మున్నగుజ్యోతిషగ్రంథములు పఠియింప మొదలుపెట్టెను. హరిభజనుడప్పటికి పదుమూడేండ్లప్రాయమువాడైయుండెను. సంస్కృతవ్యాకరణమును చదువవలెనని కోరిక పుట్టి గాజీపురమునందలి సుప్రసిద్ధవయ్యాకరణపండితుడగు వేచనపండితు నాశ్రయించి 'సారస్వత' 'చంద్రిక' లనుగ్రంథములను తొలుత పఠించెను. ఒకయేడు గడచినపిమ్మట గోపాలపండితునాశ్రయించి 'వేదాంతపంచదశిని' పూర్తిగ చదివివైచెను. అత డసాధారణజ్ఞాపకశక్తిగలవాడగుటచే శీఘ్రకాలముననే యద్వితీయపాండిత్యము సంపాదింప గలిగెను. విజ్ఞానధురీణుడైనపిదప నొకసారి స్వగ్రామమునకు పోయి యతడు మాతృదేవతను సందర్శించెను.

క్రీ. శ. 1856 వ సంవత్సరమున లక్ష్మీనారాయణయోగి పరమపదించెను. పెదతండ్రియంత్యక్రియలు నిర్వర్తింపజేసి యాతనియాశ్రమమునందే హరిభజనుడు వసింపదొడగెను. లక్ష్మీనారాయణుడు తన యాశ్రమమున వివిధములగు విగ్రహముల ప్రతిష్ఠించి వానిని నిత్యము పూజించుచుండువాడు. హరిభజనుడును నావిగ్రహములను పూజించుచు శాస్త్రపఠనము చేయుచు నాకుటీరమున కాలము గడపుచుండువాడు. కాని యాతనికి మనశ్శాంతి యుండెడిది కాదు. మిగులచింతాక్రాంతుడై యుండువాడు. ఆహారము భుజింపక యించుక పాలుమాత్రము త్రావి యుండువాడు. ఒక్కొక్కప్పుడు పాలుకూడ మాని యుపవాసములు చేయుచుండువాడు.

క్రీ. శ. 1857 వ సంవత్సరమున నాశ్రమమును పెదతండ్రిగారిశిష్యున కప్పగించి హరిభజనుడు తీర్థసేవకై బయలుదేరెను. శ్రీజగన్నాథము సేతుబంధరామేశ్వరము చిదంబరము మొదలగుముఖ్యతీర్థస్థానములకు పాదచారియై చని 'గిరినార' పర్వతమును జేరుకొనెను. అందొక మహాపురుషుని దర్శన మాతనికి లభించెను. ఆసిద్ధపురుషుడు హరిభజనునకు యోగాభ్యాసము నేర్పదొడగెను. యోగవిద్యయందారితేరి మరల తీర్థసేవనమునకై కదలిపోయి మూడేండ్లు గడచినపిదప తొంటియాశ్రమమును జేరుకొనెను. యాత్రలనుండి తిరిగి వచ్చినవెంటనే యాతడు పెదతండ్రిసమాధినుండి యస్థికలను తీసి వానిని గంగగర్భమున కలిపివైచి సమాధిని మరల నిర్మించి దానిపై నల్లరాతితో చేయబడిన పావుకోళ్లను స్థాపన మొనరించెను. ఆసమయమున నతని జనకుడు అయోధ్యానాథుడు పరలోకగతు డాయెను.

'గిరినార్' పర్వతమునుండి మరలి హరిభజనుడు 'నేను' అనుపదమును పరిత్యజించెను. తన్ను దాను 'దా' ననియు నొరుని 'బాబు' అనియు పరకాంతను 'తల్లి' యనియు పిలచుచుండువాడు.

ప్రతిదినము ప్రాతఃకాలమునుండి పదిగంటలవఱకు నాతడు స్నానసంధ్యాపూజనములను నెఱవేర్చుచుండువాడు. ఉషఃకాలమునందే స్నాన మాచరించి నదీగర్భమందు నిలచి యాతడు కృష్ణసంస్తవ మొనరించుచుండువా డనియు దేవతలుకూడ నచటికరుదెంచి యాతని ప్రార్థనమున దోడగుచుండువారనియు

శ్రీకృష్ణభగవానుడు సముఖమున నిలిచియుండెనా యనున ట్లుండెడిదనియు ప్రజలు వచించుచుండువారు.

పూజానంతరమున నేకదీక్షగా నాలుగైదుగంటలు యోగాభ్యాసము చేసి యనంతర మాతడవ్వలి కరుగుచుండువాడు. బయటనుండి మరలివచ్చి వంట చేసికొని భోజన మొనరించుచుండువాడు. తిండి తినినపిదప కొంచెము విశ్రాంతి గైకొని, కొంతసే పతిథియభ్యాగతులతో ప్రసంగించుచుండువాడు. తరువాత నాతడు మఱల యోగసాధనము ప్రారంభించువాడు. ఇట్లు కొంత కాలము గడచెను. రొట్టెలు తయారొనరించుటలో కొంతకాలము వృథయగు చున్న దని తలపోసి యాతడాహారమును మానుకొనెను. మారేడాకులు కొన్ని నలిపి పాలలో కలిపి దానిని కొంతకాలము త్రావుచుండువాడు. ఒకొక్కప్పు డదియును మాని యాతడు శుష్కోపవాస మొనరించుచుండువాడు. ఇట్లు కొన్నియేండ్లు గడపి స్వగ్రామమగు ప్రేమపురమున కరిగి తల్లికి నమస్కరించి యామెను వెంటబెట్టుకొని మాఘకుంభమేళ మహోత్సవమునకు ప్రయాగ చనెను. అచటినుండి గంగయొడ్డునగల తనపూర్వాశ్రమ టీరమునకు పోయి యచట యోగసాధనమునకై యొకగుహను తయారు చేసెను. తొలుత నొకదినమును క్రమముగా నంతకంటె నెక్కుడుదినములును నిట్లొకవారమువఱకు నాగుహ యందే యుండువాడు. ఏయాహారమును గొనక యాతడు జీవించియుండుట కబ్బురపడి ప్రజ లాతని పవుహారీబాబాయని పిలువదొడగిరి (పవుహారీయనగా పవనము నాహారముగా గొనువాడని యర్థము)

సాధారణసన్యాసులవలె నాతడు శరీరమునకు విభూతి నలదుకొనువాడు కాడు. శిరమున జటాభారము ధరించుటకూడ నాత డెఱుగడు. తలవెండ్రుకలను పర్వదా ముడివైచుకొనువాడు. కౌపీనమును ధరించి పాదములవఱకు వ్రేలు లుంగీని ధరించుచుండువాడు.

కొంతకాలము గడచినపిదప 'గిర్నార్' పర్వతమునందు వసించు తన గురువర్యుని దర్శింప నచటకి పయన మయ్యెను. కాని యతడయోధ్యకడ కరుగునరికి యాచార్యునెఱిగిన యొకపెద్దమనిషి కానుపించి యాతడు హిమా లయపర్వతముల కరిగి యందు ప్రాణత్యాగము చేసెనని తెలిపినందున ముందు వకు జనక యయోధ్యయందే కొంతకాల మాగి వైష్ణవభక్తులందు మిగుల

ప్రసిద్ధిజెందిన యొక యోగీంద్రునికడ నూతనవిజ్ఞానము నంది నిజనివాసమునకు మరలెను. అంతటనుండి యతడు నిజకుటీరము తరచు వీడు మండువాడుకాడు. అచటిదేవుని రథోత్సవసమయమందు మాత్రము కుటీరమునుండి బయలు కరిగి రథముత్రాడును బట్టుకొని కొంచెము దూరము రథమును లాగి యింటికి బోవు చుండువాడు. తరువాత నదియును మాని యాశ్రమద్వారమునం గూర్చుండి రథ మును జూచు చుండువాడు. దూరదేశములనుండి పలువురుభక్తులు స్వామిని దర్శించి యతనికడ నుపదేశముల పొందుటకు వచ్చుచుండువాడు. ప్రతియేకా దశిని కొంతకాల మందులకు నిర్దిష్టమొనరించి యాతడు వారికి దర్శనమిచ్చి యభీష్టములు దీర్చుచుండువాడు.

ఎచ్చటికి నరుగక యెండకన్నను వానకన్నను నెఱుగక నిరంతరము నాశ్రమమందే వసించుచుండుటచే నతనిశరీరము పుష్పములకంటె సుకుమార మును నంచుకంటె తెలుపును నయ్యెను.

పిదప కొన్నాళ్ళకు మరల త్రివేణీపుష్కరము వచ్చెను. ఈసారి యతడు రైలుమార్గమున ప్రయాగకు జనెను. త్రివేణియొద్దున నతడు సామాన్యకుటీర మందు వానము చేసెను. తీక్ష్ణమగు సూర్యకాంతికిని దుస్సహమగుశీతబాధ కును నతడు మిక్కిలి బాధపడెను. ఈరెంటివేదనలచేతను నతని శరీరము వ్యాధి గ్రస్థమయ్యెను. చెప్పనలవిగానిదగ్గుచే నాతడు వేదన బడజొచ్చెను. శీతబాధచే శిరమున శూలబయలుదేరెను. హరిభజనుడు మాటలాడుశక్తినికూడ కోలు పడెను. తఱచు జ్వరము తగులుచుండెడిది. అతడు తీవ్రవేదన బడుచుండుట జూచి సమీపమున వసించుచున్న కొందఱువిప్రు లతనిచెంత జేరి మందుపుచ్చు కొమ్మని పరిపరివిధముల నతని వేడుచునుండువారుకాని యాతడందులకంగీక రింపలేదు. తుదకెట్టులో హరిభజనుని నిత్యము ప్రార్థించి పీడించి ఔషధసేవన మున కొప్పించి కొంతపైకము నెట్లో సంపాదించి మంచిఖరీదుగలమందులను దెచ్చిరి. మారేడాకులను గోక్షీరములును పుచ్చుకొనునాతని కేమిపథ్యాహార ములు తేవలెనో యావిప్రులకు తెలిసినదికాదు. యోచించి యోచించి పాలతో తయారైనవివిధములగు రుచికరమగు మధురమగు భక్ష్యములను దెచ్చి యతని చెంత నిడుచుండువారు. ఆయాపదార్థములన్నియు హరిభజను డొకతావున నుంచువాడు. వాని నాత డేమిచేయునో పరీక్షింతమని యావిప్రులు చాటున

నుండి యాశనిజాడలు కనిపెట్టుచుండువారు. స్వామిజి దాచియుంచినయాభక్ష్యములను నౌషధములను మెల్లగ దీసికొనిపోయి నదిలో పారవైచి యే దేనొక దిక్కునకు పోవుచుండువాడు. అదిగాంచి యాబ్రాహ్మణు లందఱు కుపితులై "వీనిని వానిని దేవురించి పైకము దెచ్చి యమూల్యమగునౌషధములను రుచ్యములగు భక్ష్యమును దెచ్చి తన కర్పింప, నీయోగివరుడు వానిని నదీగర్భమున పాలువైచుచున్న వాడు. వీనికొఱకై మన మింతశ్రమపడ నేల" యని యనుకొని, యంతందు తిరిగి పర్ణశాలకు తిరిగి జేరుకొనినస్వామిని దర్శించి యాతనిని నిందింపసాగిరి. వారినిందల కించుకైనను నతడు చలింపక చేతులు జోడించి, "తండ్రులారా! దాసునిపై కోపపడ నేల. దాసు డేయపరాధమును జేయులేదు రోగనివారణార్థము మీ రొసగినమందులు మాకులు నేను రోగమునకే సమర్పించితిని. దాసునిశరీరమును పరిశీలింపుడు. వ్యాధి యదృశ్యమైనది" యని వచించెను. విప్రులు పరీక్షింప నాతనిరోగము నివారణమై యుండెను. పూర్వము వలెనే యాతనివాక్కులు విస్పష్టములుగా నుండెను. ఆచిత్రమును గాంచి యెల్లరు నాశ్చర్యము నందిరి.

ప్రయాగయం దింక వసింపక కడపటిసారి త్రివేణియందు స్నాన మాచరించి యతడు జనయిత్రిని చూచుటకై ప్రేమపురమునకు పోయెను. ఈసారి యాతిడు గృహమున ప్రవేశింపక సమీపమందలి యుద్యానవనమున నొక దినము వసించి పదపడి తనయాశ్రమమునకు వెడలెను.

చిన్ననయస్సునుండియు హరిభజనుడు సాధువులను సన్యాసులను దీనులను దరిద్రులను సేవించుట కలవాటు పడియుండెను. ఈయభ్యాసము నతడుకడవఱకు నిలుపుకొన గలిగెను. అతనియాశ్రమమున కెట్టిసమయమున నెవ్వ రరుదెంచినను నిరాహారులై పోవువారు కారు. హరిభజనునిశిష్యుడు నందకుమారుడును, నగ్రజుడు గంగారాముడునుగూడ నతిథిసత్కారమునందు పాలుగొని సంతుష్టులగుచుండువారు.

లక్ష్మీనారాయణుడు (హరిభజనుని పెదతండ్రి) బ్రతికియున్ననాళ్ళలో పల్లెవాసులు తమపంటలనుండి నాగలి కై దేసిసేరుల ధాన్యముచొప్పున నాశ్రమమున కనుపుచుండువారు. ధనాఢ్యులు పైకముగూడ నొసగుచుండువారు. కాని యపు డశ్రాంతము నభ్యాగతసేవ జరుగుచుండెడిది కాదు. అట్లు ప్రోగు

పడినధనమును ధాన్యమును సంవత్సరమునకొకసారి లక్ష్మీనారాయణుడు దీనులకు వంచియిచ్చువాడు. ఇపు డాశ్రమమున కరుదెంచు నతిథులనంఖ్యా యధికముగుటచే నూరివారొసగినధనధాన్యసంపద లెప్పటికప్పుడే వెచ్చపడుచుండెను.

పూర్వము గంగానది యాశ్రమమునంటి పారుచుండెడిది. ఇపు డది యవ్వలియొడ్డును గోయుచు నివ్వలియొడ్డున నాశ్రమసమీపస్థలమున కొంతలంక కల్పించెను. ఎవరిపొలమునకనుసరించి యేర్పడినక్రొత్తభూమి యాపొలముకామందుకు జేరుట యాచారము. కావున నాశ్రమపరిసరమున నేర్పడినభూమి యంతయు నాశ్రమమునకు చెందెను. స్వామిజీ శిష్యసహితుడై యాభూమి యంతయు సేద్యము చేసి ధాన్యాదు లందు పండించి మునుపటికంటె నధికముగ నతిథిసత్కార మొనరించుచుండువాడు.

స్వామిజీకీర్తి బహుప్రదేశములు వ్యాపించెను. భక్తులును పామరులును మాత్రమే గాక ద్రవ్యవంతులును యోగివరునిప్రసాదము నందుటకు కుటీరమునకు వచ్చుచుండువారు. జనసమూహ మెక్కుడగుటచే తనయోగసాధనమునకు భంగమువాటిల్లుట విలోకించి యాశ్రమమునకునమీపమున కొన్నిగుడిసెలు నిర్మింపజేసి యోగివరు డభ్యాగతుల నందు వసింపచేయుచుండువాడు.

ఒకనాడొకపిచ్చివాడొకదుడ్డుగఱ్ఱ చేతబట్టుకొని స్వామిజీని కొట్టుటకై యాశ్రమముకడ కరుదెంచెను. వాడు ఘాతుకకృత్యమునకు తలపడుట గాంచి యచట గుమిగూడిన కొందఱు ప్రజ లాతనిని ముందున కరుగనీయకుండ నొడిసి పట్టిరి. స్వామిజీ యపుడు కుటీరమున హోమ మాచరించుచుండెను. హోమము నిర్వర్తించి యీవలకువచ్చి యున్మాదునిపై తీవ్రముగు తనదృష్టుల సారించెను. అంతట నతడు నిలచిపోయెను. పిమ్మట వానిని వదలివేయుడని యాప్రజ కాత డానతిచ్చెను. ఆప్రజ లాతని విడిచిపుచ్చిరి. పిచ్చివాడు పరమభక్తాగ్రేసరుని మాడ్కి స్వామిజీకి నమస్కరించెను. పిచ్చివానియందు గలిగిన యీ యద్భుతమగుమార్పున కంద అచ్చెరువు నొందిరి. ఒకప్పు డున్మాదుడై యుండెనని తిల చుటకైన వీలులేనంతటి సాధుగుణసంపన్నుడై యాతడు వరలెను.

దుర్మతియొకడు సన్యాసివేషమున నొకనాటిమధ్యాహ్నమున నాశ్రమమున కరుదెంచి యందలి వస్తుసామగ్రిని విలోకించి హరిభజను నుద్దేశించి "ఏమోయీ! నీవైఖరి చూచిన నీవు మూర్ఖునివలె తోచుచున్నావు.

నీయాలయమందలి విగ్రహాముల కీయమూల్యాలంకారము లేల? ఇంతద్రవ్యము నీకేందులకు? సన్యాసివయ్యును నీ వీమడిమాన్యములను ధనధాన్యములను సంచిత మొనరించుచుంటి వేల? నీవు దుర్మార్గుడవు; పరోపకార మను పేరు పెట్టి ధనము చాల కూడబెట్టుచున్నావు. నిన్ను నమ్మి నిరుపేదలును నిరక్షరకుక్షులును నగు నీయూరియమాయికప్రజలు మోసపోవుచున్నారు. నీ విందుండి యెందేని జను" మనియెను. "తండ్రీ! నా కీయలంకారము లెవ్వియు నక్కరలేదు. వలయునో నీవు వీని నన్నిటిని గొనిపొమ్ము. దాసుని యాశ్రమమును యిందలి సర్వస్వమును గైకొనుము. నీయిష్టానుసారము దాసుడు బద్ధుడై యిందుండి వెడలిపోవువాడు. కాని యపుడే యీాత డిందుండి వెడలిపోవునేని యాశ్రమవాసు లడ్డు నిలతురు. నిన్ను లోపలప్రవేశింప నీరురు. నడి రేయి దాసవ్వలికిపోవును" యని స్వామిజీ ప్రత్యుత్తర మొసగి నాటిరాత్రి యాశ్రమముతాళముచెవి యాగ్రోత్త యోగి కిచ్చివేసి యందుండి యెచటికో లేచిపోయెను. మఱునాడుద యమున నాశ్రమ సమీపమందలి పల్లీయులును భక్తులును స్వామిజీయాశ్రమము బంధింపబడి యుండుట గాంచి వింతపడి యందలి నూతనపురుషునిచర్యలు లక్షణములు విలోకించి సంశయించి స్వామిజీ యెందరిగెనని వా రాతనిని ప్రశ్నించిరి. "ఈయాశ్రమము నాయది. ఇందలిధనధాన్యములను నాకొసగి యోగివరుడు వెడలిపోయెను. మీర లెల్లఱు నాకు దాసులై పరిచర్య సలుపుడు" అని యాగ్రోత్తసన్యాసి జవాబుచెప్పెను. ఆకస్మికముగ నందుగానవచ్చిన యీదుర్మార్గుడే యోగివరున కెగ్గుచేసె నని తలచి యాశ్రమవాసులు వానిని దండించుటకు యత్నము సలుపుచుండుట గాంచి పాకముదప్పెనని యెంచి యీదొంగసన్యాసి కాలికి బుద్ధి చెప్పెను.

పవుహారీస్వామి, యాశ్రమమునుండి వెడలిపోయె ననువార్త కార్చిచ్చు వలె దేశమున వ్యాపించెను. అతని వెదకుటకై, యెందరెందరో యెన్నితావు లకో జనిరి. కాని యాత డెందును కనుపడలేదు. పిమ్మట నొకసంవత్సరమునకు 'అజిమ్‌గడ' నివాసి యగురామచార్జీ యనునతడు జగన్నాథక్షేత్రమున స్వామిజీని కలసికొని తొంటియాశ్రమమునకు రమ్మని యతనిని పరిపరివిధముల వేడుకొనెను కాని పరిత్యజించిన యాశ్రమమున తిరిగి ప్రవేశించుట కాతడు సమ్మతింపలేదు. జగన్నాథమునుండి దేశసంచారమునకును తీర్థసేవనమునకును

నతడు బయలుదేరెను. మార్గమధ్యమున నతడు వ్యాధిగ్రస్తు డయ్యెను. ఘూజి దాబాదు జిల్లాయందలి బహ్మాపురమం దాతడు నివసించి లోకపావని యగు గంగానదియొడ్డున నతడు ధ్యానమగ్నుడై కాలము గడుపదొడగెను. సజ్జనుడును సాధువర్తనుడును నగునొకవంగదేశస్థుడు స్వామిజీకొఱ కా నదియొడ్డున నొక కుటీరము నేర్పఱచెను పవుహారిస్వామి యందునివసించి యోగాభ్యాసాదులు నిర్వర్తించుకొనుచుండువాడు. ఆవంగీయుడును మిగులశ్రద్ధాభక్తులు చూపుచు నతినిని సేవించుచుండువాడు.

క్రీ. శ. 1888 వ సంవత్సరమున (ఆషాఢపూర్ణిమనాడు) పవుహారీ స్వామి గొప్పయజ్ఞము చేసెను. అనేకు లీజన్నము జయప్రదముగ కొనసాగు టకు తమతమ శక్తికొలంది తోడుపడిరి. భారతవర్షమందలి పెక్కుప్రాంతముల నుండి, ధనికులును దరిద్రులును సాధువులును సామాన్యులును యజ్ఞమున సాయ పడుటకు స్వామిజీకడ కరుదెంచిరి. ఎవరికితోచినభంగిని వారు స్వామిజీకి సహాయ సంపత్తు లొసగిరి. ఈసవనము రమారమి నెలదినములు జరుపబడెను.

ఒకనాటియర్ధరాత్రమున పవుహారిస్వామి గంగానది కరిగి యందు స్నాన మాచరించి యొడ్డున కూరుచుండి యోగాభ్యాసమునకు దొడగెను. కొంత సేపటి కేలనో యాతనిసాధనమునకు విఘ్నము వాటిల్లెను. యోగదృష్టి నిలు పుట కాతనికి వలనుపడకుండెను. అకస్మాత్తుగ నాతనిశరీరమున నొకదురంతవేదన ప్రారంభ మయ్యెను. ఎద్దియోవ్యాధి స్వామిజీ జీర్ణకాయమును కబళించెను. అంతటినుండియు యోగీంద్రునిస్థితి క్షీణింప దొడగెను. శరీరము పాడు కాజొ చ్చెను. పల్వు రాతనిదర్శనమున కరుదెంచి యేమివ్యాధియని పలుమా రాతని నడుగుచు వచ్చిరి. కాని యాత డెన్నడు నేమియు నుత్తర మొసగినవాడుకాడు.

క్రీ. శ. 1898 వ సంవత్సరమున జ్యేష్ఠశుద్ధసప్తమినాటియుదయమున పవుహారిస్వామి సోదరుడును, సోదరునికుమారుడు బదరీనారాయణుడును, వార ణాసికళాశాలయందలి యాచార్యు డగుభాగవతాచారియు జనార్దనపండితు డును మఱికొందఱు పెద్దమనుష్యులును స్వామిజీకుటీరసమీపమందలి పర్ణశాల యందు విడిసియుండిరి. యోగీంద్రుడు తనకుటీరమందే యుండెను. ఆసమయ మున కుటీరమునుండి పొగ బయలుదేరెను. స్వామి హోమ మొనరించుచుండె

ననియు హోమధూమమే పైకి వచ్చుచుండెననియు వారు తలచిరి; కాని స్వచ్ఛమైన ధూమము వెలువడుచుండుటచే బదరీనారాయణుడు సంశయించి మనంబున భయంబు దోచి కుటీరము చెంతకు తిరిగిచూచెను. పర్ణశాలతలుపులు మూయబడి యుండెను. అతడు పైకెక్కి పరికించెను. అగ్నిజ్వాలలు కుటీరము నుండి పైకెగయుచుండుట కనిపెట్టెను. కెవ్వున కేక వైచి "మహాత్మా! యగ్ని నార్పుటకు సెలవిం" డని స్వామిజీని ప్రార్థించెను. పవహారీస్వామి పైకి జూచి యేమో సంజ్ఞచేసెను. దాని యర్థము బదరీనారాయణునకు బోధపడలేదు. బదరీనారాయణుడు పెట్టిన కేక విని స్వామిజీశిష్యుడు ప్రియసేవకుడు నగు భృగునాథుడును గాజీకొండయును పర్ణశాలపై కెక్కి చూచిరి. యోగివరు డపుడే స్నాన మొనరించినట్లు వారికి కాన్పించెను. అతనిశిరోజములు తడిసి యుండెను. ఎఱ్ఱగా కాల్చిన బంగారమువలె ప్రకాశించుచున్న యాతనిశరీరమునంతటను నేయిపూసిన ట్లుండెను. దర్భాగ్నిసంబంధమైన యాతనిగోచి తడిగా నుండెను. అప్పుడే స్నానమాచరించి స్వామిజీ హోమకుండము నెదుర కంబళిపై నుత్తర ముఖముగా పద్మాసనము (పద్మాసనము రెండువిధములు (1) ముక్తపద్మాసనము (2) బద్ధపద్మాసనము:—ముక్తపద్మాసనము: కుడిపాదము నెడమ తొడపై నుంచి యెడమచేయి నెత్తి యుంచవలెను. కుడితొడపై నెడమపాదము నుంచవలెను. కుడిచెయ్యి యెత్తియుంచి నాసికాగ్రమున దృష్టినిలిపి దంతమూలమున నాలుక చేర్చి యుంచవలెను. పిమ్మట గడ్డమును ఱొమ్మును నెత్తి మెల్లమెల్లన వాయువును బీల్చవలెను. పీల్చినవాయువును జాలినంతసేపు లోపల నిలుపవలెను. బద్ధపద్మాసనము: ఎడమతొడపై కుడిపాదమును కుడితొడపై నెడమపాదమును నుంచి రెండుచేతులతో వెనుకనుండి త్రిప్పి కాలి బొటనవ్రేళ్లను బట్టుకొనవలెను. కడమ ముక్తపద్మాసనము ట్లే.) వైచుకొని యోగమగ్నుడై యుండెను. పరిశుద్ధ మగునాతనిశరీరమునుండి మంట లెగయు చుండెను. యోగదండము (యోగులు ధ్యానమగ్నులయి యుండియుండి నడుమ విశ్రాంతి తీర్చుకొనుటకై 'T' రూపముతల చేగఱ్ఱపై శరీరము నానుకొందురు. దీనినే యోగదండ మందురు) సమీపమున పడియుండెను. చూచుచుండగనే మంటలు స్వామిశరీరమును గప్పివైచెను. ఆత డించుకయు కదలకుండెను. యోగనిమగ్నుడై యట్లే కూరుచుండియుండెను. క్షణములో నామహాయోగిబ్రహ్మ

రంధ్రము (మాడపట్టు) బ్రద్ద లయ్యెను. బదరీనారాయణాదులు నిశ్చేష్టులై కుటీరముపై నిలిచిపోయిరి.

హరిభజనుని జీవనమహత్వ మాతనిచిన్నతనమందే యంకురించెను. అతడు బుద్ధి యెఱిగినదాది యాశ్రమమునందే వసించెను. అనవరతము, నతిథి సేవనము, దేవతారాధనము, యోగాభ్యాసము మనోనిగ్రహములనే యాత డాచరించుచుండెను. పెదతండ్రికి శుశ్రూషలు సలుపునపుడే తనయంతరంగ మందలి యాధ్యాత్మికభావములకు శుశ్రూషలు చేయదొడగెను. లక్ష్మీనారాయ ణునిదృష్టాంతమే బాలకునకు అనుసరణీయ మయ్యెను. పరిశుద్ధ మగువాయువు, పవిత్రములగుగంగాజలములు, పరిపూత మగుభక్తగణము హరిభజనున కాచార్యస్థానము లయ్యెను, స్థలమును సంసర్గమును నైశవసమయమున శిక్షించునుపాధ్యాయులు. బాలునియందు గుణాగుణము లేర్పడుట కివియే ముఖ్యహేతువులు. జీవనమంతయు యోగాభ్యాసమునకును పలువురకు శాస్త్ర బోధయొనరించుటకును వినియోగించి త్యాగమునకై పరిపక్వమైనశుభ ముహూర్తమున పవుహారీస్వామి ఆత్మాహుతి గావించుకొనెను. ఈఆహుతిని గాంచినభృగుబదరీనారాయణులు నిర్వాక్కులైపోయిరి. పంచభూతములు నడలుపాటున కంపించినవి కాని యోగి యించుకయు చలింపలేదు. పవిత్ర మగుతనశరీరము నతడు మంటల కొప్పగించెను. రుచికరమగు తనశరీరమందలి రక్తమాంసముల నగ్నిదేవునకు నాహారముగ సమర్పించెను. యోగివరుని హృదయసింహాసనమున నాసీనుడగువేలుపు మంటలవేడికి చలియించెనుగాని పవుహారీస్వామి చలింపలేదు. అనిర్వచనీయమై యద్భుతమైన యోగిచంద్రుని దివ్యతేజము ప్రళయకాలమందును నశింపక వెలుగొందుచునే యుండును.



౨౨

# ఉద్ధారణ ఠాకూర్



మ. పరగోవింద కథాసుధారసమహాశ్చర్యోరుధారాపరం
పరలం గాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంతదురంత దుస్సహజనుస్సంభావితానేక దు
స్తర గంభీర కఠోర కల్మషకనద్దావానలం బాఱునే.

సప్తగ్రామ మనుపురమున వంగదేశమున వంగశకము 1403 వ సంవత్సరమున భద్రావతీశ్రీకరదత్తులకు ఉద్ధారణ ఠాకూర్ జన్మించెను. శ్రీకరదత్తుడు పేరుపడిన వర్తకుడు. వాణిజ్యమున నతడు విశేషధన మార్జించెను. జనకుడు మరణించినపిదప ఉద్ధారణఠాకూర్ తండ్రియాస్తి కధికారి యయ్యెను. పిమ్మట వాడున్నేనుపాకడ నొకజమీందారీని గైకొని తనపేరట నాజమీందారీని యుద్ధారపురమని పిలుచుచుండువాడు. నేడును కాటోయాకు సమీపమున నీపురము వంగదేశమున వన్నెకెక్కి యున్నది.

ఉద్ధారణ ఠాకూర్ పరమభక్తుడు. సుప్రసిద్ధుడగు నిత్యానందయోగి ధర్మప్రచారమునకై సప్తగ్రామమున కరిగినపు డుద్ధారణదత్తునింట విడిసెను. నిత్యానందుని ధర్మోపదేశమూలమున నుద్ధారుని జ్ఞాననేత్రము తెఱపింపబడెను. పంసారసంపత్తియం దతనికి మిక్కిలిరోత పుట్టెను. వైరాగ్యచింత మనసున నుదయించెను. అచిరములో తన విపులమైనసంపదను పరిత్యజించి యతడు నీలాచలమున కరిగి చాలాకాల మచట కఠోరయోగనిష్ఠయందు మునిగియుండెను. పిమ్మటనతడు బృందావనమునకు జని కృష్ణనామ సంకీర్తనమున కాలము గడిపి యేబదియేడవయేట మాఘబహుళ త్రయోదశినాడు దివంగతు డాయెను. బృందావనమందలి వంశీవటసన్నిధానమున నీతనిసమాధిమందిరము నేడుకూడ గోచరించుచున్నది.

ఈతనినిగుఱించిన యొకచిత్రకథ కలదు. ఒకనాఁడు శంఖపుమురువులను విక్రయించువర్తకుఁడొకఁడు సరస్వతీనదీప్రాంతమునుండి చనుచుండ చక్కని బాలిక యొకర్తు మార్గమధ్యమున నిలచి యొకజతమురువులను తన కిమ్మని యాతని గోరెను. వర్తకుఁడు మురువుల నొసగినంతనే బాలిక "అబ్బీ! యిచటికి కొంతదూరమున నుద్ధారణుఁడను నొకమనుజుఁడు కలఁడు. అతని నడిగి మురువులకు రావలసినఖరీదు గైకొను" మనియెను. వర్తకుఁడు సంశయాకులచిత్తుఁడయి యేదియో యోచింపఁదొడఁగెను. "నీ కాతఁడు పైకమీయఁడను ననుమానమున్నచో తూరుపుటింట పడమటిగోడమూలఁగల గూటిలో మీకొమరిత కాసు లైదున్నవనియు వానిని నీకిమ్మంటినని యుఁ దెలుపు" మని యాబాలిక మరల వచించెను. వర్తకుఁడు మిన్నక యుండెను. "అప్పుడుకూడ నుద్ధారణుఁడు గూటియందలిసొమ్ము నీ కియ్యనిచో మరలివచ్చి నీమురువులను నీవు తీసికొని పొ"మ్మని బాలిక పలికెను. అంతట సంశయముమాని వణిజుఁ డందుండి తిన్నఁగా నుద్ధారుని యింటి కరిగి సంగతియంతయు నాతనికి దెలిపెను.

ఉద్ధారణుఁ డా నుడువులు విని వింతపడి "ఏమోయీ! నీ కథయంతయు చాలచిత్రముగ నున్నది. నాకు కూఁతులు లేరు. ఎవరికన్యయో నీకు గానుపించి మురువుల గైకొనుటకై యిట్లు చెప్పియుండును. చిత్రములు చేయుటయందును చేయించుటయందును పసిపాపలకు వేడుక మెండుగా నుండును. అయినను గూటియందు వెదకి వత్తుఁగా" నని పలికి లోని కరిగి తూరుపుటింటిపడమటిగోడగూటియందు చేయి పెట్టి చూచెనుగదా నిగనిగమెఱయుచు రంగారు బంగారునాణెములైదు వానికనుల మిఱుమిట్లు గొలిపెను. అచట నెన్నఁ డతఁడు పైకము నుంచి యుండలేదు. విస్మయము నొంది యాతఁడు వర్తకునితో "ఏమోయీ! నీవు నన్నాపిల్లయుండునెడకు గొనిపొమ్ము. ఆమెను చూపినపిదప నీకీ కాసుల నొసఁగెద" ననెను. వర్తకుఁ డందులకు సమ్మతించి యుద్ధారణుని తీసికొనిపోయెను గాని యాబాలిక వారికి కానుపింపలేదు. ఇరువురును చాలాసేపన్వేషించిరి. ఎంతవెదకి వేసారినను బాలిక కంటఁబడలేదు. నిట్టూర్పు నిగుడించి యుద్ధారణుఁ డపుడు "వర్తకుఁడా! నిరుపేదవయ్యు నీచకులస్థుఁడవయ్యు నాకంటె నీవు ధన్యుఁడవు. ఎంతకాలమునుండి తపించుచున్నను నాకు ప్రత్యక్షముకాని జగన్మాత

తనంతతాను నీకు ప్రత్యక్షమై నీతో ప్రసంగించి నిన్ను తరింపజేసినది. సామాన్యుడవు కాకున్నను జగజ్జననిని గుర్తింపజాలవైతివి.'' అని వర్తకునుద్దేశించి వచించెను. ఆపల్కులు విని నిరుపేద యెలుగెత్తి గోడుచు "అమ్మా! నాకిచ్చినమాట మఱచితివా! తల్లీ! ఇచటికి నేను తిరిగివచ్చినంతనే కలిసికొందు నని వాగ్దాన మొనరించియుంటివి గదా. అట్లని నే నీయోగిపురుషునితో చెప్పితిని. నిన్ను యిం దీతనికి చూపజాలకపోతినేని యబద్ధికుడనై పోదును గదా! నన్నీకలుషమునుండి కాపాడుము. మురువులను రెంటిని జూపితివేని నాకెట్టికీడును ప్రాపింపదు.'' అని పలికెను. ఆర్తత్రాణపరాయణయగు దుర్గ దుఃఖార్తుడగు నావర్తకునివచనములు మన్నించి యాతని కనృతదోషము రాకుండుటకై సరస్వతీనదీపవిత్రోదకములనుండి మురువులతోరంజిల్లు తనకరపద్మముల నెత్తి చూపెను.

ఈకథ గంభీరభావగర్భితమై యున్నది. సాధారణముగా భగవంతు దుండుస్థలము పేదవాని కుటీరముగాని ద్రవ్యవంతుని దివ్యహర్మ్యము కాదు. జగదీశుడు తన్మయనృత్యము జేయనభిలషించుటకు నిరుపేదలహృదయము గాని దుష్టచింతలచే నిండియుండు ధనాఢ్యుని మానసము, పవిత్రమగు నాట్యరంగము కానేరదు. పట్టుపుట్టములను ముఖమల్ వలువలను దులిపిన నేలగాలునవి విషయచింతలుగాని పవిత్రమగు భావములు కావు. ఆడంబరమందును విజృంభణమందును తలయెత్తుటకు ద్రవ్యవంతులు గర్వపడుచుందురుగాని జగదీశుడు తల వంచుకొనుచుండును. సర్వేశ్వరుని కనుగొన నువ్విళూరువారు గగనమును ముద్దుగొనుమేడల నెక్క నక్కరలేదు. గోచిపెట్టి సాంద్రవనములయం దాకుల నముల నక్కరలేదు మహామునులకంటె పవిత్రులగు వ్యవసాయదారులచెంతను సూర్యుని యెండవేడిమికి తల దాచక యొరులకై ప్రాణములను చెమటనీటిరూపమున పిండివైచు సేవకులచెంతను, స్వగృహములందు దురంతఅత్యాచారమునకు గుఱియై మారుమూలల చింతించు పలువురు హైందవనారీమణుల చెంగటను దురంతవైధవ్యభారమున నేల గ్రుంగుయభాగినులచెంతను కర్తవ్యనిర్వహణమునకై యసిధారావ్రతదీక్ష నెఱపుమహాపురుషులపొంతను జగదీశుడు వర్తిల్లుచుండును.

ఉద్ధారణునిబోలు నఖిలైశ్వర్యసంపన్నుని జేయుటకు జగదీశుడు సంశ యించి నిరుపేదయై యూరూర దిరిగి వర్తకముచేసుకొనుచు పొట్టపోసికొను వానిని వాత్సల్యపూర్వకముగ ప్రసంగించి కరుణించుటకు సర్వేశ్వరు డువ్వి ళ్లూరెను. ఎంతయత్నించినను యెంతవెదకినను ధనసంపన్నుడగు నుద్ధారణునెడల నాతడు ప్రసన్నుడు కాలేదు.

పదపడిపవిత్రభావసంపన్నుడై ప్రత్యక్షదృష్టాంతములవలననేమి ? నిత్యా నందయోగీంద్రుని ధర్మోపదేశముచేనేమి యుద్ధారణు డమేయధనరాశిని దృణ మట్లు విడిచివైచి సంసారసుఖముల పరిత్యజించి శ్రీకృష్ణపరమాత్మసంకీర్తన తత్పరుడై పరమేశ్వరుని పొంద జాలెను.



# ౧౩
# విజయకృష్ణస్వామి



శా. శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ.

క్రీ. శ. 1847 వ సంవత్సరమున నదియాజిల్లాయందలి యొకగ్రామమున మేనమామలయింట విజయకృష్ణుడు పుట్టెను. శాంతిపుర మీతనిజనకు డుండుగ్రామము. ఉత్సుకపుర మితనిమేనమామల యూరు. అన్నగా రగు గోపీనాథునకు విజయకృష్ణునితండ్రి ఆనందకిశోరగోస్వామి విజయకృష్ణస్వామిని పెంపిచ్చెను. బాల్యమున నితడు స్వగ్రామమందలి పాఠశాలలయందు చదువు నేర్చుకొని పిదప కాళీఘట్టమునకు పోయి యచటి సంస్కృతకళాశాలయందు ప్రవేశించెను. శ్రద్ధాళుడై చదువు నాతడు కావ్యములు శీఘ్రకాలముననే ముగించెను. కావ్యపరీక్షయందు తేఱిన నతడు బిరుదు నందును. పరీక్ష కాతడు చదువుచుండ చుట్టమొకడు తీవ్రవ్యాధిపీడితుడై మందిచ్చువారులేక విచారించుచుండెను. అది గాంచి విజయకృష్ణుడు వానిరోగము పోగొట్టుటకయి యెన్నియో ప్రయత్నములు సలిపెనుగాని కృతకృత్యుడు కాజాలడయ్యెను. తానేవైద్యుడైనచో రోగివేదన పోగొట్టియుండగలుగువాడనని తలచి నిరుపేదలగు పీడితుల నెందఱినేని కాపాడుశక్తి నలవఱచుకొనుటకై వైద్యవిద్య నేర్చుకొనుటకై సంకల్పించెను. సమీపించుచున్న కావ్యపరీక్షపై మక్కువవదలి బిరుదునందలి వ్యామోహము లక్ష్యము సేయక పాఠపుస్తకముల నొకమూలపాఱవైచి యాతడు వైద్యకళాశాలయందు ప్రవేశించెను.

చిన్నప్పటినుండియు విజయకృష్ణుడు శాస్త్రచర్చలయం దెంతయు నభిలాష చూపుచుండువాడు. మతమునుగూర్చిగాని తత్త్వశాస్త్రమునుగూర్చిగాని యుపన్యాసములు జరుగు తావుల కతిసంతసమునవర్విడి జ్ఞానామృతము ను వీనులార

గ్రోలువాడు. విజయకృష్ణుడు కలకత్తానగరమున చదువుకొనురోజులలో బ్రహ్మసమాజమతము క్రమక్రమవృద్ధి నందుచుండెను. మతస్థాపకుడగు రామమోహనరాయలును విజ్ఞానఖనియగు దేవేంద్రనాథుడును నూతనమతమును యెడ తెగనిపట్టుదలతో పోషించుచు 'ఆదిబ్రహ్మసమాజ' మను సంస్థను కలకత్తాయందు నెలకొల్పి యామతమునుగురించిన యుపన్యాసములను చర్చలను నందు జరపుచు ప్రజాళికి జ్ఞానబోధ సలుపుచుండువారు. ఉపనిషత్తులందు గలజ్ఞానమణులా సంస్థయందు వెదజల్లబడుచుండెడివి. విజయకృష్ణుడు ప్రతిదిన మచటి కరిగి గంభీరభావపూరితములగు నచటియుపన్యాసములను వినుచుండువాడు.

వైద్యకళాశాలయందు చదువు ముగియగానే యతడు ఢక్కానగరమున కరిగి యచటి వైద్యవృత్తి నారంభించెను. దీనులకును నిరుపేదలకును దుఃఖితులకును నుచితముగ నౌషధసేవ సేయుచు తన ముఖ్యోద్దేశమును నెఱవేర్చుకొనుచుండెను.

అత్తఱి కేశవచంద్రసేనుడు విదేశమునుండి తిరిగివచ్చి బ్రహ్మసమాజమునకు క్రొత్తరూపము నొసగి ప్రజలమనస్సుల నాకర్షింప దొడగెను. సామాజికులందు పరస్పరసోదరభావము నెలకొల్పుటకయి యాతడు "భారతాశ్రమము"ను స్థాపించెను. వేఱు వేఱభిప్రాయములుగల బ్రహ్మమతస్థు లీయాశ్రమమున నేకకుటుంబమందువలె కలసి యుండువారు. నూతనవిధమున కేశవచంద్రసేనుడు బ్రహ్మమతమును నెలకొలిపెనని విని విజయకృష్ణుడు కుటుంబసహితముగ ఢక్కానగరమును వీడి కలకత్తాకు వచ్చెను.

కేశవుడుస్థాపించిన యాశ్రమము విశేషముగ ప్రజలదృష్టి నాకర్షించిన కొలది 'యాదిబ్రహ్మసమాజ'మున సంచలన ముత్పన్నమాయెను. నూతనశాఖయందు చేరుటకాసమాజమును వదలి పలువురు భారతాశ్రమమున కరిగిరి. కేశవునిగృహ మన్నివేళలయందు జనసంకులమై యుండెడిది. ప్రజలదృష్టినుండి విడివడుటకై కేశవుడు నగరమునుండి దూరముపోయి యొకయుద్యానవనమున వసింప దొడగెను. కాని యచ్చటకూడ నతడు స్వేచ్ఛగా నుండ జాలకపోయెను. పురుషులును స్త్రీలును రాత్రింబవళ్లందు, అచ్చటను గుమికూడ దొడగిరి. బ్రహ్మసామాజికులందఱు కేశవచంద్రు నపు డీశ్వరావతారముగ పరిగణించుచుండువారు. చాలకాలము భారతాశ్రమమున నుండి కేశవునిభార్యయు నాతని

తల్లియు కేశవు డున్నయుద్యానవనమునకు వెడలిరి. విజయకృష్ణు డెంతప్రతి మాలిననువినక వారు భారతాశ్రమమును వీడిరి. "విజయకృష్ణుని పరిత్యజించుటకు సంసిద్ధులముగాని గురువర్యుని పరిత్యజింప జాల" మని వారు పలికిరి. కేశవునిప్రభావ మెట్టిదియో చదువరు లూహింతురుగాక.

కేశవునిప్రచారముమూలమున బ్రహ్మసమాజమున రెండుశాఖ లేర్పడెను. కేశవుని శాఖయే భారతదేశమున పేరు గాంచెను. నిజమతమందిరమున కేశవుడు తొలియుపాసనను జరుపుదినమున పలువురుబ్రాహ్మణులు తమజందెములను ద్రెంపి నూతనమతావలంబకులైరి. విజయకృష్ణుడుకూడ తనయజ్ఞోపవీతమును నాడు తీసివైచెను. బుద్ధిమంతుడగు విజయకృష్ణుడు యజ్ఞోపవీతమును పరిత్యజించినంతనే బ్రహ్మసమాజికు డయ్యెనని తలంపలేదు. గాయత్రికి నీళ్లువదలుట సమాజనిబంధనమునియు జందెము తీసిపాఱవేయుట బ్రహ్మసామాజికుని యనివార్యకర్తవ్యమనియు నాతడు తలచియుండడు. జందెమును విసర్జించినంతనే బ్రహ్మసమాజకుడు కాజాలునని మానవుడు గర్వపడుచో యజ్ఞోపవీతధారణ మెఱుగనిశూద్రులు జందెములను దాల్చి పుటుక్కున ద్రెంపి నిముసములో బ్రహ్మసమాజకులు కాజాలుదురు. బ్రాహ్మణేతరులకు బ్రాహ్మణత్వ మొసగునది జన్నిదము గాదు. బ్రాహ్మణునకు బ్రహ్మసమాజత్వ మిచ్చునది యజ్ఞోపవీతవిసర్జనము గాదు. జందె మున్నవానికిని జందెము లేనివారికిని జందెమును దాల్చియుండువారికిని, జందెమును పరిత్యజించువారికిని యందఱకును బ్రాహ్మణత్వ ముండుటకును బ్రహ్మసమాజమతస్థుడగుటకును హక్కుగలదు. పేరులును మతములును మానవుని మహిమోపేతుని జేయుచో మహిమలేనిమనుజుని గాంచుట యసాధ్య మగును. మానవుని యాధ్యాత్మికోన్నతిని నిరూపించునది గుణము గాని జాతియు సమాజసభ్యత్వమును కావు. గుణరహితుడగు బ్రాహ్మణునకు గాక గుణసహితుడగు చండాలునకే జగదీశుడు తనయంకతలమున చోటిచ్చును.

బ్రహ్మసమాజనాయకుడై విజయకృష్ణుడు ఢక్కానగరమున నివసించుచుండ ఢక్కాకుసమీపమందెగల 'బారదీ' యనుచోట నద్భుతప్రజ్ఞానిధియగు నొకపురుషుడు వాసము చేయుచుండెను. అతడు సిద్ధపురుషుడని యెఱిగి విజయకృష్ణుడు తఱచుగ నతనికడ కేగి యాతనిదర్శనము చేయుచు వానితో పరిచయ మలవఱచుకొనెను.

ఇట్లు కొన్నేండ్లు గడచెను. ప్రచారమునకై యుత్తరదేశముల కరిగి విజయకృష్ణుడు తీవ్రరోగపీడితు డాయెను. అతడు మృతప్రాయు డయ్యెనని విని నంతనే శిష్యు డొకడు బారదీమహాపురుషునిపాలి కరిగి తనగురువర్యుని రక్షింపుమనియు నాచార్యునిప్రాణములకై తనప్రాణములను త్యజించుటకు సిద్ధముగా నుంటిననియు నతనిమ్రోల పరిదేవన మొనరింప సాగెను. శిష్యునిభక్తిశ్రద్ధలకు కడుసంతసించి యాసిద్ధుడు వాని కభయ మొసగి యందుండి యాతనిని పంపివేసెను. సిద్ధు డాప్రకారము తెలిపియు నిజకుటీరమునందే వసించుట నందఱు గాంచుచుండువారు. అట నుత్తరసీమయందు పీడితుడై శిష్యపరివృతుడై పడియుండువిజయకృష్ణుని పర్ణశాలయందు కూడ నాసిద్ధపురుషుడు గనబడుచుండు వా డనియు నాతనిమూలముననే తమయాచార్యుడు బ్రతుక జాలెననియు శిష్యులు చెప్పుచుండువారు. నిశ్చయముగ విజయకృష్ణుడు మరణించెననియు నిర్జీవమైనశరీరమును వైద్యు లావల బడవైచినపిదప సిద్ధపురుషుడు శవమున నిజ ప్రభావముచే నాయువు పోసి తమయాచార్యునకు పునర్జన్మ మొసగెననియు నాతనిశిష్యులు వింతగా చెప్పుచుండువారు.

పరకాయప్రవేశాది మహావిద్యలు ప్రాచీనభారతదేశమున బల్వురు నేర్చి రనియు నట్టి యద్భుతవిద్యలు భరతఖండమున వర్ధిల్లె ననియు తెలుపుట కనేకదృష్టాంతము లున్నవనియు చెప్పవచ్చును. బారదీసిద్ధపురుషు డద్భుత మహిమావంతు డనుట నిక్కువము. చచ్చిపోయినవాని నాతడు బ్రతికించుట యత్యుక్తియై యుండవచ్చును కాని మృత్యువునోట నగముపడినవాని నైన నతడు తనయద్భుతప్రభావముచే బ్రతికించియుండవచ్చును.

బారదీసిద్ధపురుషుని చెలిమిచేసినదాది విజయకృష్ణుని భావగతియందు మార్పు కనుపించెను. తనయాశ్రమమును వీడి దగ్గరనున్న మామిడిచెట్టుక్రింద కూరుచుండి యాతడు రేయింబగళ్లు హరికీర్తనమున నొడలు మఱచియుండు వాడు. కొంతకాల మట్లు విష్ణుసంకీర్తన మొనరించి తీర్థసేవనమునకై విజయకృష్ణుడు కాలినడకను హిందూదేశమంతటను తిరుగసాగెను. ఈతడు బృందావనమునకు బోయినపుడు వీనివిష్ణుభక్తి పరికించి యచటివైష్ణవు లచ్చెరువు నంది యాతని సేవింప దొడగిరి.

బ్రహ్మసమాజికులు విష్ణుశబ్ద ముపయోగించుట, యుచ్చరించుట కాని పని యని పలువురుసమాజస్థులు వచించుచుందురు. పొన్న చెట్టు గోచరించిన కృష్ణమూర్తి మనమున స్ఫురించుననియు నగు డట్లు పరమేశు పగిది మానోనేత్ర ములకు దోచుట పాపకర మనియు నూహించి కొందఱు బ్రహ్మసమాజికులు పొన్నతరువును పడగొట్టి రనుచిత్రకథను వినుచుందుము. విజయకృష్ణుని జీవన చరిత్ర యిట్టిదురభిప్రాయములను దూరము పారదోల గలదు.

సన్యాసియయ్యు విజయకృష్ణుడు సంసారమును విడువలేదు. దూరప్రదే శములందును పర్వతములందును నడవులయందును నతడు వసింప నరుగుచుం డుట సంసారబంధము త్రెంపుకొనుటకు కాదు. ఎంతరిగినను నాతడు దారా పుత్రులను విడువలేదు భగవంతుని తెలిసికొనుటకు కుటుంబజీవన మాటంక మగునని భ్రాంతిచెందువారికి విజయకృష్ణుని జీవనచరిత్రి మహత్తరమగు పాఠ మును బోధింపగలదు. సంసారమును పరిత్యజించి గిహానాంతర ప్రదేశముల యందు కాలముగడపువాడు. యుద్ధభూమినుండి పర్విడి ప్రాణములు నిలుపుకొను పిరికివానివంటివా డనిపలుకుట సత్యేతరము కాదు. తామరాకుపై నీటిబొట్టు ముత్తియమట్లు వెలు గొందుచు దాని నంటకయుండులీల మహాపురుషులు సంసారజీవనమును గడపుచుండియు వ్యామోహమున జిక్కక యుందురు.

విజయుడు బృందావనమున వసించుచుండ నాతనిసతి విషజ్వరపీడిత యయ్యెను. గొప్పగొప్పవైద్యు లామెను బ్రతికింప శక్తివంచన సేయక ప్రయ త్నించిరి. కాని తెగులు మిగులతీవ్ర మగుటచే వారిప్రయత్నములు విఫల మాయెను జాడ్య మాపద్రవకరమైనదని తొలుత నే వైద్యులు తెలిపినను విజయు డధైర్యపడలేదు. ఎప్పటియట్లు తెల్లవారుకడ మేల్కాంచి స్నానాది కార్య కృత్యములను కావించుకొని నిర్ణీతపూజల నాతడు నెఱపుచుండెను. మనసార నెవ్వతె నాతడు ప్రేమించియుండెనో పెక్కేడు లర్ధాంగియై యెవ్వతె సుఖము లందును దుఃఖములందును తనకు తోడునీడ యై యుండెనో యామె తనను బాసి దివమున కేగినను విజయుడు సంచలింపలేదు. పర్వతశిఖరమును నుండవిల్లు బద్దలోని యుండ లెట్లు ఛేదింపజాలవో యట్లే విజయకృష్ణుని హృదయమును నిరర్థకమగు సంసారదుఃఖములు దాకియు నొప్పింపలేకపోయెను.

పదునెనిమిదేండ్ల యీడుగల తనకుమార్తె యోర్తు కలకత్తాలో తీవ్ర వ్యాధిపీడితయై యుండ విజయకృష్ణు డపు డందుండెను. కన్య జీవింపదని యత డెఱుగును. ఇంటివారందఱు దుర్భరదుఃఖావేగమున గుండెలు మోదుకొనుచు గొల్లుమని యేడువసాగిరి. గృహమంతయు రోదనధ్వనిచే ప్రతిధ్వనించిపోయెను. ఎప్పటియట్లు దైనికకృత్యము నెఱపుకొని విజయకృష్ణుడు తనయాసనమున నాసీనుడయ్యెను. రోదనధ్వనిగాని కన్నీటికాలువగాని వానిని యోగాసనమునుండి కదలుప జాలవయ్యెను. ఏమియుపద్రవమును సంఘటిల్ల నట్లు నియమానుసారము నిర్ణయసమయ మగువరకు సతము యోగముద్రయందు మనస్సు బంధించియుంచి యనంతరము మెల్లగ లేచి శవ మున్నగదియందు ప్రవేశించి ప్రేమావేశమున నృత్యము చేయదొడగెను. ప్రపంచజ్ఞానము లేనివాడై యొడలెఱుంగక నృత్యము చేయుచు ప్రణయకీర్తనము పాడుచు ప్రత్యక్షదైవతమువలె, చనిపోయినబాలికకడ నున్నవిజయుని జూచి యందఱాశ్చర్యమగ్నులైరి. చాలసేపట్లునృత్యానందమున మైమఱచి యుండి కీర్తనము ముగిసినపిమ్మట శవమును జేరి హస్తమున నామెశిరము నంటి మరల తనయాసనమున నాసీనుడై ధ్యానమగ్ను డయ్యెను. పుట్టిననాటగోలె నిజాంకమున పెంచి పెద్దదాని గావించి కంటిని ఱెప్పవోలె గాచుచు ప్రేమించి, నేడు తనకన్నకూతునకు విజయు డెట్టు లిహలోకమునుండి సెలవొసంగెను? సాంసారికదుఃఖము లాతని సమీపించుటకు జంకును.

సృష్టిమొదలు నేటివఱకు మానవహృదంతరాళమందు విశేషసంచలన మొనరించినయద్భుతశబ్దములు రెండు. ఒకటి ముక్తి, రెండు నియమము. భవబంధములనుండి ముక్తినొందుటకై పెక్కుఋషులు మహామునులు ఘోరతప మాచరించి అరిషడ్వర్గములనుండి ముక్తి నంది జితేంద్రియు లగుటకై మహానీయులు కఠినవ్రతము నెఱపిరి. ముక్తి నొందుటకై జీవాత్మ సలుపు ఘోరయుద్ధము సృష్టి యంత మొందువఱకు జరుగుచునేయుండును.

వార్ధక్యమున విజయుడు కలకత్తానగరమున నివసించుచుండువాడు. పవిత్రమైన వీనిజీవనము పలువురదృష్టినాకర్షించెను. పెక్కుతావులనుండి వచ్చి యనేకు లీతని దర్శించుచు నీతనియాదర్శజీవనమున కచ్చెరు వంది యీతని యుపదేశములమూలముననను నాచరణమూలముననను విశేషజ్ఞానమును సంపా

దించి పవిత్రులగుచుండువారు. అనుదిన మితడు నిజమందిరమున హరిభజనము నలుపుచుండువాడు. సంకీర్తనమున పాల్గొనుట కనేకులు సంధ్యాసమయముల నితనికుటీరమున కరుదెంచుచుండువారు. సంకీర్తనసమయమున నితడు బాహ్యజ్ఞానశూన్యుడై యొడ లెఱుంగక తాండవనృత్యము సలుపుచుండువాడు. ఉత్సాహమున నావేశులై దుర్మతులుగూడ భక్తితత్పరులై నాట్యమొనరించుచుండువారు. జడపదార్థములుకూడ జీవమును దాల్చి నృత్య మొనరించుచున్నవా యనునట్లు తోచెడిది. సంకీర్తనసమయమున విజయుని నేత్రములు మూతవడక యుండునవి. స్థిరమైన జూపుగల యాతనికన్నులనుండి వెల్వడి పైకిప్రసరించు నితనిదృష్టులును మాధుర్యపూర్ణ మగు వీనికంఠస్వరమును, కంటి కింపగు నీతని వదనకాంతియు నాశ్చర్యము గొలుపుచుండెడివి.

విజయకృష్ణుడు పరక్షేమకాంక్షి. పరులకై యొడలు గోసి యిచ్చుటకు సంశయించెడువాడుకాడు. దీనులును దుఃఖితులును దరిద్రులును నాపదలయందు చిక్కుకొన్నవారును ననవరతము విజయకృష్ణుని దర్శించి తమయిడుమలు నివారించుకొనుచుండువారు. అప్పు పడినవారిని ఋణదాతల బారినుండి తప్పించువాడు. అన్నార్తుల కాహార మొసగుచుండువాడు. వస్త్రహీనులకు వస్త్రము లిచ్చుచుండువాడు. రోగపీడితులకు మందు లొసగుచు వారిని కాపాడువాడు. కుష్టురోగపీడితులందరి జేరి చీము నెత్తురులను తుడిచి యౌషధ మొసగి వారిబాధ నివారింప జూచువాడు. తీర్థమునాడు దేవాలయముకడకు చనుభక్తుల ట్లశ్రాంత మర్థిజనులు విజయునింటికి వచ్చుచుండువారు.

ప్రాచీనసన్న్యాసులకును విజయకృష్ణునకును చాలభేదమున్నది. జనసమూహమునుండియు ప్రాపంచికప్రలోభమునుండియు పరు విడి పర్వతగుహలందును దట్టమగు వనములందును తప మొనరించు ఋషిచంద్రులు నిరంతరయోగనిష్ఠయందు మగ్నులయి యాత్మముక్తి నందుచురు. ఇట్టివారు మహనీయులే గాని తమముక్తికంటె యొరులముక్తియే జీవనపరమావధియని తలచుపురుషుడధికుడని నేడు తత్త్వశాస్త్రము తెలుపుచున్నది. పరులకు సర్వ మొసగుటకై తాను నరకకూపమున బడియుండుట కాతురపడువాడును, వనములందు సంచరింపక ప్రజలనడుమ నిలచి వారియున్నతికై ప్రాణముల నొసగుటకై వెనుదీయని పురుషుడును నుత్తమపురుషులు. నిరంతరధ్యానమ్నముకంటె నిరంతరసేవ మహత్తర

మైనది. గీతాచార్యుడగు శ్రీకృష్ణభగవానుడు దీనినే ప్రపంచమున కుపదేశించెను. విపినములయందలి సన్న్యాసులనుసనులకు మరల్చి జననమూహామునై పుడ్రివృచున్న దీనుహాత్తరాశయమే. విజయకృష్ణుడట్టికర్మవీరుడు. వనమందలి సన్న్యాసికిగల మహాగ్గుణములుకొన్ని కర్మవీరునకుగల సద్గుణములు గొన్ని కలసి వానియం దలరారెను. హరిభజనమందును సంకీర్తనమందును తీర్థసేవయందును యోగనిష్ఠయందును మనసు నిలిపి విశేషకాల మతడు గడపెను. దుఃఖార్తుల దుఃఖము పోగొట్టి నిరుపేదల యాకలి దీర్చి రోగపీడితులకు చికిత్స చేసి, కొంత కాలమాతఁడుపరముక్తికై గడపెను. యోగులందును కర్మవీరులందును మొదటి వాడు కాకపోయినను రెండు తెగలయందును విజయకృష్ణు డున్నతపదవి నంది సర్వజనపూజనీయు డాయెను.

క్రీ. శ. 1897 వ. సంవత్సరమున నతడు కలకత్తాపురమును వీడి శ్రీజగన్నాథమునకు చనెను. ఎప్పటియట్టులు దీనజనరక్షణమందును హరిసంకీర్తనమందును, యోగనిష్ఠయందును రెండేండ్లు కాలము పుచ్చి విజయుడు 1899 వ సంవత్సరమున పుడమిని బాసెను.

విజయకృష్ణుని మరణముగురించి యొకవదంతి కలదు. జగన్నాథమున వసించు సన్న్యాసియొకడు యితనిప్రతిభా వభావముల కసూయ జెంది విష మిడి యాతని చంపెనట. ఈవిషయము సత్యముకాదని నేఁటికూడ కలకత్తాలో ప్రజలు దెలుపుచుందురు.

గురువర్యుని శవమును శిష్యులు నరేంద్రసరోవరమున కుత్తరమునై పున గల తోటలో సమాధి గావించిరి. జగన్నాథమున కరుగు యాత్రికులు పలువురు విజయకృష్ణుని సమాధిని దర్శించి పోవుచుందురు.

భావగంభీరములగువాక్యములను కొన్నిటిని విజయకృష్ణుని యుపదేశముల నుండి యేరి యిందు తెలుపుచుంటిమి.

సాధుజనసాంగత్యము ధర్మసాధనమున ప్రధానాంగము.

కామక్రోధములు నశింపనప్పు డవి తెలియక మనమున నుండుచునే యుండును. మనమున నవి యుండియుండినపుడు పాపము చుట్టుకొనదు. మన మనం దవి తలయెత్తినపుడే వాని నణచివేయుటకు మానవుడు ప్రయత్నింపక వానికి సాయపడినపుడే పాపము సంఘటిల్లును.

మానవుల పుణ్యపాపనిర్ణయము ననుసరించి భగవంతుడు విచారణ సలుపడు. వారి హృదయములను పరిశీలించియే జగదీశుడు గుణాగుణముల నెఱిగి విచారణము సలుపును.

నియమితసమయమున ప్రతిదినమును మనుజుడు ధ్యానము సలుపవలెను. నామసంకీర్తన మొనరించుట కాతడాతురపడవలెను. సంకీర్తన మొనరించుటకు మన మొల్లకున్నను క్రమక్రమమున నతడు దానినభ్యసింపవలెను. ఔషధము తఱచుగ చేదుగనుండును. తినగ తినగ వేముతియ్యనగును. అట్లే నామసంకీర్తనమును యిష్టమగును.

అనవరతము యాచించునాతడు దానమున కర్హుడు కాడు. పొగడ్తకు కరంగునాతడు దానమున కనర్హుడు. ప్రత్యుపకారమును ప్రతిఫలము కాంక్షించి చేయుదానము దానముకాదు. స్వర్గప్రాప్తికొఱకు పాపవిమోచనము నభిలషించి చేయుదానము దానము కాదు. దాహార్తుడైనవాడు చెంబుచేతబూని దప్పితీర్చుకొనుట కెట్లు వ్యగ్రుడగునో దానపాత్రుడు తోచినంతనే మనుజుడాతనికి సహాయ మొనరింప నుద్యుక్తుడు కావలెను.



# శ్రీ శంకరాచార్యుఁడు



శ్లో. "శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం
సూత్రభాష్యకృతౌ వందే భగవంతౌ పునః పునః"

మ. "ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచు నుండు నట్టిహరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై!"

ప్రపంచమున మానవుఁడు పుట్టుట యెట్లో శరీరపోషణ మొనరించి తుదకు దానిని బూడిదపాలు చేయవలెనని కాదు. చితిసన్నాహమునకే మానవుఁడు పుట్టుచో నట్టిపుట్టువు వ్యర్థమగును. వ్యర్థమగుపుట్టువును మనుజునకు ప్రసాదించుట భగవంతుని యుద్దేశమైనచో భగవంతునకు భగవంతు డనిపించుకొనుట కధికారములేదు. ప్రతిమానవుని జన్మయందు నొకయుద్దేశమున్నది. ఉద్దేశము లేనిజన్మ జన్మకానేరదు. మనుష్యత్వమును గుర్తింపని మనుజుడు మనుజుడు కాడు. మహత్తరమగు తనయుద్దేశమును చేరుటయే తనజీవనపరమావధి యని గుర్తించి నిజకర్తవ్యనిర్వహణమునకై తానుగావించు పనియందు నంతతానందమును జెందుచు విషయాసక్తసమయములందు మానసక్లేశమున పొగులువాడే జన్మసార్థక మొనరించుకొనును.

ఈయాదర్శము నెఱవేర్చుకొనుట మానవున కొకజన్మయందు సాధ్యము కాకపోవచ్చును. నేడు కాకున్న రేపును యీజన్మమందు కాకున్న మఱుపుట్టువు నందును నీయుద్దేశసిద్ధి మనుజుఁడు పొందవలెనని కరుణాళుఁడగు సర్వేశ్వరుని యభిప్రాయము. కష్టములందు మానవుని నలిమివేయుటకై గాక యుద్దేశసిద్ధికై ప్రయత్నించుటకు తరుణముల నొసగుటకొఱకే జగదీశుడు జన్మముల నొసగుచుండును. నేటిప్రయత్నపు మెట్టుపై రేపటియత్నపుమెట్టు నిలుచును. పుట్టువులన్నియు మనుజు నభివృద్ధికి దెచ్చుమెట్టులు. మహత్తరమగు హిందూమతము బోధించు కర్మసూత్రమం దీయద్భుతపాఠ మిమిడియున్నది. ఈ కర్మసూత్ర

వాదమును నమ్మక మనజుడుపొందుజన్మమొక్కటియే యనియు తానుచేసుకొను పుణ్యపాపముల ననుసరించి జన్మాంతమునందాతడు చిరస్వర్గముగాని చిరనరకము గాని యనుభవించుననియు దెలుపు క్రైస్తవమతము జీవాత్మయభివృద్ధికై యేర్పడిన కర్మరంగము మానవజన్మమను నద్భుతవిషయమును గుర్తింపక గుర్తించినపుడది సిద్ధించుమార్గము చూపజాలక యిప్పటికిని తొట్రుపడుచున్నది.

జన్మజన్మములయందు నభివృద్ధిచెందుచు కర్మపరంపరల దాటిదాటి దైవత్వసాధమును జేయుచు తుదిస్థానమున నిలిచి గోచరించునాతడు మహాపురుషులం దగ్రగణ్యుడు. పెక్కుపుట్టువులను దాటి లెక్కలేనియిక్కట్టులను నెట్టివైచి కట్టకడపటిమెట్టగు తుదిజన్మయం దాతడు చూపుశక్తి మహాద్భుతమైనదై యుండును. జగదీశునిశక్తికిని వీనిశక్తికిని గలభేద మొక్కమెట్టే యగుటచే యీతనిశక్తియెంతయు నద్భుతమై యుండును. అనేకశతాబ్దములును సహస్రాబ్దములును గడచినపిదప మాత్రమే యిట్టి యున్నతపదవి నందిన మహాపురుషులు గోచరించుచుందురు.

ఇట్టిమహాపురుషులనే దైవాంశసంభూతులనియు నవతారపురుషులనియు పేర్కొనుట కలదు. తేజోనిధియగుశంకరాచార్యు డిట్టిమహామహిమోపేతుల యందొకడు.

ఇతడుప్రపంచమునం దేమానవమాత్రుడుగాని పొందజాలని మహాద్భుత మేధాశక్తి నందిన లోకోత్తరపురుషుడు. జగదేకవంద్యుడు. ఈశ్వరసన్నిభుడు. వేదకాలము నుండియు ప్రజ్ఞానంతులగు తత్వశాస్త్రజ్ఞులను మహాపురుషులను మహాకవులును పవిత్రమగుభారతదేశమున పుట్టుచునేయుండిరి. వేదయుగమందును పురాణయుగమందును నాటుకొనిన జ్ఞానబీజములు మహోన్నతవృక్షములై నలుదిక్కులకు వ్యాపించెను. శంకరాచార్యుడు ప్రత్యక్షప్రమాణము విశేషముగా పరిగణింప బడుకాలమున జన్మించి మనుష్యునందెన్నడు చూపట్టని గొప్పమేధాశక్తిని చూపి ప్రపంచమునకు మిరుమిట్లు గొలిపెను.

శంకరాచార్యునిచరిత్రము విశేషముగ విచిత్రగాధలచే నిండియుండును. క్లుప్తముగ నతని చరిత్రాంశములనిందు దెలిపెదము.

శంకరాచార్యుని జీవనచరిత్రములలో "శంకర విజయము" 'శంకర దిగ్విజయ' మనుపుస్తకములు ముఖ్యమైనవి. కాని యీరెండుగ్రంథములయందలి విష

యము లందందు ప్రతికూలములై పరస్పరవిరుద్ధములై చూపట్టుచున్నవి. శంక రుని పుట్టువును గుఱించి "శంకరవిజయము" న నీవృత్తాంతము కలదు. కాపా లిక భైరవ బౌద్ధ జైన క్షపణకమున్నగు మతములు ప్రబలుటచే వైదికమతము వెనుకపడుటఁగాంచి త్రిలోకసంచారియగు నారదుఁడు బ్రహ్మపాలికిఁజని సనాతన ధర్మమును రక్షింపుమని యతనిని వేడుకొనెను. కర్తవ్యమూహింపఁజాలక కలహాశన సహితుఁడై (నారదుడు) బ్రహ్మ కైలాసమునకు కదలిపోయెను. దేవతలందఱు మహాదేవునొద్దకు బ్రహ్మాదుల ననుగమించిరి. వారిప్రార్థనమాలించి మహేశ్వ రుఁడు భూతలముననవతరించి సనాతనధర్మము నిలువబెట్టుదునని ధైర్యముచెప్పి వారి నంపివేసెను. పిమ్మట చిదంబరమందలి యాకాశలింగమను శివమూర్తి యందు దేవాదిదేవుండగు మహాదేవుఁడు ప్రవేశించెను. చిదంబరమున మహేం ద్రుఁడను నొకపండితుని వంశమున సర్వజ్ఞుఁడను నతఁడుపుట్టెను. అతనిభార్య కామాక్షి. చిదంబరేశ్వరుని పూజించి యామెవిశిష్టయను కుమార్తెను గనెను. విశ్వజిత్తను నొక బాలకున కామెనిచ్చి వివాహము చేసిరి. "నాభర్తయగు విశ్వజిత్తును చిదంబరమందలి యాకాశలింగేశ్వరుఁడును నొక్కఁడే" యని విశిష్ట పలుకుచుండెడిది. కాలక్రమమున నామె కొకకుమారుడు కలిగెను. ఆకుమా రుఁడే అద్వైతమతగురుండగు శ్రీశంకరాచార్యుఁడు.

"శంకర దిగ్విజయము" మను రెండవగ్రంథమందలి యీ క్రిందివిషయము విశేషప్రసిద్ధియందున్నది. కేరళమున మృగనారాయణుఁడను నృపాలుఁడు పాలించుచుండెను. అతఁడు శివభక్తిపరాయణుఁడు. పూర్ణానదీతీరమున చాలా శివాలయములను గట్టించి యెల్లపుడు శంకరుని గొలుచుచు 'విద్యాధిరాజను సర్వశాస్త్రపరిజ్ఞాతయగు నొక బ్రాహ్మణు నర్చకునిగా నియోగించెను. విద్యా ధిరాజునకు శివగురు వను పుత్రుఁడు కలిగెను. తలిదండ్రులచే నపారవాత్సల్య మున పెంపబడుచు శివగురు వభివృద్ధిగాంచుచుండెను. వడుగైనపిదప బాల కుఁడు విద్యాభ్యాసమునకై గురుగృహమున కరిగెను. సకలవిద్యలనేర్చి యాచా ర్యుని మెప్పువడసి గురుని యాదేశమున నాతఁడింటికి వచ్చెను. విద్యలయం దారితేరి వచ్చినకుమారుని గాంచి తలితండ్రు లమితానందమందిరి. తరువాత సర్వలక్షణ శోభితయగు నొకకన్యను తనయున కాతనితండ్రి వివాహ మొనర్చెను.

శివగురువు భార్య సుభద్ర. పరస్పరానురాగబద్ధులై దంపతులు సుఖముగా సంసారమును గడపుచుండిరి. కాని వారికి సంతానము కలుగనందున సుభద్ర విచారించుచుండునది. ఒకనాడామె భర్తనుద్దేశించి "నాధా, భూలోకమున నానందింపదగిన వస్తువులన్నియు ననుభవించి సుఖముగ జీవయాత్ర గడపుచున్నను మనకు భగవంతుడు సంతానము కలుగజేయమి నామనము దుఃఖించుచున్నది. గొడ్రాళ్లకు గతులు లేవని శాస్త్రములు నుడువుచున్నవి. "అమ్మా! అమ్మా! యని బిడ్డ పిలుచుచుండ తల్లిపొందునానందమును నేను చవిజూచియెఱుగను గదా! దేవాదిదేవుండగు మహాదేవుని గొలిచి ఫలము చెందకుండువా రెవరును లేరు. శివు నారాధించితిమేని సంతానభాగ్యము నందజాలుదుము" అనియెను. శివగురువు సరే యనెను. నాడాది భార్యాభర్తలిద్దఱు శివాలయమున కరిగి మహాదేవునర్చింప దొడగిరి. కొంతకాల మట్లు వారు శివునర్చించినపిదప నొకనాడు ముసలిబ్రాహ్మణుని వేషమున నీశ్వరుడు శివగురువునకు కలలో గానుపించి "వత్సా! మీయారాధనమునకు మిక్కిలి సంతసించితిని. వలసినకోరిక కోరుకొమ్మనెను. అడుగుటయు నాతడు మహాదేవునకు నమస్కరించి "దేవాదిదేవా! నీవంటె గుణసంపన్నుడగు నొకకుమారుని నాకు ప్రసాదింపు" మని వేడెను. ఆ ముసలిబ్రాహ్మణుడును "అట్లే యగుగాక" యని మాయ మయ్యెను. తోడనే సుభద్ర గర్భవతియై నవమాసములు మోసి పుత్రుని గనెను. శుక్లపక్షచంద్రునిమాడ్కి బాలు డభివృద్ధి నొందసాగెను. దేవదేవుడగుశంకరుని కృపచే కలిగినకుమారుడగుటచే బిడ్డకు తలిదండ్రులు శంకరుడని నామకరణ మొనరించిరి. శంకరునిజననసమయమును గుఱించి పలువురు పలువిధముల యభిప్రాయములను వెలిబుచ్చిరి.

ఈతడు మలబారు సీమయందు పుట్టెను. వేయిసంవత్సరములకు ముందు శంకరుడు వసించెనని యీ సీమవాసు లనుచుందురు.

వేయిసంవత్సరములకు మున్ను శివరావుతో యుద్ధముచేసి కృష్ణారావోడిపోయినపుడు శంకరాచార్యుడు మలబారునం దుండెనని 'కేరళోత్పత్తి' యను తెనుగుగ్రంథమునం దెలుపబడెను.

కాశ్మీరమున కరిగి ప్రతిపక్షులను శంకరుడోడించినపుడు లలితాదిత్యు డాసీమ నేలుచుండెను. 1186 సంవత్సరములకు పూర్వము లలితాదిత్యుడు

రాజ్యము చేయుచుండె నని 'రాజతరంగిణి' యందు తెలుపబడెను. అందుచే శంకరుడు తొమ్మిదవశతాబ్దారంభమునందే యుండెనని మనముగ్రహింప వలెను.

శంకరాచార్యుఁడు క్రీ. శ. 788 వ సంవత్సరమున పుట్టెనని పండిత వెంకటరాము వచించెను.

శంకరాచార్యుడు 8, 9 శతాబ్దములయందు వసించియుండెనని 'విల్సను' వచించెను.

క్రీ. శ. 1143 వ సంవత్సరమున గుజరాతు దేశపురాజుయొక్క యాస్థానపండితులలో ముఖ్యుడగు హేమచంద్రునితో శంకరుడు తర్కించెనని 'ప్రాచీన దిగ్విజయ' మను గ్రంథమందు లిఖింపబడియుండెను.

శంకరుడు, 8, 9 శతాబ్దములయందుండెనని 'ఇండియన్ ఆంటిక్విటీ' యనుగ్రంథమున నుండెను

శంకరాచార్యుడు క్రీ. శ. 800 సంవత్సరములకు పూర్వము వసించియుండెనని 'హగ్గను' దొర వచించెను.

ఈ వృత్తాంతములనుబట్టియు మరి యితర ప్రాచీనగ్రంథములయందలి విషయముల ననుసరించియు శంకరు డెనిమిదియవ శతాబ్దాంతమున జన్మించి యుండెననియు తెలుచున్నది.

శంకరుడు శుక్లపక్షచంద్రునిమాడ్కి దినదినాభివృద్ధి నందసాగెను. మొదటి సంవత్సరముననే యతడు మాతృభాష నభ్యసించి యం దాటితేఱెను. రెండవయేట తల్లి తొడపై కూరుచుండి యామె చదువుచుండు పురాణేతిహాసములనువిని వానిని మనమున జ్ఞప్తియం దుంచుకొనువాడు. శంకరుడు మూడేండ్ల ప్రాయపువాడై యుండ నతనిజనకుడు కాలధర్మము నొందెను. నాల్గవయేట మహేశ్వరుని శక్తులన్నియు నీతనియందు పొడసూపి మహామహోపాధ్యాయుల యూహాలకందని యద్భుతవిషయములాతనికి కరతలామలకము లయ్యెను. అయిదవయేటను యజ్ఞోపవీతమును ధరించి యాతడు గురుగృహమున కరిగెను. తనయద్భుతశక్తి ప్రభావము మూలముననాఱవయేట శంకరుడు సర్వశాస్త్రములందును సర్వవిద్యలందును పారంగతుడయ్యెను.

వేదమునందు బ్రహ్మకోడను తాత్పర్యబోధయందు బృహస్పతితోడను సిద్ధాంతమున కృష్ణద్వైపాయనునితోడను నాతడు సముడాయెను.

శంకరునియందు చిన్నతనమునందే యిట్టి యద్భుతప్రజ్ఞలు గోచరించుట మిగుల నాశ్చర్యకరమగు విషయము. ఇత డాదర్శమహాపురుషులం దొకడు ఈమహాత్ముని జీవనచరిత్రయందు పెక్కు లద్భుతవిషయములు గలవు. ఈతని యద్భుతస్మరణశక్తి కవికిని చారిత్రకారునకును భౌతికశాస్త్రజ్ఞునకును మిక్కిలి గొలిపినది. ఇది యసాధ్యమనియు నసత్యమనియు చెప్పుట కేశాస్త్రజ్ఞుడును చాలడు. శంకరుని యద్భుతజ్ఞాపకశక్తిని గుఱించిన యుదంతము ప్రత్యక్ష పరిశీలన ప్రమాణములపై నాధారపడియున్నది.

శంకరాచార్యుడు చిఱుతప్రాయమునుండియు నిరుపేదలయెడ మిగుల కరుణాళుడై యుండువాడు. గురుగృహమున చదువుకొనుచు నీతడు మధూకర వృత్తి చేసికొని నిష్కళంకబ్రహ్మచర్యము గడుపుకొనుచుండువాడు. ఒకనాడు మధూకరమునకై యొకగృహమునకరుగ నాయింటి యామె నిరుపేదయగుట నతనికొసగుటకు బియ్యము లేనందున మిగులవగచుచు "తండ్రీ! మేము గర్భదరిద్రులము. భిక్షుకవృత్తిచే మేము ప్రాణములను నిలుపుకొనుచుంటిమి. ఇంటియాయన ముష్టికై పోయి యింకను రాలేదు" అని పలికి యింటగల ఫలముల కొన్నిటిని దెచ్చి యామె శంకరున కొసగెను. శంకరు డా యిల్లాలి దీన దశకు మిగుల జాలిపడి, రమాసతిని స్తుతియించి యాబ్రాహ్మణి కతులైశ్వర్యములు కలుగజేసెను. ఒకపుడు రాజశేఖరుడను రాజు సంతానరహితుడై శంకరాచార్యుని కరుణ పడయ నాతనిదర్శించి బంగారు నాణెములను రాశిగా నాతని చెంతనుంచి సాష్టాంగదండప్రణామమాచరించెను. సంతానవంతుడవు క" మ్మని శంకరుడాతని నాశీర్వదించి చెంతనున్న బంగారునాణెములను నిరుపేదలకు పంచిపెట్టెను. శంకరునియాశీర్వాద మమోఘమగుటు రాజశేఖరు డచిర కాలమున పుత్రవంతుడయ్యెను.

చిన్నవయస్సు నందే శంకరునిహృదయము వైరాగ్యముదెస తిరిగెను. ఎనిమిదవయేటనే సన్యాసికావలెనని యత డపేక్షించెను. లేకలేక కలిగిన పుత్రుని విడుచుటకు తల్లి సమ్మతింపలేదు. తనయుద్దేశము నెఱవేర్చుకొనుటకై శంకరు డొకయుపాయమును పన్నెను.

ఒకనాడు తల్లితో గూడ శంకరాచార్యుడు నదినిదాటి కొందఱుబంధువులను చూచుటకై గ్రామాంతరమరిగెను. పోవునపుడు నదియందు నీరు మిగుల తక్కువగా నుండుటచే వారిరువురు నవలీలగ నదినిదాటిరి. పొరుగూరినుండి వారిరువురు తిరిగివచ్చునప్పటికి వే రుపొంగి పారుచుండెను. శంకరుడు నదియందు ప్రవేశించి కొంతదూరమరిగెను. వెళ్ళగా వెళ్ళగా లోతెక్కువయయ్యెను. కంఠములోతునీళ్ళలో నిలచి చతురుడగు నబ్బాలకుడు "అమ్మా! సన్యాసాశ్రమస్వీకారమునకు నా కనుమతియొసగుము. లేకున్న నీ నీటిలో నాశరీరము కొట్టుకొనిపోవు" నని యెలుగెత్తి పలికెను. తనయుని స్థితికి మిక్కిలి తొట్రుపడి తల్లి ప్రాణమగుట "నాయనా! వాయువులతో నున్న జాలును. వైరాగ్యస్వీకరణము నీముఖ్యోద్దేశమే యయినయెడల నీ యిష్టప్రకారమాచరించి యానందింపుము" అని జనని పలికెను. పరిణయమాడినచో కుమారునిచిత్తము సంసారసుఖములకు లొంగి వైచునని తొలుతనాతని తల్లి తలచెను కాని యామెకోరిక మట్టిపాలయ్యెను. శంకరుని కోరికయే సఫలీకృతమయ్యెను.

జనని యనుమతినివడసినపిదప శంకరుడు పూజనీయుడగు గోవిందస్వామి నాశ్రయించి యతనికరుణ పెంపున ననుపమానప్రజ్ఞానిధి యయ్యెను. అనంతర మాతడాచార్యుని యనుమతిచొప్పున వారణాసి కరిగెను. చోళదేశవాసియగు సనందుడు కాశీపురియందు శంకరుని ప్రథమశిష్యుడాయెను. తరువాత పలువు రాతని యంతేవాసులగుభాగ్యము నందిరి. సనందునికి పద్మనాభుడను మరియొక నామముకలదు; యీనామ ముత్పత్తియగుటకు నొక చిత్రకథకలదు. ఒకనాడొక పనిమీద సనందుడు గంగానది దాటి యావలికరిగెను. అతడావలి యొడ్డున నుండ మరకొరకున్నని గురు వాతనిని పిలచెను. గురువియాజ్ఞ శిరసావహించి సనందు డిట్లాలోచింపదొడగెను." అపారసంసారనీరధినుండి యవలీలగ దాటించు రక్షకుడగు జగదీశు డీ సామాన్యనదినుండి నన్ను దాటింపజాలడా!" యని తలపోసి చిత్తమును భగవదాయత్తముచేసి దృఢభక్తిసమేతుడై నదీనీరమున నడుగిడుతఱి వికసితమైన తామరపువ్వొకటి వాసహృదయమున చూపట్టెను. భగవంతునిపాదములు ముద్దిడుకొన నువ్విళ్లూరు భక్తురాలు యీలీల చిరునగవుతో గానుపింప సరోజినీదేవి సనందునిపవిత్రపాదములకు తన వికసితముఖకమలము నర్పించినటు లుండెను. రెండవయడుగునకు మరొక

తామరపుష్పముతోచెను. ఇట్లీపద్మినీకాంతలు సనందుని పాదములను గనుల నద్దుకొని పరమప్రమోదమును సూచించునట్లుపొంగు తరంగమాలికలయుం దడుగడుగునకు తేలియాడదొడగిరి. తమ్మికాంతలను మున్గడించినచు సనందుని యడుగుడమ్ముల్లల్లన నవ్వలికరిగి యాచార్యునిచరణములపై వ్రాలెను. అవింత దృశ్యమును విలోకించి యెల్లరునబ్బురపడిరి. తనశిష్యుని ప్రజ్ఞకు సతసిచి శంకరుడానాడాది సనందుని పద్మపాదుడని పిలుచుదొడగెను. భక్తితత్వసంబంధిలి మహాత్వమును విశ్వాసమందలి మహిమయు నీకథయందిమిడియున్నవి. భక్తునకు భగవంతునిపై గల మక్కువకంటె భగవంతునికి భక్తునిపైగల మక్కువ వేయి మడుంగు లెక్కువయైయుండును. ఎదురు చిక్కపడుటకు సమ్మతింపని భగవంతుడు భక్తుని హృదయమున జిక్కపడుటకు సంతసించును. మకరందముచే నిండిన తామరపుష్పమును వీడి తుమ్మెద చన నిష్టపడనిరీతిని భక్తిసుధా పూరితమైన భక్తునిహృదయకమలమును వీడి భగవంతుడు చననేరడు. తన్ను దేవతలారాధించునట్లు తనభక్తుని జగదీశుడు సేవించుట కుత్సాహపడుననిపద్మ పాదుని కథయందు తెలియవచ్చుచున్నది. సృష్టియంతయు సేవ సలుపు నాతడు భగవంతుడు. సేవయందలి నైహికయాధ్యాత్మిక ప్రాముఖ్యత యనిర్వాచ్యము కదా. నదీనీరముపై కనపించిన కమలపంక్తులు భక్తునిపై భగవంతునకు గల ప్రేమాంకురములుగాక మరియేమగును.

శంకరు డొకనాడు మణికర్ణికాఘట్టమున స్నానముచేసి నదీకూలమున శిష్యులకు తత్వబోధ నేయుచుండ నొకముసలిబ్రాహ్మణు డాతని కడకువచ్చి యిట్లడిగెను. "అయ్యా! నీవు బ్రహ్మసూత్రమునకు వ్యాఖ్యానము వ్రాసియుంటివిగదా అట్లు వ్రాయునపు డర్థమును గ్రహించుటకై నీవెచ్చట కష్టపడవలసి వచ్చెను?" "నీకెచట నర్థము కాలేదో తెలిపినచో బోధపడుతు" నని యతి డుత్తర మొసగెను.

"తదనంతరపత్తౌ, రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యాం" అను సూత్రమును చదివి యర్థము చెప్పుమని యాబాపడు శంకరుని గోరెను. శంకరు డర్థము నెరిగించెను. విప్రుడు మరొకవిధమున దానికర్థము చెప్పెను. ఇరువురకుకు చాల వాద మయ్యెను. అదిగాంచి భక్తాగ్రేసరుడగు పద్మపాదుడు వారికి నమస్కరించి యిట్లనియెను.

"శంకరః శంకరః సాక్షాత్ వ్యాసో నారాయణః స్వయమ్।
తయోర్వివాదే సంప్రాప్తే నజానే కిం కరోమ్యహమ్"

"శంకరాచార్యుడు సాక్షాత్తు శంకరుడే. వ్యాసుడు మనుష్యరూపు దాల్చిన నారాయణుడు. ఈయిరువురికు వివాదము పొసగ, నీదాసుడేమి చేయ జాలును ?"

పద్మపాదునివచనములువిని శంకరాచార్యుడు వ్యాసభగవానుని సహజ పాండిత్యము వెలపడి ప్రస్తుతించెను. వ్యాసుడు సంతుష్టాంతరంగుడై "నీమహా తేజస్సున కచ్చెరువందుచుంటిని. బ్రహ్మసూత్ర వ్యాఖ్యానములతో నూరకొనక జగతియం దద్వైతమతము ప్రచారమొనరింపు" మని శంకరునుద్దేశించి పలి కెను. "మహాత్మా! పుడమియందు నాకుగల యాయువు స్వల్పమైనది; పదునా రేండ్ల ప్రాయములోపున నేనేమి నెఱవేర్పగలను ?" అని శంకరుడు బదులు చెప్పెను. "వత్సా! నీవు చేయవలసిన పనులింకను ముగియలేదు ; వేదవేదాం తములందును న్యాయమీమాంసలందును యోగసాంఖ్య వ్యాకరణములందును నీవలె నాఱితేఱిన వ్యక్తి ప్రపంచమున నెందునులేదు. నేనురచించిన సూత్రములకు భాష్యమును నీవలె నామనసులోని భావము గ్రహించి వ్రాయజాలువా రికెవ్వ రునులేరు. నీవింతలో యిహజీవనము విడుతువేని వేదాంతాదులు దిక్కులేనివై పోవును. అందుచేనీవు మఱి పదునారేండ్లెక్కువ జీవింపుము" వని పలికి వ్యాసుం డంతర్ధానము నందెను. దశోపనిషత్తులకును, గీతావేదాంతములకును భాష్యము గావించి నృసింహతాపినీ వ్యాఖ్యానమొనరించి 'ఉపదేశసహ' స్రాది గ్రంథ ములను రచించి అద్వైత మతప్రచారమున శంకరాచార్యుడు దిగ్విజయము నొందెను.

సింహరు సీజరు నైపోలియను మొదలగు రాజశేఖరులందిన దిగ్విజయము నకును శంకరుడందిన దిగ్విజయమునకును చాల భేదముకలదు. అది భౌతికమును స్వార్థగర్భితమును నైయున్నది. ఇది ఆధ్యాత్మికోద్దేశ సమన్వితమును పరార్థ మైనదియును శాంతియుక్తమైనదియునై యున్నది. యుద్ధమందు పలువురను దును మాడువాడు యోధుడుకాడు. అంతరంగవైరుల దునుము నాతడే యోధుడని పించుకొనును. ఈతనిదిగ్విజయము మహత్తరమైనదై మహిమోపేతమైనది. ఒక పండితుడు మఱొకపండితునికడకరిగి వాదమునకు రమ్మని యడుగ రెండవవా

దందులకు సమ్మతింపవలయు. సమ్మతింపనిచో పండితమండలమున నతడు ప్రతిభా హీనుడనిపించుకొనును. వాదమునందు పలువురను గెలిచినవాడు దిగ్విజయి యనిపించుకొనును. శంకరాచార్యు డిట్టి దిగ్విజయమందినవారి యందగ్రగణ్యుడు. ఈ దిగ్విజయమున నీతడు చేబూనిన యస్త్రము విద్యగాని కత్తులు నుత్తరించు శస్త్రము కాదు. ఈయస్త్రము ప్రయోగమున వెలువడిన విజ్ఞానామృత ధారగాని రక్తధార కాదు. సహస్రాబ్దములనుండి భారతీయులభిలషించిన దిట్టి దిగ్విజయమే.

శంకరాచార్యుడు కాశీపురమున వసించుతఱి కర్మవాదులను, చంద్రోపాసకులను, గ్రహోపాసకులను త్రిపురసేవ్యులను గరుడోపాసకులను తదితర యన్యమతస్థులను నోడించి స్వీయాద్వైతమతము స్థాపించెను. పిమ్మట శంకరాచార్యుడు కాశీ వీడి కురుక్షేత్రమున కరిగి యందుండి బదరికాశ్రమమున కరిగెను. భగవంతుడగు బదరీనారాయణుని దర్శించి శంకరుడందొకమతమును స్థాపించి యథర్వవేదప్రచారమునకై యావేశమందాటితేటిన నందుడనుశిష్యు నామఠమున కధిపతిని గావించెను.

బదరికాశ్రమమునుండి శంకరుడు హస్తినాపురమునకరిగి 'విద్యాలయ' మనుప్రదేశమును జేరుకొనెను. విద్యాలయము విజిలబిందుయను పేరున నాకాలమున మిగుల పేరువడియుండెను. విజిలబిందున కంటియున్న తాడిచెట్లతోపున మండనమిశ్రుడను మహాపండితుడు వసించియుండెను. జ్ఞానకాండ ననుసరించెడు వారి కతడెంతయు విరోధి యైయుండువాడు. శంకరు డాతావును జేరినపుడు మండనమిశ్రుడు పురద్వారమును బంధించి శ్రాద్ధక్రియలచేయుచుండెను. మంత్రబలమున వ్యాసదేవు డచటి కాహూతుడయ్యెను.

పురద్వారములు బంధింపబడియున్నను, శంకరుడు యోగబలమున లోపలప్రవేశించెను. సన్యాసిని చూచినంతనే మండనమిశ్రుడు కోపోద్దీపితుడయ్యెను. వ్యాసు డాతనికోపవేగము నాపివైచి భోజనానంతరమున నిర్వురును వివాదకు గడంగవలెననియు వివాదాంతమున నోడినవారు గెలిచినవారిమతము నవలంబింపవలెననియు వారిని సమ్మతిపజేసెను. మండనమిశ్రుని భార్య తీర్పరియయ్యెను. వివాదమందు మండనమిశ్రుడు పరాజితుడయ్యెను. అందుచే నాతడు సన్యాసాశ్రమమును స్వీకరించెను. పతి సజీవుడై యుండగనే తనకు వైధవ్యము

ప్రాప్తించుట గమనించి యతడు యతియాశ్రమమును స్వీకరించుటకు ముందే వాని యర్ధాంగి బ్రహ్మలోకమున కరుగ నుద్యుక్తురాలయ్యెను. శంకరుడదిగాంచి "నీవు శరీరమునువీడి చనుట తగదు ; నీవు వరాజయమును స్వీకరింపవలె" నని యామెతో పలికెను. అందులకామె సమ్మతించి వాదమునకు దిగి సన్యాసి సర్వశాస్త్రవిశారదుడగుట గాంచి కామశాస్త్రాలాపము గావింపదొడగెను. బ్రహ్మచర్యాశ్రమమునుండియే శంకరుడు సన్న్యాసాశ్రమమును స్వీకరించినవాడగుటచే కామశాస్త్ర మతడు చవిచూచినదైన నెఱుగడు "అమ్మా! నా కాఱునెలలు గడువీయుము. ఆ శాస్త్రమునం దాఱితేఱివత్తు" నని చెప్పి యామెయొద్ద సెలవు గైకొని శంకాచార్యుడు వెడలివచ్చెను.

అట్లు వచ్చుచుండ మార్గమధ్యమున నొకరేనిమృతకాయ మొండు శ్మశానమునకు గొనిపోబడుచుండుటగాంచి తనశరీరమును భద్రముగ గాపాడుడని శిష్యులనలువుర నియోగించి మృతసంజీవనీవిద్యాప్రభావమున శంకరుడు నృపాలుని శవమందు ప్రవేశించెను. రాజు తిరిగి బ్రతుకుటగాంచి యానందభరితులయి వాహకులు రేని నింటికి గొంపోయిరి. తనభర్త వర్తించు తెఱగున శంకరుడు తన యెడ వర్తింపకుండుట రాజ్ఞిగాంచి యెవరో మహాపురుషుడు తన భర్తృ శరీరమందు ప్రవేశించెనని గ్రహించి "ఎచ్చటైన మృతకాయము కానంబడు నో దానిని తగులబెట్టిరం" డని సేవకులకామె యాజ్ఞ యొసగెను. చాల కాలము వెదకి శంకరాచార్యుని శరీరమునుగాంచి శిష్యులెంతచెప్పినను వినక దానిని తగులబెట్టుటకు రాజభటులు సిద్ధపడిరి. రానున్నయాపద దలచి తమ యోగబలమున శిష్యులు పరకాయప్రవేశమొనరించిన యాచార్యుని పాలి కరిగి సంగతియంతయు నాతనికి విన్నవించిరి. తోడనే శంకరుడు రేని దేహమును వీడి తనశరీరమందు ప్రవేశించెను.

"రేని శరీరమున ప్రవేశించిన శంకరాచార్యుడు సంపూర్ణముగా సమరకుని స్వాతంత్ర్యమును చేజిక్కించుకొని యాతని భార్యతోగూడి విషయసుఖములందు మునిగి బాహ్యప్రపంచమెఱుగక యనవరతము నంతఃపురమందే వసించు తనను గుర్తింపక తన యుద్దేశమును మఱచియుండెననియు నాతని శిష్యులలో ప్రథముడైన పద్మపాదుడు మాఱువేషమున గురువుపాలికరిగి యన్యాపదేశముగ నాతని యుద్దేశమును జ్ఞప్తికిదెచ్చి శంకరుని రాజాంతఃపురము

నంశి మరలించెననియు" మరియొకవిధముగా నీవిషయమే యన్యగ్రంథముల యందు చూపట్టుచున్నది. భగవంతునితో సమానుడై భగవంతుడే యనిపించు కొనిన శ్రీశంకరాచార్యుని యెడల నిస్గ్రహించుట యామహాత్ముని పవిత్ర చరిత్రమునకు కళంకము నాపాదించుట. శంకరుడు విషయచింతలయందు మగ్ను డయి యుండెననుట యగ్నికి చెదపట్టిన దనుటయే. సహధర్మచారిణి గూడి నియమమును వీడి యిట్టిచింతయందు మునిగియుండుటయే దోసమైయుండ పర కామినియెడల నిట్లు వర్తించుట యెట్టిదోషమో తెలుపనక్కఱలేదు.

దోషము నాపాదించునది శారీరకమగు క్రియమాత్రమే కాక యంత రంగికమగు దుష్టచింత కూడ నని తత్త్వశాస్త్రమందు చెప్పబడియున్నది. చెడు తలపున నొక్కచూపు పరకాంతపై బఱపుట హృదయమందు వ్యభిచారము సలుపుటయే యగును. వేరునుండియే చెట్టుపుట్టును. పుణ్యపాపముల వేళ్లు హృద యమునసే జనించును. నిరంతరస్మరణముచే బలపడును. మానవజీవనవృక్షము దీనినుండియే పెరుగును. పైకి పాపులుగా దోచక యంతరంగమున ననేకదోషము లలో మనసు నిల్పుచుండువారు మానవసంఘమునందు లెక్కకు మీఱియు న్నారు. పైకి పాపులుగా గనుపించువారివలన సంఘమునకు వాటిల్లు చెట్ట యంత యధికమైనది కాదు. వారి నవలీలగా గుర్తించి ప్రజలు జాగ్రత్తపడు చుందురు. అంతరంగపాపులవలన మనుష్యసంఘమునకు మూడు ననర్థము లిట్టి వని చెప్పనలవిగాదు. మనుష్యచరిత్రను గుఱించి సర్వేశ్వరుడుచేయు తీరుపు మనుజుల గుణనిర్ణయముపై నాధారపడియుండదు. హృదయపీఠమున నాశీ నుడై యనవరతమాతడు మనుష్యగుణనిర్ణయ మొనరించుచుండును. ఐహిక మునను నాముష్మికమునను మనుష్యస్థానమును నిర్ణయించునది భావము. దీనిని బట్టి యోచింప శంకరున కాపాదించిన క్రియ మిగుల గర్హితమైనది. శంకర శరీరము శిష్యులచెంత నున్నను శంకరుమానసము అమరకుని సతికడ నున్నది. శంకరునివంటి మహాత్ముడు యమరుకని భార్యతో దాంపత్యసుఖములందు మునిగి తేలె ననుట సత్యదూరమును పాపసంకలితమునైన యారోపణము. అమరకుని రూపు దాల్పగ శక్తికలదుగాని యతనిభావమును దాల్పగం శక్తి శంకరునకు లేదని యీదోషారోపకు లెఱుగరు. శంకరాచార్యు డప్పటిచూపిన విద్య పరకాయప్రవేశవిద్య గాని పరమానసప్రవేశవిద్య కాదు. రాజ్ఞి యంతః

పురమున వసించిన పురుషుడు అమరకరూపుదాల్చిన శంకరాచార్యుడుగాని యమరకుని భావము దాల్చిన శంకరాచార్యుడుకాడు. అవసరముకొలది రూపు మారినను శంకరుడు శంకరుడే. భావమున నీత డమరుకుడే యైనచో కామ శాస్త్రమును నేర్చికొనవలసిన యవసర మీతని కేలకావలయును. శంకరమానసమునుబట్టి శంకరశరీరముగాని శంకరశరీరమును బట్టి శంకరమానసముకాదు. శంకరుడు శంకరశరీరము కాదు 'నే' ననునది కాయముకాదు. శంకరుడు; శంకరాత్మ. పరమపవిత్రమగు నీయాత్మ రాజుదేహేనిగూడి యామెను మోహ గించి దూషింపదగిన వృత్తికి గడంగెననుట ధర్మవిరుద్ధము.

శారీరికముగ చేయు పాపముకంటె మానసికముగా చేయు పాపమధికమై నది. అధికమైనదయ్యును నేవ్యక్తినిగూర్చి యిది చేయబడుచున్నదో యావ్యక్తి యీకలుషము నెఱుగదు. ఈవ్యక్తిని తనమానసప్రపంచమున కీడ్చుచు నీపాపి దుర్నయమున కొడిగట్టుచున్నను నిందీవ్యక్తి కెట్టి ప్రసక్తియు లేదు. కాని శంకరుని కాపాదించిన దోషమందిట్టివ్యక్తియైన రాజ్ఞికి సంపర్కము కలదు. శారీరిక మానసికములకంటె యీకిల్బిషము మించినది. పతివ్రతయు పావనగుణశోభితయు నైన రాజ్ఞీతిలకము, తుచ్ఛసుఖములకును కామశాస్త్రచర్చయందు తుచ్ఛవిజయము నందుటకును, శ్మశానములందు విరాగియై దిగంబరియై త్యాగదేవుడైన మహాదేవుని యవతారం బని ప్రసిద్ధి కెక్కిన శంకరాచార్యదేవుండు రోత పుట్టించునసహ్యాకరమగు దోషమున కీడ్చె ననుట క్షమింపరాని గొప్పపాపారోపణము.

రాజ్ఞిప్రాపును శంకరుడు చేరుట విద్యార్థియైకాని కామియై కాదు. కామియైన యమరుకుడు మృతినొంది శ్మశానమును చొచ్చెను. అగ్నికణములం దాహుతుడైనను కాకున్నను నతనిమృత్యువు మృత్యువే. ఆతనియాత్మ యెటో యెగసిపోయెను. ఆతని మానసికప్రవృత్తు లతనితోనే యంతరించెను. అవి మరల పట్టునూపి యెద విజృంభించుటెట్లు? ఆమెకడ వర్తించిన అమరుక కాయము అమరుకుడు కాదు. శంకరాత్మకు నిమిత్తమాత్రమైన పవిత్ర నిమిత్తమాత్రమైన శరీరము. పవిత్రకార్యార్థమై చనినపరమాత్మానమునకు పలు గాకిజాలులునా?

శంకరుడు నిజశరీరమును ప్రవేశించునప్పటి కాతనికాయము రాజసేవకులు తగులబెట్టుచుండిరి. శరీరమునందలి కొంతభాగము కాలిపోయెను. సజీవుడైన యాచార్యుడు చివాలున చితినుండి దుమికి సహజగంభీరస్వనమున నృసింహ స్తవమొనరింపదొడగెను. నృసింహదేవుని కరుణామృతము వర్షధారలై శంకరునిపై గురిసెను. శంకరుడు పూర్ణశరీరుడై యాత డెప్పటియట్లారోగ్యవంతు డయ్యెను.

పదంపడి శంకరాచార్యుడు మండనమిశ్రుని యర్ధాంగితో వాదింపనెంచి యామెచెంత కరిగెను. ఎట్టివాదమును ప్రారంభింపక యామె తా నోడిపోయిన ట్లంగీకరించి బ్రహ్మలోకమున కరుగుట కుద్యుక్తయాయెను. తనయోగబలముచే నాచార్యు డామె నాపివైచెను. సరస్వతి నట్లు నిలిపివైచి శంకరుడు శృంగగిరి యను ప్రదేశమున కరిగెను. శృంగగిరి తుంగభద్రానదీతీరమున గలదు. శంకరాచార్యు డచ్చట నొకమఠము స్థాపించెను. శంకరు నాదేశమున సరస్వతీదేవి చిరకాల మందు వసించుచుండెనని ప్రజలు చెప్పుకొనుచుందురు.

శృంగగిరిమఠము విద్యాపీఠ మనుపేరున వరలుచున్నది. ఇందలి శిష్యులు భారతీసంఘీయు లని పిలువబడుచుందురు.

విద్యాపీఠమందు కొంతకాలముండి సురేశ్వరు డను నొకశిష్యునిపై మఠక్రియాదులు మోపి స్వమతప్రచారమునకై శంకరాచార్యుడు బయలుదేఱెను. మల్లా, మరుంధా, మగధ, గయా, యయోధ్య, ప్రయాగ మొదలగు పట్టణములందు స్వమతమును ప్రబోధించి వరుణ, వాయు, భూమి, యుద, కోపాసకులను; బౌద్ధులను తనమతమునందు కలుపుకొనెను. ప్రయాగనుండి శంకరు దుజ్జయినికి జని కాపాలిక భైరవోపాసకుల చేతులజిక్కెను. సుధన్వు డనురాజు శంకరుని రక్షించెను. సుధన్వుడు బౌద్ధమతావలంబి యెల్లపు డాతడు బౌద్ధులచే పరివేష్టితు డగుచుండువాడు. ఒకనాడు భట్టపాదుడు, (శంకరుడు) రాజసభ కరిగి జేని నుద్దేశించి యిట్లనెను.

"మలినై శ్చేన్న సంసర్గో నీచైః కాకకులైః పికః
శృతిదూషకనిర్ హ్రాదైః శ్లాఘనీయ స్తదాభవేత్"

(హే! కోకిలమా! వేదనిందకులును, శ్రుతిదూషకులు నను వాయసముల సంపర్కమునం దుండనిచో నీవు నిక్కముగా ప్రశంసాపాత్ర వయ్యెడిదానవు)

భట్టపాదుని వల్కనందలి యర్థమును గ్రహించి రాజాతని ననేకవిధ ముల పరీక్షించి తనసందేహములను నివారణ మొనరించుకొని యతని మతమును స్వీకరించెను. కాపాలికులు సుధన్వునిసైనికులచే నోడిపోయి శంకరాచార్యునిమతమును స్వీకరించిరి. నిజమతమును వ్యాపింపజేయుటకై శంకరుడు పిమ్మట సౌరాష్ట్రి ద్వారకల కరిగెను. ద్వారకయందు శారదామఠమును స్థాపించి సామవేదమున పండితు డగు విశ్వరూపు డను శిష్యు నామఠమున కధిపతి గావించి యాచార్యు డనంతరము పురుషోత్తమ తీర్థమున కరిగెను. అరుగునపు డాతడు కొంతకాలము కువలయపురమందును భవానీ నగరమందును విడిసి నిజమతమును ప్రచార మొనరించెను. హిరణ్యగర్భ ఆదిత్య అగ్నిహోత్ర గాణాపత్యోపాసకుల నోడించి వారినెల్ల తనమతమున కలుపుకొనెను.

ఆరోజులలో దేశమందంతటను బౌద్ధమతము వృద్ధి కాదొడగెను. సభలయందును, రాజసమ్ముఖమునందును బౌద్ధమతమం దారితేరిన పండితులతో వాదించి గెలుపొంది శంకరుడు భారతదేశమం దెల్లకడలయందును సనాతన ధర్మమహిమను దెలిపి స్వీయమతము నుద్ధరించెను.

బౌద్ధులను బౌద్ధమతమును యిచ్చవచ్చిన తెరగున దూషించి శూన్యమతస్థులనియు నాస్తికులనియు కుతర్కవాదులనియు వారిని పలువురు పలుకుచు నుందురు. తర్కవిషయపఠనమునుగాని పరిశీలనమునుగాని చేయక పలుకువాక్కు తీవ్రమై సత్యమునకు భంగము దెచ్చును. బౌద్ధమతమును గురించవలె బౌద్ధ గ్రంథమును జదివైన చూడక బౌద్ధులను నిందించుట విచారణము సేయకయే యొకని కురిశిక్ష విధించి నట్లగును. బౌద్ధులకు దేవుడు లేడనుట బౌద్ధులపై నింద మోపుటయే. భగవంతుని తొమ్మిదవ యవతార మగు బుద్ధుడు భగవంతుడు లే డని యెన్నడును వాదించి యుండలేదు. బౌద్ధగ్రంథరాజములు మహోత్తరనీతి ప్రబోధనముచే విరాజిల్లుచున్నవి. వీరు భగవంతుని నిరసించిన శ్లోకగ్రంథమును వ్రాసియుండలేదు. ఒకప్పుడు ఆనందు డను తనశిష్యుడు బుద్ధునుద్దేశించి "స్వామీ! భగవంతునిగురించి ముచ్చటింపుడని వేడెను. ఇంచుకనే పూరకొని బుద్ధదేవు డిట్లనియెను. ఒకడు వనమున కరిగెను. అతడందు సంతోషముగా విహరించుచుండెను. అట్లాతడు విహరించుచుండ నెందుండియో యొకతీవ్రమగు బాణమువచ్చి వానిరొమ్మునందు గ్రుచ్చు

కొనెను. తోడనే యాతడు నేలగూలెను. అపుడా కన్నెహితుడు వానిచెంతకు పరుగుపరుగున వచ్చెను. గాటమగుగాయముచే బాధపడుచు నేలగూలియున్న యాతడు నచ్చెలితో నెగులుగొలుపు బాణమును వెలికి దీయు మని వేడునా? లేక బాణప్రయోగము చేసినవా డెవరు? ఆతని యూరేది? అత డేజాతివాడు? వాని నామధేయమేమి. అత డేరంగుమనిషి. వానివయసెంత! వాని యుద్యోగ మేమి? యీయమ్ము దేనితో చేయబడెను? ఉక్కుగాని యినుముగాని మరి యేయొక్క లోహముగాని యీయమ్మునసం దెంత యున్నది. దీని నిర్మాణవిధి యేమి? దీని నంటియున్న చర్మ మే జంతుచర్మము? అంటినారి యెట్టిది? మున్నగు ప్రశ్నలు వేయునా?

ఈప్రత్యుత్తరము నని యందలి యంతరార్థమును గ్రహించి శిష్యు డూరకుండెను. దురంతములగు దుష్టచింతలు యెల్లప్పుడు మనస్సున పీడించుచుండ మనుజుని హృదయము పై కెట్లు మరలును? శుద్ధిలేని పూజామందిరమున భగవంతుడు ప్రవేశించుటకు వెనుదీయును. ఇంద్రియములకు వశుడై మసలుచు చెడు తలంపు లెప్పుడు మానసమున పైబడి నాట్యము నొనరింపనిచ్చు పురుషుడు భగవంతునందెస మనస్సు నెట్లు త్రిప్పుకొనగలుగును. వాడియైనశరము శరీరమున గ్రుచ్చుకొనియుండ నిటువంటి సందేహప్రశ్నలు కేవల బుద్ధిహీనుడు నడుగును. తొలుత నీతి సంబంధ నిబంధనలను పాటించుట మానవుని ప్రధానకర్తవ్యమని బుద్ధదేవుడు వాకొనెను గాని భగవంతుడు లేడని యెన్నడును బోధింపలేదు. మానసికశుద్ధి యత్యావశ్యకమనియు, యది వశపఱచుకొనని మానవుడు జగదీశు నందజాలడనియు హిందూధర్మము ఘంటాపథముగా వాక్రుచ్చుచున్నది. "బాహ్యవిజృంభణము నిన్ను రక్షింపనేరదు. నీ యంతరంగమున దట్టమయిన యరణ్యముకలదు" అని బుద్ధదేవుడు వాకొనెనని ధమ్మపదమను పాళీభాషయందలి యుద్గ్రంథమున గలదు.

మతకర్తలు మహాత్ములయ్యు మతములు మహత్తరములయ్యు మతావలంబులు తెలియక ధర్మవిరుద్ధ కార్యములపై పడుచుందురు. ధర్మావలంబులమని చెప్పుకొనుచు ధర్మవిరుద్ధము నాచరించువారు ప్రతియుగమందు ప్రతిదేశమందును గలరు. ఇట్టివారివలన ప్రపంచమునకు గొప్ప యనర్థము వాటిల్లుచుండును. ఈయనర్థమును బాపుటకయి యొక మహాపురుషుడు పుట్టుచుండును. మానవు

లలో నుత్పన్నములగు విప్లవమును మాపుచేయుట కపుడపుడు పుట్టుచుందునని భగవంతుడు గీతయందు చెప్పియుండెను. శ్రీచైతన్యస్వామి యుద్భవించి వంగదేశమున వైష్ణవమతమును ప్రచార మొనరించెను. బలులు మున్నగు దురాచారములు ప్రబలినపుడు హిందూదేశము నుద్ధరించుటకై గౌతమ బుద్ధు డుదయించెను. ఒకనాటి సదాచారములు మరొకవేళ దురాచారములు కావచ్చును. ఒకప్పుడు గొప్పవని చెప్పబడు క్రియలు మరొకప్పుడు నీచక్రియలుగ పరిగణింపబడుట కలదు. కాలము ననుసరించి చేయబడు మార్పులు యేమతమునకైన కళంకము దెచ్చుటకు బదులు జీవకళనే యొసగును. బుద్ధదేవుడు, ఆలీ, యేసు, శంకరుడు, సాంఖ్యముని, మహమ్మదు, చైతన్యుడు వీరెల్లరు వేఱురూపములు దాల్చిన యొకేయుద్భవశక్తి. ఈశక్తి యొకే దేశమునకుగాని యొకేఖండమునకుగాని చెందిన ప్రత్యేకమైన హక్కుకాదు. యేసు నారాధించుటకు భారతీయునకును శ్రీకృష్ణునిగొలుచుట కాంగ్లేయునకును మహమ్మదును సంస్మరించుటకు చైనావానికిని, బుద్ధుని కీర్తించుట కమెరికా వానికిని సంపూర్ణమైన హక్కుకలదు. క్రైస్తు తనవాడని చెప్పుకొనుటకు ప్రతి భారతీయునకు నధికారము కలదు. రాముడు తనవాడని చెప్పుకొనుటకు ప్రతి యాంగ్లేయునకును హక్కు కలదు. బుద్ధభగవానునకు పగతుడై శంకరాచార్యుడు పుట్టలేదు. ఒకరిపనికొకరు తోడుపడిన ప్రాణమిత్రులు. కాని వీరొకరికుత్తుక నొకరు నరుకుకొను బద్ధవైరులుకారు. దురాచారములను మాపి కాలోచితములగు మార్పులు చేయుటకును మతమునకు నూతనవికాసము దెచ్చుటకును బుద్ధభగవానుడు పూనుకొనెను. సమయోచితములగు మార్పులను చేయుటకును దురాచారములను సమయించుటకును మతమునుపేరు పెట్టుకొని పైశాచికకృత్యములను చేయు జాతులను దణిమి వేయుటకు శంకరాచార్యుడు నడుముకట్టెను. తనయుద్దేశము నెఱవేర్చుకొనుటకయి పలువురు పండితశ్రేష్ఠులతో శంకరుడు వాదము సలుపవలసి వచ్చెను. అనేకసభలయందు పాల్గొనవలసి వచ్చెను. శంకరు డెల్లచోటులయందును విజయము గాంచెను.

హిందూబౌద్ధమతములు పరస్పరవిరోధములైన మతములు కావు. బుద్ధశంకరులు పరస్పర విరోధులగు మహావ్యక్తులు కారు. బుద్ధుడు హిందూమతమునకు విరోధియని తలచుటచే బౌద్ధమతము మనదేశమం దించుమించుగా

నడుగంటిపోయెను. ఆకాశమునుండి పడు వర్షబిందువులు వేఱైనను యొకేసాగరమున చేరుకొనునట్లు యెన్ని దేవుళ్లకు నమస్కరించినను యెన్ని మతములను మానవుడవలంబించినను యొకే భగవంతునకే యాప్రణామము చెందును. బౌద్ధమతమునందు తలయెత్తిన మాధ్యమును రూపుమాపుటకును ధర్మ పునరుద్ధరణ మొనరించుటకును శంకరాచార్యుడు పూనెను.

సమాధియందుండి యొకనాడు శంకరుడు తన తల్లి మనసునందలి భావమును గ్రహించి యోగశక్తిప్రభావమున నామెకడ కరిగి యామె పదములకు ప్రణమిల్లెను. చాలాకాలమునకు వచ్చిన తనయుని గాంచి యామె పరమానందభరితురాలై కుమారునుద్దేశించి "తండ్రీ నేను వృద్ధురాలనైతిని. నేనీ పుడమియందు దిక తనువు నిలుపనోల్లను. నాకు సద్గతి ప్రసాదింపు" మనియెను. శంకరుడు కైలాసపతిని స్తవ మొనరింప వెంటనే శంకర సేవకు లరుదెంచిరి. కైలాసమున కరుగుట కామె యిష్టపడక విష్ణుసందర్శన మభిలషించెను. శంకరుడు శంఖచక్రగదాపద్మధారియు వనమాలావిరాజితుడును శ్రీవత్స లాంఛనుడును పీతాంబరధారియు నగు శ్రీహరిని స్తుతింప నా మధుసూదనుండు ప్రీతుండై ప్రత్యక్షమై శంకరుని తల్లిని వెంటగొని విష్ణులోకమున కరిగెను. పరిశీలించిన యీయుదంతమున శంకరుని మాహాత్మ్యమేగాక యాతని జనని యద్భుతశక్తికూడ చూపట్టగలదు. మనపురాణములన్నియు నిట్టి యద్భుత శక్తిని నిరూపించుచున్నవి. జగదీశునిశక్తిని హృదయంగమ మొనరించుకొని తనజీవాత్మను పరమాత్మయందు చేర్పజాలు శక్తి యామె సంపాదించెను. భగవంతుడు సర్వశక్తిమంతుడు. సర్వాంతర్యామి. సర్వజ్ఞానసంపన్నుడు. భగవంతుని శక్తులను మనన మొనరించి వాని ననుసరించి వర్తించు మానవుడు భగవంతుని స్థితిని పొందజాలును.

యోగప్రభావమును సాయముగొని తల్లికి శంకరుడంత్యక్రియలు నెఱపి పురుషోత్తమ మను ప్రదేశమున కరిగి ఋగ్వేదప్రచారమునకై గోవర్ధన మను పురమున నొక మఠమును స్థాపించెను. ఋగ్వేదమును దాటి నేర్చిన పద్మపాదు నామఠమున కాచార్యునిగానియమించి శంకరు డనంతరము మధ్యార్జునమను ప్రదేశమున కరిగెను. అచ్చోటికి పోవుతఱి మార్గమధ్యమునందున్న ప్రభాకరుడను నొక బ్రాహ్మణుని యింట కొంతతడవాత డాగెను. ప్రభాకరున కొక తనయుడు

కలడు. ఆబాలుడు మాటలాడక యనవరతము మౌనముద్ర దాల్చియుండెను. మూగవానివలె నున్న తమ కుమారుని స్థితికి తల్లిదండ్రులు మిగుల వగచి యాతని కెన్నేని వైద్యములు చేయించిరి. కాని కార్యము లేకపోయెను. శంకరుడు మిగుల ప్రజ్ఞావంతుడని తెలిసికొని ప్రభాకరుడు తనతనయుని దురవస్థను మాన్పుమని యాతని వేడెను. ప్రభాకరునియెడల కనికరించి శంకరాచార్యుడు బాలకునిచే మాటలాడించెను. సన్యాసి ధర్మమును స్వీకరింపుమని శంకరుడు బాలకుని కాజ్ఞాపించెను. బాలకుడు పదపడి 'హస్తామలకు' డను పేరున ప్రసిద్ధి గాంచెను. అతడు రచించిన శ్లోకములుకూడ 'హస్తామలకము' లని గణుతి కెక్కెను. పిదపశంకరుడు అహోబల మనుప్రదేశమునకు జని యచటి నృసింహోపాసకులను అద్వైతవాదులను గావించి కైవల్యగిరి దాటి అనంతరము కాంచీసీమ కరిగెను.

కాంచీసీమాధిపతి బౌద్ధుడు. ఆతనిసభయందు బౌద్ధమత పండితు లెందఱో కలరు. మతవిషయమున తనతో వాదమునకు రండని శంకరుడు హిమశీతలుని యాస్థానపండితులను గోరెను. అందులకా నరపతి మిగుల మండిపడి శంకరునకు తగినశాస్తి చేయింపదలచి బౌద్ధధర్మమందు ప్రజ్ఞావంతులగు పండితుల నెందఱినో రావించి వారితో వాదించి గెలుపొందగలిగితి రేని గెలుపొందుడు. పరాజితులు దండనార్హులయ్యెదరని యాచార్యునితో పలికెను. శంకరుడు బౌద్ధపండితులతో వాదించి వారిని చిటికెలో నోడించివైచెను. పండితులు తమ పరాజయము నొప్పుకొనిరి. పరాజితులయిన పండితులకు రాజు సముచితముగ శిక్షవిధించి శంకరమతమును తాను స్వీకరించెను. 'శివకాంచీ' యను ప్రదేశమునకు సమీపమందలి శ్మశానవాటికలో గల శివాలయద్వారము చెంతనున్న రాతిపలకమీదను భగవతీనదీతీరమందలి దేవమందిరసమీపమున నున్న శిలాఫలకముమీదను, శంకరుని యీ విజయోదంతము వ్రాయబడియున్నది. కాంచీనగరమందలి యితరమతావలంబులను గూడ నోడించి వారినందఱను దనశిష్యులను గావించుకొని శివకాంచీ విష్ణుకాంచీ యను రెండుపురములను ప్రతిష్ఠించి పిమ్మట శంకరాచార్యుడు తిరుపతి కరిగి యచటి బౌద్ధవిద్వాంసుల నోడించి పిదప నతడు మధ్యార్జునమున కరిగెను. ఇదియే రామేశ్వరమని జగత్ప్రసిద్ధి జెందిన పుణ్యప్రదేశము. యజుర్వేదప్రచారమునకై యాచార్యు

డందు శృంగగిరి యను మఠమును స్థాపించి యావేదమందు మిగుల ప్రజ్ఞాశాలి యగు తనశిష్యుని పృథ్వీధరు నామఠమున కధికారి కావించెను.

అనంతరమాతడు చిదంబరమున కరిగి కొలదిదినములందు విడిసి యం దుండి యనంతశయనమను ప్రదేశమున కరిగెను. అనంతశయనము వైష్ణవుల కాటపట్టు. ఆటు తెగల వైష్ణవులాతావున శంకరుని గలసికొని యాతనితో వాదమునకు డీకొని యపజయమునొంది శంకరమతమును స్వీకరించిరి. ఆచార్యు డందుండి కామరూపతీర్థమున కరిగెను. అభినవగుప్తుడను సుప్రసిద్ధపండితు డచట వసించుచు శంకరునిగాంచి యాతనితో వాదించి యోడిపోయెను. తన పరాజయమును సహింపజాలక శంకరున కెగ్గుచేయువలెనని యాతడు నిశ్చయించు కొనెను.

కొన్నిరోజులు గడచినపిదప శంకరునకు తీవ్రమయిన భగందరరోగము (మర్మస్థానమందలి వ్రణము) సంక్రమించెను. ఆచార్యునిమీది కోపమున నభి నవగుప్తుడే మంత్రప్రయోగమున నావ్యాధి నాతనికి కలిగించెను. ఆచార్యుని శిష్యులలోముఖ్యుడగు పద్మపాదుడు సిద్ధమంత్రమును జపించి గురుదేవునివ్యాధి నివారణమొనరించి యాతెవులు నభినవగుప్తునిమీదికి ద్రిప్పివేసెను. త్రిప్పి టయు నాతుంటరి తోడనే మరణించెను.

ఒకనాడు శంకరుడు బ్రహ్మపుత్రానదికి స్నానమొనరింపబోయెను. కొంత మంది యాత్రికులందు జేరి తమలో తా మిట్లు చెప్పుకొనుచుండిరి. "పృథ్వి యందు మనమెన్నో ప్రదేశములు చూచితిమి. అన్నిచోటులలో జంబూ ద్వీపము ముఖ్యమైనది. భారతవర్షము సర్వశ్రేష్ఠమైన దేశము. భారతదేశ మందు కాశ్మీరసీమ ప్రాముఖ్యమైనది. సర్వవిద్యాప్రకాశినియగు శారదాదేవి యచట విరాజిల్లుచున్నది. వేదాంతమునకు సమమగు శాస్త్రములేనట్లు మేరు వుతో తుల్యమగు పర్వతములేనట్లు తత్వజ్ఞానమును మించిన తీర్థములేనట్లు హరినిబోలు దేవుడులేనట్లు కాశ్మీరముపగిది ప్రదేశము పుడమియందు లేదు" యాత్రికుల పలుకులువిని వెంటనే శిష్యులను వెంటగొని శంకరుడు కాశ్మీరము నకు పయనమయ్యెను. మార్గమధ్యమున శ్రీ శంకరుడు గౌరపాదస్వామిని గాంచెను. ఆచార్యుని పిలచి స్వామి "శంకరా! నీవు భాష్యమును రచించితివని విని మిగుల నానందించితిని. నేనువ్రాసిన 'మాండూక్యోపనిషత్ కారిక' కు నీవు

టీకను వ్రాసితివని వింటిని. నీభాష్యమును వినుటకయి నీకడకు రాదలచుచుంటిని." అనియెను. ఆనుడువులు విని శంకరుడు తానువ్రాసిన టీకను స్వామిజీ చేతులయందు పెట్టెను. ఆమూలాలము భాష్యమును చదివి పరమానందభరితుడై స్వామి శంకరు నెంతయు పొగడి వెడలిపోయెను. శంకరుడు పిదప భూతలస్వర్గమగు కాశ్మీరమున కరిగెను.

ఒకనాడు కాశ్మీరమందలి విద్యాభద్రాసనమును శంకరాచార్యుడధిష్ఠింపబోవుచుండ శారదాదేవి యాతనితో "శంకరా! నీశరీరము మలినమైయున్నది. ఈపీఠము నధిష్ఠింపవలెనన్న దేహశుద్ధి యావశ్యకము. నీవు కామకళ కామశాస్త్రముల నభ్యసించితివి కావున నీదేహ మపరిశుభ్రమయినది" అనియెను. "దేవీ! పుట్టిననాటనుండియు నేనెన్నడును యీశరీరముతో కామక్రియనుదేసియుండలేదు. ఇతరశరీరము కావించిన క్రియవలన నీకాయము మలినము కాజాలను. తొలిజన్మమున శూద్రుడై జనియించి నరుపుట్టువున నాతడు బ్రాహ్మణుడై పుట్టుచో వేదమున కాతడధికారి కాజాలడా?" అని శంకరు డుత్తరమొసగెను. పీఠమునధిష్ఠించుటకై సరస్వతి యాతని కపు డనుమతి యొసగెను. అచ్చట కొన్నిదినములుండి యాచార్యుడు కేదారనాథమున కరిగెను.

వేదవ్యాసుని వరముకతన శంకరుడు ముప్పదిరెండేండ్లు జీవించియుండి కేదారనాథపర్వతసన్నిధానమున నాచార్యుడు భౌతిక శరీరమును పరిత్యజించెను. ఈయల్పకాలములోనే యాతడు సర్వశాస్త్రపారంగతుడై బౌద్ధమతమును ఖండించి యాస్తికమతమునుద్ధరించి బ్రహ్మసూత్రభాష్యమును, దశోపనిషత్ భాష్యమును, శ్వేతాశ్వతరోపనిషత్ భాష్యమును, భారతైక పంచరత్న భాష్యమును, ఆనందలహరి, మోహముద్గరసాధనపంచక, యతిపంచక, యాత్మబోధ అపరాధభంజన, వేదసారశివస్తవ, గోవిందాష్టక, యమకష్టపదీస్తుతి, మున్నగు గ్రంథములను రచించి జగతియం దక్షయకీర్తిని గాంచెను. ఈతడు దీర్ఘజీవియై యుండుచో యింకను నెట్టిప్రజ్ఞ చూపగలిగియుండునో తెలుపజాలము.

శంకరునకు ముందును వెనుకను ప్రపంచమందెందఱో మహాపురుషులు పుట్టిరి. గిట్టిరి. మేధాసంపదయందు శంకరునితో సరిపోల్చదగు వ్యక్తి ప్రపంచమందింకను పుట్టియుండలేదు. శంకరుని మేధస్సు సూర్యుని తేజస్సునకంటె ప్రకాశమానమైనది. సూర్యకాంతిని మేఘములడ్డుట కలదు. సూర్యుని రాహు

కేతువులు భ్రమింగుటయునుకలదు. సూర్యునివదనమున నల్లమచ్చ లుండుటయును గలదు. శంకరుని మేధస్సున కీలోపములేవియును లేవు. ప్రథమియం దీమహా నీయుడు పుట్టిననాటనుండియు నీతనిశక్తి వృద్ధిగాంచెను. సామాన్యబాలు రక్షరములు పోల్చజాలని వయస్సునందే యాతడు వాదప్రతివాదములు సలుపుచుండునంతటి పండితుడయ్యెను. శంకరుడు వేదయుగములోని వాడుకాడు. పురాణయుగములోని వాడుకాడు. చరిత్రయుగమునందు కొలది శతాబ్దములకుముందు మనదేశమందు వర్ధిల్లిన మహానుభావుడు.

శంకరభగవానుని "మోహముద్గరము" భారతరత్నములం దమూల్యమైనది.

(1) మూఢ జహీహి ధనాగమ తృష్ణాం—కురు తనుబుద్ధిం మనసి వితృష్ణాం।
యల్లభసే నిజ కర్మోపాత్తం, విత్తం తేన వినోదయచిత్తం॥

హేమూఢా! ధనమునెడల కాంక్షను వీడుము; అల్పమతీ! మనసును వైరాగ్యముచే నింపుము. నీకర్మఫలమున చేకూరుధనముతో సంతోషింపుము.

(2) కా తవ కాంతా, కస్తేపుత్రః, సంసారోఽయమతీవ విచిత్రః।
కస్యత్వం వా కుతఆయాతః తత్వంచింతయ తదిదం భ్రాతః॥

నీభార్య యెవరు? నీపుత్రు లెవరు? ఈ మాయసంసారము మిగుల చిత్రమైనది. ఎందుండి వచ్చితివో నీవెవ్వరివాడవో సోదరా! యోచింపుము.

(3) నళినీదళగతజల మతితరళం తద్వజ్జీవన మతిశయచపలం।
విద్ధి వ్యాధి వ్యాలగ్రస్తం, లోకం శోకహతంచ సమస్తం॥

తామరాకులోని నీటిబొట్టు యెట్లు చంచలమైనదో జీవనముకూడ నట్లే చంచలమైనది. వ్యాధివిషధరము నోట గఱచుటచే ప్రపంచమంతయు శోకహతమై యున్నది.

(4) అంగం గలితం పలితం ముండం దంతవిహీనం జాతం తుండం।
కరధృతకంపిత శోభితదండం తదపినముంచత్యాశాభాండం॥

తల నరసినది. శరీరము శిథిలమైనది. నోట పండ్లూడినవి. చూచుటకు ముఖము అసహ్యముగా నున్నది. చేత కఱ్ఱ పుచ్చుకొని మనుజుడు వడకుచు నడచుచుండెను. అయినను నతడు తన యాశను విడువజాలకపోవుచుండెను.

(5) దినయామిన్యౌ సాయంప్రాతః, శిశిరవసంతౌ పునరాయాతః।
కాలః క్రీడతి గచ్ఛత్యాయు, స్తదపి న ముంచత్యాశావాయుః॥

పగళ్లును రాత్రులును సాయంకాలములును, ఉదయములును శిశిరమును వసంతమును కడచుచున్నవి కాలమిట్లే యాటలాడుచుండును. కావున ఆయువు క్షీణించుచుండును. అయినను మానవుడు ఆశావాయువును త్యజింపడు.

(6) యావజ్జననం తావన్మరణం, తావజ్జననీజఠరే శయనం।
ఇతి సంసారే స్ఫుటతర దోషః, కథమిహ మానవ తవసంతోషః॥

జన్మలున్నంతకాలము మరణము లుండును. జనని జఠరమున మరల పరుండవలసివచ్చును. ఈసంసారము దుఃఖమునకు యిల్లు. కావున ఓమానవుడా ఏల సంతోషపడెదవు ?

(7 సురవరమందిర తరుతలవాసః, శయ్యాభూతల మజినం వాసః।
సర్వపరిగ్రహ భోగత్యాగః, కస్యసుఖం న కరోతి విరాగః॥

దేవమందిరావాసము తరుతలవాసము భూతలశయనము, మృగచర్మ వసనము సముదయ పరిజన పరిహారము భోగత్యాగము, ఇట్టి విరాగమున సుఖ మెవరికుండదు ?

(8) అష్టకులాచల సప్తసముద్రాః, బ్రహ్మపురందర దినకరరుద్రాః।
నత్వం నాహం నాయంలోక, స్తదపి కిమర్థం క్రియతేశోకః॥

కులపర్వతము లెనిమిది సముద్రము లేడు బ్రహ్మ పురందరుడు రుద్రుడు సూర్యుడు నీవు నేను యీవిశ్వమంతయు స్వప్నము. అయినను నీవు శోకమం దేల మగ్నుడవగుదువు ?

(9) బాలస్తావత్ క్రీడాసక్తః, తరుణస్తావత్ తరుణీరక్తః।
వృద్ధస్తావత్ చింతామగ్నః, పరమే బ్రహ్మణి కోఽపి నలగ్నః॥

బాలకుడై యున్నంతకాలము మనుజుడు ఆటలందాసక్తి చెందియుండును. యౌవనమున తరుణిమొదల ననురక్తుడైయుండును. వార్ధకమున చింత యందు మగ్నుడైయుండును. పరబ్రహ్మయందు మగ్నుడై యుండు టెపుడు ?

(10 యావద్ విత్తోపార్జనశక్తి, స్తావన్నిజపరివారోరక్తః।
తదనుచ జరయా జర్జరదేహే, వార్తాంకోఽపి నపృచ్ఛతిగేహే॥

మానవుడు ధనమును సంపాదించునంతకాలము సేవకులు వశవర్తులై యుందురు. ముసలితనమున శరీరము జీర్ణింపగానే యింటియందాతని నెవ్వరు పిలువనైనను పిలువరు.

(11) అర్థమనర్థం భావయనిత్యం, నాస్తి తతః సుఖలేశః సత్యం।
పుత్రాదపిధనభాజాం భీతిః, సర్వత్రైషా విహితా రీతిః॥

'అర్థ మనర్థము' అను భావ మున్నంతకాలము లేశమాత్రము సుఖముండదు. ఇదినిక్కము. ధనమందింతుకంతయు సుఖములేదు. ధనమునెడల మక్కువగలవానికి కొడుకువలనకూడ భీతి కలుగుచుండును. అన్నియెడల నీరీతి విహితమైయున్నది.

(12) మాకురుధనజనయౌవనగర్వం, హరతినిమేషాత్ కాలఃసర్వం
మాయామయమిద మఖిలంహిత్వా, బ్రహ్మపదం ప్రవిశాశువిదిత్వా॥

ధనజనయౌవనముల యహంకారమును త్యజింపుము. నిమేషకాలములో నంతయు నశించిపోవును. మాయామయమైన యీసంసారమును పరిత్యజించి బ్రహ్మపదమున నాశ్రయముగొనుము.

(13 శత్రౌమిత్రేపుత్రేబన్ధౌ, మాకురుయత్నం సమరేసంధ్యౌ।
భవసమచిత్తః సర్వత్రత్వం, వాంఛస్యచిరాద్ యదివిష్ణుత్వమ్॥

శత్రువులనియు మిత్రులనియు పుత్రులనియు బంధువులనియుసంధియనియు యుద్ధమనియు యోజింపకుము. విష్ణుపదముచేర వాంఛింతువేని నిరంతరము సర్వభూతముల యెడల సమభావము గలిగి ప్రవర్తింపుము.

(14) త్వయిమయిచాన్యత్రైకోవిష్ణుః, వ్యర్థంకుప్యసి మయ్యసహిష్ణుః।
సర్వంపశ్యాత్మన్యాత్మానం, సర్వత్రోత్ సృజ భేదజ్ఞానం॥

నీయందును నాయందును, సర్వప్రాణులందును నొకేహరి యున్నాడు. ధైర్యసాహసములను వీడి వృథాయేలకోపగింతువు. నీయాత్మయందనారతము సన్యాత్మలనువిలోకింపుము. అన్నిప్రాణులయెడలను భేదభావముపరిత్యజింపుము.

(15) కామం క్రోధం లోభం మోహం, త్యక్త్వాత్మానం పశ్యహికోఽహం।
ఆత్మజ్ఞానవిహీనామూఢా, స్తే పచ్యంతే నరకనిగూఢాః॥

కామక్రోధలోభమోహములను పరిత్యజింపుము. 'నేనెవండను' అని యొకమారు ప్రశ్నింపుము. ఆత్మజ్ఞానవిహీనులైన మూఢజనులు దుస్తరనరకమున మునుంగుదురు.

(16) తత్త్వంచింతయ సతతంచిత్తే, పరిహరచింతాం నశ్వరచిత్తే।
క్షణమిహ సజ్జనసంగతి రేకా, భవతిభవార్ణవ తరణే నౌకా॥

పరమాత్మతత్త్వమును సదా చింతన మొనరింపుము. అనిత్యమైన ధనము నెడలగల చింతను వీడుము. సజ్జనసాంగత్యముచేయుము. క్షణకాలపు సజ్జన సాంగత్యము భవసాగరమును తరించు నోడయగును.

(17) షోడశపజ్ఝటికాభిరశేషః, శిష్యాణాంకథితో౽భ్యుపదేశః;
యేషాంనైషకరోతివివేకం, తేషాం కః కురుతామతిరేకం॥

పదునాఱుశ్లోకముల యందు శిష్యులుపదేశమందిరి. ఈయుపదేశముల మూలమున నెవరికి వివేకము కలుగదో, యెవరుగాని వారికేమియు బోధింపజాలరు.

౨౫

# కల్యాణదాసుఁడు



సీ. అఖిలభూతములందు నాత్మరూపంబున
నీశుండు హరియుండు నెల్లప్రొద్దు
బుద్ధ్యాదిలక్షణంబులఁ గానఁబడును మ
హాత్మేవనీయు డహర్నిశంబు
వందనీయుఁడు భక్తవత్సలుండత్యంత
నియతుడై సతతంబు నియతబుద్ధి
నాత్మరూపకుఁడగు హరికథామృతమును
గర్ణపుటంబులఁ గాంక్షనీరఁ

గీ. గ్రోలుచుండెడు ధన్యులుకుటిలబహుళ
విషయమలినీకృతాంగముల్ వేగవిడిచి
విష్ణుదేవుని చరణారవిందయుగము
కడకు జనుదురు సిద్ధంబు కౌరవేంద్ర."

వైరాగ్యమే ముక్తిసాధనమని పలువురయభిప్రాయము. పుట్టువునుండి ముక్తినపేక్షించు మానవులు ప్రపంచమునం దెందేనియుండిరన్నచో భారతసీమయందే యున్నారని నొక్కి చెప్పవచ్చును. దేవుడులేడని దేవమందిరములను పడగొట్టించువారును, దేవుడున్నాడని పైకంగీకరించుచున్నను దేవుడులేని యట్లే ప్రవర్తించుచు హృదయసీమనుండి నిశ్శేషముగ జగదీశ్వరుని తరిమివేసినవారును ప్రపంచమున పెక్కు తావులయందున్నను, దైవభక్తిదైవభీతిగలిగి ప్రవర్తించు మహనీయులు నేటికిని మనదేశమందు కలరు. తత్త్వచింతధర్మనిష్ఠలు భారతీయుని జీవనమునుండి యింకను సదృశ్యముకాలేదు. అయినను ముక్తివిషయమున కొందఱి కొందఱియందు సరికాని అపోహలు గోచరించుచున్నవి. వైరాగ్యమే ముక్తిదాయకమని వీరియభిప్రాయము. వైరాగ్యము మహత్తరమ్మైనదేకాని పుట్టినింటనున్నపుడే మానవుడు కాషాయగుడ్డలను ధరింపవలెనని

మనమతమెన్నఁడును విధించియుండలేదు. ఆయా వయస్సుల కార్యావిధులను సనాతనధర్మ మేర్పాటుచేసినది. ఒకేజీవనమున ప్రత్యేకసమయములయందు మానవుఁ డవలంబింపవలెసినరీతుల నది నిర్దిష్టముచేసినది. కల్పసూత్రములు చెప్పెడి నాల్గువిధములగు నాశ్రమములను మనజుఁడు క్రమముగా నాచరింప వలసియున్నది. ప్రత్యేకసమయమునందు ప్రత్యేకాశ్రమసంబంధనలను పాలించు నాతఁడు సముచితమగు భౌతికజీవనమును గడపి, యారోగ్యము, ఆనందము, పరిపూర్ణాయువు మొదలగునవి బడసి పడంపడి ముక్తి సిద్ధినందును. సన్న్యాసాశ్రమమే ముక్తికోరువారికి దిక్కని తలపరాదు. ఒక్కవైరాగ్యమే ముక్తి సాధనమని యెంచరాదనియు గృహస్థుడై సంసారయాత్ర గడపుచు విహిత ధర్మముల నాచరించుచు ముక్తినొందగలఁడనియు తెలుపుటకు మనచరిత్రలును మన తత్త్వశాస్త్రములును ననేకదృష్టాంతములు చూపుచున్నవి. గృహస్థుడై యుండి పురుషుడెన్నని ప్రాపంచికవిధులను నెఱపవలసియున్నది. ఈవిధులు భక్తికి సంబంధించినవికావు. దైవచింతకు సంబంధించినవికావు. అయినను నవి నెఱవేర్చుటచేతనే ముక్తిలభించునని శాస్త్రములు చెప్పుచున్నవి.

సనాతనమతమునకు పట్టుకొమ్మలగు వేదములయందు గృహస్థుని దైనిక జీవనమునకును, ప్రాపంచకధర్మనిర్వాహణమునకును కావలసిన పరిజ్ఞానము విశేషముగా కానుపించుచున్నది. గంధర్వవేదము నాయుర్వేదము మొదలగు వేదములు విరాగులకొఱకు కేర్పడినవా? అవి కేవలము గృహస్థులకొఱకు వ్రాయబడినవి. గృహజీవనమునకు వలసినయంశము లుపనిషత్తులయందు పెక్కులు కానవచ్చుచున్నవి. ఉపవేదములప్రయోజనము సంసారధర్మము నెఱపువారికే గాని సన్న్యాసులకొఱకుకాదు. ధర్మశాస్త్రములప్రయోజనము విశేషముగా గృహస్థులకే గదా. ఈశాస్త్రములకు పునాదులు వేసినవారు వశిష్ఠయాజ్ఞవల్క్యాదిమహాఋషులుకారా! ఈవేదవేదాంగములును శాస్త్రములును గృహజీవనముగడపువారికై యుద్దేశింపలేదా? మనప్రాచీనదేవాలయములను చూడుఁడు. ఇవి యెవరికొఱకు నిర్మింపబడినవి? విరాగులకు నిర్గుణోపాసకులకు దేవమందిరావసరము లేలకావలయును. ఆకాశము గోపురము గను, దిక్కులు గోడలుగను నక్షత్రములు దేవాలయదీపములుగను భావించి పరమేశ్వరుని గీర్తించి యొడలు మఱచి నృత్యమొనరించు విరాగులకు రాతి

కట్టడములేల? సగుణోపాసకుల కాలయము లవసరము లు. గృహజీవనము నెటుపు సాధారణ సంసారులవలె యుండు గదా సగుణోపాసకులు గోచరించుట. ఈదేవాలయములు కేవలము భజనలకును ఉపాసనలకును ప్రార్థనములకును పూజలకును వినియోగమయ్యెనా? ఆయాలయమంటపములందును ఆలయప్రాంగణములందును యెన్నెన్ని గృహస్థాశ్రమమునందు మానవు నెదుర్కొను చిక్కు సమస్యలు పరిష్కరింపబడుచుండెడివి. ఊరిపెద్దలు సభలుతీర్చి తీర్పులుచెప్పిన దీదేవాలయమంటపముల యందుననేకదా. సభామంటపములే గాక విద్యార్థులకై పాఠశాలలుగను భోజనశాలలుగను భాండాగారములుగను వైద్యశాలలుగను పఠనమందిరములుగను నుపయోగపడు మంటపములెన్నో ప్రాచీనాలయములను జేరియుండెడివి.

పూర్వకాలమున రాజులును ఋషులును చేతులుకలుపుకొని సంచరింపుచుండెడివారుకారా? శ్రీరామునకు విలువిద్యనేర్పినదిమహాఋషి. శ్రీరాముడు పట్టాభిషిక్తుడగుటకుముందు వశిష్ఠుని చరణసమీపమున యోగవాశిష్ఠము నభ్యసించెను. మహామునులు జనకునిదాపుచేరి విజ్ఞానము నార్జించువారట. గృహస్థాశ్రమమును సన్యాసాశ్రమమును విరుద్ధములుగాక పరస్పర సంబంధములు కలవియని యీమహనీయుల చరిత్రలు తెలుపుచున్నవి. ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థములను పూర్వులేల యేకముచేసిరి. అర్థకామములే యాశ్రమమునకు సంబంధించినవి? గృహస్థాశ్రమమునకా? సన్యాసాశ్రమమునకా? సంసారయాత్రయందుండియు ముక్తినందినవారెందఱులేరు? బాలకుడై పంకేజలోచనుని కరుణనందినధ్రువుడు కాననమున దినములు గడపెనా. తిరిగి గృహమునకరుదెంచి రాజ్యమేలి భార్యతోడను పుత్రులతోడను పెక్కేడులు మహితానందమున కాలముగడపలేదా! మునిపల్లెయందు గృహస్థులైనమునులుండలేదా? సప్తఋషులకు భార్యలులేరా! మహత్తరములైన నాలుగు ఆశ్రమములును నొకదానికొకటి ప్రతికూలములు కావనియు నీయాశ్రమములను వేఱువేఱుగ తెగగొట్టుట సాధ్యముకాదనియు నాలుగాశ్రమములును మనుష్యజీవనమున గలిసిమెలసి యున్నవనియు మనము తెలిసికొనవలసియున్నది. శ్రీకృష్ణభగవానుడు నిత్యబ్రహ్మచారికాదా! భోజనప్రియుడగు దూర్వాసుడు నిత్యోపవాసియనుట లోకవిదితముకాదా! ఈమహాపురుషుల

జీవనముఁ ందు ఆశ్రమప్రాతినిధ్యము గోచరించెనా? ఒక్కొక్క ఆశ్రమము నియమించు విషయములను పాలించునాతఁడు తనయాశ్రమమును పాలించుటే గాక తక్కుగల యాశ్రమములకు వన్నె దెచ్చినవాఁడగును. గార్హస్థ్యధర్మములను నేలపాలుచేసి కాషాయాంబరములను గట్టిననే ముక్తి సంపాదించుకొనఁగలమని కొనుట మూర్ఖతయగును. గృహస్థుఁడగుట కనవసరము సన్యాసమునకు నవసరమై యగును. సన్యాసాశ్రమస్వీకారమునకు విహితమైన గృహజీవనము అవసరమగు నట్లు. ఇట్లని కల్యాణదాసుని చారిత్రము తెలుపుచున్నది.

కల్యాణదాసుఁడను నొక బ్రాహ్మణుఁడు సంసారధర్మము నాచరించు గృహస్థుఁడై యుండెను. భారతభూమియందలి తీర్థములను సేవింప నాతఁడు తన పట్టణమగు హరిద్వారమును వీడి యనేక ప్రదేశముల కరిగెను. కాలక్రమమున నతఁడు రామేశ్వరక్షేత్రమును చేరుకొనెను. గౌడబ్రాహ్మణబ్రహ్మచారి యొకఁ డాతని నచట కలిసికొనెను. ఇరువురకును నచట స్నేహమయ్యెను. పిమ్మట వారిరువురును మధురాపురమున కరిగిరి. మధురయందు కల్యాణదాసునకు జబ్బుచేసెను. ఆఱునెల లాతఁడు మంచముపట్టెను. రోగగ్రస్తుఁడైయున్న కల్యాణ దాసునకు గౌడబ్రహ్మచారి బహువిధంబుల సేవ చేయదొడఁగెను. కాలక్రమమున దాసు ఆరోగ్యవంతుఁ డయ్యెను. తనయెడల నెంతయు నాదరమును ననురాగమున చూపి తన దుఃస్థితియందు తనకు విశేషసహాయము సలిపి యాపత్కాలమున తనకు రక్షకుఁడైన బ్రహ్మచారిని చూచి దాసు "తండ్రీ! ఇన్నిదినములు నన్ను విడువక నాకెంతేని సేవ చేసితివి. నాప్రాణమును కాపాడు తలంపుతో నీశరీరసుఖమును లెక్కింపకుంటివి. నీ మంచితనమును వర్ణించుటకు నాకు మాటలు చాలవు. వర్ణనాతీతమైన నీధార్మికబుద్ధిని నేనెంతని కొనియాడను. నీవు కావించిన మహోపకారమునకు నేనెట్లు ప్రత్యుపకృతిని సలుపఁగలుగుదును! నాప్రార్థన మొకటి కలదు. నాకొక కుమార్తె కలదు. ఆమె సద్గుణముల కాకరము. ఆమెను నీవు వివాహమాడి నన్ను సంతోషపెట్టుము." అనియెను. ఆమాటలు విని బ్రహ్మచారి "మహాత్మా! నేను నీకొనరించిన సేవ యేమియు లేదు. ప్రతిఫలాపేక్షతో నేనేక్రియయు నాచరించియుండలేదు. రోగపీడితుఁడవై యున్న నీకు సేవ సలుపుట నాపవిత్రకర్తవ్యము. ఫలమును కోరక కర్తవ్యమును నెఱపునపుడు హృదయము మిక్కిలి యానందముతో వెల్లివిరియును.

నీకీ సేవచేసి నేనందిన పరితోషమునకు మేరలేదు. నీవు మహనీయుఁడవు కావున నీయెడల నాకు గల యానందమును పట్టజాలను. నీకూతును నాకిచ్చెదనని పలుకుచుంటివి. నీవేడికోలును మన్నించుటకు ముందంజవేసితినేని నీకు ముదమ్మును కూర్తును గాని నాకు నేను కీడుచేసుకొనువాడ నగుదునేమో యని భయపడుచున్నాను. గృహస్థజీవనము దుఃఖబంధురమైనదిగదా! సంసార సుఖము లెంతపాటివి? ఇంద్రియలోలత్వ ముత్తమచారిత్రమునకు మార్గదర్శక మగునా? ప్రపంచమోహమునుండి తప్పించుకొనుటకేగదా మహనీయులెందఱో జడలు దాల్చి కాషాయాంబరములు గట్టి వనములయందు వసించిరి. గృహస్థుఁడనై యుండి కామమోహములందు మునుంగుటకు నామనస్సు సమ్మతించుటలేదు. కావున నేను బ్రహ్మచారిగానే జీవింపదలచుకొనుచున్నాను. నీయుద్దేశమునకు 'ఔ' ననజాలనందులకు సన్నుక్షమింపుము" అనియెను. ఆపలుకు లాలించి కల్యాణదాసుడిట్లనియెను. "బ్రహ్మచారీ! నీయపోహలు సరియైనవి కావు. గృహస్థుఁడన నింద్రియ సేవనమున నోడలుమఱచువాడు కాడు. గృహము మోహమునకు స్థానము కాదు. గృహజీవనమును చూచి భయపడి మన ఋషులు కాననములకు పాఱిపోలేదు. స్త్రీసంపర్కమును గుఱించిగాని స్త్రీలను గుఱించిగాని మనువెన్నడును ప్రతికూలాభిప్రాయమును వచియించియుండ లేదు. కామమోహములను మునింగియుండుడని గృహస్థ జీవన మెవ్వరికిని యుపదేశించుటలేదు. మనుజజీవనమున ప్రత్యేక సమయమందు గడుపవలసినవి నాలుగాశ్రమములని కల్పసూత్రములు తెలుపుచున్నవి. ఋషులకును భార్యలు లేకపోలేదు. పురాణప్రసిద్ధములైన ఋషిపల్లెలందు నివసించినవారెవరు! స్త్రీ సంపర్కము హేయమగుచో సర్వేశ్వరుడు స్త్రీల నేల పుట్టించియుండును. నైతిక యాధ్యాత్మికజీవనమునందు కూడ స్త్రీపురుషులకు యెడతెగని సంబంధముకలదు. ఉత్తమసూత్రములను పాటించి సంసారమును గడపు నాతడు గృహస్థుడని చెప్పదగినగృహస్థుడు. ఇట్టివానిని నీవు బ్రహ్మచారి యనిపిలిచినను పిలువవచ్చును. గృహస్థుడై యుండిన 'జనకు' ని జీవనము పలువురు ఋషులకు మేలుబంతి కాలేదా? ఎల్లరును బ్రహ్మచారులును సన్యాసులును నగుచో వీరికి వలయు భిక్ష మొసగుటకు గృహస్థు లెచటినుండి వత్తురు. త్రిమూర్తులచెంత కూడ వారి రాణులులేరా? అవతారము లెత్తిన సర్వేశ్వరు డెన్నిసారులు

గృహస్థజీవనము గడపలేదు ? నీపొరపా టభిప్రాయములను మార్చుకొందువు గాక" "మహాత్మా! భ్రమనుండి నన్ను మేలుకొలిపితివి. నీకోరికప్రకారము నీతనయను వివాహమాడెద" నని బ్రహ్మచారి జవాబు చెప్పెను.

మధురకండలి కృష్ణదేవాలయమునకు జని కల్యాణదాసు స్నేహితు నకు కూతును వివాహము చేసెదనను వాగ్దానము ను స్వామి సాన్నిధ్యమున మఱలపలికెను. తరువాత వారిద్దఱు హరిద్వారమున కరిగిరి.

కల్యాణదాసు ద్రావిడబ్రాహ్మణుఁడనియు, బ్రహ్మచారి గౌడబ్రాహ్మణు డనియు నన్యశాఖవానికి దానుకూతు నొసగుట కాతని చుట్టము లిష్టపడ లేదనియు, తగాదాతీర్చుకొనుటకు చుట్టములును దాసును తమదేశపు రాజు నొద్దకు పోయిరనియు రాజుసాక్ష్యమును కోరెననియు శ్రీకృష్ణభగవానుడే తనకుసాక్షియనియు యితరులెవ్వరును లేరనియు దాసు చెప్పి మధురగ్రామమున కరిగి స్వామికి కల్యాణదాసుడాకథ వివరించెననియు రాజునెదుట నిక్కము ను తెలిపివేయుటకు కృష్ణుడు సమ్మతించి దాసు వెనకకుతిరిగి చూడకున్న యెడల యాతనివెంట హరిద్వారమునకు వచ్చెదనని కృష్ణభగవానుడు చెప్పి బయలు దేరెననియు కొంతదూరము సాగిపోయిన తరువాత దాసు గజ్జెలందియల చప్పుడు వినజాలక వెనుకకు తిరిగి చూచెననియు తోడనే కృష్ణభగవానుడందు నిలచిపోయి రాజును తనబంధుగులను నచటికి రప్పింపుమని దాసుతో చెప్పె ననియు దానును, నటేయని యట్లొనరించెననియు కృష్ణపరమాత్మవలన నెల్లరు నిజమెఱిగి దాసుమాహాత్మ్యమునకచ్చెరువు నొంది పరిణయమున కిష్టపడిరనియు మొదలుగాగల విచిత్రములు తెలుపు గాథ లనేకములున్నవి.

మనుష్యహృదయమునందలి యోచనశక్తికి యాధ్యాత్మికశక్తి యొకటి తోడై యాటితేటిన జ్ఞానోపాసనయందు విజృంభించినపుడు యద్భుతవచన ములును యద్భుతక్రియలును ప్రత్యక్షప్రపంచమందు చూపట్టును. అవి మను జుని నజ్ఞానమాయమున బడద్రోయు చెత్తకథలు కావు? తలయు తోకయును లేనివిడ్డూరములును విచిత్రములును కావు; ఆపగింజంతవానిని మేరువంతవానిని చేయగల యద్భుతములు. సాధారణయోచనాశక్తి మానవుని కొంతదూరము వఱకు తీసికొనిపోవును. అటుపైని యాధ్యాత్మిక సీమయందు జ్ఞానయాత్రికునకు సాయమగునది యీవిచిత్రములయందును విడ్డూరములయందును గలవిశ్వాసమే

ఈవిశ్వాసము మూఢవిశ్వాసము కాదు. మూఢవిశ్వాసము యోచనాశక్తిని కాలిక్రిందనొక్కిపట్టి మానవుని నజ్ఞానకూపములోనికి త్రోసివేయును. ఈవిశ్వాసము యెత్తయిన యోచనాశక్తినుండి దృష్టిమాంద్యముగల వారికి కనపడక చూపుబాగుగానున్నవారికి కనబడు ధృవతారదెస కొక్కగంతున జని బ్రహ్మాండ మండలి జ్ఞానమునంతను మానవునికి స్వాధీనములోనికి దెచ్చును.

కల్యాణదాసు, బ్రహ్మచారుల పెండిలి రాజీనామాయందు బ్రహ్మాండ మంత యద్భుతము పుట్టెనని నమ్ముటకవకాశము చిక్కుటలేదు. గౌడబ్రాహ్మణులకును ద్రవిడబ్రాహ్మణులకును వివాహముచేయవచ్చునని చెప్పుటకు శ్రీకృష్ణ పరమాత్మ ప్రత్యక్షము కానక్కఱలేదు. పెండ్లినిగురించినమాట యబద్ధము కాదని ఋజువుచేయుటకు కళ్యాణదాసు దేవదేవుని తీసుకునివచ్చెననుటయు నమ్ముటకు వీలులేదు. ఒక రాజుమ్రోల సాక్ష్యమిచ్చుట కెంతభత్యముకట్టినను శ్రీకృష్ణపరమాత్మ దివినుండిదిగిరాడు. తనచుట్టములీపెండ్లికి సమ్మతింపరని కళ్యాణదాసువంటి ధైర్యవంతుడు గుండెబాదుకొని వీధిపడి ద్రౌపదివలెనో గజేంద్రునివలెనో జగద్రక్షకుని ప్రార్థించునా? ప్రార్థించినను యిట్టియాక్రందనములకును యిట్టి తేలికపనులకును, దురంత దుఃఖములయందైన చులకనగాప్రత్యక్షముగాని శ్రీమహావిష్ణువు లొంగి యంతమాత్రమున దర్శనమిచ్చునా? ఒకవేళ చుట్టములును పక్కములును యిట్టి వివాహము పనికిరాదని యడ్డుపడిరనుకొనిన చీకటియందున్న వారు యేమేమోవాగిరని జ్ఞానాలోకమున ప్రకాశించు నిద్దరుమహనీయులు గుండెలుదడదడలాడ 'నేమి బుద్ధి దైవమా' యని వేయి విధముల విచారించి తుదకు రాజుకడకుచని యాతని తమ యిచ్ఛవచ్చిన తెఱగునలొంగతీయుదురా? ఒరులంగీకరింపరేదని ధర్మకర్తలమని తాముతలచిన దానిని యిరువురు ధర్మనిష్ఠాగరిష్ఠులు విడిచిపెట్టెదురా? ఒరులేమనినను యేమి చేసినను భయముచెందక యీయుత్తమచారిత్రులు తమకర్తవ్యమును తాము గ్రహించుకొనరా? ఏఆటంకములేక, యేయుద్ధమును లెక్కసేయక చుట్టముల మాటలను బంధువుప్రార్థనలను త్రోసిపుచ్చి కళ్యాణదాసు తనకుమార్తెను మిత్రునకిచ్చి పెండ్లిచేసియుండుననియే తలంపవలసియున్నది. బ్రహ్మచర్యమునకు పిదప నవశ్యముగ మానవుడవలంబింపవలసిన పవిత్రాశ్రమమగు గృహస్థాశ్రమమును కళ్యాణదాసుసమిత్రుడు సేవకుడునగు బ్రహ్మచారి తనధర్మమును తాను నెఱవేర్చుకొనుచుండెను.

శ్రీ

# శ్రీ దీపాంకురస్వామి

"ఉ. పుట్టిననాటనుండియును బొట్టకు బట్టకు దేవులాడు నే
నెట్టులు నిన్నుఁగొల్వఁగల? నెప్పుడు హాయిగనుండుఁ బ్రాణమి
క్కట్టులఁబాసి? నీపరమకారుణికత్వముఁ జూపవేల? నీ
కిట్టిపరాకు గల్గిన మఱెవ్వరు రక్షకులౌదు రీశ్వరా!"

బౌద్ధరాజు గోవిందపాలుడు హిందూస్థానమున రాజ్యమేలుచుండు వాడు. ఈతని రాజధానినగరము విక్రమపురము. విక్రమపురమునకు సమీపమందున్న 'వజ్రయోగిని' యను పల్లెటూర బ్రాహ్మణకులమున క్రీ. శ. 980వ. సంవత్సరములో దీపాంకురుడు పుట్టెను. చిన్నతనమున నీతడు ఆదినాథుడని పిలువబడుచుండువాడు. బాల్యముననే యుత్తమ భావిజీవనకళలతనియందు చూపట్టెను. విద్వాంసుడగు యొకయాచార్యు నాశ్రయించి యాతడు చదువుట నేర్చెను. తరువాత పెండ్లిచేసికొని కొంతకాలము సుఖముగ సంసారమును గడ పెను. పిమ్మట యిల్లువిడిచిపోవలెనను బుద్ధియాతనికి కలిగెను. విశేషశ్రమచేసి కొలదినాళ్లలోనే యాతడు హిందూ బౌద్ధశాస్త్రములయందారితేఱెను. ధర్మ రక్షితుడను నొకమహాత్ముని జేరి యాతని కరుణపెంపున బౌద్ధమతమును స్వీక రించెను.

ఆకాలమున బర్మాసీమ తూర్పుఖండమున బౌద్ధమతమునకు పీఠస్థానమై యుండెడిది. కొందఱు వర్తకులు యేనుగులనెక్కి బర్మాపోవుచుండ దీపాంకురుడు వారివెంటబడెను. ఆదేశమును చూడవలెనని చాలకాలమునుండి యాతడు మిక్కిలి కోరికగలిగియుండెను. దారిలో వర్తకులును నాతడును యెన్నియో కష్టములు పడవలసివచ్చినది. ఆకష్టములన్నియు సహించి శ్రమపడి చివరకు పదుమూడు మాసములకు వారుగమ్యస్థానము చేసుకొనిరి. చంద్రకీర్తియను మహానీయు డొకపుడాదేశమున వాసము చేయుచుండెను. దీపాంకురు

డా మహాత్ముని జేరి యోగశిక్ష నతనికడ నేర్చికొని పండ్రెండేండ్లచ్చట నివసించి సిద్ధుడయ్యెను.

పిదప దీపాంకురుడు స్వదేశమునకు మరలివచ్చెను. మగధలోని బౌద్ధులపుడాతనిని 'ధర్మపాలు' నిగ నంగీకరించి స్వీకరించిరి. క్రమక్రమముగ నాతని కీర్తిచంద్రికలు దేశమంతట వ్యాపింపదొడగెను. 'రాజా న్యాయపాల్' దీపాంకురుని పాండిత్యమునకును ధర్మనిష్ఠకును మిగులసంతసించినవాడై తనరాజధాని యగు విక్రమశీలపురమున ప్రధానయాజకునిగ నతనిని నియోగింపనెంచెను. కాని యాతడందుల కియ్యకొనలేదు.

ఆకాలమున టిబెట్టుదేశమందు హ్లాలామల్ అనునరపతి రాజ్యమేలుచుండెను. థోలింగునగర మతని రాజధాని. బౌద్ధమతధర్మములయందా రాజున కాదరము మెండు. అతడు కొందఱు బౌద్ధసాధకులను విశేషమతపరిజ్ఞానము నేర్చుకొని వచ్చుటకై భారతదేశమునకు పంపెను. వారును పెక్కుచోటులు తిరిగి తిరిగి తుదకు మగధ కరిగిరి. దీపాంకురుని మాహాత్మ్యమును వారు తెలిసికొని కొంతకాల మాతనిసేవించి తమ టిబెట్టునకు దయసేయుమని యాతనిని బహుభంగుల వేడుకొనిరి. టిబెట్టురాజు హ్లాలామల్ దీపాంకురు నెట్లైన తమదేశమునకు గొనిపోవనెంచి లక్షలకొలది బంగారునాణెములను సేవకులను దీపాంకురునికడకుంపెను గాని యాతడు టిబెట్టుపోవుట కంగీకరింపలేదు.

కొంతకాలము గడచినపిదప నా రాజుమృతిచెందెను. మృతిచెందినపిదప నాతని కుమారులు దీపాంకురుని విశేషముగా ప్రార్థించి నిర్బంధించి తమదేశమునకుతీసికొనిపోయిరి. పదునైదేండ్లచ్చట నతడు బౌద్ధమతమును బోధించి విశేషకీర్తి గడించెను. క్రీ. శ. 1035 వ సంవత్సరమున లాసా నగరసమీపమందలి జయుంగపురమున నాతడు నిర్వాణమందెను. నేటికిని టిబెట్టు చీనా దేశములందలి లామాలు (మతగురువులు) భక్తిపూరితహృదయులై దీపాంకురుని స్మరించి నమస్కరించుచుందురు.

బుద్ధుడు శ్రీమహావిష్ణువు తొమ్మిదవయవతారమని హిందువు లనుచుందురు. కాని బౌద్ధమతమును గాని బుద్ధునిగాని గుర్తించిన మహనీయులు హిందువులందు లెక్కకు మిక్కిలి తక్కువగానున్నారు. బర్మా, సింహళము,

జపాను, చీనా, టిబెట్టు దేశములలో నేడుకూడ బుద్ధునినారాధించువారు చాలగా కలరు. ధర్మచక్రమును గైకొని మనపూర్వు లాయాదేశములకరిగి ధర్మబోధము చేయుటయే దీనికి కారణము. తాను పుట్టి పెరిగి బుద్ధుడైన పుణ్యభూమి యందు సిద్ధార్థుడు విస్మృతిలో మునిగిపోయినాడు. అన్యదేశములం దాతడు నేటికి నారాధ్యుడై యున్నవాడు. హిందూబౌద్ధమతములు పరస్పరవిరుద్ధములు కావు.

హిందూబుధులును బౌద్ధసన్యాసులును మనకు పూజనీయులే. బౌద్ధులు శ్రీమహావిష్ణువు నారాధింతురు. బుద్ధు నెఱింగిన హిందువులు బుద్ధు నారాధింతురు. అజంతాగుహా, అమరావతీస్థూపములు హిందువులకును బౌద్ధులకును మాత్రమే గాక ధర్మమెఱుంగగోరువారందఱకును పవిత్రస్థానములే. ఈగుహ యందేమున్నదో యేస్థూపమునందేమున్నదో యెఱుంగవలెనను కోరిక హిందువులకు లేకిపోయినను విదేశీయుల కెందఱికో యట్టిది యెక్కువ కలదు. కాశీకి నేడెందఱెందఱో యాత్రికు లరుగుచుందురు. సమీపమున నేడుమైళ్ల దూరమందున్న సారనాథమునకరిగినవా రెంద ఱున్నారు? మొదట బోధిసత్వుడు తన మతమును బోధించిన తావనియు వారణాసివలెనే యచ్చోటు కూడ పవిత్రమైనదనియు యెంద ఱెఱుంగుదురు? శతాబ్దములకు మున్ను అశోకుడెత్తిన స్తంభముపై గోచరించు శిలాక్షరములం దెంతవిజ్ఞానమున్నదో తెలిసికొనుటకు మన యాత్రికు లాతురపడుటలేదు. గయాక్షేత్రమునకు బోయి పిండములను బారవేయుదురే గాని యచటికి సమీపముననున్న బోధిద్రుమమున కరిగి యందొకసారి మనహిందువులు సాగిలబడుదురా! ఏతావున సుమారారేండ్లు ఘోరతపమాచరించి రారాజు కుమారుడు జ్ఞానలోకమును గాంచెనో ఎచ్చోటినుండి సమస్తప్రపంచముపై నిర్మలనీతిబోధ యమృతధారలట్లు ప్రవహించెనో ఏపవిత్రస్థలము నేడును టిబెట్టువాసులకును చీనాదేశస్థులకును ప్రధాన యాత్రాస్థలమయ్యెనో ఎచ్చోటి మట్టిని తాకవలెనని దేవతలు కూడ నుబ్బుబడిరో ఆపవిత్రప్రదేశము హిందూమానసమున పాడుపడి యున్నది. మనదేశమందు పుట్టిపెరిగిన దీపాంకురుడెవడో మన మెఱుగము. ఒకమాఱు బుద్ధగయ కరిగినచో చరిత్రమాహాత్మ్యమును దెలుపు అశోకవినిర్మితదేవాలయమును ప్రాచీనమాహాత్మ్యమును చూపు బోధిద్రుమమును చేరి

రాత్రింబగళులు దైవప్రార్థన సలుపుచుండు టిబెట్టుసీమవాసులు దీపాంకురుని గూర్చి యెన్నెన్నికథలనో చెప్పెదరు.

ప్రాచీనయుగమునకును ప్రస్తుతయుగమునకును; దూరదేశస్థులకును స్వదేశస్థులకును, పూర్వనాగరికతకును వర్తమాన నాగరికతకును సఖ్యమును గూర్చు సద్భుతశక్తులు దీపాంకురస్వామివంటి మహనీయుల జీవనచారిత్రము లనుటనిస్సంశయము. ఈస్వామిజీ తమదేశస్థుడని టిబెట్టుదేశస్థులును చీనావాసులును పలుకుచుందురు. ఈతని యుదంత మీవఱకెఱుగకున్నను నిపు డెఱిగిన హిందువులు తమ నేలయందు బుట్టిన దొడ్డబిడ్డడని గుర్తెఱింగెదరుగాక! ఈమహాపురుషుని మాహాత్మ్యము ననుకరించి యాతని దివ్యచారిత్రము తెలిసికొని, ఆధ్యాత్మికజీవనమునందు అనూనమైన అభ్యుదయమును భారతీయు లందెదరుగాక!



## ౧౭

# ఆవుల్ చాంద్ స్వామి



"మ. అదిగో! ముంగల పెద్దమద్ది యటపో నాచెంత వ్రేపల్లె యు
న్నది యాదండఁ గళింద జాతటమునం దాపింఛ భూజాళితో
గదుపుల్ మేపుచు గోపబాలకుఁడు నిక్కంబొప్పఁగాఁ దెల్పు న
ద్భుతవిం బొమ్ము నఖా! శుభాస్పదముగా భావంబు రంజిల్లెడున్"

వంగదేశమందు 'కర్తాభజ' యనునొక మతసంప్రదాయము కలదు. దీనిని ప్రతిష్ఠించిన యాచార్యుడు ఆవుల్ చంద్. పారసీభాషయందు, దైవబలము కలవారు ఆవులియా లని పిలువబడుచుందురు. 'ఆవులియా' శబ్దమునుండియే 'ఆవుల్ చాంద్' అనుపేరు పుట్టెను. ఈతడెచటివాడో యెందుపుట్టెనో తెలియదగిన యాధారములు కానరావు.

వంగదేశమున నదియాజిల్లాయందు 'ఉలా' యనునొక పల్లెకలదు. మహాదేవదాసను నొకడు రమారమి నాలుగువందల సంవత్సరముల క్రిందట నాపల్లెయందు వాసముచేయుచుండెను. అతడు శూద్రుడు. అతని కొక తమలపాకులతోట యుండెను. తమలపాకులనమ్మి యాతడు జీవనముచేయుచుండెను. సేద్యము కూడ చేయుచు నతడు డబ్బు సంపాదించుచుండువాడు. ఒకనాడు పగలు రెండుఝాములు తిరిగిన పిమ్మట నతడు తమలపాకులు దెచ్చుటకై తనగృహమునుండి తోటకు వెళ్లెను. అపుడెవరో యేడ్చుచున్నట్లతని చెవులకు వినవచ్చెను. క్షణము నిలిచి యాయేడుపెదిక్కుననుండి వచ్చుచున్నదో యతడు కనిపెట్టెను. తన తమలపాకులతోటమధ్యనుండియే యా యార్తనాదము వినవచ్చుచున్నట్లు గ్రహించి చరచర ముందున కరిగెను. ఎవరో బాలు డాకులపొదలో గూర్చుండి యేడ్చుచుండెను. మహాదేవదాసతని సమీపించి యాదరపూర్వకముగా నతనితో మాటలాడి వాని నూరడించెను. "బాబూ! నీదేయూరు? నీయమ్మయు నయ్యయు నెవరు? ఈసమీపమున నీవారెవ్వరైన నుండిరా? నీవెట్లులీతోటలో ప్రవేశింప గలిగితివి?

నీవిచట గూర్చుని యేడ్చుచుంటివి ? " అని దాసు బాలు నడిగెను. "నాకేమియు తెలియదు." అనిమాత్రము బాలుడు ప్రత్యుత్తరమిచ్చెను. అతని వయసప్పు డెనిమిదేండ్లు మాత్ర ముండెను. మహాదేవదాసునకు పిల్లలు లేరు. అతడాబాలుని నింటికి గొనిపోయెను. తలవనితలంపుగా దొరికిన బాలుని పెంచుకొనవచ్చెనని యతడుమిక్కిలి సుఖపడెను. దాసు భార్యయు బాలుని జూచి పరమానందభరితురాలయ్యెను. పిల్లవాడు మంచిచాయగల వాడు, సుందరరూపుడు. అతని చక్కదనమున కలరి దాసుభార్య యాతనికి పూర్ణచంద్రుడను పేరొసగెను.

బాలుని నింటికితీసుకొనివచ్చినది మొదలు మహాదేవదాసు వానికి పనులు పురమాయించుచుండెను. వచ్చినమఱునాడె పశువులను మేపుకొనిరమ్మని పిల్లవానినంపెను. క్రమక్రమముగా శ్రమనుకలుగచేయు వ్యవసాయపుపనులును గృహకృత్యములునుకూడ బాలునిమీద నేపడెను. దాసు మిగుల కోపిష్ఠి. ఇంచుకంత పొరపాటువచ్చినను తొక్కద్రొక్కినపామువలె పైకిలేచుస్వభావము కలవాడు. కఠినోక్తులు ప్రయోగించుచుండువాడు. సత్తువకొలది కొట్టుటయు నతనికలవాటే. బాలునిస్థితి కష్టనిష్ఠురములతో నిండిపోయెను. పిల్లవాడేమియు విచారింపక విసుగుచెందక దాసుమాపు కాఠిన్యము నోపికతోసహించుచు సమయము దొరికినపుడెల్ల ఈశ్వరుని ధ్యానించుచుండువాడు.

దాసు గృహమునకు సమీపమున హరిహరుడను నొకడు వాసముచేయుచుండెను. అతడు విష్ణుభక్తిపరాయణుడు. ప్రతిదినమాతనియింట విష్ణుసంకీర్తనము జరుగుచుండును. వైష్ణవమతసంబంధమైన చర్చలుసాగుచుండును. పూర్ణచంద్రుడు ప్రతిదినమచ్చటికరిగి శాస్త్రచర్చవిని హరిసంకీర్తనము చెవులారగ్రోలి యానందమున పరవశుడగుచుండువాడు. ఏండ్లకుచిన్నవాడైనను బాలునిబుద్ధి పెద్దదిగ నుండెను. కఠినములగుశాస్త్రములయందలి యంశములనాతడు సులువుగగ్రహింపగలుగుచుండువాడు. స్వల్పకాలములోనే యతడు సంస్కృత విద్యను పిడికిలియందు పట్టగలిగెను. బాలుని నిర్మలమగు భక్తిభావమునకును నతని మేధాసంపాదకును ప్రజ లాశ్చర్యాన్వితులగుచుండువారు. ఎల్లఱకును పూర్ణచంద్రునిపై యాదరము ననురాగము మెండుకావచ్చెను. కాని తెలివిహీనుడగు మహాదేవదాసు బాలుని గొప్పతనము కనిపెట్టలేకపోయెను. ఇంటి

పనులను బజారుపనులను పొలముపనులను పాటింపక నిత్యము నిరుగుపొరుగిండ్ల కరిగి యతడు కాలమువృథపుచ్చుచున్నాడని ప్రతిదినమాతనిని దండించుచుండు వాడు. హరిసంకీర్తనమునందు పూర్ణచంద్రుడు పాల్గొనుట కవకాశముచిక్కుట గూడ నసాధ్యమైపోవుచుండెను. అన్నము మానుమనిన నతడుమానగలడు, నిద్రపోవలదనిన నిద్రింపకుండనుండగలడు, ఎట్టికష్టసాధ్యములగు పనులునెఱ వేర్చుమన్నను సంకోచింపక నెఱవేర్పగలడు కాని హరిసంకీర్తనము నెవ్విధము చేతను మానలేడు. అతని ప్రాణములకంటె నెక్కుడగు హరిభజనమున కడ్డు కలుగగానే యాతనిమనస్సు దుఃఖాకులమైపోవును. తలపై పిడుగులుపడినను సరే కొండవిరిగి మీదపడినను సరే హరినామసంకీర్తనము వదలరాదని మనస్సున నిశ్చయముచేసికొని తనకన్నవస్త్రము లొసగుదొఱకునాయని యాలోచింపక దాసునింటనున్నంత కాలము తనకోరిక ఫలింపదని గుర్తించి పూర్ణచంద్రుడా యిల్లువీడి వెడలిపోయెను. హరిహరుడాసంగతి తెలిసికొని తనయింటనుండుమని పూర్ణచంద్రునిగోరెను. చంద్రుడందులకు సమ్మతించెను.

హరిహర పూర్ణచంద్రులు హరిభజనముసలుపుచు నానందముతో దిన ములు గడపుచుండిరి. ఇట్లు కొంత కాలము జరిగిపోయెను. హరిహరుడు గృహ స్థుడు. గృహస్థాశ్రమమును స్వీకరింపుమని యతడు పూర్ణచంద్రుని కోరెను. అనేకవిధముల నతనిని బలవంతపెట్టెను కాని చంద్రుడందులకియ్యకొనలేదు.

అనంతరము పూర్ణచంద్రుడు హరిహరునియొద్ద సెలవుగైకొని యాతని యిల్లువిడిచి యాయూరువిడిచి 'ఫులియా' గ్రామమునకు పోయెను. ఫులియా చక్కనియూరు. తృణకాష్టజలసమృద్ధిగలిగివాసయోగ్యముగ నుండెడిగ్రామము. ఇదిశాంతిపురమునకు సమీపముననున్నది. అదియొక బ్రాహ్మణాగ్రహారమనిన ననవచ్చును. విద్వాంసులెందఱో యచట వసింతురు. ముఖ్యముగ నావల్లె వైష్ణవులకాటపట్టు. శ్రీ గౌరాంగమహాప్రభువుయొక్క ప్రియశిష్యుడు హరిదా సొకప్పు డందు వసించుచుండువాడు. ఆరోజులలో నాతడు కట్టించిన మఠ మొక్కటి నేటికి నచటగోచరించుచున్నది. మిగుల ప్రసిద్ధిజెందిన భక్తశేఖరు డగు బలరామదాసా గ్రామమందు నివసించుచుండెను. పూర్ణచంద్రు డాతని నాశ్రయించి యాతని మెప్పించి యాతని యాదరముడపొంది యాతనియొద్ద

వైష్ణవమతమును స్వీకరించెను. నాడు మొదలు పూర్ణచంద్రుడు ఆవుల్‌చాంద్ అనుపేరుతో నొప్పుచుండెను.

సుమారు పదునెనిమిదిమాసము లావుల్‌చాంద్ ఫులియాగ్రామమునందే వసించెను. బలరామదాసున కాతనియెడల నెంతో మక్కువకుదిరెను. దాసునకు తూర్పుబంగాళమున నెందఱోశిష్యులుకలరు. శిష్యులున్న తావులకు పోవలెనని తలచి యొకనా డతడు బయలుదేరెను. బయలుదేరుచు తనతో నావుల్‌చాంద్‌ను వెంటబెట్టుకొనిపోయెను. పిమ్మట నాచార్యునితో ఫులియాకు తిరిగిరాక ఆవుల్‌చాంద్ తీర్థయాత్రలు సేవించుటకై వెడలిపోయెను.

భారతదేశమును ప్రదక్షిణమొనరించి పుణ్యక్షేత్రములన్నియు దర్శించి యతడు వజరా (వంగదేశమందున్న కాంచడాపాయను గ్రామమునకీ యూరు సమీపముననున్నది) యను గ్రామమున కరిగి యందు నివాసమేర్పఱచుకొనెను. ప్రతిదినముదయమునందు భిక్షకై యాతడు వెడలి తెచ్చినపదార్థములయందు తనకై కొంచెముంచుకొని మిగిలినదానిని నిరుపేదలకు పెట్టుచుండువాడు.

దయయు దాక్షిణ్యమును స్వామిజీకిమెండు. రోగార్తులును, అనాథులును నతనిని జేరి శాంతిని బడయుచుండువారు. దుఃఖపీడితులును దారిద్ర్యపీడితులును నగువారు తన్నుజేరినంతనే వారికాతడు హితవాక్యములు చెప్పియు హారముపెట్టియు వారియెడల కన్నతండ్రివలె మెలగుచుండువాడు. ధనికులును దరిద్రులును కూడ నతనిచెంతచేరి యతని ప్రబోధవాక్యములకు చెవియొగ్గి యాసక్తితో వినుచుండువారు. స్వామిజీ హరినామసంకీర్తనము వీనులార వినుటకెందఱెందఱో ప్రతిదినమాతని యాశ్రమము చేరుచుండువారు. అచిరకాలములో వజరాగ్రామము సంజీవనీసుధతో నిండిపోయెను. దైవబలము మూలమున స్వామిజీ గ్రుడ్డివారికి దృష్టినిచ్చువాడనియు కుంటివారికి నడచు నేర్పు నొడగూర్చువాడనియు నెట్టిదారుణవ్యాధినైనను నిముసములో కుదుర్చుచుండువాడనియు వదంతికలదు.

ఆవుల్‌చాంద్ నెందఱెందఱో శిష్యులు ఆశ్రయించియుండువారు. అందు రామటూఘోష్ బేబూఘోష్ మొదలగువా రిరువురైయిద్దరు ముఖ్యులు.

రామశరణుడను నొకమనుజుడు శూలవ్యాధిచే మిక్కిలి బాధపడుచుండువాడు. స్వామిజీ యారోగము ననాయాసముగా నివారణమొనరించెను. నాటి

నుండియు రామశరణుడాతని శిష్యుడయ్యెను. ఇతడు మొదటనొక సామాన్య గృహస్థుడు. జగదీశపుర మీతని పూర్వుల నివాసస్థానము. జయపురమందు వసించు శిశుఘోషు అను నాతనికుమార్తెను గౌరి నీతడు పెండ్లియాడెను. ఇరువురుపుత్రికలను కనినవిమ్మట నామెయు పుత్రికలును కూడ కాలధర్మము నొందిరి. అనంతరము రామశరణుడు గోవిందపురవాసి యగు గోవింద ఘోషుకుమార్తెను సరస్వతిని వివాహమాడెను. సరస్వతివలన నీతని కొక కుమారుడు కలిగెను. కుమారుని పేరు రామలాలు. నదియాజిల్లాలోని భవనపూరులో వసించు నొకపెద్ద జమీందారుని యొద్ద కొందఱుమిత్రుల సాహాయ్యమున రామశరణుడు చిన్నయుద్యోగమును సంపాదించెను. మిక్కిలి మెలకువతో మెలగి కొలదికాలములోనే యాతడు యజమాని యనురాగమునకు పాత్రుడయ్యెను. జమీందారుడాతనిని 'ఉఖరా' పరగణాయందు గొప్పయున్నతోద్యోగమున నియోగించెను. రామశరణున కప్పుడే శూలవ్యాధి సంక్రమించెను. ఈ తెగులువలన నపుడపు డాతడు మూర్ఛనొందుచుండువాడు. అతనిబాధ చెప్పనలవిగాకయుండెను. ఒకనాడు ఆవుల్‌చాంద్‌స్వామిజీ యాతడున్నచోటున కరిగి యతడు పడుబాధగాంచి సేవకులవలన నతనివ్యాధి వృత్తాంతము నెఱిగి తనకమండలువు నుండి కొంచెము జలముతీసి దాని నాతనిముఖమున జల్లెను. తోడనే రామశరణుడు వ్యాధినుండి విముక్తుడాయెను. అప్పటినుండి రామశరణుడు స్వామికి శిష్యుడై యాతనిమతమును పెక్కు తావుల ప్రచార మొనరించి ప్రసిద్ధిచెందెను.

స్వామిజీ మరణ మాశ్చర్యజనకమయినది. వంగశకము 1651 సంవత్సరమున వైశాఖ శుద్ధ పంచమినాటి సాయంకాలమున నతడు పరలోకగతుడయ్యెను. బోయాలియా అనుగ్రామమున నాతనిశిష్యుడు కృష్ణదాసనువాడు వ్యాధిగ్రస్తుడై పడియుండెననియు తనను చూడనెంచి మాత్రము ప్రాణములు నిలుపుచున్నాడనియు తెలియవచ్చి శిష్యుని చూడవలెనని ప్రయాణమై స్వామిజీ తనశిష్యుల నుద్దేశించి "మీలో కొందఱు నాతోరండు. నేనును త్వరలో నిహలోకమును వీడవలెను. బోయాలియా నుండి తిరిగిరాను" అనెను. అని యాతడు కమండలువును కాషాయాంబరమును దీసికొని బయలుదేరెను. కృష్ణదాసు మరణించిన పిదప స్వామిజీకి జ్వరమువచ్చెను. ఆ జ్వరము వదలక

లేదు. తనకు పరలోకమున కేగవలసిన తరుణమువచ్చినదని గ్రహించి శిష్యులను బిలచి "నన్ను సమీపమునయున్న తులసీతలము కడకు గొనిపొండు. మీరందఱు గొంతెత్తి హరినామసంకీర్తనము గావింపుడు. శ్రీహరినామము సుధామయమయినది." అనెను. శిష్యులట్లు కావించిరి. మధురగానము వినుచు తానును హరినామము నుచ్చరించుచు భక్తచూడామణి అవుల్‌చాంద్‌స్వామిజీ జగదీశుని చేరుకొనెను.

ఆచార్యుని శరీరమును శిష్యులు 'పరారీ' యనుపల్లెకు గొనిపోయి యచట సమాధిచేసిరి. అతడు తన చెంతనుంచుకొనిన కాషాయాంబరమును బౌయాలియా గ్రామమునకంపెను. తాను బ్రతికియుండగానే స్వామిజీ తన చినుగుల శాటీని రామశరణునకు పంపెనని కొందరు చెప్పెదరు. ఈ చింపిరిగుడ్డ నేడును భద్రపఱుపబడియుండెను.

శిష్యులందఱిలో ప్రధానుడగు రామశరణుడు ఆచార్యుని మరణానంతరమున మహోత్సవములుసలిపి గురుసర్యుడు చేయుచుండిన ధర్మక్రియలను తాను నెఱవేర్పదొడగెను. కాని యాచార్యుని యనంతర మాతడు విశేష కాలము జీవించియుండలేదు. కొలది దినములలోనే పరలోకగతుడయ్యెను. పిమ్మట స్వామిజీ శిష్యులందఱు నొకచోజేరి యాతని వంశస్థుడగు ఈశ్వరచంద్రునకు మఠాధిపత్యము నొసంగిరి. ఈశ్వరచంద్రుని తరువాత నాతని కుమారుడు హరిదాసు, హరిదాసు పిమ్మట నాతని యన్నకుమారుడు రసికచంద్రుడును పీఠస్థానమున కధిపతులైరి.

రామశరణునిభార్య పావనగుణశోభిత, పతివ్రత. అవుల్ చాంద్ స్వామిజీ యామెను 'అమ్మా!' యని పిలచుచుండువాడు. శిష్యులందఱునుకూడ నామెయెడ మిక్కిలి శ్రద్ధాభక్తులు గలిగి ప్రవర్తించుచుండువారు. ఈతల్లి యుత్తమగుణములు బహుసంఖ్యాకులదృష్టి నాకర్షించెను. వంగదేశమునందీమె కీర్తిచంద్రిక లిప్పటికిని వెలుగుచునేయుండెను.

శిష్యులుకాబోవువారికి అవుల్ చాంద్‌స్వామిజీ మంత్రోపదేశ మొనరించినపిదప పవిత్రజీవనము గడపుటకు వారికికొన్ని విధులను తెలుపుచుండువాడు. హితోపదేశములచే వారిమనస్సుల దనుపుచుండువాడు.

ఉపదేశసమయమున నాతడు వచించుచు వచ్చిన వాక్యములు "ఏక మాత్రపరమచైతన్యస్వరూపుడగు శ్రీకృష్ణపరమాత్మను భజింపుడు; అట్టిదని యితర దేవతలను దూషింపకుడు. ఆచార్యునియొక భక్తిగలిగి వర్తింపుడు. మానసమందును ప్రత్యక్షమందును నతనికి ప్రదక్షిణ మొనరింపుడు. ఉదయమందును సాయంసమయమందును ఉతికిన బట్టలను ధరింపుడు. హృదయపూర్వకముగా నతిథులను సేవింపుడు. హరినామ సంకీర్తనమందును సత్కార్యాచరణమునందును మిక్కిలి శ్రద్ధగలిగి ప్రవర్తింపుడు. ఎల్లజను సోదరులరీతిని భావింపుడు. ఎల్లవేళల నెల్లతావుల సత్కథాకాలక్షేపము చేయుడు. వైష్ణవమతము నందలి మహత్వమును ప్రజలకు తెలియజెప్పుడు. ధర్మాంశములను చర్చింపుడు. శరీరమును మానసమును నిత్యము నిర్మలముగా నుంచుడు. ఉచితాహారమును గైకొనుడు. సత్యతత్పరులై యుండుడు. గురువు (ఆత్మ) సత్యమనియు వివాదము (నశించు స్వభావముగలది) మిథ్యయనియు దృఢముగా నమ్ముడు."

స్వామిజీ నిషేధించిన క్రియలు.

కాయకర్మలు :—పరద్రవ్యహరణము ; హత్య ; పరస్త్రీ గమనము.

మనఃకర్మలు :—పరద్రవ్యహరణమునందిచ్ఛ ; హత్యయందు తలంపు ; పరస్త్రీ గమనవాంఛ.

వాక్కర్మలు :—అనృతసంభాషణము కఠినవాక్యోచ్చారణము. వృథా భాషణము. దుష్టాలాపము.

ఆవుల్‌చాంద్ స్వామిజీ పరమపదించిన దినమందును ఫాల్గుణ పూర్ణిమ నాడును యిప్పటికిని ప్రతివత్సరము నీతని సంప్రదాయ వంగవైష్ణవులు మహోత్సవములు జరుపుచుందురు.

స్వామిజీ పుట్టుపూర్వోత్తరములు మనమెఱుంగము. ఎనిమిదేండ్ల వయస్సున బాలకుడై దిక్కులేక యొక నిర్జనప్రదేశమునం దాతడు దీనముగా విలపించుట మొదలు స్వామిజీ వృత్తాంతము ప్రపంచమునకు తెలియును. అంతకు ముందాతని చారిత్రము యెట్లుండెనో యెవ్వరు నెఱుంగరు. పసిబాలుడై తల దాచుకొనుట కాతనికొక చోటు లభించినను నచటకూడ చెప్పరాని కష్టముల కాతడు పాలుపడెను.

మనుష్యజీవనమున చిన్నతనము చిన్నదిగా కనపించినను ఉన్నతమైన భావిజీవితమునకది యే పునాదియగును. ఉత్తమజీవనమున కాధారమైనది తీవ్రమైన ప్రపంచానుభవము. గొప్ప గొప్ప గ్రంథములు పరిశీలించుటవలన కలుగు జ్ఞానముకంటెను మహనీయుల సహవాసమున కలుగు జ్ఞానముకంటెను, నధికమగు నాత్మానుభవమువలన గలుగు వివేకము వేయిమడుంగులుత్తమము. కత్తికంటె వాడియు నగ్నికంటె వేడియు నగు కష్టములును ఆపదలును బాల్యావస్థయందు మనుజునకు పాఠశాలలు కళాశాలలు నయి విజ్ఞానమును బోధించును. మనుజునిజీవన మహత్త్వ మిట్టిదని గుర్తించుట కష్టము. పూర్వజన్మసుకృతమున గాని యీజన్మమున నాపద లనునుపాధ్యాయులు మనుజునకు లభింపరు. మనుష్యత్వమును పెంపొందించునది మహాకష్టముగాని మహాసుఖముకాదు. కష్టము సంప్రాప్తించునపుడు తలమోదుకొనువాడును సుఖము చేకుఱినపుడు శరీరము మరచువాడును పూర్ణముగా నవివేకులు. మోహినీదేవివలె కనుపించిన సుఖము మానవుని దిగుడుబావిలోనికి త్రోసివేసినను త్రోసివేయవచ్చును. మహాభయంకరమగు దుర్గాదేవివలె కనపించిన కష్టము మనుష్యలోక మెన్నడును చూచి యెఱుంగని మహోన్నతకైలాసమును చేతికందించినను నందిచ్చును. కావున యిక్కట్టులు సంభవించునపుడు తలబాదుకొనుటకంటె సంతసించుట న్యాయము. సుఖములు లభించు నాడోడలు మఱచుటకంటె తలబాదుకొనుటయే పాడియగును. ఎంతటి యదృష్టవంతునో కాని కష్టములు వరింపవు. విశ్వామిత్రుడూపినది హరిశ్చంద్రునిగాని ఐశ్వర్యమందు పొరలాడుచు శరీరములు పెంచి దిష్టిబొమ్మలట్లు నిలచిన రాజులనుకాదు. రాహుకేతువులు సూర్యచంద్రులనే పట్టుచుందురుగాని యితర చిన్నగ్రహములను పట్టరు. ఝంఝామారుతము మహోన్నతములగు వృక్షములతో కుస్తీచేయునుగాని గడ్డిమొక్కలతో డీకొనదు. మృగరాజు మదించిన యేనుగుపై బడునుగాని భీతకురంగముజోలికి నెన్నడు పోవదు. అగ్నికుండమును ప్రవేశించు నవకాశమును శ్రీరామచంద్రుడొక్క సీతకిచ్చెనుగాని అనంతకాలము తేజరిల్లు నొక సీమంతినీ చూడామణి కిచ్చెను గాని నిత్యము దోమలట్లు చచ్చుచు పుట్టుచునుండు సామాన్యస్త్రీలకు కల్పింపలేదు. కష్టము లెదుర్కొనినపు డుత్సాహపూరిత మానసులము కావలెనుగాని నిరుత్సాహులము కారాదని మహాపురుషులయు స్త్రీలయు చరిత్ర

ములు వేనోళ్ళచాటుచున్నవి. ఆకాశమునంటు గొప్పమేడయందు వసించుచు మహాదైశ్వర్యమున గడపిన యొకానొకడు మరణాంతమున మహానరకమున బ్రమగ్గనయియు నా ధనికుని మేడచెంతనే యున్న మురికికాలువకడ పడరాని యిక్కట్టులు పడివడి చనిపోయిన మరియొకవ్యక్తి స్వర్గసుఖము చూఱగొనె ననియు నొక బైబిలుకథ చెప్పుచున్నది. దారిద్ర్యముచే గలుగుదుఃఖముగాని యాప్తులమరణముచే సంప్రాప్తించు విచారముగాని యాత్మశక్తి వృద్ధిచేయుటకు మనుజులను చేరును గాని వారి నణగద్రొక్కుటకు కాదు. ఏ దిక్కునులేక యొకని యింట సేవచేసి యెట్టి నీచకార్యములనైనను చేయుటకు సంసిద్ధుడై బాలకుడై యుండియు పూర్ణచంద్రుడు సహనశాంతు లలవరచుకొనినవాడు. పిదప ప్రజల కారాధ్యుడైన ఆవుల్ చాంద్ స్వామిజీ యొక్క యద్భుతజీవనమునకు పూర్ణ చంద్రుని జీవనము కన్నతండ్రి యైనది.

"ఒక భావమునెడల లగ్నమైన మానసమును త్రిప్పుట కెవ్వరికిని సాధ్యముకాదు." అని పూర్ణచంద్రుని జీవితచరిత్ర తెలుపుచున్నది. దృఢసంకల్ప మును మించినశక్తి పదునాల్గు భువనములయందును గానబడదు. మేరుపర్వత మును హిమాచలమును బంతులట్లు లెగురగొట్టవచ్చునేమోగాని దృఢ సంకల్పము నట్టిట్టులాడింపగల శక్తి కానబడదు. అసాధ్యమును సాధింపగలిగినది దృఢనిశ్చయము. ఇట్లని పురాణములును చరిత్రములును చాటుచున్నవి. ఆర్య నారీశిరోమణి సావిత్రి అసాధ్యమును సాధించినది. ధ్రువు డసాధ్యమును సాధిం చెను. తమ్ముగుర్తింపక సామాన్యమానవులు గేలిచేసినను, వెక్కిరించినను లెక్క సేయక తమదారిని తాముపోయి జయాపజయము లెట్లున్నను తమ క్రియల యందు తమ అద్భుతశక్తిని వ్యక్తపటిచి 'దృఢచిత్తులు' పెక్కుశతాబ్దములు జోహారు లందుదురు. ఎనిమిదేండ్ల బాలుడయ్యు తాను నెఱవదలచిన పవిత్రజీవ నమునకు భక్తిపూరిత జీవనమునకు తనకన్నముపెట్టుచున్న యజమానియే యడ్డునిలిచినపుడు తనగతి యేమగునని యాలోచింపక యాకలిబాధకుగాని దుర్మరణ బాధకుగాని జంకక తన యున్నతోద్దేశసిద్ధికై పాటుపడుటకు కృత నిశ్చయుడైన పూర్ణచంద్రుని దృఢసంకల్పమెట్టిదో పాఠకులు గ్రహించి యుందురుగాక.

౨౮

# కమలాకాంతస్వామి



"చ. బ్రతికిననాళ్లు గాళ్లు పలుతాట్లిటు పొట్టకునై పడంగ గ్రా
సితివొకొ నాముఖంబున నిసీ! మనదే చిరకాలజీవినై
గతి చెడి వాయసం బటులఁ గాక భవచ్చరణాంబుజాతసం
గతి విహరించు బంభరముగా ననుఁ జేయవె వేగ శ్రీహరీ!"

వంగదేశమునగల బర్ద్వాన్ జిల్లాలోని అంబికాకాల్నా అను గ్రామమున వంగశకము 1179 సంవత్సరమున నితడు పుట్టియుండెను. ఈతని జనకుడు వైదికవృత్తియందు కాలక్షేపము చేయుచుండువాడు. కమలాకాంతుని చిన్నతనముననే తండ్రి పరలోకగతు డయ్యెను. దుర్భరదుఃఖమున మునిగియున్న యీతని జనని యీతని నెట్లో యూరి పాఠశాలకు పంపుచుండెడిది. ఈతడు ప్రతిదినము తప్పక బడికరుగుచు శ్రద్ధతో పాఠములు చదువుచుండువాడు. మాతృభాషయందేగాక సంస్కృతమందుగూడ కమలాకాంతుడు ప్రజ్ఞను సంపాదించెను. శైశవమునందే యీతడు గ్రంథరచనకు ప్రారంభించెను. అంత చిన్నతనమునందు ప్రారంభించిన కవిత్వమయ్యును నీతని కవిత్వమున రసము చిప్పిల్లుచుండెడిది. కవిత్వముతోపాటు సంగీతమునందుగూడ నితడు ఆసక్తిగలిగియుండెను. కమలాకాంతుని కంఠస్వర మతిమధురము. సహజమాధుర్యముగల కంఠస్వరమగుటచే నితడు పూర్వజన్మమునయందే సంగీతమున నేమహనీయుని చెంతనో సాధకము చేసిచేసి ప్రవీణుడై మరణించి యీజన్మయందు పుట్టియుండనోపునని పలువు రూహించుచుండిరి. సంగీతసాహిత్యాదికళలకు కమలాకాంతుడు పట్టుగొమ్మయైనట్లే సద్గుణములకుకూడ నీతడునికిపట్టు. వినయమునందును భక్తియందును శాంతమునందును భూతదయయందును నతని కతండె సాటి. ఉన్నది యున్నట్లు తెలుపుట యితనికి వెన్నతోడపెట్టినది. బర్ద్వాన్ జిల్లా యేలికయగు మహారాజాధిరాజు తేజచంద్ర

బహాదూర్ ఈతని గుణగణములు విని యలరి వంగశకము 1316 సంవత్సరమున నితని నాస్థానపండితునిగ జేకొనెను.

కమలాకాంతుని హృదయమున నితని తల్లిదండ్రులే ధర్మబీజమును నాటి యుండిరి. ఈబీజము తేజచంద్రమహారాజుయొక్క అనురాగమనెడు జలముచే మొలకెత్తజొచ్చెను. రాజసభయందు తాను చేయవలసిన కర్తవ్యములను నిర్వర్తించి తక్కిన కాలమతడు దుర్గాదేవి యారాధనమున గడపుచుండువాడు. సంగీతమును కవనమును చిన్నతనమునందే యాతడు తనసొమ్ముగావించుకొన్న వాడు కావున నా దేవి యారాధనమున నీతడెన్నో గీతము లల్లుచుండువాడు. ఈతని గీతములయందు గల భక్తిప్రబోధముచే జడపదార్థములును తన్మయనృత్యము సలుపుచుండెడివి.

తనయాస్థానపండితుడు గొప్పభక్తుడని గ్రహించి తేజచంద్రబహాదూర్ యాతనిని తనకాచార్యుని గావించుకొనెను. బర్ద్వాన్‌నగరసమీపమున గల కోటాంహాట్ గ్రామమున నీతనికై చక్కని యిల్లొకటి గట్టించి యిచ్చెను. కుటుంబసహితుడై కమలాకాంతు డందు వసించుచుండెను. కమలాకాంతు డెపుడు పరిణయమాడెనో తెలిసికొనుటకు తగినయాధారములు కానరావు. క్రొత్తయింటిలో చేరినప్పటినుండి యానందోత్సాహములతో నాతడు పూజలు సలుపుచుండువాడు. పూజలు చేయుటకును భజనలు సలుపుటకును కమలాకాంతుని కొఱకు తేజచంద్రుడు ప్రత్యేకభవనమును నిర్మింపచేసెను. పూజాదుల కగు వెచ్చమంతయు మాసమాసము విడువక తేజచంద్రుడాతని కిచ్చుచుండువాడు. దసరాపండుగలలో నతివైభవముగ దుర్గపూజచేయించి దానికగు ఖర్చునంతయు రాజే భరించుచుండువాడు.

కమలాకాంతుని భార్య యందకత్తె కాదు. గుణవతి; దయార్ద్రహృదయ; ధర్మపరాయణ. పతియే స్త్రీలకు దైవతమని మనోవాక్కాయములనమ్మి యను దినమామె హృదయేశుని పాదపూజ గావించెడిది. భర్తృపాదోదకమును గ్రోలక యామె యెన్నడు నాహారమును భుజించునదికాదు. భర్తపై నామె కెంతభక్తిగలదో భర్త కామెయెడ నంత యనురాగముండెడిది. రమణీహృదయము నెఱుగని సంసారిహృదయము చవిటిపఱ్ఱయని కమలకాంతుడెఱుంగును. రమణీహృదయము ఉత్తమగుణములచే ప్రకాశించుచుండునని యాతడు గ్రహిం

చుట కాలస్యము పట్టలేదు. సంసారమునందు జనియించు దుఃఖశతములను నివారించి సుఖదాయకముగ నొనరించుటకు దివారాత్రములు పాటుపడునది స్త్రీయని యతడు గుర్తించెను. "పురుషుడు దుర్గుడు కావచ్చును. కఠినుడు కావచ్చును కాని స్త్రీయట్లు కాజాలదు. ఆమె ప్రేమస్వరూప; ఆమె కమనీయభావముల కునికిపట్టు" అనియతడు భావమున తలంచుచుండువాడు. తీవ్రమగు భావములచే నొక్కొక్కప్పు దుగ్రుడగు పతియొక్క మానసమును శాంతవచనములచే చల్లపఱచునది గుణవతియగు పత్నియని కమలాకాంతుడు తలచుచుండువాడు. తన సహధర్మచారిణి మూలమున స్త్రీలయొక్క ప్రకృతి గ్రహించినవాడై స్వామిజీ స్త్రీలను మిక్కిలి గౌరవించుచుండువాడు.

తేజచంద్రమహారాజు నొద్ద పెద్దయుద్యోగియైయున్న యాతడొక్కడు గార్హస్థ్యధర్మ మొనర్చుచున్న కమలాకాంతుని కడకువచ్చి "మహాశయా! పవిత్రజీవనమునకు కామినీకనకములు విఘాతములు కదా! మీరువీరిని పరిత్యజింపక సాధనభజనలు ఎట్లు సల్పుచున్నారు." అని ప్రశ్నించెను. స్వామిజీ యతనికిట్లు ప్రత్యుత్తరమొసంగెను. "భూతలమున నారీమణులు భగవతియొక్క అంశరూపిణులు 'స్త్రియః సమస్తాః సకలజగత్' అనుట యెఱుంగవా? సంసారమందు సులువుగ లభింపని యమూల్యరత్నము స్త్రీ. అట్టిరత్నము సాధనభజనలకు విఘ్నముకాజాలదు. సాధ్వియైన స్త్రీనిగుఱించి శాస్త్రమేమి తెలుపుచున్నదో చూతము.

నాస్తి భార్యా సమోబంధుః నాస్తి భార్యాసమాగతిః
నాస్తి భార్యా సమోలోకే సహాయో ధర్మసంగ్రహే॥

"సాధ్వియైన భార్యయే భార్య. ఆమెనే సహధర్మిణి యనజెల్లును. సాధనమునందును, సంకీర్తనమునందు , పూజయందును పతికి తోడుపడజాలునది యామెయే. తంత్రశాస్త్రమున చెప్పబడిన 'శక్తి' యనుపదమామెకే చెల్లును. ఆమెయే పతిక్రియానుకూలాంతరంగిణి అర్ధాంగి యనదగు సీమంతినీ చూడామణి ఆమెయే. కామినీకాంచనములందు చెప్పబడిన కామినియు నీమెయు నొక్కటికాదు." ఉద్యోగి స్వామిజీవాక్యములను విని సంతుష్టాంతరంగుడై యాతనికి శిష్యుడయ్యెను. పిదప కొన్నియేండ్లకు స్వామిజీభార్య

స్వర్గస్థురాలయ్యెను. పత్నిశరీరమును చితిపైనిడి, కమలాకాంతుడు మధురకంఠస్వరముతో సంకీర్తనమొనరించుచు నృత్యముచేయదొడగెను.

ఆహా! సంగీతముయొక్క శక్తియెట్టిది? గానము మోహినికదా. సంగీతరవమువిని విషోరగము పడగయెత్తి యాడును. ఏడ్చుచున్న పసిబాలుడు యేడ్పుమాని కిలకిలనవ్వును. అడవిలోని క్రూరమృగము గీతారవము విని సాధుజంతువగును. దుస్సహదుఃఖమునందు మునింగిన యాతడు చింతమఱచి యానందమందును. భగభగమండుచున్న చితిచెంత తన్మయత్వమున నాట్యమొనరించి యర్ధాంగియొక్క అంత్యక్రియలు నిర్వర్తించి మహాసంతోషమున కమలాకాంతు డింటికి జనెను.

ఒకనాడు కమలాకాంతస్వామి స్వగృహము విడచి పొరుగూరి కేగుచుండెను. 'ఒడగాయ' యను నొకగ్రామముసమీపమున నొకపుంతదారిని పోవుచుండగా నతనిని బందిపోటుదొంగలు పట్టుకొనిరి. యమకింకరులచేతబడిన ప్రాణియైన తప్పిపోవుట కలదుగాని యీబందిపోటులచేత బడి తప్పించుకొనిన ప్రాణి యింతవరకు నొకండునులేడు. బందిపోటులు బల్లెములు కత్తులుబూని మీదికురికినపుడు ఆసన్నమగుచున్న మృత్యువును గ్రహించి కమలాకాంతుడు పరమానందమున హరినామసంకీర్తనము గావింప మొదలుపెట్టెను. అతిమధురమగు నాతని సంగీతరవము వినినంతనే బందిపోటుల మనసులు కఱగిపోయెను. స్వామికి నమస్కరించి వారు వెడలిపోయిరి.

మహాకష్టములు సంభవించినపుడు సామాన్యమానవులు ధైర్యమును గోలుపోయి "ఏమిబుద్ధిదేవరా!" యని చింతింతురు. రానున్న యాపద తనకెగ్గుచేసినను మానినను వీరినావహించిన భయమే వీరిని ముందు క్రుంగదీయును. భయము సరిగా ఆయువుపట్టును చేబట్టును. భయముచెందిన మానవుని గుండెలు దడదడలాడును. మనసు చెదరిపోవును. కాలుసేతులు వడంకును. భీతిచెందినమానవుడు తానున్నను చచ్చిననొకటియే యని భావించును. అట్టి సమయమున రక్షణోపాయమేమి యని యాతడు విచారింపనేరడు. 'చచ్చితినిరా' యని నేలగూలి మృత్యుదేవతకు ప్రాణములర్పించివేయును. గుండెపగిలి చచ్చును. మానవుని విజయమునకు ప్రతిబంధకము భయమే. ఎటువంటి యత్నమునైన నీభయము పీకపట్టి నొక్కివేయును. భయమావ

హించినతోడనే మానవుడు ముందునకడుగిడనేరక వెనుకంజవేసియో వెలికిల పడియో ప్రయత్నము మానుకొని యెందునకును కొరగానివాడగును. ఇతడు విశేషప్రజ్ఞావంతుడైన మేధావికావచ్చును. ఇతడు సర్వశాస్త్రముల చదివిన వాడు కావచ్చును. ఇతడు చూడని యద్భుతములు లేకపోవచ్చును. కాని యితడు భయమును జయింపకపోయినచో నీతడు చదివిన చదువులును పొందిన విజ్ఞానమును యీతడు సంపాదించిన యనుభవములును నిరర్థకములు, నిష్ప్రయోజనములు. పిరికితనమువలన కొండంతశక్తి గోరంతయగును. ఆధ్యాత్మిక (ఆత్మసంబంధమైన) జీవనమున మానవుడు భయరహితుడై యుండవలెను. యోగి యోధవరుని మించిన యోధుడు. యోధుడు శత్రువులనుజంపి తనధైర్యమును చూపును. యోగియంతరంగశత్రువులను జంపి మహాయోధుడనిపించుకొనును, మహారథుడనిపించుకొనిన, శ్రీకృష్ణభగవానుడు గీతాచార్యుడు పాండవులను మహారథులని పేర్కొనినాడు. సంయమగుణమున (హింసాదిగుణముల విరమించుట) నారితేరిన యమునకను దృఢసంకల్పమునందును సహనగుణమునందును తనకు తానే సాటియనిపించుకొని దూర్వాసుని వరమును పొందినకుంతికిని పుట్టి, తల్లిదండ్రుల గుణములను తనజీవనమున వ్యక్తీకరించిన యుధిష్ఠిరుడును, సగుణోపాసనమున నద్వితీయుడై వరలిన భీముడును, పరమార్థమును జయించిన నిర్గుణోపాసకుడగు అర్జునుడును, త్యాగ; తితిక్ష (ఓర్పు లకు మారుపేరులైన నకులసహదేవులును అంతరంగశత్రువులను జయించి కర్మక్షేత్రములగు తమ తను తనువులను ధర్మక్షేత్రములు చేసి మహారథులైరి. లోని విరోధులకు లొంగిపోయినకౌరవులు ఈమహారథుల మ్రోల జయద్రథులైరి. కౌరవపాండవయుద్ధము బాహ్యయుద్ధము కాదు. అంతరంగయుద్ధము. అర్జును డెదుర్కొనినవిరోధులను మీరును నేను నెదుర్కొనవలెను. యుద్ధప్రారంభమున నర్జునుడు కన్నీరొడ్చుటగాంచి దేవదేవుండగు శ్రీకృష్ణభగవానుడు పిరికితనముకూడదని దెలిపి మనుష్యజీవనతత్త్వమును (స్వభావమును) ఆతనికిబోధించెను. దానిని తెలిసికొని ధైర్యము తెచ్చుకొని యర్జునుడు నేలపారవేసిన గాండీవమును లేవనెత్తిరిపులను చెండాడ బూనుకొనెను. లోనిశత్రువులను జయించుటకు దైవముయొక్కహితోపదేశము మానవున కనివార్యము. ఈహితవేయజ్ఞానమును పారద్రోలి మానవునకు ధైర్యము చేకూర్చును. ఈధైర్యము

మనుజుని విజయుని గావించును. "అంతరంగవైరులను నిర్జించిన యోధుడే మహాయోధు డనిపించుకొనును." అని బుద్ధభగవానుడు తెలిపినాడు.

ఈ శత్రువులను జయించిన కమలాకాంతుడు భయరహితుడయ్యెను. డెందమునందలి పగతురను మనస్సునందలి దొంగలను ఉల్లమునందలి తాల్మిని హరియింపనెంచిన బందిపోటులను అణచిన మహావీరుని బాహ్యశత్రువు లేమి చేయగలరు. భయమునుంతరించిన నాడే మనుష్యత్వము తలచూపును.

భయరాహిత్యమును గూర్చి శ్రీఓంకారస్వాములవారేమనిరో గమనింపుడు. "ఏవిధమగు భయమును లేకుండువారు మనజీవితములో చాలా అరుదుగా కనుపించుచున్నారు. దేహాజ్ఞప్తియున్నచోట భయముండక తీరదు. దైవజ్ఞప్తిగలవారలకు భయముండ నేరదు. పని హెచ్చుగానున్న భయపడువారు కొందరు. ఎండ కొంచెమెక్కువగా నున్న భయపడువారు కొందరు. మఱికొందరింకను కొన్నికొన్ని విషయములలో భయభ్రాంతులగువారు కలరు. వైరాగ్యము గలిగినంతనే భయము పటాపంచలై పోవును. ధైర్యశాలికి మరణమొకపర్యాయమే యనియు పిరికివా డనుక్షణము మరణార్తి నొందుచుండు ననియు నొక మహామహుడు చెప్పియున్నాడు. ఒకప్పుడొక గ్రామమున నంటువ్యాధి వ్యాపించి జనులు విపరీతముగా చనిపోవసాగిరట. అంతట నాగ్రామవాసులు గ్రామదేవతను ప్రార్థింపగా నామె ప్రత్యక్షమై వేయిమందిని మాత్రము చంపుదుననియు నంతకు మించి చంపననియు సెలవిచ్చెనట. కాని యాతరుణమున వేనవేలు మనుజులు మరణించినందున తిరిగి యా గ్రామవాసులు, అట్లేల జనుల నంతమొందించితివని యా దేవతనడుగ నట్లు తాను చేయలేదనియు తాను వేయుమందినే చంపితిననియు మిగతావారెల్లరు మరణభయము చేతనే మరణించిరనియు చెప్పెనట. కావున భయమే సర్వానర్థములకు కారణము.

భయరహితులముగా నుండనెంతుమేని భగవాను నాశ్రయింపవలెను. చీకటి పోవలయునన్న కిటికీలను తలుపులను తెరచి యుంచవలయును గదా. రాత్రిపడినచో దీపమును వెలిగింపవలయును గదా. మనము శాంతిమయులముగా నుండనెంతుమేని భయము లేశమేని లేక యుండనెంతుమేని దైవమును సదా జ్ఞప్తియం దుంచుకొనవలయును. దైవమును పూర్ణముగా మరచుటచే

పూర్తిగా భయభ్రాంతులకు మార్గమగుచున్నది. దైవజ్ఞప్తి యనగా దైవ నామము ననేకసారు లుచ్చరించుటకాదు. 'దైవము దైవ' మని యరచువా రందరును దైవానుభవము గలవారు కారు. తమయందు నఖిలభూతములందును కూడ సూదిమొన మోపువ్యవధిలేక జగదీశ్వరుడే నిండియుండెనని గ్రహించి యనుభవింప గలిగినవారు భయవిహ్వలులుగా నగత్యములేదు. ఏదైవము మనప్రాణమునకు ప్రాణముగా నుండెనో యెల్లవస్తువులయందును యేదైవము సాక్షిమాత్రుముగా వెలుగుచుండెనో అట్టి భవ్యమూర్తిని క్షణమేనియు మరువకుండువారిదే యథార్థమగు జీవితము. అట్లుకానివారి దంతయు మరణ తుల్యమగు జీవితము. బాహ్యాభ్యంతరములయందు దైవవిశ్వాసము కలిగి యుండుటయే యథార్థజీవితము. మనమెంత యారోగ్యవంతులమైనను యెల్ల సౌఖ్యముల ననుభవించుచున్నను దైవమును మరచి యుంటిమేని యితరుల దురవస్థను చూచినప్పుడేనియు విచారము మనకు కలుగకపోదు. ఒకచిన్న మాటచే నొచ్చుకొనువారనేకులున్నారు. స్వల్పమైనమాటలకే మన మిట్లు భయకంపితులమయి పోవుదుమే! క్రీస్తు దేహమును చిలువపైనుంచి శరీరమున మేకులుకొట్టు సమయమునందైనను "యిట్లు చేయువారలు పాపము వారు చేయు దుండగము నెఱుగలేనంత యజ్ఞానులుగ నున్నారుగాన నోదైవమా వారిని మన్నింపు" మని ప్రార్థించునంతటి యోర్పు గలిగియుండుటయు మనము స్వల్పవిషయములో గూడ మనోవ్యథ నందుటయు అయనకుగల భగవన్నిరీక్షణను మనకుగల యైహికేచ్ఛలను వ్యక్తపరుచుటలేదా? వెలుతు రున్న ప్రదేశమున నంధకారముండజాలనట్లే దైవానుభవమున్నచోట భయ మునకు తావుండదు. కుక్క మొరిగినను మనము జడియుదుమేని యది యింకను మీదికివచ్చును. నిర్భయత్వముతో నిలతుమేని యది వెనకకు బోవును. కాశిలో నొకడు కోతులను చూచి భయపడి పరిగిడదొడగెను. అవియు నాతని వెంబడించెను. అపు డాదారినిపోవు నొక డదిచూచి పరుగిడవలదని యతనిని వారింప నతడు నిలబడెను. కోతులు వెనుకకు తిరిగి పోయెను. స్వశక్తిపై నాధారపడి నిర్భయులమైయుండ గలిగితిమా చింతింపనవసరము లేదు. ఆత్మజ్ఞప్తితో నిండియుండి దైవానుభవమును పొందుచున్న యెడల నిత్యానందమున మునిగి చింతావర్జితుల మగుదుము. కాన భయములన్నిటికి

విదూరమైన జీవితమును గడుపనెంచితిమేని అపుడు మనకన్యముగా లేక హృద యమున నధివసించుచున్న యాసర్వేశ్వరుని మనలోనే యనుభవించుచు ఆనందము నొందుచుందుము.

భర్తృహరి విరచితమగు వైరాగ్యశతకమునందలి యీక్రింది శ్లోకము వలన దీని భావము చక్కగా తెలియగలదు.

శ్లో. భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం
మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయాభయం
శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాంతాద్భయం
సర్వం వస్తుభయాన్వితం భువి నృణాం వైరాగ్య మేవాభయం.

ఆత్మోన్నతి కడ్డునిలుచు మహాశత్రువులలో దుఃఖము మఱొకటి. భయముచేయునంత చెఱుపును యిదిచేయును. దుఃఖము భయమునుండి పుట్టును. దుఃఖమునకు దాసుడైన మానవుడు గోతియందు కూలివానికైవడి క్రుంగి పోవును. ఈతని చూచి జాలిపడుటకు మాఱు ప్రజలు వెక్కిరింతురు. దుఃఖితు డంచునది అపజయము. దుఃఖమును పోద్రోలినగాని మానవుడు ఆత్మోన్నతి నందజాలడు. ఆత్మోన్నతికి హృదయదార్ఢ్య మవసరము. భయమును దుఃఖ మునులేని హృదయము కంటకరహితమైన గులాబివలె సుందరమై పవిత్రమై యుండును. భయమును దుఃఖమును జయించినవారిని చూచి యముడును గడ గడ వడకును. ఏశత్రువును గానక యొందరిగినను యితడు స్వేచ్ఛావాతూల మును పీల్చును. నందనసౌరభమును దనివార పడయును. ముక్తి యితనికి కరతలామలకమగును. ఈతని చూచి యాపద లాకసమున కెగయును. అర్ధాంగి చనిపోయినపుడు కమలాకాంతుడును, కూతురు మరణించినపుడు విజయకృష్ణుడును, సామాన్యమానవులరీతి యేడువక మహాసంతోషమున నృత్యము చేసినారు. వీరు యిహజీవనమునందే ముక్తినొందిన మహనీయులు. వీరిని చూచి జగదీశుడు గర్వపడుననుట తథ్యము.

కమలాకాంతస్వామిజీ యెన్నేండ్లు జీవించెనో తెలిసికొనుటకాధారము లేవియు దొరకలేదు. కమలాకాంతుడు తన యవసానదశను తానెఱిగి తేజ చంద్రమహారాజును తనకడకు రావించెను. వ్యాకులచిత్తుడైయున్న తేనికి

పరమార్థవిషయిక యంశములను బోధించి యతని యుల్లమును చల్లపరచెను. కడముహూర్తమున నాతడు "నేనిక నిష్క్రమించవలసిన సమయ మాసన్నమాయెను, నన్ను నేలమీద పరుండబెట్టుము" అని యాతడు తేజచంద్రునితో బలికెను. స్వామిజీ శరీరమునుండి యాత్మకళకుంతము బయలువెడలు సమయమున భోగవతీనది యుబికి యెల్లరి నాశ్చర్యమున ముంచెనని నేడును వంగ దేశస్థులు చెప్పుకొనుచుందురు.

చ. మన మొక కోతివంటిదని మాన్యులు శాస్త్రములందు చెప్పినా
రనుభవజన్యమైన పలుకయ్యది యేలన దైవమందు నో
క్కనిమిషమైన నిల్వక విఘాతములన్ గలిగించు యోగ్యుడై
మన జతనంబులన్ సలుపుమానవు చిత్తము బత్తిత్రాట నా
మనసును గట్టి గట్టిగను మంచిదిగా నొనరింపు రాఘవా!

చ. బ్రతికెడు మూడునాళ్లు జవరాండ్రకొ కల్మికొ దేవులాడుచున్
మది నుపశాంతియన్న దణుమాత్ర మెఱుంగక దుర్వ్యయంబొన
ర్చెదరు స్వకాలమంతయు ధరిత్రిని బెక్కురు నీతి పూర్తిగా
వదలిరి యెంత ఘోరకలి బాపవె దుర్దశలెల్ల రాఘవా!

---

## ౨౮

# శ్రీవిశుద్ధానందస్వామి



మ. తనపెండ్లాము కొమారుఁడో కొమరియో తన్బెంచువారో ప్రియం
బును బుట్టించు మతెవ్వరో మహిని దన్వేన్ వీడినన్ హెచ్చుగా
ననుతాపానల తప్తచిత్తుఁడయి మాయాబద్ధ మీజన్మమం
చును వేదాంతపుమాట లాడును గడుం జోద్యంబుగన్ గాని, యా
తనివైరాగ్యము నిల్వదవ్వలను చిత్రం బెంతయున్ రాఘవా!

క్రీ. శ. 1805 సంవత్సరమున దక్షిణదేశమున కల్యాణి యనుగ్రామమున విశుద్ధానందస్వామి జన్మించెను. ఈతని జనని యమునాదేవి, జనకుడు సంగమలాల్. బ్రాహ్మణులు. ఆర్యావర్తమునందలి బౌడీగ్రామమునందు సంగమలాల్ జన్మించెను. ఈతని చిన్నతనముననే జనకుడు పరలోకగతుడయ్యెను. తండ్రి చనిపోయినంతనే యేదిక్కును లేనివాడై యిందందు తిరిగి తిరిగి తుదకు దక్షిణదేశమందలి యీకల్యాణి యనుగ్రామము చేరుకొనెను. నవసుఖరాము డనునొక బ్రాహ్మణుడు బాలుడైన సంగమలాలును చూచి జాలినొంది తనయింట నాతని కాశ్రయమొసగెను. నైజాముక్రిందనుండు మోహన్ షాహ యను నవాబునొద్ద సేనానాయకుడును మున్సుబాదారును అయిన యొక వీరపురుషునికడ నవసుఖరాముడు పనిచేయుచుండువాడు. యమున బాలిక యీతని చెలియలు. సంగమలాల్ మిగుల బుద్ధిమంతుడును నెమ్మది గలవాడును అగుట చూచి సుఖరాముడు యమున నాతనికిచ్చి పెండిలి సేయ దలచెను. మొగమెఱుగని యీతని కులధర్మమేమో యెఱుగక వివాహమునకు దలపడుట కూడదని యోచించి రహస్యముగ నతడు సంగమలాల్ను గుఱించి వాకబు చేయదొడగెను. బాలుని వృత్తాంతమంతయు నెఱిగి తృప్తి పొందినవాడై సుఖరాము డొకసుముహూర్తమున చెలియలి నాతనికిచ్చి పెండ్లి చేసెను. ఈదంపతుల సంతానమే యీవిశుద్ధానందస్వామి.

వివాహమైన కొన్ని యేండ్లకే సంగమలాలున కిరువురు పుత్రులు కలిగిరి. కాని పుట్టిన కొలదినాళ్లలోనే యాబిడ్డలిరువురు మృతినొందిరి. స్వామిజీ వీరి మూడవ శిశువు. శిశువునకు మొదటిసంవత్సరము దాటగానే తండ్రి హోమ యాగపూజార్చనాదులను జరిపి బిడ్డకు వంశీధరుడని పేరుపెట్టెను. దురదృష్ట వశమున బాలునకు మృగీరోగము సంక్రమించెను. ఈశిశువుకూడ తనకు దక్కడని యమునాదేవి కడుంగడు విచారింపసాగెను.

ఇట్లుండ నొకనాడు కల్యాణియందొకక్షత్రియస్త్రీ సహగమన మొన రించెను. సహగమన మొనరించు స్త్రీయొక్క అంతిమ యాశీర్వాదము యెన్న డును వ్యర్థము కాదను నొకనమ్మకము ఆప్రాంతవాసులందుండెడిది. ఆక్షత్రియ రమణి చితిని చేరుతటి వేలకొలది తల్లులును తండ్రులును తమబిడ్డలను చంక బెట్టుకొని యామెకడ కరిగి దీవనల నందుచుండిరి. ఇతరయిల్లాండ్రతో గలసి యమునాదేవి వంశీధరుని చంకబెట్టుకొని యచటికి పోయెను. క్షత్రియాంగన యమునాదేవిని విలోకించి "సోదరీ! నీవు భాగ్యవతివి. నీకొడు కొక మహా యోగి యగును. అకాలమృత్యువు యీతని చేరరాదు" అనెనట. ఆమె యాశీర్వాద మందినంతన వంశీధరుని మృగీరోగము మానిపోయెను. కాని కొలదిదినములకే మఱల నారోగము తలసూపెనట.

మంటగలిసి మటుమాయము కానున్న మగువ యోర్తు గొప్పజోస్యము చెప్పినదనియు నాజోస్యము తప్పక జరిగెననియు నెవ్వరును నమ్మరాదు. ఆక్షత్రియాంగననుబోలు అభాగిను లెందఱో మూఢభక్తికిని మూఢాభిప్రాయ ములకును లొంగి దుర్మరణమునోట జొచ్చియుండుట నిజమే. సహగమనము ప్రబలియున్నరోజులలో సహగమనము గావించిన స్త్రీలందఱు నిష్టపడి యా ఘోరక్రియకు గడంగిరనియు బ్రతికియున్నంతకాలము వారు మహాపతివ్రతలై యుండిరనియు తలచుట తప్పు. తమంత తామా దారుణకృత్యమునకు కడంగిన యాడువారిసంఖ్య మిక్కిలి స్వల్పము. ఈదురంతక్రియ నెందఱిచేతనో బల వంతముగా చేయించినది సంఘము. గయ్యాళులై మాత్రముండక రక్తమాంస సములుగల పిశాచములై బ్రతికియుండగా భర్తల గుండెరక్తమును పీల్చిపీల్చి వారి ప్రాణములను కడముట్టించి తుదకు వారిచితిపై నెక్కినస్త్రీలు తమంత దామే యట్లొనరించియుండిరా? మొట్టో యని యేడ్చు యాడువారి నెందఱిని

యీనాటి సంఘము కాలుసేతులు గట్టిగ పట్టుకొని శరీరములకు నేయి రాచి బలవంతముగా చితి మంటపై విసరి వారేడ్చుచుండ బాజాలు వాయించుచుండలేదా? సంఘ మేమిచేసినను చెల్లితీరును.

ఇది నిరంకుశత్వమనియు దౌర్జన్యమనియు నెవ్వరయినపలికిన వారితల వేయివ్రక్కలయి నేల పడవలసినదే. ఇది కేవలము నజ్ఞానమని యెవ్వడేని వాక్రుచ్చినచో వాడు తనజీవితముపై నాశవదలుకొనవలసినదే.

జ్ఞానము బజారులో చవుకగాదొరికి కడుపునబడు తియ్యని మిఠాయి కాదు. దీనిని గ్రహించుటకు నేండ్లును పూండ్లును పట్టును. కోట్లకొలది జన్మములు కూడ పట్టునని సనాతనమతము తెలుపుచున్నది. హిందూధర్మము తెలుపు "కర్మ" యననేమి? అభివృద్ధి పథమున మానవు డగ్రసరుడగుటకు జన్మలనేక మొసగి తుదకాతని జగదీశునితో చేర్చునది కర్మ. మానవుడు సంపూర్ణజ్ఞానమందుటకు కర్మయను కళాశాలయొకటి ముఖ్యముగా నవసరము. కర్మయొక్క కర్మాగారమం దెంతేని జ్ఞానము తయారగును. ఒక్కొక్క జన్మయొక్కొక్కతరగతి. ఒకతరగతియందు అపజయ మందినవానికి గురువు విజయార్థము శిష్యునకు మఱొక యవకాశమిచ్చిన విధమున నొకజన్మయందు జ్ఞానమును పొందక నేలగూలినవానికి వేఱొకజన్మయను నవకాశ మిచ్చును. పరిపూర్ణజ్ఞానము చేకూరుటకు యెంతకాలము పట్టునో తెలియజాలము. "సోహమ్" (అతడే నేను) అని చెప్పిన మహనీయుడు యెన్నెన్ని తరగతులు దాటి కడతరగతియందు ప్రవేశించియుండును. నారాయణునికంటె నొకమెట్టు దిగువయందుమాత్రముండిన నరుడు యెన్నెన్నితరగతులు దాటి ధనంజయుడును విజయుడును నైనాడు. బుద్ధుడు బుద్ధుడగుటకు మున్నెన్ని జన్మ లెత్తవలసియుండెను. నరుడందిన విజ్ఞాన మెన్నేండ్ల తపస్సునుండి పుట్టినదికాదు. బుద్ధుడు కాంచిన దివ్యాలోకనము యొకనాటిసంపాదనమా? శంకరాచార్యుడు వడసిన జ్ఞానమెక్కనాటిదా?

జ్ఞానము మేధస్సునతోచి యది యందే నిలిచియుండరాదు. అందుండి యదిహృదయమందుజొచ్చి ప్రత్యక్ష జీవనమున గోచరింపవలెను. జ్ఞానము వట్టి భావములకును మాటలకును చెందినదే గాక క్రియకుకూడ చెందినదని చెప్పవలసియున్నది. జ్ఞానముయొక్క నిజస్వరూపము క్రియయే. క్రియయందు

చూపట్టక తలపునందును మాటలయందును దాగి యదృశ్యముగా నుండునది జ్ఞానము కాజాలదు. లోభియగు సెట్టియొక్క యినుపపెట్టెలో పదిసంచులున్న నేమి లేకున్ననేమి? జ్ఞానము ప్రత్యక్షజీవనమునందును బాహ్యప్రపంచమందును, తోచినపుడే సార్థకమగును. కర్మయన క్రియ. కర్మ జ్ఞానముయొక్క కర్మాగారము. కర్మతో సంబంధములేని జ్ఞానము జ్ఞానముకాదు. జ్ఞానముయొక్క పునాది బలమైనభావము. మనసునందు భావము బలవత్తరమైనగాని యది క్రియయందు గోచరింపజాలదు. కట్టెయందు చాలసేపు కుమిలి కుమిలి రాజిన యనంతరమునగదా అనలము జాజ్వల్యమానమై కనుపడును. జ్ఞానమును నట్లే హృదయమందు బాగుగ వికాసమానమయి బాహ్యజగతియందు ధగద్ధగాయమానమగును.

జ్ఞానము బీజమువంటిది. గింజ గుణము తేటపడుటకు గింజ పడిననేల యొక్కసత్తువ ప్రధానవిషయము. నేలననుసరించియే యందుండిపుట్టు వృక్షము యొక్క శక్తియు నున్నతియు నుండును. చవిటిపఱ్ఱవంటి మనస్సున జ్ఞానబీజము పడనేవడదు. పడినను నది లోనికి చొరక నిమిషములో నదృశ్యమగును. భావము లోతుగ మనసుననాటినగాని యది మహోన్నతజ్ఞానమహీరుహము కాజాలదు.

నేలయందు గింజ చేరుటకుముందు నేల చక్కగా దున్నబడవలెను. దుక్కియెఱుగని నేలపై విత్తనము లెన్నిపడిన నేమి ఫలము. మననము, నిధి, ధ్యాసము లెఱుగని మనసున పడినభావమును నట్లే వ్యర్థమగును. ఏమహానీయుడో యొక మంచిమాట చెప్పినప్పుడు 'శబాస్' అని నంతనే జ్ఞానము లభించినదని మనము తలపరాదు. మంచి భావ మొకటి మనస్సున తట్టినపుడు మంచి మాట యొకటి వెలువడిన గాని మంచిపని యొకటి గోచరించిన గాని జ్ఞానము పట్టుబడినదని యోచింప రాదు. ఇట్లు గోచరించిన క్రియ చాల కాలము నిలువదు. దీనికిపిదప దుష్క్రియలెన్నో తలచూపవచ్చును. సద్భావము మనసున బలమై నిలిచినపుడు యెత్తయిన కోటగోడను భేదింపలేక వెనుకకు మఱలు శత్రుసైన్యమువలె దుర్భావములును దుష్క్రియలును ముందునకు పోజాలక పోవును. తనయందు మంచి తలపును యిముడుచుకొనుచున్న మనసు ముద్దను తనయందు చేర్చుకొని తాను శక్తినొంది శరీరమునంతటికిని శక్తి నిచ్చు

ఉదరమువలె తాను బలవంది వ్యక్తి జీవనమునకంతకు బలమునిచ్చును. నమలి మ్రింగినగాని ముద్ద కడుపున ప్రవేశింపనట్లు నేకాగ్రదృష్టియందు జొచ్చి గాని భావము మనసున ప్రవేశింప జాలదు. భావమును మనసున జీర్ణింప జేయునది మననము. ఒక మొక్క దాపున పిల్లమొక్క లెన్నో పుట్టునట్లు మనసున నంటుకొనిన యొక సద్భావము దాపున నెన్నియో సద్భావములు పుట్టును. పెక్కు మొక్కల గుంపున్న చోటును పొలమందురు. పెక్కు సద్భావము లున్న నడవడిని సచ్చారిత్ర మందురు. విత్తనములు మొక్కలై తోచునట్లు భావములు క్రియలై చూపట్టును. సచ్చారిత్రము కనులు కోరగించు కేదారము వంటిది. రమ్యమగు నుద్యానము వంటిది. ఫలకుసుమసంశోభితమైన యుద్యాన మొకటి గోచరించుటకు ముందెన్ని క్రియలో జరుగవలెను. ఎంతకాలమో గడువ వలయును. సత్క్రియా సంశోభితమైన సచ్చారిత్ర మొకటి గోచరించుటకుకూడ నెన్నియో పూనికలు నెఱవేర వలెను. క్షేత్రమునకు నెరువును గాలియు వెలుతురును మున్నగునవి తోడుపడుట యెంత యావశ్యకమో బోధయు శ్రవణమును యోచనమును తోడ్పడుట సచ్చరిత్ర యొక్క వృద్ధి కవసరములు. జ్ఞానము యొక్క ప్రత్యక్షరూపము సచ్చరిత్ర.

విత్తును గ్రహింపవలె నను కాంక్ష ఫలవంతమగు క్షేత్రమునకుమాత్రమే యుండును. విత్తనమును వెలుపలికి త్రోయు విషవాయువు లనేకము లా భూమియందున్నచో నెంత సత్తువగల విత్తులయినను నెట్లు ప్రవేశింపగలవు. జ్ఞానబోధ అన్నిహృదయముల యందును నెక్కజాలదు. ఆచార్యు డున్నత భావములను వ్యక్తీకరించుచుండు తఱి యెదుట నెందఱెందఱో యుందురు. ఏ యొక్క యిద్దఱిమనస్సులయందో యాతని భావములు ప్రవేశమునందును. సభామంటపమందలి స్తంభము లెట్లున్నవో యట్లేయుండు శ్రోతలును గురువునెదుట నుండవచ్చును. జ్ఞానమును పడయవలెనను కాంక్ష యంతరంగమం దుండవలెను. ఆకలిగొన్న కడుపు అన్నపుముద్దను గ్రహించి తనయం దతివేగమున దాని నిమిడ్చికొని దానిని తనరక్తముగను మాంసముగను మార్చుకొను లీల జ్ఞానకాంక్షితమైన మానసము మహత్తరభావములను గ్రహించి యతివేగముగా వానిని జీర్ణింపచేసికొని తాను వృద్ధినందును. జ్ఞానజిజ్ఞాస వేడిపెనము వంటిది. నీటిబొట్టు పెనముపై పడినంతనే దానియందలి వేడియందు గలిసిపోవును. తీవ్ర

జ్ఞానజిజ్ఞాస సద్భావముల నట్లే గ్రహించును. సలసలగ్రాగు నీరు చన్నీళ్లను తనయందు కలుపుకొనుట కెట్లాతురపడునో యట్లే సలసలగ్రాగు జిజ్ఞాసయు జ్ఞానము నందుట కట్లు వేగిరపడుచుండును. అంతరంగమున కాంక్షలేని యపుడు యవ్వలినుండి వచ్చు జ్ఞానబోధ అవమానితాతిథివలె తరలిపోవలసినదే. ఈ సత్య మున్నతభావములను బోధించుపట్లనేగాక సామాన్య హితవును గఱపువట్ల కూడ చెల్లును. బోధకునిపట్లగాని బోధకుని వాక్కునెడలగాని గౌరవములేని వ్యక్తి కెంత చెప్పినను యేమి బోధించినను వట్టి కంఠశోషగాని యెట్టి ప్రయోజనము నుండదు. ఆచార్యునెడల భక్తిగౌరవములు కుదిరినగాని విద్య యలవడుట యసాధ్యమని మనపూర్వులు తెలిపియున్నారు. భక్తియు జిజ్ఞాసయు విజ్ఞాన సంపాదనమున కనివార్యములు.

పొలమునుండి కలుపునుతీసినగాని యందుండి పైరుత్పన్నము కాజాలదు. మనసునందు నాటిన కానితలపులు తరుమబడినగాని సద్భావములందు నాటు కొనజాలవు. కానితలంపులకు దురాచారములు కన్నతల్లులు. దురాచారమున కజ్ఞానమే పునాదియగునేని యాపునాదిని నిముసములో పెల్లగింపవచ్చును. అజ్ఞానము చెప్పినట్లు లొంగును. కొంపలు తీయగలది మిడిమిడి జ్ఞానము. కొండొకవిషయము తెలియలేదని గుర్తించు మానవుడు పరీక్షణమున దానిని గ్రహించును. ఆవిషయమేమో యెఱుగక దానిని సర్వము తా నెఱింగితినని పొరపాటు పడునాతడు తా నెట్టి జ్ఞానవృద్ధిని పొందజాలడు సరికదా యాతడు గర్వమునకును ఆగ్రహమునకును మొండిపట్టునకును క్రౌర్యమునకును నిరంకుశ త్వమునకును నిక్షేపమై ప్రపంచమున కెంతేని యెగ్గుచేయును.

దోషము తొలగిపోవలెనని దోష మొకటి కలదని వ్యక్తి గ్రహింప వలెను. దోషములేని నరు డుండనేయుండడు. ఇట్లని గీతాచార్యుడు తెలిపి యున్నాడు. రక్తమాంసముల కాంక్ష తీరవలెనన్న మనుజుడు దోషము చేసి తీరవలయును.

శరీరమును లోతగు గోతిలో ద్రోయునది మనసు. ఈమనస్సునకు దాసులై ప్రవర్తించునవి దశేంద్రియములు—కర్మేంద్రియము లైదు; జ్ఞానేంద్రి యము లైదు—కీడుచేయు శరీరమును మనస్సును నింద్రియములను దేవుడు మనకేల ప్రసాదించినాడు? వీనికి దాసులుగాక వీనిని దాసులు గావించుకొను

డనియే భగవంతుడు మనకు వీని నొసగినాడు. ఇవి అగ్నివంటివి. మనకు స్వాధీనమై యున్నపుడు అగ్ని మనకెంతేని పరిచర్యసలుపును. స్వాధీనమైన యావిరి ధూమశకటమును నడుపుచున్నది. అగ్నిలేకున్న మనకన్నమేది? జఠరము చల్లారినంతన, ధనంజయనాడి యాగినంతట, మనుజునియాయు వంత రిత్తముకాదా. స్వాధీనమునుండి దాటిన యగ్ని యూళ్లను దేశములను తగులబెట్టును. తీవ్రాగ్ని శరీరమందు దోచినపుడు జ్వరప్రకోప మధికమైనపుడు మానవుని పరమాయు వెంతసేపు నిలచియుండును. స్వాధీనమైన శరీరమును మనసును నింద్రియములును మానవున కెంతేని మేలుగూర్చును. మనుజుడు వీనిని తనపై స్వారి చేయనిచ్చునేని యతడధోగతిపాలగుట నిశ్చయము. చేచిక్కిన సింగము పరిచర్యచేయును. మనజుని చేచిక్కించుకొన్న కంఠీరవ మాతనిని గుటుక్కున మ్రింగివేయును. మనసు నట్టిదే. శరీరమును మనసును నింద్రియములను నాత్మకు లొంగవలెను. ఆత్మబలమునకై పాటుపడునాతడు అవలీలగ జితేంద్రియుడు కాజాలును. తీవ్రమైన ప్రపంచానుభవమువల్లనూ ఘనమైన తపస్సువల్లనూ మహత్తరమగు బోధనలను మనస్సున నిమిడించుకొన్నందువల్లనూ యలవడిన జ్ఞానము ఆత్మకు శాంతినిచ్చి శక్తినిచ్చి మానవునిమహాత్మునిని చేయును. పాపాత్ముడు తాను పాపాత్ముడనని గుర్తించెనేని యాతడచిరకాలమున మహాత్ముడు కాజాలును. హృదయపరిశీలనము ఆత్మసంస్కారణమునకు తొలిమెట్టు. వ్యాధినిరూపణముసేయక వైద్యుడు వ్యాధిని రూపుమాపి రోగిని బ్రతికింపగలడా? బ్రహ్మ విష్ణు మహేశ్వరు లెవరు? మహేశు డాత్మనంటిన తెవులును మాన్పువాడు. తెవులు నశించినంతనే యాత్మను రక్షించి వృద్ధిచేయువాడు విష్ణువు. వృద్ధినుండి సృష్టిచేయువాడు బ్రహ్మ. శంకరుడు శూలపాణియై ముందుల కేతెంచినగాని బ్రహ్మవిష్ణువులకు పనిలేదు. రోగము నిర్మూలము కాకుండినచో బలమునొసంగు దేహములును రక్తమాంసములిచ్చు నాహారములును యెందులకు పనికివచ్చును? తొలుతపని శంకరుని దనగా దోషనివారణమని తెలుపుటయే. దోషనివారణము దోష మిట్టిదని గ్రహింపబడినపుడేగదా సాధ్యమగును.

దోషములనుచేయు మానవులు బహుసంఖ్యాకులు. తమ దోషములన గుర్తించువారో? వీరిసంఖ్యను వ్రేళ్లపై లెక్కింపవచ్చును. దోషములు నొప్ప

కొనుట మహాత్ములకుగాని సాధ్యముకాదు. ఆత్మగౌరవమునకు లోపము ఘటిల్లు నని తమ తప్పులను తాము కప్పిపుచ్చుకొని తమతప్పుల నొప్పులుగ భావించి తమతప్పులను చూపినవారి గొంతుకలు పిసిగి దారుణములకు దలపడు మను ష్యాధములు ప్రపంచమున నెందఱులేరు. ఇట్టివారికి లభించున దధోగతియే. దుర్గతినుండి యట్టివారు వెలుపల బడజాలరు. సద్గతి వీరినుండి దూరముగా తొలగిపోవును. తమయందు దోషమున్నదని వీరు ప్రపంచమున కెలుగెత్తి చెప్పనక్కరలేదు. లోసిహృదయమున తమదోషములను వీరు పరిశీలించు కొనిన చాలును. నాడే వీరు పునర్జన్మమందుదురు. ఇహజీవనమునందే వీరు ముక్తినంద గలుగుదురు. తన్నుతాను గుర్తించుకొనిన కిరాతుడు వినాశన హేతువగు దుడ్డుకఱ్ఱను పాఱవేసి సృష్టిహేతువగు కలమును చేతపూని దాని మూలమున ననంతకాలమునకు సీతారాములను ప్రసాదించినాడు. తనదోష మును తానుగుర్తించిన కిరాతుడు పాపాత్ముడై యుండియు మహాత్ముడు కాజాలెను. సకాలమున తనదోషములను మాపుజేసి తనదుర్వృత్తులను తన దురాచారములను కడముట్టించి జ్ఞానసముపార్జన మొనరించునాతడు మను ష్యులయందు మనుష్యుడై తదుపరి యమరులయం దమరుడు కాగలుగును. దోషములను దుర్వృత్తులను మాపుచేయుట యన మానసికపరివర్తన మందు టయే. ఈపరివర్తనమే ముక్తికి సింహద్వారము. దీనికతననే నరు డిహ జీవనమున ముక్తినందును. పాపబంధురమైన గతము చచ్చినంతనే మానవుడు కాంతివంతమైన నూతనజీవనమున కాలిడును.

వ్యక్తిగుణమును గుఱించి యింతగా తెలుపుటకు కారణము సంఘ గుణములును సంఘాచారములును వ్యక్తిగుణము ననుసరించి యుండును. పలువురు వ్యక్తులు కూడిన నొక సంఘమేర్పడును. సంఘదోషములను సంఘ దురాచారములను సంఘము తెలిసికొని నపుడే సంఘము రోగరహితమై సద్గుణసహితము కాజాలును. సదాచారుడై జ్ఞానసంపన్నుడైన మానవుడు సచ్చరిత్రుడన బరగునట్లు సదాచార సహితమై జ్ఞాన సంపన్నమై యున్న సంఘము గొప్పనాగరకత కలది యగును. సంఘమును పునరుద్ధరించవలె ననిన సంఘదురాచారములను ప్రస్తుత ప్రజల యెదుటను భావిప్రజల యెదుటను, బయట పఱచి వారికి మెలుకువ గొలుపవలెను. అంతియేకాని యాదురా

చారములను గొప్పగా నెంచి దానిచుట్టునూ పవిత్ర మైనదిగా నెంచబడు అబద్ధపు పురాణము నల్లి దానిని జనాళిముందుంచుట తగదు. సహగమనము దురాచారములలో నొకటి. అందులకు కడంగు నాడువి వివేక మెఱుగని యాడుది. వివేకమెఱుగక దారుణమగు నాత్మహత్యకు తెగించు నామె యొరుల బాగోగులను గుఱించి దొడ్డదగు జోస్యమును చెప్పజాలునా? వంశీధరుని జోస్యమును వంశీధరుని శైశవ చారిత్రమే తెలిపినది. కన్నుగలిగి పరీక్షింప కలుగు నాతడు తప్పటడుగు లిడు బిడ్డను చూచి భావికాలమున నతడు మహామేరువు కాగలడో ఘోరకూపము కాగలడో తెలుపగలడు. వంశీధరుడు విశుద్ధానంద స్వామియై చచ్చి స్వర్గము చేరిన పిదప యాతని చరిత్రను గుఱించి విడ్డూరపు జోస్యము నొకటి పుట్టించుట కష్టమైన పనికాదు.

వంశీధరుడు నాలుగేండ్ల ప్రాయమువాడై యున్నప్పుడు తల్లిని బిలిచి "అమ్మా! నాపుస్తక మేది?" యని యడుగుచుండువాడు. తల్లియు బిడ్డని కేదేని పాత్ర మొసగుచుండెడిది. "అది నాదికాదు నాపుస్తకము నాకియ్యి" యని బాలు డేడ్చుచుండువాడు. బిడ్డ పోరుపెట్టుటచూచి మేనమామ యతనిని చెంతకు జేరదీసి ముద్దాడి లాలించి యీయాట వస్తువును నాయాట వస్తువును నాతనికిచ్చి తొడపై కూర్చుండ బెట్టుకొని "వంశీ, నీపుస్తక మేమి చేసు కుంటావు?" అని యడుగుచుండువాడు. "నాపుస్తకము నాకు దొరికితే నాజబ్బు పోతుంది? అది గుడిసెలో ఉంది" అని బిడ్డ పలుకుచుండువాడు. బాలకుని వాక్కులు విని అబ్బురపడి సుఖరాముడు "నాయనా! గుడిసె అంటావు అది యెక్కడ నున్నది?" యని అడుగుచుండువాడు. బాలకు డుత్తర మీయజాలక యేడ్చుచుండువాడు.

కల్యాణికి పది పదునొకండు క్రోసుల దూరములో నుత్తరదిశయందు ఔరత్ అను నొక పుణ్యక్షేత్రము కలదు. కీర్ణయను నొక చిన్ననది యచట ప్రవహించుచుండును. ప్రతిసంవత్సరమునందును చైత్రమాసమున బహు సంఖ్యాకులైన యాత్రికులు స్నానముకొఱకై యానది సాగరమున కలియు చోటున కరుగుదురు. సంగమస్థానమున కనతిదూరములో నొక చిన్నకుటీరము కలదు. కుటీరమం దొక యోగివరుడు వసించుచుండెను. సుఖరాముడు కుటుంబ సహితుడై యాక్షేత్రమున కరిగినపుడు వంశీధరు డేమటనున్న పర్ణశాలను

చూపి "నాపుస్తకం ఆగుడిసెలో ఉంది" అనియెను. బాలకుని పలుకులువిని యెల్లరు నాశ్చర్యము నొందిరి. వెంటనే వా రాపర్ణశాల కరిగి యచటి యోగి వరునికి సాగిలపడి మ్రొక్కి "ప్రభూ! యీబిడ్డ యేమనుచున్నాడో వినుడు" అనిరి. బాలుడు క్షణకాలము కనులుమూయుక యోగీంద్రుని తేఱిచూచి "నాపుస్తక మీగుడిశెలోఉంది" అనెను; యోగి కుతూహలాక్రాంతమాన సుడై "కుటీరమంతయు నెమకి యాత డనుచున్న పుస్తకమును కనుగొను" మని సుఖరామునుద్దేశించి పలికెను. సుఖరాముడు గుడిసెనంతటను గలయవెదకెను. వెతకగా వెతకగా గుడిసెమూల నిరుకుకొనిపోయిన ప్రాతపుస్తక మొకటి యత నికి గానవచ్చెను. పుస్తకము నాత డీవలికి తీసినంతనే దానినిచూచి బాలకుడు "అదే నాపుస్తకము అదే నాపుస్తకము" అని పరమానందమున గంతులు వేయదొడగెను.

అదృశ్యముగాంచి కుటీరమందలి యోగివరుడు మిగుల విస్మయము చెంది నిముసము బాలకుని తేఱిచూచి యాతని పాదములకు ప్రణమిల్లెను. పసి బాలుని చిన్నయడుగులచెంత బుషి సాగిలపడుట చూచి యందఱును నాశ్చ ర్యమున మునిగిరి. "అదే" మని వా రడుగుచుండ యోగి లేచి కూర్చుని సుఖరాము నుద్దేశించి యిట్లు పలికెను. "మహాశయా! ఇతడు నాగురుదేవుడు. కొన్నేండ్లక్రిందట నాఆచార్యుడు మృతినొందెను. అతడు మృగీరోగముతో కొన్నినాళ్లు బాధపడెను. శయ్యాగతుడైయుండి యీపుస్తకమును వెదకి యిమ్మ నియు ఇది తనకు లభించినయెడల తాను వ్యాధినుండి ముక్తుడ నౌదుననియు నతడనెను. నే నీపుస్తకము నిమిత్త మెంత వెదకినను దురదృష్టవశమున నాకపుడు లభించినదికాదు. దీర్ఘనిశ్వాసము వీడి యాచార్యుడు ప్రాణములను వదలినాడు. ఇపుడు జరిగినదానిని బట్టిచూడ బాలకుడు గత జన్మమున పూజనీయుడైన నాగురువని రూఢియగుచున్నది. జన్మాంతరీయస్మృతికతన యీతడు పుస్తకమును గ్రహించుటకై యాతురపడినాడు. కాలక్రమమున నితడు మహాయోగి కాగలడు నిస్సంశయము."

పుస్తకము లభించిన పిదప బాలకుడు రోగవిముక్తుడయ్యెను. పిదప వం శీధరున కే తెవులును సంభవింపలేదు.

ఈగాథ చిత్రముగానున్న దైన నిది యబద్ధమనుటకు వీలులేదు. ఇట్టి వృత్తాంతములు నిక్కములనుటకు నేడును ననేక దృష్టాంతరములు గోచరించు చున్నవి. ఇటీవల నుత్తరహిందూస్థానమున నిట్టి యుదంతమొకటి గోచరించి నది. ఆ యేండ్లబాలుడు తన తొంటి జన్మమును గుఱించిన వృత్తాంతము దెలువ నాయుదంతమంతయు నిజమనుటకు నిదర్శనములు ప్రత్యక్షముగా కనుపించినవి. జీవాత్మ పెక్కుజన్మలందు ప్రయాణము సాగింపవలసియుండునని హిందూ ధర్మము తెలుపుచున్నది. బౌద్ధమతముకూడ నీసత్యమున కెంతేని ప్రాముఖ్య మిచ్చుచున్నది. కడచిన జన్మయందు జీవాత్మపొందిన యభివృద్ధి కడచినజన్మతో కడముట్టదు. గతజన్మసూత్రములు ప్రస్తుతజన్మమంచలి జీవనపుటల్లికకు నుప యోగపడును. హిందూబౌద్ధమతములు వాకొను కర్మసిద్ధాంతము నిక్కమైన దనియు కారణహేతుసూత్రము ననుసరించి యొకజన్మనుండి వేఱొకజన్మకలుగు చుండుననియు పాఠకులు గ్రహింతురుగాక. కొందఱు కొందఱు మహనీయులకు పూర్వజన్మస్మృతియుండును. పూర్వజన్మమందు మహాఋషియై వరలినవ్యక్తియే తదుపరి జన్మయందు వంశీధరుడును విశుద్ధానందస్వామి కాగలిగెను.

వంశీధరు డైదేండ్లప్రాయ మందగానే తమయింటికి సమీపమందు వసించుచున్న భట్టజీయను గురునకు తండ్రి యాతని నప్పగించెను. బిడ్డకు పార శీకభాషనేర్పుటకు మౌల్వీనొకని నియోగించెను. ఒకమాఱు వినిన దానిని చదివినదానిని బాలకుడు మఱచువాడుకాడు. బాలునియసాధారణ స్మృతి శక్తికి వింతచెంది భట్టజీ యతనికి 'శృతిధర్' అనుపేరు నొసంగెను. బిడ్డకు యేడవయేడు రాగానే యాతని తండ్రి పరలోకగతు డాయెను. తండ్రిగతించిన కొలది దినములలోనే తల్లియు స్వర్గస్థురాలాయెను. పదమూడేండ్లు గడచు నప్పటికి వంశీధరుడు పారసీక మహారాష్ట్ర భాషలయందు ఆరితేఱి శాస్త్రాలో చనమునకు గడంగెను. పదునాఱవయేట నశ్వారోహణ కౌశలమును అస్త్ర విద్యయు నలవఱచుకొనెను.

ఆసమయమున విశేషమూల్యమిచ్చి నవాబొక గుఱ్ఱమునుకొనెను. గుఱ్ఱము మిగుల పోగరుపోతు జంతువై యుండెను. అది యెవ్వరికిని స్వాధీనము కాకయుండెను. దాని నెట్లయిన లొంగదీయవలసినదని వంశీధరుని గోరుచు నవాబు గుఱ్ఱము నాతని చెంతకు పంపెను. అచిరమున వంశీధరుడు హయమును

స్వాధీనము గావించెనుకాని గుఱ్ఱమును నవాబుకడకు గొనిపోవుతఱి దాఱిలో నశ్వపాలకులు దానిని విశేషముగా గొట్టినందున గుఱ్ఱము చచ్చిపోయెను. నవాబానంగతి నెఱిగి గుఱ్ఱమును వంశీధరుడే చంపినవాడని నిశ్చయించి తోడనే యాతనిని ఖైదునందు ద్రోయించెను. కారాగృహములో వంశీధరుడు కొంత కాలముండగానే యాతని హృదయమున నొక వింతయైన మార్పుకలిగెను. సంసారము కష్టభూయిష్టమైనదని యాతడు తలపోయసాగెను. విరాగి కావలె నను నుద్దేశ మాతని మనసునందుదయించెను. కొంత కాలమున కతడా ఖైదు నుండి విడుదలయైనాడు. పిమ్మట వంశీధరుడు కొన్నిదినములు మేనమామ యింట నుండెను. "సంసారమందు తనకేమియు నిచ్ఛ లేదనియు వైరాగ్యమే తనకెంతేని యానందము కూర్చుననియు బాహ్యప్రపంచమును తనగృహము కావించుకొన వాంఛించుచుంటిననియు శ్రమపడి తన్న న్వేషింప వలదనియు" నొకజాబు వ్రాసి మేనమామ యంగీజేబునందుంచి యిలువిడిచి యెందేని వెడలిపోయెను.

వంశీధరుడు కల్యాణిని వదలి నాసికాక్షేత్రమున కరిగెను. నిష్ఠావరుడును విద్వాంసుడును నగు నొక మహనీయుని యంతేవాసియై వంశీధరుడాతనియొద్ద వేదాధ్యయనము గావింపదొడగెను. అతనివయసప్పుడు పదునేడేండ్లు మాత్రమే. కొంతకాల మాతడా నాసికయందేయుండి పదంపడి కాలినడకను నాతడు ఓంకారనాధమున కరిగెను. అందుండి యాతడు ఉజ్జయినీనగరమున కరిగెను. అచటమహాకాళేశ్వరాలయమున శివపంచాక్షరీ మంత్రమును జపింపసాగెను. ఆయాలయమున నామంత్రము జపించువారి మనోభీష్టములు సిద్ధించు నను వాడుక కలదు. మంత్రసాధన సమయమున వంశీధరుడు నాలుగైదు దినములు నిరాహారుడై యుండవలసివచ్చెను. తరువాత ననుదినము నొకగుజరాతీదేశ స్థుడు రెండుగుప్పిళ్లశనగ లాతనికి తెచ్చియిచ్చుచుండువాడు. కొద్దిపాటి సెన గలనుమాత్ర మతడు నోటవేసికొని తనువున ప్రాణములు నిలుపుచుండువాడు. మహాకాళేశ్వరాలయమున నతడు వ్రతోద్యాపనము గావించి గ్వాలియరు పోయెను. ఆసమయమున సింధియారాజ్యమున ఘోరవిప్లవము పొడసూపెను. సైనికులు వంశీధరుని గుఱించి సంశయించి యతనిని ఖైదునందు ద్రోసిరి. కొన్నినాళ్ళకు విడుదలనంది యతడు బ్రహ్మావర్తమున కరిగెను. అచట కొంత

కాలముండి హరిద్వారమునకరిగి యందుండి యాతడు ఖన్ ఖన్ నకు జనెను. ఖన్ ఖన్ తో కొంతకాలముండి పిదప నాతడు బదరికాశ్రమమున కరిగెను. అచటి కనతిదూరమునగల విష్ణుప్రయాగయందు మారుమూలనున్న యొక గుహలో మహాయోగియొకడు వసించుచుండెనని విని వంశీధరు డాతని సాన్నిధ్యమున కరిగెను. కొన్ని సంవత్సరము లామహాత్ముని కడనుండి, యతనికి శుశ్రూషలు సేయుచు యాతనికడనున్న యోగరహస్యముల నన్నిటిని గ్రహించెను. యోగ సాధనయందు వంశీధరునకు విశేషమగు మక్కువకుదిరెను. అనంతర మాతడు హృషీకేశమున కరిగెను. హృషీకేశమున గోవిందస్వామియను మహాత్ముడొకడు వాసము చేయుచుండెను. వంశీధరుడతనిని సేవించి పదునైదేండ్లు కడుకఠోర ముగా యోగసాధనము గావింపదొడగెను. గౌడస్వామియను నొక యసాధా రణ ప్రజ్ఞాధురంధరుడు దశాశ్వమేధ ఘట్టమున నపుడు వసించుచుండువాడు. వంశీధరుడాతని శిష్యుడై సన్యాసాశ్రమమును స్వీకరించెను. అప్పటినుండియు నతడు విశుద్ధానందస్వామియనుపేర బరగదొడగెను.

గౌడస్వామికడ నప్పటికి ముప్వురు శిష్యులుండిరి. ఈముప్వురలోను స్వామి విశ్వరూపజీ మిగుల ప్రజ్ఞగలవాడు. ఆచార్యుని కతనియెడల ప్రీతి మెండు. ఒకనాడొకానొక విషయమును గుఱించి విశుద్ధానంద విశ్వరూపజీలకు వాదముపొసగెను. విశ్వరూపజీకి అపజయము కలిగెను. విశుద్ధానందుడే విజ యము నొందినను తర్కవితర్కములయందు కొంతసేపాతడు శాంతిని గోలు పోయి యాగ్రహాయత్తచిత్తుడయ్యెను. స్వామిజీయందలి యాకస్మికమగు యీమార్పునకు గురువర్యు డంతరంగమున చింతిల్లెను. ఆచార్యుడు మనసున చింతబడుటచూచి విశుద్ధానందస్వామి మిగుల సిగ్గుచెందెను. నాటినుండి విశుద్ధా నందుడు విశ్వరూపజీని తన జ్యేష్ఠభ్రాతగను గురువుగను గౌరవింప దొడగెను.

క్రీ. శ. 1859 సంవత్సరమున గౌడస్వామి పరలోకగతు డాయెను. ప్రాణములువిడుచుటకు ముందు ఆచార్యుడు తనశిష్యులను సమీపమునకు బిలిచి వివిధోపదేశము లొసంగి తనయనంతరమున తనయాసనమున నుపవిష్టు డవు కమ్మని విశుద్ధానందునితో పలికెను. గురువు పరమపదించిన పిదప నాతనిచే ప్రతిష్ఠింపబడిన పీఠమున నాసీనుడవు కమ్మని విశుద్ధానందుడు విశ్వరూపజీని వేడుకొనెను. వేడుటయు విశ్వరూపుడు "సోదరా! నీవు గురుదేవుని యంతిమ

వాక్కులను మదిదలపుము. వయసునందు నేను నీకంటె పెద్దవాడనయ్యు జ్ఞానమున నీవు నాకంటె పెద్దవాడవు. ఆచార్యుడు గతించినపిదప నన్ను నీవు ఆచార్యునిగా పరిగ్రహింప దలచితివేని గురువునై యీపీఠమునం దాసీనుడవు కమ్మని నీకాజ్ఞయిచ్చెదను." అని సోదరశిష్యు నుద్దేశించి పలికెను. విశుద్ధానందు డిక చేయునదిలేక యాతని యుద్దేశము ననుసరించి గౌడస్వామి పీఠమునం దాసీనుడయ్యెను. అయినను విశ్వరూపజీని గురువుగా నెంచుచు నతడాతనియెడల శ్రద్ధాభక్తులు గలిగి వర్తింపుచుండెను.

గౌడపీఠాధిపతియై విశుద్ధానందస్వామి యాచార్యుని పేరునకు వన్నె దెచ్చెను. దర్శనాది వివిధశాస్త్రములందు అతనితో సముడగు మహాపండితుడు గతశతాబ్దమున లేడు. జర్మనీమున్నగు విదేశములనుండి సుప్రసిద్ధ దార్శనికులు వచ్చి స్వామిజీని దర్శించి భక్తిశ్రద్ధలతో నాతని మీమాంస కథనమును వినుచుండువారు.

తన తొంబదిమూడవయేట క్రీ. శ. 1898 సంవత్సరమున యోగాసనమున నుపవిష్టుడై స్వామిజీ ప్రాణములవిడిచెను.

పూర్వజన్మమున నొకడు పొందిన యభివృద్ధి నాటిజన్మాంతమందలి చితియందు మ్రగ్గిపోక తరువాతిపుట్టువున ముఖ్యమగు మెట్టగునని యివివరలో తెలిపియుంటిని. జీవాత్మయొక్క అభివృద్ధికి జగదీశుడు జన్మజన్మలయందు తనగుణములను ప్రత్యక్షము చేయుచుండును. గతజన్మమున గడచిన ఘట్టమునుండి తరువాతిఘట్టమును చేరుసమయము నతడు మానవునకొసగును. కడచినఘట్టమేమో ప్రస్తుతజన్మమున మానవుడెఱుగడు. కాన గతజీవనకృషి యాతని ప్రస్తుత జన్మప్రకృతియందు దాగియుండును. కావుననే కొన్నిగుణములు పుట్టువుతోడనే మనసునంటియుండును. వీనిని హృదయమునుండి పెకలించుట దుస్సాధ్యము. లోనిశక్తి ప్రజ్వరిల్లుటకు యత్నించుచునేయుండును. రాపిడిచెందిన చకుముకిరాయివలె తరుణస్పర్శ నందిన లోనిశక్తి నెరసులు విదజిమ్ముచు బాహ్యాపనియందు విజృంభించును. కష్టములను ఆపదలనబోలు ఆచార్యులేరి? ఉన్నత విశ్వవిద్యాలయములందును, పుస్తకపు గుట్టలయందును మనము నేర్చుకొనగలుగు విజ్ఞానమదియెంత? నిప్పునుగుఱించి పదియేడ్లు వ్యాసము లిచ్చుటకంటెయొకమాఱు నిప్పుసోకి పొంత యొకనిని ఒలిపితిమేని జన్మాంతరము

వఱకు నతఁడాయనుభవమును మఱచునా? లోకానుభవమున నలవడు విజ్ఞానము నకు మేరలేదు. ఆహా! మనుష్య చరిత్ర యెట్టిది? కొండయెత్తు నవలీలగ తెలిసికొనవచ్చును. సముద్రపులోతును సులభముగ గ్రహింపవచ్చును. కాని మనుష్యప్రకృతి గ్రహించుట మాటలలోని పనికాదు. ఇందులకువలయు తీక్ష్ణపరిశీలనము ప్రపంచానుభవమువలన కలుగును. ఎల్లఱ యనుభవములు నొకతీరున నుండవు. ఎంతయదృష్టవంతులనో కాని యాపద లెదుర్కొనవు. ఆపదయొక్క తాకుడు తీవ్రమయినకొలది యభివృద్ధి తీవ్రమయియుండును. ఇతరులయనుభవములును గ్రంధరాజములందు పొడకట్టు మహనీయుల యను భవములును మనజ్ఞానాభివృద్ధికి కొంతసహాయపడును. కాని విశేషవిజ్ఞానాభివృద్ధికి ముఖ్యమైనమార్గము స్వానుభవమే.

వంశీధరుడు అన్యాయముగా నవాబుచే కారాగారబద్ధుడైనపుడు అతని మనసునందు వైరాగ్యాంకురములు పొడకట్టెను. క్రియ దుర్న్యయమయినదే. కానియిట్టి సుత్తిదెబ్బ అవసరమయినదని సర్వేశ్వరుడు గుఱుతించెను. భూత భవిష్యద్వర్తమాన కాలములు జగదీశునిచెంత స్పష్టములై తోచును. రేపటి బాగు నాతడు తెలిసికొని యవసరమగువట్ల నతడు శస్త్రచికిత్సకు కడంగును. ఎల్లుండి రాదగుబాగునకై యీచికిత్స నీతడు రేపు నెఱపును. రేపటి చికిత్సను కష్టమని మనఃమెంచు రేపటియనుభవమును నేడే మన మెఱిగి యున్నయెడల నేడే గుండెలు బాదుకొనుటకు సిద్ధపడుదుము. కావుననే భవిష్యత్తును గుఱిం చిన జ్ఞానమును భగవంతుడు మనకీయడు వంశీధరుని విశుద్ధానందుని చేసినది పైన దెలిపిన సుత్తిదెబ్బయే.

సంసర్గమును, ఉపదేశమును, ప్రదేశమును చరిత్రనిర్మాణమునకు తోడు పడును. స్థానస్థానములందు భ్రమణమొనరించి మహాత్ములను సేవించి వారి యుపదేశములకు వీనులొగ్గి వారిదృష్టాంతముల ననుకరించి సచ్చారిత్రులగు తోడిశిష్యులందు మసలియేకదా వంశీధరుడు మహాపురుషుడు కాగలిగెను. పుట్టువునుండియు మనసునంటియున్న ప్రకృతికి సత్పురుష సంసర్గ సద్గురూప దేశాదిశక్తులు తోడుపడును. వీనివలన దానిశక్తి వృద్ధినందును, దానివలన వీనిబల మువయుక్తమగును. మొద్దును దెచ్చి మహాపురుషుని యెదుట బెట్టిన ప్రయోజనములేదు. బహుజన్మములనుండి పుతములందుచు కొత్తకొత్త వన్నె

యును మెత్తదనమును వడసిన మనసే రంగారు గుణభూషణములను తయారు చేయు ఆచార్యవిశ్వకర్మకృపికి లొంగును.

ఎంతదిట్టమైన కంసాలియైనను ఉక్కును యినుమును దెచ్చి నగలు చేయుటకు పూనుకొనునా? పూనుకొనినను నెఱవేరునా! ఇనుపగుండెలును ఉక్కు హృదయములును దివ్యాలంకారములకు పనికిరావు. బంగారునకు హృదయమున్నది. ఎంతయో సంస్కారమును చెంది గురుగుణమున శోభిల్లి యది మహీకాంతుల మకుటములయందు నిలువగలిగెను. సంస్కారముపొందిన మనస్సు మనుష్యచారిత్రమున కట్టితేజమునే యొసంగును. గతజన్మమునందే విశుద్ధానందస్వామి మనస్సు విశేషముగు వన్నెవడసినది. తత్పూర్వ్యమే యది యెంతేని సంస్కారమును చెందియుండును. పరిపూర్ణ శుద్ధాత్ముడై విశుద్ధానందుడు విశ్వనాథుని జేరుకొనెను.

కొండొక శాస్త్రవిషయమును చర్చించుచు విశుద్ధానందస్వామి వాదించుతఱి నాగ్రహావేశ చిత్తుడాయెననియు విశ్వరూపజీ యూరకుండెననియు వారి యాచార్యుడు దుఃఖితుడాయెననియు నిదివరలో వ్రాసితిమి. ఎట్టివానినైన లొంగదీయగలశక్తి క్రోధమునకు కలదు. క్రోధము అగ్నివంటిది. అగ్ని పరుల కెగ్గు సేయుటకు ముందు — యేపదార్థమునైనను తగులబెట్టుటకు ముందు — దగ్ధము చేయుటకు ముందు తన్నుతాను దగ్ధమొనరించుకొనును. తాను రవిలి రవిలి మండిపోయినగాని మఱియొక వస్తువును తగులబెట్టజాలదు. క్రోధము తాను పుట్టిన హృదయమునే మొట్టమొదట తగులబెట్టి మఱియొక హృదయమును తగులబెట్టును. కోపోద్దీపితుడు లోపల కాలి కాలి యితరులను కాల్చును. కావున కోపమువలన కలుగు నమితతాపమును దురంతదుఃఖమును తొలుత దానికి వశవర్తుడై నమానవునకే ప్రాపించును.

మనుష్యుని పట్టిపల్లార్చునవి కామక్రోధములు. ఇట్టి శత్రువులకు జగదీశ్వరుడు మనుష్యహృదయమున తావేల కల్పించెను. ధర్మార్థ, కామ, మోక్షములను చతుర్విధపురుషార్థములలో కామ మొకస్థానమునందెను. శత్రువునకు గురు పీఠమేల? కామక్రోధములు కేవలము శత్రువులనుటకు వీలులేదు. మనుష్య జీవనమునకివి యావశ్యకములు. కానిచో నివి మనుష్యహృదయమునందేల జనించును, కామక్రోధములకుగలశక్తి మహాద్భుతమైనది. తలుచు మానవుడు

వీనిని విజృంభింప నిచ్చునుగాన నివి శత్రువులవలె కన్పట్టుచున్నవి. వీనిని శత్రువులుగా చేసికొంటిమేని యివి మానవున కాపాదింపని ఘోరారిష్టములుండవు. కావున వీనిపేరు వినినంతనే మానవున కడలుజనించును. వీనికి మనుజుఁడు వశుఁడైనపు డివి దుర్దాంత శత్రువులగును. వీనిని లొంగించుకొను నాతని కివి పరమ మిత్రములగును. ఇట్లు కావించుకొనువారు స్వల్పసంఖ్యాలగుటచే వీనికి శత్రువులను పేరే వచ్చినదిగాని మిత్రులను పేరు రాలేదు.

ఇవి విద్యుచ్ఛక్తివంటివి. మనము విద్యుచ్ఛక్తికి లొంగితిమా చిటికెలోనది మన ప్రాణములను తీయగలదు. దానిని వశపఱచుకొంటిమా మనము చేయజాలని యద్భుత క్రియలుండవు. కామ క్రోధములు మనుజులకు దాసులైయున్నపుడు అవి యద్భుతములను నెఱపును. అవి యంతరించెనేని మానవ హృదయము నల్లరాయియగును. మహాత్ములను జితేంద్రియులందురు. జితేంద్రియులనగా నింద్రియములను జయించినవారుగాని వానిని నాశనము చేసినవారుకారు. కామక్రోధములను చంపివేసినవాఁడు మనుష్యుఁడనుపించుకొనజాలఁడు. అతఁడొక పెద్ద మొద్దనిపించుకొనును. అట్టి పెద్దమొద్దున కవమానమేదేని జరిగినపు డూరకుండును. ఊరకుండిన హేతువుచే నతఁడు మహాత్ముఁడు కాజాలఁడు. తనకా యవమానము తటస్థించినపుడు వెంటనే యా యవమానమును హృదయమున పరిశీలించి దానిననుసరించి వర్తించువాఁడు మహాత్ముఁడు. ఈ పరిశీలించుటలోనే బ్రహ్మాండమగు ప్రజ్ఞయున్నది. క్రోధమును పిడికిలియందుంచుకొనినవాఁడే బాగుగ పరిశీలింపగలుగును. ఇట్లు కావింపనివాఁడు అవమానింపబడినంతనే కార్చిచ్చువలె లేచి తనకవమానము చేసిన వ్యక్తిని బాధించును. ఒకవిషయమున విశాలచిత్తుఁడైన మానవుఁడు తనకవమానముచేసిన వ్యక్తినేగాక కనబడిన ప్రతిదానిని మాడ్చివేయ చూచును. క్రోధము ముక్కుదారములచే నీతనినడిపి యెట్టి ఘోరమైన సంహారక్రియలనైన నతనిచే చేయించును. కాబట్టి యిట్టి యవస్థలు సంభవించుతఱి క్రోధమును జయించి శాంతమును పరిగ్రహించవలయును. శాంతమునకు కూడ కొంతపరిమితియున్నది. మహితాశయములకును హద్దుపద్దులుకలవు. ఉత్తమనియమములు బొమ్మరాళ్లుకావు. అవి జీవకళతో నిండియుండును. జీవకళకు దృష్టికలదు. దృష్టియన విచక్షణము. విచక్షణ గలిగిన గాని నియమపాలన మొనరింపతగదు. శాంతమునకును కామరాహిత్యమునకును హద్దులుకలవు.

మనకన్నులయెదుట యొక్క యభాగినియొక్క మానమునకును ప్రాణమునకును నొకపాపి చెఱుపుచేయ నుంకించుచుండ వాని కెదిరమెత్తి యాతఁడు దౌర్జన్యము నకు కడంగుచుండ శాంతమున స్మరణ మొనరించుచు తులసితావళమో రుద్రాక్షమాలయో చేతబట్టుకొని త్రిప్పవలెనా? అట్లు త్రిప్పుచుండు వాడు మహాముని యనిపించుకొనునా? రౌరవాదినరకములకు కూడ రోత పుట్టించు మహాపాపి యనిపించుకొనునా? అప్పుడాతనిది శాంతమనిపించు కొనునా? అతడు మనుష్యుడనిపించుకొనునా? సత్వగుణ సంపన్నుడనిపించు కొనునా? తమోగుణ పీడితుడనిపించుకొనునా? అప్పుడతడు లేచి నిలిచి రక్షణ మునకు గడగవలయును. రక్షణయత్నమున నాతనితల తెగి నేలబడినను బడ వచ్చును. అతనిరక్తము పుష్కర గంగాపవిత్రోదకములకంటె పవిత్రమైనదగును. అతని ప్రాణములు దేవతల ఆలయములందు విగ్రహములగును. మానప్రాణ రక్షణార్థము శూరుడు చూపునది యాగ్రహమే. దానికి వేరు పేరులేదు. ఆగ్ర హామే యనవలయును. కాని యది పాపము నాపాదించు ఆగ్రహము కానేరదు. పుణ్యమునిచ్చు పవిత్రాగ్రహము. ఇట్టి పవిత్రయుత్కృష్టాగ్రహమును చూపవ వలెనన్న మానవుని హృదయము నెండబెట్టవలయునా? ఉత్సాహానందము లతో నంసిక్తమొనరింపవలెనా; ఉత్తమనియమములు భావముల పుంజములై యూరకుండవు. అవి క్రియలయందు దోచుచుండును. అట్లు తోచకున్నచో వానికి అస్తిత్వమే లేదు. క్రియలకు వలసినవి జీవమును, నుత్సాహమును, చలనమును. వీనికి స్థానము హృదయము. ఈ హృదయము క్రోధమునకును శాంతమునకును కూడ తావలమే. క్రోధమునుబట్టియే శాంతమును గోచ రించును క్రోధము లేకున్న శాంతమును లేదు. మనుష్యజీవన పరిపూర్ణత్వము నకు శాంతమును పరివర్తినియగు పవిత్రమైన యాగ్రహమును నవసరములే. కఠోరమైన తపస్సును చిరానుష్ఠితమైన యాత్మసంస్కరణమును నలవఱచు కొనినవాడే శాంతమును పవిత్రమైన ఆగ్రహమును చూపగలడు. బుద్ధునకు పిదప శాంతికి పెన్నిధానమైన మహాపురుషుడు ఏసు. ఒకచెంపగొట్టిన రెండవ చెంప నిమ్మనియు నొకయంగీని యపహరించినవానికి మరొకయంగీ నిమ్మనియు పరుషవాక్కునకు బదులుగ దీవనలిమ్మనియు చెప్పెనుగదా! పవిత్రాగ్రహమును చూపదగిన సమయములు జీవనమున నెప్పుడోగాని గోచరింపవు. సాధారణ

దైనికజీవనమున మనము విశేషముగ చూపవలసినది శాంతమే. హృదయమున కోపము మొలకెత్తినంతనే దాని నడచివేయవలెను. క్రోధమునకు కన్నులు లేవు. యోచనలేదు. దాని గమనము ఝంఝానిలగమనము. దానివేగము నడచివేయు నాటంకములు తోచనపుడది తనంతతానే యాగిపోవును. దృష్టిని వేఱుదిక్కునకు మరల్పగలిగితిమేని యది మెల్లన హృదయమునుండి లేచిపోవును. క్రోధకారణముపై మనసు నిలిపితిమేని యది పగయై వృద్ధినంది కోరలుగల రాక్షసియై హృదయసింహాసనమున నాసీనుడైన జగదీశ్వరుని కూలద్రోయ గమకించును. క్రోధమును పెరుగనీయకుండ నుండవలెనన్న దానిని హృదయమున నిలువనీయరాదు. మనసు కోతివలె పరుగెత్తునదే యయ్యును నాపిన నాగుశక్తి దానికి గలదు. ఒక భావమునెడ నొకసంఘటనయెడ యొక వస్తువుదెస మనస్సు తనదృష్టిని బరపెనేని వేఱుదిశ నేమిజరుగుచున్నదో యది గ్రహింపజాలదు. క్రోధహేతువు చిత్తమును తన వైపునకు లాగినపుడు వేఱు వైపునుండి దానిని లాగుభావము మఱొకటి యుండవలెను. అనగా దృష్టిని వేఱుదిక్కునకు మరల్పవలెను. ఆగ్రహావేశుడైన మానవుడు 'రామ రామ' యని పలుమాఱు మానసమున నుచ్చరించెనేని క్రోధకుండమునుండి యాతడు శాంతోద్యానవనమున బడును.

కామమును కోపమువంటిదే. అదియు వశవర్తిని యగునేని పవిత్రమైనదగును. నియమబద్ధమైన గృహస్థజీవనమును గడపునాతడు బ్రహ్మచారి కుజ్జ్వమై మహామునికి యెనయై నిలుచును. శ్రీకృష్ణునకు పదునాఱువేల యెనమండుగురు పత్నులుండిరి. అతడు నిత్యబ్రహ్మచారియనుట జగత్ప్రసిద్ధముగదా!

కామక్రోధములును నరిషడ్వర్గమందలి తక్కిన నాలుగుతీరులగు గుణములును అణగుటకును వానిపట్ల నిరాదరణ చూపుటకును మానవుడు తనహృదయమును మిక్కిలి యున్నతమును చేసికొనవలెను ఒకసారి మనస్సునం దొకతీరుభావమునకే గదా చోటుండును. అనురాగముచే నిండిన మనసున క్రోధము నిలువజాలదు. భక్తిచేనున్నతమైన మనసున జగదీశుడు నటరాజై నృత్యము సలుపుచుండ క్రోధపిశాచ మాచెంత కెట్లుపోగలుగును. ఔదార్యము క్రోధమును నిర్జించి యూరకొనక దాని ననురాగము లోనికి మార్చివేయును. అనురాగభక్తి ఔదార్యము లరిషడ్వర్గములను నిర్జించు నద్భుతశక్తులు.

కామక్రోధములు లేనివానికి గాక వీనిని గలిగి వీనిని నిర్జించినవానికే ఆచార్యుడు సన్యాసాశ్రమమున తావల మొసగును.

క్రోధమును జయించుటయం దెంత కష్టమున్నదో శాంతమునం దెంత మహాత్త్వకలదో విశుద్ధానందస్వామి జీవితము తెలుపుచున్నది. ఆధ్యాత్మికజీవనమున విశేషముగ నగ్రసరుడైనను విశుద్ధానందు డొకసారి యాగ్రహమును పిడికిలియందు పట్టజాలకపోయెను. కాని యామహాపురుషునికోప మాతనిని మాపు చేయునది కాక యాతడు పునరుద్ధరణము నొందుటకు వలసిన వ్యవస్థను గావించెను. తొలిముహూర్తమున క్రోధమువలన నతడు కూలద్రోయబడినను మలిముహూర్తమున నాతడు మేలుకాంచి శత్రువును పిడికిలియందు పట్టగలిగెను. ఎదుటివాని సద్భావముకూడ నతనికిసాయపడును. విశ్వరూపజీయొక్క సద్భావమును విశుద్ధానందుని భక్తిశ్రద్ధలకు ఆటపట్టగు గురుహృదయమునందు పొంగిన దుఃఖపూరమును గంగాయమునలట్లు కలిపి విశుద్ధానందస్వామి హృదయమును పూర్తిగ కడిగివేసినది. విశుద్ధానందు డీయనెంచిన గురుశిరమును గైకొనక విశ్వరూపజీ చూపిన యుదారభావముకూడ విశుద్ధుని మరింత దొడ్డవానిగ జేసెను. క్రోధమును జయించినది క్రోధముగాక యనురాగమనుట కీయిర్వుర మిత్రుల చారిత్రము తార్కాణము.

శాంతమందలి మహాత్త్వమును గుర్తించువానిపట్ల నదికావించు వింత మార్పు చెప్పశక్యముకాదు. సుహృద్వరుని సద్భావమును గుర్తించిన విశుద్ధానందుడు మిగుల దొడ్డవాడై తనక్రోధమునకు గుఱియైనవాని శిరమును నశ్రాంతము భక్తిపుష్పములచే పూజింపదొడగెను. శాంతముయొక్క విజయమిట్టిదని గ్రహించి విశ్వరూపజీ హృదయమున నెంతయు సంతసపడి ఆధ్యాత్మిక దృష్టియందు మునుపటికంటె రెండింతలై యుండును. ఈశాంతమును తెలిసికొనజాలని వానియెడల నది నిరర్థకమగుటయేగాక దానిని చూపినవానికి ముప్పు కూడా తెచ్చియుండును. ఒకప్పు డాశాంతభక్తుడు చచ్చినను చచ్చును. అతనియందలి మహత్తును గ్రహించుటకు దశాబ్దములును సహస్రాబ్దములును పట్టినను పట్టవచ్చును.

దోషములేని మానవులుండరనియు తనదోషములను గుర్తించినమానవులు లెక్కకు మిక్కిలి తక్కువగా నుందురనియు యిట్లు గుర్తింపగలిగినవా

రిహాజీవనమునందే పునర్జన్మమందినవారై యందే ముక్తినందిన మహాత్ములగుదు రనియు నీవఱలో తెలిపియుంటిని. ఇట్టి మహాత్ములలో శ్రీవిశుద్ధానంద స్వామి యొకండని పాఠకులు గుర్తించియే యుందురు.

ధర్మకర్తవ్య నిర్వహణమున శాంత మెప్పు డవసరమో ఆగ్రహమెప్పు డవసరమో యెఱుగ గోరువారు భగవద్గీతను పరిశీలింపవలెను. మనుష్యత్వ మును రూపుమాపి దాని సమాధిపై శాంతమను తులసిమొక్కను నాటదలచిన వారికి భగవద్గీత దివ్యదృష్టి నీయగలదు.

కర్తవ్యనిర్వహణమునకై ముం దురుకదగు ముహూర్తమున కాళ్లు ముడుచుకొని కాషాయాంబరములు దాల్చువానికి "అర్జున విషాదయోగ" మను అధ్యాయము యెంతేని విజ్ఞానభిక్ష పెట్టగలదు. సంసారజీవనము రాజ కీయజీవనమువంటిది. రాజకీయములకును, మతమునకును; ఐహికజీవనము లకును గల అవినాభావసంబంధమును గీతకంటె మానవకోటికి బాగుగా బోధింపజాలు సద్గ్రంథము ప్రపంచమునందింకను గోచరింపలేదు. ఇంక గోచ రింపబోదు. ఉత్తమాశయములను గురించిన వెఱ్ఱివెఱ్ఱి యపోహాలు విజృం భించుచున్న యీదినములలో ఆదర్శచారిత్రము నలవఱచుకొన కాంక్షించు మానవునకు భగవద్గీత రక్షణదైవతమగుట తథ్యము.

—

# 30

# రామప్రసాదస్వామి



"ఉ. జన్మకుఁ గారకుండవును సర్వజగత్పరిపాలకుండవున్
జన్మలు లేనివాఁడవును సాంతుఁడుగాక యనంతుఁడౌనినున్
తన్మయతన్ మదిన్ దలఁచి ధ్యానసమాధి నిమగ్నమౌ నదే
జన్మముగాని కానిదొకజన్మమె? కావునె దాని సత్ప్రభూ!"

వంగదేశమున హాలిసహర్ అను పట్టణము కలదు. దాని కనతిదూర మునన న్న కుమారహట్ట యను పల్లెయందు వంగశకము 1643 సంవత్సరమున రామప్రసాదు పుట్టెను. వంగదేశమున నపుడు క్షత్త్రియులనియు వైశ్యులనియు వర్ణభేదములేదు. ఈరెండుకులములవారును కాయస్థులను పేరున నొప్పుచుండు వారు. వీరుబ్రాహ్మణులు కారు కావునను, క్షత్రియవైశ్యులమని చెప్పుకొనరు కావునను శూద్రులకంటె వీరు యెక్కువ కులస్థులుగా పరిగణింప బడుదురు. రామప్రసాదు యీకులమున పుట్టెను. ఈతని తండ్రి రామరామ సేనుడు. వైద్య వృత్తివలన జీవనము గడపుచుండువాడు. కుమారహట్టలో రామప్రసాదుపుట్టి పెరిగిన గృహము యొక్క చిహ్నములు నేడు కానరావు కాని "స్వామియై యాతడు యోగనిద్రయందు యీ చోటునందే మునిగియుండువా" డని నేఁను కొందఱు వంగీయులు కుమారహట్టయందొక తావును చూపుచుందురు.

రామప్రసాదు చదువునకై జనకుడు సముచితమగు యేర్పాటు గావించెను. అల్పవయసునందే సంస్కృత వంగ పారశీక భాషలందు ఆతడు ఆరితేఱెను. పదునాఱేండ్ల వయసునందు ఆత డసాధారణ కవిత్వశక్తిని చూపగలిగెను. తంత్రశాస్త్రమం దాతనికి పరిచయము విశేషముండెడిది.

చిన్నవయసునందే రామప్రసాదునకు పితృవియోగము కలిగెను. పిల్లి కాకిమీద నుండవిల్లుదెబ్బ యన్నట్లు సంసారమాతనిపై బడెను. కుటుంబపోషణమునకై యాతడు పెక్కు చిక్కులకు గుఱికావలసి వచ్చెను. ఏదేని

యుద్యోగము సంపాదింపనెంచి యాతడు కలకత్తా కరిగెను. కడు కష్టము మీద నొక ధనికునియింట నాతడు గుమాస్తాపనిని సంపాదించెను. భూకైలాస మను జమీాయొక్క అధికారియొద్ద దివానుగానుండిన గోకులచంద్రఘోసాలు నొద్ద నతడు పనిచేసి యుండెనని కొందరును దుర్గాచరణమిత్ర యనునొక ధని కునియింట నుద్యోగియై యుండెనని కొందఱును చెప్పుదురు. ఎవరియొద్దనైన నేమి యతడు పొట్టకూటికై గుమాస్తాపనిని చేయవలసి వచ్చెను.

చిఱుతప్రాయమునుండియు రామప్రసాదు కాళీభక్తుడై యుండువాడు. తఱుచుగా నాతడు దుర్గ నామసంకీర్తన మొనరించుచుండుచు "మాతా! కాళీ! యని ధ్యానమగ్నుడై పోవును. ఉద్యోగమును చేయుచు లెక్కలను వ్రాయుతఱి తన్నుదాను మఱచి చితాపుస్తకమునం దాతడు కాళిని గుఱించిన పద్యములను పాటలను వ్రాయుచుండువాడు. అతని పైయుద్యోగి లెక్కల పుస్తకములందు పాటలను పద్యములను చూచి మిగుల జీకాకుపడి యొకనాడు వానిని గొంపోయి యజమానికి చూపెను.

మిగుల ముఖ్యమగు లెక్కల పుస్తకమునందు తోచిన వ్రాతలను చూచి యజమాని తొకత్రొక్కిన పామువలె యెగిరి గంతులు వేయలేదు. అందు లిఖింపబడిన పాటలను పద్యములను బహుశ్రద్ధతో చదివి భక్తిరసముచే నిండి యుండిన యాపంక్తులను గాంచినంతనే యాతని హృదయము ఆనందముతో పరవశమై పోయెను. వెంటనే యతడు రామప్రసాదునకు కబురు పంపెను. సమ్ముఖమునకు పిలిపించెను. పిలిపించి ప్రేమాశ్రుపూర్ణలోచనుడై యిట్లనెను. "తండ్రీ! నీవు సామాన్యుడవు కావు. పొట్టకూటికై నీవు గుమాస్తాపని చేయ తగవు. నీప్రకృతి వేఱు. సంసారము గడపుకొనుటకై నీవు ఉద్యోగము చేయ నక్కఱలేదు. నీ వెచ్చటనున్నను నెలకు ముప్పదిరూకలు నేను నీకు పంపెదను. ఆ పైకమునుగొని నీకిచ్చవచ్చిన చోటునందు నీకిష్టమగు రీతిని కాలము గడ పుచు సుఖముగా నుండుము."

ఈ వాక్కులు మిగుల దొడ్డవి. వీని నుచ్చరింపగల యజమాని హృద యము మిగుల విశాలమైనది; యితని యౌదార్యము మూలముననే రామ ప్రసాదుడు, విశాలప్రపంచమునకు దక్కెను. యజమాని యాతనిని గుర్తింప కుండినచో దుఃఖమందును దుస్థితియందును పడి యాతడు ముక్కిపోయి

యుండువాడు. రసభావములతో తొలుకాడు నతనిలేఖని లెక్కల పుస్తక ములయందుపడి వ్యర్థమయి యుండెడిది. కవిత్వసంపదతో కూడిన యాతని హృదయము నిరాశాబంధురమగు చవిటినేల యయ్యెడిది. ఆతని యంతరంగ మున నుప్పొంగు ఆనందము భక్తి దుస్సహదారిద్ర్యమునుండి వీచు వేడిగాడ్పు లచే కొట్టుకొనిపోయి యుండెడివి.

ఏలికయొద్ద సెలవుగైకొని నిజమందిరంబునకు మరలివచ్చి రామప్రసాదు కాళీభజనయందు కాలక్షేపము చేయదొడగెను. అతడొనరించు సంకీర్తనమును విని యతనితోగలిసి భజనసలుపుటకు పలువురాతని చేరుచు ననేకరీతుల కాను కలు వానికిచ్చుచుండువారు. విశేషముగా ధనమునుకూడ నిచ్చుచుండువారు. రామప్రసాదు డాధనమును దీనులకును దరిద్రులకును యిచ్చివేయు చుండు వాడు.

రామప్రసాదు డేయేట వివాహమాడెనో తెలిసికొనుటకు తగు నాధార ములు లభింపలేదు. పదునాఱవయేటనే యాతనికి పరిణయమయ్యెనని కొందరి యభిప్రాయము. ఈతనిపత్ని యీాతనికంటె నధికమైన భక్తిగలిగి మహాకాళి నారాధించుచుండెను. భర్తయెడల ననురక్తయై మెలగుచు పూజాదులయం దాతనితో పాల్గొనుచుండెడిది. తనయెడల ననురక్తయైన భార్య దొరకుట రామప్రసాదుయొక్క అదృష్టము. గంగాయమునలట్లు వారి ప్రకృతులు రెండును గలిసి వారిగృహము నొక పవిత్రక్షేత్రము నొనరించినవి. ఇట్టి దంపతు లున్న చోట పార్వతీపరమేశ్వరులును లక్ష్మీనారాయణులును సరస్వతీచతుర్ముఖులును వసించుటకు మిక్కిలి మక్కువపడుచుందురు. ఐహిక సుఖమునకు ఆముష్మి కానందమునకును పట్టుగొమ్మయగునది దాంపత్యము. ఉదయసంధ్య దిక్కుల యమున సముద్రమును నాకసమును కలిసినపుడు, ఏది సముద్రమో యేది ఆకసమో తెలియక యుండును. ఆ కలయికనుండి యెట్టి యపూర్వ తేజముద్భ వము కాజాలదు! హృదయములు కలిసిన సతీపతుల జీవమునుండి కనులు కోర గించు అద్భుతదృశ్యము లెన్నియో యుద్భవమగును.

కుమారహట్ట గ్రామము కృష్ణచంద్రమహారాజు అధీనమందుండెడిది. ఈపల్లె భాగీరథీకూలమం దుండుటచే కృష్ణచంద్రుడచట నొక చక్కని మేడ కట్టించినాడు. తఱుచుగనాతడు నదీతీరమందలి యీాసౌధమున విశ్రాంతిగొనును.

అరవిందమును బోలు రామప్రసాదుని చారిత్రమునుండి వెడలిన సుమధుర భావపరిమళము ప్రశంసావాయుసహాయమునుంది నలుదిక్కులజేరి కృష్ణచంద్ర రాయల మానసమధుకరము నాకర్షించెను. కృష్ణచంద్రుడు ప్రతిమానము నాతనికి విశేషసాహాయ్యము నలుపుచు తన యాస్థానమునందు వసింపుమని బహుభంగుల నాతనిని వేడుకొనెను. అందులకు సమ్మతించెనేని రామప్రసాదుడు ఆర్థికముగా విశేషోన్నతినంది యుండువాడు. అట్టి యాధిక్యత సతడు కోరక సిరికిని సమాన్మానమునకును కూడ కాలొడ్డెను. అందులకు కృష్ణచంద్రుడు విచారపడక రామప్రసాదుని యున్నతగుణముల మెచ్చుకొనినవాడై బహుభంగుల నాతని సేవింపుచుండువాడు. విశేషభూమి నాతనికొసంగి కవిరంజనుడను బిరుదమును కూడ నొసగెను. మహారాజు హృదయమున పొంగిపొరలు ఆనందమునకు బాహ్యవ్యక్తీకరణములైన క్రియలనన్నింటిని యాతడు అడ్డుపెట్టుచున్న యెడల నాతనికి చింతకలుగునని యోచించి రామప్రసాదీపర్యాయము వాని నంగీకరించెను కాని యాభూమిని బిరుదమును తాను కాంక్షించి యాక్రియ కాతడంగీకరింపలేదు.

రామప్రసాదుడు భక్తియుక్తమైన గ్రంథముల నెన్నియో వ్రాసెను. ప్రసిద్ధికెక్కిన యాతని గ్రంథములలో 'విద్యాసుందర్' అను గ్రంథ మొకటి. ఇది స్వకపోల కల్పితముకాదు. దీనిని వరరుచి యనునాతడు సంస్కృతమున రచించెను.

కుమారహట్టులో అచ్యుతగోస్వామి యను నొక వ్యక్తికలడు. అందఱాతనిని ఆజూగోసాయి యని పిలుచుచుందురు. ఆశురచన యందీతడు కుశలుడు. రామప్రసాదేదేని గీతమును పాడునపుడు ఆతని బరిహాసించుచు వెంటనే యాతడు సొంతగీతముతో నుత్తర మొసగుచుండువాడు.

రామప్రసాదు తాంత్రిక (యొకానొక వేదశాఖ) మతావలంబికదా. తాంత్రికోపాసనమునుబట్టి యతడించుక సురాపాన మొనరించుచుండువాడు. ఆకారణమున పలువురాతనిని త్రాగుబోతని పిలుచుచుండువారు. అందులకు రామప్రసాదెపుడును కోపగించువాడుకాడు. ఒకనాడాతడు దారినిపోవుచుండ కొందఱు తుంటరు లాతని నుద్దేశించి "తప్పుకొనుము ఒరే! త్రాగుబోతూ!" అనికేకవెట్టిరి. అపుడు కూడ రామప్రసాదు కోపగించుకొనక తోడనే యాశు

కవనమున నొకగీతమల్లి పరమానందమున కాళీనామసంకీర్తనమును కావింప దొడగెను.

రామప్రసాదుని జీవనచారిత్రముమ వ్రాయుతఱి త్రాగుబోతు అను విషయమును గుఱించి కొంతవ్రాయవలసి యున్నది. ఉత్తమగుణ సంశోభితు నకు త్రాగుడేల ?

అల్పజ్ఞానముతో మానవులొనరించు నిబంధనలు అనంతజ్ఞానికి పనికిరావు. శంకరాచార్యుడు కల్లుత్రాగెననియు యాతని శిష్యుడొక డదిగాంచి తానును త్రాగెననియు, ఆచార్యుడందులకు కోపగించి, కరగిన సీసమువింత తన గొంతుక యందు గొటగొట లాడించి శిష్యునికూడ నట్లు కావింపుము నె ననియు నట్లొన రించుట కాశిష్యుడు వెరచెననియు నందుచే శంకరుడొనరించు నేపని యెట్టిదైనను నది ప్రతిఘటింపరానిదనియు నొకగాథను పలువురు తెలుపుచుందురు శ్రీశంక రాచార్యులు కల్లు త్రావెనో లేదో తెలిసికొనుటకు నిదర్శనములులేవు. ఆవిష యము నిజము కావచ్చును కాకపోవచ్చును. నిజమేయుందు మేని యితరవిషయము లందన్నిట నాతడు శంకరభగవానునకు సరివచ్చువాడే యైనను ఈ ప్రత్యేక విషయమున క్రిందికి కూలెననుట దోషము కానేరదు. నీతిబాహ్యముగా నెంచ బడు యేక్రియగాని యొకరిపట్ల నుచితము కాజాలదు. అది మఱింత నీతిబాహ్య క్రియగా పరిణమించును. తప్పులు దిద్దు నాతడు తప్పొనరించునేని యాతని తప్పు మఱింత ఘోరమై చూపట్టును. ఎంతటి ఘనుడైనను నెరసుల నుండి తప్పిపో జాలడు కావున తప్పుకావించెనని యాతని నిందింపక యాతని యందలి యద్భుత మైన మంచికే నమస్కరించి యతని సుగుణముల ననుకరించుట యుక్తము.

ఒక వ్యక్తియొక్క చారిత్రమునుగూర్చి విమర్శించుతఱి ఆవ్యక్తి పుట్టి పెరిగి మసలిన దేశకాలవాతావరణములను దృష్టియం దుంచుకొనవలయును. నేటి నిబంధనలు నాడు చెల్లకపోవచ్చును. నేడక్కఱకుమాలిన పదార్థము లొకప్పు డనివార్యభోగ్యములు కావచ్చును. శుక్రదేవయానుల కాలమున సురాపానము పరిపాటిగా నుండెను. వేదకాలమందు 'సోమ' రసమును సుర త్రాగబడుచుండెడిదట. నాటి యాచారములు నాటి పరిస్థితులనుబట్టి యుండును. నలుడును ధర్మరాజును ద్యూతమునాడుట తగనిపని యనిపించును. నాటి రాజన్యుల గౌరవాగౌరవములు విమర్శించుతఱి నేటి దృష్టి చెల్లదు. శంకరుడు

జగదీశునితో సమానుడైనవాడైనను నతడు మనియున్న కాలము యీకాలము నకు మిక్కిలి దూరమునందు లేనికారణమున, నాతడు కల్లుత్రాగవచ్చుననుట సమంజసముకాదు. రామప్రసాదునందును నీలోపము గోచరించుట దుఃఖ కరము.

మధుపానమును గుఱించిన యపోహాలు నేడును కొందఱు సన్యాసు లందు గోచరించుచున్నవి. తాంత్రికులు సురను సేవింపవచ్చునని యొక వాడుక కలదు. అందుచే తాంత్రికోపాసనకు కడంగిన రామప్రసాదు మధుపాన మొన రించెను. తాంత్రికోపాసకులయందు పుట్టిన యీమూఢ విశ్వాసమును మూఢాచారమును స్వతంత్రబుద్ధిని వినియోగించి యేకారణముచేతనో రామ ప్రసాదు తలక్రిందు చేయలేకపోయెను.

ఉత్తరహిందూస్థానమున బైరాగులలో విచక్షణజ్ఞానము లేనివారును మూఢులును నేడున్నారు. వేషములకు వీరు బైరాగులే. ఈబైరాగులందఱు స్వాములవార లని తలపరాదు. వీరిచేతులయందు తఱచుగ చిలుము గొట్ట ముండును. గంజాయి భంగు మొదలగు మత్తుపదార్థములు ధ్యానమున కుపచ రించువస్తువులని వీరినమ్మిక. భక్తియొక్క మత్తువేఱు; భంగుయొక్క మత్తు వేఱు. భక్తిప్రియులు వేఱు; భంగుప్రియులు వేఱు. చెడు సాంప్రదాయము నకు చేతులొగ్గినవారు మన కాదర్శపురుషులు కాజాలరు.

రామప్రసాదొకప్పుడు కృష్ణచంద్రునితో గలిసి మూర్షిదాబాదున కరి గెను. గంగానదిలో నావపై నెక్కి పోవుచు నతడు సహజమధురకంఠస్వర ముతో పాడదొడగెను. ఆసమయమున సురాజుద్దౌలానవాబుయొక్క నావ ఆపడవచెంతనుండి పోవుచుండెను. ఈతని గాన మానవాబు చెవులపడెను. తోడనే యతడు తనవావ నాపించి యెదుటి నౌకలోనున్న గాయకుని తన నౌకలోనికి రప్పించి పాడమని యాతనివేడెను. నవాబు మిక్కిలి సంతోషించు నని యెంచి రామప్రసాదు ఉర్దూపాట నొకదానిని పాడ నారంభించెను. నవా బందుల కిష్టపడక తొలుతపాడుచుండిన పాటనే పాడుమని రామప్రసాదుని కోరెను. తోడనే యతడు దుర్గ గీతికను పాడెను. ఆపాట వినినంతనే పాషాణ హృదయుడని యెంచింపబడు సురాజుద్దౌలా పరమానందభరితుడాయెను. ఆతని రాతిగుండె నిముసములో కరగిపోయెను.

సంగీతము కళలలో రాణి. కళకు లొంగనిదేదియు నీలోకమున లేదు. పదునాలుగు భువనములయందును కూడ నుండదు.

దార్జన్యమును సాధించుటకు కళ ముఖ్యమైన సాధనము. భీషణాకారుడై గదయెత్తి మీదనుఱుక గమకించు యముడు విఫలమనోరథుడగుట సంభవించును. వాడి యడిదములును అగ్నికణములును ఘనకార్యములు నెఱవేర్చ లేక నుపయోగపడక పోవచ్చును. పిడుగుచేయజాలని కార్యము పూలచెండు చేయగలుగును. కొండనుప్రక్కలుసేయు కేక చేయజాలనిపని చల్లని మెల్లని మాట చేయగలుగును. హృదయమును బెదరగొట్టి గాక చల్లపఱచియే యెదుటివాని నొకడు వశము చేసికొనగలుగును. క్రియయందుగాని మాట యందుగాని తలపునందుగాని దార్జన్యము చేయగలుగుపని యేమియులేదు. దార్జన్యప్రయోగమున మంచివారు చెడిపోయినను చెడిపోదురు. ప్రశాంత వర్తనమున చెడ్డవారును మంచిమార్గమునకు రాగలుగుదురు.

మనుష్యప్రకృతి వింతయైనది. ఇది యిట్టిదని నిరూపించుటకు దీనితో పోల్పదగునది మఱియొకటి ప్రకృతియందులేదు. దేవతయొక్క ప్రకృతికిని సమానముకాదు. పిశాచపు ప్రకృతితో పోల్పరాదు. మనుష్యుని ప్రకృతియందు దేవతయు పిశాచమును కూడనున్నవి. ఘోరయుద్ధమునగాని దేవతాప్రకృతికి పిశాచప్రకృతి లొంగదు. లొంగిననాడు మానవుడు దేవతాసముడగును. అతనిజీవనము స్వర్గమయమగును. ఒకయెగ్గుగాని యొకఅపరాధముగాని యొక దూషణముగాని యొకదుర్నయముగాని యిట్టిమనుజుని చలింపచేయజాలవు. మనుజుడు దేవసముడగుట సులువైన కార్యముకాదు. తనయందలి పిశాచమును జయించినగాని యాతనికి దేవత్వములభింపదు. మహావీరుడే దేవతకాజాలును. కత్తిచేబూని రణరంగమున నిలిచి శత్రువులను జయించు వానికంటె తననుతాను జయించుకొనినవాడే యధికశక్తిగల వీరుడగును. విజయుడైన మానవుని దుఃఖావమానము లేమిచేయగలవు. ఈవిజయమునకు అంతరంగికమైన తపంబును, తపమునననుసరించి యనుష్ఠానమును నావశ్యకములు. ఇవి పట్టుబడుటకు ననేక జన్మాంతరముల ప్రయత్నమువసరము. పూర్వసంచితానుభవము లాత్మగతమున నిలువనై యుండును. ఈయనుభవముల ననుసరించి ప్రస్తుతజీవనమున నియమబద్ధజీవనమును నడుపువ్యక్తి కాలక్రమమున విజయుడగుటకు తగినశక్తి నంద

గలడు. అంతరంగ విజయము నందినవాడే బాహ్యావిజయము నందగలడు. చెట్లయందును పుట్టలయందును రాళ్లయందును రప్పలయందును కొండచరియలందును చాటుగుహాలందును వసించువారికి బాహ్యాజగతికి సంబంధించిన చిక్కులవలని భయముండదు. అంతరంగమందలి శత్రువులను రెచ్చగొట్టువారును బాహ్యాప్రపంచమందలి శత్రువులేకావున నంతరంగజగతికి సంబంధించిన చిక్కుల వలననుకూడ నిట్టివారికి భయము లేదు. కష్టమంతయు మామూలు ప్రపంచమునందుండి ప్రలోభములనుండి యాకర్షింపబడక వానికి వశుడుగాక వానిని జయింప నెంచినవానిదే. ఎవరును లేనిచోటున మహాసముద్రమును దాటుట తప్పనిసరి. ఇందు కష్టమేమున్నది. పదుగురయందుండి ముని కాగలుగువాతడే మహాపురుషులయందు మహాపురుషుడు కాజాలును. ఇతడు బాహ్యజగతియందు జన్మమునొందెను. దేవుడొకని నొకచోట నొకయుద్దేశముతోగదా బుట్టించును. దైవోద్దేశమును త్రోసిరాజని యే చెట్టు తొఱ్ఱలోనో యేపీఠకన్నములోనో కూర్చుని స్వాంతముక్తిని సంపాదింప నెంచుట యుత్తమోత్తముడైన మానవునకు చెల్లదు. జనకుడెవడు? ఇతడు జడదారి కాడు. మనుష్యప్రపంచమున నిలిచి ఋషికంఠీరవులకు కూడ మేలుబంతి కాజాలు ఉత్తమజీవనమును గడపిన మహాపురుషుడు. విషయబంధురమగు జగతియందుండి విషయచింతలయందు తగులుకొనినవాడే మహాపురుషుడు. ఇతడే తామరాకుపై జలబిందువు. ఇతడే విజయజీవుడు.

మనుష్యసంఘము దాడిమగింజల ప్రోవువంటిది. గింజల పొందున్నప్పుడే దానిమ్మపండు రత్నములభరణివలె రంగారి యుండును. గింజలు కొన్ని యూడిపడెనేని పండులోని యందమునకు హాని వాటిల్లును. అట్లే శరీరాంగములలో నేదేని యొకయంగ మూడెనేని యా వ్యక్తియొక్క యందమునకు హాని చేపడును. ఆవ్యక్తి జగదీశురూపు ననుసరించి నిర్మింపబడిన దివ్యవిగ్రహామట్లు చూపట్టునా? ఎండుమోడువలె గన్పట్టును. మానవసంఘమునుండి చీలిన మానవుడును విడివడిన మొండెమై యుండును. అభివృద్ధి నందవలెననిన మానవుడు తోడిమానవులతో గలసియుండియే దాని నందవలెను. మహాత్ముడగువాడు యొరులముక్తిపై మొదట దృష్టి ప్రసరింపచేసియే తనముక్తిదెసనాదృష్టిని మరల్చును. తోడిమానవుడు స్వర్గమును చేరుటకు తాను నరకమున

కూలుటకు సంశయింపనని వివేకానందస్వామి వచించెను. పలువురు కలిసిచేసిన ప్రార్థనమే విశేషబలత్తరమైనదై యుండును. సంఘముమీద నేకముఖముగా జరుగు ప్రార్థనము పెద్దకెరటములతోకూడిన మహాసముద్రమువలె యున్నతమైన భావవీచికలచే నిండియుండును. సంఘమందును సంఘీభావమందును నద్భుతమైన శక్తియున్నది. ఒంట్రెత్తు బ్రతుకు బ్రతికి "హాయి హాయి" యనగలిగినవాడెవడు నుండడు. తుదకు సామాన్యమైన భోజనక్రియయందు కూడ సంఘీయమైన యానందము వెల్లివిరియును గదా! తన వంటయింట ప్రొయ్యిచెంత తాను కైదీయయి పాలకడవలను నేతిజాడీలను దిగమింగు బొజ్జకా! లేక వనసంతర్పణమున నప్పడములు వడియములు విఱిచి గోవింద నామోచ్చారణమందు హృదయమును నృత్యములు చేయించుచు సంఘమునందు భోజనముచేయు మానవుని బొజ్జకా! ఆనంద మరచేతి వెన్నయగుట. సంఘము కలసినపుడు చేకూడు సంతసమునకు నది వేరైనపుడు సంభవించు చింతకును మేరలేదు. మానవసంఘమునందలి పలువురు మనుజలు మన మనస్సునకు నచ్చినవా రగునపుడు మనకు విజయము చేపడుట కెంతకాలము పట్టును? ఇపుడు మనము పొందవలసిన విజయమున కెన్నియడ్డంకులున్నవో చూడుడు. ఈ యడ్డంకుల నెదుర్కొనుట కుపయోగించు సాధనములు, పూర్వయుగములయం దుపయోగించిన సాధనములను పోలునవికావు. నేడు గాండీవమును లేదు, సుదర్శనచక్రమునులేదు. దుర్యోధనులు మాత్రము కోల్లలుగానున్నారు. జీవనమునందు విజయమును సంపాదించుటకు నాటి యుద్ధవిధానము నేడుచెల్లదు. గీతలయందు చెప్పబడిన యుద్ధము ఆధ్యాత్మికమైనది. గీతలను శిరసున ధరించి, యందలి యుద్ధమునుమాని యందలి మాధుర్యమునుగ్రోలి, జీవన విజయమునకు నేడు కావలసినది మాధుర్యమనియు నెదుటిశత్రువును నిర్జించుటకు మనము కాంక్షింపవలసినది కంఠము నరకు సుదర్శన చక్రముగాక హృదయమును కరగించు మురళియనియు నొక్కి చెప్పవచ్చును. విశ్వరూపసందర్శనము మన కబ్బునదికాదు. అబ్బినను మనము కన్నెత్తిచూడజాలము. అర్జునుడే యారూపమును కనజాలకుండెను. (గీత 11 అధ్యాయము.) తగినయత్నము చేసితిమేని మురళీధరుడైన శ్యామసుందరుని మనము కాంచగలము. మురళీనాదమున నానందవీచికలుపొంగి పొరలుచుండును. తన జీవనబృందావనమున నిట్టియానంద

తరంగముల పొంగింప గలుగునాతడు మురళీధరుడనిపించుకొనును. ఆనంద మయమై శాంతియుతమై సౌందర్యోపేతమై కళావిరాజితమైన యాతనిజీవనమే నేటి మనుష్యసంఘమునకు కాంతియుతమైన మేలుబంతి కాగలుగును.

కండబలము వలనను, కారుమాటల వలనను, కన్నెఱ్ఱవలనను, కత్తిపోటు వలనను మనసు లెన్నడును స్వాధీనముకావు. దుష్టశిక్షణము, శిష్టరక్షణము నను పదములు మన పురాణములందు స్వర్ణాక్షరములతో లిఖింపబడియున్నవి. దుష్టులను దునుమాడుటకును, శిష్టులను రక్షించుటకును జగదీశ్వరుడు పెక్కువతారముల నెత్తెనుగదా, పదియవతారములయందలి గంభీరతత్త్వమును మన మింకను గ్రహింపలేదు. దుష్టులను దునుమాడునది వారికెదురై నిలిచి వారిగొంతుకలను నులిమివైచు వారిదుష్టత్వమే. శిష్టులను కాపాడునది వారియండనుండి వారి ప్రాణముల కడ్డునిలుచు వారిశిష్టత్వమే. శిష్టత్వమం దీశ్వరుడున్నాడు దుష్టత్వము నందు దానవుడున్నాడు. ఈదుష్టత్వము నణచునది యెప్పటికైన నాశిష్టత్వమే. ప్రత్యక్షదృశ్యమును గాంచిననేగాని సామాన్యులు ఉన్నతభావములను చింతనచేసి కొనజాలరని తెలిసికొని వారికి యవగాహనమున కందుబాటగు కథను గావించుటకు, ఈదుష్టత్వమునకు రక్తమాంసములుగల రూపమిచ్చి దానవుడనియు, నాశిష్టత్వమునకు రూపమొసగి యవతారపూరుషుడనియు మనపురాణకర్తలు వాకొనిరని నాతలంపు. పెద్దకోరలును పదితలలును గలవారు నేడునులేరు, నాడును లేరు. భావమును వ్యక్తపఱచుటయందు మనపూర్వకవులు విశేషస్వాతంత్ర్యమునుతీసికొనిరి. మనమెన్నడును కనివిని యెఱుంగనివ్యక్తులొకప్పు డున్ననేమి లేకున్ననేమి. వారుబ్రతికి గంతులు వేసిననేమి, చచ్చి స్వర్గముననో నరకముననో వాసము చేయుచుండిననేమి? ఈ విడ్డూరములవలన మనకుగల ప్రయోజనమేమి? ఇటువంటి భయంకరరూపములను సంహరించుటకు జగదీశుడు రూపుదాలిచి గోచరించెనందుమేని నేడు మనకుకూడ భగవంతుడు ప్రత్యక్షము కావలెనని కోరుదుము గదా! నాటి దానవులను మించిన దానవు లిపుడు గోచరించుచున్నను ఏస్తంభమునుండియో యొకనరసింహస్వామి గోచరించి యీ ఘోర దుర్మతులను దునుమాడుటలేదేమి! దేవదానవుల పోరాటము నాడు కలదు నేడునుకలదు. మనవలెనే నాటిప్రజలును జీవనరంగమున పలువిధములగు కష్టముల నెదుర్కొని వానినొకరీతిని చేపట్టగలిగిరి. ఈ సమస్యలందును, ఆనమస్య

లందును దేశకాల పరిస్థితుల ననుసరించిన భేదము లుండవచ్చును. అంతియుకాని మనము కనివిని యెఱుంగని దేవదానవు లనువ్యక్తులు ఆనాటివారని యిప్పుడు లేరని నమ్మినచో ఈపురాణములవలన మనము నేర్చుకొనవలసిన దేమిగలదు ? ఆవిడ్డూరపు గాథలు, ప్రస్తుతము మనుష్య జీవనమునందలి కష్టపరంపరల నెదుర్కొనుటకు, మనకింతజ్ఞానశక్తినిచ్చు అద్భుతోదంత ములని గ్రహించితిమేని వానివలన మనకెంతేని లాభము చేకూఱును. అవతారపూరుషులను గుఱించియు దానవులను గుఱించియు యింతక తెలిపిన యీసందర్భమున రామాయణార్థమును శ్రీ శంకరాచార్యుడు తెలిపిన రీతిని యిందు వ్యక్తపఱచుచున్నాను. సంసారమను వార్ధిని బ్రహ్మానుష్ఠానమను వారధిమూలమున దాటి దానవులను అంతఃశత్రువులను జయించియే శాంతియను సీతను మానవుడు పొందగలుగు ననియు, నాడే మనుష్యహృదయమునందు ఆత్మారాముడు శాంతిమయి సీతసహితుడై యుండుననియు, శ్రీశంకరాచార్యులు వచించెను. మహాభారతమందును నిట్టి గంభీరార్థమున్నది. కురుక్షేత్రమనగ క్రియాక్షేత్రము. క్రియాక్షేత్రమను శరీరమున సత్ప్రవృత్తులను పాండవులు దుష్ప్రవృత్తులను కౌరవులను జయించిన తోడనే హృదయమున శాంతి తేజరిల్లును. రామాయణ మహాభారతములు రక్తప్రవాహములతోడను మాంసఖండములతోడను నిండిన గ్రంథములుగాక శాంతి వైపునకు మానవులను నడపు గొప్ప కావ్యరాజములు.

అంతరంగవిజయమని గోలపెట్టుచు దానిని పొందుటకై ఇంద్రియములను మాడ్చి మాడ్చి వదలివేయవలెననియు శరీరమును పంచాగ్నుల (ఆహవనీయము ; దక్షిణాగ్ని ; గార్హపత్యము ; సభ్యము ; అవసథ్యము) మధ్య తగులబెట్టవలెననియు, పరస్త్రీ కన్నులబడినంతనే పెడమొగము బెట్టవలెననియు పరధనము కానుపించినంతనే గ్రుడ్డు పీకివేసికొనవలెననియు యిట్లెన్నియో రీతుల నెందఱో తెలిపియున్నారు. ఇంద్రియములను మాడ్చివేయుట రాక్షసకృత్యమని శ్రీకృష్ణభగవానుడు గీతలయందు తెల్పియున్నాడు. మాడ్చుట కేర్పడినవైనచో భగవంతుడు వానిని మనకేల ప్రసాదించినాడు? సత్క్రియకై యేర్పడిన వస్తువులన్నియు దుష్క్రియకును పురికొల్పునవియై యుండుట మనము చూచుచున్నాము. దుర్వినియోగము చేయుటకు తలపడు దుష్టప్రవృత్తిని అణచివేయువలయును గాని సద్వినియోగమునకు ముఖ్యమైన వస్తువులను వీని సృష్టికి ఆధారమైన ఆంతర

శక్తిని రూపుమాపుట న్యాయమగునా? ఇంద్రియవిజయమునకును ఆత్మవిజయమునకును దారుణబాధ పడనవసరములేదు. అమానుషాభ్యాసములకు శరీరమును లోబఱుపనక్కరలేదు. దినములకొలది కటికియుపవాసములు చేసినవాడు ఆత్మకు అగ్గిముట్టించును గాని ఆనందము గూర్పడు. కాల్చిననే గాని వన్నెయును శుద్ధియు రావనువారు మనసు లోహముగా భావించుమూఢులు. మనస్సును కాల్చి యా పొగలయందును సెగలయందును స్వర్ణకాంతులు కనుగొనినవాడెవడు? శరీరమానసములకు హింస కూడదని బుద్ధభగవానుడు వాకొనినాడు. జీవనవిజయమునకు భంగము తెచ్చునది క్రోధము. ఇది అంతఃశత్రువులకు రాజువంటిది. ఇది లొంగనేని తక్కినవిరోధులు తృటిలో లొంగుదురు. సృష్టి మొదలు నేటివఱకు ప్రపంచమునందు జన్మించిన మహాపురుషుల జీవితములను గమనించితిమేని యొకప్పుడు గాకపోయిన మరియొకప్పుడైనను నీ క్రోధము తనశక్తిని చూపియుండినట్లు గోచరించును. సంయమగుణమున ప్రసిద్ధికెక్కిన మహాత్ములు కూడ క్రోధమును సంపూర్ణముగా నిర్జింపజాలరైరి.

క్రోధకారణములను నశింపజేసితిమేని క్రోధమును మాపనగును దురాశను స్వార్థమునకును వీనినుండి పుట్టిన దుర్గుణములకును దెబ్బతగిలినపుడు తోకత్రొక్కిన త్రాచువలె కోపము హృదయమందు లేచును. శాంతమును ప్రబోధించి నిర్వాణమార్గమును సూచించిన బుద్ధుడు "వాంఛవిడువుము" అని చెప్పినాడు. బౌద్ధశాస్త్రమందు కాంతిమంతమగు నక్షత్ర పంక్తులతో వెలుగొందు వాక్యమిట్టిదియే. ప్రస్తుతపువంశమున జీవించి సంసారజీవనమున కంటియుండు నాతడు "నేనేమియు వాంఛింపను" అని యెంతవఱకు సంసారమార్గమున సాగగలడు? "పక్షులు తమయక్కఱకై యాతురపడవు. అవి యెన్నడును ఆనందముతో నుండును. తమ కోరికలకై మనుజుడు దుఃఖింపనేల? దేవుడే యాతనిని కాపాడును" అని యేసుక్రీస్తు తెలిపెను. గురువులకు గురువులై జగదీశుని లక్షించుకొన గలిగిన యీ మహాత్ముల వాక్యములు సర్వమానవుల వలనను లెక్కసేయదగినవి. కాని వీరి నుడువుల యర్థము నూహించుచు న్యాయవాదుల వ్యాఖ్యానమువలె గాక విశాలదృష్టిగలవారి వ్యాఖ్యానమువలె భాష్యమును చెప్పవలెను. సర్వసంగపరిత్యాగియైనవాడే గాని "నాకు వాంఛలు వల" దని తెలుపజాలడు. "ఆహారమును గుఱించిన యాతుర

పాలేల ? ” అనుచు తోచినట్లు సంచరించు సంసారి ఆకలిబాధచే జావవలెను. మహాపురుషుల వాక్యములను మహితాశయములను గంభీరసత్యములును, సూర్యకిరణముల వంటివి; ప్రకృతిసౌందర్యము వంటివి; పుష్పసౌరభము వంటివి. యుగములు గడచినను పుష్పసౌరభము ప్రాతగిల్లి పాడుకాదు. సూర్య కిరణములు త్రుప్పుపట్టవు. ప్రకృతిసౌందర్యము మాపు మాయదు. మహితాశ యములును మహావాక్యములును, సూర్యచంద్రు లున్నంతకాలము కాంతిగుత మగు ప్రకాశమానమైన యర్థబంధురములై యేసు బుద్ధుల నుడువులు సృష్టి చివరవఱకు శాసావహింపవసగినవి. మామూలు సంసారజీవనము గడపుచు మెట్టపల్లముల కీర్ష్య వాంఛలకును మానసిక శాంతిని క్రియాగార్ధ్యమును నశి ప జేయు నాతురపాటునకును ప్రాదనికావశ్య ములను గుఱించిన దుఃఖమునకును మనసున మానవుడు చోటియ్యరాదని బుద్ధ క్రీస్తుల యభిప్రాయము. ఈమహా నీయుల వాక్కులసారము గ్రహించి వాని ననుసరించి జీవనము గడపితిమేని క్రోధమును పుట్టించు ప్రవృత్తులెన్నో చచ్చిపోవును.

వాదసంఘర్షణమును క్రియాసంఘర్షణమును కలిగినపుడు కోపము తరు చుగా రవులును. విశుద్ధానందుని వంటి మహాత్ముడు సోదరశిష్యునితో తగ్గుం గుచు ఆగ్రహావేశుడైనాడు. నములుకాక తనకంటె తక్కువవారని తాను యెంచువారును, శత్రువులును సరిసులవంటి మాటలను వెదజల్లినపుడు మానవుడు కోపించును. ఎదుటివాడు దుద్రేకమును పురికొలిపినపుడు రగులుకొనిన అగ్నివలె ఆగ్రహము రగులును. సాధారణనిత్యజీవనమున నిట్టి సందర్భములు తటస్థించుచుండును. సమత్వభావమును, సహనమును, క్షమాగుణమును నిట్టిక్రోధ మును పుట్టనీయకుండును. మనయెడల నెదుటివాడు అపచారము చేసినపుడు అతని మానసిక సాంసారిక అవ్యవస్థితులను బాగుగా నాలోచించితిమేని యాతని హృదయమును తలక్రిందులుచేసిన కారణములను గ్రహించి యాతని యెడ కోపము చెందుటకుమాఱు కరుణచూపుదుము. అసాధారణ సంఘటనము మారొకనినపుడు చల్లదనము ప్రయోజనరహితమై యుండునని తలపరాదు. క్రోధమునకు మారు కౌశలమును ఉపాయము మానవుని యిట్టి విపత్తునుండి తప్పించును. ఒకసారి క్రోధమునకు తావిచ్చితిమేని వెఱ్ఱిగుఱ్ఱమువలె మానస మును అది హఠాత్తుగా లోతుగోతిలో పడద్రోయును. క్రోధమువలన తలవని

తెలవరాని యాపదలు వచ్చును. మనకినుక మన కినుకయై యుండక యెదుటి మానవుని పిశాచము చేసివైచినను చేసివైచును. అపుడాతనివలన మనకును మనవలన నాతనికిని యిరువురివలన సంఘమునకు చెప్పనలవిగాని ముప్పు వాటిల్లును. ఎదుటివాడేకారణముచేతనైన శాంతమును గోల్పోయినను సాధారణముగా నాతడు పిశాలహృదయము గలవాడే యైనచో మనమాతని యెడల చూపుసహనము సంజీవివలె పనిచేసి యాతని పునరుద్ధరించును. శాంతము మంచి విత్తనమువంటిది. ఈవిత్తనమును గ్రహింపలేని మానసక్షేత్రమున నది మొదట వృధాయగును. ఎదుటివాడు మూఢుడును కఠినుడును నగుచో మన శాంతము భయముగను పిరికితనముగను యెంచబడి యాతని క్రౌర్యమును హెచ్చించినను హెచ్చించును. అపుడు మనము విచక్షణశక్తి నుపయోగించి నిరపాయమైన విగ్రహము నభినయించి అపాయమునుండి తప్పించుకొని క్రమ క్రమముగా నెదుటివాని మనస్సును సంస్కరించుటకు మనము ప్రయత్నము చేయవలెను. మేఘుడు గర్జించుట యెఱుగుదుము. కాని యామేఘుడు శాంతమైన చల్లని సలిలధార గురిపించును. సముద్రమున నెత్తైన తరంగములు లేచును. కాని మహాసముద్రముయొక్క హృదయము అనంతమగు శాంతితో విరాజిల్లును. గంభీరహృదయుని క్రోధమును నిట్టిదే.

శాంతమును కొంతవంచి ఆగ్రహమును లేవనెత్తు భావమొకటి గలదు. అది ఆత్మగౌరవము. ఇప్పటిప్రపంచమున నిది విశేషముగా ప్రాముఖ్యము నందియున్నది. ఆత్మగౌరవమును పోనాడి శాంతమును తనది కావించుకొనిన వాని కంటె శాంతమును పోనాడి ఆత్మగౌరవమును తనది కావించుకొనినవాడిపు డెక్కుడు గౌరవింపబడుచున్నాడు. శాంతముయొక్క గుణము లొంగుపాటు. లొంగక తలయెత్తుట ఆత్మగౌరవముయొక్క నైజము.

మనుష్యవిజయమునకు అహింసామానములు చేదోడగును. ఎదుటి వానిని జయింపవలెననిన మానవుడు అహింసను ప్రథమమున నారాధింపవలెను. శారీరకహింసయే గాక మానసికహింస కూడ మన సనాతనధర్మము నిరసించినది ఒక్కొక్కప్పుడు మాటలకుగల వాడి, వాడికత్తి కుండదు; వాడి బాణమున కుండదు. మంచిమాటలు మనసును రంజింపచేయునట్లు వేడిమాటలు

మనస్సును మంటబెట్టును. మనసు మండినపుడు గదా దారుణకృత్యములు వెలువడును. అహింసావ్రతమును పాలించు నాతడు చల్లనిమాటలు పలుకును. అతని పలుకులు కత్తులును యీటెలును బల్లెములును కావు. మనుష్యహృదయ మెట్టి చిత్రమైనదో కాని దోషము వేలెత్తి చూపితిమేని యది కుతకుత లాడును. పరిపక్వమైన మనస్సులుగల యేకొద్దిమంది మహాత్ములో తక్క తక్కిన మానవులు దోషనిర్దేశమును సహింపరు. సామాన్యమానవుని తప్పు చూపితి మేని యతడు దుర్మతియగును. అహింసవలనను శాంతమువలనను దోషిని దోషరహితుని గావింపవచ్చును.

మౌనము శాంతముయొక్క చిహ్నము. మౌనము నభ్యసించు నాత నికి శాంతి మరచేతి యుసిరికపండగును. మౌనముయొక్క విలువ యెఱిగిన వాడు దినకృత్యముల నెఱపుతఱి యోచించి అవసరమగు సమయములయందే మాటలాడును. ఈతని మాటలయం దొడుదొడుకు లుండవు. ఒరులు త్వర పడి మాటలు విసరినను తక్షణమే యా మాటల కేదో యర్థముతీసి క్రోధ మును జెందక తన యోచనయందు వానిని నిలిపి విశాలదృష్టిని వానిపై ప్రస రింపజేయును. బాహ్యప్రపంచమే గాక అంతరంగ ప్రపంచ మొకటి కలదనియు ప్రస్తుతజీవనమే గాక మరణానంతరజీవన మొకటి కలదనియు మౌనియైనవాడు గుర్తించును. ఒరులతో ప్రసంగించునపుడు తన మానసమును బరణిలో నింపి యున్న భావములను మణువునుండి వలసిన వానిని గొని వాని నాతడుపయోగిం చును. ప్రజలతో మెలగురీతి నితడెఱిగినట్లు మఱొక్కరుడు యెఱుగనేరడు. ఎదుటి వానిని బాగుగా గ్రహించి వాని చిత్తవృత్తు ననుసరించి వారితో తాను మెలగవలయు రీతి నీతడు నిర్ణయమొనరించుకొనును. ప్రజలతో మెలగ వలయు రీతి జీవనవిజయమున కనివార్యమైన యుపకరణము. బాహ్యజగతి యందే పూర్ణముగా దృష్టినిలిపి బాహ్యవ్యక్తులమీదను వస్తువులమీదను మిక్కిలి మక్కువకలిగియుండు నాతడు వానికి లోపముగాని కీడుగాని సంభ వించినపుడు దుఃఖమున మునిగిపోవును. బాహ్యజగతిని గట్టిగ నంటిపెట్టుకొని యుండు నాతనికి ఆత్మశాంతి యుండదు. అవసానసమయమున నీతని ప్రాణములు దుఃఖాగ్నియందు మ్రగ్గుచునే తప్పనిసరిగా నెందో యెగసిపోవును. తొలి నుండియు నభ్యసింపజాలని నిష్కామజీవనము నాతడు తుదిముహూర్తమున

నభ్యసింపనేరడు. ధ్యానము, మననము, ప్రార్థనము మౌనము ఆత్మవిజయమున కనివార్యమైనవని మానవుడు సకాలమున గుర్తింపవలెను.

శాంతము, ఆనందము, సౌందర్యము నొకదాని కొకటి సంబంధముగలవి. వీనియందు ప్రధానమైనది శాంతము. జీవనవిజయమునకు కావలసిన యమ, నియమ, వ్రత, యజ్ఞ, తపస్, దాన, ధ్యాన, సామ, దమన, వివేక, భక్తి, జ్ఞానములన్నియు శాంతమునకు సహాయకారులు.

చిరతపము, చిరానుష్ఠానము, గభీరయోచనము, దూరదృష్టి, విశేషాభిజ్ఞత అల్పానుభవము శాంతమునందున్నవి. వీనినందక మానవుడు ఉత్తమ చారిత్రుడు కాజాలడు, ఉత్తమచారిత్రమునకును విజయజీవనమునకును భావనావేగ మవసరము. హృదయావేగమును సముచితభావోద్రేకమును జీవత్వసిద్ధికి అత్యవసరములు. ఇట్టి యావేశము కలిగించునది శాంతముకాదు; సౌందర్యమును, ఆనందమును. కన్నులు మూసుకొని యోగనిద్రయందు మునిగిన మునియొక్క మోమును చూడుడు. అబ్బురపాటున మనమాతనికి ప్రణమిల్లుదుము శాంతమువలె సౌందర్యము లోపల నడగునదికాదు. సౌందర్యము తన సంపదను ప్రజల కనులయెదుట ప్రదర్శించును. దీనిమహాత్మ్యము ప్రతిమనుజునకును బోధపడును. తొలుత బాహ్యప్రపంచమును గుర్తించియే పిదప అంతరంగమును గుర్తింతుము. బాహ్యావనిని బట్టియే మనస్సున రూపములు నిర్మింతుము. మనపూర్వులు విగ్రహారాధనమున కేల హిందూజీవనమున చోటిచ్చిరి? ఎదుట నొకరూపునిలిపి మనస్సునకు నిబ్బరమిచ్చుటకే గదా. ఆలయములందు శిల్పకౌశలమును తేటపఱచిరేల? అంతియే కాక దేవమందిరములలో నిత్యగానమును నిత్యనృత్యమును కూడ యేర్పఱచిరేల? గానరవమువిని అలంకృతమూర్తినిగాంచి భక్తులు తన్మయనృత్యము సలుపరా? వివిధపుష్పములతోడను వివిధభూషణములతోడను మూర్తులు రంగారియుండవా? ఆధ్యాత్మిక భావములకు నిధానమైన ఆలయమునందు లలితకళ లన్నిటికి మనపూర్వు లేల చోటిచ్చిరి? హృదయమున భావనాతరంగముల నుప్పొంగించునవి కళలు.

రామప్రసాదుని మధురగీతిక నవాబు పాషాణహృదయమును నిముసములో గరగించి ఆమందానందతరంగముల నుప్పొంగించె నని చదువరులు గ్రహించియుందురు.

రామప్రసాదు శక్తినిడుపాసించుచుండువాడు కదా. పంచవటీతలమున పంచముండీ ఆసనమున కూర్చుండి యాతడు భగవతిని ధ్యానించుచుండువాడు. స్వామిజీ ఆసనము నేడును నచట నున్నది.

రామప్రసాదుని గుఱించిన పుక్కిటిపురాణము లెన్నో వంగదేశమున పొడసూపినవి. సామాన్యజీవనమునందు గోచరింపకున్నను అసామాన్యుల చరిత్రయందు గోచరించు యొకటిరెండు విషయములు రామప్రసాదుని జీవన చారిత్రమునందు చూపట్టును. వానిని జనువరులు పరికింతురుగాక.

ఒకనా డీతడు పశువులను గట్టుచుండెను. అలవాటుచొప్పున కూని రాగము తీయుచు నతడు కాళిని కీర్తింపదొడగెను. పశువులను గట్టుచుండ వానికూతురు జగదీశ్వరి యాతనికి సాహాయ్యము చేయుచుండెను. కొంత సేపైన పిదప బాలికయింటికరిగెను. అపుడుకూడ రామప్రసాదు తనపనియందు తోడ్పాటు నందుచుండెను. సంకీర్తనము నలుపుచునే యాతడు తనపని చేయుచుండెను. ఇంటికిపోయి బాలిక తిరిగివచ్చి "నానా! నీకు పనియందెవరు సాయపడిరి?" అని ప్రశ్నించెను. "అమ్మా! నీవేకదా సాయపడితివి?" "కొంత సేపు తోడ్పడి నేనింటి కరిగితిని" "ఇంతవఱకు నీ కిందే యుంటివిగదా!" "లేను" జగదీశ్వరి కాళి తన కుమార్తెరూపమున తనకు సాయమొనరించెనని రామప్రసాదు డపుడు గ్రహించెను.

ఒకనాడు గంగాస్నానమొనరించి రామప్రసాదుడు తనయింటికి మరలు సమయమున యొకమనుజు డాతని చెంతకువచ్చి "యెవరో స్త్రీ తమపాట వినుటకై కనిపెట్టుకొని యున్నది. చండీమండపముపై కూర్చుని యున్నది" అని అతనితో చెప్పెను. రామప్రసాదు డపుడు చండీమండపముపై కరిగి చూచెను. ఇరువురు బాలికలందు ఆటలాడుకొనుచుండిరి. ఆ స్త్రీని గుఱించి యాతడా బాలికల నడుగ "అవును యొకతె యిచటికి వచ్చినది. నిన్ను కాశీకిపోయి అందు నీ సంకీర్తనమును తనకు వినిపింపుమని కోరినది." అని వారుత్తరు విచ్చిరి. కాశీనుండి అన్నపూర్ణ తనగానమును వినుటకై వచ్చెనని రామప్రసాదుడు గ్రహించెను. తడిబట్టలనైన విడువక యత డట్టులే జగదీశ్వరిని ప్రస్తుతించుచు కాశీకి పయనమాయెను. త్రివేణీక్షేత్రమునకు సమీపమున గల యొకపల్లె యందాతడు నాటిరాత్రి విశ్రమించెను. రాత్రి కలలో దేవి యతనికి కను

పించి "నాయనా! నీవు కాశీవలకు రానక్కఱలేదు. ఇందేయుండి నీ పాటను నాకు వినిపింపుము" అనెను. రామప్రసాదు దట్లే గావించెను.

ఇవి పుక్కిటిపురాణములు కావు. దేవియెడల రామప్రసాదునకు గల భక్తియు, రామప్రసాదు నెడల దేవికిగల వాత్సల్యమును తెలుపు ఉదంతములు. రామప్రసాదుడు అన్నముచండి దేవికి నైవేద్యము పెట్టినపుడు ఆమె యాతని వెనుకభాగమున గూర్చుని యా అన్నమును తినుచుండెడిదని మరి యొకగాథ కలదు. నేఁను మహాపురుషుల భక్తిని భగవంతుని వాత్సల్యమును తేటపరుచు సంఘటనము లెన్నో కానవచ్చుచున్నవి. వీనిని గుర్తించుటకు కావలసిన విజ్ఞానము యింకను మనుష్యమాత్రుని చేతికి చిక్కలేదు. ఇవి భావగర్భితములనుట సత్యదూరము కా జాలదు.

రామప్రసాదుని కీర్తనములు "కాళీ కీర్తనము" "కృష్ణకీర్తనము" "విద్యాసుందర్" అను మూడు గ్రంథములుగ ప్రచురింపబడెను వీనియందు "కాళీకీర్తనము" మిగుల నుత్కృష్టమయినది. ఈ గ్రంథమును చదివినవారి హృదయములు భక్తితరంగములతో నుప్పొంగిపోవును.

రామప్రసాదుని మరణమును గుఱించి వంగదేశీయవృద్ధు లీగువ వృత్తాంతమును తెలుపుదురు. దుర్గపూజలైన పిదప దుర్గప్రతిమను గంగయందు విడుచుటకై ముందు రామప్రసాదుడు బంధుమిత్రులతో "నేను, నేడు జననిని విడుచువేళ నాతనువునుకూడ విడతును" అని చెప్పి దుర్గసంకీర్తనము చేయుచు నుత్సవముతో గంగానది కరిగెనట. విగ్రహమును గంగయందు జారవిడుచుచు నూతనకీర్తనములు నాశువుగ నల్లి పాడినాడట. మూర్తినివిడిచి సంకీర్తనముతో నృత్యముచేయుచుండ నాతని బ్రహ్మరంధ్రమును భేదించుకొని యాతని ప్రాణము లెగిరిపోయినవట. మహాభక్తులెందఱో యీ తీరున తమప్రాణముల విసర్జించిరి.

ఈత డెన్నవయేట మరణించెనో కనుగొనుటకు తగిన యాధారములు లభింపలేదు. ఏబది, ఏబదియాఱవయేట మరణించి యుండునని కొందరూహించిరి.

---

# ౩౧
# శ్రీమతి కర్మాబాయిజీ



ఉ. "మాయనుగుల్, సఖిజనము, మాజననీ జనకాదిబంధుగుల్
మాయువతీవతంసములు మా ధనధాన్యములాది సంపదల్
మాయురె! యంచు మోహమున మైకమునొందును గాని మాయయే
"మా" యను నక్షరార్థమనుమాట నెఱుంగరు దీనపోషణా."

"ఆత్మశుద్ధిలేని యాచారమదియేల భాండశుద్ధిలేని పాకమేల?" అని వేమనయోగి పలికినాడు. ఉత్తమజీవితమునకును జీవనపరిపూర్ణత్వసిద్ధికిని ఆత్మశుద్ధి అనివార్యము. మనస్సు యెన్నడును వట్టిదియై యుండజాలదు. నిదురించు సమయమున కూడ నది పనిచేయుచుండును. మనస్సునుగుఱించి హిందూతత్వశాస్త్రము తెలిపినవిధము హిందువులందఱకు విశదమే. పలువురు దీనిని కోతికి పోల్చిరి. వ్యాసుడు మత్స్యమునకు పోల్చినాడు. ఇట్లని యాతడు తేటతెల్లముగ తెలుపలేదు. మత్స్యయంత్రమును గొట్టి ద్రౌపది నందిన నరుడు విజయుడని యతడు నిరూపించెను. మత్స్యయంత్రమందలి మత్స్యము కనరానిది. దాని నీడ మాత్రము అర్జునునకు గోచరించినది. అది యనవరతము కదలుచునే యుండెడిది. చేప యొక్క ప్రతిబింబచలనమును చూచియే పార్థుడు విల్లెక్కుపెట్టవలసి వచ్చినది. మనస్సుకూడ కనరానిది. క్రియలందు మాత్రము దానిజాడలను జూడగలుగుదుము. అది యనారతము కదలుచునే యుండు నంటిమిగదా. పాండవమధ్యముడైన నరుడు విల్లెక్కువెట్టినట్లే ఆత్మశక్తి నెక్కువెట్టి ప్రతి నరుడును దీనిని స్వాధీనముచేసికొనిన నాడే యెల్లఱకును అంతఃశాంతి ద్రౌపది చేపడును. మనశరీరము కురుక్షేత్రము. మన ప్రపంచజీవనము భారతయుద్ధము. కర్తవ్యము వైపు మనకు దారిచూపు సారధి శ్రీకృష్ణుడు. విజయుడైనవాడు నిర్గుణోపాసకుడు. మనస్సును జయించినవాడు విజయుడు. ఈతడు ఆత్మశాంతి నందినవాడు. సగుణోపాసకుడు (భీముడు) ను సాయుధ (యముడు) ధృఢప్రతిజ్ఞల

(కుంతి) లకు జనించిన ప్రజ్ఞానిధి (యుధిష్ఠిరుండు) ను త్యాగతితిక్షులకు మారు పేరులైన నకులసహదేవులును నిర్గుణోపాసకు (అర్జునుడు) ని వలె మనస్సును జయించి ఆత్మశాంతి నందగలరని తెలుపుటకు; ఆధ్యాత్మికజీవనోన్నతిదేన నీయైదుగురి గుణములును సైదోషులట్లు ఆత్మను గొనిపోవునని తెలుపుటకు; వ్యాసుండు ద్రౌపదిని పాండవులేవురికి పెట్టబెట్టినాడు. మనసు స్వాధీనమైననాడే మహత్తరమైన ఆధ్యాత్మికశక్తి యలవడును.

అట్లు పరిపక్వమైన, పవిత్రమైన, స్వాధీనమైన, మనసుగలది కర్మాబాయిజీ. కర్మాబాయిజీ హృదయము పుట్టినవస్తువు అపూర్వతేజము నందును. సామాన్యపాత్రమున నీమెవండిన యన్నము శ్రీజగన్నాథునకు అమృతాన్న మాయెను. ఈమె హృదయమెట్టిదో యీమె పాత్రయు నట్టిదే. ఈమె హృదయమందలి సువర్ణమయభావము లెట్టివో యీమె పాత్రయందలి పదార్థములు నట్టివే. కావుననే జగదీశునకది ప్రీతి గూర్చినది.

కర్మాబాయి మార్వాడిదేశపు స్త్రీ. చిన్ననాటనుండియు నీమె దైవభక్తి పరాయణయై యుండెడిది. శ్రీజగన్నాథస్వామిపై నీమెకు భక్తిమెండు. శ్రీజగన్నాథక్షేత్రమునందే ఈమె తనవాసము నేర్పఱచుకొని నిత్యము జగన్నాథుని సేవించుచు నానందముతో కాలము గడపుచుండెడిది. నిద్రనుండి లేచినంతటనే యీమె యే ఆచారములను పాటింపక స్వామి ప్రసాదము తయారు చేయుచుండెడిది. అల్లము, ఇంగువ, నేయి, కొన్ని మసాలావస్తువులు కలిపి హిందూస్థానీయులు కిప్రియమగు కిచిడీయన్నము నీమె సిద్ధము చేయుచుండెడిది ఈయన్నమే స్వామికి మిగుల నిష్టమని యీమె తలచుచుండెడిది. అందుచే దానినే యీమె ప్రసాదముగా స్వామి కర్పించుచుండెడిది. తక్కిన భోగములకంటె నీభోగమే స్వామి కధిక ప్రీతి గూర్చెడిది.

ఇట్లుండ నొకనాడు బైరాగి యొకడు కర్మాబాయిజీ కీర్తివిని యీమె గృహమున కరిగి భిక్షవేడెను. సర్వసద్గుణసంపన్నయగు నామెను గాంచి యాతడు చాల సంతసపడెను. ఆమె భక్తిశ్రద్ధలకు మిగుల నచ్చెరువు నొందెను. కాని యీమె స్వామి ప్రసాదమును యే ఆచారమును పాటింపక వండుట గాంచి యించుక కినిసి కొంత ఆచారకాండ నామెకు దెలిపి యా యాచారప్రకారమే యీమె ప్రసాదమును సిద్ధము చేయవలెనని యాబైరాగి కోరెను. మఱునాడు

కర్మాబాయిజీ యట్లొనరించెను. కాని నాటి యాచారక్రియాకలాపము మూలమున రెండు జాములు తిరిగిన పిదపగాని ప్రసాదము సిద్ధముకాలేదు.

జగన్నాథస్వామి మనుష్యరూపముదాలిచి కర్మాబాయిజీ యింటికరిగి ప్రసాదము నారగించువా డనువాడుక కలదు మామూలుప్రకారము నాడును స్వామి భోజనార్థము బాయిజీయింటి కరిగెను. నాటి విలంబనమునకు బాయిజీ మిక్కిలి నొచ్చుకొనుచు స్వామికి ప్రసాదమును వడ్డించెను. తొందరపాటున ప్రసాదమును భుజించి ప్రక్షాళనమైన గావింపక స్వామి వేగిరపాటున మందిరమున కరిగెను. స్వామి నోటికి కిచిడీయన్న మంటియుండుట పరికించి యచటి పండాబ్రాహ్మణులు "పరాత్పరా! ఏపుణ్యాత్ముని గృహము పావనముచేసి విందారగించి యాతని జీవనమును సఫలము చేసితివి? త్రిభువనములయందు నాపుణ్యపురుషుడు ధన్యుడై యుండును" అని పలికిరి.

"భక్తులారా! నన్ను సేవించినది పూతగుణశోభితయగు కర్మాబాయి. ఈమె అనుదినము మధ్యాహ్నమునకు పూర్వమే నాకు ప్రసాదము వడ్డించుచుండెడిది. నేడొక సన్యాసి కోరిక ననుసరించి కొంత ఆచారము నవలంబించి ప్రసాదమును తయారుచేసినది. ఆమెచేతి ప్రసాదమును గ్రహింపక నేను వేఱు పదార్థమును గొనను. అన్నమునకై బాయిజీ యింట ఆలస్యముచేసి ఇచటి ప్రసాదము నారగింపక దేవి నాకొఱకై వేచియుండునని యెఱిగి పరుగుపరుగున వచ్చితిని. మీరు పోయి కర్మాబాయితో నెప్పటితీరున నాకు ప్రసాదమును సమర్పింపుమని చెప్పుడు" అని స్వామి పలికెనట. ఈయుదంతము నాబ్రాహ్మణులు బాయిజీకి దెలిపిరి. అందు కామె మిక్కిలి సంతోషించి యెప్పటియట్లు ఉదయముననే లేచి స్వామికి ప్రసాదము సిద్ధముచేసి పెట్టుచుండెడిది.

జరిగిన కథ విని యాసన్యాసి బాయిజీ కడకు వచ్చి "అమ్మా, నీ మహత్వము నెఱుంగజాలనైతిని. నీకు సుద్దులు చెప్ప నారంభించితిని. ఏమేమో ఆచారములు నీకు బోధించితిని. స్వామికి కష్టము కలిగించితిని. మీరు యిరువురును నా అపరాధమును క్షమింపుడు" అని వేడుకొనెను. భక్తిమహిమను వెల్లడిచేయుటకు శ్రీజగన్నాథస్వామి యిట్టి లీలను చూపెను. సన్యాసి నాతడు క్షమించెను.

శ్రీకర్మాబాయి స్మరణార్థము నేడును కిచిడీ (ఖేచరాన్నము) తయారు చేయబడి బంగారు పళ్లెరమున స్వామికి భోగము చేయబడుచుండును. ఎంగిలి గాని అంటుగాని మతభేదసంశయముగాని మహాప్రసాదమును పాడొనరింపజాలవు. ఆచార వ్యవహారములు జగన్నాథుని భోగమునకు అక్కఱయైనవి కావు. "సర్వం జగన్నాథ" మను పవిత్ర శబ్దమందు సర్వసమత్వమున్నది.

శ్రీజగన్నాథుడు ప్రతిదినము తనమందిరమునుండి ప్రసాదము నారగించుటకై బాయిజీ యింటి కరిగెనో లేదో! స్వామి మాత్రము ఆమె హృదయమును తనమందిరముగా నేర్పఱచుకొనినాడు. పరిశుద్ధమైన ఆత్మకు చుట్టును ఆచారము లను ముళ్లకంచె లేలయని సిన్యాసికిని తక్కుంగలవారికిని తెలుపుటకై శ్రీజగన్నాథస్వామి యట్లొనరించినాడు. అట్టి పవిత్రమైన పరిశుద్ధమైన నిష్కల్మషమైన ఆత్మ యొసగిన సంభావనము తనకు అనిర్వచనీయమైన ఆనందము నొనగూర్చునని భగవంతుడు వ్యక్తీకరించినాడు. ముక్కిపోయిన యదుకులు గొని శ్రీకృష్ణపరమాత్మ తన హృదయైశ్వర్యమును తన భక్తుని చరణసన్నిధిని గుమ్మరించెనని పురాణమున చదివితిమి. కర్మాబాయిజీ పురాణయుగములోని వ్యక్తికాదు. ఇటీవల మన మన్నునందు జననమంది మన మన్నునందు పెరిగి వసుంధరను పవిత్రీభూత మొనరించిన మహాత్మురాలు. ఆమె పవిత్ర హృదయము, ఆమె భక్తి అత్యద్భుతములైనవి. సాధకుల కామె జీవనము మేలుబంతి. తెల్లని ఆకాశమందే విచిత్రరాగములు రంజిల్లును. కాఱుమబ్బుల యందు ఆకాశమున సౌందర్యము చూపట్టునా! పరిశుభ్రమయిన ఆకాశ తో సమానమగు బాయిజీ హృదయము అనురాగ భక్తి భావములతో ప్రకాశమానమైనది. కలుషములనెడి మబ్బులతో నిండిన హృదయమున ప్రేమానురాగ మెట్లు పొడసూపును? భక్తిదీప మెట్లు ప్రకాశించును. అందు వినంబడునవి దుశ్చింతల ఘుముఘుమారావములు కదా. స్వచ్ఛమై చక్కనై పుష్పదళము సుగంధ మాశ్రయించినట్లు శుభ్రమయిన హృదయమునందే భక్తి పరిమళించును. అందుండి పొంగిపొరలు అనురాగపూరముపై క్షీరసాగర శయనుండు డోలలాడుచుండును.

---

## ౩౭

# శ్రీమతి ప్రేమాబాయి



"చ. జగమొక యంత్రశాల కను జక్కని యంత్రముమాయ దానిలో
నగణితమైన వస్తువుల నైదిటనైచి మహాద్భుతంబు మీ
రఁగ సృజియింతు వీ వివిధ ప్రాణిసమూహము వీనిచేత నీ
కిఁ గలుఁగుమేలు నే నెఱుఁగఁగోరితిఁ జెప్పవె! దీనపోషణా!"

హరిభక్తిపరాయణుఁడగు నొకరాజు ఆర్యావర్తమున వసించుచుండెను. అతడు మహాభక్తుడని యెవ్వరు నెఱుంగరు. రహస్యముగ నతడు తనయిష్ట దేవతను ఆరాధించుచుండువాడు. పతి యిట్టిభక్తుడని యాతనిభార్య ప్రేమా బాయి సయితము నెఱుంగదు. ప్రేమాబాయి శుద్ధమతి. భక్తురాలు. పూజల యందును, భజనలయందును తనకాలమును వెళ్లబుచ్చుచుండును. ఆధ్యాత్మిక జీవనమునందు తనభర్త నిర్లక్ష్యముగా నున్నాడని తలచి యామె ఆతని హృదయమున భక్తిభావమును జనింపజేయుమని తనకులదేవతకు మ్రొక్కు చుండెడిది.

ఒకనాటి యర్ధరాత్రమున నిద్రలో నతడు "కృష్ణ! కృష్ణ!" యని పలవించెను. చెంతనున్న రాణి యాపలుకులు విని పరమానందభరిత యయ్యెను. ఉదయమున లేచి పెద్దయుత్సవము చేయుట కెన్నో ప్రయత్నములు చేసెను. మర్నాడెందరెందరికో దానధర్మములు గావించెను. నిదురనుండి మేల్కాంచినభర్త గృహమందలి పండువునుగాంచి మిగుల నాశ్చర్యమునొందెను. నాటి యుత్సవమునకు కారణమేమని యాతడు భార్యనడిగెను. వెంటనే ప్రేమా బాయి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "ప్రభూ! నేడు శుభదినము. నాయిష్ట దైవతమగు కృష్ణుని మధురనామమును నిద్దురలో మీరు పలికియుంటిరి. నాహృదయమంతయు నానందముతో నిండియున్నది. అందుచే నేను నేడిట్టి యుత్సవమును చేయుచుంటిని" రాజాపలుకులు విని దుఃఖావేశమున "ఏమి నాకిట్టి దుర్భాగ్యము ఘటిల్లినది. ఎంతకాలమునుండియో నా అంతరంగమున

రహస్యముగా నెవ్వని దాచియుంచితినో యాతడు నిశానమయమున నాకు తెలియకుండ వెలువడెనా ?” అట్టిగా పలికెను. పలికినవెంటనే యాతడు నేలగూలెను. కూలిన యత్తరక్షణముననే యాతడు ప్రాణములబాసెను. ఈఆకస్మికదృశ్యమును గాంచి దుస్సహాశోకసంతప్తమానసయై ప్రేమాబాయి “హా! యెంతటి దుర్భాగ్యము. ఎంత ప్రారబ్ధము. ఎట్టిగతి ప్రాప్తించెను. నాప్రాణేశ్వరుడు పరమభక్తాగ్రేసరుడని యెఱుంగక సంశయ పడినందున నాకిట్టి శాస్తి ప్రాపించినది” అని యామెవిలపించుచు నేలగూలి యసువులు విడిచెను.

తోడనే కృష్ణపరమాత్మ ప్రత్యక్షమై మృతకళేబరములను వాత్సల్యముతో నిమిరెను. నిమురుటయు నాపుణ్యదంపతులు సజీవులై లేచి స్మితవదనుడై మ్రోలనిలచిన శ్యామసుందరుని పదములకెరగి బహుభంగుల నా దేవదేవుని సంస్తుతించిరి. నాడు మొదలు సతీపతులు ఒకరినొకరు తెలిసికొని పరమపరితోషమున పూజాదులు సలుపుచు తనువులు గడపిరి. అనంతరము యిహయాత్రముగించి దివ్యబృందావనమున వారిద్దరు జగదీశునితో గలిసి చిదానందక్రీడల దేలిరి.

అనురాగమందును, భక్తియందును భార్య భర్తను మించెను. భర్తయు భార్యను మించెను. పరమభక్తాగ్రేసరులగు వీరిరువురు నొకరినొకరు గుర్తించు కొనజాలక కొంతకాలము గడపిరి. ఒకే సంసారచక్రమును త్రిప్పుచు పవిత్ర గృహబాధ్యతను నెఱపుచు యిరువురువ్యక్తులు—యొండొరుల యెడల నను రక్తులైన సతీపతులైనను—యొండొరులను గుర్తింపలేకపోయిన యెడల వారి జీవనము దురంతసంతాపమునకు ఆలవాలమై యుండుననుటకు యీకథ యొక యుదాహరణము. ఉన్నతాశయములచే తమజీవనములను ప్రకాశింపచేయు వారైనను యొకరిహృదయము నొకరు ఎఱుగకపోయిన యెడల యొకనాడు గాకున్నచో మరొకనాడైనను పొరపొచ్చెములను కన్నులార జూతురు. ప్రత్యేకవ్యక్తులందు దోచు ప్రత్యేకభావములందు కలయిక గోచరించినపుడు ఉత్తుంగశృంగములుచేరి పర్వతశిఖరమును పెట్టనికోటనుచేయులీల మనుష్యజీవనమును బలవత్తరముగావించును.

---

# ౩౩

# శ్రీ విష్ణుపురీగోస్వామి



"గీ. ఎవడు మింటను మంటను నితరసకల
వస్తువులయందు ననయంబు వ్యాప్తిఁజెంది
వానివృద్ధి క్షయంబులు దానుబొరయ
డట్టి బ్రహ్మము దలఁపుదు నాత్మయందు."

ఆర్యావర్తమున విష్ణుపురీగోస్వామి యను పండితుఁడు గలడు. అతడు మహాభక్తుడై జగదీశుని ధ్యానించుచుండువాడు. భారతదేశమున గల తీర్థము లన్నింటిని సేవించి యాతడు వారణాసికరిగి యాపురమునే తన వాసస్థానము గావించుకొనెను. హరిభజనసేయుచు నితడు తిరుగుచు నగరవీధుల యందు తిరుగుచుండువాడు. కాశీలో నున్నపు డీతడు యెన్నియో పెద్దగ్రంథ ములువఠించినాడు. వానిలో ముఖ్యమైనది సుప్రసిద్ధమైన 'అమృతసాగరము'. పిదప నీతడు 'భక్తిరత్నావళి' యను మహాగ్రంథమును రచించినాడు. వైష్ణవు లందఱీ పుస్తకము మిగుల అమూల్యమైనదిగా తలంతురు. గోస్వామియొక్క భక్తి విశేషములను తేటపఱుచు నొకయాఖ్యాయిక కలదు.

పురుషోత్తమ ధామమున వెలసిన శ్రీజగన్నాథస్వామి యొకనాడు తనచుట్టును గల ఓఢ్రఅర్చకులను పిలచి యిట్లులనెను. "విప్రులారా! కాశీ యందు పరమభక్తాగ్రేసరుడైన 'విష్ణుపురి' వసించుచున్నాడు. కాశీక్షేత్ర మును అతడు వాసముగా నేర్పఱచుకొనుట నాకానందమే. ఆమహాత్మున కీయదగునదేమియు నిరుపేదయగు నీ జగన్నాథుని కడలేదు. ఒకపర్యాయము ఆమహాపురుషుని చూడవలెనను వాంఛ నాకు కలదు. మీరు కాశీపురి కరిగి నా యాప్సితము నాతని కెఱిగింపుడు." అనుటయు నావిప్రులు హుటాహుటి వారణాసి కరిగి గోస్వామిజీని దర్శించి యాతనితో స్వామి వచనములు తేట తెల్లముగా తెలిపివేసిరి. ఆనుడువులు వినిన విష్ణుపురియోగియానందమునకు మేరలేకపోయెను. "శ్రీ శ్రీ జగన్నాథస్వామి యెందునకును పనికిరాని క్షుద్ర

కీటంబనగు నా యెడల నిట్టిమక్కువ చూపుట నా పూర్వజన్మమునకు సంబంధించిన ఫలముగాని మరియొకటి కాదు. వైకుంఠము చరచర దిగివచ్చి నా యరచేతియందు ప్రవేశించినను నా కింత యానందము కలుగనేరదు. కాని సోదరులారా! పురుషోత్తమునితత్వమేమో నాకు తెలియుటలేదు. కాశీయన నేమో గయయన నేమో మధురయన నేమో నే నేమియు నెఱుంగను. అతని నామరత్నమాలను మానసమున ధరించి యెందే నొకతావున కాలముపుచ్చుచున్నాను. ఎవ్వనిదెస తమ చూడ్కులు నిబద్ధ మొనరించి త్రిభువనములు నెల్ల వేళల వేచియుండునో అట్టివానిని నా హృదయమునుండి జారవిడుతునేమో యని భయపడుచున్నాను. నిత్యము తనమానసమున జగదీశుడు నన్ను జూడ వాంఛించుట నా యదృష్టము కాదే. కాని మిగుల దుస్సాహ్యమైన విషయ మొక్కటి తోచుచున్నది. ఎల్లవిశ్వములకును అధినాథుడైన దేవదేవుడు తాను నిరుపేదనని తెలిసికొనినాడు. జగదీశుడు నిరుపేదయేనా? అగును. మఱచితి. నిరుపేదయే కావచ్చును. తన ధనమంతయు తనప్రేమ ధనమంతయు నాతడు గోపికల కర్పించెను. కావున నిరుపేదనని తెలిసికొనినాడు. ఇందు అనృత మేమియు లేదు. కాని యిప్పుడైనను ఆతనియొద్ద అక్షయమును నవ్యయమును నైన రూపరాశి యున్నదిగదా. దానిని చూడగలుగుదునని ఆశపడుచున్నాను. నా యెడల జగదీశుడింత మక్కువను జూపినాడుగదా! నా కోరిక యొకటి ఆతడు తీర్చునేని యాతనిని మక్కువగూర్తును చేతపట్టగలను. ఆతని హృదయసీమయం దెల్లపుడు విరాజిల్లు మాలలలో నొకటి నాకు కావలయును. ఇట్లని మీరు స్వామితో విన్నవింపుడు. దాని నాతడు పంపకున్నయెడల ఆతని చరణములను నా ప్రేమపాశముచే గట్టివైచి నా హృదయమందు బంధించి యుంచెదనని చెప్పుడు." అని గోస్వామిజీ ఆనందబాష్పములు వెలార్చుచు యోఢ్రబ్రాహ్మణులతో పలికెను. వారును జగన్నాథమున కరిగి తాము వినిన కథనమంతయు స్వామికి తెలిపిరి. జగదీశుడా పల్కులు విని పకపక నవ్వి తన మెడయందలి యమూల్యమైన రత్నమాల నొకదానిని తీసి తనసేవకులలో నొకనిద్వారా దాని నా కాశీపురియందలి గోస్వామిజీకడ కంపెను. పంపి యూరకొనక ఆ బహుమతికి బదులు బహుమతి యోగీంద్రునుండి తాను కాంక్షించిన ట్లాతనికి విన్నవింపచేసెను. ఈ వాక్కులు విని గోస్వామిజీ పరమ

సంతోషమును జెంది తన్మయనృత్యము చేసెను. తోడనే వారణాసినుండి వయ సమై కృష్ణగీతికల పాడుకొనుచు శ్రీజగన్నాథమును జేరుకొనెను. తానీను కలిగిన సాంతోషిక మేమైనుండునని యించుక తలపోసి గోస్వామిజీ తాను రచించిన 'భక్తిరత్నావళి' యను మహాగ్రంథమును స్వామిచరణతలమున బెట్టి యెదుటనిలిచి నటరాజనృత్యము చేయదొడగినాడు. ఆనందావేశమున నామూలాగ్రముగ దేవదేవునకు వినిపించినాడు. పురుషోత్తముడు నవ్వుచు యోగిని కౌగిలించుకొని తన కౌస్తుభమణి ప్రాంతమున వానికి చిరస్థానమొసగి నాడు. ఆహా! గోస్వామిజీయొక్క అదృష్టమేమన వచ్చును.

ప్రేమకును భక్తికిని అసాధ్యములైన శోచు క్రియలెవ్వియులేవు. యోచనమునకు గురూహ్యములైన పనులెన్నియో ప్రేమవలన తేటతెల్ల మగును. కన్నులయెదుట కానంబడని అద్భుతములెన్నియో భక్తివలన ప్రత్యక్షమగును. గోస్వామిజీ చరిత్రమునుండి మనము గ్రహింపవలసిన ముఖ్యాంశము లివి.

జగదీశునందుటకు మానవు డెట్లు కాక్షించుచుండునో మానవు నందు టకు జగదీశుడును నట్లు కాక్షించుచుండును. ఇట్టికాంక్ష జగదీశునియం దధికముగ నుండును. మానవుడు తానుపడియున్న అజ్ఞానమను గోతిలోనుండి లేచి జ్ఞానమును కొంతసంపాదించి తదనంతరమున జగదీశు నందవలయునను కాంక్షకు తన హృదయమున తావొసంగును. ఈకాంక్ష పరమేశ్వరునకు తొలినుండియు నుండును. తనదెస భక్తుడు చేయిచాపు పవిత్రముహూర్తమున కై యాత డెదురు చూచుచుండును. భక్తునిహృదయము పరిపక్వమగునంత వరకు ఆతడు నిమిషములు లెక్కచూచుచుండును.

విష్ణుపురీగోస్వామిజీవితమును గాంచితిమేని యది కడుంగడు చిన్నది యైనను మనకెంతేని విజ్ఞానమును ప్రసాదింపజాలును. రామకృష్ణపరమహంస మున్నతో ప్రసంగించినట్లే యీతడు జగన్నాథస్వామితో ప్రసంగించినాడు. కొడుకునెడల తల్లి ప్రేమ చూపునట్లు కాళీమాత రామకృష్ణుపై కారుణ్యము వెదచల్లినట్లు గోస్వామిజీపట్ల జగదీశుడును యెంతయో నెనరుచూపినాడు. ఈ కథయందబద్ధముగాని నమ్మకూడని విడ్డూరముగాని లేశమును లేదు.

భావవ్యక్తీకరణమునకును ప్రేమప్రకాశమునకును మొగ్గతోటీరు లుండును. తల్లిని కుమారుని; తండ్రిని తనయుని; ప్రాణేశ్వరుని ప్రాణసతిని; కలుపునది ప్రేమపాశమే. ఒక్కొక్క చుట్టరికపురీతి యొక్కొక్క భక్తునకు రుచించును. నాథా యని భక్తుడు తనను పిలుచునప్పుడు జగదీశుడు అతనిని రాధా యని పిలుచుట కిష్టపడును.

విష్ణుపురిగోస్వామి 'రాధ' కాగలుగుటచే సామాన్యులకు అసాధ్యములై కానుపించు క్రియలనేకము లాతనికి సాధ్యము లయ్యెను. ఆతని హృదయ మాతనికి దేవమందిర మాయెను. ఈ దేవమందిరము వెలుగును గాలిని అవ్వల నిలువబెట్టి మిణుకుమిణుకుమను చిన్నదీపముతో నున్న రాతి కట్టడము కాదు; మిక్కిలి యున్నతమును మిక్కిలి సుందరమును విశాలమును నైన ఆలయము. ఈఆలయగర్భమునుండి అద్భుతభావములు పుట్టెను. ఈభావమే గోస్వామి వాక్కులనుండియు గోస్వామి క్రియలనుండియు బహుభంగుల వెలువడినది. ఈతని వాక్కులు అమృతబిందువులు చిమ్ము రాగమాలిక లాయెను. ఈతనిక్రియ లీతనికీర్తనముల కనుకూలించు నృత్యము లాయెను. 'భక్తిరత్నావళి' గ్రంథరూపమును దాల్చిన స్వామియొక్క జీవితము. అందు గీతములున్నవి. మాధుర్యమున్నది. సహకారమున్నది. అనురాగతత్త్వప్రకాశమున్నది. ముక్తికాంక్షయున్నది. విశ్వాసపటుత్వమున్నది. ఆధ్యాత్మిక జీవన గభీరతత్త్వమున్నది. ఉపాసకోపాస్యదేవతల మేలుకలయిక యున్నది. క్రియాతత్త్వమున్నది. నిష్కామకర్మమహాత్త్వ మున్నది. ఆనందసముద్ర మున్నది. హృదయ జలనిధియందు లభించు కాంతివంతములైన ఆదర్శరత్నములున్నవి. ఇంతయేల! సనాతనమతవిభూతి యంతయు నందున్నది.

---

# ౩౪

# శ్రీ అర్జునమిశ్రస్వామి



"శా. పాపాత్ముండను, దుర్మదాంధుడను దివ్యజ్ఞానహీనుండ పెన్
గోపిన్, ధూర్తుఁడనంచు నెంచి యముఁడున్ గోపించి యేరీతితో
భూపా ! బాములఁ ద్రోయనోయనుచు; నన్ బ్రోవంగ నీరీతి నే
నీపాదంబులఁ బట్టినాఁడగద తండ్రీ ! ఆర్తరక్షామణీ !"

అర్జునమిశ్రుడను పండితుడు పురుషోత్తమధామమున నివసించుచుండు వాడు. మిశ్రుడు ఉదారస్వభావము కలవాడు. శాంతచిత్తుడు. శిష్టాచారసంపన్నుడు. పరమసాధువు. విరాగి. భగవద్భక్తిపరాయణుడు. బిచ్చమెత్తి యతడు సంసారమును గడపుచుండువాడు. భగవద్గీతపై యతనికి మిక్కిలి మక్కువ కలదు. సర్వదా యతడు దానిని పారాయణ చేయుచుండువాడు. గీతయందలి సారము సంపూర్ణముగా గ్రోలి దాని కతడు టీక వ్రాసెను. ఈ టీకను గాంచి యిప్పటికిని ఉత్తరహిందూస్థాన పండితులును, పామరులును ఆదరించుచున్నారు.

శ్రీమద్భగవద్గీతకు టీక వ్రాయునపుడు తొమ్మిదవ అధ్యాయమందలి యిరువదిరెండవ శ్లోకములోని "యోగక్షేమం వహామ్యహమ్" అను వాక్కును గుఱించి మిశ్రపండితుని మనసునందు సంశయము తోచెను. "ఎవ రితరులపై కోరికలేక నన్నే శరణుపొంది కొలిచెదరో అట్టి అచంచల చిత్తులైనవారల యోగక్షేమములను నేనే ప్రత్యక్షభావమున వూని యుండెదను" అని కృష్ణ భగవాను డీశ్లోకమునఁ దెలిపియున్నాడు.

"ప్రత్యక్షభావమున బూనియుండెదను" అని యర్థమిచ్చు గీతాచార్యుని వాక్యము సత్యముకాదని తలచి దానిని కొట్టివేసి "పరోక్షభావమున యుండెద" నను భావముగల శబ్దము నందాత డిరికించెను.

భగవద్గీత భగవంతుని శరీరము. దానియందలి యొక పదమునకు సంభవించిన కొట్టివేత కృష్ణపరమాత్ముని శరీరమున తీవ్రమైన దెబ్బయయ్యెను. ఈ విషయము నర్జునమిశ్రునకు బోధించుటకై లీలామానుషవిగ్రహుండైన

శ్రీకృష్ణుండు కొన్ని సిద్ధూకములు పుట్టించెను. తొలుత పుట్టించినది గొప్ప గాలివాన.

బిచ్చమెత్తినగాని మిశ్రునకు దినము గడువదు. గాలివాన మిక్కిలి ఘోరముగా నుండుటచే భిక్షాటనమున కావలి కరుగుట కతనికి యెంత మాత్రము శక్యము గాకయుండెను. అందుచేత నొకదిన మాతడును, నాతని భార్యయు తప్పనిసరిగ నుపవాసము చేయవలసి వచ్చెను. ఆమఱునాడు వర్షము కొంత తగ్గినది. బిచ్చమెత్తుటకై యాతడానాడు గృహాము వెలువడి వీధిలోనికి వచ్చెను. కాని యేవీధియందు తిరుగుటకును మిశ్రునకు శక్యము కాకయుండెను. వర్షము మరల తీవ్రము కాజొచ్చెను. కూలిపోవుటకు సిద్ధముగానున్న యొక గుడిసెయం దాతడు యెట్లో ప్రవేశించి తల దాచుకొనగలిగెను.

ఇంతలో నిరువురు బ్రాహ్మణబాలురు, శరీరమునుండి రక్తము కారు చుండ నేడ్చుచు బుజములపై మిగుల బరువైన యాహారపదార్థములమూట నిడికొని మిశ్రునియింటి కరుదెంచి యాతని యిల్లాలిని బిలిచి "అమ్మా! మిశ్రజీ యీప్రసాదమును మీకిమ్మని మమ్మిచటికి పంపినారు, ఈప్రసాదమును తీసు కొనుడు" అని పలికిరి.

మిశ్రజీయిల్లాలు మిగుల నాశ్చర్యమునొంది యాబాలురతో నిట్లనెను. "బాలులారా! ఈయాహార పదార్థము లాయన కెచ్చోట లభించెను. మీరు బాలకులు; సుకుమారులు; కోమలశరీరులు. మీచేత నింత బరువుమోయించుట కాయన మనసెట్లొప్పెను. మీయొడలినుండి రక్తధార లట్లు కారుచున్న వేమి? మీరేల నట్లు తీవ్రముగా రోదనము చేయుచున్నారు? అయ్యో! ఇట్టి సుకు మారమైన మీశరీరములపై యింత తీవ్రమైన దెబ్బవేసిన కఠిను డెవరు? నాయనలారా! మీ యిల్లెక్కడ? మీతలిదండ్రు లెవరు? ఇంత పెద్ద గాలి వానలో మీతలిదండ్రులు మాత్రము మిమ్మెట్లు గృహాము వీడ నిచ్చగించిరి? తండ్రులారా, మీకథయంతయు నాకు తెలుపుడు. మిమ్ములను చూచినకొలది నాకడుపు తరుగుకొని పోవుచున్నది. విలపింపకుడు రండు ఇచట కూరుచుండుడు. మీగాయములకు మందువేసి యుపచారము చేసెదను. శరీరము తిన్నబడిన పిదప మీరు మీయిండ్లకు తిరుగవచ్చును. నామాట వినుడు. మీజననీజనకుల కిప్పుడే కబురు పంపెదను."

గద్గదకంఠమున నామెపలికిన జాలిగొలుపు పలుకులువిని బాలకు లిట్లనిరి. "అమ్మా! మాతల్లిదండ్రులు మిక్కిలి దరిద్రులు. అతికష్టమున జీవనము గడుపుచున్నవారు. మేమిద్దఱ మన్నదమ్ములము. కేవలము భారమునుమోయు చుండుటయే మా దినకృత్యము. ఎండనక వానయనక పవలనక రాత్రియనక మేమీ భారమును మోయుచుందుము. మోతమోయుట మానిత్యకృత్యము. నేడు మిశ్రజీభారమును మోయుటకు మేము నియోగింపఁబడినారము. అమ్మా! మీకు చెప్పవలసిన దుఃఖకరమగు విషయ మొకటి కలదు. మీవంటి పరమ సాధ్వికి మా వచనములు నమ్మదగినవిగా తోఁపకపోవచ్చును. ఆకలిబాధ కోర్వ జాలక మతిభ్రాంతుడై మిశ్రపండితుడే యొక యినపకాడతో మమ్ములను కొట్టి నాడు. ఆతడు మరలివచ్చిన వృత్తాంతమంతయు తమకు విశదపడగలదు."

అని పలికి తాముతీసికొని వచ్చిన భోజన పదార్థముల నాయిల్లాలి చెంత పెట్టి యాబాలకులందుండి వేగముగా పరువెత్తుకొని పోయిరి. బాలకుల నోటి నుండి దారుణమగు వృత్తాంతమును విని ఆ యిల్లాలు గడగడ వడకుచు పిల్లల నిరువురను తన యంకతలమున బెట్టికొని సేవసేయుటకై ప్రయత్నించి నంతటనే రివ్వున వారెగిరిపోయిరి. పాప మప్పు డామె పడిన సంతాపమునకు మేరలేదు. చివాలున నామె నేలగూలి మిగుల నేడువ దొడగెను.

ఇటులుండ మిశ్రజీ యింటికి మరలినాడు. దుఃఖపడుచు నేల పడియున్న భార్యనుచూచి మిగుల నచ్చెరువునొంది యామె యట్లుండుటకు కారణ మేమని యాత డామె నడిగెను. గృహిణి జరిగిన వృత్తాంతమంతయు పూసగ్రుచ్చిన యట్లు పలికి నివేదించెను. ఆ బాలకు లెట్లుండిరని పండితు డామెను ప్రశ్నించెను. అంతట నా యిల్లాలు డగ్గుత్తికతో నిట్లని ప్రత్యుత్తర మొసగెను. "అకటా! మిక్కిలి సుందరులగు ఆ బాలకు లెంత కష్టపడుచున్నారో గదా! వారిరువురును అతిసుకుమారులు. అన్నదమ్ములు. పెద్దవాడు బంగారుమేని ఛాయగలవాడు. రెండవవాడు నల్లనివాడు. వారి వదనములనుండి అద్భుత మైన తేజస్సు వెలువడుచున్నది. ఇరువురకును చెవులను సువర్ణకుండలము లున్నవి." ఈ ప్రత్యుత్తరము వినిన నిముసములోనే నిజము మిశ్రపండితునకు విశదమైనది. "ఆహా! జగదీశ్వరుని శరీరముపై దెబ్బవేసినది నేనే" అని గద్గదస్వరముతో పలికి వెంటనే యాతడు మూర్ఛనొంది నేలకూలెను. పతి

మూర్ఛిల్లినంతనే ఆశ్చర్యముతోడను దుఃఖముతోడను నిండిన హృదయముగల దైన యాతని యిల్లాలును తెలివితప్పి నేలకూలెను. ఆమె కేమియు తెలియ లేదు. ఉత్తమోత్తముడని పేరు పొందిన తన పతి యట్టి నిష్ఠురక్రియ యెట్లాచ రించెనో యామెకు బోధపడలేదు. ఆ బాలకు లెవరో యామె గ్రహింప జాలకపోయెను. తాను తెలిసికొన జాలనందులకు దురంతమగు సంతాపమును జెంది మూర్ఛిల్లిన యామె తెలివినొంది పతికడజేరి యతడు పొసరించిన చెడు కార్యమునకు చింతనొందినవాడై మూర్ఛనొందిన యాతనిని శైత్యోపచార ములచే నేద దేర్ప యత్నించెను. కొంతసేపటికి పండితుడు మూర్ఛనుండి లేచెను. లేచి యర్ధాంగిని చెంతకు తీసికొని యామె నుదురు నిమురుచు ఆవేశపూరి తుడై "సతీమణీ! నీవు మిగుల సదృష్టవంతురాలవు. నీకు కనుపడిన బాలురు, నీచెంత కరుదెంచిన బాలురు, నీ మోల సాక్షాత్కరించిన బాలురు సామాన్య బాలురు కారు.—వారు శ్రీకృష్ణబలరాములు. నీవు మిగుల ధన్యురాలవు. కావుననే నీకు వారిదర్శన భాగ్యము లభించినది. నేను మందభాగ్యుడను. నాకు వారిదర్శనము దొరికినదికాదు." అనెను. అప్పుడా యిల్లాలుపడిన యానందమునకు మేరలేదు కాని తనప్రాణేశ్వరుడా శ్రీకృష్ణబలరాముల నేల కొట్టెనో యామె కెంతమాత్రమును బోధపడినదికాదు. ఆ విషయము తెలుప వలసినదని యామె పండితుని వేడుకొనెను. "శ్రీమద్భగవద్గీత యందలి తొమ్మిదవ యధ్యాయములోని యిరువది రెండవ శ్లోకమును నున్న 'వహామ్య హమ్' అను మాటను కొట్టివేసి నా యుద్దేశము ననుసరించి టీకను వ్రాయుచు దానికి సరిపడునట్లుగా మూలసూత్రమున దిద్దుబాటు చేసితిని. కలముతో నేను గావించిన తుడుపు తీవ్రమగు దెబ్బగా జగదీశుని మేన పరిణమించినది. అన్న దమ్ములయి వచ్చి యాతడు తన శరీరమును నీకు అగపఱచినాడు" అని విచార పడుచు మిశ్రపండితుడు తనభార్యతో పలికెను. సంగతియంతయు విని యామె మిక్కిలి యాశ్చర్యమునొందెను. పిమ్మట మిశ్రపండితుడు కాలయాపనము చేయక తాను కావించిన దిద్దుబాటును కొట్టివేసి మూలశ్లోకమందలి మొదటి పదము యెప్పటియట్లు వ్రాసి తానుకావించిన యపరాధమును మన్నింపుమని పరిపరివిధముల భగవంతుని వేడుకొనెను. మునుపటికంటె మొక్కుడు శ్రద్ధా భక్తులతో జగదీశ్వరుని సేవింపదొడగెను. భక్తవత్సలుడగు నారాయణుండు

కృపాపరవశుడై మిశ్రపండితునకు దర్శనమిచ్చి యాతనినికూడ ధన్యుని కావించెను. దంపతులు మిగుల నానందముతో నారాయణసేవయందు కాలము గడపి యనంతరము ముక్తినందిరి.

ఈ కథను తెలిచితిమేని మనకెన్నెని భావములు చిక్కును. భగద్గీత యొక్క మహాత్మ్యమును దారిద్ర్యమునందలి గభీరార్థమును సేవాధర్మమందలి పటుత్వమును పశ్చాత్తాపమందలి ఫలితమును విశ్వాసమందలి సుగుణమును అనుకూలదాంపత్యమందలి యానందమును గృహజీవన యాధ్యాత్మికజీవనముల గాఢమైత్రియు నిందు పరోక్షభావమున గాక ప్రత్యక్షభావమున గోచరించు చున్నవి. ఇందు మొట్టమొదట మనదృష్టి నాకర్షింపవలయునది భగవద్గీతా మాహాత్మ్యము.—

గీతయందలి కొండొకపాఠమును గుఱించి మిశ్రపండితుడు సంశయించినాడు. ఇట్టి సంశయములకు చోటిచ్చినవా రప్పుడప్పుడు తలసూపిరి. గీతను కనినది శ్రీకృష్ణమానసము కాదని కొందఱియూహ. ఎవ్వండో సామాన్య మానవుడే దీనిని రచియించి యుండునని వీరి యపోహ. ఒకడుగాక పలువురు గీతను లిఖించియుందురని వచించువారు కొందఱున్నారు. స్థిరముగా నిర్ణయింపబడిన విషయము—గీత శ్రీకృష్ణుని వాగమృతముయొక్క గంభీరసింధువని—గీతామహాత్మ్యము మాటలకందునదికాదు. ఈ మహాత్మ్యమును గుఱించి యొక చక్కని శ్లోకము కలదు.

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థోవత్సః సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్."

ఉపనిషత్తులన్నియు గోవురూపమున నుండ శ్రీకృష్ణు డాయావుపాలు పితికెననియు అర్జును డాయావునకు దూడయై యుండెననియు నిందు తెలుపబడినది. దూడ ఆవు పొదుగును కుడుచుకొనిన పిదప గోపాలుడు పాలు పిదుకును. అర్జునుని ప్రశ్నమూలమున శ్రీకృష్ణుడు గీత లను పాలధారలను ఉపనిషత్తుల నుండి కలియుగప్రజలు త్రాగుటకై పిండినాడు.

గీతకు నెందఱెందరో యెన్నెన్నరీతుల టీకలో వ్రాసియుండిరి. అద్వైతవాదియైన శ్రీశంకరాచార్యుడు అద్వైతతత్త్వమును మనస్సున నిడికొని గీతకు

భాష్యమును వ్రాసినాడు. విశిష్టాద్వైతవాదియైన శ్రీరామానుజాచార్యుడును ద్వైతవాదియైన మధ్వాచార్యుడును ప్రత్యేకముగా వేరువేరు టీకలు వ్రాసిరి.

ఆత్మనుగుఱించియు ఈశ్వరుని గుఱించియు జీవనముగుఱించియు పృథ్విని గుఱించియు ఉపనిషత్తులందు వ్రాయబడిన విషయమందలి మీగడయంతయు నీ గీతయందు చేర్చబడియున్నది. అక్కడక్కడ ఉపనిషత్తులయందలి భాష కూడ గీతయందు చూపట్టుచుండును. అది యుపనిషత్తులయం దొకటిగ నెన్న బడుచున్నది. భగవద్గీతయొక్క మాఱుపేరు గీతోపనిషత్తు. గీతను పఠించుట వలన చేకూఱు ఉన్నతి బహుళభంగులయినది. "గీతాధ్యయ సమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్" (ఎవండు నిత్యమును గీతను చదువుచుండునో పరజన్మమం దతడు మనుష్యత్వము నందఁగలడు.) అనువాక్కు గీతను పఠియిం చుటవలన కలుగు ఫలితములలో నొకదానిని వివరించుచున్నది. గీత చదివిన వాడు హీనయోనియందు పుట్టనేరడు. జన్మబలమును భక్తిబలమును యితర బలములను నతడు పొందగలడు. మనుష్యజన్మ ముక్తికి ద్వారము. ఈ జన్మ లభించుట కష్టము.

దుర్లభం త్రయమేవైతత్ దేవానుగ్రహ హేతుకమ్
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః॥

అని శ్రీశంకరాచార్యుడు వచించినాడు. దేవతల యనుగ్రహముండిన గాని మనుష్యత్వమును ముముక్షుత్వమును ముక్తికాంక్షయును మహాపురుష సాంగత్యమును లభింపనేరవని శ్రీశంకరుడనిన యీవాక్కు గొప్ప సత్యమును తెలుపుదు చేయుచున్నది. మహాపురుషుల పల్కులయం దెంతేనిశక్తి యిమిడి యుండును. శ్రీశంకరాచార్యుని మించిన భాష్యకారుడును పండితుడును జగత్తు నందింకను పుట్టియుండలేదు. గీతను హృదయంగమము మొనరించుకొని దానికి అద్భుతభాష్యమును వ్రాసిన యీమహాపురుషుడు వచించిన మనుష్యత్వము గీతాపఠనము చేచిక్కు—ఆమలకము—దీనిమూలమున దివ్యఫలమయినముక్తియు మనుష్యున కందుబాటగును.

గీతయొక్క ప్రధానమగు టీక శ్రీకృష్ణభగవానుని జీవనమే. అది జగత్ప్రసిద్ధ మహాగ్రంథమగుటకు తోడ్పడిన హేతువులలో నీయంశ మొకటిగా నున్నది. కృష్ణభగవానుడు అనంత విజ్ఞానసముద్రము. కళాపూర్ణుడు. సాహిత్య

సింధువు. తత్వశాస్త్రమునకు జనకుడైన భగవంతుడు. శ్రీకృష్ణభగవానుని గురుగంభీరగుణములన్నియు కృష్ణరచిత మహాగ్రంథమగు భగవద్గీతయందు గోచరించుచున్నవి. ఒక వ్యక్తి వ్రాసిన యాదర్శ గ్రంథమే ఆవ్యక్తిజీవనమును వ్యక్తపరుచు ఆట పందిరి. ఇట్లని నిశ్చయించుటకు శ్రీమద్భగద్గీతయం దెన్నోని దృష్టాంతము లున్నవి. ఉపనిషత్తుల మీాగడతరకైన భగవద్గీత తత్వభావ బంధురమైన గ్రంథము.

గీతావాక్యములు కృష్ణభగవానుని వాక్యములు. పూర్వకాలపు విజ్ఞానులు కేవలము తమ మేధాశక్తిని హృదయశక్తిని పురస్కరించుకొని తమ రచనలను వ్యక్తపఱుపలేదు. పఠనపాండిత్యములమీాద మాత్రమే వారి రచన లాధారపడియుండలేదు. దీర్ఘమగు అనుభవమును క్రమముగ అనుష్ఠానమును వారిరచనలకు పునాదులు. తమ యూహాలను తమ భావములను తమ సూత్రములను తమసిద్ధాంతములను వారు తమ జీవమునలందు కనుపఱచిరి. వారి ప్రబోధమునకు వారి యాచరణమునకును అవినాభావసంబంధమున్నది. శ్రీకృష్ణుని వాక్కులు ఆతని ముఖమునుండియేగాక యాతని జీవనము నుండియు వెలువడినవి. ఆతడు బోధించిన గురుగుణములన్నియు నతని జీవితములోనివే. ఘోరమైన సంకటములు సంభవించినపు డాతడు సముద్రసన్నిభస్థిరత్వగభీరత్వములు చూపినాడు. సౌందర్యసంశోభితబృందావనమందును రాగద్వేషపూరిత రణరంగమందును శత్రుజనపరివృత మధురాపురమునందును రాజన్యనివహాప్రపూర్ణహస్తినాపురము నందును ఆత డొకేతీరుగా స్థిరత్వమును ప్రకటించినాడు. కార్యకారణ ప్రవాహవేగగమనిక నెఱింగిన శ్రీకృష్ణుడు యదుకుల ధ్వంసమును ముందే చూడగలిగినాడు. కర్మ భీకరముగానున్నపు డందుండిపుట్టు ఫలమును భీకరముగానే యుండును. కర్మ నిలచియుండ ఫలితముయొక్క గొంతుకను నులిమివేయ నెవరితరము. మహాజ్ఞానియైన శ్రీకృష్ణుడు స్థిరహృదయుడై నిజవంశవినాశమును పరికించినాడు. కన్నులయెదుట విధ్వంసము చెల రేగుచున్నను నతని చిత్తము చలింపలేదు. విరామము లేని కార్యాచరణ యందలి యద్భుతవిశ్రాంతిని, యోగీంద్రుని యచలభావమును కృష్ణుడు చూపినాడు. కురుక్షేత్రయుద్ధభూమిలోనికి చరచర తేరునడపుచు అర్జునుని యందలి మూర్పును గ్రహించి కృష్ణు డొకచేత కళ్లెములనుబట్టి లాగి హయములను

నిలువబెట్టుచు వెనుకకు తిరిగి విచారాక్రాంతుడగు యోధుని పరికించినాడు. గుఱ్ఱములను లాగిపట్టుట ఆయాసమును పుట్టించును. శరీరము శ్రమకుగుఱియై యున్నది. అపుడుకూడ కృష్ణమానసము ప్రశాంతమై యుండుటం జేసి యా తని వదనము యోగీంద్రుని వదనమట్లు విరాజిల్లుచుండెను. భయంకరమగు కురుక్షేత్రరణస్థలమున సమరసమయమున గోచరించిన యీ ప్రశాంతభావము కృష్ణభగవానుని యద్భుతప్రజ్ఞను వేనోళుల జాటుచున్నది. యుద్ధభూమి అపాయమునకును, అనుమానమునకును ఆటపట్టు. ఎందఱు యోధులు, యేయేరాజులు మడియుదురో తెలియదు. ఏ దిక్కున జయలక్ష్మి వాలునో తెలియదు. అనేకు లస్థిరచిత్తులై భయకంపితులై దుఃఖితులై ఉన్మాదులై యుందురు కాని శ్రీకృష్ణుడు స్థిరహృదయుడై యుండి ఇతరుల కల్యాణమునకై ధర్మసంస్థాపనమునకై మిక్కిలి యత్నముచేయుచు తత్వశాస్త్రమందలి గొప్ప గూఢ విషయములు పార్థునకు బోధింపమొదలిడినాడు.

విపత్సమయమున నుపాయము నెఱుంగుట, ప్రశాంతమగు ప్రబోధము సలుపుట గుండెలు నిబ్బరముగ నిలుపుట, యెవరికి సాధ్యము? శ్రీకృష్ణుని దృష్టాంతము సర్వమానవులకును ఉద్దేశింపబడినది. పనిచేయుచు చేయుచు మనుజులు సాధారణముగా సోమరితనమునకును, మత్తతకును, నిరుత్సాహము నకును, విచారమునకును, నిరాశకును చోటిత్తురు. కర్మను పిడికిట బట్టుటకు మాఱు వీరు కర్మయొక్క పిడికిలికి లోనగుదురు. క్రియాకలాపమును పాడు చేయు ఇంద్రియములను అణచుటకుమాఱు ఇంద్రియములను తమపై స్వారి చేయనిత్తురు. ప్రశాంతచిత్తుడైన ప్రభువు మహాత్ముడైన ప్రభువు దాసుని చర ణములకు ప్రణమిల్ల సంశయింపడు. కృష్ణుడనేకమాఱులు నిరుపేదలకును జ్ఞాన మూర్తులైన విప్రులకును నమస్కరించినాడు. అహంకరించిన సేవకుడు ప్రభు వును కాలదన్న సంశయింపడు. పట్టుతప్పి చెలరేగు యింద్రియములు కార్య ముల నన్నిటిని చెఱచును. అద్భుతాశయములను ఉన్నతోద్దేశములను తన్ని వేయుటకవి సంశయింపవు. కార్యాచరణమునందవి గగ్గోలుపుట్టించును. మాన వుడు కర్మయందు స్థిరత్వమును గాంచినపుడే యతడగ్రసరుడు కాగలుగును. ఈ స్థిరత్వమును చెఱచునదియు మానవుని లోతుగోతియందు కూల్చునదియు కామముతో కూడిన కర్మయే. వాంఛను మనసునం దిడికొని కర్మక్షేత్రమున

కాలిడు నాతడు వాంఛ నెఱవేరని తఱి హతాశుడై నేలకూలును. ఇట్టివారిలో ఆత్మహత్య గావించుకొనిన వారనేకులున్నారు. ఇట్టి సంకటములనుండియు సంతాపమునుండియు మానవుని తొలగించి యాతనిహృదయమును శాంతి నికేతనము చేయునది నిష్కామకర్మ. దీనిని తెలియజేయునదియే గీత. ఇది యొక వ్యక్తికిని యొకజాతికిని యొకదేశమునకును యొక కాలమునకును మాత్రమే పనికివచ్చు గ్రంథముకాదు. గీతామృతము సర్వసమయ సర్వ మానవ కల్యాణార్థము కృష్ణపరమాత్మవలన కురుక్షేత్రమున ధారవోయపడినది.

కృష్ణుని వాక్కునకును కృష్ణునిజీవనమునకును కృష్ణునకును భేదములేదు. ఈ పాఠమును అర్జున మిశ్రునకు తెలుపుటకే కృష్ణుడుద్దేశించినాడు. ఆతని దృష్టిలో అర్జునుడును అర్జునమిశ్రుడును సమానులు. తెలిసికొనుటయందు యిచ్ఛగలవారందఱును కృష్ణకటాక్షమును పొంది తీరుదురు. తనగీతయును తానును నొక్కడేయని తన క్షతకాయమువలన నాతడు నిరూపించినాడు. గీతా శ్లోకమందలి కొట్టివేత గీతాచార్యుని యొడలిపై తీవ్రాఘాతమై పడినది. తన యపరాధమును గుర్తించి మిశ్రజీ తన సవరణను దిద్దివేసి గీతాచార్యుపట్ల తాను గావించిన అపచారమును మాపుచేసికొని యాతని ప్రసన్నత నంది నాడు. మిశ్రజీ జీవనమున కూడ స్పష్టమై గోచరించుచున్నది.

## దారిద్ర్యమందలి గభీరార్థము

దారిద్ర్యగుణములు మిగుల వింతయైనవి. మనుజునిపీల్చి పిప్పిజేసి దుర్మర ణము పాలుచేయునది బీదతనమే. మనుజుని మహాత్ముని గావించి జగదీశు దాపల చేర్చునదియు బీదతనమే. అనేకశతాబ్దములకు మున్నే దారిద్ర్యమందలి మహా త్త్వము భరతఖండమున ప్రశస్తి చెందినది. భారతసంయములు దరిద్రులు. భారతవిజ్ఞానులు పేదరికమును శృంగలించుకొని కఠోరమగు వ్రతములు సలిపి తీవ్రమగు దీక్షవహించి ఆధ్యాత్మిక (ఆత్మసంబంధమగు) విభూతినందిరి. కేవ లము ధనార్జనకొఱకే ఉద్దేశింపబడుచున్న ప్రస్తుతవిద్యకును ఆధ్యాత్మిక విభూతికిని యెట్టిసంబంధమును లేదు. ప్రాచీనవిద్యయందిట్టి సిద్ధాంతములులేవు. నాటి విద్య నాటి యాశ్రయములయందు పుట్టినది. నాటియాశ్రయములు పవిత్ర స్థానములు. బ్రహ్మచర్యదీక్ష దారిద్ర్యవ్రతము కఠోరనియమపాలనము నాటి

విద్యార్జనమునకు అనివార్యములుగా నుండెడివి. ఇట్టి దీక్షయందు విద్య నందినవారి వాక్కులు విస్మృతిగర్భమున మునిగిపోవక కాలమార్గమున ప్రతిధ్వనించుచు నేడును మనకు కర్ణగోచరము లగుచున్నవి.

ఇట్లని భారతదేశము దారిద్ర్యదేవత నుపాసించినదని తలపరాదు. దారిద్ర్యోపాసనమున కర్హులైనవారికి మాత్రము అందలి పటుత్వమహాత్త్వము లను దెలిపినది. నిరంతరజ్ఞానజిజ్ఞాసువులకును బ్రహ్మచారులకును యోగులకును భారతదేశము దారిద్ర్యదేవతా ఉపాసనము నుద్బోధించినది. దేశముయొక్క ఆర్థికాభివృద్ధి పరులచేతులయందు బెట్టి వారినిపోషించు భారము వీరిపై వైచి నది. నియమబద్ధజీవులై అర్థకాంక్షరహితులై ఆత్మాభివృద్ధిమీదను ఆధ్యాత్మి కోన్నతిమీదను మనసునిలిపిన మన ప్రాచీనులు అద్భుతకావ్యములను గభీర తత్వశాస్త్రమును రచియింపగలిగిరి.

అర్జున మిశ్రుడు దరిద్రుడు. ఈతని సేవింపవలెనని జగదీశుడు వేగిరపడి నాడు. ఈతనిహృదయమును మార్పుచేయవలెనని కొంతకష్ట మీతనికి తొలుత కలుగచేసినాడు. కలుగజేసియు ఆకష్టమునకంటె అధికమగు కష్టమునుపూని యాహారపదార్థములను మోసితెచ్చి కృష్ణపరమాత్మ మిశ్రజీ యిల్లాలి కొసగి నాడు. దరిద్రులున్న చోటులయందు జగదీశు డుండకమానడు.

## సేవాధర్మము

సేవాధర్మమునందలి మహాత్త్వమును కృష్ణుడు పలుమాఱు వ్యక్తీక రించినాడు. పాండవులకును వారి యర్ధాంగలక్ష్మికిని యాతడెంతేని పరిచర్య సలిపినాడు. ద్రౌపదీవస్త్రాపహరణ సమయమందును జయద్రథవధకు ముందును భీష్మద్రోణులు విజృంభించిన వేళలందును నాతడు చేసినసేవ యపరిమితము. దేవదేవుడు సారథియైనాడు. తనభక్తున కూడిగము చేసినాడు. కురుపాండవు లకు సంధి కుదురునేమోయని యత్నించుటకై రాయబారమునకరిగి విపదవస్థ యందు చిక్కుకొనుటకు సంశయించినాడుకాడు. ఈతనిశాంత మత్యద్భుతము. భృగుమహాఋషిచే తన్నుతిని మహాశాంతము చూపి యాతని పదములు తన హస్తముల నొత్తిన దేవదేవుడు కృష్ణుడుకాడా? పాతాళమున నేడును బలిని ద్వారపాలకుడై సేవించు జగదీశుడు కృష్ణుడుకాక మరెవ్వరు? ఈకథయందు

తనభక్తుని కొఱకును యాతని భార్యకొఱకును దెబ్బతగిలిన శరీరముతో కృష్ణుడు వానయందు తడిసి మోయలేని బరువును మోసికొనివచ్చి వారి యాకలిబాధ తీర్చి వారిని రక్షింపలేదా! దాసానుదాసుండైన కృష్ణునిమించిన ప్రజాసేవకుడు బృథ్వియందుండెనా? సేవాధర్మముయొక్క మహత్త్వమును భారతీయులేగాక పృథ్వీవాసులందఱును గుర్తించిననాడు ప్రపంచమున సుఖ శాంతులు పునరుద్ధరణము నందును.

## పశ్చాత్తాపము

పశ్చాత్తాపము పునర్జన్మద్వారము. ఇందుండియే ముక్తిమార్గము సాగి పోవును. శరీరమును పరిత్యజించినప్పుడే ఆత్మ విముక్తిని పడయునని జీవన్ముక్తి యనునదేమియు లేదనియు రామానుజు డనునుగాని పురాణగాథలనన్నిటిని పరిశీలించితిమేని యిట్టి ముక్తియున్నదని నిరూపించు దృష్టాంతము లెన్నోని మనకు గోచరమగును.

ఈజీవన్ముక్తిని గుఱించిన యుదంతము భగవద్గీతయందెంతేని యున్నది. ఆతనికి యేవిధమగు బాధలును లేవు. దుఃఖములేదు. భయములేదు. కోరిక లేదు. అనుక్షణము నతడు జగదీశుని సాక్షాత్కారము నందుచుండును. అత నికి స్మృతి, శృతి, పురాణాదుల పఠనమునావశ్యకము. అతడు సచ్చిదానంద సాగరమున నీదులాడుచుండును. జగదీశునివలెనే పరార్థజీవియై యతడు ప్రపంచమున తిరుగులాడును. తనకొఱకై యాతడేపనియుం జేయడు. ఒకరి దూషణముల కాతడు కోపగింపడు. ఒకరి సంప్రీతి కాతడు ప్రాకులాడడు. ఉత్కృష్టమగు నేదేని కార్యమొనరించుటకు జగదీశ్వరుడే పుడమిపై మనుష్య రూపమున నవతరించునట్లు అతడును తిరిగి జన్మమెత్తిన నెత్తవచ్చును. మహా యోగులును మతాచార్యులును జీవన్ముక్తులనుట నిస్సంశయము.

ఆంతరంగిక సముద్ధరణము నందినవాడు జీవన్ముక్తుడు కాగలడు. జగదీశు డంతరంగమందే యున్నాడు గావున ముక్తిని యెందుండియో కొని తేనక్కర లేదు. "వడ్లగింజలకంటెను, ఆవగింజలకంటెను చిన్నవాడై యాతడు అంత రంగమందున్నాడు. భువనములన్నిటికంటెను పెద్దవాడై యాతడు నా ఆత్మయై నాయందున్నా" డనియు; "హృదయమునందే స్వర్గమర్త్యములును, అగ్ని

యును, వాయువును, సూర్యచంద్రులును, నక్షత్రములును, విద్యుత్తును కూడి యున్న" వనియు ఛాందోగ్యోపనిషత్తు స్పష్టముగా చెప్పుచున్నది. మిశ్రజీ జీవనమునం దీసత్యము ప్రత్యక్షమై గోచరించినది.

తాను గావించిన యెగ్గునకు అత డనుతాపము నందినాడు. తనతప్పును తాను దిద్దుకొనినాడు. ఆంతరంగిక పరివర్తనముచెందిన అర్జునమిశ్రజీ యెదుట, అంతకుమున్ను ఆతని భార్యకు మాత్రమే దర్శనమిచ్చిన జగదీశ్వరుడు సాక్షాత్కరించినాడు. ఈ సాక్షాత్కారమే మిశ్రజీపొందిన ముక్తి.

## విశ్వాసము

ఆధ్యాత్మికజీవనమునకు పట్టుకొమ్మ విశ్వాసము. వట్టియాలోచన భౌతిక శాస్త్రమునకు పనికివచ్చును కాని మతశాస్త్రమున కుపయోగింపదు. ఆలోచనమువలనను, హేతువాదమువలనను జగదీశుడు సాక్షాత్కరింపడని మనతత్త్వశాస్త్రములు తెలుపుచున్నవి. ఆధ్యాత్మికానుభవము, విశ్వాసము, ముక్తికి అవసరములు. వట్టి హేతువాదముమీద నాధారపడక ఆధ్యాత్మికానుభవములతో నిండియున్న శ్రుతులను పఠించి యందలి సత్యములను గ్రహించి యాచరించుట ప్రతి మతజీవికిని యనవసరమని పండితులు వాకొందురు. హేతుయోజనములకు కొంతతావొసంగి పిమ్మట ప్రకటనచేయు విశ్వాసమే భక్తుని జగదీశుని చెంతజేర్చు విశ్వాసము. భక్తియోగమునకు ఆయువు పోయునది విశ్వాసము ఇట్టి విశ్వాసము కలిగినదగుటచేతనే మిశ్రజీ యర్ధాంగలక్ష్మికి జగదీశుడు దర్శనమిచ్చినాడు. తనపెనిమిటివలె నీమె పాండిత్యము సంపాదింపలేదు. ఈమెకు జగదీశునిపై విశ్వాసము మెండు. నిత్యదైనికజీవనమునం దీమె పరమపావనమై మెలంగినది. ఈమె తనమానసమున నెన్నడును సంశయమునకు చోటియ్యలేదు. శంకాకులితమానసుడైన మిశ్రజీకి జగదీశ్వరుడు దర్శనమిచ్చుటకు సంశయించినాడు. విశ్వాసమున్న తావులందు దైవసాక్షాత్కారమును, దైవప్రసన్నతయు నుండునుగదా!

## అనుకూలదాంపత్యము

భార్యాభర్త లొకహృదయము గలిగి యున్నపుడే వారి దాంపత్యము సుధామయమై యుండును. సాధారణదైనికజీవనమునకును, ఆధ్యాత్మికజీవన

మునకును వ్యత్యాసములేదని గ్రహించి జీవనము గడపిన యిల్లాలు మిశ్రజీ భార్య. ఆమె స్త్రీవిద్య, ఆమె పవిత్రజీవనమున నిమిడిపోయినది. గృహజీవన ఆధ్యాత్మికజీవనముల గాఢమైత్రిని పరోక్షభావమున గాక ప్రత్యక్షఆచరణ భావమున నామె వ్యక్తీకరించినది. మిశ్రజీ కన్నులు తెఱచునట్లు చేసినది ఆతని యిల్లాలు. పాండిత్యవిషయమున పరిశీలించితిమేని యామె పతికంటె వేయిమడుంగులు తక్కువ. మిశ్రజీకూడ సచ్చరిత్రుడేయయ్యు ప్రత్యక్షజీవన నిర్వహణమునందు పరిశీలించినచో నాతనికంటె యాతని భార్యయే వేయి మడుంగు లధికురాలు. విద్యయొక్క విలువ అవిద్య ఆదర్శముతో ప్రకాశించి యాచరణయందు గోచరించినపుడే వ్యక్తమగును. ఈసత్యము పునరవతరణ మందిననాడు భారతగృహజీవనము మరల అమృతమయమై యుండును. ఈ గృహజీవనమునకు ముఖ్యమైన దాంపత్యము అనుకూలమై ఆనంద సందీప్తమై యుండును.

ఈకథ చిన్నదియయ్యు నిందెంతయో విలువగల విషయము లిమిడి యున్నవి.



౩౫

# శ్రీ మధుపండిత ఠాకూర్

మ. "కమలోల్లాసకమై నిరంతరకళల్ గన్పట్ట శీతాంశుబిం
బముకంటెన్ ద్విగుణాభిరూప్యమున రమ్యంబైన నెమ్మోము బు
న్నమజాబిల్లి వెలుంగుతో వెలయ కృష్ణాభిఖ్యమానాదు జీ
వము దృష్ణాబ్ధితరంగలన్ ద్విగుణమై వర్తిల్లజేసెన్ మదిన్."

మధుపండితుడు ఆర్యావర్తమున వసించువాడు. బాల్యప్రాయము నుండియు నతనికి కృష్ణభగవానునిపై ప్రీతిమెండు. ఆతనిభక్తికి మెచ్చి ప్రజ లాతని యక్కరలు దీర్చుచుండువారు. శ్రీకృష్ణుని దర్శింపవలెనని యొకప్పు డాతడు బృందావనమున కరిగెను. అరిగి 'కృష్ణా! కృష్ణా!' యని యఱచుచు నతడు బృందావనమునం దంతటను సంచరించెను. వనములందును కుంజకవాట ములందును లతాగృహములందును పిచ్చివానివలె కృష్ణాన్వేషణము సలిపి నాడు. కాని కృష్ణునిదర్శనముమాత్ర మతనికి లభించినదికాదు. మధుపండి తుని దుఃఖమునకు మితిలేకయుండెను. యమునాతీరమందలి వంశీవటము నీడ యందు నిరాహారియై పడియుండి "హే! కృష్ణా! హే! కృష్ణా! హే గోపాల కృష్ణా! హేగోవిందకృష్ణా! హేద్వారకావాసా!" యని రోదనమొనరింప సాగెను.

కృష్ణభగవాను డింక యూరకొని యుండలేకపోయెను. మధుపండితుని యీప్సితము తీర్పవలెనని నిశ్చయించినాడు. నీలమేఘపుకాంతి వెదజల్లు మేని చాయతో వంశీవటసమీపమున వెంటనే గోపీనాథుడు మధుపండితునకు దృగ్గోచర మయ్యెను.

మధుపండితుని యానందమునకు మితిలేకపోయెను. ఒక్కగంతువైచి ముందునకరిగి యా విగ్రహమును చేతబట్టినాడు. అమూల్యమైన రత్నమును బడసి దాని నితరు లూడపెఱుకుదు రనుభయమున రివ్వున పరువెత్తు మాన వుని చందమున నాపండితుడు కృష్ణవిగ్రహమును చంక నిడుకొని పరుగువెట్టి

నాడు. యమునాతీరమున కేశీఘట్టమున నొక మఱుగుతావున దానిని నిలిపి యనవరతము నపరిమిత అవ్యాజవాత్సల్యముతో పూజించుచుండు వాడు.

తరువాత కొన్నినాళ్లకు ఆర్థిక ఆధ్యాత్మికధనములను పిడికిటబట్టిన మహాపుణాత్ము డొకడు చక్కని యాలయమొకటి కట్టించి యా విగ్రహము నందు ప్రతిష్ఠచేయించి నిత్యనైవేద్యమునకు సమారాధనకు తగునేర్పాటులు గావించెను.

ఇపుడుకూడ శ్రీ బృందావనధామమున నా యాలయమును గోపీనాథ విగ్రహమును విరాజిల్లుచున్నవి.

కవిత్వమువలెనే భక్తి హృదయకాసారమున నుప్పొంగును. భక్తిపరులకు, కవిశేఖరులకువలెనే యావేశము మెండు. పరమహంస (ఉత్తమపదము నొందిన సన్యాసి) లకును కవిరాజులకును జగదీశుడైన నటరాజునకును వ్యత్యాసములులేవు. జగదీశునెడల సంపూర్ణమైన నమ్మికకలవాడు కావున భక్తుడను క్షణము ఆతని చూచుచున్నటులును ఆతనితో మాటలాడుచున్నటులునువర్తించును. తమలో తాము నవ్వుకొనుచు తమంత తామేడ్చుచు మెలగువారు ఉన్మాదులయందే గాక మహాభక్తులయందును చూపట్టుదురు. రక్తమాంసములతో కూడిన శరీరముతో మూర్తిభవించి సృష్టికర్త వీరిముందు నిలువకున్నను ఆతని చిహ్నలును ఆతని లీలలును ఆతని ఛాయలును పరోక్షముననైన గాంచి యట్టిభక్తులు రూపగుణసముంచితుడైన జగదీశుని ప్రత్యక్షముగా విలోకించునట్లు ఆనందింతురు. వీరి యానందమే వీరి వైకుంఠము.

మధుపండితఠాకూర్ యిట్టిభక్తులలో నొక్కడు. కృష్ణునికొఱకై యాతడు తపించినాడు. కృష్ణవిగ్రహమును గాంచి భగవంతుని తన చేతులార పడసినట్లు మురిసిపోయినాడు. మహాకవులట్లు మహాభక్తులును ఆత్మలోనిభావములను బాహ్యవస్తువులయందు గాంతురు. మధుపండితుని యాత్మ యాతడు సంపాదించిన విగ్రహమున ప్రత్యక్షమైనది. ఆతనికోరిక నెరవేరినది. ఆతని విషాదము అంతరించినది. ఆతనిభక్తి హెచ్చినది. ఆమరణము నతడు విగ్రహసేవయందే గడపి తుదిని ముక్తిని పొందెను.

ముక్తిగాంచుటకు హిందూమతము వివిధమార్గములు చూపుచున్నది. భక్తిమార్గ, కర్మమార్గ, జ్ఞానమార్గములు జగత్ప్రసిద్ధములు. వనములయందు

వసించి నిరంతరము యోగనిష్ఠాపరాయణుడై మునికుంజరుడొకడు ముక్తిని పొందగలిగినట్లే జనసంకులప్రదేశమున నివసించుచు నిజకర్మను నిర్వహించు చుండువాడును ముక్తిని పొందగలడని హిందూమతము తెలుపుచున్నది. భగవంతుని సేవయందు అన్యమతములకే విశేషస్వాతంత్ర్య మొసగిన హిందూమతము హిందూమతస్థునకు నీ స్వాతంత్ర్యమొసగుట వింతకాదు. విగ్రహారాధనము అనుచితమని హిందూమత మెన్నడు ననదు. ఆధ్యాత్మికజీవనమును ప్రారంభించువారి కన్నులయెదుట వారిదృష్టి నాకర్షించు వస్తు వొకటి యుండవలెను. ఈ వస్తువే జగదీశుడని యే విగ్రహారాధకుడును తలపడు. భగవంతుని తెలిసికొనుటకు యేకాగ్రచిత్తము ఆవశ్యకమైనది. చేపవలె నలువైపుల మనలు మనస్సును నిలుపు నాతడే మానసమత్స్యయంత్రమును కొట్టి ముక్తిస్వరూపిణియు నాత్మశాంతియునైన ద్రౌపదిని పొంది ధనంజయుడగును. నిర్గుణోపాసనము మిగుల కఠినమైనది. దీనినొకఘడియయందు యొక్కదినమున పిడికిట బట్టుట దుస్సాధ్యము. ఆధ్యాత్మికజీవనమున న్యగ్రసరుడు కావలయునని కోరెడు భక్తుడు క్రమానుష్ఠానము సలుపవలెను. ఈ యనుష్ఠానమునకు వలయు క్రమయత్నములను ప్రాచీనయోగులు మనశ్శాస్త్రనిబంధనల ననుసరించి నిర్ణయ మొనరించిరి. కావున హిందూభక్తులందు వేఱువేఱు తరగతులవా రున్నారు. విగ్రహారాధకులు సగుణోపాసకులు నొకతరగతికి చెందినవారు.

వెలుపలి కన్నునకును లోపలి కన్నునకును సంబంధమున్నది. ఎదుట దోచు వస్తువు అంతరంగమందుకూడ తోచును. విగ్రహారాధకుని ఆరాధనమందు ముఖ్యమైనది భక్తిభావము. ఈతడు చూచుచుండు విగ్రహమును ఈతడు భక్తిమయము చేసివైచును. నిజముగా విగ్రహమపుడు ప్రాణప్రతిష్ఠ నొందును. అంతరంగమందలి భక్తిరాశి నుబికించు సాధనమగునది విగ్రహము. అంతరంగ శక్తిని లేపుటకు యేమతస్థులకైనను బాహ్యసాధనము లవసరములు. ఈసాధనములు వేర్వేరు విధములుకలవి కావచ్చును. జగన్నాథ క్షేత్రమునకు వెడలిన యొక సిక్కుమహాయోగి ఆలయము ముంగిటకుగాని లోపలికిగాని ప్రవేశింపక వెలుపల నిలచి విశ్వమంతయు, నొక దేవాలయమనియు నక్షత్రయుక్తమైన యాకాశము ఆలయమందలి మీది భాగమనియు, అద్భుతమగు నా యాలయమున నాతడున్నపుడు మఱియొక దేవళమున బ్రవేశించుట యేల

యనియు బలికినాడట. ఈ మహాభక్తుని భక్తిభావమును, ఉపొంగించినది వట్టిశూన్యముకాదు. నిరాకారముకాదు. సాకార సారూపములు గల జగత్తు. విగ్రహారాధకుడును సాకార సారూపములను భజియించువాడు. ఇరువురును నొకేనియమము పాలించుచుండ వస్తువులలో భేదములున్న నేమి లేకున్న నేమి !

కవికిని భక్తునకును దగ్గర చుట్టరిక మున్నదని యిదివరలో చెప్పితిని గదా ! కవి సగుణోపాసకుడు. బాహ్య ప్రపంచమునుండి భావములు మిక్కుటముగా గ్రోలి యతడు మధురమగు మంజులగీతములు పాడును. ఇరువురు నొక మార్గము నుండియే ముక్తి నందుదురు.

మధురపండితఠాకూర్ సగుణోపాసకుడు. బాహ్యావిగ్రహమం దాతడు అంతరంగమూర్తిని కాంచినాడు. అవ్వలి విగ్రహముపై నాతడు చల్లిన పుష్పములు హృదయ సింహాసనమున నాసీనుడై యున్న జగదీశునిపై పడినవి. కావున నాత డాత్మసిద్ధి నందినాడు. ముక్తిని కాంచినాడు.

ఇట్టి కథలు హిందూజీవనమున తఱచుగ జరుగుచుండును. సంయుక్త రాష్ట్రములలో ఫరుకాబాద్ జిల్లాయందు గంగాగంజియను నొక పల్లెకలదు. ఇది చరిత్ర ప్రసిద్ధినొందిన 'కనోజ్' కి పదిమైళ్ళ దూరమందున్నది. దీనికి దగ్గర మియాగంజ్ యున్నది. గంగాగంజి గంగాతీరమునం దున్నది. గంగానది యచ్చోట మిగుల వడిగలదియై లోతుగలదిగా నుండును. నదీకూలమున నారదస్వామి యను నొక యోగి యెల్లపుడు శ్రీకృష్ణుని ప్రస్తుతించుచుండును. ఒకనా డతని యెదుట మిక్కిలి సుందరమై శిలానిర్మితమైన కృష్ణ విగ్రహ మొకటి కానుపించినది. గంగాగంజ్ వాసులు ఆ తావున నొక చిన్న గుడికట్టి యందా కృష్ణ విగ్రహమును నిలిపిరి. భజనమందిరమును కూడ కట్టిరి. నిశ్చల తపమునకై చక్కని సొరంగములు నిర్మించిరి. ఈ ప్రదేశమునకు వైకుంఠ ఆశ్రమమని పేరుపెట్టిరి. నేడును శ్రీనారదయోగి యందున్నాడు. ఈ కథ యందలి మధుపండితుని పోలువాడే నారదస్వామి. ఇది పురాణ కథ కాదు. బూటకపు గాథకాదు. చదువరు లిందలి పరమార్థమును గ్రహింతురుగాక !

---

# ౩౬

# శ్రీ గోపాలభట్టు



"మ. సరసస్మేరకపోలు గొల్లు మురళీసంగీతలోలున్ శుభా
కర చామీకరచేలు నీలమణి రంగత్కుంతల శ్రీ విశా
లు రమాపాలు నితాంతశౌర్యగుణశీలున్ దానవప్రాణ హృ
త్కరవాలుం గపిలాదనీకవలయోద్యన్నీలు గోపాలునిన్."

గోపాలభట్టుని చరిత్రము మిగుల నానందజనకమైనది. అద్భుతజనకమైనది. చిన్నతనమునుండియు నీతనికి శ్రీకృష్ణునిపై భక్తి యధికము. అదృష్టవశమున నీతనికొక మహాయోగి దృష్టియందు పడినాడు. బాలకుని శ్రద్ధాభక్తుల కానందించి యోగీంద్రు డీతనికి కృష్ణమతము నుపదేశించినాడు. నాడు మొదలు గోపాలభట్టు వ్రతదీక్షయందు మునిగియుండువాడు. ప్రేమానందమున మునిగి జగదీశుని మనమునందిడికొని రాత్రింబగళులు సాలిగ్రామారాధనము చేయుచుండువాడు. నిరంతరము నిట్లారాధించుచుండ నా సాలిగ్రామము శ్రీరాధారమణరూపమునుదాల్చి మురళినిధరించి గోపాలభట్టునకు చూపట్టినదట.

ఒకప్పుడు మిగుల ధనికుడగు యాత్రికుడొకడు తీర్థములనేకములు సేవించి, బృందావనమున కరిగెను. బృందావనమందిరము లన్నింటిని చూచి పలువిధములగు భోగ్యవస్తువులను వస్త్రములను అలంకారములను నతడు స్వామికి సమర్పించినాడు. గోపాలభట్టుని పూజామందిరమును కూడ దర్శించి యచ్చటగూడ నతడు వస్త్రాభరణాదుల నిచ్చినాడు.

ఆ వస్తువుల నన్నిటిని గాంచిన గోపాలభట్టుని యానందమునకు మేర లేకపోయెను. అతి డొడలు మఱచినవా డయ్యెను. పిమ్మట నాత్మవిస్మృతుడు కూడ నయ్యెను. తెలివివచ్చినపిదప "ఆహా! దుర్దైవమా! ప్రాణతుల్యునగు నీ సాలిగ్రామము చేతులు మొదలగు నవయవములతో కూడియున్నదియైనచో

యీాతడిచ్చిన యలంకారములను వస్త్రములను, స్వామికి యలంకరించి యుండు వాడనుగదా. ఆహా! అప్పుడు స్వామి యెంత తేజరిల్లియుండువాడు'' అని యాతడు మిగుల వగచెను. మనస్సంతయు నతడు కృష్ణునిమూర్తిపై నిలిపి పరుండినాడు. కలయందుకూడ నాచింతయే వాని మనస్సున నిలిచియుండెను.

శ్రీకృష్ణుడు భక్తులకు కల్పతరువుగదా! భక్తుల మనోభీష్టములను దీర్పవలెనని యాతడు నిశ్చయించినాడు. రాత్రిసమయమున సాలిగ్రామము యొక్క రూపము మారిపోయెను. భువన మోహనరూపుడగు శ్రీకృష్ణుని విగ్రహము బంగారు గద్దెపై రాజిల్లెను.

నిద్దురనుండి లేచి యెదుటి పూజామంటపముపై గోపాలభట్టు కన్ను నిలిపినాడు. సచ్చిదానంద ఘనస్వరూపుడగు కృష్ణుని చూచి యపరిమితానందమున సంకీర్తన మొనరించుచు నృత్యము సలిపి ప్రేమపూరిత హృదయుడై యానందమున నతడు మునింగెను. వర్తకుడు సమర్పించిన వస్తువుల నన్నిటిని మిక్కిలి మక్కువతో నాతడు కృష్ణవిగ్రహమున కిచ్చినాడు. చక్కని యా జట్టలను నేర్పుతో నావిగ్రహమునకు కట్టబెట్టినాడు. అలంకారము లన్నియు నామూర్తికి ధరింపజేసినాడు.

నేడు కూడ బృందావనమున నీయద్భుత విగ్రహము విరాజిల్లుచున్నది. స్వామి పేరు రాధారమణమూర్తి. గోపాలభట్టుని వంశీయులే యావిగ్రహమును నేడును నారాధించుచున్నారు. భట్టజీ హిందూస్థానీయుల కెంతయు మేలు చేసినాడు.

ఈకథ మిక్కిలి విడ్డూరమైనది. ఇది యసృత మగునది కాని నిజము కాదనియు పామరుల హృదయములు ఆకర్షించుటకు కల్పితమైన చిత్రగాధ యనియు ననేకులు పొరపాటు పడవచ్చును.

మానసశక్తివలనను ఆత్మశక్తివలనను యెన్నెని యద్భుతము లుద్భవమందును. మనస్సునకును శరీరమునకును మనుష్యజీవనమునకును అవినాభావ సంబంధమున్నది. అంతరంగమున పుట్టు భావము అంతరంగమునందే యంత యుండదు అది కనుపడనిదగుటచే లేనిదేయని దానిని భావింపరాదు. అది యొరులకంట పడకున్నను, యొగల నది తాకకమానదు. భావమువలన పుట్టు

ఫలము తోడనే వ్యక్తియందుత్పాదించును దుష్ప్రవృత్తులను మనసున జనింప జేయు మానవుడు తనచేతనే నిర్మింపబడిన నరకమునకు రాజమార్గ మేర్పఱచు కొనినవాడగును. ఈతని మానసము చింతనిష్ఫలతో నిండియుండ నీతని మొగము నందనసౌరభమును గురిపించును. దుఃఖభావమైనను క్రోధభావమైనను ద్వేషభావమైనను ప్రేమభావమైనను మఱేభావమైనను ముగముపై తన చిన్నెలు కనుపడునట్లు చేయును. దీనిని తెలిసికొనుకుండ నణపగలవారెకొందరైన నున్నను వానివలన ఘట్టు మంచిచెడ్డలనండి వారు తప్పించుకొని పోవ జాలరు. ఆనందభావమును మానసమున నింపుకొనువాతడు చక్కని యారోగ్య లాభమునందును. విషాదమనస్కుడు నేలకగ్రుంగియుండును. మనసున నానంద ప్రవాహము ప్పొంగుతరి పై ప్రపంచము కూడ మార్పుచెందినదే యగును. మనుజుని మానసము నరకమును స్వర్గముగను, స్వర్గమును నరకముగను చేయ జాలును. మానసశక్తి యద్భుతమైనది. మనస్సును సంతసముచే నింపునదియు దుఃఖముచే నింపునదియు భావమే కాని యొకానొక సంఘటనము కాదని కొందఱి తత్త్వవిదుల యభిప్రాయము. ఒకవ్యక్తి చెన్నపురిలో నున్నాడను కొనుడు. అతని తనయుడొకడు బొంబాయిలో చదువుచున్నాడనుకొనుడు. కొడుకు మరణించెనని తంతివార్త యొకటి తండ్రికి చేరెను. తంతిని చూచిన తండ్రి దుఃఖపూరితమనస్కుడు కాకుండునా! అయితు నాడే వాని తనయుడు బొంబాయినుండి వచ్చి తండ్రిని చెన్నపురిలో కలుసుకొనును. తండ్రి యానంద మున కపుడు మేరయుండునా? తనయుడు పూర్ణారోగ్యవంతుడై యున్నను యెవరో యొకదుర్మతి తండ్రిమీది కిట్టనితనముచేత దురంతమగు అనృతమును తంతిద్వారా తండ్రికి పంపినాడు. తండ్రి మానసమును దుఃఖముచే నింపినది, తంతిలోని భావముగాని బొంబాయిలోని తనకుమారుని స్థితికాదుగదా! నిజముగా బొంబాయిలో నతని తనయుడు మరణించె ననుకొనుడు. ఈదుర్వార్తను తండ్రికి తెలుపువారెవరును లేకపోయిరని యనుకొనుము. చెన్నపురిలో మిత్రులతో గలసి యొకనాడు తండ్రిమహోత్సవమును జరుప నిశ్చయించెనని నమ్ముడు. ఉత్సవదినమునందే యతని తనయుడు మృతుడయ్యెనని భావింపుడు. తనయుని చావు తండ్రి యెఱుంగడు. ఆతడుల్లాసమున మునిగి తేలుచుండును. బొంబాయిలో జరిగిన ఘోరసంఘటనము తండ్రిమనస్సును సోకలేదు. దానిని

గుఱించిన భావము తండ్రిచిత్తమును చేరలేదు. చేరియున్నచో నాతనిచిత్తము దురంతసంతాపముచే నిండిపోయెడిని. కావున శక్తికలది భావముగాని సంఘటనము కాదని పైన తెలిపిన తరగతిలోని తత్త్వవిదులు తెలుపుదురు.

ఈ భావసృష్టి ప్రత్యేకవ్యక్తియొక్క మానసప్రకృతినిబట్టి యుండును. అనుమానమువలనను అడలుపాటువలనను భయమును పుట్టించు భావములను సృష్టించుకొనువా రెందఱోకలరు. చీకటిలో చెట్టుమోదులను చూచి దయ్యములనియు దొంగలనియు తలచి వీరు భయకంపితులగుదురు. నిర్భయచిత్తుడై యుండు నాతనికి భయము కలిగించు వస్తువు లేకీడును సలుపజాలవు. పులులను దూడలవలె నెంచు యోధులున్నారు. శకుంతల తనయుడు బాలుడై యుండగానే "అమితోగ్రాటవిలోన గ్రుమ్మరుమహావ్యాళఖడ్గమ గేభ శార్దూలము" లను తన కౌపీనమునకు కట్టి కణ్వాశ్రమములోని కీడ్చి తెచ్చి వాని నచట చారువులకు కట్టుచుండువాడట. గుండె నిబ్బరమున్నవా రెట్టి భయద కార్యమునైన నెఱవేర్పగలరు. అది లేనివారు తమనీడను చూచి తాము త్రుళ్ళిపడుచుందురు. తాడుచూచి పామనుకొనువా రున్నారు. రజ్జువును సర్పమని భ్రమ పడుటవలన మూడు కీడు సామాన్యమైనదికాదు. పామును త్రొక్కితిమనియు యేదియో చీకటియందు గ్రుచ్చుకొనినపుడు పాము కఱచినదనియు తలచి ప్రాణసంకటములు తెచ్చుకొనువారు మానవసంఘమునందు తఱచుగ చూపట్టుచునే యుందురు.

దుర్భావములను పెంచుకొను అల్పులున్నటులే సద్భావములను వృద్ధి చేసికొను ఘనులును కలరు. బాహ్యవస్తువులను చూచి వారు యెంతేని విజ్ఞానమును వడయుదురు. భక్తులు బాహ్యప్రపంచమునందు జగదీశుని లీలలను కాంచి మహదానంద మందుదురు. తమ్మెదుర్కొను సంఘటనములందు పరోక్షమందున్న జగదీశునిభావములను గ్రహించుట భక్తుల అభ్యాసము. ఒకకీడు తలపై బడినపుడు వారొనరించిన దుష్కృతియో వారి హృదయమున నుదయించిన దుర్భావమో తమకు దండన మొసగినదని వా రూహింతురు. ఆకీడు తమ భావిజీవనమున తమకు వెలు గిచ్చు యాచార్యుడని వారు యోజింతురు. సామాన్యవస్తువులనుండియు ఘోరాపదలనుండియు గురుతరభావములను వడబోయుట యందు భక్తులకు మంచి నేర్పుగలదు. వీరిభావములు చిరకాలము

నిలిచియుండును. అవి యితరుల మానసములందు దివ్యదేవాలయము లందలి చలింపని విగ్రహములట్లు నిలిచియుండును. ఆభావములే తమ్ము చింతన మొనరించిన వ్యక్తుల నైహిక ఆముష్మికజీవనములను తమ్ము పోలునవిగ చేసికొనును. మనుజుడు నశించునే కాని యాభావములు నశింపవు. మానవుడు తాను తలచినయట్లు కాగలడు. తుమ్మెదపై దృష్టి నిలిపిన పురుగు తుమ్మెదయగు ననియు అట్లే జగదీశునిపై మనసు నిలుపు నాతడు జగదీశు డగునని భ్రమర కీటకన్యాయము తెలుపుచున్నది. తాను కాంక్షించిన దానిని—అది యెట్టి దైనను-మానవుడు పొందితీరును. కావుననే రామకృష్ణ పరమహంస "మన మేదికోరుదుమో అదియే మనకు లభించుచున్నది. ఈ జన్మకూడ మనకట్లు లభించినదే కాని లభించిన వస్తువును మనము కోరినది కాదని భ్రాంతిపడి దానిపై మన మసహ్యము చూపుచున్నాము" అని వచించెను

ఉదయించిన మనసునందే గాక యెదుటివ్యక్తి మనసునందును యెదుటి ప్రదేశమందును భావము తనశక్తిని విజృంభింపజేయును. మునుల యాశ్రమములు భావమయములై శాంతిమయములై యుండుటకు హేతువు మునుల మానసములందలి ప్రశాంతభావము లచట ప్రవాలుటయే. అంతరంగమునకును బాహ్యావనికిని పరస్పరము సంబంధమున్నదని పలురీతుల తత్వజ్ఞులును కవులును నిరూపించియున్నారు. గోపాలభట్టుని కాలమునందే గాక యీ కాలమందును భావముయొక్క యీశక్తి దృగ్గోచరమగుచున్నది. రామకృష్ణ పరమహంస నిన్న మొన్నటివాడు. ఈతని సమకాలికు లింకను వంగదేశమందున్నారు. ఒకప్పుడు పరమహంస 'నాగ్' మహాశయునితో గలిసి గుఱ్ఱపుబండిమీద నెచటికో పోవుచుండెనట. తఱచుగా పరమహంస సమాధియందు ఆత్మవిస్మృతుడై యుండువాడు. బండిలో పయనము చేయుచు నాతిడట్టి తన్మయత్వమునకు లోనయ్యెనట.

భావశక్తి యద్భుతమై యున్నపుడు అది సముద్రతరంగములవలె యుప్పొంగును. వీచికాహృదయముతో పాటు సముద్రహృదయమును కదలిక నందును. భక్తునిహృదయమునం దుప్పొంగిన భావతరంగము ఆతడు మసలు వాతావరణమును సోకకమానదు. దీనిమహిమ యొక్కొక్కప్పుడు యదృశ్యమై యితరుల హృదయములందు తట్టును. వారపుడమందానందము నొందుదురు,

విశ్వేశ్వరాలయము ప్రవేశించినపుడు మనహృదయములును విశ్వేశ్వరనిలయము లగును. కైలాసమున కాలుపెట్టితిమని యానందింపక పోము. ఒక మహాపురుషుని యెదుట నిలిచినపుడు మనహృదయములు అవనతములై యాతని పాదసరోజములకు నమస్కరింపకపోవు. ఈయద్భుతము లన్నియు భావము నుండి పుట్టినవియే. గొప్ప గొప్ప దృశ్యములనుండియు మహాపురుషుల నుండియు భావతరంగము లుత్పన్నములై చెంతనున్న మానసములను ప్రకృతిని తాకును. ఇవి యొక్కొక్కప్పుడు అదృశ్యమై మానసములను తట్టును. ఒక్కొక్కప్పు డివి ప్రత్యక్షమై యెదుటివారిని యెదుటివస్తువులను తట్టును.

నాడు పరమహంస పయనము చేసినపుడు ప్రత్యక్షనిదర్శన మిట్టిది గోచరించినదట. బండి నడచుమార్గము చక్కనిది. దానిపై గతుగులులేవు. బండియందు దోషములేదు. బండివాడు పొగరుబోతుకాడు. గుఱ్ఱము గ్రుడ్డిది కాదు. చాలాకాలమునుండి బాగుగా బండిలాగుచునే యున్నది. పరమహంస తన్మయుడు కాగానే బండియును గుఱ్ఱమును తన్మయస్థితి నందినదట. నిముసములో బండి బోర్లపడి పోయెనట. బండివాడు నేలకూలినాడు. నాగ్ మహాశయుడును పిల్లిమంత్రము వేసినాడు. గుఱ్ఱము సకిలించుచు వెల్లకిలపడినది. తన్మయత్వము నుండి మేలుకాంచి పరమహంస దృశ్యమును విలోకించి చాల నొచ్చుకొనెనట. నాగ్ మహాశయుడు నవ్వుకొనెనట. రామకృష్ణుని భావశక్తి యాతనిబండిని కూడ తట్టినది.

రామకృష్ణుని భావశక్తి యెట్టిదో గోపాలభట్టుని భావశక్తియు నట్టిదే. ఈతనిశక్తి యెదుటి సాలిగ్రామవిగ్రహమును సోకినది. సంయముల భావములు సత్వరసంఘటనములను ప్రత్యక్షదృశ్యములను సృష్టించును. వీరికి వరప్రదాతలనియు శాపాయుధులనియు, పేరందులకే వచ్చినది. వీరాడిన దాటయు పాడినది పాటయు నెందులకయ్యెను? వీరి భావమందలి మహత్త్వము కతనం గదా! భట్టజీభావమహత్త్వము కతన సాలిగ్రామము సచ్చిదానందఘన స్వరూప దాల్చి కృష్ణవిగ్రహమై యెదుట ప్రత్యక్షమైనది.

ఇట్టి యద్భుతమే మఱొకమారు మధుర (బృందావనమునకును గోకులమునకును నడుమనున్నది. బృందావనమున కేడుమైళ్లు గోకులమునకును నింతే) యందు జరిగినదట. ఒకప్పుడు తులసీదాసు మధురకు పోయినాడట.

మథురయు బృందావనమును గోకులమును గోవర్ధనమును కృష్ణసంకీర్తనము లతో మాఱుమ్రోగుచుండును. తులసీదాసు రామభక్తుడు. అతడు మధుర కరిగి స్వామినిదర్శించుటకై యొక దేవళమున ప్రవేశించెను. ఎదుట గోచరించి నది శ్రీకృష్ణవిగ్రహము. తన యిలవేలుపైన రామచంద్రుడు గోచరించునని యాతడాశ చెందినాడు. ఎదుటనిలచి తులసీదాసు రామసంకీర్తనము చేయ దొడగినాడు. తోడనే కృష్ణభగవానుడు 'కుటిలభ్రూకటి తాన్యుడై' 'లసత్కో దండదివ్యాస్త్రుడై' 'చటులారిందముడై' 'ధీరుడై' 'శ్యామాంగుడై' న శ్రీరామచంద్రమూర్తి యైనాడట. తన దైవతమును గాంచి తులసీదాసు పర మానంద భరితమానసు డయ్యెనట.

శ్లో. "ఆలోల స్ఫుటరత్నకుండలధరం ధీరస్మితాలంకృతం
ఆధారాదిక చక్రమండలగతం ఆనందకందాంకురం
ఆవిర్భూత కృపాంతరంగ జలధిం అక్షాంతవర్ణాశ్రయం
ఆపన్నార్త నిదాఘమేఘనమయం రామం భజే తారకం"

---

32

# శ్రీ ఖో జేజీ స్వామి



" మ. తెలుకున్నిద్దపుఁ జెక్కుటద్దములపై ఘర్మాంకురంబూరగా
గలికాభోగపయోధరాంతర లసత్కాశ్మీరసంబంధ గం
ధిల వక్షస్థలుఁడై గృహీతఘనవేణీబంధుఁడై నెయ్యపుం
జెలియం జుంబనకేళిఁదేల్చుహరి నాచిత్తంబునం జెందెడున్ "

ఉత్తరహిందూస్థానమున పల్వురుభక్తు లుదయించినారు. అద్భుత మేధాసంపదగల మహాచార్యులు అందు జన్మింపలేదు. ఇట్టి యాచార్యులకు దక్షిణభరతదేశము పుట్టినిల్లు. మేధాసంపదయందు జగదీశునితో సముడని పించుకొనిన శ్రీశంకరాచార్యుడు దక్షిణసీమస్థుడే. విశిష్టాద్వైతమును బోధించిన రామానుజాచార్యుడును దక్షిణసీమస్థుడే. ఇక వల్లభాచార్యుడు-ఇతడును దక్షిణసీమవాసియే యనియు మీదుమిక్కిలి యాంధ్రుడు కూడననియు పరిశోధకులు కనుగొనగలిగిరి. గురునానక్, చైతన్యులు ఉత్తరసీమవాసులు. వీ రవలంబించినది భక్తియోగము. వీరు భక్తులయందు తలమానికములు. వీరి తెగవేఱు. మన దక్షిణదేశాచార్యుల తెగవేఱు. రామమోహన, రామకృష్ణ, రామతీర్థ, దయానంద, వివేకానంద, కేశవచంద్ర, దేవేంద్రనాథప్రభృతులు శంకరాదిగురువులకు నమస్కరించిన మహాపురుషులు. భక్తియోగము నభ్యసించిన మహనీయులే ఆర్యావర్తమున పెంపునొందిరి. ఇట్టివారిలో శ్రీఖోజేజీ స్వామి యొక్కరుడు. ఇతడు తనజీవనమునంతను హరిసంకీర్తనమున గడపినాడు. అవసానసమయ మాసన్నమగుట గ్రహించి యొకనాటి యుదయమున స్వామి తనశిష్యులను చెంతకుబిలచి వారితో నిట్లనియె. "వత్సలారా! ఇహలోకమునువీడి నేను వైకుంఠమునకు పోవలసిన సమయ మాసన్నమగుచున్నది. త్వరలోనే యీయాశ్రమమును మీకు వదలి నేను వెడలిపోవుదును. నేను వైకుంఠపురమునందు ప్రవేశింపగలిగితినో లేదో మీకు తెలియుటకై యొక సంకేతమును తెలుపుచున్నాను. నాఆత్మ వైకుంఠపురమున ప్రవేశించినతోడనే

యిందలి శంఖమును గంటమును, యితరవాద్యములును తమంతతాము మ్రోగును. ఆశుభధ్వని వినినపిదప మీరు నామృతదేహమును అంత్యక్రియలకై కొనిపొండు." ఇట్లు పలికి కొలది నిముసములలో స్వామిజీ ప్రాణములు వదలెను. వెంటనే యాశ్రమము శుభనాదముతో మారుమ్రోగునని శిష్యులు తలంచుచుండిరి. ఎంతసేపటికిని స్వామిజీ తెలిపిన మ్రోత కర్ణగోచరముకాలేదు. ఆశ్రమమునందలి వాద్యవస్తువులన్నియు నెచ్చటివచ్చట పడియున్నవి. శిష్యుల దుఃఖమునకు మేరలేకపోయెను. తమ యాచార్యుని జీవనవిధానమును వారు చాలకాలమునుండి పరికించుచుండిరి. అతడు నిర్మలహృదయుడనియు వారెఱుంగుదుగు. వైకుంఠమునకే యాతని యాత్మ యెగసిపోవునని వారు తలంచుచుండిరి. గురుపత్న్యుడును తనసద్గతిని గుర్తించి దాని సంకేతమును తెలిపినాడు. శిష్యులెంతోసేపు తడసిరి. ఎంతసేపు వేచికొనియున్నను శంఖారవముగాని, ఘంటారవముగాని వినంబడలేదు. దుఃఖితులైన యాతని శిష్యు లట్లు జరుగకపోవుటకు హేతువును గ్రహింపవలెనని యాతురపడిరి. అంతేవాసులయందు పెద్దయొకడు సమీపమునందొకపల్లెలో వసించుచుండెను. అతడు యోగసిద్ధి నందిన మహాత్ముడు. ఆచార్యునితో సముడనిపించుకొనినవాడు. భక్తవరేణ్యుడు. తమలో నిరువుర నాతనిపాలికంపి యాతని నాశ్రమమునకాహ్వానించిరి.

స్వామిజీ తన మరణోదంతమును తనయవసాన ముహూర్తమునకు కొలది నిముసములకు మున్న మాత్రమే తెలిపియుండుటచే వృత్తాంతమును పొరుగూరనున్న సోదరశిష్యునకు ఆశ్రమమునందున్న శిష్యులు తెలుపజాలరైరి. ఆచార్యుని మరణవార్తవిని యాశ్చర్యాన్వితుడై తనపాలికి వచ్చిన శిష్యులతో గలిసి యోగానందసరస్వతి స్వామియాశ్రమమున కరిగినాడు. ఆచార్యుని మృతకళేబరమును గాంచినాడు; ప్రణమిల్లినాడు; దుఃఖితులైన సోదర శిష్యులనుండి వృత్తాంతమంతయు వినినాడు.

యోగానంద సరస్వతి క్షణకాల మాలోచించినాడు. ఆశ్రమము నలువంకల విలోకించినాడు. సమీపమునందలి మామిడి చెట్టుపై కన్నులు నిలిపినాడు. పదంపడి యితర శిష్యుల నుద్దేశించి యాత డిట్లు పలికినాడు " నెచ్చెలులారా! మన యాచార్యుడు వైకుంఠపురమును ప్రవేశింప జాలక పోయెను. కావుననే యాతడు తెలిపిన విజయధ్వని యిందు వినంబడలేదు, ఇట్లు విపరీతముగా

జరుగుటకు కారణ మొకటి కలదు. దేహత్యాగ సమయమున జీవాత్మకు దేనిని గుఱించియైన భోగేచ్ఛ యుదయించెనేని తోడనే యది తనకోరిక తీర్చు కొనగలుగు తావున నందుల కనుకూలముగ నుండు శరీరమున ప్రవేశించును. మనసు సంపూర్ణముగా స్వాధీన మైనగాని—వాంఛలన్నియు ఆధ్యాత్మిక అగ్నియందు భస్మమయినగాని జీవాత్మ మరల మరల జన్మల నందవలసివచ్చును. ఈప్సితమును బట్టి బాహ్య జగత్తు గోచరించును. మనుష్య జన్మను బాగుగ పరికింపుడు. బాల్యకాలమున హృదయము పవిత్రమైనదై యుండును. యౌవన కౌమారములయందు హృదయము భోగేచ్ఛల తగిలియుండును. బాల్యదశ మారును. యౌవన కౌమార సమయములయందు వాంఛల కాటపందిరియై యుండును. ఈ వాంఛలు నిలుచునంతవఱకు నవి శరీరమునే కాంక్షించును. జన్మాంతమునకూడ వాంఛ మిగిలియే యున్నయెడల వేఱొకజన్మ వేఱొక శరీరము దానికై కనిపెట్టుకొనియుండుట రూఢియని నమ్ముడు. మన గురుదేవుడు మహాభక్తుడనుట నిస్సంశయము. కృష్ణభజనవలన తన కర్మనంతను నతడు పుటుక్కున త్రెంపుకొనజాలినాడు. అందు సంశయమేమియులేదు. స్వామిజీ యీ వృక్షతలమున పరుండి ప్రాణములు వదలెనుగదా! అంత్యముహూర్త మున నాతనిదృష్టి అల్లదె యీ కానుపించు మామిడిపండుపై పడినది. పండు మీదివాంఛ యాతని జీవాత్మను బంధించినది. అందుచేత నతడు వేఱొకజన్మ మెత్తవలసి వచ్చెను. గురుజీ వాంఛ పండుమీదనే వ్రాలినది కావున ఆతని మనస్సు పండునంటియున్నది. ఆతని పునర్జన్మయును అందేయున్నది. ఆపండును కోసి యిటు తెండు. దానిని రెండుముక్కలుచేసి చూడుడు. మన గురుస్వామి పురుగై అందుండుట గోచరమగును.”

ఆ వాక్కులువిని శిష్యు లాశ్చర్యాన్వితులై యామామిడిచెట్టెక్కి పదిల ముగా పండునుకోసి క్రిందికి తెచ్చిరి. యోగానందసరస్వతి మిక్కిలి జాగరూక తతో పండును రెండుఖండములు చేసినాడు. చేయుటయు నాతడనిన పురుగందు గన్పట్టుటయు జరిగెను. కాని తోడనే యాపురుగు ప్రాణములు విడిచెను. నీల మేఘశ్యామల శరీరుండును చతుర్భుజుండును శంఖచక్ర గదాపద్మధారియు నైన వైకుంఠపతి దివ్యతేజమును విరజిమ్ముచు విమానమున కూర్చుండి తన తేజ ముతో నలుదిక్కులు ప్రకాశించునట్లుచేసి కొంతసేపటిలో అంతర్ధానుడయ్యెను.

తోడనే యాశ్రమమునందలి శంఖమును ఘంటమును తక్కుంగల వాద్య విశేషములును తమంత తాము మ్రోగి చుట్టుప్రక్కలు ప్రతిధ్వనింపజేసినవి. ఆచార్యశేఖరుని స్వర్గారోహణ సంకేతము పూర్ణమగుటగాంచి పట్టరాని యానందమున శిష్యులెల్లరును హరినామ సంకీర్తనము గావించిరి. మధుర గీతములు పాడుచు నృత్యముచేయుచు నాచార్యుని మృతకళేబరమునకు వా రంత్యక్రియలు జరిపిరి.

ఈ చరిత్ర మిగుల పవిత్రమైనది. ఇది హిందూమత మహత్త్వమును వ్యక్తపఱచుచున్నది. మనుష్యజన్మయందలి రహస్యముల నిది వెల్లడిచేయు చున్నది. ముక్తికోరువారికి మంచి దృష్టాంతమును చూపుచున్నది. ఈ విష యముల నుపదేశము మూలముననను నుదాహరణము మూలమునను బోధింప గలిగినది హిందూమత మొక్కటియే. ఇది సనాతనమైనది. దీనిపుట్టువు మానవునితో సంబంధించి యుండలేదు. జగదీశుని తొలిపలుకులతో నిది పుట్టినది. మనుష్యుడూహింపజాలని, మనుష్యుడు ఋజువుచేయజాలని విషయము లెన్నో జీవాత్మ పరమాత్మల చరిత్రములందున్నవి. ఇవి తెలుసుకొనుటకు మను ష్యునికి శక్తిచాలదు.

శ్రీ ఖోజేజీస్వామి చరిత్రము మిగుల చిన్నది. అయినను పునర్జన్మను గుఱించిన విషయము కలది కావున దీనికి సంబంధించిన కర్మసూత్రమును సంక్షేపముగా నిందు చర్చించుట యుచితము.

జీవాత్మ మోక్షమందుటకు ముందు, సంసారమునుండి యది దాటిపో వలెను. గతజన్మమందలి క్రియలును భావములును గతజన్మతోనే చావక తరు వాతి పుట్టువున నవి తమ ఫలితములను విజృంభింపజేయును. ఈ విషయమునే 'కర్మసూత్రము' వివరించుచున్నది. ఇది హిందూమతముయొక్క హృదయ మని చెప్పినను చెప్పవచ్చును. కర్మసూత్రము బాహ్యప్రపంచమునందు తోచు హేతు సూత్రమువంటిది. జగదీశు డెందో యుండి నేరములువిని తీర్పులు జారీ చేయడు. అత డంతరంగమందే యున్నాడు. మనుష్యక్రియలను మనుష్య భావములను నతడనుక్షణము వీక్షించుచునే యుండును. అతని నిబంధనలు మనుష్యజీవనమును నంటియుండి యెప్పటికప్పుడు పనిచేయుచుండును. ప్రకృతి సూత్రములట్లు ఈ నిబంధనలు తిరుగులేనివై యుండును. ఈ నిబంధనలవల

ననే మన జీవనములు నడచునుగాని జగదీశుడనువానియొక్క నిరంకుశత్వము వలన గాని చపలత్వమువలన గాని కాదు. వీని క్రియ జీవాత్మను సోకుచుండును. ఈ సోకుడువలన చలింపజేయబడిన మనుష్యకర్మలు ఒక పుట్టువుతో కడముట్టక మనసునందు తమ చిహ్నములను ముద్రించును. ఈ చిహ్నమునే మనశాస్త్రములు "అదృష్ట" మని వాకొనును.

తన కర్మను తాను పూర్తిగా త్రెంపుకొని నపుడుగాని యెన్ని జన్మలెత్తినను మానవుడు వాని పట్టునుండి తొలగిపోజాలడు. కారాగృహభటునివలె అది వాని వెన్నంటి చరించుచునే యుండును. ఒక ఖైదునుండి వేఱొకఖైదునకు పోవుఖైదీ యెట్లో యొకజన్మనుండి వేఱొకజన్మకు చను కర్మబద్ధుడగు మనుజుడును నట్లే. కర్మ అంతరించిన ముహూర్తమున కారాముక్తుడైన వానివలె కర్మయుక్తుడు జన్మపరంపరల యందు ప్రవేశింపక యిచ్చవచ్చిన యట్లు చని స్వస్థానమును చేరుకొనును (జీవాత్మయొక్క స్వస్థానము పరమాత్మయుండు స్థలమే.)

కర్మసూత్రము మనుష్యనిర్మితసూత్రము వంటిదికాదు. మనుష్యసూత్రములు మనుష్యుని కోరికపై నాధారపడియుండును. అవి మారవచ్చును. రద్దు కావచ్చును: కర్మసూత్రము ప్రకృతిసూత్రము వంటిదిగాన తాను చేయవలసిన పనిని చేసితీరును. తనసత్తువ నెఱుగడని కాని తనయెడల నొకనికి గుఱిలేదని కాని యెవ్వనిని యది పరిత్యజింపదు. అగ్నిగుణము నెఱుగక పసిబాలుడు మంటలో చేయిపెట్టినపుడు అతనిచేయి కాలకుండునా! పానకమని విసము త్రాగు నాతడు చావక బ్రతికియుండునా? వేఱొకహేతువు అడ్డు రానంతవఱకు ఒకహేతువు ఒకే ఫలితమును పుట్టించును. హేతుఫలితములు అవినాభావసంబంధము కలవి. రెండును నొక్కడే యని తెలిపినను తెలుపవచ్చును.

మనుష్యకర్మలు వేర్వేఱు కావుననే మనుష్యగుణములందును ప్రజ్ఞలందును జీవనములందును వ్యత్యాసములు గోచరించుచుండును. బోధనమువలన గాని సహవాసమువలనగాని స్థలసాంగత్యమువలన గాని పుట్టనిగుణములు పూర్వజన్మయందలి సంస్కారముల నుండియు అనుభవములనుండియు వెడలినవి కావా? స్మృతికి రాకున్నను యివి మనుజునియం దుండి తీరును. శైశవమందే అద్భుతప్రజ్ఞ చూపువారుందురు. కొఱగానివారు నుందురు. సర్వాంగసుందరు

లుందురు. పుట్టుగ్రుడ్డులుందురు. సుఖులుందురు. దుఃఖితులుందురు. పూర్వ జన్మమందలి ప్రత్యేకకర్మలే ప్రస్తుతజన్మమందలి ప్రత్యేకపరిస్థితులకు కారణము లగును.

వేదప్రబోధితమైన యీ కర్మసూత్రములోని సత్యమును ప్రజ్ఞావంతులైన ప్రాచీనమహాఋషులు పలువురు ప్రత్యక్షముగ గాంచగలిగిరి. వీరు పూర్వ జన్మజ్ఞానము కలిగియుండిరని మన శాస్త్రములు తెలుపుచున్నవి.

ఈ గ్రంథపాఠకులు శ్రీ విశుద్ధానందస్వామి జీవనమున కర్మసూత్రము యొక్క ప్రత్యక్షనిదర్శన మెట్లు గోచరించినదో యెఱిగియే యుందురు. ఇట్టి నిదర్శనము కొలదియేండ్లకు ముందు సంయుక్తరాష్ట్రములందలి బెరెల్లీలో జరిగి నది. ఆఱేండ్లబాలుడు డొకడు తన దారాసుతులను గుఱించియు మడిమాన్య ములను గుఱించియు కూడబెట్టిన ధనమునుగుఱించియు పలుమాఱు పలుకు చుండువాడట. అతని తలిదండ్రులు ఒకనాడు బాలకుడు చూపిన గ్రామము లోని యింటికాతనిని గొంపోయిరి. బాలకుడు వెంటనే లోనికేగి మఱుగు చోటులందు తానుంచిన ధనమును నితరవస్తువులను వెలుపలికి తీసి చూపి గృహమందలి వారిని సన్నిహితబంధువు లట్లు పిలువదొడగినాడట. పూర్వ జన్మముయొక్క అద్భుతమైన అట్టి ప్రత్యక్షనిదర్శనముగాంచి యెల్లఱు నాశ్చర్య పడిరట.

మనుష్యకర్మను హిందూశాస్త్రములు మూడువిధములుగ విభాగించి నవి. (1) ప్రారబ్ధము (2) సంచితము (3) ఆగామి. ప్రారబ్ధకర్మను మానవుడు ప్రస్తుతజన్మయందు అనుభవించి తీరవలెను. ఎంత పెనుగులాడినను ఈ కర్మ అతనిని విడిచిపోదు. అనుభవమువలననే ప్రారబ్ధకర్మము తఱిగిపోవును. పూర్వ జన్మలయందు మూటకట్టబడిన కర్మము సంచితము. ఇది ప్రారబ్ధకర్మము వంటిదికాదు. గట్టి ప్రయత్నమువలన దురభ్యాసములను పోద్రోలవచ్చును. సత్క్రియల వైపునకు మనసును మరలింపవచ్చును. అనుతాపమువలనను ప్రాయశ్చిత్తమువలనను సత్కర్మలవలనను సంచితకర్మను మాపుచేయవచ్చును. జ్ఞానమను నగ్నిచే నిది పూర్ణముగా దగ్ధముకాగలదు. ప్రస్తుతజన్మయందు మూటకట్టబడుకర్మ ఆగామి కర్మ. దానిఫలితములను మానవుడు రాబోవు జన్మ యందు అనుభవించి తీరును. మనసున దుశ్చింతలకు చోటిచ్చి దుష్క్రియలు

చేయు నాతడు జన్మపరంపరలను సృష్టించుకొనును. సత్క్రియలందారితేఱు నాతడు పరిపూర్ణత్వము దెస నగ్రసరుడగును. ఈతని సంసారచక్ర పరిభ్రమణము కట్టుపడిపోవును. ఈతనికర్మ బంధము పుటుక్కున తెగిపోవును.

ఈ మూడుతీరులకర్మను బ్యాంకులో నొకడు నిలువ వేసికొను ధనముసకు పోల్చవచ్చును. నిల్వపైకము సంచితధనము. దీనిని సంచితధన మన వచ్చును. బ్యాంకులోని నిల్వ మొత్తమునుండి యొకడు చేతిఖర్చు కొఱకై కొంతపైకమును తీసివేయుచుండునుగదా! వెచ్చమగుచుండు నీ ధనము అనుభవింపబడు ప్రారబ్ధకర్మ యనవచ్చును. బ్యాంకులోని సొమ్మునకితడు కొంతపైకమును చేర్చుచుండును గదా! చేర్చబడు నీ ధనము ఆగామికర్మను బోలును. కర్మచ్యుతుడు కాగోరు నతడు బ్యాంకుకాతాను పూర్తిగా తీసివేసికొనవలెను. సంచితమగుచున్న పైకమునుండి ప్రస్తుతము జన్మమెత్తినాడు కావున కొంత ప్రారబ్ధకర్మ తప్పని సరిగా ఈతని జేరును. నూతనకర్మకు చేయి చేసికొనిన యెడల ఇందాగామికర్మ చేరదు. ఇక మిగిలియున్న సంచితకర్మ ఖర్చుగాక నిలువదు. జ్ఞానముచే నిది నాశనమగును. ఆగామిసంచిత కర్మలు ఈ తీఱున నశింపగానే తప్పనిసరిగ వ్యక్తినంటిన ప్రారబ్ధకర్మ జగతియందు దత డిహలీలలు కడపినంతనే తనంత తాను విడివడిపోవును. కర్మబారినుండి విడివడిన జీవాత్మ స్వస్థలమగు పరంధామమును చేరుకొనును.

కర్మసూత్రమునందలి మహత్త్వము నెఱుగనివారు ఇది జీవాత్మయొక్క వృద్ధిని అరికట్టుననియు ఇది జగదీశుని తలకు నిర్దాక్షిణ్యమును కట్టుననియు ఇది నమ్మదగినది కాదనియు చెప్పుదురు. కాని కర్మసూత్రము జీవాత్మయొక్క వృద్ధికై ఏర్పడినది. ఆత్మవృద్ధి యొకజన్మతో రాదు. ఎన్నెనితరగతులు దాటిన గాని ఒకడు సంపూర్ణవిద్యావంతుడు కాజాలనట్లు ఒక్కటిగాక పెక్కుపుట్టువులు దాటినగాని ఒకడు పూర్ణత్వసిద్ధి నందజాలడు. కర్మసూత్రము దండన విధిని వ్యక్తీకరింపదు. విద్యాభివృద్ధిని బోలు ఆత్మాభివృద్ధి నదిబోధించుచున్నది. ఆచార్యునిసద్బోధవలననే గాక స్వప్రయత్నమువలన కూడ విద్యార్థి యభివృద్ధి సుసాధ్యమగును. తోటమాలి మడులయందు నీరుపోయును. మొలకెత్తుటకై విత్తనముల కాతడు సహాయ మొనరించును. కాని విత్తనములు తమ ప్రత్యేకగుణమునుబట్టి తమ సహజగుణమునుబట్టి వృద్ధియగును. శ్రీకృష్ణుడు

వనమాలి ఇది జగత్ప్రసిద్ధము. ఈతని ఆదరమును సాహాయ్యమును జీవులు పడయుచునే యుందురు. జీవుల సహనశక్తి జీవుల స్వప్రయత్నము ఉన్నతటి దైవసహాయము వారి నుద్ధరించి తీరును.

విశ్వమండలము నియమబద్ధమయినది. సంబంధరహితకార్యములు ఇందు కానరావు. సూర్యచంద్ర నక్షత్రాదులు నియమానుసారముగా పనిచేయును. ఋతువులు తమసూత్రములను త్రెంచుకొని తమ హద్దులు మీరటి యొక్క మొగి జొరబడుకొని రావు. సర్వసూత్రములకు సర్వకర్మలకు జగదీశ్వరుడు అధ్యక్షుడు. కావుననే మనశాస్త్రము లాతనిని "కర్మాధ్యక్షు" డని పేర్కొనుచున్నవి.

నియమానుసారముగా నడచు వసుంధరయందు మానవుడు నియమ పాలన మొనరించియే మసలవలెను. అతనికి స్వేచ్ఛావిహారము లేదుగాని స్వాతంత్ర్యమున్నది. ఈ స్వాతంత్ర్యము లేకున్న నైతికజీవన మసాధ్యమై యుండును. తనశరీరమునుండి మానవుడు తన్నుకొని యెందేని పోజాలడు. ఈ కర్మసూత్రమును భగవద్గీత స్పష్టముగ ప్రబోధించుచున్నది. గీత మనుష్యశరీరమును పొలముతో పోల్చినది. ఈ పొలము ఆత్మయను వ్యవసాయదారున కీయబడినది. భూమి పరిమాణమును భూమిగుణమును భూమికి తటస్థించు శీతోష్ణపరిణామములును ముందే నిర్దిష్టమైనవి. కాని వ్యవసాయదారు తన యిష్టవచ్చిన చొప్పున నేల దున్నుకొనగలడు. అందు ఫలవంతమగు ఎరువును వేయగలడు. తగిన విత్తనములందు చల్లి ఫలసాయము నందగలడు. అట్లుగాక తనపొలమును నిర్లక్ష్యముగా వదలివేసి దానిని బీడుగానో యెడారిగానో చేయగలడు. మనుష్యుడిట్టి సేద్యకాడు. కొన్ని నిబంధనలును కొన్ని స్వేచ్ఛాంశములును యిందున్నవి. కర్మసూత్రము వీనినన్నింటిని పాటించును. ఈ విషయమునే యింకొకరీతిగా తెలుపవచ్చును. మనుష్యజన్మయందు బంధనమున్నది. ఈ జన్మ కట్టురాటునకు కట్టబడిన గోవు వంటిది. తన త్రాడును త్రెంచుకొని గుంజనుండి పాటిపోజాలదు. త్రాడు ననుసరించి కొంత మేరమాత్రమా గోవు సంచరింపవచ్చును. మనుజుడును తన జన్మకిట్టులే కట్టబడియుండును, ఆతనికి కొంత స్వాతంత్ర్యమున్నది తన స్వాతంత్ర్యము ననుసరించి మనుజుడు ముక్తికై కృషిసలుపవలెను. కృషియొక్క ఫలితముగా నతడు కర్మసూత్రము నుండి వెడలిపోవును.

ఇంతియేకాదు. తన యత్నముల మూలమున సేద్యకాడు తన ఫలసాయముయొక్క పరిమితిని గుణమును అధికము చేసికొని తన బోధనలవలనను తన దృష్టాంతమువలనను సమీపమందలి వేఱొక సేద్యకాని పంటలను కూడ పెంపొందించునట్లు తన కృషిద్వారా మనుజుడు వేఱొక వ్యక్తికి సహాయపడ గలడు. ఈరెండవవ్యక్తి పూర్వజన్మమున కొంత సత్కర్మ చేసియుండినయెడల ఆతని యత్నముల కిట్టి సహాయము చేకూఱును. మనుజుడు తన సంఘమునుండి త్రెంచుకొని పోజాలడు. ఈతని జీవనమునకును సంఘజీవనమునకును దగ్గిర సంబంధమున్నది. ఈతనికృషి సంఘాభ్యుదయమునకు తోడుపడక మానదు.

ఈకృషి వ్యక్తిని ఆధ్యాత్మిక ప్రపంచమున నిలుపును. అచ్చట కర్మ సూత్రమునకు తావులేదు. మనజుని కర్మనుండియు జన్మనుండియు విముక్తుని గావించునది నిష్కామకర్మ. కృష్ణపరమాత్మ వాక్కులను గమనింపుడు.

“ నీవేమి చేయుదువో నీవేమి భుజింతువో నీవేమి యొసగెదవో నీవెట్టి కఠోరవ్రతములు సలుపుదువో, వాని నన్నింటిని నాకర్పింపుము ”

“ అట్లొనరించితివేని సత్ఫల దుష్ఫలములనిచ్చు క్రియలయొక్క సంకెలల నుండి విడివడుదువు. త్యాగముపై నిశ్చలభావముతో బుద్ధి నిలిపితివేని నీవు ముక్తుడవై నాకడకు వత్తువు ”

మోక్షాపేక్షులగువారు పాపమును కాంక్షింపనట్లే స్వర్గమునుకూడ కాంక్షింపరు. ఈరెంటిని మించిన ముక్తిమాత్రమే వారు సర్వదా కోరుదురు. పొందుటకు ప్రయత్నింతురు. ఈయత్నములు సలిపినవారిలో శ్రీఖోజేజీస్వామి యొకడు. అవసానకాలమందు మామిడిపండుపై ఆతనిదృష్టి పడుట దోష మైనది. ఈవాంఛ ఆతని జీవాత్మకు క్రొత్తసంకెలయయినది. కాని యల్పమైన యీ ఆగామికర్మ పరువు బ్రదుకున ప్రారబ్ధకర్మమై దానితో నంతమయ్యెను. కర్మచ్యుతుడైన యనంతరమే యతడు ముక్తినందెను. ఆతని జీవాత్మయే విజయధ్వానము సలిపినది. భక్తుని ముక్తికై భగవంతుడు డాతునపాటున వేచియుండుననియు ముక్తిముహూర్తము రాగానే యాతని తనకౌగిట జేర్చుకొనుననియు తెలుపుటకే విమానోదంతము వివరింపబడినది. పరమపావనమైన ఈ చరిత్ర మందలి పరమార్థమును పాఠకులు గ్రహింతురుగాక !

---

## ౩౭

# శ్రీ లాలాచార్యస్వామి



ఉ. చక్కని మోముతోఁ జెలిమిసల్పెడు ముద్దుల కోడిగంబుతోఁ
జొక్కపు నవ్వుతోఁ బెళుకుచూపులతోఁ దమిఁగొల్పు బాలకుం
గ్రక్కున నక్కఁజేర్చుకొని కన్నులపండువుగా మనంబులో
నక్కరదీరఁ గాంచెద నహర్నిశమున్ వసుదేవభాగ్యమున్.

లాలాచార్యుడు శ్రీరామానుజాచార్యుని యల్లుడు. గురుభక్తిపరాయణుడు. నిర్మలహృదయుడు. వైష్ణవులందు ప్రసిద్ధిచెందినవాడు. గురువాక్యముల నతడు దైవవాక్కులవలె గ్రహించుచుండువాడు. వైష్ణవసోదరులయెడల విశేషానురాగము గలిగి ప్రవర్తించుచుండువాడు.

ఒకనాడు లాలాచార్యుడు నదీతీరమున పచారు చేయుచుండెను. అప్పుడొక శవము నదీప్రవాహమున కొట్టుకొని పోవుచుండెను. ఆచార్యుడు భయకంపితుడై శవముపై దృష్టినిలిపినాడు. శవశరీరమున విరివిగ నామములు దిద్దబడియుండెను. "ఆహా! ఈ నిర్భాగ్యు డెవ్వరో కదా! వాలకము చూడ నితడు వైష్ణవునివలె గన్పించుచున్నాడు. ఈతడేదేని ప్రమాదమువలన నదిలోపడి యుండును. ఏ దిక్కునులేక శవము నదిలో కొట్టుకొనిపోవుచున్నది. దీని కంత్యక్రియలు సలిపి పుణ్యము కట్టుకొందు" నని యాచార్యుడు తనలో వితర్కించి నది కడ్డముగా జని యీదుకొనిపోయి శవమునొడ్డునకు లాగుకొని వచ్చినాడు. వైష్ణవమతాచారప్రకారముగా నంత్యసంస్కారములు నెఱపదలచి శవము నతడు మూపుననిడుకొని నిజగృహమున కరిగినాడు. అరిగి పుష్పశయ్యయొకటి ఏర్పఱచి శవమును దానిపై పరుండబెట్టి విహితక్రియలుచేసి హరినామసంకీర్తనము సలుపుచు దాని నతడు నదీతీరమునకు గొంపోయినాడు. అచట నంత్యక్రియలు నిర్వహించిన పిదప నతడు గృహమునకు మరలినాడు.

అపరిచితుని యాత్మశాంతికై శ్రాద్ధమును జరిపి నానావిధపదార్థములను వండించి లాలాచార్యుడు బంధుమిత్రులను భోజనమునకు పిలచినాడు.

ఎందుండియో కొట్టుకొనివచ్చిన శవమును తెచ్చి శ్రాద్ధకర్మచేసిన లాలాచార్యుని సాహసమునకు పల్వురు కోపించిరి. ఆతని గృహమున భోజన మొనరించినయెడల తమజాతి సంగలో కలియునని భయపడి వారా భోజనమునకు పోలేదు. తోడివైష్ణవులు తిట్టిపోయసాగిరి.

లాలాచార్యు డీయుదంతము సంతయు గురువర్యున కెఱింగించెను. రామానుజస్వామి "వత్సా! నీ చరిత్రమునందలి మహిమను నీయాచరణమందలి మహాత్త్వమును మూర్ఖులు, నహంకారులైన వీరు గ్రహింపజాలరైరి. తమ తప్పిదమును వీరు త్వరలోనే గుర్తించి పశ్చాత్తాపచిత్తులగుదురు. నీవే మియు విచారింపకుము. నీవొనరించిన కార్యము దొడ్డది. సంతసచిత్తుడవై యింటికిపొ" మ్మని యెల్లు నుద్దేశించి పలికెను.

గురువర్యుని వాక్కులవలన చింతబాసి లాలాచార్యుడు గృహమునకు మరలినాడు. మరలుసరికి నిజగృహమున ఆతడొక యద్భుతదృశ్యమును గాంచినాడు. ఎందఱో యతిథులు దివ్యకాంతి సందీప్త శరీరులై యాతనియింట దోచిరి. పరమవైష్ణవ శిఖామణులట్లు వారెల్లఱు పట్టెనామములు దిద్దియుండిరి. మధురమంజులరవమున విష్ణునామసంకీర్తనము కావింపదొడగిరి. తన్మయ నృత్యము చేయుచుండిరి. అనంతర మింటనున్న భక్ష్యభోజ్యలేహ్యచోష్యములను వారు కడుపార నారగించిరి. ఇందు తన గురువర్యుని మహాత్త్వమే దేని యుండునని లాలాచార్యుడు గ్రహించినాడు. ఆతనిగృహము స్వర్గనిలయమై యుండుట విలోకించి యూరివారందఱు నచ్చట గుమికూడిరి. దివ్యసుందర విగ్రహులు గృహమున మహోత్సవమున నోలలాడుచు విందారగించుట చూచి మిగుల నబ్బురపడిరి. తమ్ము లాలాచార్యు డెంతవేడినను ఆతని వేడికోలు మన్నింపక తులువయని యాతని తిట్టి ఇపుడాతడు వైకుంఠమందలి దేవత యట్లు తోచినంతనే నిశ్చేష్టులై కొంతతడ వాయద్భుతదృశ్యమును విలోకించి తా మొనరించిన యపరాధమునకు తమ్ము తాము నిందించుకొని యూరివారాతని పదములకు ప్రణమిల్లి దోషము మన్నింపుమని వేడికొనిరి. వేడుకొనుటయు నతడు "సోదరులారా! మీరు వగవం బనిలేదు. మీరీమహాసీయుల యుచ్ఛిష్టమును భజింతురేని యెల్లదుఃఖముల నుండియు విముక్తులయ్యెదరు. వైష్ణవుల నారాధింపుడు. పరమానందసాగరమున నీదులాడి పదంపడి పరమ

పదమును పడయుదురు" అనియెను. భక్తిపూరితమానసులై వారట్లే సలిపిరి. వారిహృదయమందలి గర్వమును దంభమును దూరీభూతమాయెను. లాలాచార్యుని కృపాదృష్టివలన వారిహృదయసరోజములు వికసించెను. సాధుసాంగత్యమందలి అమృతమిట్టిదని గ్రహించి తనివారా దానిగ్రోలి వారు ధన్యాత్ములైరి.

ఈకథయందు మన దృష్టి నాకర్షించినది అనాధశవసేవ. మృతకళేబరము వైష్ణవుని దగుటవలన లాలాచార్యుడు, విధి యుక్తముగ దాని కంత్యక్రియలు నెఱపినాడని మనము తలప జెల్లదు. మహాభక్తుడగువాని హృదయమున నెల్లఱకును చోటున్నది. ఈతడు తనప్రేమ కౌగిటి కెల్లర నాహ్వానించును.

సేవాధర్మమందలి మహత్త్వమును హిందూధర్మము గ్రహించినట్లు మఱేమతధర్మమును గ్రహింపలేదు. ఒక్కజీవరాసులయెడల నేకాదు. నిర్జీవరాసుల యెడలను కూడ నెనరు చూపవలయునని యీ హిందూధర్మము బోధించుచున్నది. 'అనాధప్రేత సంస్కారం కోటియజ్ఞఫలం లభేత్' యజ్ఞముకంటె సేవ ఘనమని తెలుపు మతముయొక్క దృష్టి యెంత విశాలమైనదో పరికింపుడు. ఇట్టిసేవగాంచి పరమాత్ముడు పరమహంస పగిది నృత్యముగావించును. ఈసేవయందలి మహత్త్వమును తేటపఱచుట కొఱకే జగదీశుడు రామానుజుని వేడికోలు నిమిత్తమాత్రము చేసికొని యతిథులను తృటిలో లాలాచార్యుని ఇంటికి పంపినాడు. వీరినివైష్ణవు లనినంత మాత్రమున నొకమత సంప్రదాయము లోని వారని తలప జెల్లదు. విష్ణుభక్తు లందఱును; జగదీశుని గొలుచువారందఱును వైష్ణవులే. ఆచార్యునియింట విందారగింప పరుగులిడుచు వచ్చినవారందఱును మాయవలన పుట్టినవారని తలపరాదు. పెక్కురూపములు దాల్చిన జగదీశుడే అచటకిచని లాలాచార్యుని చేతియన్నము గుడిచిరనుట నిక్కువము. లేకున్న నీయతిథులలో ప్రధానుడు విష్ణువై యుండ నమరులతని ననుసరించి విందులో పాల్గొని యుందురు. జగదీశు డున్న చోట భక్తగణముండును. శ్రీరాముని జేరిన కోతులును, కృష్ణునంటిన గోపికలును, దైవతము ప్రాపుగొనిన మహాఋషులును నీ శ్రేణియందలి వారే. పలువురు మనుజులంధులై యుండి జాతిభేదములనియు మతభేదములనియు విఱ్ఱవీగుచుండ వీరు తాకనికులమును సోకుటకును వీరు ముట్టనివస్తువును అక్కున జేర్చుకొనుటకును,

'ఛీ' యని వీరు కసరికొట్టిన, తన్ని పాఱవేసిన వారియడుగుదమ్ముల్లొత్తుట కును దాసులకు దాసుడని చెప్పుకొనుచు జగదీశుడు ముదంజ వేయును. ఈ యద్భుత సత్యమును ప్రపంచమందలి పెక్కు మతములు పెక్కు దృష్టాంతము లందు నిరూపించుచున్నవి.

అజ్ఞానియు దంభముచే నిండినవాడును అంధునిబోలును. తాను చేర వలసిన తావు దివ్యక్షేత్రమయ్యు కన్నులు కప్పియుండుటచే నది కూడని తావ నియు తానున్నచోటు బురదచే నండియున్నదైనను అది పుణ్యక్షేత్రమనియును యోజించి అజ్ఞానుఢంధరకారమందే సలిచియుండ కాంక్షించును. మానవ సంఘము పలువు రజ్ఞానులచే నిండియున్నది.

ప్రబోధముకంటె దృష్టాంతము ఘనతరమైనది. దివ్యవైష్ణవుల దృష్టాంతము గ్రామవాసుల మనసున మార్పుగొల్పినది. ఆ దివ్యవైష్ణవులు సేవించు మహితాదర్శమును కొంత వీరు గ్రహించిరనుటకు వీరి యుచ్ఛిష్టసేవనమే నిదర్శనము. భక్తిభావముచే నిండిన యుచ్ఛిష్టము దివ్యమగు పరమాన్నము కంటెను మహత్తరమైనది. మధురమైనది. నిరుపేదరాలొకర్తుక కూడని యన్న మును కృష్ణునకు నైవేద్యముగా నొసంగబోయి అట్టియన్నము నందుల కుప యోగింప నిచ్ఛగింపక నొకప్రక్క విడిచినేయ సదృశ్యుడై యున్న కృష్ణుడు తన నోటినుండి ముద్దరాలెనని వగచినాడట. భావముగల కూడు భవ్యమగు గుణముకలది. శబరి యిచ్చిన ఎంగిలిపండులు శ్రీరామునకు మధురాహార మయ్యెను. దివ్యాతిథులవలన మధురభావపూరితమగు నాహారము నంది యూరి వా రానందించిరి.

శా. నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ గాఢంబుగా సాగనీ
ఘాతం బప్పుడు పొందనీ నియతిమై కానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబు దప్పరుగదా నిత్యంబు ధీరోత్తముల్.

## ౩౯

# శ్రీ గుహరాజు



మ. " సరసీజాయతపత్రనేత్రు విలసత్ సౌందర్యపాత్రుఁ సుధా
కరబింబానను నీలతోయధర సద్గాత్రున్ ధరాపుత్రికా
వరుఁ గోదండముఖాయుధాశ్రితభుజున్ వందారుమందారు శ్రీ
కరుఁడౌ రాముని రాఘవున్ రఘువరున్ కాంక్షించి సేవించెదన్. "

పితృవాక్యపరిపాలనమునకై రఘుకులతిలకుడు సీతాలక్ష్మణసహితుడై దండకారణ్యమున కరిగెను. చండాలవంశపావనుడైన గుహరాజు రామచంద్ర మూర్తిని మార్గమధ్యమున గంగాతీరమున కలిసికొని ఆతని సేవించెను. రాముడు సంతోషచిత్తుడై యాతని యాతిథ్యమును స్వీకరించెను. సౌందర్యనిధానమైన రాముని జూచినంతనే గుహునిమనసు భక్తిప్రేమలచే నిండిపోయెను. రాముని యవస్థకు మిగుల చింతించి "నాయనా! సుకుమారుడవు. ముండ్లతో నిండిన తెరువులబడి చలికిని ఎండకును వానకును దేహము నప్పగించి క్రూరములగు మృగములు గలచోటుల తిరుగుచున్నావు. కమలముకంటె సుకుమారమైన శరీరముగల యీ తల్లి నీతో మసలుచు కష్టపడుచున్నది. సుకుమారదేహుడు నీ తమ్ముడు నీతో గలసి శ్రమలందుచున్నాడు. నాయనా! మీ కష్టములు నా గుండెల తల్లడిల జేయుచున్నవి. మీ కీ పాట్లు పడనేల? నా యింటికివచ్చి నాతో వసింపుడు. అనుదినము మిమ్ములను సేవించి నన్ను ధన్యుని గానిమ్ము" అని గుహుడు దీనుడై సీతాపతితో పలికెను. గుహుని ఆలింగనపాశమున బద్ధునిజేసి శ్రీరామచంద్రుడు అతని దుఃఖము నపనయింప బహుభంగుల ప్రయత్నించెను. కాని గుహుడు "తండ్రీ! నా నిక్కంపు స్నేహితుడవు. నా దేహమును నా ప్రాణమును నాకు కలదాని నంతయు నీకు సమర్పించెదను. నా రాజ్యమును నా పరివారమును నా సర్వస్వమును నీ చరణ సరోజముల చెంత నివేదన మొనరించెదను" అని పలికి గుహుడు శ్రీరామునకు,

"వనమూల ఫలములు వలయువస్తువులు
కనకాంబరాదులు కానుకలిచ్చి
వినయవిధేయుడై వినతులొనర్చె".

(శ్రీరంగనాథరామాయణము)

శ్రీరామచంద్రు డందులకు చిరునవ్వు నవ్వి నెచ్చెలీ! నాకీ కానుకలును వివిధభోజ్యములును ఏల? ఫలములును కందమూలములను మాత్రము పదునాలుగేండ్లు తినవలయునను నియమము నాకు కలదు. ఈగడువు కడచిన పిదప అనంతానందముతో నీ భక్తి నివేదనము కైకొందును. ఇపుడు చేకొంటిని గాదని వగవకుము" అని గుహునితో పలికెను. ప్రేమచే నొడలుమరచిన గుహుండు శ్రీరాముని వ్రతమున కచ్చెరువు నొంది,

"... . . ...యిచ్చలో వెఱగంది యిదియేమి దేవ!
నీవరణ్యములకు నిఖిలంబువిడిచి, యీవిధి విచ్చేయు టేమికారణము?
నలినాప్తకులనాథ! నాయట్టిబంటు కలుగ నీవేషంబుగలిగెనే మీకు
చెనటియై మిమ్మిట్లుచేసిన నీచు ననిఁబట్టి చంపెద..." ననియెను.

అనిన విని రాఘవుఁడు,

"నతని సద్భక్తికి నతనిశక్తికిని
నతని ధీరోక్తుల కానందమంది
యతనిఁ గౌఁగిటఁజేర్చి యాదరం బెసఁగ
నతనితో తనదు వృత్తాంతంబు దెలుప
నంతయువిని గుహుండాత్మలోఁ బెద్ద
చింతించి కైకేయి సేతకువగచి
దశరథునేరమి తలపోసి
దశరథాత్మజుల దుర్దశకు శోకించె
రాముడప్పుడు కృపారసమగ్ను డగుచు
సౌమిత్రియును దాను సముచితఫణతి
గుహుశోక ముడిపె............"

(శ్రీరంగనాథరామాయణము)

శోకమేగాక క్రోధముకూడ గుహునిహృదయమున విజృంభించెను. రాజ్యకాంక్షియై భరతుడింతపని చేయించియుండునని గుహుడు తలచెను. ఆతని రోమకూపములనుండి నిప్పుకణములు ఉబుకుచున్నట్లాయెను. ఆగ్రహావేశమున నొడలు కంపింపదొడగెను. ఆతని కన్నులు లెఱ్ఱబారెను. నిముసములో నాతడు సైనికుల కడకరిగి గంభీరస్వరమున నిట్లనెను. "యోధులారా! వినుడు. గుణమణియు నన్నుగన్నతండ్రియు నగు శ్రీరామచంద్రుని మోసగించి భరతుడాతని రాజ్యము నూడబెరికినాడు. అంతటితో సంతృప్తిచెందక నా తండ్రికి నారబట్టలు కట్టి వనములకు పంపినాడు. నా హృదయమున కధీశ్వరుడైన శ్రీరామచంద్రమూర్తియెడల నాతడెంత అత్యాచారము బూనినాడో గ్రహింపుడు. ఈ దారుణకృత్యమును చూచి సహించుటెట్లు? నడువుడు. మనమిపుడా వంచకుని యుద్ధమున నోడించి రామచంద్రుని సింహాసనారూఢుని జేయుదము. ముందులకు ఉరుకుడు. మన ప్రాణములను శత్రువులకర్పించియైనను రఘుకులతిలకుని రాజుచేసి వదలుదము." సైనికులు ఏలికమాటలు శిరసావహింతుమని ఏకగ్రీవముగ బలికిరి. రణోన్మాదుడై గుహుడు అయోధ్యదెస ముందంజ వేయదొడగెను.

సర్వసహిష్ణుడైన రాఘవుడు గుహుని తొందరపాటు గాంచి స్తంభితుడై పోయెను. కదలిపోయి యాతని మరలింపుమని సోదరు నంపెను. భీమవిక్రముడైన గుహునిజేరి సౌమిత్రి వాని వారించి యన్నపాలికి దోడ్కొనిపోయెను. భక్తుని బుజ్జగించి సాదరవాక్కుల రాముడిట్లనెను. "సోదరా! విపద్దశయందు హృదయదార్ఢ్యమును గోల్పోవజెల్లునా? ధైర్యము ఓర్పు ఆరాధ్యగుణములు గదా! నాయెడల నీవు మిగుల ననురక్తుడవై యున్నావు. నాకపచారము జరిగినదని తలచి కోపించుచున్నావు. నా సోదరుడగు భరతుడు అపరాధియని తలంచుచున్నావు. అతడు సుగుణముల ప్రోవు. నేను రాజ్యమును వీడిపోవలసి వచ్చినందులకు కాతడు మిగుల వగచుచున్నాడు. ఈ దోషము నా తండ్రిదియును గాదు; తల్లి కైకదియనియు దలపరాదు. దైవేచ్ఛవలన నిది ఘటిల్లినది. కష్టములు కలకాలముండవు. నియమితకాలము గడచిన పిదప నేను అయోధ్యకు తిరిగివచ్చి రాజ్యమును స్వీకరింతును. నీ వది గాంచి యానందింతువు. సోదరా! శాంతింపుము." శిరంబువంచి గుహరాజు శ్రీరాముని వాక్యముల వీనులార గ్రోలెను

అనంతరము భక్తుని సెలవు గైకొని శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణులతో కదలిపోయెను. నిద్రాహారములపై మనసు నిలుపక కేవలము రామ

స్మరణమందే అతడు కాలము గడుపదొడగినాడు. తన యిష్టదైవతము మరల నెపుడు మరలునో యని శేబవ లాతడు కన్నుల నీరు నించినాడు. పదునాలు గేండ్లు గడచిననాడు రాముడు తప్పక కన్నులయెదుట పడునని అతడు ఆశపడి నాడు. పాపము గుహుని కన్నులు కాయలు కాచినవి. నాడు రాముడెదురు కానందులకు విచారాక్రాంతుడై శోకసంతప్తహృదయుడై అగ్నికుండమందుఱికి ప్రాణముల బాయ దలపడినాడు. కాని నిముసములో నేదియో యద్భుత భావము మెఱుపట్లు గుహుని హృదయాకాశమున తళుక్కు మనినది. తాను తలచిన ఘాతుకకృత్యము నుండి తరలినాడు. రఘుకుల తిలకుని కృపారససుధ అంతరంగమున గురియుట గ్రహించినాడు. రామభజనమున రాత్రింబవళ్లు కడ పినాడు. రామాగమనము దెలుపుచు నొకనాడు మారుతి గుహునకు ఆకాశ మార్గమున గన్పట్టిన ట్లాయెను. ఊర్ధ్వముఖుడై గుహరాజేమో పలికినాడు. అచిరములో తనహృదయాధినాథుడు ప్రత్యక్షమగునని ఆనందించినాడు.

ఇట్లొకమాఱు శోకించియు వేఱొకమాఱు ఆనందించియు ఒకమాఱు ఏడ్చియు నింకొకమాఱు మధురగీతములు పాడియు అతడు దినములు గడపి నాడు. పదంపడి గుహరాజు తన యాత్మారాము నంది ముక్తిని పడసినాడు.

గుహుడు చండాలు డనుట నిశ్చయము. అత డితరులకు అంటరాని వాడేమో కాని రామచంద్రభగవాను డాతని నక్కున జేర్చుకొనినాడు. ఆతని చేతి ప్రసాదము నారగించినాడు. భక్తి ప్రపంచమున జాతులులేవు. జగదీశుని సామ్రాజ్యమున వర్ణభేదములును వర్ణవైషమ్యములును లేవు. గుణాధిక్యతవలన మానవుడు పూజనీయుడగును. గుణరహితుడగు బ్రాహ్మణునికంటె గుణసహి తుడైన చండాలుడు వేయిమడుంగులు పెద్ద.

పంచమవేద మేమనుచున్నదో పరికింపుడు.

"చండాలోఽపి ద్విజశ్రేష్ఠో హరిభక్తిపరాయణః।
హరిభక్తి విహీనస్తు ద్విజోఽపి శ్వపచాధమః॥

ఒకని ముక్తికి ద్వారమగునది యాతని మహద్గుణమే. గుహుని గురు గుణమే అతని జగదీశుని చరణతలమున జేర్చినది. నందనారు పవిత్రచారిత్రమే ఆతని నటరాజు హృదయకవాటమున బ్రవేశపెట్టినది. నీచకులస్థులని మానవ సంఘమందు గర్హింపబడిన పలువురు గుణాధిక్యత ననుసరించి ఈశ్వరసామ్రాజ్య మును పడయగలిగిరని మన శాస్త్రములు తెలుపుచున్నవి.

---

## ౪౦
# శ్రీ భక్త మహంత్ జీ



శా. "నీలోనన్ బ్రభవించి వర్ధిలి తుదిన్ నీలోన లీనంబులౌ
నీలోకంబు లటంచుఁ దెల్పుటకునై యేలా పురాణేతిహా
సాలోకంబులు? నీ సృజించినది యౌ నానాసాలెపుర్వోక్కలే
చాలు న్స్వార్థము శాస్త్రచర్చ! జగదీశా! సత్కృపాంభోనిధీ"

ఒరిస్సా దేశమున యాజపురమను నొక యూరున్నది. కరణకాయస్థకుల జుండును మహంత్ వంశీయుండును నైన నిరుపేదయొకడు ఆ పల్లెయందు వసించుచుండెను. అతడు కృష్ణభక్తుడు. ప్రజలాతని యపరిమిత భక్తినిగాంచి "భక్త మహంత్" అని యాతని బిలుచుచుండువారు. ధనములేకున్న నేమి?— మనుజున కుండవలసిన ధనము, రాజాధిరాజుల మేడలయందు సాధారణముగా లోటుపడియుండు ధనము బిచ్చమెత్తి యైన దేవతల చేజిక్కించుకొను ధనము మహంతజీకి కలదు.

మహంతజీ భార్య పరమసాధ్వి; భక్తురాలు. వారికి నాలుగేండ్ల మగ బిడ్డయు ఏడేండ్ల ఆడుబిడ్డయు యేడాదిలోపు యాడుపసిబిడ్డయు కలరు. మహంతజీకి భిక్షాటనమే జీవనాధారమై యుండెను. పడసిన దానిని ముందు బిడ్డలకు పెట్టి మిగిలిన కొంచెపాటి యాహారమును భుజించి యాలుబిడ్డలు కృష్ణ భజనమందే కాలము గడపుచుందురు. అపుడపు డొక్కొక్క యతిథి మహంతజీ యింటికి వచ్చుటయు కలదు. బిడ్డలకు పెట్టగా మిగిలినయాహారము నా నాడు తాము భుజింపక ప్రత్యక్షమైన యతిథిమహాశయున కొసగి కృష్ణభజన చేసి కడుపులో కాళ్లుపెట్టుకొని యాదంపతులు నిద్రించుచుండువారు. అతిథి పూజయందు వారికి గల మక్కువ అద్భుతమైనది. ఎట్లైని అతిథిమనసును రంజింపజేయవలెనని వారు ఆతురపడుచుండువారు. ఫలకాంక్ష నెఱుగక నారాయణ స్వరూపుండని అతిథిని సేవించుతఱి వారి మానసములు అకుదానందముతో నుప్పొంగెడివి.

ఇట్లుండ నొరిస్సాలో గొప్ప కాటకము సంభవించెను. ఆకలిబాధచే ననేకులు హాహాకారములు సల్పదొడగిరి. తండులములు లేనందున పలువురు ఆకలములు తిని కొన్నాళ్లు తనువులు నిలుపుకొనిరి. తుద కవియు కడముట్టుటచే నొక్కరొక్కరు మృత్యువునకు కబళము కాజొచ్చిరి. దురంతమగు నాకలి బాధ కోర్వజాలని కొందఱు మృత గేహము నందలి మాంసమును తిని యుండు వారు. నలుగడలయందును ఘోరదారిద్ర్యము నృత్యము సలుపుచుండ కలవారును లేనివారై దురంతదుఃఖమున కుందుచుండ నిక మహంత్ జీకి గాని మఱే బిచ్చగానికి గాని పట్టెడన్నము పెట్టగలవారెవ్వ రుందురు? ఏ కొంచెపు మెతుకులు దొరికినపుడైనను బిడ్డలకు దానిని కుడువబెట్టి వారాడుకొనుచుండ చూచి ప్రసన్నచిత్తులై మహంత్ జీయును వాని యిల్లాలును బ్రదుకులు నిలువబెట్టు కొనుచుండువారు. ఇపుడు బిడ్డలకు కూడ నన్నము కఱవగుటచే మహంత్ జీ కన్నుల నీరుపెట్టుకొని కృష్ణసంకీర్తన మొనరించుచు జగదీశు నుద్దేశించి "తండ్రీ మేమిరువురము ఆకలిచే మాడినను మాడిపోదుము. మా యాహారమునకై నేను చింతించుటలేదు. కాని ఈ బిడ్డలను చూచినపుడు నాకడుపు దహించుకొనిపోవుచున్నది. వీరు నిర్మలహృదయులు. ఏ పాపము నెఱుగనివారు. నేను చేసిన పాపమే వీరిని కట్టి కుడుపుచున్నయెడల పిడుగులు పడునట్లుచేసి నా శిరము సంపూర్ణముగా చూర్ణముచేయుము పట్టెడన్నము మాత్రము నాబిడ్డల నోటబెట్టుము. ప్రభూ! నేను నిన్నుదక్క పృథ్వియందింకెవ్వరి నెఱుగను. తండ్రీ ఇంక నీ రౌద్రలీలలను కడముట్టించుము. లేకున్న మమ్ముల నందఱ నొక్కమాఱుగ కడతేర్చి వేయుము. తండ్రీ! ఏమి పలుకుదును? నీ యిచ్ఛ యేమో గదా? దానిని పూర్ణమొనరించుకొని ధన్యుడవుకమ్ము" అని వగచుచుండు వాడు. కాని జగదీశుడాతని మొరాలకించుట కుపేక్షచేసినాడు. ఏమిచేయుటకును ఎందుబోవుటకును ఆతనికి తోపకుండెను. ఆతని యర్ధాంగి యెంతో యోరిమికలది. కాని యోరిమికైనను హద్దుపద్దులుండును కదా! పాలిచ్చుట కామె పసిబిడ్డను రొమ్మున జేర్చుకొనెను. కాని ఎముకలును తోలును మాత్రము మిగిలియున్న యామెకడ పాలెట్లుండును. దురంతమై నలుగడల వ్యాపించిన కఱవామె స్తన్యమునుకూడ ఆవహించినది. కన్నతల్లి కావున నామె తనకడుపుకోసి యందలి ప్రేవులను బిడ్డల కియ్యగలదు. తనగుండెలను

చీల్చి యందలి రక్తమును బిడ్డలకు పానీయముగా నొసంగగలదు. కాని యీ అపూర్వాహారమును బిడ్డలు ముట్టుదురా? ఎండిన తల్లిరొమ్మును మాటిమాటికి పుడుకుచు బిడ్డ ఒకబొట్టు పాలైనను బడయజాలక "కేరు కేరు" న నేడ్వసాగెను. ఇంక తల్లి దుఃఖమును ఆపుకొనజాలక పోయెను. ఆ యిల్లాలు పతి చెంత కరిగి గోలుగోలున నేడువదొడగెను. మహాంత్ జీ అంతయు గ్రహించినాడు. ఎండుతడపవలె పడియున్న యర్ధాంగలక్ష్మిని విలోకించినాడు. ఏడ్చి యేడ్చి నేలబడియున్న చంటిబిడ్డను చూచినాడు. తలిదండ్రులను చూచి 'ఆకలి ఆకలి' యని పోరుపట్టు పెద్దబిడ్డలను చూచినాడు. ఇంతవఱకును ఎట్టులో గుండెయందు దావగింజంత సహనమును చిక్కబట్టినాడు. ఇపుడు శత్రుత్వము పూనినట్లు కుట్రపన్నినట్లు దుర్దశ ఆతని హృదయమును పట్టి పిండివేసినది. ప్రాణములనుకూడ పిండివేసినది. "హేకృష్ణా! హేకృష్ణా!" యని మహాంతజీ మూర్ఛిల్లినాడు. నేలగూలిన జనకజననులపై బడి బిడ్డలు గొల్లున నేడ్వసాగిరి.

కొంతవడికి మహాంతజీ మూర్ఛనుండి తేఱకొని 'కృష్ణా! కృష్ణా!' యనుచు కనులు విప్పినాడు. మగనిచేతులు పట్టుకొని యాతని యిల్లాలు డగ్గుత్తికతో నిట్లనెను. "నాథా! ఇంక గతియేమున్నది? నిర్భాగ్యురాలను ఏమి చేయుదును! నాకు మీ కంటె దిక్కెవరును లేరు. ఉన్నను, బంధుగులు మనకు పట్టెడన్నము పెట్టెదరని మన మాశింపగూడదేమో. ఈ యాపద యందు మనకు తోడుపడగలవారు నాకెవ్వరును నా వైపునలేరు. మీకు మిత్రులెవ్వరును లేరా! తప్పక యుండి యుందురు. నడువుడు. మనముపోయి వారికి సేవసలుపుదము. పట్టెడన్నము వారు పెట్టకపోరు."

దుఃఖసంతప్తహృదయుడగు మహాంతజీ పెదవులపై చిరునగ వంకురించినది. మితిమీఱిన సంతసమునుండి దుఃఖమును అధికమగు సంతాపమునుండి సంతసమును పొడచూపుచుండుట వింతకాదు.

"నా వైపున కూడ 'నా' యనువా రెవ్వరును లేరు. కాని నా కొక మంచి స్నేహితుడున్నాడు. అతనియొద్దకు వెళ్లితిమేని తప్పక మనము సహాయమును పొందగలము. అతడు దయాళుడు. దీనులను దిక్కులేనివారిని ఆదరించుటయం దాతనికి ఆసక్తిమెండు. అతనిపేరు దీనబంధు" అని మహాంతజీ పెండ్లాముతో పలికెను.

ఈ వాక్కులు వినినంతనే ఆమె ముఖమునం దాశాంకురము లుద్భవ మయ్యెను. మహంతజీ మరల నిట్లనెను. "ఇపుడు మనమా మిత్రునకు చాల దూరము నందున్నాము అయిదురోజులు రాత్రింబవళ్లు యెడతెగక నడచి పోగలమేని ఆతడున్న చోటును చేరగలము. 'నీలాచలధాము' మున నతడు వసించుచున్నాడు. కాని అంతదూరము కృశించి ప్రాణావశిష్టులైన యీ బిడ్డల నెట్లు తోడ్కొని పోగలము ? "

మహంతజీభార్యకు పోవనున్న ప్రాణములు నిలువం బడునట్లయ్యెను. నిజ నాథు నుద్దేశించి "అట్టి మిత్రుడొక డుండ మనమిచ్చట యాకలిచే మరణించు టేల ? చచ్చియో చెడియో మనమా పుణ్యాత్మునిపాలికి పోవుదము రండు వేగమ పయనము సాగింపుడు" అనెను. విచారాక్రాంతమనస్కయైన యామె కన్నులనుండి నాడానందాశ్రుధార స్రవించెను.

"ఎల్లుకును అన్నమిడుతండ్రి మాకును పట్టెడుకూడు బెట్టదలచినచో ఇందే పెట్టును. ఏకారణముచేత నేని యాతడు పెట్టదలపనిచో సమస్తభూమండలమును తిరిగినను ఒక్క కబళమైనను చేతుల జిక్కదు. మృత్యువే గతియైన యెడల ఎందుదాగినను యేమూలకు పరుగెత్తినను వెంటనంటి అది పట్టుకొని తీరును. ఇపుడెచటకో పోయిన ప్రయోజనమేమి " అని తనలో తాను వితర్కించుకొని మరల మహంతజీ యిట్లని తలపోయసాగెను. "మరణము ఆసన్నమగునని దుఃఖించుటేల. కటవులో ప్రాణములు పోయినను సరేకాని తుది ముహూర్తమున నీలాచలనిలయుని దర్శనమును పడయ గలిగితినేని నా జన్మ సార్థకము కాదా ? ఆతని చరణతలమునందే మరణించిన మాడుచున్న నాప్రాణములకు మధురశీతల యాశీర్వాదము చేకూరకుండునా ? " ఇట్లాలోచించుకొని యతడు "మంచిది నీవు అనినట్లే చేయుదము. ఇపుడే ఆ మిత్రునికడకు పోవుదము. వెంటనే కదలిపోవుదము" అనెను.

బిడ్డలను చంకబెట్టుకొని భార్యాభర్తలు పయనమైరి. పయనమైరి కాని అడుగుతీసి ముందడుగు వేయుటకు వారికి సత్తువలేదు. పాపము వారెంతో ఆయాసపడిరి. తమశరీరములనే మోయుట వారికి కష్టమాయెను. ఏడ్చుచున్న బిడ్డల నెత్తుకొని యెట్లుపోగలరు ? పాపము వారికాళ్లు బొబ్బలెక్కుచుండెను. తడబడుచుండెను. ఒక్కొకచో వారు నేల కూలబడుచుండిరి. మార్గమధ్య

మున నేదేని పదార్థము గాని పండుగాని లభించినపుడు దానిని బిడ్డలకిచ్చి తమకడుపుల నింత నీరు పోయుచుండువారు. మరల పది యడుగులు నడచువారు, కాలు సాగనపుడు 'దైవమా, యని చతికిల పడుచుండువారు.

జీర్ణశరీరులై జీవచ్ఛవములై ఆ దంపతులు యెట్టకేలకు ఐమదినముల పయనము సాగింప కలిగిరి. సాయంకాలము కావచ్చినది. వెనుకనుండి కనుచీకటులు ముందులకు కూడా క్రమ్ముచున్నవి. ఇంతలో నీలాచలనాధుని దేవళము గోపురము తళుక్కుమనెను. దంపతుల హృదయములు ఉప్పొంగెను. వారిప్రాణములు కుదుటపడినవి ఎదుటనున్నగి కొంతదూరము మాత్రమే. ఈదూరము నడచినంతనే 'అనంతము అక్షయము' నగు స్వర్గము వారికి లభించునని వారుబ్బిపోయిరి క్రొత్తయుత్సాహము వారియందు దుదయించెను ఎండిపోయిన వారి హృదయములనుండి ఆనంద మూటలూరినది. ఇన్నినాళ్ల ఆకలిబాధ, ఆయాసము ప్రయాణశ్రమ తృటిలో నెందో ఎగిసిపోయెను.

దంపతులు విసవిస ముందునకు సాగుచుండిరి. శ్రీజగన్నాధుని ఆలయమున నపుడు శంఖారవము ప్రతిధ్వనించినది. ఘంటానినదము మ్రోగినది. అది హారతిసమయము. దంపతులు విప్పారిన హృదయములతో చివాలున నెగిరి వచ్చి ఆలయసింహద్వారమున నిలచిరి.

అసంఖ్యాకులగు పురుషులును స్త్రీలును గుమ్మముకడ నిలువంబడిరి. వారి హృదయము లాతురపాటుతో నిండియున్నవి. ముందుగ లోనికరిగి మనసార స్వామినిచూచి హృదయార్ఘ్య మీయవలెనని ఎల్లరును తొందరపడుచుండిరి. ద్వారరక్షకులు బెత్తములు పుచ్చుకొని మూగిన జనసమూహము నదలించుచుండిరి. ప్రాణావశిష్టులైన బిడ్డలను తోడ్కొని జనసమూహములనుండి చొరచుకొని లోనికి పోవుటకు మహంతజీ యిష్టపడలేదు. గుమ్మమున కేవలనుండియే యతడు తన నెచ్చెలిని చూడగలిగెను. ఆతని యిల్లాలును దూరమునుండియే శ్రీజగన్నాధస్వామిని చూడగలిగెను. తలిదండ్రుల ననుకరించి "జే" యని పసిబిడ్డలు స్వామికి మ్రొక్కిరి. పదపడి వారు ఆలయద్వార సమీపమునుండి కదలిపోయిరి. పోయి యచటికి సమీపముగానున్న గంజికాలువ చెంత చతికిలపడిరి.

మహంతజీపత్ని "ఇంకను జాగుచేసెద రేల? వెంటనే మీ మిత్రునికడకు పోయి బిడ్డలకై పట్టెడన్నము కొనిరండు. ఇంక వీరిప్రాణములు నిలుచునట్లు

లేదు.” అని మహనితో పలికెను. పలుకుటయు నతడు “ఎందులకు తొందర పడెదవు? ఎట్లో మనమీ తావును చేరుకొని గుమ్మముచెంతనుండి మిత్రుని దర్శనము చేయగలిగితిమి. ఇది గొప్పయదృష్టము కదా! మిత్రుడు నేడు ఎంతయు తొందరలో నుండుట చూచితివిగదా! ఎంతో కష్టపడి యింతదూరము రాగలిగినవారము ఎంతో శ్రమను ఓర్వగలిగినవారము ఇపుడు మఱికొంత యోపిక చూపజాలమా! చూపలేకున్న చచ్చిపోదుము! చావనిన భయమేల? రాదలచినచో నది రాకమానదు! ప్రియతముని చూచితిమిగదా! ఇక మరణించినను మనము ధన్యులమే యని మనమేల తలంపరాదు. ఎన్నెన్ని దేశములనుండియో యెంతెంతదూరము నుండియో ఎందఱెందఱో నేడు మిత్రుని చూచుటకై వచ్చిరి. స్వామి ఎందఱెందఱి మొరలనో నేడు వినవలసియున్నను. ఇపుడే నేనుబోయి యాతని విసిగింపన్యాయమా! మనల నాతడు జూడలేదని తలచుచుంటివా! అతడు ఒకరి నొక కంటను ఇంకొకని వేఱొకకంటను చూచువాడని యోచించుచుంటివా. ఆతని కందఱును సములే కదా, మనదుఃఖమును చూచి యాతడెంత దుఃఖించుచున్నాడో నీ వెఱుగవా! అతడెట్టి దయాళుడో చూచుచుంటివిగదా! చూడు అతడు మనల నీగంజికాల్వ కడ జేర్చినాడు. ఇతరు లెవ్వరికి దొరకని నెచ్చలి తొలినివేదనమును పరమామృతమైన యీ గంజిని కడుపార ద్రావి ఈ రాత్రి గడిపివేయుదము. ఒకపరి యోజించిచూడుము. కఱవుచే కాలిపోవుచున్న మనయూర మనకు కుళ్లిపోయిన రెండుమెతుకులు కఱవయ్యెను గదా! మనకెట్టయెదుట నిచ్చట అమృతమట్లు గంజినీరు పొంగుట లేదా! ఇకహృదయమున దుఃఖమునకు చోటిచ్చుట తగునా? మిత్రుని ప్రథమ ప్రేమపూరిత నివేదనము అమృతతుల్యమగు ఈగంజి, దీనిని త్రాగిచూడుము. నెచ్చలి యెట్టికృపాళుడో గ్రహింపుము. ఈగంజినీరు కడుపులో పడినంతనే ఎంతశాంతి ఎంత ఆనందము అంతరంగమున నుదయించును! ఆతని దయయను తన రెక్కలను మనపై విప్పియుండనిచో మార్గమధ్యమందే మనము మడసి యుందుము.” అనెను.

మహాంతజీ చెప్పిన చొప్పున అందరును గంజికాల్వలోని గంజినిదోసిళ్ల ముంచి కడుపునిండ ద్రావిరి. ఆయాసముచే సొమ్మసిలియున్నవారు గావున గట్టుపై మేనులు వాల్చిరి. దుఃఖోపశమని, క్లాంతినాశిని నిద్ర నిముసములో వారి

నావహించినది. ఆకసమునుండి వెన్నెల కురియుచున్నది. వసంతసమయ మంద మారుతము మెల్లన వీచుచున్నది. జగమంతయు వెండిపూత పూసినట్లుండెను. నలువలకులశాంతి విరాజిల్లుచుండెను. మహాంతజీసతియు బిడ్డలును ఆదమఱచి నిద్రవోయిరి. ఆతడొక్కరుడు మాత్రము మేలొంచియుండెను. వెన్నెల యేట స్నానమాచరించి శాంతియమృతమును గ్రోలి ఆనందావేశమున తన నెచ్చెలి నుద్దేశించి,

గీ. కటికి చీఁకటిపొరలుచు, కడుపునుంట
నోర్వఁజాలక పొగులు మమ్మొక్కదగిని
జేర్చి, పండువెన్నెల హృదిఁజిమ్మి ప్రోచి
నావు; దీనరక్షక! జగన్నాథ! దేవ!

యని యాతడు పాడదొడగెను. ఇంతలో బిడ్డలు నిద్రలేచి యేడువ సాగిరి. తల్లియు లేచినది. మురికికాల్వయందు తేలి ప్రవహించు గంజినీరు త్రాగినంతన బిడ్డల యాకలిదీరునా! మన్నుతోగలిసిన గంజిని గతిలేకకడుపున బోసికొనిన వారి యాకలిబాధ తీరిపోవునా! తల్లి పసిబిడ్డను రొమ్మున చేర్చు కొనినది. పాలు అందక బిడ్డ పోరువెట్టసాగెను తల్లి తల్లడిల్లినది. ఇకదిక్కేమి? మహాంతజీ యెల్లఱను పరికించినాడు. కొలది నిముసములలో వారి ప్రాణములు పోవునని తలచినాడు. బిడ్డలనుగూర్చియు భార్యనుగూర్చియు నతడు మిక్కిలి దిగులుపడినాడు. భార్యయు బిడ్డలును మతిదప్పి పడిపోయిరి. ఆతనికి అపుడు దిక్కు ఇతని నెచ్చెలియొక్కడే. "జగన్నాథా! జగన్నాథా!" యని యతడు గొంతెత్తి పలికి మూర్ఛిల్లినాడు.

ఆపిలుపు ఆలయపు రాతిగోడలను భేదించుకొనిపోయి లోపలనున్న దేవదేవుని గుండెలకు తగిలినది. జగన్నాథుడు భక్తాధీనుడు. భక్తునికొఱకై ఆతనిహృదయము తల్లడిల్లినది ఇంకనాతడు మిన్నక యుండజాలకపోయెను జగదీశుడు నడుముకట్టినాడు. తన చెంతనున్న బంగారుపళ్లెరమునిండ మధుర ప్రసాదముంచి బ్రాహ్మణబాలకరూపమున ముందులకు చరచరనడచి, ద్వారము చెంతనిలచి "నెచ్చెలీ! నెచ్చెలీ! లెమ్ము, రమ్ము. మీకొఱకై చక్కని ప్రసాద మును గొనివచ్చితిని. వచ్చి తీసికొనుము. కడుపార మీరెల్లఱును భుజింపుడు.

రమ్ము వేగముగరమ్ము. నాకు ఆలస్యమగుచున్నది. అన్యథా తలపకుము. రమ్ము." అని జగదీశుడు ఎలుగెత్తి పలికినాడు.

మహాంతజీ మూర్ఛనుండి తెలివినొందెను. కాని కనులుమూసికొని యాతడట్టులే పడియుండెను. జగదీశుని ప్రేమపూరిత ఆహ్వానము ఆతని చెవులపడినది. "ఏమో ప్రేమవాక్కులు వినబడుచున్నవి. కాని అధమాధముడనగు నాపట్లనివి చెల్లునా?" యని తనలో వితర్కించుకొని అతడట్లే పడియుండెను.

మరల పిలుపు వినబడినది — "మిత్రమా! మిత్రమా! వేగ రమ్ము. రమ్ము." మహాంతజీభార్యకు తెలివివచ్చెను. జగదీశుని పిలుపు ఆమె చెవులం బడియెను. పతినుద్దేశించి "ఒకసారి లెండు! మేలుకొనుడు. మీమిత్రుడు కాబోలును గుమ్మముచెంత నిలువబడి పిలుచుచున్నాడు. లేచి వేగమే కదలి పొండు" అని యామె పల్కెను.

మహాంతజీ సంశయములు పటాపంచలై పోయినవి. తత్తరపాటునలేచి పిచ్చివానివలె అతడు ముందునకు పర్వెత్తెను. సుకుమారశరీరుండగు బ్రాహ్మణ బాలకు డొకడు బంగారు పళ్లెమొకటి చేతబట్టుకొని గుమ్మముకడ నిలచి యుండెను. పళ్లెరమునిండ నపూపములుండెను. బరువుచే బాలకుని చేతులు రెండును వడకిపోవుచున్నవి.

మహాంతజీ తొందరగా చేతులు చాపినాడు. బాలకుడు పళ్లెరమును ఆతని చేతులయందు బెట్టెను. మహాంతజీ దానిని తనతలపై నిడుకొనినాడు. అతని శరీరము హఠాత్తుగా గగుర్పొడిచెను. ఆతడేమో పలుకదలచినాడు. కాని యాబాలకుడు నిముసములో నందుండి మరలిపోయినాడు. ఆబాలకుని చరణసరోజములకు ప్రణమిల్లి యేమేమో మహాంతజీ తెలుపుకొన దలచినాడు. కాని యాతనికోరిక ఫలించినదికాదు. ఎద్దియో మాయశక్తి యాతని మనసులోని తలంపులను నోటిలోని మాటలను దొంగిలించుకొని పోయినది. ఇకనేమి చేయగలడు. జగదీశు డదృశ్యుడైనాడు. అన్యాయత్తచిత్తుడై త్రుళ్లుచు తూలుచు నతడు గంజికాలువగట్టు చేరినాడు. తినుబండారములతో నిండియున్న పళ్లెరమును బిడ్డలయెదుట పెట్టినాడు.

ప్రసాదమును చూచినంతనే వారి హృదయము లుప్పొంగిపోయినవి. పరమానందమున వారు కుడువసాగిరి. వారినిపట్టి పీడించిన ఆకలిబాధ నిముస

ములో నణగిపోయినది. తమయుదరమును హృదయమును ఎవ్వరో అమృత ధారలతో నిండించినట్టు వా రద్భుతసంతృప్తి నందిరి. పళ్లెరమునం దావంత ప్రసాదమైన వారు మిగుల్పలేదు. పళ్లెరము నాతనిభార్య కడిగి శుభ్రముచేసినది. మిత్రునకు దానినిచ్చి వేయవలసి యున్నది. దానిని చంకనిడుకొని మహాంతజీ ఆలయముకడ కరిగెను. కాని కవాటము గట్టిగ బంధింపబడి యున్నది. మిత్రునికొఱకై యాతడెన్నోని కేకలు వేసినాడు. ఎన్నిమాఱులో తలుపుతట్టినాడు. ఎవరును బదులు పలుకలేదు. జబాబు చెప్పలేదు; తలుపు తీయలేదు. చేయునదిలేక అతడు తిరిగి వచ్చినాడు. పళ్లెరము నెంతయోసేపు హృదయమున జేర్చుకొని కూర్చుండియుండెను. తరువాత తన చింపిరిగుడ్డలో దానిని చుట్టబెట్టి తలక్రింద బెట్టుకొని పరుండినాడు. తనతొడపై మహాంతజీని జేర్చుకొని తనకరకమలములచే నాతని కనుదమ్ములు గప్పి నిద్రాదేవి సహస్రాధికస్వర్గ స్వప్నములచే నాతని హృదయమును నింపివేసినది.

తూర్పు తెల్లబాఱెను. బాలభానుని బంగారుకాంతి జగదీశుని యనురాగహాసమువలె యెల్లచోటులందును తళ్కొత్తుచుండెను. ఆలుబిడ్డలతో మహాంతజీ యింకను నిదురించుచునే యుండెను. ఎన్నినాళ్లనుండియో నిద్ర యెఱుంగని వారు ఆరాత్రి దైవప్రసాదము నందినవెనుక కన్నులనిండ నిద్ర నెఱింగిరి. మహాంతజీ ముఖమున ప్రశాంతము విరాజిల్లుచున్నది. దుఃఖరేఖలును దుఃఖచిహ్నములును అందుండి యెవ్వరో తుడిచివైచిరి. ఆ వదనమునుండి అపూర్వతేజము వెలువడుచుండెను. ఉషఃకాలరక్తకాంతులచే నాతనివదనము మఱింత ప్రభాకలితమై తోచుచుండెను.

ఇట్లుండ జగన్నాథదేవాలయమున పెద్దయల్లకల్లోలము ప్రారంభమయ్యెను. గర్భాలయమందలి రత్నఖచితమగు బంగారుపళ్లెరము కానంబడుటలేదు. "దారుణచౌర్యము! దురంతకృత్యము! దారుణము!" అని యఱచుచు పలువురు నలువంకలకు పరువెత్తసాగిరి. మహాంతజీ సమీపమునుండి కొందరు చనిరి. ఆతని తలక్రిందిచింపిరిగుడ్డనుండి సూర్యకాంతియందు అద్భుతముగ తళ్కులీను బంగరుపళ్లెము వారికంటబడెను. "దొంగ! దొంగ!" యని మహాంతజీపై బడిరి. కెవ్వున కేకవేయుచు నతడు నిద్దురనుండి లేచినాడు. పూజారులును భటులును ఆతనిని నోటికివచ్చినట్లెల్ల తిట్టి పిడిగ్రుద్దులతో నాతని

శరీరమును చూర్ణముచేసి త్రాళ్లతో నాతని కాలుసేతులు కట్టివేసిరి. మహాంతజీ నోటినుండి మాట వెలువడినదికాదు. "ఇదియు నెచ్చెలి లీలయే!" అని మాత్ర మతడొకసారి పలికినాడు. ఈగందరగోళమున నులికిపడి నిదురమేల్కొనిన యాతని భార్యయు బిడ్డలును మహాంతజీ దురవస్థ చూచి గోలుగోలున నేడువదొడగిరి. కాని వారి యార్తనాద మచట వినువారెవరును లేరు.

దెబ్బలచే మహాంతజీ ప్రాణములు కడముట్టున ట్లయ్యెను. చేతులు జోడించి పూజారులతో నాత డిట్లనెను. "తండ్రులారా! మీరూరక నన్ను బాధించుచున్నారు. నామాట లాలకింపుడు. నేను దొంగను కాను. ఇది నామిత్రుడు దానముచేసిన వస్తువు. ఆలుబిడ్డలతో ఆకలిబాధచే చచ్చిపోవు చుండుట చూచి ప్రభువు ఈ పళ్లెమునిండ బహువిధరుచ్యపదార్థముల నిడికొని తెచ్చి నా కిచ్చినాడు. ఆ మహాప్రసాదము కడుపార నారగించి పళ్లెరమును తోమి శుభ్రపఱిచి తిరిగి నెచ్చెలి కియ్యవలెనని గుడి గుమ్మముకడకు వచ్చితిని. తలుపులు మూయబడి యుండెను. ఎంతయఱచినను యెంతతట్టినను ప్రభువు కవాటమును తెఱచినాడుకాడు. ఉదయమున దీనిని దేవళములో నందచేయ వచ్చునని తలంచి మరల గొంపోయి పదిలముగా నావస్త్రమున చుట్టబెట్టి తల క్రింద పెట్టుకొని పరుంటిని. గాఢముగా నిదురపట్టినది. నిదురనుండి నేను లేవక మునుపే యీయల్లరి పుట్టినది. పళ్లెమును గొంపొవుడు. ఈదరిద్రుని ఈ నిర్దోషిని వదలివేయుడు. దురంతదుఃఖాగ్నికుండమునుండి నా పెండ్లామును బిడ్డలను కాపాడుడు."

ఆవాక్కులు విని కొంద ఱాతడు పిచ్చివాడనిరి. మఱికొందఱు దొంగ యెత్తు వేయుచున్నాడనిరి. ఇంకను కొందఱు అతడు వంచకుడనిరి. ఆతడెంత వేడినను ఆతని మొరాలింపక, గుండెచించుకొని గోలుగోలున నేడ్చుచు వేయి విధముల వేడుకొనుచున్న ఆతని యిల్లాలి మాటలు లెక్కసేయక, రాలను సైతము నీరుచేయు పసిబిడ్డల యాక్రందనము సరకుగొనక భటులును పూజారులును బలముకొలది మహాంతజీని పొడుచుచు నీడ్చుకొనిపోయి కైదులో బడ వేసిరి. మహాంతజీ కన్నులు మూసికొని స్థిరచిత్తుడై గోవిందుని ధ్యానింపదొడగెను. ఆతని యిల్లాలును బిడ్డలును గోలుగోలున నేడ్చుచు గంజికాలువచెంత ధూళియందు నేలగూలిరి.

మహాంతజీ అనిన 'నెచ్చెలి లీల' యెట్టిదో? భగవంతుడు భక్తునేల ఇట్టి దురవస్థకు లోనుగానిచ్చునో? మహాంతజీ గతియేమాయెనో తెలుపక ఈ విషయములనిందు విమర్శింప నొల్లను. బంగారమును గొనదలచిన యతడు దానిని బాగుగా పరిశీలించినపిదప మాత్రమే గ్రహించును. దానిని పలుమారు పుఠము వేసి వేసి అది పదియార్వన్నె పసిండిగా నైననేగాని యాతడు దానిని చేకొనడు. భక్తుడుకూడ పదియార్వన్నె పసిండివంటి భక్తిని చూపగలిగినపుడే జగదీశునిచే పరిగ్రహింపబడును. జగదీశు డీతని భక్తిని బహుభంగుల పరీక్ష చేయును. నిజదుఃఖమును నిజసుఖమును తలంపక ఫలాపేక్షలేక కేవలము "నెచ్చెలి" నే పడయవలెనని యాశవహించి తనశరీరమును తనమనస్సును తనచిత్తమును తనబుద్ధిని తనయంతరాత్మను దశేంద్రియ పంచభూత పంచ తన్మాత్రలను (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము) ఆతని చరణతలమున అర్పన మొనరించిన ముహూర్తమునందే భక్తునతడు తనయంకతలమున జేర్చుకొనును. అగ్నియందు పడినపుడే కాంచనము శుద్ధమగులీల అగ్నిపరీక్షయందు నిలిచి నపుడే మానవుడు శుద్ధాత్ముడగును. జగదీశు డగ్నిపరీక్షకు సామాన్యులనుగాక మహాపురుషులను మహాపతివ్రతలను గురిచేసినాడు. ఈపరీక్షయం దుత్తీర్ణులైనవారు అనంతకాల మాతని సమ్ముఖమున నానందక్రీడల తేలుచుందురు. మహాంతజీ యిపు డగ్నిపరీక్షయందు నిలిచియున్నాడు. కృతార్థుడు కాగల గట్టిఘటమో వెలికిలబడు ఓటికుండయో పరికింపవలసియున్నది.

మహాంతజీ ఖైదులో బంధింపబడినాడు. మహాంతజీలోని స్పర్శకు అందు నది బంధింపబడినది. మహాంతజీ ఒకశరీరమే యైనయెడల పూజారులును భటులును నెగ్గితి మని ఎగిరి గంతులువేయవచ్చును. వ్యక్తిరక్తమాంసముల ముద్ద కాదు. ఒకరి స్పర్శకును ఒకరి యత్యాచారమునకును లొంగని వ్యక్తియొక్క కూర్పునం దుపయోగింపబడిన శక్తి. ఈశక్తి నశింపనంతవఱకు మనుష్యుడు నిలిచియేయుండును. ఈతని శరీరమును తునుకతునుకలు చేయుడు. సింహముల కీతని నెరసేయుడు; ఈతని హృదయమందలి శక్తి చావనంతవఱకు ఈతనిచంప లేవు. ఒకశరీరము తునిగినయెడల వేరొకశరీరము సిద్ధమై ఆయద్భుతశక్తికి స్థాన మగును. ఆత్మ విజయకాంక్షగలది. విజయపతాకమెత్తిన పిదప కాని అది స్వస్థలమున జగదీశు సమ్ముఖమున విశ్రాంతిగొనదు. మహాంతజీయాత్మ శక్తి

కలది. అది అధ్యాత్మికమైన కవచమును దొడిగికొనినది. పలుగాకుల పోటులు ఆతని శరీరమును చీల్చినవి. మహాంతజీ పెదవివిరిచినా డంతియే. ఆతని కట్టు గుడ్డలు చినిగి చిందర వందరలైనవి. అందులకు మహాంతజీ చింతింపలేదు. ఇపుడో ఆతనిఆత్మ కట్టుకొనినగుడ్డ దుర్మతులచే కొంత చింపబడినది. అందులకు మహాంతజీ చింతింపలేదు. ఆలుబిడ్డలకై మాత్ర మాత డారాటపడినాడు. సర్వము జగదీశుని కర్పించినాడు. తనసుఖములను తనదుఃఖములను 'కృష్ణార్పణ మస్తు' అని జగదీశుని కర్పించి తాను 'టింగు రంగా' యని కూర్చుండి యున్నాడు. ఇపుడాతనిది స్వేచ్ఛ; శరీరమునకు దుష్టులు తాళమువైచిరి. అతడు కదలకుండ నడ్డుగోడల నెదుట బెట్టిరి; కాని ఆతని ఆత్మకు తాళము వేయుగల వారెవరు? అతని మానసచలనము నరికట్టగలవారెవరు? కైదునందు కూర్చుండి యాతడు జగన్నాథునితో ప్రసంగించుచున్నాడు. మనుష్యుడు భౌతికశాస్త్రపరిజ్ఞానము మూలమున తీగలులేని తంతిని కనిపెట్టినాడు. ప్రపంచమునందొక మూలనున్నవాడు వేరొక కోణమునందున్న వానితో నే డవలీలగ తంతిపై నాధారపడకయే ప్రసంగింపవచ్చును. ఇకనాతడు భగ వంతునితో ప్రసంగింపజాలడా? భక్తునకును భగవంతునకును నడుమగల ప్రార్థనాబంధము బంధరూపమున గోచరింపని యాతంతిలేని తంతివంటిది. దీని ద్వారా భక్తుడును భగవంతుడును ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుకొందురు. రాతిగోడలుగాని ఉక్కుతీగెలుగాని విచ్చుకత్తులుగాని నిప్పులగుండములు గాని ఈయుత్తరప్రత్యుత్తరములు త్రుంపివేయుజాలవు. స్థలకాల వివరములుగాని, భూమ్యాకాశములుగాని ఈయుత్తర ప్రత్యుత్తరముల నడుమ నిలువజాలవు. మహాంతజీ ఎత్తైనరాతిగోడల నడుమ బంధింపబడిననేమి, తన చేతులు కటికి సంకెళ్లచే కట్టబడిననేమి, తన నెచ్చెలితో ప్రసంగించుచునే యున్నాడు.

నిబిడాంధకారమును చీల్చివేసి పాషాణపు గోడలను బ్రద్దలుచేసి మహాం తజీ ప్రార్థనాభావమును స్తవగానమును నేడు జగన్నాథుని హృదయకుహరమున ప్రవేశించినవి. భక్తుని వేడినిట్టూరుపు ప్రపంచమున నపూర్వసంచలనము పుట్టించినది. భావశక్తియొక్క మహత్త్వ మిదివరలో తెలిపియుంటిని. మహాం తజీ భావశక్తిమాత్ర మట్టి మహత్త్వముకలదికాదా? మనుష్యమాత్రుడని

వెఱ్ఱివాడని దిక్కులేనివాడని చేతగానివాడని పిచాచగణమాతని త్రొక్కిపచ్చడి చేసి ఆతని యాయువుపై విజయధ్వజ మెత్తగలదా ?

అత్యాచారము బడబానలముకంటె భయంకరమైనది కావచ్చును. అది నిప్పువానలు కురిపించుచుండ జగదీశుడు కాళ్లుముడుచుకొని యొకమూల కూర్చుండడు. సృష్టి నీతిబంధములులేని రక్కసి గుండెవంటిదికాదు. భగవంతుడు పిరికిపందకాడు. జరుగుచున్నదానిని కనుగొనజాలని యంధుడుకాడు. సృష్టి కర్త కన్నులకు రెప్పలులేవు. సృష్టికర్త మనసున మాంద్యములేదు. దాని నణచివేయుటకు తగుముహూర్తమువఱకు వేచియుండునుగాని తనసింహాసనము నుండి దిగి పాఱి అత్యాచారమున కాతడు పట్టముగట్టింపడు.

మహంతజీని పీల్చి పిప్పిచేయవలెనని నిన్నటివఱకును దారిద్ర్యమును దుఃఖమును కుట్రపన్నినవి. నేడీ కుట్రలో అత్యాచారము కూడ చేరినది. దుఃఖ దారిద్ర్యము లాతని శరీరము నించుమించుగ తినివేసినవి. ఇప్పు డత్యాచారము శేషించిన భాగముపై తన వాడికోరలు ప్రయోగించుచున్నది. జగదీశుడు చూచుచున్నాడు. తన భక్తుని చేవను కనుగొను తరుణమిదిగదాయని ఉబ్బి తబ్బిబ్బులగుచున్నాడు.

శారీరకమగుబాధ మహంతజీ మనసు నంటలేదు. ఆతని ముఖమున బాధపడుచున్నట్లు చిహ్నములేవియు గోచరించుటలేదు. సంకెళ్లలోనున్న ఆతని శరీరమునుండి అపూర్వతేజ మొకటి తెరలుతెరలై ప్రవహించుచున్నది. అనంతమును అగాధమును నగువిశ్వమందలి భావము అదృశ్యమైయుండక సప్తరాగసమ్మిళితకాంతి వర్షమున మెడతెగనిధారయై చూపట్టునట్లు ఘన హృదయుండగు భక్తుని భావము మహాకవి భావమట్లు అంతరంగమునుండి కుంభవృష్టి కురియుచు కన్నులు కలవానికి గోచరించును. మహంతజీని కొంత సేపు తనలో నిమిడించుకొన గలిగిన కారాగృహము నేడు భావపూరితమైనది. ఆవేగసంభరితమైనది. జగదీశుడుకూడ నిపు డం దుపవిష్టుడై యున్నాడు. భక్తివేగమున, భావపూరమున నాత డుక్కిరిబిక్కిరియైనాడు. ఇక నాతడు తడయజాలకపోయెను. నిజకంఠమునందలి పూలదండదీసి మహంతజీ మెడ యందువేసి జగన్నాథుడు చరచర రాజసౌధమున కరిగినాడు.

రాత్రి. ఇంకను తెల్లవారుటకు కొంతయాలస్యమున్నది. ఎల్లరును గుండెలపై చేతులు వేసికొని హాయిగ నిద్రించుచుండిరి. హంసతూలికాతల్పమున ప్రతాపరుద్రమహారాజు శయనించియుండెను సుఖస్వప్నములు కనుచుండెను. జగన్నాధుడు స్వప్నమున నాతనికి ప్రత్యక్షమై యిట్లు పలికెను. "రాజా! నీయింటికి చుట్టములుకాని మిత్రులుకాని మఱే యతిథులు కాని వచ్చినయెడల వారిని తగినట్లు సమ్మానింపక తరిమివేయుదువా? యాజపుర మెచ్చట! జగన్నాధపుర మెచట! యాజపురమున నివసించు నామిత్రుడొకడు కాటకమువలన పీడితుడై ఆలుబిడ్డలను గొనుకొని క్షుద్బాధకోర్వజాలక నాసమ్ముఖమున కరుదెంచినాడు. రత్నఖచితమగు నాబంగారు పళ్లెరమున నాతనికి స్వయముగ ప్రసాదము పెట్టితిని. దొంగయని నీయనుచరులు ఆతనిని బహుభంగుల హింసించి ఆతనికడనుండి పళ్లెరము నూడవెఱికి కాళ్లుచేతులు కట్టి ఒక చీకటికొట్టునందు ఆతనిని బంధించివేసిరి. ఆతని యాలుబిడ్డలు నిస్సహాయులై గోలుగోలున నేడ్చుచున్నారు. నీవు ఏలికవై యుండి యిట్టి దారుణకృత్యమునకు చోటిచ్చుచుంటివా? ఇప్పుడైనను కన్నులు తెరువుము. నా యాదేశమును పాలింపుము. ఉదయముననే యాతనిని బందినుండి తొలగింపుము. తప్పిదమును క్షమింపుమని యాతనిపాదముల పట్టుకొనుము. తీర్థజలమున ఆతనికి స్నానము చేయించి అమూల్యములైన బహుమానములిచ్చి ఆతనిని సత్కరింపుము. అనంతరము నాఆలయమున లెక్కలు వ్రాయుటకై వానిని నియోగింపుము. మరణపర్యంతము నిజదారసుతులతో నాతడు సర్వసౌఖ్యముల నందునట్లు వ్యవస్థచేయుము. ఇట్లు చేయవేని నీకును నీరాజ్యమునకును చేటు వాటిల్లక మానదు." ఇట్లు పలికి జగదీశు డదృశ్యుడయ్యెను. రాజన్యుడు నిద్దురనుండి మేలుకాంచినాడు. మేల్కాంచి వెంటనే జగదీశు నాజ్ఞను పాలించుటకై రాజన్యు డాతురపడి యందులకు వలయునన్నాహములు చేయదొడంగెను.

మహాంతజీ కైదునందు గీతగోవిందములు పాడుచునే యున్నాడు. ఆతని కన్నులనుండి యానందబాష్పధారలు విరామములేక స్రవించుచునే యున్నవి. రాత్రి కడచిపోవుచుండెను. ఉదయారుణకాంతులు కారాగార కవాటరంధ్రములనుండి లోనికి తొంగి చూచుచున్నవి. అంతలోనే ప్రతాపరుద్రమహారాజు సపరివారుడై గుమ్మమును చేరుకొనినాడు.

తలుపు చప్పుడయ్యెను. మహంతజీ యులికిపడలేదు. జగన్నాథుని ప్రస్తుతించుచునే యున్నాడు. నిముసములో తలుపులు బారుగ తెరవబడెను. రాజన్యుని దృష్టి ఎదుటి భక్తునిపై పడెను. స్వప్నమున జగదీశుడు చెప్పిన చొప్పున నతని దేహము మిక్కిలి కృశించియుండెను. చివాలున ముందున కుఱికి తే డాతని సంకెలలు విప్పినాడు. మహంతజీ కన్నులు విప్పి చూచినాడు. సంకెలలు విప్పినతోడనే రాజన్యుడు నేల బోరగిలపడి మహంతజీ చరణములను గట్టిగ పట్టుకొని బాష్పపూరితలోచనుడై పలుమా ఱాతనిని క్షమింపవేడు కొనెను. మహంతజీ కన్నులనుండి సుధావర్షము మఱింత వేగముగా గురియ దొడగెను.

పిశాచము ఆర్తనాదము సలుపుచు నేలగూలినది. అత్యాచార మడు గంటినది. సచ్చరిత్రము విజయభేరీ మ్రోగించినది. సద్భక్తి విజయకేతన మెత్తినది. అంతయు చూచుచున్న దిక్కులు ఆనందపరవశమైనవి. దిగ్వలయము చెంత ఆకాశము మోకరించి మహాభక్తునకు మాటిమాటికి మ్రొక్కినది. నిలింపులు ఆనందావేశమున ప్రభాతమున గీతికావర్షము గురుపించిరి. బంగారు చాయగల సూర్యకిరణములు కడుచిత్రముగా నాట్యము సలిపినవి. అదృశ్యుడై జగన్నాథుడు భక్తునిచుట్టును తన్మయనృత్యము సలిపినాడు. మనుష్యజీవనము కష్టములతోడను దుఃఖములతోడను నిండియున్నదనియు పంకిలమయమైన దనియు అహస్యకరమైనదనియు నెంచి నిరుత్సాహమున నెడతెగని విచార మున మునుగువారు ఈముహూర్తమున ఈశుభముహూర్తమున తమగతమును మఱచి తమ మనసుల నానందముతో నాశతో నింపుకొని పునరుద్ధరణమును పునరుద్ధరణమే కాదు పునర్జన్మమును ఇహజీవనమందే ఇహజన్మమునందే పున ర్జన్మము నందుదురుగాక ! దేవత్వమునుమించిన మనుష్యత్వమందలి మహత్త్వ మును గుర్తించి తాండవనృత్యము సల్పుదురుగాక !

ప్రతాపరుద్రుడు మహంతజీ పాదములనుపట్టి వదలక " మహాత్మా ! క్షమింపుము. అపరాధము సల్పితిని మన్నింపుము. గుర్తింపనైతిని. ఎఱుంగ నైతిని. అజ్ఞానుడనైతిని. అంధుడనైతిని. నన్ను దయచూపుము క్షమింపుము " అని అనేకవిధముల వేడుకొనెను.

నెచ్చెలి లీలయని మొదట మహంతజీ ఆనందబాష్పములు కురిపించి నాడు. కాని ప్రస్తుతదృశ్యము మహాద్భుతమై కనుపట్టుటచే నేమియు పాలు

పోక నేమియు గ్రహింపనేరక పాదములపై బడి పరిదేవన మొనరించుచున్న మహారాజును వారింప నాతడు ప్రయత్నించినాడు. తాను మరల నేదేని తప్పిద మును చేయలేదు కదాయని అతడు తలంచినాడు. విద్దూరమేమో యెఱుగక రాజన్యుని కడుప్రయాసమున నాతడు తనపాదములకడనుండి తొలగించినాడు. రాజుయొక్క చర్య చూచి ఎల్లరును ఆశ్చర్యాన్వితులై పోయిరి. మహాత్ముని కెంతయు నెగ్గుజరిగినదని యెల్లఱును గ్రహించిరి. ప్రభువు మహంతజీపదముల నుండి తొలగినంతనే ఎల్లఱును ఆపాదరాజీవములను స్పృశించి ధన్యులమైతి మనుకొనిరి.

అనంతరము రాజన్యుడు మహంతజీఆలుబిడ్డల నచటికి రప్పించినాడు. మహంతజీభార్యమ్రోల నతడు సాగిలపడి "అమ్మా! అపరాధము సైరిం పుము" అని ప్రార్థించినాడు. బిడ్డలనెత్తి ముద్దాడినాడు. జగదీశుడు మమ్ముద్ధ రించినాడని ఆయమ ఆనందించినది.

కుటుంబసహితముగ మహంతజీని బంగారు పాలకియందు కూర్చుండజేసి వారిని దేవసమ్ముఖమునకు గొంపోయినాడు. వారిచే తీర్థస్నానము చేయించి నాడు. వారిని వివిధపుష్పములతో పూజించినాడు. పన్నీరును అత్తరును పలు విధసుగంధద్రవ్యములును వారిపై జల్లినాడు. వారికి దివ్యాలంకారములును దివ్యాంబరములును నొసగినాడు. వివిధభక్ష్యభోజ్యలేహ్యచోష్యములచే వారిని సంతృప్తిపఱచినాడు. ఆలయమంతయు మంగళవాద్యములతో మారు మ్రోగెను. జగన్నాథక్షేత్రమంతయు అనంగగీతికలతో వెల్లివిరిసినది.

పిమ్మట ప్రతాపరుద్రుడు ఆజీవము మహంతజీకి అతులైశ్వర్యము లిచ్చు భూదానముచేసినాడు. దేవుని గద్దెయొద్ద మహంతజీని గూర్చుండబెట్టి వంశ పారంపర్యముగ దేవాలయపు లెఖ్ఖలవ్రాయు నుద్యోగమున నాతని నియో గించి ఉద్యోగపుపట్టాను వ్రాసి యిచ్చినాడు.

ప్రతాపరుద్రునకు వచ్చిన స్వప్నవృత్తాంతమును మహంతజీ సత్యవృత్తాం తమును భక్తియొక్క అద్భుతవిజయమును పురవాసులందఱు అబ్బురముతో చెప్పుకొనసాగిరి. ఈవింతవిషయమును విని పొరుగూళ్లనుండి ఎందరెందఱో వచ్చి మహంతజీని దర్శించిరి. ఆతని పాదధూళి శిరమున ధరించిరి. మహంత జీని క్రూరదండనమునకు పాలుపరచిన పండాబ్రాహ్మణులును, రాజభటులును వచ్చియాతని పాదరాజీవములపై బడి తమ్ము క్షమింపుమని బహుభంగుల

వినయపూర్వకముగా కాతరస్వరమున వేడుకొనిరి "జగదీశునెడల నిట్టిమైత్రి జూపి ఆతనివలన నీరీతి మైత్రినందువా రెందఱుందురు ? మహాత్మా! దీనబంధుని నీవే గుర్తింపగలిగినావు ఆహా ! నీభక్తియొక్క మహిమయెట్టిది. నీవు నిజముగ ధన్యుడవు" అని ప్రజలందఱు మహంతజీని ప్రస్తుతించిరి. లెక్కలేని యా జనులకు మహంతజీ యేమి ప్రత్యుత్తరమీయగలడు. వారితో నాతడెట్లు ప్రసంగింపగలడు. శిరమువంచి నిలచి ఆతడు హరిభజనము చేయదొడగినాడు. వినయముకంటె నధికముగ భక్తియు, భక్తికంటె నధికముగ వినయమును ఆతనియందు విరాజిల్లినవి. తన నెచ్చెలి యపారవాత్సల్యమును తలంచిన కొలంది, మహంతజీ కన్నులనుండి ఆనందవర్షము ఎడతెగక కురియదొడగెను.

శతాబ్దములు జరిగిపోయినవి. నేడును ఈభక్తచూడామణి వంశీయులే పురుషోత్తమధామమున లెఖ్ఖలను వ్రాయుచున్నారు. నేడును మహంతజీ జయగీతములే దేవమందిరమున ప్రతిధ్వనించుచున్నవి.

అద్భుతమైన మిత్రవాత్సల్యమునెడ చలింపని విశ్వాసమునిలిపిన మహాత్ములెందఱో మన భారతభూమియందు పుట్టినారు. అదృశ్యుడైన భగవంతుడు అనవరతము తోడు నీడవలె తిరుగు నెచ్చెలియని భావించి ఇట్టి మహాత్ములు తమ మానప్రాణములను ఆతని కప్పగించి ఫలము నపేక్షింపక మహాద్భుత జీవనములు గడపిరనుటకు ఈమహంతజీ జీవనమే తార్కాణము.

మానవుని మనుగడకు రక్షక మగునది విశ్వాసమే. ప్రళయకాల మహాభయంకరఝంఝానిలయమైనను ఈవిశ్వాసమును ; మహాభక్తుడు చూపు నిశ్చంచల విశ్వాసమును అట్టిట్టు లాడింపనేరదు. సమస్త ప్రాణములను తన వాక్కులందునింపి మహంతజీ యట్లు జగదీశుని పిలిచినపుడు తన్నుగాన ట్లూరకొనుటకు దేవదేవుడు ఇష్టపడునా ? మిన్నకుండుట అతనికి సాధ్యమగునా ?

. ప్రహ్లాదుని కథ సత్యయుగమునాటిదే యగునుగాక. గజేంద్రుని యుదంతము ఉత్తమయుగములోనిదేయనుడు కలికాలము విశేషముగా కలుషముతో కూడి యున్నదే యనుడు. అయినను పూర్వయుగములందు జన్మించిన మహాభక్తులకు తీసిపోవని భక్తులు ప్రస్తుతయుగమునందును పుట్టుచున్నారు. భద్రాచల రామదాసు లెందఱో యున్నారు. లేరను వారు కన్నులులేనివారు; భక్తియందును, మతమునందును, ధర్మమునందును విశ్వాసములేనివారు ; జగదీశుని

మీాది విశ్వాసమును కోల్పడిన నాస్తికులు. నిష్కామజీవులగు నీమహాభక్తులు కీర్తికాములుకారు. ప్రజలకన్నులయెదుట తమ మహత్త్వము తేటపడవలెనని వీరాశపడలేదు. అద్భుతమంత్రశక్తిగల కలములెవ్వియు భావసంభరితములగు మహాకావ్యములువ్రాసి ఈభక్తుల కమరత్వము ప్రసాదించినవికావు.

తనకు సంభవించినకీడు తన పరీక్షయని ఎంచువాడే జగదీశుని ప్రేమింపగలడు. తన తల వ్రక్కలుసేయు ఆపదలు దేవుని చేతిదెబ్బలని తలంచువాడు భగవంతునెట్లు ప్రేమింపగలడు? ఆతనియునికియందెట్లు విశ్వాసముంచును? ఈ విశ్వాసమును ఈప్రేమను మానవుడు పోగొట్టుకొనిన నాడే తానును నశించినవాడగును. అతని హృదయము సంశయముల కాలవాలమగును. దౌష్ట్యమునకు పుట్టినిల్లగును. అతని మనస్సునుండి ఆనందమును శాంతియు నంతర్ధానమగును. శరపరంపరలుగా నాపద లాతనిజీవనముపై పడును. అతడు పిచ్చివాడగును. ఏదరియుగానని నిర్భాగ్యుడగును. తన యాపదలు తనకు తటస్థించిన కీడులు తనకు సంభవించిన హానులు ఆధ్యాత్మిక జీవనమున తనను అగ్రసరుని గావించునని తలంచునాడు నేడు నిప్పుగుండమున నిలిచినను ఎన్నడును వాడిపోని కమ్మకమ్మతావులు వెదజల్లు పల్లవముల రాశియందు అనంతకాలమునిలువగలడు. ఇట్లని మహంతజీ చరిత్రము వేనోళుల జాటుచున్నది. ఓర్పుయొక్కయు శాంతియొక్కయు విజయ మనివార్యమనియు నీపవిత్ర చరిత్ర ఘోషించుచున్నది. సాగరమువలె దోచు దుఃఖమునకును దిక్చ్రకమొక్కటి యున్నదనియు దీనులకు చేయూత నొసగుటకు జగదీశుడందు నిలచియుండుననియు తనను నమ్మినవారి నాతడెన్నడు విడువడనియు నీయుదంతము ఘంటాపథముగా తెలుపుచున్నది. ఉన్నతాశయముల మహాత్త్వ మిట్టిదనియు అవసరమగు పట్టుల జగదీశుడే ప్రత్యక్షప్రపంచమున ప్రకాశమొనరించుననియు నీయాఖ్యాయిక వ్యక్తీకరించుచున్నది.

"శ్లో. ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి."

(శ్రీభగవద్గీత ; సాఙ్ఖ్యయోగః)

(అట్టివానికి మనోనైర్మల్యము గలిగినతోడనే దుఃఖములన్నియు బోవును, చిత్తము నిర్మలముగానున్నవానికి వేగముగా బుద్ధి స్థిరపడును).

౪౧

# శ్రీ ర యి దా స స్వా మి



" శా. వేదోద్ధారక ! మంథభూధరధరా ! పృథ్వీసముద్ధర్త ! ప్ర
హ్లాదోపాసిత ! యాచనాపహృతబల్యైశ్వర్య ! దుష్టేద్వన
చ్ఛేదీ ! శైవధనుర్విభంగచణ ! దుశ్చేష్టప్రలిశిక్షాది మ
ర్త్యాదప్రాణ మరుత్సణిప్రదర ! రామా ! యార్తరక్షామణీ.

రామానందస్వామి నొక బ్రాహ్మణయువకుడు సర్వదా సేవించుచు అతనికడ శాస్త్రములు చెప్పుకొనుచుండువాడు. యువకుడు కఠినమగు బ్రహ్మచర్యవ్రతము నాచరించుచుండువాడు. గురుని యానతి శిరమున నిడికొని ప్రతిదినమాతడు అనువగు ప్రదేశములందు బిచ్చమెత్తి లభించిన బియ్యముతో నన్నమొండువాడు. ఆచార్యుడా యన్నమును యిష్టదేవతకు భోగముగా సమర్పించుచుండువాడు. ఈరీతిగా బిచ్చపు బియ్యమువలననే జగదీశునకు నిత్యనివేదనము జరుగుచుండెను.

ఎడ్డీవ్యాపారమున జీవనముచేయుచు విశేషధనమూర్జించుచున్న సాహుకారొకడు బ్రాహ్మణయువకునకు ముష్టివేయ నొకనాడుద్దేశించినాడు కాని యాచార్యుని యనుమతిలేనిదే బ్రహ్మచారి యాసాహుకారిచ్చు తండులము గ్రహింప నిచ్చగింపకుండెను.

ఒకనాడు తీవ్రమైన గాలివాన కురియదొడగెను ఆగాలివానలో బ్రహ్మచారి యావలకు బిచ్చమెత్తుటకై పోజాలకుండెను. అందుచే సాహుకారు కడనుండి తండులమును దెప్పించుకొని యెప్పటివలె నాతడు భోగాన్నమును సిద్ధము చేసినాడు. ఆచార్యుడు భోగాన్నమును నైవేద్యమునకై కొనిపోయెను. కాని పరమేశ్వరధ్యానమున నతని మనస్సు మునుపటియట్లు నిబద్ధము కాకుండెను. గురువర్యుడందులకు మిగుల నాశ్చర్యముచెంది శిష్యునుద్దేశించి " వత్సా! నేడు నీవెందుండి బిచ్చము దెచ్చితివి ? " అని ప్రశ్నించెను. " ప్రభూ ! నేడు

దైవము ప్రతికూలుడైనందున నవ్వలికి పోజాలకుంటిని. అందుచే వడ్డీవ్యాపారముచేయు నొక సాహుకారునియొద్దనుండి తండులములు దెప్పించి భోగాన్నమును వండితిని." అని శిష్యుడు పలికెను. గురుడు మిగుల కోపించి "అనుచితమగు విధమున ధనమార్జించువానికడనుండియు విషయలాలసుల యొద్దనుండియు ముష్టిగొనినయెడల చిత్తము మలిన మగును. ఇట్లని నీకో పలుమారు చెప్పితిని. నీవు స్వధర్మమును కాపాడుకొనజాలకపోతివి. నాయాదేశమును సరకుగొనక నీధర్మము పాలింపనందులకు నీవు తగినశాస్తి ననుభవింపవలసియున్నది. కొలదినాళ్లలో నీ వీజన్మమునుబాసి నీచకులమున బుట్టెదవు" అనియెను.

ఆచార్యుని శాపము తిరుగులేనిది. బ్రాహ్మణయువకుడు అచిరములో మృతుడై మాదిగకులమున పుట్టెను. పూర్వజన్మమున నాచరించిన సత్కర్మము వలనను సద్గురు సేవవలనను అతడు పూర్వజన్మజ్ఞానము కలిగియుండెను. మునుపటి జన్మయందలి విషయములన్నియు నతనికి బాగుగా తెలిసియుండెను. అందుచే పుట్టువుతోడనే ఆతనిహృదయము హరిభక్తిచే నిండియుండెను. కాని గురునితో సంబంధము తెగిపోయినందుల కాతని మానసము మిక్కిల వ్యథ చెందెను. అందులకై యతడు దివారాత్రములు విచారించుచుండువాడు. ఆతని తలిదండ్రులు పాలిచ్చియు తినుబండముల నిచ్చియు బుజ్జగించియు జోలపాడియు మంత్రించియు నెన్నియో యుపాయములు ప్రయోగించియు నాతని యాక్రందనము మాన్పప యత్నించిరికాని బాలుడు పోరుపెట్టుచునేయుండెను. అందులకు జననీజనకులు మిక్కిలి దుఃఖించినవారై రామానందస్వామి పాలికరిగి బిడ్డని యవస్థ యావత్తు నాతనికి నివేదించి యమోఘమైన యాతని యాశీర్వాదమును కోరిరి.

సర్వము నెఱింగిన రామానందస్వామి ఈవృత్తాంతమునువిని, తన ప్రియశిష్యుడు చండాలకులమునపుట్టి గురుసంసర్గ విచ్ఛేదము మూలమున పాలు త్రాగుటమాని పోరుపెట్టుచుండెనని గ్రహించెను. ఆతని హృదయమున కరుణారసము నిండిపోయెను. దిగులుగొని బిడ్డకష్టము చెప్పుకొనుచున్న మాదిగవాని నుద్దేశించి యాతడు "నీవు బిడ్డకై చింతింపకుము. నన్ను మీయింటికి గొనిపొమ్ము. బిడ్డను బాగుపఱచెదను" అనియెను. చండాలుడు చేతులు జోడించి వంగి "ప్రభూ నేను నీచకులస్థుడను. తమవంటి మహాత్ముల పాదధూళి నందు

టకు నాగృహమున కర్తతలేదు. అంగుచే మిమ్ము చటికి తోడ్కొనిపోవుటకు సంశయించుచున్నాను" అనెను. అనుటయు నాచార్యుడు "నీవందులకై చింతింపవలదు. సేవానన్ముఖమున నంటరానితనమునకు చోటులేదు. భగవం తుని సేవయనగా ఆతని బిడ్డలగు జీవులసేవయే. సకలజీవరాసులు భగవంతుని ప్రతిమలు కావే! అట్టిచో ప్రజాసేవమాని ముక్కుమూసికొని ఈశ్వరు నారాధించుచుంటిమని పొంగువానికంటె వెట్టివాడెవ్వడు? పరోపకారమే నిక్కమైన హరిసేవ. ఈ సేనసలుపుట నాధర్మము. స్వధర్మనిర్వాహణమున స్థాన వివక్షతలను కాలవ్యత్యాసములను గణింపనొల్లను. నడువుము నీవెంట వచ్చె దను" అని యాతనితో పలికెను.

అనంతరము రామానందస్వామి మాదిగవానితో గలిసి యాతనియింటికి జనెను. పోరుపెట్టు పసిపాపను చంకబెట్టుకొని చండాలమాత స్వామిజీ కట్టెదుట నిలచినది. దప్పిగొనిన చాతపక్షికరణి బిడ్డ తదేకదృష్టితో స్వామిజీ ముఖమును చూచుచుండెను. ఎడతెగని కన్నీటిని విడుచుచు హృదయవేదనను నాచార్యునకు దెలుపదొడగెను.

శిష్యుని భక్తిభావమును ఆచార్యుడు గ్రహించినాడు. అతని మానసము కారుణ్యముతో నిండిపోయెను. బిడ్డశిరమును సాదరమున నిమురుచు గురువు "వత్సా! దుఃఖింపకుము. భక్తవత్సలుడు శ్రీరామచంద్రుడు ఈజన్మ యందే నిన్నుబ్రోచును. నీవు ధన్యుడవగుదువు" అని పసిపాప చెవిలో రామ నామ మహామంత్రము నుపదేశించి బిడ్డమొగమున శాంతరేఖను ఆనందదీప్తిని గాంచి తన ఆశ్రమమునకు మరలిపోయెను.

బిడ్డక్రమక్రమముగా పెరిగి పెద్దవాడయ్యెను. శ్రీరామచంద్రమూర్తి యెడల భక్తికూడ నతనికి దినదిన ప్రవర్ధమానమగుచుండెను. మధుర రామ నామసంకీర్తనము సలుపుచునే యతడు కులవృత్తి నిర్వహించుచుండువాడు. దిన మునకు రెండుజతల చెప్పులజోళ్లు కుట్టి ఒక జతను తనకెదుట దోచు రామ భక్తునకు దానముచేసి రెండవజతనమ్మిన పైకముతోడ మాత్రమే అతడు పొట్టపోసికొనుచుండువాడు. హరిభక్తుల జోళ్లను పైకము తీసికొనకయే బాగు చేయుచుండువాడు.

ఇట్లు కొంతకాలము కడచిపోయెను. రుయిదాసు బంధుమిత్రులను వదలి గంగాతీరమున నొక పర్ణశాలను నిర్మించుకొని అందు రామవిగ్రహము నొక దానిని స్థాపించి నిత్యము నా విగ్రహమును పూజించుచుండువాడు. కులవృత్తిని జరుపుకొనుచు పొట్టపోసికొనుచుండువాడు. జోళ్లజత లమ్ముడుకానినాడు చేత పైకము లేక అత డుపవాసము చేయుచుండువాడు. ఆకలి దప్పులను సరకు గొనక అతడు నిత్యదేవతా పూజయందు నిమగ్నుడై యుండువాడు.

భక్తుడు కష్టపడుచుండ కరుణామయుడగు రామచంద్రుడు చూచి సహింపగలడా! అతని దారిద్ర్యము బాపదలచి యొకనాడు జగదీశుడు మాఱు వేషమున నాతని పర్ణశాలకు వచ్చి రుయిదాసునకు అపూర్వమగు వస్తువు నొక దానిని చూపి "వత్సా! నీ వికఁ పేదరికమునుండి తొలగిరమ్ము, నీ కొఱకై ఇదిగో నే నొక స్పర్శమణిని గొనివచ్చితిని. దీనితో నినుమును గాని ఉక్కును గాని తాకితివేని అది వెంటనే బంగార మగును. దీని వలన నీ వైశ్వర్యవంతుడవు కాగలవు దీనిని గైకొనుము" అని యాతని కీయబోయెను.

స్పర్శవేదిని అందుకొనక రుయిదాసు ఆవచ్చినవాని నుద్దేశించి "అయ్యా! నీ వెవరవు? నాయెడల నీకు కరుణయేల జనించెను?" అనియెను. "వత్సా! నేను నీయిష్టదైవమును రామచంద్రుడను. నీ కష్టమును తొలగింపవలెనని యెంచి వచ్చితిని. పరుసవేదిని దీసికొనుము" అని యవ్యాజవాత్సల్యముతో నాయాగంతువు పలికెను.

"బాబూ! నీవు నిజముగా నాకిష్టదైవమగు శ్రీరామచంద్రమూర్తివే యైతివేని నీ నిజరూపమును జూపి నన్ను ధన్యుని గావింపుము. ఎద్దియో రాతిని దెచ్చి యూరక నన్నాశపెట్టెద వేల?" అని రుయిదాసు ప్రత్యుత్తరమునిచ్చెను.

"ముందీమణిని తీసికొనుము" అని పలికి మాఱురూపమున నున్న రాముడు పరుసవేదితో నా పర్ణశాలయందున్న కత్తిని తాకెను. తోడనే యది బంగారుకత్తి యాయెను.

రుయిదాసు భీతినొంది "మహాశయా! నీ వెవరవో నా ముందు గారడి విద్యను ప్రదర్శించుచున్నావు. కులవృత్తి జరుపుకొనుటకు విధిగా నాకు కావలసిన యీ కత్తిని బంగారు చేసివేసినావు. ఇపు డీకత్తి నా కెందులకు పనికి రాదు. నాయనా! నీ రాతిని నీవే తీసికొనిపొమ్ము. ఇది నా కక్కరలేదు." అని పలికెను.

"వత్సా ! నీ యినుపకత్తి యిప్పుడు బంగారుకత్తియై వెలలేనిది యయ్యెను. దీనివలన నీకెంతేని ధనము లభించును" అని యా యాగంతువు పలికెను.

"ప్రభూ ! నీ పరుసవేదివలన నాకెంతేని చేటు వాటిల్లును. రాశి రాసులుగా బంగారు కూడబెట్టవలెనను కోరిక నా మనస్సున దీనిమూలమున జనించును. ఈ కోరిక నాయందహంకారము పుట్టించును. ఈ అహంకారము నన్ను నా రామునుండి వేఱుచేయును. తుచ్ఛమగు ఐహికధనము మీఁద మనసు నిలిపి పరమమైన ధనమును గోలుపోవుదును. ఈ పరుసవేది నాకు ముక్తినిచ్చుటకు మాఱు నాకెంతేని ముప్పు తెచ్చిపెట్టును. దయయుంచి దీనిని నీవే కొనిపొమ్ము" అని రుయిదాసు పలికెను.

అపుడుకూడ లీలామయుండైన జగదీశుడు రుయిదాసు పలుకులను పాటింపక ఎట్లో స్పర్శవేధి నాతనిచేతుల బెట్టివేసి యందుండి వెడలిపోయెను.

రుయిదాసు బంగారుకత్తిని పరుసవేదిని రెంటిని కుటీరమందొకమూల బాఱవేసి వేఱొకకత్తిని సంపాదించి మునుపటివలె కొంతకులవృత్తిని నలుపు కొనుచు తాను తయారుచేసిన పాదరక్షలమ్ముడుకానినాడు కఠినోపవాసము నలుపుచు మానసమును రామచంద్రునిపై నిలిపి ఎప్పటివలె జీవనము గడుపు చుండెను.

భక్తుని కఠినవ్రతమును రామచంద్రుడనుక్షణము పరికించుచునే యుండెను. అతని కఠినోపవాసములు చూచి జగదీశుడు పరితాప మొందు చుండెను. ఆలసింపజాలక పూర్వపు రూపముననే మరల నాతడు రుయిదాసునకు ప్రత్యక్షమై "తండ్రీ ! నీకిచ్చిన పరుసవేది నేమిచేసితివి ?" అని ప్రశ్నించెను. "బాబూ ! నీవిచ్చిన మాయశిలను బంగారుకత్తిని గుడిసెయందొకమూల బడవేసితిని. ఇపుడే వానిని దెచ్చి నీకిచ్చెదను. అవి మఱెవ్వరికైన కావలసిన యెడల నిచ్చిన నిమ్ము" అని రుయిదాసు ప్రత్యుత్తరమిచ్చెను. అంతట నాతడు "స్పర్శవేధిని నీచెంత నుంచుకొనుటకు నీకిష్టము లేనియెడల దానిని నే దీసికొనిపోదును. కాని నాయొద్దనుండి నీవు ఏకొంచెపాటి వస్తువైనను పుచ్చు కొనక తప్పదు. నీవు నిత్యమును పూజచేయు విగ్రహాముచెంత దేవునిపీఠముపై ప్రతియుదయమున నైదు బంగారునాణెము లుండును. నీవు వానిని దీసికొని

తీరవలెను. ఇపుడు పీఠమును పరికింపుము. రమ్ము" అని రయిదాసును దేవతార్చనస్థానమునకు గొనిపోయెను.

రయిదాసు పీఠముపై కన్నుంచినాడు. బంగారునాణెములందు విరాజిల్లుచున్నవి. ఆశ్చర్యపడి యాతడావ్యక్తి నుద్దేశించి "అయ్యా! నిజముగ నీ వెవ్వడవో నాకు చెప్పుము. ఈ యధమునికొఱకై నీవేల యింతగా తలపోయుచున్నావో తెలుపుము" అని యడిగెను.

"వత్సా! నేను నీవాడను. చిరకాలమునుండి నీవు పడయగోరు రాముఁడను. నీవంటి భక్తశేఖరుని కష్టముచూచి నేను సహింపజాలకున్నాను. నీదుస్థితి నాకెంతయు విచారము కలిగించుచున్నది. నిన్ని నిష్ఠురపరిస్థితినుండి తొలగింపదలచి పలుమాఱు నీ కడకు వచ్చుచున్నాను. ప్రతిదినము దేవుని పీఠమున గానుపించు ఐదు బంగారునాణెములను దీసికొని దారిద్ర్యవిముక్తుడవై నన్నానందపెట్టుము. ఈవాంఛ దీర్చెదనని మాటయిమ్ము" అని యాగంతువు పలికెను.

"ప్రభూ! నీవు చెప్పినచొప్పున నాచరింతును; కాని దీనికొక షరతు కలదు. నీ నిజరూపమున నాకు దర్శన మిచ్చి యీ అధముని కృతార్థుని చేసిన గాని నీవాంఛ దీర్పజాల" నని రుయిదాసు పలికెను.

తోడనే రామచంద్రభగవానుడు నిజరూపమున రుయిదాసు నెదుట సాక్షాత్కరించి నిముసములో నంతర్ధానము నొందెను. దాసు మనసున నద్భుతజ్యోతి వెలిగెను. దివ్యమూర్తిని గాంచి యతడు ఆనన్యయనృత్యము సలిపెను. రయిదాసు మానసమున జనించిన భావప్రవాహ్మండమును వర్ణింపనలవిగాదు. దాసే యేమియు పలుకజాలక స్తంభితునివలె, హతబుద్ధిమాడ్కి నిలిచి కనులు మూతపెట్టక చూచుచుండెను. తరువాత నొకక్షణమునకు తెలివినంది, ఉన్మాదునివలెవడి "రామా! రామా!" అని కేకలువెట్టుచు నిటునటు పర్వెత్త సాగెను. రాము డప్పుడే అంతర్ధానుడైనాడు. విభ్రాంతచిత్తుడై యఱచుచు నతడు పరువులెత్తుచు గట్టిగా నిట్లు విలపింపదొడగెను. "హా రామా! నవఘన శ్యామా! దూర్వాదళనిందితరాగ నందీప్తకాయా! పీతాంబరధారీ! శ్యామ సుందరా! నిముసమాత్రము నయనరంజన మొనరించి మాయమైతివేల? ఆహా! నే నెంతనిర్భాగ్యుడను. రఘురాముడనని చెప్పుకొనుచు నీవు నావెంట పలు

మాఱు సంచరించినను నాచుట్టును పలుమాఱు తిరిగినను నిన్ను గుర్తింపక పోయితిని. ఎంత దురదృష్టవంతుడను ! ఇంక నీ వెక్కడ దొరకుదువు ! నిన్ను గుర్తింపక మీదుమిక్కిలి సంశయించి నీ పట్ల నేనెంత ఎగ్గుచేసితిని ! అట్లని నీవు కినియక నాసుఖమునకై మిక్కిలి శ్రమపడి బంగారురాణెములు తెచ్చి నన్ను తృప్తిపఱచుటకై ఎంతగా ప్రయత్నించితివి ! నేను గుర్తింపక పోయినను నీవు తృప్తిపడినట్లు కాన్పించితివి. నాకై సేవలు చేయుటకు దీనుడవై వచ్చితివి. మఱల వచ్చి నన్నాశ్రయించి నీదివ్యమంగళ స్వరూపమును చూపి నన్ను కృతార్థుని చేసితివి. సేవలాడి నన్నొక్క మారు నిలువబెట్టి ఒక్కమాఱు దివ్య తేజమున తళుక్కుమని అంతర్థానుండవైతివి. కరుణామయుడవని ప్రణయుకునివని ఎంతటి యద్భుతదృష్టాంతము చూపితివి ! జగదీశా ! రెప్పపాటు వేళలో నెన్ని బ్రహ్మాండభావములు నా మనోవీధిని దొరలింపచేసితివి ! అయ్యో ! బొమ్మవలె నిశ్చేష్టుడనై నిలువంబడిపోయితిని. పోనియ్యనని నీ రెండు పాదముల నేల గట్టిగాబట్టుకొననైతిని. తొలుతనే నేను నిన్ను గుర్తించియున్న పక్షమున నా హృదయమున నిప్పుడింత వియోగబాధ ఉత్పన్నమయ్యెడిది కాదు. ఆహా ! చిరకాలము నిన్ను నాముందు నిలుపుకొనజాలని నేను ఎంతమంద భాగ్యుడను. ఎంత నిర్భాగ్యుడను. తండ్రీ! రామా! మరలరమ్ము. నీదర్శనమిమ్ము. రామా ! రామా ! రామా ! " ఇట్లు విలపించి విలపించి వెఱ్ఱివానివలె యఱచి యఱచి దాసు తుదకు మూర్ఛిల్లెను.

కొంత సేపటి కాతనికి స్మృతివచ్చినది. కొంత సేపు ధ్యానమగ్నుడై యుండి " ఇట్లు విచారించిన లాభమేమి ? నన్నుగన్నతండ్రి నా యిష్టదైవతము రఘురాముడు వచియించిన మాటలను శిరసావహించెదను. ఆతనియొద్ద ఇచ్చిన మాటను జరిపెదను. ఆతని మక్కువను దీర్చెదను. ఆతనిని సంతోషపెట్టెదను. అనుదినము నాకొఱకై యాతడు తనపీఠమున నుంచు బంగారునాణెములు దీసి రామభజనమునకై రామనామసంకీర్తనమునకై రామభక్తపూజకై దీనజన సేవకై వెచ్చబెట్టెదను " అని తనలో తాను వితర్కించుకొని స్నానాది నిత్యకృత్యములు నిర్వర్తించుకొని రుయిదాసు పూజామండపమును ప్రవేశించెను.

నాడు మొదలు పలువురుభక్తులు దాసుపర్ణశాలయందు నిత్యము చేరుకొనదొడగిరి. ప్రతిదినము కుటీరము రామసంకీర్తనముతో ప్రతిధ్వనింపసాగెను. దీనులును దిక్కు లేనివారును దాసునకు దాసులైరి. దాసు సిద్ధముచేయు భోగాన్నము గొనుటకై అనుదినము మాఱువేషమున రామచంద్రభగవానుడు అచటికి వచ్చుచుండువాడు. మహాప్రసాదము నంది, ఎందఱెందఱో తనిసి తరించుచుండువారు.

తరువాత రుయిదాసు తన పర్ణశాలను శిష్యులకు వదలివేసి శ్రీరామ చంద్ర పదపద్మాంకితమైన చిత్రకూటమున వసింపదలచి యచ్చోటకరిగి యచట మందాకినీతీరమున తానొక యాశ్రమమును నిర్మించుకొనెను. ఈమందాకిని జాహ్నవియని చదువరులు తలంపరాదు. అదే పేరున బరగు మఱియొకనది. ఈనదియొడ్డున కామదగిరియని చిన్నపర్వతముకలదు. చిత్రకూటక్షేత్రమునకు కొంతదూరమున గాయత్రి, పయస్విని, మందాకిని యను మూడునదులు కలియును. అదియు త్రివేణీక్షేత్రమే. ఈక్షేత్రమునకు చుట్టును సుమారు ముప్పదిమైళ్ళ దూరముననుకు ఎన్నియో క్షేత్రములుకలవు. వీనిని చూచు టకు కాలినడకను బోవలయునుగాని మరియొక మార్గములేదు. హనుమాన్ ధారా, భరతకూపము, భరద్వాజాశ్రమము మున్నగు సుప్రసిద్ధ క్షేత్రము లచటివే. శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సహితుడై చిత్రకూటమున కరిగి నపుడు సపరివారఃముగా మిథిలానగరమునుండి జనకుడాతనిని జూడనరిగెనట. మామగారిని యాతని పరివారమును గౌరవించుటకు శ్రీరామచంద్రమూర్తి కోరిన వస్తువుల నన్నింటిని చిత్రకూట పర్వతమే యొసగెనట. కావుననే ఆకొండకు కామదగిరియను పేరువచ్చినది. ఆకొండ చుట్టును నేడెన్నియో యాలయములున్నవి. పర్వతమున కన్నివైపులను చక్కని మెట్లున్నవి. చిత్ర కూట యాత్రలో కామదగిరిప్రదక్షిణము ముఖ్యమైనది. ఇచటి ప్రకృతి దృశ్యము మిక్కిలి రమ్యమైయుండును. ఇచట రుయిదాసు ఆశ్రమము నిర్మించు కొని యందు వసింపుచుండ సీతాఝూలీయను నొక రాజ్ఞి యాతనివలన మంత్రోపదేశమునంది దీక్షాజీవనమును గడుప కాంక్షించినది. తనకోరిక సిద్ధించుటకై యామె చాలకాలమునుండి ప్రయత్నము చేయుచున్నదికాని ఆదర్శపూరుషుండైన యాచార్యుం డెవ్వరు నామె కింతవఱకు గోచరింపలేదు. స్వాములమనియు జగద్గురువులమనియు పెద్దపెద్ద బిరుదులుదాల్చినవారు పలు వురు నీతిబాహ్యులై ప్రవర్తించుచుండుటగాంచి నిట్టూరుపు నిగిడించి యించు మించుగ తన యుద్దేశమున కామె నీళ్లువదలివేసినది. కాని భాగ్యవశమున— భగవత్కృపవలన నామెకు రుయిదాసస్వామి దర్శనభాగ్యములభించెను. ఆతని గాంచినంతనే దాసు పరమభాగవతోత్తముడని యామె గ్రహింపగలిగెను. ఆమె మానసము భక్తిపూరముచే నిండిపోయెను. స్వామిజీ చరణసరోజముల

కడ్రవాలి తన్ను సేవకురాలిగా పరిగ్రహింపవలెనని యాతని నామె వేడు కొనెను.

కొందఱు పండితు లామెయొక్క యీ యుద్దేశమెఱిగి యనేక శాస్త్రములనామె యెదుటబేర్చి యామెతో "అమ్మా! నీవు ఉత్తమకులమునందు బుట్టిన యాడుదానవు. మహారాజ్ఞివి. ఒకమాలవానిని—మాలవాడేకాదు, అతనికంటె నధమాధముడు, చెప్పులుకుట్టుకొని జీవించుచుండెడి మాదిగవాని దరికి; అంటరాని, దగ్గరకుపోరాని, వానిదరికరిగి; మంత్రములేగాక యేమేమో తంత్రములకూడ చేయువానికడ కరిగి; యొక నీచుని కడకు యొక తుచ్ఛుని కడకు యొకతులువకడ కరిగి; మంత్రోపదేశము జేయుమనియు దీక్షాజీవనము నకు వలయు నక్షరాభ్యాసము జేయుమనియు నీవు వేడుకొనుట మాకు మిక్కిలి సిగ్గుగానున్నది. మాకు కడుంగడు నాశ్చర్యముగానున్నది. మాకు దుఃఖమును ఆగ్రహమును కలిగించుచున్నది. ఇంతకంటె లజ్జాకరమగు విష యము అవమానకరమగు విషయము మఱియొకటియున్నదా? నీ యీప్రయ త్నము మాకు తలకొట్టివేసినట్లున్నది. ఇది ధర్మవిరుద్ధము, నీచము. పాపబంధు రము. మాపలుకులాలించి మీసంకల్పమును విడువుడు" అని గట్టిగా పలికిరి.

రాజ్ఞి మూర్ఖురాలు కాదు. శాస్త్రములరీతి యెఱుంగనిది కాదు. "మహాశయులారా! మీరు తొందరపాటును అహంకారమును చూపు చున్నారు. మీరెల్లప్పుడు నుచ్చరించు వేదముల యర్థమెఱుంగక విహితా చారములను పాటింపక స్వార్థమునకు సాయపడు కొన్నితంతులు సృష్టించి మతముపేరునను ధర్మముపేరునను మీలోపలువురు వర్తకము సాగించు చున్నారు. అధ్యాత్మికమైన నిత్యకృత్యములయందలి నిజమైన యర్థమును గ్రహింపక గ్రహించుటకు ప్రయత్నింపక వట్టి బొమ్మలవలె యంత్రములయట్లు మీరు మెలంగుచున్నారు. భారతవిజ్ఞానమందలి మహత్త్వము తెలిసికొన జాలక శుష్కజీవనముల గడపుచున్నారు. ఈశాస్త్రములయం దెన్నిభువన ములు అణగి యున్నవో మీరెఱుంగరు. మీరు పలుకుచున్న శ్రుతి వాక్కులయందు బ్రహ్మాండమును నిండించు భావమున్నదని మీరెంత మాత్రము తెలిసికొనజాలకున్నారు. మీముక్తికై మీరు పాటుపడుచుండుట లేదు. పరులముక్తికై మీరు కష్టపడుటలేదు. నేను ముక్తిని కోరుచున్నాను.

మీామీా పెద్దకబురులు నాకు నచ్చవు. అబద్ధజీవనమున కంజలి ఘటించి సత్యాన్వేషణము చేయ శక్యమగునా ? స్వామిజీ నీచుడంటిరి. తుచ్ఛుడంటిరి. తులువయంటిరి. ఈవాక్కు లెట్టివి ? అతనిని మీారు గుర్తించితిరా ? ఆమహనీయునకును మీాకును చాలదూరమని మీావాక్కులవలననే తేటతెల్లమగుచున్నది. అతని జీవితమందలి యద్భుతముల నెఱుంగకపోయినను ఆతని హృదయమునుండి వెడలు దివ్యమరీచికలను వీక్షింపకున్నను నిత్యము నాతడు భగవదారాధనమందు జీవనము గడపుచుండ అతడు భక్తుడనియైన మీారు గుర్తింపవలసెడిది. అనృతవాక్కు కలుషమును ఘటించును. అనృతమునకు మీారు నిందను తోడుచేసిరి. రుయి నాను నీచకులమందే పుట్టుట నిక్కువము. కాని తన గురుగుణముకతన, తన మాహాత్మ్యముకతన జగదీశుని ప్రీతికి పాత్రుడు కాలేదా ? సర్వేశ్వరుని హృదయమున కౌస్తుభమణియై వెలుంగునాతడు మాలవాడైన నేమి ! మాదిగవాడైన నేమి ? జనవంద్యుడు కాడా ? బ్రాహ్మణకులమందు జన్మించియు చేతులుజోడించి జగదీశ్వరునికి మ్రొక్కక కలుషజీవనమున కాలముపుచ్చునాతడు తనకులము నాధారముచేసికొని భగవంతుని సామ్రాజ్యమున ప్రవేశమందకలుగునా ? ఈతనిచుట్టు నెన్నెన్ని కర్మబంధములు డొంకతీగెలవలె జుట్టుకొనియుండవు ? ఈతనికొఱకై యెన్నెన్ని నీచకులములు ఎన్నెన్ని నీచపుట్టువులు కసిపెట్టుకొని యుండవు. నీచమగు విషయచింతలదేవ మనసును పాటించునాతనికి యతని అగ్రజన్మము యాతని బ్రాహ్మణత్వము గట్టిపట్టగునా ? దొడ్డ రక్షయగునా ? మహాశయులారా ! స్వామిజీ విషయమున మీారు సరిగా నాలోచింపరైరి. అతడు చండాలకులమున బుట్టిననేమి ? బ్రాహ్మణకులమున బుట్టిననేమి ? అతనిని మించిన భక్తప్రవరుని నేను కాంచియుండలేదు. నా కాచార్యుడగుట కాతడే తగినవాడు'' అని జలద గంభీరస్వరమున నాయమ పల్కెను. అంతట నాపండితప్రవరులు తోకలుముడిచి తమదారిని తాము తరలిరి.

కొంతకాలము రాజ్ఞీతిలకము రుయిదాసస్వామికి సేవలుసలిపి యాతనికడ తారకమహామంత్రోపదేశము నందెను. అతనివలెనే రామనామ సంకీర్తనమందును, నిశ్చల ధ్యానమందును, దీనజన పోషణమందును, ఆమె కాలము గడుపసాగెను. భక్తవత్సలుడు ఆమెసేవకు మిగుల ప్రీతిజెందినాడు. బహుజన్మకృత సత్కర్మవలననేమి, రుయిదాసస్వామి సేవవలననేమి వ్రతానుష్ఠానమువలన

నేమి సీతాఝూలి యొక సారి తనయభీష్ట దేవత దర్శనమునందగలిగి ధన్యురా లయ్యెను.

విరోధులైన విప్రులు కుతకుతలాడుచునే యుండిరి. దాసునెడల రాణి చూపిన భక్తిశ్రద్ధలు వారికి కన్నెఱ్ఱగానుండెను. ఆమెయాచార్యున కవజ్ఞ చూపు తరుణమునకై వేచియుండిరి.

ఇట్లుండ నొకసారి శ్రీరామనవమి వచ్చెను. అప్పుడామె పెద్దపూజచేసి గొప్ప సంతర్పణము చేసినది. అన్నిజాతులవారిని యామె యాహ్వానించినది. బ్రాహ్మణులందఱిని యామెభోజనమునకు పిలిచినది. తాము కోరుకొనుచుండిన తరుణము లభించినదని బ్రాహ్మణులందఱు నానందించిరి. సంతర్పణసమయమున బ్రాహ్మణ పంక్తియందు ఒకచోటున రాణి రుయిదాసస్వామి కాసన మేర్పఱిచి గురువర్యుని చేయిపట్టుకొని తీసికొనివచ్చి యాతని నాయాసనముపై నాసీను గావించెను. అపుడు బ్రాహ్మణు లాగ్రహావేశులైరి. వారికోపమునకు మేరలేక పోయెను. ఒక చండాలుడు వచ్చి తమపంక్తినడుమ కూర్చుండుటను వారు సహింపజాలకపోయిరి. "ఛీ! ఛీ" యనుచు నసహ్యావడి దాసు కూర్చుండిన తావునువిడిచి ఎల్లఱు తొలగి దూరముగాబోయి మఱియొకయెడ గూర్చుండిరి.

వడ్డన ముగిసినది. ఎల్లఱ నివేదనములైనవి. విప్రులందఱు పరిషేచనములు చేసిరి. రసకందాయములోనికి దిగిరి. ప్రక్కకు చూచితిరిగదా! రుయిదాసస్వామి తమతోగలసి యేకపంక్తిని భుజించుచుండెను! ప్రతిబ్రాహ్మణుని దక్షిణపార్శ్వమునందును గూడ స్వామిజీ రూపము తోచుచుండెను. ఎల్లఱు నాశ్చర్యమగ్నులైరి. ఒకరిమొగ మొకరు చూచుకొనదొడగిరి. ఇంక నెచటికి జరిగెదరు. ఎచటికి పోయెదరు. స్వామిజీ తమ్ముఁ నంటియే యుండెను. ఆతనిని విడిచి పోవుట వారికి శక్యముగాక యుండెను.

భోజనాంతరమున రాణి గురుదేవుని స్వర్ణసింహాసనమున కూర్చుండబెట్టి వింజామరచే నాతనికి విసరసాగెను. విప్రులు విప్పారిన కన్నుగవతో నాతనిని విలోకింపసాగిరి. ఆతనిభుజమున బంగారుజందెము విరాజిల్లుచుండెను. ఆతని వదనమునుండి వెలువడు తేజంబువలన నా ప్రదేశమంతయు భాసమానమయ్యెను. ఈ యద్భుతదృశ్యమును చూచినపిదప నైనను దాంభికులైన యా

విప్రులు తమ అభిప్రాయమును మార్చుకొనజాలరైరి. ఏమియుం బలుకక వార చ్చోటు విడిచిచనిరి.

స్వామిజీ ప్రతిభ విని యెందఱెందఱో చిత్రకూటపర్వతమున కరిగి యా తనిని రాజ్ఞిని దర్శించి కృతార్థులగుచుండువారు. పలువురాతనికి శిష్యులుకూడ నైరి. శిష్యులతో గూడినవాడై దాసు భారతదేశమందలి పుణ్యక్షేత్రము లన్నిటిని చూచెను. ఆతని యడుగుజాడల ననుసరించి సీతాఝాలీకూడ నడ చినది. అతనివలెనే తుదకు సాయుజ్యముక్తి నందినది.

రుయిదాసు గతించి చాలాకాలమైనది. ఉత్తరహిందూస్థానమున నేడును అన్నిజాతులవారును నామహాత్ముని పవిత్రనామము స్మరించుచు యా తనియాత్మ నుద్దేశించి పూజలు సల్పుచుందురు. 'రామనామ' మనుపేర స్వామిజీ చక్కనిగ్రంథము నొకదానిని రచించెను. అందు రామకీర్తన లెన్నేని కలవు. భక్తిప్రణయములతో నవి తొలుకాడుచుండును. ఆర్యావర్తవాసులు నేడును ఆకీర్తనములను పాడుకొనుచు ఆనందించుచుందురు.

జాతిభేదములను భారతదేశమెన్నడును పాటింపలేదు. అందువలన నెన్నడును పొరపొచ్చెములు పొడసూపలేదు. అద్భుతమైన ప్రణయసూత్ర మన్ని జాతులవారిని కలిపివేసినదని భారతప్రాచీనచరిత్రము తెలుపుచున్నది. గురుగుణము ఏజాతివ్యక్తియందైనను తోచినపుడు జాతిని సరకుగొనక ఎల్ల యును వ్యక్తిని పూజించిరని మనదేశపు ప్రాచీనవిజ్ఞానము తెలుపుచున్నది. మన ఋషిసంప్రదాయమున నిమ్నజాతియందు జన్మించిన మహాత్ములకు చోటు లేకపోలేదు. ఏఅల్పసంఖ్యాకులో రుయిదాసునం దవజ్ఞానము చూపినను పలువురాతని సేవించుటకై ముందంజవేసిరి.

గుహుని చరిత్రమువలెనే యీరుయిదాసు చరిత్రమును మిగుల పవిత్ర మైనది.

ఈతని చరిత్రమున కర్మసూత్ర మెట్లు పనిచేసియుండెనో పాఠకులు గ్రహించియే యుందురు. గురుశాపమాతనిని పతితుని గావించినది. అయినను గురుని వరము గురుని యుపదేశము గురుని కరుణ యిహజీవనమునందే యాత నిని జగదీశుని నికటమును చేర్చినవి. గురుశాపము మనకు కొంతవిచారము కలిగించినది. నియమబద్ధజీవులు నియమోల్లంఘనము నొప్పరు. అట్టి లంఘనము

తనయందు పొడచూపినను రామానందస్వామి తనను తాను క్షమించుకొనుచుండువాడుకాడు. మనుష్య నియమములు చులుకనగా మాఱగలవని నేటి యభిప్రాయము. ప్రకృతి నియమములకైనను తిరుగుండునేమో కాని ప్రాచీన భారతీయులు నిత్యజీవన నిర్వాహణమునకు నెలకొలిపిన నిబంధనములకు నెట్టి తిరుగుడును ఉండెడిదికాదు. అవి అమోఘమయినవి. అద్భుతమైనవి.

అధ్యాత్మిక విభూతిపై మన స్సుంచునాతనికి ఆదిభౌతిక విభూతిపై మక్కువ లవంబైన నుండదని రుయిదాసు చరిత్రము నొక్కి చెప్పుచున్నది. చేతికందిన బంగారును కొల్లలుగా పుట్టించు నద్భుతశక్తిగల శిలను అతడు గుడిసెయందొకచో బాఱవైచి తన నియమమును తాను పాలించుకొన నిశ్చయించుకొనినవాడై ఉపవాసములు చేసినాడు. పరుసవేదికాదు, త్రైలోక్యాధిపత్యముచేతపడినను అష్టాదశసిద్ధులు ముంజేతి కంకణములై నిలిచినను త్రోసి రాజని తన తోలుముక్కను తాను చేతబట్టి తన యుద్దేశమునకు జేగంటగట్టి యుండువాడు. తన నిశ్చితాభిప్రాయముచెంత చేతగట్టిగా జెండాయెత్తి యాతడు నిలిచియుండలేదా? తన శరీరము నాహుతి చేయుటకైన సిద్ధపడినాడు కాని తనయాశయమునుండి తన నియమమునుండి అంగుళపు మేరమైనను కదలుట కాతడు సమ్మతింపలేదు. తుదకు నెగ్గునది యాత్మయని అతడు నిరూపించినాడు. గదలు చేతబట్టి ముల్లోకములు నెత్తివచ్చినను ఆత్మశక్తిగలవాని కాలిగోరును తాకజాలవు.

ఘనతరమగు ప్రజ్ఞను గురుగంభీరమగు గుణమును సంపాదించు టెట్లో వానిని గుర్తించుటయు నట్లే. గుర్తించువాడే సంపాదింపగలడు. ఒకటియగు నంశమున సంభూతులయినవారికే యొకరిసత్త్వ యొకరికి గ్రహింపశక్యమగును. ఈ గ్రహణమున్న తావునందే ప్రశంసయుండును. పుష్పమునుండి సువాసన సహజవిధి నుప్పొంగును. అట్లే గ్రహణశక్తిగల మానసమునుండి ప్రశంస బయలుదేరును. ప్రశంస భక్తికిని ప్రార్థనమునకును దూరముకాదు. ఉపాసకునకును, ఉపాస్యదేవతకును ఉత్తరప్రత్యుత్తరములు ప్రార్థనామార్గమునుండియే జరుగును. అట్లే ప్రజ్ఞాధురీణుని హృదయమునకును ప్రజ్ఞాగ్రహణపారీణుని హృదయమునకును ప్రశంసయందే వియ్యమును నెయ్యమును గలుగును. వెన్నెలను గ్రహింపగలుగు చంద్రకాంతిశిల మొద్దురాతివలె పడియుండక చల్లని

పూరమున తనహృదయమును వెలువరించును. జ్ఞానినెఱిగిన జిజ్ఞాసువును, భగవంతుని గుర్తించిన భక్తుడును, భక్తునిగుర్తించిన వేఱొకభక్తుండును భావనా పూరితమగు తమ గుండియల నిర్లే గుమ్మరింతురు. గుర్తుపట్టనివారు చత్రాతి బండ లట్లు పడియుందురు. గమ్యస్థానమైన ఆశయమందేని విశేషదూరము సాగిపోయిన ప్రజ్ఞానిధియు ఆశయమును దృష్టియం దిడికొని ఇంకను చాల దూరమందుండిన యాత్రీకుడును ఒకే రహదారియందు నిలుచువారు. పైమెట్టును గుర్తింపనివారు మెట్టుమీది మెట్టును గుర్తింపజాలరు. పైమెట్టు నందలేనివారు మెట్టుపైమెట్టు నెట్లందగలరు. కావుననే భక్తపూజవలనగాని కృష్ణపూజ సిద్ధింపదు.

"వినాభక్తపూజా కృష్ణపూజానహే సిద్ధ।
భక్తపూజాకై వే కృష్ణహృదేహాయబద్ధ"

కృష్ణభగవాను డేమనినాడో తిలకింపుడు :—

"నాహం వసామివైకుంఠే యోగినాం హృదయేనచ।
మద్భక్తాయత్రగాయంతి తత్ర వసామి నారద॥"

రుయిదాసస్వామి మహాత్త్వమును గ్రహింపగలిగినవా రెట్టివారో ఆతనిని గుర్తింపక అతని కవజ్ఞ తలపెట్టిన వారెట్టివారో జగదీశ్వరు డెవ్వరిచెంత వసించుచున్నాడో చదువరులు గ్రహింతురుగాక !

## ౪౨

# శ్రీ జగన్నాథమాధవదాసస్వామి



ఉ. "గోపిక లోపిక ల్పడలి కొల్వఁగ గోవులు గోవులాడఁగాఁ
గ్రేపులు మేపువాని పరికింపఁగఁ గెంజిగురాకు మోవిపై
మోపినవేణు వగ్గలము మ్రోయఁగఁ గల్పవని న్వసించునా
గోపకుమారమన్మథునిఁ గోకులవార్ధిశశిన్ భజించెదన్."

శ్రీ కృష్ణ కర్ణామృతము

శ్రీ జగన్నాథమాధవదాసు ధనధాన్య సమృద్ధిగల ఉత్తరహిందూస్థాన నివాసి. ఆలుబిడ్డలతో నతులైశ్వర్యము లనుభవించుచు అతడు కొంతకాలము సుఖముగ గృహజీవనమును గడిపినాడు. పదపడి యాతనిమనస్సు సంసారసుఖములనుండి రివ్వున నెగసిపోయినది. గృహస్థజీవనమున కాతడు స్వస్తిజెప్పినాడు. జగన్నాథక్షేత్రమున కరిగి నిరంతరము కృష్ణభజన చేయదొడగెను. బిచ్చమెత్తి కొన్ని దినములు తనువును పోషించినాడు. అనంతరము భిక్షాటనముకూడ మాని వేసినాడు. మూడుదినములు వరుసగ నుపవాసములుచేసి ధ్యానమగ్నుడయి యతడు పడియుండెను. దేవదేవుని మనసుకరిగెను. భక్తునిరక్షింపవలెనని జగదీశ్వరుడు నిశ్చయించినాడు. బంగారుపళ్లెరమందు ప్రసాదముంచి లక్ష్మిదేవి ద్వారా భక్తున కంపినాడు. భక్తునిపై దేవదేవుని కరుణయెట్టిదో జగన్నాథమాధవదాసెఱుగును. మహాప్రసాదమును కడుపార భుజించి పళ్లెరమును తన గుడిసె గుమ్మమున కవ్వల బెట్టినాడు. స్వామి సేవకు డెవ్వడేని దానిని గొనిపోవునని యాతడు తలంచినాడు.

కాని పళ్లె మందే యుండిపోయెను. గుడి పూజారులు పళ్లెరమును గానక మాధవదాసు గుడిసె గుమ్మముకడ దానిని గాంచి దొంగయని యాతనిం బట్టి యాతని వీపుపై బలముగా బెత్తములతో గొట్టిరి.

నాటిరాత్రి శ్రీజగన్నాథస్వామి తన ప్రధానపూజారికి స్వప్నమందు ప్రత్యక్షమై "నీవును నీయనుచరులును నేడు దురంతమగు అత్యాచారమున

కొడిగట్టిరి. మాధవదాసు నాభక్తుడు. అతడు కఠినోపవాసములు చేయుచుం డుట పరికించి దేవిద్వారా నాబంగారుపళ్లెమం దాతనికి ప్రసాదమంపితిని. చోరుడని మీరాతని హింసించిరి. అతని వీపుపై బడిన దెబ్బలు నా వీపుపై పడినవి. నావీపును పరికింపుడు. దానిపై మీరెన్నెని బెత్తములను విఱిచి వేసితిరి. మీరెట్టి యకృత్యమును చేసితిరో గ్రహింపుడు. ఇకముందు నాభ క్తునివట్ల భక్తిమెయి మీరు వర్తింపవలెను.'' అని పలికెను.

నిద్దురనుండి మేలుకాంచి పెద్దపండా స్వప్నవృత్తాంతమును తోడిపూజా రులకు దెలిపెను. అనంతరము పండాబ్రాహ్మణు లందఱు దాసుపాలి కరిగి యా తని కాళ్లేతులు పట్టుకొని పరిపరివిధముల పరిదేవన మొనరించి క్షమింపుమని వేడుకొనిరి. అంతట "నన్నేమియు వేడుకొనవలదు. మీరు మీయశ్రుజలం బులచే మహాదేవుని పాదములను ప్రక్షాళనమొనరింపుడు'' అని దాసుపలికెను. మాధవదాసును పూజారులు బహుభంగుల సత్కరించిరి.

కొంతకాలము గడిచిపోయెను. మాధవదాసొకప్పుడు తీవ్రమగువ్యాధిచే పీడితుడై సముద్రపు టొడ్డున నిసుకతిన్నెపై పడియుండెను. అపరిమితమగు దాహముచే నాతని గొంతుక యెండిపోయెను. ఆతని యీ దుస్థితి కనుగొను వారెవ్వరును లేకపోయిరి. జగన్నాథుడు మనుష్యరూపమును దాల్చి చరచర సాగరతీరమునకు వచ్చి దాసునులేపి "తండ్రీ! ఈ జలమును త్రాగుము'' అని కలశోదకము నాతని గొంతుకలో పోసెను. నీరుమ్రింగి దాసు తెప్పిరిలి ఆగం తువు నుద్దేశించి "అయ్యా! నీ వెవ్వరవు. జగన్నాథుడవే కావుగదా! ఇట్టి కరుణ నింకెవ్వరు చూపగలరు?'' అనెను. జగదీశుడు చిరునవ్వు నవ్వుచు నచటనే నిలువంబడెను. అంతట దాసు "తండ్రీ! దివ్యసింహాసనమున నధిష్టించి సమస్తభువనముల యందలిప్రాణి కోట్లచే పరిచర్యనందు నీవు ఈరూపున నిచటి కేగిరివచ్చి నాకూడిగము చేయుచుంటివా? నీ బంగారుగద్దెనుండి దుమికి యిచ టికివచ్చి సేవకావృత్తియందు దవులొ్కనిన నిన్నుచూచి నీ యర్ధాంగలక్ష్మి పరిహాసింపదా? ప్రజలందఱు నవ్వరా?'' అని వచించెను.

"ఒరులు నన్ను వెక్కిరించిన వెక్కిరింపనిమ్ము. నేనెట్టి పరిహాసమునైన నోర్తును. ఎట్టి యిక్కట్టులనైన సహింతును. కాని నీపరితాపమునుమాత్రము చూచి సహింపజాలను.'' అని పలికి శ్రీజగన్నాథుడు దాసునియొడలు ఆపాద

మస్తకము నిమురసాగెను. ఈశ్వరకరస్పర్శచేత దాసు నిముసములో పరిపూర్ణారోగ్యవంతుడాయెను. పదపడి దేవదేవుడు తనమందిరమున కరిగెను.

ఒకనాడు జగన్నాథుడు మాధవదాసుతో పరిహాసమాడ మిక్కిలి మక్కువపడినాడు. ఎప్పటియట్లు మనుష్యరూపమున ఆతనియెదుట ప్రత్యక్షమై "దాసూ! మనమిద్దఱము నేడొక చక్కనిపని చేయవలెను. గోపాలబాగ్ అనుతోటలో మంచి మంచి పండ్లున్నవి. వెలగపండ్లు మిక్కిలి ముగ్గియున్నవి. ఎంతో చక్కగా ముగ్గియున్నవి. వానిని మెల్లగ సంగ్రహించుదమురమ్ము" అనియెను. ఆ దొంగపనికి దాసు మనసొల్లకుండెను. రానని యాతడు నిరాకరించెను. కాని జగన్నాథుడాతనిని, వదలక బలవంతముగ నాతనిని తోటలోనికి గొనిపోయెను. జగదీశు డొకపెద్ద వెలగచెట్టెక్కెను. దాసు చెట్టుక్రింద కూర్చుండి భజనసేయుట మొదలిడినాడు. చేతికివచ్చిన పండ్లెల్ల పుడికియు రాని వానిని నేలరాల్చియు చెట్టునగల పండ్లన్నియు జగన్నాథుడు తొలగించినాడు. తోటమాలి యపుడెందుండియో పరుగుపరుగునవచ్చి "దొంగలు దొంగలు" అని యఱచి వారిద్దఱిని పట్టుకొనుటకయి ముందుల కుఱికినాడు. జగదీశుడు చెట్టునుండి చరచర దిగివచ్చి దాసు నందే దిగవిడిచి తానెందో వెడలిపోయెను. తోటవాని కతడందలేదు. మాలి క్రోధమధికమయ్యెను. తన అగ్రహమంతయు నతడు చెట్టుక్రిందనున్న యావెఱ్ఱిదాసుపై చూపగడగినాడు "ఓరీ! దొంగా! నిన్ను బట్టివేసితిని. ఈ తోట నీయదియా? తగినశాస్తి చేయించెదనులే. ఇపుడు పండాబాబుల కడకురమ్ము" అని తోటకాపరి యాతని గట్టిగ పట్టుకొని గుడిపూజారులయొద్దకు గొంపోయెను.

మందభాగ్యుడగు దాసు కొంతసేపటికి తెప్పిరిలి "అయ్యా! నేను దొంగనుకాను. నేనొక నిరుపేదను. నే నేపాపము నెఱుగను. నాకీతోట సంగతియే తెలియదు. వెలగపండ్లమీద నాకు మక్కువయునూలేదు. నేను చెట్టెక్కలేను. నా ఘోషలోనేను పడియుండగా శ్రీజగన్నాథుడే నన్నీ తోటలోనికి బరబర లాగికొనివచ్చినాడు. ఈచెట్టుక్రింద నన్నతడే కూలవేసినాడు. చెట్టెక్కి యీభీభత్సమంతయు నతడే చేసినాడు. చివరకు నిన్నుచూచి చరచర చెట్టుదిగి తుఱ్ఱుమన్నాడు. దోషియాతడేగాని నేనెంతమాత్రమును గాను. నన్ను ఊరక యేల హింసింప చూచెదవు? నన్ను వదలివేయుము. నాదారిని

నేనుపోయెదను" అని దీనవదనుడై తోటకావరివానితో చెప్పుకొనినాడు. కాని యాకాపు వాని మాటలు పాటించినవాడుకాడు. అతని మాటల ధోరణి చూచి మొదట దాసు వెఱ్ఱివాడనియే తలంచినాడు కాని పిదప దొంగ వేషము వేయుచున్నాడనియెంచి యాతనిని తోటనుండి దాటిపోనీయక గుడిపూజారుల కడకు దీసికొనిపోయెను.

పూజారులు కనులెఱ్ఱజేసిరి. "బాబులారా! ఇందు దోషి జగన్నాథుడు నేనెంతమాత్రముకాను. అతనినడిగిచూడుడు. ఇంతపని జరిగినమీదట నతడు నిజము చెప్పునని తలచెదను. పండ్లవిలువ యాతనినడిగి తీసుకొనుడు. పుడికిన పండ్లన్నియు నతనియొద్ద నే లభించును. పోయి మీరాతని పట్టుకొనుడు. నిజము తేటతెల్లమగును. వెలగచెట్టుమీద నతని పీతాంబరము చిక్కుకొనిపోయినది. దానిని తీసికొనిరండు. మీకంతయు స్పష్టమగును." అని దాసు పలికెను. పండాలు గర్భాలయమున కరిగి చూచిరి. స్వామిచెంత వెలగపండ్లు ప్రోగుపడి యున్నవి. జగన్నాథుని పీతాంబరము కనుపింపలేదు. తోటలోనికరిగిరి. వెలగ చెట్టుపై శ్రీజగన్నాథుని పీతాంబరము వెలయుచున్నది. వెలుగువలె సత్యము కన్నులయెదుట కన్పట్టినది. దాసు చరచర స్వామిసమ్ముఖమున కరిగినాడు. అతడు కోపమును పట్టజాలకపోయెను.

"జగన్నాథుడా! నీవు గజదొంగవు. నీవంటిదొంగ మఱొకడు గాన రాడు. దొంగతనమునందు చాలకాలమునుండి ఆరితేఱినావు. నిముసములో పనిముగించి దొంగతనము నాతలకుగట్టి నీత్రోవ నీవు చూచుకున్నావు. నీ నైజము నీవు చూపుకొన్నావు. క్రింద చలికిలపడియున్న నన్ను తోటమాలి నిర్బంధించియుండ నిన్నుగాదని యూరకొని వచ్చివచ్చి నీపీఠముపై నధిష్టించి నావు. నీకీవరలో వెన్నదొంగయను పేరుమాత్రముకలదు. ఇపుడు వెలగదొంగ యను పేరు తెచ్చుకొన్నావు. నీచర్య ఎల్లఱకుముందు ఏకరువుపెట్టెదను. జను లందఱు నిన్ను వెలగదొంగయనియే పిలచునట్లు చేసెదను." అని గట్టిగా బలికెను.

భక్తుని దూషణవాక్యములు వినిన జగన్నాథుని యానందమునకు మేర లేకపోయెను. ముసిముసి నగవులు నవ్వుచున్నట్లు దాసునకుతోచి దేవదేవుడు దానును మఱింత ఉడికించినాడు. తరువాత అనంత ఆనందమున తన్మయత్వమును చెందినాడు.

దాసుయొక్క క్రోధమున నడిగియున్న గాఢమగుప్రేమను ఆలయ మందు గుమిగూడిన వారెల్లరు గ్రహించిరి. ప్రేమయొక్క ఆవేశమునుండి వెడలిన దూషణవాక్యములు మధురమగు స్తుతివాక్యములకంటె తీయనై వారి చెవులకు విందుగొలిపెను. దాసుమీది గౌరవముచే నచటివారెల్ల నాతనికి ప్రణమిల్లిరి.

పూజారులు తోటలోనుండి పీతాంబరమును తెచ్చి స్వామి కర్పించిరి. చాలగా వెలగపండ్లును యింకను నితరఫలములను స్వామివారి యారామము నుండి తెచ్చి యాతనికి సమర్పించిరి. దేవదేవుడు దొంగతనము చేసినది తన తోటలోనే. శ్రీజగన్నాథస్వామిలీలలు యెల్లరకును సంతోషమును చేకూర్చెను. నాడు ఆలయమున గొప్ప యుత్సవము జరిగెను. నాటివ్రతమునం దెల్లరు పాల్గొనిరి. నాటి స్వామి ప్రసాదము నెల్లరు చవిచూచిరి. వీరిలో ముఖ్యుడు మాధవదాసు. నాడాతని యుత్సాహమునకు హద్దుపద్దు లేకయుండెను.

ఒకప్పుడు దాసు బృందావనమునకు వెడలినాడు. శ్రీకృష్ణనామసంకీర్త నము సలుపుచు బృందావనమున సంచరించుచు నొకనాడు యమునాతీరమందలి యారామము నాతడు చేరుకొనినాడు. అందొక కుంజవాటికయందు కూర్చుండి మధురకంఠస్వరమున కృష్ణగీతికపాడ మొదలిడినాడు.

ఆతోటకు సమీపమునందున్న యొకమేడలో నొక ధనికుడు వాసము చేయుచుండెను. ఆత డతులైశ్వర్యసంపన్నుడయ్యును మిక్కిలి లోభి. ధన ధాన్యాది సకలసంభారములతో నిల్లు నిండియున్నను పిడికెడుబియ్య మొబిచ్చు కునికిని నాతడు పెట్టియెఱుంగడు. పిల్లికి బిచ్చముపేసిన పాపమున్నకైన నాత డెన్నడును నోచుకొనలేదు. ఆకలిబాధ నొందుచు నేదరిద్రుడైనను "స్వామీ! రొక్కమెతు"కని యడిగికొనినపుడు, యాతడు గ్రుడ్లెఱ్ఱజేసి వానిమ్మని మీద పడును. పరులకు పెట్టకున్నమానె తానైనను తృప్తిగా ననుభవించుచేశా యనిన నదియునులేదు. తాను తినడు. పరుల కిడడు. తనసంపదసంతను నొక మూల నునిచి నమస్కరించుచుండునే గాని దరిజేరువాడు కాడు తనకుండి మాన్యములను కన్నులతో చూచుకొను మాత్రముననే యాతడుబ్బి తబ్బిబ్బై పోవుచుండువాడు. ధనధాన్యముల నింట నొకమూల ముక్కబెట్టి వాని

చుట్టును నతడు భజనసేయుచుండువాడు. అచటికి సమీపమున వనమున మాధవదాసు కృష్ణనామసంకీర్తనము లాలాపించుచుండ మిక్కిలి కోపము చెందినవాడై యతడు మేడమీదినుండి యవ్వలికి తొంగిచూచెను. చూచి "అరే గాడిదా! ఇచ్చట గోలచేయుదువేమిరా! ఇంకండి తక్షణ మావలకు పొమ్ము, పోకున్న తల్పి పాతరవేయించెదను." అని ఛీంకరించి పలికినాడు.

మాధవదాసు ప్రతివచన మీయలేదు. లోభి పైనుండి దుర్భాషలాడుచునే యుండెను. సంకీర్తనముచేయుచున్న దాసు మొగమెత్తి యాతని చూడలేదు. దుష్టప్రలాపములు హెచ్చుచున్నవి. దాసపుడు "ఈసందభాగ్యుని గుణము మాఱి తీరవలెను. వీనికి శుభము చేకూర్చెదను" అని యాలోచించుకొని యొకమాఱు లోభిదెస కన్నెత్తి "అయ్యా! నిరుపేదను. ఆకలిబాధచే పీడింపబడుచున్నాను. కరుణించి నాకు పట్టెడన్నము పెట్టుము. నీకు పుణ్యముండును" అని దీనముగా బతిమాలెను. అందులకా కృపణుడు "ఛీ! ఛీ! నోరు మూయుము. ఇచటినుండి లేచిపొమ్ము. ఇచ్చట నఱువకుము" అని గొంతెత్తి పలికినాడు.

మాధవదాసు కృష్ణనామసంకీర్తనమును సలుపుచు అందుండి మెల్లగా వెడలిపోయెను. తోడనే కృష్ణమాయ చెలరేగినది. లోభి గృహమునందలి సంబారములన్నియు పుర్వులతో నిండిపోయెను. ఈభయంకరదృశ్యము గాంచినంతనే లోభికి తెలివివచ్చినది. వడివడిగ నాతడు దాసుపోయిన వైపునకు పరువిడినాడు. గీతాలాపమొనరించుచు నడచుచున్న దాసును గాంచినాడు. ఎదురుగపోయి యాతనిపాదములపై పడినాడు. పడి, "మహాప్రభూ! అపరాధిని, మహాపాపిని, నాతప్పు క్షమింపుము. నాయిల్లంతయు పురువులతో నిండిపోయినది. నిన్నుదూషించిన ఫలము నాకు వెంటనే కనుపడినది. నానేరము సైరింపుము. నావస్తువులలో సగము నీకిచ్చెదను. కరుణబూని నీశాపమును మరలింపుము" అని పరివరి విధముల బతిమాలుకొనినాడు.

దాసు చిరునగవున "వత్సా! ఊరడిల్లుము. నాపలుకులు వినుము. నీకు శుభము చేకూరును. నీవు యేకాకివి; యొంటరివి. నీకు తలిదండ్రులు లేరు; బంధువులు లేరు; మిత్రులు లేరు. ధనధాన్యములు నీయింట కొల్లగా నున్నవి. అతిథులును, అభ్యాగతులును, దీనులును, బిచ్చగాండ్రును నీవీధిగుమ్మముదరి చేరినపుడు

కట్టిచేబూని వారిపై పడుచున్నావు. ఇదేమిధర్మము. ఇదినీకు కూడివచ్చునా! నీమానవమును దోషసంకలితమేల చేసికొందువు? బృందావనమున మనలు చుంటివి. నవనీతచోరుడు, గోవిందుడు, ముకుందుడు, మాధవుడు, మురళీ లోలుడు, నిరంజనుడు నీకనులయెదుట కాంతిలుచున్నాడు. కృష్ణపదపద్మసేవ యేలచేయవు? కృష్ణనామసంకీర్తన మేల యొనరింపవు." అని పలికెను. ఆధ్యాత్మికజీవనమునందలి మహత్త్వమును అతనికి తెలిపినాడు. భక్తితత్త్వము నతని కుపదేశించినాడు. కృష్ణ యన్న రెండక్షరములయందలి మాధుర్యమును నాతని చెవులందు వడ్డించినాడు.

లోభి కనుగప్పినపొరలు రాలి పడిపోయినవి. ఒకనిముసమున నాతండు కలుషమయమయిన తనపూర్వజీవితమును చక్షుకొనినాడు. ఇహాజీవనమునందే అనగా యీపుట్టువునందే చచ్చిబ్రదికినాడు. నరకజ్వాలలయందు దగ్ధమగుచు రెక్కలు కట్టుకొని యెగిరివచ్చి ముక్తిద్వారమున చోటు నంపాదించినాడు. సాధుసాంగత్యమందలి యమృతమును గ్రోలినంతనే యాతని మనసునంటి యున్న పాపమను చీడపురుగులు జలజలరాలి పడిపోయినవి. ఆతనిమనసు క్రిమి రహితమైనది. తోడనే యాతని యింటిలోని వస్తువులన్నియు క్రిమిరహితము లైనవి. క్షణములో తనసర్వసంపదలకు నతడు నీరు వదలినాడు. కృష్ణధన మును చేపట్టినాడు. తంబురచేతబట్టి మాధవదాసును వెంబడించి కృష్ణగీతములు పాడుచు ప్రేమానందమున భావమయబృందావనమున విహరించినాడు.

మాధవదాసు బృందావనమునుండి జగన్నాథమునకు పయనమైనాడు. మార్గమధ్యమున తనకు పరిచితమైన యొకయూర నొకమజిలీ యేర్పఱచు కొన్నాడు. ఆయూరున నాతని శిష్యుడొకడు వసించుచుండెను. అతడు మిక్కిలి విష్ణుభక్తిపరాయణుడు. నృత్యగీతములయందును, భాగవతపారాయణమునందును నతడు కాలము గడుపుచుండును. ఆయూరివారెల్లరు నాతని యుత్సవములందు పాల్గొనుచుండురు. అనుదిన మాతనిగృహము సంతోషపారవశ్యమున మునిగి తేలుచుండును.

సాయంసమయమున మాధవదా సాశిష్యునియింటి కరిగినాడు. కొంత దూరమందుండగానే మధురగాన మాతనిచెవులబడెను. అతనియాత్మ ఉల్లాస మున నృత్యముచేసినది. అల్లనల్లన నడచి శిష్యుని యారామమున నొకచో

నుపవిష్టుడై మధురగానమును వినుచుండెను. ఆతని యానందమునకు మేరలేక పోయెను. కొంతకాల మచటనేయుండి కృష్ణభజనానందమున నీదులాడవలెనని యాతడు మక్కువపడినాడు. భజనానంతరమున నతడు మారువేషము ధరించి శిష్యునికడ కరిగి వినయముతో నిట్లని పలికెను "అయ్యా! నేను మిగుల దరిద్రుడను. దిక్కులేనివాడను. ఈప్రపంచమున నాకు నాఅనువా రెవ్వరును లేరు. పట్టెడన్నముకై యూరూర దిరుగుచున్నాను. ఈయధమునకు తమ చెంత నేదేనిపనియిచ్చి గుప్పెడు మెతుకులు పెట్టుడు. మీయండనుండి మిమ్ము నే నమ్ముకొని దినములు గడుపదలచుచున్నాను. తమసెలవేమో ఆనతీయుడు."

శిష్యుడు గురువర్యుని గుర్తింపలేదు. ఆతడెవ్వరో నిరుపేదయనియే తలచినాడు. ఆతని దీనావస్థకు జాలిపడినాడు. తనయొద్ద పసులకాపరిగా నుండుమని చెప్పినాడు. నాడే యాపనియం దాతని నియోగించినాడు.

ఆచార్యుడు శిష్యుని పశువులనుమేపుచు ప్రతిదినము పశుశాలను రెండు మూడుసారులు కడిగి శుభ్రముచేయుచు గొడ్లకు చిట్టు తవుడు పెట్టుచు కడు శ్రద్ధతో తనపని తాను నిర్వర్తించుచు నాశాలయందే యొకచోట కూర్చుండి సంకీర్తనసమయములయందు మనసును విష్ణునామామృతముతో నింపుచు ధ్యానమగ్నుడగుచు తన్మయానంద మందుచుండువాడు. ఇట్లొకమాసము కడచిపోయెను. మాధవదాసుస్వామిశిష్యుడు మఱియొకడు తోడిశిష్యుని గృహమున కొలదిదినములు గడుపవలెనని తలచి వచ్చినాడు. ప్రతిదినమును భజనయందు పాల్గొనుచుండువాడు. ఒకనాడు ఆకస్మికముగా నెందులకో దొడ్డిలోని కరిగి పశువులశాలవైపున కతడు తనదృష్టి సారించినాడు. అందొక మూల నొకవ్యక్తి ధ్యానమగ్నుడై యున్నాడు. అతని శరీరమంతయు మిక్కిలి కృశించి యున్నది. అది వట్టి యెముకలప్రోవువలె కనుపడుచుండెను. అది మిక్కిలి మలినముతో కూడినదై యుండెను. కాని యాతని వదనమునుండి యొక అపూర్వమైన తేజము వెలువడుచుండెను. ధ్యానమగ్నుడై యున్న యాతని నేత్రములనుండి జొటజొట కన్నీరురాలుచుండెను. ఆశ్చర్యాన్వితుడై యాతని విలోకించుచు శిష్యుడందే నిలచియుండెను. ఆత డాచార్యుని గుర్తింపలేకపోయెను. లోనికిబోయి యాశాలలోని వ్యక్తి ఎవ్వరని తనమిత్రు నడిగినాడు. పశులకాపరియని యత డుత్తర మొసంగెను.

శిష్యుడు ఇంటియందే యున్నను చాలసేపటివఱకు నాతని మనస్సు పశువులశాలయందున్న సమాధినిశ్చలుడైన యావ్యక్తిమీదనే యుండెను. మనసు పట్టలేక ఆతడు తిరిగి దొడ్డిలోనికరిగినాడు. అవ్యక్తి యట్లే కూర్చుండి యుండెను. ఆతని కన్నులనుండి ఆనందబాష్పబిందువు లట్లే రాలుచుండెను. ఆత డెంద జెందఱనో పశువుల కాపరులను చూచినాడు. వారియందిట్టి యద్భుత శక్తి యాతడెన్నడును చూచియుండలేదు. మిక్కిలి కౌతుకముచెంది యాతడా వ్యక్తి సమీపమునకు పోయి యాతనివదనమును తేఱి చూచినాడు. మనసున నేదియో సందియము పొడసూవది. క్రిందివైపున కొంగి ధ్యానమగ్నుని మొగ మును మఱింత తేఱిచూచినాడు. తనగురువు మాధవదాసు కాదుగదా యని సంశయించినాడు. అతడేమిటి, పశులకాపరి యేమిటి? శిష్యుడు తనకన్నులను తాను నమ్మజాలకపోయెను. తనమానసమున పెద్ద పెనుగులాట ఉత్పన్నమా యెను. మఱి మఱి పరికించి చూచినాడు. రూపమంతయు నాతనికి పరిచిత మైనదివలెనే తోచినది. అతడు నిశ్చయముగ మాధవదానస్వామి యనిగ్రహించి నాడు. నిమిషమైనను పశువులశాలలో నాలసింపక యొక్కదాటున గృహము లోనికి పరువెత్తుకొనిపోయి మిత్రునిచూచి "ఏమోయి ఎంతపనిచేసితివి. గురూ త్తముని నీచవృత్తియందు నియోగించితివేల" అని క్రోధముతోడను దుఃఖము తోడను కూడిన కంఠస్వరమున నెలుగెత్తి పలికినాడు.

మిత్రుని కాతనిమాటలు అర్థముకాలేదు. ఆతనితల తిరిగిపోయెను. గుండియు దడదడలాడ దొడగెను. వెఱ్ఱివానివలె నేమో ప్రేలుచు మిత్రునితో కూడి యాతడు పశువుల సాలలోనికి బోయెను. తనమిత్రుడు చూచినట్లే తానును పశులకాపరిని పరికించి చూచినాడు. ఆతనిసందేహము విడిపోయినది. పెద్దపిడుగొకటి యాతని తలపై పడినట్లాయెను. బిడియముచే నాతని శిరస్సు నేలకు వంగిపోయెను. భయముచే నాతనిహృదయము కంపించిపోయెను. దుఃఖా వేశముచే నతడు చివాలున నేలగూలెను. నెచ్చెలిస్థితికిని జరిగిన ఘోరాపరాధ మునకును తోడిశిష్యుడు మిగులవగచినాడు.

శిష్యులు యిరువురు గురుదేవుని పాదములపై పడినారు. సమాధినుండి ఆచార్యుని మేలుకొలుపుటకై వా రాతని కాళ్లుమెల్లమెల్లన పిసుకసాగిరి. కొంత సేపటికి గురువర్యుడు కన్నులు తెఱచినాడు. చరణములపై సాష్టాంగపడి

శిష్యులిరువురు వెక్కి వెక్కి యేడువసాగిరి. ఆచార్యుడు వారిని లేవదీసి కౌగిట చేర్చుకొనినాడు.

కన్నులనుండి అశ్రుధారలు కాలువలై పాఱ నంతేవాసులు చేతులు జోడించి గురుదేవునితో నిట్లనిరి "మహాత్మా ఇట్టి క్రియ కేల కడంగితిరి? మీ పుత్రసముని ఘోరనరకకూపమున నేలపడనిచ్చితిరి. అతఁడేదేని యపరాధము చేసియుండెనేని మీ చేత నెట్టి దండనకైన తలయొగ్గియుండును గదా! ఇది యెట్టిలీల? మీ పాదధూళియొక్క రేణువునకు సేవకుడవై వర్తించితిరేల? ఆ రేణువును సిగ్గుచే, భయముచే, శోకముచే నిండించెడు కార్యమునకు మీ రేల చేయి చేసికొంటిరి. ఇది యపరాధమును మాపుచేయు పద్ధతియా? ఇదేటి లీల. అనవరతము మీ పదకమలములను మా హృదయములందు మా శిరములందు నిలిపి మమ్ము ధన్యులనుగా జేయక తుదకు మమ్మింతకు గురుదేవునిచే సేవచేయించుకొను దురంతరమునకు; మా పశువులకు దాస్యము చేయించుకొను నంతటి ఘోరపాతకమునకు తెచ్చితిరేల? మా హృదయములు దగ్ధములగుచున్నవి. ఘోరాపరాధము చేసితిమి. క్షమింపక మమ్ము దండింపుడు; దహింపుడు."

ఆచార్యుడు చిరునగవు నవ్వుచు శిష్యులను ఆలింగనపాశమున బంధించి "అన్నలారా! ఇంత చింతింపనేల. మీరుచేసిన యపరాధమేమియును లేదు. దైవవశమున నే నీమార్గమునుండి పోవుచుంటిని. మధురమైన కృష్ణగీతము నావీనుల సోకినది. ఒక యడుగైనను ముందులకు వేయజాలనైతిని. ఇందున్న నాకు నిత్యము కృష్ణనామామృతము లభించునని ఆశపడి నేనీపనికి పూని ధన్యుడ నగుచుంటిని. మీరు విచారింపకుడు. చింతింపకుడు. ఇక పూజామందిరమున కరిగి కృష్ణగీతములు పాడుకొందము రండు నృత్యము చేయుదమురండు రహస్యధ్యానమందలి అనందము పోయిన పోనిండు. ఇక గలిసి భజనచేయుదము రండు." అని సాదరముగఁ బలికెను. భక్తిపారవశ్యమున నిండిన హృదయము కలవారై శిష్యులిరువురును గురుదేవుని లోనికి గొంపోయిరి. పిమ్మట అభ్యంగనము చేయించి బహుభంగుల నాతని పూజించిరి. ఊరివారందఱు నందు పాల్గొనిరి నాటిమహోత్సవ మెంతయు వర్ణనాతీతము.

శిష్యునియింట గొంతకాలము కడపి మాధవదాసస్వామి జగన్నాథక్షేత్రమున కరిగినాడు. చాలాకాలము జగదీశుని సేవించినాడు. పదంపడి

దివ్యబృందావనక్షేత్రమును చేరుకొని నెచ్చెలిని గూడి చిరరాసక్రీడ సలుప గడంగినాడు.

ఈ పవిత్రచరిత్రమునుండి మనము గ్రోలవలసిన నీతిపాఠములును ఆధ్యాత్మికాంశములును ఊటలు చిమ్ముచు వెడలుచున్నవి. భక్తునివీపున దగిలిన దెబ్బలు భగవంతుని వీపుపై బడినవట. భక్తునకును భగవంతునకును వ్యత్యాసము సున్నయని కదా యిందలి సంఘటనము సూచించుచున్నది.

జ్ఞానయోగివలె భక్తియోగి 'సోహమ్' అని యద్భుతవిశ్వాసమును ప్రకటింప పోయినను నతడును అట్టివాడే యగును. జ్ఞానయోగి మాట యందు పటుత్వమున్నది; దార్ఢ్యమున్నది. సంకల్పసిద్ధియందలి యద్భుతోత్సాహమున్నది. మహోన్నతపదవియందు ప్రభావంతమై వెలుంగు భగవంతుని దృష్టి యందు నిలిపి జ్ఞానయోగి నడుముకట్టుకొని పయనము సాగించి అతని జేరి దృఢయత్నసముద్భవశక్తిని తోడుచేసుకొని "అతడే నే" ననును. ఆహా! జ్ఞానయోగి కర్జ మెంతగట్టిది. అణువువంటి మనుష్యుడు—పరమాణువువంటి జీవము బ్రహ్మాండమున నిండుకొని నిలిచిన జగదీశు నంతటిది అనికదా 'సోహమ్' అనును. తనంతశక్తి బ్రహ్మాండపతి పరమాణువున కిచ్చినాడు. కాని తనకును అణువునకును నడుమ కృషిని నిలిపినాడు. కృషిఘట్టమును దాటిన పరమాణువే బ్రహ్మాండమంతటిది కాగలుగుచున్నది. ఈకృషియు బ్రహ్మాండమును పోలునదే. జ్ఞానయోగి దీనినిచూచి 'అమ్మో' అని యదరి వెనుకంజవేయడు. నడుము బిగించి ముందునకు పోగడగును. ఆహా ఈ ముందునకు పోవుటయందెట్టి నిశ్చయశక్తియుండునో! మనుష్యత్వమునందలి వీరత్వము సార్థకము కావలెనన్న మనుష్యుడు జ్ఞానయోగియే కావలెను. మహాత్ములం దిట్టి యోగుల సంఖ్య మిక్కిలి తక్కువ. దిగువమెట్టునకును దిగువనున్న వ్యక్తి అదృశ్యమగు ఊర్ధ్వప్రపంచమందలి పైమెట్టుమీది ఆశయమును చేరుటయెట్టిది! ఇది యెందఱకో సాధ్యముకాదనుటయం దాశ్చర్యమేమున్నది.

శౌర్యము ధైర్యము స్థైర్యము చూపు జ్ఞానయోగి సృష్టికి ప్రతిసృష్టి చేయగలడు. అపరసృష్టికర్తయై సృష్టికర్తప్రక్క సింహాసనాసీనుడు కాగలడు.

ఇక భక్తియోగి? గట్టి ఘటముకాడు. ఇతడు ముందంజవేయజాలడు. ఎదుటి పర్వతమును నెట్టివేయుటకు హుమ్మని యుఱుకుట కీతనికి శక్తిలేదు.

ఇతనికి పెనుగులాట కిట్టదు. కాని జగదీశుని కీతనియెడలనే ప్రేమ మెండు. నీరసస్థుని యెడలనేకదా కన్నకడుపు మిక్కిలి మక్కువపడియుండును. బలము గల కొడుకును చూచినంతనే కన్నతండ్రి హృదయమున నానందోత్సాహములు వెల్లివిరియును. తనబిడ్డ మేరుపర్వతమెక్కి ఆకాశమండలి పూవులు కోయుచుండ చూచినంత నీతనియాత్మ యీతని హృదయోద్యానమున నెగిరి గంతులువేయును. కాని సుకుమారియగు మటియొకబిడ్డ తప్పటడుగులిడుచు గోచరమైనపుడు ఈతనిహృదయము కారుణ్యముచేనిండుకొనును. భక్తియోగినిచూచినపుడు భగవంతుని కడుపుకూడా కనికరముచే నిండుకొనును. అశక్తుడగుబిడ్డయని యెఱుంగును. జ్ఞానయోగి మహోన్నతకృషి నతిక్రమించి జగదీశునిచేరి 'అతడే నే' నన, జగదీశుడే క్రిందికివచ్చి భక్తుని జేరి "యితడే నే" ననును. ఇత డాతడగునపుడు అత డీతడగునపుడును కూడ కలయిక యుండునుగదా. దీనినే మనీషులు యోగమందురు.

ఇతడు అతడగుటకు ఎట్టి యత్నమునలుపునో అతడు యీతడగుటకునూ అట్టి యత్నమే సలుపును. జగదీశుని జేరుటకు మానవుడు పాటుపడునట్లు మానవుని జేరుటకు జగదీశుడును పాటుపడును అనికదా, తత్వశాస్త్రము తెలుపుచున్నది. మానవుని పొందజూచు భగవంతుడు మానవునిపై నిరంతరము కన్ను వేసియే యుండును. అతని హృదయము పద్మమువలె సుందరమై యుండెనేని, అతని మానసము, మంచువలె శుభ్రమైయుండెనేని, ఆతనిజీవనము నందనమువలె రమ్యమైయుండెనేని ప్రేయసినిపీడని ప్రాణనాథునివలె జగదీశు డాతనినంటి యుండును. అతని సుఖదుఃఖములను తనవిగాచేసికొని తానే ఆతడనుకొని అతడే తాననుకొని వర్తించును. కావుననే మాధవదాసస్వామి పడిన బాధయంతయు తనదియే యని యెంచి, శ్రీజగన్నాథుడు మిగుల వాపోయినాడు. కావుననే భక్తు నుద్దేశించి, "ఎట్టి పరిహాసమునైనను నోర్తును. ఎట్టి యిక్కట్టులనైన సహింతును. నీపరితాపమును చూచి సహింపజాలను" అని జగదీశుడు పలికెను.

ప్రణయము వివిధశాఖలుకలది. జగదీశునిమీది ప్రేమను వివిధభక్తులు వివిధరీతుల తెలిపియున్నారు. దేవుని యేసు "తండ్రీ" అనెను. సేవకుడైన హనుమంతుడు "ప్రభూ" అనెను. రామకృష్ణపరమహంస "అమ్మా"అనెను.

గోపికలు "వల్లభా" అనిరి. అర్జునునకు భగవంతుడు మిత్రుడైనాడు. మహాంత్ జీ మొదలగువారు "నెచ్చెలీ!" అనిరి. శ్రీచైతన్యుడు "నాధా" యని శ్రీకృష్ణుని సంబోధించెను. భగవంతుడుకూడ భక్తునితో నిట్టిసంబంధములు కలుపుకొనుచునే యుండును. మిత్రుడు నెచ్చెలితో నాటలాడినట్లే, భక్తునితో నతడు ఆటలాడ మక్కువపడును. కృష్ణపరమాత్ముడు గోపికలతో గలసి రాస క్రీడలందు దేలలేదా! ఒక్కొకపుడు యువకునివలెను, వేఱొకప్పుడు బాలకుని వలెను ఆతడు వర్తించును. భక్తుని ఉడికించుచు నతడు ప్రణయకోపమును చూపుచుండ భగవంతుడు అమితానందము పొందును.

ఈశ్వరుడు సచ్చిదానందమయుడు. ఆతడెల్లపుడును ఆనందమునే కాంక్షించును. జగదీశుని ఆత్మస్వరూపమున పుట్టిన మానవుడును నానంద మయుడే. ఆనందము సహజమైనది. పసిపాపలను చూడుడు. తఱచుగా వారు నవ్వుచునే యుందురు. మహాభక్తుడును, మహాకవులును, పసిపాపవంటివారు. కీడులెన్ని ఎదుర్కొనినను. వారు చిత్తశాంతిని, సహజపరితోషమును, పోగొట్టు కొనరు. తనచెంగటనుండి తనతో హాయిగ కాలముగడుపు నాత్మలెట్టివో పరమాత్మ ఎఱుగును. కావున పూతాత్మలతో పరమాత్మ యాటలాడ మొదలిడును.

మానవుని సుముఖుని కావించుకొనుటకు భగవంతు డెన్నెన్ని వెరవులనో రోయును. అతడు దుష్టుడని కినియడు. ఆతని హృదయమున క్రొత్తగ జేరిన దానిని (నవనీతమును) హరింపవలెనని—జగదీశుడు నవనీతచోరుడు అనబడుట జగత్ప్రసిద్ధముకదా—అతడు యత్నించుచుండును. ఈకోరిక సిద్ధించుటకై అతడు సామదానభేదదండోపాయముల నవలంబించును. ఈయవలంబనమందే భగవంతుని మహిమ బహువిధముల విజృంభించును. ఒక్కొకపుడు తన విజృంభణమునకు, ఆతడు భక్తుని నిమిత్తమాత్రము చేసికొనును. మాధవదాస స్వామిని నిమిత్తము చేసికొని అతడొక పలుగాకిని పరమభక్తుని కావించినాడు.

జగదీశుడు మానవునకు తండ్రివలెను, తల్లివలెను, నాధునివలెను, హితునివలెను, అధిపతివలెను మాత్రమేకాక సేవకునివలె కూడ చరించి ఆతని పట్లతనకుగల కర్తవ్యమును నెఱపుకొనును. సేవాధర్మమందలి మహత్త్వమును ఆతడెన్నెన్ని మాఱులో ప్రకటించినాడు. కృష్ణపరమాత్ముడు కుచేలుని పదము

లొత్తినాడు. చింతామణికి సాగిలపడినాడు. పార్థునకు సారథియై ధర్మయుద్ధము జరిపించినాడు. వైకుంఠముననుండి భృగుఋషి పదాఘాతమును చిఱునగువుతో సహించి ఆతని పదములను సేవించినాడు పాతాళమున బలిచక్రవర్తికి నేడును ద్వారపాలకుడై యున్నాడు.

అవతారమూర్తియగు ఏసుకూడ తనశిష్యులపాదములను సుగంధతైలములతో కడగినాడు. తన గొప్పగుణములనే జగదీశుడు తనభక్తులందు ప్రకాశముచేయును. మహాభక్తులును మహాపురుషులును సర్వేశ్వరునివలెనే సేవాధర్మము జరుపుచుందురు. ఈ పవిత్రధర్మనిర్వహణమునకు ముఖ్యము అగునది అడకువ. కావుననే పండిన చేను తలవంచుకొనియుండునట్లు, మహావిద్వాంసుడు నమ్రుడై యుండునట్లు, మహాభక్తుడును వినమ్రుడై యుండును. ఈ విధేయతను తొల్లుతబోధించిన మతము మన సనాతనమతము. ఇట్టి నమ్రతను, సేవాధర్మమును చూపిన మహాభక్తుడు మాధవదాసు. సేవాధర్మమందు నీచత్వములేదు. ఉన్నదనువారు ఆ ధర్మమందలి మహత్త్వమును గుర్తింపనివారు. మాధవదాసు పసులకావరియైనాడు. పసులమేపరితనమందు కృష్ణునిమించిన వ్యక్తి వేఱొకరుండులేడు. నేడొకపర్యాయము గోకులము పోయిచూడుడు. గోకులయందు గోడలపై కృష్ణుడు గోమాతకు ప్రణమిల్లుచున్నట్లు చిత్రములు చూపట్టును. మనుష్యసేవయందే కాక పశుసేవయందుకూడ— ఒక్కపశుసేవయందే కాక ఎల్లజీవరాసులపట్ల నెఱపుసేవయందు కూడ మాటలకందని ఆధ్యాత్మిక విలువయున్నదని హిందూమతము వేనోళుల జాటుచున్నది. అహింస పరమధర్మము. అహింసను మించిన పరమధర్మము సేవాధర్మము. ఈ ధర్మమును నెఱపుకొని మాధవదాసు మొదలగువారు ధన్యులైరి.

---

౪౩

# శ్రీ నామదేవస్వామి



మ. అరయన్ శంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపై కుబ్జపై
నరుపై ద్రౌపదిపై కుచేలునిపయిన్ నందవ్రజశ్రేణిపై
పరగన్ గల్గు భవత్కృపారసము నాపై కొంత రానిమ్ము నీ
చరణాబ్జంబులె నమ్మినాడ జగదీశా కృష్ణ! భక్తప్రియా!

నామదేవుడను భక్తవరేణ్యుడు నిరంతరము కృష్ణసేవాపరాయణుడై ఎట్లో జీవనోపాధినందుచు ఆలుబిడ్డలతో కాపురము చేయుచుండెను. కాలక్రమమున పాపము ఆతని కెన్నో కడగండ్లు సంభవించి బాధింపదొడగెను. ఆతనిభార్య పరమపదించెను. ఒకకూతురు తక్క తక్కినబిడ్డలందఱును మరణించిరి. తుదకాకుమారిత మగడును చనిపోయెను. బిడ్డమొగము చూచినప్పుడెల్ల నాతనికడుపు తఱుగుకొనిపోవుచుండెను. ఒకదరినుండి హృదయము చిల్లులు పడుచున్నను అతడు నిత్యపూజ జరుపుచునే యుండెను. అతనిభక్తియే ఛిన్నవిచ్ఛిన్నమగుచున్నవాని హృదయమును నిలిపినది.

బిడ్డను దుఃఖసముద్రమునుండి లేవనెత్తునది కృష్ణసేవయని నామదేవుడెఱుగును. దగ్గర కూర్చుండబెట్టుకొని ప్రతిదినము నాతడు ఆమెకు భక్తితత్త్వముపదేశించుచుండువాడు. ఆమెయు హృదయపూర్వకముగ జగదీశుని పూజించుచు కాలక్షేపము చేయదొడంగినది. ఆమెభక్తికి మెచ్చి కృష్ణపరమాత్మ ఆమెయెడల మిగుల ప్రసన్నుడై ప్రత్యక్షమై యే వరము కోరుకొమ్మని యావితంతువు నడిగెను. ఆమెయు అల్పబుద్ధికలది. తోడియువతులు బిడ్డల గనుచు పెంచుచు నెత్తుకొనుచు హాయిగ కాలము గడపుచుండ దానును వారి వలెనే యుండవలెనని ముక్కవపడి తనకును నొకపుత్రుని దయచేయుమని ఆమూర్ఖురాలు జగదీశుని వేడుకొనెను.

సుప్రసన్నుడైన కృష్ణుడు "తన్వీ నీకోరిక మిగుల చిత్రమైనది. ఐనను దానిని దీర్చుట నావిధి. పురుషసంసర్గములేకయే నీకొక చక్కని బిడ్డకలుగును. అతడు భక్తచూడామణియై లోకపావనుడై యుండును. నాయంశమందే యత డావిర్భవించును." అని చెప్పి అదృశ్యుడయ్యెను.

జగదీశుని కటాక్షమున కొలదిదినములలో నాబాలవింతంతువు గర్భము దాల్చెను. ప్రజలందఱును, ఆవిషయమెఱిగిరి. మూతివిఱుపులును, ముక్కు విఱుపులును, తోచినవి. మహాభక్తుడు వామదేవుడు, నలుగురిలోను తలఎత్త జాలక పోవుచుండెను. మిగుల చింతించుచు జగదీశుని స్మరించి యతడు "దేవా! ఇదెట్టి లీలాప్రదర్శనము, పసుగులో నాకు నగుబాటు వాటిల్లెను. ఇది దుస్సహమైయున్నది. నాకిపుడు ఏమార్గమును తోపకున్నది. బిడ్డను నీకే అప్పనమొనరించి నేనుగృహమువిడిచి వెడలిపోయెదను" అని అనియెను. అచిరములో నట్లొనరింపవలెనని వామదేవుడు సంకల్పించినాడు. కాని వానిహృదయము శోకసంతప్తమయిపోయెను. పోకతప్పదు. పోవుటకు మనసొప్పకున్నది. దుఃఖితుడు కన్నులు మూసినంతనే నిద్దురపట్టినది నిద్దురలో స్వప్నమువచ్చినది. స్వప్నమందు శ్రీకృష్ణభగవానుడు తోచి ఆతనితో "వత్సా! ఏల విచారించెదవు? నీబిడ్డ కళంకినికాదు. నావరము మూలముగ నాయంశమున నామెకు గర్భోత్పత్తియైనది. పరమభాగవతుడైన దౌహిత్రుడు జనించి నీగృహమును లోకమును పావనముచేయును. నీవదనమును ప్రకాశమాన మొనరింపుము. ఆతనికి నామదేవుడని నామకరణముచేయుము. నామహిమవలన నీకెట్టి యపనింద ఘటిల్లదు." అని పలికెను. నిదురనుండి మేలుకాంచి వామదేవుడు తన భారమునంతయు కృష్ణునిపై పెట్టి ఎప్పటియట్లు కాలక్షేపము చేయుచుండెను.

కాలక్రమమున నామదేవుడు, జన్మించెను. చిన్నతనమునందే వాని హృదయమున కృష్ణగీతిక మంజులస్వనమొనరించుచు వినంబడినది. తోడి బాలురు క్రీడలయందు కాలముపుచ్చుచుండ నతడు కృష్ణనామ సంకీర్తన మొనరించుచు మిగుల నానందమున నృత్యముచేయుచుండువాడు. పలుమాఱు నామదేవుడు మాతామహుని జేరి బాష్పపూరితలోచనుడై "తాతా! నీవు రోజును పూజచేయుచుందువు నాకును పూజచేయవలెనని యున్నది. విగ్రహ

సేవచేయురీతి నాకు తెలుపుము. ” అని వేడుకొనుచుండువాడు. వృద్ధుడు మంద హాసముతో “ నాయనా! నీ వింకను బాలుడవు. పెద్దవాడవైతివేని నావలెనే నీవు పూజచేయజాలుదువు. ” అనిచెప్పి బిడ్డను బుజ్జగించుచుండువాడు.

ఇట్లుకొంత కాలము గడచిపోయెను. ఒకనాడు వామదేవుడు పొరుగూరికి పోవలసివచ్చినది. మనుమనిపిలిచి “ తాతా! నేను తప్పనిసరిగా ఇపు డూరికిపోవలయును. ఇంటనున్న సుగబిడ్డవు నీవే. నేను రెండుమూడు దినముల వఱకు మరలిరాను. ఇంట దేవుడున్నాడు. ఆతనిని నీపరము చేయుచున్నాను. కొంచెము పాలతనికి నైవేద్యము పెట్టుచుండుము. అంతియే చాలును. నేను త్వరలోనే వచ్చెదములే. ” అని యాతడనినాడు. బిడ్డకు మంచిసమయము చిక్కినది. తనకోరిక తీఱునని పరమానందమున నామదేవుడు గంతులువేసినాడు. తనంతతాను సొంత ఆవుపాలు పిదికి వెచ్చపెట్టినాడు. స్వామికి తానే నివేదనము చేయగలుగుచున్నందులకు హృదయమున నాతడావేశమున నుప్పొంగుచున్నాడు. సంతోషము పట్టజాలక బాలకుడు విస్మృతుడైనాడు. తల్లితన యుని నొడిలో జేర్చుకొని పెక్కు ఉపచారములు చేసి ఆతనికి చైతన్యము తెప్పించినది. తెలివివచ్చి నామదేవుడు పాలకు సరిపడునంత కలకండను వేడి పాలయందు వేసి, పూజామండపమున కరిగి పాలను దేవుని ముందిడి స్వామి మ్రోల సాగిలపడి ప్రీతివాక్కుల “ ప్రభూ! పాలను త్రాగుము ” అనియెను. దేవదేవుండు క్షీరమును గ్రోలుననియే అతడాసపడినాడు. కొంతతడవు వేచి నాడు. మహాప్రభువు మిన్నకొనియుండెను. “ ఏమిప్రభూ! పాలుత్రాగవేమి? ఊరకమందహాసము చేయుచు కూర్చుంటివేల? నీ యంత నీవు కలశము నెత్త వేని చెప్పుము. నేనే యెత్తి దానిని నీ నోటికందపట్టియుంచెదను. ” అని బాలకుడనెను. అపుడుకూడ స్వామి ఊరకొనియే యుండెను. “ మంచిది ప్రభూ! తెలిసినది. నే నెదుట కూర్చుంటనీవు త్రాగుటకు సిగ్గుపడుచుంటివి. నేను అవ్వలికిపోయెదను. త్వరగా పాలుత్రాగుము. ” అని పలికి బాలకుడవ్వలి కరిగి, “ నాతో పరిచయముములేదు కావున స్వామి నే నిచ్చిన పాలుత్రాగకున్నాడు. ” అని చింతింపసాగెను.

నామదేవుడు కొంతసేపు అవ్వల నాలసించియుండెను. “ ప్రభువు యిప్ప టికి పాలుత్రాగియుండును ” అని యెంచి, లోనికి తొంగిచూచినాడు. పాల

గిన్ని యట్లే నిలిచియుండెను. "అట్లైన పాలలో నేదైన దోషముండి యుం డును." అనితలపోసి బాలకుడాకలశమును దీసివైచి మరల పాలుపిదికి వేఱొక పాత్రమందు వానిని పోసి కాచి కలకండవేసి స్వామికి నివేదన మొనరించి "మహాప్రభూ! ఇదుగో యీ పర్యాయము నైవేద్యము గైకొనుము. అను దినము తాత యొసంగుపాలను త్రాగుచుంటివి. నే దెచ్చినక్షీరము నంటకపోవు టకు నేను చేసినదోషమేమి? ఈ తూరియైనను త్రాగుము. మంచి కలకండ వేసితిని. మిక్కిలి మధురముగ నుండును." అని చేతులుజోడించి పలికెను. విగ్రహమట్లే కదలకయుండెను. పాలచెంబట్లేనిలిచియున్నది. బాలకుడు మరల జగదీశు నుద్దేశించి, "ప్రభూ నా మాట విని పాలుత్రాగుము. ఇక త్రాగవేని నా కంఠమును కోసివేసికొందును. ఈ హత్యాపాపము నీతలకు చుట్టుకొనును." అనెను. అప్పుడుకూడ విగ్రహమట్లే కదలమెదలక కూర్చునియుండెను.

నామదేవుఁడు దుఃఖమును పట్టజాలకపోయెను. యెడతెగక కన్నీరో డ్చుచు నతడు కత్తితెచ్చి, నిజముగ కంఠము దాపుగ నిడుకొని "దేవదేవా! ఇదిగో నా కుత్తుకనైన గైకొనుము." అని కత్తిని దూసికొనబోయినాడు. తోడనే స్వామి ఎడమచేతితో బాలకుని చేయిపట్టుకొని కుడిచేతితో పాలచెంబు నెత్తి మందహాసము చేయుచు క్షీరమును త్రాగివేసెను. నామదేవుని ఉల్లాస మునకు మేర లేకపోయెను. అతడు చాలసేపు నృత్యముచేసెను. గీతాలాప మొనరించెను. స్వామి క్రోలగా మిగిలిన దుగ్ధప్రసాదమును తాతకొఱకై దాచి యుంచెను.

మాతామహుడు ఊరినుండి మరలివచ్చి మనుమని పిలిచి "తాతా చెప్పినట్లు చేసితివికదా?" అని అడిగినాడు. "స్వామికి పాలనిచ్చి మిగిలిన ప్రసాదమును నీకై యుంచినాను. పుచ్చుకొనుము" అని నామదేవుడు ముచ్చ టతో తాతకిరింగించి చెంబు నాతనికిచ్చెను. వృద్ధుడు కలశమును పరికించి పాలు వెలితిగ నుండుట గాంచి "ఏమిరా! కుఱ్ఱా! పాలను చాలావఱకు నీవు త్రాగి, దేవుడు త్రాగెనని అబద్ధమాడుచున్నావా! విగ్రహమెన్నడైన పాలను త్రాగుట కలదా?" అనెను. బాలకుడు భయపడుచు, "అదేమి తాతా! అట్లనుచుంటివి? నే నెన్నడైన అబద్ధమాడితినా? స్వామి మొదట పాలను

త్రాగలేదు. ఆత్మహత్య చేసుకొందునని నేను కత్తి నెత్తితిని. దేవుడపుడు, ఒక చేతితో నాచేయి పట్టుకొని రెండవచేతితో కలశమెత్తి పాలు త్రాగెను" అనెను. వృద్ధుని మనసింకను సందేహాయుత్తమై యుండెను. బాలకుడపుడు దుఃఖించుచు స్వామిచెంత కరిగి "దేవా! నీవు పాలు త్రాగలేదని మాతాత తలచుచున్నాడు. నిజము తెలిపినను అబద్ధమాడితిననుచున్నాడు. అతని మానసమందలి సందేహముతీర్చి నన్ను రక్షింపుము" అని చేతులుమోడ్చి పలికెను. నామదేవునికడ ప్రత్యక్షమై నిలచుట దేవదేవున కిష్టములేదు. అయినను బాలకుని వేడుకోలు త్రోసివేయజాలకపోయెను. బాలకుని కన్నీ రాతని హృదయమున శూలమై గ్రుచ్చుకొనెను. తోడనే యాతడు మరల కలశమెత్తి క్షీరమును త్రాగినాడు.

ఈదృశ్యమును పరికించి ముదుసలి ఆశ్చర్యాన్వితుండయ్యెను. జగదీశుని గాంచవలెనని యాత డెంతకాలమునుండియో తపించుచుండెను. అతనికి నేటి వఱకు వాంఛ పూర్ణము కాలేదు. మనుమనిమూలమున నేడాతని చిరవాంఛ ఈడేరినది. మహాత్ముడైన మనుమనిపై అనృతదోషము పెట్టినందులకు యాత డెంతయో నొచ్చుకొనెను. తనకంటె తన దౌహిత్రుడు కోటిమడుంగుల ఘనుడని గ్రహించినాడు. బాలకుని తొడపై కూర్చుండబెట్టుకొని, సంతోష చిత్తుడై యాతని చిన్నియడుగుల నొత్తి వానికి ప్రణమిల్లి బహుభంగుల కుట్టిని ప్రస్తుతించినాడు.

నామదేవుడు శుక్లపక్షచంద్రునికరణి పెంపొందుచుండెను. అత డెన్నెన్నియో అద్భుతక్రియలను నెఱపుచుండెను. అత డొనర్చు కృత్యములనుగాంచి ప్రజలాత డవతారమూర్తియని తలంచుచుండువారు. వేనవేలు నామదేవునింట గుమిగూడి బాలకుని దర్శనముంది ధన్యులమైతిమని సంతసపడుచుండువారు. బాలకుని వింతచర్యలను గురించిన వృత్తాంతమును పాదుషా కర్ణాకర్ణిగ విని ఆచర్యలలో కొన్నింటిని తానుకూడ చూడవలెనని మక్కువపడి నామదేవుని తనకడకు రావించినాడు. బాలకుని చూచినంతనే పాదుషా ఆశ్చర్యాన్వితుడాయెను. "ఏమోయి! నీవెన్నెని అద్భుతచర్యలు జరుపుచుందువని విని యుంటిని. నీయలౌకికప్రజ్ఞను నాకడ కొంత చూపుము. నా కౌతుకమును దీర్పుము" అని పాదుషా నామదేవుని వేడుకొనినాడు.

"అయ్యా! నేను సామాన్యుడను. నన్నేల పెద్దచేయుచుంటివి. నేను అద్భుతములను, విడ్డూరములను, ఎట్లు నెఱపగలను?" అని నామదేవు డనెను.

పాదుషా క్రోధపరవశుడై నామదేవుని ఖైదునందు బెట్టించి అప్పు డప్పుడు అతని దనపాలికి బిలిపించి లీలాప్రదర్శనము గావింపుమని వాని నడుగు చుండువాడు. తానేమియు నెరుగనివాడనని దైన్యముతో బాలసాధువు ఉత్తర మొసగుచు కారాగారమున కృష్ణభజన చేయుచు నానందముతో కాలము గడుపుచుండువాడు.

ఇట్లుండ దైవవశమున నొకనాడు కారాగృహ సమీపమున నొక యావుదూడ మరణించెను. చచ్చిన దూడదాపల నిలిచి గోవు "అంబా! అంబా!" యని వాపోవుచుండెను. ఆసమయమున పాదుషా ఆదారినుండి నడచుచుండెను. గోవుయొక్క దుర్దశను పరికించినాడు. ఖైదునుండి నామ దేవుని రప్పించి "అయ్యా! ఈదృశ్యమును పరికింపుము. చచ్చినబిడ్డకై పాప మీయావు యెట్లు విలపించుచున్నదో వీక్షింపుము. నీవు సాధుప్రవరు డవు. హిందూమతమున విశేష అనురాగము గలవాడవు. గోవును పూజింపు డని మీశాస్త్రములు ప్రజలకు బోధించుచుండును గదా? మీశాస్త్రములను పాటింతువేని యీవృద్ధధేనువుయొక్క దుర్దశను మాపుచేయుము. దూడను బ్రతికించితివేని గోవుయొక్క మనస్తాపము నశించును. మీధర్మమునకు మీ మతమునకు జయము సిద్ధించును" అని పలికెను.

ఆవును చూచినంతనే నామదేవుని హృదయము కరగిపోయెను. కృష్ణ నామసంకీర్తన మొనరించుచు దూడ యొడలున జేయివేసి యాతడు లెమ్మని యాదేశించెను. తోడనే దూడ నిదురనుండి లేచినదానివలె లేచి, "అంబా" యని యఱచుచు తల్లి పొదుగుదరికి పర్వెత్తెను.

ఈయద్భుతదృశ్యమును జూచిన పాదుషా నిర్ఘాంతపోయెను. తోడనే యతడు నామదేవుని విడుదల గావించి తానుకావించిన తప్పిదమును మన్నింపు మని బహుభంగుల వానిని వేడుకొని కానుకలును ధనరాసులును వానియెదుట పెట్టి వానిని గైకొని తన్ను ధన్యునిజేయుమని ప్రార్థించెను. అపుడు బాల యోగి, "రాజా! నే నీధనరాసులను, బహుమతులను, నేమిచేసికొందును?

దీనులకును, దుఃఖితులకును, వీనిని పంచిపెట్టుము. సంతసింతును. ” అనియుత్తర మొసగెను.

చేడాతని యద్భుత త్యాగగుణములను మిక్కిలి కొనియాడి యతడు కోరినట్లు తోడనే యాధనమంతయు బీదసాదలకు పంచి యిచ్చెను. అనంతరము పాదుషాయును, మంత్రిసామంతాది అనుచరులును, నామదేవునకు బహువిధసత్కారములు సమర్పించి మహోత్సవము జరిపి గౌరవపూర్వకముగ నాతని నిజగ్రామమునకు పుత్తెంచిరి.

వర్తకముచే విశేషధనము సంపాదించిన యొకడు విశేషముగ కొంత సైకమును దానముచేయ సమకట్టి తన క్రియను మిగుల మెచ్చు పెద్దలను ఆహ్వానించెను. పాదుషా సత్కారమువలనను తన మహత్త్వమువలనను నామదేవస్వామి విశేషఖ్యాతి సంపాదించి యుండుటచే నతనినిగూడ యావణిజుడు దాన పరిగ్రహణమునకై పిలిపించినాడు. వర్తకుని చిత్తవృత్తిని స్వామిజీ కనిపెట్టెను. దీనులును, దరిద్రులును, దుఃఖితులునుగాక యితరులాతని దృష్టి నాకర్షించుటచే హృదయమున మిగుల పరితాపముచెంది చక్కని పాఠమును షాహుకారునకు బోధింప వలెనని నిశ్చయించి స్వామి ఆహ్వానము సంగీకరించెను; మహోత్సవముతో వర్తకుడు స్వామిజీకి స్వాగతమిచ్చెను.

అనంతరము దానము గొనుడని సవినయముగ వణిజుడు నామదేవునడిగెను. అడుగుటయు స్వామిజీ, “ వర్తకుడా ! నీభక్తికి మెచ్చితిని. నేకోరు దానము చేయుదువేని దానిని వట్టెదనను” అనెను. “మహాత్మా మీసెలవెట్లో అట్లేచేయుదు ” నని వర్తకుడనెను. ఒక తులసిదళముపై కృష్ణనామమును లిఖించి దానిని వణిజునకిచ్చి దానితో సరితూగు బంగారమును తనకిమ్మని స్వామిజీ యాతని నడిగెను. వైశ్యుడు నవ్వి “చిన్నముకాదుగదా, ఒక గురిగింజ తూనికైన నిలువని యీచిన్ని యాకువలన మీకు ముట్టు బంగారమెంత యుండును ? దానివలన మీకు చేకూఱు ప్రయోజనమెంత ? అయినను తాము తెలిపిన చొప్పున తమవాంఛ తీర్చెదను. ” అని ఒక చిన్న త్రాసునుదెచ్చి తులసీ దళముతో సమముగ బంగారమును తూచ దొరకొనెను. చిన్ని మాత్రవంటి బంగారుగోళితో నతడు తూనిక నారంభించినాడు. పిల్లకాసులు, ఉద్ధర

కాసులు, పెద్దకాసులు కడచినవి. దళము బరువై యుండెను. త్రాసును మూలబడవైచి వర్తకుడు తక్కెడను తెచ్చినాడు. తనయింటనున్న బంగారమంతయు రెండవతట్టునసంచి తూచినాడు. అప్పుడును తులసీపత్రముగల తక్కెడపళ్లెము మీదికి లేచినదికాదు. వర్తకుడచ్చెరువందినాడు. తనమాట పొల్లుపోవునని భీతిల్లి గృహమందలి స్త్రీల నగలనుదెచ్చి తూచినాడు. అతని ప్రయత్నము వ్యర్థమయ్యెను. ఇరుగుపొరుగువారికడ నప్పుగొని మఱికొంత బంగారము తెచ్చినాడు. అపుడుకూడ పత్రము బరువుగనేయుండెను. త్రాసు తక్కెడలుపోయి కాటాతెచ్చి బంగారమును తూచినను తులసీదళము కృష్ణనామాంకితమగుటచే దానితో నెంతబంగారము తూచినను సరితూగదని వర్తకుడు గ్రహించెను. కొంతతడవు అతడు తొట్రుపడినాడు. ఇందేదో మహాత్మ్యమున్నదని గ్రహించి చేతులుజోడించి స్వామిజీనుద్దేశించి, "మహాత్మా! అసమర్థుడనైతిని. ఈతులసీ దళముతో సరితూగు బంగారమును తేజాలకుంటిని. ఇందలి అద్భుతరహస్య మేమో కరుణించి తెలుపుడు." అని వణిజుడు పలికెను.

మందహాస మొనరించి నామదేవస్వామి, "సోదరా! కృష్ణనామముతో సరితూగజాలునది పదునాల్గుభువనములయందును నేమియులేదు. ఈతులసీ పత్రము కృష్ణనామాంకితమయినది. కృష్ణనామ మహాత్మ్యమెట్టిదో యిపుడు కొంచెము గుర్తించితివికదా? ఇక కృష్ణుని సేవింపుము. కృష్ణనామసంకీర్తనము గావింపుము. శుభకార్యములు చేయుట మంచిదే, దానధర్మములు చేయుటయు మంచిదే. కాని ప్రజలదృష్టి నాకర్షింపవలెనని చేయబడు నిట్టికార్యములు నరర్థకములు. నిరుపేదలకును, అభాగ్యులకును, నీవొనరింపదగిన కర్తవ్యమును గుర్తింపవైతివి. వారిహస్తముల నొక కాసైన బెట్టవైతివి. మాబోటి సన్న్యాసులకు రూకలప్రోవులను బంగారుకుప్పలను ఇచ్చుచుంటివి. దరిద్రనారాయణులను సేవించునపుడే జగదీశుడు సంతృప్తిపడును. సర్వము ఈశ్వరార్పణమని కృష్ణభజనము చేయుము. హరినామహారము కంఠమున దాల్పుము. కృష్ణనామమునకు సరియైన దేదియును నీ విశాలవిశ్వమున గానరాదు. బంగారమే కాదు బ్రహ్మాండము నంతను మూటగట్టి తక్కెడయందు బెట్టి తూచినను మహానామాంకిత దళమందలి కోటియంశములతోనైనను ఈడ్జాలయె యుండజాలదు. సముద్రముతో బిందువు సరితూగునా? సోదరా! ఈ ఉపయోగములేని వేషములను

పరిత్యజించి సంసారతాపనాశన మొనరించు కృష్ణుని పదములను సేవించుచు కృష్ణపరముగ సత్కార్యముల గావించుచు ధన్యుడవగుము."

స్వామీజీవాక్కులు వర్తకునిహృదయమునకు అమృతవర్షమాయెను. అతని హృదయము సంపూర్ణముగ మారిపోయెను. నూతనజీవనమును పొంది యాతని మానసము పరమహంస యట్లు నృత్యమొనరించెను. సర్వము త్యజించి నామదేవస్వామి కాతడు శిష్యుడాయెను. అతని వెనుక నెందరెందరో స్వామిజీని కొలువసాగిరి. పలువురకు ముక్తిమార్గము జూపి కాలక్రమమున నామదేవస్వామి జగదీశుని జేరుకొనెను.

ఈ కథ విడ్డూరముతో నిండియున్నది. జగదీశునికరుణ పెంపున వితంతువు గర్భముదాల్చుట, విగ్రహము సచేతన మానవునట్లు బాలకునిచేతి పాలను త్రాగుటయు, మృతగోవత్సరము బ్రతుటయు, కృష్ణనామాంకితమైన తులసీదళము మిగులభారము కలిగియుండుటయు, విచిత్రములే. సాధారణదైనికజీవనమున నిట్టిచిత్రములు గోచరింపవు. ఆధ్యాత్మికజీవనమున నీ యద్భుతక్రియలకు నిర్ధ్యానముకలదు. ప్రపంచమున చరిత్రలను పరికించితిమేని దృష్టాంతములనేకములు గోచరమగును. వడ్రంగితల్లి కడుపున భగవంతుని కరుణచే ఏసు క్రీస్తు పుట్టెనని 'బైబిలు' తెలుపుచున్నది. భీమకవి జన్మవృత్తాంతమందును నిట్టి విడ్డూరమున్నది. మహాపురుషుల చుట్టును అద్భుతము లనేకములు పెరుగుచుండును.

ఏసుక్రీస్తుజీవన మెన్నెని చిత్రములతో నిండియున్నది. ఏసు నీటిని సారా గావించెననియు, రోగులను మరణోన్ముఖులను నిముసములో బాగుచేసెననియు, కొలదిపాటి రొట్టెలను, మీనములను అసంఖ్యాకులకు పంచిపెట్టెననియు, భూమిపై నడచునట్లు సముద్రముపై నడచెననియు, గ్రుడ్డివానికి తృటిలో దృష్టినిచ్చెననియు, చచ్చినవానిని బ్రతికించెననియు తాను మరణించిన మూడవనాడు సమాధిచేయబడిన స్థలమునుండి లేచెననియు 'బైబిలు' మహాగ్రంథము స్పష్టముగ తెలుపుచున్నది. ఏసు మానవుని బ్రతికించునట్లు కృష్ణపరమాత్మ తన గురువగు సాందీపుని కుమారుని బ్రతికించిన విధమున నామదేవస్వామి గోవత్సమును బ్రతికించినాడు. భగవంతుని మహిమయందలి కొంతభాగము మహాభక్తులకు దక్కును.

ఇక తులసీదళమహాత్మ్యము—ప్రతి హిందువుడును దీని మహాత్మ్యము నెఱుగును. "యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతాః యదగ్రేసర్వవేదాశ్చ" శ్రీకృష్ణతురాభారమందలి మహత్వము, శ్రీకృష్ణప్రజ్ఞను గుర్తించిన భక్తవతంసుని జీవనమందును గోచరించును. దృఢమైన విశ్వాసమును నిర్మలమైన చరిత్రయు వెలయుచోటునందే భౌతికశాస్త్రముగాని దాని తాతగాని హృదయంగము చేసికొనజాలని యద్భుతములు గోచరమగును. నిజముగ పాలు త్రాగునని నమ్మిన బాలునకే ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు. ఇందలి యద్భుతము అధ్యాత్మికానుభవము నందినవారికే బోధపడును. నామదేవస్వామి జీవనమందలి అద్భుతమహత్వమును సంశయసంకులచిత్తులు గుర్తింపజాలరు. ఆధ్యాత్మిక విభూతిపై కన్నుగలవారే నమ్మగలుగుదురు.

౪౪

# శ్రీరామకృష్ణపరమహంస



"అంబా సృష్టివినాశపాలనకరీ ఆర్యావిశంశోభితా,
గాయత్రీ ప్రణవాక్షరామృతః పూర్ణానుసంధీకృతా,
ఓంకారీవినుతా సురార్చితపదా ఉద్దండదైత్యాపహా,
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ"

(శ్రీరామకృష్ణకథామృతము అను వంగమాతృకనుండి ఆంధ్రీకృతము)

వంగదేశమున హుగ్లీజిల్లాలలో జహానాబాద్ (దీనికి ప్రస్తుతనామము 'ఆరాంబాగ్') నకు పడమర నాలుగుక్రోసుల దూరమందును, బరద్వానునకు దక్షిణదిశయందు రమారమి పదమూడుక్రోశుల దూరమునందును గల కామార్ పుష్కరిణి అను గ్రామమున వంగశకము 1241 వ సంవత్సరమున ఫాల్గుణ శుక్ల విదియ బుధవారమునాడు (క్రీస్తుశకము 1836. Feb. 17) వేకువజామున నాలుగుగంటలకు శ్రీరామకృష్ణుడు జన్మించెను. జననీజనకుల అవ్యాజానురాగము కతన నతడు దినదినాభివృద్ధి గాంచదొడగెను. బాలకునకు నెనిమిదవ మాసము రాగానే తలిదండ్రు లాతని కన్నప్రాశనముజరిపిరి. బాలునకు గదాధరుడని పేరుపెట్టిరి కాని యీ పేరు కుటుంబమందు పలువురకు నచ్చనందున దానికి బదులుగ వారు బాలకునకు రామకృష్ణుడని పేరుపెట్టిరి. బాలున కైదేండ్లు రాగానే తలిదండ్రు లాతని గ్రామపాఠశాలయందు ప్రవేశపెట్టిరి. చదువునందు రామకృష్ణునకు మక్కువలేకుండెను. అతడాటపాటలందే కాలము గడపివేయువాడు. సంగీతమనిన నతనికి మక్కువ ఎక్కువ. ఊరిలో నెచటనైన హరికథగాని, పాటకచేరిగాని, భజనగాని జరుగుతేరి రామకృష్ణుడు తప్పకపోయి అందు వ్రాలుచుండువాడు. ఒకనాడాతని బాల్యమిత్రులలో నొకడు, "సోదరా! నీ కంఠము మిగుల మధురమైనది. ఏదైనపాట పాడుము. విందును" అని వానితో పలికెను. నాటినుండి రామకృష్ణుడు సంగీతము నభ్యసింపగడంగెను.

ఎవ్వరి సహాయ్యము గొనక అచిరములో సంగీతమునం దాతడు కొంతప్రజ్ఞ సంపాదింప గలిగెను.

రామకృష్ణుని తండ్రిపేరు, క్షుదిరాం చట్టోపాధ్యాయుడు. అతడు భక్తుడు. మిగుల నిష్ఠాపరుడు. దశకర్మల నిర్వహించుటయందు ఆరితేరిన వాడు. దేరేయను నూకీతని పూర్వవాసస్థలము. కామరపుష్కరిణికి మూడు మైళ్ల దూరమున నున్నది. ఆయూరి జమీందారు నడపు కొండొక కేసులో క్షుదీరాముడు సాక్ష్యమిచ్చుట కంగీకరింపక కామరపుష్కరిణికివచ్చి అందు వాసమేర్పరుచుకొనినాడు. వైదికవృత్తి నెఱపుచు, అతికష్టముతో సంసార యాత్ర గడపుచుండువాడు. ఆతనిభార్య చంద్రమణి, శాంతమతి. వీరికి మువ్వురు కొడుకులు, ఒకకూతురును జనించిరి. పెద్దవాడు రామకుమారుడు, రెండవ వాడు రామేశ్వరుడు, మూడవవాడు రామకృష్ణుడు. కుటుంబయాత్ర గడుపుట యందు జనకునకు రామకుమారుడు సాయపడుచుండువాడు. స్వగ్రామమువీడి కలకత్తానగరమునకుచని ఝామాపుష్కరిణి యను ప్రదేశమున మకాము ఏర్పరుచుకొని శాస్త్రశిక్షణ మొనరించుటకై పాఠశాల యొకటి నిలిపెను.

గ్రామ విద్యాలయమందున్నపుడు రామకృష్ణునకు చదువేమియు నంటలేదు. అందుచేత తమ్మునకు శాస్త్రబోధ సలుపదలచి రామకుమారుడు వానిని తనయొద్దకు గొనిపోయెను. రామకృష్ణుడపుడు పదునాలుగేండ్ల వయసువాడు. కలకత్తా వచ్చినపిదపకూడ నతనిమనసు చదువుమీది కెక్కలేదు. అన్నగారి శ్రయమువలన, కొంత మిడిమిడి జ్ఞానమును సంపాదించినాడు. కాని రామకృష్ణుని మేధాశక్తి గొప్పది. పౌరాణికులు, రామాయణము, మహాభారతము, భాగవతము, మొదలగు గ్రంథములు చదువుచుండ విని నిముసములో వానియందల్లి యుదృతాంశములను మనసున పట్టించుకొనుచుండెడివాడు.

రామకృష్ణుడు పదునెనిమిదేండ్ల వయసువాడైనపుడు, అతని జ్యేష్ఠ సోదరుడు కలకత్తా కుత్తరమున రమారమి ఆరుమైళ్ల దూరమందున్న దక్షిణేశ్వరాలయమున అర్చకుడుగ నియోగింప బడెను. రాసమణి యను ఒక మ్రాహ్వాడీ రాణి వంగశకము 1259 సం॥రమున, (క్రీ. శ. 1855 మే. 31) దక్షిణేశ్వరమున భాగీరధీ తీరమున నొక మనోహరమగు నుద్యానవనమున విశేష ధనము వెచ్చించి చక్కని గుడికట్టించి అందు మహాశక్తి ప్రతిమను ప్రతిష్ఠింప

శ్లెను. ఆస్థలము 1847 సెప్టెంబరు 6 వ తేదీని కొనబడినది. 1861 ఆగస్టు 27 వ తేదీని రిజిస్టరు చేయబడినది. ఆలయమునకు ఆదాయమిచ్చు డినాజ్‌పూరు జమీందారీ ఖరీదు రు 2,26,000. ఈ విగ్రహారాధనమున నియోగింపబడిన పిదప రామకుమారుడు ఝామాపుకురుణి యందుగల తన చిన్న పాఠశాలను ఎత్తిపెట్టి తమ్మునితోగూడి దక్షిణేశ్వరమున మకాము ఏర్పఱుచుకొనెను. రామకృష్ణుని చిన్నయన్న రామేశ్వరుడు అపుడపుడు దక్షిణేశ్వరమునకువచ్చి పూజ సలుపుచుండువాడు. ఈదక్షిణేశ్వరముననే రామకృష్ణునకు క్రీ. శ. 1859 లో పరిణయ మాయెను. హుగ్లీజిల్లాయందలి జయరామవాటియందు నివసించు రామచంద్ర ముఖోపాధ్యాయు డాతని మామగారు. అతని జ్యేష్ఠకుమార్తె శారదాసుందరి రామకృష్ణుని యర్ధాంగి. పెండ్లినాటికి రామకృష్ణునకు ఇరువది మూడేండ్ల వయసుండెను. శారదామణి వయసప్పు డాఱేండ్లు మాత్రమే. రామకుమారుడు దక్షిణేశ్వరాలయమున రెండుమూడేండ్లు అర్చకత్వము నిర్వహించి కాలధర్మమునొందెను. రాసమణిరాజ్ఞి రామకుమారుని కొడుకువలె ప్రేమించుచుండెడిది. ఆమె మేనయల్లుడు మథురబాబు రాణియొక్క రాజ్యకార్యములయందు పాల్గొనుచుండువాడు. అతనికికూడ రామకుమారునిమీద దయమెండు. రామకుమారు డకాలమరణమునకు గుఱియగుటచే నతని కుటుంబమునకు దీనావస్థ సంభవించెను. కుటుంబభరణ కర్తవ్యమును రాసమణిరాజ్ఞి తనపై వేసికొని రామకుమారుని పదవియందు రామకృష్ణుని నియోగించెను. రామకృష్ణుడంతకుమున్ను ఎన్నడును అర్చకత్వము చేసియెఱుగడు. అతని కా ఉద్యోగము క్రొత్త కాని అచిరములో నాతడు శాస్త్రానుసారముగ పూజ చేయగలిగినాడు. విశేషోత్సాహముతోడను, నిష్కళంక భక్తితోడను, నతడు దుర్గకర్చనము చేయుచుండువాడు.

అర్చకపదవినందినదాది రామకృష్ణుడు సదా దేవినే ఆరాధించుచుండువాడు. కరాళవదనయైన జగదీశ్వరి సాహాయ్యము మూలమున నతడు అంతః శత్రువులను (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములు) జయింపగలిగినాడు. రామప్రసాద, కమలాకాంత ప్రభృతి భక్తులు రచించిన, కాళీకీర్తనములు నాతడు సతతము పాడుచుండువాడు.

ఇట్లుండ రామకృష్ణునకు యోగాభ్యాసము చేయవలయునని బుద్ధి పుట్టెను. ప్రశాంతమగు ప్రదేశమునగాని యోగసాధనము సాధ్యముకాదని రామకృష్ణుడు ఉద్యానవనమున కుత్తరదిశనొక చక్కని పర్ణశాల నిర్మించుకొని యందు వసింపసాగెను. కుటీరమునకు సమీపమందే పెద్ద మఱ్ఱిచెట్టొకటి కలదు. ఈ చెట్టునీడయందే రామకృష్ణుడు యోగాభ్యాస మొనరించుచుండు వాడు. తోతాపురియను వైరాగి రామకృష్ణున కాచార్యు డాయెననియు, అతని కరుణ పెంపుననే రామకృష్ణుడు యోగాభ్యాసమునకు ప్రారంభించెననియు కొందఱు చెప్పెదరు.

ఐశ్వర్యమును, బంకమట్టిని, అతడు సమముగ జూచుచుండువాడు. గంగాతీరమున కూర్చుని రామకృష్ణు డొకచేత పైకమును, రెండవచేత మట్టిని పెట్టుకొని ఇట్లనుచుండువాడట, "ధనమా! నీకు తళుకుబెళుకు లున్నవి. నీవు నిర్జీవపదార్థంబవు. నీవలన ఇండ్లును, వాకిండ్లును, మిద్దెలును, మేడలును, నిర్మాణమగును, కాని సచ్చిదానందము నీవీయజాలవు. మృత్తికా! నీవును జడ పదార్థంబవే. నీవలన నెన్నెని సస్యములు ఉత్పన్నమగుచున్నవి. వానిని విని యోగింపగ సకలసౌఖ్యములు చేకూరుచున్నవి. నీవును, సచ్చిదానందము నీయజాలవు. అట్టైన ద్రవ్యమా! నీకును యీమట్టికినిగల వ్యత్యాసమేమి! అనుచు రామకృష్ణుడు పైకమును నీట గిరవాటు వేయువాడట.

కాంచనము నెట్లు వర్జించినాడో, రామకృష్ణుడు కాంతనుగూడ నట్లే వర్జించినాడు. "సుందరరమణులజూచి, లోకములోని పురుషులు ఉన్మత్తప్రాయు లగుదు రేల? వారి శరీరములేమి? అవి యస్థిపంజరములుకావా? రక్తమాంస ముల ప్రోవులుకావా? వీనిపై నల్లనిదో, పచ్చనిదో చర్మముండును. రక్త మాంసములులేని మొండెమును జూచినపు డెవ్వరేని మోహపరవశులగుదురా? ఈవాంఛయంతయు రక్తమాంసముల మీదనేకదా ప్రాలుచున్నది. రక్త మాంసముల ప్రోవుపై చేయివేయుట కసహ్యించుకొను మానవుడు, వీనినే స్త్రీ శరీరరూపమునగాంచి మక్కువ పడుచున్నాడు. ఆప్రోవునతడు లక్ష్యము చేయరాదు." అని రామకృష్ణుడు పలుకుచుండువాడు.

రాసమణిరాణి మేనల్లుడు మధురబాబు రామకృష్ణుని పలుమాఱు పరీక్షచేసినాడు. ఉద్యానవనమందలి తనగృహమునకు అతడు మిగుల వంద

కత్తెలైన వారవనితలను రావించి రామకృష్ణునికూడ నచటికి బిలిపించి అతని మనస్సు త్రిప్పుడని వెలవెలందులను ప్రోత్సహించుచుండువాడు. కాని వర్నాంగనల విలాసములును, వలపులును రామకృష్ణుని మనమున నాటుకొను వాడిబాణములు కాజాలకపోయెను. అవి రామకృష్ణునిపట్ల వ్యర్థములయ్యెను. మధురబాబు పిమ్మట రామకృష్ణుని ఉత్తరహిందూస్థానమందలి ముఖ్యములగు ప్రదేశములయందు త్రిప్పి యాతనిమనసు తిరుగునేమోయని మిగుల ప్రయత్నించినాడు. కాని యాతని యత్నములును విఫలములైనవి.

రామకృష్ణుని గురుగంభీర గుణము లోకులకు తెలియవచ్చెను. క్రమక్రమముగ శిష్యు లాతని జేరజొచ్చిరి. రామకృష్ణుడు చదువుకొన్న వాడుకాడు. శాస్త్రముల నాతడు పరిశోధింపలేదు. అతనికి భాషాజ్ఞాన మంశగాలేదు కాని యాతని ఉపదేశములు ఉపమాలంకారములతో గూడి గంభీరమగు భావములతో విలసితములై యుండెడివి. అతని నుడువులువిని యెందరెందరో వింతపడు చుండువారు. క్రమక్రమముగ రామకృష్ణుని శిష్యసంఖ్య అధికమైనది. బ్రహ్మసమాజ మతమున విశేష ప్రశస్తినంది కేశవచంద్రసేన్ పరమహంసదేవుని చరణోపాంతమున కూర్చుండి ఎంతేని జ్ఞానామృతమును గ్రోలినాడు. నాట్యకళయందు విశేషమయిన ప్రతిభను సంపాదించిన గిరీశ చంద్రఘోషు చాలకాలము ప్రపంచమున పాపమనునది లేదని విశ్వసించువాడు. రామకృష్ణ పరమహంస ఉపదేశములను మనమున నింపికొని అతడు సంపూర్ణముగ మారిపోయినాడు. నాస్తికులును, పాపులును, ఎందరెందరో, పరమహంస కతన బాగుపడిరి.

శైశవమునుండియు రామకృష్ణుని భక్తిగుణము మిక్కిలి గాఢముగనుండెను. పల్లెబడియందు ప్రవేశ పెట్టబడినపుడు బడి కేగుటకు నిత్యమును రఘువీరుని పాదము లతడు సేవించు చుండువాడు. తనంతతాను పూలుకోసి పూజసేయు చుండువాడు. అతనియింటి సమీపమున ధర్మశాల యొకటి యుండెను. యోగులును విద్వాంసులును నచట చేరగా తరచుగ వారిని జేరుచువారు పురాణ కాలక్షేపము చేయుచుండ వీనులొగ్గి సత్కథామృతమును గ్రోలుచుండువాడు. రామకృష్ణుని తరువాతి జీవనమునందలి మహాత్మ్యము అతని శైశవ దశయందలి చిహ్నములనుండియే పెరిగి పెంపొందినది.

బాలకుడై యున్నపుడు రామకృష్ణుడొకప్పుడు పరిసర గ్రామమునకు ఒక పొలముగుండా నడచి పోవుచుండెనట. అతనివయస్సపుడు పదునొకండేండ్లు మాత్రమే. అట్లు నడచుచు పోవుచుండ నొకనాడాకస్మికముగ నాతడొక యద్భుతజ్యోతిని తిలకించి తన్మయుడైనాడట. కనులుమూసి నేల నాతడు పడి యుండుట జూచి చుట్టుచేరిన ప్రజ లాతడు మూర్ఛిల్లినాడని తలచిరట. మూర్ఛకాక అది భావసమాధియని పదపడి గుర్తించిరట. అద్భుతమగు ఆ దర్శనమును గురించిన యుదంతమును పరమహంసయే తరువాత దనశిష్యులకు దెలిపెను. ఆధ్యాత్మిక (ఆత్మసంబంధమైన) జీవనము లందిట్టి వింతలు పొడకట్టి నట్లు మహాపురుషుల జీవితములు తెలుపుచున్నవి. మహాభక్తులే కాక మహా కవులును యిట్టి దృశ్యములను పరికించినారు. రాముని సందర్శనము పొంది తాను భాగవతము రచించినట్లు పోతన చెప్పుకొనినాడు. తన సౌధాగ్రమున నొకమనోహర సాయంసమయమున నిలిచినపుడు అద్భుత దృశ్యమొకటి గాంచి కవితను చెప్పదొడగితినని రవీంద్రుడిటీవల చెప్పుకొనినాడు. ఇట్టి దృశ్యములు, ఇట్టి యనుభవములు మనుష్యజీవనమున నెంతలేని మార్పు గలిగించును.

పూజచేయుకొలది రామకృష్ణుని మానసము అద్భుతమగు స్థితికి వచ్చు చుండెడిది. ఏకాగ్రచిత్తుడై యాతడు ప్రతిమ కెదురుగ నిలువంబడి యుండువాడు. పరిణయమువలన నాతని మనసు తిరుగునని యాతని యాప్తులు తలచిరిగాని వారియూహ నిష్ఫలమాయెను. దక్షిణేశ్వరమున నున్నతటి ఆధ్యాత్మికానుభవ మున నతడాటితేలినాడు. దుర్గపూజ చేయుచు నతడొక యద్భుత ఈశ్వరీయ రూపమును గాంచుచుండువాడు. ఆరతిచేయ మొదలిడివాడు—కాని అది యెంత సేపటికిని ముగియునదికాదు. పూజచేయుచునే యుండెడివాడు. అది యెంత కును తెమల కుండునది. భగవతిని మనమునం దిడికొని యాతడేపనిచేయుటకు పూనుకొనినను నతడందే తన్మయుడై యుండువాడు. పూజచేసిచేసి తుదకత డున్మాదునివలె గంతులు వైచువాడు.

రామకృష్ణుని మహత్త్వమును గుర్తించిన మధురబాబు పూజారితనము నుండి యాతనిని తొలగించి యాతని మేనల్లుడు హృదయముఖోపాధ్యాయునిపై నాభారముంచెను. అనవరతము ధ్యానమగ్నుడై యుండు మహాత్ముని సేవించు

కర్తవ్యముకూడ మధురబాబు హృదయముఖోపాధ్యాయునిపై యుంచెను. ఒక్కొక్కప్పుడు జడపదార్థమువలెను, వేఱొక్కపుడు బొమ్మవలెను, ఇంకొక్కప్పుడు పిచ్చివానివలెను, మఱియొక్కప్పుడు బాలకునివలెను పరమహంస ప్రవర్తించుచుండువాడు. కామినీకాంచనములు పూజించువా రెదురైనపుడు మఱుగునకు తొలగుచుండువాడు. పరమేశ్వరారాధకుల గాంచినపుడు మిక్కిలి యుల్లాసపడుచుండువాడు. అనవరతము "మాతా! మాతా!" యని భగవతిని ప్రస్తుతించువాడు.

దక్షిణేశ్వర కాళీయాలయములోనికి పండితులును, సాధువులును యెల్లప్పుడు వచ్చుచు మహాప్రసాదము స్వీకరింపుచుండువారు. తోతాపురయోగి యను నొక మహావిద్వాంసుడందు పదునొకండు నెలలు వసించి రామకృష్ణునకు వేదాంతమును వినిపించెను. తోతాపురయోగి ప్రబోధించుచుండ రామకృష్ణుడు నిర్వికల్పసమాధియందు చిత్తమును నిలిపి తన్మయుడై యుండువాడు.

1859 మొదలు 1866 సంవత్సరమువరకు నీయోగి దక్షిణేశ్వరమునకు తఱుచుగ చనుచు తంత్రసంబంధమగు సాధనములను రామకృష్ణునకు తెలుపుచుండువాడు. చైతన్యుడు మొదలగు నుత్తమవైష్ణవోత్తముల చరిత్రలాతడు చదివి రామకృష్ణునికి వినిపించుచుండువాడు.

వైష్ణవచరణుడను నొక వైష్ణవపండితుడుకూడ తఱుచుగా దక్షిణేశ్వరమునకు వచ్చుచుండువాడు. కలకత్తా మహానగరమందలి కొలూటోలాయను పేటలోనున్న చైతన్యాశ్రమమునకు రామకృష్ణు నతడు కొనిపోవుచుండువాడు. పలుమాఱు రామకృష్ణు డచట భక్తియావేశు డగుచుండువాడు. వైష్ణవచరణుడు చైతన్యసభకు అధ్యక్షుడు. రామకృష్ణుని మహత్త్వమును గుర్తించిన వారిలో నతడు మొట్టమొదటివాడు. మధురబాబు నుద్దేశించి యాతడు "ఈతని యున్మాదము సాధారణమైనదికాదు. అది ప్రేమోన్మాదము" అనుచుండువాడు. చైతన్యునియందు గానిపించుచుండెడి బాహ్యాంతరదశలీ రామకృష్ణునియందు కన్పట్టుచుండెడివి.

'అమ్మా! అమ్మా!' యని రామకృష్ణుడు విలపించుచుండువాడు. సర్వదా ఆమెతో మాటలాడుచు ఆమె యుపదేశముల నందుచుండువాడు. "అమ్మా! నేను శాస్త్రముల తెలియంగేఱుంగను. నాకు పాండిత్యములేదు.

నీమాటలే నీయుపదేశములే నాకు జ్ఞానము ప్రసాదించును. నీవు పరబ్రహ్మాంశవు. అఖండసచ్చిదానంద స్వరూపంబవు" అని యాతడు పలుమాఱు పలుకుచుండు వాడు. "నీవును నేనును ఒక్కరమే. భక్తులకు సదుపదేశము చేయుచుండు" మని భవాని యాతనితో చెప్పుచుండెడిదట. ఆలయమున సాయంసమయ మున హారతిజరుగువేళ ఘణఘణ గంట మ్రోగినంతనే రామకృష్ణుడు కంఠమెత్తి భక్తులను పిలచుచుండెడువాడు.

తనకన్నతల్లిని చంద్రమణిని రామకృష్ణుడు జగజ్జననివలె చూచుచుండు వాడు. భక్తిశ్రద్ధలతో నామెను సర్వదా పూజించుచుండెడువాడు. అన్నగా రగు రామకుమారుడు చనిపోయిన పిదప రామకృష్ణుడు తల్లిని తనపాలికి గొనిపోయెను. జనని పాదధూళిని తనశిరమున దాల్చుచు సదా యత డామె క్షేమము నరయుచుండువాడు.

రామకృష్ణుడు యాత్రలుసేయ రెండుమాఱులరిగెను. మొదటిసాఱి క్రీ. శ. 1863 లో, తల్లినికూడ తనతో గొంపోయినాడు. రామఛటర్జీయును, మధురబాబు కొడుకులు కొందఱును అతనివెంట నంటిరి. కాశీకి అపుడే రైలు మార్గము వేయబడినది. వైద్యనాధమహాక్షేత్రమును, బృందావనమును గాంచి పరమహంస కాశీప్రయాగలు దర్శించినాడు. అయిదేండ్లు గడచిన పిదప నతడు తిరిగి తీర్థసేవనమునకై బయలు వెడలినాడు. అర్ధాంగియైన జగదాంబ తోడను, దాస దాసీజనంబులతోడను పయనమై మధురబాబు తీర్థసేవనమున పరమ హంసకు వలసిన సౌకర్యములు చేకూర్చుచుండువాడు. మణికర్ణికా ఘట్టమున విడిసి విశ్వనాధుని చిన్మయరూపమును వీక్షించి పరమహంస పరమానంద భరితుడైనాడు. మోక్షాపేక్షులయి చెంతచేరు మానవుల చెవులందు తారక బ్రహ్మనామామృతమును వోసినాడు. శ్రీత్రైలింగస్వామిని వీక్షించి ధన్యుడై నాడు. మధురయందు ధ్రువఘట్టమున పరమదేవుని అంకతలమున శ్రీకృష్ణుని, శ్రీబృందావనమున సంధ్యాసమయమున గోవులనుగొని యమునానదిదాటి మంజుల రవమున పిల్లంగ్రోవిని పాడు గోపాలుని కన్నులయెదుట గాంచినట్లు సంతసించినాడు. నిధువనమందలి గంగామాతను గాంచి ముదమునొందిరి.

సర్వమతముల సిద్ధాంతముల నెఱింగి సర్వమతసమన్వయముసేయ రామ కృష్ణుడు మిక్కిలి మక్కువపడినాడు. పరమహంస వసించుగదియందు వివిధ

మతాచార్యులు ప్రతిమలుండెడివి. ఇపుడును నామందిరంబున నా ప్రతిమలు వెలయుచున్నవి. నేమను పాశ్చాత్యులనేకులు ఈగదియందు ప్రవేశించి పరమ హంసను ధ్యానించి వెడలుచుందురు.

మిగుల నాత్రమున రామకృష్ణు డొకనాడు కాళీమాత నుద్దేశించి "నీక్రైస్తవభక్తులు నిన్నెట్లు సంబోధింతురో వినగోరెదము. అమ్మా! ఒకనాడు నన్ను వారి ప్రార్థన మందిరమున జేర్పుము" అనియెను. కలకత్తా చని పరమ హంస యొకనాడు యొక క్రైస్తవదేవాలయము గుమ్మమున నిలువఁబడి యచటి ఉపాసనమును చూచి యందు పాల్గొనినవాడు.

పురుషులేగాక స్త్రీలును పలువురు పరమహంసదేవుని సేవింప నాతుర పడుచుండువారు. అనేకభక్తురాండ్రు రామకృష్ణునకు భక్తురాండ్రయిరి. స్త్రీల నందఱ పరమహంస తల్లులట్లు పూజింపుచుండువాడు పరనారి భగవతియనియే యాతని తలంపు. పరస్త్రీ జగన్మాతయని యొకడు తలంపజాలనంతవఱకు నిర్మల చిత్తుడును, భక్తప్రవరుడును కాజాలనంతదనుక స్త్రీలయెడల నొకడు మిగుల నప్రమత్తుడై ప్రవర్తింపవలెనని రామకృష్ణుని యుద్దేశము. ఎదుటియాడుది భక్తిమతియయ్యు ఆమె సంపర్కమునుండి కొంచెము దూరమునందుండుమని తోడిమానవునితో నాతడనుచుండువాడు. దుర్గనుద్దేశించి "అమ్మా! నాహృద యమున కామభావము పొడసూపెనేని కుత్తుక నరకికొందును" అని పరమ హంస పలికినాడు.

వంగశకము 1293 సంవత్సరమున నొక శ్రావణమాస భానువారమున (క్రీ. శ. 1888) తన యేబది రెండవయేట భక్తి చూడామణియైన రామ కృష్ణ పరమహంసయొక్క పవిత్రాత్మ నశ్వర దేహమును పరిత్యజించి కైవల్య ధామమున ప్రవేశించెను. మృత్యువునకు కొన్ని నెలలుముందు స్వామి గొంతు కలో నొకకురుపు లేచినది. ఆకురుపు క్రమక్రమమున పెరుగుచు వచ్చినందున నతనికి బాధ మిక్కుటమయ్యెను. కాని యాబాధ నత డావంతయైన నరకు గొనక నొరులతో చెప్పకయుండెను. ద్రవపదార్థములుదక్క నతడేమియు పుచ్చుకొనకుండెను. పదపడి ద్రవపదార్థములనేని యాతడు మ్రింగజాలక పోయెను. కడుపులోని కేమియు పోకుండినందున పరమహంస శరీరము క్రమ క్రమముగా క్షీణింపదొడగెను. ఆచార్యుని దురవస్థను చూచి భీతిచెంది శిష్యు

లాతనిని కలకత్తా తీసుకొనిపోయిరి. మొదట నచట భాగీబజారునం దతని విడియించిరి. అందుండిపిదప నతడు బలరామబాబు గృహమునకు గొంపో బడెను. అనంతర మాచార్యుని శిష్యులు ఆతని కాశీపురమందలి యొకానొక రమ్యమగు తోటలోనికి గొనిపోయిరి. అచటనే పరమహంస పరమపదించెను.

విశ్వవిద్యాలయమున చదువుకొను యువకులు కొందఱు పరమహంసను తఱచుగ గలిసికొని జ్ఞానభిక్షను వేసుకొనుచుండువారు. వారిని స్వామిజీ మిగుల ప్రేమించుచుండును. పరమహంసను సేవింప నువ్విళ్ళూరి వైరాగ్యముపై మనసు నిలిపి ఈయువకులు పలువురు సంసారసుఖములు వదలుకొని సన్యాసి యాశ్ర మమును స్వీకరించిరి. అట్టివారిలో శ్రీవివేకానందస్వామి ముఖ్యుడు. ఈయువ కులే పిమ్మట "రామకృష్ణమిషన్" ప్రతిష్ఠ చేసిరి. భారతవర్షమున నీమిషనుకు మిగుల ముఖ్యమైన స్థానములు మూడుండెను. ఈ మఠములు బెలూడ్, మాయావతి, మద్రాసులం దున్నవి. వీని శాఖోపశాఖలు భారతదేశమందే గాక నేడు ప్రపంచమం దంతటను నలుముఖములనియున్నవి.

కలకత్తా సమీపమున గంగానది పడమటి గట్టున హౌరాజిల్లాయందు బెలూడ్ గ్రామ మున్నది. శ్రీవివేకానందస్వామి 1899 లో నచటి మఠమును నెలకొలిపెను. ఈమఠమునందు పరమహంసయొక్క అస్థికలు పాదుకలు హస్తా క్షరములు మున్నగు నానావిధ స్మృతి చిహ్నములు చేర్చి యుంచబడినవి. ప్రతి సంవత్సరము శివరాత్రి కడచినపిదప పరమహంస జన్మతిథినాడు ఈమఠ మున గొప్ప యుత్సవము జరుపబడును.

నియమప్రకారముగ నీమఠమున ప్రతిదినము పూజలు మొదలగు సత్క్రి యలు జరుపబడుచుండును. కొంతమంది విద్యార్థులు బ్రహ్మచర్యవ్రతమునునెఱ పుచు మఠమందు విద్యాభ్యాసము చేయుచు మహత్తరగుణములను అలవరచు కొనుచుందురు. దేశదేశాంతరములనుండి సాధువులును మోక్షాపేక్షులును తఱచుగ నచటికరుదెంచి, కొన్నిదినములందు భక్తిగోష్ఠియందు కాలముగడుపు చుందురు. శాస్త్రసంబంధమైన చర్చలు సదా ఆమఠమందు జరుగుచుండును.

మాయావతి 'కుమాయున్' జిల్లాయం దున్నది. ఇచటి మఠమును అద్వైతాశ్రమ మందురు.

ఎల్ల ఆశ్రమములందు ఒకేరీతి ప్రణాళిక అవలంబింపబడుచుండును.

## శ్రీరామకృష్ణుని ముఖ్యోపదేశములు



1. ఒకేమునుకయందు రత్నములు దొరుకవేని రత్నాకరము రత్నరహితమైనదని తలపకుము. ధైర్యముతో సాధనముచేయుము. కాలక్రమమున నీశ్వరకృప నీకు చేకూఱుట నిక్కము.

2. ఒకవ్యక్తి చెఱువు త్రవ్వదలచి ఒకయెడ రెండడుగులు త్రవ్వెను. మరియొకవ్యక్తి అతనినిజేరి "ఓయీ! ఏలవృథాగా శ్రమపడెదవు? ఎంతత్రవ్వినను నీ కిందు జలము లభింపదు." అనెను. ఆమాటలు విని యాతడు మరియొకతావున త్రవ్వదొడగెను. ఇంకొకపురుషు డతని జేరి, "అయ్యా! ఈప్రదేశమందు మునుపొక చెఱువుండెడిది. అది ఎండిపోయినది. నీ వెంత త్రవ్వినను నీ కిందు నీరు దొరకదు. వృథాశ్రమపడెదవేల? ఇంచుక దక్షిణమున కరిగి త్రవ్వితివేని నీకోరిక ఫలించును." అనియెను. తోడనే త్రవ్వుగోల గొని మొదటివ్యక్తి మరియొకచోట త్రవ్వ నారంభించెను. అప్పు డింకొక బుద్ధిమంతుడెదురై అచట ద్రవ్విన ప్రయోజనము లేదనియెను. ఇటు ఎన్నెన్ని తావులందో ఆవ్యక్తి కొంతకొంత త్రవ్వెను. కాని చెఱువు త్రవ్వుట కాలేదు. ధర్మపథమున స్థిరచిత్తులై నడువనివారును యిట్లే విఘ్నములపై బోర్లపడెదరు. నేడు నమ్మినదానిని, కష్టమును, దుఃఖమును, పరీక్షయు నెదురైననాడు వారు రేపు పరిత్యజింతురు. ఒక ఆశయముపై మనసు నిలుపక ఇందందు అల్లాడి నాస్తికులైనను అయ్యెదరు. స్థిరసిద్ధాంతము చేయజాలని వారికి ధర్మలాభము దూరమై యుండును.

3. ఒకడు ఒకచెఱకుతోటయందు నీరు పెట్టెను. తోటకు నాలుగు వైపులను రంధ్రములుండెను. తోటలోని నీరంతయు వానిగుండ అవ్వలికి పోయినది. అం దొకబొట్టైన నిలువలేదు. విషయచింతలపై మనసు నిలిపి ఉపాసనము చేయునాతడు వట్టిదైన చెఱకుతోటవంటివాడు. విషయచింతలే రంధ్రములై ఆతని ఉపాసనమునంతను అవలికి కొట్టివేయును. ఆతడు మానసిక వృద్ధి నెఱుగకుండును. ఉన్నచోటనే ఎప్పటియట్లు నిలచియుండును.

4. ఈసంసారము ఈశ్వరునకు రంగభూమి. జగదీశుడు పెక్కురీతుల తనలీలల నీరంగభూమియందు ప్రకాశమొనరించును. బిడ్డచేతియందు లక్కపిడ

తలు మొదలగు నాటవస్తువుల నునిచి తల్లి మరపించులాగున నానాపదార్థము లను మనచేతుల నిడి భగవంతుడు మనలను మఱపించును. చేతియందలి ఆటవస్తువులను బిడ్డ పారవేసి రోదన మొనరించునప్పుడు పరుగుపరుగున వచ్చి తల్లి బిడ్డ నెత్తుకొనును. మనమును నస్థిరములై ఐహికములైన వస్తువులమీది మమకారమును పోనాడి జగదీశునికొఱకై విలపింపగలిగితి మేని యాతడు వడివడిగ వచ్చి మనలను తనహృదయమున చేర్చుకొనును.

5. కాషాయవస్త్రముల ప్రయోజన మేమని ఒకప్పు డొకరు రామకృష్ణు నడిగిరి. కావిశాటువులకు పవిత్రభావముతో సంబంధ మున్నది. చింపిరి గుడ్డలను దాల్చి, చిరిగినజోడు తొడిగి, నడుచునప్పుడు, మనసునందు దీన భావము లుదయించును. పెద్దవేషములువేసి మసలువారి మనసులందు అహంకారభావము తలయెత్తును. అట్లే కాషాయాంబరములు ధరించినపుడు సాధనానుకూలమైన భావములు హృదయమున పొడసూపును.

6. వాద ప్రతివాదములకు కడంగకుము. వాదులాడిన నెట్టి ప్రయోజనమును చేతుల జిక్కదు. ఈశ్వర కృపవలన నెల్లఱును తమతమ పొరపాటులను గుర్తించి సరియైన మార్గమునకు వత్తురు.

7. ఇతరులను వధింపవలెననిన వివిధములగు అస్త్రములు ఆవశ్యకమయి యుండును. కాని ఆత్మహత్యమిగుల సామ్యమయిన ఆయుధములవలన సాధ్యమగును. ఇతరులకు బోధింపవలెననిన పెక్కుశాస్త్రములను బోధింపవలసి వచ్చును. కాని సామాన్య జ్ఞానమువలన నొకడు ఆత్మవృద్ధి నొందగలడు.

8. స్వజనులందు మసలుచు ఇంటిపనులను చక్కబెట్టుచున్నను దుష్టస్త్రీ ఎల్లప్పుడును తనమనస్సును విటునిదెసకే త్రిప్పును. నీవారలందు మసలుచు నీ వెన్ని కార్యములను చక్కబెట్టువాడవయ్యును నీచిత్తమును నెల్లప్పుడు జగదీశ్వరునిదెసకే మరలింపవచ్చును.

9. ధనికుల యిండ్లయందుండు పరిచారికలు పిల్లలను కడుగారాబముగా పెంచెదరు. కాని ఆపిల్లలపై తమకెట్టి అధికారములేదని వారెఱుంగుదురు. 'హే మానవుడా! నీవును నీబిడ్డలకు ఆలనపాలనములను చూచుచు మరియు చుండువుకాని యీబిడ్డలు నీవారు కారనియు, వారిపై నీకెట్టి యధికారము లేదనియు గ్రహింపుము.'

10. మేడమీది కెక్కుటకు మెట్లును గడలును మ్రోకులును మున్నగు వస్తువులు సాధనములగునట్లు ఈశ్వరరాజ్యమును చేరుటకు అనేక ఉపాయము లున్నవి. ఒక్కొక్కమత మొక్కొక్క ఉపాయమును చెప్పుచున్నది.

11. సంసారముదెసను, సాయుజ్యముదెసను, ఒకేమాఱు దృష్టినిలుపుట ఎట్లుసాధ్యమని ఒకరు పరమహంసదేవుని ప్రశ్నించిరి. అత డిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "ఒకయిల్లాలు ఒకచేతియందు ఒకరోకలినిబూని మెల్లగదంచుచు రెండవ చంకయందు బిడ్డనిడుకొని పాలిచ్చుచుండును. అపుడే ఏదేని అంశమును గుఱించి ఎవ్వరితో నైన ప్రసంగించుచుండును. ఈతీఱున నామె అనేకకార్యములను నెఱపుచుండును. కాని తనచేతియందలి రోకలి జారిపోకుండ తనదృష్టి నామె దానిపై సారించియే యుండును. సంసారమందునిలిచి సకలకార్యములను నిర్వహింపవచ్చును.

12. స్ప్రింగు (ఊపు) కల పీఠముపై కూర్చుంటివేని అది సంకుచితమగును. అందుండి లేచితివేని అది ఎప్పటియట్లు పైకుబుకును. సంసారమునందుండువారు నిర్మల మత ఉపదేశములను వినినపుడు వారిమనసులయందు, ధర్మభావము ప్రబలముగ గలిగియుందురు. సారాంశములయందు వారు మునిగిపోయి యుండుచో నట్టిభావము తమబలమును గోల్పోయి తమతొంటి నీరస నిరాశకు లొంగిపోవుదురు.

13. నీరంతయు నారాయణ స్వరూపమే. కాని ఎల్లచోటుల యందలి నీరము త్రాగుటకు తగినదై యుండదు. ఎల్లతావులందును ఈశ్వరు డుండుట సత్యమేకాని ఆయాతావులం దన్నిటను సమానభావము చేకూఱజాలదు.

14. పెద్దపులు లందును ఈశ్వరు డుండుట సత్యమే కాని, వానిసమ్ముఖమునకు పోరాదు. కాపురుషులందును జగదీశు డున్నాడు. అట్లని వారలను జేరరాదు.

15. రాబందు పైకి ఎగురుగలదు, కాని దానిచూపు వల్లకాటిదెసకే పాఱియుండును. దేవునియందు నమ్మిక లేక యిచ్చవచ్చినరీతిని మెలగువార్లు ఉన్నతశాస్త్ర వీధులయందు విహరింప వచ్చును. కాని వారిమనసు తుచ్ఛమైన విషయచింతల దెసకే మరలుచుండును.

16. గొడ్రాలికి బిడ్డకుట్లబాధ బోధపరచుటకు దుస్సాధ్యము. అట్లే విషయాసక్తులకును ఆధ్యాత్మిక జీవనమందలి యానంద మెట్టిదో బోధించుట దుస్సాధ్యము.

17. ఒకేరీతి పిండినుండి ఎన్ని తెఱగుల పిండివంటలనో తయారు చేయుదురు. ఈపదార్థముల రుచియందు భేదము లుండును. మానవు లందరు ఒకే రీతిగ సృష్టింపబడిరి; కాని హృదయ పవిత్రతాపవిత్రతల ననుసరించి సజ్జనులును దుర్జనులును బయల్పడుదురు.

18. నీటికి పాలను చేర్చినయెడల రెండునుకలసిపోవును. క్షీరముయొక్క ప్రత్యేకత గోచరింపదు. ధర్మకాంక్షులైన మహనీయులు యితరులతో కలసి వర్తించిరేని తమ ధర్మభావమును పోగొట్టుకొందురు. వీరి తొంటి విశ్వాసమును, ఉత్సాహమును కన్గొనజాలుట సాధ్యముకాదు.

19. పాలును నీరును కలిసిపోవుట నిక్కమే కాని పాలను వెన్నగా చేసితిమేని యిట్టి కలయిక సాధ్యముకాదు. సచ్చిదానంద మయుడైన జగదీశ్వరుని గుర్తింపగలిగి ఉన్నతస్థితి నందినవారు అనేక సంఖ్యాకులైన జీవులనడుమ మసలినను వారి మహత్త్వము క్షీణము కాదు. వారిని గుర్తించుట సులభ సాధ్యము.

"శ్రీ రామకృష్ణకథామృతము" నుండి ఆంధ్రీకరింపబడిన
కొన్ని ముఖ్యోపదేశములు

"ఒకమాఱు 'హరి' యనిగాని 'రామ' యనిగాని పలికినంతనే శరీరమున గగుర్పాటు కలిగినచో అశ్రుధారలు స్రవించినచో సంధ్యాదికర్మలను చేయనక్కఱలేదని గ్రహింపుము. అపుడు కర్మను విడిచిపెట్టజాలు నధికారము నీకు గలుగును. కర్మ తనంతదాను వదలిపోవును. అపుడు రామనామమును గాని, హరినామమునుగాని, ఓంకారమునుగాని, జపించిన జాలును. సంధ్య గాయత్రియందు లయమగును. గాయత్రి ఓంకారమందు లయ మగును."

"మానవుడా! జగదీశుడే నీకు వలసిన అంశములను బోధపఱచును. ఎవ్వడు యీజగతిని సృష్టించినాడో, సూర్యచంద్రులను, మానవులను, జంతువులను పుట్టించినాడో, సృష్టింపబడిన జీవముల రక్షణకొఱకై ఎవ్వాడు మాతృవాత్సల్యమును పితృకారుణ్యమును మానసమునందు సృజించినాడో అతడే

ఉత్తమబోధకుడు. అతడు అంతర్యామి. మట్టిబొమ్మను పూజించినపుడు ఏదేని పొరపాటు వచ్చిన తన్నే పిలుచుచుంటివని అతడు గ్రహింపకుండునా? నీ పూజ నంది ఆతడు సంతుష్టి గనడా? వేరుయోచనలతో నీకేమివని? భక్తిని, జ్ఞానమును, అలవఱచుకొను యత్నము చేయుము.”

“మానవుడా! నీ వేరీతిపూజన్ననను చేయవచ్చును. వివిధమగు పూజలను ఈశ్వరుడే నిర్మించియున్నాడు. బిడ్డల రుచులనుబట్టియే తల్లి తినుబండములను తయారొనరించునుగదా! ఒకేవస్తువును వారిరుచుల ననుసరించి వేర్వేరు రీతుల నామె వండుట ఎఱుంగమా!”

“నీ పనులన్నియు నెఱవుకొనుచుండుము. గాని నీమానసము నీశ్వరునందే నిలుపుము. తల్లిదండ్రులపట్లను, పెండ్లాము బిడ్డలయెడలను, నీవుచేయవలయు కర్తవ్యమును చేయుము. కాని వారు నీకేమియు కారని అంతరంగమున గుర్తింపుము.”

“తాబేలు నీటియందు తిరుగుచుండును కాని దానిమనసు తనగ్రుడ్లున్న చోటియందే నిలచియుండును. సంసారమందలి క్రియలన్నిటిని నిర్వర్తించుచు చిత్తమును జగదీశునియందే నిమగ్న మొనరింపుము.”

“చేతికి నూనె రాసికొనియే పనసకాయను గొట్టవలెను. అట్లు చేయకున్న చేతికి జిగు రంటుకొనును. ఈశ్వరభక్తి యను తైలమును మనసునకు పట్టించుకొనియే సంసారకార్యములను చేయ కడంగుము.”

“ధ్యానమువలన జ్ఞానము చిక్కును. సంసారమందు మనసును నిలిపియుంచితివేని అది నీచ మార్గమును బట్టును. సంసారము కామినీ కాంచనముల చింతలచే నిండియుండునుకదా!”

“ఈశ్వరుని ప్రేమింపవలెను. తల్లి బిడ్డకు చూపుప్రేమయును, పతికి సతి చూపు ప్రణయమును, విషయాసక్తుడు శృంగారవస్తువులయెడల చూపు మక్కువయును ఒక్కటిగ కలిపిన తోడి అనురాగమును ఈశ్వరునియెడల నీవు చూపగలిగితివేని అతడు నీకు దర్శనమొసగును.”

నరేంద్రుడు (ఈతడే పిదప వివేకానందస్వామియయ్యెను) కళాశాలయందు జదువుచు తరచుగ సాధారణబ్రహ్మసమాజ మందిరమునకు అరుగుచుండువాడు. ఆదివారమునందు తీరిక చేసికొని భక్తులను గలసి అతడు పరమహంసదేవుని

వర్ణింప నరుగుచుండువాడు. అతని వయస్సప్పుడు పందొమ్మిదేండ్లు. ఆతని వాకులు తేజముతో నిండియుండెడివి. కన్నులు ఉజ్జ్వలములు. భక్తుని వైఖరి గలవాడు. ఒకనాడు నరేంద్ర రామకృష్ణులకు యీ క్రిందిప్రసంగము జరిగెను.

న :—ప్రపంచమున విషయాసక్తులైనవా రెందఱో ఉన్నారు. ధర్మబద్ధజీవు లగు ఈశ్వరసేవాపరాయణులను చూచి వీరు వెక్కిరింతురు. వారిని నిందింతురు. దుష్టులతో వ్యవహరించుట ఎట్లు ?

రా :—ఏనుగు నడచుచుండ వెనక కుక్క లరుచుచుండును. కాని ఆ ఏనుగ వెనుకకు తిరిగియైన చూడదు. నిన్నెవ్వరైన నిందించినయెడల నీవేమి చేసెదవు ?

న :—కుక్కలు అఱచుచున్నవని తలతును.

రా :—ఈశ్వరుడు సర్వభూతములయందును ఉన్నాడు. సుగుణులతో కలసి మెలసి వర్తింపుము. దుర్గుణులనుండి దూరదూరముగ తొలగుము. పెద్ద పులియందు నారాయణుడున్నాడు. అట్లని పెద్దపులిని కౌగలించుకొనరాదు. "శార్దూలము నారాయణుడు దానికడనుండి పరుగెత్తనేల ?" అని నీ వన వచ్చును. "పులినుండి పరుగెత్తుము" అనువారును, నారాయణస్వరూపులు. వారిమాట ఏల వినరాదు." అని ఉత్తర మొసగెదను. ఒక కథ వినుము. ఒకానొకవనములో నొకయోగి వసించుచుండెను. ఆతని కనేకశిష్యులుండిరి. సర్వభూతములందును నారాయణుడున్నాడు. ఇట్లని ఎఱిగి ఎల్లప్రాణులకును నమస్కరింపుము. అని ఆచార్యు డొకనాడు తనశిష్యుల కుపదేశించెను. ఒకనాడు శిష్యు డొకడు హోమమునకై కొన్ని చితుకుల నేఱ నాశ్రమము నుండి కొంతదూరము సాగిపోయెను. "ఎవరెచటనున్నను పారిపొండు. ఒక పిచ్చి ఏనుగు పరుగెత్తుకొనివచ్చుచున్నది." అని ఎవరో చెట్లమాటుననుండి కేక వేసిరి. ఆపలుకులు వినినవారందఱు కాలుకొలది పరుగిడిరి. కాని శిష్యుడు పరుగెత్తలేదు. అతడు కొయ్యవలె నిలువంబడిపోయెను. అంతియే కాదు. నిముసములో నుఱుకనున్న ఏనుగును గూర్చి స్తవమొనరింపసాగెను. "పారిపో పారిపో" మ్మని మావటివాడు బిగ్గరగ నఱచెను. అపుడుగూడ కదలక నిలచియుండెను. భయంకరముగ ఘీంకార మొనరించుచు నింతలో పిచ్చియేనుగ కదువడిగ వచ్చి తొండముచే శిష్యు నెత్తి దూరముగ విసరి

వేసెను. శిష్యునిశరీరము గాయములతో నిండెను. పాప మతడు చైతన్యము కోలుపోయినాడు. ఈ విషయము విని ఆచార్యుడును తోడిశిష్యులును పరుగిడివచ్చి శిష్యుని చేతులందు వేసికొని ఆశ్రమమునకు గొంపోయి తగు చికిత్స గావించిరి. కొంతవడి కాతనికి తెలివి వచ్చెను. పిచ్చి ఏనుగు పైబడుచున్నపుడు ఏల కదలమెదలక నిలువంబడితివి? నీకును పిచ్చి బట్టినదా? అని ఆచార్యు డతనిని ప్రశ్నించెను. 'మహాత్మా! అన్నిజీవరాసులందును నారాయణు డున్నా డని తామే సెల విచ్చియుంటిరి గదా, దంతావళ నారాయణుడు వచ్చుచున్నపుడు నిలువంబడుట నావిధి కాదా?' అని శిష్యు డుత్తర మొసగెను. 'దంతావళనారాయణుడు మీాది కురుకుచున్నపుడు మావటీనారాయణుడు పారిపొమ్మని కేక వేసియుండలేదా? ఎల్లరును నారాయణులైనపుడు యీనారాయణుని హెచ్చరిక నేల పాటించితివికాదు?' అని గురు డుత్తర మొసగెను. ఆపోనారాయణః అని శాస్త్రములు తెలుపుచున్నవి. నీరు నారాయణుడనిన ఎల్లచోటులందలి నీరము నారాధనకు భోజనమునకు పనికిరాదు. సాధువులందును అసాధువులందును భక్తుల హృదయమందును అభక్తుల మానసమునందును నారాయణు డున్నాడు. కాని దుష్టులతో వ్యవహరించతగదు. కొందఱు కొందఱితో ప్రసంగింపవచ్చును. కొందఱితో ప్రసంగముకూడ చెల్లదు. వారికడనుండి దూరముగ తొలగిపోవలెను.

:—మహాత్మా! దుష్టులు అపకారము చేయవచ్చునపుడు కావింపదగు కర్తవ్య మేమి?

:—ప్రపంచమందు వసించునపుడు దుష్టులెందఱో మనలను మార్కొందురు. వారియెడ కొంత తమోగుణమును అభినయించినగాని మనకు రక్షణ ముండదు. వారు మన కెగ్గుచేయుచుండిరని తిరిగి వారికి కీడు చేయరాదు. ఒకానొక పొలమున ఆలమందను తోలుకొనుచు నొక గొల్లవాడు వసించుచుండువాడు. ఆపొలమునందే మిగుల భయంకరమైన పా మొకటి వసించుచుండెను. కడుజాగరూకులై మార్గస్థు లచ్చోట నడచెదరు. ఒకనాడు బ్రహ్మచారి యొకడు ఆపొలముగుండా నడచుచుండెను. ఆలమేపరి వడివడిగ నతనికడ కరిగి యాతని నాదిక్కునుండి నడువకుమనియు నందొక

భయంకరమగు త్రాచుపా మొకటి మసలుచుండు ననియు చెప్పెను. 'పామున్న నేమి! నాకు భయములేదు. నేను మంత్ర మెఱుగుదును.' అని ఉత్తర మొసగి విప్రు డాదిక్కునకే జనెను. భీతచిత్తుడై గొల్లవాడు దూరము నుండి చూచుచుండెను. బ్రహ్మచారిని చూచి పడగ ఎత్తి పాము బుస కొట్టుచు నతనిదరికి కదుఁవడిగ రాసాగెను. విప్రు డేదో మంత్రమ్మును పఠించి నాడు. తెగపడిన త్రాడువలె త్రాచు పడియుండెను. 'సర్పమా! ఒరులను హింసించుచు, నిష్ఠురజీవనమును గడపుచుంటి వేల? నీకొక మంత్రము నుప దేశించెదను. నీవు నీ దుష్ప్రవర్తనము మాని దానిని పఠింపుము. నీకు భక్తిగుణమబ్బును. జగదీశునికరుణ నందగలవు' అని పలికెను. మంత్రోప దేశమునొంది పాము బ్రహ్మచారికి నమస్కరించి 'సాధన చేయు టెట్లు?' అని ప్రశ్నించెను. "మంత్రమును పునశ్చరణ మొనరించుచుండుము. ఎవ్వరి కిని హాని చేయకుము. నీవు చేయవలయు సాధన మింతియే, నేను మరల వత్తును". అని చెప్పి విప్రు డెందేని జనియె. ఇట్లు కొంతకాలము గడచి పోయెను. సర్ప మెవ్వరికిని హాని జేయక తనజీవనము తాను గడపుకొను చుండెను. భయరహితులై మార్గస్థులు పాముచెంతనుండియే మరలసాగిరి. పిల్లలు ఊరక మసలక పామువలన నెట్టిప్రమాదము రాదని ఎఱిగి దానిపై రాలు రువ్వదొడగిరి. ఒక నాడొక దుష్టబాలుడు సర్పమును తోకతో పట్టుకొని గిరగిర త్రిప్పి దూరముగ విసిరివేసెను. పాప మాపాము రక్తము గ్రక్కినది. కొయ్యవలె నేలబడినది. అది చచ్చినదనియే ప్రజ లూహించిరి. చాలరాత్రి గడచినపిదప పామునకు తెలివి వచ్చెను. అతికష్టమున నది మెల్లగ ప్రాకి తనపుట్టలో ప్రవేశించెను. దాని శరీరమంతయు శిథిలమై పోయెను. కొంతకాలమునకు దానికి కొంతబలము చేకూరెను. కాని దుష్టులు తనకు కీడు కలిగింతురని భయపడి పగటివేళ నాయురగము బయ టికి వచ్చునదికాదు. రాత్రివేళ మెల్లగ నీవలకు వచ్చి ఏ కప్పనో కీటకమునో చంపక ఏ రాలుగాయనో కాంచి అది తిని ప్రాణములు నిలుపుకొనుచుండెడిది. ఒక సంవత్సరము గడచెను. బ్రహ్మచారి అపోలమున నడచుచు పాము కొఱకై చూచినాడు. అది చచ్చినదని గొల్లలతనితో పలికిరి. విప్రుడావలు కులు నమ్మలేదు. తా నుపదేశించిన మంత్రము యొక్క సాధనము పూర్తి

డైనగాని భుజంగము మరణింపజాలదు, అని యత డెఱుగును. ఆదరముతో పామును పిలుచుచు నతడు పొలమును కలయవెదకినాడు. ఆచార్యకంఠధ్వని విని పాము పరమానంద మంది మెల్లన పైకి వచ్చి గురువునకు ప్రణమిల్లెను. చచ్చినట్లు చిక్కియున్న పామును చూచి, కారణ మేమని విప్రు డడిగెను. పాము తనయొక్క కథను గురువర్యున కెఱింగించినది. 'ఆదుష్టుడు అజ్ఞానుడు. అపుడు నా మానసిక స్థితి ఎట్లుండెనో గ్రహింపజాలక పోయినాడు. నేను కీడుచేయుదానను కానని అత డెఱిగియుండక పోవచ్చును.' అని పాము పలికెను. అంతయు విని ముక్కుమీద వ్రేలువేసికొని విప్రుడు 'సర్పమా! నీవింత తెలివిమాలినదానవా? నిన్ను నీవు రక్షించుకొన జాలకపోయితివి. ఎవ్వరినిగాని కఱువవలదని నీతో నొక్కి చెప్పితిని. బుసకొట్టవలదని నేను తెల్పియుండలేదు. బుసకొట్టి నిన్ను హింసింపదలచినవారి నేల భయపెట్టితివి కావు అని పలికెను. దుష్టులు మార్కొనినపుడు ఆపద ఘటిల్లకుండునట్లు వారికి భయము జూపవలెను. వారికి ఎట్టికీడును చేయరాదు.

శ్రీరామకృష్ణుడు :—గలేబులోని దిండువలె దేహములో దేహి యుండును. దేహము నశించునది. దేహియే నాశనము కానివాడు. దేహముయొక్క ఛాయాపటము తీసినప్రయోజన మేమి? మనుష్యహృదయమున విరాజిల్లు జగదీశుని పూజింపవలెను.

భక్తునిహృదయము భగవంతునకు వాసస్థానము. అతడు సర్వభూతముల యందును ఉండుట నిజము. కాని భక్తునిహృదయమే ఆతనికి ఆనందము నను కూర్చు సదనము. జమీందారొకడు తనజమీయంతటను మసలుచుండును. తనదియను తావున నాతడు వసించుచుండును. అతనిగద్దియ ఆకచేరిచావడి యందే ఉండును. అందే అతడు కూర్చుండి యుండును. భక్తునిహృదయము భగవంతునియొక్క కచేరిగది. అతనిగద్దియ అందుండును.

ఒకేబ్రాహ్మణుడు పూజచేయునపుడు పూజారి యనబడును. వంటకు గడగునతరి వంటబ్రాహ్మణుడని పిలువబడును. జ్ఞానయోగులు జగత్తు కాదనుచు చిత్తమును స్థిర మొనరించుకొని ధ్యానమగ్నులయినపుడు బ్రహ్మజ్ఞాను లగుదురు. బ్రహ్మ సత్యమనియు జగత్తు మిథ్యయనియు బ్రహ్మజ్ఞానులు గుర్తింతురు.

నానారూపములు స్వప్నముల వంటివి. బ్రహ్మన్ ఎట్టివాడో మాటలతో చెప్పుట దుర్ఘటము. అతఁ డొకవ్యక్తియని తెలుప చెల్లదు.

భక్తులు వేదాంతవాదులవలె జగత్తు మిథ్యయని తలపరు జాగ్రదవస్థ గూడ సత్య మందురు. జగత్తును స్వప్నతుల్య మనరు. జగము ఈశ్వరుని యైశ్వర్యమని వా రందురు. ఆకసము, నక్షత్రములు, చంద్రుఁడు, సూర్యుఁడు పర్వతములు, సముద్రములు, సర్వజీవములు యీయైశ్వర్యములోని వనియే వారి తలంపు. జగదీశు డంతరంగమందును ఉన్నాడు; బాహిరమందును ఉన్నాడు.

'హేభగవానుడా! నీవు ప్రభుడవు, నేను నీదాసుడను; నీవు తల్లివి, నేను నీతనయుండను; నీవు నాతండ్రివి, నేను నీబిడ్డను; నీవు పూర్ణుండవు, నేను నీ అర్థభమను." అని భక్తుఁడు సర్వేశ్వరునుద్దేశించి పలుకును. నేను 'బ్రహ్మన్' అని యూరక డనడు.

పరమాత్మని చూచుటకై యోగివరు లువ్విళ్లూరెదరు. వారు కాంక్షించునది జీవాత్మ పరమాత్మల కలయిక. విషయసుఖములదెస మనసును పోనీక స్థిరచిత్తులై వారు పరాత్పరుని ధ్యానింతురు.

సృష్టి స్థితి ప్రళయములు శక్తియొక్క ఆటలు. బ్రహ్మన్‌యొక్క శక్తియును అభేదములు. ఒక దానిని విశ్వసించిన రెండవదానిని విశ్వసింపవలెను. ఇవి అగ్ని, అగ్నియొక్క మండించుశక్తి వంటివి. అగ్నిని విశ్వసించిన, అగ్నియొక్క మండించుశక్తినిగూడ విశ్వసింపవలెను. ఈశక్తిని విడచి అగ్నిని యోచించుట సాధ్యము కాదు ఈరెంటికిని అవినాభావసంబంధ మున్నది. సూర్యుని విడచి సూర్యరశ్మిని, సూర్యరశ్మిని వీడి సూర్యుని తలంచుట సాధ్యమగునా?

పాలెట్లుండును? తెల్లగ నుండును గదా! పాలను కాదని పాలయొక్క తెల్లదనమును? ఊహింప వీలగునా? పాల తెలుపు కాదని పాలను తలప శక్యమగునా?

శక్తి లీలామయి. సృష్టిస్థితి, లయములు కావించునది. ఈశక్తియే కాళి. కాళియే బ్రహ్మ. బ్రహ్మయే కాళి. ఏక్రియలు చేయక యూరకొనియున్నపుడు దానిని బ్రహ్మన్ అందుము. సృష్టి మొదలగు క్రియల నది చేయునపుడు దానిని శక్తి యనుందుము. నామరూపములందు మాత్రము భేద మున్నది.

ఒకతటాకమున నాలుగు రేవు లున్నవి. ఒకరేవున హిందువులు నీరు గ్రైకొందురు. దానిని వారు జల మందురు. వేఱొకరేవున మహామ్మదీయులు నీరుకొనిపోయెదరు. వారు దానిని 'పానీ' యందురు. ఇంకొకరేవునుండి ఆంగ్లేయులు నీరు దీసికొనుచు దానిని వారు 'వాటర్' అందురు. ఇట్లే దేవుని కొందఱు 'అల్లా' యందురు. మరికొందఱు 'గాడ్' అందురు. ఇంకకొందఱు 'బ్రహ్మన్' అనియెదరు. ఇట్లే 'కాళి' యనియు, రాముడనియు, 'హరి' యనియు, 'యేసు' అనియు, 'దుర్గ' యనియు పలికెదరు.

పలురీతుల కాళి తనలీలలను ప్రదర్శించినది. ఒకశక్తి మహాకాళి, నిత్యకాళి, శ్మశానకాళి, రక్షాకాళి, శ్యామాకాళి, యనబరగుచున్నది. మహాకాళి, నిత్యకాళి, మొదలయుదంతము తంత్రశాస్త్రమున గలదు. సృష్టి కానపుడు చంద్ర సూర్యులును, గ్రహములును, పృథ్వియును, లేనపుడు ఎల్లయెడలయందును, గాఢాంధకార మున్నప్పుడు జనని నిరాకారమై మహాకాళియైయుండెను. శ్యామాకాళి కోమలభావము కలది. గృహస్థులచే నీమె పూజింపబడును. మరిడిజాడ్యములు, దుర్భిక్షము, భూకంపము, అనావృష్టి, అతివృష్టి, ఎపుడైనపుడు ప్రజలు రక్షాకాళిని పూజింతురు. శ్మశానకాళి, సంహారమూర్తి. శవములయందును, దయ్యములందు, శ్మశానమందువసించును. ఈవిగ్రహము మెడయందు పుఱ్ఱెల దండయు, నడుమున నరహస్తముల పటకాయు, దేహముపై రుధిరధారలు ఉండును. మహాప్రళయసమయమున సృష్టిబీజముల నన్నిటిని శక్తి భద్రపఱచును.

కాళీశక్తి నలుపనుట నిజముగాదు. దూరమునకు నల్లగ తోచును. ఆకసము దూరమునుండి నల్లగ తోచును. సమీపమున కరిగి చూచిన నది రంగు లేనిదను తేటపడును. అట్లే సముద్రము దూరమునుండి చూచిన నీలమై యుండును. సమీపమునకరిగి చేతియందు నీరు గ్రైకొంటిమేని ఏరంగును గోచరింపదు.

ఒకచేతితో కర్మచేయుము. రెండవచేతియం దీశ్వరుని బట్టియుంచుము. కర్మ ముగియగానే రెండుచేతులతోను - ఈశ్వరుని బట్టుము.

మనసువలననే మానవుడు బద్ధజీవు డగును. మనసువలననే ముక్తినొందును. ఏరంగు నద్దిన నారంగు మనసున కంటును. బట్టను ఊదువు (రంగు

వేయుట) చందాన మనసును ఉనుపవచ్చును. ఏరంగునీటియందు తడిసిన ఆ రంగే బట్టకంటును. ఆంగ్లము మీాదనే మక్కువగలవారు ఆ యాచారములనే అవలంబింప తలంతురు. సంస్కృతవాఙ్మయఅభిలాషులు సాధారణముగ ప్రాచీన పద్ధతులపై ప్రీతి గలిగియుందురు. దుష్టులతో సహవాసము చేయువారు దుర్మతు లగుదురు. సజ్జనులతో మెలగువారు సజ్జను లగుదురు. వీరిమనసు నకు భక్తిగుణ మంటును. వారి మనసునకు బురద యంటును.

హృదయ మొకటియె అందుపుట్టుభావములు భిన్నములు. ఒకడు తన భార్యాపుత్రుల నొకరీతిగను, ఇతరచుట్టములను వేరొకరీతిగను, మిత్రులనింకొక తెఱగునను, ఒరులను మఱియొకచొప్పునను చూచును. మనసు ఒక్కటియే యయ్యు అందు తోచుతలంపులు వేర్వేరై యుండును. దయ సత్వగుణమునుండి పుట్టును. సత్వగుణమునుండి పాలనమును, రజోగుణమువలన సృష్టియు, తమో గుణమువలన సంహారమును గలుగును. బ్రహ్మసత్వ రజస్తమముల కతీతుడు. ప్రకృతి కతీతుడు.

పట్టుపడుదు ననుభయమున దొంగ కట్టుదిట్టమైనతావున నడుగు పెట్ట జాలనట్లు సరియైనచోటున నీగుణములు చేర నేరవు. సత్వరజస్తమోగణములు మూడును దొంగలే. ఒక కథ యున్నది. 'ఒకవ్యక్తి అడవిమార్గముబట్టి పోవు చుండెను. ముప్వురు బందిపోటులు అతని నెదుర్కొనిరి. వారాతనిసొత్తు యావత్తును తీసికొనిరి. ఈతని మిగిల్చిన లాభ మేమియని అందొకడు కత్తిని గొని ముందున కరుదెంచెను. వలదు కాళ్ళేతులు కట్టివేసి పడవేయుదమని మఱియొక డనెను. దొంగ లాతని కట్టివేసి అందుండి నిష్క్రమించిరి. కొంతసేపు గడచినపిదప ఆదొంగలలో నొకడు మరలవచ్చి ఆతని కట్టుత్రాళ్లను విప్పి తన వెంట రమ్మని రాజమార్గమునకు తీసికొనివచ్చి వాని యింటికి దారిచూపి వెడల బోయెను. అప్పుడావ్యక్తి 'నాకు మీారెంతేని యుపకారము జేసితిరి, నాయింటి వఱకు మీారును రండు' అని పలికెను. 'నే నచ్చటికి రానొల్లను. పోలీసులు కనుగొందురు' అని దొంగ ప్రత్యుత్తర మిచ్చెను.

సంసారమే అరణ్యము. సత్వరజస్తమోగుణములు మూడును యీకాన నమున దాగియుండు బందిపోటుదొంగలు. ప్రాణియొక్క జ్ఞానధనమును యివి దోడలాగును. తమోగుణ మీాప్రాణిని సంహరింప బూనును. రజోగుణము

సంసారమున బంధించి యుంచును. సత్వగుణ మారెంటినుండి అతని రక్షించును. మానవుడు సత్వగుణముయొక్క పొందు నందెనేని కామక్రోధాదిగుణములు మాయమగును. సంసారబంధమునుండి సత్వగుణము మానవుని విడివడ జేయగలదు. కాని సత్వగుణమును, చోరుడే. అది తత్వజ్ఞాన మిాయజాలదు. పరంధామమున కరుగుదారిని మాత్రమది చూపజాలును. బ్రహ్మజ్ఞాన మున్నతావుకు సత్వగుణము చాలదూరముందుంతును.

బ్రహ్మ ఎట్లుండునో మాటలతో చెప్పుటకు శక్యముకాదు. బ్రహ్మజ్ఞానులు మనయొద్దకు తిరిగివచ్చి తమయుదంత మిట్టిదని వివరింపరు.

నలుగురు మిత్రులిటునటు తిరుగుచు ఉన్నతమైన యావరణమున్న ఒకచోటును చూచిరి. ఆవరణమం దేమున్నదో చూడవలెనని వారు మిగుల కుతూహలపడిరి. వారిలో నొకడు ఆవరణము మిాది కెగబ్రాకి లోనికి తొంగి చూచి, ఆశ్చర్యపడి లోపల పడిపోయెను. అత డేయుదంతము తెలుప జాలక పోయెను. తక్కిన ముప్వురును అట్లే ఎగబ్రాకి లోపలపడిరి. లోపల నేమున్నదో యిక తెలుపు వారెవరు ?

జడభరతుడును, దత్తాత్రేయుడును, బ్రహ్మయొక్క దర్శనమును బొంది తమవృత్తాంతము నెవ్వరికిని తెలుపజాలక పోయిరి. బ్రహ్మజ్ఞానము పొంది సమాధి జొచ్చినవారికి 'నేను' అనునది యుండదు. మనసు లయమై పోవలెను.

శుకుడు బ్రహ్మసముద్రముయొక్క దర్శన స్పర్శనములమాత్ర మెఱుగును గాని, అందు మునగ లేదనియు, చొరబడలేదనియు, కొంద ఱందురు. కావుననే అతడు వెనుదిరిగివచ్చి అనేకోపదేశములు గావించెను. బ్రహ్మజ్ఞానము నొందినవెనుక ప్రజలకు బోధించుటకై అతడు మరలివచ్చెనని కొంద ఱందురు. అతడు పరీక్షితునకు భాగవతమును చెప్పవలెననియు ఎందఱెందఱికో జ్ఞానోపదేశము చేయవలెననియు నెంచి ఈశ్వరు డాతని 'నేను' ను అంతను కడ ముట్టింపలేదు. విద్యకు సంబంధించిన 'నేను' ను మాత్రము మిగిల్చియుంచెను.

'నేను' 'నాది' అనునవి అజ్ఞాన సూచకములు. 'నేను' కర్తను యీ మెనాభార్య; వీరునాబిడ్డలు, ఇదినానంపత్తి, ఇది నామానము, ఇదినానంభ్రమము' అనుభావము అజ్ఞానుల హృదయమందే తల ఎత్తును. ఇట్లని నే నని నప్పుడు కేశవచంద్రసేను అయ్యా! 'నేను' అనుదానిని పరిత్యజించి వేసిన

మొదల యింక మిగులున దేమియు నుండదు' అనెను. 'కేశవా! 'నేను' అనునది అంతయు పరిత్యజించి వేయుమని నే చెప్పుటలేదు. నేను యజమానిని, నేను గురుండను, అను భావము వదలివేయుమంటిని. నేను అతని దాసుండను. నే నాతని భక్తుండను. ఆతడు కర్త, ఆతడే యజమాని, అను భావమును నీహృదయమందు నింపుము' అని నేను కేశవునితో పలికితిని.

మతప్రచారము మిగుల కఠినమైనది. ఈశ్వరాదేశ మందియే యొకడు మతమును బోధించుటకు ప్రయత్నింపవలెను. జగదీశుని అనుజ్ఞ పొందియే శుకుడు భాగవతమును పరీక్షితునకు తెలుపగడగినాడు. ఈశ్వర సాక్షాత్కారమును ఈశ్వరాదేశమును, పొంది యొకడు బోధన మొనరించుట మంచిది.

బ్రహ్మమును శక్తికిని భేదములేదు. బ్రహ్మయే శక్తి. భగవంతుడే ఒక రూపున భక్తుడు; అతడే ఒకరూపమున భాగవతము. భాగవతము, భక్తుడు, భగవానుడు కలసి యుండును.

మానవుడు త్రిగుణాతీతు (సత్వ, రజ, స్తమ,) డగుట చాలకష్టము. ఈశ్వరుని పొందక అతడట్లు కా జాలడు. అతడు మాయయొక్క రాజ్యమందు వసించుచున్నాడు. ఈమాయ మానవు నీశ్వరు నెఱుగ నియ్యదు. ఇది మనుజుని అజ్ఞానుని జేసివేయును. స్నేహితు డొకడు ఒకచిన్నిలేగను దెచ్చి తోటయందు కట్టివేసి మేతవేసినాడు. ప్రతిదిన మాతనిచర్య కనిపెట్టుచు నొక నాడాతనితో 'ఏమోయీ! అనుదినము యీదూడను యిందేల కట్టివేయు చుంటి' వని ప్రశ్నించితిని. 'మహాశయా! దూడను మాయూరి కంపెదను. పెద్దదై నంతనే యిది దుక్కి దున్నగలదు' అని యాత డుత్తర మొసగినాడు. అత డట్లు పలుకగానే నేను మూర్ఛితుడ నైతిని. అబ్బురపడితిని. దూడయివు దున్న తావు ఎందుండెను? అది పోవలయుచోటు ఎందుండెను? ఈలేగ దూడ దేశము పోవునా? అచటి కేగి పెద్దది యగునా? అపుడది దుక్కి దున్నవలెనా? సంసారమనిన నిదియే. మాయయనిన నిదియే అని యనుకొంటిని.

జగదీశునియాజ్ఞ పొంది ఉపదేశము చేయువాని హృదయమునుండి ఒకొక్కకిరణము ప్రసరింపగానే పండితులెందఱో తాము అణుమాత్రులమని గ్రహింతురు.

దీపము వెలిగినంతనే శలభములు తమంతతాము చివాలున వచ్చును. వాని నెవ్వరును పిలువనక్కఱలేదు. ఈశ్వరాదేశము పొందినవానికడకు బొట్టుపెట్టి పిలువనక్కఱలేకయే ప్రజలు వత్తురు. ఆతనిజ్యోతి గాంచి తమంత తామే ప్రజలు వానిని చేరుకొందురు. పెద్దలును, చిన్నలును, ధనవంతులును, పేదలును ఆతనిమ్రోల కేగి, వివిధసంభారముల నాతని కీయ నెంతురు. ఉపదేశ కర్త వాటి నన్నిటిని నిరాకరించును.

నీవు నాకడకు రమ్మని ఇనుపముక్కను సూదంటురాయి పిలుచునా?

ఈశ్వరాదేశము పొందినవారు పండితులు కాకపోవుటనిక్కమే. అట్లని వారిజ్ఞానము అల్పమైనదని తలపఁజెల్లదు. పుస్తకపఠనమున జ్ఞాన మబ్బునా! జగదీశుని ఆదేశమందిన వానిజ్ఞానమునకు మేరయుండదు. ఆతనిజ్ఞానము ఈశ్వరునికడ్డనుండి వచ్చును. దాని కంతములేదు. ఒకడు ధాన్యమును కుంచములో కొలుచుచుండ, నింకొకడు రాశిని నింప సరిచేయుచుండును. ఎంద ఱెందఱికో ఈశ్వరసందేశమందిన మానవుడు ఉపదేశము లొసగుచుండ వెనుకనుండి జగదీశుడు జ్ఞానరాశిని సిద్ధముచేయుచుండును.

ఒకప్పుడు బ్రహ్మసమాజప్రచారకుడొకడు ఉపన్యసించుచు తాను సుర ద్రాగుచుండువాడననియు, ఇదిచేయువాడను, అది చేయువాడననియు పలుకగా నాతని నుడువులువిని సభికులు అల్లరిచేసిరి. దుర్మతియని ఉపన్యాసకుని దూఱ దొడగిరి. సచ్చారిత్రుని ప్రచారమే ప్రయోజనకారియై యుండును.

ఈశ్వరునకు భృత్యుడై ఈశ్వరాదేశమందినవాని వాక్కులే గణనీయములై యుండును. ఈశ్వరదేశముకతన శక్తిసంపన్నుడైనవాడే ఉపన్యసింప నర్హుడు.

ఈశ్వరాదేశ మందవలెనని మానవుడు ఈశ్వరపాదపద్మముల నాశ్రయింపవలెను. ఆతనిధ్యానమున మగ్నుడు కావలెను.

ఈశ్వరుడు రససముద్రము; సచ్చిదానందసాగరము; అమృతమహోదధి; మానవు డీరత్నాకరమున బుడుంగున మునుంగవలెను. ఈయమృతసారమును చేర్చుమార్గము లనంతములు. ఏమార్గమును బట్టియైనను చని మానవుడీసాగరమున చేరుకొనవలెను. అందలిబిందువు నొక్కటియైన నోట బడవేసుకొంటివేని అమరుడ వగుదువు. నీయంతనీవు సుధాకుండమున దుమికి

నను నుఱుకుము, లేక ఎవ్వరైనను నిన్నందు జీవాలున కూలద్రోయనిమ్ము. ఎట్లైనను పురిష్కెడు అమృతమును నోట బోసికొమ్ము. ఇంచుకంత అమృతము నాస్వాదించునంతన అమరత్వము చేకుఱును.

అనంతపదములు :—జ్ఞానమును, కర్మయును, భక్తియును, వీనిలోనివి. ఏపదము ననుసరించినైనను చనుము. నీయత్నము హృదయపూర్వకమైన నీవు తప్పక నీశ్వరుని జెందగలవు.

యోగములు మూడువిధములు—జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగము.

జ్ఞానయోగము—జ్ఞాని బ్రహ్మను చూడవలెనని మక్కువపడును. బ్రహ్మను జేర ప్రయత్నించును. బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్యయని యెంచును. సదసత్ విచారమున మనస్సు నిలుపును. విచారానంతరమున నతడు సమాధి నందును. బ్రహ్మజ్ఞానము పడయును.

కర్మయోగము—కర్మమూలమున నీశ్వరుపై మనసు నిలుపుట కర్మ యోగము. దేనియందును కోరిక నిలపక ప్రాణాయామధ్యాన ధారణాదు లందు కాలము గడపుట కర్మయోగియొక్క పని. సంసారము గడుపునాతడు తాను ఫలమును కాంక్షింపక ఫలము నీశ్వరార్పణ మొనరించి కర్తవ్యమును నెఱపుచో కర్మయోగియని యనిపించుకొనును. ఫలము నీశ్వర సమర్పణమొన రించి జపాదికర్మలను చేయుటయు కర్మయోగ మనిపించుకొనును. ఈశ్వర లాభమే కర్మయోగముయొక్క యుద్దేశ్యము.

భక్తియోగము—ఈశ్వర గుణములను ప్రస్తుతించుచు, ఈశ్వరనామ సంకీర్తన మొనరించుచు ఈశ్వరునిపై మనసు నిలుపుట భక్తియోగ మన బడును. కలియుగమున భక్తిమార్గమే సులభమార్గము. భక్తియోగమే నేటి యుగధర్మము.

కర్మయోగము మిగుల కఠినమైనది. ఏపకర్మలు చేయవలెనని శాస్త్ర ములు చెప్పుచున్నవో వానిని చేయుటకు సమయ మేది? కలియుగమున మాన వుని ఆయువు మిగుల స్వల్పమైనది. ఈశ్వరుని పొందక నిర్లిప్తత నందుట అసాధ్యము. కోరికలు నీమనసును గట్టిగా పట్టివేయును.

ఈయుగమందు జ్ఞానయోగము కూడ మిగుల కఠినమైనది. మానవుడు అన్నగతప్రాణి. అతని జీవితము మిగులతక్కువ. ఎంత పెనుగులాడినను మనుజుని దేహబుద్ధి నశింపదు. దేహబుద్ధి అంతరింపకున్నచో జ్ఞానము గగనకుసుమమై యుండును. 'నేను బ్రహ్మను, నేను శరీరమును కాను, ఆకలి, దాహము, రోగము, శోకము, జన్మము, చావు, సుఖము, దుఃఖముల కతీతుడను!' అని జ్ఞానియనును. సుఖదుఃఖముల వలనను, రోగశోకముల వలనను, పీడింపబడువాడు జ్ఞాని కానేరడు. చేయితెగి సతతధారగ రక్తము కారుచుండ చేయి తెగలేదని ఎవ్వడనజాలును? అట్లే ఐహికతాపముచే పొగులుచు నేను బ్రహ్మనని ఎవ్వడును అనజాలడు.

కర్మయోగ జ్ఞానయోగము లెంతయు కఠినములైన నగుటచే యీయుగ మనకు భక్తియోగము అనుకూలమైనదని గ్రహింపనగును. భక్తిమార్గము కష్టమైనది కాదనిన అందుండి పోవుమానవుడు ఒకగమ్యస్థానమునకును, జ్ఞాన కర్మమార్గముల ననుసరించి పోవుమానవుడు మఱియొక గమ్యస్థానమునకు అరుగునని తలంప జెల్లదు. బ్రహ్మజ్ఞానము నపేక్షించునాతడు భక్తిమార్గము గుండా చనినను, ఆజ్ఞానము నందగలడు. భక్తవత్సలుడు ఇష్టపడినచో భక్తునకు బ్రహ్మజ్ఞాన మిచ్చితీరును.

భక్తుడీశ్వరుని సర్వరూపములను చూడ నభిలషించును. జగదీశ్వరునితో ప్రసంగింపవలెనని మక్కువ పడును—సాధారణముగ బ్రహ్మజ్ఞానము కావలెనని యాతడు వేగిరపడడు. ఈశ్వరుడు యిచ్ఛామయుడు. ఆతడు తలచినచో భక్తునకు సమస్త ఐశ్వర్యములు నొసగజాలును. వానికి భక్తియు నిచ్చును. జ్ఞానమును యిచ్చును.

మానవుడు జగతియొక్క జనయిత్రిని తెలిసికొనినచో భక్తి నందగలడు. జ్ఞానమును పొందగలడు. భావసమాధియందు రూపదర్శనమును, నిర్వికల్ప సమాధియందు అఖండసచ్చిదానంద దర్శనమును మానవునకు చేకూరును.

'అమ్మా సకామకర్మ నాకెంతో భయము కలిగించును. దాని నొనరించినచో నిన్ను మఱచిపోదును. నిన్ను చేరకోరుగతి ఎదురగు ఏచిన్నకర్మనైనను నిష్కామమనస్కుడనై చేయుటకును, నాహృదయమును భక్తిభావములో

నిండించుటకును వలసినశక్తి నాకు దయచేయుము. కర్మ తగ్గిపోవలెననియే, తొలగి పోవలెననియే, నేకోరినను, నీవు ఆదేశమొసరించినపుడు నీపట్ల చేయ వలయుకర్మను నిర్వహింతును! అని భక్తుడు పల్కెను.

అహంకారము తమోగుణము. అజ్ఞానమునుండి అది పుట్టును. అహం కారములక్షు లనిలనంతకాలము మానవుడు ఈశ్వరుని చూడజాలడు. ఈశరీ రమును యీసంపదయు వేయేల ప్రపంచక సంబంధమైనదేదియు నిలువదు. ఒక త్రాగుబోతు దుర్గప్రతిమను చూచి నవ్వుచు 'దేవీ! నేడెంతో అంద ముగ నుంటివని కులుకుచుంటివి. రెండుమూడునాళ్లు గడచినపిదప నిన్నీభక్తులు గంగయందు గిరివాటు వేయుదురు' అనును. మానవుడా! నీవు న్యాయ మూర్తివి కావచ్చును. మఱొక గొప్ప ఉద్యోగివి కావచ్చును. కాని నీగొప్ప తనము, నీ యధికారము నీయైశ్వర్యము మూడునాళ్ళముచ్చటయే. కావున నీ యభిమానమును నీఅహంకారమును, విడువుము.

సత్వరజస్తమోగుణములు మిక్కిలి భిన్నములు. అహంకారము, నిద్ర అమితభోజనము, కామము, క్రోధము, మున్నగునవి తమోగుణావిష్టుని లక్షణ ములు. రజోగుణము నలవరచుకొనువారలు తమోపీడితులట్లు కాక చాలపనుల యందు చేయిచేసికొనియెదరు. తమయింటిని బాగొనరింతురు. చక్కగ నలంక రింతురు. రంగురంగుల ప్రతిమలను గోడలకు వ్రేలాడగట్టెదరు. వేషభాషలం దారి తీతెదరు. ఆడంబరమున అసమాను లనిపింతురు. ఈశ్వరచింత చేయు నపుడు మిగుల పటాటోపమును చూపుదురు. కంఠమున వీరు దాల్చు రుద్రా క్షమాలయందు ఒకటి రెండు బంగారపు పూస లుండును. ఎవరైన వీరి పూజా మందిరమును చూడవచ్చినపుడు, వారిని కుతూహలముతో వెంటగొని అందలి చిత్రములను చూపుదురు. ఇతరులు చూచి తమ్ముమెచ్చవలెనని వీరుదాన ములు ధర్మములు సలిపెదరు. సత్వగుణమున వెలయువారు మిగుల శిష్టులు; శాంతస్వభావులు, వేషభాషలయందు డంబ ముండదు. ఆకలిబాధ తీర్చుకొను టకు మాత్రము వీరు ధనము సంపాదింతురు. ఎవ్వరిని గాని వీరు పొగడి పైకము నార్జింపరు. భార్యాపుత్రులమహోన్నతికై వేగిరపడరు. గౌరవమునకై ప్రాకు లాడరు. కీర్తికై చెవికోసుకొనరు. ఈశ్వరధ్యానమును, దానాదిసత్కా ర్యములను రహస్యముగ జరుపుచుందురు. సత్వగుణమును తుది మెట్టికినపిదప

పై అంతస్థు సమీపమందు గోచర మగును. ఇంచుక ముందుల కరిగి వంతనే సత్వగుణసంపన్ను లీశ్వరుని పొందెదరు.

జీవులందు వేర్వేఱు తరగతులు గోచరించును—నిత్యజీవులు, ముక్త జీవులు, ముముక్షుజీవులు, బద్ధజీవులు నను మానవు లున్నారు. నారద శుకాదులు నిత్యజీవులు. వీరు ముక్తిని పొంది త మ్మాశ్రయించిన జీవులకు ముక్తినీయ గలరు. సంసార జాలమునుండి తప్పిపోవుటకై ప్రయత్నించువారు ముముక్షు జీవులు. వీరియం దొకరిద్దరు మాత్రము వలనుండి అవ్వల బడగలరు. ఇట్లు పడజాలువారే ముక్తజీవులు. సంసారమందు పూర్తిగ కట్టుబడువారు బద్ధ జీవులు. వారు వలయందు పడియే యుందురు. పడితిమనుజ్ఞానమైన వారి కుండదు. హరినామస్మరణము చేయువారి కడనుండి వీరుదూరముగ పరిగెత్తె దరు. విష్ణునామము మృత్యుశయ్యపై కావలెనుగాని యిపు డేలయని వీ రను చుందురు. కడసారి ముహూర్తము నందైనను వీరు ఐహిక వాంఛలను విడువరు. ఆలుబిడ్డలకై గగ్గోలు పడెదరు. దుఃఖములను తెచ్చిపెట్టు క్రియలనే వీరు మాటిమాటికి సల్పెదరు. ముండ్లగడ్డి తినుచుండ కడువడి రక్తధారలు స్రవించు చున్నను ఒంటె ఆగడ్డిని విడువక దానినే నోట గఱచును. కొడుకు చచ్చెనని ఒకమూల విలపించుచూ, ఏడాది దాటకుండ కొడుకు కావలెనని సంసార బద్ధుడు మక్కువపడును. కొమరిత పెండిలికై ఆస్తినంతను అమ్మివేయును. ఏటేటను ఆడుబిడ్డలను కనుచునే యుండును. తీర్థయాత్రల కరుగునపుడు ఈశ్వర ధ్యానము చేయుట కితనికి తీరిక యుండదు. తీర్థమందలి వేడుకలను చూచి తాను సంతసించి, తనబిడ్డలను సంతసింప జేయవలయుననియే అతడు తలచును. పొట్టకై వెట్టిధ్యానము చేయుటకైనను యితడు సంశయింపడు. బూటకములు చెప్పియు, వంచనములు చేసియు, పొగడ్తలు సల్పియు, దోసిళ్ళతో నీతడు రూకలు సంపాదించును. ఈశ్వరధ్యానపరాయణులనుజూచి వారు వెఱ్ఱి వారని ఇతడు వెక్కిరించును.

జపమాల త్రిప్పిన నేమి? గంగయందు మునిగిన నేమి? తీర్థయాత్రలు చేసిననేమి? సంసారచింతలకు మనసున చోటిచ్చునాతడు అవసాన సమయ మున పరమాత్మను తలంపఁ జాలడు. ఏమేమో వాగును గాని ఆసమయమున విష్ణునామసంకీర్తన మొనరింప జాలడు. రామచిలుక రాధాకృష్ణాయని పలుకు

చుండును గాని పిల్లి పైనపడినపుడు మామూలు అఱపునే అఱచును. మృత్యు కాలమున మనుజు డెట్లుభావించునో పిమ్మట అట్లగునని భగద్గీత తెలుపు చున్నది. భరతరాజు 'హరిణమా! హరిణమా!' అని ప్రాణము వదలి నాడు. హరిణమై పుట్టినాడు. ఈశ్వరునియందు మనసుంచి ప్రాణములుపాయు నతడు జగదీశు నందితీరును. మరల నాతడు జన్మ మెత్తకుండును.

ఇతర సమయములందు ఈశ్వరచింత చేసి మృత్యుసమయమందు చేయలేదని మానవు డొకడు సుఖదుఃఖమయ సంసారమున మరల పుట్ట వలెనా యని యెవ్వరేని యడుగవచ్చును. ఒకడు ఈశ్వరచింత చేయవచ్చును కాని ఈశ్వరునియందు విశ్వాసమును కోల్పడవచ్చును. ఒకప్పు డీశ్వరునిపై మనసుంచినవాడు పదంపడి ఆతని మఱువవచ్చును. మరల సంసారమందు ఆస క్తుడు కావచ్చును. ఏనుగును స్నానము చేయించిన పిదప నది బూడిదయందును బురదయందును పొరలాడవచ్చును. మనసు మత్తకరి. ఏనుగుచే తానమొనర్చి దానిని విచ్చలవిడిగ తిరుగనీకుండ ఒకతావున నిలిపి యుంచితిమేని అది బురద యందు ప్రవేశింపనేరదు. శుద్ధమనస్కుండైన మానవుడు కామినీకాంచనము లపై మక్కువ కలిగియుండడు. మృత్యుసమయమున తన దృష్టిని జగదీశునిపై నిలిపి తీరును. అత డింక సంసారమందు పొరలాడుటకై పునర్జన్మ నెత్తడు.

ఈశ్వరునియందు విశ్వాసము లేనందు వలననే మనుజుడు కర్మయోగ మునకు పాల్పడవలసివచ్చుచున్నాడు. గంగాస్నానము చేయునపుడు పాపములు మనుజునుండి తొలగి గంగయొడ్డుననున్న చెట్లను పట్టియుండి అత డొడ్డును జేర గనే ఆతనిపై నుఱికి మరల వాని నాశిసిపట్టునని విశ్వసించువా రున్నారు. ఇట్టి కూడని నమ్మకము మనసున తా వీయక, అభ్యాసయోగముమూలమున నీశ్వర ధ్యానమున నారి తేఱి అవసానదశయందును మానవుడు పరంధాముని విడువక యుండవలెను. ఏమేమో తెలిపితిని. జగదీశు డేమిపలికించెనో ఎఱుగను. నేను యంత్రమును, అతడు నడపువాడు. నేను గృహమును, అతడు గృహాయజ మాని. నేను శకటమును, ఆతడు బండినడుపువాడు. నేను రథమును, అతడు రథి కుడు. ఆత డెట్లునడుపునో అట్లు నడచెదను. ఆత డేమిచేయుమనునో దానిని నేను చేయుదును."

---

ఒక బ్రహ్మభక్తుడు పరమహంస నుద్దేశించి ఇట్లు పలికెను.

భక్తుడు:—మహాత్మా, ఈశ్వరుని చూడగలుగుదుమా? కలిగిన మేని మనము చూచుచుండుట లే దేమి?

పరమహంస:—ఈశ్వరుని చూడవచ్చును. సాకారరూపమందు చూడవచ్చును. అరూపమందును చూడవచ్చును. ఇట్లని నీకెట్లు ప్రబోధింతును?

భక్త:—ఏయుపాయమున చూడవచ్చును?

పరమ:—వ్యాకులుడవై అతనికొఱకు ఏడ్వగలవా? బిడ్డలకొఱకు, స్త్రీకొఱకు విత్తముకొఱకు, లోకులు విలపింతురు. ఈశ్వరునికై విలపించువా రెంద ఱున్నారు? బిడ్డ లక్కఱపడతగాని ఆడుకొనుచున్నంతసేపు తల్లి యింటిపను లను చక్కజేసికొనగలదు. ఆటవస్తువులపై రోతపుట్టి దానిని పాఱవేసి బిడ్డయేడ్చుచుండ తల్లి పరుగుపరుగున పోయి బిడ్డను చంకబెట్టుకొనును.

భక్త:—మహాశయా! ఈశ్వరస్వరూపమును గురించి వివిధాభిప్రాయము లేల తలసూపినవి? కొందఱీశ్వరుడు సాకారుడందురు. మఱికొందఱు నిరాకారు డందురు. సాకారవాదులందును భిన్నాభిప్రాయము లున్నవి. జగదీశుడు నానారూపులు కలవా డనువారును కలరు. ఇంతగొడవ యెందులకు?

పర:—ఇందు గొడవేమియు లేదు. ఏభక్తుడు ఏవిధముగ జగదీశుని యూహించునో ఆవిధముగ నాతని గాంచును. ఏవిధముగనైన ఈశ్వరు నొకసారి భక్తు డందగలిగెనేని అతని కంతయు విశదమగును. పొలిమేర యందు ప్రవేశింపనివ్యక్తి ఎల్లయంశముల నెట్లెఱుగనేర్చును. ఒకకథ యున్నది. ఒకవ్యక్తి ఒకనా డవ్వలి కరిగి ఒక చెట్టుపై నొకజంతువును జూచెను. మఱొకనిపాలి కరిగి 'ఓయస్వా! చూడుము. ఆవృక్షముపై ఎఱుపురంగుగల ఒక చక్కనిజంతు వున్నది.' అని పలికెను. 'దానిని నేనును చూచితిని. అది కపిలవర్ణపుజంతువు' అని యారెండవవ్యక్తి పలికెను. వారిపలుకులు విని ఇంకొకడు 'ఆమృగమును నేనును చూచితిని. అది పసుపుపచ్చనిరంగు గలది.' అనెను. ఇంతలో మఱొక్క డరుదెంచి 'దానిరంగును ఆకుపచ్చగాని మఱేరంగును కాదు' అనెను. ఇట్లే మఱికొంద ఱచోటున జేరి చెట్టుపైగల జంతువు నీలివర్ణము గలదనియు, వంగపండు చాయ గలదనియు, తెల్లదనియు, నల్లనిదనియు వేర్వేఱుతెఱగుల

పలుక దొడగిరి. అందఱును గొప్పవివాదమునకు దిగిరి. మహాశయులం దఱు చెట్టుకడ కరిగిరి. చెట్టుక్రింద నొకడు కూర్చునియుండెను. జంతువును, గుఱించి యెల్లఱును వానిని ప్రశ్నించిరి. ప్రశ్నించుటయు నాత డిట్లనెను. 'అయ్యలారా! నే నెల్లప్పుడు యీచెట్టు మొదటనే వసించుచుందును. నాకాజంతువు బాగుగా తెలియును. మీరు చెప్పినదంతయు నిక్కమైనదే. ఆజంతు వొక్కొకప్పుడు తెల్లనిదై, ఒక్కొకప్పుడు పచ్చనిదై, నల్లనిదై, ఎఱ్ఱనిదై, నీలివర్ణముగలదై యుండును. అది యెన్నిరంగులందైన చూపట్టును. దానికి రూపములు మెండు. అది ఒక్కొకప్పుడు ఏరంగును లేనిదై యుండును. ఒకసారి సగుణజంతువై చూపట్టును. మఱియొకప్పుడు నిర్గుణజంతువై చూపట్టును. ఎవ్వాడు సర్వదా ఈశ్వరధ్యానమందు నిమగ్నుడై యుండునో అతడు ఈశ్వరస్వరూప మెట్టిదో గుర్తింపగలడు. జగదీశుడు నానారూపములందు చూపట్టుననియు, నానావిధముల గోచరించుననియు, సగుణుండనియు, నిర్గుణుండనియు, నాతడు తెలుపగలడు. జగదీశుని సమీపమునందున్నవాడే అత డిట్టివాడని గ్రహింపగలడు. దూరమందు నిలుచువారు ఒకరితో నొకరు తర్కించుకొనుచు పెనగులాడెదరు. నిరాకారుడు నాతండ్రి, సాకారుడు నాతల్లి, యని కబీరు పలుకుచుండువాడు. భక్తు డేరూపుపై మనసు నిలుపునో ఆరూపునే అతడు కాంచును. భగవంతుడు భక్తవత్సలుడు కదా? ఏమీ మా పరిశీలింపవలెననియు, విచారము చేయవలెననియు ఆతురము పడువానికి జగదీసుడు దురూహ్యుడై యుండును. భక్తుడు దుర్గను గంభీరమైన శ్యామలరూపమున జూచు నేల? ముందులకు దుముకక దూరమునందుండి జగదీశుని గాంచును. గాన, దూరమందు నిలచి చూచుచుంటిమి కావున సూర్యుడు చిన్నవాడుగ చూపట్టును. సూర్యుని సమీపించి చూచితిమేని అతడు కడుంగడు పెద్దయై యుండును. మనజు డాతని చూడనే లేడు. చెఱువునీరు దూరమునకు నల్లగనో, నీలిరంగుగనో, తోచును. చెంతకరిగి నీటిచేతుందు చే యిడితిమేని రంగేమియు నుండదు. దూరమునకు నీలమై తోచు ఆకసము సమీపమందు రాగరహితమై కాసించును. కావున వేదాంతదర్శన విమర్శనమున బ్రహ్మ నిర్గుణుడై చూపట్టును. అతనిస్వరూప మెట్టిదో

మాటలతో చెప్పుట కలవికాదు. నీవు సత్యంబ వయితివేని, జగత్ సత్యమై ఈశ్వరుని నానారూపములు సత్యమై, ఈశ్వరవ్యక్తిత్వము సత్యమై గోచరించును. చులకనైన భక్తిపథమే మిగుల మంచిది. అనంతమయిన ఈశ్వరుని గుర్తించుట సాధ్యమా? ఆతని నెఱుగవలసిన యావశ్యకము మాత్ర మేమున్నది? దుర్లభమైన మనుష్యజన్మము నెత్తిన మనము ఆతని పదములను భజింపజాలు భక్తిని బడయవలెను. ఒకచెంబెడు నీటితో దాహము తీరునపుడు చెఱువులో నీ రెంతయున్నదో మనము కొలువ నేల? మురగల సీసాయందలి సగముతో మనము మత్తెక్కిపోవుచుండ అంగడియం దెన్నిమణుగుల సారా యున్నదో మనము లెక్కించు టెందులకు? అనంతుని పూర్తిగా నెఱుంగవలెనని మనము వేగిరపడ నేల?

భక్త:—జ్ఞానముగల మనుష్యుడు అవాక్ అగును. ఆతనికనులు నిమీలితమగును. అశ్రుధారలు స్రవించును. అపుడు భక్తి ఆవశ్యకమై యుండును.

పరమ:—భక్తి యువతి. కావున నది యంతఃపురమున కరుగగలదు. జ్ఞానము అవ్వలిగృహమువఱకు చనును.

భక్త:—అంతఃపురములోనికి ఏస్త్రీనైనను పోనీయరాదు కదా? వేశ్యలు ప్రవేశింప గలరా? జ్ఞాన మవసరము కదా?

పర:—సరియైన తెలివి నెఱుగక ఈశ్వరభక్తి గలిగి ఆతని నెఱుగవలయు కోరిక గలుగునాతడు జగదీశు నందగలడు. ఒక మహాభక్తుడు జగన్నాథ దర్శనమునకై బయలువెడలెను. పూరీపోవు మార్గ మాతడెఱుగడు. సరియైన దక్షిణమార్గమునుబట్టి నడువక పడమరదిక్కుగ పోయినాడు. త్రోవ తప్పినాడు. వ్యాకులచిత్తుడై, తెన్ను తెలుపుడని వీరిని వారిని వేడుకొనినాడు. తుద కాతడు పూరీ చని శ్రీ జగన్నాథుని దర్శించినాడు. ఒకడెఱుగకపోయినను ఒరులు తెలుపుటవలన గమ్యస్థానమును చేర జాలినాడు.

భక్త:—అతడు తప్పుదారిని పట్టినాడు కదా?

పర:—అవును నిజమే. పిమ్మట నతడు సరియైనదారి తెలిసికొనినాడు.

భక్త:—స్వామీ! ఈశ్వరుడు సాకారుడా? నిరాకారుడా?

పరి:—అతడు రెండునూ! జగన్నాథమున కరిగిన యొక సన్యాసి మనసున నీ సందియమే పుట్టెను. స్వామిసమ్ముఖమున నిలిచి, చేతిదండము ఆతని

శరీరమునకు తాకునో తాకదో తెలిసికొనుటకై దానిని కుడినుండి ఎడమ ప్రక్కునకు విసరెను. దెబ్బ దేవునకు తగులలేదు. స్వామివిగ్రహమే అందు లేదు, మరల దండము నాతఁ డెడమవైపునుండి కుడివైపునకు విసరగా అది మూర్తియొక్క శరీరమునకు తగిలెను. అపు డీశ్వరుడు నిరాకారుడును సాకారుడును కూడనని సన్యాసి గుర్తించినాడు.

భక్తు :—ఈవిషయమును బోధపఱచుకొనుట కష్టము. నిరాకారుడు సాకారు డెట్లగును? సాకారుడేయైన వివిధరూపము లెందులకు?

పర :—ఈశ్వరుడు నంకర ఈవిషయముల నెఱుగుట సాధ్యముగాదు. సాధకుని కొఱకు పలువిధముల పలురూపముల నతడు గోచరించును, ఒకని కడ ఒక మండిగ (మూడుకు) రం గున్నది. బట్టలు ఉంపించుటకై అనేకు లతనికడ కరుగుచుందురు. ఏరంగు కావలసినను ఆమండిగనుండియే ఉనుపుచుండును. ప్రత్యేక మనుష్యకాంక్ష ననుసరించి ఒకేజగదీశుడు వేఱువేఱు రూపుల వేర్వేఱురంగుల దోచును. భగవంతుడు సచ్చిదానంద సముద్రము. ఈసము ద్రమున కెందును తీరము లేదు. భక్తిహిమ మూలమున నాసముద్ర జలము అచటనచట గట్టిపడును — నీరము మంచుగడ్డయై చూపట్టును. భక్తుల సమక్షమున భగవానుడు సాకారమున గన్పట్టును. జ్ఞానసూర్యు డుదయించినంతనే యీమంచు కఱగిపోవును.

భక్తు :—సూర్యుడుదయించిన మంచుకఱగి నీరగును. నీరైనను నీరశ్లేయుం డును; నిరాకారమైన ఆవిర్యైనను అగును కదా?

పర :—బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య యను విచారానంతరమున నొకడు సమాధి జేరినంతనే రూప మెగసిపోవును. అపు డీశ్వరుడు వ్యక్తియని అతడు గ్రహింపడు. ఆతడు ఎట్టివాడో మాటలతో చెప్పుట సాధ్యము కాదు. అపుడు బ్రహ్మ నిర్గుణుడు. బుద్ధిద్వారా అతనిని గ్రహించుట సాధ్యము కాదు. భక్తి చంద్రునివంటిది. జ్ఞానము సూర్యుని వంటిది. ఉత్తరమందును, దక్షిణమందును సముద్ర మున్నది. చలియు చల్లదనమును అచట నధికము. నీ రపుడపుడు గట్టిపడుచుండును గాన ఓడ అందు నడువ జాలదు. అందు అడ్డుండును.

భక్తు :—భక్తిపథమున అడ్డుండునా?

పర :—ఉండును కాని దానివలన హాని కలుగదు. సచ్చిదానంద సాగరము మంచుగడ్డవలెనట్లు తోచును. జ్ఞానసూర్యుని కతన గడ్డ యంతరించును. గడ్డయున్నను లేకున్నను ఎదుట నున్నది సచ్చిదానందమే కదా? సమాధియందు 'నే' ననునది అంతర్ధాన మగును కాని సమాధి స్థితినందుట మిగుల కష్టము 'నేను' నశించుట కెట్లును సమ్మతింపదు. సమ్మతింపదు కావున తిరిగి అది సంసారమును ప్రవేశింప వలసి వచ్చును.

ఈశ్వరు నందినవాడు ఐదేండ్ల బాలకుని స్వభావమును బడయును. బాలకుని 'నేను' పరిపక్వమైన 'నేను' ఏగుణమునకును బాలకుడు వశము కాడు. అతడు త్రిగుణాతీతుడు. సత్వరజస్తమము లాతని నంటవు. ఎవరితోనైన బాలకు డొకడు పోరి, ఐదునిమిషములు కడవకమున్న అతనిమెడ బట్టుకొని ఊయల ఊగి వింత ఆట లాడును. బాలుని హృదయమున తమోగుణము లేదని ఇందువలన స్పష్ట మగును. బొమ్మరిల్లు కట్టి అందెంతయో ఏర్పాటులు చేయును. కొంతసేపటిలో నాబొమ్మరిల్లు కూలును. తల్లియొద్దకు బాలుడు పర్విత్తును. ఆడుచు పాడుచు గంతులు వేయును. రజోగుణమునకు బాలకుడు వశవర్తి కాడు. 'నీవు కట్టినబట్ట ఎవరిది' అని యొకబాలు నడుగ నా దేఅయ్య యిచ్చినా' డనును మంచిపిల్లవాడవు నాకీబట్ట నిచ్చివేయుము' అని యడుగ 'నీకు దీని నీయ' ననును. మరపించి ఏబొమ్మనో ఆటవస్తువునో చేతియం దుంచి నచో వస్త్రమును చేతబెట్టి గంతులువేయుచు బాలు డదృశ్యు డగును. సత్వగుణమైనను నీతని నంటదు. బాలురతోను బాలికలతోను ఆడుచు పాడుచు వారియెడల నాతడు మక్కువ గలిగి ప్రవర్తించును. తల్లిదండ్రులతో నన్య ప్రదేశముల కరిగినపుడు నిముసములో నచటిపిల్లలతో చెలికారము సలుపును. వెనుకటి నెచ్చలులను పూర్తిగ మఱచిపోవును. ఇతనికి జాత్యాభిమానము లేదు. బ్రాహ్మణుల యింటిబిడ్డమైనను, శూద్రుల యింటిబిడ్డమైననుఎవరైనను యాతనికి జతకాడే. జతగానితో నొకకంచమున కుడుచుట కీతడు సంశయింపడు. ఇది శుచికలది, ఇదిశుచిలేనిది, ఇది దొడ్డది, ఇది తక్కువది, అను భావము బాలున కుండదు. మంచియన్నము పెట్టినను ఎంగిలియన్నము పెట్టినను తినును. కామక్రోధములు సిగ్గుబిడియములు యాతనికి దూరములై యుండును.

ముదుసలిని పీడించుపాశము లెన్నెని యున్నవి. జాతి, అభిమానము, లజ్జ, భయము, విషయలాలసము, కపటము, మున్నగునవి. పాండిత్యమును గుఱించిన అహంకారము, ధనమును గురించిన అహంకారము, వీనిని బట్టిపీల్చి వేయుచుండును. అంకారమును, అజ్ఞానమును తమోగుణమునుండి యుద్భవించును. రావణుని రజోగుణమును. కుంభకర్ణుని తమోగుణమును, విభీషణుని సత్వగుణమును, అంటియుండెడివని పురాణములు తెలుపుచున్నవి. సత్వగుణ సంపన్నుడు కావున, విభీషణుడు రామచంద్రుని పడయకలిగెను. క్రోధము తమోగుణముయొక్క ముఖ్యలక్షణము. క్రోధమువలన విచక్షజ్ఞాన మంతరించును. హనుమంతుడు క్రోధపరవశుడు. లంకకు నిప్పంటించెను. ఆ లంకయందు సీతాదేవియున్నదని యోచించినాడుకాడు.

కామముకూడ తమోగుణముయొక్క లక్షణమే. ఈశ్వరవాంఛవలన కామ మంతరించును. భక్తిపూరితహృదయుడు అరిషడ్వర్గములను మనసునుండి మళ్ళింప గలడు.

భక్తు:—ఇంద్రియసంయమ మొనరించుట చాలకష్టము. గుఱ్ఱముయొక్క కన్నుల కిరుతట్టులందు తోలుముక్కలు కట్టబడును. కొన్నికొన్ని గుఱ్ఱముల కన్నులు పూర్తిగా మూసివేయువలసివచ్చును.

పర:—ఈశ్వరకృప నందినానవున కెట్టిభయమును లేదు. నారద, ప్రహ్లాదాది, నిత్యసిద్ధులు కన్నుల కిరుతట్టులయందును తోలుముక్కలు కట్టుకొనలేదు. ఆత్మశక్తి కలవారికి కన్నులకు గంత లేల? ఈశ్వరునకు అప్పన మగువారు అడలనేల? బాలకుడు తండ్రిచేయి పట్టుకొని చేనుగట్టుగుండా నడచుచుండును. గట్టున కిరుప్రక్కలందు లోతుగ గోతు లుండును. తండ్రి చేతిని జారవిడచి పిల్లవాడు ప్రక్కగల గోతియందు కూలబడును. బాలకుని చేతిని తండ్రి పట్టుకొనినచో బాలకుడు పల్లమందు కూలబడడు.

భక్తు:— తండ్రి కొడుకుచేతిని పట్టుకొనుట ఉచితమా?

పర:—అట్లు తలంప నేల? మహాపురుషులకందఱికిని బాలకస్వభావ ముండును. ఈశ్వరసముఖమున నీమహాపురుషులు సర్వదా బాలకులే. వీరియందహంకారము నిండుసున్న. వీరిశక్తి యథతయు నీశ్వరశక్తి—వీరిశక్తి కాదు. ఇట్లని వీరికి దృఢవిశ్వాస ముండును.

భక్తు :—గుఱ్ఱము కన్నుల కిరుతట్టులందును, తోలుతో తోలుముక్కలు కట్టిన ప్పుడుకదా అది తిన్నగ నడచును. అంతరంగము వ రిపులను వశమొనరించు కొనకమున్న ఎవ్వడైన ఈశ్వరు నందగలడా!

పర :—నీవు జ్ఞానమార్గమునుగుఱించి తెలుపుచున్నావు. దానినే జ్ఞానయోగ మనియు నందుము. ఆపథమునుండికూడ నీశ్వరు నందవచ్చును. తొలుత చిత్తశుద్ధి అవసరమని జ్ఞాను లందురు. తొలుత సాధనము కావలెను. అప్పుడుకదా జ్ఞానోదయమగును. భక్తిపథమునుండికూడా సర్వేశు నంద వచ్చును. భగవంతుని చరణకమలములపై దృష్టి నిలిపి ఆతని నామసంకీర్తన మొనరించువాని ఇంద్రియములు అప్రయత్నముగ స్వాధీనమగును. ఆరిష డ్వర్గములు తమంతతాము లొంగుబాటులోనికి వచ్చును. ఒకనికి పుత్ర శోకము ఘటిల్లినపుడు ఏదేని సంతర్పణమున కరిగి విందారగించునా! అహంకార ముట్టిపడ నిందందు నడయాడునా? సుఖసంభోగమున నోడలు మఱచియుండునా? మనసును బలమైన వేఱొక సంఘటనము గాని, వేఱొకశక్తిగాని, ఆకర్షించినపుడు కూడపమార్గమున నది పారిపోవునా! వెలుగు చూచిన శలభము అంధకారమున నుండ తలచునా?

భక్తు :—శలభము వెలుగుబడి మ్రగ్గిపోదా?

పరమ :—భక్తుడు శలభమువలె కాలి మరణింపడు. ఏ వెలుగుదెస భక్తుడు ఆసక్తితో బరుగెత్తునో అది మణియొక్క వెలుగు. మణియొక్క వెలుగు మిగుల ప్రకాశమానమై చల్లనైనది. ఈజ్యోతికతన, శరీరము భస్మము కాదు. మనసున నానందశాంతములు నిండుకొనును. 'నేను శరీరమును గాను, మానసమును గాను, బుద్ధినిగాను, నాకు వ్యాధి లేదు, శోకము లేదు, అశాంతి లేదు. నేను సచ్చిదానందస్వరూపుడను. సుఖదుఃఖముల కతీతుడను. ఇంద్రియవశవర్తిని గాను' అని అవలీలగ పలుకవచ్చును. పెద్ద ముల్లు విఱిగినపుడు రక్తము కారుచుండ ఇది వట్టియబద్ధ మను ట్లేల? ముందుగ ముల్లు నూడబెఱుక వలయునుగదా! జ్ఞానాగ్నియందిట్టి ముండ్లను మాడ్చివేయవలయును గదా!

గ్రంథపఠనమునగాని జ్ఞానోదయము కాదనియు విద్య యలవడదనియు ననేకుల యభిప్రాయము. చదువుటకంటె వినుట మంచిది. వినుటకంటె చూచుట

మంచిది. కాశీని గుఱించి చదువుటయందును కాశీని గూర్చి వినుటయందును కాశీని చూచుటయందును ఎంతేని భేదముండును గదా!

చతురంగము నాడువారికంటె చెంతనుండి పరికించువారు చక్కని యెత్తుల నూహింపగలరు. సంసార నిమగ్నులు తాము మిగుల బుద్ధిమంతుల మని యోజింతురు. వారు విషయాసక్తులు వారు ఆటనాడుచున్నారు. ఏమి యెత్తు వేయవలెనో బాగుగా నెఱుంగరు. సంసారమునుండి వెలువడి విషయ చింతనుండి తప్పించుకొనిన సాధుపురుషులు ఘనతరమైన బుద్ధిబలము గలిగి యుందురు. వీరు జీవనమును చతురంగపు టాటయందు పాల్గొనరు. చక్కని యెత్తుల నూహింపగలరు.

రామకృష్ణ :—భక్తిపూరితహృదయుమైన గోపిక కృష్ణునిదెస నరిగిన కొలది కృష్ణుని దేహగంధము నందగలదు. ఈశ్వరసమ్ముఖమునకు ఉపాసకుడు జరిగినకొలది భావభక్తి అధికమగును. సాగరసమ్ముఖమునకు నది ప్రవహించిన కొలది వెల్లువ వేగమెక్కుడగును. జ్ఞాని అనంతరమున గంగ అల్లనస్రవించు చుండును. అతని కంతయు స్వప్నసృష్టులు గోచరించును. భక్తుని అంతరంగ మున జహ్నవి పొంగిపొరలును. సాగరసమీపమందలి నదీప్రవాహమువలె నీతనిభావము వేగవంతమైయుండును. ఇతడు నవ్వుచు, ఏడ్చును, నాట్యము సలుపును, పాడును. జగదీశునితో నాడవలెనని భక్తుడాశించుచుండును. నీటి యందలి మంచుగడ్డ ఒకమాఱు తేలియు నొకమాఱు మునిగియు వింతగ జూపట్టు లీల భావసాగరమున భక్తుడు ఒకసారి మునుంగును. ఇంకొకసారి తేలును. వేఱొకపర్యాయ మీదును.

జ్ఞాని బ్రహ్మను గుర్తింపగోరును. భక్తుని దృష్టియందున్న భగవానుడు షడైశ్వర్యపూర్ణుడు, సర్వశక్తి సంపన్నుడు. బ్రహ్మకును శక్తికిని భేదములేదు. సచ్చిదానందమయుడే సచ్చిదానందమయి. ఇరువుర సంబంధము మణిజ్యోతుల సంబంధమువంటిది. మణిజ్యోతి యనినపుడు మణి ఊహయందు జొచ్చును.

మణి యనినంతనే జ్యోతి మనసున సోకును. మణిని యోచింపకున్న మణిజ్యోతిని, మణిజ్యోతిని తలపకున్న, మణిని తలంచుట సాధ్యముకాదు. కార్యములున్న చోటున శక్తి యుండును. జలము కదలకున్ననూ జలమే. తరంగభూయిష్టమైననూ జలమే. సచ్చిదానందమయుడే సృష్టిస్థితిలయములకు

కర్త. సేనాని ఏక్రియము జరుపుకున్నపుడును, పూజాదిక్రియలు సలుపు నపుడును, పైయధికారులను చూచునపుడును, ఉద్యోగము చేయుచున్నపుడును సేనానియనియే పిలువబడును. ఈశ్వరుడే జగములును, జగత్తును నైయున్నాడు.

బ్రహ్మజ్ఞానియొక్క వివిధావస్థలు వేదమందు వర్ణింపబడినవి. విషయ బుద్ధి గలవానికి జ్ఞానము చేకూరదు. వేదమందు సప్తభూములు వర్ణింపబడి నవి. ఈయేడుభూములును మనస్సుయొక్క వాసస్థానములు. మనస్సు నిలుచు నపుడు, గుహ్య, లింగ, నాభిస్థలములు మనసున కావాసములై యుండును. మన సున కపుడూర్ధ్వదృష్టి యుండదు. కామినీకాంచములదెస కదిమాత్రము వర్తి డును. మనసుయొక్క నాలుగవభూమి హృదయము. చైతన్యము తొలుత, నపు డుదయించును. నాలుగుదిక్కులయందును అది ప్రకాశవంతమైన వెలుగును విలోకించును. ఐశ్వర్య సంబంధమగు జ్యోతిని గాంచి మనుజు డపుడాశ్చర్యానిర్వి తుడై సంసారముదిక్కుగ చూపులు మరలింపడు. ఆదెసకు వానిమనసు తిరు గనే తిరుగదు. మనస్సుయొక్క ఐదవభూమి కంఠము. ఎవ్వానిమనసు కంఠ మందు జొచ్చెనో ఆతని ఆవిద్యయును, అజ్ఞానమును, అంతరించును. ఈశ్వర ప్రసంగమును తప్ప అన్యవిషయము వినుట కాతనిమన సొప్పదు. ఎవ్వరేని అన్యప్రసంగము నెత్తినపుడు వారికడనుండి అతడు వెడలిపోవును. మానసము యొక్క ఆరవభూమి కపాలము. అందు జొచ్చినంతనే అహర్నిశములందు మనసు ఈశ్వరరూపమును దర్శించుచుండును. అపుడుకూడ యించుక అహం భావముండును. చెంత తోచు నిరుపమరూపసందర్శనముకతన ఆమనసు ఉన్మ త్తప్రాయ మగును. ప్రత్యక్షమయిన దివ్యరూపమును, తాకవలెనని మక్కువ పడును. ఆలింగన మాచరించుకొనవలెనని ఆస పడును. కాని అది యట్లు కావింప జాలదు. లాంతరులోని దీప మెదుట దోచునపుడు దానిని తాకితినని మనుజు డెంచును. కాని నడుమ నద్ద ముండుటచే, దాని నాత డంటజాలడు. శిరసున సప్తమభూమి యుండును. మానసము అందు ప్రవేశింపగనే సమాధి గలుగును. బ్రహ్మజ్ఞానికి బ్రహ్మయొక్క ప్రత్యక్షదర్శనము లభించును. కాని ఆ యవస్థయందు శరీరము విశేషకాలము నిలచియుండజాలదు. మనుజుడుసర్వదా స్మృతిరహితుడై యుండును. అతడేమియు భుజింపజాలడు. నోట పాలుపోసి

నను కారిపోవును. మనుజు డీభూమియందు జొచ్చినపిదప యిరువదియొక్క దినము మాత్రము జీవించియుండును.

"మహాశయా! నాకు సమాధిని బోధ పఱతురా?" యని యొకడు నన్ను ప్రశ్నించినాడు. సమాధి కలిగినంతనే సర్వకర్మలను పరిత్యజింప వచ్చును. పూజ, జపాదికర్మలును, విషయకర్మలును, సడలిపోవును. తొలుత కర్మను గుఱించిన విజృంభణము మిక్కిలిగ ఉండును. మానవు డీశ్వరునిదెసను అగ్రసరుడై నకొలది యీవిజృంభణము క్షీణించిపోవును. దాని నామోచ్చారణమును, గుణసంకీర్తనమును, కట్టువడి పోవును. హరినామసంకీర్తన మొనరించుచు 'పాలించరా! పాండురంగా!' అని అందుము. భావము గాఢ మయినపుడు 'పాండురంగా' అందుము. పిదప 'రంగా' అందుము. పిదపడి 'రం, రం' 'గా, గా' యనుచుండ భావసమాధియందు లీన మగుదుము. సంకీర్తనము సంపూర్ణముగ కట్టువడును. బ్రాహ్మణభోజనమును పరికించి యుందురు. భోజనమనినంతనే పలువురు విప్రులు ఎగిరి గంతులు వేయుదురు. విస్తళ్లు వేసినంతన మొదటి ఎగురుపాటు తగ్గును. వడ్డనవడ్డన యని భోజనప్రియు లందురు. భోజనారంభము కాగానే, మూడువంతులు శబ్దము చల్లారును, పెరుగు జుట్టి ఉత్తరోపాశనము పట్టుసరికి ధ్వని సంపూర్ణముగ నణగును. భోజనానంతరమున వీరు నిద్రింతురు. అపుడు విరాజిల్లునది, పూర్ణనిశ్శబ్దత.

ఇంటికోడలు గర్భిణియై యున్నపుడు ఆమె చేయవలయుకర్మలు యించుమించుగ తగ్గిపోవును. పదినెలలు నిండువఱకు ఆమెచేయవలయుపనులు అల్పమై యుండును. బిడ్డను కనినపిదప ఆమె కర్మను త్యజించును. పసిపాపనుగొనియెత్తి ముద్దాడుచు ఆనందముగ కాలము కడపును. ఇంటియందలి కర్మలను అత్తగారు, ఆడపడచు, మున్నగువారు నెఱపుదురు.

కర్మాంతము కలుగుస్థితి సమాధి. భక్తుడు సమాధి చొచ్చినపిదప, శరీరము తఱచుగ నిలువనే నిలువదు. ప్రజలకు ప్రబోధించుటకు మాత్రము కొందఱు తనువులు నిలుపుదురు. నారదాది మహామును లిట్టివారు. శ్రీచైతన్యుడు మొదలగు నవతారపూరుషులు నిట్టివారే! వీరు స్వార్థరహితులు. ఎండుకట్టె నీటియందు ఎట్లో తేలును. కాకము దానిపై వ్రాలగనే అదిమును

గును. నారద చైతన్యాదులు యిట్టి ఎండుకట్టెలు కారు. వారియం దెంతేని చేవ యున్నది. తాము తేలి ఇతరులను తేల్చ గలరు. "ముక్తిని జేర్ప గలరు."

వేదాంతదృష్టియందు సంసారము మాయామయ మయినది, మిథ్య. అది స్వప్నమును పోలును. పరమాత్మ సాక్షి. జాగ్రత్స్వప్నసుషుప్తియవస్థలు మూడింటికిని సాక్షిస్వరూపుడు. ఒకకథ యున్నది.

ఒకానొక యూరున మిగుల జ్ఞానియైన సేద్యకాడు ఉండెడివాడు. వ్యవసాయమువల్లనే అతడు పొట్ట పోసుకొను చుండెను. అతనికి చాలకాలము కడచినవెనుక నొక కొడుకు కలిగెను. తలిదండ్రులు బిడ్డకు హారియని పేరుపెట్టిరి. లేకలేక కలిగిన కొడుకు కావున తలిదండ్రు లాతని మిగుల గారాబమున పెంచు చుండిరి. కాపు ధార్మికుడు, ఊరివారంద ఱాతని గౌరవించుచుండెడివారు. ఒకనాడు పొలమం దాతడు పనిచేయుచుండ నెవ్వరో వచ్చి బిడ్డకు కలరా వచ్చినదని కబురు వానికి తెలిపిరి. ఇంటికి వచ్చి జనకుడు విశేషచికిత్స చేయించెను. కాని బిడ్డ జీవింపలేదు. ఇంట జేరినబంధుమిత్రుల దుఃఖమునకు మేర లేక పోయెను. సేద్యగాని భార్య లేకలేక కలిగినబిడ్డ చేతినుండి జారిపోవుటచే గోలు గోలున నేడువ దొడగెను. కాని సేద్యకాడు కిక్కురు మనలేదు. ఏమియు జరుగనట్లే యుండి తనపనిమీద తాను పోయెను. తిరిగి వచ్చినపిదపనైన వాని భార్య యారాటము తగ్గలేదు. ఒక్క కన్నీటిబొట్టయిన వీడని మగని జూచి ఆమె 'మీరు కఠినాత్ములు బిడ్డకై ఇంచుకైన చింతిల్లుచుంటలేదు' అనియెను. స్థిరభావమున పొలముకాపు ఇట్లుత్తర మొసగెను. 'నే నేల దుఃఖించుటలేదో తెలుపుమందువా? నిన్నరాత్రినేను చక్కని కలగంటిని. మహారాజు నైనట్లును, ఎనమండ్రుబిడ్డలకు తండ్రి నైనట్లును, పరమానందభరితుడ నైనట్లును, స్వప్నమున గాంచితిని. కొంతసేపటికి మెలకువ వచ్చినది ఏమియు పాలుపోవుట లేదు. ఇపుడు నా ఎనమండ్రుబిడ్డలకై ఏడునా? ఈయొకబిడ్డయైన 'హారి' కి ఏడ్తునా యని తలపోయుచుంటిని?' సేద్యకాడు జ్ఞాని. స్వాప్నావస్థ ఎట్లు మిథ్యయో జాగ్రదవస్థయునట్లే మిథ్యయనియు, నిత్యవస్తు వొక్క ఆత్మయనియు నతడు గ్రహించినాడు. జాగ్రత, స్వప్న, షుషుప్తి, యవస్థలు మూడింటిని నేను గైకొందును. అబద్ధము లని త్రోసివేయుదును.

కామినీ కాంచనములను చేపట్టినపిదప వానియందలి మక్కువ తీరునని సంసారమున మనలువారు అందురు. ఒకమారు బ్రహ్మానందమును చవిచూచిన వారు, ఇంద్రియసుఖములనుగాని అర్థమునుగాని కాంక్షింపరు. వీనిదెస వారి మానసము లేశ పరుగులెత్తవు.

రావణు నుద్దేశించి ఒకడు 'నీవు సీతకై మాయారూపు లెన్నేని దాల్చు చుందువు. ఒకమారు రామునిరూపము ధరించి సీతకడ కేల పోరాదు?' అని ప్రశ్నించినాడు. 'తుచ్ఛం బ్రహ్మ పదం, పరవధూసంగ కుతః' రాముని ధ్యానించితినేని బ్రహ్మపదమే తుచ్ఛమగును. పరస్త్రీసంగమేచ్ఛ ఎట్లు తలయెత్తును' అని రావణుడు ఉత్తర మొసగినాడు.

సాధన భజనము లవసరములు. జగదీశుని ధ్యానించుకొలది సాంసారికములైన సామాన్యభోగములు మనసు నాకర్షింప జాలవు. రాముని పాద పద్మములమీది భక్తి అధికమగుకొలది విషయవాసన తగ్గిపోవును. శారీరక సుఖములు తుచ్ఛములట్ల తోచును. భక్తుడు పరస్త్రీని తల్లివలె చూచును. పశుభావ మంతరించును. దేవభావ మంతరంగమున పొడసూపును. సంసారము మీది మక్కువ తగ్గును. మనుజు డపుడు సంసారమున నిలచినను, జీవన్ముక్తుడై యుండును. చైతన్యదేవునిభక్తులు సంసారమందు బంధరహితులై మెలంగిరి.

సిద్ధివస్తులాభము: దీనినిగుఱించి శ్రీకృష్ణుడు అర్జునునితో ముచ్చటించెను. 'అష్టసిద్ధులం దొకటి, ఒకమనుజుని కున్నచో అతడు నన్నందజాలడు. సిద్ధి యున్న యెడల అహంకార ముండును. లేశమాత్ర మహంకార ముండినను భగవాను నందుట సాధ్యము కాదు.' అని యాత డనెను. లాభాపేక్ష నిష్కామకర్మకు విరుద్ధము. ముక్తికి అడ్డుగట్టు.

ప్రవర్తకుడు, సాధకుడు, సిద్ధుడు, సిద్ధులందుసిద్ధుడు, లేక మహాసిద్ధుడు అను భక్తులున్నారు. ఈశ్వరారాధనమందు ప్రవృత్తుడగువాడు ప్రవర్తకుడు. ఇతడు తిలకము దిద్దును. మాల ధరించును. ఈతనికి బాహ్యాచారము మెండు. సాధకు డీతనికంటె ముందటికు జరుగును. ఈశ్వరు నందవలెనని యాతడు వ్యాకుల పడును. హృదయపూర్వకముగ ఈశ్వరు నతడు సంబోధించును. ఆతని కీర్తించును. పవిత్రాత్ముడై ప్రార్థించును. నిశ్చయాత్మికబుద్ధి గలవాడు సిద్ధుడు. ఇత డీశ్వరదర్శన మందగలడు. సిద్ధులందు సిద్ధుడు జగదీశుని దర్శనలాభమును

మాత్ర మంది యుండదు. ఆతనితో నీతడు ప్రసంగించును. మధురసంభాషణ మున నాతడెంతేని యానందము నందును.

సాకారమును గురించిన యభిప్రాయమందు గాని, నిరాకారమును గురించిన యభిప్రాయమందుగాని, మానవుడు దృఢవిశ్వాసము గలిగి యుండవలెను. అట్టివిశ్వాసమున్నపుడే అతడీశ్వరు నందగలడు. లేకున్న నందజాలడు. మనుజుడు సాకారవాది యైన నేమి! నిరాకారవాది యైన నేమి? తీయని రొట్టెను చిదిపి తినిన నేమి? కొరికితినిన నేమి? అది తియ్యగనే యుండును. కాని గట్టినమ్మిక ముండవలెను. ఆతురపాటున భక్తుడు భగవంతుని పిలువవలెను. విషయలాలసుల ఈశ్వరభక్తి చిత్రమైనది. కుఱ్ఱడు ఆడుచు 'దేవుని తోడు' అనునట్లు విలాసపురుషు డొకడు పుష్పవనమందు విహరించుచు నొక పుష్పము గోసి 'ఈశ్వరు డెంతసుందరమగు పుష్పమును సృష్టించినాడో' యను నట్లు వీ రీశ్వరనామము నుల్లేఖింతురు. వీరిభక్తి క్షణికము: తప్తలోహము మీద బిందువును బోలును. మునుగనిదే సముద్రమందలి రత్నములు చిక్కవు. నీటిపై నూరక దేలిన ప్రయోజనమేమి.

ఈశ్వరనామమున నెంతేని మహత్త్వ మున్న దని శ్రీచైతన్యు డనుచుండువాడు. ఈమహత్త్వము, యీమహాబలము, గోచరించుట కాలస్యము పట్టినను పట్టును. ఒకయింటిగోడపై యజమాని మంచిబీజము నుంచెను. కొన్నాళ్ల కాగృహము నేల గూలెను కాని నేలబడినవిత్తనము మొక్కయై కాలక్రమమున వృక్షమై, పండ్ల నిచ్చెను.

సంసారులందు సత్త్వరజస్తమోగుణములు కలవారున్నట్లే భక్తులందును నీగుణము లున్నవా రున్నారు. సంసారులందలి సత్త్వగుణసంపన్నుడు దయాళుడు, అమాయకుడు, శాంతివంతుడు, పరహితకాంక్షి, వేషభాష లెఱుగడు. అక్కరైనమెతుకులనే నోట బెట్టుకొనును. ఏయొక్క పుట్టముతోడనో కాలము గడుపును. గృహశృంగారముకొఱకు మక్కువ పడడు. గృహస్థితి యెట్లున్నదో యని లక్ష్యింపనైన లక్ష్యింపడు.

సంసారులందలి రజోగుణసంపన్నుడు శృంగారమును కాంక్షించును. వేషభాషలపై నీతనికి ప్రీతి మెండు. రెండుమూడుంగరములు, గడియారము, బంగారు గొలుసు మున్నగు వస్తువుల నీతడు దాల్చును. పెద్దపెద్ద పటములచే

సీతకు గోడల నలంకరించును. గోడలపై నొక్కమచ్ఛమైన సుందనితీరున నతడు వెల్ల వేయించును. ఇతడు చక్కని వలువలు కట్టును. సేవకులచే కూడ సీత డస్త్రే కట్టించును.

సంసారులందలి తమోగుణపీడితుడు నిద్రకు కామక్రోధములకు, దురహంకారమునకు, దాసుడై యుండును.

భక్తులందలి సత్వగుణసంపన్నుడు జగదీశుని రహస్యముగ ధ్యానించును. ఒకరిని పొగడి యీతడు డబ్బు సంపాదింపడు. ఎట్లో ఒకతీరున పట్టెడన్నమును కుడుచును. రేబవలులు మనసును కృష్ణచరణములకు లగ్నము చేసియుంచును రజోగుణయుతుడైనభక్తుడు భక్తియుక్త బాహ్యాఆడంబరము కాంక్షించును. ఇతడు కడుచక్కగ తిలకము దిద్దును. రుద్రాక్షమాలలను దాల్చును. రుద్రాక్షలం దొకటి బంగారుపూత గలిగియుండును. చక్కని పీతాంబరమును గట్టి యీతడు పూజ చేయును.

భక్తులందలి తమోగుణపీడితుడు, అహంకార, అహంభావములను, విడువజాలనివాడై యుండును.

జగదీశుని లీల లనంతములు. రావణవధానంతరము శ్రీరాముడు లంక యందు ప్రవేశించెను. వృద్ధస్త్రీయొకతె శ్రీరాముని జూచి పర్విడ సాగెను. ఆశ్చర్యాన్వితుడై లక్ష్మణుడు రామునుద్దేశించి "అన్నా! యీముసలిది ఎందఱు బంధుగులనో గోల్పడియుండును. ఈమె కొడుకులును, మనుమలును, యుద్ధమున మడసియుందురు. ఈవృద్ధనారి కింకను ప్రాణములపై నెంతతీపి యున్నదో పరికింపుము." అనియెను. ముసలిదానికి అభయదాన మొసగి రాము డాదరపూర్వకముగ నామెను చెంతకు చేరబిలిచి ఆమె పలాయనమునకును భయమునకును కారణ మెద్దియని ప్రశ్నించెను. ఆమె చేతులు జోడించి ఇట్లుత్తర మొసగెను. 'ఇంతకాలము నేను జీవించి యుంటిని కావున నీలీలలను చూచితిని. ఇంకను నీలీలల నెన్నింటినో చూడవలెనని మక్కువ పడుచున్నాను అందుచే ప్రాణములు నిలుపుకొన నువ్విళ్ళూరుచుంటిని.'

మానవునకు జన్మాంతర మున్నదని వింటిని. తక్కువబుద్ధి గలవారము మన మీశ్వరుని బుద్ధి నెట్లు గ్రహింపగలవారము? పలువురు జగదీశుని గుఱించి బహుశతాబ్దములనుండి చెప్పుచు వచ్చినదానిని మనము విశ్వసించు

చున్నాము. రణభూమిని గూలినభీష్ముడు అంపశయ్యపై పరుండియుండ శ్రీకృష్ణుడును, పాండవులును, చెంత నిలిచిరి. భీష్మునికన్నులనుండి బాష్పవారి స్రవింప దొడగెను. శ్రీకృష్ణుని విలోకించి అర్జునుడు 'బావా! యిదేటి వింత తాత సత్యవ్రతనిష్ఠుడు, జితేంద్రియుడు, మహాజ్ఞాని, అష్టవసువులం దొక్కడు; అట్టి భీష్ముడు యిదేమి? అవసానకాలమున కన్నీరు రాల్చుచున్నాడు.' అని ప్రశ్నించెను. అర్జునుని ప్రశ్నను కృష్ణభగవానుడు భీష్మున కెఱింగించెను. ముకుళితకరకమలుండై భీష్ము డిట్లని యుత్తర మొసగెను. 'కృష్ణా! నేను కన్నీ రేల వీడుచుంటినో నీవు బాగుగ నెఱుగుదువు. పాండవులకు స్వయముగ భగవానుడే సారథియై సహాయ్యము సలుపుచున్నను, వారికష్టములును, దుఃఖములును, అంత మగుచుండుట లేదు, జగదీశునిక్రియలం దెట్టిభావమున్నదో గ్రహింప జాలనైతినని దుఃఖించుచుంటిని.

ఈశ్వరు డనంతుడే కాని అతడు తలచినచో తనయందలి సారమును, మనుజున కీయగలడు. అత డపు డవతారమూర్తియై గోచరించుచుండును. ఈయుద్భూతవిషయమును మనము ఉపమానమువలన సరిగా తెలిసికొనలేము. దానివలన ఇంచుక తెల్లమగును. గోవుయొక్క కొమ్ములను తాకిన గోవును తాకి నట్లే. పాదములను ముట్టినను, తోకను తాకినను, గోవు నంటినట్లే. గోవు యొక్క సారపదార్థము క్షీరము. పాలవలన గోవును గుర్తింతుము. అనంతుడైన జగదీశుడు మనుష్యరూపునందు తోచి మానవుని ఊహకు లొంగుచున్నాడు.

ఈశ్వరుని సంపూర్ణముగ గ్రహించుట ఎవరికి తరము? అట్లు గ్రహింప వలెనను మక్కువమాత్ర మెందులకు? ఆతని యవతారమును చూచినంతనే యాతని జూచి నట్లే గంగానది కరిగి అందలిజలమును స్పృశించునాతడు గంగ నంటి వచ్చితి నని చెప్పడా? అట్లనిన గంగనంతను గంగోత్రినుండి గంగా సాగరమువఱకును గల గంగానదినంతను అతడు ముట్టివచ్చె నని యూహింప దగునా?

సాగరము కడ కరిగి అందలినీరము లించుక స్పృశించితి మేని మహాసముద్రమును స్పృశించినట్లేక దా? అగ్ని అన్నిచోటులం దుండును. కాని కాష్ఠమందు అధికముగ నుండును. ఈశ్వరతత్త్వము మనుజునం దధికముగ

తెలియబడును. ఎవ్వాడు మహాభక్తుడై ఈశ్వరప్రేమయందు మునింగి ఈశ్వరుని కొఱకు రాత్రింబగళ్లు తపించియుండునో ఆతనియందు నిశ్చయముగ జగదీశు డవతీర్ణు డాయెనని, గ్రహింపుము.

ఈశ్వరుడు మనసునకు గోచరుండు కాకుండుట నిక్కము. కాని శుద్ధ మానసులకు గోచరు డగును. ఈబుద్ధి కాతడు చూపట్టడు. శుద్ధబుద్ధికి చూపట్టి తీరును. కామినీకాంచనములమీది వాంఛ తొలగిపోయినయెడల శుద్ధమాన నము సుసాధ్య మగును. శుద్ధబుద్ధి యలవడును. అపుడు శుద్ధమనమును, శుద్ధ బుద్ధియు, నొకం డగును. మహాఋషులు ఆతని దర్శింపగలరు.

అహంకారము పోకున్న జ్ఞానము కలుగదు. 'నేను నాది' యనునవి అజ్ఞానమునకు సంబంధించినవి. 'నీవు నీది' యనునవి జ్ఞానమునకు సంబంధించి నవి. నిజమగు భక్తుడు భగవంతు నుద్దేశించి 'హే ఈశ్వరా! నీవు యజమాను డవు. నేను సేవకుడను. నాది యనునది ఏదియును లేదు, నీ యిచ్చవచ్చిన తెఱగున నన్ను నడపుము.' అని పలుకును.

ఏకో కొంతగ్రంథపరిశీలన మొనరించి అనేకు లహంకారపూరితు లయ్యెదరు. ఇంచుక సంపత్తిగలవారియందుగూడ అహంకారము తోచును.

దక్షిణేశ్వరమున నొకపాకీయాడుది యుండెడిది. ఆమెశరీరమున నొకటిరెండునగ లుండెడివి. ఒకనా డామె నడచుచుండు మార్గమున సమీప ముగ నొకరిద్దఱు చనుచుండిరి. 'పొండు, దూరముగాపొండు' అని పాకీమనిషి వారిని కసరికొట్టినది. ఇక నొరులమాట ఏమి చెప్పుదును.

నీకు మామిడిపండు మిగులనిష్టముకదా! తోటలో నెన్ని చెట్లున్నవో, ఎన్ని వేలకొమ్మ లున్నవో మఱెన్నికోట్ల ఆకులున్నవో నీ కేల, నీకు కావలసిన నది మామిడిపండు. దానిని తిని నీ వారిని నీవు పొమ్ము. ఈశ్వరసాధనమునకై నీవు మానవజన్మ మెత్తితివి, ఈశ్వరచరణసరోజములపై మనసు నిలుప ప్రయత్నింపుము. ఇంచుకసుర త్రాగినంతనే మత్తిల్లు నీవు అంగడియం దెంత సుర యున్నదో అడుగ నేల.

నీభారమునంతయు ఈశ్వరునిపై పడవేయుము. పాపమునకు శాస్తి యున్నదో లేదో, అతడే చూచుకొనును. ఆతనిమనసున నే మున్నదో, ఆతడే ఎఱుగును. ఆతనిగుఱించి విమర్శింప నేల. ఈశ్వరునియందు వైషమ్యదోష

మున్న దని కొంద అందురు. కొందఱిని సుఖులను జేసి మఱికొందఱిని దుఃఖమున కూలఁద్రోయుననట. తమమనసులం దున్నదాని నీశ్వరమానసమున చూతురు. మనుజుడు తనదోషములను జగదీశునితలకు చుట్టును. ఈశ్వరునకు పక్షపాతబుద్ధి లేదు.

ఆచార్యా! తండ్రీ! కర్తా! అనియితరులు నన్ను సంబోధించునపుడు యీపదములు ముండ్లవలె నన్ను గ్రుచ్చుకొనును. నేను జగదీశుని బిడ్డను. నన్ను తండ్రీ! యనిపిలుచు టేటిపాడి? సచ్చిదానందస్వరూపుడుతక్క ఇతరు లెవ్వరును ఆచార్యులు కారు. ఆచార్యత్వము చేయుట సామాన్యత్వము కాదు.

ఒకనాడు చాలతప మొనరించెను. భగవతి తృప్తి జెంది వరము కోరుమనియెను. 'అ దరత్తితో బంగారుకంచమందు కడుపార భుజింపవలె నని కాంక్షించుచున్నాను. ఈవరము దయచేయుము' అని యాతడు పలికెను. ఆ యొకవరమందు ఆమహాశయుడు నాతిని, ఐశ్వర్యమును, దొడ్డదైన భోజనమును యిమిడ్చివేసినాడు. మనస్సునుండి ఇవి తొలగినగాని మానవు డీశ్వరు నందజాలడు.

శిశువు భూమిపై పడి "నేను గర్భమునందుంటిని. యోగమున లగ్నమై యుంటిని. ఇపుడెచటికి వచ్చితిని? ఈశ్వరపాదపద్మములను ధ్యానించుచుండువాడను. ఇపుడిందు పడితిని" అని విలపించును. ఈశ్వరధ్యానమే ఆనందదాయకము.

సంసారమునందుండకన్న నెందుండెదవు? ఎందరిగెదవు? నే నెందున్నను శ్రీరాముని అయోధ్యయందున్నట్లే భావింతురు. ఈ జగత్సంసారము శ్రీరాముని అయోధ్య. గురువునొద్ద జ్ఞానలాభము పొందినపిదప శ్రీరాముడు తాను సంసారమును విడుతు ననినాడు. వేగిరపడి దశరథుడు వశిష్టుని పిలిపించినాడు. తీవ్రవైరాగ్యభావము శ్రీరామునియందుదయించినట్లు గురువర్యుడు తిలకించి యిట్లనియె. రామా! నా పలుకులు తొలుత విని పదంపడి సంసారమును త్యజింపుము. సంసారము ఈశ్వరున కవ్వలనున్నదా? ఉన్నచో దానిని త్యజింపుము." ఈశ్వరుడే జగత్తును జీవములును నైనాడని శ్రీరాముడు గుర్తించి తనపట్టు వదలినాడు.

సంసారమం దుండియే మానవుడు కామక్రోధాదులతో యుద్ధము సలుప వలెను. అనేకవాంఛలతో సతతము రణమొనరింపవలెను. గృహమునం దుండియే యీసమరము సలుపుట యుచితము. గృహమం దన్నము లభించును. ధర్మ పత్ని పలు తెఱగుల తోడుపడును. కలియుగమున మానవు డన్నగతప్రాణి. అన్నముకొఱకై పలుతావులు తిరుగుటకంటె నొకే తావున నుండుట మంచిది.

సంసారమునం దుండుమానవుడు ఝంఝూనిలమునకు గుఱియగు ఆకు వలె నుండును. తీవ్రమైనగాలి పత్రమును ఒక్కొక్కపుడు మేడమీదికి ఎగుర గొట్టును. వేఱొక్కపుడు తుక్కుగుట్టయందు విడుచును. గృహస్థుని నేడు మంచిచోటు నందుంచి రేపు యింతకంటె మంచితావున నది నిలుపును. సంసా రమున నిలిచిన మనుజుడు సర్వమును జగదీశునికి సమర్పింపవలెను. ఆకడిట్లు ఆత్మసమర్పణ మొనరించెనేని అంతరంగమున నెట్టిబాధయు నెఱుంగకుండును. అంతయు రామేచ్ఛయను విశ్వాసమున కాతడు మనస్సున దృఢమైన చోటివ్వ వలెను.

ఒకయూరున నొక సాలివాడుండెను. అతడు మిగులధార్మికుడు. నిష్క ల్మషచరిత్రుడు. భక్తుడు. ఊరివారందఱు ఆతనిపై నెంతేని మక్కువగలిగి యుండిరి. సంత కరిగి యతడు తాను నేసినబట్ట లమ్ముచుండును. ఎవ్వరేబట్టలు కొనుటకై యాతని దరి కరిగినపుడు సాలె యిట్లనుచుండువాడు. “దారము ఖరీదు పండ్రెండణాలు; రామునియిచ్ఛ; నేతకూలి మూడణాలు; రాముని యిచ్ఛ; రంగునకైన ఖరీదు ఆఱుపైసలు; రామునియిచ్ఛ; మొత్తము గుడ్డ ఖరీదు పదునేనుఅణాలనర.” ఇక నాతనితో బేరమాడక వారు వెంటనే ఆ వస్త్రమును తీసుకొనుచుండువాడు. రాత్రులందు అన్నముభుజించి చండీమండ పమున కరిగి చాలసేపటివఱకు అచట భజనచేయుచుండెడివాడు. ఒకనాడర్ధ నిశీథిని కడచినపిదప మండపముపై కూర్చుండి మెల్లగ పారాయణము చేయుచు మధ్య మధ్య హాకొ్క పీల్చుచుండెడివాడు. అపుడు మండపము దరినుండి కొందఱు బందిపోటు దొంగలు పోవుచుండిరి. దొంగలు కొక కూలివాడు అవ సరమయ్యెను. తమతోరమ్మని వారాతని చేయిపట్టుకొని క్రిందికిలాగిరి. రాముని యిచ్ఛయనుచు సాలెవాడు దిగినాడు. బందిపోటులు వాని నీడ్చుకొనిపోయిరి. రామునియిచ్ఛయనుచు సాలెవాడువారివెంట జనెను. బందిపోటులు ఒకగృహ

స్థుని యింటపడి కొంతధనమును దీసి మూటను సాలెవానితలపై పెట్టిరి. ఇంతలో అల్లరిజరిగెను. రక్షకభటులు వచ్చిరి. దొంగలు కాలుకొలది పరుగెత్తిరి. మూట నెత్తినిడుకొనిన సాలెవాడు నిలచిపోయెను. వానిని భటులు పట్టుకొనిరి. రాముని యిచ్ఛయనుచు యతడక్కడే నిలువంబడెను. నాటిరాత్రి భటులు వానిని కొట్టునందు బంధించియుంచిరి. రాముని యిచ్ఛయనుచు నాడుచు పాడుచు నతడు రాత్రియంతయు కారాగారమున గడపెను. మఱునాడు న్యాయాధికారి సమ్ముఖమునకు విచారణనిమిత్తము సాలెవాడు తీసికొని పోబడెను. ఈ వృత్తాంతము వినిన గ్రామవాసులు ఆశ్చర్యపడి న్యాయస్థానమును జేరుకొనిరి. ఊరువారందఱు న్యాయాధికారి నుద్దేశించి "ఈతఁడు పవిత్రచరిత్రుడు; మహాభక్తుడు. ఇట్టి దారుణకృత్యమును నీతడు సలిపియుండడు." అనిరి. న్యాయాధికారి వారి వాక్కులు విని మిగుల నచ్చెరువొంది "ఏమోయి! ఏమిజరిగినదో చెప్పుము" అని సాలివాని నుద్దేశించి పలికెను. సాలె జరిగినదంతయు నిట్లెకరువుపెట్టెను. "హుజూర్! రామునియిచ్ఛ; నేను రాత్రి అన్నము తిన్నాను; రాముని యిచ్ఛ. మండపమునకు పోతిని; రామునియిచ్ఛ. భజనసలిపితిని; రాముని యిచ్ఛ. ధ్యానించుకొన్నాను; రామునియిచ్ఛ. పారాయణము చేసికొన్నాను; రామునియిచ్ఛ. హుక్కాపీల్చుచుంటున్నాను; రామునియిచ్ఛ. అప్పుడెవరో గుంపువాండ్రువచ్చి నన్ను మండపమునుండి హఠాత్తుగా క్రిందికిలాగిరి; రాముని యిచ్ఛ. బరబర కూడలాగుకొనిపోయిరి; రామునియిచ్ఛ. వారొకగృహస్థుని యిల్లుదోచిరి; రామునియిచ్ఛ. మూట నాతలపై బెట్టిరి; రామునియిచ్ఛ. దొంగలు పాఱిపోయిరి; రామునియిచ్ఛ. అపుడు పోలీసులువచ్చి నన్నుబట్టుకొనిరి; రామునియిచ్ఛ. నన్ను ఖైదులో నుంచిరి; రామునియిచ్ఛ. ఇపుడు యేలినవారి యెదుటికి నన్నుదీసికొనివచ్చిరి; రామునియిచ్ఛ." అపుడమాయకుడును సత్యవాదియునైన సాలెవానిని విడిచిపుచ్చుడని న్యాయాధికారి భటులకు హుకుమొసగెను. 'రామునియిచ్ఛ, యేలినవారు నన్నువదలివేసిరి' అనుచు సాలెవాడు న్యాయస్థానము విడిచి తనయింటికి పోయెను.

సంసారము చేయుటయు సన్న్యాసము స్వీకరించుటయు మఱేమిచేయుటయు రాముని యిచ్ఛ. అందుచే మానవుడు భారతమంతయు భగవంతునిపై బడవైచి తనపని తాను నిర్వహింపవలెను.

ఈకథయందలి సాలివానిని పరికింపుఁడు. బందిపోటు దొంగలు పట్టినపుడు అతడు బాధపడలేదు. బందెగృహములో బంధింపబడినపుడు గోలు గోలున నేడువలేదు. నమ్మినరాముడు తనను చూడక నిర్లక్ష్యము చేసెనని తన కష్టము ముప్పు నాతడు తెచ్చిపెట్టెనని యాతని నిందింపలేదు. తనకాపదకలుగుట రాముని యిచ్ఛయని నమ్మినాడు. పిమ్మట విడుదలయై తాను స్వేచ్ఛనందుటయు రాముని యిచ్ఛయని యేమియు జరుగనట్లు తన గృహమునకు తరలినాడు. ఆ తొలుతటి కష్టమునకు చింతింపలేదు. తరువాతి సుఖమునకు సంతసింపలేదు. అంతయు రామునకు చెందినదనియు సర్వము రాముని యిచ్ఛానుసారముగా జరుగుచున్నదనియు అతడు గట్టిగ నమ్మినాడు. ఆతని దృఢవిశ్వాసమే, ఆతని కాపాడినది. ప్రజలయం దతనిని మిన్నజేసినది.

తనను నమ్మినవానిని జగదీశుడు బ్రోచితీరును; అనియు ఎట్టి గొప్పకష్టములైనను దైవభక్తుని నేలయందు పూడ్చివేయవనియు మనశాస్త్రములన్నియు తెలుపుచున్నవి. ఈశ్వరుని ప్రత్యక్ష కరుణనుగుఱించిన దృశ్యము లెన్నెన్నియో మన పురాణములందు వర్ణింపబడినవి. మానము కాపాడుమని ద్రౌపది సభాంగణమున పెట్టిన మొఱ విని శ్రీకృష్ణుడు ఆమెను కాచినాడు. విపద్దశయందున్న గజేంద్రుని కాచినాడు. ప్రహ్లాదుని బ్రోచినాడు. మార్కండేయుని కాపాడినాడు. ఇటీవల రామదాసుని రక్షించినాడు. ఇట్టి ప్రత్యక్షప్రమాణములు నేడు కానరావు. పురాణములందలి సంఘటనలు ప్రత్యక్షముగ జరిగినవియా యని నేడు మనలో పలువురకు సందియము కలుగవచ్చును. ఈసంఘటనలు ప్రత్యక్షములు కాకపోవచ్చును. కాని యవి అబద్ధములు కాజాలవు. వేదములయందలి వేదాంగములయందలి సత్యములను తత్వశాస్త్రవిషయములను ఆధ్యాత్మిక విషయములను వ్యాస వాల్మీకులు జనసామాన్యుల హృదయముల నాకర్షించుటకు నూతన సాహితీరూపమున వివరించిరి. ఉపన్యాస మందఱకును తెలియదు. హరికథ యెల్లఱకును తెలియును. వ్యాసమందఱకును తెలియదు. కథయెల్లఱకును తెలియును. భాషాలంకారములు భావప్రకాశమునకును చదువరుల హృదయముల నాకర్షించుటకును కవి యవలంబించు మార్గములు. అంతియే గాని విషయములు మాత్రము జరిగినవియేయని మనము నమ్మవలెను.

ఇసుమల పడినవారిని రక్షింపవలెనని భగవంతుడు ప్రాచీనయుగము లందు ఆతురపడుట నిక్కము; ప్రస్తుతయుగమునందును నట్లాతురపడుట వాస్తవము; భావియుగమునందునుగూడ నట్లే ఆతురపడుట నిజము. గతించిన కావ్యకర్తలు యీవిషయములను సొంపుగూర్చి తమ రచనలయందు చోద్యముగ వర్ణించిరి. నేటి కావ్యకర్తల వర్ణనలు వేఱువిధమునున్నను ప్రాచీనపద్ధతుల ననుసరించినను ఈసత్యమునే వ్యక్తీకరించును. భావి గ్రంథకర్తల వ్రాతలను నట్లేకావించును; కాని సత్యమెన్నడును సత్యమే. నేను జగదీశుడు భక్తులను బ్రోచుచున్నాడనుటకు ఈసాలివాని కథయే తార్కాణము. ఈసత్యమునే తెలుపు కథ లెన్నేని కలవు.

ఈకథను చదువుతఱి గమనింపవలసిన విషయ మింకొకటికలదు. దైవేచ్ఛ, రామునియిచ్ఛ, అని భారమునంతను ఈశ్వరార్పణ మొనరించి తన యిచ్ఛాశక్తికి దిగదుడుపు పెట్టరాదు. దైవేచ్ఛకు తనయిచ్ఛను లగ్నమొనరించి జగదీశుడు తనకిచ్చిన కన్నును బుద్ధిని ప్రయోగించి యిక డగ్రసరుడు కావలెను. దేవుడిచ్చిన కాలుచేతులను పగ్గముతో కట్టివేసికొని ముక్కుమూసికొని నవరంధ్రములను బిగించి నేసి ఫలి విూదికుఱుకుచున్నను పలుగాకి పైబడి తినుచున్నను రామేచ్ఛయని మిన్నకొనరాదు. విశ్వాసము మానవుని కాత్మోన్నతి నిచ్చును. కాని మూఢవిశ్వాసము మనుష్యుని మఱింత లోతుగ నవిద్యా కూపమున కూలద్రోయును.

ఒక వణిజుడు కారాగృహమున కరిగెను. శిక్షముగిసపిదప అతడు ఇందందు నాట్యముచేయునా లేక తన తొంటివృత్తిని నల్పుకొనునా ?

సంసారి యొకడు జీవన్ముక్తు డయ్యునేని ప్రబంధనమునకు కట్టుపడక సంసారమందు వసింపగలడు. ఎవ్వానికి జ్ఞానలాభము కలిగెనో ఆతని కీచోటనియు, నాచోటనియులేదు. అతనికన్నియు సమానములే.

భక్తి, వివేకము, వైరాగ్యము, దయ మున్నగు సత్త్వగుణముల నలవఱిచి కొనినగాని మానవు డీశ్వరు నందజాలడు. రజోగుణమందు క్రియాడంబరముండును. కావున నందుండి తమోగుణము పుట్టును. కర్మను పూర్తిగ విడుచుట సాధ్యముకాదు. మనుష్య ప్రకృతి మనుజునిచే కర్మచేయించును. కావున కర్మఫలముపై కన్నువేయక అతడు తనపనిని తాను నెఱపుకొనవలెను.

జపతపములుగాని, పూజలుగాని, మనుజుడు ప్రజల గౌరవము కోరికును, పుణ్యముకోఱకును చేయరాదు. ఫలము కాంక్షింపక చేయబడు కర్మ, కర్మ యోగ మనబడును. ఇది మిక్కిలి కఠినమైనది. కలియుగము నందిట్టి యోగము ననుష్ఠించుట కష్టము. ఫలాపేక్షలేక చేయగలనని మానవుడు తలప వచ్చును. కాని ఎందుండియో వాంఛ వచ్చి మనసున ప్రవేశించితీరును. 'వ్రతములు సల్పితిని, ఉత్సవము నెఱపితిని, పలువురు బీదసాదలకు కూడుపెట్టితిని, ప్రతి ఫలమును కోఱనైతిని' అని ఒకడనుకొన వచ్చును. కాని ప్రజాగౌరవము నడగలవాంఛ యీతని హృదయమున కెక్కియుండును. ఎవ్వాడీశ్వరుని దర్శింప గలిగినాడో అతడు నిష్కామకర్మను నెఱపగలడు.

ఈశ్వరుని దర్శింపజాలనివారు అవలంబింపవలసిన ఉపాయము—భక్తి యోగము వారికి శరణ్యము. ఈశ్వరనామసంకీర్తనము, హృదయపూర్వకమైన ప్రార్థనము కలియుగమున మానవునకు శరణ్యము. "ఏ ఈశ్వరా! నాకర్మలను తగ్గించివేయుము. తప్పకచేయవలయు దానిని వాంఛారహితుడనై చేయు నట్లు ప్రసాదింపుము" అని యాతడు భగవంతుని వేడుకొనవలెను. భక్తియో గమువలన వాంఛ తనంతతాను తొలగిపోవును. చెఱకుపానకము త్రాగిన తరు వాత నొకడు తాటిబెల్లపుపానకము నపేక్షించునా?

కావున భక్తియోగసాధన మొనరించి ముందునకరిగితివేని ఈశ్వరుడే నీవందవలయు నిత్యవస్తువని గ్రహింపగలుగుదువు. ఒక కథ వినుము. ఒక యూరిసం దొకడు కట్టెలుకొట్టుకొని జీవనము గడపుకొనుచుండెను. కట్టెలు కొట్టుకొనుటకై మామూలుప్రకారముగా నొకనాడు అడవికరిగినాడు. వన మార్గమునం దొకబ్రహ్మచారి అతనిని కలిసికొని, 'ఏమోయీ! మరింత ముందునకు పొమ్ము'అని వానితో చెప్పెను' కట్టెలవాడింటికి మరలివచ్చి బ్రహ్మ చారి తనతో నట్లేల తెలిపెనో యని యోజింపదొడగెను. కొన్ని దినములు గడచిపోయెను. ఒకనాడాతనికి బ్రహ్మచారిపలుకులు జ్ఞప్తికివచ్చెను. నేను నేను కొంచెము ముందుకునకు పోవుదును అని నిశ్చయించుకొని వనమునకరిగి మను పటికంటె కొంత ముందునకరిగినాడు. అచట అసంఖ్యాకములై మహోన్నత ములైన మంచిగంధపుచెట్లు అతని కన్నులపడెను. చందనపుకలపను మిక్కి

లిగా నరుకుకొనిపోయి దాని నతడు విక్రయించెను. ఎంతో ధనమును అతడు సంపాదింపగలిగెను.

కొన్ని దినములు కడచిపోయెను. బ్రహ్మచారివాక్కు మరల నాతనికి జ్ఞప్తికివచ్చెను. వనమునకు పోయి మఱికొంత ముందున కరిగెను. ఒక నది యొడ్డున పెద్ద వెండిగని యొకటి యాతనికి దృగ్గోచరమయ్యెను. తన కంతవెండి కన్నులబడునని యాతడెన్నడును కలలోనైన తలంచియుండలేదు. చాలవెండిని త్రవ్వుకొనిపోయి అతడు దానిని విక్రయించి విశేషధనమును చేత బట్ట గలిగెను.

మఱికొన్ని దినములు గడచిపోయెను. "బ్రహ్మచారి వెండి గనివఱకు మాత్రమే పొ" మ్మని నాతో చెప్పియుండలేదు. "మఱింత ముందున కరుగు" మని యాతడుద్బోధించియున్నాడు. కావున నట్లేయొనరింతునని యాలోచించుకొని తోడనే యాతడు కదలిపోయినాడు. దొలుత తానుచూచిన నదివినాటి అవ్వలికరిగినాడు. అచట నాతనికొక బంగారుగని కనుపించెను. మిక్కిలి సంతోషించినవాడై యా 'కట్టెలవా' డప్పుడు నృత్యమొనరించినాడు. కావుననే బ్రహ్మచారి నన్ను 'మఱింతముందునకు పొ' మ్మనినాడు. అని యనుకొని యెంతేని బంగారము వెంటగొనిపోయి అమ్ముకొని విశేషముగ నైశ్వర్యమును గణించినాడు.

ఇంకొకసారి యాతడు మఱింతముందున కరిగి వజ్రములరాశిని గాంచి దానివలన కుబేరుడైనాడు.

కావున మనుజుడు మఱింతముందున కరుగవలెనని చెప్పుచున్నాను. అరిగినకొలది యాతడు మంచివస్తువులను కాంచును. ఇంచుక జపమొనరించి అధికుడనైతిననియు, జరుగవలసినది జరిగెననియు నతడెన్నడును తలంపరాదు. మఱింత ముందున కరిగినపుడు కర్మ నిష్కామకర్మకాగలదు. అగ్రపురుడైన కొలది మానవుడు జగదీశుని సందర్శించి యాతనితో ప్రేమాలాపములు లాడ గలడు.

మనుజు డీశ్వరుని సమీపించుకొలది యాతనికి నామరూపములు లేవని గ్రహింపగలుగును. ఇంచుక వెన్కకు తిరిగి చూచిన మరలశ్యామాంగిమైన తల్లి యట్లాతడు గోచరించును. గరికపువ్వుల లీల ఆమెయంగు పొడగట్టును. సమీప

వర్తికి గోచరించునది ప్రకృతియో పురుషుడోయను గుర్తు తెలియకుండును. ఒకానొక భక్తుడు పూజచేయుచుండెను. పూజచూడదలచి వచ్చిన పెద్దమనిషి యొకడు దేవిమెడయందు యజ్ఞోపవీతమును చూచి యచ్చెరువునొంది 'తల్లి కంఠమున జందెపుపోగులు వేసితివేమి?' యని భక్తునడిగెను. 'సోదరా, నీవు తల్లిని గుర్తించితివి. నేనింకను గుర్తింపజాలనైతిని. ప్రకృతియో పురుషుడో యెఱుంగనైతిని అందుచే తల్లి మెడయందు యజ్ఞోపవీతము వేసితిని" అని భక్తుడుత్తరము చెప్పెను.

శ్యామాంగియైన తల్లియే బ్రహ్మ. సగుణుడే నిర్గుణుడు. రూపముగల వాడే రూపములేనివాడు. బ్రహ్మయే శక్తి. శక్తియే బ్రహ్మ. భేద మేమియు లేదు. సచ్చిదానందమయుడే సచ్చిదానందమయి.

సంసారభోగములైన వెనుక మనుష్యప్రాణి మోక్షమునకై వ్యాకుల పడును. ఆతని నెల్లు బడయగలుగుదునని మానవుడు సదా యోచించు చుండును. జగదీశుని సాన్నిధ్యమున సతని నవలీలగ జేర్చునది భక్తియోగము.

నేను పాపిననుభావము క్రైస్తవమతములోనిది. ఒక మిత్రుడు బైబిలు గ్రంథమును కొంతచదివి నాకు వినిపించినాడు. 'పాపము, పాపము' అను పదమే నాకు వినంబడినది. నేనుచ్చరించునది ఈశ్వరనామము. రాముడనిన నేమి; హరియనిననేమి. మఱేమనిననేమి. ఈశ్వరనామ ముచ్చరించినపిదపగూడ నాకు పాపముండునా? నామమహాత్మ్యమందు విశ్వాసముండవలెను. భగవా నుని ప్రేమించితివేని నీకావిశ్వాసము అలవడును. ఇట్టి ప్రేమకై ఈశ్వరధ్యాన మొనరింపుము. ఆత్మబంధువుగాని భార్యగాని వ్యాధిచే పీడింపబడినపుడు మానవుడు మిగుల తొట్రుపాటు చెందును. ఎంతేని ద్రవ్యము వెచ్చబెట్టును. ఎంతయేని పరిచర్య సలుపును. మిగుల దుఃఖించును. ఈశ్వరునికొఱకై విల పించువారెవరు? పలువురు జనకుని పేరుచ్చరింతురు. ఊరక జనకుని నామ ముచ్చరించిన జాలదు. క్రమానుష్ఠానమునగాని మానవుడు జనకుడు కాలేడు. ఒకానొక వ్యక్తి ఆంగ్లమును కడుచక్కగా వ్రాయునని జనులందురు. ఒక్క నాడే ఆతడట్టి శక్తినందెనా? ఆతడు నిరుపేదయింట పుట్టినాడు. ఒకరియింట కొంతకాలము వంటచేసి పొట్టపోసికొనువాడు. ఎన్నోపాట్లుపడి చదువు సంధ్యలు నేర్చుకొనినాడు. పదంపడి చక్కని రచనమున నాఱితేఱినాడు.

వికారముచే బాధపడువానికి చింతపండుపచ్చడి, పచ్చిపులుసు మందు లగునా? విషయవికారపీడితునకు, భోగేచ్ఛలు యీ పచ్చడి పులుసులవంటివి. విషయతృష్ణకు అంతములేదు. తృష్ణను రేకెత్తించు నీ వస్తువులు లేనిచోటున మనుజుడు వసింపవలెను. జగదీశుని పొంది ఆతని కరుణపెంపున ఆత్మశక్తినంది యీ వస్తువులుండుచోటున గృహమున సంసారమున నతడు వసించుచో ఎట్టి వికారరోగమువలనను అతడు పీడింపబడడు. ఈ శక్తి నందుటకు నిర్జనస్థానమం దుండి అతడు సాధన మొనరింపవలెను.

రావి మొక్కను పాతినపుడు మేకలు మొదలైన జంతువులు దానిని తినివేయకుండుటకై యొకవ్యక్తి దానిచుట్టును కంచె పాతును. మొక్క పెరిగి పెద్దచెట్టయిన పిదప నిక దానికి కంచెయొక్క అవసర ముండదు. ఆ చెట్టునకు పెద్దయేనుగును కట్టివేసినను దానికెట్టి యుపద్రవమును వాటిల్లదు. ఈశ్వర పాదరాజీవములను ధ్యానించి ఆత్మశక్తి నందిన మానవుడు సంసారనిర్వాహణ మొనరించు తఱి యాతడు కామినీకాంచనముల వలన నెట్టియాపదను నిశ్చయ ముగ పొందడు.

మఱిగిన పాలు తోడుపెట్టి అందుండి వెన్నతీయవలెను. ఈశ్వరభావ సంసర్గము మూలమున తోడుకొనిన మనస్సునుండి భక్తియను వెన్నను తీయ వలెను. అట్టివెన్నను పొందిన మనుజుడు సంసారమను నీరమున దానినుంచి నను, తాను గృహావరణము నందున్నను నిర్లిప్తుడై దాని నంటనివాడై యుం డును. కాని యాతడు మనసును దుగ్ధావస్థయందే యుంచినచో సంసారమను జలము దానిని గలసినంతనే అది సంసారమందే పూర్తిగా కలిసిపోవును. మనసు అపుడు నిర్లిప్తమై యుండజాలదు.

ఒక చేతితో నీశ్వరపాదమును బట్టుకొని రెండవచేతితో మనుజుడు తన పనిని నిర్వహించుకొనవలెను. తీరికయైనపుడు రెండుచేతులు కలిపి ఈశ్వర పాదపద్మములను పట్టుకొనవలెను. ఈశ్వరుని ధ్యానించుటయందును, పూజిం చుటయందును, సేవించుటయందును కాలము గడుపవలెను. అపు డాతడు ఈశ్వరు నందగలడు.

ఆచార్యకృత్యము మిగుల కష్టమైనది. ఈశ్వరాదేశము నందినవాని పట్ల నిది సులభకార్యమగును. ఇట్లాదేశమందినవాడు ఈశ్వరశక్తి నందగలడు.

61

ఒకప్పుడొక పెద్దజమీందారుతో నొక సామాన్యమానవుడు న్యాయస్థానమున వ్యాజ్యమునకు డీకొనెను. ఈసామాన్యమానవుని వెనుక నెవ్వరో శక్తిమంతు డున్నాడని ప్రజ లపుడు చెప్పుకొనుచుండువారు. ఈ శక్తిమంతుడు మఱియొక గొప్ప జమీందారై యుండవచ్చును. సామాన్యజీవియైన మానవుని వెనుక నీశ్వరుడు నిలువకున్న యెడల నతడాచార్య క్రియను నెఱపగలడా!

ఒకనిని సంసారబంధమునుండి విముక్తుని గావించుట మఱియొకనికి సాధ్యముగునా? భువనమోహినియైన యీ మాయ యెవ్వానిదో యాతడే మానవుని సంసారబంధమునుండి విడుదలజేయగలడు. సచ్చిదానంద గురువు తప్ప మానవునకు వేఱుదిక్కు లేదు. ఈశ్వరుని యాజ్ఞపొందక యాతని కరుణ పెంపున క్రొత్తశక్తినందక యే మానవుడును మఱియొక్కని భవబంధనమును త్రెంపజాలడు.

ఒకప్పుడు నేను 'పంచవటి' సమీపమునుండి పోవుచుంటిని. అపుడు వెనుకనుండి యొక కప్పకూత వినబడెను. పాపము పామేదేని దానిని నోట బెట్టుకొనెనని తలచితిని. చాలసేపటికి తిరిగి నేనాదారిననే వచ్చితిని. బురదపా మొకటి కప్పను నోటబట్టియుండెను. అపుడుకూడ మండూక మఱచుచుండెను. కప్ప నది మ్రింగజాలకుండెను. విడుపను లేకయుండెను. కప్ప మిక్కిలి బాధ నొందుచుండెను. కప్పను పట్టినది త్రాచుపామైనచో మూడుకూతలతో కప్ప యూరకుండునది. పట్టినది బురదపా మగుటచే కప్పకును పామునకును కూడ బాధ కలుగుచుండెను.

మానవుడు సద్గురుని చేతియందు పడునెడల మూడుకూతలతో నాతని యహంకార మంతమగును. గురువు తగినవాడు కానిచో ఆచార్యునకు బాధ కలుగును; శిష్యునకును బాధకలుగును. శిష్యుని అహంకారము నశింపదు. అతని సంసారబంధనము తెగిపడదు.

ఈశ్వరదర్శనము కలుగకున్న నహంకారము అంతము కానేరదు. ఎవ్వం డేని అహంకారశూన్యుడై గోచరించుచో యతడీశ్వరదర్శన మందినట్లు గ్రహింప వలసి యుండును.

ఈశ్వరదర్శనమందిన మానవుని లక్షణములు శ్రీమద్భాగవతమున వివ రింపబడియున్నవి. ఈ లక్షణములు నాలుగు. ఇట్టివాడు (1) బాలకునివలెను (2) పిశాచమువలెను (3) జడవస్తువువలెను (4) ఉన్మాదునివలెను నుండును.

ఇతడు త్రిగుణాతీతుడై యుండును. ఏ గుణమును నీతని నంటదు. కావున నితడు బాలకస్వభావము కలిగియుండును. శుచియు, అశుచియు వీనికి సమానములై యుండును. అందుచే నితడు పిశాచమట్లుండును. మరల పిచ్చి వానివలె నొకప్పుడు నవ్వును. వేఱొకప్పు డేడ్చును. ఒకమాఱు విలాసపూరుషునివలె పెద్దవేషము వేయును. అరనిముసములో దిగంబరుడై గుడ్డలను చంక బెట్టి యిందంను యిచ్చవచ్చినరీతిని విహరించును. ఇంకొకప్పుడు జడవస్తువు వలె కదలమెదలక పడియుండును. ఒక్కొక్కప్పు డతడు అహంకారమును హృదయమునుండి పూర్తిగ తుడిచివేసికొనగలడు. సమాధిస్థితియందు అహంకారముండదు. ఇంకొకపుడు కొంతయహంకారమున్నను ఉండవచ్చును. కాని యిట్టి యహంకారమువలన నెట్టిదోషము ఘటిల్లదు. ఇది బాలకుని యహంకారము వంటిది. అయిదేండ్ల బాలుడు "నేను నేను" "నాది నాది" యనుచుండును. కాని యతడెవ్వరికిని యుపకారము చేయుట యెఱుంగడు.

పరశువేది సోకినంతనే లోహము బంగారమగును. ఉక్కుకత్తి బంగారు కత్తియగును. కత్తిరూపుండును కాని యది యెవ్వరికిని హానిచేయదు. బంగారు కత్తితో నెవ్వడు దేనిని కోయజాలును? ఎట్టి ఘాతుకకృత్యమును నెఱవేర్పగలడు?

ఈశ్వరుని నింద్రియములవలన గాని మానసమువలనగాని యెఱుగుట సాధ్యముకాదు. మానసమున విషయవాసనలేనివాడు శుద్ధమనస్కుడగును. శుద్ధమానసమువలననే యతడీశ్వరుని గ్రహింపగలడు. ఈశ్వరుని సంపూర్ణముగ నెవ్వరెఱుంగగలరు? మన కవసరమైనంత వఱకు మన మెఱింగిన జాలును. చెంబెడు నీరు మనకు సరిపోవునపుడు బిందెడునీరు మనమేమి చేసికొందుము. పంచదారకొండ దగ్గఱకు చీమయొకటి పోయెను. కొండనంతను అది యేమి చేసికొనును? ఒకటి రెండు పంచదారపలుకులే దానిపొట్టకు చాలునుగదా?

ఈశ్వరుడు యంత్రకాడు. మానవుడు యంత్రము. (పోతనామాత్యుడీభావము పలుమాఱులు శ్రీమద్భాగవతమున వ్యక్తీకరించియున్నాడు) ఈభావముకలవాడు జీవన్ముక్తుడు కాగలడు. కర్త జగదీశుడుగాని మానవుడు కాడు. వేదాంతమందు చక్కనిపోలిక యొకటికలదు. ఒకపాత్రయందు పచన సామగ్రిని వేసి దానినొకడు పొయ్యిమీదనుంచెను. కొంతసేపటికి పాత్రలోని

కూరదినుసులు పైకి ఉబికినవి. "నేను కదలుచున్నాను" నేను గంతులు వేయు చున్నాను' అని యనునట్లాకముక్క గిన్నెయందు ఎగురదొడగెను. పసిపిల్ల లిట్టిపాత్రను వంటయింట్లయందు చూచినప్పుడు కూరముక్కలకు ప్రాణము గల్గదనియు, అందుచే నవి ఎగురుచున్నవనియు తలపోయుదురు. కూరముక్కలు తమంతతా మెగుఱుచుండుట లేదు. గిన్నెక్రిందనున్న అగ్ని వాని నట్లెగుర జేయుచుండెను, అనిపెద్దవాండ్రు బాలురతో పలికెదరు. పొయ్యిలోని కొర కంచులను తీసివేసితిమేని గిన్నెలోని పదార్థములు కదలవు. "నేనుకర్తను అను వాక్కును మనుజుఁడు తన అజ్ఞానముమూలమున పలుకును. ఈశ్వరునిశక్తి చేతనే మానవుడు శక్తిమంతుడగును. మండుచున్నకట్టెను తీసివేసితిమేని కుతకుతలాడుచున్న దంతయు చల్లారును. బీబినాంచారిబొమ్మ చేతియందు చక్కగ నాడును. అది చేతినుండి పడిపోయినచో కదలక మెదలక యుండును. ఈశ్వర దర్శనము కానంతవఱకు జగదీశుఁడు అను పరశువేది తాకనంతవఱకు 'నేను కర్తను' అను పొరపాటు నిలుచును. 'నేను మంచిపనిచేసితిని ఇదిచేసితిని, అదిచేసితిని,' అనుభావము నిలుచును. ఇట్టిభావ మాతని మాయవల్లనే జనించును. మంచిత్రోవను నడచెడిమానవుఁడు ఈశ్వరుని తెలిసికొని మాయనుండి సులువుగా దాటిపోగలఁడు.

పంచభూతాత్మకమైన దేహము స్థూలదేహము ; మనసును, బుద్ధిని, అహంకారమును, చిత్తమును గలది సూక్ష్మశరీరము. భగవత్ప్రసాదితమైన ఆనంద మేశరీరమున ననుభవింపబడునో ఆశరీరము కారణశరీరము. భగవతి 'తను' అని తంత్రశాస్త్రమున తెలుపబడినది. అన్నింటికిని అతీతమైనది మహా కారణశరీరము. "తురీయము" ఇట్టిదని దీనిని వర్ణించుట సాధ్యముకాదు. వీనినిగురించి ఊరక వినిన ఏమిప్రయోజనము. కార్య మొనరింపుము. 'సిద్ధి, సిద్ధి' యనినంతనే, మత్తువచ్చునా ? దీనిని శరీరమున కెంతపట్టించినను మత్తు రాదు. త్రాగినపుడే మత్తువచ్చును. (ఇచట సిద్ధిపదమునకు రెండర్థములుకలవు. ఉత్తరహిందూస్థానీయులు త్రాగు 'భంగ్' అను నిషావస్తువు సిద్ధియనికూడ పిలువబడును.) ఏదారము ఏనెంబరుదో దారములమ్మువానికే బోధపడును. సాధన మొనరించితివేని స్థూలసూక్ష్మ కారణ, మహాకారణ, శరీరము లెవ్వియో బోధపడును. ఈశ్వర ప్రార్థనయందు మానవుఁడు సిద్ధహస్తుడగును.

అహల్యాశాపవిమోచనానంతరము వలసిన వరము కోరుకొమ్మని శ్రీరామచంద్రుఁ డామె నడిగెను. 'రామా! నేను సూకరయోనియందు పుట్టి నను నా మానసము సదా నీపాదకమలములందే యుండునట్లు వరము ప్రసాదింపుము' అని యహల్య రాఘవునడిగెను.

అమ్మ (పరమహంస కాళిని అమ్మా! యనిపిలుచుచుండుట యందరకు తెలిసినవిషయమేకదా.) పాదపద్మములయందు పువ్వులనుంచి చేతులుజోడించి నేనిట్లంటిని 'అమ్మా నీజ్ఞానమును, అజ్ఞానమును, నీశుచిని, అశుచిని, నీపుణ్యమును, పాపమును, నీబాగును, ఓగును, నీధర్మమును, అధర్మమును, యివే గైకొనుము నాకు పరిశుద్ధమైన భక్తినిమ్మ.'

ధర్మమునుగురించి యోచించునపుడు అధర్మమేమో తెలియును. పుణ్యము, జ్ఞానము, శుచి, వెలుగు, వీటిని తలచినపుడు పాపము, అజ్ఞానము, అశుచి, అంధకారము, ఎట్టివో మనుజునకు విశదమగును.

పందిమాంసమును తినువాఁడైనను ఈశ్వరుని పాదపద్మములందు మనమును నిలుపుకొనగలుగుచో నతఁడు ధన్యుఁడగును. హవిస్సును దిని విషయవాంఛలందు మనసు నిలుపువాఁడు అధముఁడు.

## ఈ శ్వ ర ద ర్శ న ము

జగదీశుఁడే జగత్తును జీవనములును అయ్యెను. నేను కన్గొంటిని. కాని చైతన్యము కలుగకున్న చైతన్యుని గ్రహించుట సాధ్యముకాదు. యోచన నిలుచు టెంతిసేపు? చైతన్య లాభానంతరము సమాధికలుగును. దేహము మీద మరపుఘట్టును. కామినీకాంచనములపై నయిష్టముకలుగును. ఈశ్వర నామముతప్ప మఱెద్దియు రుచింపదు.

యోచనమున జగదీశ్వరుని తెలుసుకొనుతీరు ఒకటి. ధ్యానమువలన నాతని వెలుగువిధము మఱొకటి. అతఁడే అంతయు వెలుఁగజేయునపుడు తెలిసికొనురీతి వేఱొకటి. అవతారమూర్తియై మనుష్యలీలయందు ఆతఁడంతయును విశదీకరించుచుండ నిక తెలియని దేముండును. చీకటిలో అగ్గిపుల్లను గీచినపుడు అట్టివెలుగువచ్చును. అట్టివెలుంగు నతఁడొసంగుతరి సంశయమును చీకటి నశించును.

నరేంద్రుఁడు :—నాలుగుదినములనుండి నేను కాళిని ధ్యానించుచున్నాను. నా కేమియు కానుపించలేదేమి ?

రామకృష్ణ :—క్రమముగ కానుపించును. కాళి మరెవ్వరును కాదు. బ్రహ్మయే కాళి, ఏ క్రియయు, చేయనపుడు ఈశ్వరుని మనము బ్రహ్మయందుము. సృష్టిస్థితి, ప్రళయములను కావించునపుడు శక్తియనియు, కాళియనియు అందుము. బ్రహ్మకును కాళికిని భేదములేదు. అగ్నికిని, అందలి దహించు శక్తికిని భేదమేమున్నది. అగ్నినిగురించి తలచునపుడు దహింపజేయుదాని శక్తినికూడ తలచెదముకదా !

జగదీశుడు సర్వత్రా ఉన్నాడు కాని ఒక్కొక్క తావున అవిద్యాశక్తి విశేషముగ ప్రకాశించును, మఱొక్కచోటున విద్యాశక్తి విశేషముగ ప్రకాశించును. వేరు వేరుచోటులయందు శక్తిలో హెచ్చుతగ్గులుండును ; కావున మానవులందరు సమానులు కారు.

రామకృష్ణ :— 'నరేంద్రు నుద్దేశించి' వేదాంతమందు శంకరుఁడు చెప్పినది ఉన్నది. రామానుజాచారి తెలిపిన విశిష్టాద్వైతవాదమును ఉన్నది.

నరేంద్రుండు :—విశిష్టాద్వైత మననేమి ?

రామకృష్ణ :—ఇది రామానుజమతమునకు సంబంధించినది. జీవజగద్విశిష్టుఁడు బ్రహ్మయనియు, అన్నియు గలిసి ఒక్కటైయుండుననియు రామానుజమతము వాకొనుచున్నవి. మఱ్ఱిపండునుచూడుము. అందు గుంజు, గింజలు, తొక్క యుండును గదా ! గుంజు ఏ వస్తువునకు జెందినదో, గింజలును, తొక్కయును దానికే జెందినది. జీవము లెవ్వానికి సంబంధించినవో, జగత్తును ఆతనికే సంబంధించినది. నిత్యమెవ్వానిదో, లీలయు నాతనిదే. లీల ఎవ్వానిదో నిత్యము ఆతనిదే. ఒక్కడే యెన్నియో యైనాడు. సృష్టి అనులోమ విలోమములను బోలునది. మజ్జిగయందు వెన్నయున్నది. వెన్నయందు మజ్జిగయున్నది. మజ్జిగయైన యెడల వెన్నయైయ్యేయున్నది. వెన్నయైన యెడల మజ్జిగయయ్యే యున్నది. శుచి అశుచి ; బాగు ఓగు ; తల్లి బిడ్డ జీవరాసులన్నియు బ్రహ్మన్ లోనే యున్నవి. విశిష్టాద్వైతము జీవజగద్విశిష్టుఁడు జగదీశుఁడని తెలుపుచున్నది.

సమయము రాకమున్న అనగా తీవ్రవైరాగ్యభావము హృదయమం దుదయింపకమున్న సంసారమెవ్వరును విడువరాదు. విడిచినచో చాలకష్ట ములు సంభవించును. దెబ్బ తగిలినపిదప మానుపట్టకముందు దానిపై పొర చినిగిన యెడల రక్తము ధారధారలుగ స్రవించును. మానుపట్టిన పిమ్మట పొర తనంతతాను రాలి క్రిందపడును. ఈవిషయము తెలియని సామాన్యులు చీటికిమాటికి సంసారమును పరిత్యజింతుమని చెప్పుచుందురు.

జీవుని అహంకారమే మాయ. ఈ అహంకారము అంతటిని కప్పి ఉంచును. ఈమాయ, ఈ 'అహం' భావము మేఘమువంటిది. సామాన్య మేఘము అడ్డువచ్చినపుడు కూడ సూర్యుని చూడలేము. మబ్బుతొలగినపుడే సూర్యుడు కంటి కగపడును. గురుకృపచే అహంకారబుద్ధి అంతరించినచో ఈశ్వరదర్శనము లభించును.

రెండుమూరల దూరమందున్న శ్రీరామచంద్రుడను నీశ్వరుని నడు మను సీతయను మాయయుండుటచే లక్ష్మణుడను జీవి చూడజాలకున్నాడు. సమీపమందున్నను ఒకడు ముఖమున కెదుట చిన్ని అంగవస్త్రమునుంచ నేని, ఎదుటవ్యక్తి కానంబడదు. అట్లే కడుసమీపమందున్న జగదీశుడు మాయ యొక్క ఆవరణము మూలమున మానవునకు కానంబడుట లేదు.

జీవము సచ్చిదానందస్వరూపము గలది. కాని మాయకతన దానికనే కోపాధులు కలిగినవి. అందుచే నది నిజరూపమును గుర్తింపజాలకున్నది.

ఒక్కొక్క యుపాధివలన జీవస్వభావము మారిపోవును. ఒకడు ఒక అందమగు బట్టను కట్టగానే వేషమునకు సంబంధించిన క్రియలు చేయమొద లిడును. చేతియందొక బెత్తమును బూని యిటునటు విహరింపవలెనని ఆతడు ముచ్చటపడినను పడును. పేకాట మున్నగు క్రియలందు దవుల్ కొనినను దవుల్ కొనును. రోగికూడ పాదములకు జోడు తొడిగెనేని దొరవలె మెట్లపై గంతు లువేయబూనును. ఒకనిచేతియందు కల మున్నయెడల ఎదుటికాగితముపై నేదో బరికి తీరును.

ద్రవ్యముకూడ ఒక విలక్షణమైన ఉపాధి. ధనమువలన మానవుడు మఱియొకడై పోవును. ఆతనిరీతి పూర్తిగ మారిపోవును. ఒక బ్రాహ్మణుడు

దటచుగ దక్షిణేశ్వరమునకు వచ్చుచుండెడివాడు. ఆతడు మిక్కిలి వినయము గలవాఁడు. కొంతకాలమైన పిదప 'కోన్నగర' మను పల్లెకు వెళ్లితిని. నాతో నపుడు 'హృదయు' డున్నాడు. పడవమీదినుండి దిగినంతనే ఆబ్రాహ్మణవ్యక్తి కానుపించెను. అతడు కనుపించినది గంగయొడ్డున. అతడు నన్ను జూచి "ఏమి ? ఠాకూర్ !" ఎట్లున్నావు !" అని యడిగెను. ఆతని కంఠస్వరమును విని నేను హృదయునితో "చూచితివా ఇతడు ధనికుడై నాడు. అందుచే నీ తీరున మాట్లాడుచున్నాడు" అని పలికితిని. హృదయుఁడు నవ్వినాడు.

ఒకప్పు డొకకప్పకు రూకయొకటి దొరకెను. దాని నది యొకరంధ్రమున దాచి యుంచెను. ఏనుగయొకటి యాదారిని బోవుచు రంధ్రమును ద్రొక్కివేసెను. ఆకప్ప ప్రక్కనుండి ఎగిరెగిరిపడుచు వచ్చి ఏనుగును చూచి కను లెఱ్ఱజేసెను. పైకమువలన అహంకారము జనించును.

శ్రీరామకృష్ణపరమహంస జీవితమునందు ప్రత్యేకప్రాముఖ్య మున్నది. హిందూమతముపై మహాక్లిష్టములు ప్రాలుకాలమున నీతఁడు జనన మందెను. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే." యని జగదీశు డనిన వాక్కు సంపూర్ణ సత్యముకావున సనాతనమతము నుద్ధరించుటకై కడచిన శతాబ్దమున దేవదేవుడే రామకృష్ణుడై పుట్టియుండ నోపు.

రామకృష్ణుడు మతసముద్ధరణమునకై నిలిచిన యోధవరుడై యుండ లేదు. రచ్చపై కురికి మతబాహ్యావర్తనలను పిడికిట పట్టి వారివక్రప్రణాళిక లను తలక్రిందులు చేయలేదు. ఎదుటవారి నీతిను చెండాడలేదు. ఇతడు వక్త కాదు. వ్రాతకాడును కాదు. ఇత డేచదువులను నేర్వలేదు. జగదీశుడే ఈతని ముఖమునుండి గంభీరభావములను వెలువరించినాడు. అద్భుతభాషణములను పలికినాడు. రామకృష్ణుడు విశేషకాలము ఆత్మవిస్మృతుడై యుండువాడు. భావసమాధియందు తన్మయుడై యుండువాడు. అక్షరములునేర్వనిబీదబ్రాహ్మణుడు హిందూమతమును గుఱించిన గొప్పవిషయములను తెలుపుచు మూర్తీభవించిన భక్తియై తోచినంతనే పలువురు హిందూమతమందు మహాత్మును గుర్తించిరి.

ఈతని ప్రసంగములందు ప్రకటించిన భావములు అద్భుతశక్తి గలవియై యున్నవి. రామకృష్ణుఁడు అవతరించిన ప్రత్యక్షజగదీశుఁడు. ఈతఁడు తన్మయ జగతియందే యుండి మానవులను బ్రోచు ప్రబోధవాక్కుల నుచ్చరించినాడు.

రామకృష్ణునివాక్కులను దిగమ్రింగి పరమహంసయొక్క భావములను హృదయపేటికయందు నింపుకొని పాశ్చాత్యదేశములయందు సంచార మొన రించి వివేకానందస్వామి వానిని వెదజల్లినాడు. ఆదేశస్థులు పలువురు హిందూ మతమందలి మాహాత్మ్యమును గుర్తించి హిందూమత మవలంబించిరి.

రామకృష్ణునివాక్కు లమూల్యములు. ఈతనివదనమునుండి వెలువడిన నుడువులు "శ్రీ రామకృష్ణకథామృతము" న స్వర్ణాక్షరము లైనవి. పలు వురు మహనీయు లీయుద్గ్రంథమును వేనోళ్ల గొనియాడిరి.



## ౪౫

# కుపరాబాయి



"చ. నగమొగసెత్తుమోరలను జన్నులు సేపఁగ నీరు, మేపునన్
దిగవిడనాడి యాలు గన దివ్యథరాజముక్రింద నిల్చి నె
మ్మొగము నొకింత వంచి యఱమోడ్చి కనుంగవఁ బిల్లఁగ్రోవి నూ
దు గుణసముద్రుఁ డెల్లపుడు తోడయి యుండును మాకునిచ్చలున్."

భక్తియోగమహాత్మ్యమును శ్రీరామకృష్ణపరమహంస పలుమారు ఉగ్గడించెను. జగదీశుఁడు యోచన కంద డని యెఱిగి విశ్వాసము నూతకోలఁ జేసికొని భక్తియోగము నవలంబించి పలువురు ముక్తినొందిరి. భక్తిమార్గము సులభమైన దగుటచే ముక్తిఁగోరినకాంతలు తఱచుగా నీతెరువును బట్టియే సాగి పోయిరి.

పురుషులకంటె స్త్రీలకు భక్తిమార్గము సన్నిహితమైనది. క్లిష్టమైన యోజనకు వీరు పూనుకొనరు. జటిలమైన తాత్త్వికసమస్యలదెస దృష్టిసారింప నొల్లరు. అనురాగమునకును, కళకును, భక్తికిని, నెలవైన హృదయము ముఖ్యముగ స్త్రీజన్మకు మూలబంధము. భక్తిపంథయందు స్త్రీలకు గల ప్రాముఖ్యము తెలుపుటకే తనభక్తులనందరిని గోపికలజేసి, ముక్తికి వేఱుపేరైనబృందావనమున జగదీశుఁడు వారితో వేడుకల దేలె నని వాకొందురు. కర్మాబాయి యనునదు, మీరాబాయి యనునదు, రామామాయి యనునదు, గోమాబాయి యనునదు, పిళాబాయి యనునదు, జనాబాయి యనునదు, గుణవతీబాయి యనునదు, శీలాబాయి యనునదు, సక్కూబాయి యనునదు, ప్రేమాబాయి యనునదు, కుపరాబాయి యనునదు మహాభక్తురాండ్రె సాయుజ్యముక్తి నొందిరి.

కువరాబాయి ఒకపురోహితుని బిడ్డ. చిరకాల మతడు సంతానహీనుడై యుండెను. సంతానముకొఱకై యతడును, భార్యయు అనేకవ్రతములు నెఱపిరి. దానములు చేసిరి. సంతానములేని వారికి, అందును పుత్రసంతతి లేనివారికి,

గతులు లేవనువిశ్వాసము హిందూసంఘమందు వ్రేళ్ళు నాటుకొనియున్నది. సంతానము లేని హిందూదంపతులు మిగుల పరితాప మొందుదురు. బిడ్డలు లేకొరతను తీర్చుకొనుటకే కదా హిందువులు దత్తుని స్వీకరించుచుందురు. అనివార్యముగ దంపతులకు సంతాన ముండితీరవలె ననుభావము ప్రాచీన కాలమున విశేషముగ ప్రబలియుండెడిది.

ఆపురోహితుండును భార్యయును కొంతకాలము ద్వారకయందుండి కృష్ణపరమాత్మను సేవించిరి. కృష్ణకృపవలన వారికి కుపరాబాయి కలిగినది.

పురోహితునిభార్య దుర్భరమైన ప్రసవవేదన బడె ననియు జగదీశుడే మంత్రసానియై వచ్చి ఆమెను సేవించి యామెయాతనము నడంచె ననియు, కొన్నిమాసములవరకు ఆమెకును ఆమెబిడ్డకును నూడిగము చేసెననియు, కుపరాబాయి పుట్టిన కొలదినిముసములలోనే యామెకు శ్రీకృష్ణమంత్రము నుపదేశించెననియు, కొందరు కథకు లందురు.

కృష్ణజీవనమును బాగుగ పరిశీలించితి మేని అత డనుక్షణము దీనజన రక్షణమునకై ముందంజవేయుచుండువా డని గుర్తింపక పోము. అంతియె కాదు ఆశ్రితశత్రువు లని యెంచబడువారిని కూడ నతడు బహుభంగుల సేవించి నాడు. పాతాళమున నేమును అతడు బలిచక్రవర్తికి ద్వారపాలకుడై యుండె నని మనగ్రంథములు తెలుపుచుండ, నతడు పార్థునకు సారథి యయ్యెననియు, చింతామణిపాదముల కెరగెననియు, కుచేలుని సేవించెననియు, ననేకదృష్టాంత ముల చెప్పనేల? కుపరాబాయికిని, ఆమెజననయిత్రికిని కృష్ణపరమాత్మ కొన్నిదినము లూడిగము జేసె ననిన, అం దక్కజ మే మున్నది?

భక్తిపరాయణులైన తల్లిదండ్రుల కడుపునబుట్టినది కావున కుపరాబాయి భక్తియందే పెం పొందినది. భక్తిదుగ్ధమును గ్రోలినపాప, భక్తిగుణమునందే బలిష్ఠ కాదా? కృష్ణమంత్రోపదేశ మొక్క కుపరాబాయికే కాదు, కృష్ణమహాత్త్వమందు విశ్వాసమున్నవారి కెల్లరకు చేకూరును. వ్యక్తియై జగదీశుడు కమండలోదకములు పూని బీజాక్షరము లుచ్చరింపు మని మ్రోల నిలువ నక్కరలేదు. భక్తుని అంతరంగదృష్టి ఎన్నడును జగదీశుని సమ్ముఖమునం దిడుకొనును. హృదయాగారమున నాత డనారతము ఈశ్వరునిప్రేమవాక్కును వినుచునే యుండును. అనుక్షణ మాతనిహృదయ మీశ్వరస్పర్శవలని హాయి

ననుభవించుచుండును. వ్రతదీక్ష యనుఁడు, ఉపాసనాయానందమనుఁడు ఈశ్వర ప్రేమానుభవమున గలుగునవే కదా! ఈప్రేమను తనసొమ్ముఁ జేసికొనిన కుపరాబాయి కృష్ణమంత్ర మందె ననియు, కృష్ణజీవనతత్త్వ మెఱిఁగె ననియుఁ దెలుపుట నమంజసము కాదా?

ద్వారకను విడిచి కుపరాబాయి తలిదండ్రులు తమపల్లెకు తరలిపోయిరి. శుక్లపక్షశశికళవలె బాలిక క్రమాభివృద్ధి నందినది. చిన్నవయసునందే యామెకు తలిదండ్రులు పెండ్లిచేసిరి. పదంపడి ఆమెను అత్తింటికి పంపివేయ సమకట్టిరి. గృహస్థజీవనముపై కుపరాబాయికి మక్కువ కుదురలేదు. జననీజనకులకు తెలుపకుండ నిలు వీడిపోయి, ఆమె యనేక తీర్థముల సేవించి ద్వారక చేరుకొని అచట శ్రీకృష్ణనామసంకీర్తనమునఁ గాలము గడుప దొడంగెను. కొంతకాల మున కామె జనకుఁడు బిడ్డను వెదకుకొనుచు ద్వారకను జేరెను. దుహితను గాంచి, ఆనందించి, జననిపాలికి రమ్మని ఆమెను వేఁడుకొనెను. కుపరాబాయి జనయిత్రియారాటము మాన్ప గృహమున కేగెను. కాని, తనమనసును నిరంతరము హరినామస్మరణమున స్నాన మొనరించెను.

తనయను జూచి తలిదండ్రులు లేబవలులు విష్ణుచింతయందే మునింగి యుండువారు. బహుసంఖ్యాకులు కుపరాబాయిని దర్శించి శుభ్రమనస్కులై పవిత్రజీవనములు కడుప సాగిరి. సామాన్యులేకాక పాలకులును ఆయమ నాశ్ర యించి భక్తిమహాత్త్వమును గ్రహించిరి. అనేకకడగండ్లను నిరపాయముగ దాటి పవిత్రులైరి.

మనుష్యుని ప్రధానగుణములలో అనుకరణ మొకటి. జీవనమార్గమందు కొంతదూరము సాగిపోవువరకు మనుజు డీగుణమును పడయు చుండును. తెలిసియే కాదు, తెలియకగూడ నత డీగుణము నలవఱచుకొనును. మనుజుడు కనునదియు, వినునదియు, ఆతనిమనసున తమచిహ్నము లంకిత మొనరించును కావుననే స్థల, వాతావరణ, సఖ్యము లొకనిగుణమును మార్పుజేయు హేతువు లగుచున్నవి. గురుగంభీరమైన పర్వతమును, ఉత్తాల తరంగబంధుర మహో దధిని వివిధ రాగరంజిత మాకాశమును, బహువిధపుష్పవిలసిత యుద్యానమును, ఉదయభాస్కరుని అపరంజికిరణములను, చంద్రుని సుధామయకిరణములను, దివ్యసుందరవిగ్రహమును, మహోన్నత దేవమందిరమును, వెండిలీవ బోలు

వెల్లువను, మహాపురుషుని, మహాభక్తుని, విలోకించి నపుడు పరమానందమున నాత్మ సృశ్య మొనరింపదా? ఆత్మ సచ్చిదానంద ఘనస్వరూపము. అది సౌందర్యమయి. 'సత్యం' 'శివం' 'సుందరమ్' ఎదుట దోఁచినపు డది, తన ధనమును గాంచినట్లై పరమపరితోష మందును. గురుగంభీరదృశ్యముల విలోకించు నాతఁడు, రమ్యప్రకృతి గల కవి కాఁగలఁడు. గురుతరగుణములను తిలకించునాతఁడు సచ్చారిత్రు డగును. సత్పురుషసాంగత్యము మానవుని సంసార జలధినుండి అవ్వలికి దాటించు తెప్ప యని శంకరాది మహాజ్ఞానులు పలుకు టెఱుఁగమా!

కాని, మనుజుఁడు కేవలము ఆత్మయే కాఁడు. సంస్కరణ మందనిమనసు కూడ ఆతనియం దున్నది. ఆత్మప్రమోల మనసు శిర మెత్తి నిలువనంత దనుక మానవునకు ముక్తి లేదు. మనసున కింద్రియములు బంటులు. వీనికి దాసు డగుమానవుడు అరిషడ్వర్గముల చేతులందు కైదీ యగును. ఆత్మశక్తి నందని మానవుడు పిశాచమునకు తనమనసులోనికి స్వాగత మనును. దుశ్చారిత్రు లెదుట బడినపుడు ఇతఁ డవలీలగ దుర్గుణములను అస్వాదించును. విమర్శనశక్తి గాని, విచక్షణజ్ఞానము గాని, ఇతనికి లేదు. పిశాచ మీతనిపై స్వారి చేయునపు డీతఁడు చేయఁజాలని దుష్కృత్య ముండదు. లోని కనురెప్పల నెత్తిఎదుటి ప్రకృతి యెట్టిదో గుర్తింప జాలనంతదనుక మానవుడు ప్రతికూలవాతావరణ మందు గాని, వికృతపరిస్థితులందుగాని మసల రాదు. అత్తఱి ఈతని పెద్దలే ఈతని ననుకూలస్థలమందును, సద్గుణచరిత్రులందును నిలుపవలెను. చరిత్ర అవగాహనము చేసికొనినపిదప నత డెట్టిప్రతికూలమనస్కులందు నిలిచినను ఇట్టటు కదలడు. తనమహాత్త్వముచే తన ననేకులను చక్కని తన తెరువునందు ప్రవేశ పెట్టు టాతని కసాధ్యము కాదు.

బాహ్యశక్తియే కాక అంతరంగమున బహుకాలమునుండి విరాజిల్లు చుండుశక్తి కూడ మనుష్యచరిత్ర నిర్మాణమునకు తోడుపడును. మనుష్యజన్మ ఒక్కపుట్టుకనాటిది కాదు. పరమాశయమైన ముక్తిని చేరునంతదనుక జీవాత్మ జన్మపరంపరలందు పయనము చేయుచుండును. అభివృద్ధిమార్గమందలి క్రమానుస్థాన మీజన్మపరంపరలం దుండును. గతభవనమున నొకదిక్కుగ నొకడు కావించినకృషి ఆపుట్టువుతో పుటుక్కున తెగిపోదు. జన్మపరంపరల

కర్మఫలితము లంతరంగమున నిలువనై ప్రత్యక్షజీవనమున పొడసూపుచుండును. కావుననే పుట్టువుతోడనే కొందఱు మహాజ్ఞానసంపదను గలిగియుందురు. అంతరంగవృద్ధి సందర్భమునకు బాహ్యాతరుణములు నిమిత్తమాత్రములు. రాపిడివలన నటాత్తుగ చెకుముకిలోని నిప్పునెరసులు వెల్వడవా? మనుజులందలి అంతరంగ శక్తికూడ నిట్లే తళ్కొత్తును. ఈశక్తి నంటినఅడ్డును భేదించునది విద్య (విద్=భేదించుట). అంతరంగశక్తిపై గ్రొత్తగ జేరిన దానిని నవనీతమును) హరించువాఁడు జగదీశుఁడు. కావున నతఁడు నవనీత చోరుఁ డని పేర్కొనబడినాడు. ఉపనిషత్తు లీతని 'చోరశిఖామణి' యని సంబోధించినవి. జ్ఞానము జగదీశుని కరుణపెంపున లభించునుగదా? లోఁగలశక్తి నివ్వల విజృంభింప జేయు తరుణము జగదీశునివంటిదే.

ఇట్టిశక్తి గలవాడు పాడుచోటులందు బడుట అరుదు. పూర్వభవ యత్నమును బట్టియే, ఇహభవనమున మనుజుడు తగువాతావరణమున ప్రవేశ మందు నని మతశాస్త్రములు తెలుపుచున్నవి. ఈయంశముల ననారతము ప్రత్యక్షప్రమాణములచే రూఢిచేయుట సాధ్యము కాదు. సృష్టి నియమబద్ధమైనదికాని, కారణకార్యసంబంధము లేనితుచ్ఛలప్రోవు కాదు; మనుష్యజన్మయు నట్టిదియే. మనుష్యజీవనమునందలి సంఘటనములు, ఎట్లో ఎగిరివచ్చి ప్రబను కుపై వ్రాలినపులుగులు కావు. కనులయెదుట గానంబడనిహేతుమాత్రము లీసంఘటనములకు బంధింపబడియే యుండును. అదృశ్యశక్తియొకటి తానుండ వలయు తావును నిర్దిష్టమొనరించు నని యోజించి, మనుజుఁడు కాళ్లుచేతులు ముడుచుకొని కూర్చుండరాదు. ఊరకుండువానికి జగదీశుఁడు సాయము సలుపడు. మనుష్యయత్నమున దిగ్వలయమున సూర్యకిరణమట్లు దైవసాహాయ్యము శోభిలును.

స్వప్నయత్నమువలన నేమి; స్వచింత, స్వప్రయత్నములకు చేయూతి కాఁజాలని వయసున జననీజనకుల ప్రయత్నమువలన నేమి; మనుజుఁడు సముచితభావిజీవనగ్రథనమున కనుకూలమైన స్థలవాతావరణసఖ్యములందు నిలువ వలెను. బాహ్యాపరిస్థితుల తాకుడువలన నీతని అంతరంగశక్తులు విజృంభించును. మనసు నంధకారకూపమున బడద్రోయు వికృతబాహ్యస్థితులనుండి ఇతఁడు తొలఁగిపోవలెను. మనుష్యశక్తి ఎంతమహత్తరమైన దైనను, మనుష్య

హృదయము జగదీశుఁడు వసించు దివ్యమందిరమైనను, మనుష్యుఁడు పూర్ణత్వ సిద్ధికి కడుదూరమం దుండుటచే పిశాచ మైన నతనిమానసమున బ్రవేశ మందఁజూచును. ఏమఱుపాటున నున్నతఱి వానిని గభీరప్రలోభనాకూపమున గూలద్రోయ నుంకించును. నిజజీవనమును సార్థకముగావించుకొన దలఁచు నాతఁడు పైశాచికప్రవృత్తులుండు చోటునుండి తొలఁగి పోవలెను.

మనసును తాఁకుశక్తుల ననుసరించి (ఈశక్తు లేయే హేతువులచే దానిని తాకినను) సాధారణముగ మనుష్యచరిత్ర యేర్పడును. అసంఖ్యాకులు కుపరా బాయిని జేరి, పవిత్రజీవనములు గడపిరి. అట్టిజీవనములను వీ రెట్లు గడుపఁగలి గిరో చదువరులే యూహించియుందురు.

అద్భుతదృశ్యమునుండివలె మహావ్యక్తినుండి మహత్తర భావతరంగ ములు పొంగి ఎదుటి వ్యక్తిహృదయమున బ్రవహించునుగదా! కుపరాబాయి జీవనము గంగోత్తరి వంటిది. అందుండి ప్రవహించిన పూతభావకల్లోలిని యందు గ్రుంకిలిడినవారు ముక్తినందిరి. తొలుత బరమాశయమును తానుజేరి, పదంపడి యనేకు లనాయాశయమునఁజేర్చిన పుణ్యచరిత్ర కుపరాబాయి.



౪౬

# సక్కుబాయి



"ఉ. హారికి, నందగోకులవిహారికి చక్రసమీరదైత్యసం
హారికి, భక్తదుఃఖపరిహారికి, గోపనితంబినీమనో
హారికి, దుష్టసంపదహారికి, ఘోషకుటీపయోఘృతా
హారికి, బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్."

సక్కుబాయికథ ఆంధ్రులకు పరిచితమైనది. కడుసంక్షేపముగ కథ నిందుఁ దెలిపిన తరువాత విమర్శనవిషయములు వివరింపబడును.

పండరిపురమునకు కొంతదూరమందున్న ఒక గ్రామమున సకలవిద్యలం దారితేరిన విప్రు డొకఁ డుండెను. చదువులు నేర్చినవాఁ డయ్యు అతడు సత్ప్రవర్తన మెఱుఁగడు. ఆతనికి తగినమానినియే ఇల్లాలయ్యెను. వారికి విశ్వనాథు డనుకొడు కుండెను. అతడును అన్నివిద్యలం దారితేఱినాడు.

కొడుకునకు పెండిలి చేయవలెనని జననీజనకులు నిశ్చయించిరి. పిల్లను వెదకుటకై బ్రాహ్మణుడు బయలుదేఱినాడు. కొన్నిదినము లిందందు తిరిగి అతఁ డొకయూరు చేరుకొని ఒకవిప్రునింట విడసినాడు. ఆవిప్రునకు ఒకకూతు రుండెను. ఆమె సర్వాంగసుందరి. గంభీరమైన కాసారము తనగొప్పందనమును ప్రసన్నవదనమున వ్యక్తపరచునట్లు ఆకన్నియమోము అంతరంగమందలి యతులవిభూతిని వ్యక్తీకరించెను. ఆమెను తనకోడలిగ పడయవలె నని బ్రాహ్మణుడు, మిక్కిలి మక్కువపడి తనయుద్దేశ్యము విప్రున కెఱింగించినాఁడు. అర్ధాంగితో నాలోచించి యతడు సంబంధమునకు వల్లె యనినాడు. బ్రాహ్మణు డింటి కరిగి శుభవార్తను భార్యకును కొడుకునకును యెఱింగించెను. వారు మిగుల నానందించిరి. పిదప నొకశుభముహూర్తమున విశ్వనాథునకును విప్రనందనికిని వివాహమహోత్సవము జరిగెను. విశ్వనాథుని యర్ధాంగలక్ష్మి సక్కుబాయి యని పాఠకు లూహించియుందురు.

సక్కుబాయికి శైశవమునుండియు, భగవత్సేవయందు ప్రీతి మెండు. ఒకభాగవతోత్తమునికడ చిఱుతప్రాయమునందే ఆమె కృష్ణమంత్రోపదేశము నొందెను. మిక్కిలి మక్కువతో ఆమె కృష్ణభజనము చేయుచుండెను. అత్తవారింటి కరిగినపిదపకూడ మునుపట్టులే ఆమె పూజలను భజనలను నెఱవుచుండెను. భక్తిశూన్యహృదయులైన ఆమె అత్తమామలకు కోడలి జీవనవిధానము నచ్చలేదు. హరిసేవ అంగన కేలయని వారియుద్దేశ్యము. ఆమె కృష్ణనామసంకీర్తనము చేసినకొలది వారిక్రోధ మధిక మయ్యెడిది. ఇంటిపనులన్నియు కనుగాయమైన సక్కుబాయినెత్తిపై బెట్టువారు. ఉబుసుపోనపుడును భక్తిగీతమును వినినపుడును కోడలిని వారు గొడ్డునుకొట్టినట్లు కొట్టువారు. కొడుకు విశ్వనాథముచే గూడ కొట్టించువారు.

ఇట్లుండ గొంతకాలమునకు విశ్వనాథునితండ్రి విగతజీవుడైనాఁడు. పాపము మహావిద్వాంసుడే. ఆతనిచదువు ఆతనిమేధస్సునుండి హృదయములోనికి దిగజారలేదు. ఆతఁడు ముక్కున బట్టినఉత్తమజీవనసూత్రములు ఆతని జీవనమును సోకలేదు. ఆతనిహృదయము చక్కనిభావాంకురములను దిగమ్రింగిన పొలము కాదు. వేడితలపుల నెగురజిమ్ము ఎడారి. అతనిపాపము బ్రద్దలయ్యెనో లేదో ఎఱుగము కాని అతనికి బ్రదుకు నిహితమైన సెగవలన బీటలువారు నేలవలె బ్రద్దలైనది. సతి మగడు చావగనె పరిసరగ్రామాదులు ప్రతిధ్వనించునట్లు రోదన మొనరించి అతనిమీఁదిప్రేమను దశదిశలందు ప్రకటన మొనరించినది. పెక్కుస్వరములు మేళగించి వన్నెచిన్నెలతో నామె దుఃఖ మాలాపించినపుడు పొరిగింటిఅమ్మలక్కలు అయ్యో పాపమని కంట తడిపెట్టుకొనిరి. ఒరుల యోదార్పు వినినపు డామెగొంతుకు సవరించుకొని మరింత దీక్షతో వెక్కి వెక్కి ఏడ్చినది. పాపము విశ్వనాథుడు తండ్రిమరణించినాడని ఒక పెద్దయేడుపు యేడిచి మిన్నకొనినాఁడు. తరువాత నాతడు మిన్నకొనియుంట తల్లికి నచ్చలేదు. ముఖము వాచునట్లు చాటున వానిని చీవాట్లు పెట్టినది. అందుచే ఎవరైన వచ్చినపుడు తల్లి ముఖారియాలాపమును మొదలిడగనె విశ్వనాథుడు కంఠ మెత్తి బోరు మనువాఁడు. పాపము సక్కుబాయి మామగారిమరణమునకు మిగుల దుఃఖించినది. తనవలె నామె రోదన మొనరింప లేదని అత్తగారు సక్కుబాయిని బహుభంగుల నిందించినది.

అత్తగారిశక్తి యిపుడు ద్విగుణీకృత మైనది. వచ్చినదుగ దామెయం దావహించి యుండును. ఆమె యిపుడు సక్కుబాయిపట్ల ప్రత్యక్షపిశాచ మైనది. కోడలికన్నపానీయము లైన సరిగ నీయక ఇంటిలోని బండపను లన్నియు నామెపై బెట్టుచు వాని నామె ముగించిన పిదప భారవహములైన నూతన కార్యము లేమేమో కల్పించి ఆమెతలకు గట్టుచు బహువిధముల నామె నా పిశాచము బాధ పెట్టఁజొచ్చినది. కష్ట మని తలపక విసుగుకొనక నిద్రాహారము లెరుగక రేఁబవలులు గృహకృత్యములు సలుపుచు ఆపనులందే కొంత సమయమును సృష్టించుకొనుచు ఆసమయమందు సక్కుబాయి తనచిన్నికృష్ణుని గొలుచుచుండెడిది. కోడలిచేతియందు కృష్ణవిగ్రహమును చూచుతరి, వితంతువు ఆగ్రహావేశచిత్తయై దాని నవ్వల బారవేసి చిత్తమువచ్చిన తెఱఁగున నామెను చరచుచుండెడిది.

నీరు తెచ్చుటకై ఒకనాడు సక్కుబాయి చెఱువున కరిగెను. పొరుగింటి యువతి యొకతె ఆమె చెంగట నుండెను. కొందరుయోగు లపుడు విష్ణుకీర్తనలు పాడుకొనుచు కాసారతీరమునుండి చనుచుండిరి. మధురగీతమును పాడినంతనే సక్కుబాయిహృదయ మానందముతో నిండిపోయెను. భాగవతులు పాండురంగని కీర్తించుచు పండరీపురమున కరుగుచుండిరి. తానును పంఢరినాథుని గొలువవలెనని, సక్కుబాయి ముచ్చట పడినది. స్వామిని సేవించి వచ్చెద నని నెచ్చెలితో చెప్పినది. జతకత్తె యింటికిపోయి ఆవార్తను సక్కుబాయిఅత్తగారి కెఱింగించినది. తోడనే కొమరుకును వెంటగొని నల్లేరుమీది బండివలె నామె చెరువుకడ కరిగి యోగినాథుని దూషించి ఆగనిముఖమున నీరు చిమ్మి నిష్ఠురరాలై సక్కుబాయిని శిక్షించి ఆమెజడ పట్టుకొని యింటికి బరబర లాగుకొనిపోయి పెడరెక్కలు విఱిచి ఒక స్తంభమునకు కట్టినది. అన్నముగాని పానీయమునుగాని యొసగక స్తంభమునంటియున్న కోడలిని చేతులుఁదు నొప్పి కలుగునటుల దండించినది. గరిటెను నెఱ్ఱగ గాల్చి ఆమెయొడలున నంటించినది. అత్తగారితో ప్రతివచన మేమియు బలుకక ఇసుమంతయైన కోపమును ప్రకాశింపజేయక కనులు మూసికొని సక్కుబాయి పాండురంగని గూర్చి ధ్యానింప తొడంగినది. తనకు తలపడిన అత్యాచారమును కాయిల్లాలు ఇంచుకంతేని చింతిలలేదు. పాండురంగని సేవించుభాగ్యము తనకు కలుగలేదని

ఆమె మిగుల దుఃఖించి విషాదభరితమై యున్న హృదయమును జగదీశుని చరణ తలమున గ్రుమ్మరించినది.

దురంతమైన ఇట్టియత్యాచారము పృథ్వియం దేకడనైన సాధ్యమగునో కాదో! ఇది విస్తారపుకథ కాదు. ఈదుర్న్యయము నేడును భారతగృహము లందు అందందు గోచరించుచునే యున్నది. అనదలు పడుహింసయే నేడెదురు తిరిగి హిందూసంఘమును కట్టికుడుపుచున్న దేమో!

అహింస పరమధర్మ మని ఎంచుభారతీయులందు యుగయుగములనుండి యుత్తమాశయములను దిగ్రమించుచువచ్చిన భారతీయులందు, ఆ పవిత్రజీవుల అడుగుజాడలను నేడును తమనేలయందు గాంచుచు అబ్బురంపడు భారతీయు లందు, జగదీశుని దుర్గయని, అమ్మయని పూజించు భారతీయులందు కొందఱు గృహలక్ష్ముల కిట్టిదుర్దాంత అత్యాచారము తప్పనిసరి యగుట దుఃఖకరము. జగదీశుడైన ఒకప్పుడు విచలితచిత్తుడై సహనమును గోలుపడునేమో గాని, భారతరమణి కోలుపడదు. ఈమెసహనమునకు మాఱుపేరు. శాంతమునకు రూపాంతరము. ఈయుత్తమగుణములు గ్రంథపఠనమున నబ్బునవి గావు. ఈగుణములు భారతస్త్రీహృదయమున నెన్నడు నాటుకొనినవో కాని, నేడును అందు బలవత్తరములై యున్నవి. దివ్యబృందావనమున కెనయగు స్త్రీహృద యముకతననే భారతగృహములు నేడును ఉన్నతాశయములకు నాలవాలములై యున్నవి. సక్కుబాయిని బోలుస్త్రీ లితరసీమలయందు పుట్టిరో లేదో తెలుపఁ జాలము కాని భారతభూమియం దనవరతము జన్మించుచునే యున్నారు.

ఇట్టిపతివ్రతాంగనలను హింసపెట్టినది అవిద్యకాని మఱొండు కాదు. ఈ యవిద్య యీనాటిదిగాని మునుపటిదికాదు. ఈయవిద్య మాపగునాడే సక్కుబాయిబోలు పావనగుణసంశోభితలు నిరపాయముగ జీవనములు గడుపఁ గలరు.

తదేకదృష్టితో ధ్యానించుసక్కుబాయి దురవస్థ జగదీశుని హృదయ మున దుస్సహమైన వ్యథను కలిగించినది. అభాగుల అడలును అరాటమును తోడుతూపులై ఈశ్వరహృదయమున గ్రుచ్చుకొనును. అయినను జగదీశుడు తనభక్తులను దాను పూర్తిగ పరీక్షింప నువ్విళ్లూరు చుండును. ఈపరీక్ష అగ్ని

పరీక్ష ఇది ఒకనాఁటితో ముగియునదికాదు. ఈపరీక్ష ముగియుటకు ఏండ్లును జన్మములును గూడ పట్టును. పరీక్షయందు పూర్తిగ నెగ్గనివ్యక్తికి నెగ్గువఱకు తరుణము లీయఁబడును. ఈ తరుణములే జన్మలు. అగ్నినుండి వెడలివచ్చిన ఆత్మ దివ్యస్వర్ణభూషయట్లు తేజరిల్లును. పరీక్షయం దున్నవ్యక్తితో భగవంతుఁడు కూడ కొంతవ్యథ నందుచుండును. మానవుఁడు వ్యథయం దున్నపుడు జగదీశుఁడు కులుకు చుండఁడు. ఈశ్వరుఁడు నిరంకుశప్రభువు కాఁడు. ఆతని క్రియలు చలచిత్తములనుండి వెడలునవి కావు. అవి నియమబద్ధమైనవి. తన నియమములు దాను పాలించితీరును. గాని అవి తనభక్తులకుఁగాని, తనకుఁగాని సంతాపమును గలిగించున వని ఈశ్వరుఁడు వాని నుల్లంఘింపఁడు. ఈసత్యమెఱుఁగనిమానవులు జగదీశుఁడు క్రూరుఁడై తమ్ము ఘోరాపదలందు గూలఁ ద్రోయుచున్నా డనియు, తా మెకవేళ ఎన్నఁడో చేసినయపరాధములను విశాలహృదయుఁడై క్షమింపక నిష్ఠురుఁడై భగవంతుఁడు తమ్ము కట్టికుడుపుచున్నా డనియు, విశ్వము నేలుచున్నది జగదీశుఁడుకాక పిశాచ మనియు, అతఁడెందో నిద్దుర వోవుచుండె ననియు, ఈశ్వరు డొకఁడు లేనేలే డనియు పలుకుచుందురు. వీరియవిశ్వాసము, వీరివిచ్చలవిడితలఁపు, వీరినిష్ఠురయోజనము, వీరి హృదయములందలి ఆశాప్రదీపమును పూర్తిగ నార్పివేసి, వీరి కనుకొలుకులందలి ఆనందాలోకమును పూర్తిగ నిర్వాణ మొనరించి వీరిబ్రతుకును చిరకాలము చిటచిటమను చితిని గావించివేయును. వీరిహృదయములనుండి విశ్వాసము తొలఁగిపోదేని, వీరిమనసును కష్టముల సెగ సోకినపు డదియమృతవర్షము గురిపించి ఉల్లమును చల్లవఱచును. కావుననే ఘోరపరీక్షలందు ద్రోయబడిన భక్తులు వమ్ముగాక, పూవులోని పుప్పొడియట్టులు కమ్మతావులు వెదజల్లుచు తమపరీక్షలం దుత్తీర్ణు లగుచున్నారు. ప్రహ్లాదుని భక్తివిశ్వాసములే ప్రహ్లాదుని గాచినవి. లేకున్న నతఁడు తనపై బడినయరిష్టముల కతన దుష్కృతుఁ లగువాఁడు. అగ్నిప్రవేశ మొనరించినసీత, చల్లనితల్లియై ఈవల బ్రవేశించిన దనియు, ఎదురైన ఘోరానలమును చంద్రమతి తనమహాత్త్వముకతన నార్పివేసిన దనియు మనపురాణములయందు చదువుచున్నాము. కావ్యకర్తల అలంకారములను ఉన్నవున్నట్లుగ పామరులు గ్రహింతురు. ఈయలంకారములు కొండొకగభీరసత్యమును వ్యక్తీకరించున వని మనీషులు గుర్తింతురు.

మహాపతివ్రతలను, మహాభక్తులను, భక్తురాండ్రను, ఎదుర్కొనిన ఘోరపరీక్షయే సక్కుబాయిని కూడ నెదుర్కొనెను. పరీక్షసమయమున నదృశ్యుండై జగదీశుడు తనభక్తురాలికి దాపల నుండును. సక్కుబాయి స్తంభమునకు పగ్గములతో గట్టబడినపుడు దాపలనున్న కృష్ణపరమాత్మ ఆ యాతనము చూచి సహింపజాలక మనుష్యరూపమున నామెముందర ప్రత్యక్షమై "అమ్మా! నీవు దురంతమైన వేదనకు గురి యగుచున్నావు. నీయాప్సితము పండరిపురమున కరిగి అండలిస్వామిని సేవించవలయు నని కదా! నీకట్లు విప్పివేయుదును; యిపుడే కొందరుభాగవతులు పండరిపురము నకు విఠలనాథుని దర్శింప నరుగుచున్నారు. నీవు వారి వెంట నరిగి నీయభీష్టము తీర్చుకొనుము. నీరూపమున నేను స్తంభమునకు కట్టబడి యుందును. నామాట విను" అని సాదరముగ సక్కుబాయితో బలికెను. తనకు జగదీశుని దర్శన భాగ్యము లభించినందులకు సక్కుబాయి మిగుల సంతసించెను. గాని తనకై పరమేశుడు త్రాళ్ళయందు కట్టబడి యుండుట కామె యిష్టపడలేదు. తన పలుకు లాలింపు మని శ్రీకృష్ణుం డామెకు బహువిధంబుల నచ్చచెప్పెను. జగదీశునుడువులను త్రోసివేయుటకు సక్కుబాయికి సాధ్యము కాలేదు. తోడనే యామె భాగవతులను కలసి అనేకతీర్థములను సేవించుచు పండరి పురమును జేరుకొనెను.

భక్తులదుఃఖభారమును తానువహింపవలె నని సర్వేశుం డనవరతము ఆతురం పడుననుట కిదియొక తార్కాణము. సక్కుబాయి కట్టు త్రాళ్ళను తాను గట్టుకొని ఇంట నాపె పడుకష్టములను తాను స్వీకరించి దురంతయాతనమున కాలవాలమైనగృహమునుండి కొంతకాల మామెకు నిష్కృతి యొసగి పూతవాతావరణ సమన్వితమైన పండరిపురమున కామె నాతఁడు పంపి తనభక్తవాత్సల్యమును తేటపఱచినాడు. అంతియె కాదు. సక్కుబాయియై పదునేను దినములు నిద్రాహారములు లేక స్తంభమున కట్టుపడి యుండి దుస్సహమైన అత్యాచారమునకు తల యొగ్గినాఁడు.

జగదీశుఁడు దుష్టులను దండించు ననియు శిష్టులను కాపాడు ననియు, ప్రతీతి కలదనువిషయమునకు ప్రతిహిందువుడును అవగతుడై యున్నాడు. సక్కుబాయి పడుయాతనమును, చివాలున నాత డంత మొనరింపలేదేల? మీఁదుమిక్కిలి ఆ వేగనమునకు తనతల యొడ్డ నేల?

దుష్ప్రవృత్తులను, మూర్తీభవించిన దుష్ప్రవృత్తులైనవారిని, యెదిరించుపట్ల మానవు డవలంబింపవలయు విధానమును గుఱించి ప్రపంచమహామతములందు భిన్నాభిప్రాయములు లేవు. అహింస పరమధర్మ మని, జలదగంభీరస్వరమున వాకొను హిందూమతము, ఒకరిని సంహరించుటకై ముందులకు లంఘింపదు. ఎదుటిశత్రువునుజయింపు మనునుగాని, తునకతునకలు చేయుమని మనమతము ప్రబోధింపదు. హిందూమతమునుండి జనియించి, నాటికాలపరిస్థితులనుబట్టి కొలదిమాత్రము వ్యత్యాసములు కల బౌద్ధమతము తన యుత్కృష్టసిద్ధాంతము లన్నిటిని అహింసాతత్త్వముమీదనే ఆధార మొనరించినది. పదంపడి తలసూపిన జైనమతమునకు అహింసాపాలనము ఆయువుపట్టైనది. మహావీరుని ఆచార్యునిగా గొనిన పలువురు ఉత్తరహిందూస్థానీయులు నేడును యీతత్త్వమును శిరసావహించుచున్నారు. మహాపురుషుడైన మహమ్మదు హింసను బోధింపలేదు. తనెందరో హింసింప హింసయందలి సౌఖ్యమయిన భావమును నాతడు గుర్తించినాడు. ప్రతిమనుజుడును తనమనుష్యత్వమును నిజజీవనమున ప్రతిష్ఠించుకొనవలె ననియు, మానవులు సోదరులట్లు మెలగి శక్తిసంపన్నులై యుండవలె ననియు, దేవుం డొక్కడే యనియు, ఎల్లరును దేవుని బిడ్డ లనియు నత డుద్బోధించినాడు. మహమ్మదీయులకు నాడును నేడును, అన్యమతస్థులకంటె నధికమైన మతావేశము కలదు. మహమ్మదుప్రవక్త ప్రబోధములను గొన్నింటిని వారు హృదయంగమ మొనరించుకొని ఆత్మజీవనములందు వానిని యింకింపజేసిరి. ఈయంశమున వీరి కీడువచ్చు అన్యమతస్థులు లేరు. మహమ్మదీయులందలి భ్రాతృభావము, సౌహృదయభావము, ఇతరులకు లేదు. ఐనను అహింసాతత్త్వమును వీరంతగా పాటించుచుంట లేదు. అన్యమతస్థులనుండి హింసాప్రవృత్తి ఎగసిపోయె నని, తెలుపుట నాయాశయము కాదు. ఈలోపము ముసల్మానులందు విశేషముగ గోచరించుచున్న దేమో యని సంశయము పడుచుందుము. ఏసు మహాముని అహింసాతత్త్వము నుద్బోధించినాడు. ఉద్బోధించినదాని నాత్మజీవనమున ననుష్ఠించినాడు. ఇత డొక యంజ ముందులకు వేసె నని తెలిపినను తెలుపవచ్చును. ఒకరిని హింసింపకుండుట మాత్రమే గాక హింసించునాతనిపై ఆశీస్సులు గుమ్మరించుట మనుజుని కర్తవ్య మని యితడు పలికినాడు. ఒకచంప నొకడు వాయించిన వేఱొక

చంపను వాని కందియు డనియు, అంగీ యొకడు దొంగిలించుచో అతనికి కోటును దీసి యీయుడనియు అత్యాచారము జేయునాతని కనురాగము జూపు డనియు, యీమహాపురుషుడు మనుజులకు తెలిపినాడు. తన్నొక మొద్దుపై బోర్లదోసి తనవీపును మోకుముదులతో గడుతీవ్రముగా మోది, తనముఖమున బలముకొలది అఘాతములు వేసి, తనశిరమున సీతముండ్ల కిరీటమును గ్రుచ్చి, తనవదనమున కాండ్రించి యుమిసి ఎత్తుకొండమీదికి తనచే నొకశిలువమును మోయించి చోరులతో దాను సము డని జగతికి విశద మొనరించుకొఱకు పైలట్ (రోమన్ పాలకుఁడు) ప్రేరితుడై ఫారసీల దురుద్దేశమును పురస్కరించుకొని దుర్మతులు తనను ఇర్వురు గజదొంగలనడుమ నిలిపి, శిలువమున నిలిపి, శరీరసంధిస్థలములందు వాడిమేకులను గొట్టినపుడు "తండ్రీ! వారిని క్షమింపుము తామేమిచేయుచుంటిరో వారెఱుఁగరు" అని జగదీశు నుద్దేశించి పలికి, తన్ను హింసించునిష్ఠురులపై దివ్యాశీర్వాదము గురిపించి, ఏసుమహాత్ముఁడు అహింసకు ప్రతిరూపంబై వరలినాఁడు.

బౌద్ధక్రైస్తవాదిమతములు తలసూపకమున్నే హిందూమత మీ మహత్తరధర్మమును పృథ్వీవాసుల కుద్బోధించినది. ఒరులను హింసింప కుండుటయగాక పరులవాంఛలను తనుపుటకై శిబిమున్నగువారు తమశరీరములను కోసి వారి కొసగిరి. ఎదుటివ్యక్తినిగాక వ్యక్తిమనమున విజృంభించు దుష్ప్రవృత్తులను దునిమి, ఆతనిసదాశయములను రక్షింపవలె నని సనాతన మతము వాకొనుచున్నది. ఈయద్భుతసత్యమును పాలించుటకే జగదీశు డపుడపుడు మనుష్యరూపున వసుంధరయం దవతరించినాఁడు. రాక్షసులని పేర్కొనబడునవి మనుష్యమానసమును పీడించుదుష్ప్రవృత్తులుగాని పెద్ద ముక్కులును, మూతులునుగల వికృతజీవులు కావు. ఇది యంతరించినగాని మనుష్యమానసమున శాంతము విరాజిల్లదు. ఈశాంతమే రామాయణమున సీతయని పేర్కొనబడినది. ఈశాంతమే మహాభారతమున ద్రౌపదియని తెలుపబడినది. ఈశాంతమును నెదిరించుదుర్భావములను, అంతఃశత్రువులను అడంచు తీరును జగదీశుడు అర్జునునిద్వారా మానవులకు జూపినాఁడు. ఈశ్వరాదేశమును శిరసావహించిననరుడు పరమార్థమును చేబట్టి, ధనంజయుం డనిపించుకొను నని భగవద్గీత తెలుపుచున్నది.

సక్కూబాయిని పీడించుట ఆమె యత్తను దుసుమాడుట పాండురంగని ఆశయము కాదు. తాను స్తంభమునకు కట్టుబడి పదునేనుదినములు నిద్రాహారము లెఱుంగక పడియుండుటకంటె ఒకదుష్టురాలిని పృధ్వీరంగమునుండి తొలగించి, అతఁడు తనభక్తురాలిని రక్షించియుండవలసినదని కొంద అనవచ్చును. అనుచో వీరు హిందూధర్మమందలి గభీరార్థమును గ్రహింపఁజాలని అభాగులని తెలుపదగును. విఠలనాథు డట్లొనరించి యుండుచో, సహనశాంతు లెఱుంగని నిష్ఠురు డనియు, ఈయద్భుతగుణములం దాటితేటిన సక్కూబాయి ఆతనికంటె కోటిసుగుణంగులు మిన్నయై, ఆత డారాధింపవలయు దేవి యనియు ఆతడు దయామయుడగు జగదీశుఁడే కా డనియు నిస్సంశయముగ దెలుపవచ్చును. ఒకవృద్ధవితంతువు—ఆమె యెట్టిగయ్యాళియైనను, రూపఱుచుటకు సర్వశక్తిమంతు డగుభగవంతుని సుదర్శనచక్రముయొక్క అక్కఱ లేదు. ఈవనికి కడంగియుండినచో దేవదేవునిచక్రము తనదుఃఖావమానములను సహింపజాలక తుక్కతుక్క లయ్యేడిది. హింసయు, సంహారమును ఈశ్వరుని ఆశములే యగుచో, అతఁడు సక్కూబాయియందు ప్రవేశించి, నిముసములో వృద్ధవితంతువుయొక్క శిరమును వేయిప్రక్కలు చేయువాఁడు. సచ్చిదానంద, శుద్ధ, బుద్ధ, ముక్త, ఘనస్వరూపమునకు హింస యెట్లు సరిపడును? సూర్యతేజమునకు చెదలు పట్టునా? అమృతసూతి అగ్నికణములను గ్రక్కునా? గులాబిపూవు కంపును వెదలించునా? ఇంద్రధనువు చీకటులను గ్రుమ్మరించునా? పరంజ్యోతి అంధకారము నాహ్వానించునా? శాంతిమయుడగు జగదీశుకు దౌర్జన్యమును కాంక్షించునా? ఎదుటివ్యక్తిహృదయమున ప్రవేశించినదుష్టుని అణంచి శిష్టుని ప్రోచుట జగదీశుని ఆశయము కావున ఈయాశయము నీతండు పరుసూఱు లందినాడు. తనభక్తులచే నంద జేసినాడు. దౌర్జన్యమువలన గాక శాంతసహనములవలనను, స్వార్థత్యాగ అనురాగములవలనను, ఎదుటివానిని జయింపవలె నని ఇతం డనేకమాఱులు నిరూపించినాఁడు. పాఠకమహాశయు లీవిషయమును తెలియుగ నీగ్రంథభూమియందు విలోకింపగలరు.

వాడిఖడ్గములో ఎదుటివ్యక్తిని జగదీశుఁడు సంహారించినను, సంహారింపబడునది ఆవ్యక్తి శరీరముగాని, ఆతని దుష్టబుద్ధి కాదు. చావవలసినది మనను

నంటిన దుర్వాసన. మనసునందలి వాసనలు మడిసినగాని మనుజునకు ముక్తి పాలుకాదు. కొండొకనిర్దిష్టసమయమున కారావాసమును కడుపవలయువ్యక్తి ఒకకైదునుండి వేఱొకకైదునకు పంపబడుచో, రక్షకభటుల బారినుండి తప్పిపోజాలడు. నిర్దిష్టసమయము కడచినపిదప, రక్షకభటులును, కైదులును, కూడ అతనిని విడిచివేయుదు. అప్పుడాతండు ముక్తినందును. కైదీని బట్టియుండుభటు లెట్టివారో, మనసు నంటియుండు వాసనలు నట్టివే. ఒకశరీరము బూదెమైన నేమి? అందు నెల వేర్పఱుచుకొనిన వాసనలు, ప్రవృత్తులు, మడియకున్న, నవి ఆవ్యక్తిజీవు నంటియుండి, ఆజీవుడు ప్రవేశించు యితరశరీరమును జొచ్చును. ఇట్లెన్నిపుట్టువులు కడచినను వాసనలు మానవుని అంతరంగమున నిలిచినంతకాలము ఆతనికిముక్తిలేదు. మానవునిముక్తి కాంక్షించు వాడండు జగదీశుడు. భవబంధములను త్రెంచుకొని, తనతోగలిసి మనుజుడు దివ్యబృందావనమున నృత్యక్రీడల దేలు శుభముహూర్తము నాతడనుక్షణము నాహ్వానించుచుండును. ఎవటివ్యక్తిని, అతడెట్టిదుష్టుడైనను, తునకతునకలు చేయుచో, జగదీశుడు హంతకు డనిపించుకొనును కాని, అతని యంతరంగ సంస్కరణ మొనరించి ఇహజీవనమందే వానికి పునర్జన్మమును ప్రసాదింప దొరకనిచో దేవదేవుం డనిపించుకొనడు. దేవదేవుండు తనసహానముకతన, తనత్యాగముకతన, తనశాంతముకతన, తనయనురాగముకతన, సక్కుబాయి యత్తగారిహృదయమున నీయద్భుతసంస్కరణము గావించి ఆనందించినాడు.

పదునేనుదినములు స్తంభమునకు కట్టుపడియున్న సక్కుబాయిని జూచి నంతనే హృదయరహితమైన స్తంభమునకే కనికరము కలిగెను. తమయపచారమును గుర్తించి అబద్ధపుసక్కుబాయిని వారు విడిపించి ఆమె కన్న మిడిరి.

తనయుద్దేశసిద్ధి నందినపిదప కృష్ణపరమాత్మ విశ్వనాథునింటినుండి వెడలిపోదలచెను. పండరిపుర మరిగి, తనభక్తురాలు ఈప్సితము దీర్చుకొనుట ఆతం డెఱుగును. ఇక కథను ముగించుట తనకర్జ మని అతడు యోజించినాడు. అంతరంగప్రేరణచే నాతడు సక్కుబాయిని నిజగ్రామమునకు మరలించినాడు. నీళ్లకై సరోవరమున కరిగి గట్టుపై సక్కును చూచి, ఆమెను సమీపించి "జననీ! మనమిర్వురము కృతకృత్యుల మైతిమి. ఇక నీగృహంబున కరుగుము.

నీకష్టములు గట్టెక్కినవి. ఇక నీవానందముగ నుండుము.” అని పలికి, బిందెనామె కొసంగి దేవదేవుం డదృశ్యుం డయ్యెను.

సక్కుబాయి యింటికరిగి చూచెనుగదా, అది సంపూర్ణముగ మారి యుండెను. అందలి వేడిగాడ్పు లంతరించి మలయమారుతమునకు తావల మొసంగినవి. పునస్సృష్టి నందిన ఆమెయత్తగారు, అపూర్వరూపమున నామెకు గానంబడెను. తొంటి యుడుకును, తొంటి యారాటమును, తొంటి బాధనతన మును వీడి, విశ్వనాధుడు శ్రోత్రమాసక్తుడై చూచుచుండెను. సక్కు ఆశ్చర్యాన్విత యాయెను.

“తల్లీ! నీమహత్త్వ మెఱుగక బహుభంగుల నిన్ను బాధపెట్టితిని, క్షమింపుము” అని అత్తగారామెను బ్రతిమాలెను “ప్రేయసీ! నిన్ను గుర్తించలేక, మాయమ్మతో గలిసి నిన్ను హింసించితిని. నాయపరాధమును సైరింపు” మని విశ్వనాధుడు తనయర్ధాంగలక్ష్మిని వేడుకొనెను. తన్నుద్దేసించి వారట్టియనునయపూర్వకవచనము లుచ్చరించుట పాడి కాదనిపలికి సక్కుబాయి, వారిరువురకు ప్రణమిల్లి తాను పండరిపురమున కరిగిన యుదంతమును వారికి దెలిపెను.

అవృత్తాంతమును విని వా రాశ్చర్యచకితులైరి. అనుక్షణము తను కను లెదుట దోచుచు, తమయత్యాచారమునకు తల యొగ్గుచునుండు సక్కుబాయి పండరిపురమున కరుగు టేమో వారికి బోధపడలేదు. అత్తగారిని విలోకించి సక్కుబాయి, “ఇం దాశ్చర్యపడవలసినవిషయము లేదు. శ్రీహరి నన్ను పండరిపురమున కంపి నారూపు తాను దాల్చి మీ కూడిగము చేసినాడు. పూర్వజన్మమున మీ రెంతోపుణ్యము సలిపితిరి. కావున శ్రీహరిసేవ నందు భాగ్యము చేకూరినది” అనెను. “ప్రాణేశా! మీయదృష్టము అనిర్వచనీయ మైనది. హరి మీకర్ధాంగలక్ష్మియైనాడు. మీకు సర్వసుఖములు ప్రసాదించి నాడు. మీరు ధన్యులైతిరి” అని యామె నిజేశు నుద్దేశించి పలికినది

అదిమొదలు వారు ప్రణయసంబద్ధజీవులై రేబవలులు హరినామ సంకీర్తన మొనరించుచు పుణ్యావర్తనులై ముక్తి నందిరి.

సక్కుబాయి అత్తగారును, మగండును పూర్వజన్మమున కొంత సత్కర్మను జేయుట చేసియే, హరి కీభవమున ముక్తి లభించెను. ఈ సత్కర్మ నామె మగడు చేసియుండడు. అతడు బహుశాస్త్రములను పఠించునదిట్ట.

మనసునుండి ఆత్మజీవనమున ప్రవేశింపనిపఠనము వ్యర్థ మైనది. పుస్తకపత్ర మెట్టిదియో మానసికపత్రమును నట్టిదియే. ఈపత్రములందు ప్రోగుపడిన భావములు జీవనవిధానమున ప్రవేశించినపుడే, అది ప్రకాశవంతమగు కిరణములను వెదజల్లును. ఘనపాండిత్యము వాంఛనీయ మైనదే. అది ముక్తిని చేత బెట్టదు. మహాపండితులందు ధూర్తులెందరో గోచరించుటెఱుగుదుము. భక్తిమార్గమట్లు, కర్మయోగమట్లు, జ్ఞానయోగము ముక్తి నిచ్చుట నిక్కము. జ్ఞానముకతన తనజీవాత్మను పరమాత్మకు జేర్చినయాతడే జ్ఞానయోగసిద్ధి నందును. వ్యక్తిజ్ఞానము ముకుళితకమలము వంటిది. ఈకమలము ఖిన్నమై యుండును. సూర్యతేజము సోకినంతన నది వికసించును. ఆనందపులకిత మగును. పుండరీకము ప్రభాకరునిపై కన్నుంచి కృతార్థత నందునట్లు, జగదీశునిపై దృష్టిని బద్ధ మొనరించినజ్ఞానమే దివ్యప్రభాకలితమై తన యస్తిత్వమును సార్థక మొనరించుకొనును. సక్కుబాయిమామగారు కొంత జ్ఞానము సంపాదించినారు. కాని వానిది చీకటిబ్రతుకు. ఆతనిజ్ఞానము తేజము నెఱుంగదు. అతం డంధకారమునందే మనుగడ గడపి అంధకారమందే మడసినాడు.

ఆతనికి పూర్వజన్మసత్కర్మకూడ కొఱవడినది. కానిచో, తనకొమరువలె, తనపత్నివగిది కాలక్రమమున నాతడు వెలుగు జూచియేయుండును.

అత్తగారిముక్తికిని, మగనిముక్తికిని, సక్కుబాయి నిమిత్తమాత్ర మైనది. పరమాశయములను చేరుపట్ల మహాశిష్టులును, సచ్చారిత్రులసంసర్గములును మార్గదర్శకము లగును. ఘోరారిష్టముల నాచార్యులుగా బడసి ముక్తి నందినవారిసంఖ్యకంటె, సత్సాంగత్యము నంది, భవార్ణవమును దాటుటకై సచ్చారిత్రులను తెప్పలుగా బడసినవారిసంఖ్య అల్ప మైనది. ఈసంఖ్యయందు జేరినయదృష్టవంతులు సక్కుబాయిమగడును, ఆతని జనయిత్రియును.

సక్కుబాయినిగురించి విడ్డూరపుగాథ లెన్నో వెడలినవి. పండరిపురమున నీమెయాత్మ పరంజ్యోతియందు గలసిపోయె ననియు, నీమెశరీరము దహన మొనరింపబడెననియు, మగడు దాపల లేనందున రుక్మిణి దురంత దుర్దాంత దుస్సహావిరహావేదనముచే కుందె ననియు, సక్కుబాయియెముకల నామెనమ్ముఖమునకు దెప్పించె ననియు, ఆదుమ్ములు హరిభజనము చేయుచుండ

ననియు, రుక్మిణి యేమేమో గొణిగినంతనే అస్థిక లాకస్మికముగ నచ్చ-ళాయిన్నై నిలిచె ననియు, నీగాథలు తెలుపుచున్నవి. బాహ్యేంద్రియములకు గోచరముకాని అద్భుతము లెన్నో అంతరంగానుభవమువలన మాత్రమే స్పష్టమై చూపట్టుట నిక్కము. ప్రత్యక్షజీవనమున ప్రమాణపరికరములకు సంశయములు ఆధ్యాత్మికజీవనమున కొంఱగానిన్నై యుండుటయును నిక్కము. పూజాసుందిరమున, హృదయమందిరమున స్థాయిన్నై నిలువవలసినది దీక్షయో జనయు, తర్కమీమాంసలును, ఊరిగిపలాటపేలుపులునుగాక దృఢవిశ్వాస మగుటయు, ఈవిశ్వాసముకతన ముక్తి నుంజేతికంకణ మగుటయును నిక్కమే. ఇట్లనిన నేదోకొంత వింతవిషయమును దెచ్చిపెట్టి, ఇది యోజన కందని విద్యూరమనియు, గట్టినమ్మికను పురస్కరించుకొని దీనిని ప్రజలు గ్రహింపవలెననియు, తెలుపుట అనుచితము. నాటిభగవంతుడు నేడును ఉన్నాడు.

భగవంతుని జేరుపట్ట జీవాత్మ సల్పవలయుయత్నము నాడెట్టిదో నేడును అట్టిదే! నాడును ముముక్షులున్నారు. నేడును ఉన్నారు సఖ్యయందు విశేషప్రభేద మున్నదని స్పష్టికి సబంధించినసూత్రములందు, ఐహికాముష్మిక జీవనములకు సంబంధించిన నీతులందు జీవాత్మపరమాత్మల సంబంధమునుగురించిన నిబంధనములందు పూర్ణత్వసిద్ధికై కన్నించినమను జుడు అవలంబింపవలయు ప్రధానజీవనవిధులందు స్థలకాలములు ననుసరించిన ప్రభేద ముండదు. మనుష్యనిర్మితసూత్రములకు మార్పు ఉండవచ్చును. నైతిక ఆధ్యాత్మికనిబంధనలందును ఉత్తమాశయములందును పరివర్తనములును, హానసపాదులును ఉండవు. "సత్యం, శివం, సుందరమ్" లు మానవుడందవలయు పరమాశయములు కావా? ఈ మహదాశయముల మహత్త్వము మహాయుగములకు మున్నెట్లువిరాజిల్లెనో నేడును అట్లే విరాజిల్లుచున్నది. భావికాలమందును అట్లే విరాజిల్లును. నాటి సూర్యతేజము, నేడు త్రుప్పుపట్టలేదు. యుగములు కడచినను త్రుప్పు పట్టదు. నాటిచంద్రకిరణములు నేడుగాని రేపుగాని వికలముక్కలై నేలపై బ్రుల్లిపడవు. నాటి పుష్పసౌరభము నేడుగాని రేపు గాని దుర్గంధము కాదు. నాటి యున్నతాశయములు నేడు గడ్డిపీలికలై నేల రాలవు. ఇచ్ఛాశక్తి దృఢనిశ్చయములవలన నాడు సాధ్యమయిన క్రియలు నేడును సాధ్య మగును.

ఆధ్యాత్మికజీవనమున నద్భుతము లన్నికాలములందును గోచరించును. ఈయద్భుతములందు దివ్యజ్యోతిర్లీల గానంబడును. ఇవి మానవుని జగదీశుని దెస నగ్రసరు చేయును. ప్రజలదృష్టి నాకర్షించుట కేదోవింతవిషయము దెచ్చి ఇది యీయద్భుతములం దొక్కటియని వాకొనువారు, జనాళికి విద్య యను దివ్యచక్షువును ప్రసాదించుటకుమారు తెఱనియొగ్గు చేతురు. వారి యవిద్యను వారిమౌఢ్యమును వృద్ధిగావింతురు. సాధ్యాతీతములను కనులెదుట కట్టి నేటిజిజ్ఞాసువుల యాత్మవిశ్వాసమునకు చెఱుపు దెత్తురు. వింతకొఱకును విడ్డూరముకొఱకును చెవిగోసికొనువా రెందరో యుందురు. కావున విషయములు చెలామణీ యగుచుండును. ఇది ధనమును తెచ్చును. కాని కాలక్రమమున ప్రచురణకర్తకు, గ్రంథకర్తకు, రోతను అడలును పుట్టించువిషక్రిములే యావిత్తమునుండి బిలబిల బయల్వెడలును.

రుక్మిణి దురంతమైనవిరహవేదనకు గురియైన దట. జగదీశు డామెకడ నుండి యదృశ్యు డాయెనట, జగదీశు డెవ్వరో, రుక్మిణి యెవరో గ్రహించినవా రిట్లు పలుకరు. మనప్రబంధకవులు పలువురు వివాహమునుగూర్చి వెగటు పుట్టించువ్రాత లెన్నో వ్రాసియుండిరి. విరహబాధయను పిశాచము వారిమనసులను బట్టినదో, వారిదృష్టియందలి నాయికా, నాయకులను బట్టినదో ఊహించుటకు తడవు కాదు. నాటి పాడుసంప్రదాయము మనసాహిత్యములోనికి శాఖోపశాఖలై ప్రవహించినది. ఇట్టివ్రాతలు అంతరించినగాని మనసాహితి సత్యమునుగాని సౌందర్యమునుగాని ఎఱుఁగనిదై యుండును.

సాహితికిని గురుగంభీరచారిత్రమునకును, కళోపాసనమునకును; భాస్వంతభావమును, జీవమును నొసగునవి ఉత్తమాశయములే. కావుననే ఆదర్శగ్రంథకర్తలు ఉత్తమగుణాన్వితులను నాయికా, నాయకుల గావించి కావ్యజగతియందు విడచిరి. సాహిత్యోపాసకులు చేమోడ్చు అందజాల తేజస్విని నక్కాబాయియని పాఠకమహాశయులు గుర్తించియే యుందురు.

---

# ౪౭

# భరతుఁడు

•••○○○•••

ఉ. "ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై
యెవ్వని యందు డిందు బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దాన యైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్."

గురుగంభీరమై గగనమును చుంబించుహిమగిరినిజూచినపుడు ఆత్మఅనిర్వచనీయానందము నందును. ఉన్నతచారిత్రుని, కళాస శోభితమనస్కుని విలోకించినపుడు హృదయము పరితోషముతో పొంగును. మహాపురుషుడు ప్రత్యక్షమైనపుడు తన్మయానందమున నృత్యము సలుపని మానస మేది?

మనుష్యమానసమునుగురించి ఎందరెందరో ఎన్నెన్ని యపోహాలో పడుచుందురు. శరీరమువలెనే ఇది మనుజునకు శత్రు వగునని అనేకు లందురు. కాని హిందూమతము యీ రెంటిని ఈసడించి యెఱుంగదు. ఆత్మవృద్ధికై మనుజుండు వీనితోడ్పాటు నందుచుండవలెనని జగదీశుని ఆశయము. ఆత్మప్రదీపముపై కన్ను వేయక మనసును, శరీరమును తుచ్ఛవాంఛలపై క్షుద్రసుఖములపై నిలిపి ఎందరెందరో పతితు లగుదురు. ఇవి సంసర్గమునుబట్టి పరివర్తన మందుచుండును. ఆత్మప్రదీపకళికనుండి దూరస్థము కాని మానసము అంధకారమున బడజాలదు; దీనితో నవినాభావసంబంధము గల శరీరము తమసమున బొరలాడదు. తమమనసులను అనవరతము దివ్యప్రభాకలితమైన తనయాత్మావరణమున నిలుపుకొనినవారే మహాపురుషులై, మహాత్ములై నిత్యానందమందుచుందురు. అద్భుతాలోకమును వెదజల్లు జ్యోతికెదుట నిలిచినపుడు మన కనులు ఆలోకసందీప్తములు కావా? మనమనసులు దివ్యభావప్రదీప్తములు కావా? మధురగీతిగాలాపనము నంటిశబ్దించు వీణయును, మృదంగమును హృదయమున హాయిని నింపునట్లు ఆత్మనంటి మసలుమనసును, శరీరమును, మనుజున

కెంతేని హాయిం గూర్చును. వీణయును స్పందగమును వేర్వే అగునపుడు విశృంఖల శబ్దము సలుపుచు శ్రోతకు రోత పుట్టించును. మనసును, శరీరమును, ఆత్మ యేమిటియని విచ్చలవిడిగా మసలెనేని మనుష్యజీవనమున కెంతేని జుగుప్స గలిగించును. మహాపురుషుల జీవనములు అలోకప్రదీప్తములే కావు; అవి సౌందర్యశోభితములే కావు. అవి మాధుర్యపూరితములు. వీరియాత్మలును వీరి మనసులును, వీరి శరీరములును ఏకైక పంథ ననుసరించుచు అమృతమయములై వెలయును. వీరిని దర్శించినపుడు కనులకు విందగును. వీరి వాక్కులు వినినపుడు సెవులకు పండు వగును.

ఇట్టి మహాత్ము లెందరో భారతభూమియందు బుట్టిరి. వీరి శరీరములు నేడ దృశ్యములైనను, వీర దృశ్యులు కాలేరు. మనుష్య మహాత్త్వము నశ్వరమగు శరీరములందు గాక మరణమెఱుంగని ఆత్మయందే గదా యుండును! నష్టశరీరులైనను మహాపురుషులు అమరులై అన్నికాలములందును మని యుందురు. వీరు వెదజల్లిన దివ్యభావములు, వీరిజీవనములనుండి ప్రసరించియుంచిన అద్భుతాశయ మరీచులు అస్తమయ మెఱుంగనివై యుండును.

బాహ్యేంద్రియములకు హద్దుపద్దు లున్నవి. లోగల ఇంద్రియముల కవి లేవు. ఎన్నని దృశ్యములను పొడగాంచగలవు ఎన్నని మధుర వాక్కులను వినగలవు. ఆత్మశక్తిసాహాయ్యమున మన యంతశ్శక్తి ఇవియును శక్తిసమన్వితములై స్థలకాలపరిమితులందలి అవాంతరములను నెట్టివేయజాలును. వీనికతన సుదూరభూతకాలమును అంతరంగమున ప్రత్యక్షము చేసికొని నన్నిహితదృశ్యమును గాంచులీల ఆనందింతుము. వీనికతన భావనాపథమునుండి విశాలవిశ్వమందలి అద్భుతము లన్నింటిని అంతరంగపీఠమున నమర్చుకొని ఆనందింతుము ఎన్నడో పృథ్వీతలమున మనియున్న మహాత్ముల దివ్యచారిత్రములను స్మృతిపథమునుండి తెచ్చి, హృదయపూజామందిరమున జ్యోతులట్లు వెలుంగజేయున వివియే. అంతరంగికశక్తికతన స్థలకాలపరిమితులను గూలద్రోసి అనంతకాలమున అనంతవారాశియట్లు వెలయు అద్భుతభావపూరములు అంతరంగము లోనికి ప్రవహింపజేయుచు ఆనతానందమున నింగి తేలుచుందుము. మహాపురుషుల జీవితములనుండియు, హృదయములనుండియు, పలుకులను డిగ్గు, అనవరతముగ వెడలుభావములే ఇట్లద్భుతపూరములై వెలయుచుండును.

ఇట్టిమహాపురుషులు ప్రాచీనభారతమున నెందరో వెలసిరి. ఇంచుమించుగ ప్రపంచమంతయు అజ్ఞానధ్వాంతావృతమై యున్నపుడు భారతభూమి విజ్ఞానమరీచికలచే తేజరిల్లినది. అన్యదేశీయు లెందరో వన్యపశువులట్లు యిందందు నడయాడుచున్నపుడు జగదీశుని చెంగట నిలువజాలుమహాత్ములతో మన నేల వెలసినది. వీరిపాదరేణువులు నేడింకను భారతభూమి యందు అర్థబంధురములై దివ్యరజమ్ములు రంగారి యున్నవి. వీరిభావములు భాసమానక్షత్రములై పృథ్వీవియత్తలమున వెలుగొందుచున్నవి. వీరిజీవనమందలి అద్భుత మహత్త్వము నేటికిని భారతవాతూలమున నవిరళఅదృశ్యతరంగములై ప్రవహించుచున్నది. ఎన్నెన్నియో దండయాత్రలు, ఎన్నెన్నియో విపత్తులు బహుశతాబ్దములనుండి, భారతనిహాయసమున విషవాయువులను గ్రక్కి గమకించినవి. పూతభావబంధురమైన మనవాతూల మీవిషవాయువులను నెట్టివేయుచున్నది. కావుననే నెన్నెన్నియో నాగరకతలు పుట్టి గిట్టినను, ఎన్నడో జనించిన మనసభ్యత నేడును తనదివ్యతేజమును వెలార్చుచు పాశ్చాత్యప్రతీచీవాసుల కన్నోన్నెద్దులను జ్ఞానపిపాసువుల మన్ననలను నందుచున్నది. మన సభ్యతకట్టి అధిక్యమిచ్చిన మహాత్ములే మనవాతావరణమందింతభావపూరమును ప్రవహింపజేసిన మహాపురుషులే మనభారతాంబజీవనమున నింతసౌందర్యమును, ఇంతమాధుర్యమును, ధారవోసిన మహనీయులే మనగతమున భవ్యభాస్వన్మరీచికలను చిమ్మించేసిన మహనీయగుణగరిష్ఠులే వివిధపీఠాధిపతులై ఈగ్రంథభూమియందు గోచరించుచున్నారు. ఇపుడు మనదృష్టినిగలమహాత్ముఁడు భరతుండు.

భరతనామధేయము భారతభూమియందు మిగుల పవిత్రమైనది. ఈనామధేయమే మననేలకు భావబంధురమైన అభిధేయ మొసగినది. ఈపేరున వరలినమహనీయు లందఱు మనసీమయందు పూజనీయులై యుండిరి. వీరిలో జడభరతుఁడు తలమానిక మని నాయూహ. జనకునివలె నీమహాత్ముఁడు ముక్తిని అవలీలగ నందుపుచ్చుకొనినాఁడు. కఠోరములైన పరీక్ష లెన్ని యెదురొడ్డినను ఇతఁడు విచలితచిత్తుఁడు కాక విజయధ్వజ మెత్తినాఁడు. రాము సోదరుఁడైన భరతుఁడు పామరులందఱికినికూడ పరిచితుఁడు. దుష్యంత నందనుఁడును వీరి కపరిచితుఁడు కాఁడు.

మనదృష్టియందు గలభరతుఁడు అతులవైభవసంపన్నుఁడై బహువర్షములు రాజ్యము చేసెను. ఈతనికి మున్ను మనదేశమునకు అజనాభ మను పేరుండెడిది. ఈతనికతన దీనికి భారతవర్ష మను పేరు వచ్చినది. రాజ్యమేలుతరి జనకున ట్లీతఁడు నిర్లిప్తుఁడై పవిత్రచారిత్రుఁడై మెలఁగుచుండువాఁడు. నాఁటిసంప్రదాయము ననుసరించి ఈతఁ డెన్నేని క్రతువులు జరిపినాఁడు. వార్ధకము సమీపించినంతన ప్రజాపాలనము తనయుల కప్పగించి, శేషించిన తన జీవనమును తపమందుఁ గడపుటకై పులహునిఆశ్రమమున కరిగెను.

పులహాశ్రమము గండకీతీరమం దున్నది. గండకి సాలగ్రామశిలావిలసితమై యుండును. పరిసరమున వనలక్ష్మి కిలకిల నగుచుండును.

స్థలవాతావరణముల ప్రభావము అనిర్వచనీయ మైనది. వీనియందలి భావము మహోదధియందగి పెద్దకెరటలవలె వడివడిగ ప్రవహించుచు మనసును తాకును. రమ్యమైన ప్రకృతి రంగారుతలంపుల కాలవాలమై యుండును. పువ్వునిచయమును కనుఁగొనునపుడును, ఆకసమున వజ్రపుతునుకలు తావట మొనరించులీల గోచరించు నక్షత్రములను విలోకించినపుడును, ఎందుండియో సింగారమును దెచ్చుకొని తలపై చివాలున గ్రుమ్మరించుకొనునట్లు తోఁచు ఎత్తుకొండను గాంచినపుడును, ప్రియురాలివలె నిశీథినీసమయమున నల్లన గుసగుసలాడు శైవలినిని తిలకించినపుడును మాటల కందనియానందమున హృదయము పొంగి పోదా ? ఈదృశ్యము లన్నియు స్వర్గమునుండి కొనిరాఁబడి వసుంధరయందు నాటఁబడిన బదనికలు. ఇవి యన్నియు వైకుంఠమును చేతులం దొడ్డి మనుష్యహృదయమున చేరవేయును. కావుననే ముముక్షువులైన మునులును, ముక్తికాంక్షులైన మహాకవులును సౌందర్య సందీప్తమైన ప్రకృతియందు తమ యావాస మేర్పఱచుకొనుచుందురు.

గండకీనదీతీరమందలి ప్రకృతిసౌదర్యమును నేత్రాంజలియందు గ్రోలుచు వివిధకుసుమములను, మధురఫలములను ప్రకృతిమహిళకడనుండి పడసి, మునిబృందపరివృతుఁడై భరతుఁడు నిత్యము శ్రీహరిని బూజించుచు ఆనందించుచుండెను.

ఒంటరియైన యొకఁడు సలుపు ప్రార్థనముకంటె, బలువురతో గలసిసలుపు ప్రార్థనము విశేషభావశక్తిఁ గలదై యుండును. బహువర్షములనుండి ఈవిష

యమునకు భారతీయు లవగతులై యుండిరి. సంఘప్రార్థనమునకు వలసినవ్యవస్థ ప్రజలకు చేకూర్చుటకు మనప్రాచీనులు ఆలయములను స్థాపింప మొదలిడిరి. ప్రార్థనముకొఱకును, సమిష్టిపఠనముకొఱకును, భజనముకొఱకును, మనదేవ స్థానము లుద్దేశింపబడినవి. మనహరికథలందును, భాగవతములందును, యక్ష గానములందునుగూడ ఉన్నతమైన సీ యాధ్యాత్మికభావము విరాజిల్లుచున్నది. మనఋషులు తఱచుగ తమఆశ్రమములందుఁ గలసికొనుచు హోమాదిక్రియలు నెఱవుచుండువారు. వీరు వల్యూ శేకగ్రీవముగ సామగానము నలుపుచుండ, జడములుకూడ తన్మయానందము నందుచుండెడివి. భరతయోగి తోడిముని లను గూడి పులహాశ్రమమున పూజాదినిత్యక్రియలను నలుపుచుండువాఁడు.

భరతుఁ డొకనాఁటిప్రాతఃకాలమున స్నానము చేసి పులినతలమున 'ముహూర్తత్రయం బంతర్జలంబులందు ప్రణవోచ్చరణము' నలుపుచుండెను. అపు డొకలేడి నీరుద్రాగుటకై నదితీరమున కరుదెంచెను. మృగము మిగులఁ చిక్కనై యుండెను.

శాంతమునకును, సౌకుమార్యమునకును, సౌందర్యమునకును, లేడి పట్టుగొమ్మ. ఒకరి కపాయము గాక ఆనందము గలిగించు జంతువు. వ్యాస వాల్మీకి కాళిదాసాది మహాకవుల కలముల కెంతేనిభావముల నొడ్డించిన సుకుమార మృగము. మంచివారికే మహాకష్టములు వరించులాగున పాప మీమృగమునే ఆపద లన్నియు మూఁగొనును. భరతున కనతిదూరమున నీరుద్రావు లేడి నిండుచూలాలు. కన్నబిడ్డకు చనుబా లిచ్చుజనయిత్రివలె నదీమతల్లి చల్లని నీరమును ఆసుకుమారజంతువున కొసఁగుచుండెను. నలుగడలందును శాంతి విరాజిల్లుచుండెను. ఎత్తైన పూలకుప్పయందు ఆకస్మికముగ అగ్నికణ మొగసి పడునట్లు అల్లనల్లన హృదయములోనికి హాయిని ప్రవహింపఁ జేయు ప్రశాంత వాతావరణములపై అపుడు భీమశబ్ద మొకటి పడెను. ఆనంద మంతరించినది. అడలును, ఆరాటమును, ఆవాతావరణమున దాడి వెడలినవి. ఆశబ్దమును సింహ గర్జనము. అది విలయకాల ఘనారావ మట్లు మిగుల భయంకరమై యుండెను. లేడిగుండియలు దడదడలాడినవి. వెన్కనుండి కంఠీరవము ఎగసి పైబడు నను భీతిని చివాలున నిర్భరగర్భిణియగు నాహరిణి యవ్వలి కుఱికినది. అత్తరి దానిగర్భమం దున్నలేడిపినుంగు దైవవశమున నీటియందు జారి పడెను.

అవ్వలియొడ్డునఁ గలకొండరాతిశిలపైఁ బడి తల్లిలేడి పాపము గాయపడి అసువులు బాసెను.

ఈదృశ్యము భరతునికన్నులఁ బడియెను. భయంకరశబ్దము వినవచ్చుటయు, లేడి నదియవ్వలికి దుముకుటయు, గర్భస్థకిశోరము జలములందుఁ బడుటయు తెప్పపాటుకాలములో జరిగిపోయెను. పాపము లేడిబిడ్డ నీటిలో విలవిలఁ దన్నుకొనుచుండెను. యోగీంద్రునిహృదయము కరగిపోయెను. చివాలున నాతఁడు లేచి ఝరీపూరమం దుఱికి, హరిణకిశోరమును బట్టుకొని పదిలముగ దానిని తనయాశ్రమమునకు గొంపోయెను. నాఁడాది భరతుని దృష్టియంతయు లేడిపిల్ల మీఁదనే నాటుకొని పోయెను. ఇందందు మెత్తని లేఁతపచ్చికల నేఱి తెచ్చియు, చల్లని నీరము దోసిటఁ గొనివచ్చియు లేడి కిచ్చుచు దాని నత్యంతాదరమున, నాతఁడు పాలించుచుండెను. చెప్పనేల హరిణడింభము నాతఁడు నిజడింభమునట్లు పెంచుచుండెను. కొన్నాళ్ళ కాలేడిబిడ్డ కొంచ మెదిగినది. ప్రకృతిలక్షణమును బట్టి అది యుత్సవమున గంతులు వేయసాగినది. కన్నబిడ్డ ప్రాకట మాని అల్లనల్లనఁ దప్పటడుగు లిడుచు, నడుమనడుమ గంతులు వేయుచు తండ్రికిని, తల్లికిని ఎంతేని ముదమును గూర్చులీల మృగకిశోరము భరతునకు పరితోషము గూర్చెను. దాని నాతఁ డెత్తి ముద్దాడి, ఒడియందిడుకొని లాలించి పూజాసమయమందు పార్శ్వమున నుండఁబెట్టి బుజ్జగించి అది యిందును అందును ఎగఁబ్రాకి ఏదుష్టమృగమునకైనఁ జిక్కునని యడరుచు దాఁ గూడ దానివెంటఁ బర్వెత్తుచు ప్రణయోత్సాహిత మైన గృహస్థునట్లు కాలముఁ గడుపుచుండెను. ఇట్లుండ ఇందును అందును అడుచు లేడిపిల్ల ఎందో అదృశ్య మాయెను. భరతుఁడు ఎంత వెతకినను, అది కానరాదయ్యెను. "అయ్యో! హరిణపోత మే మయ్యెనో కదా! ఈ యాశ్రమమున బుట్టినతృణములను మేసి పెరిగిన ఈ బిడ్డను బట్టి మృగేంద్రుడు గొట్టి బాధించెనేమో! ఇదెప్పుడు వచ్చి నన్ను సంతోషపఱచునో! 'నానాప్రకారములైన తనగతులచేత నన్ను ఎప్పు డానందంబు నొందించునో! ధ్యానసమాధి నున్నప్పుడు నన్నుఁ గొమ్ములఁ గోఁకుచుండునట్టి వినోదంబు లెప్పుడు గనుఁగొందునో! దేవపూజాద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొని నంగోపించి, చూచినం గుమారుండునుం బోలె దూరంబునకుం జని నిలిచి మరల నేఁ బిలిచిన వెనుక

నిలిచియుండునట్టి' యీలేడిబిడ్డ మరల నాకన్నుల నెన్నడు పడునో! ఈ భూదేవి యెంతయో తపంబు చేసినది కావున హరిణపాదస్పర్శముకతనఁ బవిత్రమైనది. 'స్వర్గాపవర్గకాలములైన మునులకు యజ్ఞార్హ యగునది హరిణపోతమే కదా!' 'భగవంతుడగు చంద్రుఁడు మృగపతిభయంబున, మృతజననియు, స్వాశ్రమపరిభ్రష్టంబు నైనమృగశాబకంబును గొనిపోయి పెంచుచున్నవాడేమో!" అని హరిణనిమిత్తము భరతుఁడు మిగుల దూపిల్లఁ దొడఁగెను.

కొన్నిదినములు కడచిపోయెను. ఇట్లుండ నొక్కనాఁడు లేడిపిల్ల భరతుని సమ్ముఖమున ప్రత్యక్ష మయ్యెను. అప్పు డాతని యానందమునకు మేర లేకపోయెను. మృతుఁడైన నందనుఁడు లేచి వచ్చి కవుగలించుకొనుచో దండ్రి అనిర్వచనీయానందమున నోలలాడులీల లేడిబిడ్డ తనకు మరలఁ దక్కినందున భరతుఁడు పరమానంద భరితుడయ్యెను. కొన్నినాళ్లకు భరతున కంత్యకాల మాసన్న మయ్యెను. "అయ్యో! నాయాయువు ఇఁక సలువదే! పుత్రునిలీలఁ జెనుచుచువచ్చిన ఈలేడిబిడ్డ కిఁక దిక్కేది?" అని వాపోవుచు అతఁడు ప్రాణములు పాసెను. హరిణశాబకముపై మనసుంచి విగతజీవుఁడగుటచే నాతఁడు 'హరిణీగర్భమున జనించి హరిణం బై యొప్పెను.'

అవసానసమయమునగల మనుజుని మానసస్థితి ననుసరించి ఆతనిజీవనమంకలి తరువాతి పుట్టుముందునకు కీయునంతయు ప్రబలతారాక్రమము. మానవుని సంసారమునకు బంధించియుంచు కట్టుత్రాడు కోరిక. నిష్కామ కర్మవలనఁ గాని ఈకట్టుత్రాడు తెగిపడదు; ముక్తియుంజేతికందనియు కాదు. కావుననే "కోరికను సమయింపుము" అని బుద్ధభగవానుడు పలుమాఱు లుద్బోధించెను. తుదిసమయమునఁ గోరిక మనసున నించుకంత మిగిలినను, అది సంకెలయై జీవాత్మను మఱొకపుట్టువునకుఁ గట్టిపెట్టును. జీవాత్మ భావిజీవమును నిర్దిష్ట మొనరించును. ఈయంత్యముహూర్తమును ఆముష్మికానందమందు ముంచుటకు మనుజుఁడు పిన్ననాఁటనుండి దృఢయత్నము సలుపవలెను. అంతియ కాదు, ఈయత్నము బహుజన్మలం దాతఁడు సలిపి నపుడే, అది యవిచలితమైన తపమై, తుదిజన్మమున ముక్తికి సోపానమగు తుదిముహూర్తమును నిర్మించును. ఈతపమున నేమాత్రము లోపమున్నను, అతఁ డామెట్టునుండి జారి మఱొకభవమున గుభాలున కూలిపడును. పరమభక్తుండయ్యు భరతు

డిట్టిలోపమును జూపుటచే కాబోలు ఆతనికి లేడిపుట్టుక తప్పినది కాదు. కాని యించుక యోజించితిమేని, ఇది లోపమా యని మనకు సంశయము కలుగక మానదు. ముక్తికాంక్షి కాక హారిణకాంక్షియైనాఁడు కావున నాతఁడు ముక్తి నందక హారిణజన్మము నందినాఁడు. ఇది భాగవతమందలి సుసువు. భాగవతము మనకు మిగులఁ బునీత మైనది. అందలివాక్కు భగవంతుని వాక్కునియే మన దృఢవిశ్వాసము. ఐహికవాంఛ మనుజు నైహికస్థితులకు బంధించి యుంచుననియు, ఆముష్మికజీవనమందలి మక్కువ అట్టిజీవనమును జీవాత్మ కిచ్చుననియు, స్వర్గ మైనను చిరమై, మనుజున కనంతానంద మిచ్చునది కాదు; కావున దానినైనను కాంక్షింపక, దేనిని గాంక్షింపక కేవలము జగదీశుని దిశకే హృదయమును మరల్చి యుంచువాఁడు ముక్తి నందితీరుననియు మన మతశాస్త్ర తత్త్వశాస్త్రములు తెలుపుచున్నవి. ఇవి గురుగంభీరములైన సత్యములు.

ఆత్మముక్తికై చనిగోసికొను వానికంటె అన్యముక్తికై ఆరాటపడు వాఁడు ఘనుఁ డని చెప్పక తప్పదు ఒరులముక్తికై తాము నరకకుండమున మ్రగ్గియైన పోదు మనిన మహాత్యాగులు వసుంధరయందు (వీరిసంఖ్య మిగుల యల్పమైన నేమి) బుట్టిరి. ఇట్టి యభిప్రాయమును కొలఁదిరోజులకుమున్నే వివేకానందస్వామి వ్యక్తీకరించెను. పరముక్తిప్రముక్కముందలి మహత్త్వము రామకృష్ణపరమహంసగారు ఉగ్గడించెను. భరతుఁడు అంత్యముహూర్తమున తనబిడ్డలకై, తనపాపలకై దుఃఖింపలేదు ధర్మప్రకారము వారికివలసినవ్యవస్థను జేసి, వారితో గల తనసంబంధ ము నాతఁడు చాలకాలమునకు మున్నే త్రెంచుకొనినాఁడు. ఇపు డాతనిబుద్ధి నిలిచినది లేడిబిడ్డపై. పుట్టిననాడే అదితల్లి మమునఁ బెడఁగినది. వనమునందుఁ బుట్టి విచ్చలవిడిగ దిరిగి ఆత్మరక్షణో పాయములు నెఱిఁగిన మృగ మది కాదు. నైసర్గికముగ దాని కట్టిశక్తి చేకుఱు ననుకొనినను అది యింకను కిశోరమై అట్టిసామర్థ్యము నందినది కాదు. తన యవసానముహూర్తము తనపై పులుగువలె వ్రాలుచుండ హృదయముకల వ్యక్తి అట్టిదానినుంగునకై ఆతురపడక మానఁడు. తఱచుగ వన్యమృగములు చరించుతావున భయంకర సింహగర్జనముకతన సకాలమున, జలములందు బడినశాబకము భయంకరకంఠీరవమున కెరయగునేమో యోజించుట సహజ

మైనది. ఈయోజనము పరార్థచింత గాని ఆత్మముక్తిచింత కాదు. ఈభావనము మహత్తర మైనదని నాతలంపు. లేడిబిడ్డకు వేఁకురక్షణ మేర్పడిన పిదప, లేక అదియే పెద్దదియై ఆత్మరక్షణోపాయము నేర్చినపిదప అవసానదశయందొకఁడు దానికై ప్రాకులాడుట అనుచిత మని మనము తెలుపవచ్చును. భరతుని ప్రాకులాట అట్టిది కాదని తోచుచున్నది. తనముక్తినిగాక అతఁడు హరిణముక్తిని ముందుగ యోజించినమహాత్ముఁడు. ఈ యోజన మాతని కట్టికుడుపునది కాక, తన యాధ్యాత్మికబలమువలన హరిణపోతమునకు సత్వర రక్షణోపాయమును జేకూర్చునదై భరతునిముక్తి నిసుమంత చేరువఁ జేయునదై యుండవలసినది. కాని సోపానముపై నడుగువేయపోయినాఁడఁట. కాలు జారి కూలఁబడినాఁడఁట! మహాభక్తుఁడు లేడియై పుట్టినాఁడఁట. "నాకు హరిణపోతస్మరణంబుకతంబున యోగవిఘ్నంబు ప్రాప్తం బయ్యె. మోక్షము దూరముండ నైతి." నని యాతఁడు పదంపడి వగచినాఁడని పోతనామాత్యుఁడు స్పష్టముగఁ దెలిపినాఁడు. మఱియు భరతునివాక్యములుగా పోతన యిట్లు పలికెను.

ఉ. "రాజులు ప్రస్తుతింప సురరాజసమానుఁడనై తనూజులన్
రాజులఁ జేసి తాపసుల రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ
దేజము నొంది యాహరిణదేహమునందలి ప్రీతిఁ జేసి నా
యోజ చెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన బేలనై."

భరతుఁడు హరిణమై పుట్టెను. శరీరావరణముమాత్రము హరిణము. ఆవరణమందున్నవాఁడు మహనీయగుణగరిష్ఠుఁడు. అంతరంగికశక్తికి శరీరమే గుర్తు కాదనుటకు ఈకథ చక్కనిదృష్టాంతమును చూపుచున్నది. ముక్తిని చేరుటకుమున్ను జీవాత్మ అనేకజన్మఘట్టములను దాటవలెననియు, ఈ ఘట్టములు సంబంధరహితములు కాక జీవాత్మపథములందలి మజిలీలనియు, కడచినఘట్టమందలి కృషి తరువాతిఘట్టమున మడియక దానియందలి యత్నమునకు మూలబంధ మగు ననియు ఈ మజిలీలయందు కారణక్రమము చూపట్టు ననియు మనతత్త్వశాస్త్రము తెలుపుచున్నది. ఈ యంశమునే తమయితిహాసములందు వ్యక్తులద్వారా మనపురాణకర్తలు వ్యక్తీకరించిరి. తక్కుంగల తత్త్వశాస్త్రములట్లు హిందూతత్త్వశాస్త్రము ఎత్తుకొండపై నిలిచి సామా

న్యుల కందనిదై యుండలేదు. రంగారురూపు దాల్చి హిందూమతద్వారమున ప్రవేశించి హైందవసాహితియందు విహరించి అసంఖ్యాకులగు ప్రజలను తన పొంత కది ఆకర్షించుకొనినది. కావున తత్త్వశాస్త్రము, మతశాస్త్రము సాహిత్యము మననేలయం దవినాభావసంబంధమున వెలసినవి. మానవుని సర్వతోముఖాభివృద్ధి కివి తోడుపడును. వీని జ్యోతిర్లీల భారతవిజ్ఞానమున దృగ్గోచర మగుచుండును. కావున ప్రభాకలితమయిన సాహితి ముక్తిసాధనము.

భరతుఁడు హరిణరూపున నుండెను. ఈ హరిణము తక్కినహరిణము లట్లు మనలలేదు. తన గతమహత్త్వమును, ఆత్మహృదయమున నిది విలోకించినది. హరిణమం దున్న భరతుఁడు తరువాతిపుట్టువున కై తడయుచుండెను. భరతుఁడు తనతొల్లింటి యాశ్రమమున కరిగి అవసానంబు గోరుచు సంగంబు విడిచి ఏకాకి యగుచు, శుష్కపర్ణ తృణాహారుండై మనలుచు కాలక్రమమున శరీరమును విడిచెను. పదంపడి యాతడు ఆంగీరసుం డను బ్రాహ్మణుని తనయుడై పుట్టెను. పూర్వజన్మస్మృతి గలవాడు కావున తక్కుంగలవారియట్లు విషయచింతలకు మనసుచ్చక చోటీయక కర్మబంధంబుల ఖండింపజాలు నీశ్వరుని నచ్యుతు నజు శ్రవణ మననములను, హరిచరణధ్యానములను, మనమందు బాయనీక నిలిపి సంస్తుతి సేయుచు నిలిచియుండె.

ఆంగీరసున కిద్దరుపత్నులు గలరు. తొలియిల్లాలికి తొమ్మండుగురు కొడుకులును మలియిల్లాలికి కవలు బిడ్డలును ఉండిరి. కుమారులందరికి చాల, ముఖ్యాగ్రకర్మముల నెఱపి వేదవిద్యలయందు ప్రవేశపెట్టెను. కర్మంబుల యందు నిచ్ఛ లేక యుండినను, తండ్రిమొదల నుల్లంఘింపక భరతుఁ డాతఁడు సెప్పినట్లు చేయుచు మనసును హరిమీదనే నిలిపి యుంచువాఁడు. ఇట్లుండ కొంతకాలమున కాంగీరసుండు దివంగతు డయ్యెను. భరతుని తండ్రితోఁగూడ దల్లి అగ్నిప్రవేశ మొనరించెను. ఇంటిపెత్తనము సవతితల్లికొడుకుల చేతుల బడెను. వారు భరతునిమహిమ నెఱుఁగక ఆతనియెడల జుగుప్సాభావమును జూపుచు, శాస్త్రవిద్యలనుండి ఆతని మరలించి ఇంటిపనులందు నియోగించిరి. అతఁ డేమియు బదులుసెప్పక, చెప్పినపనులన్నియు సతమ స్తకుఁడై సలుపుచుండెను.

ఇట్లు గృహకర్మ ప్రవర్తనుం డగుచు నుండ, మూఢులగు ద్విపాదపశువులచే నున్మత్త జడ బధిర యని పిలువబడుచు తదనురూపంబు లగు సంభాషణంబుల నొనర్చుచు నియుక్తకర్మంబులం బ్రవర్తించుచు,

" తే. అతులమృష్టాన్న మైన కుత్సితాన్న మైన
నెద్దివెట్టిన జిహ్వకు హితవు గాగ
తలఁచి భక్షించుఁ దా నొంటఁ దలఁచి మిగుల
బ్రీతి సేయఁడు రుచులందు బెంపుతోడ."

( శ్రీమన్మహాభాగవతము. పంచమస్కంధము )

శరీరమునకును మనసునకును సంబంధించిన సుఖదుఃఖముల నాతఁడు నరకుచేయు కుండెను. నిత్యానందమందే ఆత డనవరతము మునిగి తేలుచుండు వాఁడు. సుఖము ఐహిక మైనది. ఆనంద మో ? అది యాధ్యాత్మిక మైనది. మనప్రాచీనఋషులు సుఖమునకు తిలోదకములు వదలి, ఆనందమును గ్రుంకులిడుచుండువారు. భరతుఁ డట్టిమహాత్ములలో నొక్కండు కాడా ? శీతోష్ణవాత వర్షాతపంబుల నతఁడు లక్ష్యము చేసియెఱుఁగఁడు. ఒడలిపై నీతఁడు వస్త్రము కప్పి యెరుగఁడు. మఱియు వృషభంబునుం బోలెఁ బీనుంగును, కఠినాంగుండును, నగుచు స్థండిలశాయియై రజఃపటలంబునం గప్పంబడిన దివ్యమాణిక్యంబునుం బోలె ననభివ్యక్తబ్రహ్మవర్చసుండై యుండువాడు. మలినాంబరపరీతకటితటుండును, నతిమషీలిప్తయజ్ఞోపవీతుండు నగుటం జేసియజ్ఞజనంబు లతండు బ్రాహ్మణాభాసుండు, మందుండు ననిపలుకుచుండువారు. జనులు పిచ్చివాఁడా యనినను, బుద్ధిహీనుఁడా యనినను, చెవిటివాడా యనినను, నుత్తేమనినను, అత డట్టిక్రోధభావమును వ్యక్తీకరించువాఁడు కాఁడు. తిట్టినఁ బ్రతివచనమిచ్చువాఁడు కాఁడు. కొట్టిన నొడ లొడ్డువాఁడు కాని యెదురుతిరుగు వాఁడు కాఁడు. ఏల యని ప్రశ్నించువాఁడు కాఁడు. 'ఇస్సీ ! యని గాని 'అయ్యో !' అని గాని, 'అమ్మో' అని గాని, మనోవ్యథను వ్యక్తపఱుచువాఁడు కాఁడు. అట్లాతఁడు ప్రవర్తించుచున్నను సవతిసైదోడులు జాలి మాలి ఆతని నిష్ఠురాచరణమునకు గురి గావించుచుండిరి. గృహనిర్వహణోద్యోగమునుండి తొలగించి పొలముకావరితనమం దాతని నప్పగించిరి. అట్టికార్యము కడుంగడు కఠినమైన దనిగాని, జుగుప్సాగర్భితమైన దనిగాని తలఁపక భరతుఁడు నిర్దిష్ట

సమయమున పొల మరుగుచు, అచటికూలిపనులను గూడ తానే చేయ దొడగెను. "నూక, తవుడు, తెలికపిండి, పొట్టు, మాఁడు, ద్రబ్బెడయాదిగాఁ గల ద్రవ్యంబులయందు నరుచిచేయక యమృతంబుపగిది భక్షించుచు" నాతఁడు చేనికావలి యుండువాఁడు.

అత్తఱి వృషలపతియను మేలిక యుండువాఁడు. అతనికి సంతానము లేదు. సంతానప్రాప్తికై దుర్గపూజఁ జేయనెంచి బలికై పురుషపశువు దేనిం గాని కొనిరం డని భటుల కాజ్ఞాపించెను. రాత్రియంతయు వారు తిరిగి వేసారిరి. కాని యెందును వారి కట్టిపశువు లభించలేదు. నిట్టూర్పు విడుచు వెడలుతరి వారికి చేనిగట్టుమీఁది భరతుఁడు కానవచ్చెను. "మనపుణ్యము పుచ్చినది. మనబలి కీపురుషపశు వెంతయుఁ దగినవాఁ డని" త్రు పోసి, అతని గూడ తోడ్కొని పోయిరి. వృషలరాజు సంతోషమునకు మేర లేకుండెను. వెంటనే యాతఁడు భరతునిచే అభ్యంజనాది కృత్యంబులు చేయించెను. వానిభృత్యులు నూతనవస్త్రము లాతనికిఁ గట్టఁబెట్టిరి. గంధ పుష్పాభరణాక్షతాలంకృతునిం జేసి మృష్టాన్నంబులు భుజయింపం బెట్టి, ధూప దీప మాల్య లాజ కిసలయాంకుర ఫలోపహారాదులు సమర్పించి, పంచమహావాద్య ఘోషంబులతోడ నాపురుషపశువుం గాళికాదేవి సమ్ముఖంబున నాసీనుం గావించిరి. రుధిరధారలచే దుర్గను సంతోషపెట్టఁ దలఁచి వృషలపతి అతికరాళంబైన ఖడ్గము నంది దానిచే భరతునికుత్తుకను తెగవేయ నుంకింప,

"సీ. సర్వభూతములకు సఖుఁడును బ్రహ్మభూ
తాత్ముఁడు నిర్వైరుఁ డయినబ్రహ్మ
సుతుని తేజం బతఁ జూడ దుస్సహమైన,
భయమంది వడఁకుచు భద్రకాళి
క్రోధంబు మిన్నుముట్టఁగ హుంకారంబు,
నలుపుచు నట్టహాసంబు చేసి
పాపాత్ములును దౌష్ట్యపరులును రాజస
తామస కర్మసంధాను లగుచు
తే. విప్రవరు నట్లు హింసించు వృషలపతిని
భృత్యవర్గంబుతోఁ దలల్ వృథ్వి గూల్చి

యపుడు వృషలాధిపుని శిర మంది లీలఁ
బాడి యాడుచు నందందఁ గ్రీడ సలిపె. ”

(భాగవతము, పంచమస్కంధము, పద్యము 188)

మనుజుడు దురంతములైనపాపములు సలుపుచు తరచుగ వానిని జగదీశునితలకు గట్టుచుండును. తమహింసాప్రవృత్తి నణచుకొనలేక, నోరులేని జంతువులను చంపుచు, దేవిప్రీత్యర్థ మవి బలికావింపఁబడె నని పలికెదరు. జగములను గనినతల్లి రక్తపిపాసు వగునా? ఘోరక్రియకు సమ్మతించునా? ఇట్టి నింద్యకృత్యముల కామె విముఖయనుట కీయుదంతము చక్కని తార్కాణ మగుచున్నది!

విప్రసూనుండైన భరతుండు ఇంచుకంతైన భయ మొందక, చంపగా వచ్చిన వారియందును, కరవాలమునందును, కాళియందును, అచ్యుతభావ ముంచి, హృదయమున శ్రీహరిని నిలిపి, యే యనుమానము నొందక యే యారాటమును చెందక, ప్రశాంతహృదయుండై చండికాగృహమునుండి వెడలి తనచేనుగట్టు జేరుకొని అం దెప్పటట్లు కావలి యుండెను.

ఇట్లుండ రహూగణుఁడను సింధుదేశాధీశ్వరుండు ఇక్షుమతీతీరమున వసించు కపిలమహాముని గాంచి, తత్త్వవిజ్ఞాన మెఱుంగం గోరి ఒకపాలకి నెక్కి అచటికిం బోవ బయాన మయ్యెను. బోయలు, చేనిగట్టుపై కావలి గాయు విప్రభరతుని విలోకించి, పీడింపు గూర్చుండ నేల? పీ డొకజంతువవలె నున్నాడు. మాపల్లకిని మోయుటకు పనికివచ్చును.” అని అతనిని బరబర లాగుకొనివచ్చి పాలకికొమ్ము నాతనిబుజముపై పెట్టిరి. విప్రుడేమియు మాఱు పలుకక, శిబికను మోయదొడగెను. కాని, అతం డంతకుము న్నెన్నడు పాలకిని మోసిమెఱుగడు కావున మిట్టపల్లము లందు నడచుటచే మిగుల కష్టపడ జొచ్చెను. శిబికగమనమున లోపము గోచరింప రాజు కుపితుండై బోయల నాక్రోశించెను. “ప్రభూ! మావలన దప్పేమియు లేదు. ఈనాలవ వాడు మాతో సరిగ నడువకుండుటచే కొంతయిబ్బంది కలుగు చున్నది.” అని నాతనినుద్దేశించి బోయ లనిరి. క్రుద్ధుడైనరాజు ‘విమర్శ తప్పి’ నివుఱు గప్పిన నిప్పునుం బోలె నెఱుంగరాని బ్రహ్మతేజంబు గల బ్రాహ్మణుని, మహత్త్వ మెఱుగక ఆతని మిగుల దూషించెను. ‘విప్రవరుండు దనకుం గడ

పటిశరీరం బయిన కళేబరంబునందు నహంకారమమకారంబులం బొందనీక మిథ్యాజ్ఞానరహితుండై బ్రహ్మభూతుండై మౌనవ్రతంబున తనశక్తికొలది పాలకిని మోయసాగెను. అపుడు కూడ భూవరున కేదియో యిబ్బంది తోప నతం డుగ్రుండై "ఓరీ! దుర్మతీ! ఓరీ జీవచ్ఛవమా! నాయాజ్ఞ మీఱి నడచెద వేల? నీపొగరణచెద చూడుము" అని విప్రునిపై నిష్ఠురోక్తులు కురి పింప దొడంగెను. అపుడు విప్రుఁడు మన్నీ నుద్దేశించి, ప్రశాంతభావమున నిట్లు పలికెను! "నరేంద్రా! భారము యీశరీరమునకే కాని నాకుఁ గలుగనేరదు. స్థౌల్యకార్శ్యంబులు నాధివ్యాధులు క్షుత్తృష్ణలు నిచ్ఛావిరోధభయంబులు జరామరణంబులు రోషనిద్రాజాగరణంబులు, అహంకార, మమకారమద శోషనాదులును దేహంబుతోడన జనియించుంగాని నాకు గలుగనేరవు. జీవ న్మృతుండ నేన కాదు. ఆద్యంతంబులు గలుగుటంజేసి యందఱియందును గలిగి యుండును. స్వామిభృత్యసంబంధములు విధికృతంబు లగుచువ్యవహారంబులంజేసి శరీరంబులకుం గలుగుం గాని జీవునికి లేక యుండును. రాజాభిమానంబున నీవు నన్నాజ్ఞాపించెదవేని ప్రమత్తుండవైన నీకుం బూర్వస్వభావం బెట్లుండె నట్లు గాక యే నేమి సేయుదు నెఱింగింపుము. ఉన్మత్త మూకాంధ జడులం బోలె సహజస్వభావంబునం బొందిన నాయందు నీ శిక్ష యేమిలాభము పొందింప నేర్చును. స్తబ్ధుండు మత్తుండు నయిననాకు నీశిక్ష వ్యర్థంబగును." ఇట్లని యాతఁ డెప్పటట్లు శిబికను మోయసాగెను. ఈవాక్కులు కడువడిగ రహూగణుని హృదయమునఁ బ్రవేశించి అచటి అంధకారమును దృటిలో తరిమివేసెను. హృదయగ్రంథివిమోచకంబులును బహుయోగగ్రంథసమ్మతంబులు నగువిప్ర వాక్కులు వినినంతన తత్త్వజ్ఞానపిపాసు వగునారాజవల్లభుని గర్వమంతయు నాశన మాయెను. తోడన నతండు శిబిక దిగ్గన డిగ్గ నుఱికి బ్రాహ్మణునకు దండ ప్రణామము లాచరించి చేతులుజోడించి శిరంబున నిడుకొని యిట్లనెను. "మహాత్మా! ని న్నెఱుంగక అపరాధము చేసితిని. అవధూతవేషివై అవని యందు ఏల చరింప వచ్చితివి? ఒంటిగా నేల మసలుచుంటివి? నన్ను గృతార్థుని జేయనెంచు కపిలమహామునీంద్రుడ వేమో తెల్పుము. నీమహత్త్వ మెఱుఁగక దురంతమైన దోషమున కొడిగట్టితిని. మందబుద్ధిని. ని న్నెట్లు గుర్తింప గలుగుదును. నిస్సంగుఁడవై, జడునివోలెనుండి నిగూఢవిజ్ఞానము గలిగియుంటివి.

నీవాక్కులు యోగశాస్త్రసమానములై వాఙ్మనంబులకు నభేద్యంబులై యున్నవి. విష్ణుకళావతీర్ణుఁడైన కపిలమహాముని వలన బ్రహ్మవిద్య నెఱుఁగగోరి చనుచున్నాను. నన్ను కరుణించి నీవే నాకు ప్రసాదింపుము."

తేని ఆకస్మిక ఆంతరంగికపరివర్తనమునకు విప్రుడు మిగుల నానందించి వాని వేడికోలును మన్నించి ఆతనికి బ్రహ్మవిద్యను గఱపెను. 'లోకవ్యవహారమునకు నిత్యత్వం బౌపాధికం బగుం గాని నిత్యంబు గా నేర దని దృష్టాంత నిదర్శనంబుగ' విప్రభరతుఁడు భూనాథునితో నిట్లనెను.

"సీ. పావకశిఖలచే భాండంబు దాఁ దప్త
మగు దప్తఘటముచే నందు నున్న
జలము తపించు నాజలముచే తండులం
బులుతప్త మొంది యప్పుడు విశిష్ట
మైన యన్నం బగు నాచందమునను దా,
దేహేంద్రియంబులఁ దెలివితోడ
నాశ్రయించుక యున్నయట్టి జీవునకు దే
హంబునఁ బ్రాణేంద్రియాదికమున

ఆ. జరగుచుండు నిట్లు సంసారఘటశిక్ష
రక్షకుండు నయినరాజు దుష్ట
కర్మములకుఁ బాసి కంజాక్షపద సేవఁ
జేసెనేని భవముఁ జెందఁ కుండు."

(శ్రీమన్మహాభాగవతము, పంచమస్కంధము, పద్యము 148)

"వ. ......ధర్మాధర్మ వాసనాయుక్తంబు, విషయానురక్తంబు నైన చిత్తంబు గుణప్రవాహంబులచేత వికారంబు నొంది దేవ తిర్యఙ్మనుష్య రూపంబులైన దేహంబులం బుట్టించుచు, కాలప్రాప్తంబులైన సుఖ దుఃఖ తదుభయ ఫలంబుల ననుభవించుచు, ననవరతంబు జీవునికిం బ్రత్యక్షం బగుచు స్థూలసూక్ష్మరూపంబుల నుండు. స్వాంతంబు గుణరహితంబైన ముక్తికారణం బగు. ఘృతవర్తులుగల దీపంబు సధూమశిఖలం బుట్టించు. ఘృతవర్తులు నాశంబు నొందిన స్వరూపంబు బొందు. నీ తెఱంగున మనంబు గుణకర్మాను

బంధంబైన నిజన్మాదులం బుట్టించు. గుణకర్మంబులం బాసెనేనిం బరతత్త్వంబు నొందు. జ్ఞానేంద్రియంబు లేనును విషయంబులమీఁదఁ దోఁచుబుద్ధు లేనును, నభిమానంబును, నను నేకాదశవృత్తులం గూడినమనంబు జీవునికి నసంఖ్యంబు లయిన జన్మంబులం బొందించు. మనోవృత్తుల నతిక్రమించినజీవుండు పరంజ్యోతియైన నారాయణస్వరూపంబుగా నెఱుంగును. స్థావరజంగమంబులయిన జీవులకుం బవనుండు ప్రాణంబై యున్నచందంబున నీశ్వరుండు సర్వభూతాంతర్యామి యగుచు జీవాత్మస్వరూపంబున నుండు. జీవాత్ముండు జ్ఞానోదయంబునం జేసి మాయ నెంతకాలంబు గెలువకుండు నంతకాలంబు ముక్తసంగుండు గాఁడు. అరిషడ్వర్గంబును జయించి, పరతత్త్వంబు నెఱింగిన, నీశ్వరుం డగు. చిత్తం బెంతకాలంబు విషయాసక్తంబగు నంతదడవు సంసారచక్రంబునందు నంచరించుం గావున మహావీరుండైనను, దనకుశత్రువైన, మనంబున నప్రమత్తుండై యిచ్ఛావిహారంబున జగగనీశ పరమగురుండైన శ్రీహరి చరణోపసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం బరతత్త్వంబు నొందును."

భరతునికతన సింధుపతి పరమార్థము నందెను. 'పూర్వకర్మశేషంబునం గల్గుభారవాహకత్వంబుం దలంగింద్రోయుటకు' శిబికభారంబువహించిన భరతుఁడు—గురు గంభీర భాషణంబుల, సింధుభర్తను నిమిత్తమాత్రుని గావించుకొని పృథ్వీవాసులకు పరతత్త్వబోధవినిపించిన భరతుడు అచిరములో ముక్తినంది పరంజ్యోతిని జేరుకొనెను.

ఈకథ మిగుల బవిత్రమైనది. మహాపురుషుల యుదంతము లెన్నేని విందుము. మహాత్ములగాథల నెన్నేని విందుము. భరతునివృత్తాంతము వీనియందు వన్నె కెక్కినది. ఇది పతితహృదయమును తలక్రిందులు చేయునది. పతితకనులనుండి అవిరళముగ బాష్పధారలు కురిపించునది. మహనీయగుణగరిష్ఠుండైన భరతుండు ఎన్నికడగండ్లకు పాల్పడవలసివచ్చునో! శరీరమును, మనసును, సంపూర్ణముగ లొంగదీయగలిగిన కొలదిపాటి మహాపురుషులలో నీత డొక్కడు. శాంతమూర్తియై సహనమునకు మాఱుపేరై దుర్దాంతారిష్టములు పిడుగు లట్లు తలపై దుళ్ళిపడినను ఇంచుకంతైన చలింపక జితేంద్రియుడై ముక్తినందినాడు.

భరతుఁడు మన మెఱుఁగనియెన్ని జన్మముల దాటినాడో! మనమెఱిఁగిన ఈతనిమూఁడుపుట్టుకలును మహిమోపేతములు. ఇంతమహిమగల మానవుడే ముక్తినందుట కిల్లు పిప్పిగావలయుచో, తక్కుంగల మానవు లెన్నికోట్ల జన్మలు కడచి ముక్తి నందుదురో! ఈయద్భుతోదంతము ప్రజలమనస్సులందు నిరాశగొలుప దని ఆశపడుచున్నాను. రాజులందు రాజైనమనుజుడు పరమాశయమును చేరుట కిన్నిఘట్టములు దాటవలసి వచ్చునెడల, ఐశ్వర్య వంతుల మని నేడెంతో విఱ్ఱవీగుచు, తమహృదయముల నెందో పూడ్చిపెట్టి, తోడిమానవులను దురంతమైన అత్యాచార, అవమానములందు, గూలఁ ద్రోయుచు నుండువారు ఆయాశయ మందుట కెంతదూరమందున్నారో యని యోజింపవలసి వచ్చును. ధనముచేనేమి, కీర్తిచేనేమి, కన్నుఁగానక ప్రవర్తించు వారికిని, గర్వాంధులకును, క్రూరచిత్తులకును, ఈపవిత్రోదంతము దివ్యచక్షువు నిచ్చి వారి యంతరంగములం దద్భుతపరివర్తనము గావించి, వలసినంత తత్త్వజ్ఞాన మొసంగి పల్వుర నిది పునీతజీవులను జేయును.

---

## ౪౮

# గుణవతిబాయి



చ. "కరమనురక్తి షట్పదము క్రమ్మసుగంధమరందవాంఛచేఁ
దరమిడి శాతకంటవృతస్ఫుటనవ్యతరప్రసూనమం
జరులను డాయుపోలిక భృశం బగువిఘ్నములన్ జయించుచున్
చరణసరోజముల్ గొలువ నమ్మతి వచ్చితినయ్య కేశవా."

ఈమె ఉత్తరహిందూస్థానమున నొకచిన్న రాష్ట్రము నేలు క్షత్రియకుల వీరునకు నర్ధాంగి. మహాపతివ్రత యని ఈ యువతీమణి పేరు గడించెను. ఈమెకు సేవచేయు దాసీజనంబులో నొకర్తుక పరమభక్తురాలు. తనపనులను తాను నిర్వహించునపుడు కూడ ఈమె తనమానసము నీశ్వరపాదరాజీవము లపై నిలుపుచుండెడిది. మిగుల సాధ్వీమణియైన రాజ్ఞి యీపరిచారికయెడల కడునసురక్తయై మెలంగుచు ఆమెవలెనే తానును హరిసేవయందు కాలము గడుప నిశ్చయించి తనకోరిక దాసి కెఱింగించెను. ఆమెయు మిగులనంతసించి శ్రీకృష్ణమంత్రమును రాజ్ఞికి ఉపదేశించెను.

మంత్రోపదేశము నందినపిదప రాణి రేబవళ్లు తనదృష్టిని జగదీశుని మీదనే నిలిపెను. పూజయందును సంకీర్తనమందును, పారాయణమందును, అభ్యాగతపూజయందును; దీనులను, దుఃఖితులను, రోగులను, యోగులను, సేవించుటయందును ఈమె కాలమును గడుప దొడగెను. సంసారసుఖముల దెస నామెమనసు పోకయుండెను.

అర్ధాంగియొక్క ధోరణి, యామెనడవడి, రాజునకు నచ్చలేదు. భార్య యొక్క దైవభక్తి అధికమైనకొలది ఆతనియాగ్రహ మతిశయింప సాగెను. ఈశ్వర కరుణయందు సంపూర్ణవిశ్వాస ముంచి రాజ్ఞి పూజాదిక్రియలను నిర్వ ర్తించుచునే యుండెను.

విరాగు లరుదెంచుచు తనభార్యకు కూడనిబోధనలు సలుపుచున్నా రని తలంచి యోగు లెవ్వరును తమకోటలో ప్రవేశింపరాదని యాతడు గట్టిగా

కట్టడ కావించెను. తనయాజ్ఞను సరిగా పాలింపుచుండు డని భటులకు దెలిపి కోటలోనియుదంతమును తనకు తెలుపుచుండు మని మంత్రి కాజ్ఞాపించి తేడు వేట కరిగెను.

విరాగులదారులు కట్టుపడినవి కాని రాణి తనపూజాదులను కట్టిపెట్టక ఎప్పటియట్లు నిర్వర్తించుచునే యుండెను. హరిసేవయందే సదా కాలము గడుపదొడగెను. మంత్రి యీవిషయమును అడవికి వేటకరిగిననృపాలునకు తెలియజేసెను. రాజు మిక్కిలి కుపితు డయ్యెను. తనమాట తప్పక చెల్లి తీరవలె నని యాతనికి గట్టిపట్టు. రాణి కావించునది ఉత్తమక్రియయేయనియు, అట్టిక్రియనుండి యామెను మరలింపబూనుట తనకు తగ దనియు, తనయాజ్ఞ కూడని పనియనియు, జగదీశుని పాదారవిందములపై వ్రాలిన మానస మను తుమ్మెద వెనుకకు మరలజాల దనియు రాజు యోచింపక తాను నెగ్గకుండినందు లకు మనసున మిగుల పరితాపము జెంది కుతకుతలాడి కోపము పట్టజాలక రాణిని చంపిరం డని యాతడు నలువురుచారులను నగరమున కంపెను. రాజు మాటకు అడ్డు చెప్పుటకు భీతిల్లి ఆ చారులు కోట కరిగిరి. రాణి యపుడు ధ్యానమగ్నయై యుండెను. అట్టిసమయమున నామెచెంత చేరుటకు భయపడి కొంతదూరమున వా రట్లే నిలువంబడి యుండిరి. ఇంతలో వారిహృదయమున నేదో దారుణమైన బాధ జనించెను. చనిపోయినవారివలె వారు నేల గూలిరి. ధ్యానము ముగించినరాణి వారికి సేవ జేసి తేర్చి వారియుదంత మడిగెను. ఆమెకన్నులనుండి ఒకఅపూర్వతేజస్సు వెడలు చుండెను. ఆమెవాక్కులు భగవతివాక్కులవలె ఆ చారులనలువురచెవుల బడెను. నిముసములో వారి దుశ్చింత మాయ మయ్యెను. ఆ దుశ్చింతతో దురంతమైన వారిహృదయవేద నము కూడ అంత మయ్యెను. రాణిపాదములపై వ్రాలి తమకు తే డొసంగిన యాజ్ఞనుగురించిన యుదంతము నామెకు తెలిపి భృత్యులు తమ్ము క్షమింప వేడుకొనిరి. ఈవృత్తాంతము సర్వమును మంత్రిపుంగవుడు తేని కెఱింగించెను. తాను తలచిన ఎగ్గునకు తాను మిగుల సిగ్గుపడెను. పశ్చాత్తప్తహృదయుడై గృహమునకు తిరిగి వచ్చి తేడు ఇల్లాలిని సమీపించి తనయపరాధమును మన్నింపు మని బహుభంగుల నామెను ప్రార్థించెను. అపు డామె చేతులు మోడ్చి "నాథా! ఈదీనురాలిని మీరిట్లు ప్రార్థింప దగునా? మీహృద

యమున నిట్టి యద్భుతమైన మార్పు గలుగజేసినవాడు దేవదేవుండైన శ్రీకృష్ణుండు. మనల నిరువురను బ్రోచినవాడు కృష్ణపరమాత్మయే. కృష్ణ మంత్రము నా కుపదేశించి పున్నెము కట్టుకొన్నది మనదాసి" అని పలికెను. పరిచారికను పిలిపించి యపు డారాజు తనకుగూడ మంత్రోపదేశ మొనరించి తనను ధన్యుని గావింపు మని ఆమెను కోరెను. శిరముపై చేతులు మొగిచి యాదాసి "రాజేంద్రా! మీకు మంత్రోపదేశము చేయుటకు నే నెంతదానను. రాణీగారు కోరినపుడు కూడ నే నిట్లే పలికితిని. ఎట్టకేలకు వారియాజ్ఞ్సితము తీర్పవలసి వచ్చినది. ఈశ్వరకరుణను పడసితిరి కావున తమహృదయమున నిట్టిసద్బుద్ధి జనియించినది. మనమందరము కలసి భజనసేయుదము రండు" అని పలికెను.

భావబంధురమైన పవిత్రబీజాక్షరములందు విశేషమహత్త్వ ముండు ననియు, శంఖారవమువలె అంతరంగదేవాలయమున నవి ప్రతిధ్వనించు ననియు, ఈశ్వరప్రభావమును మనన మొనరించుకొనుట కామంత్రాక్షరములు తోడు పడుననియు, ఒకనిర్దిష్టసమయమున కొంతకర్మానుష్ఠానమున కొంతదీక్ష నెఱపు టకును, ధ్యానప్రవాహము నిటునటు చెదరనీక అవిరళముగ జగదీశునిదెస ప్రవహింపజేయుటకును, మంత్రపునశ్చరణము మిగుల సహకారి యగు ననియు తెలిసికొని మంత్రోపదేశము చేయు మని రాజు దాసీని వేడుకొనెను. ఆమె యిక సంశయింపక యేలికమనోభీష్టమును దీర్చెను. పరిచారికవృత్తినుండి డామెను తప్పించెను. తనకోటయందు సుందరమగు మఠము నొకదానిని నిర్మించెను. రాజకార్యములు నిర్వర్తించుకొనినపిదప కుటుంబసహితుడై మహీ శుడు అందు పూజాదులు జరుపు చుండువాడు. తనకు మంత్రోపదేశ మొనరిం చిన పురంధ్రిని గురుపీఠమున నిలిపి తనపూజలయందును అర్చనలయందును, ఆమెయొక్క తోడ్పాటు నందుచుండువాడు. గుణవతీబాయి యానందమునకు మేరలేదు. మునుపటికంటె యిపు డెక్కువమక్కువతో నామె అతిథి, అభ్యా గతులను, రోగులను, దీనులను, పూజించి సత్కరింప సాగెను.

'యథా రాజా తథా ప్రజా.' తేడు భక్తాగ్రేసరుడై, తనజీవనమును పుణ్యకార్యాచరణమందు గడపుచుండుట జూచి, బహుజనులు రాజకుటుంబ మొనరించుపూజాది సత్క్రియలందు పాల్గొని సద్గోష్ఠియందు, సత్కర్మయందు,

సత్కాలక్షేపమునందు, విశేషముగ కాలము వెచ్చింప సాగిరి. రాష్ట్రమం దంతటను భజనలు సంకీర్తనలు చెలంగెను.

చాలకాలము పవిత్రజీవనము గడపి గుణవతీబాయి పుడమి విడచి దివం గతయై దివ్యబృందావనమున చిరస్థానము నందినది. దాసియు అచిరకాలము లోనే రాణి ననుగమించెను. రాజ్యభారము తనకుమారున కప్పగించి పృథ్వీ పతియు రేబవళ్లు మఠమందే ధ్యానమగ్నుడై దినములు పుచ్చుచుండువాడు. ఇంచుమించుగ నాతఁడు నిద్రాహారములను వర్జించినాఁడు. ఇట్లు కొలదిమాస ములు కడచినపిదప నతడును తనయర్థాంగిని యామెనెచ్చెలిని కలిసికొనెను.

ఇందలి నీతి మహత్తర మైనది. నిరుపేదరాలును, మిగుల దీనురాలును నైనదాసి యొర్తుక మహసీయ గుణగరిష్ఠయై, గురుపీఠ మలంకరించినది. నరపాలుని, యాతనిరాణిని, నూతనజీవనమునందు దీక్షితులను గావించినది.

నీచస్థితియం దుండిరని నిరుపేదలైనవారిని ప్రాచీనులు దూరముగ తరిమి కొట్టలేదు. వారియందు గొప్పగుణ మేదేని గోచరించినచో దానికి వారు అంజలి ఘటించుచుండువారు. అగ్రజాతులవా రేకాక అన్యజాతులవారు కూడ తమమహత్త్వమును తేటపఱచుతఱి సంఘముయొక్క మన్ననలను పడయుచుండువా రని మనయుద్గ్రంథములు తెలుపుచున్నవి. సంఘపురోభి వృద్ధికై సంఘమందలి ప్రజలు తమప్రత్యేకప్రకృతులను, రుచులను, శక్తులను బట్టి ప్రత్యేకక్రియలు కావించుచూ ఒకేకుటుంబమందలి వారివలె కలసి మెలసి యుండిరి గాని విరోధభావములకు తా వొసగినవారు కారు.

శూద్రవనిత యనియు, తమకూడిగము చేయుటకు నియోగింపబడిన దనియు మనమున సంశయింపక, రాణి ఆమెయొక్క మహత్త్వమును గుర్తించి, యామెను ఉన్నతాసనమున వసియింప జేసినది. జే డామె ననుక రించెను. ప్రజ్ఞ ఎందు గోచరించినను హిందువులు దానికి పట్టము గట్ట నాశ పడుదు రనుటకు యీకథ చక్కనితార్కాణమై యున్నది.

ఎదుట దౌష్ట్యము గోచరించుతఱి దౌష్ట్యమువలన గాక అనురాగము వలన దాని నణగింపవలెనని తొలుత ప్రపంచమునకు తెలిపినది మనహిందూ మతము. పాశ్చాత్యదేశములలో పన్ను నూడబెఱికినవాని పన్నును, కన్ను పీకినవాని కన్నును, తొలగింపవచ్చు ననువిచిత్రసిద్ధాంతము ప్రబలి యున్న

వుడు హింస మార్గాకానినపుడు అహింస నభ్యసింపుడని సనాతనమతము ప్రజల కుద్బోధించినది. అహింసాతత్త్వమును బౌద్ధ, జైన, మతములు బల పరచినవి. ప్రత్యేకబౌద్ధమతమునందు యీతత్త్వమహాత్త్వము తొలుకాడు చున్నది. యజ్ఞమునకై జీవహింస గావించిన విప్రుడొకడు యజ్ఞపశువై జన్మించి తనకుత్తుక నర్పింప వలసివచ్చె ననియు, తానుచేసిన చేతయొక్క ఫలితము ననుభవించి తీరెననియు, మనగ్రంథములు తెలుపు చున్నవి. ఇరువురు రాజన్యులు రథారూఢులై ఒకరి కొక రొకనన్నని కొండ తెరువునం దెదురైన తరి ప్రత్యేకరాజన్యుని గుణాధిక్యత ననుసరించి ఒకడు రెండవయాతనికి తొలుత త్రోవ యొసగవలె ననియొడబడెననియు, హింస చేసినవాని నహింసచే నాదరించుట తనయాశయముగా గలనృపాలునకు రెండవయాతడు మార్గ మొసగుటకై తనరథమునుండి దిగి దాని నొకమూలకు తప్పించె ననియు, మొదటివ్యక్తి ముందుల కగ్రసరు డాయెననియు, అహింసావ్రతతత్త్వరునకే అధికమాన్యము లభించుననియు, సుజీయొక గ్రంథము తెలుపుచున్నది. బౌద్ధులు అహింసాతత్త్వమును అనేక దేశములందు ప్రచారము లొనరించిరి. మహావీరుడు స్థాపించినజైనమతమున నీఉద్బోధనము విశేషస్థానము నొంది నది. యేసుక్రీస్తుకూడ యీమహత్తరప్రబోధము కావించి తన్ను దురంత దుర్మరణమునకు గురిచేయువారిపై కరుణాపూరిత మైన తనహృదయమును గ్రుమ్మరించి తా మేమిచేయుచుండిరో ఎఱుగనివారిని రక్షింపు మని జగదీశుని వేడుకొనెను.

సర్వమతములును బోధించుఅహింసావ్రతమును తమజీవనములందు అనుష్ఠించినవారిసంఖ్య మిక్కిలి తక్కువ. ఇక్కాలమున వసుంధరయందు హింస పెచ్చిల్లు చున్నది. హిందూమతము పునరుద్ధరణము నందిననాడే ఉత్త మాశయములు విజయకేతనముల నెత్తగలవు.

హింస శారీరకము మాత్రమే కాదు. మానసికముకూడ నగును. గదచే శరీరముపై వేయునాఘాతముకంటె దుష్టవాక్కులచే నెదుటివానిమన సున నొక డేయు ఆఘాతము విశేషబాధను గొలుపును. పరుషవాక్కులందు ఆరితేరినవాడు హింసయందు సిద్ధహస్తు డని మనము నిస్సంకోచముగ చెప్ప వచ్చును. హింసయొక్క తొలిఘట్టమందు దుశ్చింత; మలిఘట్టమునందు

దుర్వ్యాక్కు; తరువాతిఘట్టమందు దుష్క్రియ. అది యీమూఁడుఘట్టములందు నెందు తలసూపినను నిందింపదగినదే. తొలిఘట్టమందలి దానియస్తిత్వమును గురుతించునాతఁడు అంతర్యామియే. భావముతోఁచి వెంటనే అదినశింపదు. కాలక్రమమున తరువాతిఘట్టములందు అది యుబికితీరును. భావశక్తి సామాన్యమైనది కాదు. దుర్భావమును హృదయమున తలయెత్తనీయకుండుటకై దానిని పరిశుభ్రముగ మానవుఁ డుంచి తీరవలెనని మతములన్నియు ప్రబోధించుచున్నవి. మనసున దుర్భావము ప్రవేశించెనేని సద్భావముచే దానిని తరిమివేయవలెను. ఇది దానికంటె బలవత్తరమైన దయినచో నీపోరాటమున జయము గాంచగలదు.

ఈకథయందలి రాణి సాధ్వీతిలకము. ఆమెభర్త సాధుగుణ మెఱుంగనితేఁడు. తేఁడు నిప్పులు చెరుగుచున్నను, ఆమె అనురాగమును, వినయమును భక్తిని జూపెను. ఈ సద్గుణములు సుధాబిందువులు. తేని క్రోధాగ్నియందు యీసుధాబిందువులు పడినంతనే అది చల్లారెను.

ఎట్టిమహాపాపియైనను చిరకాలము పాపియై యుండఁడు. మృగమైయొకప్పుడును వృక్షమై వేఱొకప్పుడును పిపీలికమై యిక నొకప్పుడును పక్షియై మఱొకప్పుడును అతఁడు పుట్టవచ్చును. నేఁడుమానవుఁడై యతఁడు దారులు కొట్టవచ్చును. హంతకుఁడై మనుష్యరక్తము ద్రాగవచ్చును. ఈ దౌర్జన్యము తుత్తునియలగుట నిశ్చయము. ఒక్కనాటితో యొక్కజన్మతో తునియలు కాదు. నిజమే. అనంతకాలమున నీపుట్టువులు నీటిబొట్టుల వంటివి. పాపము పండి నేలరాలిపోవుననియు పాపాత్ములు మహాత్ములగుదురనియు కిరాతులు వాల్మీకులు కాఁజాలుదురనియు మనసాహిత్యము మన తత్త్వశాస్త్రము మన సనాతనమతము ఘనగంభీరభాషణంబుల దెలుపుచున్నవి. భవపరంపరలు తన యాదర్శము దెస నగ్రసరుడగుటకై మానవుఁ డందు తరుణములు.

చదువరులు లవణరాజు కథ నెఱిగియుందురు. సభాస్థలియందు తన గద్దెపై నాసీనుఁడైయున్న ఆ రాజన్యుఁడు కొలఁది నిముసములు కనులుమూసి ఇంద్రజాలమహిమ కతన బహువర్షము లెందో ఏ పుట్టువునందో మనియుండి అనేకసుఖదుఃఖములకు పాల్పడెననియు కనులు తెఱచి సభాస్థలినిగాంచి అచ్చెరువు నొందెననియు నాతని కథావృత్తాంతము తెలుపుచున్నది. బహుజన్మ

పరంపరలు కొలదినిముసములలో నణగిపోయినవి. మనుజు డీమాయయందు తిరుగాడుచున్నాడు. ఐహికజన్మయంతయు నొక నిద్దురయని యొకానొక వేదాంతిచెప్పెను. నిద్దురనుండి మేలు కాంచినంతన నంతకుమున్ను మనము కనిన కలలన్నియు మిథ్యలని యెట్లు తలంతుమో ఐహికజన్మలను కడచిన పిదప దివ్యబృందావనమైన మన స్వాంతస్థలమున కనులు తెఱచినంతనే వెనుకటి పుట్టువులన్నియు కలలవంటివని గుర్తింతుము. ఎన్నటికిని కడువ వని మనము తలంచిన ఏండ్లును పూండ్లును చరచర సాగిపోవునవియే. తన పరమాశయము ను చేరుటకు మానవు డీభవపరంపరల నుండి కడచిపోవలెను. బహుజన్మలు కొన్ని మాయామయ ముహూర్తములందు, కొన్ని దివ్యముహూర్తములందు నీ భవపరంపరలు బుడుంగు మనవచ్చును. ఈకథ యందలి జేడు పెక్కు జన్మలనుండి కడచి పొందజాలు మహత్తరానుభవము నొక్క దివ్యముహూర్త మందు పొందకలిగినాడు. ఈముహూర్తమందే యాతడు పునర్జన్మ మందెనని చెప్పనగును. ఇదియే యైహికపునర్జన్మము.

ఈ జేడు యిట్టి అద్భుతపరివర్తనము నొంది భార్యాపరిచారికలతో తాను ముక్తి నొందుటయే కాక నిజరాష్ట్రములోని పలువురు ప్రజలు ముక్తి మార్గమునందుటకై కావలసిన ఆధ్యాత్మికనైతిక వ్యవస్థలు కావించినాడు. హిందూమతసిద్ధాంతముల ననుష్ఠించు వ్యక్తికి ఎన్నటికైన ముక్తి ముంజేతి కంకణము కాగలదని ఈ యుదంతము విశద మొనరించుచున్నది.

---

## ౪౬

# నందనారు



మ. "ధరణీనాథులు మోహబద్ధులగుచున్ ధైర్యంబు వోనాడి తా
మరుదేరంగఁ గతంబెఱింగక చికాకందన్ రథారోహస
త్వరవైదర్భిని రుక్మిణిన్ రథముపై దర్పించి యెక్కించి వే
హరులన్ ఱొప్పుచుఁ బోవుసామికిదె జోహారుల్ కృపాభూమికిన్."

మనుష్యహృదయమున జగదీశుఁడు తేజరిల్లుచున్నాఁడు. మనుష్యుఁ డేజాతి వాఁడైన నేమి? అతనిహృదయము ఈశ్వరున కాలవాలమై యుండును. జాతి భేదములు పృథ్వీసామ్రాజ్యమునం దున్నవి కాని జగదీశ్వరుని సామ్రాజ్యమున లేవు. శ్మశానవాటిక కరిగి చూడుడు. బ్రాహ్మణశవము బూడిద యొకతీఱు నను చండాలశవము బూడిద మఱియొకతీఱునను ఉండదు. వర్ణవ్యత్యాస ముల నడిగి తెలిసికొని భగవంతుఁడు జీవులను తనయక్కున జేర్చుకొనఁడు. ఏ జాతివానిదైన నేమి! అది పవిత్రమైన హృదయమైనచో నత డాలింగనము చేసికొనును. హిందూసంఘమున పంచము లనఁబడువా రున్నారుగదా. వర్ణా శ్రమధర్మమున నీ పంచములు కావింపవలసిన ప్రత్యేకకార్యక్రమము కలదు. ఈకార్యక్రమము ధర్మబద్ధమైనది. పంచముఁడు తన కర్తవ్యమును తాను నెఱవుకొని తనధర్మమును తాను నిర్వహించుకొని సంఘాభ్యుదయమునకు తాను చేర్చవలయు దానిని జేర్చి ముక్తి నందును.

కాని కాలము గడచినకొలది వర్ణాశ్రమధర్మమందలి మహత్త్వ మదృశ్యము కా దొడగినది. వేఱ్వేఱు జాతులందు ఒకప్పు డుండిన ప్రణయభావము ఇంచుమించుగ మాయమైనది. పరస్పరవైషమ్యములు పొడసూపినవి. పంచ ములు నికృష్టులుగ నీచులుగ పరిగణింపబడిరి. అవిద్యయందును దారిద్ర్యమం దును అనారోగ్యమందును వీరు తనువులు కడుపవలసివచ్చినది. శునకమార్జాల ములను పొత్తిళ్ల జేర్చుకొని ముద్దాడువారే వీరు అస్పృశ్యులనియు అంటరాని

వారని వీరి నీడ తమకు సోకరాదని బలికిరి. నిష్ఠురాచరణమునకు గుఱియై మిక్కిలి నికృష్ణమగు జీవనము కడుపువారయ్యు వీరిలో కొందఱు ఈశ్వర తేజమును కనులార గాంచవలెనని తపియించిరి. వీరితపము ఫలించినది. వీరు మహాభక్తులందు చిరస్థాన మలంకరించిరి. సర్వకాలములయందు సర్వదేశముల యందు సర్వజాతులవారిచే వీరు పూజనీయులై యుండిరి.

వీరిని గుఱించిన కథలయందు చిత్రవిచిత్రము లెన్నియో అల్లుకొని యున్నవి. ప్రతిభకలవారి చరిత్రచుట్టును విస్తారపుగాథ లలముకొని యుం డుట సహజమే కదా! ఈ చిత్రవిచిత్రములయందు మనస్సును ప్రవేశపెట్టి పరిశీలించితిమేని వానియందు కొన్ని యత్యుక్తులును అలంకారములును ఉన్నను సత్యముకూడ కలదని గ్రహింతుము. నందనారు చరిత్ర అబద్ధముకాదు. అతడు కవులచే సృష్టింపబడిన బూటకపుజీవి కాడు. నందనారువలెనే పంచములందు జనించిన, చోకమేల ; రవిదాసులు ; పరమభాగవతోత్తములు సాహిత్యప్రమా ణములును చారిత్రకమైన ఋజువులును బహుళముగా నుండుటచే విచిత్రము లకు చోటిచ్చినను వీరియుదంతములు విశ్వసనీయములు.

చరిత్రయుగమునందు దక్షిణభారతదేశము కళోపాసనమునందును, మతోపాసకము నందును మిగుల వృద్ధిచెందినది. చిరకాలము ప్రఖ్యాతములై యుండజాలు రచనలు అత్తఱి ఆంధ్రదేశమున జనించినవి. చోళులును, పాండ్యు లును, నాయకులును, సాహిత్యాభిమానులును, మతోద్ధారకులునై దక్షిణ దేశమున ననేకస్థలములయందు తమపాలనమును నెలకొలిపిరి. వీరిపాలనము నందు ప్రజలు భక్తిగుణమం దాఱితేఱి యుండిరి. దేశమందు సిరిసంపదలు మెండై యుండుటచే రాజులకు విశేషమయిన రాబడి యుండెడిది. వీరు తమయై శ్వర్యమును దుర్వ్యయమొనరింపక కళలను వృద్ధిచేయుటకును దేవాలయములను నిర్మించుటకును, వినియోగించెడివారు. చోళభూపాలుడు ఉత్తరరాజన్యులను జయించి తంజావూరులో నొకపెద్దఆలయము కట్టించినాడు. ఆ ఆలయనిర్మాణము ముగియునప్పటి కిరువదేండ్లు పట్టినది. ప్రతిదిన మానరేంద్రుడు ఆమందిరమున ప్రార్థనము సలుపుచుండువాడు. పాండ్యప్రతిభకు ఆటపందిరియైన మగధ యందు పరమభక్తాగ్రేసరుడగు పాండ్యరాజు విశేషధనము వెచ్చించి దూర దేశములనుండి శిల్పకౌశలమున పేరుపడినవారిని పెక్కుర రావించి మిక్కిలి

చక్కని మందిరములను గట్టించినాడు. ఇది దేవాలయయుగము. రాజన్యులు తమధనమును ఆలయనిర్మాణమునకు ధారవోసినట్లు కృషికులుకూడ తమకు కలదానిలో కొంత అట్టి సత్కార్యములకై వినియోగించుచుండిరి. బహు ప్రాకారసంశోభితములైన దేవాలయమందిరముల పరికించినంతనే ప్రజలహృదయములు సంతోషపూరితము లయ్యేడివి. పండితులకును, పామరులకును, యోగిజనులకును, సామాన్యమానవులకును, మహాయోధులకును, బీదసాదలకునుకూడ ఈదేవభవనములు ఆరాధింపదగినవై యుండెడివి.

దేవాలయమున ప్రవేశించి అందు దేవుని పూజించుట మహాభాగ్యమని ప్రజ లూహించు ఈ కాలమున నందనారు ఆదనూరు అను గ్రామమున పుట్టినాడు. ఈ యూరు తంజావూరు జిల్లాలలో కొలెరూన్ అను నదికి అనతి దూరమున నున్నది. ఆతడు మాలకులమునందు జన్మించెను. భూమినిదున్నుట, చచ్చినపశువులను తొలగించుట, కాటికాపరితన మొనరించుట మొదలగు కృత్యములు వీరిదైనిక క్రియలై యుండెను. కూలినాలిచేసి వీరు అనుదినము సంపాదించు పైకమునకు తోడుగా పశువులతోళ్లను అమ్ముటవలన వచ్చిన పైకము కొంతసాయము కాగా వీరు జీవయాత్ర కడపుచుండువారు. ఊరు వెలపల వీరు ప్రత్యేకమైన యొకగూడెమందు వసించుచుందురు. తడిపొలము లందును రొంపియందును కొన్ని గుడిసెలు వేయబడియుండును. దీనినే గూడెమందురు. నందనారు వసించెడి గూడెము బురదతో నిండి చూచుటకు మిగుల నసహ్యాకరముగ నుండెను. గూడెముచుట్టును చేపలచే నిండిన కుళ్లునీటిగుంటలుండెను. చేపలపెంట, కోళ్లయీకలు, యిందందు గూడెముసందులలో విరజిమ్మబడియుండెడివి. చేపలముక్కలను మాంసఖండములను అపేక్షించి గ్రద్దలు యెల్లప్పుడు గూడెముపై పందిరి వేసినట్లు యెగురుచుండెడివి. రాత్రియనక పవ లనక యెల్లప్పుడు కుక్కలు వీధులందు మొఱగుచుండెడివి. గుడిసెలకు ముందు వెనుకల కుళ్లుతోళ్లను యితర యేహ్యావస్తువులును నిండియుండెడివి.

నందనారు యిట్టిప్రదేశమందు పుట్టినాడు. బాహ్యాపంకము ఆతని అంతరంగమును అంటలేదు. పూర్వజన్మమునుండియు తదేకదృష్టితో నతడు జగదీశుని సేవింపుచునే యుండవచ్చును. తోడిమాలపిల్లలను పిలుచుకొనిపోయి యే చావడియందో దొడ్డియందో, ఆటలయందును, పాటలయందును, భజన

యందును, ప్రార్థనయందును బాలకుడైన నందుడు కాలము గడుపుచుండువాడు. ఆవేశపరవశుడై గొంతెత్తి "హర! హర! మహాదేవ!" అనియు "శివ శివ!" అనియు పలికి చెలిమికాండ్ర నట్లుపలుకు డని యాత డుత్సహించు వాడు. సమీపగ్రామముల యందలి దేవళమ్ములకు బోయి దూరమునం దుండి యైనను స్వామినిదర్శించి ప్రార్థించి తా నీయగలిగిన సంబారములను స్వామికి సమర్పించుచుండువాడు. పాప మాత డీయగలిగిన దేమున్నది, తనగూడెము నందు లభించు గోరోజనము చర్మపుముక్కలునుగాక. అవియే కొంపోయి గుడి పూజారుల కొసంగి గోరోజన మభిషేకమున కుపయోగింపుడనియు చర్మపు ముక్కలు గుడిమద్దెలల కుపయోగింపుడనియు వారిని వేడుకొనుచుండువాడు. ఆనంద పారవశ్యమున మేను మఱచుచుండువాడు. ఆ దేవాలయములనుండి యింటికి తిరిగివచ్చి మిక్కిలి యుత్సాహముతో పొలముదున్నుట మొదలగు వ్యవసాయపు పనులయందు మిగుల చాకచక్యముతో పనిచేయుచుండువాడు. దేవతాదర్శనము వలనను, ప్రార్థనము వలనను హృదయమున కెట్టి యానం దము కలుగునో తోడిజాతీయుల కతడు దెలుపుచుండువాడు. చప్పటులు కొట్టుచు అఱచుచు నతడు "రండు! రండు!" "ఆడుదము" "ఆడుదము" "రథము లాగుదము" అని యొకమాఱును "మనము క్షణభంగురములగు ప్రపంచసుఖముల విషయమే ఆలోచింతుము. కాని జగదీశుని చరణారవింద ముల నెప్పుడును స్మరింపనే స్మరింపము" ని యోచనాపరుడై మరియొకప్పుడును పలుకుచుండువాడు.

నందనారుప్రబోధము తోడివారలకు రుచింపలేదు. తమజాతికి తగని మాటలు పలుకుటవలనను, తమ జాతికి తగని క్రియలు చేయుటవలనను తమకు మిక్కిలి కీడుమూడు నని వా రడలజొచ్చిరి. పెద్దపెద్ద కులస్థులు చేయదగిన పనులు నీచకులస్థుల రయిన తాము పొనరించినచో జగదీశునకు తమపై యాగ్రహము వచ్చునని వారు భయపడిరి. ఆగూడెమంతయు నొక బ్రాహ్మణుని కమతమునకు జేరి యున్నది. ఆబ్రాహ్మణునికి కోపము వచ్చెనేని తాము మూటముల్లె కట్టుకొని పొరుగూళ్లకు పోవలసినదే. తన బుద్ధిని మార్చుకొని తనచేతలు మానుకొని తనకులమున కుచితమైన యట్లు ప్రవర్తింపుమని నందునికి బోధ చేయువలసినదని గూడెమువా రందఱును తమలో

పెద్దలను వేడుకొనిరి. కానివా రెంతప్రయత్నము చేసినను నందనారు తన పంతనుండి యినుమంతయు కదలడయ్యెను. తమకులమున చెడబుట్టినపాపి యనియు, తమకు ముప్పు తెచ్చిన ముష్కరుడనియు, తమగూడెమును పెల్లగించు పిశాచ మనియు పలుతెఱంగుల గూడెములోనివారందఱును నందుని దూషింప దొడగిరి. నందు డేమియు వారికి ప్రతివచనమీయక వారి మౌఢ్యమునకు మిగుల వగచుచుండువాడు. కాని యాతని వయసువారలు కొందఱు మాత్రము సహవాసబలముచే నతడు చెప్పినచొప్పున నాచరించుచుండువారు. వీరి సంఖ్య పదునొకండు మాత్రమే.

ఒకనాడీపదునొకండుగురను వెంట నిడికొని నందుడు 'తిరుప్పన్‌గర్' పోయి, అందలి ఈశ్వరుని దర్శింప మక్కువపడెను. ప్రయాణము కడుదీర్ఘ మయినది. భజనసేయుచు, సంకీర్తన మొనరించుచు మిక్కిలి యుత్సాహముతో వారు ప్రయాణము సాగించిరి. చాలదినములు నడచి వారాయూరు చేరుకొనిరి. గ్రామమునకు తూర్పుదిక్కున నిలిచి చూచినంతనే ఆలయగోపురము సూర్యరశ్మియందు తళతళలాడుచు కనుపించినది. నాలుగడుగులు వేసిరి. మందిరమండపము వారికి చేరువయైనది. అమందానందమగ్నులయి నందాదులు నేలపై సాగిలపడి లేచి నుదుట చేతులుజోడించి గట్టిగా సంకీర్తనము చేయసాగిరి. ఉన్నతమైన నంది దేవాలయద్వారమున కెదురుగ నున్నందున వారికి స్వామిదర్శనము కాలేదు. నందుని మానసము దుర్భరదుఃఖముచే నిండిపోయెను. "స్వామీ! నీమందిరము చెంతకువచ్చియు నీదర్శనము లభింపక నేను వెడలిపోవలసినదేనా? నాపాపములన్నియు నందిరూపము దాల్చి నీకును, నాకును నడుమ నిలిచి యున్నవికాబోలు" అని యాత డెలుగెత్తి యేడ్చెను. నందుని యార్తనాదమువిని యెదుటనున్న నందిని ప్రక్కకు తొలంగుమని స్వామి యాజ్ఞాపించెనని నేటికిని యచటిప్రజలు చెప్పుచుందురు. నేటికిని ఆనంది మాత్రము గుడిద్వారమున కెట్టయెదుటగాక కొంచెము ప్రక్కగనే యున్నదట. నందుని యానందమునకు మితిలేకపోయెను. ఆదినమంతయు భజనయందును సంకీర్తనమునందును, ప్రార్థనమునందును నతడు కడపివేసినాడు. తాను తెచ్చిన గోరోచనమును చర్మమును స్వామికి సమర్పించినాడు.

ఆలయసమ్ముఖమునం దొకచిన్నగుంట కలదు. నందునిదృష్టి దానిపై బడెను. ఆగుంట నొక చక్కని కాసారముగా త్రవ్వవలె నని యాతనికి తోచినది. అట్టి సరోవరము యాత్రికులకు స్నానపానములకు పనికివచ్చు ననియు పశుపక్ష్యాదుల దాహము దీర్చునదై యుండు ననియు నాతడు తలంచెను. తనతోవచ్చిన కొలదిమందిభక్తుల సహాయమునుగొని త్రవ్వుగోల తీసికొని యాతడు కొలను త్రవ్వనారంభించెను. నందుడట్లు కష్టపడుచుండుట విలోకించి యాతనివలన నాక్రియ నెరవేర దని తలంచి జగదీశుడు చెరువుత్రవ్వుటకై తనసేవకులను పంపినా డట. నిముసములో వా రాకార్యము పూర్తిచేసిరి. నందుడు పరమానందభరితుడై తన చెంతనున్న కొలదిపాటి గింజలను వారి కిచ్చినా డట. మరల గుడిగుమ్మముకడ నిలిచి చాలసేపు భజన గావించి తన హితులతో నింటికి తరలిపోయినాడట.

ఇట్లు కొంతకాలము గడచెను. నందుని మనసు మాలపల్లెలో నిలవకుం డెను. కొలెరూన నది కవ్వల ఉత్తరదిశయందు, నటరాజావతార మెత్తి చిదంబరమం దీశ్వరుడు కొలసియుండెను. కవులును, భక్తులును, తమగీతికల చేతను మధురమంజుల రాగాలాపనముచేతను ఆపవిత్రప్రదేశమును ప్రతిధ్వనింప జేయుచుందురు. ఆప్రదేశమున నిత్యమును భజనలును, నృత్యములును జరుగుచుండును. అచట చిరకాలముక్రిందట పల్లవరాజన్యు డొకడు చక్కని దేవాలయమును కట్టించినాడు ద్రవిడదేశస్థులే కాక హిందూస్థానమందలి దూరప్రదేశములనుండి యసంఖ్యాకులైన యాత్రికు లాదేవస్థానమును దర్శింప నేటికిని వచ్చుచుందురు. చిదంబరము కైలాసమేయని నందుని యభిప్రాయము. భక్తులహృదయమును అద్భుతానందములతో నింపుచు ఈశ్వరు డందు నిత్యము నృత్త మొనరించుచుండు నని యాతనియభిప్రాయము. అచ్చోటి కరిగి ఈశ్వరసాన్నిధ్యమున సాగిలపడి దేవదేవుని ప్రార్థింపవలెనని చాల కాలమునుండి నందనారు ఆశపడుచుండెను. తనగూడెముచుట్టు తిరిగి "రండు! మనమందరము చిదంబరము పోవుదమురండు. గూడెమునుండి కదలిరండు. ఇచటి దుఃఖమునుండి విడివడి అచ్చటి ఆనందమున మునుగుదము రండు. ఇచటి చీకటినుండి తొలగిపోయి అచటి వెలుగున మసలుదము రండు" అని బిగ్గరగ నతడు కేకలు వేయసాగెను.

చిదంబరస్వామిని దర్శించుట నందుని పరమాశయమైయుండెను. దుక్కి-దున్నుచు, దున్నుచు ఆకస్మికముగ నాగలిని వదలి "శంభో! శంభో! స్వామీ! స్వామీ! నటరాజస్వామీ!" అనుచు అతడు గంతులు వేయుచుండును. ఆకుమడులందు తోడికులస్థులను కూడి కృషిచేయుచు హటాత్తుగ నతడు అశ్రుపూరితనయను డగుచుండును. ఎందులకోయని కూడనున్నవారు ఆశ్చర్య పడుచుండువారు. "ఆయుష్కాలము స్వల్పము. అది చరచర పరువెత్తు చున్నది. అది విశేషకాలము నిలువదు. మనమందఱము చిదంబరము పోయి స్వామి చరణములపై వ్రాలుదము రండు" అని యాతడు గద్గదస్వరమున బలుకుచుండును. చేతిలోనున్న పనిముట్టు లతడు అనాలోచితముగ జార విడుచును. తన్మయపరవశుడై ఆత్మవిస్మృతుడై పొలమం దాతడు పాడుచు నాడుచుండును. స్వామిదర్శనముమాట యటుండ చిదంబరము పోవుటయే నందనారున కసాధ్యమైనవిషయము. అత డొకవిప్రుని వ్యవసాయమున పని చేయుచుండెను. యజమాని యనుమతి లేనిదే యతడొకయడుగైనను నవ్వల బెట్టుటకు వీలులేదు. ఆబ్రాహ్మణునియెదుట కొంతదూరమున సాగిలపడి యాతనినుద్దేశించి నందనా రిట్లని ప్రార్థించెను.

"మహాప్రభూ! చాలరోజులనుండి మిమ్ము నేను సేవించుచున్నాను. ఒకపర్యాయము చిదంబరమువెళ్లి యచటి స్వామిని దర్శించిరావలె నని కుతూహలపడుచున్నాను. అనుగ్రహించి నా కనుమతి దయసేయుడు.

"నేను చదువుసంధ్యలనెఱుగను. నేనేవిధమైన సత్కర్మలనుచేసి యెఱుంగను. నాజీవితము కడచిపోవుచున్నది. సంసారతాపత్రయమందు మునిగిపోవుచున్నాను. చిదంబరమునకు వెడలి యొకసారి త్రిలోకనాథుని కొలువవలెనని కోరుకొనుచుంటిని.

"మహాప్రభూ! నాకీయొక్క యనుమతిని దయసేయుడు. స్వామిని దర్శించి వచ్చి తమ యాజ్ఞను తలదాల్చి తమ పొలమును కాచుచు తమ వ్యవసాయమున తమ్ము సేవించుచుందును."

బ్రాహ్మణుడు మండిపడినాడు. "అరే! చండాలా! ఏమో పెద్దకబురులు చెప్పుచున్నావు. నీకు చిదంబరమును, స్వామిదర్శనమును గూడనా? పోయి పొలముదున్నుము. నీవెఱ్ఱిచేష్టలు మానుము. ఇంకను యెదుట నిలబడియుంటి

వేని మాఱుమాటపలికితి వేని కూలిడబ్బులను పోగొట్టుకొందువు" అని యతడు గట్టిగాపలికినాడు.

నందనారు గుండెలు దడదడ లాడజొచ్చెను. నిట్టూరుపు నిగుడించి కన్నీరుజాలువార్చుచు పొలమున కతడు మరలినాడు. కులస్థుల పరిహాసములకును యెత్తిపొడుపుమాటలకును అతడపుడు గుఱియైనాడు. "నందా! నీకీవెఱ్ఱిగంతు లెందులకు? వెఱ్ఱివెఱ్ఱి పాటలెందులకు? నీవ్యవసాయమేమో నీకూలిపనియేమో నీబ్రతుకేమో చూచుకొనరాదా!" అని కొందఱు సదయహృదయు లతనిని చివాట్లుపెట్టిరి.

మఱికొన్నిదినములు గడచెను. చిదంబరస్వామిని చూచుకోరిక నతండు తనమనంబునుండి తొలగింపజాలకపోయెను. ఇంకొకసారి యజమానియొద్దకు పోయి మునుపటి యట్లే యాతడు వేడుకొనినాడు. క్రోధతామ్రాక్షుడయి యా విప్రు డిట్లనియె. "చిదంబరము చిదంబర మని మొత్తుకొనుచుంటి వేల? నీవు చండాలుడవు కావా! అగ్రజాతులవారికి మాత్రమే చూడదగిన స్థానమగు నా చిదంబరము చండాలుడవు నీవు చూడనర్హమగునా. మాలవాడప్రదేశమున ప్రవేశింపనగునా? పొలమున కేగి నీపనిని నీవు చూచుకొనుము పొమ్ము. నీ గ్రామదేవతను కొలుచుకొనుము. మురికియందు పుట్టి మురికియందు పెరిగి మురికియం దీదులాడునది నీ కులము. అందని మానిపండ్లకై చేతులు సాపనగునా?"

మాఱుపలుకక మిగుల దుఃఖించుచు నందనారు చేనునకు మరలిపోయెను. ఉత్తరదిశగ నొకమాఱును, ఆకసమువంక నొకమాఱును నతడు ఆత్రమున తనదృష్టి సారించినాడు. కాని దిక్కులు చూచినందున నతనికేమియు విశేషము కంటబడలేదు. నందుడు శోకసముద్రమున మునిగిపోయినాడు.

కొన్నినెలలు కడచినవి. డిసెంబరుమాసము ఆసన్నమైనది. ఈ నెలయందు చిదంబరములో గొప్పయుత్సవము జరుగును. వేనవేలు భక్తులా యుత్సవము జూచి యానందించుటకై యచటికి పోవుదురు. ఉత్సవసమయమున స్వామి రథమున నూరేగింపబడును. నృత్యగీతాదులయం దెందఱో మహదానందమున కాలము గడపెదరు. చిదంబర మెంతయు నా సమయమున కోటివెలుగులతో వెలుంగుచు కనులపండువు గావించును. ఆ యుత్సవము

తలచినకొలది నందుని హృదయము ఆ వేశముతో నుప్పొంగినది. ఒక్కమాఱు స్వామిని చూడకుండినచో తాను బ్రతికిన నేమి, చచ్చిన నేమియని యాతడు తలచెను. రెండుసారులు తన కామందువలన తిరస్కరింపబడినను పొలము లోనికి తరుమబడినను మరొకపర్యాయము యజమాని కడ కరిగి యనుమతిభిక్ష వేడవలె నని యాతడు నిశ్చయించినాడు. బ్రాహ్మణుని బ్రమోలసాగిలపడి గద్గద కంఠుడై,

"మహాప్రభూ! ఉత్సవము సమీపించుచున్నది. ఒక్కపర్యాయము నన్ను చిదంబరము వెళ్లిరానింపు. వేగిరమే తిరిగి వచ్చెదను. ఈ తనువు నశింప కమున్న ఈదేహము నేల రాలకమున్న యొకసారి నేను స్వామిని దర్శించి తీఱవలెను. నాప్రార్థనము మన్నించి పుణ్యము కట్టుకొనుడు." అని నందనారు కడుదీనముగ బలికినాడు. బ్రాహ్మణుని యాగ్రహమునకు మేరలేకపోయెను. "పరమనీచుండ వగు నీకు ఉత్సవ మెందులకు? తోడేళ్లు ప్రార్థన సలుపునా? నక్కలు పెండ్లిండ్లుచేయునా? పొమ్ము. ఇక మాటలాడకుము" అని యాతడు తీవ్రముగ పలికెను.

"మహాప్రభూ! కాలుసేతులు కదుపనేర్చినది మొదలు తమకు సేవ చేయుచుంటిని. దేవుని యాజ్ఞవలె తమ యాజ్ఞను శిరసావహించుచున్నాను. నా యీయొక్క కోరికమాత్రము చెల్లింపుడు. నిష్కారణముగ నన్ను మడియ నీయకుడు, మీ యాశీర్వాద మొసగి నన్ను శీఘ్రమే చిదంబరమున కంపుడు. అని నందుడు వేడుకొనినాడు.

కారుకూతలు కూయుచు పొడవుపాటి కఱ్ఱతో నందుని కుళ్లబొడుచుచు "నలువదియెకరముల పొలము ఊరికే పడియున్నది. బీడుపడియున్నది. దానిని నీవు దున్నితీరవలెను. అదను తప్పిన దున్నుటకు వీలుపడదు. పొలము నిష్కారణముగాడ పాడగును. పంట నష్ట మగును. ఇక నోరెత్తక వెంటనే పోయి పొలము దున్నుము. నాగళ్లు కట్టి చెప్పినట్లు చేయుము" అని బ్రాహ్మణుడు పలికెను.

ఇట్టి దురంతము మన భారతదేశమునందు మాత్రమే సాధ్య మగుచున్న దని తోచుచున్నది. ఏలికకును సేవకునకును నడుమగల సంబంధము ఇట్లేయుండును. ఐశ్వర్యమునకును దారిద్ర్యమునకునుగల సంబంధ మీతీరునసే

యుండును. పేదవాని దుర్భరదుస్సహదుస్థితి ధనికుని బాహువులకు సత్తువ నొసగును. కండకు కావర మిచ్చును. ఇతడు తన్నిన నాతడు నోరుమూసికొని యుండవలెను. 'ఇది న్యాయమా?' యని యడుగరాదు. తాను నిర్దోషి నని బుజు వొనరించుటకు ప్రయత్నింపరాదు. ఇట్టి సాహసము యేలికతో వాదించి నట్లగును. యజమాని న్యాయమూర్తి. న్యాయమూర్తితో వాదించి యెవ్వండు నెగ్గును. ఈన్యాయమూర్తి హుకుమును మార్చగల న్యాయమూర్తి యింకొకడు లేడు. తీర్పుచెప్పి దాని నమలులో పెట్టువాడును నితడే. ఎదిరించిన పేదను ముక్కముక్కలుచేసినను నితడు చేయగలడు. ఇట్టి దుర్న్యయము జరిగిన దని యానిర్భాగ్యు డెవరితో చెప్పినను ఇతడు కక్షసాధించి యాతనిని మచ్చమాపును. పరపతి, పలుకుబడి, ధనము, గలవానితో నెవ్వడు కక్ష సాధించి నెగ్గగలడు? ఈ యజమానిని మాని మఱొక్క యజమానిని చేరినను నీతనికంటె నాతడు ఘోరతరపాపి కాడని యెట్లుచెప్పగలము. నిరుపేద రెండుస్థితులయం దేదేనొక్కటి యెన్నుకొనవలెను. యజమానిచూపు దౌష్ట్యమునకు తాను తలయొగ్గి కిక్కురుమన కుండవలెను. లేదా తన ప్రాణముల నూడవెఱికికొనవలెను. ఆత్మహత్య అనుచితము, ధర్మవిరుద్ధము, శాసనవిరుద్ధము, మతవిరుద్ధము, పాపహేతువు, అని యాత డెఱుగును. కావున పూర్తిగ చావనియ్యని దుర్దాంత ఆచరణమునకు ఆ నిర్భాగ్యుడు తన తనువు నప్పగింపవలెను. ఆ నిర్భాగ్యు డేజాతివాడైన నేమి? చదువులు నేర్చినవాడైన నేమి? పేదయై పుట్టుట వాని ప్రారబ్ధకర్మము. ఈప్రారబ్ధమును తప్పించుట తనకుకూడ శక్యము కాదని కాబోలు బ్రహ్మదేవుడు నోరుమూసికొని యెందో పడియున్నవాడు. నిరుపేదలను నిర్భాగ్యులను దుఃఖితులను రక్షించుటకు దేవదేవుడు కడువడిగ పరువిడివచ్చువా డని మన పురాణములు తెలుపు చున్నవి. ఎందుచేతనోగాని యొక్క ప్రత్యక్షనిదర్శము అధునాతనయుగమున గానుపించుటలేదు. జగదీశుని యుద్దేశము మహత్తరమైనదై యుండును. సంఘహృదయమున దోచిన రాచపుండును నేడుగాకున్న రేపైన నాతడు తన శస్త్రచికిత్సకు గుఱిచేయకపోడు. అభాగ్యులతోనిండిన నేటి భారతదేశము నిరుపేదలతో గూడిన నేటి భారతదేశము నిరుద్యోగులతోగూడిన నేటి భారత దేశము సర్వకాలములయందు యిట్లే దిగబడియుండదు.

ఈ దుర్ధాంతస్థితికి ఉత్తరవాదియైనది హిందూసంఘమే. హిందూ సంఘము పునరుద్ధరణ మందిననాడు హిందూదేశము పునరుద్ధరణము నంద గలదు.

ఒడలు హూనముగా కొట్టబడిన నందుడు యిట్లు పరిదేవన మొనరింప సాగెను. "ఈశా! జగదీశా! నన్నీతని సేవకునిగా నేల సృజించితివి? నాకిట్టి గతి సంభవించుటకు పూర్వజన్మమున నే నెన్నెని పాపముల జేసియుందును. తునుకతునుకలైన యవయవములతో అశ్రువులు రాల్చుచున్న కన్నులతో చేతులు జోడించుకొని నేను ప్రార్థనసలుప 'దుర్మతి' వనియు, 'మోసకాడ' వనియు అతడు నిందించుచున్నాడు. ఇంచుమించుగ నీతడు నాప్రాణములను తీసి వేసినాడు. ఇట్టి దీనస్థితియందైనను నాయెడల నీతనికి దయపుట్టుటలేదు. ఒక్క మాఱు నే నాగుడిగోపురమును చూడగలిగితినేని నాపాపము లన్నియు పటా పంచలయి పోవును. కాని నాకాగోపురము కానుపించుటెట్లు? చిదంబరేశ్వరా! నీకైన నాయెడల జాలికలుగలేదా? మాలవాడ నని నీవుకూడ నన్ను ద్రోసి వేసితివా? నిన్ను కొంతసేపు సేవింప నియ్యవా? పుట్టుచు గిట్టుచు నే నెంత కాల మీకర్మ ననుభవించుచుండవలెను. జగదీశా! నీవే నాకు తండ్రివి; నీవే నాకు తల్లివి; నీవే నాకు రక్షకుడవు. ఒక్కసారి నిన్నుచూచు భాగ్యము నాకు దయసేయుము. నావిషయమున నీవు గుండె ఱాయిచేసికొంటివా? ఱాయియే యైతివా? మనసు ఉఱుకుచుండుటచే నేను నిన్ను తూలనాడుచుంటిని. నాయప రాధమును సైరింపుము. నన్ను కాపాడుము. నన్నుద్ధరింపుము"

అద్భుతజ్ఞాన సంపన్నులగు యోగులెందఱో పుట్టిరి. మహనీయగుణ గరిష్ఠులైన భక్తులెందఱో పుట్టిరి. తల్లికై బిడ్డయేడ్చినట్లు జగదీశునకై యిట్లు వాపోయినవారు పృథ్వీరంగమున నరుదుగ బుట్టిరి. నందుడు కలియుగములోని వాడు, చరిత్రయుగములోనివాడు. అవిద్య అవిశ్వాసములందు పొరలాడు వారినడుమ బుట్టినాడు. కష్టములు పైబడి నపుడు దేవుడే లేడనియు ఉన్నను అత డెందో నిదురించుచుండె ననియు సాధారణముగా మానవు లందురు. ఏమి చిత్రమో కాని మహాభక్తులకే మహారిష్టములు దాపరించుచుండును. అగ్నిపరీక్షయందు త్తీర్ణుడయినగాని మానవుడు జగదీశునకు సన్నిహితుడు

కాజాలకు కాబోలు. అగ్నికుండమును దాటిగాని యతడు పూలసెజ్జను చేరుట కర్హుడు కాడు కాబోలు.

దుర్భరదుఃఖముతో నందుడు క్రుంగిపోయెను. యజమానికడనుండి మెల్లగ తనయింటికి తరలిపోయినాడు. గద్గదకంఠుడై యతడు చాలసేపు ఈశ్వరనామసంకీర్తన మొనరించినాడు. ధ్యానించినాడు. నలువది యకరముల నేల దున్నవలెనని యజమాని యాజ్ఞ పెట్టినాడు. ఆజ్ఞ పిడుగువలె నతనిహృదయమున పడినది. కాని యాపిడుగు వానిని కదలింపలేదు. చిదంబరస్వామిని చూచు టెట్లని యాతడు దుఃఖింపదొడగెను. అన్నమును నీరును నతడు పరిత్యజించినాడు. నిద్దుర మానినాడు. "శివా! తండ్రీ" యని యశ్రువర్షము గురిపించినాడు. ఆతని మొగము వెలవెలబారిపోయెను. కాలుసేతులు చలనశక్తిని కోలిపోయినవి.

నందుడిట్లు కొన్నిదినములు కడపినాడు. తుదకీశ్వరునకు కరుణకలిగెను. "ఈశ్వరా! ఈశ్వరా!" యని కేకలిడుచు తేగతోలువలె నతడు నేలబడినాడు. వెంటనే యతనికి కనుకుపట్టెను. చిదంబరేశ్వరు డతనికి దర్శన మిచ్చి సాదరవాక్కుల నిట్లనెను. "నందా! దుఃఖింపకుము. నలువదియకరముల నేల పండిన చేనుతో నిండియున్న దనియు, కోతకు సిద్ధముగానున్న దనియు పోయి నీ యజమానితో చెప్పుము. చిదంబరమునకు వచ్చుటకు నీకు తప్పక యాతడనుమతి నిచ్చును." ఇట్లుపలికి జగదీశు డదృశ్యుడైనాడు. నందనారు నిముసములో మేలు కాంచినాడు. చరచర చేను చూచుటకు పరువెత్తిపోయినాడు. అంతకుమున్ను బీడుపడియున్న పొలము కనులపండు వొనరించుచు కానుపింపగానే నందుని యానందమునకు మితిలేకపోయెను. వడివడిగ నేలిక కడకు పరువెత్తుకొనిపోయి సాగిలపడి "స్వామీ! వచ్చి తను పొలమును చూచుకొనుడు. పైరు కోతకు సిద్ధముగా నున్నది. ఇక తమ యాశీర్వాదముతో నన్ను చిదంబరమునకు పంపుడు." అని నందుడు పలికెను. పొలమున కేగి యచ్చటి దృశ్యమును విలోకించి విప్రుడు విస్మయపరీతహృదయుడయ్యెను. అట్టి యద్భుతచర్యను సర్వేశ్వరుడే కావించెనని యూహించి మహాభక్తుడైన నందుని పట్ల తాను కావించిన దుర్న్యయమునకు మిగుల నొచ్చుకొని "నందా! నిన్ను గుర్తింపనైతిని. నీవు సామాన్యుడ వని తలదిరిగి నీచకులస్థుడ వని నిన్ను

పెక్కుసారులు తూలనాడితిని. కఠినుడనై దండించితిని. నాహృదయమిపుడు పశ్చాత్తాపాగ్నిచే దహించుకొని పోవుచున్నది. నా యపరాధమును మన్నింపుము.” అని బ్రాహ్మణుడు తనసేవకుని పాదములకు ప్రణమిల్లినాడు.

బ్రాహ్మణుని వచనములకు నందనారు మిగుల విచారించి యాతని లేవనెత్తి “స్వామీ! ఇట్లుపలుకుట తమకు తగదు. నేను మీపాదసేవకుడను. మీపాదసేవజేసి బ్రతుకువాడను” అనెను. “ధనధాన్యములును సిరి సంపదలును ఎవ్వనిని మహాపురుషుని చేయజాలవు. ఈశ్వరప్రీతి నందినవాడే మహాపురుషుడు. అగ్రజాతివాడనై పుట్టితిని. చాల పాండిత్యము గడించితిని. నీచెంత నిలుచుట కర్హుడను గానని గుర్తించితిని” అని తిరుగ బ్రాహ్మణుడు పలికెను.

మనుజుడు గొప్పపాపమును చేయవచ్చును. తన పాపమును తాను గుర్తించిననాడే గుట్టలకొలది పెరిగియున్న యాతని పాపమును కరుగ మొదలు పెట్టును. ఈతడు పొందు పశ్చాత్తాపము ఆకలుషమును పూర్తిగా కడిగి వేయును. ఈతని పశ్చాత్తాపమే ఈతనికి పునర్జన్మ మొసగును. తన యపరాధమును గుర్తించిన ముహూర్తమందే మహాపాపి మహాపురుషు డగును. ఇట్లు గుర్తింపజాలువారు మనుష్యలోకమందు ఎందరో యుందరు. తమనేరములను తా మడంచుకొనవలె ననియే పల్వురు యత్నింతురు. ఈయత్నమున విజయులై నిరపరాదులట్లు వీరు మసలవచ్చును. కాని వీరు తమ్మునతాము మోసగించుకొను అభాగులు. వీరి మోసము వీ రెత్తవలసిన జన్మలసంఖ్యను హెచ్చు చేయును; వీరందవలయు ముక్తినుండి వీరిని దూరముగ తొలగించును.

ఈకథయందలి బ్రాహ్మణుడు నందునిపట్ల కఠినుడై ప్రవర్తించి ఘోరపాప మునే కావించినాడు. తరువాత తన యపరాధముతోపాటు నందుని మహత్త్వ మును గుర్తించి పునర్జన్మనందినాడు. ఈతని కీపునర్జన్మ నొసగినవాడు నందుడు. నందుని ప్రేమ నందునిభక్తి యెదుటిశత్రువును పరమపవిత్రుని జేసినవి. ప్రేమ చేతపట్టునది విజయధ్వజమే గదా!

అమితానందభరితుడై నందుడు చిదంబరమునకు పయనమైనాడు. కొలెరూన్‌నది చేరినాడు. ఒక చిన్ననావనెక్కి అవ్వలదరిచేరినాడు. భవార్ణవమును దాటినవానివలె సంతోషించినాడు.

నందునకు సమ్ముఖీనమైన దృశ్యము మిక్కిలి రమ్యమైయున్నది. పచ్చపట్టములుదాల్చిన పూబోడులట్లు చక్కని మామిడిచెట్లు నందుని కనులకు మున్ముందు విందొనరించెను. వసంతుని ముద్దులకు మురిసె కాబోలు చెట్లు పూబోడులు చిఱునవ్వు నవ్వినట్లు మిక్కిలి చక్కనైన మామిడిపూవు చూపరులకు తోపించుచుండెను. పూవులనుండి కమ్మతావి యిందందు ముదమున జరింపసాగెను. వృక్షములకు నడుమనడుమ చిన్నిచిన్ని చెరువులు నవవికసిత సరోజములతో కలకలలాడుచుండెను. వసంతునికి మిక్కిలి చెలికాడైన కోయిల స్వాగతగానము లాలాపించుచుండెను. చెట్ల జొంపముల కవ్వల చిదంబర మందిర గోపురము ఉదయసూర్యుని సువర్ణకాంతియందు తళుక్కులీనుచుండెను. కైలాసము తన కెదురైనదని నందుడు సంతసించెను. "నేటికిగదా నాజన్మము తరించినది. తనహృదయమున చేర్చుకొనన కైలాసము నన్నాహ్వానించుచున్నది. అదిగో! ఆలయమునుండి ఘంటారవము వినవచ్చుచున్నది! అందు దేవదేవుని సాదరవచనములు వినవచ్చుచున్నవి. ధన్యుడనైతిని" అని పరమానంద భరితుడై నందుడు ముందుల కుఱుక దొడగినాడు.

అచిరములో నందుడు చిదంబరము చేరినాడు. వడివడిగ ఆలయముకడ కరిగినాడు. దక్షిణద్వారమున కెదుట సాష్టాంగపడి లేచి మహావేశమున పాడుచు నందుడు నృత్యము చేయసాగెను. ఆలయప్రాకారమునకు ప్రదక్షిణ నమస్కార మాచరించి తూర్పుగుమ్మముకడ సాగిలపడి చాలసేపు చిదంబరేశ్వరుని ప్రస్తుతించినాడు. పలుమాఱులు గుడిచుట్టు నాడుచుపాడుచు ప్రదక్షిణము చేసినాడు. పదంపడి దక్షిణద్వారమునకు సమీపమునగల చెరువుగట్టుమీద కూర్చుని చాలసేపు ప్రార్థించినాడు. మరల ప్రాకారముచుట్టు తిరుగుచు భజన కావించినాడు. చాలదినములు యీతీరున నతడు ప్రార్థనమందును, ప్రదక్షిణములందును కడపివేసినాడు.

తన యావేశము నాపుకొనజాలక నందు డొకనాడు ప్రాకారపుగోడపై నెక్కి లోనికి చూచినాడు. ఈశ్వరగృహ మద్భుతమై యాతనికి చూపట్టెను.

యాత్రికు లెందఱెందఱో శివనామ ముచ్చరించుచు చుట్టును నిలుచుండిరి. మందిర మండపమున పలువురు విప్రులు కూర్చుని వేదమంత్రములను కడు శ్రావ్యముగ నుచ్చరించుచుండిరి. చుట్టుప్రక్కలందుగల ఉన్నతసౌధములు నటరాజస్వామి దివ్యనృత్యము విలోకించుచు అబ్బురపాటున నిలువంబడినట్లు కన్పించుచున్నది.

నందునిహృదయ మానందముతో నుప్పొంగినది. కాని తోడనే తన నీచజన్మ తలంచుకొని దుఃఖించినాడు. "ఆహా! మాలనై పుట్టుటవలన గుడిలోనికరిగి స్వామిని దర్శించుటకు నాకు ర్హత లేకపోయినది కదా! పూర్వజన్మమున నే నెన్ని పాపములు చేసియుంటినో జగదీశా! నీవు దయామయుండవు. కటాక్షించి నన్ను నీకడకు గొనుపొమ్ము. నేను సంసారమును పరిత్యజించితిని. కట్టు త్రాళ్లు నన్నింటిని త్రెంపుకొంటిని. నీవు తక్క నాకిక వేఱుదిక్కులేదు. నిన్ను దర్శింపగోరి నీగుమ్మముకడ చాలదినములనుండి వేచియున్నాను. నీపాదముల పొంత కూర్చుని నిన్ను సేవింపవలె నని ముచ్చటపడుచున్నాను" అని యాతడు తలపోసినాడు.

జగదీశుడు తనకు స్వప్నమందు గోచరించి తన యజమాని కేదారమును చక్కని పైరుతో నింపి తన్ను చిదంబరమునకు నరుగ గాంక్షించిన యుదంత మాతని తలపునకు వచ్చెను. దేవదేవు నుద్దేశించి యా మహాభక్తుడిట్లు వగచెను. "తండ్రీ! నీవు చెప్పినట్లుగ నేను చిదంబరమునకు వచ్చితిని. ఇంకను నన్ను నీ పదముల చెంతకు తోడ్కొనిపో వేమి? నాకొఱకై శ్రమపడి నా యజమాని చేనిలో పని చేసినావు. నీ వాత్సల్య మపారము. నేను నిన్నే నమ్ముకొని యున్నాను. అడవికి నవ్వల యెందో నా నివాసము కలదు. ఇదినాకు క్రొత్తప్రదేశము; నాకిచట పరిచితు లెవ్వరును లేరు. నీవే కదా నన్ను దరిజేర తీయవలసిన వాడవు. నేను మాలనై పుట్టితి నని నీకుకూడ సంశయము కలుగుచున్నదా? మనుజుడు మాలవాడై పుట్టుటకంటె మట్టియై పుట్టుట మేలు. వీధినుండి నడచునపుడు పదుగురు "చండాలా! దూరముగా తొలగుము" అని గద్దించి పలికినపుడు నా గుండెలు బ్రద్దలగుచుండును. వీధిని పడి నడువజాలని వారికి దేవాలయమునడుమ చోటు దొఱకునా! గుడిలో నాడుచు పాడుచు గడుపగల యదృష్టము నా కెట్లు లభించును? నీ కృప నా

యెడ కలుచో దేనికి నాటంకము కలుగదు. నీ కరుణ నాపై ప్రసరించుచో నెట్టి యసాధ్యక్రియలును సాధ్యమగును. తండ్రీ! యీ నా యాప్సితము తీర్పవా?"

కొన్ని మాసములు కడచెను. ఎన్నియోసారులాతడు గుడిపూజారుల పాదములకడ ప్రణమిల్లి గుడిలోనికిబోవ తన కనుమతి దయసేయుమని వేడు కొనెను. కనులెఱ్ఱజేసి పండ్లు పటపటలాడించి వలదన్నని వారు ఛీంకరించినారు. నందుని హృదయము, శోకాగ్నిచే కాలిపోవుచుండెను. తన గూడెమునం దున్న తఱి 'చిదంబరము చిదంబరము' అని పలవరించినాడు. ఇపుడు చిదంబరము చేరినను స్వామి యాలయద్వారము చేరినను స్వామి ముఖ మాతనికి దృగ్గోచరము కాలేదు. ఆతని యగ్నిపరీక్ష యింకను ముగియలేదు.

నందుడు తన దృఢసంకల్పమునకు నీళ్లు వదలుకొనలేదు. తన యిచ్ఛాశక్తిని కోల్పడలేదు. "స్వామీ! స్వామీ!" యనుచు ననుదిన మతడు ప్రాకారము చుట్టును ప్రదక్షిణము చేయుచు భజనచేయుచుండువాడు "సర్వేశ్వరా! నీశక్తి అద్భుత మైనది. నిన్నుతక్క నే నొరులను ఆశ్రయింపలేదు. నాకు నీపాదపద్మములచెంత కొంతతావునీయవా? నే నెన్నెని పాపముల చేసి యుందును. నాకలుషమును మాపుచేసి నన్ను రక్షింపుము." అని విలపించుచు నిద్రాహారములుమాని ఈశ్వరధ్యానమందే నందనారు దినములు కడుపసాగెను.

ఇట్లు కొన్ని దినములు కడచిపోయెను. నందనారు చెరువుగట్టుమీద పడియుండెను. "తండ్రీ! తండ్రీ!" యని విలపించుచునే యతడొకనాటిరేయి నిద్రించెను. అపుడు నటరాజస్వామి నిండురూపమున నతనికి కలలో దర్శన మిచ్చి "నందా! ఇక శోకింపకుము. అచిరకాలమున నీవు నన్ను చేరగలవు. గుడిపూజారులు నిన్నొకమాఱు పరిశోధించి గర్భాలయములోనికి ప్రవేశింప నీ కనుమతి నొసంగుదురు." అని చెప్పి మాయమయ్యెను. నందుడు నిద్రనుండి లేచినాడు. ఆనందసంశయములమధ్య నతడు చిక్కుకొనినాడు. "తుద కీమాల వాని గోల ఈశ్వరునిచెవి సోకినదా? చండాలుండ నని గుడిపూజారులు మరల నన్ను కసరికొట్టరుగదా." అని తర్కించుచు కడమరాత్రి యంతయు నాత డాచెరువుగట్టమీదనే శివనామ సంకీర్తనము చేయుచు కడపివేసినాడు.

నందునికి దర్శన మిచ్చిన ముహూర్తమునందే చిదంబరస్వామి యాపట్టణమునగల మూడువేల విప్రులకు కలలో కన్పడి "మందిర దక్షిణ ద్వారమునకు సమీపమునగల చెరువుగట్టుమీద నాభక్తు డొకడు చాలదిన ములనుండి యాలయమందు ప్రవేశింపవలెనని పరిపరివిధముల పరితపించు చున్నాడు. మీచిత్తము వచ్చిన ట్లాతనిని పరీక్షించి గర్భాలయములోనికి వచ్చుట కాతని కనుమతి యొసగుడు" అని వారితో పలికెను. విప్రులందఱు నొక్కమాటే మేల్కాంచి చివాలున వీధిపడిరి. ఆశ్చర్యాన్వితులయి యొకరి మొగ మొకరు చూచుకొనిరి. ఎల్లఱకలలు నొకతీఱుననే యున్నందున నవి విశ్వసనీయములనియు, ఈశ్వరాజ్ఞను పాలించుట తమ సత్వర ముఖ్యకర్తవ్య మనియు వారు గుర్తించిరి. నిముసమైనను తడయక వారు చెరువుగట్టునకు వెడ లిరి. ఎండినతోలును మూటకట్టబడిన యెముకల ప్రోవట్లు నందు డచట పడి యుండెను. మెల్లనిస్వరమున నతడీశ్వరనామము నుచ్చరించుచున్నాడు. నాటి రాత్రి కాతని కదల్పక కొంతదూరమున నిలిచి భక్తి విస్మయములు మనమున నింపుకొన తదేకదృష్టితో వారాతని చూడదొడగిరి.

నందునివాంఛ యీడేరుట చూడవలెనని మక్కువపడి సూర్యభగవా నుడు నాడు చప్పుచప్పున తూరుపుకొండనెక్కి నందనారునకు తనకను లప్పగించి నాడు. చెర్వుతీరమున లేచి నిలిచి మార్తాండునకు నమస్కరించి "తండ్రీ! తండ్రీ!" యనుచు నందనారు ఆలయము దిక్కుగ మరలినాడు. కట్టెదుటగల భూసురు లాతనిదెసకు రాదొడగిరి. వారలనుగాంచి శిరమువంచి "మహాత్ము లారా! నేను చండాలుడను సమీపమునకు రాకుడు." అని నందనారు పలికి నాడు. "భక్తశిఖామణీ! చండాలుడవై పుట్టినను, నీ వీశ్వరకటాక్షము వడసి తివి. పవిత్రవహ్నియందు శుద్ధినంది ఆలయమునందు ప్రవేశింపుము" అని బ్రాహ్మణు లాతనికి ఉత్తరము నొసగిరి.

మందిర దక్షిణద్వార సమీపమున బ్రాహ్మణులు, అగ్నిహోత్రము చేసిరి. జ్వాల లాకసమునంటినవి. నందుడు విప్రుల యాదేశము శిరసావహించి, అగ్నియందు ప్రవేశించినా డట. అల్లన నందుండి నడచి దివ్యకాంతి సందీప్త తేజస్వియైన బ్రాహ్మణుడై స్ఫటిక సన్నిభ యజ్ఞోపవీతమును దాలిచి దివ్యాంబర సంశోభితుడై యగ్నినుండి వెడలి బ్రాహ్మణుల ననుగమించి దేవాలయద్వార

మున జొచ్చి పడంపడి లోనియావరణమున నడచి అచటి సోపానము లెక్కి గర్భాలయమున ప్రవేశించి యంతట నదృశ్యుడైనా డట. నందనా రెందరి గనో యేమయ్యెనో నిక్కముగ నాగర్భాలయమున నంతర్ధానుడయ్యెనో లేదో తెలుప శక్యము కాదు. తన వాంఛ నందినముహూర్తమునుండి దివ్యహర్ష భరితుడై ఈశ్వరసమక్షమున తన్మయనృత్యము నొనరించుచు శాంతినయ హృదయుడై చాలాకాల మాతడు జీవించి కైలాసమున జేరియుండును. దుర్గంధమునుండి ఘోరపంకిలమునుండి దూషణమునుండి అత్యాచారమునుండి విడివడి ఈశ్వరసాన్నిధ్యమున నందనారు సచ్చిదానందమునం దోలలాడినాడు.

దక్షిణ భారతమునందు నందనారుకథ మిగుల ప్రసిద్ధి నందినది. దక్షిణ గ్రామములందు తిరుగు బిచ్చగాండ్రందఱు ఆవేశపూరితులై నందనారుపవిత్రో దంతమును పాటగ పాడుచుందురు. తమిళ వ్యవసాయదారులు తమపొలములందు శ్రమపడి పనిచేయుచు నందచరిత్రమును చెప్పుకొనుచు తమయాయాసము నపనయించుకొందురు. ఈ దేశమున వరిమడులయందు పనిచేయుచున్నను, దూరమునగల నేటాలు, ట్రాన్సువాల్ భూములయందు పనిచేయుచున్నను అరవకూలీలు పరమ పవిత్రమైన నందనారుచరిత్రము నుచ్చరించుకొనుచు ధైర్యము సంతోషము నందుచుందురు. ఉత్తమ కులస్థులుకూడ హరికథ రూపమున నీ మహాభక్తునిగాథ విని యానందించుచుందురు.



౫౦

# రవిదాసు

మ. అరవిందోదర తావకీన చరణధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణనజాతభూరి సుఖముల్ స్వానందకబ్రహ్మమున్
దరయన్ లేవఁట దండభృద్భట విమానాకీర్ణత్రైకూలు నా
సురలోకస్థుల జెప్ప నేల సుజనస్తోమైక చింతామణీ.

ప్రపంచచరిత్రను పరికించితి మేని, మహోద్యమములు గొప్పకష్టముల నుండి పుట్టినవని గుర్తింపజాలుదుము. పాపమును అవిద్యయు అంధకారమును అత్యాచారమును చెలరేగినపుడే మహావిప్లవము లుప్పతిల్లును. శంకరుడు హిందూమతమును సముద్ధరించుటకై పుట్టినాడు. బుద్ధుడు తనకాలమున ప్రబలుచుండిన దురాచారములను దునుమాడుటకును భారతభూమియందే కాక సమస్త ప్రపంచమందును నిర్మలనీతిని ఉత్కృష్టధర్మమును నెలకొలువుటకును ఉద్భవించినాడు.

చరిత్రకాలమున, మధ్యయుగమందు భారతరాజకీయములును సాంఘిక మతపరిస్థితులును వక్రమైయుండెను. రాజుల నిరంకుశత్వము మిగుల బలిసినది. గొప్ప అరాజకస్థితి ప్రబలినది. మతము మన్నుపాలైనది. మూఢాచారములు తలనూపినవి. పాపము పండినతోడనే, ధర్మసంస్థాపనార్థము యుగయుగములందు అవతారమూర్తియై దేవదేవుడు గోచరించు లీల, జగములను క్రమ్మిన కారు చీకటిని చీల్చివేయ తూరుపునదోచు రవిబింబమట్లు నాటి ప్రతికూలపరిస్థితులను ప్రతిఘటింప కొందఱుమహనీయులు ముందుల కరుదెంచిరి. ఘోరమైన కాలపరిస్థితులేకదా మహాపురుషులను కనును. మధ్యయుగమందలి యిట్టి మహాపురుషులలో రామానందు డొకడు. ఈతడు చేపట్టిన కేతనమును ఈతని శిష్యుడు కబీరుదాసు దశదిశలందుద్రిప్పి నాటి భారతభూమియందు స్థాపన మొనరించినాడు.

తనకాలమందలి ప్రతికూల సాంఘిక మతపరిస్థితులకు అడ్డు నిలిచిన రామానందుడు మహామేధావి; సద్గుణగరిష్ఠుడు. సామాన్య సన్యాసివర్గమందే కొంతకాల ముండి కాలక్రమమున నాతడు భారతభూమియందలి వివిధయాత్ర స్థలములను చూచినాడు. తిరిగి తిరిగి రామానందుడు మరలివచ్చినంతనే జాతి నిబంధనలను శిష్టాచారసూత్రములను నతిక్రమించి యుండునని పలికి నిష్ఠురులై తోడి సన్యాసు లాతనిని మఠమందు ప్రవేశింపనిచ్చిరి కారు. తమవర్గమునుండి యతనిని వేఱుచేసిరి. తనమఠమునుండి వేత్రైన రామానందుడు వారికి ప్రతికూలముగ తనజెండా యెత్తినాడు. ప్రత్యేకమైన తనశాఖను తాను నెలకొలపినాడు. రామానందుని యుద్బోధనలను హృదయంగమ మొనరించుకొనిన కబీరుదాసు హిందూముసల్మానులను చేరదీసి, దేవుం డొక్కడే యని గట్టిగా పలికి భారతభూమియం దంతటను తనమతము ప్రచారము కావించినాడు. రామానంద, కబీరుల సంస్కరణములు మతావేశమును భావనావేశమును మిగుల నుప్పొంగించుటచే పెక్కురు యోగులును కవులును జన్మించి తమ వాక్కులందును తమ పాటలయందును, తమజీవనములయందును నూతన మత మహత్త్వమును వ్యక్తీకరించిరి. ఈ మహాపురుషులు నెలకొలిపిన మహోద్యమముమూలమున అణగి నిదురించుచున్న శక్తులు విజృంభించినవి. ఈ యుద్యమము కతననే చండాలకులమున నొక మహాయోగి జన్మించినాడు. జనసామాన్యము నంతను తాకి, సంఘ హృదయమును తలక్రిందులు చేసినదగుటచే నీ యుద్యమము ప్రజలందఱిచే జేగంట మ్రోగింప జేసినది. పెద్దగంటను మ్రోగించిన మహనీయుడు రవిదాసు. ఈ యంత్యకులజుడు క్రీస్తుశకము పదునేనవ శతాబ్దారంభమున జనించినాడు.

రవిదాసు కులమువారిది చెప్పులు కుట్టుకులము. మాదిగల యింట పుట్టుటచే అతడు కులవృత్తియందు శిక్షితు డాయెను. చిన్నప్పటి నుండియు వానికి భక్తిగుణ మబ్బెను. తోళ్లను బాగుచేయుచు చెప్పులు కుట్టునపుడు కూడ నతడు హరినామ స్మరణము చేయుచుండువాడు. కులవృత్తివలన సంపాదించిన కొలదిపాటిధనము నతడు మూటకట్టక బీదలకును సాధువులకును నిచ్చుచుండువాడు. తోలుముక్కలతో విగ్రహములనుచేసి ప్రజలు నిందించుచున్నను నత డావిగ్రహములను పూజించు చుండువాడు.

ఇటులుండ ఉత్తర హిందూ స్థానమున ఘోరమైన కాటకము బయలుదేరెను. నిరుపేదలు మఱింత నికృష్ట స్థితియందు మూలపడిరి. రవిదాసునకు తినుటకు పట్టెడన్నమైనను లేకపోయెను. ఎంతమాత్రమును చింత నొందక అతడు హరినామసంకీర్తనమున కాలము గడుపజొచ్చెను. ఆతని దురవస్థ భక్తవత్సలుని హృదయమున వాడిశూలమై గ్రుచ్చుకొనెను. శ్రీహరి తోడనే రవిదాసునెదుట సన్యాసిరూపమున బ్రత్యక్షమై సకలైశ్వర్యముల నిచ్చు దివ్యశిల నొకదాని నతని చేతులయందు పెట్టెను. ముకుళితకరకమలుండై యతడు యోగి నుద్దేశించి "తండ్రీ! నీమధురనామమే నాకు పరమధనము. ఈధన మెన్నటికి తఱిగిపోదు. దినదినాభివృద్ధి నందును. దానిని దొంగిలింపగల దొంగయెవ్వడును లేడు. ఇట్టి యద్భుతధనము నావశమై యుండగా నాకిక వేఱైశ్వర్యమేల?" అని తనచేతనున్న దివ్యశిలను సన్యాసి కిచ్చివేసెను. సన్యాసి శిలను గైకొమ్మని రవిదాసును మాటిమాటికి వేడుకొనెను. తనగుడిసెయందొక మూల దానిని పాఱవేయుట కాతనికి దాసు అనుమతి యొసంగెను. కొన్ని నెలలు గడచినపిదప సన్యాసి మరల ప్రత్యక్షమై రవిదాసు మునుపటివలెనే దురంత దారిద్ర్యబాధచే మాడుచుండుట చూచి "ఏమోయీ! ఇంకను ఇట్లే యుంటివి. ఆశిలను ఉపయోగించ లేకపోతివా?" అని ప్రశ్నించెను. "స్వామీ! మీశిల మీరుంచినచోటుననే పడియున్నది. దాని నేనంటలేదు. చూడనైన మరల చూడలేదు." అని రవిదాసు ప్రత్యుత్తరమిచ్చెను. దాసుయొక్క త్యాగభావమునకు జగదీశుడు వింతపడెను. భక్తవత్సలుం డపుడును నూరకొని యుండజాలక బహుధనరాసులను రవిదాసున కర్పించెను. వానినికూడ నతడంటక చేతులు మొగిచి నతశరీరుండై నిలువంబడెను. "ఆధనమును దేవాలయ నిర్మాణమునకై వినియోగింపు"మని దివినుండి యెవ్వరో అతనికి చెప్పినట్లాయెను. ధనరాసుల నందు వీడి శ్రీహరి యదృశ్యుడాయెను. దేవవాక్కు దేవాలయనిర్మాణమునకై రవిదాసును ప్రోత్సహించెను. వెంటనే యతడు దేవాలయమును కట్టించెను. జగదీసునకు తానే యర్చకుడై పూజాదులను నిర్వర్తింప దొడగెను. కాని యాధనరాసులం దొకకాసైన నత డంటలేదు. ఆతడు పూజాద్రవ్యముల నిడుకొను తట్టయం దొకనాడు ఆకస్మికముగ మిలమిలలాడు బంగారు నాణెములైదు వాని కగపడెనట. అదిగాంచి యత

డప్రతిభుడై ఈశ్వరసేవ తనయాత్మ కెగ్గుదెచ్చు ధనమును తనకు ప్రసాదించి నందులకు దాను మిగుల దుఃఖపడెనట. ఈశ్వరుడు కలయం దాతనికి కాన్పించి తనయాజ్ఞ పాలించుట వాని విధియని చెప్పినాడట. రవిదాసు దానికి సమ్మతించి ఆ నాణెములను వెచ్చించి యాత్రికుల కొక విశ్రాంతిగృహము కట్టించెనట.

రవిదాసుపేరు నలుదెసలు ప్రాకెను. అదిపలువురకు కన్నెఱ్ఱయాయెను. బ్రాహ్మణులయందు గగ్గోలు పుట్టెను. చరచర వారు రేనికడ కరిగి "మహాప్రభూ! పవిత్రవస్తువులకు మైల సోకినపుడు మరణము, కఱవు, భయము నను మహానర్థములు వాటిల్లును. చండాలుడొకడు పూజారియై విష్ణుప్రసాదమును ప్రజలకు పెట్టుచున్నాడు. వెంటనే యాచండాలుని యాలయమునుండి తరిమివేసి మతగౌరవమును కాపాడుడు" అని చెప్పుకొనిరి. రేడు తత్క్షణమే రవిదాసును పిలిపించి ఆలయమును విగ్రహమును వెంటనే విప్రులవశ మొనరింపుమని యాదేశించెను. "చిత్తము మహాప్రభూ" అని దాసు వెడలిపోయెను. నాటిరాత్రి జగదీశుడు రాజునకు కలయందు ప్రత్యక్షమై తనసేవనుండి రవిదాసును తొలగింపవలదని యాతని నాజ్ఞాపించెను. రేడు దాసు మహత్త్వము గుర్తించి ఆలయసేవయందే యాతనిని నిలిపి బహుభంగుల నాతని సత్కరించెను.

రవిదాసు కీర్తిలతికలు దశదిశలు వ్యాపించెను. చిత్తూరు రాజ్ఞి ఝాలీ యను సీమంతిని దాసుయొక్క శిష్యకోటిలో నొక్కతె. పవిత్రరసపుత్రకులమున పుట్టిన రమణి చండాలునకు శుశ్రూషచేయుట అగ్రజాతివారి కిష్టము లేకపోయెను. వారియందు గందరగోళము జనించెను. ఒకనాడామె విప్రుల నందఱ నామె విందున కాహ్వానించెను. రాణివలన బహుమతులనందుట కై బ్రాహ్మణు లనేకులు సంతర్పణమున కరిగిరి. అతిథులు తమతమ యాసనముల నుపవిష్టులైరి. ప్రతియిద్దర బ్రాహ్మణులనడుమ నొక రవిదాసు గోచరించెను. చండాలుడు బ్రాహ్మణపంక్తియందు చేరెనని యొకమూల కొంద ఱతిథులు గోలచేయ నారంభించిరి. అవిశాలమైన భోజనాగారమం దెల్లకడలందును నతడు గోచరించుటచే నెల్లఱు నాశ్చర్యాన్వితులైరట. కిక్కురుమనక పొట్టలు నిండించి బాపలు చేతులు కడుగుకొని నాటి విచిత్రమునుగుఱించి బహుభంగుల చెప్పికొనిరట. రవిదాసు మహత్త్వమును గుర్తించి ముగ్ధులై యాతనిపాదములపై బడి క్షమింప వేడికొనిరట. రవిదాసపుడు తన చర్మమునుకోసి

యందు యజ్ఞోపవీతమును వారికి చూపి పూర్వజన్మమున తాను బ్రాహ్మణుడ నని ఋజువు చేసినాడట.

రవిదాసు జీవనచరిత్రను గుఱించి చిత్రగాధ లింకనుకలవు. ఈగాధల సత్యమునుగుఱించి మన మెట్లూహించినను చండాలకులమున పుట్టిన రవిదాసు యోగియై ఆచార్యుడై వెలసె ననుట నిర్వివాదాంశము. ఆతనిచరితము నిర్మల నీతి గర్భితమైనది.

అచిరకాలములో రవిదాసు మహాజ్ఞానియని కూడ ప్రతీతి నందెను. ఆతని గ్రంథములుకొన్ని "ఆదిగ్రంథ" మందు జేర్పబడినవి. అవి సర్వజనాదర ణీయములై యున్నవి. ఆతడు రచించిన శ్లోకములను నేడును కాశీక్షేత్రమందు పలువురు పండితులు మహాఆవేశముతో పఠించుచుందురు. రవిదాసు తోడి జాతీయులందఱికై ప్రత్యేకమైన మతశాఖయొకటి స్థాపించెను. ఇది వైష్ణవ మతముయొక్క శాఖయే. వైష్ణవమత మెట్టి సంస్కరణమునందెనో యీశాఖా స్థాపనము విశద మొనరించుచున్నది. ఆతని మహత్త్వమును గుర్తించిన పిదప సర్వజాతులవారును నాతని నారాధించిరి. "భక్తమాల" యందు రవిదాసునకు మహోన్నతమైన స్థానము కలదు.

పరోపకారపారీణుండగు నీతడు తనయాధ్యాత్మికశక్తిచే కుష్ఠు మొదలగు నిష్ఠురవ్యాధులను సులువుగ నివారణ మొనరించుచుండువాడట. నియమ నిష్ఠలుగల పురుషులుకూడ ఈతని సేవించి వ్యాధినుండి ముక్తులగుచుండెడివా రట. ఉత్తరహిందూస్థానీయులు రవిదాసు వృత్తాంతమును నేడును చెప్పుకొనుచు ఆశ్చర్యమందు మునిగి ఆనందమందు తేలుచుందురు.

రవిదాసులు (యీతడు స్థాపించిన మతములోనివారు) తమయాచార్యుడు నూట యిరువదియవయేట పరమపదించి బ్రహ్మపదము నందెనని చెప్పెదురు. శరీరముతో నాతడు అదృశ్యుడైనాడట. తనగ్రంథములను కొన్నింటిని నాతడు కూడ కొనిపోయెనట. కాని యాతని పాటలును, ఉపదేశములును విశేషముగా నుత్తరహిందూస్థానమున నిలిచియున్నవి. ఆత్మయే ఈశ్వరుడనియు కాని అది శరీరమునకు కట్టువడుటచే దాని మహత్త్వమును సామాన్యుడు గుర్తించుటలే దనియు జగదీశుడు దయామయు డనియు దుశ్చింతలను దునుమాడువా డనియు రవిదాసు బోధించుచుండువాడట. ఈతని బోధనలు ఈతనితోనే అంత మొందక ఈతని సచ్ఛిష్యులయందు నెలకొనినవి. ఈతడు స్థాపించిన మతమునందు చిరస్థాన మందినది.

---

# ౫౧

# చోకమేల

"మ. తరుణాబ్జారుణ లోచనద్వయి కృపాధారేయమై యొప్పు సా
గరకన్యాకుచకుంభపాళిఁ బులకల్ గన్పట్ట మానీంద్రహృ
త్సరసీజంబులు సంచలింప మురళీసంజాత గీతామృత
స్ఫురణల్ రాల్గరగన్ జరించు హరికైశోరంబు భావించెదన్."

ఆర్యావర్తమున మధ్యయుగమున తలసూపిన మతోద్యమము మహారాష్ట్రదేశమున గూడ తనశంఖమును పూరించెను. అలందికడ తన కులము నుండి బహిష్కరింప బడిన ధ్యానదేవుడు పంఢర్ పురమున కరిగి విప్లవమును లేవదీసినాడు. బ్రాహ్మణుల యధికారమున కడ్డునిలిచినాడు. జనసామాన్యమునకు తేలికగా బోధపడు లాగున భగవద్గతను మహారాష్ట్ర భాషలోనికి అనువాదము గావించినాడు. బలియనుపేర జరుగు జంతుహింస అనుచిత కృత్యమనియు విశ్వాసము వలననే మానవుడు జగదీశు నందగలడనియు అతడు బోధించెను. అచిరములో నతనిచుట్టు పలువురు చేరుకొనిరి. ఉద్యమము ముందంజ వేసినకొలది భక్తులును కవులును హెచ్చిరి. మహారాష్ట్ర ప్రజలకా యుద్యమము మతసాంఘిక స్వాతంత్ర్య మొసగి మహారాష్ట్రభూమికి నూతన రూపిచ్చినది. ఉద్యమస్పందనమును నడపిన భక్తులు సర్వజాతుల నుండి వెడలిరి. చండాల వంశజుడైన చోకమేల భక్తశ్రేణి యందున్నత స్థాన మలంకరించినాడు.

ఈ మహోద్యమమునకు ముఖ్యస్థానము భీమనదీ తీరమందలి యొక చిన్నపట్టణము. అందొక దేవాలయము కలదు. అది మిగుల ప్రాచీనదేవాలయమై యుండవచ్చును. కాని పదమూడవ శతాబ్దరంభము వఱకు అది ప్రసిద్ధికి రాలేదు. అప్పటినుండి యది మహారాష్ట్రుల భక్తిపూరిత దృక్కుల నాకర్షించినది. పంఢర్ పుర దేవాలయ మందలి ఇటుక వేదికపై నతశరీరులై నిలిచి విఠోభా సుందరమూర్తి నారాధింపవలెనని మహారాష్ట్రదేశమందలి భక్తులును

సామాన్యులు కూడ మిక్కిలి మక్కువపడుచుందురు. ఎట్లయిన స్వామిదర్శన మబ్బెనేని ధన్యుల మైతిమనియు తమ జీవనపరమాశయమును పూర్తిగా మనియు చేతుల నందిపుచ్చుకొంటి మనియు వీరు తలచి పరమానందభరితు లగుచుం దురు. వీరి భక్తివిశేషమును గుఱించి ఎన్నెన్నో చిత్రగాధలు మహారాష్ట్ర భూమియందు పుట్టినవి. విఠలు నొకసారి కన్నులారా చూచుటకు గుంటివాడైన యోగి యొకడు పిటన్‌నుండి పండరిపురమువఱకు డేకియు ప్రాకియు పోయినా డట. ఆలయము మహోన్నతమైనది కాదు. శిల్పకౌశలమయినను అందు విశేషము కన్పట్టదు. కాని గుడియందలి ప్రతి రాతియొక్క భక్తిభావపూరి తమై చూపరుల హృదయములందు పెద్దపెద్ద సంతోషతరంగముల నుప్పతిల చేయును.

విఠలదేవుని ప్రధానసేవకులలో చోకమేల యొకడు. ఆతని తండ్రి సుదాముడు. తల్లి ముక్తాభాయి. పండరిపురమునకు సమీపమందలి అనాగడ మనుపల్లె వారి కాపురస్థలము. వీరికి మంచియాస్తి కలదు. కాని సంతానము లేదు. అందుచే వా రహర్నిశాంతము దుఃఖితులై యుండువారు. సుదాముడు పెక్కుసారులు విఠలదేవుని దర్శించినాడు. భర్త యింట లేనపుడు ఊరితోట నుండి రెండువందల మామిడిపండ్లను బీడారుమసల్కను గవర్నరు కడకు పంప కమునకై ముక్తాభాయి కొనిపోవలసి వచ్చెను. ఆమె పోవుచుండ మార్గమధ్య మున నొక పేదబ్రాహ్మణుడు ఆమె కెదురై ఆకలిబాధచే పీడితుడగుచు కొన్ని పండ్లను తనకిమ్మని ఆయిల్లాలి నడిగెను. ముక్తాభాయి యావిప్రున కైదు మామిడిపండ్లిచ్చినది. బ్రాహ్మణుడు సంతోషపూర్వకముగా వానిని గ్రహించి యామె నాశీర్వదించి "తల్లీ! సదయ హృదయవై నీవు నాకైదుపండ్లిచ్చి నాయాకలిబాధను తీర్చితివి. ఈపండ్లవంటి బిడ్డలు నీకైదుగురు జన్మింతురు. నాకు మామిడిపండ్లిచ్చితివిగాన నీపెద్దకుమారుని 'చోక' (మహారాష్ట్రభాష యందు 'చోక్ నేన్' అనగా మామిడిపండ్లు అని యర్థము) యని పిలుచు చుండుము" యని పలికి వెడలిపోయెను.

కొంతకాలమున ముక్తాభాయి గర్భవతి యైనది. పుత్రసంతానము కలిగినంతనే తలిదండ్రులు పరమానందభరితులై భూసురేంద్రుని యాజ్ఞ ననుస రించి వానికి 'చోక' లేక 'చోకమేల' యని పేరు పెట్టిరి. తలిదండ్రులు

మంచి భక్తులు కావున చోకమేల జన్మాదిగ తనహృదయమును భక్తిపూరముచే నింపదొడగెను. అంత్యకులమున బుట్టుటచే చచ్చినగొడ్డుల శరీరములను యూరినుండి యవ్వలి కీడ్చివేయుట వానిపని. ఒకనాడాతని తండ్రి యూరలేనపుడును, తోడికులస్థులు వేర్వేరు చోటులకు తమతమ పనులమీద వెడలినపుడును, చచ్చిన యొక పెద్దయావు కళేబరమును చోకమేల ఈడ్చివేయ వలసి వచ్చెను. ఇట్టిపని బాలకుని శక్తిని మించియుండెను. విఠోబా తనశక్తిని కొంత యువ్వ డాతని కిచ్చినాడట. అందుచే చోకమేల యాపనిని కడు త్వరితముగ నెరవేర్పగలిగెను. ఉన్నతకులమున బుట్టిన బాలికయొకర్తు విఠలుని దర్శించి జనసమూహమున నిలిచియుండెను. ఆమె మిగుల రూపవతి. తన కర్తవ్యమును నిర్వర్తించుకొని చోకమేల దివ్యతేజస్సు తోచినంతనే చరచర నామె ముందుల కరుదెంచి యాతని పాదములపై వ్రాలి తన్ను పత్నిగ గైకొమ్మని వేడుకొనెను. అంతట నామెనర్ధాంగిగా పరిగ్రహించెను.

కొన్నిదినములు గడచినపిదప నతడు స్వగ్రామమును వదలి తనహృదయాధినాథుడు విఠలుని సమీపమున నివసింప గోరి పండరీపురమున వాసమేర్పఱచుకొనెను. ఆతనిసతి వానియెడల మిగుల ననురక్తయై యుండి మగని వలెనే భక్తిశ్రద్ధలతో విఠదేవుని సేవింప మొదలిడెను. చోకమేల పండరిపురమునకు పోగలిగెను. కాని విఠలుని చరణసమీపమున గూర్చుని యాతని సేవింపగల భాగ్యమాతనికి చేకూఱ దయ్యెను. నీచకులమున బుట్టుటచే మందిరమందు ప్రవేశించుట కాతనికి హక్కును లేదు. అవ్వలిగుమ్మము కడ గూర్చుండియే యతడు రేబవళ్ళు స్వామిని ప్రార్థించుచుండువాడు. విఠలుని దర్శనమాతనికి దూరమందుండుటచే సరిగా యబ్బునదికాదు. చాలాసేపతడు గుమ్మమునకవ్వల నిలిచి ప్రార్థించి యనంతరము చేత జీపురు పూని గుడిచుట్టునున్న వీథులు తుడుచుచుండువాడు.

ప్రార్థనమందును భజనయందును సేవయందును అతడు దినములు గడుపుచుండువాడు. మాదిగవాడు సన్యాసి కాగలుగుట ధ్యానదేవుని అనుచరులకు కూడ చాల విరుద్ధముగ దోచెను. కావున నాతనికై యత్యాచారము వేచి యుండెను.

చోకమేల యెప్పటియట్లు బయట గుమ్మముకడ నిలిచి విఠలుని కీర్తించు చుండ నొక బ్రాహ్మణు డాదారిని పోవుచు అసూయా భావమున నాతని పరికించి "ఏమోయీ! మాదిగా! నీకీప్రార్థనలవలన నేమి ప్రయోజన మున్నది? నీవు రేయింబవళ్లు యిందేల వృథాకాలహరణము మాచరించు కొనుచున్నావు. బ్రాహ్మణుని చెంగట గూర్చుని యొకేకంచమున వానితో కుక్క పెరుగన్నమును కాంక్షించుటెట్లో నీవు విఠలదేవుని చూచి సంతసింప వలెనని కోరుటయునట్లేయుండును. బిచ్చగాడు మూర్ధాభిషిక్తుడు కాగలిగిననాడు నీవు వైకుంఠమున స్థానము నందగలవు." అని పలికెను. వినయముతో విప్రునకు నమస్కరించి చోకమేల యిట్లనియెను. "బహుయోజనముల దూరమందున్నను సూర్యభగవానుడు కమలముపై తనకిరణశోభను గ్రుమ్మరించును. విఠలదేవుడు నాకు దూరమందున్నను, నాప్రార్థనల నాలకించి తన కరుణా పూరిత దృక్కులను నాపై ప్రసరింప చేయగలడు. దూరమందు నిలిచి యున్నను జనయిత్రి బిడ్డను కాపాడు కొనుటకై చరచర ముందులకు పర్వెడును. దూరమునుండి యైనను జగదీశు నన్నొక కంట జూచి రక్షింపక మానడు. ఒకానొక మనుజుని హృదయమునం దాతడు తన యాలయమున నిర్మించు కొనినచో యామనుజుడు విఠలుని గుడికి దాపున నున్నను దూరమందున్నట్లే యని మన మూహింపవలెను కదా!"

ఆనాటిరాత్రియే విఠలదేవుడు స్వయముగా చోకమేలను తనగర్భాలయములోనికి గొంపోయి యందు కూర్చుండజేసి యాతని భక్తిని మిగుల కొనియాడెను. గర్భాలయమున కివ్వల పరుండియున్న పూజారి చోకమేల గుడియందుండుట కనిపెట్టి తక్కిన పూజారులను లేపి చూడుడు; మాదిగవా డెట్లు ఆలయమందు ప్రవేశించినాడు. తలుపులన్నియు బంధించి యున్నను అతడు దొంగవలె ఏవిధముగనో లోపల దూరినాడు. గుడియంతయు మైలపడి పోయినది. విగ్రహము పాడుపడినది! ఈచండాలాధము డెంతపని చేసినాడో! బ్రాహ్మణమతము నీతడు మంటగలిపినాడు అని బిగ్గరగా త్రాగినవారివలె కేకలువైచిరి. చోకమేలను బట్టితీవ్రముగ కొట్టి బరబర నవ్వలి కీడ్చిరి.

అత్యాచారమునకు తలయొగ్గి చిరునవ్వుతో నామహాయోగి "మహాత్ములారా! మాదిగ యొకడు గంగానదియందు స్నానము చేసినయెడల అందలి

నీరము మైలపడిపోవునా ? రివ్వురివ్వున వీచు వాయువు చండాలుని యూపిరి వలన కలుషితమగునా ? నీచకులమందు పుట్టినను నేనట్టి యపరాధమునుచేసి యుండలేదు. ఈశ్వరు డనవరతమును నాభావములను, నాక్రియలను చూచు చునే యున్నాడు. ఆతని కన్నులకు అన్ని జాతులవారును, అన్ని మతముల వారును సములే కదా! తమకు సర్వశాస్త్రములును పరిశీలించిన మహాపండి తులు. తమకెఱుంగని దేమున్నది ?" అని ప్రశాంతముగ పలికెను. కోపో ద్దీపితులై కనులెఱ్ఱజేసి గుడిపూజారులు "దుర్మతీ! మాదిగకులమున పుట్టి ద్విజులమగు మాకు నీతులు నేర్పుచున్నావా ? చాలు నీసాహసము, నీసుద్దులు వినుటకు మేము బుద్ధిమాలిన వారము కాము. మాకు చక్కట్లుదిద్దుటకు నీ యంతర మేమి మాయంతర మేమి " అని నోటికివచ్చిన ట్లాయోగీంద్రుని తిట్టి ప్రభువునొద్దకు పోయి ఆలయమునకు మహాపదసంభవించెనని వానితో మొఱ వెట్టుకొనిరి. ప్రభువు మహామ్మదీయుడు. స్వతంత్రమైన బుద్ధికలవాడుకాడు. పూజారులమాటలకు చెవియొగ్గి యోగీశ్వరుని పిలిపించి తురకరాజు "చండా లుడా! వీరిదేవాలయమున నేల ప్రవేశించితివి " అని ప్రశ్నించెను. "ప్రభూ! జగదీశుడే నన్ను లోనికి గొంపోయినాడు. నే నేమిచేయుదును. మాలనని గోలపెట్టినను ఆతడు మానలేదు " అని యోగీంద్రు డుత్తరమొసంగెను. "దురాత్మ రుడా! అబద్ధములాడుచున్నావా! 'అల్లా ' వచ్చి నిన్నెత్తుకొని లోపలికి తీసు కొనిపోయినాడా ?" అని గద్దించి ఆలికి తురకగవర్నరు యోగీంద్రుని మెడకు పలుపుత్రాడొకటి కట్టించి నిష్ఠురుడై వానిని వీథులందు ఈడ్పించెను. యోగి శరీరము తున్కతున్కలైనది. కాని యాతనిది గట్టిప్రాణము. ఏమియు పలుకక విష్ణునామ సంకీర్తనము కావించినాడు. ఆకఱకుతురక వెంటనే వానిని పండరి పురమునుండి తరిమివేయించినాడు. భీమనది కవ్వల పడవేయించినాడు. అందుండి కదలి రావలదని శాసించినాడు.

ఇట్టి ఘోరకృత్యమునకు యిట్టిరాక్షసకృత్యమునకు చోకమేల కొంచె మైనను చింతించినవాడు కాడు. తన మానసమును శ్రీహరిపాదములయందే నిలిపియుంచి భీమానదియొక్క యవ్వలి గట్టుమీద "దీపమాల " ను గట్టిం చెను. ఇది నేడును అందు గోచరించును. ఒకనాడు తనగుడిసెకు సమీపమున గల నిమ్మచెట్టునీడను గూర్చుండి యాతడు భోజనము సేయుచుండ దివ్యాంబర

ధారియై విఠలమూర్తి యాతనికి ప్రత్యక్షమయ్యెను. భక్తుడు భగవంతునకు కూడ విస్తరివేయించినాడు. చోకమేలభార్య కలశమున పెరుగు గొనివచ్చి దేవదేవునకు వడ్డించుచుండ నొకపెరుగుచుక్క ప్రమాదవశమున విఠలుని వసనములపై బడె నట. "సర్వేశ్వరుడు మనయింటికి విందునకై వచ్చినపుడు నీ వాచరింపవలయువిధ మిట్టిదియా" యని యతఁ డర్ధాంగిని ఆక్రోశించెను. ఆసమయమున దగ్గరగల దారినుండి పోవుచున్న పూజారియొకఁడు ఈమాటలువిని ఎచ్చటనోయున్న విఠలుని గూర్చి చండాలుడు దూషణవాక్యములు పలుకుచున్నాఁ డని యపోహపడి ఆగ్రహావేశుడై పరుగెత్తుకొనివచ్చి చోకమేల చెంప మీఁద బలముగ గొట్టి మాలని ముట్టినందులకు భీమానదిలో స్నాన మాచరించి విఠలుని దేవళమున కరిగెను. అం దతఁడు ప్రార్థించుచుండ విఠలుని అమూల్య పీతాంబరముపై పెరుగుచుక్క కాన్పించెను. దేవదేవునిచెంప మిగుల వాచి యుండెను. ఆతని కనులనుండి అశ్రుబిందువులు జొటజొట రాలుచుండెను. పూజారి యాదృశ్యమును విలోకించి తన దుష్క్రియ దేవదేవుని బాధించుచుండె నని గుర్తించెను. భయవిషాదములచే నాతని హృదయము నిండిపోయెను. "చండాలుఁ డని నేను గర్హించిన ఆమానవుఁడు నిక్కమగుయోగి; నేను ఘోరపాపిని. సమ్మెటతో మంచిముత్యమును గొట్టినట్లు ఈశ్వరప్రేమనందిన ఆ మహాత్ముని గొట్టితిని" అని తలపోసి యాపూజారి కడువడిగా నదిదాటి యవ్వలితీరమున కరిగి చండాలయోగిపాదముల వ్రాలి యపరాధమును మన్నింపుమనివేడి భక్తిశ్రద్ధలు చూపుచు వానిని కూడ తోడుకొని విఠలమందిరమున కరిగినాఁడట. అపుడు స్వామి చెక్కిలిమీఁది వాపుతగ్గెనట. బాష్పధారలను గురిపించు విఠలుని వదనము మందహాసాంకితమయ్యె నట. జగదీశుడు పరమానందభరితుడై నాఁడట.

కొంతకాలమువఱకును చోకమేల సుఖముగాజీవయాత్ర గడుపగలిగి నాడు. దురంతదుర్మరణము ఆతని పవిత్రజీవనమును కడముట్టించినది. బీడారు గవర్నరు తనరాష్ట్రమందలి మాదిగలనందఱిని మంగళవేఢ యను పట్టణము చుట్టును ఎత్తైనగోడ నొకదానిని నిర్మింపుడని యాజ్ఞాపించినాడట. తోడి జాతీయులందఱితోడను చోకమేల ఏలికయాజ్ఞను శిరసావహించి పని చేయుచుండెను. ఒకతట్టున కట్టబడినగోడ యించుమించుగపూర్తికాగానే అది

చివాలున కూలి క్రింద పనిచేయుచున్న కూలివాండ్రపై పడినదట. గోడ క్రిందపడి ఆ నిర్భాగ్యులు నలిగి చచ్చిపోయిరి. వారిలో చోకమేల యొకడు. పాప మాతని యస్థికలు ఆ పడిపోయిన గోడక్రింద నడంగియుండెను. ఆతడు మృతుడైనపిమ్మట నాతని కీర్తిచంద్రికలు దశదిశలు ప్రాకెను. నామదేవుడను నొక జంగమ సన్యాసికి పండరీనాథుడు స్వప్నమునందు దర్శనమిచ్చి చోకమేల యస్థికలను విఠలమందిరమునకు గొనితెమ్మని యాతనినాజ్ఞాపించెను. ఈశ్వరా దేశమును శిరసావహించి నామదేవుడా పట్టణమున కరిగెను. చోకమేల యెముకలు యితరుల యెముకలతో కలిసియుండెను. యోగీంద్రుని యెముకలు గుర్తించుటెట్లు అని చాలసేపు యోజించి యతడు తన చెవిని నేలబారుగా నుంచినాడట. ఒకవైపున "విఠోబా విఠోబా" అను శబ్దము లాతని చెవిని బడెనట. చోకమేల యెముకలచ్చట నున్నవని యతడు గ్రహించి భక్తివిన యములు మనమున నిండుకొన వాని జాగ్రత్తగా ప్రోగుచేసి పండరి పురమునకు గొనిపోయి భూగర్భమున పాతిపెట్టినాడట. ఆపవిత్రస్థలముపై నొక శిల స్థాపింప బడినది. అది యందు నేటికిని గోచరించుచుండును. మహారాష్ట్రసీమ యందలి మాదిగలు ఆస్థలమును జేరి యిప్పుడును హరిభజనము చేయుదురు.

దురంతకష్టములచే పీడింపబడుచు దుఃఖమున మునిగి యున్నవారికి పరచర్య చేయవలెనని జగదీశుడు సర్వదా కనిపెట్టుకొనియుండును. ఈ పీడితు లేజాతి వారని కాని, యీదుఃఖితులేమతము వారని కాని యాతడాలోచింపడు. అగ్రజాతులచే గర్హింపబడు నిమ్నజాతుల చెంగటనే ఆతడు తఱచుగా మసలు చుండును. కారణమేమనగా వారియందే యభాగులు పలువురున్నారు గనుక. నిష్ఠురులై బ్రాహ్మణులు కొట్టిన దెబ్బలకు గుఱియైనవాడు చోకమేలయయ్యు వానికి శరీరము నొడ్డినవాడు విఠలుడే. భక్తుడు దుఃఖించిన భగవంతుడు దుఃఖించును. భక్తుడానందించిన భగవంతుడానందించును. ఆతని యానంద మును తనదిగా చేసికొనును. ఆతని దుఃఖమును తనదుఃఖముగా భావించును. అందులకీ కథ చక్కని తార్కాణము. జగదీశుననుకరించుట మానవుని కర్తవ్యము మానవుడు దయాసముద్రుడైననాడు వసుంధరయందు దుఃఖము నకు తావుండదు. కలహములు మటుమాయమగును; జాతివైరములు అంతరించును పశుపతి వైకుంఠమేయగును. అట్టిదినము ఎప్పుడు ప్రత్యక్ష మగునోకదా !

౫౨

# కృష్ణదాసు

"చ. జలనిధికన్యకాఘన కచస్థలిపచ్చలతాళి గోపికా
విలసితహారమధ్యమణి విశ్వజగద్వలయ ప్రకాశకో
జ్జ్వలమహనీయరత్న మని నారిత కాళియ భోగిభోగ మం
డలగిరివజ్ర మై వెలయు నందతనూజు భజింతునాదినిన్."

వంగసీమయందు వైష్ణవమతము విశేషముగా విజృంభించిన సమయము నందు నదియా యందు శ్రీకృష్ణచైతన్యుడు పుట్టినాడు. మధ్వాచార్యుడు స్థాపించిన శాఖలోని యోగియైన ఈశ్వరపూరివలన చైతన్యు డుపదేశమునంది దీక్షా జీవనమున ప్రవేశించినాడు. పదంపడి చైతన్యుడు భారతసీమయందలి పవిత్ర ప్రదేశముల నన్నింటిని దర్శించి వివిధప్రదేశములయందు మహోపన్యాసములు కావించినాడు. పెక్కుచోటుల జరిగిన పండితసభలందు పాల్గొని దిగ్విజయము నందినాడు. మధురమంజుల గీతాలాపముచేతను తన్మయనృత్యముచేతను అమర వాహినీ సదృశభావతరంగిణుల నుప్పొంగ చేసినాడు. అందుచే అనేకులు చైతన్యునిచుట్టుచేరి ఆతని తత్త్వామృతమును గ్రోలి ఆతనికి శిష్యులైరి. తన శిష్యులను అనుచరులను వెంటగొని యతడు జగన్నాథక్షేత్రమున కరిగి శేషించిన తన జీవనమును శ్రీహరిధ్యానమందు శ్రీచైతన్యస్వామి కడపివేసెను. శ్రీ చైతన్యునికి మిగులగూర్చు శిష్యులలో కృష్ణదాసొకడు. "చైతన్యజీవన చరిత్ర" యందును ఇతర వ్రాతలయందును లభించిన యాధారములను బట్టి కృష్ణదాసంత్యజుడని పలువురు నిర్ధారణ మొనరించిరి. క్రీస్తుశకము పదునేనవ శతాబ్దాంతమున నీతడు పుట్టినాడు. కృష్ణునెడల నీతనిగలభక్తి అత్యద్భుతమైనది. సమకాలికు లగు మహాభక్తులెందఱో ఈతని సఖ్యమంది ఆనందించిరి.

చిన్నతనమునుండియు ఏకాంతమున వసించు అభ్యాసము కృష్ణదాసునకు కలదు. కొంత యీడురాగానే ఇతడు వంగదేశమందలి జెస్సూర్ జిల్లాలోని బురాన్‌అను యూరునకరిగి అందొక యేకాంత ప్రదేశమున తనవాసము నేర్ప

అచుకొనెను. ఆతనిగుడిసెచుట్టు చక్కని తులసివనముండెను. రేబవళ్లు హరి నామస్మరణమున నతడు నిమగ్నుడై యుండువాడు. ఆతని ప్రతిభ అచిరకాలములో వంగసీమయం దెల్లకడలందు వ్యాపించెను. దూర ప్రదేశములనుండి ఎందఱెందఱో ఆతని దర్శనార్థమై వచ్చుచుండువారు. ఎట్టి పాడుజాడ్యమైన నతడవలీలగ కుదుర్పగలుగువాడు. ఆతని కరుణవలన నెందఱో రోగులు స్వస్థులైరి. కొంతకాలము కడచిన పిదప నతడు బురాన్‌వదలి శాంతిపుర సమీపమందలి ఫులియా కరిగెను. అద్వైతాచార్యునితో నచట నాతనికి గాఢమైత్రి కుదిరెను. అద్వైతాచార్యుడు మహావిజ్ఞానియైన విప్రుడు. మహాభక్తుడు శ్రీచైతన్యస్వామి శిష్యుడు. కృష్ణదాసు, నితఁడును నొకేతావున వసించుచు ఒకేమాఱు పూజాదులను నిర్వర్తించుచుండువారు.

శ్రీచైతన్యుని ప్రజ్ఞావిశేషముల నెఱిగి కృష్ణదాసాతనిని నదియాయందు గలిసికొనెను. చైతన్యస్వామి మహోదారుడు. కరుణాపూరితమనస్కుఁడు. అంత్యజుని భక్తివిశ్వాసములకు మిగుల సబ్బురపడి మహానందముతో నతనిని కౌగలించుకొని ఈశ్వరారాధనమున జాతిభేదములకు చోటు లేదని పలికెను. తోడనే గౌరాంగుడు కృష్ణదాసును తన శిష్యవర్గమందు జేర్చుకొనెను. ఆతనియెడల నెంతేని యాదరమును అనురాగమును చూపుచుండెను. నాడాది కృష్ణదాసు చైతన్యుడు పోవు మహాక్షేత్రములకు ఆచార్యుని పదముల నంటి పోదొడగెను. గౌరాంగుడు జగన్నాథమున నివాస మేర్పఱుచుకొనిన పిదప కృష్ణదాసుకూడ ఆమహాక్షేత్రమందే వసింపసాగెను. అతడు వసించుచుండెడి కుటీరము 'యిచట' నుండెడిదని యాత్రికులకు జగన్నాథక్షేత్రవాసులు చూపుచుందురు. కృష్ణానందుని "చైతన్యజీవనచారిత్ర" మందు శ్రీజగన్నాథక్షేత్రమున కృష్ణదాసునకు చైతన్యుడొసగిన అనురాగపూరిత స్వాగతమును గుఱించిన విపులోదంతము కలదు. చైతన్యుని తొలుత విలోకించినపుడు కృష్ణదాసు దూరమున మార్గమునకు ప్రక్కను సాగిలపడెను. కొందఱు భక్తులాతనిజూచి చైతన్యస్వామికడ కాతనిని రమ్మని యాహ్వానించిరి. "అయ్యలారా! నేను నీచకులస్థుడను. ఏ ఆలయమునందు గాని నాకు ప్రవేశించుట కధికారములేదు. ఇందలి యుద్యానమున నొక నిర్జనప్రదేశమున నాకు జానెడు చోటు లభించునెడల నా మైలగాలి యొకరికి సోకనిరీతి యందు వసింతును.

నా ప్రార్థన మింతియే" యని యాతడుత్తర మొసగెను. చైతన్యుడు కడువడిగా నాతనికడ కరిగెను. కృష్ణదాసు భక్తిపూర్వకముగ నాతని పదములకు ప్రణమిల్లెను. చైతన్యుడాతని లేవనెత్తి గాఢముగ నాలింగన మొనరించుకొనెను. ఇరువురకనులనుండి ప్రణయాశ్రుబిందువు లెడతెగక కురిసెను. "మహాత్మా! నేను చండాలుడ; అంటబోకుడు" అని కృష్ణదాసు పలికెను. "నీకుగల నిర్మలభక్తి నాకు లేదు. పవిత్రుడ నగుటకై నిన్నంటితిని. సర్వమహాక్షేత్రము లందు స్నానమాచరించియు దానాదిసత్క్రియల నాచరించియు వేదములను పఠించియు కోటివిప్రులచేబట్టుపున్నెమును అనుక్షణము కృష్ణనామసంకీర్తనము వలన నీవు పడయుచుంటివి. నినుబోలు భాగవతుడు బ్రాహ్మణులయందుగాని సన్యాసులయందుగాని లేడు." అని వచించి శ్రీకృష్ణచైతన్యుడాతడు కోరిన యుద్యానములోనికి గొనిపోయి ప్రత్యేకమైన యొక కుటీరమున నతనిని విడియించి కృష్ణస్తవమొనరించుచు దోయిష్టానుసారమిందు వసింపుము అనుదినము వచ్చి నిన్ను కలసికొనుచుందును. జగన్నాథమందిరశిఖరమునగల పసిడికుండ ఇందుండి నీకు దృగ్గోచరమగుచున్నది. దానికి ప్రణమిల్లుచుండుము. ప్రసాదము నీకు పంపబడుచుండును. అని యతనితో పలికెను. నిత్యానంద జగదానంద దామోదర ముకుందులు మున్నగు మహాభక్తులు కృష్ణదాసును కలిసికొని పరమానందభరితులైరి. గోవిందునిద్వారా శ్రీచైతన్యుడు ప్రసాదమును కృష్ణదాసునకు పంపుచుండెను.

కృష్ణదాసుని జాతీయులు దక్షిణ పశ్చిమ భారతదేశ భాగములయందు బడయుచు వచ్చిన నిరాకరణముగాని నిష్ఠురాచరణముగాని ఆతని నంటలేదు. సమకాలికులైన మహాభక్తులును యోగులును ఆతనియెడల మిగుల ననురక్తులై మెలగిరి. ఆతనితో గలిసిమెలసి యుండవలెనని మక్కువపడిరి. గౌరాంగుడాతని నాదరించుటం జేసి బహుసంఖ్యాకు లాతనిమార్గము ననుసరించిరి—

చరిత్రయుగమందలి ఈసమయమున శ్రీజగన్నాథక్షేత్రము యోగులకును భక్తులకును ప్రధానస్థానమైయుండెను. నందునకును ఆతనిబోలు దక్షిణదేశభక్తులకును చిదంబర మెట్టిదో మహారాష్ట్రభక్తులకు పండరిపుర మెట్టిదో వంగ ఒరిస్సా రాష్ట్రము లందలి భక్తులకు పూరీ యట్టిదై యుండెడిది.

సాగరమున కనతిదూరమునగల శ్రీజగన్నాథ మందిరము పలువుర దృష్టుల నాకర్షించినది. ఏటేట వేనవేలు యాత్రికులు ఆక్షేత్రమును దర్శించి సముద్రస్నాన మాచరించి స్వామిని సేవించి మహోత్సవములను కనులారగాంచి తమతమ నివాసములకు మరలిపోవుచుందురు. వైష్ణవభక్తులకు ఆకాలమున జగన్నాథము వైకుంఠ మట్లు చూపట్టెను. వైకుంఠనాథుడు జగన్నాథస్వామియై అచట మానవకోటికి ప్రత్యక్ష మయ్యె నని వారి విశ్వాసము. తమ ముద్దు కృష్ణుడే శ్రీజగన్నాథు డని వారు గుర్తింపగలిగిరి. ప్రకృతిసౌందర్యముతో ప్రభవిల్లు నాప్రదేశము కృష్ణజీవనమందలి శృంగారదృశ్యములను వారికలపు నకు దెచ్చెడివి. చైతన్యాదుల కా తావునెడల నంతప్రేమ కుదురుటకును వారచ్చో టును తమవాసస్థానము గావించుకొనుటకును కారణమిదియే. సముద్రమునగ్రుంకు లిడి మందిరమందు ప్రార్థనమును పూజలును సలుపుట నాటిభక్తుల పరమాశయ ములు. పండువుదినములందు భక్తులందఱు భజనలు సేయుచు పురవీథులం దూరేగుచు నృత్తగీతాదులు సలుపుచుందురు. సాగరమునకైన హద్దుపద్దు లున్నవిగాని, ఉత్సవసమయమున నుప్పొంగు వీరి యుత్సాహమునకు వీరి యానందమునకు వీరి యావేశమునకు నెట్టిపరిమితి యు నుండెడిదికాదు. చైత న్యాదులు ఆలయసేవకులై మెలగుచు గుడినేలను తుడుచుచు స్వామి విగ్రహము లను కడుగుచు రథమును లాగుచు మహోల్లాసమున గంతు లిడుచుండువారు.

తోడిభక్తుల గూడి కృష్ణదాసు ఆనందసాగరమున నీదులాడుచుండు వాడు. చైతన్యస్వామి చరణసమీపమున కూర్చుండి యాతని వాక్సుధా ధారలు వినుచుండువాడు. భజనసంఘములందుజేరి వారినిగూడి యాడుచుండు వాడు; పాడుచుండువాడు. ఆరామమందలి తన కుటీరమందు యేకాంత వాసియైయుండి విశేషకాలము ధ్యానమగ్నుడై యుండువాడు. నెచ్చెలులును తోడిభక్తులును కృష్ణదాసును తమతో సమునిగ నెంచుచుండినను వారి నందఱి నాతడు తన యధికులగ నెంచుచు వారందఱు ప్రసాదమారగించిన యనంతర మందే తాను ప్రసాదమును తీసుకొనుచు గుడిగుమ్మమునకు చాలాదూరమున నిలిచి ప్రార్థనము సలుపుచుండువాడట. ఈయుదంతము సత్యేతర మేమో తెలియదు. తమతో సమునిగ నాటి మహాభక్తు లీతని నెంచియుండ భవాబ్ధి సంభ్రాంతులైన ప్రజలీతని మహత్త్వమును గుర్తించి యాతనికి భక్తిపుష్పాంజలి

రొసగుటకు సిద్ధముగానుండ గర్భాలయమందలి స్వామికిని ఈతనికిని అడ్డునిలిచినవా రెవ్వరైన నుండిరనుట కవకాశము లేదు.

మహాభక్తుడైన కృష్ణదాసు కొంతకాల మిట్లు శ్రీజగన్నాథమున నివసించి తన యాచార్యుని తోడిభక్తులను వీడి తన హృదయాధినాథుని గలిసికొనుటకై దివ్యబృందావనమున కరిగెను. చైతన్యుడు క్రీస్తుశకము 1533 లో దివంగతు డైనాడు. అంతకు కొలది సంవత్సరములకుముందు కృష్ణదాసు మృతుడై యుండు నని యూహింపదగియున్నది.

కృష్ణదాసునకు బ్రహ్మహరిదా సను నామాంతరము కలదు. కొందఱు ఈతడు మహాత్మ్మదీయు డనియు హరిదాస ఠాకూ రను నామాంతరము కలవాడనియు చెప్పుదురు.

భారతభూమి మిగుల ఫలవంతమైనది. ఇందుండి పుట్టునవి సదాశయములే. ఈసదాశయము లొక ప్రత్యేక జాతి సొమ్ములు కావు. సర్వజాతులందును మహాయోగులు పుట్టిరి ; మహాపురుషులు జన్మించిరి.

నంద, రవిదాసు, చోకమేల, కృష్ణదాసులు ; బుద్ధ, శంకర, మహావీర రామానుజుల బోలు మేధావులు కారు. శంకర రామానుజాదులు మహానదుల వంటివారు. రవిదాసు ప్రభృతులు పిల్లకాల్వలవంటివారు. ఆ మహానదులు విశాలమగు కేదారములను తనిపినవి. ఈపిల్లకాల్వల దరిజేరి పథికులును కృషికులును పిపాసువులును పురిపిళ్లలో చల్లనినీరు గ్రోలి పరితృప్తులైరి.

రామానుజుడు మహాభక్తుడు ; మహాజ్ఞాని. రవిదాసు మహాభక్తుడు. ఆతడు గంభీరభావసమన్వితశ్లోకములను రచించినాడు. ఈతడు సుందరభావ బంధురకవిత్వము చెప్పినాడు. ఈతని కవిత్వము అజ్ఞానాంధకారములు పోద్రోలు సూర్యుడనియు ఈతని ప్రసంగములు సంశయములను, అవిశ్వాసమును తరిమివేయున వనియు ఆర్యావర్తవాసు లందురు. రవిదాసు కవితారచనలు బహుళముగ సిక్కుగ్రంథమైన "గ్రంథసాహిబ్" నందు గోచరించును. అంత్యజులైన ఇందలి నలువురయోగులలో రవిదాసు విద్వాంసు డనిపించుకొనినాడు. జగదీశునకును తనకును గల సంబంధమునుగూర్చి రవిదాసు యీక్రింది విధముగా వ్రాకుచ్చినాడు. " ఈశ్వరా ! నీవు మేఘమువు. నిన్నుచూచి ఆనందించు మయూరమును నేను. నీవు చందురుండవు. నీయందము కనులారాచూచి

యానందించు పరిచారకుడను నేను. నేను నిన్ను బాసి యొం దరుగగలను. నీవు ప్రదీపంబ వగుచో నే నందలి వ త్తిని. నీవు మహాక్షేత్రమవగుచో నేను నీయాత్రికుడను. నిష్కళంకప్రేమ మనయిర్వురను బంధించుచున్నది. నిన్ను గలిసి నేను సర్వమును పరిత్యజించితిని. నీకు నేను సలుపుసేవ నాహృదయమును ఆనందముచే నుప్పొంగించును. జగదీశా! నిన్నుబోలు ప్రభువెవ్వండునులేడు. నిన్ను పూజించుటవలన మృత్యువు చేతనుండు ఉరిత్రాడు తునియలై నేలరాలును నీసేవకోరియే రవిదాసు గీతాలాప మొనరించును."

భారతమతప్రవాహమున రామానుజ శంకరు లట్లు కాకపోయినను ఈ రవిదాసు కృష్ణదాసాదులు వేఱొకరీతిని నూతనభావవీచికల నుప్పతిల జేసిరి.

---

# మహావీరుఁడు

"క. పరమాత్ముని నారాయణుఁ
జిరంతనుని భక్తశేముషీనిష్ఠాస్వీ
కరణైకాయనుని సమ
స్మరణంబునఁ దలఁతు సతులసద్విధభూతిన్."

హిందూమతసంజాతులైన కొందఱు మహాపురుషులు తమకాలమందు ప్రబలిన దురాచారములను దుమమూడుటకై విశేషప్రయత్నములు చేసిరి. సంఘసంస్కరణములను సలిపిరి. ప్రధానహిందూమతసిద్ధాంతములను బలపఱిచిరి. ఈ మహనీయులలో ముఖ్యులు గౌతమబుద్ధుడును; మహావీరుడును. వీరు బౌద్ధజైనమతములను స్థాపించిన ఆచార్యులు. ప్రస్తుతము మనదృష్టి నాకర్షించిన యాచార్యుడు మహావీరుఁడు. ఈతని జన్మోదంతమును జీవనచారిత్రమును మహావిచిత్రములతో నింపబడియున్నవి.

పాటలీపుత్రమునకు అనతిదూరమున కుండలపురమను నొక చక్కని నగరము కలదు. దాని ప్రస్తుతనామధేయము 'బేసర్'. క్రీస్తుశకమునకు ఆరు వందలయేండ్లకు పూర్వము ఈ పురము మిగుల పెద్దదై యుండెడిది. అది యనేకభాగములుగ విభజింపబడెను. ఒక్కొక్కభాగమున నొక్కొక్కజాతి వారు వసించుచుండువారు. ఈపురమున కధినాథుడు సిద్ధార్థుఁడు అతడు ప్రజానురంజకముగ పాలించు రా జగుటచే యెల్లఱచేతను మిగుల ప్రేమింపబడు చుండెడివాడు.

సిద్ధార్థుని యర్ధాంగి త్రిశాల; మిగుల సుందరి. ఈమెకు ప్రియకరణి యను నామాంతరముండెను. రాణియు రాజును చాలకాలము సఖులై యుండిరి. కాని వారికి సంతానము కలుగలేదు. ఈలోపము కొంతకాలమునకు వారి హృదయములకు దురంతమైన వ్యథ కలిగించెను. ఒకనా డుద్యానవనమున విహరించుచు రాజదంపతులు తమదురదృష్టమునకు వగచుచు

ప్రసంగింపదొడంగిరి. ఆసమయమున నాకసమున కొందఱు దేవతలు పోవుచు వారి సంభాషణమువిని మిగుల దుఃఖించిరట. తక్షణమే వారొక కాసారతీర మున వ్రాలి రట. మిక్కిలి యందకత్తెయగు బాలికయొక్తు ఆ కాసారమున నపుడు జలకమాడుచుండెను. ఆమెసౌందర్యమునకు మిగుల ప్రీతుడై ఆదేవ తలయందొకడు "ఆమె కడుపున నొక మహాయోధుడు పుట్టుగాక" యని యాశీర్వదించినాడట. ఆతని సహచరుడు ఆనుడువులు విని "ఈమె విప్ర బాలిక. కడు పేదరాలు. ఈమె కడుపున నొకమహాయోధుడు పుట్టిన నేమి ప్రయోజనము?" అనెను. అంతట "అట్లయిన నీయోధుడు ప్రియకరణి గర్భ మున జనించుగాక" అని మొదటియాత డనెను.

ఆరాత్రి రాణి పదునాలుగు కలల గనెను. అవి మిగుల నద్భుతమైనవి. తన యపూర్వస్వప్నముల నుదయమున తనహృదయేశ్వరునకు విప్పి చెప్పెను. రాజు పరమానందభరితుడై "దేవీ! నీస్వప్నములు గంభీరభావగర్భితములు. నీగర్భమున మహావీరుడొకడు జనించి దిగంతవిశ్రాంతకీర్తి గడించును" అనెను.

కొంతకాలము కడచినది. త్రిశాలకనిన కలలు ఫలించినవి. ఒక శుభ ముహూర్తమున నామె తనయుని కనెను. బిడ్డ రంగారుబంగారు వన్నెవాడు. తేడు పుత్రోత్సవము సలిపెను. ప్రజలందఱు సంతోషసంభరితులై ఆటపాట లందు కాలము గడపిరి పలువురు పండితులును జ్యోతిష్కులును రాజును దర్శించి ఆతని నందనుడు బహుసంఖ్యాకులగు ప్రజల కాచార్యుడు కాజాలు ప్రజ్ఞానిధి కాగల డని వచించిరి. విప్రులెందఱో బాలకు నాశీర్వదించిరి. బహు విధదానములచే రాజు వారిని సంతోషపెట్టెను. కారాగారమందలి ఖైదీలను వదలివేసెను. బీదలకు బహుదినములు అన్నదానముచేసెను. కొన్నినాళ్ళ కాబిడ్డకు నామకరణము గావించెను. ఆతడు జనించినదాది తేని యైశ్వర్యము వృద్ధికాజొచ్చెను. అందుచే తనయునకు సిద్ధార్థుడు వర్ధమాను డనునామధేయ మొసగెను.

జన్మోత్సవము దేవతలుకూడ జరిపిరట. దేవేంద్రుని ఆజ్ఞను శిరమున బూని దేవతయొకడు రాజాంతఃపురమున ప్రవేశించి దొంగబాలకు నొక్కరుని అందుంచి వర్ధమానుని మేరుశిఖరమునకు గొంపోయెనట. గంధర్వాంగన లెందఱో అచటజేరి బాలకునిచుట్టు నృత్యము సలిపి కొంతసేపు మధురగీతికా

లావ మొనరించి బిడ్డనెత్తి ముద్దాడి పూజించిరట. పదంపడి అమరులా మాయాబాలుని తొలగించి వర్ధమానుని రాజాంతఃపురమున విడిచిరట.

వర్ధమానుడు దినదిన ప్రవర్ధమానుడయ్యెను. ఒకనా డతడు కొందఱు బాలకులతో గలిసి ఉద్యానవనమున నాటలాడుచుండెను. అపుడు పిచ్చియేను గొకటి భయంకరముగ ఘీంకరించుచు కుఱ్ఱలమీదికి వచ్చెను. బుడతలు చివాలున వృక్షశాఖలమీద కెగబ్రాకిరి. ఆయేనుగు చెట్లను మూలములతో నూడబెఱికెను. పిల్లలు క్రిందపడిరి. వర్ధమాను డిక నూరుకొనక కరికుంభమును విదళింప నుఱుకు సింహమువలె ముందులకు లంఘించి యేనుగుతొండమును గట్టిగబట్టి కుంభస్థలిపై జేరి వాడియైన దానిదంతములను తన్నుచు స్వారిచేయ దొడగెను. గజము కోపించి బాలకుని నేలగూల్ప గమకించెను. కాని దాని కా క్రియ సాధ్యముకాకపోయెను. భయరహితుడై యారాకొమరుడు పురము చుట్టు గజముపై స్వారిచేసెను. మహాయోధులెందఱో గుమిగూడిరి. కాని యాపిచ్చియేనుంగుదరి చేరజాలరైరి. తుదకాయేనుగు అలసట జెందెను. అది తెలిసికొని వర్ధమానుడు దానిని నిలిపి తాను క్రిందికి దిగెను. సిద్ధార్థుడు తనయుని దుండగమునకు చింతితుడై యాతని మందలించెను. బాలకుడు చిఱునవ్వు నవ్వెను. ప్రజలందఱు కుఱ్ఱవానిపరాక్రమమున కాశ్చర్యము చెందిరి.

వర్ధమానుని విక్రమమునుగుఱించి దేవతలయందు వాదప్రతివాదము లుప్పతిల్లెను. కొంద ఱతడు వీరు డనిరి. కొందరు భీరు డనిరి. తమలోతాము వారు పందెములువేసికొనిరి. వారిలో నొకడు గరుత్మంతునిరూపము దాలిచి వర్ధమానుడు తోడిబాలురతో నాడుకొనుచుండగా తన వాడిగోళ్ళతో బట్టి వాని నంబరవీధికి తన్నుకొనిపోయెను. బాలురు భయబడి గోలపెట్టిరి. వర్ధమానుడు భయపడక ఖగమును పరికించినాడట. పక్షితలపై యొక జుట్టుపిలక కానుపించినదట. వర్ధమానుడాపిలకను బట్టుకొని బలముకొలది ఝణాయించి లాగినాడట. దేవత కుయ్యో మొఱ్ఱో అనెనట. "భడవా! క్రిందికి మెల్లగా వ్రాలుము" అని వర్ధమానుడు గట్టిగా గద్దించినాడట. కిక్కురుమనకుండ దేవత కిందికి వ్రాలెనట. నేలమీదికి దిగి రాకొమారుడు దేవతజుట్టును బట్టుకొని కొంతసేపు లాగిలాగి అతనిచే మొఱ్ఱోయనిపించి వదలినాడట. "బుద్ధివచ్చిన"

దని దేవత చెంపలు వాయించుకొని దివి కేగి తోడి దేవతల కావృత్తాంతమును దెలిపినాడట. సంగమయను సురయోధుఁడు ఆయుదంతమును విశ్వసింపక రాచపట్టి బలమెట్టిదో పరీక్షింప కుండలపురమునకు రివ్వురివ్వున నెగసిపోయినాడట. అట బాలకులగోల విని నగరవాసులు గుంపులు గుంపులుగా ఆట స్థలమునజేరిరట. సిద్ధార్థుఁడును పరువెత్తి వచ్చెనట. ఆకసమున నెందో నలక వలె తోచిన బిడ్డను రక్షింప నేయుపాయమును తోచక దుఃఖించినాడట. అంతటనే తనయుఁడు భూమీతలమునకు వచ్చుట గాంచి పరమానందభరితుఁడైనాడట.

ఒకనాఁడు వర్ధమానుఁడు నెచ్చెలులగూడి తోటలో నాటలాడుచుండెను. సమీపమందలి డొంకయందు "బుస్సుబుస్సు" అను శబ్దము వినబడెను. బాలకులగుండెలు తటతటలాడినవి. ఇంతలో నొక తెల్లత్రాచు పడగయెత్తి బుసకొట్టుచు చరచర నివ్వలికిఁ బ్రాకి వచ్చెను. కెవ్వు మని బాలకులందుండి పరుగెత్తిరి. త్రాచు కన్నుల నిప్పులు చెరుగుచుండెను. వర్ధమానుని మీఁదికి దుముక నెంచి యది యాతనిదెసకు వచ్చెను. కదలక మెదలక యింతవరకు నిలిచి యున్న రాకొమరుఁడు చివాలున పాముతోక బట్టుకొని వడిసెల ద్రిప్పినట్లు దానిని ముమ్మాఱు గిరగిరద్రిప్పెను. భుజంగము బాలుని వీపుపై విషము గ్రక్కెను. పాము చచ్చినదనియెంచి రాచపట్టి దానిని నేల విసరివైచెను. మహారోషముతో నాయురగము యాతనిమీఁది కెగురజొచ్చెను. మరల దానిని బట్టుకొని వర్ధమానుడు డగను కాలిక్రిందబెట్టి మెత్తగ ద్రొక్కఁదొడగెను. మనుష్యస్వరమున సర్పము "అయ్యా! రక్షింపుఁడు. అపరాధిని. నేను సంగమ యను దేవతను. నీపరాక్రమమును నెఱుగక నిన్ను డీకొంటిని; ఓడితిని. క్షమింపుము ప్రాణభిక్షపెట్టు" అనియెను. ఆవాక్కులువిని వర్ధమానుఁడు ఆశ్చర్యాన్వితుఁడై తన పా ను పాముతలనుండి తొలగించెను. అమరవీరుడు సర్పరూపమును చాలిం చబిడ్డచరణములఁ వ్రాలి తన యపరాధమును క్షమింపుమని బహుభంగుల ప్రార్థించెను. అనంతర మాతని బూజించి దేవగీతములచే వానికీర్తించి "రాకుమరా! మనుష్యలోకమున నిన్నుబోలు యోధులు జన్మించుట అరిది. నేఁడాది నీవు మహావీరుఁడ వను నామధేయముతో వరలుదువుగాక" అని వచియించి సంగముఁడు నిజలోకమునకు మరలిపోయెను.

కొన్ని యేండ్లు కడచినవి. మహావీరునకు వివాహమయ్యెను. ఆతనిపత్ని సౌందర్యతిలక; నామధేయము యశోద. అర్ధాంగలక్ష్మితో రాచపట్టికొన్నేండ్లు సుఖముగా గడపెను. వారికొక చక్కని కొమరుతు జనియించెను. పేరు అంగ తాతగా రాతనికి జామలి యను రాచకుమార్తెనిచ్చి వివాహము జరిగించిరి. సంసారముపై మహావీరునకు విరక్తి కలిగెను. ఒకనాడు తండ్రిపాలి కరిగి యాతడు "జనకా! నాకు సంసార సుఖములపై రోత కలుగుచుండెను. విరాగిని కావలెనని మక్కువ పడుచున్నాను. నాకు అనుమతి దయచేయుడు" అని వేడుకొనెను. సిద్ధార్థుడామాటలు కదరిపడి "నీవు మా తపఃఫలంబవు, నిన్నువిడిచి నీతల్లియు నేనును ఒకదినమైన నుండజాలము. ఇపుడు యోగి జీవనమును గాంక్షించుట నీకు తగదు" అనెను.

తలిదండ్రుల యాజ్ఞ నుల్లంఘించుట వర్ధమానున కిష్టము లేకపోయెను. తనయుడు తలపెట్టిన వైరాగ్యమును రాజదంపతులు స్వీకరింప నిశ్చయించిరి. అనుదినము వా రారగించు పంచభక్ష్యపరమాన్నములకు వారు నీరు వదలిరి. ఒకకబళము సామాన్య ఆహారము నొకపూట మాత్రము తినుచు వారుకొన్నాళ్లు కడపిరి. అనంతరము కొంచెము పాలుత్రాగి యుండువారు పిమ్మట క్షీరమును కూడ పరిత్యజించి నీటిపై నాధారపడిరి. బలిష్టకాయులై యుండిన యీరాజ దంపతులు శల్యావశిష్ట శరీరులైరి. పదంపడివారు తమరాజ్యమును తనయుని చేతులబెట్టి భద్రమని మంత్రిపుంగవుని హెచ్చరించి తప మొనరించుటకై వనావృతమైన యొక పర్వతప్రదేశమున కరిగిరి. అనిలాహారులై కొంత కాల మందు వసించి యనంతరము వారు ప్రాణముల బాసిరి. భార్యాసహితుడై తమయేలిక రాజ్యమును విడిచినంతన మిగుల దుఃఖించిన ప్రజలు సతీయుతుడై యాత డిహలోకమును వీడినవార్త వినినంత నపార శోకసముద్రమున మునింగిరి.

మహావీరున కైశ్వర్యముపై సంసారసుఖములపై పూర్తిగ రోతపుట్టెను. రాజ్యాధికారమును తసోదరునకిచ్చి జ్ఞానాన్వేషణము నకై వెడలిపోవలె నని యాతడు నిశ్చయించెను. తన యభిప్రాయ మనుజునితో చెప్పెను ఆతడందు లకు సమ్మతింప లేదు. మహావీరుని సంకల్పము దృఢమయియున్నది. అపు డనుజుడు "సోదరా! నీ విపుడు రాజ్యమును విడిచిపోతివేని రాజ్యాపేక్షినై నిన్ను తరి

వేసితి నని ప్రజ లపోహ పడెదరు. కొంతకాలమైన నాతో గలసి యుండుము; పిదప నీయిష్టము" అని మహావీరునితో పలికెను. అత డందులకు సమ్మతించెను.

మన ప్రాచీనరాజన్యులు మిగుల నైశ్వర్యవంతు లయ్యు తమయైశ్వర్య మున కెపుడును వారు దాసులుగ ప్రవర్తింపలేదు. తామరాకుపై నీటిబొట్టు వలె వారు తమ యిహలోకజీవనమును సాగించిరి. తాము మసలినది పలువురు భూమిప్రజలందైనను, ప్రజాసేవమాత్రము సలిపి తమపవిత్రకర్తవ్యమును వారు నిర్వహించినను తమదృష్టిని తెలచుగ వారు దివిదెసకే సారించిరి. వారి రాజ్యభోగములు వారి ఈశ్వరకాంక్షను మడియింపలేదు ఈశ్వరసేవకుల మని యెంచియే వారు పాలనాధర్మమును నెఱపుకొని సమయము వచ్చినపుడు తమ పాలనాచక్రమును తనయుల కప్పగించి తపోవనములకు తరలిరి. క్రమగతి తనప్రత్యేక ఆశ్రమధర్మమును నెఱపుకొనిన రాజన్యులలో సిద్ధార్థు డొకడు. తనయైశ్వర్యమును తుచ్ఛముగ నెంచి సమయ మాసన్నమైతంతనే యతడు అర్ధాంగి సహితుండై తుదియాశ్రమమున కాలు పెట్టినాడు.

సోదరుడేర్పఱిచి గడువు దాటగనే మహావీరుడు సన్యాసాశ్రమస్వీకారమునకై తగినసన్నాహములు సలిపినాడు. మహావీరునివయ సపుడు ముప్పదేండ్లు మాత్రమే. కుండలపురపండితుల నందఱను రప్పించి "మహాశయులారా! నేను "పరశ్వనాథా' శ్రమమును ప్రవేశింప గాంక్షించుచున్నాను. అందులకై విధ్యుక్తకర్మలు జరుపవలసి యున్నది" అని వారితో పలికెను.

పండితుల తోడ్పాటున తొలుతటితంతును మహావీరుడు జరపినాడు. మూడుదినము లుపవాసము జేసినాడు. నీరుమాత్ర మాదినములలో గ్రోలినాడు. బంధుమిత్రులనుండి విడివడి ధ్యానమగ్నుడై యుండెను.

మహావీరుడును మహేంద్రుడును పూర్వజన్మమున సన్నదమ్ములై యుందురు. అందుచేకాబోలు మహావీరునెడల నింద్రునకు మిక్కిలి మక్కువ యని జైనమతగ్రంథకర్తలు వ్రాసిరి. మహావీరుడు సన్యసించుట గాంచి దేవేంద్రుడు పరమానందభరితుడైనా డట. ఒకని తపమును చూచి యాతడధికుడై తనపదవిపై కన్నువేయు నని మహేంద్రుడు భయపడుచుండు నని పురాణగాథలయందు వినుదుము. కాని మహావీరుని తప మాతనికి సంతోషదాయకమే యయ్యెను. మహావీరుడు సన్యాసాశ్రమమును స్వీకరించిననాటిరాత్రి మహేంద్రు

డమేయధనరాసులను దెచ్చి యాతని జోలియందు బోసినా టడ. వైశాలియందలి బీదల కాధనమును మహావీరుడు పంచిపెట్టినా డట.

ముత్యములు తాపిన బంగారు పల్లకిపై నెక్కి మహావీరు డూరేగెను. మహోత్సవము జరిగెను. ప్రజలతోపాటు సన్యాసు లనేకు లుత్సవమున పాల్గొనిరి. మహాసంరంభమున పాలకి పురమున గవ్వలగల ఉద్యానవనములోనికి కొనిపోబడెను. చక్కనియొక యశోకవృక్షముక్రింద నెత్తైన వేదికయొకటి నిర్మింపబడెను. మహావీరుడు తూరుపుదిక్కు మొగముగా వేదికపై నాసీను డయ్యెను. కొండొకవడి నిమీలితనేత్రుడై జగదీశుని ధ్యానించి అనంతర మాతడు తన యొద్దనున్న ధనరాశిని పేదలకు పంచియిచ్చెను. పిదప నతడు తన శరీరమందలి రోమములనుచూచి వానివలన క్రిములు పుట్టు ననియు వానిని హింసించుట యగుననియు యోజించి బాధకు సహించి వెండ్రుకల నూడబెకికినా డట. ఇంద్రునికన్ను అనవరతము మహావీరునిమీద నే యుండెను. సన్యాసియై ఆవీరుడు కేశముల తీసివేయుచుండ నింద్రుడు వడివడిగ బర్వెత్తుకొనివచ్చి రాలుచున్న ఆ పవిత్రకేశముల నొక వజ్రపుగిన్నెయందు గ్రహించినాడట. ఆగిన్నె నాతడనంతరము పాలసముద్రముకడకు కొనిపోయినా డట. మహావీరుడు "పరశ్వనా" ధాశ్రమమున ప్రవేశించెను. జైనులు తీర్థంకరు లను మహాజీవులను కొలుతురు. తీర్థంకరులసంఖ్య యిరువదినాలుగు. పరశ్వనాథుడు వారిలో నిరువదిమూడవ వాడట. మహావీరు డిరువదినాలవ తీర్థంకరుడయ్యెను. అతనితో వారి సంఖ్య కడ ట్టినది. పరశ్వనాథాశ్రమస్థులు పరశ్వనాథుని కొలుతురు. అతని యుపదేశముల ననుష్ఠింతురు.

మహావీరు డుద్యానమున నారువారములుండెను. ఆసమయమున నాతడేమియు భుజింపలేదు. అశోకవృక్షమున౦దద ధ్యానమగ్నుడై కదల మెదలక యాతడు కూర్చునియుండెను. ఎండ నాతడు సరకుసేయలేదు. వానకు చలింపలేదు. గాలిని లెక్కసేయలేదు. సర్పరాజు తన ఫణమెత్తి దాని నాయోగి శిరముపై గొడుగువలె నిలిపినా డట.

ఒకనాటి యుదయమున మహావీరుడు కన్నులు తెఱచి భిక్షుకపాత్రమును చేగొని కులపురమున కరిగెను. యోగీంద్రుడు తనపట్టణమున కరుగుదెంచచుండుట యెఱింగి రాజాతనికి నెదురేగి సాదరముగా వానిని తనమందిరమునకు

గొనిపోయి యాతని పాదములు కడిగి ఉపవాసదీక్ష జాలింపు డని కోరెను. ఆతని వేడికోలు మన్నించి మహావీరు డించుక యన్నమును క్షీరమును తీసికొనెను. తన గృహమున వసింపుమని రా జాతనిని కోరెను. కాని మహావీరు డందులకు సమ్మతింపక వెంటనే కులపురమును వీడి యరణ్యమున కరిగెను. అం దాతడు తపము చేయదొడగెను.

ఒకనాడు కొందఱు గొల్లపిల్లలు వనమున దిరుగుచు తపముచేయు మహావీరుని దూరమునుండి చూచి 'పులి పులి' యని యఱచిరి. కాని యోగీంద్రుడు కనులు తెరువలేదు. బాలకు లాతనిపై బెడ్డలువిసరిరి. అపుడును మహావీరుడు చలింపలేదు. దుండగులైన యాకుఱ్ఱ లపుడు యోగికాళ్లకు నిప్పంటించిరి. అపుడును ఆతడు కదలలేదు. అగ్ని యాతనిశరీరము నేమియు చేయలేకపోయినది. వారంతటితో నూరకొనలేదు. వాడి మేకులాతని చెవుల యందు గొట్టిరి. మహావీరు డప్పుడైనను చలింపలేదు. ధ్యానమగ్నుడై యుండెను. విసిగి మరల నొకసారి రాలు రువ్వి గొల్లపిల్లలు తమదారిని పోయిరి.

కాలక్రమమున మహావీరునిచుట్టు కొందఱు శిష్యులుచేరిరి. ఒకనాడాతడు తనశిష్యులకు జ్ఞానోపదేశము చేయుచుండ నింద్రుడు వచ్చి ఫాలభాగమున కరకమలములు మొగిచి యిట్లనెనట. "మునీంద్రా! నీవు నీసర్వస్వమును వీడితివి. కౌపీనముకూడ త్యజించివేసితివి. స్వర్గభూమియందలి దేవతలందఱు నీకై కడుచక్కని యంగీని తయారుచేసిరి. దానిని ధరియించి మ మ్మానందింపజేయుడు." మహావీరుడు మందస్మితవదనుడై "మహేంద్రా! సన్యాసికి కౌపీనముమాత్ర మెందులకు. ఇహలోకసంబంధమగు వస్తువేదియు నాతని కక్కరలేదు. అయినను నీవేడికోలును త్రోసివేసి నీమానసమును నొప్పింపనొల్లను. అంగీని పరిగ్రహింతును" అనెనట. పరమానందభరితుడై దేవేంద్రు డాయంగీనతనికి దొడిగినా డట. దివ్యాంబరభూషితుడై యప్పు డా సంయమీంద్రుడు అపూర్వ తేజమున వెలుగొందినా డట.

ఒకనాడు సోమదత్తుడను పేదబ్రాహ్మణుడు మహావీరుని శరీరమున తేజరిల్లు అంగీనిగాంచి "అయ్యా! నీవు యోగివికదా! ఈయమూల్య వస్త్రము నేమిచేసికొందువు. నేను పేదబ్రాహ్మణుడను. చింపిగుడ్డలతో మసలుచున్నాను.

ఈ యంగీలో సగము నా కీయరాదా ?" అనియెను. యోగి యేమియుం బలుకక అంగీని జింపి యర్ధభాగమును సోమదత్తున కిచ్చివేసెనట.

వేల్పుటంగీయొక్క యర్ధభాగమును మూపుననిడికొని యాపేద బ్రాహ్మణుడు పోవుచుండ మార్గమధ్యమున నొక సాలెవా డాయంబరమును గాంచి దాని యుదంతము నడిగి తెలిసికొని "అయ్యా! నీవు పేదవు నీకు కొంతపైక మిచ్చెదను. మిగిలిన యర్ధభాగమును కూడ యోగి శరీరమునుండి మెల్లగదీసి నాకిమ్ము" అని సోమదత్తునితో పలికెను. బ్రాహ్మణుడు వెనుకకు మరలెను. దూరదూరమున సాలెవాడుకూడ నడుచుచుండెను. యోగివరుడు కనులు మూసికొని కూర్చుని యుండెను. సమయము దొరకిన దని బ్రాహ్మణుడు సంతసించి మెల్లన నాతని శరీరమునుండి యంగీ తునకను తీసి దూరమున నిలిచిన సాలెవాని చేతికొసగి తన బహుమానమును తాను గ్రహించి యం దుండి నిష్క్రమించెను. కాని యానా డాతనికి నిద్దుర పట్టలేదు. దుష్కార్య మొనరించుటచే వాని యంతరంగ మాతని పరిపరి విధముల బాధింప దొడగెను.

చాలసేపటికి మహావీరుడు ధ్యానమును చాలించినాడు. వస్త్రభాగ మదృశ్యమైనందుల కాతడు నవ్వి "దానిని దొంగిలించినవారు ధన్యులు. సన్యాసి యెన్నడు వస్త్రము ధరింప రా దను విషయమును వారు నాకు తలపునకు తెచ్చిరి. ఇంద్రా! నీయంబరమును గోల్పోయినందులకు క్షమింపుము" అని యనుకొనె నట.

ఉజ్జయిని యొకప్పుడు ఆర్యావర్తమున మిగుల ప్రసిద్ధినందిన నగరము. అందు చక్కని కళాశాల యుండెడిది. పండితులెందరో అచట చేరుచుండువారు. ఉజ్జయినిపై మహావీరునకు ప్రీతిమెండు. శిష్యసమేతుడై యొకనాడత డావీటికి గదలిపోయెను. పోయి నగరమున కవ్వల గల శ్మశానమున విడిసెను. ప్రదేశమంతయు శవసంకులమై దుఃఖమయమై యుండెను. కొలదిదినము లుపవాసముజేసి యతడు తప మొనరింపసాగెను.

మహావీరుని తపసు చూచి కొందఱు గంధర్వులు భీతిల్లిరి. అద్భుత శక్తినంది యతడు ముల్లోకములను జయించునని తలచి యాతని తపంబునకు భంగముదెచ్చుటకై యనేకోపాయంబు లరసిరట. పిడుగులనాతనిపై పడవేసిరట. మెఱుపులను గ్రుమ్మరించిరట. రాక్షసరూపములను దాలిచి యాతనిచుట్టు

వికృతనృత్యము సలిపి యాతనిని భ్రమింగఁబోయిరట. పదపడి జగన్మోహనాకారలై యాతని హృదయము నాకర్షించుటకై యెన్నెని విలాసములు చూపిరట. మధురగీతముల నాలాపించిరట. నాట్యమాడిరట. మహావీరు డచలితచిత్తుడై తపమొనరించుచునే యుండెను. మనోరథ మీడేరనివారై గంధర్వు లదృశ్యులైరట.

కొంతకాల ముజ్జయినీనగరసమీపమున నివసించి యనంతరము మహావీరుడు కుముర్గ్రామ యను నగరమున కరిగెను. ఆ పట్టణము మిగుల సుందర మగు ప్రదేశమున నున్నది. నగరమునకు నలువలకుల చక్కనితోటలు కలవు. అందొక తోటయందు ప్రవేశించి యందున్న తామరకొలనుకు నొద్దున కూర్చుండి ప్రకృతిసౌందర్యమునకు మిక్కిలి యక్కజంపడుచు ధ్యానమగ్ను డయ్యెను.

ఒక వ్యవసాయదారు డపు డాచెరువుదరి నరుగుచుండెను. బలిసియున్న జోడెద్దు లాతనితోడనుండెను. యోగీశ్వరుని సమీపించి యాతడు "అయ్యా! నేనూరులోనికి పోవుచున్నాను. త్వరలో వచ్చెదను. నాయెడ్లను కనిపెట్టి చూచుచుండుము." అనెను. యోగనిద్రయందు మునింగియున్న యాయోగి యాతనిమాటలను వినలేదు. సమ్మతిసూచకముగా నాతడూరకుండె నని తలచి వృషభములను స్వామికడ విడిచి, కృషికు డందుండి వెడలిపోయెను.

వృషభము లందు నిలిచియుండలేవు. ఇందందు తిరిగి యొక పండిన చేనులో ప్రవేశించి కడుపునిండ పైరును మెసవుచుండెను. సేద్యకాడు మగిలి వచ్చెను. చెరువుగట్టుమీద నెడ్లు లేవు. యే మయిన వని యోగీంద్రు నడిగినాడు. ఆత డింకను యోగనిద్రయందే యుండెను. కావున నేమియు నుత్తర మొసగలేదు. వ్యవసాయదారు డిందందు తిరిగి యెడ్లను గానక తనయింటికి మరలిపోయెను.

మరునాటి యుదయమున నాయెడ్లాచెర్వుకట్టకడకు తిరిగివచ్చి నెమరు వేయుచు యోగిపొంత పరుండి యుండెను. కృషికుడుకూడ సరోవరముచెంతకు వచ్చి వృషభములనుగాంచి ఆశ్చర్యాన్వితుడై "వీనిని నిన్న నేమిచేసితివి?" అని యోగి నడిగెను. మహావీరుడు అప్పుడుకూడ ధ్యానమగ్నుడై యుండెను. కావునా డాగ్రహావేశు డయ్యెను. "అరే! దొంగా! నే నడుగుదానిని విన

నట్లు నటించుచున్నావు." అని యఱచి చేతనున్న బడితెతో మహావీరుని మోదసాగెను. అపుడుకూడ మహావీరుడు ధ్యానమగ్నుడై యుండెను. కనులు తెరువలేదు. అతనికి వాటిల్లు విపత్తును మహేంద్రుడు పరికించి పరుగుపరుగున దివినుండి దిగివచ్చి యుపాయముచే ధ్యానమగ్నుడగుస్వామిని లేపి "మహాత్మా! మాటాడకుంటివేల? ఈ దుర్మతి నిన్ను చంపివేయును. నీప్రాణములను కాపాడు కొనుము" అని అనెనట. "నే నిందుండి కదలను. నీవు నాకు సహాయము చేయవలదు. ఆతడు నన్ను పొడిచిన పొడువ నిమ్ము" అని మహావీరుడు పలికినా డట. ఆతనిపల్కుల కాశ్చర్యమంది మహేంద్రుడు యోగిని కాపాడుటకై యొక దేవత నందు నిలిపి తా నదృశ్యుడైనా డట. కాపువాడును నందుండి వెడలిపోయెను.

ఒకరోజున మహావీరుడు కౌసంబి వీధులందు తిరుగుచుండెను. సుందరి యోర్తుక యొకయింటి గుమ్మముముందు నిలిచి చేరువ జనుచున్న యోగివరు నుద్దేసించి "మహాత్మా! నిలువుడు. లోనికరుదెంచి ఈగృహము పావనమొన రింపుడు. మీయుపవాసదీక్ష చాలించి నే నిచ్చుభిక్షను పరిగ్రహింపుడు" అని వినమ్రమైయై పలికెను.

మార్గమధ్యమున మునివరుడు నిముసముసేపు నిమీలితనేత్రుడై నిలిచి యోజించెను. తన నాహ్వానించిన సుందరియుదంత మాతని మానసమునకు గోచర మయ్యెను.

ఆసుందరి నామధేయము చందన. వైశాలిదేశపురాజు కుమార్తెకు కుమార్తె. ఒకనా డామె పూదోటలో విహరించుచుండగా విద్యాధరుడొకడు రివ్వున పైనుండి వచ్చి తనచేతులం దామె నెత్తుకొని చివాలున వినువీధి కెగసె నట. భాసమానమైయున్న తన గగనసౌధమునప్రవేశింపకమున్న "అయ్యో! నే నెట్టిపనిచేసితిని. ఈసుందరుని చూచి నాభార్య యేమనునో! తక్కిన విద్యాధరులు నన్నుచూచి ఛీ యనరా" అని తనలో వితర్కించుకొని పశ్చాత్తప్త హృదయుడై వెనుకకు మరలి సుందరి నొక యరణ్యమందు విడిచి తనదారిని పోయె నట. అది యర్ధరాత్రము. అరణ్యప్రదేశమంతయు నంధకారబంధురమై యుండెను. అడవిమృగములు భయంకరముగ గర్జించుచుండెను. ఆ భయంకర సమయమున ఆ భయంకరప్రదేశమున పడి భయకంపితయై సుందరి గోలు

గోలున నేడ్చెను. ఆయేడుపు విని భిల్లుడొకడు అచ్చటి కేతెంచి వనలక్ష్మివలె దోచు సుందరిని గాంచి పరమానందభరితుడై "నాపున్నెము పండుటచే నాకిట్టి సుందరి కన్నులపడెను. ఈమెను కౌసంబిపురమునకు గొనిపోయి విక్ర యించితినేని నాకెంతేని ధనము చేకూడును" అని తలపోసి యేడ్చుచున్న బాలిక నూరార్చి వెంటనే కౌసంబిపురమున కామెను గొంపోయెను. అచట నొక వర్తకుని యింటి కరిగి తనయుద్దేశము నాతని కాభిల్లు డెఱింగించెను. వర్తకుడు ధనవంతుడు. మంచిమాటలు చెప్పి భిల్లుని మోసముచేసి చౌకబేర మున కాతడామెను గొనెను. ఆమెను పెండిలియాడవలెనని యాతడు నిశ్చ యించినాడు. వర్తకుని భార్య సుభద్ర చక్కనిదే. సౌందర్యమం దామె చంద నకు తీసిపోదు. భర్త యభిప్రాయము గ్రహించి సుందరి నొక ప్రత్యేకగృహ మందు విడియించి యామె ననూయభావముతో చూడసాగెను. చందన సుందరి మాత్రమే కాదు; బుద్ధిమతి. తనయవస్థకు తననే యామె నిందించు కొనెను. తన్నింతకు తెచ్చిన విద్యాధరునినైనను యామె దూషింపలేదు. అనవరతము పూజాదులను సలుపుచు పరమపావనయై మెలగుచుండెను. తన ప్రత్యేకగృహమం దుండియే యామె మహావీరుని విలోకించి యతిథిసత్కార మంద నాతని నాహ్వానించినది.

దివ్యదృష్టివలన నామెయుదంతము నంతయు గ్రహించి యామె దురవ స్థకు మహావీరుడు మిగుల దుఃఖించెను. ఆమెయెడల కరుణ గలిగి "అమ్మా! నీయాహ్వానము నాకెంతయు నానందము కలుగచేసినది. నీవాంఛ తీర్చెదను" అని యాతడు సుందరితో పలికెను.

చందన భక్తిపూర్వకముగా యోగివరుని యింటిలోనికి గొనిపోయి పాదములుకడిగి పీఠముపై నాసీనునిగావించెను. పాప మామెకనుదినము లభించు నవి ముక్కిపోయిన బియ్యమే. ఎంతయత్నించినను ఆమెకానాడు మంచి బియ్యము లభింపలేదు. తనదుస్థితికి మిగుల దుఃఖించి యామె యాముక్కిపో యిన బియ్యమునే వండి కడుశ్రద్ధతో నత్యంతభక్తితో అన్నమును స్వామిజీకి వడ్డించెను. ముని ప్రభావముచే నాయన్నము కలమాన్నముగా మాఱినదట.

మహావీరునిబోలు మహాముని సుందరియింట భిక్షనుగ్రహించెనని వినినం తనే కౌసంబిపురవాసులు ఆశ్చర్యాన్వితులై యామె మహాత్మ్యమును గుర్తించి

బహుబంగుల నామెను ప్రస్తుతించిరి. రాణి యామెను తనమందిరమున కాహ్వా నించెను. సుందరిని చూచినంతనే ఆమె తన సోదరియగు చందన యని రాజ్ఞి గుర్తించి పరమానందభరితురాలై ఆమెను కవుంగలించుకొనెను. రాణి తన యక్కయగు మృగవతియని సుందరి గుర్తించి అమితానందముతో నామె నాలింగనముచేసికొనెను. అక్కసెల్లెం డ్రిరువురు తమ గతమును దలచికొని తమకష్టములకు మిక్కిలి విచారించిరి. అనంతరము తమ తలిదండ్రులను వైశాలి నుండి రావించిరి. తనయలను చూచి వా రమితానందము నొందిరి. చందనకు పరిణయము చేయవలెనని వా రాలోచించిరి. చందన వారి యాలోచనమును ప్రతిఘటించి తన యావజ్జీవము మహావీరుని సేవించుటయందు గడపివేయ నిశ్చయించి సన్యాసాశ్రమమును స్వీకరించెను.

మహావీరుడు స్థాన స్థానములందు పరిభ్రమించుచు గురుగంభీర సత్య మును ప్రజలకు బోధింపదొడగెను. ఆతని శిష్యసంఖ్య అధికమయ్యెను. కాని యాతని శిష్యులందు పలువురు ఆచార్యుని ప్రబోధములను హృదయంగమ మొనరించుకొనినవారు కారు. విలువగల వలువలు ధరించి భక్ష్యభోజ్య లేహ్య చోష్యములందు మనసుంచి విలాసజీవనము నపేక్షించి నగరవాస మభిలషించి ఆడంబరమును కాంక్షించిరి. వారియెడల మహావీరునకు మిగుల రోత కలిగెను. "ఇట్టి యభ్యాసములు మీకుతగ" వని, "మీప్రవర్తనమును మార్చుకొన వలె" నని యాచార్యుడు వారికి హితవుగఱపెను. "అయ్యా ! పరశ్వనా థాశ్రమమునకు చెందిన నిబంధనలను మే మతిక్రమింపలేదు" అని వారుత్తర మొసగిరి. "ఈఆశ్రమమున కిట్టిగతి పట్టుచో నేను దానినుండి వెడలిపోయెదను. నే నుద్దేశించిన కార్యమును నిర్వహించుటకు నిర్మలహృదయులే తగుదురు" అని చెప్పి మహావీరుడు పరశ్వనాథాశ్రమమును పరిత్యజించెను.

మతప్రబోధము సలుపుచు పండ్రెండేం డ్లాత డనేక ప్రదేశములయందు పరిభ్రమణ మొనరించెను. మహావీరు డపుడుకూడ దిగంబరుడై యుండెను. కొంతకాలము కోసల యను శిష్యుడాతనితోడ నుండెను. ఈశిష్యుడు తాను మహాఘనుడై యుండ తనకొక యాచార్యు డేలయని యూహించి మహావీరు నుండి విడిపోయి స్వంతయాశ్రమ మొకటి నెలకొల్పెను. ఈ ఆశ్రమవాసులు అజీవకులని పిలువబడుచుండువారు.

మహావీరు డెప్పటియట్లు తనమతమును ప్రచారము చేయుచునే యుండెను. అతడు విశేషముగా పల్లెటూళ్లయందు సంచారము గావించెను. ఏపట్టణమునందును నత డైదురాత్రులకంటె నెక్కుడు వసింపలేదు. శీతకాలమం దతడు కొండగుహాయందు నివసించుచుండువాడు. అందుండి కదలివచ్చువాడు కాడు.

మహావీరుని యుపదేశములు మహారాజుల హృదయములను నాకర్షించినవి. పల్వురుయోధులును, రాజన్యులును అతని శిష్యులైరి. విదేహాధర్త చేతకుడును, అంగరాజగు కునికయును, కౌసంబిపురాధీశుడును వీరిలో ముఖ్యులు. వివిధరాష్ట్రములవారు మహావీరుని యడుగుజాడలబట్టి నడచుటకు మక్కువపడిరి. శిష్యులసంఖ్య పదునాలుగువేలవఱకు హెచ్చెను. యోగీంద్రుడం దరిగినను బహుసంఖ్యాకు లతని ననుగమింపసాగిరి. వారడిగిన ప్రశ్నల కన్నింటికిని మహావీరుడు సమత్తరములనొసగుచు వారియందలి సంశయబీజముల నన్నింటిని పెల్లగించి పారవేయువాడు.

కొంతకాలము కడచినపిదప యోగీంద్రుడు రాజగృహమున కరిగెను. రాజగృహము మగధరాజ్యమునకు ముఖ్యపట్టణము. శ్రీనిక యను రాజన్యు డానేల నేలుచుండెను. అతడు మహావీరునెడల మిగుల ననురక్తుడై యుండి యతనికి శిష్యుడయ్యెను. "యథా రాజా తథా ప్రజా." రేడు నూతనమతము నవలంబింపగానే ప్రజలందఱు నతడుత్రొక్కిన త్రోవయందే నడువసాగిరి. ఇంచుమించుగ నార్యావర్తమంతయు మహావీరమతావలంబులతో నిండిపోయెను. నిద్రాహారములను గట్టిపెట్టి విశేషముగా నతడు మతప్రచారమునకై శ్రమపడెను. ఆతని యారోగ్యము శిథిలమయ్యెను. పాట్నాజిల్లాయందలి పాప యను పురము నాతడెట్టకేలకు చేరుకొనెను. ఆ యూరినుండి యాతడింక కదలలేకపోయెను.

మహావీరున కపుడు డెబ్బదిరెండేండ్లు నిండెను. పాపపురమునేలు హాస్తిపాలున కాతడు కబురంపి యతడు రాగానే "పుత్రా! నా యవసానకాలమాసన్న మగుచున్నది. ప్రజలకు నాయంత్యోపదేశము నీయవలె నని కాంక్షించుచున్నాను. సభ యేర్పాటు చేయుము" అని వానితో వలికెను,

"చిత్తము మహాప్రభూ" అని యొక నిర్మలకాసారతీరమున రాజన్యుడు పెద్ద సభామండపమును నిర్మాణము కావించెను. మండపమం దాతడు ఎత్తైన బంగారు వేదిక నిర్మించి దానిపై నొక వజ్రసింహాసనము నేర్పాటు చేయించినాడట.

బహుసంఖ్యాకులగు సన్యాసులు రాజులు ప్రజలు సభనలంకరించిరి. తారతమ్యములెఱుగక వారందఱు గుమిగూడిరి. మహావీరుని యంత్యమహోపదేశమును వినుటకై స్వర్గమునుండి దేవతలందఱు దిగివచ్చిరట.

ఆఱుదినములు రేయింబవల్లు మహావీరుడు బోధన చేసెను. ఏడవ దినమున నాతని కంఠస్వరము ఆవేశపూరిత మయ్యెను. "కర్మముక్తులుకండు. అహింసావ్రతము నెఱపుడు. భూతదయకలిగి వర్తింపుడు" అని యాతడు గొప్పకంఠముతో నుద్బోధించెను. రాత్రి చాలభాగము కడచిపోయెను. ఎల్లకడలు శాంతిమయములై యున్నవి. సభలోనివారలసి నిదురించిరి. దేవతలు కూడ నొకప్రక్క కొరగిరట. అట్టిసమయమున మహావీరుడు నిర్యాణమందెను.

ఉదయమున మహావీరుని మృతశరీరమును చూచి ప్రజలు దుఃఖమున మునింగిరి. రాజన్యులు విశేషముగ శోకించిరి. హస్తిపాలు డుత్సవములు జరిపించెను. పల్లెలు పట్టణములు దీపమాలలచే నలంకరింపబడినవి. ఆనాడే జైనుల దీపావళిదిన మయ్యెను.

మహావీరునకు జినయను నామాంతరముకలదు. జిననుపాసించువారు జైనులని పిలువబడుచుండిరి. బౌద్ధమతమువలెనే జైనమత మొకప్పుడు భారతదేశమున విశేషప్రశస్తి నందినది. జైనమతమునకు సంబంధించిన కళాశాలలు నిర్మింపబడినవి. పెద్దపెద్ద గ్రంథములు రచియించి జైనపండితులు గొప్పప్రతిభను గడించిరి. ఈగ్రంథములు నేడును గణనీయములై యున్నవి. ప్రార్థనామందిరములను ఆలయములను జైనప్రచారకులు విశేషముగా నిర్మించి తమ యాచార్యుల మూర్తులనందు పూజించువారు.

అహింసా తత్త్వమును జైనులు మిగుల పాటింతురు. కొందఱు జైన సన్యాసులు నెమలిపింఛపు కట్టులు చేతులయం దిడికొనియే నడతురు. తాము నడచుమార్గమున చీమలుగాని యితరపిపీలికలుగాని యున్నచో తమపాదముల

క్రిందపడి యవి చనిపోకుండుటకై తుడుచుకొనుచు వారు ముం దడుగువేయుదురు. నీరు త్రాగుచుండ నేపురుగులును నోట బ్రవేశింపకుండుటకై వారు నోటికి గుడ్డ కట్టుకొందురు. జైనులు సూర్యాస్తమయ మయిన పిదప భుజింపరు. చీకటిలో తమకు తెలియక పురుగు లేవైన నాహారమున ప్రవేశించు నేమో యని వారందురు.

జైనసన్యాసులు తఱచుగ కొండ గుహాలయందే నివసింతురు. శీతాకాలము నాలుగు నెలలు వారు గుహలనుండి వెలుపలికి రారు. వారిశిష్యులు వారికి కావలసిన సంబారములను తెచ్చి యొసంగుదురు. తమ యాచార్యుని పద్ధతి ననుసరించి జైనసన్యాసులు దిగంబరులై యుందురు. పెరిగెడు కేశముల నూడలాగెదరు.

జైనులసంఖ్య భారతదేశమున బౌద్ధుల సంఖ్యవలెనే క్షీణించిది. నజైన మతమును ప్రోత్సహించినరాజు లంతరించిననాడే ఆమతమును కుంటువడి పోయినది. జైనమతోపదేశములను పాటించువా రించుమించుగ నదృశ్యులైరి. బొంబాయి రాజధానియందును మైసూరు దక్షిణార్కాట్ ఉత్తరార్కాట్ దక్షిణకనరా యందును కొలదిమాత్రపు జైనులు నేడును గోచరింతురు.

నేడు జైనమతప్రాముఖ్యము సన్నగిల్లినను ఈమతస్థాపకుడైన మహావీరుడు ప్రపంచమహాయోగులలో నొక్కరుం డని మరువకుందుముగాక. మేరు పర్వతమునుపోలు ధనరాసులను తుచ్ఛముగ నెంచి బంగరుతూగుటుయ్యాలలను త్రుంపివేసి ఇహలోకోన్నతిని పడదన్ని రాజ్యములను పనికిమాలిన బంతులక్లైగరదన్ని కౌపీనధారులై ప్రజాసేవ తమజీవన పరమావధియని తలచి కటిక దారిద్ర్యమును కవుంగలించుకొని ధర్మపునరుద్ధరణమునకై మానవసంరక్షణమునకై తమప్రాణములను ధారపోసిన మహాయోగులను కనిన చల్లనితల్లి భారతాంబ. బుద్ధునివలెనే మహావీరుడును పూజనీయుడు.

---

౫౪

# శ్రీ బమ్మెర పోతరాజు



"ఉ. న్యాయికి, భూసురేంద్రమృతనందనదాయికి, రుక్మిణీమన
స్థాయికి, భూతసమ్మదవిధాయికి, సాధుజనానురాగసం
ధాయికిఁ, బీతవస్త్రపరిధాయికి, బద్మభవాండభాండని
ర్మాయికి, గోపికానివహమందిరయాయికి, శేషశాయికిన్"

పోతననామము ఆంధ్రపృథ్వియందు పవిత్రమైనది. అతడు మహాకవి; మహాకవియేకాదు మహాభక్తుడుకూడ నని చెప్పవచ్చును. అతడనేక గురు గంభీరగుణములుగల మహాపురుషుడు. ఇట్టి వ్యక్తులు వసుంధరయం దరుదుగ పుట్టుచుందురు. ఈతడు తత్త్వవేత్త. ఆధ్యాత్మికదృష్టిగల విజ్ఞాని. తన కర్తవ్యము భగవత్ప్రేరితమని నమ్మి కలముబూనిన మహానుభావుడు. ఇతని భక్తిపారవశ్యము ఇతని భావనావేశమును అప్రతిమానములు. ఈపారవశ్య ఆవేశములేకదా జగదీశుని వాక్కునకు ముఖద్వారములగును. వీనిని గల వ్యక్తులే ఈశ్వరునకు నిమిత్తమాత్రులై ఆతని వాక్కుల నుచ్చరింతురు. ఆయీశ్వరుడు యిట్టి వ్యక్తుల వీనులయందుపోయు వాక్యామృతమే వారి వదనములనుండి వెలువడును. ఇట్టి వాక్యామృతమే కవితాపంక్తియై విరాజిల్లును.

భక్తుడు భగవానునిజేరగాంక్షించును. భగవానుడు భక్తునిజేరగాంక్షించును. భూమ్యాకాశముల సంధిస్థలమైన దిగ్వలయమందే సూర్యభగవానుఁడుదయించును. అట్లే భక్తునియొక్కయు భగవంతునియొక్కయు హృదయములు కలసిన ఆంతరంగికదిగ్వలయమందు జ్ఞానభాస్కరు డుదయించును. ఈ పద్యములయందెట్టి కిరణకాంతిపూరము తొలుకాడుచున్నవో పరికింపుడు.

"ఉ. ఎయ్యది కర్మబంధముల నెల్ల హరించు విభూతికారణం
బెయ్యది సన్మునీంద్రులకు నెల్లఁ గవిత్వసమాశ్రయంబు ము
న్నెయ్యది సర్వమంత్రముల నేలిన దెయ్యది మోక్షలక్ష్మికా
పెయ్యది దానిఁ బల్కెద సుహృద్యము భాగవతాఖ్యమంత్రమున్."

(భాగవతము. షష్ఠస్కంధము—పద్యము 14)

" మ. హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానససరస్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతిలేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్."

(భాగవతము, ప్రథమస్కంధము—పద్యము 59)

" మ. త్రిజగన్మోహననీలకాంతి తనువున్ దీపింపఁ బ్రాభాత నీ
రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుంజేరెడు వన్నెకాఁడు మదినావేశించు నెల్లప్పుడున్."

" మ. తనకున్ భృత్యునిఁ బోలె సారథ్యము నొనర్పం బంచి యర్జున ధర్మము నెఱింగి
యర్జునసారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్
మునికోలన్ వడిఁ బూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహమునొందఁజేయు పరమాత్మున్ బ్రశంసించెదన్."

(భాగవతము, ప్రథమస్కంధము—పద్యములు 181, 186)

" శా. వైరుల్ కట్టినపుట్టముల్ విడువఁగా వారింప నావల్లభుల్
రా రీవేళ నుపేక్షసేయఁ దగవే రావే నివారింపవే
లేరే భ్రాతలు కృష్ణయంచు సభలో లీనాంగియై కుయ్యిడం
గారుణ్యంబున భూరివస్త్రకలితం గాఁ జేయఁడే ద్రౌపదిన్."

(భాగవతము, ప్రథమస్కంధము—అధ్యాయము 15, పద్యము 326)

" మ. అరవిందోదర తావకీనభజనధ్యానానురాగోల్ల స
చ్చరితాకర్ణనజాత భూరిసుఖముల్ స్వానందకబ్రహ్మసుం
దరయన్ లేవటఁ దండభృత్స్ఫుటవిమానాకీర్ణులై కూలు నా
సురలోకస్థులఁ జెప్ప నేల సుజనస్తోమైక చింతామణీ."

" చ. హరిభజనీయమార్గనియతాత్మకులై భవదీయమూర్తియై
వఱలిన భక్తియుక్తులగువారల సంగతిఁ గల్గఁజేయు స
త్పురుష సుసంగతిన్ వ్యసనదుస్తరసాగర మప్రయత్నతన్
సరసభవత్కథామృతరసంబున మత్తుఁడనై తరించెదన్."

(భాగవతము, చతుర్థస్కంధము—పద్యములు 282, ...

పోతనహృదయమున నుప్పొంగు భక్తిభావమిట్టిదని దెలుపుట కీపద్యములు చాలవు. భాగవతముయొక్క ప్రతిపుటయందును ఈభావము తొలుకాడుచుండును. పోతనకుగల తాత్త్వికదృష్టి యితరకవులకు లేదు. వ్యాసహృదయము నీమహాత్ముడు తెలిసికొనినట్లుగా తిక్కనకవులు గుర్తింపలేదు.

తిక్కనాదులగ్రంథము వారివారి కవిత్వసంపద నెఱిగి యానందించుటకై చేకొందుము. పోతనగ్రంథమును పోతనకవితాశక్తిని గ్రహించుటకే కాక, మూలగ్రంథమందలి పవిత్రభావపూరమును పురిపిళ్ళతో గ్రోలుటకై గైకొందుము. పోతనగ్రంథమును చేరుతఱి మస్తకన్యస్తహస్తులమగుదుము. పవిత్రప్రాచీనయుగముల మసలుచుంటిమని యానందింతుము. ఇహపరభాగ్యములనెంటిని రెండుచేతులగైకొన నేగుచుంటిమని యానందింతుము.

వేదములన్నింటిని పిండి వ్యాసభగవానుడు తనపురాణములందు తత్త్వరసమును గుమ్మరించినాడు. ఇట్టి రసమున కాలవాలమైనది భారతము. కావున నది పంచమవేదమనబరగెను. నన్నయాదులు కథనుమాత్రముగైకొని తమప్రత్యేకరచనాకౌశలమును ప్రకటించిరికాని గురుగంభీరమైన వ్యాసభగవానుని వాక్కులను కర్ణాంజలులగ్రోలుటకై మనలనామహాత్ముని చరణతలమున నిలిపిరి కారు. పోతనామాత్యుడు పదునెనిమిది పురాణములలో మిన్నయైన భాగవతమును చేతబట్టినాడు. అంతియకాక విష్ణుపురాణము హరివంశము మొదలుగాగల గ్రంథములయందలి వృత్తాంతములనుగూడ కొన్నింటిని తన భాగవతాంధ్రీకరణమున చేర్చినాడు. గూఢమై గంభీరమైన వ్యాసరచనల నీతడు విపులీకరించినాడు. మూలమందలి తూచాలనైనను తప్పిపోనీయక భాష్యము చెప్పినట్లు భాషాంతరీకరించినాడు.

పోతన మహాభక్తుడు. జ్ఞానయోగి మార్గమునకును ఈతనిమార్గమునకును భేదమున్నది. జ్ఞానయోగి కదలమెదలక కూర్చుండి తనవాక్కులందలి జ్ఞానరసమును మాటిమాటికి నెమరువేసికొనుచు ఆనందించును. భక్తియోగి అట్టివాడుకాడు గభీరతగాని గూఢభావముగాని యితనియందు లీనమైయుండదు. ఇతడు తన్మయనృత్యము సలుపును. ఈతనివాక్కులు బాలకునిపల్కులట్లు గాయకునిపదములట్లు మనమున కానందము గొలుపును. జ్ఞానయోగివాక్కులు జ్ఞానులహృదయముల నద్భుతానందములతో నిండించును. ఇవి సామాన్యులకు

హృదయంగమములుకావు. భక్తియోగి వాక్కులు యెల్లఱకును సుబోధక ముగా నుండును. వీనియందలి తియ్యదనము నెల్లరుగ్రోలి యానందింతురు. పోతనామాత్యుడు భక్తియోగియైన మహాకవి.

వ్యాసవాక్కులలోని గభీర గూఢార్థము పామరులందఱికి తెలియవలె నని పోతన యుద్దేశము. దానినిట్లు తెలుపు నవసరమున మాతృక నీతడు విపులీకరింపవలసివచ్చెను. అంతియేకాదు. తాను మహాభక్తుడు కావున భక్తిపారవశ్యముల భగవద్గుణములను బహుభంగుల పేర్కొనుచు తన స్వంతకథనమును కొంత పోతనామాత్యుడు తన భాగవతాంధ్రీకరణమున ప్రవేశపెట్టినాడు. కావున నీతని యాంధ్రీకరణము మాతృకకంటె పెద్దది. మాతృకయొక్క గ్రంథ సంఖ్య రమారమి యిరువదిరెండువేల శ్లోకములు. పోతనామాత్యుని గ్రంథ పద్యసంఖ్య సుమారు ముప్పదివేలు.

వ్యాసమహత్త్వ పోతనమహత్త్వముల కలయిక గావున ఆంధ్ర భాగవతము మిగుల పవిత్రవంతమైనది. పోతనామాత్యుని ఉద్గ్రంథమున మహోన్నత దేవమందిరమున చొచ్చులీల ప్రవేశింతుము. పోతనశైలి మహాప్రవాహమును పోలును.

శైశవమున పోతన గోవులను మేపుచు దనయాలచెంగట నొకయెడ మనలుచుండ చిదానందుడను యోగీంద్రుం డచటికి వచ్చెను. అంతట పోతన యాఋషీంద్రుని ముందు సాగిలపడెను. సంతుష్టాంతరంగుడై యోగివర్యుడు ఆతనికి తారకమంత్రము నుపదేశించెను. రామచంద్రుని యనుగ్రహంబున నతనికి కవితాశక్తి కలిగెను. చంద్రగ్రహణ పుణ్యకాలమున నదియందు స్నానమాచరించుచుండగా శ్రీరామచంద్రుడు పోతనకు ప్రత్యక్షమయినాడట. తానీశ్వర సాక్షాత్కారమందినట్లును శారద తనకు ప్రత్యక్షమైనట్లును, పోతనామాత్యునడు చెప్పుకొనినాడు.

"సీ. మెఱుంగు చెంగటనున్న మేఘంబుకైవడి
నువిద చెంగటనుండ నొప్పువాఁడు

... ... ... ... ...

ఆ. పుండరీకములను బోలుకన్నులవాఁడు
వెడఁదయురమువాఁడు విపులభద్ర

మూర్తియైన రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా
కిన్నగవకు నెదురఁ గానఁబడియె. ”

(ప్రథమస్కంధము—పద్యము 14)

“ సీ. ఉరవడిఁ బ్రాగ్దిశ నుదయించు మార్తాండ
కోటిబింబచ్ఛాయ గూడినట్లు
హరిహరబ్రహ్మల యాత్మలలోనుబ్బి
కరుణ యొక్కట మూర్తి గైకొనినట్లు
ఖరకర కరతీవ్రగతిని గరంగుచు
హేమాద్రి చెంతఁ బెల్లెగసినట్లు
ఫణిరాజఫణరాజి మణిగణవిస్ఫూర్తి
సుషిరంపు వెలిఁగల చూపినట్లు

తే. ఉట్టిపడ్డట్లు కట్టెదుటనూదినట్లు
తేజమెనగంగ నా మ్రోలదివ్యవాణి
పూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టి
జూచి యిట్లనిపలికె మంజులముగాను ”

(షష్ఠస్కంధము—పద్యము 17)

ఈశ్వరసాక్షాత్కారమున నిట్టి యద్భుతవిశ్వాసముగల మహనీయుడు గావుననే తనమహాగ్రంథము దైవప్రేరితమైనదే కాక దైవోచ్చరితమైనదని పోతనామాత్యుడు పలికినాడు. ఆతని వాక్కులు వినుడు.

“ క. పలికెడిది భాగవతమఁట
పలికించెడివాఁడు రామభద్రుండట నే
పలికిన భవహరమగునఁట పలికెద
వేఱొండుగాథ పలుకఁగ నేలా ? ”

శైశవమున గోవులను కాచిన పోతన పెద్దవాడయి నాగలిని బట్టినాడు. ఈతని దృష్టియందుండినవి రెండువ్యవసాయములు. ఒకటి నిజమానస వ్యవసాయము ; రెండవది భూమివ్యవసాయము. ఇవి రెండును నితనికి ప్రాణముల కంటె నధికముగా నుండెను.

మానసిక వ్యవసాయమున దవిలిన యాతనికి దారిద్ర్యము అనివార్యమైన నెచ్చెలి యగుచుండును. అతడు తన కవిత్వ మహత్వము కతన నెన్నెని భువనములను సృష్టింపగలడు. కాని యాతనికి కూడుగుడ్డలు సున్న. మహా పండితుడగు విద్యారణ్యునిగతి యేమయ్యెను. ఈ కవులసృష్టి యనవరతము ఉన్నతాశయములపై నిలుచుటచేత నార్థిక సంపదకై వీరు పెనగులాడలేదు. ఈశ్వర సాక్షాత్కారమునకై తపించు మహామునులట్లు వీరును యిహలోక వాంఛలను పోద్రోలిరి. వీరి కలములు ముముక్షువు లయిపోయినవి. తమ సాహితీ పరిజ్ఞానము కతన తమ సాహిత్య సేవకతన నీమహనీయులు ముక్తి నందిరి. ఇట్టివారిలో పోతన యొకడు.

ఇతని సేద్యము ఇతనికి రక్షణమీయలేదు. తాను పండించుకొను ధాన్యము అధికము కాకపోయినను అతిథి పూజకై దానినాతడు వాడుచుండువాడు. తన కూడుగుడ్డలమాట ఆతడెఱుగడు. దురంత దుర్దాంత దారిద్ర్యము పోతన నెదుర్కొనెను. అయినను యెవ్వరిని ఆశ్రయింపక, కీర్తిని అభిలషింపక తనహృదయానందము కొఱకు తనధర్మము నెఱపుకొనుటకు తనదృష్టియందలి ఉన్నతాశయము నందుటకు తాను కొల్చుదేవికి ప్రీతికూర్చుటకు తన యారాధ్య దేవత యాజ్ఞ పాలించుటకు తన గంటమును సాగించి తన దురంత పరిస్థితులకు చలింపక భీషణావస్థలందు కూడ వెనుదీయక ఉద్దేశ సిద్ధిమీదనే కన్నుంచి సామాన్య అర్థసంబంధమగు సంపదచేత లభించు సుఖమునుగాక పరమార్థ సంబంధ మహానందము కొఱకు గ్రంథమును వ్రాసి తరించినాడు. ద్రవ్యపిపాసువులగు కవులెందఱో పుట్టినారు గిట్టినారు. తాము బ్రతికిన మూడు నాళ్లలో నేదో కొంత పేరుపొంది తమపేరుతో తాముకు నశించిరి. పోతన కవీంద్రుడు విగతజీవుడై, కాలవిహాయసమున దివ్యప్రదీపమట్లు, చిరంజీవుడై యైదు శతాబ్దులనుండి తేజరిల్లు చున్నాడు. ఝంఝూనిలమున పడినను కారు మబ్బులు గప్పినను భయంకరమగు పిడుగులు పడినను ఉన్నతాశయములు ఎన్నటికిని మడియవు. ఆలస్యమైననేమి? తమ విజయపతాకముల నివి యెత్తి తీరును. పోతరాజు జీవనము మనకీయుత్కృష్టపాఠమును బోధచేయుచున్నది. కావున నది మిగుల పవిత్రవంతమైనదని చెప్పవచ్చును.

ప్రాచీనకవులనుగుఱించియు మహాభక్తులనుగుఱించియు చిత్రకథలెన్నేని యున్నవి. మహాపురుషుల జీవనములచుట్టును విడ్డూరములెన్నియో అల్లుకొనుట అక్కఱజనుకాదు. వీనిని చర్చించి వీనియందలి విశదములను ఉన్నవి యున్నటుల గ్రహింపకపోయినను వీనియందు అంతర్భూతమైయుండు పరమార్థమును చేకొనుట న్యాయముగదా. శ్రీనాథ పోతనామాత్యులు నెఱపిన రెండు అద్భుతసంఘటనములను గుఱించిన యుదంతమును పలువురాంధ్రులెఱుంగనే యెఱుంగుదురు.

ఒకనాడు పోతనామాత్యుడు చేనిగట్టుమీద కూరుచుండి కుమారుడగు మల్లనచే తన పొలమును దున్నించుచుండగా మహాకవి శ్రీనాథుడు పదారుగురు బోయిలసవారియం దాసీనుడై బావమఱదిని పోతనామాత్యుని చూడవచ్చెను. తన ప్రభావమును బావమఱదికి చూపనెంచి ముందు కొమ్ము వట్టిన బోయీలను కొమ్ము విడువుడని శ్రీనాథుడాజ్ఞాపించెను. బోయీలు తొలగిరి. అయినను పాలకి యెప్పటియట్లు సాగిపోవుచుండెను. మల్లన తనతండ్రికావిడ్డూరమును చూపెను. "నాయనా! నీవాశ్చర్యపడనేల? దాపటియెద్దును వదలివేసి దున్నుము" అని పోతన చెప్పెను. కుమారుడట్లే యొనరించెను. కాని దుక్కి యెప్పటియట్లు సాగుచుండెను. పౌరుషశాలియగు శ్రీనాథుడు రెండవకొమ్మునుబట్టిన బోయీలను తొలగుడని యాజ్ఞాపించెను. వారట్లే కావించిరి. సవారి యెప్పటియట్లు పోవుచునేయుండెను అది గాంచి పోతనామాత్యుడు "కుమారా! వలపటియెద్దునుకూడ విడిచి దుక్కిదున్నుము" అని మల్లనతో చెప్పెను. అతడు అట్లే యొనరించెను. మునుపటివలెనే నాగలి నేలను చీల్చికొనిపోవుచుండెను. బావమఱదులు ఒకరిప్రజ్ఞ నొకరు చూచుకొని యానందించిరి.

భాగవతమందలి గజేంద్రమోక్షభాగమును ఆంధ్రీకరించుచు గజరాజును కాపాడ ప్రణయోత్సాహియైన శ్రీహరినిగూర్చి తెలుపుతఱి పోతనామాత్యుడు "అలవైకుంఠపురంబులో నగరిలోనామూల" యని వ్రాసి పిదప నేమి వ్రాయుటకు తోచక కూతునకు గ్రంథమిచ్చి తాను పెరడునగల వృక్షముకడకరిగి దానినీడను గూర్చుండి యోజింపదొడగెనట. ఇంతలో నొక వ్యక్తి తన రూపమున వచ్చి బిడ్డచేతియందలి గ్రంథమును చేకొని "సౌధంబుదాపల"

అని వ్రాసి మరల వచ్చెదనని చెప్పి అంతర్హితుడై నాడట. గడియసేపు వృక్షమూలమున యోజనయందు మునిగియుండి తరువాతిపదములు ఊహకు చిక్కనంతనే ఆనందభరితుడై బిడ్డకడకరిగి వ్రాయబూని ఆమాటలప్పటికే గ్రంథస్థములై యుండ గాంచి మిగుల నబ్బురపడెనట. జరిగిన యుదంతమును తనయ తండ్రికి వివరించెను. ఆనందపరవశుడై తండ్రి బిడ్డను కౌగలించుకొని "అమ్మా! పూర్వజన్మమున నీవెంతో పుణ్యము సలిపితివి. నీవ్రోలసాక్షాత్కరించిన వ్యక్తి నీతండ్రికాడు. అతడు శ్రీహరి. నీవు మిగుల నదృష్టవంతురాలవు" అని కొమరితభాగ్యమును, జగదీశునికి తనపై గల అనురాగమును దలచుకొని పోతన అమందానందపూరితహృదయుడై నాడట.

పోతన శివకేశవులను సమముగ గుర్తించిన మహానుభావుడు. శ్రీమన్మహాభాగవతము ఈతని విష్ణుభక్తిని తేటపఱచును. ఈతడు రచించిన వీరభద్రవిజయము ఈతని శివభక్తిని వ్యక్తీకరించును. ఈతని తనయుడు మల్లన రుక్మాంగదచరిత్రను రచించెను. ఈతని యన్న తిప్పరాజును తండ్రి కేసనయును సాహిత్యప్రతిజ్ఞను చూపినవారుకారు. పోతన పాండితి సహజమైనదనుట జగత్ప్రసిద్ధము. శాలివాహనశకము 1378 సంవత్సరమున నీతడు జననమొందినాడు. ఈతడు నియోగిబ్రాహ్మణుడు. ఈతని యూరు ఏకశిలానగరము. ఈతని జనయిత్రి లక్కాంబ. ఈతని గనిన ఆంధ్రమాత ధన్య.

---

XX

# జ్ఞానేశ్వరస్వామి



"శా. శ్రీనర్థించి కుచేలుఁ డుగ్రభవవార్థిం దాటఁ బ్రహ్లాదుఁడున్
మానత్రాణము గోరి ద్రోవది, సరోమధ్యం బునన్ నక్రబా
ధానిర్ముక్తికిభేంద్రుఁడుం గొలిచి లబ్ధస్వార్థులై నట్టిత
చ్ఛ్రీనారాయణపాదపద్మముల మచ్చిత్తము హత్తించెదన్."

మానవజీవితమునందు నాలుగుఆశ్రమములకు ప్రాముఖ్యము కలదు. క్రమసిద్ధినే కాక్షించువారు కల్పసూత్రప్రోక్తములైన ఈయాశ్రమములను సమదృష్టితో వీక్షింతురు. ఏయాశ్రమమును వారు పరిత్యజింపరు. నాలుగు యాశ్రమములందును నివ్వటిల్లవలయు జీవితోద్దేశములు కలవు. కాని బహుజన్మములనుండియు తపస్సు సాగించునాత్మలు మొదటిమూడు యాశ్రమముల యందు తడసియుండుటకు నొల్లక తుది యాశ్రమముమీదనే దృష్టి నిలిపి యుండును. మునిప్రవృత్తులతో పుట్టువారు మొట్టమొదటనే సన్న్యాసాశ్రమమునే కోరుటలో నాశ్చర్యమేమికలదు. సన్న్యాసియనినంతనె సంఘమునుండి వెడలి కాంతారమున కాపురముచేసి స్వీయముక్తికై యేర్పాటులు కావించుకొనువాడని తలపరాదు. సంఘములందే నిలిచి జ్ఞానప్రబోధము మూలమున ఉదాత్తజీవితవిధానముకతన ప్రజానీకమునకు ముక్తిని ముంజేతికంకణము కావించు పరార్థజీవియును సన్న్యాసియే. శ్రీ శంకర రామానుజ మధ్వాదులు మానవసంఘమునుండి కదలిపోయి కాననములందు కాపురము కావించిరా? శంకరభగవత్పాదులబోలు మహనీయులు శైశవమునుండియు ముముక్షువులై సంసారసుఖముల నపేక్షింపక పరార్థజీవులై మనియుండిరి. ఆధునికయుగమున భారతయోగులలో నుత్కృష్టస్థానములు పొందిన వివేకానందస్వామి పరార్థజీవులైన మహాయోగుల మహత్త్వమెట్టిదియో పలుమాఱు వివరించినాడు. "భాస్కరునిచెంత మిణింగురుపురు గెట్టులుండునో మేరుభూధరమున కెదుట

నిసుకరేణువెట్టులుండునో గృహస్థునిజీవితము సన్న్యాసి జీవనముగ్రమోాల నట్టులే యుండును" అని స్వామిజీ యొకప్పుడు తెలిపెను.

జ్ఞానేశ్వరస్వామి తండ్రి విఠలపంతు సన్న్యాసాశ్రమమునెడల మిక్కిలి మక్కువ గలిగియుండెను. ఇతడు మహారాష్ట్ర దేశమున నొక యున్నత బ్రాహ్మణవంశమున పుట్టినాడు. చిన్నతనమునుండియు నీతనికి పండరీనాథుని యెడల నెంతేనిప్రీతికలదు. బాల్యమునందే ఘూర్జర మహారాష్ట్రసీమలందు ఈతడు యాత్రలు సలిపినాడు. బహుళమందిరములయందు భగవంతుని సేవించినాడు. నైసర్గికమైన వీని భక్తి యీదేశాటనమున విశేషవృద్ధిచెందెను. ఈతని పూర్వపురుషులు కులకరణి (కరిణీకము) వృత్తి యవలంబించువారు. కులమర్యాదను పాటించి ఈతడును కులకరణివృత్తినే యవలంబించినాడు. తల్లి దండ్రుల కోరిక ననుసరించి వివాహమాడినాడు. కాని వీని మానసము సంసారమున నిలుచునదికాదు. వారణాసికిపోయి సన్న్యాసి కావలెనని ఈతడు మక్కువపడుచుండువాడు. జడదారి కావలెనని యుద్దేశించునాతడు భార్య యనుమతి పడయవలెనను విశ్వాసము ప్రజలయందు ప్రబలమైయుండెను.

సన్న్యాసి కానుద్దేశించు నాతడు కొడుకును కలిగియుండవలెననియు, యాగాదులను నెఱపియుండవలెననియు, వేదాధ్యయనమున నాఱితేఱినవాడై యుండవలెననియు స్మృతులు వాకొనుచున్నవి గాని, భార్యయనుమతి వలయు నని నిక్కముగ స్మృతులయందు వచింపబడనేలేదు. కాని ప్రజావాణికి బల మెక్కుడుగదా! సంఘసంప్రదాయమెఱిగి విఠలపంతు తనయుద్దేశ్యము తన పత్నికి తెలిపి యామెయనుమతిని వేడినాడు. కాని రుక్మిణి యందులకియ్యకొనలేదు. తనసంసారసుఖములకు నీరువదలుట కామెకిష్టములేదు. విఠలపంతు నిట్టూర్పువుచ్చువాడుకాడు. ఆతని దృఢసంకల్పమును, ఆతని యిచ్ఛాశక్తియును, ఆతని వజ్రసంకల్పమును వానిహృదయమునుండి యెట్లునిష్క్రమించును.

పరిణయమైన యనంతరమే విఠలపంతు తలిదండ్రులు పరమపదము నొందిరి. మామగారి వేడికోలును మన్నించి తదనంతర మాతడు అత్తగారి యింట పూనాకు పదునాలుగుమైళ్ళ దూరమందున్న ఆలంది యను గ్రామమున విడియ దొడగెను. భార్య నిరాకరణము నెఱిగిన యనంతర మాతడు ఆమెకుగాని అత్తమామలకుగాని తెలుపక అల్లన గృహమువీడి కాశీ జేరు

కొనెను. అత్తఱి వారణాసియందు యశస్తిలకుడగు రామానందస్వామి వసించుచుండెను. విఠలపంతు స్వామీజీ చరణ సరోజములచెంత జేరి శిష్యునిగ తనను పరిగ్రహింపుడని యోగీంద్రుని వేడుకొనెను.

"నీవు నీయాలి యనుమతి సందియే వచ్చితివికదా ?" యని యోగీంద్రు డాతనిని ప్రశ్నించెను.

"నాకుభార్యలేదు" అని విఠలపంతు జంకుగొంకుల కెడమీయక ప్రత్యుత్తర మొసగినాడు.

రామానందస్వామి యించుకైన సంశయింపక ఆతనికిమంత్రోపదేశము గావించినాడు. బద్ధ దీక్షితుడై కావిశాటువులు దాలిచి విఠలపంతు యోగీంద్రుని శిష్యవర్గమం దుచితస్థాన మలంకరించెను.

తన భక్తిశ్రద్ధలవలన విఠలపంతు అచిరకాలములో గురువర్యుని ఆదరానురాగముల నందజాలెను. ఆచార్యుడాతనిని తన ప్రధాన శిష్యునిగ గావించుకొనెను. కొంతకాలము గడచినపిదప రామానందస్వామి తనమఠమును తనమఠమందలి వారిని విఠలపంతునకప్పగించి కొందఱు శిష్యులను మాత్రము వెంటగొని రామేశ్వర యాత్రకై కాశీ విడిచిపోయెను. తాను మహారాష్ట్ర బ్రాహ్మణు డగుటచే పశ్చిమమార్గమున బయనము సాగించి స్వీయసీమయందలి క్షేత్రములను తొలుత సేవింప నాతడు నిశ్చయించినాడు. ఆలందిగ్రామము ప్రాచీన విజ్ఞాన కేంద్రస్థలములలో నొక్కండని ప్రతీతి పడయుటచే స్వామీజీ అచ్చోటును దర్శించుట ముఖ్యమని యెంచి కొంత పరిభ్రమణము కావించిన పిదప యచటి కరిగెను. విఠలపంతు ఆచార్యుని యుద్దేశ్యమును ముందేగ్రహించి యుండును. కావుననే యాతడు గురు ననుగమింపక వెనుకనుండ నిశ్చయించి యుండును. కాని దుర్విధి వానిపై దండెత్త నిశ్చయించినది.

రామానందస్వామి ఆలందిలోని దేవాలయమునకు సమీపమందు విడిసెను. యోగీంద్రుని సేవింప నెందరెందఱో యరుదెంచిరి. తొలినాటి సాయంకాలమున వచ్చినవారిలో నొక కృశాంగి కలదు. ఆమె మూర్తీభవించిన దుఃఖమట్లు తోచినది. భక్తిపూరిత హృదయయై యామె యోగీంద్రుని చరణద్వంద్వము నెూల సాగిలపడెను. "అమ్మా! కొడుకుతల్లివి కమ్ము!" అని స్వామీజీ యాశీర్వదించెను. ఆశీర్వాదము వినినంతన నా యనద యా

నమున పరిహాస సూచకమైన చిఱునవ్వు తోచెను. ఆమెయేమియు బలుకలేదు. ఆ వికృతమైన చిఱునవ్వును విలోకించి యోగీంద్రు డాశ్చర్యాన్వితుడై "అమ్మా! నీమందహాసమందలి యర్థమేమి" అని యామె నడిగెను.

"మహాత్మా! నన్ను మన్నింతురుగాక! నేను కొడుకుతల్లి నెట్లుకాజాలుదును? నాప్రాణపతి నన్ను బాసి కాశిపోయి సన్న్యాసాశ్రమమును స్వీకరించెను. వారు నాకు పుత్రభిక్ష పెట్టిరికారు. నాయంగీకారము నపేక్షింపక నాతో చెప్పనైన చెప్పక వారిందుండి నిష్క్రమించిరి." అని యామె ప్రత్యుత్తరమొసగెను.

తరువాతి ప్రసంగమువలన నాయభాగిని తన ప్రధానశిష్యుని భార్యయని రామానందస్వామి గ్రహించెను. అతని హృదయము ఆగ్రహదుఃఖములతో నిండిపోయెను.

ఇక యాత్ర సాగింపక రుక్మిణిని యామె ప్రధానబంధుగులను తోడుకొని తక్షణమే యాతడు వారణాసికి మరలిపోయెను. తొలుత నాచార్యుడు మాత్రమే విఠలపంతుకు గోచరించెను. ఆశ్చర్యాన్వితుడై యాతడు—

"స్వామీ! ఇంతలోనే మరలివచ్చితి రేల?" అని ప్రశ్నించెను. ఆగ్రహావేశుడై ఆచార్యుడు "నేను ఆలంది కరిగితిని. నీప్రవర్తన మెఱింగితిని. నీవిప్పుడేమి సమాధానమును చెప్పెదవు?" అని యడిగెను.

ఆలంది యను పదము పిడుగువలె విఠలపంతుపై బడెను. క్రోధకంపితస్వరమున నాచార్యుడడిగిన ప్రశ్న వాని గుండెయందు భయదమైన ప్రతిధ్వనులను కలిగించెను. చివాలున నేలపై వ్రాలి గురువర్యుని చరణయుగళమును గట్టిగ బట్టుకొని తన తప్పు నొప్పుకొని విఠలపంతు తన యాచార్యుని క్షమాభిక్ష వేడుకొనెను. "తక్షణమే నీభార్యను తోడుకొని స్వస్థానమునకు మరలుము. గృహస్థుడవై యుండుము." అని రామానందస్వామి అతని నాజ్ఞాపించెను.

ఆచార్యుని ఆజ్ఞ నుల్లంఘించుటకు విఠలపంతు సాహసింపలేదు. మాఱు వలుకలేదు. వెంటనే యాతడు రుక్మిణిని తోడుకొని వారణాసివీడి ఆలందిజేరెను.

గృహమున విఠలపంతుకొఱకై లెక్కలేని యిక్కట్టులు కనిపెట్టుకొనియున్నవి. వారణాసినుండి మరలివచ్చి గృహస్థాశ్రమమున నాతడు మరలనడుగు బెట్టుచున్నాడని ఆలంది గ్రామస్థులు ఆదరానురాగము లుట్టిపడ నాతని నాహ్వానింపలేదు. తనయూరున పంతు ప్రవేశించినంతనే అతని కగపడినవి కన్నెఱ్ఱలు;

వినబడినవి పండ్ల పటపటలు, మిత్రులందఱు వానిని బహిష్కరించిరి. ఇతరులు అత్యాచారమునకు చేజేసికొనిరి. విఠలపంతునకు సన్నిహితమైనవి దారిద్ర్యమును క్షుద్బాధయును మాత్రమే. ఎవరెట్లు దూషించుచున్నను ప్రతివచన మీనతడొసగువాడుకాడు. మానసికశాంతి యించుకంతయైన భంగము కలుగనిచ్చువాడీతడుకాడు. రాక్షసులవలె పైబడు విరోధులను చల్లని యాశీస్సులతో తనుపుట యీతని యాశయము. నిష్ఠురపరిస్థితులలో మధురసంకీర్తన మొనరించుచు నీభక్తవరేణ్యుడు మహానందమున నోలలాడువాడు.

జ్ఞానేశ్వరుని దృష్టిలోగల ఆదర్శ సన్న్యాసికిని అతని జనకుడైన విఠలపంతునకును యెన్నెని పోలికలు గలవు.

జ్ఞానేశ్వరుని వాక్కులు గంభీరభావ విలసితములు. "తనయడుగు యేచీమమీాదనైనను పడునను భయమున నతడెంతో జాగరూకతతో ముందడుగు వేయువాడు. నీట నించుకైన గదలికను తలసూపనీయక రివ్వున నెగసి వచ్చి అందలి మీానమును గ్రద్ద యతికౌశలమున గొంపోవులీల యొరుల చిత్తశాంతి కించుకంతయైన భంగము వాటిల్ల నీయక యందుండి యాతడు సద్భావము గ్రహించును. పిల్లి తనకూనల నొకచోటునుండి మఱియొక తావునకు నోట గఱచుకొనియే పోవును. అట్లొనరించు నపుడు కూనల కించుకంతైన నొప్పి కలుగునా? అట్లే ఆతని క్రియలును యితరుల చిత్తముల కెట్టి కష్టములను కలిగింపవు. ఆతని ముఖము ప్రశాంతమున కాలవాలమై యుండెను. వానికన్నులు అనురాగ సందీపితములు. అతని నుడువులు సుధా బిందువులకు సహపాఠులు. అతని కాయము పుష్టినెఱుగదు. ఆతని రూపము చూచి హృదయస్థ గంభీర ప్రణయ సింధువును గుర్తింపగలిగిన వారరుదు. ఆకారము నవలోకించి గుణనిర్ణయమునకు గడంగరాదు. అరటినారను చూచి అరటి పండులోని తియ్యదన మెట్టిదియో నిర్ణయింపగడంగువా రెవరు? ఆతని ముఖము వీక్షించినంతన వానిహృదయము భావభరిత మైనదని గ్రహింతుము. ఆతడు మితభాషి. శారీరకముగా గాని మానసికముగా గాని ఆతడు మానవుని గాని పశువునిగాని హింసించి యెఱుంగడు. ఒరులకు అభయహస్తమిచ్చుటకై ఆతడు మిక్కిలి మక్కువ పడుచుండును. చెప్పనేల ఆతడు మహనీయ గుణగరిష్ఠుడు."

( ' ధ్యానేశ్వరి ' యను గ్రంథమునుండి యనువాదము )

క్రీ. శ. 1273 సంవత్సరమున విఠలపంతు కొక పుత్రుడు కలిగెను. తలిదండ్రులాతనికి ' నివృత్తినాథు ' డని పేరుపెట్టిరి. రెండేండ్ల పిమ్మట జ్ఞానేశ్వరుడు జనించెను. పదంపడి వారికి మరియొక తనయుడును యొక తనూభవయును కలిగిరి. వానిపేరు సోపానదేవుడు. ఆమెపేరు ముక్తాబాయి. జగదీశుడు తమకు సంతానము ప్రసాదించినందులకు సంతోషము వారికి కలదుగాని సిరి నొసగలేదను సంతాపముకూడ దానికి సన్నిహితమై వారి హృదయమును వేధించుచుండెను.

తల్లిదండ్రుల లాలనపాలనములనందుచు, బిడ్డలు క్రమాభివృద్ధినందుచుండిరి. తమకు దాపురించిన దురంతదారిద్ర్యమును దుర్నయభూయిష్టమయిన బహిష్కరణమును దుస్సహమైన అత్యాచారమును తమ నిసుంగులకును సంక్రమించుటగాంచి దంపతులు మిగుల దుఃఖింపసాగిరి. బాలురతో నాడుకొనుటకై యొరులబిడ్డలు వారల జేరరారు. విద్యాబుద్ధుల నందుటకై బిడ్డలే యాచార్యుని యాశ్రయింపరాదు. తల్లిదండ్రుల చరణోపాంతమునందేయుండి వారి యుపదేశరత్నములను హృదంతరాళమునందు చేర్చుకొనుచు వారు క్రమవిజ్ఞానము నందుచుండిరి. పవిత్రమైన గృహవాతావరణమున వారందిన వివిధభావ పరంపరయే వారి భావిజీవితమునకు మహిమోపేతమైన వన్నెదెచ్చెను.

నిష్ఠురపరిస్థితులు వారి హృదయశాంతికెట్టిభంగపాటును కలిగింపలేదు. కష్టములనుండి వారు గభీరభావబంధురసత్యములను గ్రహించి తమ యంతరంగములందు చేర్చుకొనిరి. వారివైజ్ఞానికవిభూతి కాలక్రమమున వారు రచించిన గ్రంథములయందు ప్రవేశపెట్టగలిగిరి.

ఈయుత్కృష్టగుణములు విశేషముగా జ్ఞానేశ్వరుని జీవితవిధానమందును రచనావిధానమందును తళ్కొత్తినవి. భయముచేగాక ప్రణయముచే నాతడు దిగ్విజయమునందినాడు. వింతపనులునెఱపి సాధారణ మానవులకు అతీతములైన శక్తులను ప్రదర్శించి కొందఱు యోగులు తమ మహత్త్వమును రూఢిచేసికొందురు. తమ్మితరులు గుఱుతింపనివారు విడ్డూరపు చెయువులను అద్భుతావహకృత్యములను సలుప నుంకించుట వంచనమేయని జ్ఞానేశ్వరుని యభి

ప్రాయము. తర్కించుటగాని కలహించుటగాని వాని ప్రకృతికి ప్రతికూలము. మతమును బోధించునపుడు, గొప్పసత్యముల నుగ్గడించునవసరమున, మహిమో పేతమైన భావనావేశమునంది ఆతడు ఉచ్చరించిన గంభీరవాక్కులు ఈశ్వర ప్రోక్తమైనవనియే మనమూహింపదగును. తన గ్రంథమునెడలను ఆచార్యుని యెడలను జగదీశునియెడలను ఆతనికిగల మక్కువ అనిర్వచనీయమైనది. తన ప్రజ్ఞనుగూర్చి యతడెన్నడును గ్రాసుకొనలేదు. ఈశ్వరమహిమను, గురుకటాక్షమును, పురస్కరించుకొనియే సత్యము నన్వేషించుచుంటిననియు, మత మహాత్మ్యము నుగ్గడించుచుంటిననియు ప్రజానీకమును సేవించుచుంటిననియు, పవిత్ర ధర్మమును నిర్వహించుచుంటిననియు ఆతడు విశ్వసించువాడు.

వెలివేయబడిన పంతువాట్లు అంతమొందలేదు. కొంతకాలము గడచి నదిగనుక తనయూరిపండితుల ఆగ్రహము అంతరించియుండునని యాతడు ఆశ పడినాడు. తనకొడుకుల నిగువురకు ఆతడిపుడు వడుగుచేయవలెను. నివృత్తి నాథుని వయసు పదేండ్లు. జ్ఞానేశ్వరుని వయసెనిమిదేండ్లు. ఇరువుర యుపనయ నమును గుఱించి విఠలపంతు గ్రామమందలి సాస్త్రులతో ప్రసంగించినాడు. ప్రసంగమును విని వారు మండిపడిరి. "నీవు పాపివి; వెలియైతివి. కుక్కముట్టు కొనిన కుండ పూజాకలశము కాజాలునా? తొలుత నీవొనరించిన పాపమునకు శిక్షజరిగి తీరవలెను. మరణశిక్షకే నీవు తలయొగ్గవలెను" అని వారు తీవ్ర ముగా నిష్ఠురోక్తుల నాడిరి.

పండితుల పలుకులను దంపతులు మననము గావించుకొనిరి. వారిద్రోల వాద ప్రతివాదములకు గడంగలేదు. యేమియు మొరపెట్టుకొనినవారు కారు. "మనము జీవించి యుండుటచే మనబిడ్డలకు చేటు వాటిల్లు చున్నది. మనము కడతేరినచో వారికి విధ్యుక్తముగా నుపనయనముజరుగును. బ్రాహ్మణకులమున వారికి మరల ప్రవేశము కలుగును. క్రమాభివృద్ధి నందుచు వారు సుఖముగా నుండజాలుదురు. కావున పండితవరేణ్యులు విధించిన శిక్షను శిరసావహించి తనువుల బాయుదము." అని వారు వితర్కించుకొనిరి. దంపతుల నిశ్చయము అచలమయినది. "తండ్రీ! ఇక మా బిడ్డలను నీవే చూచుకొనుము" అని జగ దీశుని ప్రార్థించి వారిరువురు ప్రయాగ మహాక్షేత్రమున కరిగి ఈశ్వరనామము నుచ్చరించుచు త్రివేణీ సంగమమున ప్రవేశించి కడసారి స్నానమును గావించి

జలగర్భమున మునింగి అసువుల బాసిరి. ఆదంపతుల ప్రాణములతో వారి కష్టములును కడ తేరినవి.

రూఢియైన వృత్తాంతము తెలియదు గావున నీవిషయము విమర్శింప జాలము. విరలపంతు తొందర పడెననియే తలంపవలసి యున్నది. తన మతము నుండి తఱిమివేసిన యాచార్యునిగాని మఱే విజ్ఞానినిగాని జేరి శాస్త్రములు నిర్దేశించు శిక్ష యెద్దియో హేతుశక్తి నిర్ణయించు దండన మెద్దియో ఆతడు కనుగొన వలసినది. యాజ్ఞవల్క్యస్మృతిని గుఱించిన మితాక్షర భాష్యమును పరిశీలించినపుడు గృహస్థుడు కాగోరిన సన్యాసిచేత మహాపాతకములందు గాక ఉపపాతకములందు మాత్రము గణింప దగినదేయని గ్రహింతుము. భాష్యకారుడైన విజ్ఞానేశ్వరుడు పరాశర వాక్కుల నుల్లేఖించుచు నట్టిచేతకు సంబంధించిన కలుషము సామాన్య ప్రాయశ్చిత్తమువలన నడంగునని తెలిపెను. కావున ఆలందిశాసనకర్తలు విధించిన శిక్ష కడుంగడు ఘోరమైన దనుటకు సంశయములేదు. ఏశాస్త్రవచనము నాధారముచేసుకొని వారట్టి తీర్పు కావించిరో తెలుపజాలము. పూర్వోక్తోదంతము జ్ఞానేశ్వరుని సోదరియైన ముక్తాబాయి వివరించినది. అందలి సత్యమును ప్రతిఘటించిన వారెవరును నేటిదనుక గోచరింపరైరి.

ఊరిపండితులు తమ తల్లిదండ్రుల మృత్యువునకు కారకులైనను నివృత్తి నాథ జ్ఞానేశ్వరులు వారిని ద్వేషింపలేదు. వారి సంపర్కముగాని వారి యనుమతినిగాని పెద్దవాడు కాంక్షింపనేలేదు. "మనజననీజనకుల కృపవలన మనము పవిత్రజీవులము కాజాలితిమి. మనకు మన తండ్రికంటె ఘనతరప్రజ్ఞగల ఆచార్యుడెవరు లభించును? ఉపనయనమునకై మనమీపండితుల నాశ్రయింపనేల?" అని యాతడు వచించెను. కాని జ్ఞానేశ్వరుని యభిప్రాయము వేఱుగానుండెను. "ఈపండితులతో సంపర్కము మనకేలయని మనము మిన్నకుండరాదు. వారి హృదయములందు పూర్ణమగుమార్పు కలిగించుట మనకర్తవ్యము." అని యతడు వచించెను.

అనంతరము సోదరులిరువురు గ్రామశాస్త్రవేత్తల పాలికరిగిరి.

"మీఉపనయనమునకు మేము అనుమతి నీయజాలము. మిమ్ము బహిష్కరింపుమనియే యేశాస్త్రమైనను వచింపుచున్నది. కాని మీరు పైతాను

పండితుల అనుజ్ఞ నంది వచ్చితిరేని మీావెలి తప్పింతుము. బ్రాహ్మణకర్తకు మీా రపు దర్శ్నాలయ్యెదరు. ” అని యాశాస్త్రవేత్తలు పలికిరి.

పైఠాను గోదావరినదీతీరమునగల ప్రసిద్ధపండిత కేంద్రము దేవగిరి వలె నిది యిపుడు నైజాము సంస్థానమునం దున్నను మన యుదంతకాలమున మహారాష్ట్రమున జేర్పబడియుండెడిది. అనుజులిరువురు తోడనే పైఠానుపండితుల కడ కరిగిరి. వారును వీరి వేడికోలును మన్నింపరైరి. జ్ఞానేశ్వరుడపుడు తన ప్రజ్ఞావిశేషములను వారిముందల పదర్శింపగలిగినా డట. పండితప్రవరులచెంత కొకదున్నపోతును గొనివచ్చి దానిచే ఋగ్వేదశ్లోకముల నుచ్చరింపజేసినా డట. ఈయద్భుతకృత్యమునకు వెఱగంది జ్ఞానేశ్వరుని మహిమను గుర్తించియాతనికిని వాని యనుజునకును ఉపనయనాధికారమును పండితు లొసంగి రట.

ఈసోదరుల వైజ్ఞానిక జీవితము విరలపంతు జీవించియున్నపుడే ప్రారంభమైనది. తన యేడవయేటనే నివృత్తినాథుడు త్ర్యంబకమునొద్ద నొక యోగీంద్రుని కటాక్షమునంది యోగాభ్యాసము నారంభించినాడు. యోగీంద్రుడు బాలకుని గుణగణములు గ్రహించియే మునిజీవితమున నాతనిని బద్ధజీవితుని గావించినాడు.

జ్ఞానేశ్వరుడు అగ్రజుని యంతేవాసి యైనాడు. అన్నకటాక్షమువలన ముక్తిపథగామి కాజాలితినని యాతడు మురియుచుండువాడు. కాని జ్ఞానేశ్వరుడు స్వాంతముక్తిమీాదనే దృష్టినిలిపిన స్వార్థపరుడుకాడు. మానవ సముద్ధరణ మాతని జీవిత పరమావధి యయ్యెను. నాటి మహారాష్ట్ర పరిస్థితులు ఆతని ప్రయత్నములను ఘనతర మొనరించినవి.

ఆకాలమున మహారాష్ట్రము యాదవరాజులచే పాలింపబడు చుండెను. దేవగిరి వారి రాజధాని నగరమైయుండెను. ఈనగరమే పిదప దౌలతాబా దన బరగినది. క్రీ. శ. 1270 సంవత్సర ప్రాంతమున దేవగిరి యేలికయైన రామదేవ రావు దక్షిణసీమయందు గొప్ప మతోద్యమ మొకటి నడుపుటకై నడుము కట్టెను. పండరిపురమున శిథిలావస్థయందున్న విఠోబా యాలయమును మరల నిర్మాణము గావించిన వా డీతడే. ఇతని ప్రోత్సాహమును ప్రజల యుత్సాహమును జ్ఞానేశ్వరుని ఉదారాశయములకు చేయూత నొసగెను. ఆతని భావము

లను హృదయంగమ మొనరించుకొనిన వా రెందఱో యాతని యంతేవాసు లైరి. క్రమక్రమముగా యోగివరుని శిష్యసంఖ్య అధికమైనది. హిందూమత మహత్త్వమును శిష్యకోటికి విశద మొనరించుటకై ఆతడు వేయిమార్గము లరయువాడు. గ్రంథరచనము వీనిలో ప్రసిద్ధమయినది. అహమద్ నగర జిల్లా యందలి 'నివస' యను సుందరప్రదేశమున నివసించు నవసరమున క్రీ. శ. 1290 లో నతడు రచించిన 'భావార్థదీపిక' యను సద్గ్రంథము ఈతని రచన లలో తలమానికము. భగవద్గీతలోని భావశబలత నీత డత్యద్భుతముగ తన గ్రంథమున వివరించినాడు. ఉపనిషత్తులును, బ్రహ్మసూత్రములును, ఈతనికి కంఠస్థములైనను తన భాష్యరచనకై ఈతడు "భగవద్గీత" నే చేకొనుటకు హేతువు అది పండితులకును పామరులకును సన్నిహితమైన దగుటచేతనే.

రూపుచూపులకు సంబంధించిన ఉదంతమే సామాన్యమానవులకు మనసున కింపుగొలుపును. ఇట్టి వృత్తాంతము మెదడునకు పనినీయదు. "భగవద్గీత" యనినపుడు శ్రీకృష్ణుడు మనశ్చక్షుస్సమక్షమున గోచ రించును. హృదయము భక్తిభరితమగును. జటిలమగు వైజ్ఞానిక విభూతికంటె భక్తియే సాధారణప్రజలకు సుసాధ్యమగును. కావున వైజ్ఞానిక సంపద కాల వాలమైన వేదములకంటె క్లిష్టమగు తాత్త్విక సూత్రములకంటె భక్తిభావము నకు నిధానములైన పురాణములే సర్వసమయములయందు ప్రజలకు సన్నిహిత ములైనవి. ప్రజాళియొక్క మానసగ్రథనముపై (కూర్పుపై) కన్నుంచిన మహావిజ్ఞాని కావున వ్యాసభట్టారకుడు సూత్రరచనముతో నూరకుండక అష్టాదశపురాణములను రచించి జగతికి సమర్పించినాడు. మానసికశాస్త్రము నకు సంబంధించిన ఈ ప్రధానాంశమును గుర్తెఱింగిన మహిమోపేతుడు జ్ఞానేశ్వరుడు. తనకాలమున మహారాష్ట్రమున తలసూపిన సంచలనమెట్టిదో ఆత డెఱుగును. పాండురంగడు పామరులందఱికిని సన్నిహితుడైన విషయ మాతని కవగతమే. నిర్గుణబ్రహ్మకంటె మహితగుణాఢ్యుడైన యవతార పూరుషుండే తమకు చెలియై చుట్టమై యుండునని వారూహింతురని యాత డెఱుంగును. కృష్ణునకు సన్నిహితులైనవారు కరకమలములు ముకుళించి కృష్ణవచనామృతమునకు కర్ణాంజలుల నొడ్డెదరనియు నాత డెఱుంగును. కావుననే మతప్రచారమునకు గడంగిన పవిత్రముహూర్తమున భగవద్గీతను శిరమున

దాలిచి అందలి భావమణులను అసంఖ్యాకులకు పంచి యిచ్చుటకై జ్ఞానేశ్వరుడు పూనుకొనినాడు.

సామాన్య ప్రజాహృదయతత్త్వ మెఱింగిన జ్ఞానేశ్వరుడు హృద్యమైన కావ్యభాషాప్రయోగములనే కావించి తన "భావార్థదీపికను వారి చేతుల యందు పెట్టినాడు. ఈ గ్రంథమును విపులముగ విమర్శించుట కిందు తావు లేదుగాని జ్ఞానేశ్వరుడు తన రచనావిధానమున నిజోద్దేశసిద్ధి నెట్లు కననెంచెనో కొన్ని దృష్టాంతములను లిఖించి తెలిపెదను.

"సుధామాధుర్యమును, గానమాధుర్యమును, దక్షిణానిలసౌరభమును సంయుక్తములైనను ఈకథామాధుర్యమునకు సరిపోలవు. ఇది హృదయమున నవిరతానందము నుప్పొంగించును. తీయనిపాలు నీవ్యాధిని నిర్మూలము గావించుచో చేదుమందుల నేల సేవింతువు? మోక్షకాముడవైనచో నీవు శరీరమును హింసింప నక్కఱలేదు; ఇంద్రియములను మాడ్చివేయనక్కఱలేదు. ఈకథామృతమునకు కర్ణాంజలుల నొడ్డుము. ముక్తి మీకు ముంజేతి కంకణ మగును."

అన్యరాష్ట్రములందలి పండితులవలె మహారాష్ట్రమందలి పండితులును పెక్కండ్లు సంస్కృతమునకే ప్రాముఖ్యమొసగి మాతృభాషను వెనుక నిలిపిరి. జ్ఞానేశ్వరునికాలమున మహారాష్ట్రభాషాంగణమున నీదృశ్యము బహుసంఖ్యాకుల ఆదరదృష్టి నాకర్షించెను. సంస్కృతమున కంజలి ఘటించు మహావిద్వాంసుడే యయ్యు మాతృభాష గీర్వాణవాఙ్మయమువెనక దాసిచాడ్పున నిలువ రాదని యాతని యభిప్రాయము. కావున మాతృభాషాప్రాభవమును పెంపొందించుటకై ఆతడు నడుము గట్టెను. తన వజ్రసంకల్పముచే జేగంట మ్రోగింప జేసి ప్రతిపక్షులైన పండితులచే సయితము తల లూపింపజేసెను. మనన నిదిధ్యాసనములకతనను, అవిరతతపంబు కతనను తీవ్రానుభవము కతనను క్రమనిష్ఠకతనను పూతజీవితవిధానమ్ము కతనను మహత్తరమనఃపరిణతిని పడసి సౌందర్యసందీప్తహృదయుండై ఈశ్వరకారుణ్యమునంది నిజాంతరంగమును మధురభావ సుధాకలశమునకు సదనంబుసేసి ఆత్మరచనమున నమృతసేచనము గావించి అపూర్వసౌందర్య మాధుర్య సౌష్టవములచే మాతృభాషామహత్త్వమును ఘనతర మొనరించి జ్ఞానేశ్వరుడు ధన్యజీవి యాయెను.

గీతాభాష్యము వ్రాయుతఱి తన నైసర్గిక ప్రతిభను సహజ ప్రజ్ఞను బహు భంగుల నీతడు వ్యక్తీకరించెను. కొన్ని దృష్టాంతములను పరిశీలింపుడు. ఆఱవ యధ్యాయమందలి పదవశ్లోకమును పదునొకండవ శ్లోకమును విమర్శించుతఱి జ్ఞానేశ్వరుడు యోగాభ్యాసనార్హస్థానమును గుఱించి యిట్లు వచించెను.

“ఆ స్థానమున ప్రశాంతవాతావరణము వెలయవలయును. ఎండ వేడిమినుండి కాపాడి కన్నుదోయికి విందొనరించు చెట్లగొంపము అందొప్పు చుండవలెను. సాంద్రమైన పర్ణవితానమునుండి తొంగిచూచుచు రవిమరీచు లచ్చోటు నాలోకిత మొనరింపవలెను. పరిమళబంధురమై చల్లనై ఉల్లము పల్లవింపజేయు హిల్లోలము అల్లనల్లన వీచుచుండవలెను. కర్ణకఠోరమైన శబ్ద మెద్దియైనను అందు వినబడరాదు. భ్రమరగీతికయనుడు కీరవచనమనుడు వీనులకు విందు చేయుచుండు టొప్పు. అంచల పిండుయనుడు చక్రవాకతతియనుడుసమ ముమున తోచుటమేలు. సుముహూర్తములందు కోయిల కూయుచో హృద యము పరితోషపూరితముకాదా. ఆత్మనలరించునట్టి తావలమే హృదయమున నిదురించు దివ్యశక్తులను మేల్కొలుపునుగదా. అపుడే సాధకుని జీవితము చరితార్థతగాంచగలదు. మకుటధారి యాచోటును దర్శించుచో మకుటమును విసర్జించి తపోనియతియందు మనసును బొనుపనెంతయు మక్కువపడవలెను.”

జ్ఞానేశ్వరుని గీతాభాష్యవిధానమును దృష్టాంతీకరించు పంక్తుల గొన్నింటిని పఠితులు పరికింతురుగాక. విష్వచ్ఛుడు విశ్వరూపసందర్శనాభిలాష నెట్లు వ్యక్తీకరించెనో ఈపంక్తులందు విలోకింతురుగాక.

“దేవా! మఱొక్క వాంఛ నాహృదయవీథిని తలసూపుచున్నది. నాకోర్కి యెట్టిదో విన్నవింతునా? విన్నవింపక నెట్లుండజాలుదును? సలిల గర్భమున వసించి తోయమునకు శ్రమగూర్చనిచ్ఛగించదేని మత్స్యమెందు పోగలదు? మాతృస్తన్యమును గొన శిశువువాంఛింపదేని క్షుద్బాధ నెట్లు పాపుకొనగలదు? నీదరి జేరజాలమేని మాకు చేదోడు వాదోడు లెందు చేకూఱును? మనోరథసిద్ధి నందుటకై నేనర్హుడనో కానో యెఱుంగను. వ్యాధి పీడితుని—వదువున నాయాతన మెట్టిదో వైద్యున కెఱింగించుట నా కర్తవ్యము. అర్హతానర్హతలను విమర్శించుట నాపనికాదు. అన్నార్తుడు సమస్తవిశ్వమును కబళింప నాతురం పడడా హే జగదీశా! కన్నులార నిన్ను విలోకింప

నే నాతురంపడుట సహజము కాదా? నా వాంఛాసిద్ధి నీయుద్దేశ్యముమీదనే ఆధారపడియున్నది. నీయుద్దేశ్యము నాకు ప్రతికూలముకాదని యెఱుంగుదును. నా యాధ్యాత్మిక విభూతివలనగాక నీయవ్యాజ వాత్సల్యమువలన నాకోర్కి ఫలించుట గాంచగలను. నీశత్రువులైన దైత్యులకు నీవు మోక్షమునీయలేదా? పగతురే నీకటాక్షమందుచుండ నాప్తులును భక్తులును బిడ్డలును దుఃఖింపనేల. ధ్రువుడు నీ కారుణ్యము నందినపుడు నేనేల నందజాలను? ''

ప్రపంచమహాగ్రంథములలో తలమానికమైన "భగవద్గీత" ను భాషాంతరీకరించుట సామాన్యక్రియకాదు. భవ్యభావరత్నాకరము "భగవద్గీత" యనుట నిస్సంశయము. గంభీరభావబంధురమై రసపూరితమై ధ్వనిగర్భితమైనదే ఉత్కృష్టసాహిత్య మనిపించుకొనును. ఇట్టి సాహితిని పరిశీలించినపుడు పఠితమానసమున నవ్యభావము లెన్నో యూరును. ఉపనిషత్తులందలి భావశబలత మఱేవాక్కులందు లేదని ప్రపంచమనీషులు పలుమాఱు వాకొనిరి. వానిలోని మీగడతఱకలే భగవద్గీతయందు ప్రవేశించినవి. అర్జునుడను వత్సముసకు గోపాలుడు వానియందలి దుగ్ధమును గ్రోలుభాగ్యము నొసగెనని విజ్ఞు లెఱుంగుదురు. "భగవద్గీత" యందలి మధురక్షీరమును మఱొక భాషయందు వెలారించుట సామాన్యక్రియకాదు. ఉదాత్తానువాదము భాషాజ్ఞానము మీదనే ఆధారపడి యుండదు. సహజరచనమునకువలె ననువాదమునకును వ్యక్తిగతహృదయ గ్రథనా విధానమును జీవితవిధానమును అనివార్యమైన చేదోడులగును. త్రాగుబోతు గీతామృతము నెట్లు గ్రోలజాలును? పఠితల మానసాంజలులం దాసుధ నెట్లు పోయగలడు? మహితభావముల నాత్మజీవితమున ప్రస్ఫుటింపజేయు మహాత్ముడే గీతాసారము నెఱిగి భక్తి పిపాసువులను తన చెంగట జేర్చికొనగలడు. మనసున జీర్ణించిన మధురభావములు మంజుల వాక్కులం దాత్మప్రకాశము గావించుకొనును.

జ్ఞానేశ్వరు డెట్టిజిజ్ఞాసువో ఎట్టితపస్వియో ఎట్టిభక్తుడో ఎట్టివిజ్ఞానియో ఎఱుంగుదుము. హృద్గతమైన భావమును తొలుత ననుష్ఠించియే మాటలందు ప్రకాశముగావించు మహనీయు డాతడు. కావున నాతని గీతానువాదము మాతృకలోని మహత్త్వమునకు దూరస్థముకాక మహితభావపూరితమై మహారాష్ట్రమున ననేకుల హృదయముల నాకర్షింపజాలినది. క్రీ. శ. 1290 లో

నివిసా యాలయాంగణమున నధివసించి అధ్యాయము తరువాత నధ్యాయమును అవిరతవాక్ప్రవాహముతో తెలుపుచుండ నీతని సన్నిహితశిష్యుడు, సచ్చిదానందుడు గురూక్తవచనములను తోడ్తోడన లిఖించుచుండువాడు. భావమును తొలుత జీర్ణించుకొనిన మహామేధావియగుడు జ్ఞానేశ్వరుడు నిముషమైన దలకక ఝరీవేగముతో వచనపరంపరను వ్యక్తీకరించువాడు. చుట్టు చేరిన అసంఖ్యాకు లాయోగీంద్రుని వచఃకౌశలమున కలరి తామందిన భావశబలత కతన జీవితసఫలత గాంచి ధన్యులగుచుండెడివారు. అనువాదము ముగిసి నంతన జ్ఞానేశ్వరుని అగ్రజుడును ఆచార్యుడునైన నివృత్తిదేవుండు ముదిత హృదయుండై అనుజ నభినందించి "సోదరా! మమ్ముల నానందసాగరమున నోలలాడించితివి. కాని, అనువాదముతో మేము తృప్తినందజాలము. నైసర్గిక ప్రతిభాసమన్వితమైన ఉద్గ్రంథమేదేని రచించి మమ్మలరింపుము" అనిపలికెను. అగ్రజునాజ్ఞ నాదలగొని పదిదినములలో "అమృతానుభవ" మను స్వతంత్ర గ్రంథమును రచించెను. గాజుకుప్పెలోని దీపకళికవలె జ్ఞానేశ్వరుని ప్రతిభ ఈగ్రంథమున తేజరిల్లినది. కాని ప్రజాళియందిది పూర్వోల్లిఖిత గ్రంథమువలె విశేష ప్రాముఖ్యమును పడయజాలకపోయెను.

జ్ఞానేశ్వరుడు సమన్వయదృష్టిగల సంయమీంద్రుడు. మానవాభ్యుదయ మాతని జీవితపరమావధి. సనాతన మతపునరుద్ధరణము వాని నిత్యకృత్యము. యుగవాతూల మెట్లువీచుచున్నదో ఆతడెఱుంగును. బుద్ధిమంతులు కాల వాహినినుండి కదలిపోజాలరు. ప్రజాజీవితములందు పెచ్చిల్లు నేరములను రూపుమాపజేయుటకు కంకణము గట్టుకొనియు ప్రజాహృదయములందు నధివసించిన మౌఢ్యమును దూరీకృతమొనర్చుటకై కృతనిశ్చయులయ్యు ప్రధాన ప్రజావిశ్వాసములను సాదరదృష్టితో పరిశీలించి అసభ్యములు కానివానిని గుర్తుపట్టి స్వీయాభిప్రాయములకును వానికిని సమన్వయము చేకూర్చు వెరవును వారు రోయుచుందురు. మహాపురుషుల జీవితములను అనిమేషలోచనములతో పరీక్షింపుడు. పరభావముతో నాత్మభావములు ఢీకొనినపుడు అంతరంగిక ముగ వారు పడు యాతన మెట్టిదో గ్రహింపగలరు. తమదృష్టిగల ఉదాత్త నియమములకు తలవంపులు రానీక స్వీయస్వాతంత్ర్యమునకు బన్నము వాటిల నీయక సమకాలవాతూలమునుండి మొగసిపోక ప్రజాహృదయములందు ప్రవేశ

మును పడయుటకై వారు బహుధా ప్రయత్నించుచుండురు. ఉత్కృష్టగీతా భాష్యమును వ్రాసి, ఆధునికయుగమున నసమానమైన కీర్తిగాంచిన బాలగంగాధర తిలకు పూర్వప్రసిద్ధములైన భాష్యవిధానముల ననుసరించిపోలేదు. సమకాల పరిస్థితులపై కన్నుంచి కర్మయోగమును సేవామహత్త్వమునకు లగించి తాను కర్మయోగియై లోకమాన్యుడై వఱలినాడు. పరమహంసప్రోక్తములైన ఉపదేశములను హృదయంగమ మొనరించుకొని అర్వాచీనయుగము కాంక్షించు భావప్రకరమునకు మనసిచ్చి మతజీవితమందలి వేర్వేఱు శాఖలను నిర్వచించి సేవాధర్మపరార్థజీవితమునందలి మహత్త్వము నుగ్గడించి ప్రాచీననాగరకతకు ప్రస్తుతకృషిని భావివృద్ధిని సమన్వయ మొనరించి విమర్శనాదక్షులయిన పాశ్చాత్యుల మనసులకు వచ్చు తెఱంగున పూర్వజ్ఞానమును ప్రబోధించి ప్రాచీప్రతీచీ వసుంధరలందు తన పాండిత్యమును ప్రయోగించి వివేకానందుడు యశస్విలకు డాయెను. గురూపదేశమును జీర్ణించుకొని గురుసంప్రదాయమును మన్నించి వివేకానందస్వామి స్వీయస్వాతంత్ర్యమునుగాని సహజప్రతిభనుగాని ప్రత్యేక ప్రజ్ఞనుగాని వ్రాలనీయలేదు. సమన్వయచింత నలవఱచుకొనుటకు ముందు ద్వంద్వభావము లతనిహృదయ వీథియందెట్లు పెనగులాడెడివో స్వామిజీ యంతేవాసినియైన నివేదితాసోదరి వివరించినది. నైసర్గికముగా జ్ఞానయోగము నభిలషించువాడే యయ్యు సమకాలికులు పల్వురు భక్తియోగము ననుష్ఠించు వారని జ్ఞానేశ్వరు డెఱుగును. కావున దీనిదెసగూడ మనసుద్రిప్పి, ఇందలి మహత్త్వము నసంఖ్యాకులకు ప్రబోధించినాడు. కొందఱు తాత్త్వికులవలె కర్మయోగము నాతడు జుగుప్సతో వీక్షింపలేదు. కర్మయోగము సర్వజన సులభమైనదని యెఱిగి దానిప్రభావము నాతడు ప్రశంసించినాడు. తాను నిర్గుణోపాసకుడయ్యు సగుణోపాసనమునుండి దూరీకృతుడు కాలేదు. పౌరాణిక యుగమునుండి ఆరాధ్యదైవతములను గుఱించి కొందఱుభక్తులందు చెలరేగు భావవ్యత్యాసముల నాతడు విషాదదృష్టితో విలోకించినాడు. శివకేశవులను సమదృష్టితో నవలోకించి స్వీయగ్రంథములందు వారి కాతడు సమానప్రాభవము నొసగినాడు. జ్ఞానేశ్వరుడు సమకాల రాజకీయస్థితిగతులదెస పెడమొగము బెట్టలేదను నంశమును పాఠకులు జ్ఞప్తియందుంచుకొనవలెను. నాటి మహమ్మదీయ దండయాత్రలకతన హిందూమతమునకు ఘటిల్లెడుచేటు నాతడు

గుర్తించినాడు. జవోపేతమైన వెల్లువ నెదుర్కొనవలెనని హిందూమతము పొరపొచ్చెములనుగాని తీవ్రవ్యత్యాసములనుగాని తల యెత్తనీయక ఘనతర శక్తి నందవలెనని ఆతడు గ్రహించినాడు. దేశాభ్యుదయమును వలచిన మహనీయుడగుచు, స్వీయముక్తినేగాక పరముక్తినికూడ వలచిన మహాత్ముడగుచు జ్ఞానేశ్వరుడు సమన్వయక్రియాకలాపము ననుష్ఠించి ధన్యజీవియైనాడు.

పూర్వోక్త గ్రంథములు రెండును జ్ఞానేశ్వరుని కీర్తిని వృద్ధిగావించెను. ఆతని కీర్తిచంద్రిక లసంఖ్యాకుల నాతని చరణోపాంతమునకు నాకర్షించెను. ఆతని ప్రబోధమునకు వీనులొగ్గి వైజ్ఞానిక యాత్రికు లెందరెందరో ఆశయ సిద్ధిగాంచిరి. కాని జ్ఞానేశ్వరు డీమాత్రపుప్రబోధముతో తృప్తినందలేదు. పద్మాసనము వేసికొని ప్రణతులనందుచు నిజాశ్రమమున ననారతము విడిసి యుండుట కాతని మానస మీయకొనలేదు. బంధుమిత్రశిష్యగణములను తోడు కొని స్థానస్థానములందు పరిభ్రమణముసలిపి వేదాంతసత్యములను ప్రజలకు ప్రబోధింపసాగెను.

నరహరి యను కంసాలియును గోరా యను కుమ్మరియును ఈతని శిష్య వర్గములోనివారు. వీరు మహారాష్ట్రదేశమున ప్రతీతివడసిన భక్తులు. వివిధ వర్ణములవారెందరెందరో ఈతని పరివారమున నుండిరి. వివిధవృత్తులవారెందరెందరో ముముక్షువులై జ్ఞానేశ్వరు ననుసరించిరి. వీరిలో కొందఱు వ్రాయను జదవను నేర్చినవారుకారు. ఉపదేశ శ్రవణము వలన మనన నిదిధ్యాసములవలన క్రమానుష్ఠానము కతన నాంతరంగికశక్తులను వృద్ధిగావించుకొని ఇహపరసాధనములను చేగొనినవారు మనసీమయందు వరలియుండిరి.

పండరీపురము జేరినపిదప నామదేవుడు జ్ఞానేశ్వరుని పరివారమును గలసికొనెను. ఈతడు కుట్టుపనివాని తనయుడు. విఠోబాభక్తులందు మహోన్నత స్థానము నందినవాడు. పండరీనాథునితో నెంతో చనువుతో మెలంగెడువాడు. ఈతని వాక్కు లుద్వేగపూరితములై యుండెడివి. అసంఖ్యాకుల హృదంతరాళములందు భక్తితరంగముల నుద్వేత్తున పొంగింపజాలు మహిమోపేతుడు. జ్ఞానేశ్వర, గోరా, విసోబాఖేచార్ ప్రభుతుల యాదరానురాగముల నంది మతప్రచారమునకై ముదంజ వేసినాడు.

నాటి భక్తులును ప్రజలును హిందూమతసిద్ధాంతముల ననుగమించి, వర్ణాశ్రమధర్మము ననుష్ఠించిరి. ఎవరికర్తవ్యమును వారు నెఱపుకొనుచు,

నీర్ష్యాద్వేషములను దూరమున నిలిపిరి. విజ్ఞానము నందుటకును ఒరులను విజ్ఞానులను జేయుటకును విప్రుడు తనజీవితమును వినియోగించువాడు. అన్య జాతులవారు ధనధాన్యములను ప్రోగొనరించుచుండ నీత డెన్నడు కన్నీరువిడువ లేదు. సంఘజీవితమున నీతడు గౌరవానురాగముల నందుటగాంచి కినిసిన వారెవ్వరునులేరు. పదునొకండవ శతాబ్దిమొదలు పదునేడవ శతాబ్దము వఱకు వఱలిన భక్తప్రవరుల ప్రబోధములు హిందూసంఘమున సంఘీభావ మును నెలకొలుపుటచే నెల్లడల ప్రణయమే వెలసినది కాని ప్రకోపముకాదు. హృదయము ప్రణయపూరితమైనపుడు ఉపద్రవకరములైన వ్యత్యాసము లెట్లు పెచ్చిల్లును? జ్ఞానేశ్వరుని సహభక్తులందును, అంతేవాసులందును సహప్రచారకు లందును వివిధమతస్థు లెందఱో యుండిరను సంశమును పాఠకులు విస్మృతింప కుందురుగాక! "జ్ఞానేశ్వరి" యను తన యుద్గ్రంథమున (13 వ అధ్యాయము 674 వ పద్యము) ఏవర్ణసంప్రదాయమునకు భిన్నము వాటిల్లరాదని మన స్వామిజీ తెలిపినను, ప్రత్యేకవర్ణసంప్రదాయ సంరక్షణము కతన బొరపొచ్చెము లను తలసూపనియ్యక తన సమన్వయసిద్ధాంతము నాతడు కాపాడుకొనెనని చదువరులు గ్రహింతురుగాక! ఏకనాథ, నామదేవ, తుకారామ, రామదాసు మున్నగు సంయములు జ్ఞానేశ్వరుని మార్గము ననుసరించినవారే యని వారెఱుంగుదురుగాక! జాతీయాభ్యుదయ మీ మార్గమందే పొడసూపినదని చరిత్రపాఠకు లెఱుగుదురు.

పూర్వోక్త సంయములు రాజకీయము లంటరానివని ఎన్నడు నూహింం చిరికాదు. శివాజికి నుత్సాహ ప్రోత్సాహముల నొనగూర్చిన మహాత్ములు తుకారామ రామదాసులనియు వారికతనతా నందినశక్తిని పురస్కరించుకొనియే ఆ యశస్తిలకుడు తన జాతీయపతాకము నెత్తెననియు రాజకీయ సాంఘిక మతోద్యమములు నాడు అవార్య సంబంధమున వర్థిల్లె ననియు సత్యసందీప్త మైన చరిత్రను పరిశీలించువారు తెలిసికొనక పోరు.

పూర్వోక్త సంబంధము భారత ప్రకృతికి మిగుల గూర్పునది కావున భారతచరిత్రయందు ప్రత్యేక ప్రాముఖ్యమును వహించినది. మత మహత్త్వ మును ఈశ్వర చింతయును ఉదారాశయారాధనమును ఉదాత్త భావోపాస నమును భారతీయుని హృదయము నాకర్షించునట్లు మతే దేశవాసిమానసము

నాకర్షింపవు. భారతవిద్యాధికుడు భగవంతుని మఱచిన మఱచునుగాని భారత పామరుడు మఱువడు. ఈతని స్వప్నములనుండిసయితము ఈశ్వరచింత నిర్వాసితము కాదు. భారతమానసమునకీ భావశిక్ష పెట్టిన మహాత్ములు పూర్వఋషులే. వీరిలో ప్రధానులు వాల్మీకి వ్యాసులు. క్లిష్టమైన తాత్త్వి కాంశములకు రూపుచూపు లొసగి మహాకావ్యములద్వారా మనశ్చక్షు సమక్షమున వానిని నిలిపిరి. కావ్యమునకును క్రమసిద్ధకును సాహిత్యమునకును మహితభావ గ్రహణమునకును దైనిక తపసునకును వియ్యము చేకూఱినది మన దేశమందే. మన కావ్యములు వినోదపఠనమునకై ఉద్దేశింప బడలేదు. ఉత్కృష్టాదర్శములను ఉదాత్త దృష్టాంతములను మానసముమ్రోల నిలిపి మానవ చరిత్రకు వానిని మేలుబంతు లొనరించుటకై అవి యుద్దేశింపబడినవి. సీతారాములు కేవల కథాపాత్రలు కారు. స్త్రీపురుషుల కారాధ్య దేవతలై పవిత్రజీవితవిధాన మలవఱచుకొన దపించు తఱి వారి మానస నేత్రముల మ్రోల నాదర్శజీవులై వెలయువారు జానకీ రాఘవులని మన మెఱుంగు దుము. అనుష్ఠానమున ప్రవేశింపని పఠనము మఱేదేశమందైన నాదరము నందెనేమో కాని మనదేశమందు కాదు. అవగాహమైన గాని ఆచరణము సాధ్యముకాదు. పామరులకు కావ్యము బోధపడినట్లు శాస్త్రము బోధపడదు. కథ తెల్లమైనట్లు శాస్త్రము తెల్లముకాదు. వారుభాష్యకారులుకాకపోవచ్చును రసామృతము గ్రోలి ఆనందింపగలరు. ఆనందించి తరించు నుపాయము కను గొనగలరు. కనుగొని అనుసరింపగలరు. అనుష్ఠింపగలరు. వాల్మీకివ్యాసుల యుద్దేశములును ఉత్కృష్ట హిందూమత సిద్ధాంతములును భారత పామర జీవితములందు కోటివత్తులై వెలుగొందుచున్నవి. ఈశ్వరుడును అవతార పూరుషులును భారతపామరులకు సుపరిచితులు.

ఇట్టి సంప్రదాయము ఇతరదేశములందు దలసూపలేదు. తమ కావ్య ములద్వారా ప్రజలను మహితాశయములదెస దోడ్కొనిపోవ దపించిన మునిరచయితలు ప్రతీసీమలందు బుట్టనేలేదు. దైనికజీవితమున నైహికసమ స్యలకు మనసిచ్చునట్లు ఆముష్మికసమస్యలకు మనసిచ్చువా రాదేశములందు నెందఱో లేరు. సీతారాములు భారతపామరులకు సత్యజీవితమున సుపరిచితు లైనట్లు ప్రతీచీవాసులకు ఏసుప్రభృతులు సుపరిచితులుకారు. ఒకప్పుడు వివేకా

నందస్వామి తెలిసిన దృష్టాంతము నొండు నిందుల్లేఖింతును. మహాత్ముడని ప్రసిద్ధినందిన మతగురువొకండు ఇంగ్లాండున నొక గనియొద్దకుబోయి అందు పనిచేయు నొక్కరుని "నీవు ఏసు నెఱుగుదువా ?" యని ప్రశ్నించెనట. ప్రశ్నవిని యాతడు " వానినెంబరు (సంఖ్య) ఎంత ?" యని యడిగినాడట ! ఏసు తనలో గనియందు పనిచేయువారిలో నొక్కండై యుండునని ఆత దూహించెననుట స్పష్టాంశము. ఇట్టి మౌఢ్యము భారతభూమియం దెన్నడు దలయెత్తలేదు.

భారతీయుల మానసగ్రంథనమెట్టిదో ఎఱింగిన మహాత్ములు జ్ఞానేశ్వర, ఏకనాథ, నామదేవ, తుకారామ, రామదాసు ప్రభృతులు. రచ్చమీాదినుండి గురుగంభీరోపన్యాసముల నిచ్చు రాజకీయవేత్తకంటె నిజాశ్రమమున నుప స్థుడై ప్రశాంతభావమున తారకమంత్రోపదేశ మొనరించు యోగీంద్రుడు భారతభూమియందు విశేషగౌరవ మందుననియు వాని వాక్కుకంటె వీని వాక్కు అధికాదరము నందుననియు వారెఱుంగుదురు. ఏ యుద్యమమైనను మతముతో కొంత చుట్టఱికమును కలుపుకొనకుండ భారతభూమియందు విజయిభేరిని మ్రోగింపజాలునా.

జ్ఞానేశ్వరాదుల భావశబలతను జీర్ణించుకొనిన మహాత్ముడు వివేకానంద స్వామి. ఈతడు దైవభక్తుడును దేశభక్తుడునుకూడ నని ధ్యానమునకును సేవామహత్త్వమునకును సమన్వయము చేకూర్చిన మహనీయుడని పర ముక్తిపై కన్నిడినయనంతరమే స్వముక్తికి మనిసిచ్చిన గుణగరిష్ఠుడని సభ్య జగతి యెఱుగును. వివేకానందాదులు చూపిన ఆలోకము గాంధిదృష్టి నాకర్షిం చెను. ఏసుబోలు సంయమివైె రాజకీయవేత్తయై భారతముక్తికొఱకును మానవముక్తికొఱకును ఈతడొనరించు తప సెట్టిదో ఎఱుగనివారు నేడు పుడమిలో లేరు.

మతసంబంధమనిన చుఱ్ఱుమని లేచువారును రాజకీయములకును మతము నకును ముడిపెట్టరాదని వచించువారును నేడు గోచరించుచున్నారు. మత మని నపుడు ప్రాముఖ్యమునందవలసినది మతస్థమహితభావముగాని వ్యక్తిగత మతా చార సముదాయము కాదు. ఈసముదాయమును గుఱించి భిన్నమతస్థులవారి యందు విభేదములుండును. ఈ విభేదముల ప్రాముఖ్యము అంతఃకలహములకు

దారిదీసి జాతీయసౌభాగ్యముపై నిప్పులు చల్లవచ్చును. భావమహిమ సర్వమతములకు స్వతస్సిద్ధమైనది. ఉత్తమాశయము లన్నిమతములందు తేజరిల్లు జ్యోతులే! జాతీయవాదులైన మతప్రవక్తలందఱు నీయాశయోపాసనము దేసకును ఆశయానుష్ఠానము దేసకును ప్రజానీకమును పురికొల్పిరి. అరేబియాలో నొకప్పుడు మహమ్మదు అట్లొనరించెను. ఆర్యావర్తమున సుప్రసిద్ధులైన సిక్కుమతగురువులును అట్లు గావించిరి. వీరి శిక్షణము కతన మునియోధులెందఱో పొడసూపి స్వీయజాతిముక్తికై మతముక్తికై దేశముక్తికై ఆత్మార్పణము గావించుకొనిరని నిక్కంపు చరిత్రలు తెలుపుచున్నవి.

అధునాతన భారతజీవితమునకును మన దృష్టి నాకర్షించు విషయమునకును ముఖ్యమైన సంబంధము కలదనియు, మన ముఖ్యులుకొందఱు దూరదృష్టిగల రాజకీయవేత్తలనియు జాతీయత్వ అంతర్జాతీయత్వముల సమన్వయ మెఱిగిన మేధావులనియు వీరిలో జ్ఞానేశ్వరు డొక్కండనియు దెలుపుట నాయాశయము. పరదండయాత్రల కతన దేశమునకు తమ మతమునకు చేకూఱిన ముప్పును తప్పించుటకై నడుముగట్టి ప్రజాళియందు నవ్యతేజమును తళ్కొత్తించుటకై స్వీయసీమయందు నూతనశక్తిని దీపింతజేయుటకై ఆతడొనరించిన తపసెట్టిదో చదువరు లెఱుగుదురు.

జాతీయత్వసిద్ధికిని మతమహత్త్వవృద్ధికిని మహితగుణసమృద్ధికిని మాతృభాషాభివృద్ధికిని అనివార్యసంబంధము కలదని కంఠమెత్తి వచింతును.

మనదృష్టి నాకర్షించుచున్న రాజకీయమతమహోద్యమములు మహారాష్ట్రమున వర్ధిలుకాలమున మహారాష్ట్రవాఙ్మయము సమధికాభివృద్ధి నందినది. జ్ఞానేశ్వరు డొనరించిన మాతృభాషాసేవ ఎట్టిదో చదువరులెఱుంగుదురు. ఏకనాథ నామదేవ తుకారామ రామదాసులును తమ భాషాయోషకు అనల్పమైన సేవజేసిరి. పండితులు సంస్కృతవాఙ్మయమునకే మనసిచ్చి మాతృభాష నాదరించిరి కారు. తెలుగునేలలోవలె నాడు మహారాష్ట్రభాష రాజాదరము నందెనని తెలుపలేము. కృశించి యల్లాడు తల్లిని యోగీంద్రులే కాపాడిరి. వీరి కృషి కతన మహారాష్ట్రసాహితి అపూర్వవిభవము నందినది. సాహిత్యాచార్యులైన మతాచార్యుల మహిత దృష్టాంతములను మేలుబంతులొనరించుకొని పల్వురు భాషాసతిని గొలుచుటకై ముందంజవేసిరి. బహుళగ్రంథము

లను రచించిరి. అసంఖ్యాకములగు పద్యములను రచించుట వారి జీవితాశయము అయినది. నామదేవుడు తొంబదియారుకోట్ల అభంగములను రచించెనట! ఇది యతిశయోక్తి యనుట నిస్సంశయము. కాని నామదేవుడును ఆతనిదృష్టాంతము నొజ్జబంతిజేసికొనినవారును అనేకాభంగములను రచించిరని యూహించుట సత్యదూరముకాదు. విశేషమైన సాహిత్యసామగ్రిని సృష్టించుటే జీవితపరమాశయమని యూహించుటచే నాటి రచయితలందఱు ఆదర్శగ్రంథకర్తలు కాజాలకపోయిరి. గ్రంథబాహుళ్యముపై గాక భావగాంభీర్యముమీద దృష్టిని బద్ధమొనరించువారే ఆదర్శరచయితలు కాగలరు. శ్రమతపసునుగాని శ్రమశిక్షణమునుగాని పడయక కలములు చేబూనిన గ్రంథకర్తలు పునరుక్తిదోషముల పాలబడిరి. కథాసూత్రములను తలక్రిందులుచేసిరి. వీరి గ్రంథములందు సయితము ఆధ్యాత్మిక విశ్వాసము విరాజిల్లినది. అనుకరణ అనుసరణముల నవలంబించిన వారి రచనములందు నెరసులు తలయెత్తినను నైసర్గికప్రతిభాసమన్వితులైన తపోధనులు సృష్టించిన రచనలయందు భావమణులు వెలసినవి. మతమహాత్త్వమునకు సంబంధించిన నాటి మహారాష్ట్ర రచనలను వేర్వేఱు భాగములుగా విభజింపవచ్చును. వేదార్థమును ప్రకాశముగావించు గ్రంథములు ప్రథమశ్రేణిలోనివి. జ్ఞానేశ్వరవిరచిత "భాగవతము" ను ఈశ్రేణిలోనిది. ఇవి పద్యగ్రంథములు. ఆధ్యాత్మికభావోద్వేగమును వ్యక్తీకరించు అభంగములు రెండవ శ్రేణిలోనివి. అభంగములందలి ఛందస్సు అనుష్టుప్పు ననుసరించినది. నీతిపద్యాత్మకములైన రచనములు మూడవశ్రేణిలోనివి. రామాయణభారతకథలు నాలవశ్రేణి గ్రంథములు. కథావాఙ్మయము వివిధ ఛందోగతుల ననుసరించి నడచినది. శ్రీధరముక్తేశ్వరమోరోపంతులు ఈ వాఙ్మయకర్తలలో ప్రసిద్ధికెక్కినవారు.

మూడునాలుగేండ్లు యాత్రయందు కడపి జ్ఞానేశ్వర ప్రభృతులు ఆలంది జేరిరి. స్వామిజీ సోదరులుగాని సోదరిగాని పెండ్లియపేక్షను మనసున ప్రవేశింప నియ్యలేదు. స్వీయ జీవనోపాధికై వారు తపించిరికారు. ఈశ్వర సేవయే తమ జీవిత పరమావధియని వారు తలంచిరి. మానవ సంఘమునకు తామొనరించుసేవ ఈశ్వర సేవయేయని యూహించిరి. అభాగులను కాపాడుట పతితుల నుద్ధరించుట తమ ప్రధాన కర్తవ్యములని యెంచిరి. ఈ పవిత్ర

జీవుల యుద్దేశములను వీరి సీమయందు శతాబ్దుల యనంతరము జనించిన తిలకు మహాశయుడు హృదయంగమ మొనరించుకొనియే గీతాభాష్యమును రచించెను.

సేవాధర్మమును జ్ఞానేశ్వరు డొకరీతి యుజ్ఞ మర్లించెను. ఆతని యుద్దేశ సిద్ధి పలువుర హృదయములం దీర్ష్యానలమును రవుల్కొలిపినది. పైఠానుప్రభృతి ప్రదేశముల నుండి ప్రశాంత వాతూలము వీచినను అన్యస్థానములనుండి అపు డపుడు వేడిగాల్పులు వీవ దొడగినవి. ఛాంగదేవుడను యోగి జ్ఞానేశ్వరునకు పరాభవము జూపవలెనని పట్టుపట్టినాడు. పదునాలుగు శతాబ్దుల వయసు తనకు గలదని ఈతడు చెప్పుకొనుచుండువాడట. భయంకరమైన పెద్దపులిపై నీతడు స్వారీచేయు చుండువాడట. బుసకొట్టు త్రాచుపా మొకటి అత్తటి ఈతని చేతిజూకగా ప్రయోగింప బడు చుండెనట. వ్యాఘ్రవాహనము నధి ష్ఠించియే ఈతడు ప్రయాణములు చేయుచుండువాడట. బెబ్బులినెక్కి శిష్యసేనా పరివృతుడై జ్ఞానేశ్వరుని మార్కొనుటకై ఈత డాలందిదెస బయనమైనాడట. వీనిరాక నెఱింగి జ్ఞానేశ్వరుడు మందహాసముతో నీతని కెదు రేగినాడట. ఎదు రేగునపుడు డాత డొకగోడపై నధిష్ఠించి దానిని నడిపించినాడట. జ్ఞానేశ్వరుని ప్రభావము ప్రత్యర్థి నప్రతిభు జేసెనట. తరువాతి ప్రసంగమున ఛాంగదేవుడు తొట్రుపడినాడట. పదపడి తనబెబ్బులిని తనపామును పరిత్యజించి శిష్యపరివార మునకు సెలవొసంగి తాను జ్ఞానేశ్వరుని చరణముల నాశ్రయించి ఆతని సేవించి ధన్యుడైనాడట.

ఈయుదంతమును పాఠకమహాశయులు విమర్శకదృష్టితో వీక్షింతురు గాక! మహిషముచే ఋగ్వేదమంత్రములను పఠింపజేయు టెట్టిదో భిత్తికచే నడిపించుటయు నట్టిదే. ప్రవక్తల జీవితములచుట్టును, స్వాముల జీవితముల చుట్టును, ఎన్నెన్నో విడ్డూరవు గాథలు తలలెత్తు చుండుట లోకప్రసిద్ధము. చరిత్ర యుగమున ప్రసిద్ధినందిన మహనీయులను గుఱించి కూడ విచిత్రోదంత ములు సృష్టియగుట శోచనీయము. ఆధునిక యుగమున నిశిత పరిశీలనమును తీక్ష్ణ విమర్శనమునమును ప్రాముఖ్యమును పడసినవి. వింత వృత్తాంతముల కంజలి ఘటించువారు నేడెందరో లేరు. భావనముకంటె యోచనమే నేడధికాదరము నందుచున్నది. విచిత్రగాథల నున్నవాని నున్నట్లుగ గ్రహింప రాదనియు

వానియందలి యంతరార్థమునే గ్రహించుట పాడియనియు దలచుచు వారొను చుందును. తనచరిత్ర మహత్త్వము కతన తనజ్ఞానిక ప్రజ్ఞకతన జ్ఞానేశ్వరుడు లాతివారి మనసులను ద్రిప్పి వారిని సన్నిహితుల గావించుకొనెనని పఠితులు గ్రహింతురుగాక !

శ్రీశంకరుని వలెనే జ్ఞానేశ్వరుడు భూతలమున నెంతకాలమో మని యుండలేదు. శంకరునికంటె పిన్నవయసునందే సరిగ నిరువైరెండేండ్లు ముగి యకమున్నే క్రీ. శ. 1296 సంవత్సరమున అక్టోబరు 25 తేదీనాడు జ్ఞానేశ్వ రుడు ఈశ్వరసాయుజ్యము నందెను. అనంతరము సంవత్సరము దాటకమున్నె ఆతని యనుజన్ము లందఱు గూడ దివంగతులైరి.

చరిత్ర యుగములో వఱలిన జ్ఞానేశ్వరుని చరిత్రమును సత్యాభి లాషులమై సత్యాన్వేషులమై పరీక్షించితిమేని మన మెంతేని జ్ఞానము నంద గలము. హేతు సంబద్ధముకాని వృత్తాంతమును విడచివైచినయనంతరము కూడ నీతని జీవితము అద్భుతావహాంశములతో తుందిలమై యుండెను. దురంత దారిద్ర్యమున, దుస్సహమైన అత్యాచారమున జనించి పడరానిపాట్లు పడియు ధృతిసహనములను పాయక అవిచలిత దృష్టిని ఉదాత్తాశయములపై నిబద్ధ మొనరించి అద్భుత ప్రతిభను ప్రకటించి తా నుపదేశించిన సత్యముల చేతనే తన జీవితమును సందీపిత మొనరించి ప్రణయదానము కతన దుష్టుల నిష్టుల గావించుకొని అల్పకాలములో మహా మహిమోపేతుడై మహాత్ముడై జ్ఞానేశ్వరుడు వఱలినాడు. నివసా మందిరమున జ్ఞానభాస్కరుడై నిలిచి మంత్ర శక్తిగల వాక్కులచే ననేకులను ముగ్ధుల గావించి శరపరంపరగ భావపరంపరను ప్రకాశ మొనరించి తన పదునేనవయేట మహోత్కృష్టమైన గ్రంథమును రచించిన డింభకుని మానసనేత్రముమ్రోల నిలుపుకొని వాని ప్రభావమును మనన మొనరించుకొను పఠితల హృదయములు భావోద్వేగ పూరితములు కావా ? పరార్థజీవులై తిరిపెమెత్తి దూషణమునకు బదులు భూషణమును సమర్పించి దుమ్ముపోయువారికి పుష్పాడి ప్రసాదించి విషపాత్ర మెదుట నిలి చిన వారికి స్మితముఖులై పీయూష భాండము నొసగజాలువారు పృథ్వియం దెందఱు గోచరింతురు ? సంఘ బహిష్కారమునకు గుఱియైన విఠలుపంతు బిడ్డలే తమ కాలమున మతాచార్యులైరి. బిచ్చమెత్తి మనిన బాలకుడు తన

యాధ్యాత్మికశక్తిద్యుతులచే నాలుశతాబ్దుల నాలోకితమొనరించినాడు. తన గంభీరోపన్యాసములచే మహారాష్ట్రమున విజయభేరిని బ్రమోగింపజేసి విఠల దేవుని సింహాసనముచుట్టు నసంఖ్యాకులగు వందిమాగధులను జేర్చినాడు. భక్తప్రవరులచే తాండవకృత్యము చేయించినాడు. జ్ఞానేశ్వరుని కాలమునుండి పండరీపురము మహారాష్ట్రదేశమందు వారణాసి యయ్యెను.

వేదాంతరహస్యములును, మతాశయములును పండితవర్గమందే కట్టుపడియున్న దినములలో పామరులందు వానిని వెదజల్లి మతప్రభావమును విస్తృతమొనరించిన మహానుభావుడు జ్ఞానేశ్వరుడు. శంకరమతావలంబియై సన్యాసధర్మమును నిర్వహించుచు గభీరసమాధియందలి ప్రమోదమును పరిత్యజించి గుహానిభృతమందలి రహస్యతపసులోని అంతరంగికానందమునకు నీరువదలి సంఘమున ప్రవేశించి ప్రజాళి కష్టసుఖములరసి పరహితకాంక్షియై ఆతడు పరగినాడు. మనశ్శాస్త్రపరిజ్ఞాతయై లోకుల విశ్వాస మాదరదృష్టితో విలోకించి భావసంఘర్షణంబునకు తావీయక జ్ఞానయోగియయ్యు దక్కిన యోగములదెస పెడమొగము బెట్టక జనానీకహృదయముల నుత్సాహోద్వేగ సంభరితము లొనరించి మహారాష్ట్రవసుంధరయందు నవ్యసంచలనము బుట్టించినాడు. తరువాత రెండు శతాబ్దులందు విజృంభించిన తీవ్రరాజకీయ విప్లవము కతన మతప్రాముఖ్యము కుంటుపడినను ఏకనాథస్వామి కాలమున ద్విగుణీకృతోత్సాహముతో తలయెత్తి మహారాష్ట్రభూమియం దెల్లకడల నాత్మతేజమును వెలారించెను. నాటి మతమహోద్యమ మహత్వమే యోధాగ్రేసరుడైన శివాజిని యోగనిష్ఠాగరిష్ఠు గావించి ప్రజాహృదయమందును మహారాష్ట్రహృదయమందును వానిచే స్వరాజ్యమును స్థాపింపజేసి లాతిశక్తులను ప్రతిఘటింపజేసి దేశగౌరవమును, సర్వతోముఖప్రజాభ్యుదయమును, జాతికల్యాణమును, మహితసంప్రదాయదార్ఢ్యమును గాపాడినది. నాటి దేశభక్తి అర్థశాస్త్రమునకును రాజకీయతంత్రమునకును గాక తత్త్వశాస్త్రమునకును మతశాస్త్రమునకును సన్నిహితమై దైవభక్తికి సహపాఠియై యుండెడిది కావున జ్ఞానేశ్వరాదుల తపఃశక్తికతన ఘనతరమహిమనంది మహారాష్ట్రవిషయమున నిత్యశృంగారమును పచ్చతోరణమును నెలకొలిపినది. భక్తిశక్తి ముక్తులను ముగురమ్మలజేసి యారాధించి యా ఆరాధనమున తోడిమానవుల బద్ధదీక్షితుల గావించి పరార్థజీవియై పరమ పవిత్రుండైన జ్ఞానేశ్వరస్వామి చిరస్మరణీయుడు కాడా!

———

౫౬

# అప్పాస్వామి

---

"ఉ. ఆకృతిలేక భూతబహిరంతర పూర్ణనిజప్రకాశతన్
స్వీకృతదుష్టశిష్టజనశిక్షణరక్షణ కార్యభారుఁడై
లోకులకుం గనంబడక లోకము లేలుదయాపయోధి సు
శ్లోకుని భక్తపాపభయశోకహరుం బరమేశుఁ గొల్చెదన్."

అప్పాస్వామి పూర్వనామధేయములలో నొక్కటి మరుల్ నీకియార్ యనునది. పుగలనార్ మతినియార్ లనబరగిన తలిదండ్రులు తొలుత వానికా పేరుపెట్టిరి. ఈకొడుకునకుముందు వారికొకకూతురు పుట్టెను. ఆయాఁడుబిడ్డ పేరు తిలాతవధియార్. ఈమెకు పండ్రెండేండ్లు రాకమున్నె కలిప్పహైయార్ అను వెల్లాలకులస్థునకు నీమెనిచ్చి పెండ్లిచేయవలెనని తలిదండ్రులు నిశ్చయించిరి. కలిప్పహైయార్ పల్లవయేలిక యధీనమున సేనాధిపతిగా నుండువాడు. నిశ్చితమైన వివాహము విధ్యుక్తముగ నిర్వహింపబడక మున్నాతడు ఉత్తరముననుండి దండెత్తివచ్చిన కొండొకయోధు నెదుర్కొనుటకై యుద్ధభూమికి పోయినాడు. పెండ్లియాడుటకై యింటికి మరలిరాక రణోర్వియందు అతడు మరణించెను. అతడు వీరస్వర్గమున ప్రవేశింపకమున్నె బాలిక తలిదండ్రులు దివంగతులైరి. విపత్తుననుసరించిన విపత్తు బిడ్డల నిరువురను మార్కొనినది. దుర్భరదుఃఖముచే క్రుంగియున్న బాలిక చితినెక్కి తనపతియేయని నమ్మిన యోధుని వీరస్వర్గమున గలసికొనవలెనని యుద్దేశించినది. కాని తన చిన్ని తమ్ముడు దిక్కుమాలినవాడై ప్రపంచమున నల్లాడుననుతలంపు ఆమె మానసమును మిగుల వేధించినది. సైదోడుకై ఆత్మాహుతి పాలబడక ఆమె తన తనువును నిలుపుకొనినది.

వయసు వచ్చినకొలది బాలకుని హృదయమున జిజ్ఞాస సమధికము కాదొడగినది. ఆకాలమున దాక్షిణాత్యమున రాజాదరము నందుచుండిన జైనమత మాతనిమానసమ్ము నాకర్షించెను. కొండొక జైనసన్యాసివలన నుపదేశమంది బాలకుడు జైనమతావలంబియై జైనమతగ్రంథములను పఠించి అనల్పమైన అభిజ్ఞానమును సంపాదించినాడు. ఆర్యావర్తమున జైన బుద్ధ మత

ములకు కేంద్రస్థానమై యొప్పిన పాటలీపుత్రమునకు పదపడి ఆతడరిగెననియు, తన ప్రజ్ఞను ప్రభావమును అచట ప్రకటింపజాలెననియు, జైనసంఘమునకు ఆధ్యాత్మిక అధినేతగా నెన్నుకొనబడెననియు నొకగాథ తెలుపుచున్నది.

తమ్ముడు దూరస్థుడై జైనమతావలంబియగుటచే అక్కకడుపు తఱుగుకొని పోయినది. చితియందు పడక ఎవ్వానికొఱకై ఆమె మనుగడ గడప నిశ్చయించినదో ఎవ్వానిపై నైదుప్రాణములు నిలిపి తాను పుడమిపై నిలిచి యున్నదో ఆతడు తనను తనమతమునుకూడ బాసిపోవుటచే నామె పరితాపము దురంతమైపోయినది. స్వగ్రామమునువీడి కెటిలామ్ నదీతీరమందలి తిరుఅతికై యనుశివక్షేత్రమునకు పోయి పరమశివుని సేవింపగడంగినది. కాని తమ్ముని గుఱించిన దుఃఖము ఆమెహృదయమును బాసిపోలేదు. తమ్ముని పునరాగమున మునకై ఆతురపాటున పశుపతి నామె ప్రార్థింపసాగినది.

ఆభక్తురాలి యీారెలుంగు ఉమాపతి చెవులబడెను. ఆమెప్రార్థనము ఫలోపేతమైనది.

ఆమె యనుజుడు పాటలీపుత్రమున సంతోషసాగరమున నోలలాడుచుండెను. తన సోదరిని తనమతమును తనయూరును మఱచినాడు. ఆకస్మికముగా వాని యుదరమున దుస్సహమైన బాధ కలిగెను. చుట్టుగల జైనసన్యాసులాబాధ నుడుప నెన్నో వెరవులు గోసిరి. మంత్రములుచ్చరించి మాటిమాటికి వాని కాయమును నెమలికన్నులతో స్పృశింపసాగిరి. దారుణ మరణబాధయే తన్నుపట్టి పీడించుచున్నదని ఆతడెంచినాడు. అయాతనమున వానికి దిక్కులేని యక్క వానికి జ్ఞప్తికి వచ్చినది. వానికన్నులనుండి యశ్రువారి గంగాస్రవంతివలె జాల్వారసాగెను. ఒకపర్యాయము తనకడకు రమ్మని సోదరి కాతడు ఒక పరిచితునిద్వారా కబురు పంపినాడు.

ఆకబురువలన దమ్ముని దుస్థితి యెట్టిదో ఆమెకు తెలియలేదు. జైనులువసించు తావలమున తా నడుగుపెట్టననియు, జైనమతస్థుని ముఖమును తానుజూడననియు నామె ప్రత్యుత్తరము నంపెను. సోదరియుద్దేశ్య మెద్దియో గ్రహించుటకు వాని కాలశ్యము కాలేదు. జైనమతమును త్యజించి స్వీయ ప్రాచీనమతమును స్వీకరించి స్వస్థానమునకు మరలి సహోదరియాదరానురాగములను పడయవలెనని ఆతడు నిశ్చయించినాడు. ఒకనాటి నడిరేయిని లేచి

జైనమతానుసారముగ దాను ధరించియుండిన వలువలను, భిక్షాపాత్రమును నెమలికన్నులను పాఱవైచి నిజసీమదెస బయనమైనాడు. మార్గాయాసము వలన కడుపులోని యాతనము అధికమైనది. దుర్దాంతమైన బాధ నోర్చుచు బోయిపోయి తిరుఅత్తికైలో వసించుచుండిన అక్కపాదములపై పడి "నే నీ యాతనము నింక సహింపజాలను. నిన్నుమఱచి మనమతమును మఱచి ద్రోహి నైతిని. అక్కా! నన్ను మన్నించి కాపాడుము" అని యాత డామెను వేడు కొనినాడు. తమ్ముని పాటు చూచినపుడును, దీనోక్తులు వినినపుడును ఆమె గుండెయందు దుఃఖసింధువు పొంగి పొరలినది. అశ్రుజలము లవిరళములై స్రవింప నామె సాదరమున సోదరుని చరణద్వంద్వమునుండి లేవదీసి సైదోడు నొసలున భస్మము బూసి, వానిని గర్భాలయములోనికి గొనిపోయి మహా దేవుని మ్రోలసాగిలపడి ప్రార్థింపుమని నియోగించినది. సోదరియాన నొదల దాలిచి ఆత డట్టులే కావించెను. భక్తిపూర్వకముగా పరమశివు నాతడు ప్రార్థించి లేచినంతన వానినిపట్టి పీడించు యాతనము అదృశ్యమయ్యెను. ఆనందోద్వేగముతో వానిగుండె నిండిపోయినది. తోడనే మధురగేయముతో పశుపతి నాతడు ప్రస్తుతింపసాగినాడు. ఆతని రచనములందిది మిగుల నుత్కృష్ట మైనదని యనేకుల యభిప్రాయము.

దక్షిణభారతమున కొలేరూన్ నదికి నుత్తరమందుగల జిల్లాలపుడు పల్లవుల పాలనమందున్నవి. పల్లవు లపుడు బలసంపన్నులై యుండువారు. కదవ యను నాత డపుడు ఏలికయై యుండెను. అతడు జైనమతమును స్వీకరించి నాడు. రాజధానిలోని జైనమతస్థులు అప్పాస్వామి తమమతమునుండి దూర స్థుడైన యుదంతమును తమమన్నీని కెఱింగించి యువస్వామిని బహుభంగుల బీడింపుమని వానిని ప్రోత్సహించిరి. తనమంత్రికి కొందఱు జోదులను తోడిచ్చి అప్పాస్వామిని తనమ్రోలకు గొనిరమ్మని ఏలిక వాని నాజ్ఞాపించెను. అనుచర సహితుడైన సచివుడు తత్క్షణమె తిరుఅత్తికై జేరినాడు. వారియుద్దేశ్య మెఱిగి తాను మహాదేవుని ఆజ్ఞను మాత్రము పాలింతునని, మర్త్యుడైన యేలిక ముదలకు దల యొగ్గువాడను గానని సుంతైన బీతిలేక భావబంధురమైన గేయ మందాతడు వారికి ప్రత్యుత్తర మొసగినాడు. ఏలిక యుద్దేశ్యమును మన్నింపు మని మంత్రి వానిని వేడుకొనినాడు. స్వామి కొండొకవడి యోజించి రాజును

శివమతావలంబిగావింప నిశ్చయించి సచివునివెంట గదలిపోయినాడు. పల్లవ రాజు బాలయోగిని పలుబాములందు పడద్రోసెను. ఒకమారు వానిని కాలుచుగాలుచున్న సున్నపుబట్టిలో బోర్లద్రోయించినాడు. కాని అనలము స్వామి కాయము నంటనేలేదు. మఱొక్కమారు వానిని సముద్రమున గూల ద్రోయించినాడు. గభీరసింధువున మునుంగక యోగి నీటిపై తేలియాడి తిరుప్ప తిరిపులియూర్ తీరమును నిరపాయముగా జేరుకొనినాడు. శివకారుణ్యము నుగ్గడించుచు అప్పాస్వామి రచించిన గేయములు కొన్ని యీ యత్యాచారములందీవిపత్తులందు వానియవిచలిత చిత్తమునుండి వెడలినవియే! పదంపడి కెలిలామ్ నదిని దాటి అతడు స్వస్థానమును జేరుకొనినాడు. పల్లవరాజు అప్పాస్వామి మహిమను గుర్తించి, తనతప్పు నెఱిగి, జైనమతమును పరిత్యజించి, యోగివరుని శిష్యుడై శివమతమును స్వీకరించినాడు. తనరాజ్యమందలి జైన మందిరములను, మఠములను పడగొట్టించి వానిసామగ్రితో తిరుఅతికైలో మహోన్నతమైన శివాలయమును గట్టించినాడు.

స్వామిజీ జీవితమందలి ఈ సంఘటనము గణనీయమైనది. దీని నెఱిగి పాఠకులు జైనమతము జుగుప్సాగర్భితమైనదని నాటిదక్షిణాత్యు లెంచిరని తలపోయరాదు. కొన్నియంశములందు జైనబౌద్ధమతములు ప్రాచీనమతసంప్రదాయములను ప్రతిఘటించినను, అవి హిందూమతవిరోధులని తలచుట తప్పు. కర్మసిద్ధాంతమును అహింసామహత్త్వమును, ఆత్మసంయమమందలి పటుత్వమును, పరార్థజీవితమందలి మహాత్మ్యమును ఈ మతములన్నియు నైక్యకంఠమున నుగ్గడించినవి. జైనబౌద్ధమతములు నిర్వాసితములైనను వానిప్రబోధ మహత్త్వము దాక్షిణాత్యమునుండి యంతర్హితము కాలేదు. తమిళనాగరకత యందిది వెలసినది.

స్వస్థానమునకు మరలిన పిదప, సోదరితో కొంతకాలమును గడపి, తీర్థసేవకై వెడలిపోయెను. తొలుత నాతడు చిదంబరమును దర్శించినాడు. చోళ రాజుల భక్తిశ్రద్ధలను వడయుచు చిదంబరక్షేత్రము విశేషప్రశస్తి నందుచు ప్రజలహృదయముల నాకర్షించుచున్నది. చిదంబరమందిరమున నధివసించి అప్పాస్వామి ఉద్వేగభరితములైన గేయములను భక్తిపూరితములైన పద్యములను రచించెను. ప్రజలనేకులు వీనిని కంఠస్థలములు గావించుకొనిరి. అనంతర

మాతడు కావేరీనది కిరుకట్టులందుగల శివక్షేత్రము లన్నింటిని సేవించినాడు. వీనిలో ముఖ్యమైనది, తంజావూరుజిల్లాలోని షియాలీ.

ఈ యాత్రయందే తింగలూరులో అప్పాస్వామి అప్పూధి యను విప్ర సాధువును దర్శించెను అప్పాస్వామి వెల్లాలకులజుడని తలంపక ఈసాధువు ఆతనిని విశేషముగా గౌరవించి యాతిథ్యమొసగెను. ఈయోగుల సమావేశమున నొక విచిత్రసంఘటనము జరిగినది.

అప్పుడీసాధువు తనయుడు త్రాచుపాము కాటువలన మరణింపగా అప్పసాధువు తన మంత్రప్రభావమువలన వానిని బ్రదికించెనట. స్థానస్థానములందు అప్పాస్వామి బహుళ సత్కారములను వడసినాడు. స్వామిజీ మనియుండగనే ఆతని మహిమాతిశయములను ప్రజలు గుర్తించిరని ఈ సత్కారములు చెప్పక చెప్పుచున్నవి.

అప్పాస్వామి పిదప తిరుఆరూరు (తంజావూరు జిల్లాలోని ఫుడిచి తిరివాలూరన బరుగుచున్నది.) పోయి అందుండిఆదూరమందలి పుంపకాలూరును జేరుకొనెను. తరువాతకూడ స్వామిజీ తనయాత్ర సాగించినను, ఈ తావును తన జీవితాంతమువఱకును స్థిరవాసము గావించుకొనినాడు. ఇందే బహుళ సన్యాసులతో నాతనికి పరిచయము కలిగినది. సంబంధరస్వామినిగూడి తిరుఆరూరునకు దక్షిణమునగల క్షేత్రములను అప్పాస్వామి మరల సేవించెను. వీనిలో ముఖ్యమైనది వేదారణ్యము. (తంజావూరు జిల్లాలోనిది) ఇచట నొక పురాణదేవాలయపు తలుపులు చాలకాలమునుండి మూయబడి యున్నవి. వేదములు స్వయముగ వచ్చి ఈయాలయమున పార్వతీశు నొకప్పుడు సేవించుచుండెడివట. వెనుకటివలె నిపుడవి ఉమాపతిని పూజించుట మానివేసెనట. స్వాము లిరువురు ఆలయసమ్ముఖమున నిలిచి దృశ్యమును పరికించిరి. బంధిత కవాటములచెంత నిలిచి సంబంధస్వామి వేడికోలును మన్నించి అప్పాస్వామి మధురమంజుల స్వరముతో పశుపతిని ప్రస్తుతింపసాగినాడట. పదవ గేయము నాతడు ముగించునప్పటికి మందిర కవాటములు తమంతదాము తెరచుకొనెనట! పిదప సంబంధస్వామికూడ నొక గేయము నాలాపించెను. ఒక్కొక్క చరణము నుచ్చరించునప్పటికి గుడితలుపులు తమంత దామొకపర్యాయము తెఱచుకొని రెండవపర్యాయము మూసుకొని మరల తెఱచుకొని అనంతరము మూసుకొన

సాగినవట. స్వామిజీ పాటపాడుసంతసేపు ఈరీతి వింతయాచరణము జరుగ దొడగినదట! ఆకాలమున వేదములును ఉపనిషత్తులును పడసిన నిరాదరను నీకథ సూచించుచున్నది.

అప్పాస్వామి తిరుప్పన్తుకుతి (తంజావూరు జిల్లాలోనిది) లో వసించు చుండగా నొకనాడు సంబంధస్వామి పాలకినెక్కి యచ్చటి కరిగెనట. స్వామిజీ శిష్యులే శిబికను మోయుచుండిరి. యోగీంద్రుని యాగమనమును ముందే విని అప్పాస్వామి కొంతదూరము ఎదురేగి తానును పల్లకిక్రిందజేరి శిష్యబృంద ముతోపాటు దానిని మోయసాగినాడట. గ్రామమును సమీపించినపిదప సంబంధస్వామి "అప్పాస్వామి యెక్కడ?" అని ప్రశ్నించెను. "స్వామీ! నేనిందేయున్నాను పాలకి మోయుచున్నా" నని ప్రత్యుత్తర మొసగినాడట. ఆపలుకులు విని సంబంధస్వామి మిగుల దొట్రుపడి చివాలున పాలకినుండి నేల మీదికి లంఘించి, ప్రణయబాష్పములు విడుచుచు ఆతనిని కవుగలించు కొనెనట.

చదువరులారా! గ్రహించితిరా ఈ సంఘటనమందలి మహత్త్వము? మహాత్ము లనవరతము వినమ్రులై యుందురు. ఎక్కువ తక్కువ యనుతలంపు ఎన్నడును వారితలయందు తలయెత్తదు. తమశిష్యులను తమభక్తులను సేవిం చిన మహనీయులు కలరు. భక్తప్రవరుడైన బ్రాహ్మణుని పాదములను శ్రీకృష్ణు డొత్తలేదా! తనయంతేవాసులచరణముల నేసుక్రీస్తు సేవించెనని బైబిలులోన కొండొక యుదంతము తెలుపుచున్నది. అసంఖ్యాకుల ప్రణతులను పడయు అప్పాస్వామి సంబంధస్వామి పాలకినిమోసి తనవినయగరిమను చూపుటయందు అక్కజమేమున్నది? సంబంధస్వామి అప్పారుతో కొంతకాల మాపల్లెయందే వసించెను. జైనులను తాను జయించిన యుదంతమును మధురను పాలించు పాండ్యరాజును ఆతనిమూలమున ననేకులను శివమతస్థుల గావించిన తెఱంగును సంబంధస్వామి అప్పారునకు పూసగ్రుచ్చినట్లు తెలిపెను.

శైవవిజ్ఞానమును హృదయంగమము గావించుకొనుటకై అప్పాస్వామి ఆర్యావర్తమున పరిభ్రమణము గావించెను. అంతియ కాదు. పశుపతి మనికిపట్టైన కైలాసపర్వతము నధిష్ఠింపగడంగినాడు. విశేషమైన శ్రమకోర్చి ఆతడు పర్వతమందలి కొంతభాగమును ఎక్కినాడు. అపుడు అశరీరవాణి ఆతని

నుద్దేశించి " హే! భక్తప్రవరా! నీవు శిఖరాగ్రము నధిష్ఠింపనక్కఱలేదు. కావేరీతీరమందలి తిరుయియారు (తంజావూరు జిల్లాలోని యిప్పటి తిరువాడి) పోయి శివునిగుఱించి తపముచేయుము చరితార్థుడవు కాజాలుదువు" అని పలికెనట. స్వామిజీ యట్లే యొనరించినాడు. కావేరీకూలమున నాతడు తప సొనరించుచుండగా నుమాసహితుడై మహేశుడాతనికి ప్రత్యక్షమయ్యెనట. భక్తిపారవశ్యమున తన్నుదాను మఱచి పార్వతీపరమేశులను బహుభంగుల బ్రస్తుతించుచు నానమయమం దాతడెన్నో గేయములను రచించినాడట.

అప్పాస్వామి సంయమశక్తిని పరీక్షించు ప్రలోభములు తఱచుగ నాతని కట్టెదుట గన్పట్టినవి. ఒకప్పుడు పుంపకాలూరులోని శివునిసేవింప నాతడు గడంగినంతన ఖిహిపసిండియును వజ్రవ్రజమును వాని చరణోపాంత మున గోచరించెను. వానిపై రెండవచూడ్కి నిగిడింపక యోగీవరుండు భక్తి తత్పరుడై మహేశునకు మనసిచ్చి పూజాదులను నిర్వహించెను. మఱొక మాఱు గంధర్వభామినులు కొందఱు వానిముందర నవతరించి వానిచిత్తమును చలింపజేయ బహుధా ప్రయత్నించిరట! కాని సంయమీంద్రుడు కన్నెత్తి యైన నాయందకత్తెల జూడక పశుపతిని ప్రస్తుతింపసాగెనట. వితథమనోరథ లైన అచ్చరచానలు నిట్టూర్పులు నిగిడించి నిజనిలయములకు తరలిపోయిరట.

హాలముబోలు పనిముట్టు నొండుస్కంధసీమ నిడికొని ఆలయ ప్రాంగణము లందు ప్రవేశించి అందును మందిరభిత్తికలందును అందును ఇందును పెరిగిన కసవు నాతడు తొలగించివేయువాడు. వేదచోదితమైన సేవలలో నిదిమూడవ దని తాత్త్వికులు తెలుపుచుందురు. ఆంతరంగికమైన సేవ తొలుతటిదని వాగ్రూపమైన సేవ రెండవదని, శారీరకసేవ మూడవదని వారు వాకొనుచుం దురు, దక్షిణభారతమందును సింహళద్వీపమందును దోచు అప్పాస్వామి ప్రతిమలం దీపనిముట్టుకూడ కానవగును. హాలమును హాలమునకు సంబంధించిన పనులును స్వామిజీకి మిగులగూర్చునవని పూర్వోక్తయుదంతము రూఢిచేయు చున్నది. ఈయోగివరుని రచనములను పరిశీలించినపుడు ఆతని కృషికపరి జ్ఞానము అనల్పమైనదని గ్రహింపగలము. ఈతడు భాగవతుడును, కవియును, కర్షకుడునని తెలుపు టొప్పు. కబీరు సాలెవాడుకాడా? బొహీమ్‌యోగి పాదరక్షలుచేయు నిమ్నజాత్యుద్భవుడుకాడా? వీరి శారీరకకృషి వీరి భావనా

శక్తికిగాని గభీరయోచనమునకుగాని యడ్డుకట్టుకాలేదు. దక్షిణసీమస్థులైన సేవ్యకాంధ్రు పల్వురు ఈశ్వరభక్తులని యెఱుంగుదుము.

అప్పాస్వామి పద్యములును, గేయములును కలసి మున్నూఱు కలవు. ఇవి మూడు గ్రంథములం దున్నవి. తమిళ శైవవాఙ్మయమున "తిరుమురై" యని ప్రతీతినందిన పండ్రెండు గ్రంథముల సంపుటిలో నీ మూడును గలవు. తీర్థస్థానములందు తాను సేవించిన దేవుళ్ళ నుద్దేశించి స్వామిజీ రచించిన గేయము లిందు బహుళములు. మనదేశమున యాత్రకు సంబంధించిన వాఙ్మయము లేదుగాని యాత్ర తమ జీవితమందలి ప్రధానాశయమని యెంచినవారనేకు లుండుటచేతను, ఈభక్తులందు కొందఱు కవిత నెఱిగినవారగుటచేతను, స్థాన స్థానములందు వెలసిన దేవతలను గుఱించిన యుదంతములును సంస్తవ వృత్తాంత ములును బహుళముగ మన సీమయందు గలవు.

అప్పాస్వామి రచనలను మనము పరిశీలించినపుడు అవి తాత్త్వికసంపద తోడను మతవిజ్ఞానముతోడను శుందిలమై యున్నవని గ్రహింతుము. ఈశ్వ రుడు సర్వాంతర్యామి యనియు ఆతడు మనుష్య హృదయమందును వసించు ననియు స్వామిజీ విశ్వసించెనని గ్రహింపగలము.

మతమునకును సాహిత్యమునకును తత్త్వశాస్త్రమునకును జీవితవిధా నమునకును అవినాభావసంబంధము కలదని స్వామిజీ జీవనోదంతము చెప్పక చెప్పుచున్నదికదా! ఉదాత్తమై భావోద్వేగము కళయందు ఆత్మప్రకాశము గాంచును. ప్రసూనము గంధబంధురమైనట్లు పూతచరిత్రము గంభీరభావవిల సితమై యుండును. ఈభావములు సాహిత్యకలయందేకాదు తోడ్తోడన శిల్ప కళయందును వ్యక్తమయ్యెనని దక్షిణదేశ వైజ్ఞానిక చరిత్ర తెలుపుచున్నది. శైవ వైష్ణవ మతములును భక్తిభరిత కవిత్వమును భావబంధురశిల్పకౌశలమును దక్షిణభారతమున నవార్యమైన విద్యముతో వఱలినవి. దక్షిణయాత్ర సలిపి మహోన్నత దేవాలయములందును దేవవిగ్రహములందును మునిమూర్తులం దును వెలయు శిల్పవిభవమును విలోకించు విజ్ఞానులు గభీరపరిశోధనమునకు గడంగిరేని పూర్వోక్తమైన విద్యమందలి సత్యమును గ్రహింపజాలుదురు. అప్పాస్వామి సంబంధస్వాములబోలు కవియోగుల జీవితోదంతములు కేవలము వ్యక్తుల చరిత్రములు కావనియు దాక్షిణాత్య వైజ్ఞానికచరిత్రయందలి ప్రధానా ధ్యాయములనియు వారెఱుంగగలరు.

---

# ౫౭

# వల్లభాచార్యుఁడు



" ఉ. గ్రుక్కెఁడు చేఁతిపాల్ శిశుత గ్రోలి యొసంగితి మోక్షసంపదన్
రక్కసి ; కారగించి మధురంబగు గుప్పెడు నివ్వరడుక్కలన్
మిక్కిలి బీదబాఁపనికి మేటిసిరుల్ ఘటియించి తీవు ; నీ
చక్కికి వచ్చినన్ సములు శత్రులు మిత్రు లయారె ! శ్రీహరీ ! "

మహాపురుషులును మహాభక్తులును మహాసంయములును ఒక రాష్ట్రమునకుగాని ఒక దేశమునకుగాని ఒకజాతికిగాని ఒకమతమునకుగాని చెందినవారని చెప్పుటతగదు. వా రన్నిజాతులకును అన్నిమతములకును అన్నిసీమలకును జెందిన మహనీయులు. వారి హృదయములు దిశావలయమునకు సహపాఠులు. వారిదృష్టి మానవకల్యాణముపై నిలిచియుండును. సర్వమానవులకును సమస్తయుగములకును వా రారాధ్యులు.

పరమాశయములమీఁదనుండి దృష్టి చెదరనీయక లోకాభ్యుదయముపై మనసుంచి అదర్శసిద్ధికై తోడుపడిన జాతిప్రాభవమును గుఱించిగాని మహత్తర జాతిసంప్రదాయము కతన మహిమోపేతులై పరార్థజీవులైనవారి ప్రత్యేక ప్రయత్నపరంపరను గుఱించిగాని తెలుపుతఱి సంకుచితభావమును ప్రకాశము గావించుచుంటి మని తలప జెల్లదు.

భారతభూమి నేలినమహీపతులకును బౌద్ధధర్మమునకును చేయూతనొసంగిన పూతచారిత్రులకును కన్నతల్లియై భారతనాగరకతను ఘనతర మొనరించిన ఆంధ్రమాత గౌరవమహత్త్వములను దలచినపు డేయాంధ్రుని హృదయము ఆనందోత్సాహములతో నిండుకొనదు ! ఆంధ్రజ్యోతి కేవలము ఆంధ్రభూమియందేగాక భారతభూమియందును అన్యసీమలయందును తేజరిల్లినది. చాణుక్య నాగార్జును లాంధ్రులు. సంస్కృతవాఙ్మయమున ఆఱితేఱిన ఆంధ్రకవివరేణ్యులు కొండఱు శతాబ్దులకు మున్ను అన్యరాష్ట్రములందు వసించి అనేకుల అదరానురాగముల నందిరి. భవభూతి ఆంధ్రు డని చారిత్రక పరిశోధనము తెలుపు

చున్నది. జగన్నాథపండితు డాంధ్రుడే. భారతమహాభక్తులం దొక్కరుండై ఘూర్జరసీమరాజస్థానములందు వైష్ణవమతప్రభావమును ప్రకటించి ఉత్కృష్ట సాహిత్యసృష్టికి మార్గదర్శకుడై గృహస్థాశ్రమమునుండి దూరీకృతుడుకాక ఆచార్యపరంపరకు జనకుడై వఱలిన వల్లభాచార్యుడు ఆంధ్రుడే.

వల్లభాచార్యుడును అతని తరువాతి వారును మతప్రచారము గావించు టకుమున్ను ఘూర్జరసీమరాజస్థానములందు వైష్ణవమతసిద్ధాంతము లెంతదనుక నాదరము నందినవో పరికించుట పాడి. ఇరువురు మహావ్యక్తులవలన నీసిద్ధాంత ములు బోధింపబడినవి. నర్సిమెహతా తొలుతటివ్యక్తి. ఇతడు ఘూర్జరదేశ వాసి; బ్రాహ్మణుడు; కవి; క్రీ. శ. 1415 నుండి 1481 వఱకు జీవించినాడు. తరువాత వర్ధిల్లినది మీరాబాయి. రాజపుత్రస్థానమున జన్మించిన మహాభక్త రాలు. క్రీ. శ. 1504 నుండి 1550 వఱకు జీవించినది. యశస్తిలకుడైన సూర దాసునామధేయమును కూడ నీసందర్భమున పేర్కొనుటపాడి. ఈతఁ డంధుడు, ఆగ్రావాసి. పదునేనవశతాబ్దమున ప్రసిద్ధినందినకవి. ఇతడు వల్లభాచార్యుని యనుచరులలో నొక్కండని గ్రియర్సన్ మున్నగువారు తెలిపిరి. కాని యీ యాచార్యునికి ముందే సూరదాసు వఱలె ననుట కాధారములు కలవు.

## నర్సిమెహతా

కథియవార్ లోని తలజాయం దీతడు నగరబ్రాహ్మణులయింట బుట్టి నాడు. ఈతనికులమువారు వేదాధ్యయనపరులు. మహావిజ్ఞానులు. కళారాధ నమునందును కదనాంగణమందును అందెవేసినచేతులు. ప్రతిభావంతులందు పుట్టినను మెహతా సోమరులందు శిరోమణియయ్యెను. పుస్తకములదరికి పోవు వాడు కాడు. పెండ్లిమీదికి వీనిబుద్ధి పోనేపోలేదు. తండ్రి పరమపదించిన పిదప సోదరునితో గలసి జూనాగడమున వసించువాడు. అన్న పెండ్లాము చూపిన అనాదరము వీని మనసును వికలచివైచెను. ఆముహూర్తమందే ఈతని యంత రంగమున నద్భుతమైన పరివర్తనము పొడసూపెను. జిజ్ఞాసువై ఈశ్వరోపాసన మున సిద్ధహస్తుడాయెను.

మానసికయాతనము భావప్రసవిని యని తెలుపజెల్లును. నిత్యసంతృప్తి పురోభివృద్ధికి సంకిలి యగుచుండును. గుండె కదిలినపుడే నిదురించుచున్న అంత

రంగికశక్తులు మేల్కొనును. కఠోరానుభవ మిచ్ఛాశక్తికి పని కల్పించును; నరకము దాపున నిలిచిన మానవునిచే ముందంజవేయించి స్వర్గద్వారమున జేర్చును. పిశాచమునకు క్రీతదాసైనవానిని భాగవతులందు తలమానిక మొన రించును. కారుణ్యనిధియైన జగదీశుడుకష్టములను దుఃఖములను మాటిమాటికి కొందరిమీదికినేల పురికొలుపునో యోజించితిరా ? అగ్నిపరీక్షయందువారినేల నిలుపునో తలపోసితిరా ? తీవ్రానుభవములు పాపాత్ములను పుణ్యాత్ములగావించి నవి. ప్రపంచవైజ్ఞానికచరిత్రలను పరిశీలించినపుడు మన కెంతేని భావసామగ్రి లభించును.

తొలుత నర్సీమెహతాకు శివపూజయందు మక్కువ యుండెడిది. కాని కొండొక యద్భుతసంఘటనము వీనిని కేశవభక్తు గావించె నట. కాలక్రమ మున నీతడు విష్ణుసంస్తవమున నాఱితేరినాడు. ఈ సంస్తవము నీతడు మధుర కవిత్వమున నలుపువాడు. ఈతనిగేయములు భక్తిభరితములైనవి. నేడు గుజ రాతులో నివి యింటింట బాడపడుచుండును. శ్రీకృష్ణకారుణ్యమే వీనికి ఉత్కృష్టసాహిత్యశక్తిని ప్రసాదించెనని వీనిగేయములను భవ్యభావపూరితము లొనరించెనని పదునేడవశతాబ్దిలో కవియై పరగిన ప్రేమానందభట్టు వచించి నాడు.

వివాహితుడైన పిదప మెహతా కొకకూతురు పుట్టెను. క్రమక్రమముగ నీతని నెన్నోకష్టములు మూరొకొనినవి. ఈతని స్వజాతీయులే వీనిని ముప్పు తిప్పలు బెట్టిరి. మెహతా దురంతదారిద్ర్యమునకు గుఱియైనాడు. దుహితపరిణ యమునకై ఈతడు పెక్కుపాట్లు పడవలసివచ్చెను. తనయ కన్వర్ భాయిని వెంటగొని స్థానస్థానములందు మసలినాడు. ఈతని సహనశాంతులును భక్తి శ్రద్ధలును ప్రేమానందభట్టుహృదయమును భావోద్వేగముతో నింపివైచెను. కావుననే మెహతా జీవితమహత్త్వము నుగ్గడించుచు భట్టు చక్కని పద్య మును రచించినాడు.

నర్సీమెహతా తన యరువది యాఱవయేట బరమపదించినాడు. కృష్ణ జీవితమును కీర్తించుచు కృష్ణలీలలను వర్ణించుచు గుజరాతీభాషయం దీతడు ఎన్నోపద్యములను గేయములను రచించినాడు. సులభశైలితో నొప్పుచు సౌందర్యసందీప్తములై రసపూరితములై భక్తిభరితములై అవి యసంఖ్యాకుల

నలరించినవి. స్మారకచిహ్నముగా జూనాగడమున నర్సిమెహతా విగ్రహ మొకటి నెలకొలుపబడినది. ఈతని దుహితవిగ్రహము ద్వారకయందు స్థాపింప బడినది.

## మీరాబాయి

ఈమె రతనసింగు అను రాజపుత్రుని తనయ. రతనసింగు రాఠోరు వంశీయుడు. రాజస్థానమున బికనీరు యోధపురముల నడుమగల మెరాటా యాతని వానస్థానము. మీరాబాయి క్రీ. శ. 1504 లో పుట్టినది. ఈమెతల్లి భక్తురాలు. కృష్ణసేవయం దామెకు మక్కువ యెక్కువ. తల్లిదృష్టాంతము మీరాబాయికి మేలుబంతియాయెను. క్రీ. శ. 1516 లో మీవారు యేలికయైన రాణాసింగుని తనయుడైన కన్వర్ భోజరాజునకును ఆమెకును వివాహ మయ్యెను. పాణిగ్రహణమహోత్సవము అతివైభవముగ జరిగెను. పరిణయానంతరమున భోజరాజు మీరాబాయిని చిత్తూరు గొనిపోయెను. రసపుత్రరమణులందు శిరోమణియైన ఇల్లాలు సర్వజనాదరము నందినది. పరిణయమైన కొంతకాలము వఱకు మీరాబాయి సుఖముగ జీవితమును కడపినది. ఆమెకును ఆమెపతికిని కవిత్వమునెడల నెంతేని మక్కువకలదు. అవలీలగ నిరువురును భావబంధురముగ గేయములను రచించువారు. కాలము కడచినకొలది ఇరువురభావములందు వ్యత్యాసము పొడసూపినది. ఈశ్వరచింతయును సర్వమానవముక్తియును మీరాబాయికి ప్రీతికరములు. సామ్రాజ్యకాంక్ష యశోవిభవము ఐహికోన్నతి భోజరాజుచూడ్కిలో తేజరిల్లిన ఆశయములు. ప్రత్యేకాదర్శముల ననుసరించియే వారి రచనలు నడచినవి.

తొలుత మీరాబాయికి భోజరాజు సంపూర్ణస్వాతంత్ర్యము నొసంగెను. క్రమక్రమముగ నంతఃపురశృంగార మామెమనసున వెగటుబుట్టించెను. అలంకారములను పట్టుపుట్టములను ఆమె పరిత్యజించి వైచినది. సుఖభోగములకు నీరువదలినది. కావిశాటువులు ధరించినది. హంసతూలికాతల్పమునుండి కడచి కృష్ణాజినముపై మేనుజేర్చుచుండెడిది. పరిచారికల కందఱకు తన గేయములను చెప్పి తానుపాడి వారిచే వానిని పాడించుచుండెడిది. రాజప్రాసాద మామెకు కైదుగా తోచెను. పృథ్వీసమక్షమున నిలిచి కృష్ణసంకీర్తన మొనరింపవలెనని

ఆమె మక్కువపడినది. అసంఖ్యాకుల సమ్ముఖమున నిలిచి కృష్ణమహాత్మ్యము నుగ్గడింపవలెనని ఆమె యువ్విళ్ళూరుచుండెను. తఱచుగ నామె కృష్ణమందిరము నకు పోవుచు హరిభజనము చేయుచుండెడిది. పట్టరాని ప్రమోదముతో తన గేయముల నాలపించుచుండెడిది. పరమానందముతో తన్మయ నృత్యము సలిపి పదపడి ఆత్మవిస్మృతయై పడిపోయెడిది. పలుమాఱు అద్భుతానుభూతినందు చుండెడిది. రాజస్థానమునందలి భిన్నభిన్న ప్రదేశములనుండి ఎండ తెండలతో వచ్చి కృష్ణమందిరమున గుంపులుగాకూడి ఉద్వేగభరితములైన ఆగేయములకు వీనులొగ్గి తాము తన్మయులై పవిత్రజీవితములు గడప కృతనిశ్చయులగు చుండువారు.

భార్య జీవితవిధానము రాణా కిష్టములేకుండెను. తఱచుగ నాలయము లందే వసించుటయు సన్యాసులతో మెలంగుటయు నాతని హృదయమునకు బాధకలిగించెను. "రాజవంశమున బుట్టినదానవు. రాజ్ఞివి. బిచ్చమెత్తుసన్యా సులతో మెలంగెదవేల ? నీప్రవర్తనము వంశమర్యాదకు భంగపాటుకు నీకు కళంకమును తెచ్చుటలేదా ? వివేకివై యేల మెలంగుచుంటివి కావు ?" అని సన్నిహితులు లోకరామెను ప్రశ్నించిరి. "సన్యాసులసంసర్గము వేయిజన్మల కళంకమును మాపుచేయును. ఆమహాత్ములనుండి దూరముగ నిలిచినయామె కే కళంకము కలుగును ?" అని మీరాబాయి ప్రత్యుత్తర మొసగినది.

రాణా ఆగ్రహమంతకంతకు అధికమాయెను. అంతఃపురమునుండి మీరాబాయి బహిష్కరింపబడినది. సామాన్యాగారమున త్రోయబడినది. దాసదాసీలామెను చేరరాదను హుకుము జారీయైనది. ఈయనాదరమునకామె దుఃఖింపలేదు. కృష్ణచరణకమలములందు నిజాత్మను భ్రమరము కావించి మరంద పానమున చొక్కియుండెడిది. ఎట్టులైన నామెజీవితమును కడముట్టింపవలెనని పేదు పట్టుపట్టినాడు. "త్రాగు" మని యాజ్ఞాపించి ఆమెకడకు రాణా విష మును పంపెను. కృష్ణనామము నుచ్చరించుచు సంతోషపురస్సరముగ నామె యావిషమును మ్రింగెను. గరళమువలన నామెకు ప్రాణాపాయము వాటిలలేదు. "ఇందులో చక్కని హారముకలదు నీకొఱకై పంపితిని" అని వేదొక బంగారు పెట్టె నామెకడకు పంపినాడట. మీరాబాయి పెట్టెను తెఱువగనే క్రోధముతో బుసకొట్టుచు ఫణమెత్తి కాలసర్పమొకటి ఆమెపై నెగసి ఆమెగళమున పెక్కు

కాటులు వేసెనట. "హృదయేశుడుపంపిన చంద్రహారమిది" యని మీరాబాయి ప్రమోదప్రశాంతములతో నాభయంకరభుజంగమును చేకొని కంఠమున దాల్చినదట. పాముకాటు లామెప్రాణములను దీయలేకపోయినవి. పాము అల్లనల్లన ఆమె యొడలినుండి వెడలిపోయినదట. ఏవిధముగనైన నామె చావదని తేకు గ్రహించెను. "ఆత్మహత్య చేసుకొనుము" అను ఆజ్ఞాపనము నాత డామె కందజేసినాడట. ఆమె శోకపర్యాయము దర్శన మిచ్చుటకైన నాతడు సమ్మతింపలేదు. "ప్రముదితచిత్తముతో తమయాజ్ఞను పాలింతు" నని నిజేశునకు వినయముతో మీరాబాయి ప్రత్యుత్తరమంపెను.

ఏలిక ఆగ్రహమును సరకుచేయక రాజ్ఞిని దేవి యుల్లెంచుచు నామెను సేవించు పుణ్యాత్ములు కొందఱు కలరు. వీరి హృదయములకు బాధకలిగించుట కిష్టపడక వారు నిదురించునపుడు ఒకనాటి నడిరేయి నొంటరిగా వెడలి గాఢాంధకారములో నడచి నడచి ఒకానొక నదిని జేరి గట్టుమీదనుండి గభీర జలములోనికి లంఘించి పతియాన నామె పాలించినది. శీతలసలిలగర్భమున మునుంగుతఱి ఆమెహృదయమున ప్రశాంతభావమే వెలసినది. తనమానసము నామె కృష్ణచరణద్వంద్వమునకు లగించి యుంచెను. పదపడి ఏమిజరిగినదో ఆమె యెఱుగదు. కొంతసేపటికి మీరాబాయి కన్నులు తెఱచినది. తాను పడినచోటునకు విశేషదూరమున నేటిగట్టుపై పన్నుండియుంట నామెగుర్తించినది. అంతమెఱుంగని అందచందములకు నిధానములై నందనమునకు సైదోడులవడువున నగపడు బృందావనోద్యానములును రంగారు బంగారు పైరునీను కేదారములును ఆమె కన్నులపండు వొనరించెను. నగుమోములతో నిస్తబ్ధ భావమున నామె కవి స్వాగతమొసగెను. గట్టునుండి లేచి కృష్ణసంకీర్తన మొనరించుచు మహోత్సాహముతో మహోత్కంఠతో నాపూతచరిత ముందులకు సాగి బృందావనమున ప్రవేశించెను. అందే శేషించిన జీవితభాగమును కడపివేయ నామె నిశ్చయించెను.

చైతన్యస్వామి శిష్యుండును సుప్రసిద్ధుండునైన శ్రీరూపయోగి అత్తరి బృందావనమున వసించుచుండెను. ఆతడు మహావిద్వాంసుడు. తన్నెవ్వరైన సమీపించునపుడు "నీకు ముక్తి కావలెనా?" "కావలయునేని కామినీకాంచనములను కన్నెత్తి చూడకుము" అని యాతడు వచించుచుండును. ఆతని

యుదంతమును మీరాబాయి వినినది. బృందావనమున పూరుషుండొక్కఁడే కలడనియు ఆతడు శ్రీకృష్ణుడనియు అందువసించు తక్కుంగలవా రాతని యనురాగము నందుచున్నారు కావున గోపికలై వఱలుచున్నారనియు వ్రాసి భక్తిపూర్వకమైన తన సందేశమును ఆమె యోగిపాలి కంపెను. భావబంధురములైన ఆమెమాటలు యోగివరుని మిగుల నలరించివవి. ఆమెను చూడవలెనను మక్కువను స్వామి వ్యక్తీకరించెను, తోడనే యామె స్వామి సాన్నిధ్యమున కరిగెను. "బిడ్డా! నీకై నేను జేయవలసిన కర్తవ్యమేమో తెలుపుము" అని యోగి వచించెను. "జనకా! కృష్ణమందిరమున నాకు గూడ కొంతతావలమును దయచేయుము. నీ చరణోపాంతమున నధివసించి విజ్ఞానభరితములైన నీ వచనములకు కర్ణాంజలుల నొడ్డి మధురగీతామృతమును మనసారగ్రోలి యానందింపవలెనని ఉవ్విళ్ళూరుచున్నాను. నాకీ మనోరథసిద్ధి గలిగింప ప్రార్థించుచున్నాను." అని మీరాబాయి కరకమలములు ముకుళించి పలికినది. స్వామిజీ ఆదరానురాగములతో తోడన నామె వేడికోలును మన్నించెను. కొందఱు శ్రీరూపస్వామి యాచార్యుడనియు మీరాబాయి శిష్యురాలనియు తెలుపుచుండ నికకొందఱు ఆచార్యుడు కాక స్వామి ఆమె యంతేవాసియని వచించుచుందురు. వైజ్ఞానికాంగణమున, ఆధ్యాత్మికగోష్ఠియందు, వారిరువురు పరస్పరాభ్యుదయము నందిరని తలపవచ్చును.

ఎప్పటివలె సంకీర్తనమున మీరాబాయి కాలక్షేపము చేయదొడగినది. ధనికులును నిరుపేదలును, పిన్నలును పెద్దలును, స్త్రీలును పురుషులును, నాగరికులును జానపదులును, వీరును వారును అననేల ఎల్లఱును ఆమెను దర్శించి భక్తిభరితస్వాంతులై ఆమె దృష్టాంతము ననుకరించుచు నామె గేయములను కంఠస్థములు గావించి పరమపరితోషముతో వాని నాలాపింప దొడగిరి. వ్రజభాష వాడుకలో నున్న తావులందు — రాజహర్మ్యములందనుడు; క్షుద్రకుటీరములందనుడు — మీరాబాయి గేయములు ప్రతిధ్వనింప సాగినవి.

కొంతకాలము కడచిన పిదప రాణా పశ్చాత్తాపముకతన పవిత్రచిత్తుడై బృందావనమునకు కేదలిపోయి అర్థాంగిని నిజసదనమునకు గొనిపోయెను. అప్పటినుండియు వారు ప్రశాంతప్రమోదములతో భక్తివిశ్వాసములతో

మెలగిరి. ఆఱునెలలు చిత్తూరులోను, ఆఱునెలలు బృందావనమందును కాలక్షేపము చేయుచు శేషించిన జీవితభాగముల నాదంపతులు గడపిరి.

నర్సిమెహతా చిత్తమును మీరాబాయి హృదయము నాకర్షించినది తొల్లింటివైష్ణవమతమనుట నిస్సంశయము. దీనిని గుఱించిన వృత్తాంతము నెఱుంగుటకు వలసిన ఆధారములు చారిత్రకపరిశోధకులకు లభించలేదు. మన దృష్టినాకర్షించిన వ్యక్తులు నింబార్కయోగి ప్రబోధములను హృదయంగమ మొనరించుకొని యుందురు. నింబార్కయోగి క్రీ. శ. పదునాలుగవ శతాబ్దమున నార్యావర్తనమున వైష్ణవమతమును బోధించెను. కృష్ణసంస్తవమాతని ప్రబోధమున ప్రధానస్థానము నందినది. నింబార్కయోగియును ఆతని తరువాతయాచార్యులును ఆర్యావర్తమందలి మధుర (ముట్రా ను ప్రధానకేంద్రము గావించుకొనిరి. అందుండియే నాటి వైష్ణవమతసిద్ధాంతములు ప్రాచీ ప్రతీచి దిశలకు ప్రాకినవి.

ఔత్తరవైష్ణవమతమునకును, ఉదాత్తభావగర్భిత సాహిత్యమునకును ఆంతరంగిక బాంధవ్యము చేకుఱెను. మీరాబాయి యెట్టి కవయిత్రియో మెహతా ఎట్టికవియో పరిశీలించియుంటిమి. వంగదేశమున ప్రధానవైష్ణవాచార్యులు విజృంభించుటకుమున్ను వరలిన విద్యావతి చండీదాసులు సుప్రసిద్ధ కవులుకారా? వీరి గేయములందు గోపాలసంస్తవము సెలయేటిపాయవలె వెలారుచుండును.

మీరాబాయి మెహతాల దృష్టాంతములును గేయసంకీర్తనములును సహజముగ నుత్సాహపూరితులైన రాజస్థానవాసుల హృదయములను నూతన భావోద్వేగముతో నవ్యవైజ్ఞానిక విభవముతో నింపినవి.

వల్లభాచార్య ప్రభృతుల ప్రబోధములు విశేష సంస్కారమునందిన హృదయములందే వైష్ణవమతమహత్త్వమున కలవాటుపడిన మానసములందే ఇంకినవని తెలుపుట నాయాశయము.

మీరాబాయి ప్రభృతుల కాలమున సేవయును త్యాగమును ప్రాముఖ్యము నందినవి. తరువాత విగ్రహారాధనమును వ్యయభూయిష్ఠ పూజలును పెంపొందినవి. వీనివలన కొంత ప్రయోజనము చేకుఱలేదని తెలుపలేము. ఈయారాధనములును పూజలును ఘూర్జరసీమ రాజస్థానములందలి ప్రజాళి

హృదయముల నాకర్షించి వారి యాధ్యాత్మిక సాంఘిక సంబంధములను ఘనతర మొనరించినవి. ప్రభువులును దీనులును, సంపన్నులును నిరుపేదలును, వణిజులును వ్యవసాయదారులును, ఏకైకప్రార్థనమున కలసిమెలసి వర్తించిరి. రణోత్సాహమున నుప్పొంగు హృదయములందు ప్రశాంతభావము వెలసినది. రాజకీయ ప్రమాదములు ఘటిల్లినపుడు వారి హృదయములందు విశ్వాస ప్రమోదములు నెలకొనినవి.

పూర్వవైష్ణవమతము నెలకొనినపు డెట్టి సాహితీ సంచలనము తల సూపెనో వీక్షించితిమి. నూతన వైష్ణవమతము బలవత్తరమైనకొలది సాహిత్యకళయును తక్కుంగల కళలును విశేషాభివృద్ధి గాంచినవి. పశ్చిమ హిందీ రాజస్థానీ వాఙ్మయములు నవ్యభావ శబలతతోనొప్పి అనేకుల ప్రశంస నందినవి. బీహారీలాల్ రచనలును, ప్రాచీన గ్రంథానువాదములును నాటి భారత సాహితి యందు ప్రసిద్ధికెక్కినవి. చతుర్భుజదాసుమిశ్ర రచించిన "ప్రేమసాగరము" ఔత్తరాహుల హృదయములం దానందసాగరము నుప్పొంగించుట మన మెఱుగుదుము. నాటి రాజస్థాన చిత్రలేఖన మెట్టిదో చాలకాలము సభ్యజగతికి తెలియకుండెను. కాని దశాబ్దులనాటి పరిశోధనకతన దాని మహత్త్వము నేటి వసుంధరకు తెలియవచ్చెను. మధ్యయుగమున నైరోపాయందు విశేషప్రసిద్ధి నందిన ఇటాలియన్ చిత్రలేఖనమునకు పూర్వోక్త రాజస్థాన చిత్రలేఖనము సర్వవిధముల నీడువచ్చునదని ప్రపంచకళాపరిశోధకులు వాకొనిరి.

ఈయంశముల మనమున నుంచుకొనిన యనంతరము వల్లభాచార్యుని జీవితాశయములెట్టి వాతావరణమున పెంపొందినవో చక్కగ గ్రహింపవాలుదుము.

## వల్లభాచార్యుడు

### (క్రీ. శ. 1479–1531)

వల్లభాచార్యుడు లక్ష్మణభట్టు రెండవకొడుకు. లక్ష్మణభట్టుఆంధ్రబ్రాహ్మణుడు. నారాయణభట్టను సుప్రసిద్ధపండితుని సంతతిలో లక్ష్మణభట్టు నాలవ తరమువాడు. యజుర్వేదాధ్యయనమున నాఱితేఱినవాడు. తెలుగునేలలో "కంకరవ" యను పల్లెయందు వసించినాడు. పదునేనవ శతాబ్దమధ్యమున

వఱలినాడు. స్వప్నమందు శ్రీకృష్ణుడాతనికి ప్రత్యక్షమై "భక్తప్రవరా! నీవదృష్టవంతుడవు; నీకు ముగ్గురుతనయులు పుట్టెదరు. నేనే రెండవవానిగా నవతరింతును" అని వచించెనట. కాలక్రమమున నాతనిభార్య 'ఎలమగర' యను నామె గర్భవతియై కొడుకును గనెను. తలిదండ్రులు వానికి రామకృష్ణు డను పేరు పెట్టిరి.

లక్ష్మణభట్టు భార్య రెండవపర్యాయము గర్భవతియై యున్నపుడు, రామకృష్ణుని తోడ్కొని దంపతులు యాత్రార్థమై బయలుదేరిరి. ప్రయాగ యందు కొన్ని దినములు విడిసి అనంతరము కాశీపోయిరి. ఇంచుకకాల మచట సుఖముగ కడచెను. పిదప నొకనాడు కొందఱు హిందూసన్న్యాసులకును మహమ్మదీయులకును నడుమ తీవ్రమైనవాదములు చెలరేగెను. వాగ్వాదములు కలహమునకు దారిజూపినవి. దౌర్జన్యము రేకెత్తినది. రక్తము స్రవించినది. భట్టుప్రభృతులగుండెలు దడదడలాడినవి. భార్యను బిడ్డను తోడుకొని వార ణాసినుండి ఆతడు పలాయనమొనరించెను. పలాయన మొనరించుచు నొకనాటి యర్థనిశీథమున వారు చంపారణ్యమను తావును చేరుకొనిరి. కాననము భయం కరమైనది. భయమువలనను పథశ్రమమువలనను భట్టుభార్యకు తీవ్రమయిన నొప్పులు వచ్చినవి. ఎనిమిదవమాసమున నిర్జనమై భయదమైన వనమున ప్రసవ వేదనముచే పొగిలిపొగిలి యామె రెండవబిడ్డను కనెను. విక్రమశకము 1535 వ సంవత్సరమున (క్రీ. శ. 1479 లో) వైశాఖబహుళ ఏకాదశీభాను వారమునాడు వల్లభాచార్యుడు భయంకరగహనమున బుట్టినాడు.

మహాత్ముల జననోదంతములందు కొన్నికొన్ని విచిత్రములను చూపుట తొల్లింటి రచయితల యభ్యాసము. వల్లభప్రభృతుల పవిత్రజీవితగాథలతో నొప్పు "నిజవార్త" యను గ్రంథమున మన యాచార్యునిగుఱించిన విచిత్ర వృత్తాంతము కలదు. ఈతడు పుట్టినముహూర్తమున చంపారణ్యమున మహో న్నతమైన బంగారుమేడ యొకటి గోచరించెనట. దివినుండి దేవతలు పుష్ప వృష్టి గురియించిరట. కిన్నరులును గంధర్వులును మధురసంకీర్తనము గావించి రట. తమతమ విమానములందు పైనుండి అమరు లాయరణ్యమున దిగి పుట్టినబిడ్డను పలుమారు ప్రస్తుతించిరట.

పూర్వోల్లిఖితగ్రంథము చరిత్రము కాదని చదువరులు గ్రహించియే యుందురు. చరిత్రమందు కాదుకాని బుద్ధునిగుఱించిన పాళీకథలో నీరీతి విచిత్రోదంతము కలదు. పాఠకులు దానిని పదపడి పరికింపగలరు.

భట్టుదంపతులు చంపారణ్యమున భయకంపితులై ఇంచుకసేపు కడపిరి. బీతుకతన వారి మనసులు చెదరిపోయినవి. గుజ్జుగ పెరిగిన యొక చెట్టుక్రింద దట్టమైన ఆకులపై పుట్టినబిడ్డను పదిలముగ బెట్టి "ఈశ్వరా ! బిడ్డను కాపాడు భారము నీయదిసుమీ !" అని వచించి భట్టుదంపతు లాయరణ్యమును విడిచి వెడలిరట. అట్లుపోయి కొన్ని దినములలో వారు చౌదానగరు అను పట్టణము జేరి కొంతకాల మందు వసించిరి. ఇంతలో కాశీలో తిరిగి శాంతియుతమైన పరిస్థితులు నెలకొనెనను శుభవార్త వారిచెవులబడెను. మరల వారణాసి పోవలెనని నిశ్చయించి వారు పయనమైరి. తాము వచ్చినమార్గము నుద్దేశపూర్వకముగా ననుసరించి చంపారణ్యమున తమబిడ్డను విడిచినతావు నచిరములో చేరుకొనిరి.

వారచ్చోట నత్యద్భుతమైన దృశ్యమును వీక్షించిరట. భుగుల్భుగుల్మని లేచు అగ్నికీలలతో వెలయు గభీరయజ్ఞకుండమున వారి శిశువు పరమప్రమోదముతో నాటలాడుకొనుచుండెనట ! ఆచోటున నించుక తడసి విశ్రాంతిగొని ఫలము లారగించి తమబిడ్డను చేగొని వారు ప్రయాణము సాగించి కొలదిదినములలో కాశీ జేరుకొనిరి.

చంపారణ్యమున వల్లభుడు పుట్టినతావున ఆచార్యుని శిష్యులు ఏండ్లు కడచిన పిదప ఉత్సాహపూరిత మానసములతో నొక యాలయమును గట్టిరి. నేడును నాతావలమున నాగుడి వెలయుచున్నది.

కాశీకి మరలిన కొంతకాలమునకు భట్టుదంపతులకు మూడవ కుమారుడు పుట్టెను. తలిదండ్రులు వానికి కేశవుడను పేరు పెట్టిరి.

వల్లభునకు తలిదండ్రులు సకాలమున అక్షరాభ్యాసము జేయించిరి. నారాయణభట్టు అను నాతడు వాని తొలిగురువు. అక్షరాభ్యాసమునకై అతడు ఆంధ్రసీమయందలి స్వగ్రామమునకు పంపబడెనో లేదో తెలుపలేము. ప్రాయశః వల్లభుడు తొలియక్కరములను వారణాసియందే దిద్దియుండును. వ్రజభాషయందు వ్రాయబడిన వల్లభాచార్య చరిత్రమున అతని మేధాసంపదను గుఱించిన అద్భుతోదంతము కలదు. ఆతని గ్రహణధారణశక్తులు అని

ర్వచనీయములు. నాలుగు నెలలలోనే నాలుగు వేదములను ఆఱు శాస్త్రము లును పదునెనిమిది పురాణములును అతడు నేర్వజాలెను. ఇది యతిశయోక్తియే కావచ్చును. కాని వల్లభుడు ప్రాచీనవైజ్ఞానికశాఖ లన్నిటియందును అద్భుత పరిజ్ఞానమునందెననుట నిస్సంశయము. బాలకుడు పదునొకండవయేట తన తండ్రిని గోల్పోయెను. భట్టు పోవుకాలమున వాని కుటుంబము యమునా తీరమున గోకులలో వసించుచుండెను. తండ్రి పరమపదించిన మఱువత్సరము వల్లభుడు తల్లి యనుమతినంది ఆంధ్రసీమకు యాత్రార్థమై బయలుదేరెను.

పిన్నవయసువాడైనను మేధావియగుడు వల్లభుడు తన యాశయసిద్ధికై నాటినుండియే ముందంజవేయ దొడంగినాడు. వైష్ణవమతస్థాపనమాతని యుద్దేశము. తన ప్రయాణమున స్థానస్థానమున ఆగి తన సిద్ధాంతములను బహు సంఖ్యాకుల మ్రోల ప్రబోధించి పండితులతో చర్చలు సలిపి పలువుర నాతడు తన మతములో గలుపుకొనెను. ఆతని ప్రథమశిష్యులలో దామోదర దాసను నాతడొకడు. ఈతడొక యైశ్వర్యవంతుని తనయుడు. దక్షిణదేశస్థుడు. ఆచార్యునితో నీతడును పయనించెను.

వల్లభుని తల్లివైపు తొల్లింటి చుట్టములు తుంగభద్రాతీరమున విజయ నగరమున వసించుచుండిరి. దామోదరసహితుడై వల్లభు డచటి కరిగెను.

కృష్ణదేవరాయ లపుడు విజయనగరమును పాలించుచుండెను. ఈ రాజ న్యుని సర్వతోముఖప్రజ్ఞ ఆంధ్రులెల్లఱకు విశదమే. తనపరాక్రమము కతన తనరాజ్యమును విస్తీర్ణము గావించి ఈత డూరకొనలేదు. పరదండయాత్రల కతన దేశమున రాజకీయ స్వాతంత్ర్యము మాత్రమే కాక వైజ్ఞానిక స్వాతం త్ర్యము కూడ చెడునని యెఱిగిన దూరదర్శి కృష్ణదేవరాయలు. కావున మత పునరుద్ధరణకై ఆతడు నడుముకట్టెను.

నేడును హంపీ పోయి చూచితిమేని ఆమహానీయుని ఉత్కృష్టయత్నము లను దృష్టాంతీకరించు ఆలయములను కట్టడములను కాంచగలము. మతము నకును సాహిత్యమునకును గల అవార్య సంబంధమెఱిగి సాహిత్యాభివృద్ధికై పాటుపడి రెండవ భోజు డాయెను. సంస్కృత కన్నడ ద్రవిడ సాహిత్యములకు చేయూతనిచ్చుచు తా నాంధ్రుడగుడు, ఆంధ్రసాహితీప్రాభవమునకై విశేష కృషి సలిపి కృతకృత్యుడాయెను. తాను మహాజిజ్ఞాసువు కావున కవులను పండి

తులను ఆచార్యులను ఆహ్వానించి వారిని బహుభంగుల సన్మానించి వారి యుపదేశసుధాధారలకు మానసాంజలినొడ్డి ఆనందించువాడు. వల్లభస్వామి యాగమన మాతనికెంతో పరితోషము కలిగించెను. ఆంధ్రరాజన్యులలో తల మానికమైన ప్రముఖుడును ఆంధ్రయాచార్యులలో శిరోమణియైన మహాత్ముడును సమావేశమగుట జూడవలెనని ఆంధ్రమాత మిగుల యువ్విళ్లూరి యుండును. రాయలు భక్తిపూర్వకముగా వల్లభస్వామి నాహ్వానించెను. ఆసమయమున రాజసభయందు వల్లభస్వామికిని అద్వైతసిద్ధాంతము ననుకరించు శైవులకును గొప్పవాదము జరిగెను. వాదమున వల్లభుడే విజయుడయ్యెను. స్వామిచూపిన అద్భుత శక్తిసామర్థ్యములకు మిగుల నలరి రాయలు ఆతనికి వెండిబంగారములు పారితోషికములుగా విరివిగా నొసగెను. నగర మందలి కొండోక దేవాలయమున వెలసిన అమ్మవారికి రంగారుబంగారు వడ్డాణము చేయించుటకై రాజొసగిన విత్తమందలి విశేషభాగమును స్వామిజీ వినియోగించెను. కొంతభాగముతో తండ్రిచేసిన ఋణమును దీర్చివేసెను. నాలవవంతును మాత్రము తనయక్కఱలను దీర్చికొనుటకై చెంతనుంచుకొనెను.

వల్లభస్వామి విజయము అభ్యుదయగర్భితమయ్యెను. ఆప్రజ్ఞాధురీణుని వలన వైష్ణవమతము ఘనతరశక్తిని ప్రచారమును పడయునని విశ్వసించి వైష్ణవు లనేకులు ఆతనియండజేరి ఆతనిని తమయాచార్యుని గావించుకొనిరి. అప్పటినుండి వల్లభాచార్యుని ప్రభావమును, ప్రశస్తియును అధికము గాజొచ్చెను. ఒక్కచో నిలువక ఆచార్యుడు వైజ్ఞానికయాత్ర సలిపినాడు.

స్వామిజీ యాత్రను గుఱించి 'విల్సన్' అను ప్రసిద్ధగ్రంథకర్త యిట్లు వ్రాసెను.

"వల్లభాచార్యుడు ఉజ్జయినికిపోయి సిప్రా నదీతీరమున నొక యశ్వత్థ వృక్షము క్రింద విడసెను. అందాచార్యుని పీఠస్థానము నెలకొనినది. నేడును అది యందు వెలయుచున్నది. వల్లభాచార్య పీఠమని పిలువబడుచున్నది. అన్య స్థానములందుగూడ అతడు వసించెననుట కెన్నేని దృష్టాంతములు కలవు. మధుర సమీపమందలి కొండలందుకూడ వల్లభస్వామి పీఠముకలదు. చూనారు దుర్గమునకు సుమారు రెండుమైళ్ళదూరములో 'ఆచార్యఖండ' మను లోతు నూయి కలదు. దీనికి సమీపమున నొక మఠము కలదు. రెండును నొక దేవా

లయప్రాంగణమున విలసిల్లుచున్నవి. వల్లభాచార్యుడు కొంతకాలమిందు వసించెను."

అనంతరము మహారాష్ట్రమున కొంతకాలమున మసలి రాజస్థానమున స్థానస్థానములందు విడసి వైష్ణవమతప్రబోధము గావించి అనేక శిష్యుల నాతడాకర్షించెను.

వల్లభాచార్యుడు వఱలిన కాలమందే శ్రీచైతన్యస్వామి వెలసియుంట గమనింపదగిన యంశము. నదియాస్వామి క్రీ. శ. 1485 నుండి 1533 వఱకు మనియుండెను. ఇరువురు స్వాములును వైష్ణవమతాచార్యులే. కేవలము ఆధ్యాత్మికశక్తి యందే వీరు సిద్ధహస్తులని తెలుపజెల్లదు. ఆత్మశక్తికి తోడుగ హృదయశక్తికి సహకారిగ మేధాశక్తి పెంపొంది వీరి జీవితములందు సర్వతో ముఖవైభవమును ప్రకాశము గావించెను. వీరి వాదనప్రజ్ఞ వీరి వైజ్ఞానికోన్నతి కెనన్మైనది. ఏచర్చయందును ఏ రపజయము నెఱుగరు. మేటి విద్వాంసులు వీరి మ్రోల నతజానువులై తరలిపోయిరి. వీరి విజయము వీరి శిష్యసంఖ్యను వృద్ధిగావించెను. శ్రీవల్లభునివలె శ్రీచైతన్యుడును ఆంధ్రసీమయందు పర్యటన మొనరించి ప్రశస్తిగాంచెను.

పూర్వోక్తమైన వల్లభుని యాత్రయందలి కడపటితావు ప్రయాగ. అందుండి యాతడు వారణాసి చేరుకొనెను. తాత్త్వికమతపరిశోధనమందును ఘనతరవిజ్ఞానార్జనమందును కాశీయందు కొంతకాలము గడపి మరల యాత్రార్థమై వల్లభస్వామి బయలువెడలెను. ఈపర్యాయ మీతడుత్తరదిక్కుగ బోయెను. హరిద్వారముచేరి పుణ్యతీర్థములను సేవించుచు కాలక్రమమున బదరీనారాయణ కేదారేశ్వరముల దర్శించెను. మంచుమలయం దీతడు తొమ్మిదేండ్లు కడపెను. తదనంతరమందుండి మరలి బృందావనమును జేరుకొనెను. సౌందర్యశోభితమైన ఈతావునందే యాతడు విడియనిశ్చయించెను. తన తలిదండ్రులవలె యమునాశైవలినియందు గ్రుంకులిడి శ్రీకృష్ణుని సేవించి తరలిపోవుట కాతని చిత్తమియ్యకొనలేదు. మనుష్యహృత్ఫలకమందు స్వీయసిద్ధాంతములను వైష్ణవమతాశయములను నాటుట ఆతని మతమందలి ప్రధానోద్దేశము. ఉచితమైన ఆంతరంగిక ఖననమందిన హృదయములందే ఈ యాశబీజములు నాటుకొనజాలును. నిత్యము కృష్ణనామ సంకీర్తనము

గావించుచు నిర్మలనీతివిశారదులై పూతచారిత్రులైయుండు వారి హృదయ కేదారము లిట్టి యాదర్శబీజములను గ్రహించి ఆధ్యాత్మికమైన పచ్ఛందన మును ప్రదర్శింపజాలును. ఉచితస్థానమున అనుకూలవాతావరణమున వసించి జీవితచరితార్థత గాంచవలెనని వల్లభాచార్యుడు నిశ్చయించెను.

బృందావనమున ఆతడిట్లు వసించుచుండగా ఒకనాటి నిశీథమున శ్రీకృష్ణు డాతనికి స్వప్నమున ప్రత్యక్షమై "వత్సా! గోవర్ధనగిరిపై శ్రీనా థుడను నామముతో వెలయుచున్నాను. నాసహచరులు గోపకులజులు మరల నచ్చోటబుట్టిరి. గోవర్ధనమున నీకు శ్రీనాథ విగ్రహము లభించును. దాని నారాధింపుము. ఆయారాధనమునకు ముముక్షువులను ప్రోత్సాహింపుము" అని పలికెనట. నిదురనుండి మేల్కాంచి మరునాడు ప్రాతఃకాలమున శ్రీకృ ష్ణుని ఆజ్ఞను శిరసావహించి గోవర్ధనపర్వతమునకరిగి దానిపై శ్రీనాథ విగ్ర హమును గాంచి పరమానందభరితుడై అందొక యాలయమును నిర్మించి వల్ల భాచార్యు డందు శ్రీనాథస్వామిని ప్రతిష్ఠించెను. శుభంకరమైన ఈసంఘట నము క్రీ. శ. 1520 లో జరిగెనని చారిత్రకపరిశోధనము వాకొనుచున్నది. వల్లభ మతము శ్రీనాథారాధనమునకు సంబంధించిన దని భండార్కార్ మున్నగు పండితులు రూఢిచేసిరి.

శ్రీనాథవిగ్రహ స్థాపనము మహామహిమోపేత మహోత్సవముగా వల్లభ మతస్థులు పరిగణించిరి. వల్లభ ప్రబోధము రాజస్థానమున ప్రచారమును ప్రశస్తిని విడసిన యనంతరము కవుల గేయములందును చిత్రలేఖకుల చిత్రరచ నములందును ఈయుత్సవోదంతము ప్రధానస్థానమునందెను. కొలది దశాబ్దులకు మున్ను లభించిన రాజస్థానచిత్రరచనలందు మిగుల నుత్కృష్టమైనది ఈపవిత్రో త్సవమునకు సంబంధించినదియే. మనోహరబృందావనము వెనుక వెలయు చుండ నాచార్యుడు గోవర్ధనగిరిపై విగ్రహమును ప్రతిష్ఠించుచున్నట్లును ఆతని కుడిగట నిర్వు రాంధ్రవిప్రులు ధ్యానమగ్నులై యున్నట్లును దక్షిణపార్శ్వమున రాజసింగును మరియొక ఉదయపురరాజపుత్రుండును నతజానువులై నిలిచి యున్నట్లును ఇరువురు రాణులు గోపికలవడువున దధిదుగ్ధములను సమర్పించు చున్నట్లును పురోభాగమున కొంతదూరమున సౌందర్య సందీప్తములైన పల్లెలు విలసిల్లుచున్నట్లును కుడిచేతివైపున కొంతదూరమున నొక దేవాలయము వఱలు

చున్నట్లును మధ్యభాగమున కవలలవలె రెండు సరోవరములు వెలయుచున్న ట్లును ఒక తటాకముచుట్టు చిన్నచిన్న మంటపము లొప్పుచుండునట్లును ప్రధానాచార్యుడు నిమీలితనేత్రుడై ప్రసారితహస్తుండై మూర్తీభవించిన భక్తిభంగి రూపుదాల్చిన గభీరభావముచందమున నొప్పుచు మహాతేజశ్శాలియై సౌందర్య సంశోభితుడై యున్నట్లును ఆయద్భుతచిత్రమున గాననగును. కళకును మహిత భావమునకును మతమహత్త్వమునకును ఎట్టిపూతసంబంధము కలదో ఎట్టి యవి రతసఖ్యమున్నదో యూహింపుడు.

ఆధ్యాత్మిక జీవితమునకు వివాహము ప్రతిబంధకముకాదని నాటివైష్ణవాచార్యులు విశ్వసించిరి. వల్లభాచార్యుడు వివాహవిరోధికాడు. శ్రీనాథప్రతిష్ఠ ముగిసిన కొలదిదినములలో నాతడు వారణాసియందు మహాలక్ష్మి యను బాలికను పరిణయమాడెను. అన్యోన్యానురాగబద్ధులై శ్రీనాథసేవాతత్పరులై దంపతులు సుఖముగ కాలక్షేపముచేసిరి. కాలక్రమమున వారి కిరువురు పుత్రులు కలిగిరి. మొదటివాడు గోపీనాథుడు. ఇతడు క్రీ. శ. 1511 లో జన్మించినాడు. విఠ్ఠలనాథుడు రెండవవాడు. ఇతడు క్రీ. శ. 1516 లో పుట్టినాడు. ఇద్దఱును 'పర్వత్' అను పల్లెయందు ఉదయించిరి. తన తనయులకు తానే ఆచార్యుడై విద్యాబుద్ధులు కఱపి వల్లభుడు వారిని పెద్దవారిని జేసెను. జనకుని ప్రబోధము నంది అందలిమహత్త్వమును మేలుబంతిగావించుకొని ఆతనివలెనే తనూభవులుభయులును కాలక్రమమున వైష్ణవమతప్రచారమునకై తమ జీవితములను వినియోగించిరి.

వల్లభాచార్యుడు వారణాసి బృందావనములను తన వాసస్థానముల గావించుకొనెను. కొంతకాలము కాశీయందును కొంతకాలము బృందావనమందును ఆతడు వసించుచుండెను. అద్వైతసిద్ధాంతమునకు వారణాసి పట్టుగొమ్మకాదా? శైవమతపండితుల కది కేంద్రముకాదా? వల్లభునివైష్ణవసిద్ధాంతములనచ్చో నాదరించువారెవరు? కాని ఆచార్యుడు వెనుకంజవేయువాడు కాడు. తన వజ్రసంకల్పమును, తన యిచ్ఛాశక్తిని, తన దృఢనిశ్చయమును పురస్కరించుకొని విశ్వేశ్వరధామమున విజయభేరీ మ్రోగింప నాతడు ముందంజ వేసినాడు. వాదమున దన్నోడింపరండని తెలుపుచు తన సవాలునొక పత్రముపై వివరించి దాని నాతడు ఈశ్వరాలయకుడ్యమునకు గట్టెను.

దానిని గాంచి శంకరమతావలంబులైన పండితులు కన్నులెఱ్ఱజేసిరి. తీవ్ర వాదమున వల్లభుని మార్కొనిరి. అతడు వారి నవలీలగ నోడించెను. వల్లభా చార్యుని విజయము అతని కీర్తి ననేకమడుంగులు వృద్ధిగావించెను. ఆకాలమున వల్లభచైతన్యు లజేయులైన పండితులని ప్రసిద్ధినందిరి.

స్వీయసిద్ధాంత మహత్త్వమును తీవ్రచర్చలందు రూఢిచేయుట మన యాచార్యుల యాశయమై యుండెను. శ్రీ శంకరు డీయాశయసిద్ధి నెట్లందెనో పాఠకు లెఱుంగుదురు. పల్వురుపండితుల నోడించుచు శ్రీ చైతన్యుండు దిగ్విజయయాత్ర సలిపెను. వారణాసియందు వల్లభాచార్యుడు వాదప్రతి వాదములందు నిమగ్నుడై యున్నపుడే శ్రీ చైతన్యుడు కాశీక్షేత్రమున కరిగి పరీక్షానందుడను మేటి యైన ద్వైతసిద్ధాంతితో వాదించి తన కూలంకషప్రజ్ఞను ప్రదర్శించి ఆసిద్ధాంతిని తన యనుచరులలో నొక్కని గావించుకొనెను.

వేర్వేఱుదేశములందు నయితము యుగవాతూలమున నేకైకభావము వెలయుచుంట చూచుచుందుము. బలవత్తరమైన భావము భవ్యమైన భావము గోడలందును గొందులందును కట్టుబడియుండదు. వసుమతీహృదయమున వేర్వేరు హృదయములందు ఈభావము తలసూపి బహుభంగుల నాత్మ ప్రకాశము గావించుకొనెను. అద్భుతప్రతిభాజ్యోతి షేక్సిపియరు హృదయమున తేజరిల్లిన ముహూర్తమందే పింగళి సూరనార్యుని హృదయమందును తేజరిల్లి నది. శ్రీ వల్లభచైతన్యులు వఱలిన పవిత్ర సమయమందే యైరోపాఖండమున రిఫర్మేషన్ మతాచార్యుడైన మార్టిన్‌లూథర్ వఱలినాడు. మతచర్చలందు విజయుడై పాశ్చాత్యదేశములందు అద్భుతసంచలనమును గలిగించినాడు. నాడు ప్రాచీప్రతీచీ ఖండములం దేకైకభావమహత్త్వము విలసిల్లినది.

కాలక్రమమున వల్లభాచార్యుడు వారణాసియందే స్థిరపీఠమును ప్రతి ష్ఠించుకొనెను. కుటుంబసహితుడై, శిష్యపరివృతుడై గ్రంథరచనమున నాతడు కాలము గడపెను. భాష్యరచనమున నీతడు సిద్ధహస్తు డాయెను. తనరచనమున నీతడు శిష్యుల చేదోడుబడసెను. వల్లభుని తాత్త్వికమత భావవిభవ మెట్టిదో ఈతడు ప్రబోధించిన వైష్ణవమతసిద్ధాంతము లెట్టివియో ఈతని గ్రంథములు చాటుచున్నవి. ఈతని భావములకును శ్రీ చైతన్యుని భావములకును ఎంతేని భావసామ్యముకలదు. "వ్యాససూత్రభాష్యము" "జైమినిసూత్రభాష్యము"

"భాగవతటీకాసుబోధిని" "సిద్ధాంతరహస్యము" లతని సంస్కృతగ్రంథము లందు ప్రధానములు. అంతఃకరణప్రబోధము, నవరత్నములు, కృష్ణాశ్రయము, భక్తివర్ధిని' విష్ణుపదములు ఈతని వ్రజభాషాగ్రంథములందు ముఖ్యమైనవి. సుబోధినీ సిద్ధాంతరహస్యములు వీనిలో మిగుల వాసికెక్కిన గ్రంథములు. భాగవతపురాణమందలి పదవస్కంధములోని తొలుతటి నాలుగధ్యాయము లను గుఱించిన భాష్యమే సుబోధినియను బరగెను. ఆచార్యుని అద్భుతవైదుష్య మిందు గాననగును. వల్లభుని మతసిద్ధాంతములు "సిద్ధాంతరహస్యము" న క్రోడీకరింపబడినవి.

వల్లభాచార్యుని శిష్యకోటిలో ముఖ్యమైనవారు ఎనుబదినలుగురు. వల్లభుని జీవితోదంతమును ఈయంతేవాసుల జీవనవృత్తాంతములును గ్రంథ స్థము లొనరింపబడెను. ఇది పశ్చిమహిందీభాషలో వ్రాయబడినది. గ్రంథము మిగుల పెద్దది. చిత్రవిచిత్రములైన కథలతోడను అతిశయోక్తులతోడను ఈగ్రంథము తుందిలమైయున్నది. శ్రీచైతన్యునిగుఱించియు ఆతని శిష్య వర్గమును గుఱించియు దామోదర కృష్ణదాసులను వైష్ణవభక్తులు రచించిన గ్రంథము సమగ్రమై సత్యసందీప్తమైనదగుటచే పూర్వోక్తగ్రంథముకంటె ఘనతరప్రాముఖ్యముగలది.

వల్లభాచార్యుడు ఏబదిరెండవయేట బరమపదించెను. ఈతని మృత్యు వును గుఱించి ఎన్నెన్నియో చిత్రగాథలు వెడలినవి. తన జీవితోద్దేశసిద్ధిని గాంచి యిక వసుంధరయందుండ నిచ్చగింపక ఆచార్యుడు హనుమాన్ ఘట్టము కడ గంగానదిలో ప్రవేశించెనట. తోడనే దివ్యజ్యోతి యొకటి యాతనిచుట్టు తేజరిల్లినదట. ఆజ్యోతితో నాతడు భక్తబృందము పరీక్షించుచుండ నూర్ధ్వ దిశ కెగసి అచిరములో నీలాకాశమున నదృశ్యుడైనాడట. వారణాసియందు వల్లభాచార్యుడు వసించిన ప్రదేశమున నేడొకమఠము వెలయుచున్నది.

---

# ౫౭

# వల్లభ వంశజులు

“ తే. దేహబుద్ధిని దాసుండ దేవ! నేను
దావకీనాంశకుండను జీవబుద్ధి
నాత్మబుద్ధిని నీవె నే నౌదు నిదియె
యస్మదీయంబు మతినిశ్చయము మహాత్మ! ”

వల్లభాచార్యుడు పరమపదించిన పిదప ఆచార్యపీఠమునకై ఆతని తనయులు గోపీనాథ విఠలనాథులు వివాదమునకు కడంగిరి. ఢిల్లీశ్వరుడు ఈవివాదమును విని పెద్దవాడైన గోపీనాథుడే పీఠాధిపతియగుట కర్హుడని తీర్పుజెప్పెను. కాని గోపీనాథుడు తీర్పు వినినపిదప దివంగతుడయ్యెను. ఆతని తనయుడును తండ్రినినుగమించి స్వర్గమును చేరుకొనెను. కావున విఠలనాథుడే ఆచార్యపీఠము నధిష్ఠించెను. క్రీ. శ. 1516 నుండి 1576 వఱకు నీతడు దానిపై నాసీనుడై యుండెను. జనకునివలె నీతడును ప్రతిభావంతుడై పలువురదృష్టి నాకర్షించెను. ఈతని ప్రధానశిష్యులసంఖ్య రెండువందల యేబది యని వల్లభవంశచరిత్రము తెలుపుచున్నది. తండ్రివలెనే ఈతడును దీర్ఘయాత్రలు సలిపినాడు. మధుర, గోకుల, కఛ్, మాల్వా, మీవార్, పండరీపురము మున్నగుస్థానములందు మతప్రబోధము గావించుచు సంచరించుచు పల్వురను తన మతమున గలుపుకొనినాడు. ఈతడు జాతి మతభేదములను పాటింపలేదు. హిందూమతమందలి యన్ని జాతులవారును మాత్రమేకాక కొందఱు ముసల్మానులుకూడ ఈతని యుద్బోధములను హృదయంగమ మొనరించుకొని నీని యనుచరులైరి.

తండ్రి వలెనే ఈతడును బహుళగ్రంథములను రచించినాడు. “ విద్వాన్ మండన్ ” అనునది వీని ప్రధానగ్రంథములలో నొకటి. ఈగ్రంథమున నీతడు శంకరసిద్ధాంతమును తీవ్రముగ ఖండించినాడు.

పరిభ్రమణానంతరము విఠ్ఠలనాథుడు గోకులయందు స్థిరవాసమేర్పఱచు కొనెను. కావున గోకుల గోస్వామియని కూడ నీతడు పిలువబడుచుండెను. ఈతని సంతతివారందఱు కూడ నీ నామాంతర మందుచువచ్చిరి.

తన డెబ్బదవయేట నీ యోగీంద్రుడు శ్రీనాథస్వామి సాన్నిధ్యమున గోవర్ధనపర్వతముపై పరమపదించెను.

## (విఠ్ఠలనాథుని తనయులు)

విఠ్ఠలనాథునకు రెండుపెండ్లిండ్లు జరిగెను. ఈతని తొలిపత్ని రుక్మిణి. పద్మావతి రెండవభార్య. వీరివలన వీనికి గిరిధర, గోవింద, బాలకృష్ణ, గోకుల నాథ, రఘునాథ, యదునాథ, ఘనశ్యామ, యను తనయు లేడ్గురును నలువురు కూతుండ్రును గలిగిరి.

విఠ్ఠలనాథుడు దివంగతుడైన యనంతరము వీరు రాజస్థాన ఘూర్జర దేశములందు వేర్వేరుప్రదేశములందు తమ యావాసముల నేర్పఱచుకొని తమతమ విద్యాపీఠములను ప్రతిష్ఠించుకొనిరి. వీరి ప్రబోధ ప్రచారములకతన వైష్ణవమతము విశేషప్రశస్తిని వడసెను. పలువురు వైష్ణవమతమున బద్ధ దీక్షితులైరి.

వల్లభుని యేడ్గురుతనయులలో నాలవవాడైన గోకులనాథుడు విశేష కీర్తి నార్జించెను. పితామహుడు రచించిన గ్రంథములన్నిటికిని ఆతడు చక్కని భాష్యములు వచించెను. వీనిలో సిద్ధాంతరహస్యమునకు సంబంధించిన భాష్యము మిగుల నుత్కృష్టమైనది. గోకులనాథుని శిష్యులు తమపీఠస్థాన మును అద్వితీయమైనదనియెంచి "మహరాజ్" "గోస్వామి" "గురుప్రభు" మున్నగు బిరుదములతో నొప్పుచు వచ్చిరి. కచ్, కథియవార్, రాజస్థాన, మాల్వావాసులనేకులు వీరిమతమునే అవలంబించిరి. రాజన్యులును వణిజులును ఈ భక్తశిఖామణులందు గలరు.

వల్లభవంశీయుల మఠములు కాలక్రమమున అతులైశ్వర్యమునకు నిధా నములయ్యెను.

వల్లభప్రోక్తమైన మత మనుడు, చైతన్యప్రోక్తమైన మత మనుడు రామా నుజప్రబోధితవైష్ణవసిద్ధాంతములనుండియే భావశబలతనొంది కార్యసఫలతను

కన్నులజూచెను. వల్లభునకుముందు విష్ణుస్వామియను యోగి ఆర్యావర్తమున నీసిద్ధాంతములను హృదయంగమము గావించుకొనెననుటకు కొన్ని యాధార ములు కలవు.

మతప్రాముఖ్యము తలసూపినపుడు, భావసంచలనముకలిగినపుడు సాహి త్యాదికళలు పెంపొందునని ప్రపంచచరిత్ర తెలుపుచున్నది.

ప్రస్తుతకథనమున మనము పరిశీలించు కాలమున నార్యావర్తమున చక్కని సాహితీవృద్ధి పొడసూపినది. వల్లభప్రభృతుల రచనములను గుఱించి ఉల్లేఖించియేయుంటిని. వీరి వ్రాత లాధ్యాత్మికభావసామగ్రికి నిధానములనుట నిస్సంశయము. కేశవలాల్ యశవంతసింగ్ ప్రభృతులు యోగులుకాకున్నను వైష్ణవాదర్శములను హృదయంగమ మొనరించుకొనిన రచయిత లగుదు. వారి వ్రాతలు గంభీరభావబంధురమై ఉద్వేగభరితమై యొప్పినవి. సూరదాసు చతుర్భుజమిశ్రుల కవిత్వమహత్త్వము హిందీవాఙ్మయమునకు అపూర్వవిభవ మును చేకూర్చినది. ప్రాచీన హిందీభాషకు కబీరు తులసీదాసుల రచనలు వన్నె దెచ్చినట్లు సూరదాసు మున్నగువారి వ్రాతలు ప్రతీచీ హిందీసాహితికి వన్నె దెచ్చినవి. చతుర్భుజ మిశ్రవిరచిత 'ప్రేమసాగరము' భాగవతమహా గ్రంథమందలి దశమస్కంధమునకు అనువాదమేయయ్యు పోతనామాత్యవిరచిత భాగవతమట్లు, తిక్కన సోమయాజి భారతము లీల నైసర్గికప్రతిభా సముద్భవ రచనమునకు నిక్షేపమై ఆర్యావర్తమున అనల్పమైన ప్రశస్తి నందినది. కేశవ లాల్ విరచిత "రసిక ప్రియ" చక్కని గేయములతో తుందిలమైయున్నది. బీహారీలాల్ రచించిన "సత్ శాయి" వివిధఛందోనిబంధనలను దృష్టాంతీక రించు ఏడువందల పద్యములతో నిండియున్నది. శ్రీకృష్ణుని ప్రణయజీవిత మీగ్రంథమున చక్కగ చిత్రింపబడినది.

వైష్ణవమతము నిర్గుణబ్రహ్మనుగాక గుణరూపసహితుడైన జగదీశుని దృష్టిగొనును. గుణసంకీర్తనము భావనావేశమునకును భావోద్వేగమునకును సహజమైన ఆత్మవ్యక్తీకరణము. కళలును ఏతాదృశవ్యక్తీకరణమునే కాంక్షిం చును. కావున వైష్ణవమతప్రభావము వెలసిన ప్రదేశములందు కళలు పెంపొందినవి. రామానుజచైతన్యుల ప్రబోధమునుండి సుందరభావరాజి

వర్షించినచోటులందు కళలు కడుంగడు చక్కగ కుసుమించినవని పఠితలు గ్రహింతురుగాక.

రాజస్థానచిత్రకళయందు భారతసంప్రదాయమునకు స్వతస్సిద్ధమైన ఆధ్యాత్మికభావసౌందర్యము విశేషముగ వెలయుచుండును. రామణీయకమైన భారతప్రకృతి పెక్కువన్నెలతో నందుభాసిలుచుండును. కన్నులకు విందొనరించు దృశ్యమందు శ్యామసుందరుడు విహరించుచున్నట్లును, శ్రీకృష్ణునకై ఆతురపాటున వనమందు తడసియున్నట్లును వెన్కనుండి రాధ శ్రీకృష్ణుని వీపుపై చేయివేసి స్మితముఖియై ఆతని చేతికి సరోజమునందించుచున్నట్లును, గాలి వీచునపుడును వాన కురియునపుడును రాధాకృష్ణులు రతనకంబళమును గప్పుకొని ఒండొరులనుజేరి నిలిచినట్లును కన్నులనాకర్షించుచు మనసును రంజించు చిత్రములు నాడు రచింపబడినవి. ప్రణయస్పర్శను దృష్టాంతీకరించు దృశ్యములును జీవాత్మపరమాత్మల కలయిక దెలుపు రాసలీలావిలాసములును మదికెంత ముద మొదవింపవు? గానముగ్ధలై శ్రీకృష్ణసాన్నిధ్యమున (ఈశ్వరసాక్షాత్కారమునందిన తపస్వినులేయగుదు) వ్రజవనితలు సుమవిలసిత బృందావనమున నిలువంబడినట్లును గోకులమున గోవులు మసలుచున్నట్లును వాతాయనపథములనుండి గోసీమంతినులు మదనమోహను నవలోకించుచున్నట్లును కన్నులెదుట నాటి దృశ్యములు రంగారుచిత్రముల విలసిల్లుచుండ నెవరిహృదయమున నానందపయోధు లుప్పొంగవు?

ఇట్టి యుదాత్తభావసృష్టికి ఇట్టి యానందసృష్టికి ఇట్టి సౌందర్యసృష్టికి మార్గదర్శకమైన మతమును ప్రబోధించిన వల్లభాచార్యుడును ఆతని ప్రధాన శిష్యులు చిరస్మరణీయులుకారా?

---

# ౫౬

# నాగమహాశయుడు



“చింతలవంతలఁ జివుకక
సంతాపము పాలుగాక శాంతినిగని మ
త్స్వాంత మనంత! నితాంతము
సంతసమున నినుభజింప నలుపు కృపాబ్ధీ.”

ఉదాత్తమైన ఆశయములచే ఆత్మజీవితములందు చక్కని జ్యోతిర్లీలను సృష్టించువారు మానవులలో నెందఱోలేరు. భావపిపాసులసంఖ్యయే తక్కువ. హృదయములను భావభాండాగారములను గావించుకొను అల్పసంఖ్యాకులలో వచఃకౌశలమును ప్రదర్శించుటతో తమపని చెల్లిపోయినదని తలచి సంతసించు వారు తఱచుగ కన్నులబడుచుందురు. వీరిప్రబోధములకును దృష్టాంతముల కును నడుమ పెద్దలోయలుండును. ఉత్కృష్టభావములను మననము గావించు కొని వాని ననుసరించి వర్తించుటకై కంకణమును కట్టుకొనువారు వసుంధర యందు మిగుల నరుదుగ గోచరింతురు. వీరి సఖ్యమునందినపుడును వీరిని సేవించినపుడును వీరిని దర్శించినపుడును వీరిని స్మరించినపుడును వీరియుదంత మును పునశ్చరణ మొనరించినపుడును వీరిజీవితవిధానముపై మనసు నిలిపినపు డును హృదయమున నానందపయోధి యుప్పొంగుదును. అంతరంగమున నిహి తమైయుండిన దివ్యశక్తులు బాహ్యజీవితమున ప్రస్ఫుటించును; మనుష్యచరిత్ర ముదాత్తాశయసందీప్తమగును. పంకిలమున పొరలాడువారు శిరమునెత్తి సుధా కలశమునకై చేతులు చాపెదరు; క్రమతపసున బద్ధదీక్షితులై అమృతపుత్రులై మోక్షసామ్రాజ్యము నేలజాలుదురు.

మహాత్ముల చరిత్రములు కేవలము అక్షరసముదాయములే కావు. మనుష్యజీవితమును మహిమోపేతమొనరింపజాలు మహత్తరశక్తికి కేంద్రస్థాన ములై యుండునవి అవియే! వేడుకకై వినోదమునకై ఉద్దేశింపబడు గ్రంథ ములు వేఱు.

ఇపుడు మనదృష్టి నాకర్షించు మహనీయుడు పురాణయుగములోని వాడుకాడు. కాలపథమున మనకు సన్నిహితుడై వఱలిన మహాపురుషు డాతడు. నేడు మనియుండిన బహుసంఖ్యాకులకు పరిచితుడై పరగిన పవిత్ర చరిత్రు డాతడు. గృహస్థుడైయుండియు యోగీంద్రులకు సయితము ఆదర్శపూరుషుడై మనియుండిన మహాత్ము డాతడు.

"పృథివిలో నానాస్థానములందు సంచరించితిని కాని నాగమహాశయుని బోలు మహాపురుషుని నేనెందును జూడజాలనైతిని" అని ఆతని గుఱించి పూజ్యపాదుడైన వివేకానందస్వామి వచించెను.

తూర్పుబంగాళమున నారాయణగంజి రేవునకు అరక్రోశుదూరమున పడమటి వైపున 'దేవభోగ్' అను చిన్నపల్లెయందు క్రీ. శ. 1846 సంవత్సరమున ఆగష్టు 21 తేదీనాడు నాగమహాశయుడు పుట్టెను. దుర్గాచరణ నాగ్ యనునది వాని సంపూర్ణనామధేయము. కాని నాగమహాశయుడనియే అతడు పిలువబడుచుండెను. ఆతని తండ్రి దీనదయాళుడు. తల్లి త్రిపురసుందరి. దీనదయాళుని జనకుడు ప్రాణకృష్ణుడు, జనని రుక్మిణి. పూర్వమున వీరి నివాసస్థానము 'తిలారది' యను పల్లె. రెండుమూడు తరములనుండి దేవభోగ్ గ్రామమందు నివసించుచుండిరి. దీనదయాళునకు ఇరువురు చెల్లెండ్రుండిరి. వీరిలో పెద్దది భగవతి. తొమ్మిదేండ్ల వయసునందే వితంతువైన అభాగిని. తన జీవితాంతమువఱకు నీమె సోదరునియింట వసించుచుండెడిది. రెండవ చెల్లెలు భారతి. తన కాపురముచేసికొనుచు అనుజునింటికి అరుదుగా పోవుచుండెడిది. పాప మీమె ఎంతోకాలము మనియుండలేదు.

దుర్గాచరణుడుకాక మఱియొక కొడుకును, ఇరువురు కూతుండ్రును దీనదయాళునకు గలిగిరి. శారదామణి దుర్గాచరణుని తరువాత పుట్టినది. ఆమెకాక తక్కిన యనుజన్ములు పసితనమందే మరణించిరి. కడగొట్టుబిడ్డను కనిన యనంతరము త్రిపురసుందరి సూతికావ్యాధి పాలబడి బిడ్డలను ఆడుపడుచు చేతులందుబెట్టి అసువులను గోల్పోయినది.

తల్లి పోవునప్పటికి నాగమహాశయుని వయసు ఎనిమిదేండ్లు మాత్రమే. శారద నాలుగేండ్లబాలిక. తండ్రి మఱి పెండ్లిచేసికొనలేదు. మేనత్తయే

పిల్లలను పెంచుచువచ్చినది. "పూర్వజన్మములందు నామెనత్త నాకు కన్న తల్లియై ఉండియుండును" అని నాగమహాశయుడు తెలుపుచుండువాడు.

దీనదయాళుడు దేవద్విజభక్తి పరాయణుడు. నిష్ఠపరుడు. కలకత్తాలో 'కుమారటులి' యను చోటున రాజకుమారపాల్ హరిచరణపాల్ అను సోదరుల విపణియందు పనిచేయుచుండువాడు. వేతనము అల్పమైనది. కాని ఆతడు వారి యధీనమందలి యుద్యోగివలె లేడు. వారి కుటుంబములోని వారిలో నొక్కండై వారికి తలలోని నాల్కవలె నాతడు మెలగజొచ్చెను. అతడు ధర్మపరాయణుడు. సత్యవ్రతుడు. విత్తముపై మక్కువలేనివాడు. యజమానుల పైకము విశేషముగ వానిచేతిమీదుగా వెచ్చమగుచుండును. వేలకొలది రూకలు వాని చేతులయందు ఘల్లు ఘల్లున మ్రోగుచుండును. ఆతనియెడల సంపూర్ణవిశ్వాసముంచి యజమాను లెన్నడును లెక్కవివరములను గుఱించి వానిని ప్రశ్నించి యెఱుగరు. ఒకప్పుడు కొన్ని వేలరూపాయలను గుఱించి లెక్క తేలలేదు. అప్పుడైనను వారాతని సంశయించిరికారు. సంవత్సరము కడచినపిదప ఆరూకలవివరము తెలియవచ్చినది. పైకమెందును బోలేదు. నాటినుండి పాలుసోదరులకు దీనదయాళునియెడలగల విశ్వాసము దృఢతరమయ్యెను. ఆతనికి మఱికొంత పైకమును చేకూర్చువెరవును వారనవతరమును రోయగడంగిరి.

పాల్‌సోదరులు ఉప్పువర్తకము చేయుచుండువారు. పడవలద్వారా నారాయణగంజికి ఉప్పును రవానా చేయువారు. రేవుపట్టణమునుచేరు కాలువ దట్టమైన అరణ్యముగుండా పోవుచుండును. ఆదినములలో బందిపోటుదొంగలు తఱచుగా పడవలపై పడి సరకుల దోచుకొని అవలీలగా అరణ్యములోనికి పాఱిపోవుచుండువారు. కావున విశ్వసనీయులును బలవంతులు నైనవారు సరకులవెంట బోవుచుండువాడుక అపుడుండెడిది. దీనదయాళుని చేవనెఱిగిన పాల్‌సోదరులు ఒకప్పుడు తమయుప్పుపడవతో ఆతనిని పంపిరి. పడవ 'సుందరవన' యడవిలో ప్రవేశించునప్పటికే చీకటిపడినది. ఏదేని రక్షణస్థానమున తమనావను చేర్చుటకు పడవవాండ్రకు సాధ్యముకాలేదు. కావున వారు పడవను ఆపివేసిరి. మిగుల శిథిలమైన ఇల్లొకటి దగ్గఱలో వారి కగపడినది. ఆయింటికి సమీపమున రెండుగుడిసెలుండెను.

నావికులు రాత్రిభోజనము ముగించి పరుండిరి. దుడ్డుకఱ్ఱను చేబూని దీనదయాళుడు మేల్కొనియుండెను. రామస్మరణము చేయుచు హుక్కా పీల్చుచు అతడు రాత్రి గడపివేసెను. అరుణోదయమున నతడు పడవనుండిదిగి కొన్ని యడుగులు సాగిపోయెను. ఆతని కాలివ్రేలికి రాపిడియైన తావున నేదియో తళుక్కున మెఱసెను. కొంతమన్ను నందుండి ఆతడు తొలగించి చేయిబెట్టి చూచెను. బంగారు నాణెములతో నిండిన పాత్రయొకటి తోడనే ఆతనిచేతికి తగిలెను. దీనదయాళుడందుండి కొన్ని నాణెములను దీసి పరీక్షించెను. అవి తొల్లింటి మొహరులని ఆతడు గుర్తించెను. తక్షణమే అతడు చేతియందు గల బంగారు నాణెములను పాత్రమందుంచి దానిని నేలలో పూడ్చి అందుండి చప్పుచప్పున కదలిపోయి నావికులను లేపి ఆలసింపక పడవను త్రోసివేయుడని వారి నాజ్ఞాపించెను. పడవవాండ్రాశ్చర్యాన్వితులైరి. "దురాశ నాగుండెలో ప్రవేశింప గమకించినది. ఐశ్వర్యము నాకేల? అది పరధనము దాని నేనంట రాదు. దానిపై నాచూడ్కి పడరాదు. దాని నొడిసి పట్టుచు కొంటినేని నరకము పాలబడుదు ననుట తథ్యము. కావుననే పరుగుపరుగున వచ్చిపడితిని. తక్షణమే పడవత్రోయుడు. ప్రలోభముపొంత నిలువనేల?" అని యాతడు గట్టుమీది చెట్టునకు కట్టబడిన పడవత్రాటిని విప్పివైచెను. నావికుల కేమియు పాలుపోలేదు. విషయము వారికి అవగాహనము కాలేదు. "బాబూ! సమీపమున బందిపోటు దొంగలున్నారాయేమి? ఎందుకీతొందర?" అని వారు దీనదయాళు నడిగిరి. "అవును. ఇందిక తడసినయెడల ముప్పువాటిల్లును." అని యాతడు వారిని హెచ్చరించెను. నావికులు జలయానమును కడువడిగ నందుండి నడపుకొని పోయిరి.

దీనదయాళు డెట్టిమహనీయుడో పాఠకులు గ్రహించియే యుందురు. ఈమహనీయుని కడుపున బుట్టిన నాగమహాశయుడు జనకునిమించిన మహాత్ము డయ్యెను.

ఈతని బాల్యజీవితమును గుఱించిన వృత్తాంతమంతగా కానరాదు. వినమ్రుడై శాంతస్వభావుడై మధురభాషియై పల్వుర కాతడు ప్రీతి గొలుపు చుండువాడు. ఆతని సౌందర్యము వాని సౌమ్యగుణమున కీడు వచ్చునట్లుండెను. ఆతని శిరోజములు కడుంగడు దీర్ఘములై వానిసోయగమును ఘనతరమొన

రించెడివి. నిరుపేదకడుపున బుట్టినవాడగుటు ఒకజత వెండి మురుగులను తక్క-ఆతడు మఱేయాభరణములను ఎఱుగడు. సహజసౌందర్యసందీప్తకాయుడైన బాలునకు భూషణము లెందుకు? నగుమోముతో నాతడు పాడుచు నాడువేళ లందు వానిని విలోకించి ముగ్ధులు కానివా రెవ్వరునులేరు. పరిసరమున వసించు ప్రౌఢాంగనలు బాలుని చెలువమున కలరి వానిని తమ యంకసీమలందు జేర్చుకొని ముదమార వానిని ముద్దాడువారు. కాని ఆదరానురాగములతో నెవ్వారే మధురపదార్థమునైన వానికీయ సమకట్టినపుడు వానినాతడు పరిగ్రహించువాడుకాడు.

రాత్రియైనంతన బాలకుడొంటరియై తదేకదృష్టితో తారకా ఖచిత వియత్తలమును విలోకించుండువాడు. పట్టరాని సంతోషముతో మేనత్తను చెంతకు పిలచి "కొండ ఎంత చక్కగా నున్నదో! మనము పోయి అక్కడే ఉందాము" అని యాత డనుచుండువాడు. చంద్రోదయమైనంతన బాలకుడు పరమానందముతో చప్పట్లు చఱచుచు గంతులువేయువాడు. గాలివీచినపుడు ఊగాడుచెట్లను చూచి పరితోషముతో తన్నవి పిలచుచుండెనని యూహించి "అత్తా! నేనుపోయి వానితో నాడుకొందును" అని పలికి దోదుల్యమాన తరుదళము లీల దానును ఊగుచు వింతరీతిని నృత్యము చేయువాడు. ఆమనోహర నృత్యము నుపలక్షించి పరమపరితోషమున నాపైదలి పరవశయై బాలకు నెత్తుకొని తనివార వానిముఖచంద్రుని చుంబించెడిది.

చెంత గూర్చుండబెట్టుకొని మేనత్త వానికి తఱచుగ పురాణకథలను చెప్పుచుండెడిది. మిక్కిలి మక్కువతో అతడాకథలను వినుచుండువాడు. పగలు పని చేసి చేసి ఆమె పడియున్నపుడు కథచెప్పుమని వేయిరీతుల నామె నాతడు ప్రార్థించుచుండువాడు. కథలు విని శయనించిన యనంతరము కథాపాత్రలు, దేవదానవులు యుద్ధముచేయుచున్నట్లాతడు కలగనువాడు. బీతువలన మేల్కొను వాడు. కాని మేనత్త నిదురకు భంగము కలిగించువాడుకాడు. తెల్లవారువఱకు ఆమెనుచేరి కూర్చుని అనంతరము స్వప్నవృత్తాంత మామెకు తెలుపుచుండు వాడు. ఆయుదంతము విని ఆశ్చర్యాన్వితయయ్యెడిది.

ఆటపాటలందు దుర్గాచరణునకు ఇంచుకంతైన అభిలాషలేకుండెను. కాని తోడి బాలురు పీడించినపుడు అతడు ఆటలందు జేరుచుండువాడు. ఆట

లందైనను అసత్యమాడుటకు ఆతని యంతరంగము అంగీకరించెడిదికాదు. తోడిబాలురలో నెవ్వరైనను కల్లలాడినపుడు వారితో నాతడు ప్రసంగించుట మానివేయువాడు. వారిప్రవర్తనమున పశ్చాత్తాపము గోచరించిన ముహూర్తమందే వారితో నాతడు మరల మాటలాడువాడు. ఒకనాటి యాటలో గెలుపొందుటకై తోడిబాలురు "ఇపుడు నీవు అబద్ధమాడితీరవలె" నని వానిని బలవంతబెట్టిరి కాని అతడు 'ససేమిరా' యనెను. ఆటలో వాని పక్షమువారికి నోటమి వాటిల్లినది. తోడి బాలురు మిగుల గుపితులై వానిని వరిపొలములోని కీడ్చి చిత్తమువచ్చినట్లు వానిశరీరమును హూనముచేసి వదలిరి. బాలకుని యొడలంతయు గాయముల మయమయ్యెను. అందుండి అవారిగా నెత్తురు కారసాగెను. ఎంతోకష్టముతో ఆత డిల్లుచేరుకొనెను. అపుడు దీనదయాళుడింట నుండెను.

రక్తసిక్తాంగుడైన బాలునిజూచి తండ్రియును మేనత్తయును "ఏమి జరిగినది నాయనా!" అని వానిని గ్రుచ్చిగ్రుచ్చి యడిగిరి. తన నెచ్చెలులు దండింపబడుదురనియు నూరిలో గగ్గోలు పొడసూపుననియు నడలి బాలకుడు కిక్కురుమనక యాతనము ననుభవించెను. తానెన్నడు నెవ్వరితోనైన గలహించి యెఱుగడు.

మిత్రులందు పోరుపొసగినపుడు గడుకౌశలమున దాని నాత డుడిపి మరల వారియందు పొందుగూర్చువాడు.

మేనత్త యాదరానురాగముల నందుచు కొన్నేండ్లీతడు కడపినాడు. వయసు హెచ్చుకొలది వాని జ్ఞానపిపాసకూడ హెచ్చుచుండెడిది. ఇప్పటివలె అపుడు మనదేశమున వలసిన విద్యాసంస్థలు తలసూపలేదు. నారాయణగంజిలో నొకచిన్నబడి యుండెడిది. అందు కొంతదనుక మాతృభాష బోధింపబడు చుండెను. మూడుతరగతులవఱకు మాత్రమందు శిక్షణావ్యవస్థ యుండెను. ఆపాఠశాలయందు చదువుముగించి ఆతడు కూర్చుండవలసి వచ్చెను. అపుడు వానిచింతకు మేరలేకుండెను. దసరా సెలవులలో తండ్రియింటికి మరలివచ్చినపుడు "నాయనా! నేను కలకత్తాపోయి చదువుకొందును" అని యాతడు దీనదయాళునితో విన్నవించెను. "తండ్రీ! మనము నిరుపేదలము. కలకత్తా మహానగరములో నగు వెచ్చము సామాన్యమైనదికాదు. నిన్నచ్చట జదివించు

టకు నాకు సాధ్యముకాదు. ” అని జనకుడు ప్రత్యుత్తరమొసగెను. బాలకుడు మిగుల దుఃఖించెను. కాని బారుగా నిరాశజెందక ఉన్నతపాఠశాల లెందెందు గలవో అరయసాగినాడు. డక్కాలో నెన్నియో విద్యాసంస్థలు కలవని ఆతడు వినినాడు. నారాయణగంజికి డక్కా పదిక్రోశముల దూరమందున్నది. అచ్చట చదువవలెననిన అనుదినము చెప్పరాని శ్రమకు గుఱికావలెను. శ్రమనుతలంపక అచటికరిగి చదువుగొనెదనని దుర్గాచరణుడు మేనత్తతో విన్నవించెను. వలదని ఆమె వారించినది. తోడిబాలురును వారించిరి. కాని అతడు వారి వచనములకు చెవియొగ్గినాడుకాడు. ఎవ్వరితోడను చెప్పక మఱునాడు ప్రాతఃకాలమున కొన్నియడుకులను మూటగట్టుకొని అతడు డక్కాకు పయనమయ్యెను. డక్కా జేరి అచ్చటి విద్యాసంస్థ లన్నిటిని పరిశీలించి తనచిత్తమునకువచ్చిన పాఠశాలను నిర్దిష్టముజేసికొని సంధ్యకడచిన పిదప స్వస్థలమునకు మరలినాడు. మేనత్త బాలకునికై పగలంతయు నిందందు గలయవెదకుచు దుఃఖముతో నల్లాడుచుండెను. బాలుడు మరలివచ్చినపుడు ఆమెయందిన ఆనందమునకు మేరలేకుండెను. ఆదరించి వానికి నీళ్ళుబోసి అన్నముబెట్టి అనంతరము “పగలంతయు నెచ్చట మసలినావు నాయనా? ” అని యామె బాలకునడిగినది. తాను డక్కా పోయిన వృత్తాంతమంతయు తెలిపి “అత్తా! రేపే నేను బడిలో జేరనిశ్చయించినాను ఉదయము ఎనిమిదిగంటలలోపున రెండుమెతుకులు వండి నాకు పెట్టుము ” అని ఆత డామెను ప్రార్థించినాడు.

బాలుని వేడికోలును నిరాకరించుటకు ఇక నామె మనసీయకొనలేదు. “నీయిష్టము నాయనా! త్రోవలో నీకెట్టికష్టము కలగకుండ శ్రీరాముడు నిన్ను కాపాడును ” అని ఆయమ పలికినది.

మఱునాడు రేపకడలేచి ఈశ్వరుని ప్రార్థించి కాలకృత్యములు తీర్చుకొని మేనత్తవండిన యన్నమును భుజించి ఇంచుకపైకమును చేకొని బాలకుడు డక్కా పోయి నార్మల్‌స్కూలులో ప్రవేశించినాడు.

ఆపాఠశాల యందాతడు పదునేను మాసములు విద్యార్థియై యుండెను. పదునేను నెలలలో రెండుదినములు మాత్రము (మేనత్త యస్వస్థయై యుండుటచే) ఆతడు బడికి పోజాలకపోయెను. ఎండ దుస్సహమైనను వాన యవిరతమైనను మంచు దురంతమైనను జంకుగొంకులకు చోటీయక వెసుకంజవేయక

ఎంతయో మేర నడచి నడచి సకాలమున బడిజేరుకొనుచుండవాడు. పరిశ్రమము మిగుల నుత్కటమగుటచే వానిశరీరము క్రమక్రమముగా క్షీణింపసాగెను. "చదువుటకై డక్కాకుపోవుచుండుటచే నేనెంతో కష్టపడుచుంటినని యెవ్వరును తలపరాదు. కొంచమైనను నాకు శ్రమలేదు. అడవిలో నొక యడ్డుదారి కలదు. నేనాదారి ననుసరించి పోవుచున్నాను. డక్కానుండి తిరిగి వచ్చునపుడు ఒకకాని అటుకులనుగాని మురమురములనుగాని కొని జేబులో బోసికొందును. ఆకలివేసినపుడు కొంచెము కొంచెముగా వానిని నోటబోసికొని మెల్లమెల్లగా తినుచు మరలుచుందును" అని యాతడు తెలుపుచుండువాడు. ఒకనాడు బడి నుండి మరలునపు డాత డొక భూతమును విలోకించెను. ఆయనుభవమును గుఱించి నాగమహాశయు డిట్లువచించెను.

"భూతప్రేతములు లేవనిచెప్పరాదు. అవి మిథ్యలుకావని పరమహంస దేవుండు పలికినాడు. డక్కాలో చదువుకొనుదినములలో నొకనాడు అరణ్యమధ్యమున నొక చెరువునకు సమీపమున నే నొక పిశాచమును చూచితిని. అది యొక చింతచెట్టు నాశ్రయించి యుండెను. పడమటిదిక్కున చెట్టుకొమ్మపై నది నిలిచియుండుట నేను చెంత నడచుచు జూచి చివాలున చకితిలబడిపోతిని. పిశాచమును తేఱిచూచితిని. ఎంతసేపుచూచినను అది యందుండి తొలగి పోలేదు. నేను తన్ను జూచినట్లే నన్నది దేఱిచూడ దొడగినది. దానికి నేనెట్టి చెట్టనైనను చేయునపుడు నాకది యెట్టిచెట్టనైన నేలజేయునని యెంచి గుండెను చలింపనీయక నేనట్టులే కూర్చునియుంటిని. కొంతసేపట్లే కడచినది. అనంతరము లేచి నిలిచి ముందులకు మెల్లగా సాగిపోతిని. చెట్టుక్రింద నున్నంతసేపు అదేమియు బలుకలేదు. ఏమియు జేయలేదు. కాని నేను కొన్నియడుగులు వేసిన యనంతర మది పకపక నవ్వసాగినది. నవ్వు సామాన్యమైనదికాదు. నేను వెన్కకు మరలి చూడలేదు. పరుగెత్తక మెల్లగ నడచిపోతిని. ఆమార్గము నుండి పోయివచ్చునపుడు పిదప మూడుపర్యాయము లాగ్రహమును చూచి యుంటిని. ఎన్నడుగాని నాకది ఎగ్గుచేయలేదు. సుపరిచితమానవుని వీక్షించు నట్లే నేనాపిశాచమును వీక్షించువాడను.

బాలకుడైన దుర్గాచరణుని ఆతని యుపాధ్యాయులో నొక్కడు తన కొడుకు వడువున ప్రేమించుచుండువాడు. అనుదినము చదువునకై ఆతడెంతో

దూరము నడచివచ్చుటజూచి అంతరంగమున నాతడెంతో బాధపడుచుండు వాడు. ఒకనాడు బాలు నుద్దేశించి సాదరముగ నాత డిట్లు పలికెను.

"నాయనా! చదువుకై నీవెంతో కష్టపడుచున్నావు. నీశ్రమజూచి నపుడు నాగుండె నీరగుచున్నది. నీవు నాయింటనుండి చదువుకొనిన యెడల మిగుల సంతోషించెదను. నాకేదేని కష్టము కలుగునని తలపకుము." "నడచి వచ్చుచున్నాను కావున నేను శ్రమపడుచుంటినని తాము తలవకుడు. అవ్యాజమైన తమవాత్సల్యమునకు కృతజ్ఞుడను. భక్తితో తమకు ధన్యవాదములు సమర్పించుచున్నాను. నాకై చింతింపకుడు. పాఠశాలయం దున్నపుడు తమచరణోపాంతమున నాకు తావొసగుచుండుడు. ఎప్పటివలె నన్ను నడచియే బడికి రానిండు." అని చేతులుజోడించి వినమ్రుడై బాలకుడు ప్రత్యుత్తర మొసగెను. "జ్ఞానిపిపాసువైన ఈబాలకుడు కాలక్రమమున నెంతవాడగునో!" అని ఆశ్చర్యాన్వితుడైన ఆ యాచార్యుడు అనుకొనెను. సజీవుడై యుండిన యెడల తనయూహ నిక్కమైనదని యెఱింగి ఆత డానందభరితు డయ్యెడివాడు.

ఒకనాడు డక్కానుండి మరలివచ్చుచుండగా 'ఫతుల్లా' యను పల్లెను బాలకుడు చేరునప్పటికి భయంకరమైన గాలివాన వానిని మార్కొనినది. నలువలకులందు కారుచీకటులు క్రమ్ముకొనెను. గుండెలవియునట్లు మేఘములు గర్జించుచుండెను. పిడుగులు దిక్కులను ప్రతిధ్వనింపజేయుచుండెను. ప్రళయము భూమిపై విజృంభించుచున్నట్లు బాలకునకు తోచెను. ఊరివారు తలుపులను బిగించుకొనిరి. పల్లెమధ్యనుండి పోవుచు బాలు డెవ్వరి యరుగుమీాదనైనను తడయలేదు. తలుపుతట్టి యెవ్వరినైనను పిలుచుటకు వాని మానస మీాయ కొనలేదు. ఒరుల కెట్టికష్టమునైన కలిగించుట వాని ప్రకృతికి ప్రతికూలమైన పని, కావున నూరిలో నెందైన తడయక వాయువు మఱింత తీవ్రముగ వీచు చున్నను, మెఱపు వెలుగున తెన్నుజూచుకొనుచు, బాలుడు ముందంజ వేయు చుండెను. కొంతదూరము పోయినపిదప కాలుజారి పథపార్శ్వమందలి చెరువులో నాతడు పడిపోయెను. అందుండి లేచుట కాతడెన్నో యత్నములు సలిపెను. ప్రయత్నము లన్నియును వితథములయ్యెను. ఒడ్డుననుండిన దుబ్బును పట్టుకొని లేవ నాతడు పిదప ప్రయత్నముచేసెను. కాని అది తెగిపోయినందున నాతడు మఱింత లోతునీటిలో కూలబడెను. రాత్రి కొంతసేపట్లే కడచిపోయెను. గాలి

అల్లే వీచుచుండెను; వాన అల్లే కురియుచుండెను. అపుడు అశ్రుప్లావితమైన మేనత్తముఖము ఆతనిస్మరణకు వచ్చెను. ఇంకను ఇంటికి తాను తిరిగి పోనందున తనకై ఆమె ఎంత పొగులుచున్నదోయని ఆతడు దుఃఖింపసాగెను. చలిలో వడవడ వణకుచు రామనామమును స్మరించుచు చెరువులోనిలిచి నడుమ నడుమ వెలికివెచ్చుటకు ఆతడు బహుధా యత్నించుచుండెను. ఎట్టకేల కాతడు గట్టు జేరజాలెను. తన కేవిపత్తుగాని ఘటిల్లలేదను భావముతో మెల్లమెల్లగానాతడు నడచిపోయెను. ఊరి పొలిమేర చేరునరికి మేనత్త కాతరస్వర మాతని చెవుల బడెను. చేతనొక లాంతరుగొని గృహమువీడి డక్కాపోవు మార్గమున పొల ములందు మేనల్లుని "నాయనా! దుర్గాచరణా!" అని గద్గదస్వరమున నాయనద పిలుచుచుండెను. కడువడిగ నాతడుపోయి ఆమెను జేరుకొనెను. తటాలున బాలకుని కవుంగిలించుకొని ఆయమ పెద్దపెట్టున నేడువదొడగెను. "అత్తా! ఇంత దుఃఖమెందులకు? నాకేమి ముప్పుకలుగలేదు. వచ్చుచు త్రోవలో తడిసినాను. అంతియే" అని యాతడు ప్రత్యుత్తరమొసగి ఆమెకు ధైర్యము గొలిపినాడు.

తానుపడినపాట్లను ఆతడెన్నడు లెక్కించి యెఱుగడు. వానిని గుఱించి ఏవేళనైనను తన మేనత్తతో నాతడు తెలుప సాహసింపడయ్యెను.

డక్కాపాఠశాలలో దుర్గాచరణుడు విశేషకాలము విద్యాభ్యాసము కావింపలేదుకదా! కాని ఆయల్పసమయమందే ఆతడు వంగవాఙ్మయమున చక్కని పాండితిని పడయజాలెను. వాని యక్కరములు ముద్రాక్షరములను బోలి యుండునవి. ఆతనిరచనము సర్వాంగసుందరమై గంభీరభావబంధురమై తాత్త్వికవిభూతికనెలవై యొప్పెడివి. కాని ఆతడు తనవ్రాతలను సన్నిహిత మిత్రులకైనను చూపక మఱుగుపఱచువాడు. వైద్యవిద్యాభ్యాసముకొఱకై అనంతరమాతడు కలకత్తాపోయినపుడు తనవ్యాసములను క్రోడీకరించి, 'ఉప దేశమంజరి' యనునామముతో ప్రచురించెను. అందలియుపదేశములు విశే షము బాలురకై యుద్దేశింపబడినవి కావున గ్రంథప్రతులు బాలకుల కుచిత ముగా పంచి పెట్టబడినవి. నేడును అవి దేవభోగగ్రామమున పిల్లలకు మిగుల గూర్పు నెచ్చెలులై యున్నవి.

దుర్గాచరణుని అచిరములో నొక యింటివానిని జేయవలెనని, తన యుద్దేశమును వానిమేనత్త సోదరుని కెతింగించెను. వెంటనే వివాహము నిశ్చయమయ్యెను. విక్రమపురమునకు సమీపమందలి 'రాయిజదియా' లో వసించు నొక యైశ్వర్యవంతుని తనయ పదునొకండేండ్లబాలిక వానియర్థాంగి యాయెను. దుర్గాచరణునకు పరిణయమైననాడే వేఱొక ముహూర్తమున వానిశారద వివాహితయయ్యెను. ఐదుమాసములు కడచిన యనంతర మాతడు కలకత్తాపోయి కేంబెల్ మెడికల్ స్కూలులో ప్రవేశించినాడు.

అందాతడు పదునెనిమిదిమాసములు మాత్రము విద్యాభ్యాసము చేయ జాలెను. అనంతరము సుప్రసిద్ధహోమియోవైద్యుడైన బీహారలాల్ భాదురి యొద్ద శిక్షణమందుచు బహుళరోగులను పరీక్షించువాడు. వానిపత్ని ప్రసన్న కుమారి యుక్తవయస్సునందియు భర్త కలకత్తాలో విద్యార్థియై యుండుటచే పుట్టింట గాలక్షేపమును చేయుచుండెడిది.

దుర్గాచరణుడు సెలవుదినములలో స్వగ్రామమునకు పోవునపుడు వాని మేనత్త మిక్కిలి మక్కువతో వాని భార్యను రావించెడిది. కాని ఆచిన్నదాని మొగమును చూచినంతనే దుర్గాచరణుని యొడలు కంపించిపోయెడిది. సంధ్య యైనంత నాతడు తనయింటికి కొంతదూరమందున్న చెట్టుమీది కెగ్రాకి కొమ్మలందు గూర్చుండువాడు. భార్యనుచూచినపుడు తనమనసు చెదరిపోవు నని ఆతడు అడలుచుండువాడు. "ఆమెను మఱుగున నుంచివేతు" నని మేనత్త మాటయిచ్చిన యనంతరమే చెట్టునుండి దుర్గాచరణుడు దిగువాడు. మేనల్లుని ప్రవర్తన మాయమ మానసమున కెంతేనివ్యథ గలిగించెడిది. కాని కాలక్రమమున నాతడు దారిబడునని ఆమె యాశపడినది. ఆయాశ నిరాశయే యైనది.

దుర్గాచరణుడు కలకత్తాలోనుండగా పుట్టింటనాతనిభార్య రక్తగ్రహణిచే బాధపడి అకాలమృత్యువు పాలబడెను. కోడలిమరణము దీనదయాళునకును ఆతనిసోదరికిని దుస్సహమైన సంతాపమును గలిగించెను. ఆంతరంగికముగ వివాహవిముఖుడైన వానికి అర్థాంగియై నంతపించిన బాలికకై దుర్గాచరణుడు కొండొకవడి పరితపించినాడు. కాని సంసారబంధమునుండి తన్ను విడపించుట జగదీశుని యుద్దేశమని యోచించి ఆతడు తనమనస్సును కుదుటబఱచుకొనెను.

కాని తనయూహా సరియైనదికాదని ఆత డచిరములో గ్రహింపగలిగెను. మరల గోడలిని దెచ్చుకొనుటకై దీనదయాళుడు ప్రయత్నములు కావింపదొడగెను. తాను కలకత్తానువీడి యెందైనను విశేషకాలము మనలుటకు వీలులేదు కావున నూతనవధువు నన్వేషించుభారము నాత డల్లునిపై నిడెను.

జనకుని యత్నములు దుర్గాచరణుని మనసునకు యాతనమునే కలిగించెను. తనచిత్తము నాతడు విశేషించి వైద్యవృత్తిపై నిలుప గడంగినాడు. హోమియోపతి మందులుగల చిన్నపెట్టెనుకొని రోగులయిండ్లకుపోయి వారికి సేవచేయుచు ఉచితముగ వారి కాత డౌషధము లొసగుచుండెను. వ్యాధి కారణము నవలీలగ గుర్తించుటం దాతడు అజేయుడని అద్వితీయుడని ఆతని యాచార్యుడు భాదురి పలుకుచుండువాడు. ఆతని చేతిమందు దివ్యౌషధమే యని అనేకు లూహింపసాగిరి. వాని హస్తమహిమ అద్భుతమైనదని పలువురు వచించుండిరి. క్రమక్రమముగ దుర్గాచరణుని గృహముచుట్టు రోగులసంఖ్య అధికమాయెను. వాంఛించియుండినచో వైద్యవిద్యార్థియైయుండినపుడే ఆతడు విశేషధనము నార్జింపజాలువాడు. కాని వాని జీవితాశయము మానవసేవగాని ధనార్జనముకాదు. నిరుపేదలకును అభాగులకును యువకుడైయుండగనే ఆతడు ప్రత్యక్షదైవమ ట్లగపడువాడు.

పరోపకారము కావింపజాలు తరుణము తనకు లభించినపుడు నాగమహాశయుడు పరమానందభరితుడగుచుండువాడు. ఆతనిదృష్టిలో హీనకృత్యమనునది ఏదియును లేదు. ఇరుగుపొరుగువారును తండ్రికి పరిచితులైనవారును, ఆతనిచే బజారుపనులు చేయించుకొనుచుందురు. కూరగాయలనేగాక వారి బియ్యపుబస్తాలను కట్టెలమోపులను బొగ్గులమూటలను సయితము మోయుట కాతడించుకైన సంశయించువాడుకాడు.

ఆపదలోపడి అల్లాడువారిని జేరి వేయివిధములవారిని సేవించుటకై ఆత డనవరతము ఉవ్విళ్లూరుచుండును.

ప్రేమచంద్రమునిషీ యను ధనాఢ్యుడు కలకత్తాలో 'హాట్ఖోలా' యను ప్రదేశమున వసించుచుండెను. గృహమున రూకలరాసులు వెలయుచున్నను ఆతడెన్నడును గృహకృత్యములను నిర్వర్తించుటకై పరిచారకు నెవ్వని నియోగించి యెఱుగడు. తమ్మునివరుసగల దూరపు చుట్టమొకడు

నిరుపేదయై వాసియింట వసించుచుండెను. ఇంటిని అలుకుట వంటనుచేయుట నీటినితోడుట వీధినితుడుచుట దూడలనుసేవించుట మొదలైన పనులన్నిటిని ఆయభాగుడే చేయవలసివచ్చెడిది. మున్సీమహాశయుడు అనుదినము గంగా స్నానము చేయుచుండును. ప్రతిదినము ప్రాతఃకాలమున దుర్గాచరణుని ఇంటికివచ్చి ఆతడిచ్చు హుక్కాను పీల్చి పీల్చి కాయమునకు నూనె పులుము కొని అనంతరము స్నానార్థము గంగానదికిపోవుట ఆతని యలవాటు. ఈతీరున దినములు కడచుచుండ నాతనియింట బనిచేయుచుండు అభాగుడు ఆకస్మికముగ మరణించెను. నిత్యకృత్యములభారమే ఆనిరుపేద బ్రదుకును కడముట్టించి యుండును. మున్సీ లుబ్ధాగ్రేసరచక్రవర్తియని ఎల్లఱు నెఱుగుదురు. ఎవ్వరితో ప్రసగించిన నేమివెచ్చమగునోయని నష్టమో కష్టమో తనకు దాపురించి తీరునేమో యని యడలి ఆతడొంటరైత్తుబ్రతుకు కడపుచుండువాడు. తనయింట దమ్ముడనబరిగిన నిరుపేద మరణించిన పిదప శవమును కదలించు వెరవువానికి తోపదాయెను. ఎవ్వరును వాని గుమ్మమును త్రొక్కిచూచుటకు ముందంజ వేయరైరి. లక్షాధికారులైన తోడిజాతీయుల యిండ్లకుపోయి వారి సాహాయ్యము నాతడు వేడుకొనెను. ఎవ్వరుగాని కన్నెత్తి వానిని జూచుటకైన నిచ్చగింపరైరి. పదపడిసామాన్యుల యిండ్లచుట్టు తిరిగి చేయూతనర్థించెను. కొందఱు వెక్కిరించిరి. మఱికొందరు కసరికొట్టిరి. ఏమియు పాలుపోక ఆతడల్లాడుచుండుటగని నాగమహాశయుడాతనిజేరి తన సేవను పరిగ్రహింపుమని వానిని వేడుకొనెను. అట్టి కార్యమునకు తనయుడొక్కరుడు పోవుటగని దీనదయాళుడు తొట్రుపాటుతో వానివెంట బరుగిడెను. ఇరువురు శవమును శ్మశానమునకు గొనిపోయి విధ్యుక్తముగ దహనసంస్కారము గావించిరి.

వైద్యవిద్య నభ్యసించునపుడే దుర్గాచరణునకును సురేశు చంద్రదత్తు డను యువకునకును మైత్రి కలిగెను. సురేశునకు బ్రహ్మసమాజమతమునెడల నభిమానముమెండు; నాగమహాశయునకు సనాతనమతమునెడల ప్రీతిమెండు. విగ్రహారాధనమును సురేశుడు తీవ్రముగా విమర్శించువాడు. ఆవిమర్శనమును నయమున ప్రతిఘటించుట తనపవిత్రకర్తవ్యమని దుర్గాచరణు డూహించువాడు.

"నిర్గుణోపాసనము ఘనతరమైనదనుట నిస్సంశయము. కాని ఇది ఎల్లఱకు సాధ్యముకాదు. బహుసంఖ్యాలకులకు సగుణోపాసనము మిగుల

నావశ్యకమైనది. కొంతకాలము విగ్రహారాధనమును గావించినగాని వారి కేకాగ్రదృష్టి యలవడదు. మంత్రతంత్రములు కూడవని చెప్పుటకు ఏహిందువు డును సాహసింపడు. క్రమతపస్సు కతన బ్రహ్మజ్ఞానమలవడును" అని నాగ మహాశయుడు సురేశునకుత్తర మొసగుచుండును.

తమయభిప్రాయములందు వ్యత్యాసములు గోచరించినను సురేశుడు దుర్గాచరణుని హృదయమహత్త్వమెఱిగి అతనిమ్రోల భక్తిశ్రద్ధలతో మెలగు చుండును. బ్రహ్మజ్ఞానమందుగల అధ్యాత్మికశక్తి నిక్కముగ నాతనికి కలదని విశ్వసించుచుండును. అనుదినము సాయంసమయమున సురేశుడు నాగమహా శయుని గలసికొనుచుండును, కలసినపు డిరువురకు వాదప్రతివాదములు జరుగు చుండును. గాని యనవరతము వారుకావించు గోష్ఠి తత్త్వశాస్త్ర మతశాస్త్ర ములకు సంబంధించినదే. వారొనరించు తర్కము అముష్మికాంశములను గుఱించినదే. సౌహృద్యభావమే వారియందు అశ్రాంతము వెలసినది.

సురేశుడు తఱచుగ నాగమహాశయుని కేశవచంద్రసేన్ స్థాపించిన సమాజమందిరమునకు గొనిపోవుచుండువాడు. కేశవచంద్రుని వచఃకౌశలము కతన దుర్గాచరణుడు ముగ్ధుడగుచుండువాడు. సమాజమందలి ఆచార్యవ్యవహార ములు ఆతనికానందము గొలుపకున్నను సమాజముదృష్టిలోగల ప్రధానా శయముల కాతడు అంజలి ఘటించువాడు. సమాజప్రకాశిత చైతన్యచరితము, రూపసనాతనచరిత్రము, మునల్మానుభక్తుల జీవితచారిత్రము, మున్నగు గ్రంథముల నాతడతిశ్రద్ధతో పఠించుచుండువాడు. నవవిధాన సమాజమువారి గేయములను మోహనోద్వేగముతో నాలపించువాడు.

ధర్మనిష్ఠాగరిష్ఠుడై పవిత్రచరిత్రుడై లోకాచార దేశాచార గృహ స్థాచారముల ననుష్ఠించుచు మెలంగు నాగమహాశయుని జూచి కొందఱు తమ తమ యభిప్రాయములను మార్చుకొన దొడగిరి. నాస్తికులనేకు లాస్తికులైరి. బాలకుడై యున్నపుడు "హాతిమ్‌తాయ్" గ్రంధానువాదమును మిగులశ్రద్ధతో పఠించినను స్వసంప్రదాయారాధమునుండి ఏముహూర్తమందైన నాతడు దూరస్థుడుకాలేదు.

వైద్యశిక్షయందు వానిమక్కువ క్రమక్రమముగ క్షీణింప సాగినది. శాస్త్రచర్చయందే కాలక్షేపము చేయుటకై అత డువ్విళ్ళూరుచుండువాడు.

భిషగర్వ్యాడైన భాదురితోఁగల సంపర్కమును పరిత్యజింప నాత డుద్యుక్తు డాయెను. కాని తండ్రి యాన తలపై నిలిచియుండుటచే ఆత డట్లొనరింప జాలడయ్యెను. నాగమహాశయుడు సంస్కృతభాష నంతగా నెఱుగడు. కావున శాస్త్రానువాదములును పురాణ భాషాంతరీకరణములును వానికి విశేషముగ శరణ్యములయ్యెను. పండితులు కన్నుల బడినపుడు వారిని ప్రార్థించి శాస్త్ర మర్మములను వేదాంత రహస్యములను ఆతురపాటున తెలిసికొను చుండువాడు. అస్వస్థుడైయున్న దినములయందు నయితే మాతడు గంగాస్నానమును మాను వాడుకాడు. ఏకాదశీవ్రతము నతి భక్తితో నెఱపుచుండువాడు. ప్రతిదినము సాయంకాలమున 'కుమారటులి' ఘట్టమునకు సమీపమందున్న శ్మశాన క్షేత్రమునకు పోవుచుండువాడు. చింతాకుల హృదయుడై నడిరేయి కడచు వఱకు అందే వసించుచుండువాడు. గంభీరనిశీథినీ సమయమున లంబితశవము లను వక్షములబూని చితులు అల్లనల్లన జ్వలించుచుండ మననమున వసించు అశ్వత్థ వృక్ష పత్రములు హిల్లోలస్పర్శకతన గావించు మర్మర రవముతో సమీపముననుండి స్రవించు సురశైవలిని నిజనాదమును సహకరించి జీవన మరణములను గుఱించిన కరుణగానము నాలపించుచుండ నాగమహాశయుడు చింతామగ్నుడై యధివసించి శ్మశానక్షేత్రము ననిమేష లోచనుడై వీక్షించుచు "అనిత్యము అనిత్యము అనిత్యము. సర్వము అనిత్యము. బ్రహ్మన్ మాత్రము నిత్యము సత్యము. ఈశ్వర సాక్షాత్కార మందజాలనేని నాజీవితమంతయు వ్యర్థమే యగును. జగదీశు నేతీఱున జేరగలను నాకు దారిజూపువారెవరు!" అని తలపోయువాడు. తలపోయుచుండ నాతని కన్నులనుండి జాహ్నవీతోయ మున కీడువచ్చు బాష్పవారి యవిరళముగ జాలువారు చుండెడిది.

శ్మశానవాటికకు తఱచుగా సన్న్యాసులును సాధకులును వచ్చుచుండు వారు. కన్నీరోడ్చుచు చేతులుజోడించి నాగమహాశయుడు వారిని సమీపించి తనసందేహములను దీర్పుడనియు తానువలచిన మార్గమును చూపుడనియు వారిని వేడుకొనుచుండువాడు. కాని వారిప్రత్యుత్తరములుగాని ప్రసంగములు గాని జీవితవిధానములుగాని ఆతనికి నచ్చకుండెను. మీదుమిక్కిలి అవి వాని హృదయమునకు దురంతమైన సంతాపమును కలిగింపసాగెను.

శ్మశానమున జపతపములు చేయుటకై వచ్చువారిలో నొకవృద్ధబ్రాహ్మణుడు నాగమహాశయునిదృష్టి నాకర్షించెను. ఆతడు పవిత్రచిత్తుడనియు మహాత్ముడనియు దుర్గాచరణు డవలీల గ్రహించెను. నిమిత్తమైనను కాలహరణమును కావింపక కృపా భిక్షబెట్టుమని ఆతనిచరణముల నాశ్రయించెను. విప్రుడాతని యెడల కరుణించి తాంత్రికసాధనమున వానిని బద్ధదీక్షితు గావించి షట్చక్రములందలి రహస్యములను వానికి విశదపఱచెను.

అనంతరమా వృద్ధవిప్రుడు జాహ్నవీతీరమున నిహలోకయాత్రను ముగించెను. గురువచనములను స్మరించుచు నాగమహాశయుడు ప్రతిదినము అర్ధరాత్రిమున శ్మశానవాటికకుపోయి ధ్యానమగ్నుడై యుండువాడు. ఒకనాడు ధ్యానముచేయుసమయమున వానికన్ను లెదుట అద్భుతమైనజ్యోతి యొండు తేజరిల్లెను. దుర్గాచరణుని ఆనందమునకు మేరలేకుండెను. ద్విగుణీకృతభక్తిశ్రద్ధలతో నడిరేయి మననమునకుపోవుచు నేకాగ్రచిత్తముతో హరగిరిజలను ధ్యానించుచుండువాడు. జగమంతయు నిస్తబ్ధతయందు నిదిరించువేళ బరిసరమున వెలారువియున్నది ఉమామహేశులగలసి తారకమును జపించుసమయమున శ్మశానక్షేత్రమున భూతగణములు యథేచ్ఛగవిహరించు ముహూర్తమున దివిదెసనెగయు చితిమంటలు మనుష్యజీవితమందలి యర్థమును బట్టబయలుచేయు కాలమున హృదయకవాటమును తెఱచి అశేషభావవివహమునకు నిజాంతరంగమున స్వాగతమొసగి అద్భుతమైన ఆధ్యాత్మిక అనుభూతి నందుచు ఆతడు చాలరాత్రి కడచువఱకు అందే యధివసించువాడు.

తనయుని జీవితవిధానమును కనిపెట్టి దీనదయాళుడు మిగుల తత్తరపడెను. తరుణవయసున నాతడు సన్యాసులతోగలసి విరాగియై వర్తించుట తండ్రి కిష్టము లేదు. మరల వానికి పెండ్లిచేసినగాని ఆతడు శ్మశానవాసియై తనకు దూరస్థుడై యుండునని వృద్ధుడు అడలెను. తగిన సంబంధము నన్వేషింపుమని ఆతడల్లునకు వ్రాసెను. వివాహము నిశ్చయమగుట కాలశ్యము కాలేదు. శుభవార్త తండ్రి తనయున కెఱిగించెను. ఆవార్త తనూభవునకు దుఃఖవార్తయే యయ్యెను. “నాకు వివాహము వలదని ఆతడు తండ్రితో వినమ్రుడై విన్నవించెను. దీనదయాళుడు తనయుద్దేశమును మార్చుకొనదలచుకొనలేదు. కొడుకున కాతడు పెక్కుపర్యాయములు నచ్చచెప్పెను కాని ప్రయోజనము

లేకపోయెను. క్రోధముతో దుఃఖముతో వృద్ధుడు ఆహారము నంటుట మాని వేసెను. కొడుకుకూడ ఉపవాసవ్రతమును ఆరభించెను. ఇరువురచిత్తములును దురంతమైన క్షోభతో నిండిపోయెను "సంబంధము కుదిరినది. పెద్దమనుష్యుల మ్రోల వాగ్దానము చేసితిని. ఆడినమాట దప్పి అనృతవాదినై ఈ మునలితన మున నీమూలమున పాపము మూటగట్టుకొనుచున్నాను" అని తండ్రి పలికెను.

"వలదనినను ఒకపర్యాయము నాకు వివాహము చేసితిరి. ఆబాలిక మరణించినది. ఇపుడు మఱియొక బాలికను వెతకితెచ్చి మృత్యువునకు సమ ర్పింప దలపడుచున్నారా?" అని దుర్గాచరణుడు వచించెను.

"దురదృష్టమువలన ఆబాలిక మరణించినది. ఇప్పుడుకూడ ముప్పు వచ్చునని తలచుట తప్పు. నీవు నాబిడ్డవు; నాకోరిక ననుసరించి మెలగినపుడే నీకు సర్వశుభములు చేకుఱును. నాశాపము నీకు తగులరాదు దూరము యోచింపుము" అని దీనదయాళుడు పలికెను.

ఒకదిక్కున జనకుని వాంఛయును వేఱొకవైపున అంతరాత్మ కావించు ప్రతికూల ప్రబోధమును దుర్గాచరణునకు విశేషవ్యథకలిగించినవి. తండ్రి కొన్నినాళ్ళాతడును ఉపవాసదీక్ష నెఱపినారు కాని తన గట్టిపట్టును సడలించు కొనినాడుకాడు. "తండ్రీ! వివాహమువలన నాకు దుఃఖము కలుగునుగాని సుఖము కలుగదు. నన్నుమరల బంధింపబూనుకొనక మీసంకల్పమును పరిత్య జింపుడు. కోడలువచ్చి మీకుచేయు సేవకంటె వేయిమడుగులు మిన్నయగు సేవ మీకు నేను చేతును. క్షమించి నన్ను నిర్బంధపెట్టకుడు." అని చేతులు జోడించి ఆతడు జనకుని వేడుకొనెను.

పుత్రుని విషణ్ణవదనమును విలోకించినంతన తండ్రిగుండె నీరైనది. ఏమను టకును ఏమిచేయుటకును ఆతనికి పాలుపోలేదు "ఎవ్వనికై ఈపెండ్లి తలపెట్టి తినో వాని కది సుఖదాయకముకాక దుఃఖహేతువగుచో నేనీ యత్నమును సాగింపనేల? కాని వీనితో నావంశము నిర్వంశమగుననియు పితృదేవతలకు నీరు వదలువారుండరనియు దలపోసినపుడు ఆంతరంగికమైన నాదుస్థితి దుస్సహ మగుచున్నది. ఏమిచేతును?" అని వృద్ధుడు తనలో దాను వాపోయెను.

మఱి కొన్నిదినములు కడచెను. వివాహమునుగుఱించిన ప్రసంగమును తనయునిమ్రోల తండ్రి మరల దెచ్చుట కిచ్చగింపలేదు. కోపించి తర్కించియు

ప్రతిమాలియు బోధించియు కొడుకు మనసు ద్రిప్ప బ్రయత్నించి వృద్ధుడు తన యాశ నిరాశజేసికొనెను.

ఒకనాడు దుర్గాచరణుడు అకస్మికముగ తండ్రి శయనించిన గదిలోని కరిగి చూచునప్పటికి ముదుసలి బోరగిలబడి వెక్కి వెక్కి యేడ్చుచుండెను. యువకుని గుండె నీరైన "ఇహజీవనమున నాకు తండ్రికంటె పూజనీయుడైనవా డింకొక్కరుండు లేడు. జనకునికంటె నాకొరులెవ్వరునులేరు. నాకై ఆతడింతగా దుఃఖింపనేల? పరిణయము బంధనహేతువేయైనను పితృవాక్యమును పాలించి తండ్రియుల్లమును చల్లపఱచెదను." అని యాతడు నిశ్చయముచేసికొని చివా లున తండ్రినిజేరి ఆతడు తిరిగి చూచినింతనే భక్తిభరితాంతరంగుడై ఆతని చరణద్వంద్వనమునంటి "నాయినా! క్షమింప బ్రార్థించుచున్నాను. నామూల మున మీమానసమునకెంతో యాతనము కలిగినది. ఇక మీయాజ్ఞ నుల్లం ఘింపను మీరు చెప్పినట్లు వివాహము చేసికొందును." అని పలికెను.

వృద్ధుడు ఆశ్చర్యాన్వితుడయ్యెను. ఆశ్రుసిక్తనయనములతో నాత డాత్మజు నాలింగన మాచరించుకొనెను.

"ఇక మీరు శుభముహూర్తము నిశ్చయము చేయవచ్చును" అని దుర్గాచరణుడు పలికెను.

"తండ్రీ! నామానమును ధర్మమును కాపాడితివి. ఈశ్వరుడు నీకు సర్వవిధముల శుభము చేకూర్చును." అని తనయునితో పలికి దీనదయాళుడు శుభవార్తను పాల్‌సోదరుల కెఱింగించెను. వారును ఎంతేని పరితోషమంది పెండ్లివెచ్చమందలి కొంతభాగమును తాము వహింతుమని మాటయిచ్చిరి.

కన్నతండ్రి మనసు నలరింపగలిగినను నాగమహాశయుడు తనమనసును తానలరించుకొనజాలకపోయెను. దినమంతయు నాతడిందును అందును పిచ్చి వానివలె తిరిగెను. సాయంకాలమునకు గంగాతీరమును చేరుకొనెను. తన హృదయవ్యథ నాతడెవరితో చెప్పుకొనును? చాలసేపాతడు వెక్కి వెక్కి యేడ్చెను. నా డాత డన్న మంటలేదు. నీరు త్రావలేదు. తండ్రికేసంగతియును తెలియలేదు. పురోహితులను పిలపించి వివాహముహూర్తమును నిశ్చయిం చుటకును బంధుమిత్రులకు శుభలేఖలు వ్రాయుటకును పరిణయ సంబారములను కొనుటకును దీనదయాళు డాదినమును వ్యయించెను. పెద్దవైద్యునితో కొడుకు

కాలక్షేపము చేయుచుండెనని ఆతడూహించినాడు. తనయశ్రుపూరమును జాహ్నవీపూరముతో కలిపి నిశీథమున మూడుయామములు సరిత్తీరమునకడపి దుర్గాచరణుడు తనయాచార్యుడైన చికిత్సకుని ఇల్లు చేరుకొనెను.

పెండ్లికొమరుని దుస్తులనుతక్క వివాహమునకు వలసిన సమస్త వస్తువులను దీనదయాళుడు కొనినాడు. తనమనసునకు నచ్చిన వలువనే కొడుకు కొనవలెనని తండ్రి అభిలషించినాడు. కాని దుర్గాచరణునిబుద్ధి దుకూలముల మీదికి పోలేదు. కావున జనకుడే వానినికొని ప్రయాణభేరి మ్రోగించినాడు

పెండ్లికిపోవునాడు సయితము నాగమహాశయుడు యథాప్రకారముగా గంగానదికరిగెను. అతడు మరలునపుడు సురధునిమ్రోల సాగిలపడి "అమ్మా! నీవు పతితపావనివి. సంసారమున కూలిపడినపుడు నన్ను పంకిలము సోకినచో కరుణించి నీవాపంకమును కడిగివేయుము. సుఖదుఃఖములందు నాకు నీచరణ సాన్నిధ్యమున నించుకస్థాన మొసగుము." అని యాతడు ప్రార్థించినాడు. సురాపగతనవేడికోలును మన్నించుననియే విశ్వసించి ఆతడు నాడు తండ్రితో కలసి కలకత్తానుండి కదలినాడు.

స్వతస్సిద్ధముగ వివాహము గర్హనీయమైన దని నాగమహాశయుడు తలపలేదు. నియమబద్ధజీవులై బ్రహ్మచర్యమును నెఱపి తొల్లింటిమునిముఖ్యులు కొంతకాలము గృహస్థులై యుండిరనియు వ్యాస శుకదేవులును సనకసనత్కుమారులును అట్టి మహాత్ముల నందనులే యనియు నేడానిష్ఠగాని దీక్షగాని లేకుండుటవలన వివాహమందలి యాధ్యాత్మిక మూల్యము కొఱవడినదనియు గావున దాను పరిణయమునకు దూరముగ నిలుచుటే యుచితమనియు నాత డూహించియుండెను. నేడాయూహను మనసునుండి తఱిమి జనకునాజ్ఞనే దల దాల్చెను.

నిర్దిష్టముహూర్తమున వివాహము జరిగెను. బంధుమిత్రులందఱును పరితోషమందిరి. కాని నాగమహాశయుని హృదయమునుండి దుఃఖము దూరీకృతము కానేలేదు.

ఒకని యధీనమందుండి సేవచేయుట దుర్గాచరణుని ప్రకృతి ప్రతికూలము. కావున అతడేయుద్యోగము నైనను ఆపేక్షింపలేదు. వైద్యవృత్తినే అవలంబించి స్వతంత్రజీవియై యుండవలెననియే నిశ్చయించి వివాహానంతర

మాతడు తండ్రితో కలత్తాకు మరలిపోయెను. వైద్యవృత్తి నారంభించినాడు కాని నోరు తెఱచి ఎవ్వనిగాని ఆతడు పైకము నడుగదలచకొనలేదు. తమంత దాము రోగులిచ్చు దానిని ఆతడు కైకొనుచుండువాడు.

ఇట్లుండ మేనత్త మంచముపట్టెనను దుర్వార్త ఆతనిచెవులబడెను. ఆతురపాటున నాతడు స్వస్థానమునకు పరిగెడెను. ఘనగుణముగల ఔషధముల నామె కొసగి బహుభంగుల నామెకు సేవసలిపెను. ప్రజ్ఞాధురీణులైన చికిత్సకులను నియోగించి ఆమె నెట్లైన బ్రదికింపవలెనని బహుధా ఆతడు ప్రయత్నించినాడు. కాని ఆతని యత్నములన్నియు వితథము లయ్యెను. మేనల్లునకు ధైర్యము చెప్పి వేయిరీతుల నాతని నాశ్వీరదించి వానియంకతలమున తనశిరము నిడికొని కొంతసేపు ధ్యానసమాధిలో నుండి అనంతరము రామనామము నుచ్చరించుచు ఆపావనగుణశోభిత తనప్రాణములను పాసెను.

నాగమహాశయు డింతకు మున్ను తనకైగాని తనవారికైగాని దుఃఖించి యెఱుంగడు. శైశవమందే ఆతనితల్లి పరమపదించెను. తల్లి నంతగా యెఱుగకుండుటచే తల్లికై యాతడు తల్లడిల్లలేదు. తొలిజాయ దివంగతయైన పిదప ఆమెకై యాత డారాటపడలేదు. అమ్మలేనిలోపమును ఆతని మేనత్త తీర్చివైచెను. నే డామె తన్ను బాసి స్వర్గమును చేరుటచే దుర్గాచరణుడు తనధైర్యమును బొరుగా గోలుపోయెను. వానిదుఃఖము దుస్సహమయ్యెను. ప్రతిదినము రాత్రులందు శ్మశానభూమి కరిగి మేనత్త భౌతికకాయమునకు అగ్నిసంస్కారము జరిగిన తావున పడియుండి పరిపరి విధముల పరిదేవన మొనరించువాడు. తానుకూడ శవమువలె చాలాసేపందుపడియుండువాడు. ఒకొక్కప్పుడు అడవికి పోయి అంధకారమున అడగియుండువాడు.

దుర్గాచరణునిసోదరి శారద సమస్తోదంతమును తండ్రికెఱుకపఱచెను. అన్నకై వెతుకుకొనుచు ఆయనద పోయెడిది. ఆతడు పిచ్చివానివలె నుంటగని తాను మిక్కిలి పొగులుచుండెడిది. తమయింటి వెనుక నున్న దొడ్డిలో నాతడు పొరలుచుంట నామె తెఱచుగాజూచి మిగుల శోకించి వానిపాదములంటి అందుండి అన్నను లేవదీసి ఆతనికి స్నానముచేయించి బ్రతిమాలి అన్నమును పెట్టుచుండెడిది. ఆహా తోబుట్టువుప్రేమ ఎంతమహాత్తరమైనదో! తనయువలన

కొడుకు స్థితినెఱిగి దీనదయాళుడు సెలవుగైకొని వానినిజేరి బహుభంగుల వాని నూఱడించి అనంతరము కలకత్తాకు తీసుకునిపోయెను.

కొంతకాలము కడచెను. దుర్గాచరణుని దుఃఖము కొంతదనుక ఉపశమించుట నిక్కమే. కాని ఆదుఃఖమునకుమాఱు తీవ్రమైన తుపానొకటి వాని చిత్తమున చెలరేగసాగెను. మానవజన్మకు సంబంధించిన సమస్యలెన్నో ఆతని మానసమును మార్కొనినవి. "మానవుడీ ప్రపంచమున నేలపుట్టి ఏలగిట్టును?" "మరణాంతరమున జరుగునదేమి?" "నామేనత్తయాత్మ యే లోకమున కెగసిపోయెను?" "నాపై నీగనైన వ్రాలనీయకుండుటకై ప్రాణములను సమర్పించుటకై సిద్ధపడుచుండెడి యామె నేనింతగా తనకై పొగలుచున్నను నన్నుగాపాడ రాదేమి?" "మత్యువుతో సమస్త బాంధవ్యసూత్రములును తెగిపడుచో 'నే నెట్టివాడను; అదినాది' అని మానవుడు విఱ్ఱవీగనేల?" "దుఃఖపూరితమైన ఈప్రపంచమున మానవుడు వచ్చిపడనేల?" "ఈలోకమున పుట్టి మానవుడు చేయవలసిన కర్తవ్యమేది?" "యాతనపాలబడుచున్న ఆత్మను చావుపుట్టుకులనుండి తప్పించుటెట్లు?" ఈరీతిప్రశ్న లాతనిస్వాంతమున నింతింతరాని సంక్షోభమును బుట్టించెను. సంశయనివారణమునకై వేయివెరవులు రోయుచు తఱచుగా నాతడు ధ్యానమగ్నుడై యుండువాడు.

రోగులు తమకు తోచినపైకమునె యిచ్చినపుడు సంతోషముతో వానిని గైకొనుచు వారేమియు నీయజాలని వేళలయందు తానూరకొని ఆనంద పురస్సరముగ వారిని సేవింపుచు తీవ్రవ్యాధుల నెన్నిటినో కుదుర్చుచు బలువుర కాతడు తలలోనినాల్కయై ప్రవర్తించుచుండుటచే వానివృత్తి విశేషాభివృద్ధి నందినది. ఆతని సహాయము నపేక్షించు రుగ్ణులసంఖ్య అధికమైనది.

దుర్గాచరణుడేయాడంబరము నెఱుగడు. రోగులెంతదూరమున వసించుచున్నను వారికడకాతడు కాల్నడకను బోవుచుండును. తనకై బండికుదుర్చబడినను తననడకనె సాగించుచుండువాడు. సామాన్యములైన వస్త్రములను దాల్చుటే ఆతని యభ్యాసము. మంచిదుస్తులను ధరించినయెడల కొడుకువృత్తి వృద్ధియై లాభదాయకమగునని ఆశపడి దీనదయాళుడు విలువగల వలువలను కొని వానికొసగెను. వానిని కైకొనక "తండ్రీ! వీనికై వెచ్చించిన ధనమును

నిరుపేదల కూడుగుడ్డలకై వ్యయించి యుండవలసినది. వీని నోరులకు దానము చేయుడు." అని దుర్గాచరణుడు ఆతనితో వచించెను. తండ్రియేమియు బలుక లేకపోయెను. ఎవరెచ్చట వ్యాధిగ్రస్తులై యున్నారో వెతకి వారికి మందొసగి తగురీతిని వారిని సేవించినగాని అన్నమునంటుట కాత డిచ్ఛగింపడయ్యెను. మందులకు మాత్రమేగాక రోగులకువలసిన పథ్యమునకుకూడ సొంతపైకమును వెచ్చించుటకై ఆతడు ముందంజవేయుచుండును. తెరువులందు పడియుండు అభాగుల మూపునజేర్చుకొని తనయింటికి గొనిపోయి వారి కన్నపానాదు లొసగి వలసిన చికిత్సచేయుట వానియలవాటు. బిచ్చగాండ్రనోళ్ళయందు మేలి ముద్దలిడుట కాతడు ముచ్చటపడుచుండును.

ఒకనాడొక నిరుపేదయింటికి వైద్యము చేయుటకై నాగమహాశయుడు పోయెను. రోగిస్థితి మిగుల శోచనీయముగా నుండెను. నాలుగు గంటలసేపు రోగికి శుశ్రూషజేసి దుర్గాచరణు డాతని కౌషధము నొసగెను. రోగిని చూచుటకై రాత్రి మరల వానియింటి కరిగెను. శీతకాలము చలి తీవ్రముగా నుండెను. వేయిరంధ్రములుగల చిన్నగుడిసెలో రోగి వసించుచుండెను. నీలాకాశము ఇంటికప్పునకు దిగువనున్నట్లే తోచుచుండెను. రోగియొంటిపై నేగుడ్డయునులేదు. వానిస్థితిని విలోకించినంత నాగమహాశయుని గుండె నీరయ్యెను.

"వీని తెవులు తీవ్రమయినది. చలిబాధవలన అది మరింతతీవ్రము కాగలదు. ఈవిధముగా నీయభాగుడు మఱికొంతసేపు పడియుండినయెడల వీనిప్రాణము లచిరములో నెగసిపోవును" అని తలపోసి తాను కప్పుకొనియున్న సాలువును దీసి అల్లన రోగిశరీరమును దానితో కప్పి దుర్గాచరణుడు మెల్లగ నందుండి తొలగిపోయెను. వాధిగ్రస్థుడు వైద్యుని పలుమాఱు పిలచెను. అవ్వలినుండి "భయములేదు, రేపు మరలవత్తును" అని చెప్పి నాగమహాశయు డదృశ్యుడయ్యెను. తానందిన సాహాయ్యమునకు మిగుల నలరి మఱునాడు రోగి వైద్యునకు కృతజ్ఞతాపూర్వకముగ ధన్యవాదములు సమర్పించెను. "నాయనా! ధన్యవాదము లెందులకు? ఇందు విశేషమేమియునులేదు. నీచలిని తొలగించుట నాకర్తవ్యము. కావున పచ్చడమును నీకిచ్చిపోతిని." అని నాగ మహాశయుడు ప్రత్యుత్తరమిచ్చెను.

చిరమైన నిష్పచ్చరమువలన దురంతరయాతనమునకు గుఱియైన దీన దయాళుడు ధనార్జనమువలనగాని తనకుటుంబము కష్టములనుండి కడవనేరదని గ్రహించెను. కొడుకు తమకువలసిన విత్తమును సంపాదించునని ఆతడాశపడెను. ఆతనియాశ అడియాసయయ్యెను. కొడుకు చెయ్వులు వానికి నచ్చకుండెను. కొంచెముసేపు చికాకుపడి తన యసంతృప్తిని ఉపవాసవ్రతము మూలమున వ్యక్తీకరించుట వాని యలవాటు. పైకమును కన్నులజూడకుండుటేగాక తన వస్త్రములను రోగులకు తనయుడొసంగుచుండుటజూచి ఆతడు కుపితుడగుచుండెను. నాటి యుదంతమువిని ఆతడు అహారమునంటినాడుకాడు. కొడుకు కూడ తండ్రి మార్గమే యనుసరించెను. ఇరువురును ఒకదినము ఉపవాసవ్రతమును నిర్వహించిరి. మఱియొక పచ్చడమును ఆత్మజునకు కొనియిచ్చి తండ్రి యాహారమునంటెను. తోడ్తోడనే దుర్గాచరణుడు తన నిరాహారవ్రతమును విరమించెను.

మఱియొకదినమున వేఱొకరోగికి చికిత్సచేయుటకై నాగమహాశయుడు వానియింటికి పోయెను. వ్యాధిగ్రస్థుడు నేలపై బడియుండెను. “ఈయభాగునకు మంచము లేదుకదా!” యని తలపోసి గిఱ్ఱున నిజగృహమునకు మరలి వచ్చి తన మంచమును తలపైనిడుకొని దుర్గాచరణుడు దానిని రోగిసదనమున జేర్చెను. పిదప వాని నందు పరుండబెట్టి తన శుశ్రూష నారంభించెను.

ఒకకుటుంబములోని శిశువు కలరా వలన బాధపడుచుండెను. అదివిని నాగమహాశయుడు ఆకుటుంబమున్నచోటికి పరుగున బోయెను. తాను ఆహారమును గొనక పగలంతయు శిశువుచెంగట నిలచి ఆతడు చికిత్స జేసెను. కాని దురదృష్టవశమున బిడ్డ బ్రతుకలేదు. “నేటిశ్రమకై ఈతడు చాలపైకమును చేపట్టగలడు” అని నాగమహాశయుని నెచ్చెలియైన సురేశు డూహించెను. సంధ్యానంతరమున దుర్గాచరణుడు వట్టిచేతులతో నిజాలయమును జేరుకొని “పాపము! ఆకుటుంబమువారికి ఆతడొక్కడేబిడ్డ. ఎంతయత్నించినను శిశువు బ్రతుకలేదు. ఇపుడు వారిగృహము శూన్యమైపోయినది” అని విలపించుచు మిత్రునితో పలికెను. నాటిరాత్రి నాగమహాశయు డన్నము నంటలేదు. పానీయము గొనలేదు.

దుర్గాచరణుని ఔషధములు అమోఘములని కాలక్రమమున నెల్లఱకు విశదమయ్యెను. ఎట్టితీవ్రవ్యాధులైనను వాని హస్తమహిమవలన గుదురునని ఎందఱెందఱో విశ్వసింపసాగిరి. పాల్ సోదరులు నాగమహాశయుని తమ కుటుంబవైద్యునిగా నియోగించిరి. ఒకప్పుడు వారి యాఁడుచుట్టమొకర్తుక కలరావలన బాధపడెను. దుర్గాచరణుడు ఆమెకు చికిత్స చేయసాగెను. వ్యాధి తీవ్రమగుటచే తన యాచార్యుఁడైన భాదురిని పిలపించి ఆమె నాతని చికిత్సకై వదలివేయగడంగినాడు. నాగమహాశయుని చికిత్సావిధానమును ఆతడు ప్రయోగించు మందులను పరిశీలించి మిగుల సంతసించి తనకంటె తన శిష్యుడే ఘనతరప్రజ్ఞ గలవాడని పాల్ సోదరులతో పలికి అంతేవాసిని ప్రశంసించి భాదురి నిష్క్రమించెను. దుర్గాచరణుని యత్నమువలననే ఆ యభాగిని బ్రదికినది. పాల్ సోదరులు పరమానందభరితులై ఒక వెండిపెట్టెను రూకలతో నింపి ఆతని ముందల బెట్టిరి. సోదరులకు నమస్సు లర్పించి పెట్టెను గైకొనజాలనని నాగమహాశయుడు వచించెను. తన శ్రమకుతగిన ప్రతిఫలము ముట్టలేదని వైద్యుడూహించెనని యపోహపడి వారు మఱియేబదిరూకలు సమర్పింప సమకట్టిరి. కాని పెట్టెనుగాని రూకలనుగాని తీసుకొనుటకు దుర్గాచరణుడు సమ్మతింపలేదు. విషయము తండ్రికి పాల్ సోదరులు తెలిపిరి. "సిరివచ్చినపుడు మోకాలొడ్డెదవేమి? ఈవిధముగ ప్రవర్తించితివేని వృత్తిలో ముందంజ వేయజాలుదువా?" అని వృద్ధుడు పలికెను.

ముసలితనమున నెంతో శ్రమించి కొలదిపాటి రూకలను నెలనెలకు సంపాదించుచు దీనదయాళుడు నిక్కముగ వ్యథజెందుచున్నాడు. కావున కొడుకు అవలంబించు పద్ధతి ఆతనికి సంతసమునుగాక సంతాపమునే కలిగించుచుండెను.

"ధర్మమార్గమునుండి కదలిపోరాదని మీరేకదా నాకు హితవొసంగిరి. ఆ యభాగినికైన మందులవెల ఆఱురూకలకంటె అధికముకాదు. ఏడుదినములు మాత్రము నేను సేవచేసితిని. దినమునకు రెండు రూకలకంటె నధికమైన పైకమును తీసుకొనుట అన్యాయముకాదా? అధర్మముకాదా? మొత్తము సోదరుల నుండి ఇరువదిరూకలను తీసికొనవచ్చును అంతియే! మీరాసొమ్మును పరిగ్రహింపుడు" అని నాగమహాశయుడు నతజానువున్నై తండ్రితో విన్నవించెను.

"సంతోషపూర్వకముగా మిత్రులొసగిన పారితోషికమును అధర్మ కర్మగా పరిగణించితివా ?" యని దీనదయాళుడు ప్రశ్నించెను. కాని దుర్గా చరణుడు తనపట్టును సడలించుకొనలేదు.

"దోషమని నే తలచినదానిని చేయజాలను. ఇట్టిచేత చెఱుపు తెచ్చి తీరును. సత్యస్వరూపుడైన జగదీశునిదృష్టి నిడికొని సత్యము కొఱకై నాజీవిత మును వినియోగించుట నాపవిత్రకర్తవ్యము. ఏమిఘటిల్లినను ఘటిల్లనిండు. అంతరాత్మ తెలుపుదానికి ప్రతికూలముగ నేను ప్రవర్తింపజాలను." అని నాగమహాశయుడు వినయముతో జనకున కెఱింగించెను. పూజ్యులను అనవ రతము పూజసేయువాడయ్యును తన భావస్వాతంత్ర్యమును దుర్గాచరణు డెట్లు కాపాడుకొనుచుండువాడో యూహింపుడు.

ధనముకొఱకును కీర్తికొఱకును ఎన్నో ఎత్తులువేసి ఎన్నో జిత్తులుపన్ని ఐహికజీవితమునందు జెండా యెత్తగలవా రెందఱో కలరు. వీరికిని నాగమహా శయునకును చుట్టపుచూపులు లేవు. న్యాయప్రవర్తనమునకును పవిత్రజీవితము నకును భంగము వాటిల్లనితీఱున మానవుడు ధనమును సంపాదింపవలెననియు అట్లొనరింపజాలనిచో ఆతడు తిరిపెమెత్తి బ్రదుకుటకు సంశయింపరాదనియు దుర్గాచరణు డూహించెను.

సులభముగా మాసమున కాతడు నాలుగు నూఱుల రూకలను సంపా దింపజాలియుండును. కాని వంచనమునకు పాలుపడని ముహూర్తములయందు నిక్కముగా వానిచేత చిక్కినవి ముప్పది నలువది రూకలుమాత్రమే. అవి లభించిన తరుణమందే వాని నాతడు తండ్రి చరణోపాంతమున సమర్పించు చుండును. తన కట్టుబట్టలకు సయితము స్వతంత్రించి ఆతడు పైకమును వెచ్చింపలేదు. తండ్రియిచ్చు బట్టను మిగుల సామాన్యమైనదానిని ఆతడు కట్టును.

నియమబద్ధజీవులను పవిత్రచిత్తులను మోసగించుట కెందఱేని తలపడు. చుందురు. తమవలెనే ఎదుటివారును ఉదారాశయులను పాటింతురని మహా నీయగుణగరిష్ఠు లూహించుచుందురు. కాలక్రమమున ప్రవంచనము పాలబడి వీరు నష్టకష్టములకు తలలొగ్గుచుందురు. ఇట్టివారిలో దుర్గాచరణు డొక్కడు. ఎందఱెందఱో ఆతనిని వంచించి పైకమును గొనిపోవుచుందురు. నిక్కములు

కాని యిక్కట్టులను గుఱించి పెక్కువృత్తాంతములు చెప్పి ఆతని ధనమును కొల్లగొట్టుకొని పోవుచుందురు. బదులని పెద్దమొత్తములకై ఆతనిని సమీపించి ఆతని దైనికసంపాదనము నెప్పటికప్పుడు ఎగదన్నుకొని పోవువారు కొందఱు కలరు. నాగమహాశయు డింటనున్నపుడును లేనపుడునుకూడ వాని గుమ్మముకడ వేర్వేఱు తెఱగుల ప్రజలు గుమికూడి యుండెడివారు అని ఆతని పరిచితులు వంగసీమయందు నేడును వచించుచుందురు. దినమునకు పదునేను రూకలను సంపాదించునపుడుకూడ దుర్గాచరణుడు నిరాహారియై యుండవలసి వచ్చెడినని వారనుచుందురు. వానిచేత పైకముపడుట తడవుగ పూర్వోక్తజను లాతనిచుట్టు గుమిగూడుచుందురు. పరక్షణమున తనగతి ఏమగునో తలపక చేతపడిన మొత్తమును యాచత్తు అర్థితుల కొసఁగుచుండును. కొన్నికానులు తనకు మిగులుచో వానితో నడుకులనుకొని వానిని నోటబోసికొని గ్రుక్కెడు నీరు మ్రింగుచుండును. సురేశుడు మున్నగువారు సమ్ముఖమున నిలుచువేళలందు వంచకులు ముదంజవేయుటకు సంశయించువారు. ఆవేళలందు చేజిక్కు పైకమునే ఆతడు జనకున కిచ్చుచుండును. "పుట్టించినవాడు గిట్టింపడు. కూడు గుడ్డలకై తపింపనేల? ఈశ్వరునకు సంపూర్ణముగ నాత్మార్పణము కావించుకొని వ్యక్తి ఇహాపరసాధనమున కక్కఱైనసామాగ్రి నందితీఱును. స్వార్థమును పోనాడి చరించితిమేని మనకు శుభమే చేకూఱును. తొట్రుపాటునకుగాని అడలు పాటునకుగాని తలయొగ్గనేల?" అని తఱుచుగా నాతడు తెలుపుచుండును.

మతము మాటయెత్తి నీతిబాహ్య క్రియలకు కడంగువా రగపడునపుడు ఆతడు కుపితుడగువాడు. వైష్ణవ దంపతులవలె వేషములు దాలిచి ఇరువురు పాపులు ఒకనాడు తమగుమ్మముచెంత దోచినంతన పెక్కురీతుల వారిని మందలించి వదలినాడు.

పెద్దమనిషి యనబరగిన ధనాఢ్యు డొకడు ఒకనాడు వైద్యసాహాయ్యమునకై నాగమహాశయుని తన గృహమునకు ఆహ్వానించినాడు. దుర్గాచరణు డాతనియిల్లు చేరినంతన అందకత్తెయైన ఒక వితంతువును వానికిచూపి చిఱునవ్వు నవ్వుచు "ఈమె గర్భవతియైనది గర్భము పోవుటకై తాము మందొసగవలెను." అని చెప్పుచు పళ్ళెమునిండ రూకలుంచి వాని నాతడు

వైద్యునిప్రోల బెట్టెను. నాగమహాశయుని శిరము గిఱ్ఱున దిరిగి నేలగూలినట్లు అయ్యెను. విషయమును గ్రహించుట కాతనికి ఆలస్యము కాలేదు. పవిత్రమైన ఆగ్రహము ఆతని హృదయమున విజృంభించినది. "అయ్యా! ఒక యభాగినిని తోడుకొనివచ్చి ఆమె శీలమును చెఱచితివి. ఘోరమైన పాపము చేసితివి. ఇపుడు భ్రూణహత్యకు పూనుకొనుచున్నావు. మరియొక పాతకమున కొడిగట్టుచున్నావు. ఈ దౌష్ట్యమునకు నీవు కడంగరాదు. అని పలికి రూకలు పక్కెరము నందే వీడి దుర్గాచరణు చరచరబోయి సుప్రసిద్ధ బ్రహ్మసమాజ మతబోధకుడైన శివనాథ శాస్త్రినిజేరి పూర్వోక్తవ్యక్తి దుష్టయత్నమును ప్రతిఘటించు నుపాయమును తెలుపుమని ఆతనిని వేడుకొనెను. ఇరువురు పరిచితులను నాగ మహాశయునకు తోడిచ్చి చట్టము ననుసరించి తగుచర్య గావింపుమని శాస్త్రిజీ ఆతనికి సలహాయొసగెను. చట్టము ననుసరించి కాకున్నను అనునయించియు ప్రబోధించియు కొలదిమంది తోడుపాటునంతయు భ్రూణహత్యను ప్రతిఘటింప వలెనని దుర్గాచరణుడు నిశ్చయించుకొనెను. కాని దృఢసంకల్పముతో నాతడా పెద్దమనిషియింటికి పోవునప్పటికి వితంతువును దోడుకొని ఆతడు వారణాసికి పాఱిపోయెననువార్త వానిచెవుల బడెను. తనయుద్దేశము సిద్ధింపక పోవుటచే నాతడు మిగుల శోకించి కొలదిదినములు ఉపవాసము గావించెను.

తొల్లింటికంటె నిపుడు కొంచము హెచ్చుమొత్తమును కనుల జూచు చున్నను దీనదయాళుడు వంటకై ఎవ్వరిని నియోగింపక తానే ఆపనిని నిర్వహించుచుండెను. తండ్రి చేయిగాల్చుకొనుట కొడుకున కిష్టములేకుండెను. కావున నాగమహాశయుడే ఇంటిపను లన్నిటిని నెఱపి వంటకై నడుముగట్టువాడు. ఆతడిట్లు లొనరించుచుండుట జనకునకు గిట్టకుండెను. ఈ కర్తవ్యమును గుఱించి ఇరువురనడుమ వాదప్రతివాదములు చెలరేగెడివి. కొంచెము యోచించి దీనదయాళుడు వియ్యంకునకు జాబువ్రాసి కోడలిని కలకత్తా రావించెను. ఇపుడామె బాలిక కాదు. స్వీయధర్మమును గుర్తించిన గృహిణి. భర్తకును మామగారికిని ఆమె బహుభంగుల సపర్యలు చేయదొడంగినది. కాని పాపమాయిల్లాలు నిజేశుని మానసము నాకర్షింపజాలదాయెను. దైనిక వైద్యవృత్తిని నిర్వహించిన యనంతరము లభించిన అవకాశమందు దుర్గాచరణుడు శాస్త్రములను పురాణములను చదువుచుండువాడు. అపుడపుడు తండ్రి

చెంత గూర్చుని ఆతని మనసునకునచ్చు పురాణభాగములను చదివి వినిపించు వాడు. ధ్యానమందును ప్రార్థనమందును కొంతసేపు కడపుచుండువాడు.

భాగవతమందలి భవకానన వర్ణనమును జడభరతోపాఖ్యానమును దుర్గా చరణుని చిత్తమును కలచివైచెను. జడభరతునివోలు మహాత్ముడు హరిణశాబకమువిూది మక్కువకతన మరల భవసాగరమున బడవలసి వచ్చినపుడు తన వంటి సామాన్యుడు ఎన్ని పుట్టువులందు దొరలవలసివచ్చునో యని ఆతడు ఆరాటపడదొడగెను. మాయకుగల అనిర్వచనీయశక్తిని అచింతనీయప్రజ్ఞను తల పోసినకొలది భీతివిహ్వలచిత్తుడగుచుండువాడు. మహామాయ హస్తమునుండి పరిత్రాణమును పడయు వెరవేదియనియు సంసారబంధమునుండి ముక్తినందు ఉపాయమెద్దియనియు రేబవళ్ళాతడు తలపోయగడగెను. వివాహము గావించు కొని అర్థోపార్జన మొనరించుచు సంకెలకు సంకెలను జేర్చుచుంటినని ఆతడు పొగులదొడగెను. రోగులకు సేవచేసినంతన తనయాహారమును నిరుపేదలకిచ్చి నంతన తనకర్తవ్యము చెల్లిపోలేదని ఆత డడలినాడు. " కామినీకాంచనములు నాకేల ? ఈశ్వరసాక్షాత్కారము నందుటెట్లు ? నరజన్మను సార్థకము గావించు కొనుటెట్లు ? ఏమి సాధన మొనరించినయెడల ఏమహాత్ముని సేవించినయెడల నేనుద్ధరణము నందగలను ? " అను ప్రశ్నలు మాటిమాటికి వాని మానసదిశా వలయమున నుదయింపసాగెను.

ఆదినములలో సురేశుడు కొందఱు బ్రహ్మసమాజమతస్థులను దోడుకొని గంగాతీరమున కరిగి ఉపాసనము గావించువాడు. నాగమహాశయుడు వారి జట్టులోజేరి ఒకతట్టున ధ్యానించుచు కూర్చుండువాడు. ఉపాసనానంతరమున సంకీర్తనము జరిగెడిది. కీర్తనసమయమున దుర్గాచరణుడు నృత్యము చేయు చుండువాడు. నృత్యముచేయుచు నాత్మవిస్మృతుడగుచుండువాడు. నాగమహా శయుని తన్మయనృత్యమును విలోకించి సురేశ ప్రభృతు లాశ్చర్యాన్వితులగు చుండిరి. నృత్యముచేయుచు చేయుచు ఒక్కొకపుడు దుర్గాచరణుడు చివాలున పడిపోవుచుండును. ఆసమయమున వానికెన్నేని దెబ్బలు తగులుచుండును. ఒకనాడు నృత్యముచేయుచు దటాలున నాతడు గంగానదిలో పడిపోయెను. సురేశ ప్రభృతులు తోడనే జలగర్భమున లంఘించి ఆతనిని పైకిదీసిరి.

తలఁచుఁగ వాని హృదయమున భావోద్వేగము విజృంభించుచుండును. కొన్నికొన్ని వేళలం దాతడు ఆయుద్వేగమును సంవరణ మొనరించుకొన సమర్థు డగుచుండును.

ఒకనాడు యోగి యొక్కరుండు నాగమహాశయుని గలసికొని "ఓయీ! ఈశ్వరునియెడల నీకుగల భక్తిశ్రద్ధలు ప్రశంసనీయములే! కాని నీ కీభక్తి శ్రద్ధలవలన విశేషప్రయోజనము చేకుఱదు. గురుకటాక్షమంది మంత్రోప దేశము నంది క్రమతపసున బద్ధదీక్షితుడవైన ముహూర్తమున ఈశ్వర సాక్షాత్కారము నందజాలుదువు." అని చెప్పి తడయక నిష్క్రమించెను.

యోగిమాటలు చెవిబడినప్పటినుండి దుర్గాచరణుని మానసమందలి అశాంతి మఱింత హెచ్చసాగెను. అనుదినము జాహ్నవీకూలమున కరుగుచు అందు నధివసించియుండిన సన్యాసుల సమ్ముఖమున గూర్చుండువాడు. కరుణ బూని తనకు వారుపదేశము గావింతురను ఆశతో చాలరాత్రి కడచువఱకు అట్లే ఉపవిష్టుడై యుండువాడు. ఇట్లు కొన్నిదినములు కడచెను. ఒకనా డాతడు గంగాతోయమున గ్రుంకులిడుచుండ బడవ యొకటి ఒడ్డు జేరుకొనెను. నావనుండి ఆతని కులగురువు దిగి దుర్గాచరణుని చెంతకు బిలచి "జగద్ధాత్రి యానను శిరమున దాల్చి నీకు మంత్రోపదేశము చేయుటకై వచ్చితిని." అని వచించెను. యువకుని ఆనందమునకు మేరలేకపోయెను. తనయారాటము నెఱిగి తనయెడల గరుణవహించి తనయుద్దేశమును సిద్ధింపజేయ సమకట్టి విశ్వజనని కులగురువును తనపాలికి పుత్తెంచెనని ఆతడు తృటిలో గ్రహించినాడు. పరి తోషపరవశుడై దుర్గాచరణుడు గురుదేవుని చరణద్వంద్వము నంటెను. ప్రణ మిల్లిన శిష్యుని ఆచార్యుడు గృహమునకు గొంపోయెను. మఱునాడు శుభదిన మగుటచే మిగుల నలరి కులగురువు దుర్గాచరణునకును ఆతని అర్ధాంగికిని శక్తిమంత్రము నుపదేశించెను.

ఉపదేశానంతరము నాగమహాశయుడు విశేషదీక్షతో మంత్రమును విశేషపునశ్చరణ మొనరింపసాగును. రాత్రులను ధ్యానజపములందే ఆతడు గడుపుచుండెను. తప్పక అమవసనాడు ఉపవాసముచేసి నిశియైనంతన గంగా తీరమున కరిగి ధ్యానము చేయుచుండువాడు. ఆసమయమున వానికి బాహ్య జ్ఞానమే యుండెడిదికాదు. ఒకనాడు దుర్గాచరణుడు గభీరసమాధియందుండగా

ఉత్తాలతరంగములు వానిని తాకి నదీగర్భములోనికి గొనిపోయెను. స్మృతి నందిన యనంతర మాతడు తీరమునకు నీదుకొనివచ్చెను.

చంద్రుని భిన్నరూపముల ననుసరించి నాగమహాశయుడు తన యాహార మును తగ్గించి సామాన్యపరిమాణమును చేరువఱకు హెచ్చించుచుండెను. ఈవఱలో నాతడు బిల్వపూజను పుష్పపూజను విశేషముగా నెఱపుచుండు వాడు. ఇపుడు ఆతడు ధ్యానమనననిధిధ్యాసములకై అధికసమయమును వ్యయించుచుండెను. ధ్యానాంతరము దుర్గ నుద్దేశించి స్వకపోలకల్పితములైన పాటలను పాడుచుండువాడు.

క్రమక్రమముగా దుర్గాచరణుని వైద్యవృత్తికి ముసలము రాదొడగెను. ఇతరచికిత్సకులనుచేరి ప్రజలు సత్వరముగ తమయక్కఱలను దీర్చుకొనుచుండిరి. క్రమక్రమముగ నిప్పచ్చరము దుర్గాచరణుని గృహమున ప్రవేశింప దొడగినది. ఎదుర్కొనినముప్పును పరికించి దీనదయాళుడు ఖిన్నుడయ్యెను. కొడుకువైఖరిని కోడలిస్థితిని తిలకించినపుడు వానిగుండె చెరువుకాదొడగినది. అన్నవస్త్రము లను గుఱించిన లోపమేదియు నామెకు కలుగకుండ వృద్ధుడు జాగ్రత్తతో మెలగుచుండెను. కొడుకు సంపాదన మెట్లులైనను తాను శ్రమించి తెచ్చు కొలదిరూకలను కోడలి యక్కఱలకై తొలుతనాతడు వెచ్చించుచుండెను. కాని కోడలికి వలసినవి కూడుగుడ్డలు మాత్రమే కావని ఆత డెఱుగును. ప్రాణ పతి ప్రణయదృష్టి ఆమెపై ప్రసరింపకపోవుటచే వృద్ధుడు దుఃఖితుడాయెను. విషణ్ణవదనయైన వధువు నుద్దేశించి నాగమహాశయు డిట్లు పలుకుచుండువాడు. “ శారీర సంబంధము చిరస్థాయికాదు. ఈసంబంధముపట్ల నొక్కపర్యాయము మక్కువ జూపితిమేని భవపరంపరలందు మోహాబద్ధులమై యుందుము. రక్త మాంసములతో ధమనిస్నాయువులతో ఎముకల ప్రోవుతో నిండిన ఈశరీరము నకు మమకారము జూపకుము. జగజ్జనని చరణ కమలములను సేవించుటే మన యిర్వుర కర్తవ్యమని గ్రహింపుము. ఈ సేవయే మనకు ముక్తిని ప్రసా దించును. ”

అర్ధాంగి నాతడు విషయవాంఛతో నెన్నడు వీక్షింపకున్నను ఆమె నాదరించుచు ఆమె హృదయమునకు శక్తి జేకూర్చుచుండును. తాను తపసి యైనట్లామెను తపస్విని గావించినాడు.

క్రమక్రమముగా దీనదయాళుని ఆరోగ్యము శిథిలము కాదొడగినది. ధనార్జనమును విసర్జించి తండ్రి కేవలము ఈశ్వరారాధనమునందే తనకాలమును కడపవలెనని దుర్గాచరణుడు వాంఛించినాడు. పాల్ సోదరులయొద్ద తండ్రిచేయు కర్తవ్యమును తానేచేయుదునని చెప్పి నాగమహాశయు డాతనిని స్వగ్రామమునకు పంపెను. వృద్ధునకు సేవసలుపుటకై కోడలి నాతనితో పంపివైచెను.

సురేశు డెప్పటియట్లు నాగమహాశయుని గృహమున కరుదెంచుచు ఆతనితో వైజ్ఞానిక ప్రసంగము సలుపుచు ఆతని వేడికోలును మన్నించుచు దఱచుగ నాహారపానీయముల నందే పడయుచుండెను. దుర్గాచరణున కీప్రసంగము హృదయశాంతిని ప్రసాదింపకుండెను. "వట్టిమాటలవలన ప్రయోజనమేమి? ఈశ్వరసాక్షాత్కారమునందు వెరవునరోయుట మన కర్తవ్యము" అని యాతడు మిత్రునితో పలికెను.

సురేశుడు తఱచుగ కేశవచంద్రసెన్ స్థాపించిన బ్రహ్మసమాజమందిరమునకు పోవుచుండును. దక్షిణేశ్వరమున నొక యోగి కలడనియు ఆతడు నిరంతరము భావసమాధియందు ఆత్మవిస్మృతుడై యుండుననియు సురేశుడందు వినెను. నాగమహాశయుని వెంటగొని ఆ యోగీంద్రుని దర్శింపవలెనని సురేశు డుద్దేశించెను. కాని వేఱుప్రసంగములందు కాలక్షేపము జేయుచు రెండు నెలలు దాటువఱకు ఆమాటను దుర్గాచరణునితో చెప్పుట మఱచినాడు. విషయమును వినిన యనంతరము నాగమహాశయు డొక్కనిమిషమైనను కాలహరణము గావించుటకు సమ్మతింపలేదు. ఇరువురు నొకనాటి మధ్యాహ్నమున దక్షిణేశ్వరముదెస బయలుదేరిరి.

దక్షిణేశ్వరము కలకత్తా కుత్తరదిశయందు కలదు. చైత్రమాసము. ఎండదెబ్బను పాటింపక ఉభయులును చాలసేపు నడకను సాగించిరి. తమ గమ్యస్థాన మెంతదూరమున్నదో వారెఱుగరు. కొండొక అదృశ్యశక్తి ఉత్తరదిక్కుగా వారిని లాగికొనిపోదొడగినది. చాలదూరము నడచి నడచి వారొక సేద్యకాని జూచి "నాయనా! దక్షిణేశ్వరమెక్కడ?" అని వాని నడిగిరి. "అయ్యో! దక్షిణేశ్వరమును దాటివచ్చినారు" అని చెప్పి కృషికుడు వారికి వెనుకదారి జూపినాడు. అపరాహ్ణమున రెండుగంటలు దాటినపిదప మిత్రు లిరువురును గమ్యస్థానమును చేరుకొనిరి.

దక్షిణేశ్వరమందలి దేవమందిరము చక్కనితోట యందు కలదు. ఆయుద్యానవనమున నిలింపులు నిభృతలీలాభూమివలె వెలసినది. ప్రాపంచిక కోలాహలమునకు చాల దూరమందున్నది. కనువిందొనరించు చెట్లజొంపము లతో లలిత లతికావితానములతో నవరత్నములను బురుడించు వేర్వేరు పూలవల్లరులతో చిదానందముతో చెన్నారు శకుంతతతులతో నది యొప్పు చున్నది. చందురునిబోలు బిడ్డను చూచి మురియు కన్నతల్లివలె ఉత్కృష్టమైన తన భావదృష్టిని పరీక్షించి ప్రముదితచిత్తుడగు కవిచంద్రునిచందమున నిజ హృదయసముద్భవ సౌరభమును నలువలకులకు పుత్తెంచునవసరమున దని వార నందలి హాయి ననుభవించుచు ఉద్యానము నందనమునకు సహపాఠివలె దోచుచున్నది. అందలి సలిలము మహాత్ముల యుల్లములీల చల్లనై యున్నది. స్నిగ్ధవాతూలము సుందరసరోవరమునకు సైదోడై వెలయుచున్నది. ఆలయ గోపురములు అభ్రమును చుంబించుచొప్పున నొప్పుచు ఆగంతువుల నాశ్చర్యా న్వితులజేయుచున్నవి. నవపల్లవితకుజరాజి అల్లనశాఖల నూగాడించుచు అతిథుల నాదరానురాగములతో నాహ్వానించుచున్నట్లు దుర్గాచరణునకు తోచెను. మలయహిల్లోలస్పర్శ కతన ఆకుమూకలందు జనించిన మంద స్వరము "సంసారసంతప్తపథికులారా! ఇచటికరుదెంచి ఆనందశాంతు లనుభ వింపుడు" అను మాటల మధురోచ్చారణమే యని నాగమహాశయు డూహించెను.

నెయ్యురు లిరువురును శ్రీరామకృష్ణుడు వసించు గదియొద్దకు పోయిరి. పెద్ద గడ్డముగల ఒకవ్యక్తి గదిగుమ్మముకడ గూర్చుండి యుండెను.

"అయ్యా! దక్షిణేశ్వరయోగి ఎందున్నాడు?" అని నాగమహా శయుడు వానిని ప్రశ్నించెను.

"ఆయోగి వాసస్థాన మిదియే! కాని నేడాతడు చందననగరమునకు పోయెను. కావున మీరిరువురును మరియొక దినమున రండు" అని యాతడు ప్రత్యుత్తర మొసగెను.

మిగుల గష్టపడి ఉభయులును అచ్చోటు జేరుకొనిరి. ఆవ్యక్తి ఉత్తరము వినినంతన పాపమువారు హతాశులైరి. ఇకనందు తడసినను ప్రయోజనమేమి? నందన మొనరించి ఆపెద్దమనిషికడ సెలవుగొని వా రందుండి నిష్క్రమింప

గడంగిరి. అపుడించుక తలుపు తెఱచి వెనుకనుండి ఎవరో చేసన్నచే తమ్ము లోనికాహ్వానించుట నాగమహాశయుడు విలోకించెను. ఆతడు శ్రీరామకృష్ణ పరమహంసయని అతడు తృటిలో గ్రహించెను. శ్మశ్రుధారిమాటను పాటింపక మిత్రునిగూడి ఆతడు చివాలున గదిలో ప్రవేశించెను.

శ్మశ్రుధారియైన పెద్దమనిషి ప్రతాపచంద్రుడను నంతేవాసి. "ఏటి మాయ! పరమహంస దేవునిచెంత పండ్రెండేండ్లు వసించినను ఆమహాత్మునీతడు గుఱితింపలేక పోయెను. ఆతని హృదయతత్త్వమును హృదయంగమము గావించుకొనజాలక పోయెను. కరుణించి పరమహంసయే అట్టిశక్తి తనశిష్యుల కీయవలెను. నూఱేండ్లు ఆచార్యుని చరణోపాంతమున వసించినను గురుకటాక్షము చేకుఱనిచో అంతేవాసి ఆతనిని గుఱుతింప కుండును" అని పదపడి దుర్గాచరణుడు తలపోసెను.

నాగమహాశయుని యోచనము సరియైనదని యూహింప వచ్చును. పరమహంస వచనమొకటి ఇట్టి యూహకు బల మొసగుచుండెను. ఈశ్వర కటాక్షమును భక్తుడు పడయునట్లే గురుకారుణ్యమును శిష్యుడు పొంది తీర వలెను. పరమహంస జీవితము తలయెత్తిన కొండొక సంఘటన మీయంశ మును దృష్టాంతీకరించుచున్నది.

ఒకప్పుడు శ్రీరామకృష్ణ పరమహంస తన మేనల్లుడైన హృదయ ముఖోపాధ్యాయుని వెంటగొని కాళీఘట్టమున కరిగెను. గుడికి తూర్పుదిక్కున గల కొలను పొంతగల పూలమొక్కలలో బాలికయొకతె ఎఱ్ఱంచువలువతో వెలయుచు కొందఱుపడుచులతో నాటలాడుచుండెను. జగన్మాతయే బాలికయై యాడుచున్నదని పరమహంస తత్క్షణమే గ్రహించెను. "అమ్మా! అమ్మా!" అని భక్తిపరవశుడై అఱచి అతడు నేలసాగిలపడెను. కొంతసేపతడు తన్మయ భావమున పడియుండెను. సమాధి శిథిలమై యనంతరమాతడు గర్భా లయములోని కరిగెను. పూర్వోక్తబాలికదాల్చిన వలువతో కట్టెదుట దుర్గ యొప్పుచున్నది. పరమహంస స్మితముఖుడై ఆవిషయమును పదపడి మేనల్లుని కెఱిగించెను. "అయ్యో! ఇట్లని నాతో ముందే ఏల తెలిపితిరి కాదు? పరుగున పోయి లోకమాత చరణములను గట్టిగ పట్టుకొనియుందును" అని మేనల్లుడు కన్నీరొడ్చుచు పలికెను. "పరమేశ్వరి పట్టువడ నిచ్చగింపనితఱి ఆమెపదము

లను గట్టిగ పట్టుకొనుట కెవ్వరికి సాధ్యమగును ? ఆమె కృపనందక ఆమె సాక్షాత్కారమునందుట కెవ్వరికి శక్యమగును ?" అని మందహాస మొనరించుచు పరమహంస పలికెను.

పరమహంస సద్భావము లభించుటచే నాగమహాశయుడును, ఆతని మిత్రుడును నిట్టూర్పులతో మరలిపోనక్కఱ లేకపోయెను.

ఆగదిలో నొక చిన్న మంచముపై శ్రీరామకృష్ణుడు కాళ్లుచాపుకొని కూర్చునియుండెను. ఉత్తరదిశగాముఖము త్రిప్పుకొని పరమహంస మంద హాసము చేయుచుండెను. చేతులు జోడించి రామకృష్ణునకు నమస్కరించి సమీపమందున్న చాపపై సురేశుడు కూర్చుండెను. సనాతన సంప్రదాయము ననుసరించి నాగమహాశయుడు నేలపై సాగిలపడి పరమహంస పదపరాగమును నిజమస్తకముపై నిడికొన ప్రయత్నించెను. కాని శ్రీరామకృష్ణుడు తనపాదము లను వెనుకకు లాగుకొనెను. కావున దుర్గాచరణుని యుద్దేశము సిద్ధింపలేదు. పరమహంస పాదముల నంటుటకు తన కర్హతలేదని యూహించి దుఃఖపూరిత హృదయుడై ఆతడు దూరముననున్న మూలనుజేరి కూర్చుండెను.

కుశలప్రశ్నలతో కొంత సేపు కడచెను. ఆగంతువు లిరువురును వివాహితు లని శ్రీరామకృష్ణుడు తెలిసికొనెను. "ఒకజాతిచేప బురదలో వసించునుగాని దాని యొంటికి బురద యంటుకొనదు. మీరు సంసారములోనున్నను సంసార పంకిలము మిమ్మంటనేరదు." అని పరమహంస వారినుద్దేశించి పలికెను.

సంసారమును గుఱించిన తలంపే చాలకాలమునుండి దుర్గాచరణుని మనసున వేధించుచుండెను. దానికి సంబంధించిన అభిప్రాయమే పరమహంస ప్రసంగమున తొలుత వ్యక్తీకరింప బడుటచే నాగమహాశయు డాశ్చర్యాన్వితు డాయెను. ఏకాగ్రదృష్టిని శ్రీరామకృష్ణుని ముఖముపైని బద్ధమొనరించి ఆతని రసనమునుండి రాలు మాటలను శ్రద్ధతో దుర్గాచరణుడు తనచెవులందు జొనుప సాగెను.

అట్లు తేఱిచూచుచుంటివేల ? అని పరమహంస వానిని ప్రశ్నించెను.

"కన్నులార తమ్ములనుజూచుటకై వచ్చితిని కావున చూచుచుంటిని." అని చేతులు జోడించి దుర్గాచరణుడు ప్రత్యుత్తర మొసగెను.

మరికొంతసేపు ప్రసంగము నడచినపిదప పరమహంస "సమీపమందున్న పంచవటికి పోయి కొంచెముసేపు ధ్యానించి రండు" అని వారి నచ్చోటికి పంపించెను.

శ్రీరామకృష్ణుని గదికి సమీపమున పంద్రెండు శివాలయములు కలవు. ప్రత్యేకమందిరమందు ప్రవేశించి శివలింగముచుట్టు ప్రదక్షిణ మొనరించి భక్తి పూర్వకముగా పరమహంస పశుపతి మ్రోల ప్రణమిల్లెను. నాగమహాశయుడు పరమహంస పగిది ప్రదక్షిణప్రణామములను సలిపెను. సురేశుడు విగ్రహారాధన మును గావించువాడుకాడు. కావున నాత డిరువుర ప్రదక్షిణప్రణామముల పద్ధతు లను పరికించుచు నట్లే నిలువంబడియుండెను. అనంతరమువారు విష్ణుమందిర మున ప్రవేశించిరి. రామకృష్ణ నాగమహాశయు లందుగూడ ప్రదక్షిణ ప్రణామము లాచరించిరి. పదపడి పరమహంస దుర్గాలయమున ప్రవేశించెను. సురేశయుల కాతడపు డొకనూతన వ్యక్తివలె నగపడెను. ఆత డుద్వేగభరితు డాయెను. ఆతని అంగప్రత్యంగములు వడకుచుండెను. ఆత డాత్మ విస్మృతి డాయెనని ఆగంతువు లూహించిరి. అమ్మచేలాంచలిని చేపట్టి చుట్టుచిందులాడు బిడ్డవలె పరమహంస దుర్గచుట్టు నుద్వేగముతో పరుగులెత్తసాగెను. ఆపవిత్ర దృశ్యమును చూచి నాగమహాశయుడు ముగ్ధుడాయెను.

శ్రీరామకృష్ణుని ఆశీస్సులంది మిత్రు లిరువురు నాటికి నిష్క్రమించిరి.

నాడాది నాగమహాశయుని హృదయమున అపూర్వమైన సంచలన ముద యించెను. నిద్రాహారములను గణింపక నిరంతరము ఏమో యోచించుచు దుర్గాచరణుడు మౌనముద్రదాల్చి యుండువాడు.

తరువాతివారమున సురేశసహితుడై ఆతడు మరల పరమహంసపాలి కరిగెను. దుర్గాచరణుని హృదయమున నుదయించిన అపూర్వవిభూతిని కనుగొని భావభరితుడై పరమహంస "నీరాక నా కానందము గొలిపిన" దని పలికి "బిడ్డా ! వెరవకుము ఉన్నత స్థితి నందజాలితివి" అని వానితో వచించెను.

పంచవటికడమరల ధ్యానించిరండని శ్రీరామకృష్ణుడు మిత్రు లిరువురను అచ్చోటి కంపెను.

పంచవటికడ ప్రత్యేక భావతరంగము లుప్పొంగుచుండును. పవిత్రమై ప్రశాంతమైన వాతావరణమున నట్టి వీచికలు పొంగిపొరలుట అక్కజముకాదు.

పంచవటినుండి మరలి పరమహంస చరణోపాంతమున కొంతసేపుండి నెయ్యురులు నిష్క్రమించిరి.

మిత్రుని బలవంతపెట్టక అనంతరము దుర్గాచరణు డొక్కరుండు తఱచుగా శ్రీరామకృష్ణుని దర్శింప బోవుచుండెను. పరిచయము ప్రగాఢమయ్యెను, నాగమహాశయునిచే శుశ్రూషలు చేయించుకొనుటకై పరమహంస మిక్కిలి మక్కువ పడుచుండెను. తొలినాడు ఆచార్యుని చరణద్వంద్వమును స్పృశించు భాగ్యము తనకు లభించలేదని దుఃఖించిన దుర్గాచరణుడు గురుసాన్నిధ్యమున వసించి బహుభంగుల గురువర్యుని సేవించు సదృష్టమును పదపడి పడయుటచే పరమానంద భరితుడాయెను. నారాయణుడే పరమహంసయై యవతరించెనని ఆతని విశ్వాసము.

దక్షిణేశ్వరమునందే నా గ మ హా శ యు న కు వివేకానందస్వామితో పరిచయము కలిగెను. స్వామిజీ అపుడు నరేంద్రుడనియే పిలువంబడుచుండెను. పరమహంస పదతలమున దుర్గాచరణు డుపవిష్టుడై యున్న ముహూర్తమున నొకనాడు "శివోహమ్! శివోహమ్!" అని వచించుచు నరేంద్రుడు వారున్న గదిలో ప్రవేశించెను. నాగమహాశయుని నరేంద్రునకుజూపి "ఈతడు నిక్కముగ స్వార్థరహితుడు" అని శ్రీరామకృష్ణుడు వాకొనెను. "ఆచార్యుడు తెలిపిన దానిని కాదనువా రెవరు" అని నరేంద్రుడు పలికెను. నరేంద్ర నాగమహాశయుల కపు డీప్రసంగము జరిగెను.

నాగమహాశయుడు — జగద్ధాత్రి ఇచ్ఛామయి విశాలవిశ్వమున నేమి జరిగినను ఆమెయిచ్ఛ ననుసరించియే జరగెనని తలపవలెను. సమస్తక్రియలను ఆమె నిర్వహించు చుండగా "ఈపనులను మేమే నెరవేర్చుచుంటి" మని మానవు లనుకొనుచుందురు.

నరేంద్రుడు — నీభావముతో నేనేకీభవింపజాలను. నేను పరమాత్మను. నాయంతరంగమున నిఖిలబ్రహ్మాండము కలదు. ఇచ్ఛగించినచో నేనెట్టిక్రియనైనను నెఱపగలను.

నాగ — నల్లని తలవెంట్రుకను తెలుపుచేయుట నీకు సాధ్యముకాదు. బ్రహ్మాండముపై నధికారమును చలాయించుటకు నీ కెట్లు శక్యమగును! జగజ్జనని వాంఛింపనిచో గడ్డిపరకయైనను కదలజాలదు.

నరేంద్రుడు—నే నిచ్ఛగింపనిచో చంద్రసూర్యులు కదలజాలరు. నా యిచ్ఛవలననే సమస్తబ్రహ్మాండము యంత్రమువలె నడచుచున్నది.

పరమహంస వారిప్రసంగముము సావధానముగా వినుచుండెను. మందహాస మొనరించుచు, "నరేంద్రుడు ఈరీతిగాప్రసంగించుట ఉచితమే! ఒరనుండి వెడలిన కత్తివంటి వాడతడు." అని శ్రీరామకృష్ణు డనెను. గురువర్యుని వాక్కులువిని నాగమహాశయుడు నరేంద్రుని పదముల కెరలి ప్రశాంతభావమున ప్రక్కగూర్చుండెను.

శివుడే నరేంద్రుడై యుద్భవించెనని అనంతరము దుర్గాచరణుడు నమ్మెను.

శ్రీరామకృష్ణుడు ఏమివచించినను వేదవాక్కనియే నాగమహాశయుడు విశ్వసించుచుండును. "పరమహంసదేవుడు పరిహాసముతో నాడు మాటలైనను వేదాంతరహస్యముతో నిండియుండును. నేను మూర్ఖుడను. ఆతనిమహిమ నెట్లు గ్రహింతును" అని యాతడు తఱచుగా పలుకుచుండును.

"వైశ్యులును, వకీళ్ళును విపణివీధియందు ధనార్జనమునకై తిరుగువారును ఆధ్యాత్మికసత్యములను అవగాహన మొనరించుకోలేరు. మనసు మందుబుడ్లపై నిలుచుతఱి చికిత్సకుడు బ్రహ్మాండము నెట్లుగుర్తింపగలడు? అని కొండొక దక్షిణేశ్వరభక్తునితో నొకప్పుడు పరమహంస పలుకుట దుర్గాచరణుడు వినెను. ఆచార్యుని వచనము లాతడు పలుమారు పునశ్చరణము గావించుకొనినాడు.

ధ్యానసమయమందు సయితము వృత్తికిసంబంధించిన విశేషములు మానసవీధియందు తలలెత్తుచుంట స్వానుభవమున నాతడెవఱలోనే యెఱుగును. పరమహంస తనచిత్తవృత్తినిగ్రహించి తనపురోవృద్ధిని కాంక్షించి అట్లువచించెనని ఆత డూహించెను. తనకును జగదీశ్వరునకును నడుమనిలచు వృత్తిని దూరముగనెట్టివేయుట తనకర్తవ్యమని దుర్గాచరణుడు గ్రహించెను.

దక్షిణేశ్వరమునుండి నాడు నిజాలయమునకు మరలి వెంటనే తనమందుల పెట్టెను వైద్యగ్రంథములను ఆతడు గంగానదిలో పారవైచెను. తరువాత తనివార తానమాడి పరితోషముతో నతడింటికి మరలినాడు.

కొడుకు వైద్యవృత్తిని విరమించెనని దీనదయాళుడు మిగులదుఃఖించెను. స్వగ్రామమునుండి కలకత్తావచ్చి పాల్‌సోదరులతో పలుమారుచెప్పి తాజేయు

చుండెడి యుద్యోగమున తనయుని నిలిపియుంచి జీవనోపాధికై తోడు పడుడని వారినివేడి అతడు వెడలిపోయెను.

పాల్ సోదరులను సంతోషపెట్టుటకై నాగమహాశయు డప్పుడప్పుడు ఉద్యోగస్థానముతైన భాగ్ బజారునకును కిదర్ పురకాల్వలకును పోవుచుండెను. కాని పోవుచోటులందు ధ్యానప్రార్థనములకు వలసినవీళ్ళనే ఆతడు గోయుచుండెను. భాగ్ బజారులో నొకచక్కనితోటకలదు. తోటమూల నాతఁడొకచిన్న యాసనము నేర్పఱచుకొనెను. ఏయలికిడిలేనివేళయం దాతడు ధ్యానమగ్నుడై యుండువాడు. ఇంటికి మరలినంతన గంగానది కరిగి చాలసేపునీటియందే నిలిచి జగద్ధాత్రిపై మనసు నిలుపువాడు. అనవరత మాతడు గృహమున గంగోదకమునుంచువాడు. గంగోదకముగలకలశముపొంత జతికిలపడి చాలసేపాతడు ధ్యానము సలుపువాడు.

వైద్యవృత్తిని విడిచిననాటగోలె దక్షిణేశ్వరమున కరుగుటకాతనికి విశేషావకాశము లభింపసాగెను. వైరాగ్యచింత ఆతనిలో నధికమాయెను. బారుగ సన్యాసియైనగాని తనకు ముక్తిలభింపదని ఆతడుతలచెను. దక్షిణేశ్వరమున గురునానతినందియే దీక్షావస్త్రములను ధరింపనాతడు నిశ్చయించినాడు. కాని పరమహంసపలుకు లాతనియుద్దేశమునకు ప్రతికూలములై నిలచెను. "సంసారమున దోషమెద్దియునులేదు. ఈశ్వరునిపై మనసుంచిన జాలును. గృహస్థాశ్రమము మహాదుర్గమువంటిది, దుర్గములోనిలిచి పోరుయోధుడు గృహస్తుడు. ఎగ్గేమియు వానిని ముట్టనేరదు. జనకునివలెనీవు గృహస్థాశ్రమమునందే నిలిచియుండుము. నిన్నుజూచి గృహస్థులుపలువురు తమధర్మమును కడుంగడు చక్కగ నిర్వహింతురు గాక." అని శ్రీరామకృష్ణుడు ఆతనితో వచించెను.

"ఏమహాత్ముడు స్ఫులింగమును ఊదియూది ఇట్టిదావానలమును సృష్టించెనో ఆతడే యిట్టి ప్రబోధమును సలుపుచుండెనేల ; ఆచార్యునిఆజ్ఞ నుల్లంఘించుట కెవ్వరికిని శక్యముకాదు. ఎవ్వరేవిధము ననుసరించి పోవలెనో రెండు మాటలం దాతడు తెలిపివేయుచుండును. నాకీరీతి యాన లభించె నేల ?" అని దుర్గాచరణుడు తనలో వితర్కించుకొని ప్రత్యుత్తరమీయక దక్షిణేశ్వరము నుండి యొకనాటి యపరాహ్ణమున దనయింటికి మరలినాడు.

కానిమానసమున దురంతమైన యాతనమునుజనించెను. ఒంటరియైయుండి రేయింబవళ్లాతడు "హాభగవాన్ ! హాభగవాన్" అని వాపోవుచుండెను. వెక్కి వెక్కి యేడ్చుచు నొక్కొకపుడు ఆతడుధూళిలో బోరగిల పడియుండువాడు. రాళ్ళలోను ముండ్లలోను తూలిపడుచుండువాడు. వానియొంటి కెన్నేనిదెబ్బలు తగులుచుండెడివి. ఆహారముమీదికి వానిమనసు పోవునదికాదు. వెతకివెతకి ఆత డెందేని పడియుంట గాంచి బలవంతమున సురేశుడు రెండు కబళములను వానినోటబెట్టునపుడే ఆతడాహారము నెఱుగువాడు. ఆతడెచటికి పోవుచుండెనో ఎందువసించుచుండెనో ఇరుగుపొరుగు వారెఱుంగరు. ఆతడిల్లుసేరుసరికి యొక్కొకపుడు నడిరేయి యగును. పాల్ సోదరులపని చూచుట బొత్తిగా నాతడు మఱచెను. రణజిత్ హాజరాయను నిరుపేద భక్తిభరితుడై నాగమహాశయుని దుస్థితికి మిగుల వగచి ఆతడు నిర్వహింప వలయు కర్తవ్యమును తానే నెఱపు చుండువాడు.

ఈరీతిగాకొంతకాలము కడచినపిదప నొకనాడుదుర్గాచరణుడు స్వగ్రామమునకుపోయెను. వానిస్థితిచూచినపు డర్ధాంగిదుఃఖమునకు మెరలేకపోయెను. "నానాథుడుతనయాత్మను తనమానసమును తనశరీరమును శ్రీపరమహంస దేవుని చరణతలమున సమర్పించివైచెను. నాకు దూరస్థుడాయెను." అని ఆయిల్లాలు వాపోయెను. పతిమానసికస్థితిని దృష్టాంతీకరించు క్రియలు అచిరములో ఆమెకన్నులపడెను.

దుర్గాచరణుని గృహమునకు సమీపమున వానిసోదరి చక్కని పాదులను బెట్టెను. కనువిందొనరించు పూలమొక్కలను పెంచెను. పొరుగువారొకనాడు పాదులకు కొంతదూరమున తమయావును గట్టిరి. పాదులను తినివేయవలెనని ఆవుయెంతో ప్రయత్నించుచుండెను. కాని దానిమెడనున్న త్రాడు పొట్టిదగుటచే నవి గోవునకందకుండెను. కొంతదూరమున నిలిచి దుర్గాచరణుడాదృశ్యమును వీక్షించుచుండెను. ధేనువు యత్నములు వ్యర్థమగుచుంట చూచి నపుడాతనిహృదయము వ్యథతో నిండిపోయెను. చప్పున ముందునకు సాగి త్రాడువిప్పి ఆవునుపాదులమీదికి వదలి ఆతడు "అమ్మా ! ఆరగింపుము" అని యాదరానురాగములతో పలికెను. ఆవు కడుపార భుజించుచుండగా సమీపమున నిలిచి నాగమహాశయు డానందించుచుండెను.

దూరమున నిలిచి సమస్తమునువిలోకించు దీనదయాళుడు ఆశ్చర్యా న్వితుడాయెను. ఆగ్రహావేశుడు కూడనయ్యెను. చరచర ముందులకు వచ్చి "ఓయీ ! నీసంపాదనము సున్న. కుటుంబమునకై గ్రుడ్డిగవ్వనైనను తేజాల కున్నావు. వైద్యవృత్తి మానుకొంటివి. ఇంటలినుట కేమియునులేదు. కష్టపడి పెంచినపాదులను గొడ్డుకడుపునబెట్టితివి. కొంపలోనివారి గతియేమి ? " అని తండ్రి కటువుగా పలికెను.

" గతికై , కబళమునకై దుఃఖింపనేల ? తండ్రీ ! సర్వేశుడులేడా ? "

నీవు నాకేమియు బోధింపనక్కరలేదు. ఈరీతిగానే ప్రవర్తించితివేని దిగంబరివై నీవు తిరుగవలసివచ్చును. గడ్డితిని బ్రతుకవలసి వచ్చును.

నిమిషమైనను తడయక నాగమహాశయుడు కొనుకట్టుకొని చిన్నగుడ్డ నూడవెతికివైచెను. తక్షణమే నేలమీదినుండి గుప్పెడుగడ్డినిదీసి నోటబెట్టు కొని ఆతడు, " నాయనా ! మీయాజ్ఞలరెండింటిని పాలించితిని. హృదయ పూర్వకముగనీశ్వరుని నమ్మితిమేని మన కేయడలునుండదు. సాంసారికభారమును గురించి మీరింతగా చింతింపనేల ? " అని తండ్రి నుద్దేశించిపలికెను.

దీనదయాళుడు నిర్విణ్ణుడై నిలువంబడెను. నిజముగా తనకొడుకునకు పిచ్చిపట్టినదని ఆత డూహించెను. తిన్నగాలోనికిపోయి కోడలితో " తల్లీ ఇక దుఃఖించినప్రయోజనము లేదు. వానియిష్టానుసారముగ ప్రవర్తించుటేమన కర్తవ్యము " అనివృద్ధుడు గద్గదస్వరముతో పలికెను.

దుర్గాచరణుడు కొంతకాలము తండ్రియొద్దనేయుండెను. అనుదినము గృహమునకువచ్చి వ్యర్థప్రసంగములు సలుపుటకెవ్వరికైన నాతడెట్టియవకాశము నొసగలేదు. జనకునిచరణోపాంతమున గూర్చుని అనుక్షణము శాస్త్రము లను పురాణములను చదివి ఆతనికి వినిపించుచుండెను.

అనంతరమాతడు కలకత్తాకు మరలి సురేశునిమోాల తండ్రికై మిగుల వాపోయెను. పరమహంసకటాక్షమాతనికి లభింపవలెనని ప్రార్థించెను.

దుర్గాచరణునకు బదులుగా రణజిత్ పాల్ సోదరులయొద్ద నుద్యోగము జేయుచు యజమానుల యాన ననుసరించి సగముపైకమునుమాత్రముగ్రహించి మిత్రుని అన్నపానాదుల కగువెచ్చమును భరించుచు శేషించినవిత్తమును దీన దయాళునకు పంపుచుండెను.

పాఠకులారా ! రణజిత్ బోలుమిత్రు లెందఱు ప్రపంచముననుందురు ? తన కర్తవ్యమునకు ప్రతిఫలమునుగాని ప్రశంసనుగాని ఆపేక్షింపనిపరార్థజీవి యాతడు ! కీర్తిపై మనస్సుంచక మిత్రరక్షణమే తనధర్మమనియెంచిన మహాత్ము డాతడు ! అతడు విద్వాంసుడుకాడు ; వక్తకాడు ; వ్రాయసగాడుకాడు. అత డెవ్వడో ఎందువసించువాడో ఎరిగినవారులేరు. కాని వాని హృదయమున వైకుంఠము కాపురమున్నదని జగదీశునకాతడు సన్నిహితుడనియు పతితులు గ్రహించియుందురు.

ఆదివారములందును ఇతర సెలవుదినములందును శ్రీరామకృష్ణుని దర్శించుటకై విద్యార్థులును తదితరనాగరికులును కలకత్తానుండి దక్షిణేశ్వరము పోవుచుండెడివారు. అల్పుడ నని యనుకొను నాగమహాశయుడు పెద్దలుపోవుదిన ముందు దక్షిణేశ్వరము చనక కాళీఘట్టమందే కాలక్షేపము చేయుచుండెడి వాడు. ఆతనియునికిగని పూర్వోక్తమిత్రుడు వాని కన్నపానాదులొసంగువాడు. కానిప్రపంచముతో సంబంధము నిలుపుకొనుటగాని మిత్రునకుశ్రమకలిగించుట కాని దుర్గాచరణున కిష్టములేదు. దక్షిణేశ్వరమునకు పోవువేళలందు సన్న్యాస స్వీకారమునకై అనుమతి దయచేయుమని ఆతడు తప్పక పరమహంసదేవుని ప్రార్థించుచుండువాడు. గృహమందేవసింపుమని ఆచార్యుడాతని నాజ్ఞాపించు వాడు. ఇందును అందును పలువురు పడరాని బాధలతో పొగులుచుండ నింట నుండుటెట్లని వినీతభావమునశిష్యుడు ప్రశ్నించువాడు. ఇంటనిలిచియే సేవ చేయుమనియు మహాత్ములసంసర్గము నందుమనియు ఆచార్యుడనువాడు. మూర్ఖుడ నని తెలుపుకొనుచు మహాత్ములనెట్లు గుర్తింతునని కన్నీరొడ్చుచు దుర్గాచ రణుడు గురుదేవునిప్రశ్నించుచుండువాడు. మహాత్ములనన్వేషించుటకై ఆతడెందును పోనక్కఱలేదనియు, పవిత్రాత్ము లెందఱో గృహమందే ఆతని దర్శింతురనియు పరమహంస పలుకువాడు.

పల్వురను సన్న్యాసాశ్రమమున బద్ధదీక్షితులను జేయు పరమహంస తానువలచిన అనుమతిని తనకేల ప్రసాదింపకుండెనో దుర్గాచరణునకు బోధపడ లేదు. కాని గురుచరణముల నాశ్రయించి గురుకటాక్షము నంద నాతడు తపిం చుచుండెను. ఆత డంగీని వదలివైచెను. పాదరక్షలను పరిత్యజించెను. సాయం కాలమున మాత్రము గుప్పెడుమెతుకులను నోట బెట్టుకొనువాడు. రుచ్య

పదార్థముల కాతడు నీరు వదలి చాలకాల మాయెను. ఉప్పునుగాని కార మునుగాని పంచదారనుగాని ఆతడు దరిజేరనిచ్చువాడు కాడు. ఆతని శరీరము బారుగ శుష్కించిపోయెను. కాని, వానికన్నులు దివ్యకాంతి నీనుచుండెను. పరమహంస శిష్యుండును సుప్రసిద్ధ వంగనాటక కర్తయు నైన గిరీశచంద్రుడును, ఆశ్రమవాసియైన తురీయానందస్వామియును ఆదీప్తిని జూచి అచ్చెరు వొందు వారిలో ప్రధానులు. ఆచార్యుని ఆదేశానుసారముగా సెలవుదినములందు నయితము దుర్గాచరణుడు దక్షిణేశ్వరము పోవుచుండుటచే పలువురు పెద్దల పరిచయము పొందు తరుణము లాతనికి ప్రత్యక్ష మగుచుండెను. గురునాజ్ఞ శిరసా వహించియే అపుడపు డాతడు కాళీఘట్టమునకు మరలుచుండువాడు.

కలకత్తాలో దీనదయాళునకుగల గృహములో కొంతభాగము మేదినీపురవాసి కీర్తివాసు డనువ్యక్తికి అద్దె కీయబడెను. అతడు కుటుంబముతోడనే అందు వసించుచు బియ్యపువ్యాపారము చేయుచుండును. ఇంటిలో నొకమూల చాలతవుడు ప్రోగుపడి యుండెను. ఈతవుడు నాగమహాశయుని మనసు నాకర్షించెను. "ఆత్మరక్షణార్థము మాత్రమే, — ఆధ్యాత్మికజీవితమును గడపుటకు మాత్రమే ఈతనువును నిలుపవలసినది. తనువును నిలుపుటకు రుచు లేల ? తవుడు మెక్కినయెడల తనువునిలువదా ?" అని తనలో వితర్కించుకొని ఆతడు కొంతతవుడు తీసి అందు కొంచెము నీరు కలిపి అన్నమునకు మాఱుగా దానిని భుజింప దొడగెను. ఈ ఆహారముతోడనే ఆతడు కొన్నిదినములు కడపినాడు. తొలుత కీర్తివాసు డీక్రియను కనుగొన జాలకపోయెను. ఏమానిసిగాని తవుడు తిని బ్రదుక గల డని ఆత డెఱుగడు. నాగమహాశయుడు అన్నమును వర్జించి తనయింట బడియున్న తవుడును మాత్రము తిని బ్రతుకుచున్నా డని కొన్నాళ్లు కడచినపిదప ఆత డెఱుంగజాలెను. దుస్సహమైన వ్యథచే కొంతసేపు దుఃఖించి యింటగల తవుడును తొలగించి అనుదినము తా నొసగు బియ్యమును గైకొనుమని దుర్గాచరణుని ఆతడు ప్రార్థించెను. తవుడు మఱి దొరకకపోవుటచే నాగమహాశయు డాతనిని వేడుకను మన్నించెను. కాని తనకు లభించిన బియ్యమును బిచ్చమెత్తువారిజోలిలో పోయుచుండువాడు. దుర్గాచరణుని గుమ్మముచెంత తప్పక భిక్ష లభించుటచే బిచ్చగాండ్రు అనవరత మందే గుమిగూడుచుండు నారు. ఇంట తండులములు లేనితఱి నిరుపేదలను మరలింపనేరక తా నేమియు

చేయుజాలక నాగమహాశయుడు శోకించువాడు. ఆతని యారాట మెఱిగి కీర్తి వాసుడు వలసినబియ్యమును దెచ్చి వానిపురోభాగమున నుంచువాడు. తండు లములకు తోడు, రణజిత్ తన కొసంగుపైకమును దుర్గాచరణుడు పేదలకు పంచి యిచ్చువాడు. దానముచేయు నవసరమున నాటిభుక్తికై తనకు వలసిన తండులములను మిగుల్చుకొను నలవాటు వానికి లేకుండెను. తఱచుగ పస్తుండు టయే వానికి పరిపాటి యాయెను. తన యాకలిదప్పు లెట్టివియో ఆతడెన్నడు నెఱుగడు. తండులములతోపాటు పైసలను విరివిగా దానముచేయుజాలు ముహూర్తములందు వాని యానందమునకు మేర లేకుండెడిది. పైకము కొఱ వడిన దినములందు నిట్టూర్పులు వీడుచు బియ్యమునుమాత్రము కట్టెదుటి దోసిళ్ళలో నాతడు పోయువాడు.

ఈపద్ధతి కొనసాగినయెడల దుర్గాచరణుడు అచిరకాలములో ప్రాణములు పాయునని రణజిత్ కీర్తివాసులు భయపడిరి. తామే అన్నము దెచ్చి సకాల మున వానికిబెట్టువారు. తనకై మిత్రులు పరితపించుట గని నాగమహాశయుడు దుఃఖించి వారికి శ్రమ కలిగింప నిచ్చగింపక తానే వండుకొని తినెద నని చెప్పి వారిని పంపివేయువాడు. తండులము లింట మిగిలినపుడు మిత్రులతో చెప్పిన చొప్పున నాతడు సాయంసమయములందు కొంచెము అన్నము వండుకొని పరమహంస పవిత్ర నామము నుచ్చరించుచు తినుచుండువాడు.

ఒకరిని దూషించుట గాని ఎవ్వరితోనైనను పరుషముగా మాటలాడుట గాని ఒరులనుగుఱించి ప్రతికూలాభిప్రాయములను వ్యక్తీకరించుటగాని వాని కిష్టము లేదు. క్రోధభావము గాని ద్వేషభావము గాని వాని మానసమున ప్రవేశించెనేని తన చేతికి దొరికిన యే వస్తువుతోనైనను ఆతడు తీవ్రముగా కొట్టుకొనును. ఒకానొకప్పుడు వానినోటినుండి పరుషవాక్యొకటి హఠాత్తుగ వెడలినది. తత్క్షణమే సమీపముననున్న రాతిని దీసి బలముకొలది దానితో పెక్కుమాఱులు కడు వడిగ తలపై నాతడు కొట్టుకొనసాగెను. ఆకృత్యమును చూచినవారు వానిచేతిని గట్టిగ బట్టుకొని వారించిరి. మానము కడసినపిదప గాని ఆగాయములు మానలేదు. “మంచిపని జరిగినది. దుర్మతి తగినశాస్తిని పడసితీరవలెను” అని నాగమహాశయుడు తన యాచరణమునుగుఱించి వచించెను.

ఉద్రేకము నణంచుటకై తఱచుగా నాత డుపవాసములు చేయువాడు. వరుసగ నైదాఱుదినములు నీటినైన ముట్టక కడుపు మాడ్చుచుండువాడు.

దీర్ఘమైన ఉపవాసము కడచినపిదప నొకనాడు దుర్గాచరణుడు వంట చేసుకొనువేళకు సురేశుడు వానిని చూడబోయెను. సురేశుని చూచినంతన వానిమానసమున నేదేని యనుచితయోచనము తలయెత్తియుండును. తక్షణమే కొఱవితీసి ప్రొయిమీది వంటకుండను బ్రద్దలుకొట్టి దుస్సహయాతనమువలన వెక్కి వెక్కి యేడ్చుచు మిత్రునిచరణములకు ప్రణమిల్లి "క్షమింపుము. నా కింకను యంతఃకరణశుద్ధి యలవడలేదు" అని నాగమహాశయుడు వంచిచెను. సురేశుని ఆశ్చర్యవిషాదములకు మేర లేకపోయెను. మిత్రునికై మరల వంట చేయుట కాతడు సిద్ధపడినాడు. దుర్గాచరణు డందులకు సమ్మతింపక స్నేహితుని సంతోషపెట్టుటకై గుప్పెడు యటుకులను కొని నాటికి నోట బోసికొనినాడు.

ఉపవాసములకుదోడు దుస్సహమైన శిరోవేదన మాతనిని వేధింప సాగెను. ఆత్మపీడనమున కాత డనవతరము సిద్ధపడుచుండెను. "'అహం' అనుదానిపడగను అతడు చితుకకొట్టి వదలినాడు. బుస్సు మని లేచుటకు దానికి శక్యము కాలేదు" అని గిరీశచంద్రుడు వానినిగుఱించి తెలుపుచుండు వాడు. ఆతని వాలకమును చూచినప్పు డెట్టివారికైన జాలి కలిగి తీరెడిది. మూర్తీభవించిన నమ్రతయే ఆత డని చూపఱు లూహించువారు.

పథమున నడచునపుడు ఎవరినిగాని దాటి యాతడు ముందునకు పోవు వాడుకాడు. కూలివా డగపడినను వట్టిత్రిమ్మరి గోచరించినను వినయముతో వెనుకంజవేసి త్రోవ విడుచువాడు. ఒకరినీడపై నాతడు అడుగువేయుట కాతడు సాహసించువాడు కాడు. మఱొక్కరుని ఆసనముమీదగాని పరుపుమీదగాని ఆత డెన్నడు గూర్చుని యెఱుగడు. సర్వమానవులందును ఈశ్వరుని విలోకించువాడు కావున నెల్లఱను సేవించుటకై ఆతడు మిక్కిలి మక్కువపడువాడు. ఎవరైన తన కించుక యుపచారము జేయ సిద్ధపడినపుడు మిగుల వాపోవు వాడు. తన్ను జేరవచ్చు మిత్రుల కనేక సపర్య లొనగూర్చి వారి యభ్యాసము నెఱిగి వినయముతో వారికి హుక్కా అందించువాడు. "నేనే అధముడను కొఱగాని వాడను. ఈమాత్రపు సేవనైనను చేయజాలితి నేని ధన్యుడను

కాజాలుదును. నాజన్మ సార్థకమైన దని యానందింతును " అని సేవాసమయ మున నాతడు మిత్రులతో వచించువాడు.

దుర్గాచరణుడు అనంతరము పరమహంసపదతలమునుండి నిముసమైన గదలిపోవుట కిచ్చగించువాడు కాడు. ఆచార్యు డిచ్చుప్రసాదమునే ఆరగించు వాడు. ప్రసాదముతోనున్న పత్రముసహితము వర్జనీయము కా దని వాని తలంపు. కావున నా యాకును సయిత మాతడు నమలి తినువాడు. పండ్లలోని టెంకలను గింజలనుకూడ నాతడు నమలి తిను నని యడలి దాపుననున్న మిత్రులు వానిని తొలగించియే ఫలహారమును నాగమహాశయున కొసంగు వారు. ఏకాదశీవ్రతమును నెఱపుచు గురురసనస్పర్శ నందిన స్వల్పప్రసాదమును దుర్గాచరణుడు నాల్కపై వేసుకొనువాడు.

ఈరీతిగా రమారమి నాలుగేండ్లు కడచినవి. పరమహంసశరీరమున తీవ్రవ్యాధి ప్రవేశించినది. దక్షిణేశ్వరమందలి యానందోత్సవమునకు భంగము వాటిలెను. కలకత్తా కుత్తరమున కాశీపూరున కనతిదూరమున గలతోటలో పరమహంస వసింపవలసివచ్చెను. కాత్యాయని యను నొకరాణి జామాత ఆ యుద్యానమున కధికారియై శ్రీరామకృష్ణుని సేవకు వలసినవ్యవస్థ కావించెను. శయ్యనంటిన ఆచార్యునకు దుర్గాచరణుడు బహుళశుశ్రూషలు చేయ దొడగెను. శరీరమున మంట బుట్టినపుడు నాగమహాశయుని కౌగలించుకొని మంట యంతరించిన దని చల్లందన మనుభవించుచుంటి నని పరమహంస యుప్పొంగువాడు. రోగశయ్యపై పరుండినయాచార్యుని అక్కఱల నెఱిగి ఆకాలమున నెందును లభింపని ఫలములను గొని తెచ్చి "తమమహత్త్వము వలన నా కివి లభించినవి" యని వాని నాతడు గురుచరణమున నుంచువాడు. కానికాలమున నాత డా పండ్ల నెట్లు తేజాలెనో యని తురీయానంద, అద్భుతానందస్వాములాశ్చర్యాన్వితులైరి.

దురదృష్టవశమున శ్రీరామకృష్ణునివ్యాధి క్రమక్రమమున మిక్కుటమైపోయినది. వైద్యులు తమయాశలను విడనాడిరి. దుర్గాచరణునిదుఃఖము దుస్సహమైపోయినది. ఈశ్వరుని ప్రార్థించి యాచార్యునివ్యాధిని తనశరీరములోనికి నాకర్షించుకొనవలె నని అతడు నిశ్చయించెను. "మీకటాక్షమువలన నాకు సామర్థ్య మలవడినది. ఈక్షణమందే మీకాయమందలి తెవులు వెడలి

పోవును" అని నాగమహాశయుడు గురువును సమీపింప బోయెను. ఆచార్యు డాతనియుద్దేశమును తృటిలో గ్రహించి స్మితముఖుడై వానిని దూరముగ నెట్టివేసెను.

మఱికొన్ని దినములలో (క్రీ. శ. 1886 ఆగష్టు 16) పరమహంస పరమ పదించెను. వ్యథితచిత్తుడై తోడిశిష్యులను గూడి దుర్గాచరణుడు శ్మశాన వాటిక కరిగెను. అందుండి మరలిన యనంతర మాత డాహారమును పానీయ మును అంటుట మానివైచెను. శరీరము నొకకంబళితో చుట్టబెట్టుకొని ఆత డొకమూల బడియుండెను. సంగతి విని వివేకానందస్వామి తొట్రుపడెను. అఖండానంద తురీయానందులను వెంటగొని నాగమహాశయుడు పడియున్న చోటి కరిగి "సోదరా! మాకు భిక్షపెట్టవా?" అని స్వామిజీ యాతనిని వేడెను. చివాలున లేచి వలసినసంబారములు తెచ్చి, విఱిగినమంచముపై జతికిలపడియుండిన స్వాముల నుచితాసనములపై నాసీనుల జేసి శ్రద్ధతో తాను వంటజేసి అతిథులను స్నాతుల జేసి అనంతరము మూడు విస్తరులందు అన్నమును వ్యంజనములను వడ్డించి ఆగంతువుల నాతడు వానిముందు గౌరవ పురస్సరముగా కూర్చుండబెట్టెను. "మఱొకవిస్తరిలో వడ్డింపు" మని వివేకా నందు డాతనిని కోరెను. స్వామి యానతిని దుర్గాచరణుడు శిరసావహించెను గాని అందలియన్నము నారగింపు మని యాతడు వేడినపుడు, "నా కీశ్వర కారుణ్యము చేకుఱ లేదు. ఈకాయమున కింకను ఆహార మిడు టెందులకు?" అని దుర్గాచరణుడు వాపోయెను. ఉపదేశవాక్కులతో వివేకానందస్వామి ఆతని నూఱడించి ఆహారమును గొనుమని ప్రార్థించెను. తనసత్కారమునకు భంగము వచ్చు నని నాగమహాశయు డడలెను. అతిథులు విందు ముగించిన వెనుక తానుకూడ నాహారమును గొని వారి నలరించెను.

తనమిత్రుడు సురేశుడు తనవలెనే మంత్రోపదేశము నంది పరమహంస ప్రబోధములకు చెవి యొగ్గి ముక్తిమార్గము నన్వేషింపవలె నని నాగమహా శయుడు వాంఛించువాడు. కావుననే అనేకపర్యాయము లాతడు తనమిత్రుని దక్షిణేశ్వరమునకు గొనిపోయెను. మంత్రతంత్రములందు తనకు విశ్వాసములేదని సురేశుడు కొంతకాలము గడపెను. కాని నాగమహాశయుని యుద్బోధనమును దృష్టాంతమును పదపడి వానిమానసమున చక్కని పరివర్తనమును గావించెను.

పరమహంసకటాక్ష మంది మంత్రోపదేశము నంద నాతడు నిశ్చయించినాడు. కాని కొండొకపని చూచుకొనుటకై తోడనే అతడు క్వెట్టా పోవలసి వచ్చెను. అందుండి యాతడు మరలునప్పటికి శ్రీరామకృష్ణుని శరీరస్థితి శోచనీయముగా నుండెను. మఱికొలదిదినములలో పరమహంస ఇహలోకయాత్రను ముగించెను. గురుకటాక్షము తనకు లభింపలే దని తన యుద్దేశము సిద్ధింపలే దని సురేశుడు మిగుల దుఃఖించెను. ఉపవాసదీక్ష నెఱపుచు నాతడు గంగాతీరమున బడి యుండగా నొకనాటివేకువజామున పరమహంస గంగాగర్భమునుండి వెడలి సాదరవాక్కులతో సురేశునకు సాంత్వన మొసగి ఆతనికి మంత్రోపదేశము గావించె నట. అనంతర మాచార్యుని చరణరజమును శిరమున దాల్పవలె నని సురేశుడు ప్రయత్నించుచుండగా పరమహంస అదృశ్యు డాయె నట!

సురేశుడు తోడిభక్తుడగుటచే దుర్గాచరణుడు పరమానందభరితు డాయెను.

శ్రీరామకృష్ణుడు దివంగతు డైనపిదప నాగమహాశయుడు దక్షిణేశ్వర వాసమును విరమించెను. శ్రీ జగన్నాథక్షేత్రమున వసింపు మని బలరాముం డను భాగ్ బజారుభక్తుండును నవద్వీపమున గాపురముండు మని పాల్‌సోదరులును దుర్గాచరణుని ప్రార్థించి సమస్తవ్యయమును వహించుటకు సన్నద్ధులైరి. "గురుమహారాజు గృహమందె వసింపుమని పెక్కుసారులు నాకు బోధ గావించెను. ఆచార్యునాజ్ఞ నుల్లంఘించుటకు నాకు శక్తి లేదు." అని మిత్రులతో చెప్పి నాగమహాశయుడు స్వగ్రామమునకు మరలెను.

ఆసమయమందే "భాగ్యకుల" గ్రామవాసులైన సోదరు లిరువురు మాసమునకు ఏబదిరూకల స్థిరవేతన మిత్తుమని దుర్గాచరణుని వేడుకొనిరి. కాని నమస్కారపురస్సరముగా నాగమహాశయుడు వారివేడికోలును నిరాకరించెను.

స్వగ్రామమునకు మరలినపిదప నాగమహాశయుడు పితృసేవ సాధుసేవ అతిథిసేవలను పరమాశయముల గావించుకొనెను. వృద్ధుడైన దీనదయాళుడు లేచుటకును కూర్చుండుటకును కూడ శక్తి చాలనివా డాయెను. విశేష సమయము మంచము నాశ్రయించియే ఆత డుండవలసి వచ్చుచుండెను. భక్తి శ్రద్ధలతో దుర్గాచరణుడు కన్నతండ్రిని సేవింప గడంగెను. ఆతనిని పట్టుకొని

స్నానశౌచాదిక్రియలను చేయించుచుండెను. జనకుని చరణతలమున నాసీనుడై నిరంతరము ఈశ్వరగోష్ఠి నెఱపుచుండెను. శాస్త్రపఠనమును పురాణకాలక్షేపమును జేయుచునే యుండెను.

దసరా యుత్సవములలో సంపన్నులైన వంగవాసులు విశేషధనమును వ్యయించి దుర్గపూజను చేయుచుందురు. శారదీయ మహోత్సవములను మక్కువతో నిర్వహించుట దీనదయాళుని యాశయము. కొడుకు తన వృత్తికి నీరు వదలుటచే తన యాశయము సిద్ధించుదినములు కడచెనని వృద్ధుడు కొందఱు పరిచితులతో శోకసంతప్తచిత్తుడై వచించెను. ఉదంతము దుర్గాచరణుని చెవులయందు పడెను. ఏవిధముననైన తండ్రి వాంఛ దీర్చుట తన కర్తవ్యమని ఆతడు గ్రహించెను. ఈశ్వరసాహాయ్యము తనకు గలదని విశ్వసించిన మహాత్ము డాతఁడు. ఆ విశ్వాసమును సాహాయ్యమును పురస్కరించుకొని నవరాత్రి మహోత్సవముల నాత డత్యైభవముగ నెఱపి తండ్రి నలరించెను. ప్రతివత్సరము ఉత్సవములను నిర్వహించు నేర్పాటును నాగమహాశయుడు కావించెను. ఉత్సవములకు ముందు కలకత్తా పోయి వలసిన సంభారములను సేకరించి కొలదిదినములు సురేశునితో కడపుట వాని యభ్యాస మాయెను. మునుపటివలె తనమనసున ప్రాపంచికచింతకు చోటీయక తనతండ్రి అనవరతము ఈశ్వరారాధనమునకు చిత్తము నప్పగించుచుండెనని ప్రమోదభరితహృదయుడై దుర్గాచరణుడు మిత్రునితో తెలుపుచుండువాడు.

తాంత్రికసాధకుల మనియు వైష్ణవుల మనియు చెప్పుకొనువా రనేకులు తూర్పుబంగాళమున గలరు. కాని వీరు నిష్కింపుభక్తులు కా రని విద్యూరపు చేతలకు మనసిచ్చువారని కొంద ఱెఱుగుదురు. తారకనాథగంగోపాధ్యాయుడను న్యాయవాది తన వృత్తిని మాని బ్రహ్మానందభారతి యను కొత్త పేరుతో వామహస్తాచార్యులైన తాంత్రికవాదులందు ప్రవేశించి 'బరదీ' యను తావున వసించు ఆచార్యుని సేవింపసాగెను. తారకనాథుడు నాగమహాశయునకు పరిచితుడు. తనపూర్వజన్మమేదియో తనకు తెలియు ననియు చంద్రలోక, సూర్యలోక, బ్రహ్మలోకములకు, అవలీలన పయనింపగల శక్తి తనకు గలదనియు ప్రస్తుతజన్మమందలి తనగురువు పూర్వభవమున తనశిష్యు డనియు దెలుపుచు ఆతనిని దర్శించుటకై తనవెంట రమ్మని దుర్గాచరణుని ఆతడు పలుమాఱు

వేడుచుండువాడు. వానిమాటలు పాటించి బరదీయోగికడకు నాగమహాశయుడు కొన్ని పండ్లతోడను కొంతమృష్టాన్నముతోడను పోయెను. యోగి వానిపై వక్రకటాక్షములు సారించెను. "ఏమివాలకము; ఏమివైఖరి? ఏమి వేషము!" అని యాతడు దుర్గాచరణుని గేలిసేయ సాగెను. ప్రతివచనము చెప్పక నాగమహాశయుడు తాను తెచ్చిన ఫలహారములను యోగిచరణతలమున వినమ్రుడై యుంచెను. యోగి వాని నంటలేదు. దుర్గాచరణుడు మిగుల దుఃఖించి ఫలహారములను సమీపముననున్న వృషభమునకు అనురాగముతో బెట్టెను. యోగి అనంతరము చిత్తమువచ్చినట్లు శ్రీరామకృష్ణ పరమహంసను దూషింపసాగెను. తనను గుఱించిన యెట్టిదూషణమునైనను తన్ను మార్కొను ఎట్టియత్యాచారమునైనను దుర్గాచరణుడు సహించును కాని గురుదేవుని గుఱించిన దుర్భాషలను విని సహింపలేదు.

యోగి దురూక్తులను వినగానే వానిహృదయమున క్రోధాగ్ని ప్రజ్వరిల్లెను. తోడనే భైరవాకార మొకటి వానిమ్రోల గోచరించి యోగిని నేల గూల్చుటకై ఉద్యమించి దుర్గాచరణుని యనుమతిని వేడె నట. తత్క్షణమే తనయాగ్రహము నణంచుకొని ముందునకు కూలబడి నేలపై తన శిరమును గట్టిగ కొట్టుకొనుచు "అయ్యో! నే నిచటి కేల వచ్చితిని? నాహృదయమున నిట్టి దుష్టభావ మేల పొడసూపినది?" అని వచించి "శ్రీరామకృష్ణా! పరమహంస దేవా!" అని వాపోవుచు నాగమహాశయుడు యోగివద్దనుండి పరుగెత్తెను.

యోగి శిష్యు డొకడు పదపడి దుర్గాచరణుని పాలి కరిగి "మా ఆచార్యుడు నిన్ను శపించెను. కావున రక్తమును గ్రక్కుచు నొకసంవత్సరములో నీవు చచ్చెదవు" అని పలికెను.

వానిపలుకులు విని నాగమహాశయుడు నవ్వి యూరకొనెను. సంవత్సరము కడచినది. కాని దుర్గాచరణున కెట్టి కీడు వాటిలలేదు. పూర్వోక్తశిష్యుడు గురుదౌష్ట్యమును నాగమహాశయుని మహత్త్వమును గుఱితించి ఆతని దృష్టాంతము ననుసరించి మహాభక్తుడాయెను.

గంగానదిలో నొక నావ నెక్కి నాగమహాశయు డొకనాడు బెలూర్ మఠమునకు పోవుచుండెను. వివిధప్రకృతులవారు పడవలో పయనించుచుండిరి. దుర్గాచరణుడు నావలో నొకమూల గూర్చుని యుండెను. పడవ కొంత

దూరముపోయిన పిదప మఠము గోచరించినది. నాగమహాశయుడు లేచి నిలిచి భక్తిభరితుడై చేతులు జోడించెను. ప్రయాణికులలో నొకడు వానిని చూచి నవ్వుచు మఠమందలి సన్యాసులను దూషింపసాగెను. మఠాచారములను గుఱించి కటూక్తులు పలుక దొడగెను. నావలోని మఱికొందరు మహోత్సాహముతో వానిదృష్టాంతము ననుకరించి దూషణప్రలాపమునకు బూను కొనిరి. దుర్గాచరణుని చిత్తమున క్రోధభావము తల ఎత్తినది. వాని పెదవులు వడకినవి. అందుండి యేవియో నుడువులు వెడలినవి. దుష్ప్రలాపములతో దుర్గాచరణుని యుడుకించినదుష్టులు తోడనే భయకంపితులై తమపై శాప వృష్టి కురియు నని తొట్రుపడి పడవను దరిజేర్పు డని నావికులను వేడి అది యొడ్డుజేరినంతన వడివడి దిగి పరువెత్తిరి. ఆ యుదంతమును విని వివేకా నందస్వామి "ఆవిధముగ నపుడపుడు బుసకొట్టుట అవసరము" అని వచించెను.

"పుష్పము ప్రపుల్లమయినపుడు భ్రమరములు తమంత తామే వచ్చి దాని నాశ్రయించును" అని శ్రీరామకృష్ణుడు పలుకుచుండువాడు. ఎవ్వాని హృదయము వైజ్ఞానిక సౌరభసమన్వితమై కుసుమించునో విజ్ఞానపిపాసువులు వెతకుకొనుచు వచ్చి ఆతని నాశ్రయింతురు. నాగమహాశయుని హృదయ మహత్త్వమును గుఱుతించిన జిజ్ఞాసువులు నానాస్థానములనుండి వచ్చి ఆతని చెంగట జేర దొడగిరి. వాని జీవితవిధానమును గమనించి అద్భుతానందములం దోలలాడి పెక్కుచోటులందు బహుభంగుల నాతని గీర్తింప దొడగిరి. "పరమహంసదేవుని పలుకులు సత్యములు 'ఈశ్వరాన్వేషణమునకై జీవిత ములు కడపువారే నీపాలికి వత్తురు' అని ఆచార్యుడు వచించుచుండెను. కావున మన గృహము నలంకరించు నీ యాగంతువులు మహనీయగుణగరిష్ఠు లనుట నిక్కము. ఈమహాత్ములను సేవించుటచే మన మిరువురము తరింపవలెను సుమీ" అని నాగమహాశయుడు తన యర్ధాంగితో పలికి అతిథిసత్కారము నకు వలసిన వ్యవస్థలు నలుపుచుండువాడు. వేర్వేఱు రూపములతో నారా యణుడే తన యాతిథ్యము నందుచుండె నని ఆతడు మురియువాడు. 'తన గృహ మున నతిథిసేవ నిత్యకృత్యమైనందులకు దీనదయాళుడు పరమానంద భరితు డగుచుండువాడు.

ఒకప్పుడు దుర్గాచరణుడు కడుపునొప్పివలన బాధపడుచుండెను. యాతనము దుస్సహమై దుర్దాంతమై యుండెను. లేవలేనిస్థితిలో నాతడు పడియుండెను. ఇంచుమించుగ నాతడు చైతన్యమును గోలుపోయెను, అని చెప్పనగును. ఆ సమయమున నాకస్మికముగ పదుగురు అతిథులు వాని సదనమునకేతెంచిరి. ఇంట గుప్పెడు తండులములైన లేవు. చేత చిల్లిగవ్వయైన లేదు. అతిథులు కన్నులబడినంతన వానికి నూతనచైతన్యము కలిగినది. నవ్యోత్సాహము చేకూఱినది. ఉదరములోని యాతనమును ఉదరములోననే యుంచి వలసిన సంభారములను తెచ్చుటకై ఆతడు బజారునకు పోయెను. పరపతిని పురస్కరించుకొని వానిని కొనినాడు. పెద్దసంచిలో వేసికొనినాడు. ఎన్నడుగాని కూలివాని నియోగించుట వాని ప్రకృతికి ప్రతికూలమైనపని. భారవహమయిన బియ్యపుబస్తాలను సయితము తానే మోచుకొనిపోవుట వాని యలవాటు. బరువైన పెద్దసంచిని వీపున వహించి నా డాతడు విపణివీథినుండి బయలుదేరినాడు. అపు డాతని కడుపునొప్పి మిక్కుటమై పోయినది. వీపుమీద బస్తా వానిని కుంగదీసినది. దానితో నతడు తెరువునడుమ పడిపోయినాడు. తన విపత్తుకై ఆతడు దుఃఖింపలేదు. కాని తాను కావింపదలచిన యాతిథ్యమునకు భంగము వాటిలునని వాపోయినాడు. "బహురూపములు దాల్చి నారాయణుడు నా గృహమున కరుదెంచినాడు. నాసేవ కాలస్యమగుచున్నది. తుచ్ఛమై తున్కతున్కలగుచున్న ఈ శరీరము నేడు నాయుద్దేశసిద్ధికి అవాంతరము దెచ్చుచున్నది." అని యాత డంగలార్చినాడు. ఎంతో కష్టముతో కొంతసే పైనపిమ్మట లేచి సంచిని మోచుకొని అల్లన నాత డిల్లు చేరినాడు. వినమ్రుడై యతిథులముందు సాగిలపడి ఆలస్యమునకు మన్నింపుడని వారిని ప్రార్థించి గృహిణీసమేతుడై యచిరములో వంట ముగించి భక్ష్యభోజ్యలేహ్యచోష్యములతో వారిని సంతృప్తుల గావించినాడు.

ఒకనాడురాత్రి కుంభవృష్టిగ వర్షము కురియుచుండెను. రివ్వురివ్వున గాలి వీచుచుండెను. ఆకస్మికముగ నిరువురు అతిథులు వచ్చి వీథితలుపు తట్టిరి. ఆతురపాటున పోయి దుర్గాచరణుడు తలుపుతెఱచి ఆగంతువులను సాదరముగ నాహ్వానించినాడు. ఇంట తండులములు లేవు. నాగమహాశయుని ధర్మపత్ని గిన్నె చేబూని వీథినిబడి ఇరువురు మూవురు పుణ్యాత్ముల కటాక్షము కతన

కావలసిన బియ్యమును బదులు తెచ్చి వంటచేసినది. అనంతరము అతిథులు కడుపార విం దారగించిరి.

రాత్రి వారు పరుండుటకై సలుపవలసిన వ్యవస్థ దుర్గాచరణునకు పెద్ద సమస్యయాయెను. వానియింటగల గదులు నాలుగుమాత్రమే! అందు మూడు గదులు శిథిలావస్థయం దున్నవి. ఇంటిపై తున్కతున్కలైన తాటియాకు లలరారుచుండెడివి. కోటిరంధ్రములగుండా పంచభూతముల నాహ్వానించు చుండెడివి. సూర్యచంద్రు లనవరతము వాని కప్పుక్రిందనే గాపుర ముండువారు. కాని నాటితీవ్రవాతూలమున నవి యంతరిక్షమున కెగసినవి. మూడుగదు లందును మూడు సముద్రములు సృష్టియైనవి. దీనదయాళుడును దంపతులును నాలవగదియందు తలదాచుకొని యుండిరి. అతిథులకు చోటు సృష్టించుట నాగమహాశయుని సత్వరకర్తవ్యమై యుండెను. సతీసహితుడై యాత డాగారము నుండి ఈవలికివచ్చి అతిథుల నాగదియందు ప్రవేశపెట్టినాడు. ఆమె గూడి వెలుపలిగుమ్మముకడ గూర్చుండి భగవన్నామస్మరణతో శేషించినరాత్రి గడపి వైచినాడు.

రణజిత్ కలకత్తాలో పాల్‌సోదరులను సేవించుచు అర్ధభాగవృత్తి మును నాగమహాశయున కంపుచుండెను. పాల్‌సోదరులు విశాలదృష్టితో నీయేర్పాటును వీక్షించుచు ఉచితమైన మొత్తమును పంపుచుండిరి. నారాయణ గంజ్ వర్తకులు సంవత్సరమునకు సరిపడు సరకును పరపతి నాధారము చేసు కొని నాగమహాశయున కిచ్చుచుండిరి. ఆతడు మహాత్ముడనియు అతిథులను అభ్యాగతులను అనవరతము సేవించువాడనియు విపణివీథియందు ప్రతివ్యక్తియు నెఱుగును. కావున తక్కుంగలవారికడ గైకొను వెలయం దర్ధభాగమును మాత్రము గొని భక్తిపూర్వకముగ నపుడపుడు రెట్టింపుసరుకును వానికి సమ ర్పించుచుండువారు. ఈ విషయమున కవగతుడైనపుడు దుర్గాచరణుడు తన్ను సమదృష్టితో వీక్షింపుడని వారిని వేడి వా రొసగు అధికవస్తువులను, వారికి తిరిగి యిచ్చివేయువాడు. నాగమహాశయునిచేతిబోణీ తమ కెంతో శుభప్రద మని ప్రతివర్తకుడును విశ్వసించుచుండును. ధర వచ్చినను రాకున్నను దినారంభ మున నాతడు తమవస్తువులను గైకొనవలె నని వణిజులు ముచ్చటపడుచుండిరి. కావున నిరుపేదయైన నాగమహాశయుని నిత్యకల్యాణమును పచ్చతోరణమును

వరింపవలెనని మిక్కిలి మక్కువపడదొడగినవి. "సమస్తము ఈశ్వర కటాక్షమువలన చేకుఱును. ఇచ్చువా డాతడు. ఇప్పించువా డాతడు. నేనెవండను." అని వినమ్రుడై దుర్గాచరణుడు పలుకుచుండును.

పాఠకమహాశయులారా! ఈమహావ్యక్తిబోలు మహాపురుషులను ప్రపంచమున మీ రెందఱి నవలోకించితిరి? నాగమహాశయుడు పురాణయుగములోని వాడుకాడు—నిన్న మనియున్న మహనీయుడు. ఐశ్వర్యసంపన్నుడు కాజాలియు దారిద్ర్యమునే దగ్గఱకు తీసినాడు. మహాత్ముల సంసర్గనంది ఉదారాశయముల నలవఱచుకొనినాడు. అలవఱచుకొని సూక్తులందు వానిని వ్యక్తీకరించుటతో తనపని చెల్లిపోయినదని తలచినవాడు కాడు. ప్రత్యక్షజీవితమందు వానిని ప్రకాశము కావించుట తనపవిత్రకర్తవ్యమని తనజీవితపరమావధియని విశ్వసించి కృతకృత్యుడైన పరార్థజీవి యాతడు. తనపరమాశయములమీదనే ఆతడు దృష్టినిలిపినాడు కాని తనపరిస్థితులపై కాదు. కర్తవ్యనిర్వాహణమున నిముసమైన తడయక ముందంజవేయుట కలవడినాడు. కాని సాధ్యాసాధ్యములను గుఱించి పర్యాలోచనము సలిపినవాడు కాడు. మీనమేషములు లెక్కించి రాహుకాలము గమనించి లాభనష్టము లూహించి చిత్తమువచ్చిన యెత్తు లవలంబించి సత్కార్యములు చేయగలవా డెవ్వడును ప్రపంచమునలేడు. అప్రమత్తత అక్కఱలేదే కాని దానిచెంగట భయసంశయములు చెలిమికత్తెలై నిలిచెనేని మానవు డూగిసలాడునుగాని కురుక్షేత్రమున ముందంజవేయలేడు. శంఖమును పూరింపలేడు. కపిధ్వజము నెత్తలేడు. విజయుడు కాలేడు. తనయాశయములకు సదా తాను దూరస్థుడై భగ్నహృదయుడై ఎడారిబోలు అపజయము తనజీవితమునగాంచి ఆరాటపడుచు ఆత డసువులబాయును. జయాపజయములు, కాలు కదుపుటకుమున్నే ప్రత్యక్షము కావలెనని ఆశపడువాడు భీరుడుకాని వీరుడుకాడు. ఫలితము ముందే నిర్ధారితమై యొడిలో పడ దలపడునేని ప్రయత్నమునకుగాని, పురుషకారమునకుగాని, శక్తిసామర్థ్యముల సముచితవిజృంభణమునకుగాని అవకాశ మెట్లు కలుగును? ఎక్కువగా గణింపక మిక్కుటముగా గుణింపక ఈశ్వరకారుణ్యముపై ఆత్మశక్తిపై విశ్వాసముంచి అవిచలితచిత్తుడై ముందంజవేయువాడు రేపు గట్టియిక్కట్టులవలన బాధలు పడినను కాలక్రమమున విజయమును పొందగలడు. కర్తవ్యనిర్వాహణజనితమైన

ఆనందమే ఆతని హృదయమున అమృతపూరమై ఆతని పూనికకు క్రొత్త యాయువు నొసగును. పూర్వోక్తవిశ్వాసానందములు వెలయు హృదయమున నిచ్ఛాశక్తి వజ్రసంకల్పములు విలసిల్లును; ధైర్యసాహసములు వర్ధిల్లును. ఉత్సాహశక్తి గంగోత్తరివలె నవిరతముగ నూరుచునే యుండును. భయసంశయములుకాని ఉద్రేకదుఃఖములుకాని అట్టిహృదయమును తొంగియైన చూడజాలవు. భక్తిశ్రద్ధలకును భయసంశయములకును చుట్టపుచూపు లుండునా?

నాగమహాశయుని హృదయము భక్తిశ్రద్ధలకు పట్టుగొమ్మయైనది; కావున ధైర్యసాహసము లాతని కూడిగము చేయగడగినవి. పశుప్రవృత్తులును పైశాచికప్రవృత్తులును వాని తపఃశక్తినుండి వెలుతురు వెలారినంతన నదృశ్యములైనవి. కావున నెట్టివారైనను వానిమ్రోల నంకిలినిలుపక దీపావళిబోలు వానిసదాశయవితానము చుట్టి భజనసేయగడంగిరి. ఆతనికి చేయూతనీయ ముందంజ వేయసాగిరి. నిరుపేద నిరతాన్నదాత ఎట్లు కాజాలెనో పతితలు గ్రహింతురుగాక. బాహ్యపరిస్థితులు ముష్కరములైననేమి? హృదయశక్తి అనల్పమైయుండెనేని అణుమాత్రపువాడైనను మనుష్యుడు మహోన్నతమైన తన యాదర్శమును కాలక్రమమున కల్పశాఖలునుండి చిగుళ్ళను బుడుకునట్లు పుడుకగలడు. జగదీశుని వేడుకచెలికాడై దివ్యబృందావనమున చిరవాసి కాజాలును. ఈతని దృష్టాంతము భగవంతుని వక్షస్థలమందలి కౌస్తుభము భంగి కాలదిశావలయమున వెలుగొంది జిజ్ఞాసువులకు ఉత్సాహప్రోత్సాహము లొనగూర్చును; ముముక్షువులచే ముందంజవేయించును. నాగమహాశయుని దృష్టాంత మట్టిదని నక్షత్రఖచిత వియత్తలమువలె వాని జీవితము మహితాశయసందీప్తమైనదని తెలుపుట నాయుద్దేశము.

దుర్గాచరణుని యాతిథ్యమునకై వచ్చువారిలో ననేకులు బహుళారిష్టములను తలకు చుట్టుకొని వచ్చుచుందురు. కేవలము ఆతిథ్యము నొసగుటతో తన పని చెల్లిపోయినదని ఆత డెన్నడు నూహింపలేదు. వ్యాధిగ్రస్తులెందఱెందఱో వచ్చి వానినట్టింట మకాము వేయుచుందురు. అన్నముతో నౌషధముకూడ నొసంగి ఆగంతువులను బహుభంగుల సేవించి అనంతరము వారు వెడలునపుడు దారివెచ్చము నిచ్చి వా రిల్లుసేరువరకు తన కర్తవ్యము నాతడు సాగించుచునే యుండును.

సత్కారపరంపరవలన వానియప్పులు పెరిగినవి. వానిని తాము తీర్చి వేయుదుమని పలువురుభక్తులు పలికిరి. అమెరికానుండి మరలిన యనంతరము వివేకానందస్వామి నాగమహాశయుని ఋణములను గుఱించిన యుదంతము విని వానిని దీర్చి వ్యవస్థ గావించెను.

ఆవ్యవస్థను ప్రతిఘటించి "యోగీంద్రులు నాకు ఆశీస్సులనుమాత్రమే ప్రసాదింతురుగాక! ఆహారమునైన మాని అప్పులను దీర్చుకొందును. నాకై యెవ్వరును శ్రమపడరాదు. పరమహంసదేవుని కృప నాకుగలదు. నాకు వెఱ పేదియునులేదు" అని యాతడు వచించెను.

ఒరులు కష్టపడుచుండుట జూచి దుర్గాచరణుడు సహింపలేడు. పరిచారకులును, కూలివాండ్రును చేయుపనులను తానే చేయుచుండును. ఒకనాడు నాగమహాశయు డింటలేనిసమయమున శిథిలావస్థయందున్న గృహమును బాగు చేయించుటకై ఆతనిభార్య ఒక కూలివానిని పిలిపించెను. సంగతివిని తొట్రుపాటుతో నిజాలయమునకు వచ్చి కూలివానిని జూచి దుర్గాచరణుడు మిగుల వ్యథజెందెను. ఆంతరంగికయాతనము నడంచుకొనలేక విలపించెను. కూలివానికి కొన్ని తినుబండము లొసగెను. హుక్కా తయారుచేసి వాని సముఖమందిడెను తాచేయజాలు సపర్యలనన్నిటిని నిర్వర్తించి వాని నలంకరింపజూచెను. కూలివాడు నిర్విణ్ణుడై పోయెను. నాగమహాశయు డవ్వాలి కరుగుటజూచి ఆతడింటి కప్పుమీదికి మెల్లగ ప్రాకి పనిప్రారంభించినాడు. కొలది నిముసములలో మరలివచ్చి ఎండలో కూలివాడు శ్రమించుట చూచి "నాయనా! దిగు" మని వానిని ప్రార్థించెను. ఆతని వేడికోలును మన్నింపక పనివాడు కనక్రియను తాను నిర్వహించుట విలోకించి ఘోరవిపత్తునందు పడినవానివలె హాహాకారము చేయుచు "అయ్యో! నాదేటిబ్రతుకు! నాకై యొరులు కష్టపడుచుండగా చూచుచుండు కట్టిడి నైతిని. మహాపాపిని" అని నాగమహాశయుడు నొసలున చఱచుకొని గుండెలను బాదుకొని వెక్కివెక్కి యేడ్వదొడగెను. ఆదృశ్యమును చూచి తత్తరపడి పనివాడు కొంపమీదినుండి మెల్లగ క్రిందికి దిగినాడు. ఆతురపాటున వానియొద్దకు పరుగెత్తుకొనిపోయి కొంతసేపు వాని కాళ్లేతులనుపట్టి చక్కని హుక్కాను వాని చేతుల కందించి సేవకునకు సేవకుడై అనునయవాక్కు లుచ్చరించుచు వీవన చేబూని దుర్గాచరణుడు

చాలా సేపు వానికి విసరసాగెను. అనంతరము అతనికి ఆదరానురాగములతో అన్నముబెట్టి కొంత పైకమొసగి సత్కరించి భద్రముగ వానిని వానియింట జేర్చినాడు.

పడవ ప్రయాణముచేయునపుడు నావికులను శ్రమపడనిచ్చుట కాతని కెన్నడు నిష్టము లేకుండెను. తెడ్డు నసుడు గడ నసుడు తానే చేబూని ఆతడు పడవ నడపుచుండును. పడవలో పయనించువారు అపుడపుడు వానిని వారించు చుందురు. నావికు లాతని చెయ్వులు చూచి ఆరాటపడుచుందురు. కాని వారి మాటలను పాటింపక తాను తలచిన పనిని తాను నిర్వహించుచుండువాడు. తాము నావలోనుండగా నా మహాత్మునిచే పడవ నడపించుకొనుట పాపహేతు వని నమ్మి నావికు లాతనిని తమనావలో నెక్కించుకొనుట కంగీకరించువారుకారు.

వర్షాకాలమున దేవభోగగ్రామము నీటిమయమై యుండును. ఒక యింటినుంటి వేఱొకయింటికి పోవుటకు డింగీ యొక్కటి అవసరమైయుండును. కావున నాయూర నించుమించుగ నింటింటి కొక్కొక్కపడవ యుండును. దుర్గాచరణునకు మాత్రము నావ యేదియును లేదు. కావున వర్షాకాలమున నాతడు తఱచుగ తనయింట కైదీయై యుండవలసి వచ్చెడిది. గృహమునకు వలసిన సంబారములను అనివార్యముగా కొన్నినెలలకు ముందే కూడబెట్టు కొనవలసి వచ్చెడిది. కూడబెట్టినను అతిథులసంఖ్య నిర్దిష్టమైనదికాదు కావున అవి అచిరములో వెచ్చమయ్యెడివి. ఇరుగుపొరుగువారి తోడుపడసి వాని యర్థాంగి అక్కరయైన వస్తువులను కొనితెచ్చెడిది.

ప్రతిదినము సంధ్యాసమయములందు శ్రీరామకృష్ణుని ప్రతిమకు ధూప దీపనైవేద్యములను సమర్పించువాడు. ఆసమయమున నెందఱెందరో ప్రతిమ పురోభాగమునజేరి యైక్యకంఠమున సంకీర్తనము సలుపువారు. ఆగంతువులకు ఫలహారాలు తయారుచేసి యిచ్చి ఉచితరీతిని వారిని సత్కరించి పరమహంస నామ ముచ్చరించుచు దుర్గాచరణుడు సంకీర్తనమున పాల్గొనుచుండువాడు. ఆతని వాక్కు కర్ణగోచరమైనంత మాత్రమున భక్తబృందమున నవశక్తి యుద్భ వించెడిది. "జయ! జయ! పరమహంసదేవ!" అని మహోద్వేగముతో నాత డఱచువాడు.

కేవలము కీర్తనమునేకాదు. తా కావించు సమస్త క్రియలను నాగమహా శయుడు భక్తిపూరితము లొనరించును. ఒకనా డాతడు సరస్వతీపూజ సలుపు

చుండగా శరచ్చంద్రచట్టోపాధ్యాయు డను మిత్రుడు దుర్గాచరణుని దర్శింప బోయెను. ఉపనిషత్తులలోని కొన్ని భాగములను చదివి తనకు వినిపింపుమని నాగమహాశయు డాతనిని వేడుకొనెను. ఒక్కొక్క శ్లోకమునకు వేర్వేరు వ్యాఖ్యానములు కలవని మిత్రుడు వానినన్నిటి నేకరువు పెట్టినాడు. "అధికారుల అంతరంగశక్తుల ననుసరించి భాష్యకారులు భిన్నభిన్న వ్యాఖ్యలు రచించిరి. వారియుద్దేశము లుత్కృష్టములు" అని దుర్గాచరణుడు వచించినాడు. పరమహంస తెలుపుచుండెడి యూనరవెల్లికథ నుల్లేఖించుచు "ఈశ్వరు డనంత రూపములు కలవాడు. ఒక్కొక్క భక్తప్రవరుడు తా నాతని గుర్తించిన దెఱగున అతని గుణరూపములను కీర్తించును. కాని వాని నిక్కంపు రూపెద్దియో చెప్పగలవా రెవ్వరును లేరు" అని నాగమహాశయుడు పలికెను. పదపడి మండపమున మండితమైన సరస్వతిని సంబోధించి "తల్లీ! యెందఱెందఱు భక్తులో నీ కారుణ్యమునంది ముక్తిని ముంజేతికంకణము గావించుకొనిరి" అని దేవిమ్రోల పలుమాఱు భక్తిపరవశుడై ప్రణమిల్లినాడు. మండపమును వివిధపూజా ద్రవ్యములతో నింపి పురోహితుడు ఆవేశభరితుడై పూజ సలుపుచుండెను. సత్యలోకమే తనయింట నాడు వెలసినదని నాగమహాశయుడు మురిసినాడు. భవ్యమైన భావపూరము మండపమునుండి యవిరతముగ వెలారదొడగినది. ఉద్వేగపూరితమైన స్వరముతో సరస్వతిని సంబోధించి "జననీ! నీకటాక్షమునందక అవిద్యను దాటిపోజాలువా రెవ్వరు? నేను దురదృష్టవంతుడను. శాస్త్రపారంగతుడనుగాను" అని పలికి దుర్గాచరణుడు అల్లన నందుండి తరలి ప్రాంగణమందలి మామిడిచెట్టు చెంత నిలిచి "అమ్మా! నీమహిమ అనంతమైనది. నీవు సచ్చిదానందమయివి" అని గంభీర సమాధియం దాత్మవిస్మృతు డాయెను. మిత్రు డాదృశ్యమును విలోకించి ఆశ్చర్యాన్వితుడై నాగమహాశయునిసతిని పిలిచి "అమ్మా! అత డెట్లు పరవసుడై యున్నాడో చూచితివా?" యనెను. ఆ ప్రశ్నలు విని "నాయనా! ఈ స్థితిని నేడు నీవు చూచితివి. ఒక్కొక్కదినమున రెండు మూడుజాములు వారు చేతనరహితులై అట్లు పడియుందురు. శరీరమును బాసి వారు పోయిరని అపుడపు డడలుచుందుము." అని యాపతివ్రత పలికెను.

తురీయానందజ్ఞానానందస్వాము లొకప్పుడు నాగమహాశయుని దర్శించుటకై దేవభోగగ్రామమునకు పోయిరి. వర్షాకాలమగుటచే యూరంతయు నీటితో నిండిపోయెను. స్వాము లిరువురు పడవపై పయినించి తిన్నగపోయి నాగ మహాశయుని నట్టింట జేరుకొనిరి. వారిని చూచినంతన నాతడు "జయరామ కృష్ణ! జయరామకృష్ణ!" యని మహోత్సాహముతో పలికి ముందుల కుఱికి నీటిలో మునిగిపోయెను. స్వాము లిరువురు తొట్రుపాటుతో జలమందు లంఘించి ఎంతోకష్టముతో నాగమహాశయుని వెలుపలికిదీసిరి. చాలసే పాతడు సంజ్ఞారహితుడై పడియుండెను.

సహాశిష్యులను చూచుటకై దుర్గాచరణుడు అపుడపుడు కలకత్తా పోవుచుండును. పరమహంస శిష్యులలో గిరీశచంద్రుడు నాగమహాశయునకు సన్నిహితుడై యుండువాడు. అత డరుదెంచినపుడు పట్టుపరుపులపై కూర్చుండు మని మిత్రులు వానిని వేడుకొనువారు. హితులకు నమస్కరించి ఆతడు నేలపై చతికిలపడువాడు. అన్నము తినినపిదప తన విస్తరిని తానే తీసివైచుకొనువాడు. దక్షిణేశ్వరమునకు పోవునపుడు పరమహంస వసించెడి ఆగారముజూచి కన్నీరొడ్చువాడు. ఆచార్యుడు దివంగతుడైన యనంతరము ఆగదియందు ప్రవేశించుటకు ఆతనికి కాలాడలేదు. మఠపురోభాగమున సాగిలపడి చాలసే పళ్లే పడియుండువాడు. పరమహంస శిష్యులలో నెవ్వరైనను ఆహ్వానించినప్పు డేవర్ణభేదములను గణింపక వారింటి కరుగువాడు. పలువురతోకలసి భుజించుచు "జగన్నాథ మందిరమందలి యాత్రికులవలె గూడితిమి" అని వారితో ముచ్చట లాడువాడు.

ఎవ్వరైనను పారితోషికము లిచ్చుచో స్వీకరించుటకు నాగమహాశయు డియకొనడు. పసదనము లీయబూనిన సహృదయులకు వందనసహస్రము లర్పించి ఆతడు తరలుచుండువాడు. కావలసిన వలువలు లేనందున దుర్గాచరణుడు దుస్సహమైన చలిబాధ పడుచుండెనని విని గిరీశచంద్రు డొక భక్తుని ద్వారా యొకచక్కని పచ్చడమును వానియొద్ద కంపెను. పలుమాఱు ప్రణమిల్లి నాగమహాశయుడు వినమ్రుడై దానిని తన తలపై నిడికొనెను. బహుమానము నాతడు స్వీకరించెనని గిరీశుడు పరమానందభరితు డాయెను. కాని దుర్గా

చరణుడు సాలువును కప్పుకొనక భక్తిభావముతో ననవరతము దానిని శిరమందే వహించుచున్నాడని ఆత డెంతో చింతించెను.

క్రమక్రమముగ దీనదయాళుని కడపటిదినము లాసన్నము కాదొడగి నవి. అనవరత మాతడు తులసిమాలను చేబూని యుండువాడు. త్రికాలము లందును తప్పక పూజచేయువాడు. ఇహజగతియం దిక వాని కేయాశయునులేదు. ఒకనాటి ప్రాతఃకాలమున నాగమహాశయు డాతని చేయిబట్టుకొని వీథిగుండా నడపించుచుండెను. ఆయాసముతో వృద్ధు డపు డాకస్మికముగా నేలపై పడి పోయెను. వెంటనే తండ్రిని చేతులపై జేర్చుకొని దుర్గాచరణుడు మెల్లగ నిల్లు చేరుకొనెను. కొంతసేపు కడచిన పిదప వృద్ధునకు చైతన్యము కలిగెను. కాని జనకుని యంత్యముహూర్త మాసన్నమైనదని నాగమహాశయుడు గ్రహించెను. వైద్యునికి కబురు పంపి తండ్రిచెవిలో నీశ్వరనామము నుచ్చరింపసాగినాడు. భక్తిభరితహృదయుడై వృద్ధుడు భగవన్నామస్మరణము గావింపదొడగినాడు. వైద్యు డరుదెంచి ఆతని నాడిని పరీక్షించి పెదవి విఱచినాడు. నారాయణనామ ముచ్చరించుచు మఱికొన్నిఘడియలలో దీనదయాళుడు దేవలోకమున కరి గెను. ఎనుబదేండ్లిహజగతియందు మనియుండి సర్వేశ్వరుని స్మరించుచు "నారాయణా !" యని జనకుడు పరమపదించుటచే నాగమహాశయుడు పరితోషమును పడసినాడు కాని పరితాప మందలేదు.

తండ్రి కాత డిక చేయువలయు కర్తవ్యము పితృశ్రాద్ధము మాత్రమే! ఈ పవిత్రక్రియను మహావైభవముతో నిర్వహింపవలెనని దుర్గాచరణుడు నిశ్చయించినాడు. కాని వానిచేత గాసైనలేదు. ఆతని పరిస్థితుల కవగతులైన వారు చందాలు వేసికొని కొంతసొమ్ము సంగ్రహించి ఆతని కీయబూనిరి. కాని నాగమహాశయు డా పైకమును స్వీకరింపలేదు. ఆస్తి యనుకొనదగినది ఇల్లొకటి ఆతనికి కలదు. వెంటనే యాతడు తనఖా వ్రాసినాడు. ఏనూఱు రూకలను దెచ్చి నాడు. పొరుగింటి యవ్వ యొోర్తు ఏడువందల ఋణ మొసగినది. రెండు మొత్తములను వ్యయించి యాతడు తలచినరీతిని తనివార పితృకార్యమును నిర్వహించినాడు. పదపడి గయకరిగి అచ్చటి క్రియలను జరిగించినాడు.

పితృకార్యమును నిర్వహించుటలో నాగమహాశయుడు ఋణగ్రస్తు డాయె నని విని పాల్ సోదరులు చింతించి తాము వాని యప్పు దీర్ప నూహించినను ఆత

డంగీకరింపడని యెఱిగి ఏవిధముగనైన వానిరాబడిని హెచ్చింప నుద్దేశించి కలకత్తాలో కుమారటులీభాగమునగల వానియింటిని పెద్దమొత్తమున కద్దె కీయ నిశ్చయించిరి. రణజిత్ అందుల కంగీకరించెను. కాని దుర్గాచరణు డందుల కియ్యకొనలేదు. ఆగృహమున వసించుచు వచ్చుచుండిన కీర్తివాసుడు నాగమహాశయుని యౌదార్యమున కచ్చెరువంది తానే హెచ్చుబాడుగ నిచ్చుటకై సిద్ధపడినాడు. "నాయనా! నీవు రేయింబవళ్ళు కష్టపడి యించుక పైకమును సంపాదించుచుందువు. ఈవటలో నీవిచ్చు అద్దియే హెచ్చుమొత్త మని వగచుచుందును. ఇపు డింకను హెచ్చుపైకమును పుచ్చుకొనుటకు నాకు చేయి యెట్లు వచ్చును?" అని దుర్గాచరణు డాతనితో సాదరముగా పలికి నాడు. కీర్తివాసు నాతడు తనయునివలె ప్రేమించువాడు. నాగమహాశయుడు కలకత్తాలో వసించునపుడు కీర్తివాసు డాతనిని శ్రద్ధాభక్తులతో సేవించు వాడు. దుర్గాచరణుని యనంతరముకూడ నాతడు జాలకాలము వానియింట వసించినాడు. నాగమహాశయుడు వసించుచుండెడి యాగారము నాతడు పూజా గృహము కల్పించుచు ప్రత్యేకశ్రద్ధతో కాపాడువాడు. దుర్గాచరణుడు వాడు చుండెడి మంచమును పరమభక్తిచే భద్రముచేయువాడు.

ఆసంవత్సరమున కలకత్తాలో ప్రథమపర్యాయము ప్లేగ్ వ్యాధి పుట్టినది. పల్వురు దానిపాలబడి మరణించిరి. వ్యాధి విజృంభించుచుండగా నగరవాసు లనేకులు తమయిండ్లను వాకిళ్ళను వీడి మాఱుమూలగ్రామములకు పోదొడగిరి. పాల్ సోదరులు ఒక గుమాస్తాను వంటవానిని విడిచి స్వగ్రామమునకు పోయిరి. దుర్గాచరణుడు వారికి తోడుగా నుండి గీతాపారాయణము చేయసాగెను. ఇట్లుండగా గుమస్తాకు ప్లేగ్ పట్టినది. వైద్యుడు మందొసగి పోయినాడు. కాని రోగిని సేవించుటకై వానిదరి కెవ్వరును పోవుటకు సాహసింపరైరి. పవిత్ర మైన సేవాధర్మమును నిర్వహించుటకు నాగమహాశయుడు ముందంజవేసినాడు. ఆయభాగుని బ్రదికించుటకై బహుధాప్రయత్నించినాడు. అవసానసమయమున తనను గంగాతీరమునకు గొనిపొమ్మని ఆతడు దుర్గాచరణుని వేడుకొనినాడు. ఒరులతోడు బడయక నాగమహాశయు డాతనిని మూపునవహించి జాహ్నవీ ఘట్టమునకు గొనిపోయెను. పాప మాతని యత్నములు వితథము లాయెను. ఆతని యంకతలమున శిరమునిడుకొని "గంగా! గంగా!" యనుచు నా

యభాగుడు ప్రాణములు పాసినాడు. శవమును సమీపించుటకైన నెవ్వరు ముందులకు రాలేదు. మరణించినవాడు బ్రాహ్మణుడగుడు తరువాతిక్రియలు విప్రులే నెఱపవలెను. ప్లేగు వలన చచ్చినవాని పొంతకు వచ్చుటకుగాని దహన సంస్కారము జరుపుటకుగాని బ్రాహ్మణు లంగీకరింపలేదు. దుర్గాచరణుని దుఃఖమునకు మేరలేకపోయెను. కోరినసొమ్ము నిచ్చెదనని విప్రుల నాతడు వినమ్రుడై ప్రార్థించినాడు. పెద్ద మొత్తమును చేపట్టి బ్రాహ్మణు లా తంతును నిర్వర్తించిరి. "వీడు పిచ్చివా" డని నాగమహాశయుని చూచి వెక్కిరించి వారు శ్మశాన క్షేత్రమునుండి వెడలిపోయిరి.

పిదప నొకనా డాతడు కాళీమందిరమున కరిగి మరలి వచ్చుచుండగా నొకభక్తు డాతని కగపడి 'ఈడెన్' ఉద్యానమునకు గొనిపోయెను. ఎన్నో వేడుక లచట వానికన్నుల పడెను. చప్పున నందుండి మరలి "మానవుడు నేడు విశేషముగ భోగపరాయణుడై యున్నాడు. జననమరణరహస్యముల నెఱుగుటకై ప్రయత్నింపక తాత్కాలికములైన విషయసుఖములం దాత్మ విస్మృతుడై యున్నాడు. తన మత్తునుండి యాత డెన్నడు విడివడునో! తామసిక రాజసిక ప్రవృత్తు లిపుడు ప్రపంచము నేలుచున్నవి. కామినీకాంచనములకై మానవు డిపుడు పరుగులెత్తుచున్నాడు. సర్వేశా! సర్వేశా! జగతి కెపుడు ముక్తిని ప్రసాదింతువు?" అని తలపోయుచు దుర్గాచరణు డందుండి మరలినాడు.

మఱునాడు నాగమహాశయుడు గిరీశఘోషు గృహమున కరిగినాడు. పరమహంసదేవుని శిష్యులు పలువు రందుగూడిరి. ఆచార్యుని గుఱించి ప్రసంగములు జరిగినవి. నిరంజనానందస్వామి ప్రసంగించుచు నాగమహాశయు నుద్దేశించి యిట్లు పలికెను: "దీనుడననియు హీనుడననియు తలచునాతడు నిక్కముగ దీనుడగుననియు హీను డగుననియు గురుమహారాజు వచించువాడు కదా! అనవరతము మిమ్ము మీరు కొద్దిజూపుతో చూచుకొనుచుందు రేల!" "నన్ను నేను పరీక్షించుకొనుచు నేను దీనుడననియు హీనుడననియు గ్రహింపగలుగుచున్నాను. శివుడనని శంకరుడనని యెట్లు వచింపజాలుదును? మీవంటి భక్తప్రవరులే అట్లు పలుకగలరు. నేను నిక్కముగ నధముడను. మీకృపాభిక్షవేడు దీనుండను. కీటకసదృశుడను. సత్యమును వచించుచుంటిని. సత్యము వాకొనుట

నేరముకాదుగదా!" అని ప్రత్యుత్తర మొసంగి, సముఖస్థస్వాములముందు దుర్గాచరణుడు సాగిలపడినాడు. నిరంజనానందస్వామి మరేమియు బలుకజాలక పోయెను. "అహంభావమును సంపూర్ణముగ మాపుజేసుకొనగలవారే నాగ మహాశయు డందిన స్థితి నందజాలుదురు. ఇట్టి మహాపురుషుల పదస్పర్శ కతన పృథివి పవిత్రవంతమగును." అని గిరీశుడు పలికినాడు.

రామకృష్ణపురవాసియైన రామకృష్ణభక్తు డొకడు పరమహంసదేవుని వార్షికోత్సవము నెఱపుచు దుర్గాచరణుడు మున్నుగువారి నాహ్వానించెను. మిత్రులు కొందఱు గుఱ్ఱపుబండిచేసికొని నాగమహాశయుని తోడ్కొనిపోవుటకై ఆతనియింటి కరిగిరి. కాల్నడకను వత్తునని దుర్గాచరణుడు వారితో విన్న వించెను. గుఱ్ఱమును కొట్టుటచూచి ఆతడు సహింపలేడని వారు గ్రహించి దానిని తొకమని మాటయిచ్చి ఎట్టకేలకు వానిని బండిలో కూర్చుండ బెట్ట గలిగిరి. భక్తులందఱు నాడు సంకీర్తనమునందును, వేడుకలందును కాలక్షేపము చేసిరి. రామకృష్ణపురమంతయు నాటి యుత్సవము కతన మిగుల రామణీయమై కనుపట్టెను. వీవనతో విసరియు బరువుదినుసులను మోచియు నాటి యాగంతు వులకు నాగమహాశయుడు వివిధసేవలు సలిపినాడు కాని వేడుకలందు పాల్గొని నాడు కాడు. తక్కుంగలవారివలె ప్రసాదముపేరిట తన యుదరమును పూరించినాడుకాడు. పరమహంస పే రుచ్చరించి ఇంచుక ప్రసాదమును ఆరగించి నాడు. ఉత్సవములనుండి మరలునపుడు బండిలో కూర్చుండుట కాతడు సమ్మతించినాడుగాడు. కావున నెల్లఱును కాల్నడకను సాగించియే యందుండి సాగిపోయిరి.

అవివాహితుఁడు బ్రహ్మచర్యవ్రతమును నెఱపుటకంటె, అడవియందు మసలనేగినవాడు బ్రహ్మచర్యవ్రతమును నెఱపుటకంటె వివాహితుఁడు బ్రహ్మ చర్యదీక్షను నిర్వహించుట ఘనతరవిషయము. సంయములందు ప్రథమస్థానము నలంకరించువా డిట్టిదీక్షను నిర్వహించువాడే! ఒంటరియై కత్తిసాముచేసి యోధుడనని మురియు వానికంటె ప్రతికూలశక్తులు అడిదములను ఆస్ఫాలన మొనరించుచు మార్కొనుతఱి నిలిచిపోరి నెగ్గినవాడే యధికుడుకాడా? ఇట్టి యోధుని కర్తవ్యముకంటె గూడ పూర్వోక్తదీక్షా పరతంత్రుని కర్తవ్యము పెక్కుమడుంగులు కష్టమైనదని "ధమ్మపథము"న బుద్ధభగవానుడు వాకొని

నాడు. ఇంద్రియములను ప్రేరేపించు ప్రలోభములు ప్రత్యక్షమగునపుడు చలింపనివాడే సంయమీంద్రుడు. ఇట్టి మహాత్ములు మన దేశమందు సర్వ యుగములందును పుట్టిరి. ఆధునిక యుగములో వీరియందు తలమానికము శ్రీరామకృష్ణ పరమహంస యని చెప్ప జెల్లును. పరమహంసవలె ప్రపంచ ఖ్యాతి పడయకున్నను అతనిబోలు సంయమీంద్రుడు నాగమహాశయుడని వాకొనుట అతిశయోక్తి కాజాలదు. ఇరువురును వివాహితులే! పత్నులను సమ్ముఖమున నిలుపుకొని ఉభయులును కఠోరబ్రహ్మచర్యమును నిర్వహించిన మహాత్ములే!

తన పల్లెయందు ప్రత్యేకమైన పర్ణశాల నిర్మించుకొని అందు వసింప వలెనని తొలుత దుర్గాచరణు డూహించినాడు. ఆతని యుద్దేశమెద్దియో సహధర్మచారిణి గ్రహించినది. "మీ వ్రతనిష్ఠ కెట్టిభంగము వాటిలదు. మీదీక్షకు నెగ్గుదెచ్చుదానను కాను. మీరు వేఱుకుటీరమున వసింపనక్కఱ లేదు" అని ఆ యిల్లాలు వచించినది. ఆదర్శరమణి భర్త యుద్దేశములకు చేయూత నొసగునుగదా! నాగమహాశయుడు గృహస్థాశ్రమమున విజయుడైన సంయమీంద్రుడు కాగలిగినాడు. "ఏమూర్తమందైనను వారియందు కామ వికారమును పొడగాంచనైతిని. పరమహంస దేవుని పవిత్రనామము నుచ్చ రించుచు నైహికసుఖేచ్ఛను వారు బారుగ నణచివైచిరి. వా రగ్నిమధ్యమున వసించిరి; కాని యించుకంతైన వారి శరీరము దగ్ధము కాలేదు" అని దుర్గాచరణుని ధర్మపత్ని పలుకుచుండెడిది.

గురుకులమున బుట్టిన భక్తు డొకడు ఒకనాడు దుర్గాచరణుని యింటికి వచ్చి వేర్వేఱు ప్రసంగములు సలుపుచు "ఏమోయి! నీవు గృహస్థాశ్రమము సలుపుచున్నావు కాని వంశసముద్ధరణమును గుఱించి తలపకున్నావు? సంతాన వంతుడవు కానిచో నీవంశము నీతో కడముట్టును." అని పలికెను.

ఆతని పలుకులయందలి ధ్వని యెద్దియో గ్రహించుటకు నాగమహా శయునకు ఆలస్యము కాలేదు. భావము మనసున దట్టినంతన శక్తిశరాహతుని వలె ఆతడు చివాలున నేలగూలెను. కాయమున గాయము లయ్యెను. మూర్ఛ నుండి లేచి సమీపమందున్న యిటుకనుదీసి బలముకొలది నొసట గొట్టు కొనుచు "అయ్యా తమరు ఆచార్యకులమున నుద్భవించిన మహనీయులు.

నే గావించు బ్రహ్మచర్యదీక్షకు భంగమురాకుండుటకై ఆశీర్వదించవలసిన
మహాత్ములు తాము ఇట్టిభావమును సూచించుట ధర్మమా ?" అని గద్గదస్వర
ముతో దుర్గాచరణుడు పలికెను. నాగమహాశయుని ఆచరణమును చూచి
ఆతనిమాటలనువిని ఆ పెద్దమనిషి నిర్విణ్ణుడైపోయెను. తనపల్కులను తక్షణమే
ఉపసంహరించుకొనెను. దుర్గాచరణుని మానసమపుడు కుదుటపడెను. ఆగంతువు
చరణరజమును శిరమునదాల్చి ఆతడు సంతృప్తి నందెను.

పూర్వోక్తభక్తుడు వ్యక్తీకరించిన భావమునే ఒకప్పుడు దీనదయాళుడు
వ్యక్తీకరించి యుండెను. వంశసంరక్షణము నిమిత్తమేకదా "పరిణయమాడు"
మని తనయు నాతడు కోరియుండెను. తండ్రి పల్కులువిని "నేనీప్రపంచములో
నేయాడుదాని నెఱుగను. స్త్రీయెడల నాకెన్నడును మక్కువ కలుగదు.
సుఖేచ్ఛ నాలో సున్నయై యున్నది. మాతృగర్భమునుండి వెడలునపు
డెట్లుంటినో నేడును అట్లే యుంటిని. ప్రాపంచికవాంఛలతో నాకేమియు
సంబంధములేదు. నాకేల ! నాకేల !" అని కట్టుకొనినబట్ట నూడ్చిపారవైచి
చరచర నాగమహాశయు డిలువీడిపోయెను. వానిభార్య దుఃఖమునకు మేర
లేకపోయెను. ఆమె గోడుచూచి భక్తుడొకడు దుర్గాచరణునివెంట బరుగెత్తి
వేయిరీతుల నాతని బ్రతిమాలి గృహమునకు మరలించెను.

కామిని నాత డేదృష్టితో విలోకించినాడో కాంచనమునుకూడ నాచూడ్కి
తోడనే వీక్షించినాడు. "అన్నము నుపార్జించవేని ఆకలి యెట్లు తీరు" నని
యొకప్పుడు కన్నతండ్రి యడిగినపుడు "నాయనా! చెట్లపై నెన్నెన్ని
యాకులు లేవు ? క్షుద్బాధవలన మరణింతునని యడలనేల ?" అని నాగ
మహాశయు డుత్తర మొసగెను. "పక్షు లాహారమునుగూర్చి చింతింపవు.
మానవుడేల చింతింపవలెను ?" అని యేసు పలుకుచుండువాడు. ఏసు సంయమి
భావమును దుర్గాచరణు డనేకపర్యాయములు మనన మొనరించుకొని యుండును.

పాల్‌సోదరుల వేడికోలును మన్నించి నాగమహాశయు డొకనాడు
భోజేశ్వరపురమునకు పోయెను. పాల్‌సోదరు లపుడు భోజేశ్వరమున వసించు
చుండువారు. అందుండి దుర్గాచరణుడు మరలునపుడు స్టీమరువెచ్చమునకై
వాని కెనిమిదిరూకలను, చలికాల మగుటచే నొక చక్కనిపచ్చడమును వారొస
గిరి. ఓడరేవు భోజేశ్వరమున కాఱుమైళ్ళ దూరమందున్నది. రేవుచేరి ఆతడు

టిక్కెట్టుకొనువేళ మలినాంగియు జీర్ణవస్త్రధారిణియు నైన బిచ్చకురాలొకతె ఇరువురుబిడ్డల నెత్తుకొని మఱి నలుపురుబిడ్డలను ముందుబడవైచుకొని ఆతనిని సమీపించి డగ్గుత్తికతో తన దుస్థితిని గుఱించి చెప్పుకొనెను. ఆమెకథ విని నంతన నాగమహాశయునిగుండె నీరాయెను. ఆతని కన్నులనుండి అశ్రువులు బొటబొట రాలెను. తనకడనుండిన సొలువును ఎనిమిదిరూకలపైకమును బిచ్చకత్తె చేతులందు బెట్టి "అమ్మా! వీనిని తీసుకుని నీబిడ్డలను కాపాడుకొని నీవు పట్టెడన్నము తినుము" అని దుర్గాచరణుడు పలికెను. బిచ్చకత్తె వాని నాశీర్వదించి వెడలిపోయినది. నాటిప్రయాణమువలన నాగమహాశయుడు మిగుల నలసినాడు. కొంతసేపు ఓడరేవులో తడసినాడు. టిక్కెట్టు కొనుట కింక పైకమేది? ఓడ కదలి వెడలిన పిదప నాతడు కలకత్తాదిక్కుగా నడువదొడగినాడు. మార్గమధ్యమున దేవాలయమేదేని అగుపడెనేని అర్చకులను వేడి కొంచెము ప్రసాదము పడసి ఆరగించువాడు. ఆలయ సందర్శనము కానపుడు ఒకటి రెండుపైసల యటుకులు కొని తినువాడు. విశాలమైన నదులును కాలువలును మార్గమధ్యమున గోచరించినపుడు కొన్ని కానుల నిచ్చి రేవుదోనెల నెక్కి వానిని దాటువాడు. సామాన్యప్రవాహముల నీది దాటువాడు. ఏడణాల యాఱుపైసలు మాత్రము ఆతనియొద్ద నుండెను. ఈమాత్రముపైకముతో నడిచినడిచి దీర్ఘప్రయాణము సాగించి ఇరువదితొమ్మిది రోజులలో నాతడు కలకత్తా చేరుకొనెను.

తన పనిని రణజిత్ నిర్వహించుచు ఆదాయమందు అర్ధభాగమును తన కంపుచున్నను, ఆతడు విశేషప్రతిఫలమును పడయవలెనని దుర్గాచరణుని యుద్దేశము. మనసును సర్వేశునిపై నిలిపి మిత్రుడును పాల్ సోదరులును నిర్దేశించు సేవ నాతడు నెఱపసాగినాడు. న్యాయదృష్టిలో తానందవలయు పైకము కంటె తక్కువ పడయవలయుననియే మక్కువపడువాడు. ఒకప్పుడు చేత నేమియు లేక పోయెను. పాల్ సోదరులు రెండు వేలమణుగుల యుప్పును ఎగుమతి చేయు సందర్భమున పగలంతయు నెండలో కిదరపురము రేవులో నాగమహాశయుడు శ్రమపడవలసివచ్చెను. ఆశ్రమకు ప్రతిఫలముగ నాత డేడురూకలను పడయవలసి యుండెను. కాని పదమూడు అణాలను మాత్రము ఆతడు కైకొనెను. రేవునుండి మరలి వచ్చుచుండగా నొక నిరుపేద వాని కెదురై

తనకష్టముల నేకరువుపెట్టెను. "నాయనా! దుఃఖింపకుము." అని వాని నూరడించి వానికిబదులు తానే దుఃఖించి చేతగల పదమూడణాలను ఆతనికి సమర్పించి నాగమహాశయుడు మనసు గుదుటపఱచుకొనెను. నాటి క్షుద్బాధను సంతోషముతో భరించెను.

జంతువు లేవియైనను అఱచినను గూసినను ఆకలివలన నవి బాధపడు చుండెనని ఆతడు అడలుచుండువాడు. చప్పున గొంతయాహారమును గైకొని వానికి బెట్టువాడు. శైశవమునుండియు నీకర్తవ్యమున నాత డాటి తేటినాడు. కుక్కయఱచినను పిల్లి 'మ్యావు' మనినను తాను అన్నముతినుట మాని పరు గునబోయి వాని కాహారము బెట్టువాడు. ముందుగ వానికడుపులను నింపుమని పరిపరివిధముల మేనత్తను ప్రార్థించువాడు. అనవరతమామె యాతని వేడి కోలును మన్నించుచుండెడిది.

చెఱువులయొద్దకును నూతులయొద్దకును పోయి బియ్యమును పప్పును వానిలోపోసి చేపల కడుపునింపుట వాని యలవాటులలో నొకటి. చిఱుత ప్రాయమునుండియు నీత డీయభ్యాసము నలవఱచుకొనినాడు. తమయింటివెనుక గల గుంటనుజేరి పరిచితమిత్రునట్లు మీనములను సంబోధించుచు వానిదెస నాతడు గింజలను గిరవాటు వేయుచుండువాడు. పశువులను పక్షులను మత్స్య ములను తేటి చూచుచు వాని ముఖములందు జ్ఞానవికాసము కలదనియు భవపరంపర కడచినపిదప క్రమసిద్ధినంది యవి ముక్తిని పొందగలవనియు నాతడు పలుకుచుండువాడు.

గ్రీష్మకాలమున నొకనాడు నాగమహాశయుడు తనగృహమునకు సమీప మునగల ఆలయమండపముపై గూర్చుని ధ్యానము చేయుచుండెను. రివ్వు రివ్వున నెగసివచ్చి అపుడు రెండుపక్షులు ఆతని పదములపొంత వ్రాలినవి. దుర్గాచరణుడు వానిని వీక్షింపలేదు. వానిదృష్టి నాకర్షింప నుద్దేంచి కాబోలు పక్షులు మెల్లగ ముక్కులతో వానిపాదములను గీకుట కారంభించినవి. కన్నులు తెఱచి పిట్టలనుచూచి మందహాసముచేసి "తల్లులారా! రండు, మీకు బువ్వపెట్టెదను" అని చెప్పి గుప్పెడు తండులములను తెచ్చి చేతనిడుకొని అల్లన వానిముక్కుల కాతడు అందించినాడు. మెల్లగ నవి ఆ తండులములను

మెక్కినవి. కాని వానితో నాచిన్నపిట్టల పొట్టలు నిండలేదు కాబోలును. తృప్తినందక అనునయపూర్వకముగ నవి వానిచుట్టు దిరుగదొడగినవి. మరల గృహములోనికి బోయి మఱి గుప్పెడు బియ్యమును చిన్నగిన్నెడు నీటిని దెచ్చి ప్రేమపూర్వకముగ వానిని దువ్వుచు వానిముందు బెట్టినాడు. వాని యెడమ చేతిపై నిలిచి కడుపార తండులములను తిని నీరు త్రాగినవి. పక్షులను ముద్దిడు కొని కొంచెముసేపు వానిని లాలించి పాలించి " తల్లులారా! నేటి కిక వనము లోనికిపోయి ఆడుకొని రేపు విందుకై రండు " అని చెప్పి నాటికి వానికి సెల వొసంగినాడు. విహగములు సంతోషముతో నెగసిపోయినవి. " ఈశ్వరలీలలు నిక్కముగ చిత్రములు " అని గంభీరవదనుడై ఆత డనుకొనినాడు.

అహింస పరమధర్మమని విశ్వసించిన మహాత్ముడు నాగమహాశయుడు. శారీరకహింసనే కాదు, మానసికహింస నైనను ఆత డెన్నడు చేసియెఱుంగడు. హింసావృత్తి కన్నులబడెనేని తన ప్రాణముల నర్పించియైనను దాని నుడుపుటకై ఆత డుద్యుక్తు డగుచుండును. ఒకప్పుడు నారాయణగంజి జనుముజంత్రాధికారు లైన కొందఱు పాశ్చాత్యులు పిట్టవేటకై దేవభోగగ్రామమునకు పోయిరి. తుపాకిశబ్దము చెవిబడినంతనే దుర్గాచరణుడు వారిపాలికి పరుగెత్తుకొనిపోయి చేతులు జోడించి వేటసాగింపవలదని పెక్కురీతుల వారిని ప్రార్థించినాడు. వాని మాటలు వారికి బోధపడలేదు. తమకర్తవ్యమును నిర్వహించుటకై వా రుద్యుక్తులైరి. వారిచేతులు పట్టుకొని నాగమహాశయుడు వేడుకొనినాడు. ఇరుపక్షములకును కొంతసేపు పెనుగుట జరిగినది. ఎముకల ప్రోవులవలెనుండిన నాగమహాశయున కాముహూర్తమున వేయియేనుగుల బలము వచ్చెను. ఆతని మ్రోల తెల్లవేటకాండ్రు అశక్తులైరి. తుపాకుల నూడ వెఱికి దుర్గాచరణు డింటికిపోయి దుష్టసాధనములను పట్టుకొనవలసి వచ్చినందులకు దుఃఖించి చేతు లను ప్రక్షాళన మొనరించుకొనెను. వేటకాండ్రైన దొరలు స్వస్థానము జేరిన పిదప వారితుపాకులను వారి కొక మిత్రునిద్వారా ఆతడు పంపినాడు. దొరలు కుపితులై దుర్గాచరణుని న్యాయస్థానమున కీడ్వదలపడిరి. కాని ఆతడు మహాత్ముడని విని తమపూనికను విరమించిరి. వారాతనియెడల మిగుల భక్తి శ్రద్ధలతో మెలగదొడగిరి. తరువాత నెన్నడును వేటకై వారు దేవభోగ గ్రామమునకు పోవుటకు సాహసింపరైరి.

వంగపల్లెలందు సాధారణముగా నిండ్లకు వెనుక చిన్న చెరువు లుండును. వానియందు చేపలుపట్టుట వంగగృహస్థుల యలవాటు. ఇతరులు అందు చేపలు పట్టుచో వానియందు కొంతవంతును గృహస్థులకు వా రిచ్చి తీరవలెను. దుర్గాచరణుని ఇంటివెనుకగల తటాకమున జేపలుపట్టి జాలరియొకడు తన భాగమును తాను గైకొని మిగిలినవంతును గృహాయజమాని కీయగడగెను. కట్టెదుట మీలు కొట్టుకొనుట జూచినంతన నాగమహాశయుని కన్నులనుండి నీరు జొటజొటరాలెను. పల్లెవా డడిగినపైకము నిచ్చి మత్స్యములన్నింటిని దీసికొని దుర్గాచరణుడు వెంటనే వానిని కోనేటి నీటిలో విడచినాడు. తోడి వారికి ప్రతిదినము అనివార్యమైన మత్స్యభక్షణమున కాతడు దూరస్థుడై నిలుచువాడు. దుర్గాచరణుని విచిత్రాచరణము నవలోకించి ఆత డెవండో అతి లోకపూరుషుండని యూహించి అమాయికుడైన జాలరి నిముసమయిన దడయక కాలుకొలది పరుగెత్తుకొని పోయినాడు.

దుష్టమృగములనైనను విషజంతువులనైనను హింసించుటకు దుర్గా చరణుని మానస మీయకొనకుండెడిది. ఒకనాడు త్రాచుపామొకటి వాని పెరడున ప్రవేశించి బుసకొట్టసాగినది. సర్పమును చూచి ఇరుగుపొరుగువారు భయపడిరి. "దీనిని చంపువారు లేరా?" యని స్త్రీలు మొరపెట్టుకొనిరి. "చంపుటా! చంపుటా!" అని యాశ్చర్యదుఃఖములతో నఱచుచు నాగ మహాశయుడు ముందులకు బరుగిడివచ్చి "ఎవరికైన హానిజేయునది ఈపాము కాదు. మనసున పడగెత్తియాడు పామే చెప్పరాని కీడు చేయును" అని వచించి చేతులు జోడించి కాలసర్పమును సంబోధించి "హే! తండ్రీ! సుబ్బా రాయుడా? మానవులను రక్షించు దేవుండవు. నావంటి పేదవాని గుడిసె నీకు సదనము కాజాలదు. నీయాలయమును నీవు చేరుకొనుము" అని భక్తిపూర్వ కముగా పలికి తాను ముందునడచి చిలువకు తెరువు చూపినాడు. తల వంచు కొని దర్వీకరము ఆతడు చూపినదారి ననుసరించి యవ్వలికి పోయెను. ఈయంశము నుల్లేఖించి నాగమహాశయు డొకప్పు డిట్లనెను. "ఒక మానవునికి గాని జంతువునకుగాని ఎగ్గు చేసితిమేని తిరిగి ఎగ్గే మనకు దాపురించును. మన యాచరణముల ననుసరించియే ప్రతిఫలములును మనకు లభించును. అద్దమును

ముం దిడికొని వేర్వేఱు ముఖవైరులను ప్రదర్శించినపుడు అవియే ప్రతిబింబ ములై గోచరించునుగదా. ”

పరమహంస మఠములో నొకప్పుడు పాముపిల్ల ప్రవేశించెను. గిరీశుడు మున్నగువారు దానిని జూచి మిగుల తొట్రుపడిరి. కొందఱు దానిని చంప నుద్యుక్తులైరి. “వలదు వల” దనుచు పరుగు పరుగునవచ్చి “నాగరాజా! నాగరాజా!” అని నాగమహాశయుడు దానినెత్తి ముద్దాడుచు దూరముగా గొనిపోయి వదలివైచెను. “బుద్ధిలోపమువలన దోషముచేసి కష్టముపాల బడెదము. బుద్ధి నీశ్వర చరణకమలమునకు లగించి యుంచితిమేని అపాయమట్లు మన కేదియు గోచరింపదు” అని యాతడు పలికెను.

ఒకనాటి ప్రాతఃకాలమున తన గృహమునకు సమీపమందలి చెరువులో నిలిచి నాగమహాశయుడు మొగమును చేతులును కడుగుకొనుచుండెను. అపుడు సర్పమొకటి వాని యెడమకాలి బొటనవ్రేలిని కఱచినది. పామునకు కీడు వాటిలునని యడలి అతడు కదలక మెదలక అట్లే నిలువంబడి యుండెను. ఇంచుక సేపటిలో ఉరగ మాతని యంగుళిని వదలిపోయినది. ఉదంతము విని వాని భార్య మిగుల వెఱపు నొందినదాయెను. “దీనికింత యడలనేల? ఏదియో ఆహార మనుకొని అది నావ్రేలిని నోట బెట్టుకొనినది. తోడనే తనతప్పును తాను గ్రహించి దానిని వదలి తనదారిని తాను చనినది” అని యాత డామెతో వచించెను.

సాధారణముగా నాగమహాశయుడు చేతులు జోడించి యుండును. “ఎవరికి నమస్కరించుచుంటి” వని ఎవ్వరేని ప్రశ్నించినపుడు “జగదీశ్వరునకు నమస్కరించుచుంటిని సమస్తప్రాణులందును ఆతడు వెలయుచుండునుగదా!” అని యతడు పలుకుచుండును.

పశువులు పక్షులు పాములు మున్నగు వానికేగాక వృక్షములకు లతలకు మొక్కలు మొదలగు వానికి నయితము ఎగ్గుకలుగుట జూచి ఆత డోర్వజాలక పోవువాడు. ఆతని యింటివెనుక నొక మామిడిచెట్టు కలదు. ఒకనాడు భక్తు డొకడు దానియాకును త్రుంపుట చూచి ఎంతో పరితాప మొంది “ఎంతపని చేసితివోయి! చెట్టు బాధపడ దనుకొంటివా?” అని దుర్గాచరణు డనెను.

ఆతని గృహమునకు తూర్పుదిక్కున నొక చిన్న వెదురుతోపు కలదు. వెదురుకొన లింటిమీఁదికిని ఇంటిలోనికిని చొరబడుచుండెడివి. ఎవరైనను వానిని కొట్టివేయ నుంకించునపుడు నోరునెత్తులు కొట్టుకొనుచు "ఈశ్వర కారుణ్య మంది, అవి పెరుగుచున్నవి" అని యడరుచు వారిని దూరముగ తొలగించువాఁడు.

ఆత డెన్నఁడు నొకదోమనైనను చంపి యెఱుఁగడు. నల్లుల నాదరముతో తనమంచముపై చేర్చుకొనుచుండువాఁడు. చీమలు శరీరముపై ప్రాకినపుడు, అపాయము వాటిలనిచోటులందు, ఎంతో జాగరూకతతో వానిని తీసి వదలువాఁడు. నడచుచుండగా నడుగులక్రిందపడి వేర్వేఱు పురుగులు నలిగి చచ్చునని యడలి తేఱి తేఱి మార్గమును చూచుచుండువాఁడు. ఒక్కొక్కపుడు నడచుటకు సాహసించువాఁడుకాఁడు. గాలి పీల్చుచుండ సదృశ్యక్రిములు ఊపిరితిత్తులందు జొచ్చి చచ్చునని ఆత డపుడపుడు అడలుచు నుచ్ఛ్వాస నిశ్వాసములను బంధించుచుండువాఁడు.

ఆతని పూజాగృహమునకు పూర్వదిక్కున గల స్తంభమునకు చాల కాలమునుండియు చెదపట్టి యుండెను. చూచిచూచి యూరకొనజాలక భక్తు డొకడు వానిని క్రిందికి దులిపివైచెను. కొలది నిముసములు కడచినపిదప నేల బడిన చెదపురువులు నాగమహాశయుని కన్నుల పడినవి. ఆతనిగుండె నీరైపోయినది. గద్గదస్వరముతో నాతఁడు "అయ్యో! ఎంతపనిచేసితివోయి. పాపము స్తంభము నాశ్రయించి బ్రతుకుచున్నవి. వీని బ్రతుకు చెఱిపి పాపము కట్టికొనుచున్నావు" అని పలికి కన్నులనుండి అశ్రుబిందువులు రాలుచుండ చెదపురుగులను అత్యంతశ్రద్ధతో దీసి "అమ్మలారా! చిక్కులోపడిపోతిరి. మళ్ళీ యిళ్ళుకట్టుకొనండి. మీకింకభయములేదు." అని చెప్పుచు వాని నాతఁడు మరల కంబమున కెక్కించినాఁడు. ఆదృశ్యమునుచూచి ఆతని పలుకులు విని భక్తు డేమియు బలుకజాలకపోయెను. అంతరంగమందు ఆతఁడు నాగమహాశయునకు సహస్రధన్యవాదములు సమర్పించినాఁడు. చెదపురుగులు స్వస్థానమునుచేరి తమ వల్మీకమును మరల తాము సృష్టించుకొనినవి. దాని నెవ్వరును స్పృశింపకుండునట్లు దుర్గాచరణుడు కట్టుదిట్టము గావించెను.

శైశవమునుండియు గోవులయెడ వానికి ప్రత్యేకమైన ప్రీతి కలదు. జగద్ధాత్రి వానియందు విరాజిల్లుచుండునని ఆతని యభిప్రాయము. తఱచుగ గోమాతమ్రోల భక్తిభరితుడై సాగిలపడి వానిగిట్టనుండి యాతడు రజమును గైకొనుచుండును. ఒకనాడు వానిచేతియందొక యిక్షుఖండమును వీక్షించి ఒక యావు వానియొద్దకు చరచర నడచివచ్చెను. నాగమహాశయుని ఆనందము నకు మేరలేకపోయెను. ఆకులను దీసి ఆదరముతో గోమాత కాతడు తినిపించెను. గడను చిన్నిచిన్ని ముక్కలుగా జేసి ఆవునకు పెట్టి దాని మూపును దువ్వుచు ఆదరానురాగములతో దానివీపుపై అల్లన తట్టసాగినాడు. పదపడి గోమాతకు ప్రణమిల్లి లేచి భక్తిశ్రద్ధలతో కొంతసేపు దానికి విసరినాడు. తాగావించు సేవ జగద్ధాత్రికి తానొనరించు పరిచర్యయేమని ఆత డూహించినాడు. ఊహించినకొలది వానిహృదయము భవ్యమైన ఉద్వేగముతో నిండిపోయినది. తన్మయభావ మాతని యంతరంగమున తాండవించినది. ఆత్మవిస్మృతుడై యాతడు నేలపై బడినాడు.

నాగమహాశయుడు శాక్తేయుడైనను శక్తిపూజమాత్రమే ముక్తిసాధనమని నమ్మినవాడుకాడు. వేర్వేఱు తెన్నుల స్రవించు నదులు రత్నాకరమున చేరునట్లు వేర్వేఱు మతములు గమ్యస్థానమైన ముక్తిని జేరునని గీతారహస్య మెఱిగిన రామకృష్ణపరమహంస పలుకుచుండు వాక్యము నాతడు హృదయంగమమొనరించుకొనినాడు. శైవులయెడలను వైష్ణవులయెడలను అనల్పమైన భక్తిశ్రద్ధలను జూపుచుండువాడు. హిందువుల నేదృష్టితో వీక్షించువాడో మునల్మానులను బౌద్ధులను క్రైస్తవులను సిక్కులను జోరాష్ట్రనుమతావలంబులను ఆత డాదృష్టితోడనే వీక్షించువాడు. ఏదేని మసీదుప్రక్కనుండిగాని చర్చిపొంతనుండిగాని నడచుట తటస్థించుచో నిముసము నిలిచి ఏసు మహమ్మదుల నుద్దేశించి ఆత డభివాదము గావించువాడు.

సాధనమును గుఱించి నాగమహాశయు డిట్లు పలుకుచుండువాడు.

“ఫలభరితమైన చెట్టుక్రింద గావలియుండువాడు ఏ తెఱగున మేలుకొని యుండునో సాధనశక్తికతన మనుష్యాత్మ అనవరతము ఆ తెఱగును మేలుకొని యుండవలెను. సాధనఫలము జగదీశుని చేతిలోకలదు. ఈశ్వరకారుణ్యము లభించనేని జీవాత్మ ఫలమును పడయగలదు. కొందఱు కొందఱు నిదురించు

చుండగా దయాశరథియైన భగవంతుడు ఫలమును వారి ముఖములచెంత రాల్చవచ్చును. అయదృష్టవంతులు సాధనభజనల నంతగా సలుపనక్కఱలేదు. వారు కృపాసిద్ధు లనబరగుదురు. ఈశ్వరకరుణ నందక ఈశ్వరుజేరిన వా రెవ్వ రును లేరు. ఆతడు కల్పతరువు. ఎవ్వరు ఏమిపొంద నర్హులో భగవంతుడు దానిని వారి కందించును. కాని పునఃపునః జీవాత్మను భవపరంపరయందు దొరలించు వాంఛలకు మానవుడు తన మానసమున తావల మీయరాదు. శుద్ధభక్తికొఱకై శుద్ధజ్ఞానముకొఱకై ఈశ్వరు నారాధించుచు నాతని చరణ రాజీవములను మనుష్యుడు నిజాంతరంగమున నిలుపుకొనవలెను. అపుడే జీవుడు సంసారబంధమును త్రెంపుకొని సర్వేశ్వరుని కారుణ్యమునుపడసి, ముక్తి నందును. ఐహికవాంఛల బడు ప్రాణము దురంతయాతనము పాలబడును. ఈశ్వరారాధనమందును భక్తసంసర్గమందును ఆధ్యాత్మిక ప్రసంగములందును కాలమును గడపునాతని ప్రాణము నే యాతనమును చేరజాలదు...ఐశ్వర్యాధి కారములకు సంబంధించిన ప్రలోభములు సాధకునిమ్రోల తఱచుగ తాండ వించుచుండుట నిక్కమే? కాని శుద్ధాత్మ వానిపై దృష్టిసారింపదు. శుద్ధాత్మ వస్తుతత్త్వమును గుఱించి విశేషముగా విమర్శనము సలుపనక్కరలేదు. అంత రంగికమైన ఆధ్యాత్మికశక్తికతన గుణతత్త్వమా నది యవలీలగ గ్రహింపగలదు. స్ఫటికశిలయందు సమస్తవస్తువులు ప్రతిబింబించునట్లు శుభ్రహృదయమున పూర్వోక్తతత్త్వము ప్రతిఫలించి తీరును. మానవుడు ప్రతివస్తువును పరీక్షించుచు గూర్చుండిన యెడల ఆదర్శజీవితమునుండి ఆతడు దూరస్థుడు కావచ్చును."

ఒకప్పుడు అశ్వినీచక్రవర్తు లనుస్నేహితు లిరువురు నాగమహాశయుని చూచుటకై దేవభోగగ్రామమునకు పోవుచుండిరి. అశ్విని యనునాతడు ప్రతి దినము సాయంకాలములందు శూలవేదనమువలన పొగులుచుండువాడు. రాత్రులం దాత డించుమించుగా స్మృతిరహితుడై పడియుండువాడు. సాయం కాల మగులోపల మిత్రులు గమ్యస్థానమును చేరజాలకపోయిరి. యాతన మే ముహూర్తమున నారంభమగునో యని యిరువురు నడలదొడగిరి. నాగ మహాశయుని తలచుచు వా రడుగులు వేయుచుండిరి. ఏకష్టము నెఱుగక కొంత సేపటికి వారు గమ్యస్థానమును చేరజాలిరి. ఏబాధనెఱుగక అశ్విని నాడు కడు పార భుజించి బాగుగ నిదురించెను. అంతకుమున్ను ఐదు నెలలు రాత్రులందు

గ్రుక్కెడు నీరుత్రాగుటకైన వానికి సాధ్యము కాకుండెడిది. దుర్గాచరణుని గృహమున మిత్రులు మూడుదినము లుండిరి. ఆదినములు సుఖముగనే గడచి పోయెను. "ఆహా! నన్ను పీల్చి పిప్పిచేయుచుండెడి యాతనము నాగమహాశయుని సంపర్కముకతన కడతేఱినది. ఆమహాత్ముని చరణముల నాశ్రయించి తరువాతి జీవితమును కడపి యుండినయెడల పరిపూర్ణత్వసిద్ధి నందియుండు వాడను." అని అశ్వని అనంతరము తనమిత్రులతో పలుకుచుండువాడు.

ఒకప్పుడు బ్రాహ్మణబాలు డొకడు మశూచికము వలన బాధపడు చుండెను. ఆతని తల్లి పేదరాలు. వితంతువు. బిడ్డ బ్రతుకునను నాస ఆమెహృదయమునుండి యంతర్హితమయ్యెను. ఏదిక్కులేక అల్లాడుచు కొనయూపిరితో నున్న బాలుని దీసుకొనిపోయి నాగమహాశయుని గుమ్మము ముందామె విడిచిపెట్టెను. కొంతసేపటికి బాలుడు తేఱుకొనెను.

దుర్గాచరణుని యింటికి సమీపమున చౌదరి యనునాతడు వసించు చుండెను. చైత్రమాసమున నొకనాటి యపరాహ్ణమున వానికొంపకు ని ప్పంటుకొనినది. రివ్వురివ్వున గాలి వీవదొడగినది. ఇరుగుపొరుగువారు మిగుల నడలి ఎంతో యడరి అనలము నార్పుటకై బహుధా ప్రయత్నింపసాగిరి. దుర్గాచరణుని భార్యపెద్దపెట్టున నేడ్చుచు నింటియందలి వస్తువుల నవ్వలబార వేయ నుంకించినది. స్మితముఖుడై ఆమెమ్రోలనిలిచి నాగమహాశయుడు, "ఓ వెఱ్ఱిదానా! ఏల నీయారాటము? ఈవస్తువులను మూటగట్టుకొని మనము పరలోకమునకు పోవుద మనుకొంటివా? ఈశ్వరు డీఱున సముఖస్థుడై మనకు దర్శనలాభమును కలుగజేసెను. పరమానందముతో మనమాతనిని ప్రస్తుతింపవలెను" అని పలికి "జయభగవాన్! జయభగవాన్! నీకటాక్షముండెనేని ఎవ్వరికిగాని ఏల చేటు వాటిల్లును. జయగురుదేవ్! జయగురు దేవ్" అని దుర్గాచరణుడు అనిర్వచనీయమైన పరితోషముతో చప్పట్లు కొట్టుచు పాడుచు నాడదొడగినాడు. అంతట అగ్ని చల్లారినదట. ఈ యుదంతము పాఠకుల నాశ్చర్యాన్వితులను చేయకమానదు. భక్తిశ్రద్ధ లమోఘములని ఈశ్వరకారుణ్యమున కసాధ్యమనునది, ఏదియులేదని విశ్వసించినవాడు నాగమహాశయుడు. భక్తప్రవరులందఱు అట్లు విశ్వసించినవారే! విశ్వాసము బలవత్తరమైనకొలది ఈశ్వరకారుణ్యము వారికి సన్నిహితమైనది. ప్రహ్లాదుల

కాలమునుండి ఈయంశము దృష్టాంతీకరింపబడుచునే యున్నది. తనవిశ్వాస మమోఘమైనదని విశ్వసించిన మహాత్ముడు దుర్గాచరణుడు. కావున నాటి యాపత్కాలమున నాతడు భజనచేసెను. తోడనే ఈశ్వరకారుణ్యమునందెను.

గంగాతీరమున అర్ధోదయమహోత్సవము మహావైభవమున జరుగుచుండెను. అర్ధోదయయోగ మేబదేండ్లకొకమాఱు మాత్రము కలుగును. ఒకప్పు డీ యుత్సవ మాసన్నమగుటకు మూడు నాలుగు దినములకు మున్నే నాగమహాశయుడు కలకత్తానుండి స్వగ్రామమునకు బోయెను. ఆతని జూచి తండ్రి యించుక కోపించి "ఓయీ! ఇంటికి మరలవలసిన సమయ మిదియా? విశేషదూరము పయనించి యాత్రికు లెందఱెందఱో ఈపర్వమున స్నాన మాచరించుటకు గంగానదికి పోవుచుందురు. అందుండి తిరిగివచ్చి యవివేకివైతివి. ఇపుడైనను మించినదిలేదు. మరల బయనముకమ్ము. నేగూడ నీవెంట వచ్చెదను" అని పలికెను. "మానవునిభక్తి హృదయపూర్వకమైన దైనచో లోకపావనియైన గంగ తనంతదానువచ్చి వాని గృహాంగణమందే సాక్షాత్కరించి వానికి ముక్తి నొసంగును. అత డెచ్చోటికిని పోనక్కఱలేదు" అని నాగమహాశయుడు జనకునకు బదులు చెప్పెను.

అచిరములో నుత్సవసమయ మాసన్నమాయెను. హరకామిని, కైలాస వసు మున్నగు ప్రసిద్ధవ్యక్తు లపుడు దేవభోగ గ్రామమున వసించుచుండిరి. సరిగ నర్ధోదయయోగమైన పవిత్రముహూర్తమున నాగమహాశయుని గృహాంగణమున కీశాన్యదిక్కున భూమిని భేదించుకొని కలరవ మొనరించుచు సలిలము మీది కుబుకసాగినది. దుర్గాచరణు డపుడు పూజాగృహమున ప్రార్థనము సలుపుచుండెను. సలిలముల చప్పుడు విని ఆతడు తటాలున నీవలి కరుదెంచి "అమ్మా పతితపావనీ! భాగీరథీ!" అని మహోత్సాహముతో సలిల సమ్ముఖమున సాగిలపడి దోసిట పవిత్రోదకముగొని శిరమున జల్లికొని జాహ్నవిని గుఱించి పరమప్రమోదముతో ననిర్వచనీయమైన ఉద్వేగముతో సంకీర్తనము సలిపి పూరమధికమైనంతన తనివార నందు స్నాన మాచరించెను. దీనదయాళ ప్రభృతుల ఆనందాశ్చర్యములకు మేరలేకపోయెను. దేవభోగవాసులు గుంపులు గుంపులుగావచ్చి భక్తిభరితహృదయులై "జయ గంగ! జయ గంగ!" అనుచు వారిపూరమున స్నానము చేసిరి. జయజయ శబ్దములతో ఉద్వేగ పూరిత

సంకీర్తనరవముతో నాగమహాశయుని ప్రాంగణము ప్రతిధ్వనించినది. గంట సేపటివరకు ఉదకపూర ముబుకుచునే యుండెను. క్రమక్రమముగ నది తగ్గి పోయెను. ఉత్సవసమయము నిలిచియున్నంతకాలము నీరునిలచెను. ఈయద్భుత దృశ్యమును కన్నులార గాంచి నాటి పవిత్రతోయమున తానమాడినవారు కొందఱు నేడును దేవభోగగ్రామమున సజీవులై యున్నారు. హరకామిని యను నామె చాలాకాలమునుండి గుల్మరోగమువలన బాధపడుచుండెడిది. నాటి పూత సలిలమున స్నానముచేసినతోడనే ఆవ్యాధి యంతరించినదట. ఆమె నవ్యశక్తి నందినదట.

ఈ యద్భుతసంఘటనోదంతమును విని వివేకానందస్వామి "నాగమహాశయునివంటి మహాత్మున కసాధ్యమైన దేదియునులేదు. అట్టి మహనీయుల యిచ్ఛాశక్తి అమోఘమైనది. అత్యద్భుతమైన ఆశక్తికతన మానవు డవలీలగ ముక్తినందగలడు" అని వచించెను.

నాటి మహాసంఘటనమును గుఱించి నాగమహాశయు డెన్నడుగాని ఎవ్వరితోగాని తెలిపియెఱుగడు. ఎవరైనను దానినిగుఱించి ప్రసంగించినపుడు "సామాన్యక్రియలను గుఱించి లోకు లతిశయోక్తు లుచ్చరించుచుందురు" అని యాత డనుచుండువాడు.

శ్రీరామకృష్ణ పరమహంస మనుష్యరూపమున నవతరించిన నారాయణుండని నాగమహాశయుడు విశ్వసించినాడు. కావున నతడు తనకు మేలుకలిగినను కీడువాటిలినను ఆతని యిచ్ఛానుసారము అట్లు సంభవించెనని తలచువాడు. కీడు నాతడు నిరాశతోగాక సదా నదాశతో వీక్షించువాడు. ఆత్మోన్నతికై, అంతఃకరణశుద్ధికై సర్వేశ్వరసంస్మరణకై గురుదేవుండు విధించిన శిక్షయని తనకువాటిలిన చేటున కాతడు అర్థము చెప్పువాడు. తనకు శూల యాతనము కలిగినపుడు అం దాతడు ఆచార్యుని గంభీరోద్దేశము కలదని యూహించినాడు. ఒకప్పు డాతని రెండుచేతులందును దుర్దమమైన బాధ పుట్టెను. చాలదినము లాతడు చేతులు ముడుచుకొనియే యుండవలసివచ్చెను. అనవరతము తాను హస్తములను ముడుచుకొనియుండుట నేర్చికొనవలెనని యుద్దేశించి గురుదేవుండు తన కా యాతనమును కలిగించెనని విశ్వసించి స్మితముఖుడై దాని నాత డనుభవించినాడు. ఒకనా డాతడు నిదురించుచుండగా పిల్లి

యొకటి, వానిమొగముపై దుమికి వాని యెడమకంటిని గీఱిగీఱి విడచినది. తెల్లగ్రుడ్డుపై గాయమయ్యెను. దానిని గాంచి యాతని యర్ధాంగి గోలు గోలున విలపింపసాగెను. "విలపించుట నీకు తగదు. గతభవమున నేను పాతకము లొనరించియుందును. ఆత్మసంస్కరణమునకై యీదండనము నాకవసరమైనదని గురుదేవుం డూహించియుండును. అతని యుద్దేశము మహత్తరమైయుండ పరితోషమందవలెనుగాని పరితాపమందదగునా?" అని యాత డామె కెంతో యుత్సాహము గొలిపినాడు "హే గురుదేవా! ఈశరీరమును నీసేవకై వినియోగించుటయందు లోపము ఘటిల్లుచున్నదేమో! లోపమును తలయెత్తనీయకుండ జేయుట నాకర్తవ్యము. నీ యాశీస్సునందుచు నే నీ పవిత్ర ధర్మమును నిర్వహించెదను. ఓగురుదేవా! నీకు ధన్యవాదములు. గురుకృపాహి కేవలమ్! గురుకృపాహి కేవలమ్!" అని యాత డనంతరము భక్తిపూర్వకముగ సంకీర్తనముగావింప గడగినాడు. మగనికన్ను మఱి రాదని విలపించిన యిల్లాలి యారాట మడగినది. కొలదిదినములలో నది యెప్పటికన్న చూపట్టి ఆమె కమితానందము గొలిపినది.

విపత్తులు సంభవించినపుడు మహాత్ములు ఆత్మసంయమము నభ్యసింతురు. ఇంద్రియగర్భితమైన శరీరమును పలుదెశలందు పరుగెత్తు మానసమును చెప్పినట్లు లొంగదీయుటకు బహుధా ప్రయత్నించుచుందురు. శారీరకమానసిక యాతనలు వారిప్రయత్నములకు తోడుపడు అద్భుతశక్తులు. "కర్మఫలమనుభవించి తీరవలె" నను నుడి హిందూమతాంగణమున అనవరతము ప్రతిధ్వనించుచునే యుండును. ఈఫలమునందే ఆత్మసంస్కారమున కావశ్యములైన బీజములుకలవు. ఇది లభింపనిచో హృదయపరిశీలనముగాని అంతఃకరణశుద్ధిగాని ఆత్మోన్నతగాని అందజాలక మానవు డేయంకిలి నెఱుగక దుష్కృతముల నొనరించుచుండును. అందుచే పతితు డగుచుండును. వ్యాధి వచ్చినపుడు మందుమాకులకై ప్రాకులాడరాదని మహాత్ము లనుచుందురు. నియమోల్లంఘనమాచరించి నేరమును నిభృతమున నడంప దలపడి ఫలానుభవంబునుండి తప్పిపోవుటకై వేఱుతెరువుల నారయువారు ఆంతరంగికమైన పురోభివృద్ధి నందజాలరు. అపరాధి శిక్షనందనిచో అపరాధపరంపరయం దాఱితేరుచునే యుండును. శారీరకారోగ్యమునుడు మానసికారోగ్యమునుడు నియమపాల

నముపై నాధారపడి యుండును. నియమశ్రేణికి భంగము వాటిలినపుడే నిశ్శ్రేణి నేలగూలును. నీరసముహూర్తమున నొకసారి భంగము గలిగినపుడు తరువాతి భంగపరంపరను మార్కొనజాలు ఆంతరంగికశక్తి, నియమోల్లంఘనఫల మనుభవించినపుడే చేకూఱును. కావున సంయమప్రియులు దేహముకొఱకై యనుడు చిత్తముకొఱకై యనుడు ఔషధములను కాంక్షింపరు. దుర్గాచరణు డిట్టివారిలో నొకడని పాఠకులు గ్రహించియే యుందురు.

ఒరులకు దేనినిగాని ప్రబోధించుటకై నాగమహాశయుడు ముందంజ వేయలేదు. నారాయణుని కటాక్షమువలన నంతశ్శత్రువు తనంత దా నుస్మిలన మగుననియు, దానిదృష్టి అపు డెందుపడినను అందు శ్రీకృష్ణసాక్షాత్కారము చేకుఱుననియు, సృష్టియంతయు నవ్యశోభతో రంజిలుచున్నట్లు చూపట్టు ననియు ఆత డనుచుండువాడు. హతాశుల నుచితరీతిని నాశ్వాసించుచు "శ్రీరామకృష్ణునియెడల మీ కేముహూర్తమున విశ్వాసము కలుగునో ప్రస్తుతభవము కట్టకడపటి పుట్టువయని ఆముహూర్తమున విశ్వసింపజాలుదురు. సద్విశ్వాసముగలవారు సత్పథమునుండి తప్పిపోజాలరు. ధర్మార్థకామమోక్షము లను వారు తప్పక చేబట్టగలరు" అని యాతడు వాకొనుచుండువాడు.

సనాతన ధర్మమందు దుర్గాచరణునకుగల మక్కువ అనిర్వచనీయమైనది. తూచా తప్పక శాస్త్రనిబంధముల ననుసరించి నడచువాడు. తానెన్నడును ఆచార్యపీఠము నధిష్ఠింపకున్నను ఆదర్శపూరుషుండై, మహామహిమోపేత మైన తనవ్యక్తిత్వము కతన ననేకులదృష్టి నాకర్షించినాడు. భక్తులు పలువు రాతనిని సేవింపవలెనని మిక్కిలి మక్కువపడుచుండువారు. మంత్రోపదేశమును వా రాశించినపుడు దాని నొనగు సర్వాత తనకు లేదని తెలుపుచు, దీక్షను గ్రహించుటకై వివేకానందునిబోలు స్వాములపాలికి వారి నంపుచు వారి కుత్సాహప్రోత్సాహము లిచ్చువాడు. సముఖస్థులైనవారి యుల్లములను చల్లనిమాటలతో పల్లవింపజేయువాడు.

విధ్యుక్తదీక్ష దొడ్డదియే! ఈదీక్షను గైకొనినంతన మానవుడు ఆశయ సిద్ధినందెనని తలపరాదు. మనననిదిధ్యాసనముల కతన, అవిరతయాంతరంగిక పరిశీలనమువలన హృదయపరిపక్వమును పడసి అద్భుతమైన ఆధ్యాత్మికశక్తి నందినవాడే పరిపూర్ణత్వసిద్ధినందినవాడని, జగదీశునకు సన్నిహితుడాయెనని

వచింపజెల్లును. ఈత డీజాతివాడనియు నాజాతివాడనియు నెంచుట తగదు. తాను శూద్రుడనని తెలుపుకొనుచు శాస్త్రచోదితకర్మలందు నుపదేశ మొసగు టకు తన కర్హతలేదని వచించుచు నాతడు వెన్కనిలిచిననేమి ? పూర్వోక్త కర్మలనుడు మంత్రోపదేశ దీక్షాగ్రహణాది క్రియలనుడు పరిపూర్ణత్వసిద్ధికై నిర్ణయింపబడిన మార్గములేకావా ? సిద్ధినందిన పిదప మార్గముల కెవ్వరును ప్రాముఖ్యము నీయనేల ? మూర్తీభవించిన ఆశయసిద్ధి నాగమహాశయుడు కాషాయవస్త్రధారి కాకున్ననేమి ? జిజ్ఞాసువులకు కావిశాటువులు కట్టించు నధికారము లేనివాడైననేమి ? తాను బూడిద పులుముకొని ఒరులకు పులుమకపోయిననేమి ? తాను శ్మశ్రురాజిపెంచక పెంచుట కొరులను ప్రోత్స హించకపోయిననేమి ? సన్న్యాసలాంఛనములను పాటింపకపోయినంతన నాంత రంగికమైన సన్న్యాసము నొకడందెనని తలపగూడదా ! సన్న్యాసలాంఛనముల నెఱుగక ఆంతరంగికముగ సన్న్యాసము నందినవాడు నాగమహాశయుడు. కోటియుపదేశములకులేనిశక్తి మహిమోపేతమైన వాని దృష్టాంతమందును ప్రత్యక్షజీవితమందును నుండెను. వానిని గనవలెననియే ఆత డున్నయెడకు యాత్రికులై జిజ్ఞాసువు లరుగుచుండువారు.

ఢక్కాలో చదువుచుండెడి విద్యార్థియొకడు నాగమహాశయుని గుఱించి విని ఆతని జూడవలెనని మిగుల నువ్విళ్లూరి పయనమైనాడు. నారాయణగంజిలో నాతడు రైలు దిగునప్పటికి సాయంకాల మాయెను. అది వర్షాకాల మగుటచే నెల్లచోటులు జలమయము లాయెను. విద్యార్థి పడవపై పయనింపవలసి యుండెను. నాడు వర్షము కుంభవృష్టిగా కురియుచుండెను. విద్యార్థికి నావ యేదియు గోచరింపలేదు. అంధకారబంధురమై నాటిరాత్రి మిగుల భయంకర ముగా నుండెను. నాగమహాశయుని పవిత్రనామము నుచ్చరించుచు విద్యార్థి నీటిలో లంఘించి యీదసాగినాడు. రాత్రి తొమ్మిదిగంట లగునప్పటి కాతఁడు కొట్టుకొనుచు దుర్గాచరణుని గుడిసెదాపున జేరినాడు. చలివలన దుస్సహమైన శ్రమవలన నాతఁడు కొయ్యయైనాడు. ఆతని జూచినంతన నాగమహాశయుని గుండె నీరాయెను. కన్నీరొల్కుచు గద్గదస్వరముతో నాత డా యువకు నుద్దే శించి "అన్నా ! ఎంతపనిచేసితివి ? తుపాను చెలరేగుచుండగా నీ భయంకర నిశీథమున నేలవచ్చితివి ? విషసర్పములతో నిండిన చోటుల నెట్లతిక్రమింప

జాలితివి? కటికిచీకటిలో నెడతెగని వానలో నెట్లీతావును చేరజాలితివి?" అని పలుకుచు వానిని చేతులపై చేర్చుకొని కుటీరములోనికి గొనిపోయి వానికి పొడిబట్టలు కట్టబెట్టినాడు. అనంతరము పత్నీసహితుఁడై యువకున కాతడు వివిధోపచారములు పొనరించినాడు. దుర్గాచరణుని భార్యకూడ మిక్కిలి దుఃఖించి "ఇట్టిచోరవ కూడదు తండ్రీ!" యని వానిని మందలించినది. "ఈమహాత్ముని చూడక నొకనిమునమైనను తడయజాలనైతిని" అని విద్యార్థి కన్నీరోడ్చుచు పలికినాడు. నిప్పుసెగవలన నాతడు బాగుగ తేఱుకొనగలడని తలచి వలసినవ్యవస్థ చేయుమని దుర్గాచరణుడు భార్యను కోరినాడు. అతిథికై ఆమె వంటచేయవలసి యుండెను. కాని యింట గట్టెలులేవు. "ఏమిచేతును దైవమా!" అని ఆమె విలపింపదొడగెను. "ఈతనికై మనము ప్రాణము లర్పించుటకైనను సంశయింపరాదు" అని పలుకుచు నాగమహాశయుడు తన యింటివాసములను గొన్నిటి నూడబెఱికి వానిని "వంటచెఱకుగా నుపయోగింపు" మని భార్యను వేడెను. ఆమె యట్లే యాచరించినది. శేషించిన యుపచారములంది ఆహారముగొని విద్యార్థి మరల ప్రాణములను పడసినవానివలె హాయినందినాడు.

కొంతకాలము కడచినపిదప దుర్గాచరణు డీ విద్యార్థిని ఆత్మహత్యనుండి రక్షించినాడు. యువకుడు కలకత్తాలో విద్యాసాగరకళాశాలలో బి. యే. తరగతిలో చదువుచుండెను. ఒకనాడు నాగమహాశయుని జూడవలెనను వాంఛ వాని మానసమున నుదయించినది. కాని దేవభోగగ్రామమునకు కదలిపోవుట కాతని కసాధ్య మాయెను. తన యుద్దేశము సత్వరమే సిద్ధింపనందున నాతడు అంతరంగికముగ నెంతయో వ్యథ నందినాడు. తన హాస్టలు పైయంతస్తు జేరి పచారి చేయసాగినాడు. నలుదిక్కులందు ప్రశాంతి వెలయుచుండెను. పండు వెన్నెలలో జగతియంతయు కాంతిలుచుండెను. అంతరంగికయాతనము వానికి దుస్సహమైపోయెను. వాని హృదయమున శాంతి లేకుండెను. సౌధాగ్రము నుండి గుభాలున నేలమీదికి లంఘించి తన బ్రతుకును కడముట్టింపవలెనని సంకల్పించి విద్యార్థి మేడయంచును సమీపించినాడు. క్రిందికి తటాలున నాతడు దుముకఁ నుంకించు ముహూర్తమున నెవరో "తండ్రీ! లంఘింపకుము. ప్రాతఃకాలమున నాగమహాశయుని దర్శనము నీకు లభింపగల" దని పలికిరి.

ఉలికిపడి యువకుడు వెనుకకు తిరిగి చూచెను. ఎవ్వరును వాని కగుపడిరికారు. ఆశ్చర్యాన్వితుడై మేడమీదినుండి దిగి తనగది జొచ్చి పరుపుపై బడినాడు. ఏమేమో యోచించుచు నిదురించినాడు. ప్రాతఃకాల మగునప్పటి కెవ్వరో వాని పే రుచ్చరించుచు తలుపు తట్టసాగిరి. విద్యార్థి చివాలున లేచి తలుపు తెఱచినాడు. చేత నొక మూటగొని నాగమహాశయు డందు నిలిచియుండెను. యువకుడు మహోద్వేగముతో వాని చరణద్వంద్వముపై వ్రాలినాడు. అశ్రుపూరితనయనుడై దుర్గాచరణు డాతని కవుంగిలిలోనికి గైకొని "నాయనా! ఎట్టి దారుణకృత్యమునకు దలపడితివి? త త్తరపాటుతో నీకై పరుగెత్తుకొని వచ్చితిని. నీకింత యాతురపాటేల! శ్రీరామకృష్ణసామ్రాజ్యమున ప్రవేశించిన వానికి ఆరాట మేల? ఆత్మహత్య పాపకృత్యముకాదా? పరమహంసలీలా సాగరమున నోలలాడుచు నానందింపుము" అని యాదరానురాగములతో పలికి, వానిని తనతో బెళూర్ మఠమునకు గొంపోయి అచటియోగుల కాతని నప్పగించి "మహాత్ములారా! వీని గుండెయందు తీవ్రమైన కలవరపాటు పుట్టినది. మీ యాశీస్సు లీతనికి ప్రసాదించి పరమహంసదేవుని కటాక్షము వీనికి చేకుఱున ట్లనుగ్రహింపుడు" అని వచించి విద్యార్థి నందు వీడి స్వస్థానమునకు మరలెను.

నాగమహాశయుని వీక్షించి ఆతని జీవిత విధానముపై మనసుంచి ఆంతరంగికమైన పరివర్తన మందినవారు కొందఱుకలరు. దుర్మతులు సుమతులైరి. పాపాత్ములు మహాత్ములైరి. వీరిలో దేవభోగవాసియైన కాళీకుమారు డనువాడొకడు. చిఱుతప్రాయమున నిరుపేదయైయుండువాడు. ఆతనితల్లి యొక బ్రాహ్మణకుటుంబమున దాసిగా నుండెడిది. బ్రాహ్మణుని కృషిఫలితముగ కాళీకుమారుడు రతనబాబు అనెడు ధనాఢ్యుని పెంపుడుబిడ్డయాయెను. ఐశ్వర్యమాతని కెంతేని చెఱుపుదెచ్చినది. అచిరములో నాతడు తనసంపదను గోల్పోయినాడు. విషయసుఖములకు దాసుండైనాడు. వాని ధనరాసులు అంతర్హితములైనవి; ఆరోగ్యము శిథిలమైనది. బిచ్చగాడై యతడు తెరువులం దల్లాడుచుండువాడు. నాగమహాశయు డాతని దృష్టిబడినాడు. సాదరముగ నానందముమి వానిని జేరదీసినాడు. దుర్గాచరణుని సంసర్గలాభము లభించినను కాళీకుమారుడు అవలీలగ యౌవనసులభ చాంచల్యమును పరిత్యజింపజాలకపోయినాడు. అను

తాపముచే వాని యాంతరంగిక కలుషము దగ్ధముకావలెనని నాగమహాశయు డెఱుగును. కాలక్రమమున నాయువకుని యంతరంగమున ననుతాపానలము రవులుకొనినది. స్వయంకృతాపరాధములను స్మరించి విషణ్ణమనస్కుడై ఆతడు దుర్గాచరణుని గృహమున కూర్చుండువాడు. ఆతని యాంతరంగిక యాతనము దుస్సహమైపోయినది. ఒకనాడు నాగమహాశయుని గృహమున కొండొక స్తంభము ప్రోలనిలిచి యతడు శిరమును దానిపై మోపియుంచి యేమేమో యుచ్చరించుచు గట్టిగ కొట్టుకొనసాగినాడు. ఒరుల యాతనము నవలోకించి సహింపజాలువాడు దుర్గాచరణుడుకాడు. యువకునిచెట్ట నిక్కముగ వాని మానసమున కెంతో వ్యథ కలిగించినది. కాని వాని యాంతరంగిక పరివర్తనము నభిలషించి తనవ్యథ నణంచుకొని తనదృష్టిని వానిదెస సారింపక "ఎవరికర్మను వారనుభవించి తీరవలెను" అని నాగమహాశయుడు వచించెను. కాళీకుమారుడు నిముసములో స్తంభమునుండి తొలగిపోయినాడు. దుర్గాచరణుని గృహమందే విశేషకాలమును కడపదొడగినాడు. ఆతని దృష్టాంతమును మేలుబంతి గావించుకొనినాడు. ఆతనివలె సర్వదా చేతులు జోడించుకొని యుండువాడు. తలవంచుకొని నడువదొడగినాడు. కంఠమున తులసితావళము దాల్చినాడు. ఒకపర్యాయము బృందావనముపోయి శ్రీకృష్ణుని సేవించి వచ్చినాడు. నారాయణుని స్మరించుచు నాగమహాశయుని మదినిదలచుచు బుణ్యస్థానము లందు పర్యటనము సలిపినాడు. క్రమతపను కతన తొల్లింటి దురభ్యాసముల పట్టునుండి తప్పి అతడు పవిత్రచరిత్రుడు కాగలిగినాడు. దుర్గాచరణునియెడల భక్తిశ్రద్ధలను బహుభంగుల ప్రదర్శించువాడు. పెక్కుకానుకల కాతని కీయ బూనువాడు. వానిని పరిగ్రహింపక కాళీకుమారుడు ఇహజన్మయందే పునర్జన్మ నందుట గన్నులారగాంచి నాగమహాశయుడు పరమానందభరితుడై ఆదరాను రాగములతో వాని ననేకరీతుల సత్కరించువాడు.

నటవరముఖోపాధ్యాయుడను మఱియొక యువకుడు గుణసూన్యుడై ప్రవర్తించి నాగమహాశయుని కృపాదృష్టినంది కాళీకుమారునివలె నూతనవ్యక్తి యాయెను. ధైర్యమాతని సొమ్మాయెను. తాను సత్యమని నమ్మినదానికై ఎట్టిత్యాగమునైన జేయుటకు సంశయించువాడుకాడు. వానికి కొంతసాహిత్య జ్ఞానముకూడ అలవడెను. పతితుల నుద్ధరించుటకై జగదీశుడు మనుష్య

రూపమున భూతలమున నవతరించె ననువిషయమును కథావస్తువు గావించి ఆత డొక రూపకమును రచించినాడు. నాగమహాశయుని దృష్టియం దిడికొని ఆదర్శపాత్రము నొండు సృష్టించినాడు. దేవభోగగ్రామమున దుర్గాచరణుని సముఖమున నా నాటకము ప్రదర్శింపబడి బహుసంఖ్యాకుల ప్రశంసను వడసినది.

గ్రంథపఠనమువలన జ్ఞానమునందుట దొడ్డవిషయమే; కాని యీరీతి జ్ఞానమునందినంతన మానవుడు మహాపురుషుడు కానేరడు. ప్రత్యక్షజీవితమున అది యనుష్ఠానము నందకున్న వ్యర్థమైనదగును. ఈయంశమును గుర్తింపని వారును, గుర్తించినను ఆచరణాభ్యాసమునకు దూరస్థులైనవారును విద్వాంసు లలో నున్నారు. విద్వాంసులయ్యు వీరు పంకిలమున పొరలాడుచునే యుందురు. గ్రంథపఠన మెఱుగకున్నను మహాత్ముల సాంగత్యమంది మహితజీవితములను కడపినవారు పల్వురు పృథ్విలో కలరు. గ్రంథములు లభించుట సులభమే. కాని సత్పురుషుల సంసర్గ లభించుట దుర్లభముకదా! సంసారమహాసముద్రమును దాటించునది ఇట్టి సంసర్గమని మన ప్రాచీనమనీషులు వాకొనిరి. ఇట్టి సత్పురుషులే ఈశ్వరప్రతినిధులై తమ సఖ్యమునందినవారి నీశ్వరసామ్రాజ్యము లోనికి గొనిపోవుదురు.

హారకామిని భర్తయైన కైలాసచంద్రుడును పార్వతీచరణ గోపాలచంద్ర చక్రవర్తి మున్నగువారు దుర్గాచరణుని సాంగత్యమంది తమ జీవితములందలి పంకిలమును కడిగివైచి పుణ్యాచరిత్రులైరి. "నాగమహాశయుని సమక్షమున నైదునిముసములు నిలిచినజాలును; సమస్తజీవిత విధానమందును అత్యద్భుతమైన ఆధ్యాత్మిక పరిణతి గోచరించును" అని వివేకానందస్వామి వచించెను. స్వామీజీ వచనము లమోఘములు.

వంగశకము 1306 వ సంవత్సరమున శరన్నవరాత్రులం దుత్సవము నలు పుటకు మున్నువలసిన సంబారములకై నాగమహాశయుడు కలకత్తా పోజాలక పోయెను. "మీ యాచార్యులు వ్యాధిపీడితులై యున్నారు" అని దుర్గాచర ణుని యర్ధాంగి చక్రవర్తి యను శిష్యునకు తంతివార్త నంపినది. అతడు కాళీ ఘట్టమున వసించుచుండెను. రామకృష్ణమఠమున తంతియందిననాడు చక్రవర్తి "వేదమతము" ను గుఱించి ఉపన్యాస మీయవలసియుండెను. ఏమిచేయు టకును ఎటుపోవుటకును వానికి తోచలేదు. అద్భుతానందస్వామి అతని నుద్దే

శించి "ఓయీ! యిది యోచింపవలసిన సమయముకాదు. వేదమతమును గుఱించి ఉపన్యసించుటకు భావికాలమున నీ కెన్నేని తరుణములు లభించును. గంభీరోపన్యాసములు విన నువ్విళ్ళూరువారికిని ఎన్నేని తరుణములు లభించును. ఉపన్యాసములను గుఱించియును సభలను గుఱించియును యోచింపవలసిన సమయ మిదికాదు. నాగమహాశయుడు స్వర్గస్థు డాయెనేని మనుష్యరూపమున నవతరించిన వేదము నిక జూచు తరుణమును గోల్పోవుదుము సుమీ!" అని పలికెను. స్వామి వచనములు విని చక్రవర్తి నిముసమైన తడయలేదు. తోడనే యతడు దేవభోగగ్రామమునకు కదలిపోయినాడు.

మఱునాడు తెల్లవారకమున్న గమ్యస్థానమును చేరుకొనినాడు. నాగమహాశయుడు తన యింటివసారాలో పండుకొనియుండెను. అది శీతకాలము. సమీపమందలి పొలములనుండి గాలి తీవ్రముగ వీచుచుండెను. శరీరమును బారుగ నా నిష్ఠురవాతూలమునకు అప్పగించుచు శోచనీయమైనస్థితిలో దుర్గాచరణుడు పడియుండుటను చూచినంతన శిష్యుని కన్నులనుండి నీరు జొటజొట రాలసాగెను. "వారి నక్కల పరుండనిచ్చితిరి" అని కాతరస్వరమున నాతడు గురుపత్నిని ప్రశ్నించినాడు. గాంగనిర్ఝరిణివలె నామెనేత్రములనుండి యశ్రువారి స్రవింపసాగినది. పతిచరణములపొంత శోకదేవత యట్లు అధివసించి ఆయిల్లాలు "నాయనా! నే నేమిచేతును? వ్యాధి అంకురించిన ముహూర్తమందే గదిపీడి వీరిందుజేరుకొనిరి. క్రమక్రమముగ శూలయాతనము దుస్సహమైపోయినది. ఆవ్యాధికి రక్తగ్రహణి తోడుపడి వారిని వేధించుచున్నది. ఎంతవేడికొనినను వా రిందుండి కదలుటలేదు. ఎట్లు ప్రార్థించినను నౌషధమును వారంటుటలేదు. తండ్రీ! నీవైనను చెప్పి చూడుము" అని గద్గదకంఠయై పలికినది.

తన యాతనమును గుఱించి దుర్గాచరణుడు ఎవ్వరితోడను ఒక్కమాటయైనను చెప్పి యెఱుంగడు. ఆతని స్థితిని పరిశీలించుపత్ని మాత్రము బాధ దురంతమై యున్నదని గ్రహింపగలిగినది. తనభార్య నుద్దేశించి యొకపర్యాయము నాగమహాశయుడు "ఇంచుమించుగ నాప్రారబ్ధము ననుభవించితిని. ఇకకొంచెముమాత్రము మిగిలియున్నది" అని పలికినాడు. శరీరమున వ్యాధి విజృంభించుటకు మున్నే క్రమక్రమముగ నాతడు క్షీణింపసాగినాడు. పగలు

గుప్పెడు మెతుకులను మాత్రము నోట బెట్టుకొనువాడు. రాత్రులందు మంచి నీటిని సయితము ముట్టుట మానివైచినాడు. ఆతని శరీరమున నెముకలు మాత్రము మిగిలియుండెను. తనకై తనయర్ధాంగి విలపించుట విలోకించి యాతడు "వెఱ్ఱిదానా ఏలశోకించెదవు? ఇది యస్థిరపంజరమేకదా! తుచ్ఛమైన శరీరముకొఱకై దుఃఖించెదవేల?" అని యాతడు వచించెను. ఇంటిలోని కాతని నెత్తిన గొనిపోవలెనని శిష్యుడు ప్రయత్నించినాడు. కాని వాని ప్రయత్నముకూడ కొనసాగినదికాదు. దుస్సహమైన తనబాధను తాను అనుభవించుచు, వేఱుమాటలేమియు నుచ్చరింపక దుర్గాచరణుడు రామకృష్ణ నామ స్మరణము గావించుచుండెను.

చక్రవర్తి వరుసగ పదమూడు దినములు ఆచార్యుని చెంగటనుండి సేవ చేయుటకై గురునానతి నపేక్షించినాడు. శుశ్రూషకు నాగమహాశయుడు సమ్మతించినాడుకాడు. సమీపమున గూర్చుండి శిష్యుడు భాగవతమును భగవద్గీతను ఉపనిషత్తులను చదువుచు దుర్గాష్టకములను గేయములను ఆలపించుచు మధుర సంకీర్తన మొనరించుచు ఆచార్యుని హృదయమునకు ఆనందమునుగొలుప సాగినాడు. ప్రమోదప్రదీప్తముఖుడై మంజుల సంకీర్తనమును వినుచు నాగమహాశయు డాత్మవిస్మృతు డగుచుండువాడు. గంటలకొలది గభీరభావ సమాధియం దుండువాడు. సమాధి శిథిలమైనంతన నిదురనుండి మేల్కాంచిన శిశువువలె "అమ్మా! అమ్మా!" అని విలపించువాడు. ఆతని శరీర మపుడు ఉద్వేగముతో కంపించెడిది. నిముసము తడసి "సచ్చిదానంద్; అఖండచైతన్య! అఖండ చైతన్య!" అని యావేశముతో పలుకువాడు.

దుర్గాచరణుడు రోగపీడితుడై పడియున్నను అపరిచితులైన అతిథులును అభ్యాగతులును ఎప్పటట్టులే వానిగృహమున ప్రవేశించి పీఠములపై నాసీనులగుచునేయుండిరి. పరిచితులైన ఆగంతువులసంఖ్య యిపు డధికమాయెను. సన్నిహితులైన అతిథులును బంధువులును భక్తులును నిక్కముగ నాతని సేవింపవలెననియే ఆతని శయ్యాపార్శ్వమున కరుగువారు. వారిని సేవచేయ నీయక వచ్చినవారినందఱను నారాయణావతారము లగ్లించుచు తనబాధ నణంచుకొనుచు ఆదరోక్తులతో వారి నాహ్వానించుచు ఆతిథ్యమున కక్కరైన సర్వాంశములను విశేషశ్రద్ధతో జూచుచుండుమనియు సపర్యయం దెట్టి

లోపము పొడసూపరాదనియు భార్యను హెచ్చరించుచు నాగమహాశయుడు పెండ్లి పెద్దవలె వర్తింపసాగినాడు. ఆతని సమ్ముఖమున నధివసించినంతసేపు అతిథులు ప్రాపంచికతాపత్రయములను సాంసారికదుఃఖములను మఱచి భగవన్నామస్మరణము చేయువారు. తనస్థితి చూచి జాలిపడువారితో దుర్గాచరణుడు, "నాకై మీరేల దుఃఖ పడెదరు? తుచ్ఛమైన ఈశరీరముపై నెవ్వరికైనను మక్కువయుండరాదు. అది యెంతకాలము నిలుచును" అని పలుకుచుండువాడు.

"ఈశ్వరుడు కారుణ్యాశరధి; ఈశ్వరప్రేమ అంతములేనిది" అని మాటికి మాటికి ఆత డనుచుండువాడు. కాని వాని శారీరకయాతనమును విలోకించుచుండిన చక్రవర్తి ప్రభృతులు ఒక్కొక్కముహూర్తమందు ఆత్మసంవననమును గోల్పోయి "ఇట్టి మహాత్ముని పీడించుదైవము నిజముగా కారుణ్యాశరధియేనా?" అని తలపోయుచుండువారు. అత్తరి వారిచిత్తవృత్తులు చలించు రీతిని గ్రహించి నాగమహాశయుడు "నాయనలారా! ఈశ్వరకటాక్షమును గుఱించి సంశయింపరాదు. ఈశరీరము నిష్ప్రయోజనము. ఇది ఇపు డెట్లు పడియున్నదో చూడుడు. మీలోనున్న నారాయణుని సేవింపవలెనని నేనెంత యాతురపడుచున్నను నాయుద్దేశసిద్ధికై యిపు డీశరీరము తోడుపడుచుండుట లేదు. కావున దయామయుడైన భగవంతు డీకాయమును అచిరములో పంచభూతములందు గలుప నిశ్చయించినాడు. శారీరకక్లేశమును గణింపక ఆత్మ సచ్చిదానందములందు నోలలాడవలెను" అని పలికెను. చక్రవర్తి ప్రభృతులు కన్నులు మూసికొని ఉత్సాహముతో సంకీర్తనము గావింపదొడగిరి. సంకీర్తనమును వినినంతన దుర్గాచరణుని హృదయమున నవ్యశక్తి విజృంభించినది. చివాలునలేచి పద్మాసనము వైచికొని నిమీలితనేత్రుడై ధ్యానతత్పరుడై ఆత డాత్మవిస్మృతుడైయుండెను. కొంతసేపు కడచినది. భక్తులు కన్నులు తెఱచి ఆచార్యుని జూచి తొట్రుపడిరి. ఆతని కనుకొలకులనుండి అశ్రుబిందువు రాలుచుండెను. పరుండియుండగా నీప్రక్కనుండి ఆప్రక్కకు నొత్తిగిలుట ఆతని కసాధ్యమైయుండెను. ఆతడెట్లు లేచికూర్చుండెనో వా రూహింపజాలరైరిచి "మాతా! దుర్గా! మాతా! దుర్గా!" అని యాతని చెవులం దుచ్చరించి సమాధి శిథిలమగువఱకు తడసి అనంతరము అల్లన నాతని వారు పరుండబెట్టిరి.

"కాళీమాత! కాళీమాత!" అని నాగమహాశయుడు మెల్లగ నుచ్చరింప సాగెను. "స్వామీ! మీయాశీస్సులను మాకు ప్రసాదింపుడు. మీరులేకున్న మాకింక దిక్కెవ్వరు?" అని విలపించుచు భక్తులనిరి. "పరమహంస పద ద్వయమే మీదిక్కు. దానికంటె మీకు మిన్న ఏమికావలయును? మీకు ఆశీర్వాదము లొసగజాలువాడు శ్రీరామకృష్ణుడే! మీకు సర్వశుభములను ప్రసాదించునాతడు శ్రీరామకృష్ణుడే!" అని దుర్గాచరణుడు అల్లన వచించెను.

శారదానందస్వామి ఆదినములలో డక్కాలో వసించుచు మఠమునకు సంబంధించినక్రియలు నిర్వహించుచుండెను. తఱచుగ దేవభోగగ్రామమున కరుదెంచుచు నాగమహాశయునకు పరిచర్య చేయుచుండువాడు. శారదా నందునియెడల దుర్గాచరణునకు ప్రీతి మెండు. ఆతని వేడికోలును తనపతి మన్నించునను నాసతో నుచిత చికిత్స చేయించు వ్యవస్థ వానిసహాయమున గావింపవలెనని గృహిణి నిశ్చయించినది. ఈ తుదియత్నమున కూడ నామె ఫలము గాంచలేదు. "పరమహంసనామమును జగన్మాతనామమును నాకు మందులు, వేఱుమందు లేల?" అని శారదానందునితో నాగమహాశయుడు నొక్కి చెప్పెను.

తండ్రికి శ్రాద్ధక్రియలు నెఱపుటకై తా నొనరించిన ఋణమును తీర్ప జాలనందులకు నాగమహాశయుడు అనుదినము సంతపించుచునే యుండెను. అతడు శయనించియుండ ఋణ మొసగిన పెద్దమనిషి దుర్గాచరణుని ప్రోల ప్రత్యక్షమయినాడు. కన్నీరుకాల్వలై స్రవించుచుండ చేతులు జోడించి నాగ మహాశయుడు "నాయనా! అపరాధిని, అప్పుతీర్పజాలని పాపినైతిని. అచిర ములో నేనీలోకమును విడిచి పోవుచున్నాను. తమకారుణ్యమువలననే మాతండ్రిగారి అపరక్రియలను జరుపజాలితిని. ఇట్టి సాహాయ్యమొనరించినందు లకు ఆంతరంగికముగ తమకు ధన్యవాదములను సమర్పించుచున్నాను. ఋణ మును గుఱించి మీరు సంశయింపవలదు. నేను మరణించినపిదప నాగృహమును ఆక్రమించుకొనుడు. నాభార్య పుట్టింట గాలక్షేపము చేయును" అని వచించి నాడు. ఈపలుకులు విని ఆపెద్దమనిషి మిగుల శోకించి "మహాత్మా! అప్పు కొఱకై తాము దుఃఖింపకుడు నేనిపుడు పైకమునకై రాలేదు. తమ్ముఁ దర్శించి తమచరణరజమును శిరమున దాల్పవలెననియే వచ్చితిని" అని దుర్గా చరణుని పదములకు ప్రణమిల్లినాడు.

ఏమనుటకు నాగమహాశయునకు సాధ్యముకాలేదు. నవవర్ష జలధరము నుండి వెడలు అవిరళసలిలములీల ఆతని కన్నులనుండి యవిరళవారిధార వెలారెను. ప్రేమమహత్త్వము ప్రత్యక్షమై ఆతనిహృదయమున అద్భుతమైన ఆధ్యాత్మికోద్వేగము నుద్భవింపజేసెను. ఎదుటివ్యక్తికి భక్తి పూర్వకముగ ప్రణమిల్లి "ఈశ్వరకటాక్షము! ఈశ్వరకటాక్షము! ఈశ్వరకటాక్షము!" అని లేచి "మీహృదయము మహోన్నతమైనది. మీరు జగదీశునకు చేరువగా నున్నారు. మీకు సమస్త శ్రేయస్సులు చేకుఱును" అని ఉత్సాహ భరితుడై నాగమహాశయుడు వాకొని వెలికిలబడి కన్నులు మూసికొనెను.

మూడుగంటలు కడచినవి. వ్యాధిప్రకోపము అధికమైనది. ఆతని శరీర మున దుస్సహమైన తాపము ఉదయించినది. దానితో సంధిలక్షణము పొడ సూపినది. చలిగాలి వీచుచున్నను వీవనతో విసరవలసి వచ్చెను. విసురుచుండ నాకస్మికముగ నాతడులేచి కూర్చుండెను. భక్తులు మెల్లన వానిని పరుండ బెట్టిరి. కొంతసేపాతడు కదలక మెదలక పడియుండి "జగదీశా! రక్షింపుము! రక్షింపుము!" అని యఱచెను. వాని యర్థాంగి "అయ్యో! మిమ్మెట్టి తాపము వేధించుచున్నదేమి?" అని విలపించుచు పలికినది. అరగంటసేపైనపిదప యాతనముకొంత యుపశమించినది.

"నాయనా! పంచాగమును చూచి ప్రయాణమునకై శుభదినమును నిర్ణయింపుము" అని దుర్గాచరణుడు చక్రవర్తితో చెప్పెను. తుదిప్రయాణ మునకై తిథి నిర్ణయమును గావింపవలెనని శిష్యు డెఱుగడు. కావున "పుష్య శుద్ధ త్రయోదశినాడు పగలు పదిగడియలు కడచినపిదప సుముహూర్తము కలదు" అని యా అమాయికు డనెను. "నాయనా! నీవు అనుమతించితివేని ఆముహూర్తమందే కడపటి పయనమును నలిపెదను" అని నాగమహాశయు డనెను. ఈమాటలు వినినంతనే శిష్యుని గుండెలును వ్రయ్య లయ్యెను. వెక్కి వెక్కియేడ్చుచు అతడు గురుపత్ని పాలికరిగి జరిగిన యుదంతము నామెకు తెలిపినాడు. "నాయనా! ఇక దుఃఖించి యేమి చేయగలము. వారిక పుడమిని విడిచి వెడలిపోవుదురు. వారివాంఛ లటులుండెను. తమవాంఛను తీర్చు కొననిమ్ము. ఈశ్వరోద్దేశముకూడ నదియే కాబోలు." అని కన్నీరోడ్చుచు నాయిల్లాలు పలికినది.

శుభదినము నిశ్చయమైనందున నాగమహాశయుడు నిశ్చింతంతో నుండెను. కడపటి పయనమునకు రెండుదినములకుమున్ను భక్తు లందఱు శయ్యాపార్శ్వములందు గూర్చునియుండ నాకస్మికయుగ కన్నులు తెఱచి "గురు దేవుండు విచ్చేసెను. సమస్తతీర్థములను నాకుచూపును" అని చక్రవర్తి నుద్దే శించి "సర్వతీర్థములను సేవించియుంటివు. ఒక్కొక్క క్షేత్రమును పేర్కొనుము. నేను దర్శనము చేయుచుందును" అని యాతడు పలికెను. చక్రవర్తి అంతకు మున్నే హరిద్వారము పోయియుండెను. తోడనే యాత డాక్షేత్రముయొక్క నామము నుచ్చరించెను. వినినంతనే యుద్వేగముతో దుర్గాచరణుడు "అదిగో! ద్వార్! హరిద్వార్! అదిగో గంగామతల్లి కలవర మొనరించుచు గిరిపార్శ్వ ములనుండి స్రవించుచున్నది. జాహ్నవీతరంగములతో లయ గలిపి తీరస్థతరు రాజి నాట్యము సలుపుచుండెను. అదిగో! అవలియొడ్డున చండీపర్వతము వెలయు చున్నది! ఆహా! ఎన్నెన్ని ఘట్టములు తల్లి కిరువంకలందు రంగారి యున్నవో! ఇంచుక తడయుడు గంగాగర్భమున గ్రుంకులిడి, ఇహజన్మను సార్థకము గావించు కొందును. జననీ! పతితపావనీ! ముక్తిదాయినీ!" అని వచించి తన్మయభావ మున నాత్మవిస్మృతు డాయెను. సమాధి యంతరించిన పిదప నిక్కముగ నాతడు సురధునియందు స్నాన మాచరించిన వానివలె భక్తుల కగపడినాడు.

ఈరీతి కాలక్షేపముతో చాలసేపు కడచెను. వేకువవేళ నాలుగు గంట లయ్యెను. అపు డాతని కించుక నిద్దురపట్టెను. ప్రభాతసమయమున నాతనికి మెలకువ రాలేదు.

నాడు పుష్యశుద్ధ త్రయోదశి. ఉదయము యెనిమిది గంటలు కడచిన పిదప ఆతడు నిద్దురనుండి మేల్కొనినాడు. కాని క్రమముగ వాని యాయాసము అధికము కాదొడగినది. చక్రవర్తి ఆచార్యుని వీనులందు "శ్రీరామకృష్ణ! శ్రీరామకృష్ణ" అని పలుకదొడగెను. పరమహంస పటమొకటి ఆతని సముఖ మందిడి "ఏమహాత్ముని పవిత్రనామధేయము నుచ్చరించుచు సర్వస్వమును త్యజించితిరో ఆతని స్వరూపము నవలోకింపుడు" అని శిష్యుడు పలికెను. పటమును చూచి చేతులుజోడించి అల్లన "కృపానిధీ! కృపానిధీ! జోహారు జోహారు" అని నాగమహాశయుడు వచించెను. ఇహజీవితమున నాత డుచ్చరించిన తుది పలుకు లివియే.

తొమ్మిది గంటలైన పిదప ఆయాసము మిక్కుటమైపోయెను. ఆతనికన్ను లెఱ్ఱపడినవి. ఓష్ఠాధరములు కంపింపదొడగినవి. పరిసరభక్తులు అత డేమో యుచ్చరించుచున్న ట్లూహించిరి. అరగంట కడచినది. ఆతనిదృష్టి నాసాగ్రమున నిబద్ధమైయుండెను. శరీరముమీది రోమావళి నిలిచెను. పులకితనయనములనుండి ప్రేమధార వెలారసాగెను. ప్రాణవాయువు క్రమక్రమముగ మూలాధారమునుండి యూర్ధ్వదిక్కుగ చలింపసాగినది. నాభినుండి హృద్పద్మము నది చేరినంతన నూపిరి వేగవంతమాయెను. పదిపై నైదు నిముసములు కడచిన పిదప నాగమహాశయుడు మహాసమాధియందు నిశ్చలు డాయెను. ఆస్థితియెద్దియో యెఱుగుట కెవ్వరికిని ఆలస్యము కాలేదు. "వారు గృహస్థాశ్రమమున నుండిరి. ఈసమయమునగూడ గృహధర్మము ననుసరించియే క్రియలు జరుగవలెను" అని దుర్గాచరణుని ధర్మపత్ని పలికినది. శిష్యులు పలువురు పదిలముగ పట్టుకొని నాగమహాశయుని మెల్లగ నవ్వలికి గొని పోయిరి. ఒక బల్లపై చక్కని శయ్యను సిద్ధమొనరించి ఆచార్యుని దానిపై పరుండబెట్టిరి. అపుడుకూడ వాని ప్రాణవాయువు మెల్లమెల్లగ చలించుచునే యున్నది. ఆతనిని అవ్వలికి గొనిపోయిన పిదప నాలేదు నిమిషములలో నాచలనముకూడ నంతరించెను. అంతయు ముగిసెను. నాగమహాశయు డిహ జగతినుండి అంతర్హితుడై పోయెను. అపుడుకూడ ఆతని వదనము జ్యోతిర్మయమై యుండెను. అర్ధనిమీలితనేత్రములప్రాంతమున ప్రేమాశ్రుబిందువులు వెలయుచున్నవి. ప్రాణపతిచరణయుగముపై పడి గురుపత్ని పెద్దపెట్టున నేడ్వదొడగినది. భక్తులు నారాయణగంజి పోయి నేయి, సాంబ్రాణి, మంచిగంధపుచెక్కలు మున్నగు సామానులు దెచ్చిరి. మహాయజ్ఞమున పూర్ణాహుతి యొసగుటకు వలసిన సంపూర్ణ వ్యవస్థ గావింపబడెను.

గ్రామమందలి ప్రముఖులు వచ్చి శవమును పరీక్షించిరి. శరీరమున అపుడు కూడ ఉష్ణ ముండెను. దేహమును పండ్రెండుగంట లట్టులేయుంచి అనంతరము అగ్నిసంస్కారము చేయవలెనని భక్తులు నిశ్చయించిరి. రాత్రి పదిగంటలు దాటువఱకు ఆ పవిత్రశరీర మండే యుంచబడెను.

రాత్రి పదిగంటలు దాటినపిదప శ్మశానక్షేత్రమున భక్తులు చందన కాష్టములతో గురుపర్యంకమై తుదితల్పమును సిద్ధముచేసిరి. భక్తులైన శిష్యులే

నాగమహాశయునకు పుత్రులైరి. శాస్త్రోక్తముగ జరుగవలసిన క్రియలను నిర్వహించి వా రాతని పవిత్రదేహమునకు ననలమును ముట్టించిరి. మూడుగంటలలో నాగమహాశయుని మర్త్యశరీరము పంచభూతములందు గలసిపోయెను. గురుపత్ని చితి నార్పివైచెను.

ఏబదిమూడేండ్ల నాలుగుమాసముల యేడుదినములు మాత్రము మనియుండి తండ్రి పరమపదించిన పిదప మూడేండ్లే యుండి తన జన్మస్థానమందే నాగమహాశయుడు తన యైహికయాత్రను చాలించెను.

దుర్గాచరణుని పుణ్యస్మృతిని పవిత్రభస్మరాశిని ఆత్మవక్షమున వహించి దేవభోగగ్రామము నేడు పరమతీర్థస్థానమయ్యెను. ఆపుణ్యశ్లోకుని సమాధిని దర్శించుటకై యాత్రికు లనవరతము అచటికి పోవుచుందురు.

నాగమహాశయుడు జ్ఞానయోగియని చెప్పజెల్లదు. భక్తియోగమును కర్మయోగమును గంగాయమునల ట్లాతని జీవితమున గలసినవని యాతని చరిత్ర చెప్పక చెప్పుచున్నది.

పరహితము నభిలషించి కనలక తలకక దురంతయాతనమున కాత్మార్పణము గావించుకొనునాతడే మహాత్ములం దగ్రగణ్యుడని చెప్పవచ్చును. నాగమహాశయు డిట్టివాడని తెలుపుట సత్యదూరము కానేరదు.

మహిమోపేతమైన ఈతని జీవితమును గుఱించిన అద్భుతాంశము లెన్నియో ఎవ్వరికిని తెలియకుండెను. తన్ను గుఱించి యెవ్వరైనను చెప్పుకొనవలెననిగాని, వినవలెననిగాని దుర్గాచరణు డిచ్ఛగింపకుండెను. తనజీవితమును గణింపవలసిన అంశమెద్దియు లేదనియే ఆతని అభిప్రాయము. ఆతని జీవితోదంతము నెఱుగుట కెవ్వరికిని అవకాశము చిక్కకుండెను. ఆతని శిష్యులలో నొక్కరుండైన చక్రవర్తియను నాతడు సంగ్రహింపజాలిన యంశము లెన్నియో లేవు. వానిలో గొన్నిమాత్రము ప్రస్తుత కథనమునకు కొంతదనుక ఆధారములు కాగలిగినవి. కొండొక పవిత్రజీవితమునకు సంబంధించినవి కావున, ఇది బహుసంఖ్యాకులైన జిజ్ఞాసువులదృష్టి నాకర్షించుననియు, వా రిందలి పరమార్థమును గ్రహింతురనియు, ఎందఱెందఱు నాగమహాశయులో వారియందు గోచరింతురనియు, వారికతన మానవసముద్ధరణము సుసాధ్యమగుననియు మాయూహ.

---

## ౬౦

# శ్రీ రా మా ను జా చా ర్యు డు



"రావణసోదరాసురకర ప్రతిపాదితత్త్వమైన దుర్గమై
యావరణాంతరప్రణవహావ్యకరుండని గుప్తమై శ్రితా
శీవిషమౌ నిధాన మిది చేకొనగంటిమి మంటిమంచు వే
రావలె నిన్ను గొల్వగ ధరాజను లందఱు రంగమందిరా!"

* యామునాచార్యుని మనుమండును, శిష్యులలో నొక్కండును నైన శ్రీశైలపూర్ణున కిరువురు సోదరీమణు లుండిరి. మొదటియామె కాంతిమతియను సుందరి. ఆమె ఆసూరి కేశవసోమయాజికి అర్ధాంగి యైనది. వళ్ళమంగలమ్‌లో వసించు కమలాక్షభట్టునకు రెండవయామె జ్ఞాతిమతి ధర్మపత్ని యాయెను.

---

* యామునాచార్య రామానుజాచార్యులు విశిష్టాద్వైతమతస్థాపకులను విషయము లోక ప్రశస్తి నందినదే. యామునాచార్యుడు కలియుగమున 4017 వ సంవత్సరమున ధాతవర్షమున ఆషాఢమాసమున పూర్ణిమ తిథియందు బుధవారమునాడు ఉత్తరాషాఢ నక్షత్రమున సింహవాహనాంశమున, వీరనారాయణపుర మున ఈశ్వరభట్టునకు పుత్రుడై జన్మించెను. రామమిశ్రుని ఉపదేశమునంది శ్రీరంగమున నాచార్యు డయ్యెను. నాథముని క్రి. శ. 924 వ సంవత్సరమున పరమపదించెను. పుండరీకాక్ష రామమిశ్రు లాతని తరువాతి యాచార్యులనియు వారి యనంతరమున యామునాచార్యు డాచార్యు డాయెననియు తెలియుచున్నది. ఈతని యాచార్యపదవి ఆరంభమైన వత్సరము నిర్ణయించుట కష్టము కాని "గురుపరంపర" లోని పూర్వోక్తాంశములను పరీక్షించిన యనంతరము యాతని యాచార్యపదవి క్రి. శ. 975 వ సంవత్సరమున నారంభమాయెనని తెలుపజెల్లును. ఆతడు క్రి. శ. 916 వ సంవత్సరమున జన్మించుటచే ఆచార్యపీఠము నధిష్ఠించునప్పటి కాత దరువదేండ్లు వయసువాడై యుండునని యూహింపవచ్చును. విశిష్టాద్వైతసిద్ధాంత మునకు ఆదికర్తయైన మహాత్ముడు యామునాచార్యుడే. ఆతడు రచించిన గ్రంథములు నాలుగు శ్రీవైష్ణవ ప్రపంచమున మిగుల ప్రశస్తినందినవి. "శ్రీచతుశ్శ్లోకి; స్తోత్రరత్నము; ఆత్మసిద్ధి ఈశ్వరసిద్ధి సంవిత్సి ద్ధులతోనొప్పు సిద్ధిత్రయము; ఆగమప్రామాణ్యము." "మహాపురుషనిర్ణయము" న శ్రీవిష్ణువు నాధిక్యము నాతడు రూఢిచేసినాడు. వేదసారమైన పురుషసూక్తమున నుల్లేఖింపబడిన మహాపురుషుడు విష్ణువేయని యామునాచార్యుడు నొక్కి వక్కాణించెను.

చెన్నపురికి నైఋతిమూల నిరువదియాఱుమైళ్ళదూరమున చెంగల్పట్టు జిల్లాలో శ్రీ పెరంబూదూరులో కేశవసోమయాజి వసించుచుండెను. శ్రీమహా భూతపురియను నామాంతరమునగూడ నాయూరు పరగుచుండును. అది బ్రాహ్మణాగ్రహారము.

కాంతిమతీకేశవసోమయాజులు మహనీయగుణగరిష్ఠులైన దంపతులు. చెన్ననగర సమీపమందలి సంద్రమున చంద్రగ్రహణ పుణ్యకాలమున కృతస్నాతులై తిరువళిక్కేళిలోని పార్థసారథిస్వామిని సేవించి, స్వప్నమున స్వామిసాక్షాత్కారవరముల బడసిరి. త్రేతాయుగమున లక్ష్మణుండై ద్వాపరమున బలరాముండై యుందయించిన ఆదిశేషుండు కలియుగమున పూర్వోక్త వరమువలన నీదంపతుల తనయుండై యుద్భవించెను.

భక్తిభాసురమైన వీరి సంప్రదాయము పలువురదృష్టి నాకర్షించినది. కేశవసోమయాజి శ్రీశైలపూర్ణుని శిష్యుడును బావమరిదియుగూడ నగును. శ్రీశైలపూర్ణుడు తిరుపతిస్వామిని సేవించుచుండువాడు. శ్రీనివాసవిగ్రహము నభిషేకించుటకై పర్వతముల మధ్యనున్న పాపనాశతీర్థమునకు నరిగి ప్రతి దినమునను ఈతిడు జలము దెచ్చుచుండువాడు. భక్తుని శ్రమగాంచి మిగుల వగచి భగవంతుడు బాలకస్వరూపమున నీతని కగపడి "తాతా! నీకై నీర మును నన్ను గొని రానిమ్ము" అని పలికి యొకనాడు శ్రీశైలపూర్ణుని కర్తవ్య మును తానే నిర్వహించెనట. నాడాది శ్రీశైలపూర్ణుడు తాతాచార్యుడని పిలువబడు చుండెను.

జగదీశునకు సన్నిహితుడైన తాతాచార్యుడు తన మేనల్లు డెట్టి ప్రజ్ఞా వంతుఁడు కాగలడో ముందే గ్రహించినాడు. జననశుభవార్త వినినంతనే తాతాచార్యుడు శ్రీపెరంబూదూరు పోయి "బావా! నీతనయుడు మహిమో పేతుడు కాగలడు. ఆతడు పొందు విజ్ఞానము మహోదధి కెనయై యుండును. అనంతుడు త్రేతాయుగమున లక్ష్మణుడైనట్లు నేడు నీతనూభవు డైనాడు. విజ్ఞా నమునకు చిహ్నస్వరూపు డనంతుడుకదా! ఈతనికి లక్ష్మణుడని పేరిడుట ఉచి తము" అని వచించి ఆతని యదృష్టమును బహుభంగుల కొనియాడెను. కలి యుగ మావిర్భవించిన పిదప 4118 సంవత్సరమున శాలివాహనశకమున 939 వ వత్సరమున పింగళసంవత్సరమున చైత్రశుద్ధపంచమినాడు గురువార

మున ఆర్ద్రినక్షత్రమున కర్కాటకలగ్నమునందు వడమ బ్రాహ్మణకులమున ఆయుష్మాన్ యోగమున ఆపస్తంబసూత్రమున ఆసూరివంశమున భూతపురి యను నామాంతరముగల శ్రీపెరంబూదూరులో కేశవసోమయాజి తనయుడై రామానుజస్వామి జనన మొందెను.

ఈతడు లక్ష్మీనారాయణుల యంశమందును అనంతాంశమందును శనేశుని యంశమందును శ్రీవిష్ణుమూర్తి యైదుయాయుధముల యంశమందును ఉద్భవించెనని వైష్ణవమతచరిత్రలు వాకొనుచున్నవి.

ఈతడు జన్మించినంతన పరమానందభరితుడై శ్రీశైలపూర్ణుడు శ్రీ పెరంబుదూరున కరిగి బాలకుని భావిజీవితము మహత్తరమైనదని వచించి అట్టితనయుని గనిన కేశవసోమయాజి భాగ్యమును వేనోళులపొగడెను గదా!

పదునేనేండ్లు వచ్చునరికి బాలకుడు తండ్రియొద్ద వేదములను శాస్త్రము లను పఠించెను. కాంచీపురవాసియైన అద్వైతసన్యాసి యొకడు యాదవ ప్రకాశు డనబరగినవాడు వేదాంతమును గుఱించి గంభీరోపన్యాసము లొనగు చుండెనని విని హుటాహుటి వానికడ కరిగి రామానుజు డాతనిశిష్యవర్గములో నొక్కండాయెను. రామానుజుని పినతల్లి కూడ తేజస్వియైన పుత్రుని గనెను. ఈ బాలుని భావిజీవితముకూడ సముజ్జ్వలమై వెలయగలదని వచించి శ్రీశైల పూర్ణుడు వానికి గోవిందుడను నామధేయము నొసంగెను. గోవిందుడు శుక్ల పక్షచంద్రునివలె క్రమాభివద్ధి నందుచువచ్చెను. అన్నయైన రామానుజునివలె కాలక్రమమున నాతడును యాదవప్రకాశుని శిష్యులలో నొక్కండాయెను.

రామానుజుని అద్భుతమేధాశక్తిని యాదవప్రకాశుడు కనుగొన జాలెను. ఆచార్యుడు ప్రబోధించుదానిని విమర్శించియే రామానుజుడు గ్రహించువాడు. గురువచనము దోషయుక్తమైనదని యూహించు నవసర మున జంకుగొంకులకు తావీయక తక్షణమే యాతడు ప్రతిఘటించువాడు. ఇరువురకు వాదప్రతివాదములు పొసగెడివి. ఏయంశమునైన పూర్వపక్షము చేయుటయందు రామానుజుడు సిద్ధహస్తు డాయెను. ఒకప్పుడు తైత్తిరీయోప నిషత్తునందలి "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అను సుప్రసిద్ధవచనములోని భావార్థమును గుఱించి గురుశిష్యులకు వాదము పొసగెను. ఆచార్యుడు తెలిపిన అర్థము దోషభూయిష్టమైనదని శిష్యుడు ఋజువుచేసెను. క్రమక్రమ

ముగ నాచార్యుని హృదయమున నీర్ష్యానలము రవుల్కొనెను. గురువుగారి ప్రకృతిని గ్రహించి రామానుజుడు ఆచార్యునివీడి తనదారిని తాను చూచు కొనెను. యాదవప్రకాశుని హృదయమందలి ఈర్ష్యాగ్ని అంతటితో చల్లార లేదు. అది భయంకరముగా రగులుచునేయుండెను. రామానుజు నెట్టులైనను మట్టుబెట్టవలె నను తలం పాతనికి జనించెను. శిష్యులను బిలచి వారితో గలసి యోచించి ఉద్దేశసిద్ధికై వలసిన వెరవులను రోయసాగెను. చాలసేపు యోచిం చిన పిదప యాదవప్రకాశుని మనమున నొక యుపాయము తల యెత్తెను. కాశీయాత్రకై శిష్యులతో ప్రయాణమునలిపి రామానుజుని వెంటగొని మార్గ మధ్యమునగాని వారణాసికి జేరినపిదపగాని వాని యుసురులు దీయుట యుచిత మని ఆత డూహించెను. ఆదరపూర్వకముగా రామానుజుని తనచెంతకు బిలచి “అబ్బాయీ! నీమేధాశక్తి నిరుపమానము. నీయట్టి మహనీయ గుణగరిష్ఠుడు నాకు శిష్యుడై యుండుట నా భాగ్యము. ఈవలలో నావలన నీమానసమునకు కొంత యాతఘము కలిగియుండుట నిక్కమే? నాదోషము నేనెఱింగి పశ్చాత్తా పముచే పరిశుద్ధాత్ముడనై నిన్ను మరల నాయాలింగనములోనికి గైకొనవలెనని మిక్కిలి మక్కువపడుచున్నాను. అవసానసమయమున వారణాసికరిగి కొంత కాలమందు వసియించు నుద్దేశముతో నుంటిని. నీసోదర శిష్యులు నాతో విశ్వేశ్వరధామమున కరుదెంచుచున్నారు. గతమును విస్మరించి నీవుకూడ మాబృందమున గలసిరమ్ము మహదానందముతో యాత్ర సాగింతము” అని యాదవు డాదరానురాగము లుట్టిపడ నాతనితో పలికెను. ఆచార్యుని పలుకు లాలించి ఆతని భావములు ప్రణయసంసిక్తములని విశ్వసించి సంతోషపూర్వక ముగా రామానుజుడు గురుబృందమున జేరి కాశీకి పయనమయ్యెను.

శిష్యపరివృతుడై ఆచార్యుడు కొంతదూరము సాగిపోయినపిదప గోవిం దుడు వాని దురుద్దేశము కనుగొనెను. విషయమును అన్నకుదెలిపి వానిని దూరముగ తొలగింపవలెనని ఆతడు నిశ్చయించినాడు. కాని ఆత డొంటరియై యుండకపోవుటచేత మనసులోని భావమును రహస్యముగ వాని ప్రమోలవ్యక్తీ కరించుటకు గోవిందునకు వీలుచిక్కకుండెను.

గురుశిష్యులు వింధ్యారణ్యములగుండా నడచిపోవుచు నొక చోటున విడిసిరి. రామానుజుడు విడిదికి కొంతదూరమున నిలిచియుండగా తగు

ముహూర్తమునకై తడసియున్న గోవిందుడు చివాలున అన్న పాలికిపోయి చెట్టుమఱుగున వానిని నిలిపి ఆచార్యుని దురుద్దేశమెద్దియో తోడిశిష్యుల కుట్రమెట్టిదో ఆతనికి మెల్లగా తెలిపి తత్క్షణమే వెనుకకు తరలుమని వానిని వేడికొనెను.

రామానుజుడు వెంటనే అందుండి కడువడిగ నడచిపోయెను. సాంద్రమై అంధకారబంధురమైన అరణ్యమున నొంటరియై నడువసాగినాడు. కంటకావృతమైన తెన్నులందు నడచుటచే వాని యరకాళ్ళయందు ముండ్లు గ్రుచ్చుకొనెను. వానిపాదములు వాచినవి. వాడియైన కంటకములు గ్రుచ్చుకొనుటచే వానిశరీరమునుండి రక్తము స్రవింపసాగెను. ఆయాసము, ఆకలి, దాహము వానినొక్కమాఱుగా పీడింపదొడగినవి. ఇక కాలుకదుపుటకు వానికి శక్యము కాకపోయెను. వగర్చుచు పాప మాతడొక చెట్టు మొదలున కూలబడినాడు. నొసట చేతులు కీలించి బోరగిలపడి జగదీశు నుద్దేశించి "హే! తండ్రీ! నీవు దీనులను రక్షించువాడవు. మాతృగర్భమున బడినదాది నన్ను గాపాడుచున్నావు. ఇపుడు నీచరణముల నాశ్రయించుచున్నాను. నన్నీవిపత్తునుండి యుద్ధరింపుము" అని కన్నులనుండి అశ్రువారి అవిరతముగ జాలువార దుస్సహమైన హృదయవేదనమున పొగులుచు రామానుజుడు ప్రార్థించెను.

ప్రార్థనమును ముగించి ఆతడు కన్నులు తెఱచి చూచినంతన నొక వేటకాడును ఆతని యిల్లాలును వానిమీాదికి వంగి వాని వదనముపై కరుణాపూరిత దృష్టులు సారించుచు వాని మానసమున నపూర్వభావమును బుట్టించిరి. అనుకంపకు అనురాగమును తోడుచేసి ఆదంపతులు "బిడ్డా! నీవిచ్చోట నీస్థితియందు పడియుంటివేల?" అని ప్రశ్నించిరి. రామానుజుని కన్నులనుండి బాష్పములు జొటజొట స్రవింపసాగెను. ఆహా! హృదయమున ఘనీభవించియున్న దుఃఖము ప్రేమస్పర్శకతన కరుగునుగదా! తనకథ యంతయును రామానుజుడు పూసగ్రుచ్చినట్లు కిరాతదంపతులకు తెలిపినాడు. వారి సందర్శనముకతన నాతడాంతరంగికముగ నెంతో యానందమును, శాంతిని పొందెను. వారు సాధారణకిరాత దంపతులట్లు వాని కగపడలేదు. వారి రూపములు కడుంగడు సుందరములైనవి. వారి యంతరాత్మలుకూడ సౌందర్య సందీప్తములైనవని వారినుడువులు వినినంతన రామానుజుడు గ్రహింపగలిగెను. కావు

వనే వారి సంపర్గమును పడసినంత వాని హృదయము ప్రశాంత పరితోషము లతో నిండిపోయెను.

బాలుని పలుకులు వినినంతన నాసుందరదంపతుల మానసములు విషాద పూరితము లయ్యెను. "బిడ్డా! నీవు దుఃఖింపకుము. హిమగిరిమీది సిద్ధాశ్రమ మునుండి వచ్చుచు మేము సత్యవ్రతక్షేత్రమునకు (కంచికి) పోవుచుంటిమి. నీవు మావెంటవచ్చి నీస్వస్థలము చేరుకొనవచ్చును" అని కృపారస ముట్టిపడ వారు రామానుజు నుద్దేశించి పలికిరి.

సంతోషముతో బాలుడులేచి నిలువబడెను. తెరువున నంతకు మున్నా తడువడిన శ్రమవలన చాలసేపు నేలపై పడియున్నను ఏహేతువుచేతనో ఇపుడు నవ్యశక్తినంది ఉత్సాహముతో ఆగంతువుల వెన్నంటి నడువసాగెను. అరణ్యము సాంద్రమైయున్నను, చక్కని మార్గ మొకటి వారి పురోభాగమున గోచరించెను. సాయంకాల మగువఱకు వారు నడచిపోయిరి. చీకటి పడినంతన వారొక చెట్టుక్రింద విడిసిరి.

అర్ధరాత్రము గడచినపిదప వేటకానియిల్లాలు పతి నుద్దేశించి "నాకు మిక్కుటమైన దాహము వేయుచున్నది. ఈ ప్రాంతములలో కొంచెము పానీయము లభించునా?" అని పలికెను. "ఈప్రాంతములలో అమృతము బోలు సలిలముగల నూయి యొకటి యుండవచ్చును. తూరుపుదిక్కున రక్తకాంతి తోచినంతన నేను పోయి తియ్యని నీరమును దెచ్చి యిచ్చెదను" అని వేటకాడు బదులుచెప్పెను. వారి వాక్కులువిని రామానుజుడు "అహా! ఈయిల్లాలు దాహమువలన నెంతబాధపడుచున్నదో కదా! నేను పోయి ఉదకముదెచ్చి యీామెదాహము దీర్పగలిగినచో నాయాత్మ ఎంత ఆనందిం చును. కాని నిశీధినీ సమయమున దట్టమగు నీయరణ్యమున నెందుపోదును? అడవియందు దారిగానక అల్లాడు నాకు తెరువుజూపి నన్ను తమవెంట నింత వఱకు గొనివచ్చి, నన్ను చంపనెంచిన హంతకులకు నన్ను దూరస్థునిజేసి కాపాడిన ప్రాణదాతల కీపాటి సేవజేసి కృతజ్ఞతను చూపజాలని దౌర్భాగ్యుడ నైతినిగదా!" అని తలపోయుచు రామానుజుడు నిద్రించెను. నిదురనుండి యాతడు లేచునప్పటికి ఉదయాద్రిపై భాస్కరుడు గోచరించెను. సమీపమున పరుండిన పుణ్యదంపతు లాతని కగపడిరికారు, గొంతెత్తి పిలుచుచు వారికై

బాలకుడు నలువలకులందు పరువెత్తసాగెను. సాంద్రమగు నాయరణ్యమున నాతని కేకలు ప్రతిధ్వనించినవి. కాని ప్రత్యుత్తరమేమియు వానికి కర్ణగోచరము కాలేదు. రామానుజుని విచారమునకు మేర లేకపోయెను. నిట్టూర్పులు విడుచుచు ఆతడు ఆవనమును కలయవెదకెను. వాని ప్రయత్నములు విఫలమాయెను. దట్టమగు నాకాననమున కాలిబాటయొకటి వానికన్నుల బడెను. ఆమార్గము ననుసరించి ఆత డించుక దూరము సాగిపోయెను. కొన్ని పొలములును తోటలును జనపదములును గూడెములును తోడన వానికి కాన్పించెను. అవి తనకు సుపరిచితములైనట్టు లాతడు తలచెను. సమీపమునందు కనువిందొనరించు నొక యుద్యానవనమున వెలయు బావినుండి కొందఱు నీరుతోడుచుండగా వారిపాలి కరిగి రామానుజుడు "అయ్యలారా! నేను దూరప్రదేశము నుండి వచ్చితిని. దారితప్పి అడవులందు పడిపోతిని. నేనిపు డెచ్చోటున నుంటినో తెలియజాలకున్నాను. అదిగో! కొంతదూరమున గోచరించు పట్టణము పేరేమి?" అని వారి నడిగెను.

బాలకుని వైఖరి జాలి పుట్టించుచుండెను. చక్కనైన వాని కాయము చెమటలు గ్రక్కుచుండెను. రామానుజుని వాక్కులు వారి హృదయములను కరగించినవి. ఏకారణముచేతనో వాని మనసు చలించిపోయినదని వా రూహించిరి. వారిలోనొకడు, "నీ వీ ప్రాంతవాసివని నీ వేషభాషలు చెప్పక చెప్పుచున్నవి. అగపడున్నది మహాక్షేత్రమగు కాంచీపురమని యెఱుంగవా? ఎదుట గోచరించుచున్నది శ్రీవరదరాజస్వామివారి యాలయమని గుర్తింపజాలకుంటివా? గురుగంభీరమైన పుణ్యకోటివిమానమునైన గుఱుతింపజాలకుంటివా?" అని బాలు నుద్దేశించి పలికెను. "ఆహా! అది కాంచీపురక్షేత్రమేనా! అయ్యో! నే నెంత దురదృష్టవంతుడను" అని పలుకుచు రామానుజుడు మూర్ఛిల్లెను. వాని హృదయము దుర్భరమైన దుఃఖమున మునిగిపోయెను. కాంచీపురమనుమాట చెవుల బడినంతన వాని మానసదిశావలయమున కోటి తలంపులు తళుకొత్తినవి. మార్గదర్శకులైన పుణ్యదంపతుల దివ్యసుందరరూపములును వారి నవలోకించినంతన చిత్తమున వెల్లివిరిసిన సచ్చిదానందములును మిక్కిలి దూరమునందుండిన వింధ్యారణ్యములనుండి త్రుటిలో కాంచీపుర పరిసర ప్రదేశమున జేర్చిన అద్భుతశక్తియును వేటకాని యిల్లాలికి

నడిరేయి గలిగిన దాహమునుగుఱించిన యుదంతమును అమృతతుల్యమగు బావినీటి నుల్లేఖించుచు నాత డర్ధాంగితో[6] పలికిన నుడువులోని గభీరార్థమును వాని మనసున అశేషభావపరంపరను తృటిలో పుట్టించినవి. తన ప్రార్థనమును విని తన్ను రక్షించుటకై సాక్షాత్తు లక్ష్మీనారాయణులే తనప్రోల కిరాత దంపతులట్లు గోచరించిరని యిపు డాతడు గ్రహింపజాలెను. వారు చెంగట నున్నపుడు వారిని గుఱుతింపజాలకపోయినందులకు తనకు ప్రాణదాన మొన రించిన భగవతికిని భగవంతునకును సలిల మొసగి కృతజ్ఞత చూపజాలక పోయినందులకును ఆతడు మిగుల వగచెను.

దుర్భరదుఃఖముతో మూర్ఛిల్లిన బాలకుడు కొంతసేపటికి లేచికూర్చుం డెను. ఆతనిచేష్ట నవలోకించి బావిపొంత నిలిచినవా రాశ్చర్యాన్వితులైరి. రామానుజుని కన్నులనుండి యింకను నీరు జొటజొట రాలుచుండెను. వైకుంఠ మండలి తనపీఠము నలంకరింప నిక తరలిరమ్మని * నాథమునికి జ్ఞాపకమొన

---

* చోళరాజ్యమున ముఖ్యపట్టణమైన వీరనారాయణపురమున (దక్షిణార్కాడుమండలము) ఈశ్వర భట్టుఅను బ్రాహ్మణున కీతడు కలియుగ మావిర్భవించినపిమ్మట 3684 వ వత్సరమున (శోభకృత్) జనన మందెను. కాని యీతనియథార్థజన్మదినము నిర్దిష్ట మొనరించుట కష్టము. ఈత డనేకవందలవత్స రములు మనియుండెనని పలువురు పలుకుచుందురు. వైష్ణవగురు పరంపరలో అనల్పమైనయోగశక్తి నందినవాడు నాథముని యనుట నిస్సంశయము. ఈశక్తి కతన నీతడు దీర్ఘకాలము జీవించియుండును. ఈతడు క్రీ. శ. 824 వ వత్సరమున జనించి 924 వ వత్సరమున మరణించియుండును. ఈతడు "యోగరహస్యము" "న్యాయతత్వము" అను మహాగ్రంథములను రచించెను. ఆచార్యయుగమున "న్యాయతత్వమే" ప్రథమవిశిష్టాద్వైతగ్రంథము. ఈత డొకసారి ధ్యానమగ్నుడై యుండగా ఇరువురు వేటకాండ్రును నొక యాడుదియు నీకై వచ్చి రనియు వారివెంట నొకకోతి యుండెననియు నితనికుమార్తె తండ్రి కెఱింగించెను. ఆ యాగంతువులు సీతారామలక్ష్మణులనియు వెంటనున్నది హనుమంతుడనియు వైకుంఠమునకు మరలిరమ్మని తన్ను పిలచుటకు వారు వచ్చి రనియు గ్రహించి, వారుపోయిన తెరువు నరయుచు నీతడు పరువెత్తి తుద కొకయరణ్యమధ్యమున మూర్ఛిల్లెను. ఇతడు మూర్ఛయందు పడి యుండగా సీతారామలక్ష్మణు లతనికి దర్శన మిచ్చిరి. ఆ దివ్యస్వరూపములను గనినపిదప నిక నైహికా దృశ్యమును నాథముని వీక్షింపలేదు. వానికాయమునుండి తేజఃపూరితమైన స్వరూప మొకటు వెడలి యూర్ధ్వదిక్కుగాబోయెను, అత్యద్భుతమైనవెలుగులో నాత డదృశ్యు డాయెను. ఇతడు నూటనలువ దేండ్లు మనియుండెననియు పుష్యశుద్ధ యేకాదశినాడు దివి నలంకరించెననియు వారిశిష్యులు వచించువారు. అరణ్యమున నాథముని శరీరమును విలోకించి అతని తనయుడును శిష్యులును భక్తిపురస్సరముగా దానిని వీరనారాయణపురమునకు గొనిపోయి విధ్యుక్తముగ నంత్యక్రియలు నెఱపిరి.

రించుటకై సీతారామలక్ష్మణులు ఆటవికులవలె వేషములు ధరించి వచ్చిన యుదంతము బాలకుని మనసునం దాముహూర్తమున తలయెత్తినది. సమ్ముఖస్థులైన లక్ష్మీనారాయణులను గుఱుతింప నైతినని కొండొకవడి యాతడు కుందినను తన్ను కరుణింప బ్రచ్ఛన్న వేషమున వారరుదెంచుట తనభాగ్యమే యనియు తన పూర్వతపఃఫలమనియు పదపడి యాతడు గ్రహించి పరమానంద భరితుడు కాజొచ్చెను. సాంద్రారణ్యమున తనకు మార్గదర్శకులై కాంచీపుర మందలి తమ గేహముదిక్కుగ నడపించిన భగవతియును భగవంతుడును, భయద జీవితకాననమున ఘోరాంధకారమున మార్గదర్శకులై తోడ్కొనిపోయి వైకుంఠధామమున తమపదపద్మములచెంత తనను చేర్పకపోరని తలపోయుచు రామానుజుడు మిక్కిలి పరితోషము నందజొచ్చెను. చరచర నిజగృహమునకు మరలిపోయి జరిగిన అద్భుతసంఘటనమును జనని్రమోల కడుకౌశలముతో వర్ణించినాడు. ఆ విచిత్రచరిత్ర వినినంతన ఆమె పరితోషమునకు మేరలేక పోయెను. "నాయనా! నీవు కాంచిపూర్ణునికడ కరిగి యీఅద్భుతమైన వృత్తాంతము నాతని కెఱింగింపుము. అతడు శబరియంశమున జనించిన మహాత్ముడు. శ్రీవరదునకు సన్నిహితుడు. నీభావికర్తవ్యమును గుఱించి అతడు నీ కుచితమైన సలహా నీయగలడు" అని తనకన్నబిడ్డ కుపదేశించెను. తల్లి యాజ్ఞను శిరసా వహించి రామానుజ డాయుదంతమును కాంచిపూర్ణున కెఱింగించెను. ఆభక్తవరు డావృత్తాంతమును వినినంతన మిగుల నలరి "నాయనా! నీవు పుణ్యాత్ముడవు. కావుననే నీకట్టిభాగ్యము లభించినది. శాలావినీరము గొని వచ్చుటయందలి యంతరార్థమును నీవు గ్రహింపవలెనుసుమీ! అనుదినము నీ వాబావినుండి కలశముతో సలిలమును గొనిపోయి శ్రీ వరదరాజస్వామి కభిషేకము గావించుచుండుము. పరమపదమునకు సన్నిహితుడవు కాజాలుదువు" అని బాలకునితో పలికెను. రామానుజు డట్లే కావింపసాగెను. వైష్ణవభక్తులీ రామానుజసంప్రదాయము ననుష్ఠించుచుందురు. పూర్వోక్తమైన బావి నాటినుండి సకల శ్రీవైష్ణవుల దృష్టిలో పరమపవిత్రమై జగదీశ సందర్శనోదంతము నుల్లేఖించుచు విజ్ఞానయాత్రికుల నలరించుచుండును.

కొంతకాలము కడచినపిదప రాష్ట్రపాలకుని పుత్రిక నొక బ్రహ్మరాక్షసి ఆవహించి పీడింపదొడగినది. తండ్రి పరితాపమునకు మేరలేకపోయెను.

భూతవైద్యు లెందఱో రప్పింపబడిరి. కాని వారి కా బ్రహ్మరాక్షసి లొంగినది కాదు. "ప్రసిద్ధికెక్కిన యాదవప్రకాశుని మంత్రశక్తివలనగాని ఈ మహా పిశాచము రాకొమరితనుండి తొలగిపోదు" అని రాజాస్థానమందలి యుద్యోగి యొకడు యేలికతో చెప్పెను. యాదవుని సమ్మానపురస్సరముగా తోడుకొని రమ్మని ఱేడుప్రధానమంత్రిని పంపెను. "నాపేరు చెప్పినయెడల ఎట్టి బ్రహ్మరాక్షసియైనను తొలగిపోవును" అని యాదవుడు నిర్లక్ష్యముతో తన్ను జేర వచ్చిన మంత్రితో చెప్పెను. సచివు డాపలుకును రాజకుమార్తెమ్రోల నుచ్చరించినంతన యాదవుని దూషించుచు ఆమె మఱింతతీవ్రముగా విజృంభింప సాగెను. పదపడి యాదవుడు కోపముతో మండిపడుచు నేలికగృహమున కరిగెను. ఆతని జూచినంతన రాచపట్టిని పట్టినబ్రహ్మరాక్షసి ఆగ్రహముతో నఱచుచు గంభీరస్వరమున మంత్రము నుచ్చరించుచు తనదెసవచ్చు యాదవుని దెస కాళ్లువిసరుచు "ఓరీ! నిన్ను జూచి నేను బెదరెద ననుకొంటివా? నీమంత్ర ప్రభావమెట్టిదో నేనెఱుగకపోలేదు. నెమలివలె నృత్యముచేయుచున్నావు. నీవు పరమమూఢుడవు. నీవెవ్వండవో నేనెఱుంగుదును. కడచిన జన్మమున నీవు తొండవు. సుప్రసిద్ధమదురాంతక సరోవరము చుట్టునుగల గట్టులోని యొక రంధ్రమున వసించువాడవు. ఒకనాడు కంచినుండి కొందఱు వైష్ణవయాత్రికులు తిరుపతిదిక్కుగ పోవుచు ఆ చెరువుగట్టున విడిసిరి. కాసారమున స్నానమాచరించి తీరమున నన్నము వండుకొని తినిరి. వారు తినగామిగిలిన యెంగిలి యన్నమును నీవు తింటివి. కావున నీజన్మమున నీవు ఉత్తమబ్రాహ్మణవంశమున పుట్టితివి. గతభవమున నేను విప్రకులమున జనియించితిని. ఒకప్పుడు యజ్ఞము చేయుచు కొన్నిలోపములు చేసితిని. కావున బ్రహ్మరాక్షసినైతిని. కాని గత భవవృత్తాంతమును జ్ఞప్తియందుంచుకొనగలిగితిని" అని పలికెను. ఆ యుదంతమును వినినతోడనే శ్రీ ఎల్లఱును ఆశ్చర్యాన్వితులైరి. సిగ్గుతోడను అవమానముతోడను యాదవుడు తలవంచుకొనెను. బ్రహ్మరాక్షసి పకపక నవ్వసాగెను.

నిమునము కడచినపిదప యాదవుడు "నిన్ని రాచముద్దియనుండి తొలగింపగల శక్తిసంపన్ను డెవ్వడైన నిందున్నాడా? అని యారక్కసి నడిగెను. రక్కసిచే నావహింపబడిన యారాజపుత్రిక యపుడు చివాలునలేచి వెనుకవైపున వినమ్రుడై నిలిచిన రామానుజునికడ కరిగి యాతనిపదములకు ప్రణ-

మిల్లి వాని నుద్దేశించి "తండ్రీ! నీవు దేవలోకమునుండి యవతరించిన మహాత్ముడవు. నీవు ఆజ్ఞ యొసంగితివేని నే నీ రాచముద్దియను వీడిపోదును. నీయాన నాకు ప్రసాదింపబడిన వరమని నేనెంతును" అని భక్తిపురస్సరముగ పలికెను.

ప్రమోదముతో రామానుజుడు "అట్లగుచో నిమునస్మైన నాలసింపక ఈబాలికను వీడి నీదారిని నీవుపొమ్ము. ఈదుర్గతినుండి అచిరములో నీవు విముక్తుడవు కాగలవు. ఆనందశాంతులు నీ సొమ్ములు కాజాలును" అని పలికెను.

"మహాత్మా! నీయాజ్ఞానుసారము వర్తింతును. ఈఘోరపాపిని నీపదస్పర్శచే పవిత్రునిజేయ వేడెద" అని యాబ్రహ్మరాక్షసి రామానుజునితో పలికెను.

రామానుజు డట్లే చేసెను. ఆనందబాష్పములు వెలార్చుచు బ్రహ్మరాక్షసిలేచి "స్వామీ! ధన్యుండనైతిని. బ్రహ్మరాక్షసినై నదాది చెంతనున్న అత్తిచెట్టుపయి వసించుచు వచ్చితిని. నాకు నీకారుణ్యాముకతమున జన్మరాహిత్యము కలుగుచుండుటచే నాయావాసమైయుండిన వృక్షమును విడచిపోదును. నేను విడచిపోవుటకు వృక్షవిధ్వంసము గుర్తగును" అని రామానుజునితో పలికి యాదవు నుద్దేశించి "ఓయీ? నీవీ యవతారపూరుషుని కరుణనంది పాపవిముక్తుడవుకమ్ము" అని వచించి మరల స్వామిపదములకు ప్రణమిల్లి "మహాత్మా! సెలవు" అని లేచెను. తుపానుదెబ్బతగిలినదానివలె చెంతనున్న అత్తిచెట్టు ఫెళఫెళమని విఱిగెను.

అపుడు దేదీప్యమానమైన రూపమొకటి ఉత్పన్నమాయెనట. అసంఖ్యాకములైన విమానములు దివినుండి అవతరించెనట. అందుండి దేవతలు దిగి సమ్మానపురస్సరముగ నారూపము నాహ్వానించిరట. అనంతరము కనులకుమిఱుమిట్లు గొలుపువెలుంగున నందఱు నూర్ధ్వదిశకు జని అంతర్హితులైరట!

యాదవుడు లేచి రామానుజుని బహుభంగుల బ్రస్తుతించెను.

ఒడలు తెలియక పడిలేచినదానివలె రాజపుత్రిక నలుకెలంకుల నబ్బురపుచూడ్కులు సారించి పలువురు అపరిచితులమ్రోల తానుండుటగాంచి సిగ్గుపడజొచ్చెను. సమీపమున నిలిచిన తేడు "బిడ్డా! చాలకాలము నీవు బాధ

పడితివి. ఈయవతారపురుషుని కారుణ్యము మూలమున నీవు పునర్జన్మము నందితివి" అని కరుణారసపూరితస్వరమున తనయతో పలికెను. కన్నులనుండి యవిరతముగ నశ్రులురాల నా రాచముద్దియ చివాలున నేలవ్రాలి రామాను జుని చరణరాజీవయుగమును భక్తిపూర్వకముగ శిరమున జేర్చికొని "స్వామీ! దుర్భరస్థితినుండి నన్ను రక్షించితివి. నీవు నన్ను కాపాడవచ్చిన దేవదేవుండవు గాని సామాన్యమానవుండవు కావు. నేను సామాన్యమానవిని. ఈమహోప కారమున కెట్లుపకృతి సలుపనేర్తును? అనవరతము నిన్ను భజించుచు తరిం తును" అని పలికెను. అసంఖ్యాకములైన పారితోషికములను ఱేడు రామాను జున కీయబోయెను. స్వామి వానిని స్వీకరింపక యాదవసహితుండయి మఠము నకు మరలిపోయెను.

విద్యారణ్యమున రామానుజుని మట్టుపెట్ట నమకట్టిన యాదవుని తరు వాతి కథనమును చదువరు లెఱుగరు. రామానుజుని గుఱించిన వృత్తాంతమును గోవిందునివలన నెఱుంగజాలక అత డేదేని వన్యపశువు వాతబడెనని తలంచి శిష్యపరివృతుండై యాదవుడు నిజనివాసంబునకు జనియెను. కాంచీపురమున రామానుజుని గని ఆత డాశ్చర్యాన్వితుడాయెను. వాని పునరాగమనమును గూర్చిన ఉదంతమును వినినంతన యాదవుని యబ్బురపాటు ఘనతర మయ్యెను. ఆచార్యుడు తలపెట్టిన దుర్దాంతదుర్నయమును రామానుజుడు పాటింపలేదు. అంతరంగికముగ నాతని క్షమించి మునుపటికంటె నెక్కుడుగ నాతనికి భక్తి శ్రద్ధలు చూపగడంగినాడు. తనకు జరుగు సపర్యలు తన యాచార్యునికి జరిగి నట్లే యాత డూహించువాడు.

ఇట్లుండ యామునాచార్యుడు ఇహజగతినుండి నిష్క్రమింపదలచెను. తన యనంతరమున రామానుజునిచే తనకర్తవ్యమును నిర్వహింపజేయుట శ్రీమన్నారాయణుని యుద్దేశమని యాత డెఱుంగును. కావున రామానుజుని శ్రీరంగమునకు గొనిరమ్మని తెలిపి యతడు తనశిష్యుడైన మహాపూర్ణుని కాంచీపురమునకు పంపెను.

అతడు భావికాలజగద్గురువు నన్వేషించుచు రామానుజుని కనుగొని యమునాచార్య విరచిత 'స్తోత్రరత్నముల' ను ఆతని సమ్ముఖమున పఠింప సాగెను.

శ్రీవరదరాజస్వామిని గుఱించిన మధుర శ్లోకములను వినినంతన రామానుజుని హృదయమున ఆనందవీచిక లుప్పొంగినవి. వానియందలి భావ సౌందర్య మాతని ముగ్ధునిగావించెను. మహనీయ గుణగరిష్ఠుడైన యామునాచార్యుని చూడవలెనని అతడు మిక్కిలి మక్కువపడెను. పరమ పరితోషముతో మహాపూర్ణుడాతనిని తనవెంట తోడ్కొని పోయెను.

వారిరువురును, శ్రీరంగమును చేరుటకుమున్నే దురదృష్టవశమున యామునాచార్యుడు పరమపదించెను. ఆతనిశవము స్మశానవాటికకు కొనిపోబడుచు మహాపూర్ణ రామానుజుల కన్నులపడెను. ఉభయుల దుఃఖమునకు మేరలేకపోయెను.

శవసమీపమందలి వ్యక్తులకు రామానుజుని జూపి మహాపూర్ణుడు "యామునాచార్యుని అనంతరము దేవమానవులకు ఆచార్యుడుగా నుండువాడీమహాత్ముడు. వారికి జ్ఞానప్రబోధము గావింప నర్హుడీతడని యెఱింగి జగదీశుడీతని నీకార్యము నిర్వహించుకొఱకై నియోగించెను. మానవహృదయములకు శాంతిని చేకూరిచి నారాయణ చరణకమలముల చెంత మనుష్యాత్మలను చేర్పజాలు మహాత్ముడీతడు" అని గంభీరస్వరమున పలికెను.

ఆపలుకులను వినినంతన వారు ఆశ్చర్య సమన్వితులైరి. వారి హృదయములు భక్తిభరితములైనవి.

రామానుజుడు యామునాచార్యుని కాయమును తీక్ష్ణదృష్టితో పరిశీలించెను. ఆచార్యుని కుడిచేతివ్రేళ్లు మూడు మూయబడియుండుట గాంచి అచ్చెరువునొంది "ఈవ్రేళ్లిట్లుండుటకు కారణమేమి? గురువర్యుడు ముగింపజాలని కర్తవ్యము లేమైననుండెనా?" అని రామానుజుడు మహాపూర్ణు నడిగెను.

"అవును. మానవులకు బ్రహ్మసూత్రములను ప్రసాదించిన వేదవ్యాసుని యెడలను విష్ణుపురాణము నొసగిన పరాశరమహర్షి యెడలను ప్రజావాఙ్మయమున వేదముల నాలపించిన శఠకోపస్వామియెడలను యామునప్రభువునకు అపారమైన భక్తియుండెడిది. బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయుటకు తనకు సమయము చిక్కనందులకు ఆతడు మిగుల దుఃఖించువాడు" అని మహాపూర్ణుడు ప్రత్యుత్తర మొసగెను.

"అటులైనచో గురువర్యుని పవిత్రాత్మను సంస్మరించుచు ఆతని వాంఛా సిద్ధికై తపించెదను – బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాసెదను" అని రామానుజుడు వచించినంతన ముడువబడిన మూడువ్రేళ్ళలో నొకటి విడివడినది.

"ఒక పవిత్రచరిత్రుని కనుగొని ఆతనికి పరాశరుడను నామధేయము నొసగెదను" అని రామానుజుడు పలికెను. తోడనే మఱియొక యంగుళి విడివడినది.

"నేను శ్రీవైష్ణవుడ నయ్యెదను. మనోవాక్కాయములతో శ్రీ మహా విష్ణువును పూజింపుడని ప్రజలకు ప్రబోధింతును. ఆళ్వారులచే రచింపబడిన 'దివ్యప్రబంధము' నందలి గభీరమగు నర్థమును వారికి తెలిపెదను. విష్ణుచరణ సరోజముల చెంతకు వారిని తోడుకొనిపోవుటకు పెక్కుమార్గములు రోయు దును. సచ్చరిత్రుడైన మహావిజ్ఞానిని కన్గొని ఆతనిచే శ్రీశఠకోపుని రచనలకు వ్యాఖ్యానము వ్రాయింతును. ఆవ్యాఖ్యానకర్త శఠకోపస్వామి యనబరగును." రామానుజస్వామి ఈపల్కులు పల్కినంతన యామునాచార్యుని మూడవ వ్రేలు కూడ విడివడినది.

ఆ దృశ్యమును చూచినవారందఱును విస్మయపరీత చేతస్కులైరి. "ఈమహాత్ముని ప్రభావము అనిర్వచనీయమైనది. జగదీశుడు మానవ సముద్ధ రణమునకై ఈతని పుత్తెంచె ననుట నిస్సంశయము. ఇట్టి మహనీయుడు మన యాచార్యుడగుట మన యదృష్టము శ్రీవైష్ణవమతము మహిమోపేతమై వర్ధిల్లగలదు" అని వారేకగ్రీవముగ పలికి రామానుజస్వామిని బహుభంగుల బ్రస్తుతింపసాగిరి. వారిలో ప్రధానముగ నెన్నదగినవాడు వరరంగడను భక్త వరేణ్యుడు.

'శుకప్రశ్నసంహిత' యందలి ముప్పదితొమ్మిదవ యధ్యాయమున నుల్లేఖింపబడిన తెఱగున పరమసన్మాన పురస్సరముగ యామునాచార్యుని కాయము శిష్యగణముచే భూగర్భమున జేర్పబడినది.

అనంతరము వరరంగమహాపూర్ణుల సెలవుగైకొని రామానుజస్వామి కాంచీపురమునకు మరలెను.

యామునాచార్యుని శిష్యులలో మిగుల నెన్నదగినవాడు కంచిపూర్ణుడు. ఇతనికి 'తిరుకచ్చినంబి' యను నామాంతరము కలదు. ఈతని విజ్ఞానము

అనిర్వచనీయమైనది. ఆ పవిత్రాత్ముడు వరదరాజస్వామికి మిగులగూర్చు నెచ్చెలి. స్వామి యాతనితో ఏకాంతప్రసంగము సలుపుచుండునని పలువురు విశ్వసించుచుందురు. ఆతడు విప్రుడుకాడు. 'శతవద' జాతికి చెందిన భక్త వరేణ్యుడు. ఆతని మహాత్మ్యమెఱిగి రామానుజుడు వాని శిష్యుడు కాగోరెను. కాని విప్రయువకునకు ఆచార్యుడగుటకు కంచిపూర్ణు డంగీకరింపలేదు. ఆశా భంగము కలిగినందుకు రామానుజుడు మిగుల వగచెను. కంచిపూర్ణు డారగించిన అన్నమునందలి శేషభాగము భుజించి, ఆంతరంగికముగ తృప్తినందదలచి, యాత డామహాత్ముని తన యింటికి విందునకు బిలచెను. ఆయోగియు మంద హాసముతో విందారగింప నంగీకరించెను.

రామానుజుని మనసునందలి యభిప్రాయమును కంచిపూర్ణుడు గ్రహింప గలిగెను. రెండవనాఁటు రామానుజుడు విందునకై తనను పిలుచుటకుమున్ను యాత డింటలేని సమయము కనిపెట్టి చరచర వాని యింటి కేగెను. భర్తయాన నాదలగొని రామానుజుని భార్య 'తంజమ్ అమ్మల్' బహువిధవ్యంజనములను వండినది. "అమ్మా! వెంటనే నేను దేవాలయమును చేరుకొనవలయును. దయ యుంచి తత్క్షణమే నాకు వడ్డింపుము" అని కంచిపూర్ణు డామెను వేడుకొనెను. భర్త అతనిని విందుకై ఏల యాహ్వానించెనో ఆమె యెఱుంగదు. అవ్వాలి వసారాలో వెంటనే యతనికి భోజనపదార్థములను వడ్డించి, కడువడిగ నంబి విందారగించినంతన కఱ్ఱతో నెంగిలి విస్తరిని తొలగించి ఆమె స్నానము చేసినది.

కంచిపూర్ణునికై రామానుజు డాతనియింట జాలసేపు తడసి పదపడి పలుతావులయం దాతని నన్వేషించుచు తుదకు తనగృహము నాతడు వేఱు మార్గమున జేరియుండునని యూహించి నిజాలయమునకు మరలెను. ఆతని భార్య అపుడు రెండవమాఱు స్నానమొనరించుచుండెను. ఆశ్చర్యాన్వితుడై తనను వీక్షించు భర్తతో "శతవదకులస్థుడొకడు విందుకై యాహ్వానింపబడి నట్లు చెప్పి గుడిలోపనియున్నదని అతిత్వరితముగ భోజనమొనరించిపోయెను. వాని యెంగిలివిస్తరి కఱ్ఱతో నేనే దొలగింపవలసివచ్చుటచే మరల స్నానము చేయుచుంటిని" అని యామె చెప్పెను.

రామానుజుని హృదయము దుర్భరదుఃఖముతో నిండిపోయెను. "నీవు నా కెట్టియెగ్గుచేసితివో యెఱుగవు. అతిథి నాకును నీకునుగూడ దేవసముండని నీవు గ్రహింపవలసినది. నీవు గ్రహింపజాలని యంశములయందు ముందంజ వేయుచు అనర్థముదెచ్చుచుంటివి." అని అర్థాంగి నుద్దేశించి పలికి "ఈ యాశా భంగముకూడ నాకు వాటిలుటకు నాదురదృష్టమే కారణము" అని వగచుచు నంబిచెంత కాతఁడు పోయెను.

ఈకథనమును గాంచి కొందఱు పాఠకులు పెదవులు విఱుచుకొందురు. "ఎంగిలితినుటకై విజ్ఞానభాస్కరుఁడైన రామానుజు డేల అంతగాముక్కువ పడెను?" అని వారు ప్రశ్నింపవచ్చును.

భర్త విందారగించినపిదప భార్య ఆతని విస్తరియందు భుజించుటయు ఆచార్యుడు భోజనమొనరించిన యనంతరము అంతేవాసి ఆతని యాకున ప్రసాదము గొనుటయు హిందూధర్మమున ప్రసిద్ధమైన యాచారము. స్పర్శ యందు కొంత యాధ్యాత్మికమూల్యము కలదని సహేతుకముగ తత్వజ్ఞులు ఋజువొనరించుచుందురు. ఆహారపదార్థము లట్టిమహిమను అవలీలగ ఆకర్షించు నని వారు వచింతురు. ప్రభావసమన్వితములైన వేదమంత్రముల నుచ్చరింపుచు హిందూసంప్రదాయమును పాటించువారు ఆహారమును స్పృశింతురు. ఆహార సమయమున గాయత్రీమంత్రము నుచ్చరించుచుందురు. మంత్రపఠనమువలన నోదనవ్యంజనములు ఆధ్యాత్మికశక్తి సమన్వితములగునని తాత్వికులు పలుకు చుందురు. హిందూసంఘమున సతి పతిని, శిష్యుఁడు గురువును దైవమస్లెంచు చుందురు. నిజనాథుని యెంగిలి పరమపవిత్రమైనదని పత్నియును, గురువర్యుని యెంగిలి కడుంగడు పునీతమైనదని శిష్యుడును, యెంచుట హిందూసంఘమున నబ్బురముకాదు. శ్రీ వరదరాజస్వామికి మిక్కిలి సన్నిహితుఁడైన కంచి పూర్ణుని మహత్త్వము నెఱిగియే తమయిరువురనడుమ గురుశిష్యభావము నెలయవలయునని యుద్దేశించియే రామానుజు డట్టివాంఛను మనసున చోటిచ్చియుండును.

నిజవాంఛాసిద్ధికై రామానుజుఁడు మఱియొకపద్ధతి నవలంబించెనని కొన్ని ద్రవిడమతగ్రంథములు తెలుపుచున్నవి. ఒకనాఁడు కంచిపూర్ణుఁడు మార్గ మున పోవుచుండగా రామానుజు డాతని నత్యంతసన్మానముతో నిజగృహము

నకు గొనిపోయెను. ఆతని నొకపీటపై నాసీనుని గావించి రామానుజు డాతని పదద్వయమును స్పృశింపబోయెను. నంబి చివాలున ప్రక్కకుజరిగి "ఏమి చేయుచుంటివి! నీవు నాపాదములంటదగునా; ఇది ధర్మవిరుద్ధమైన కార్యమని గురుసాక్షిగ తెలుపుచున్నాను. ఒకప్పుడు క్షత్రియుని వెనుక నడచినందులకు నాథమునివంటి మహనీయుని పుండరీకాక్షు డాక్రోశింపలేదా? నీవిట్లాచరించుట ఉచితకార్య మనుకొంటివా?" అని రామానుజు నుద్దేశించి పలికెను. "మీయాజ్ఞకు బద్ధుడ" నని నిట్టూరుపు వీచుచు రామానుజుడు పలికెను. నంబి నిష్క్రమించిన యనంతరము రామానుజుని భార్య ఆతడు కూర్చుండిన పీటను కడిగి తాను స్నానమాచరించినదట! అది యెఱిగి రామానుజు డామెను గర్హించెనట. కంచిపూర్ణునకు పాదపూజచేసి ఆతని కాహారమొసగి యెంగిలిని మెసవవలెనని యాత డెందుల కుద్దేశించెనో! ప్రథమక్రియయందే గురూద్దేశము ప్రతికూలమైయుండుట గ్రహించి తరువాత గావలసినపని నాత డెందులకు విరమించెనో!

రెండు కథలయందలి యంశము లెట్టివైనను రామానుజుని యుద్దేశమెద్దియో కంచిపూర్ణునిదృష్టి యెట్టిదో రామానుజుని యర్ధాంగి ప్రకృతి యెట్టిదో రెండింటిని యొకే తెఱగున చదువరులు గ్రహింతురు.

రామానుజుడు పూర్వజన్మమున లక్ష్మణుడనియు కంచిపూర్ణుడు శబరి యనియు వైష్ణవమతసంప్రదాయము వాకొనుచున్నది. తానొసగు ఫలములు తియ్యనైనవని యెఱింగిన యనంతరమే రామలక్ష్మణులకు వాని నీయనెంచి శబరి తొలుత వానిని రుచిచూచి వారి కొసగెనుకదా! గతభవమున కంచి పూర్ణుని యెంగిలి తనకు లభించుటచే నీజన్మమునగూడ నది తనకు చేకుఱవలెనని రామానుజు డూహించి యుండును. ఈ యంశమును పామరు లాధ్యాత్మిక దృష్టితో వీక్షింపరనియు ఎంగిలిదినుట తమకర్తవ్యముగానెంచి వారు ముఖ్యమైన సాంఘికసంబంధనకు భిన్నముగా ప్రవర్తింతురనియు నడలి కంచిపూర్ణుడు రామానుజుని యుద్దేశమును ప్రతిఘటించి యుండును.

రామానుజు డనంతరము కొన్ని యాధ్యాత్మికవిషయములను గుఱించి సంశయపీడితుడై ఆఱుప్రశ్నలమూలమున సంశయనివారణము గావించుకొనన నెంచి కంచిపూర్ణుని వినీతభావముతో సమీపించి "మహాత్మా! శ్రీవరరాజ

స్వామినడిగి నాయంతరంగమందలి ఆఱుప్రశ్నలకు ప్రత్యుత్తరములు వడసి నాకు తెలుప నిన్ను ప్రార్థించుచున్నాను” అనియెను.

కంచిపూర్ణుడు స్వామి సమక్షమున రామానుజుని వేడికోలును నివేదించెను. ప్రశ్నలెవ్వియో ముందే యెఱింగిన స్వామి సముచిత ప్రత్యుత్తరముల నొసగెను. “సేవాపరాయణులందఱును ప్రేమపాత్రులే! నాకు వారు సన్నిహితులు! ఇహజీవితమును ముగించిన యనంతరమున వారు నన్ను జేరుకొందురు. రామానుజుడు మహాపూర్ణుని (పెద్దనంబిని) గురువు జేసుకొనుగాక! లక్ష్మణుడు ప్రేమపాత్రుడు” అని వరదరాజస్వామి పలికెను. కంచిపూర్ణుడు రామానుజునకు స్వామిమాటలను దెలిపి “నాయనా! నీవంటి యదృష్టవంతుడు మఱియొకడు లేడు” అని వచించెను.

అనంతరము రామానుజుడు మహాపూర్ణునివలన దీక్షబడసెను. వరదరాజస్వామియే యాతనికి కాషాయాంబరములను దండమును ప్రసాదించి యతిరాజను నామధేయ మాతని కొసగెను. శ్రీవైష్ణవమత రహస్యములను మహాపూర్ణుడాతని కాఱునెలలో తెలిపెను.

జగదీశుని కటాక్షమంది మానవసముద్ధరణ కర్తవ్యమున యతిరాజు బద్ధదీక్షితు డయ్యెను. “జగద్గురుండవు నీవు” అని వచించుచు పలువురు విజ్ఞానులు ఆతని శిష్యులైరి. రామమిశ్రుడును, వరదవిష్ణాచార్యుండును, దశరథుండును వారిలోముఖ్యులు. కడపటి యిరువురును యతిరాజుని మేనల్లుండ్రు.

కంచికి సమీపమందలి ‘కూరమ్’ అను పల్లెయందు రామమిశ్రుడు వసించుచుండెను. అత డతులైశ్వర్య సంపన్నుడు. జాతి మతభేదములను పాటిసేయక తన ద్రవ్యమును అన్నదానమునకు వినియోగించువాడు.

ఒకనాటి నిశీథినీ సమయమున ఆలయ కవాటములు బంధింపబడిన యనంతరము దేవీసహితుండై శ్రీవరదరాజస్వామి కంచిపూర్ణునితో ప్రసంగించుచుండగా పెద్ద చప్పుడు కొంతదూరమునుండి వినవచ్చెను. “అదేమి శబ్దము” అని పెరుందేవి స్వామిని ప్రశ్నించెను. “నిరతాన్నదాతయైన రామమిశ్రుడు ఇప్పటివఱకు తన యతిథులను సత్కరించుచునేయుండును. అతిథుల యాహారానంతరము భోజనాగారపు ఇత్తడితలుపులు మూయబడినవి. మన చెవులబడినది ఆతలుపుల చప్పుడే” అని మందహాసముతో స్వామి దేవికుత్తర మొసగెను.

"ఆహా! అతడట్టి అన్నదాతయా! అట్టిమహనీయు నొక పర్యాయము చూడవలెనని మక్కువపడుచున్నాను. నాయనా! ఆతని నిచటికి రేపొక మాటు గొనివత్తువా?" అని దేవి నంబి నడిగెను.

మఱునాటి ప్రాతఃకాలమున కంచిపూర్ణుడు రామమిశ్రుని పాలికరిగి దేవి వాంఛను వానికి తెలిపెను. ఆపలుకులు వినినంతన అన్నదాత ఆత్మ అనంతానందము తో నృత్యము చేయలేదు. దురంతమైన అవమానముతో నతడు తలవంచుకొనెను. వానిహృదయము దుస్సహమైన దుఃఖముతో నిండిపోయెను. "'కుడిచేయి యిచ్చుదానిని యెడమచేయి యెఱుగరాదు' అని కదా మన శాస్త్రములు వచించుచున్నవి. సర్వశుభదాయినియైన దేవిచెవులబడునట్లు నాదానము చప్పుడు చేయుచున్నది. నేగావించునది ఆదర్శదానముకాదు. నే నాదర్శదాతనుకాను. దేవిమ్రోల నిలుచుటకు నేనర్హుండనుకాను. తల్లి వేడికోలులోని ధ్వనియెద్దియో నేను గ్రహించితిని. శుభ్రాత్ముడనై నేను ప్రవర్తింపవలెనను నుద్దేశము జగద్ధాత్రిచిత్తమున గలదని గ్రహింపగలిగితిని" అని పలికి అతడు తన ధనరాసులను నిరుపేదలకు పంచియిచ్చి రామానుజస్వామి చరణముల నాశ్రయించుటకై కంచికి పయనమైనాడు.

దట్టమైన యొక అడవిగుండా అతడు నడచుచుండగా "ప్రభూ! నాకు భయము వేయుచున్నది." అని వెన్కనుండి ఎవ్వరో కేకవైచిరి. ఆశ్చర్యాన్వితుడై యతడు వెనుకకు తిరిగి చూచెను. కడుకష్టముతో నతని యర్ధాంగి వెనుక నడచుచు వచ్చుచున్నది. "ఇట్లు సాహసించితివేల? ఇంటిని వాకిలిని బంధువులను మిత్రులను పరిత్యజించి ముండ్లతోనిండియుండిన యరణ్యమున పడిన బిచ్చగాడనైన నావెంట పడితివేల?" అని యాతడు భార్య నడిగెను.

"ప్రభూ? నేనేమియు పరిత్యజింపలేదు. నాయిల్లూ నావాకిలీ నాబంధువులూ నామిత్రులూ నాయిహమూ నాపరమూ నాసమస్తమూ నాప్రభువు వసించు నిందేకలవు" అని ఆ యిల్లా లుత్తర మొసగెను.

అర్ధాంగి భక్తికి యచ్చెరువంది రామమిశ్రుడు "నావెంట నున్నపుడు నీకు భయమేల? ఇంటియొద్దనుండి నీవు దేనినైనను మోచుకొనివచ్చుచున్నావా?" అని యామె నడిగెను.

"ఈ బంగారు గిన్నెను మాత్రము తీసుకొని వచ్చుచున్నాను. రాత్రి పరుండుటకుమున్ను మీ రనుదినము నీగిన్నెతో పాలు త్రాగుచుండువారుకదా"

రామమిశ్రుడు కడుపుబ్బునట్లు నవ్వి "ఎట్టివెఱ్ఱిదానవు! రత్నఖచితమైన రంగారుబంగారుగిన్నెతో భిక్షుకుడెన్నడైన పాలుద్రాగుట చూచియుంటివా? ఈ విడ్డూరము నెవ్వరైన వినినయెడల నవ్వరా?" అని యామెచేతినుండి పైడిగిన్నె నూడపెఱికి సాంద్రారణ్యమధ్యమున విసరివైచి "చూచితివా నీ భయమెంతదూరము పడిపోయినదో" అని పలికెను.

ఈకథ గంభీరభావ బంధురము. మహత్తర భారతాదర్శనమును దృష్టాంతీకరించునది ఈకథ. విజృంభణ మెఱుగక నిభృతమున నివ్వటిలు దానమే దానము. ప్రకటన ప్రచారములు దీని యాధ్యాత్మిక మూల్యమును చెఱచును. రామమిశ్రునిబోలు దాతలు ప్రపంచమున నరుదుగ నుందురు. అగ్రశ్రేణి త్యాగులందీ మహాత్మునకు నిక్కంపు తావుకలదు. అతులైశ్వర్యమునకు నీరు వదలి పైడిపాత్రలను పారవైచి మట్టిమూకుడులు చేతబూని కౌపీనధారులై పరార్థజీవులై భిక్షుకులై దేవతలకు సయితము అబ్బురము గొలుపు మహనీయ గుణగరిష్ఠులకు నెలవైనది భారతభూమి.

పత్నీసహితుండై రామమిశ్రుడు కంచి కరిగి రామానుజుని చరణముల నాశ్రయించెను. ఆతని హృదయ విభూతిని ఆచార్యుని నిశితదృష్టి తక్షణమే గుర్తింప గలిగెను. తోడనే గురుదేవుండాతని శిష్యునిగా గావించుకొనెను. గురుచరణకమలమున రామమిశ్రుని మానసము మత్తద్విరేఫమాయెను. పతి పదసరోజములందు సతిచిత్తము నట్లే మత్తభృంగియయ్యెను. విజ్ఞానకతమున నేమి, చరిత్రమహత్త్వము కతముననేమి రామమిశ్రుడు రామానుజశిష్యులలో నగ్రస్థానము నలంకరించెను. రామమిశ్రునెడల రామానుజుడు విశేషానురక్తి గలిగి యుండెను.

యామునాచార్యుని శిష్యులలో నొక్కండైన వరరంగనాయకుడు శ్రీరంగనాథుని ముదల నొదల దాల్చి కంచి కరుదెంచి రామానుజస్వామిని శ్రీరంగమునకు గొనిపోవుటకై శ్రీవరదస్వామి యనుమతి నందెను.

శ్రీరంగవాసులును ఆలయాధికారులును శ్రీరంగనాథుని సన్మానించి సేవించునట్లే జగద్గురువును సన్మానించి సేవించిరి. ఆచార్యుడు స్వామిసమ్ముఖమున కరిగి అచ్చోట గొంతసే పొక్కరుండు ధ్యానముచేయదొడగెను. జగదీశు డపుడు జగద్గురువుతో నిట్లని వచించెను. "వత్సా! నీపై ఉత్కృష్టమైన

కర్తవ్యభారమును నిలుపుచుంటిని. సులభమార్గమున నన్ను జేరుటకై దేవ మానవులకు చేయూత నొసగుము. ధర్మమును శత్రువుల బారినుండి రక్షింపుము. ప్రజలు శుభ్రాత్ములై సచ్చరిత్రులై సత్యవాదులై యుండునట్లు ప్రబోధము సలుపుచుండుము. సమస్తప్రాణులను సేవింపవలయునని వారికి బోధింపుము. చెప్పనేల వారిమాననములను విజ్ఞానముతోడను, హృదయములను ప్రణయము తోడను నింపుము. జాతిమతభేదములనుగాని ఐశ్వర్యదారిద్ర్యభేదములనుగాని బలాబలభేదములనుగాని పాటింపకుము. ప్రతి జిజ్ఞాసువునకు వైష్ణవమతమును బోధింపుము. సమస్తజగత్తులమీదను దేవమానవులమీదను నీకధికార మొసగు చున్నాము. 'స్వర్గమర్త్యాధినాధుండ' ను (ఉదయవర్) బిరుదు నీకొసగు చున్నాను. "

శ్రీరంగనాథుని చరణములకు ప్రణమిల్లి "స్వామీ! నీయాజ్ఞ ననుస రించి నడచెదను. నీకటాక్షము కతన శక్తిసామర్థ్యములనంది తోడిమానవు లను సేవించుచు నిన్ను భజించుచుందును" అని రామానుజు డుత్తర మొసగెను.

అనంతరము రామానుజస్వామి శ్రీరంగనాథాలయాధికారమును వహించి, ఉపాసనాది కార్యములందలి లోపములను మాపుజేసి తనకాలము నంతను మందిరమునందే గడపదొడగెను.

యామునాచార్యుని గలసికొనుటకై కంచివీడి శ్రీరంగమునకు పోవు నప్పటికి రామానుజు డిరువదియైదేండ్లప్రాయమువాడై యుండెను. తన ముప్పది రెండవయేట నాతడు సన్న్యాసి యాయెను. నలువది సంవత్సరము లాతడు శ్రీరంగమునందే యుండి అనంతరము అనివార్యమైన హేతువులవలన మైసూరు నకు జనినాడు.

## రామానుజుని యాచార్యులు

వైష్ణవమతరహస్యములం దొక్కొక్కదానిని భావిసమయ జగద్గురువు నకు తెలుపుడని యామునాచార్యుడు తన యంతేవాసుల కాజ్ఞయొసగెను. మహాపూర్ణుడు రామానుజుని ప్రథమగురువై 'ద్వయ' మహామంత్రము నాతని కుపదేశము గావించెను. తిరుపతి పోయినపుడు రామానుజుడు మేన మామయైన శ్రీశైలపూర్ణునివలన రామాయణమునందలి రహస్యములను

తెలిసికొనెను. వరరంగనాయకు నాశ్రయించి ఆఱునెలలలో ఆళ్వారుగేయము లను మార్గిపద్ధతి ననుసరించి ఆలపించుట నేర్చెను. ఈ గేయాలాపనము దేవ గానాలాపన మనబరగెడిది. దేవగానమును దాక్షిణాత్యులు విస్మృతించుట దురదృష్టము. యామునకృత 'చతుశ్శ్లోకి', 'స్తోత్రరత్నము' లను కూడ యతి రాజు కంఠస్థము గావించుకొనెను. శ్రీరంగనాథుడు గోష్ఠిపూర్ణునకు స్వప్న మున ప్రత్యక్షమయి రామానుజునకు మంత్రోపదేశము గావింపుమని యాత నితో తెలిపెను. తానుకూడ శ్రీరంగనాథుని యాదేశమునుగొని రామాను జుడు గోష్ఠిపూర్ణుని సేవింపజనియెను. ఆయాచార్యుని కటాక్షము నందుట సాధారణకృత్యముకాదు. మంత్రోపదేశము నర్థించుచు యతిరా జెన్ని పర్యా యము లాతనిచెంత కరిగినను "తదుపరి రమ్ము" "తదుపరి రమ్ము" అనియే గోష్ఠిపూర్ణుడు పలుకుచుండువాడు. ఈ రీతిగ పదునెనిమిది పర్యాయములు కడచినవి. రామానుజుడు తననహజసహనశాంతులను గోలుపడలేదు. ఎట్టులైన మంత్రోపదేశమునంది యుద్దేశసిద్ధిని గనవలెనని ఆతడు నిశ్చయించెను. రామానుజుని వజ్రసంకల్పమును పరీక్షించి పరితృప్తుడై వైష్ణవమత మహా రహస్యమును ఎఱుంగుటకై ఆతడర్హుడని గ్రహించి గోష్ఠిపూర్ణుడు "మఱి యొకసారి రమ్ము నీకోరిక దీర్చెదను. నీవొంటరివై రావలెను సుమ్మా" అని యువకునితో పలికెను. రామానుజు డట్లే యొనరించెను. అష్టాక్షరీమహా మంత్రము" నుపదేశించి అందలి గభీరరహస్యమును గోష్ఠిపూర్ణు డాతని కెఱింగించి "వత్సా! నీయొక్కనికై మాత్ర మీమంత్రోపదేశ ముద్దేశింప బడినది. నీవీమంత్రము నెవ్వరికిని నుపదేశింపరాదు సుమీ!" అని నొక్కి వక్కాణించెను.

మఱునాడు రామానుజస్వామి రంగనాథాలయమునకేగి ఉత్సవమునకై యరుదెంచిన శ్రీవైష్ణవులకు రావించి తానంతమున్న వడసిన అష్టాక్షరీ మహామంత్రమును అంతరార్థసహితముగా వారి కుపదేశించెను.

ఈయుదంతము గోష్ఠిపూర్ణుని చెవులబడియెను. అతడు కోపములో మండిపడినాడు. ఎప్పటివలె రామానుజు డాతనిని జేరినంతన "నిన్ననేకదా ఏవు నాకడ మంత్రోపదేశ మందితివి" అని వంబి తీవ్రస్వరమున నాతనితో పలికెను.

"చిత్తము మహాప్రభూ"

"ఆమంత్రము నెవ్వరికి నుపదేశింపవలదని నీతో గట్టిగా చెప్పియుంటిని గదా!"

"స్వామీ! చిత్తము"

"బహిరంగప్రదేశమున దాని నీ వసంఖ్యాకుల కుపదేశించితివని వింటిని"

"చిత్తము స్వామీ; నే నట్లే యొనరించితిని"

"నీయాచార్యునిమ్రోల నాడినమాటకు వ్యతిరేకముగా నడచిన యెడల నీకెట్టిముప్పు కలుగునో యెఱుగుదువా!"

"నిక్కముగ నెరుగుదును. నేను ఘోరనరకమున పడిపోదును"

"ఇట్లని యెఱిగియుండియు నీ వట్లొనరించితివి!"

"చిత్తము మహాప్రభూ; నేనట్లే యొనరించితిని"

"కారణమేమో తెలుపగలవా?"

"స్వామీ! కారణమిది. మీయుపదేశములను నేనొక్కరుండను మాత్రమే ఎఱిగియుంటినేని నేనొక్కండనే అభ్యుదయము నందగలను. ఒక రుండను మాత్రము వైకుంఠమును ప్రవేశింపజాలుదును. నే నెఱిగిన దానిని పలువురకు దెలిపితినేని వారు మఱికొందఱిని నాయుపదేశమున బద్ధదీక్షితుల జేయగలరు. అపు డసంఖ్యాకులు భగవంతుని చరణముల జేరుకొనజాలుదురు కదా! ఉపనదుల కలయిక కతన విశాలమై మహత్తరమగు మధురధునీమ తల్లివలె గురూపదేశము పూర్వోక్తకర్తవ్యనిర్వాహణమువలన విస్తృత మహత్త్వసమన్వితమై పలువుర కుపయోగించును. ఆచార్యునాజ్ఞ నుల్లంఘిం చుటవలన నాకు నరకప్రాప్తియగుట నిశ్చయమే. ఈయాజ్ఞ నుల్లంఘింపనేని నాకు వైకుంఠవాసము లభించుటయును సత్యమే. కాని అనేకు లజ్ఞానమందును దుఃఖమందును మునిగియుండగా నేనొక్కరుండను వైకుంఠమున కులుకుట మేలా? అని నాలోనేను వితర్కించుకొంటిని. పరముక్తికాంక్ష నాహృదయ మును పరితోషభరితమొనరించినది. ఒరుల యనంతయాధ్యాత్మికవిభూతికై నరకమున ప్రగ్గుటకంటె ఘనతరమై మహత్తరమైన కర్తవ్యము మఱొండు లేదని యూహించి నాలో నేను మిగుల నుబ్బితిని. కడుంగడు పవిత్రమైన

తమ నామధేయము నుచ్చరింపుచు తమ చరణకమలమును ధ్యానించుచు తమ యాశీస్సులను వారికి సమర్పించితిని ”

ఈవాక్కులను వినినంతన గోష్ఠిపూర్ణు డాశ్చర్యాన్వితు డాయెను. “ నాశిష్యుడనని తెలిసికొనుచు నాకంటె బహువిధముల నధికుండును ఘనతర మహిమగలవాడునునైన నీత డెవ్వరై యుండును ? ఆత్మసుఖము నించుకయు నాలోచింపక పరార్థజీవియై యొరుల చిదానందముకొఱకై నరకమున చిర యాతనము నందుటకై యీతడు నడుము గట్టుచున్నాడు. సాధారణ మానవ మాత్రుని హృదయ మిట్టి కారుణ్యశరధి కాజాలదు. వీనికి నే నాచార్యుడనని చెప్పుకొంటిని. నాగురువు నాకుపదేశించిన దానిని వీనికుపదేశించుటకై పెక్కుమాఱు లీతనిని నాచుట్టు ద్రిప్పించుకొంటిని. ఈతని కాచార్యుడ నగుటకు – ఆచార్యుడ నగుట కననేల – ఈమహాత్మునకు శిష్యుడనగుటకైనను నా కర్హతలేదని యిపుడు గ్రహించుచున్నాను. ఈతనిమహత్త్వమునందు నహ స్రాంశమైనను నాకు లేదు. ఈ యువకుని ఆంతరంగిక మహిమ నెఱిగియే యీతని కష్టాక్షరీమంత్రము నుపదేశింపుమని శ్రీరంగనాథస్వామి నాకు ముదల యొసగెను. గర్వమునుండియు అజ్ఞానమునుండియు నన్ని వింతరీతిని రక్షించుటకై ఈప్రభువే యీరీతిగ నవతరించియుండును. నిక్కముగ నీతడు నాప్రభువే. (‘ఎంబెరుమానార్’) ఇంతదనుక శ్రీవైష్ణవసిద్ధాంత మనబరగిన ప్రబోధశాఖ ఇకముందు రామానుజ సిద్ధాంతమని ప్రసిద్ధినందుగాక ! నారాయణ చరణో పాంతమున నాకెన్నటికైన చోటులభించునేని ఈమహాత్ముని సంపర్కభాగ్యము కతననే నాకది చేకుఱవలయును ” అని నంబి తనలోతాను వితర్కించుకొని అత్యద్భుతమైన ఆంతరంగిక పరివర్తనమును హృదయపరిణతిని పడిసి శ్రీకృష్ణ ప్రబోధితమైన “ చరమ శ్లోకము ” ను అందలి గభీర రహస్యములను శ్రీరామానుజస్వామి కుపదేశించెను.

రామానుజ ప్రబోధమహత్త్వ మాతని జీవితమహత్త్వమునకు పునాది యయ్యెను. మహాత్ములైన ఆచార్యులందు నయితము ఈతనికి ప్రత్యేకస్థానము కలదు.

పరివ్రాజకుడైన శ్రీరామానుజస్వామి దేశదేశములందు సంచరించి ప్రజాళికి ధర్మోపదేశముగావించి విశాల దిశావలయమున కెనవచ్చు నిజాంత

రంగములోనికి పండితులకే కాక పామరులకు సయితము తావల మొసగి సర్వజనసముద్ధరణమును వలచి లోకకళ్యాణకాంక్షియై వెలిలినాడు. శ్రీరంగ నాథుడే రామానుజస్వామిని పూర్వోక్త సముద్ధరణ కర్తవ్యమున బద్ధదీక్షితు గావించెననియు అనవరతము రామానుజస్వామికిని రంగనాథస్వామికిని సన్నిహిత సంపర్కముండెడిదనియు వైష్ణవగ్రంథకర్తలు వాకొనుచుందురు. ప్రత్యక్షముగ జగదీశుడు మనుష్యరూపమున శ్రీరామానుజస్వామికి గోచరించి నను గోచరింపకున్నను ఈశ్వరాదేశము నాతడాంతరంగికముగ వినుచుండు వాడు. ప్రపంచమందలి మహాత్ములును, మహాభక్తులును, ప్రవక్తలును, యోగీంద్రులును, రసావేశమున నాత్మవిస్మృతులగు కవిపుంగవులును తన్మ యత్వమునందు ఆనందవ్రతులును, శిథిలమెఱుంగని సమాధియందును, అవి చలితధ్యానమందును, మహితమననమందును మహిమోపేత నిదిధ్యాసనము నందును, భావబంధుర ప్రార్థనమందును ఆరితేఱిన కళోపాసకులును సౌందర్య వ్రతమందును సత్యపాలనమందును సిద్ధహస్తులైన మహనీయ గుణగరిష్ఠులును, పరమహంసలును, ఈరీతి యాంతరంగికానుభూతి నందుచుందురు. అంతరదృష్టి సమక్షమున విచిత్రదృశ్యపరంపరను విలోకించి వీ రద్భుత సృష్టిని సలుపు చుందురు. వీరిహృదయము లుద్వేగభరితములై యుండును. వీరిమానసములందు భావభువనములు దిర్దిరదిరుగుచు వీరు మానమును చాలించు ముహూర్తము లందు ఆత్మవ్యక్తీకరణముగాంచును. తపసుకతన అనుభూతికతన నిట్టి యద్భుత శక్తులు జీవితాంగణమున ప్రజ్వరిల్లవు ? స్థితప్రజ్ఞయనుడు, దృఢనిశ్చయమనుడు, యిచ్ఛాశక్తియనుడు, వజ్రసంకల్పమనుడు, దివ్యశక్తియనుడు, పరిణతినందిన అంతరంగమందు ఉద్భవించి ప్రజ్వరిల్లగలవు. ఇవియే మానవుని జగదీశునకు మిగులగూర్చు నెచ్చెలికావించును. ఈ నెచ్చెలియే పరమార్థమును చేపట్టిన విజయుడై తనధర్మక్షేత్రమున దేవదత్తమును పూరింపగలడు.

ఉత్కృష్టమైన తనధర్మమును నిర్వహించుచు యతిరాజుఅయిన రామా నుజస్వామి రంగనాథదేవాలయపాలనమును తానే నిర్వహించుచు తొల్లింటి లోపములను సంస్కరించెను.

శ్రీరంగమున యామునాచార్యుని దర్శించుటకై కంచినుండి యిరువది యైదవయేట నడచిపోయి ముప్పదిరెండవయేట సన్యాసియై నలువదేండ్లు

శ్రీరంగమున కడపి అనివార్యముగ మైసూరునకు పోవలసిన ముహూర్తము నందే కొండొకవడి యాతడు రంగనాథధామమును విడిచెను.

శ్రీయామునాచార్యస్వామి చరణోపాంతమున నధివసించి మనసార బోధామృతమును గ్రోలుభాగ్యము శ్రీరామానుజస్వామికి లభింపకున్నను ఆ యాచార్యుని యాజ్ఞ నౌదలధరించిన మహాపూర్ణ, శ్రీశైలపూర్ణ, మలధర వరరంగగాయక, ప్రభృతుల ప్రబోధములకతన బహుళమతరహస్యము లాతని కవగతము లయ్యెను.

మహనీయగుణోపేతులైన భారతవిజ్ఞానులందు యతిరాజునకు మహోన్నతస్థానము లభించుటకు హేతువు ఆతనిజీవితము ప్రత్యేకమహత్త్వముతో వెలయుటయే యై యున్నది. మహిమోపేతసంప్రదాయమునకు అంజలి ఘటించువాడయ్యు స్వకీయప్రజకును నైసర్గిక ప్రతిభకును స్వతంత్రశక్తిని వ్యక్తిగతధృతికిని పనికల్పించియే నిశితవిమర్శనశక్తిని ప్రయోగించియే హేతుశక్తిని వినియోగించియే ధర్మబద్ధమైన తనకర్తవ్యము నాతడు నిర్వహించినాడు. హిందూధర్మము వ్యక్తిగతముక్తినిగాక జాతిముక్తిని దృష్టియందుంచుకొనె నను విషయము కడుంగడు చక్కగ రామానుజస్వామి ఋజు వొనరించినాడు. ఇహజీవితమునుండి పాఱిపోవుటయే పరలోకజీవితముపై మనసుంచుటయే హిందువుల యాశయమని పలుకు ప్రతికూలమతస్థుల యపోహాలను తునియలుగా ఖండించునది రామానుజస్వామిజీవితము! స్వీయమతాంగణమును విశాలమొనరించి అధునాతనయుగమున విశేషప్రశస్తినందిన సేవాధర్మమునకు శతాబ్దులకుమున్నె ఆత డాత్మజీవితమును ఆటపందిరి గావించినాడు. యుగధర్మమును పాటింపవలసిన అక్కఱ ఎదుర్కొనినపుడు మతమహత్త్వము సంకుచితాంగణమునగాక విశాలప్రజాంగణమున వ్యక్తమగు నను సంశము ఋజువుగోరినపుడు ప్రతికూలాభిప్రాయవల్లరులను పరపరగోయజాలు నిశితభావ మను గొడ్డలి ప్రయోగింపవలసిన కర్జము అవార్యమై నిలిచినపుడు మతమహత్త్వయుగములపొందును ప్రత్యక్షదృష్టాంతమున ప్రకటింపవలసినపుడు ఉదాత్తగుణజ్యోతిర్మండలమైన రామానుజచరిత్రము జిజ్ఞాసువుల కద్భుతాలోకమును జూపును. మహితవిశిష్టాద్వైతభావసమూహమును బహుళహృదయతామరసములనుండి ప్రఫుల్లము లొనరించినది రామానుజచరిత్రయే.

ఆతని యాత్మవిశ్వాసము మంచుమలపునాదికి సహపాఠియగుటచేతనే, ఆతని సంకల్పశక్తి వజ్రముకంటెను దృఢతరమగుటచే, భావశబలత కీడైన కార్యసఫలతను కనులజూడవలెననుకాంక్ష ఆతని హృదయమున ప్రజ్వలితఅగ్నికీడై యుండుటచేతనే ఆతనియాశయములు అస్తమయ మెఱుగని దివ్యజ్యోతులకెనయై యుండుటచేతనే నిజబుద్ధి కుచితమని తోచిన భావము ననుష్ఠించుతఱి స్వీయకురుక్షేత్రమున స్వీయవిశ్వాసముచే విజయధ్వజమెత్తింప కృతనిశ్చయుడైన ముహూర్తమున రామానుజస్వామి తన కారాధ్యదైవతమయిన ఆచార్యుని ఆజ్ఞను ప్రతిఘటించుటకు ముందంజవేసినాడు. గురు నాదేశమును గణింపక అష్టాక్షరీమహామంత్రము ననంఖ్యాకు లగు ప్రజల కుపదేశింపలేదా! అవిద్యాపంకిలమున పలువురు పతితులై యుండగా శ్రీపతిచరణోపాంతమున నిముసమైన నధివసించుట కిష్టపడనని రామానుజస్వామి ముక్తకంఠముతో పలుకలేదా! మంత్రప్రబోధముకతన పలువురకు జ్ఞానదృష్టిని ప్రసాదించి వారిని వైకుంఠమున జేర్పజాలుదునని వచించి అతడు పరమపరితోషసంభరిత స్వాంతుడు కాలేదా!

భారతసంయములు స్వాంతముక్తినిగోరి అనవరతము వనవాటికలయందు ముక్కులు మూసికొనియుండువారు కారనియు ప్రపంచమునకును వారికిని ఎట్టిసంపర్కములేదని పలుకు వారిమాట బూటకమే యనియు సంఘధర్మమును నెఱపుటకై పరార్థజీవితములను కడపుటకై స్వకీయసుఖభోగములకు వారు నీరువదలి మహాత్ములై వఱలిరనియు నీచరిత్ర చాటుచున్నది. ఉదాత్తభావములను మనసుననింపి వారు దైవికజీవితమును స్వీయభావానుష్ఠానమునకు ఆటపందిరి గావించుచుండువారనియు ఇట్లొనరించుతఱి భయసంశయములు వారిని జేరక దూరము తొలగిపోవుచుండెడివనియు ప్రత్యేకించి రామానుజచరిత్రమును పరిశీలించువారు గ్రహింపగలరు. బలవత్తరమైన పశ్చిమసభ్యతావిజృంభణమును ప్రతిఘటించి మహత్తరమైన భారతసంప్రదాయమునకు కేలుదోయి మొగిచి మహామహిమోపేత హిందూధర్మపతాకమును పూర్వార్ధపశ్చిమార్ధగోళములయందు నెలకొలిపిన వివేకానందస్వామి రామానుజదృష్టాంతములపై కన్నుంచి ఆతని భావములను మననమాచరించుకొని వానినాత్మజీవితమునందును స్వీయరచనలయందును ప్రకటింపజాలినాడు.

గురుశిష్య బాంధవ్యము భారతభూమియందు గురుతరమైనను శిష్యుడు తన వ్యక్తిత్వమును చంపుకొనరాదనియు గురువుకంటె మిన్నయైనది ఆశయమనియు ఆశయచరితార్థత నవలోకించుట అంతేవాసి జీవితపరమావధి యనియు భావగ్రహణ మందును ఆశయారాధన మందును క్రియానిర్వహణ మందును ఆచార్యుడు నెరసు జూపెనేని శిష్యుడు దానిని వ్రేలెత్తి చూపవలెననియు హిందూసంప్రదాయము వేనోళ్ళులజాటుచున్నది. తమ యంతేవాసులు తమ తలదాటవలెనని యాశించిన యాచార్యులు మన నేలయందున్నారు. భీష్ముడు తన యాచార్యుని మించెను. రామానుజుడు తన గురుపరంపరకంటె గురుతర మహిమను చూపజాలినాడు.

రామానుజుని యాచార్యులలో మలధరుడొకండు కదా! దివ్యప్రబంధ మండలి యొక శ్లోకమునకు ఈత డర్థము చెప్పునపుడు అది యపార్థమని చెప్పుటకును యామునప్రభువు అందలి భావమును వేఱుతీఱున వ్యక్తీకరించుటకును రామానుజస్వామి సంశయించినాడుకాడు. శిష్యప్రతిఘటనము మలధరుని మనస్సున కినుకబుట్టించినది. అయినను రామానుజమహత్త్వమును గోష్ఠిపూర్ణు డాతని కెఱిగించి తన హృదయమందువలెనే వాని హృదయమందును చక్కని పరివర్తనమును గలిగించెను. యతిరాజు జగద్గురువని వారిరువురునుకూడ గుర్తింపగలిగిరి. శ్రీపతి చరణోపాంతమున జేరు భాగ్యము తమకు అలవడుచో అట్టి యంతేవాసి మహిమయే అందులకు హేతు వగుననియు అట్టి గుణగరిష్ఠున కాచార్యులమగుట తమ భాగ్యమనియు వారు మురిసిరి. కృష్ణప్రబోధితచరమ శ్లోకమును గోష్ఠిపూర్ణుడు రామానుజున కుపదేశించి అందలి అర్థగాంభీర్యము నెఱింగించినాడు. శ్రీవైష్ణవసిద్ధాంత మనబరగుచు వచ్చిన మత ప్రబోధ మిక శ్రీరామానుజసిద్ధాంతమని ప్రశస్తి నందవలెనని యాతడు శాసించినాడు.

జటిలతాత్త్వికసమస్యలను పరిశీలించుతఱి పండితులతో బొనగు వాద ప్రతివాదములందు శ్రీశంకరునివలె శ్రీరామానుజుడు అనవరతము విజయమునే పడసెను. ఓటమినందినతజ్ఞులు తదనంతరము యతిరాజు నాశ్రయించి శిష్యులు కాజొచ్చిరి. వారణాసినుండి యరుదెంచిన పండితప్రవరుడు యజ్ఞమూర్తి యీ యంతేవాసులలో నొక్కండు. యతిరాజున కంతేవాసియైన నయంతర మీతడు దేవరాజముని యనబరగెను. సన్నిహితబంధువులు కొందఱు

శాక్యముని నాశ్రయించి ముని వృత్తియందు బద్ధదీక్షితులైనట్లు రామానుజ స్వామి చరణముల నాశ్రయించి సేవించి దగ్గఱచుట్టములు కొందఱు శిష్యులైరి. మేనమామయైన శ్రీశైలపూర్ణుని తనయుడు పిల్లన్ అను నాతడును పినతల్లి కొమరుడు గోవిందుడును అనంతల్వన్ మున్నగు తిరుపతివాసులతో యతి రాజు నొద్ద నుపదేశము నందిరి.

శ్రీయామునాచార్యుని మృతకళేబరము పొంత దానొసరించిన శపథ ములను పాలించు సమయ మాసన్నమాయెనని గ్రహించిన ముహూర్తమందే రామానుజస్వామి వేదవ్యాసుని బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానము వ్రాసి దానికి శ్రీ భాష్య మను పేరు పెట్టెను. అల్వన్, అన్డన్, దేవరాజము లీరచనమును నిర్వహించుటలో ఆచార్యునకు తోడుపడిరి. తత్వశాస్త్రమున ప్రాథమిక పరిజ్ఞానము మాత్రము కలవారికి సయితము సుబోధకమగునట్లు పూర్వోక్తవిషయమును యతిరాజు మరల "వేదాంతదీప" "వేదాంతసార" మను గ్రంథములందు వ్యక్తీకరించెను. "భగవద్గీత" కును "ఉపనిషత్తు" లకును అతడు వ్రాసిన భాష్యములును "వైకుంఠ" మును గుఱించియు అతడు వ్రాసిన గద్యగ్రంథములను పూర్వోల్లిఖితగ్రంథములట్లు భారతతాత్త్వికాంగణ మున ప్రశస్తినందినవి. గ్రంథరచన నిర్వహణమువలన తన ప్రతిజ్ఞలలో నొక దాని నాతడు పాలించెను.

భక్తుల యాహ్వానములను మన్నించి శిష్యగణపరివృతుండై రామానుజ స్వామి భారతభూమియందుగల తీర్థములను సేవించి ఆలయముల నుద్ధరించి అర్చకులతో వాదించి ఆదర్శపూజావిధానమును వారికి గఱపినాడు. పరమతస్థు లతో ప్రసంగించి పండితప్రకాండులతో వాదించి భావబంధుర తాత్త్వికగోష్ఠి కతన అసంఖ్యాకులైన జిజ్ఞాసువుల మానసముల నాకర్షించినాడు. విజ్ఞానధనుల ప్రణుతులను పడసినాడు. తిరునగరిలోని నమ్మాళ్వారు సమాధిచెంత తానధి వసించినపుడు శ్రీశైలపూర్ణుని తనయుని స్వీయజ్ఞానపుత్త్రుని గావించుకొని వానికి నమ్మాళ్వారను నామధేయ మొసగి తన రెండవ ప్రతినను నెరవేర్చుకొని నాడు. కాలక్రమమున బాలకుడు మహాపండితుడై శఠకోపస్వామి శ్లోకము లకు సంస్కృతమున చక్కని వ్యాఖ్యానమును వ్రాసెను. ఇది "అరయిరప్పడి" యనబరగుచున్నది.

కాశ్మీరమునకుపోయి వాదప్రతివాదములం దచటి పండితుల నవలీలగ నాచార్యుడోడించెను. సరస్వతీదేవి యాతని పాండితికి మిగులనలరి "శ్రీభాష్య కారు" డని అతనికి బిరుదు నొసగినదట. వాత్సల్యచిహ్నముగ హయగ్రీవ స్వామి విగ్రహమును నిత్యారాధనమునకై వాని కామె ప్రసాదించినదట.

భారతవర్ష పరిభ్రమణమును ముగించి శ్రీరంగమునకు మరలి ఆలయ మున తన పవిత్రకర్తవ్యమును యతిరాజు నిర్వహింపసాగినాడు.

ఆతని అంతేవాసులలో అగ్రగణ్యుడైన ఆల్వన్‌యోగికి శ్రీరంగ నాథుని కటాక్షము కతన నిరువురు పుత్రులు కలిగిరి. వారికి పరాశర వేద వ్యాసులను అభిధేయములు ప్రసాదించి రామానుజస్వామి తన కడగొట్టు శపథమును పాలించినాడు.

ఆకాలమున దాక్షిణాత్యమును పాలించు చోళరాజు శైవమతస్థుడై వైష్ణవసంప్రదాయమును అనుష్ఠించువారిని పీడింపదొడగెను. రామానుజస్వామి వైష్ణవమతాచార్యులం దగ్రగణ్యుండనియు, కేశవునికంటె శివుండే ఘనుడని ఆ పరివ్రాజకచక్రవర్తి పలికినయెడల దేశవాసులెల్లను తృటిలో శివభక్తు లయ్యెదరనియు ఆ తేనితో నెవ్వరో చెప్పిరి.

తోడనే యారాజు రామానుజుని తనయాస్థానమునకు గొనిరమ్మని చారులను శ్రీరంగమునకు పంపినాడు. అల్వాన్ ఆచార్యునకు స్నానాదికృత్య ములు చేయించుచుండినపుడు చారు లతనిదరి కరిగి తమ తేని యాదేశము నాతని కెఱింగించిరి. రాజాజ్ఞను గురువునకు తెలుపక ఆచార్యుని వస్త్రములను తాను ధరించి ఆ యంతేవాసి వారివెన్నంటిపోయెను. ఆతనివలెనే పయనమైన మహా పూర్ణుడు కొంతదూరమరిగిన పిదప వానిని మార్గమున కలసికొనెను.

రామానుజస్వామి రాలేదనియు తనయంశవారైన శిష్యుల నిరువుర నాతడు పంపెననియు మంత్రులు చోళరాజుతో చెప్పిరి. ఆగ్రహముతో మండి పడి శివునిమించిన దేవుడులేడని పత్రముపై వ్రాసి యీయవలసినదని అతడు వారిని నిర్బంధించినాడు. కాని తేని నిరంకుశత్వమునకు వారు శిరములొగ్గిరి కారు. క్రూరుడై రాజు వెంటనే వారిగుడ్లు నూడబెఱికించినాడు. ఆ యత్యా చారముకతన వృద్ధుడైన మహాపూర్ణుడు మరణించినాడు. దుస్సహయాతన ముతో పొగులుచు అల్వాన్ శ్రీరంగమునకు మరలినాడు. గురు నందు గానక ఆతనియాగమనము నపేక్షించుచు అలగరుకోయిలయం దాతడు వసించినాడు

రామానుజస్వామి ఆసమయమున మైసూరులో వసించుచుండెను. మిత్రులకు వాటిల్లిన విపత్తునెఱిగి అతడు మిగుల కటకటంబడి చోళరాజువలన నాతనికికూడ నెట్టిముప్పు కలుగునోయని యడలుచున్న యంతేవాసు లెంత చెప్పినను వినక కాల్నడకను పయనించి మేల్‌కోట్‌నకు పదునాఱుమైళ్ళ దూర మునను్న టొన్నూరు చేరుకొనెను.

హొయిసల వంశజుడైన విఠ్ఠలరాయ లపు డచ్చోటున పాలకుడై యుండెను. అతడు జైనమతస్థుడు. రామానుజస్వామి మహిమ నెఱింగి అతడు స్వామిజీ శిష్యుడై పరమభాగవతుడాయెను. ఆచార్యుడు వానికి విష్ణువర్ధనుడను పేరు పెట్టెను. తిరునారాయణపురమున విష్ణువర్ధను డొక కేశవాలయమును నిర్మించెను. ఏబదియిరువురుశిష్యుల నందునిలిపి యతిరాజు నిష్క్రమించెను. "గోష్ఠిపూర్ణుడుకూడ నిష్క్రమించెననియు దురంతరమైన అత్యాచారమునకు చేయిజేసికొనిన చోళరాజు తీవ్రవ్యాధిపీడితుడై దుస్సహమైన యాతనముతో యమపురి నలంకరించెననియు" కొందఱుశిష్యు లాతని గలసికొని పలికిరి. శిష్యపరివృతుడై యతిరాజు శ్రీరంగమునకు మరలెను.

అస్తమించిన ఆచార్యులకు వాటిల్లినముప్పు రామానుజస్వామి హృదయమునకు చాలవేదనము నొదవించెను. వారియాత్మలకు శాంతిచేరుటకై జగదీశుని ప్రార్థించి యతిరాజు భక్తిభరితహృదయుండై శ్రాద్ధక్రియలను నిర్వహించెను.

రంగనాథునియొద్ద నాతడు సెలవుతీసుకొని పోయినపుడు ఆతనికి డెబ్బది తొమ్మిదేండ్ల వయసుండెను. మరల రంగనాథధామము నాతడు చేరుసరికి వానికి నూటరెండేండ్ల వయసుండెను. స్వీయనగరిలో యతిరాజు అసంఖ్యాకుల స్వాగతమునందెననియు, భగవంతుడైన రంగనాథుడాతని నాదరాను రాగములతో చెంతజేర్చికొనెననియు వైష్ణవగ్రంథములు తెలుపుచున్నవి.

స్వస్థానమునకు మరలిన యనంతరము రామానుజస్వామి మహాపూర్ణుని దుహితను కలసికొని ఆమె దుఃఖమున పాల్గొని మహాపూర్ణుని మహత్త్వమును బహుభంగుల ప్రశంసించి తండ్రి దుర్మరణము పాలబడుటచే మిగులపొగులు యభాగిని హృదయమునకు సాంత్వనమొనగెను. ఆచార్యుడు మరలివచ్చినంతన అలగరకోయిలనుండి ఆతురపాటున అల్వాన్ అరుదెంచి ఆతనిపాదరాజీవములపై

బడెను. ఆతనిదుస్థితిని గుఱించి గురువర్యుడు మిగుల వగచెను. "మహనీయ గుణములతో వెలయు మహాత్ముడవునీవు. నాకై నీవు నీకన్నులను గోల్పోయితివి. నాకన్నులను నిలుపుటకై నీ కన్నుల నారాజు క్రౌర్యమునకు అప్పగించితివి. నాకు సౌఖ్యము చేకూర్చుటకై నీజీవిత సౌఖ్యమును పరిత్యజించితివి. నీవు త్యాగమూర్తివి. మహాపూర్ణుడు నేత్రములతో నుసురులు బాసినాడు. ఆహా! ఈసమయములో నెట్టి సంఘటనలు బయలుదేరినవి" అని రామానుజస్వామి ఉద్వేగభరితాంతఃకరణుడై వానితో పలికెను.

అల్లాన్ మహాపూర్ణుల పవిత్రాత్మల దలచి అంజలిఘటింపని వారెవ్వరు నుండరు. ఉత్కృష్టాశయసిద్ధికై మహత్తరాదర్శవిజయమునకై ఆత్మసుఖములను ఆత్మవాంఛలను ఆత్మశరీరములను ఆత్మజీవితములను పరిత్యజించువారు వసుంధరలో నెందఱుందురు! ఇట్టివారు జగతియందు అరుదుగ నుదయించుచుందురు. యుగపరిస్థితులు మాఱుతఱి మానవాదర్శములును వ్యక్తిగత భావములును పరివర్తన మందుచుండును. ఉదారాశయారాధనమునకు సత్యయుగమున విశేష ప్రాముఖ్య ముండెడిది. యంత్రయుగమున నారాధనము ఉపాసనము వ్రతము దీక్ష మున్నగు ఆధ్యాత్మిక దైనికక్రియలు వెనుకబడినవి. మేధాశక్తి అత్యద్భుతముగ వృద్ధినందినది కాని హృదయశక్తి సంకుచితమైనది. నైసర్గికమైన మనుష్యశక్తి, ఘనతరమైన ఆంతరంగికశక్తి, మహిమోపేతమైన నవనవోన్మేషశాలినియైన ప్రతిభాశక్తి, కళాభివృద్ధికిని గురుగుణాభివృద్ధికిని సంబంధించిన ఆత్మశక్తి ఉపాసనము కొరవడుటచే మనన నిదిధ్యాసనములకు చెఱుపుఘటిల్లుటచే ఏకాగ్రదృష్టికి భంగము వాటిల్లుటచే అవిచలితసమాధి అనుష్ఠానమునుండి దూరస్థమగుటచే వృద్ధినందుటలేదు. సాధనాభావముకతన మనుష్యహృదయస్థ దివ్యశక్తి ఆత్మప్రకాశమునందక పశువృత్తి విజృంభింపనిచ్చుచున్నవి. ఈశ్వరునకు దూరస్థుడైన మానవుడు యంత్రమునకు సన్నిహితుడైనాడు. జంత్రమునకు క్రీతదాసుడైనాడు. ఆర్యవిజ్ఞానము పునరుద్ధరణమును గాంచిననాడే హిందూ సంప్రదాయము ప్రతికూలశక్తులను ప్రతిఘటించి విజయపతాకమును చేబూని ముందంజవేసిన ముహూర్తమందే భారతసాహితి నవనవోన్మేషమై వెలయు నిముసమందే ప్రాచీనసభ్యత మరల తన వాద్యవిశేషమును ప్రయోగించిన ముహూర్తమందే, ఎందో ఎగసి మరలస్వీయప్రాదము జేరి తన సంపర్గమహత్త్వము

కతన దానిని కమలమండితమొనరించు కలహంసవలె సత్యయుగము భారత హృదయము మీదికి నెగసివచ్చి దానిని సౌందర్యసందీపిత మొనరించును. సత్యయుగావిర్భావమునకు తపించు మహనీయులు భారతదిశావలయముపై నికనైన గోచరించితీరవలెను. ఆత్మనిగ్రహము, ఆత్మవిశ్వాసము, ఆత్మజ్ఞానము నందుటకై వీరు తపింపవలెను. భౌతికములుకాని ప్రపంచములు, అవాఙ్మాన సగోచరములుగాని ప్రపంచములుకూడ కలవని అంతరదృష్టితో వీక్షింపవలసిన అద్భుతసృష్టి ఎంతేనికలదని భౌతికజీవనమును సుఖమున కడపినంతన శారీరక వాంఛలను దీర్చుకొనినంతన మానవస్వభావము పరిణతినొందదని సంసారవిధు లను దైనిక సాంఘికవిధులను నిర్వహించినంతన సంపూర్ణజీవితోద్దేశములు నివ్వటిలవని సమస్తశక్తులును సమధికరీతిని వృద్ధినందవలెనని మరల ఋగ్వేద వాక్కులతో మనము ప్రార్థింపవలెనని శారీరకదార్ఢ్యమును నిశితబుద్ధిని ఆధ్యాత్మిక విభూతిని అలవఱచుకొనుట తమ సన్నిహితకృత్యమనియుఅపరాధ మును ఆదర్శములమీదను గ్రహములమీదను మోపక ఆత్మపరిశీలనమువలన ఆత్మహృదయములందలి నెరసుల నవలోకించి వానిని తొలగించి ఘనతర చిత్తపరిణామమునంది సత్యప్రదీప్త సౌందర్యసందీప్త ఆనందగర్భిత శాంతియుత సంపూర్ణజీవితమును గడపుట తమ పవిత్ర కర్తవ్యమనియు జిజ్ఞాసువు లెఱిగి జగతియందు నిత్యకల్యాణమును పచ్చతోరణమును నెలకొలుపవలెను. భావ తత్త్వముకతన ప్రబోధపటుత్వముకతన దృష్టాంతమహత్త్వముకతన లోక కల్యా ణము చేకూర్చిన మహనీయుల జీవిత చరిత్రలను పరిశీలించుతఱి అద్భుతమైన ఆంతరంగికశక్తి యలవడును. సంపూర్ణజీవితాశయసిద్ధిని పురికొలుపు విజ్ఞాన మిట్టి చరిత్రలయందు వెలయుచుండును.

రామానుజజీవితమహత్త్వముపై మనసుంచి అల్వాన్ మహాపూర్ణులు మహనీయగుణగరిష్ఠులైరి. తమ యాచార్యునివలె నాత్మవిశ్వాస మహత్త్వ మెట్టిదో వీరుచూపజాలిరి. వీరు సత్యారాధకులు. సత్యమునకు సర్వోత్కృష్ట స్థానమొసగి దాని కంజలిఘటించిన మహనీయులు సత్యవిజయమునకై రామా నుజస్వామి తనయాచార్యులను సయితము మార్కొనుటకు వెనుకాడినాడు కాడుకదా! సత్యవిజయమునకై అల్వాన్ మహాపూర్ణులు దౌష్ట్యము నెదుర్కొ నుటకు శంకించిరికారు. తమ కన్నులను తమ యుసురులను స్వీయజీవితాశయ

సిద్ధికై సమర్పించుటకు సంయిశించిరికారు. వీరి భౌతికశరీరములు శిథిలములైన నేమి, వీరు స్థాపించిన ధర్మము దివ్యదేవాలయమువలె నేడును నిలచియే యున్నది.

భూతలమున తన కర్తవ్యమును నిర్వహించి రంగనాథరామానుజుల సెలవుగొని అల్వాన్ వైకుంఠమును జేరుకొనెను. ఆతని తనయులైన పరాశర వ్యాసులు రంగనాథుని సేవించుచు రామానుజ గోవిందుల ప్రబోధములను పడయుచు వచ్చిరి. పరాశరుడు తనయనంతరము జగద్గురువై యుండవలెనని రామానుజస్వామి వాంఛించినాడు.

అన్డన్ అను నంతేవాసి ఆచార్యుని రూపమున నొప్పు మూడు విగ్రహములను నిర్మించినాడు. యతిరాజు వాని నాలింగన మాచరించుకొని వాని యందు భావప్రతిష్ఠ గావించినాడు. గురుమహిమ దానియందు గలదని విశ్వసించి శిష్యులు వాని నొక్కటొక్కటిగ శ్రీపెరుంబూదూర్, మేల్కోట్ శ్రీరంగములయందు నెలకొలిపిరి.

ఇహజగతియందు తనకర్తవ్యము ముగియు టెఱిగి వైకుంఠమునకు మరలి పోవుటకై రామానుజస్వామి సన్నాహము సలుపసాగినాడు. పరాశరుని రంగనాథస్వామి సముఖమునకు గొనిపోయి అంతదనుక ఆలయసేవకులు తనకు జేయుచువచ్చిన సపర్యలను వారిచే వానికి జేయించి ఆచార్యపీఠస్థానమున నాతని నాసీనుజేయుటకు వలయు నవస్థగావించి రామానుజస్వామి విశేష పరితోషమందినాడు. స్థానస్థానములనుండి శిష్యులను ఆహ్వానించి మహోత్సాహముతో యతిరాజు వారికి మహోపదేశముల చేయదొడగినాడు. "డెబ్బది రెండు రంగారుబంగారుమాట" లనియు "పది యాదేశము" లనియు నీసమయపు ప్రబోధములు వ్యవహరింపబడుచు వచ్చెను.

అసంఖ్యాకులైన తన శిష్యులకు యతిరాజు దేవరాజముని ఎంబర్ అన్డన్ కురుకేశ్వర మధ్యమార్య, పరాశరభట్ట వ్యాసుల కప్పగించినాడు. ఆలయమున సేవసలిపిన వారినందఱిని చెంతకు చేరదీసి నిజశిరమున చేదోయి సంధించి వారిమ్రోల నిలిచి వినమ్రుడై రామానుజస్వామి "మిత్రులారా! నేను మానవుడను. తెలిసియో తెలియకయో నాతలపులవలనను మాటలవలనను మీమనసులను నొప్పించియుందును. నానెరసులను మీరు మన్నించినగాని నేనీశరీరమును ప్రశాంతభావమున విడువజాలను" అని పలికినాడు.

ఆపలుకులను వినినంతన ఆంతరంగికముగ మిత్రులు కటకటంబడిరి. గద్గదస్వరముతో వారు "ప్రభూ! మీవలన నెవ్వరిమానసమునకైన నొప్పి కలుగగలదని తలచువారెవరు? మాదురదృష్టముకతన నికముందు మిమ్ము మాపురోభాగమున గాంచలేము. మీమధురభాషణములనువిని మహిమోపేత మైన మీప్రబోధములను పడయుభాగ్యమును గోల్పోవుచుంటిమి. మార్గ దర్శకులై మీరు పురోభాగమున నిలిచినంతకాలము విజ్ఞానమును ఆనంద మును మాసొమ్మలైనవి. మీరు దివినలంకరించుచో మాగతి యేమగును?" అని వాపోవుచు వచించిరి.

"రెండు నదుల మధ్యను వెలసిన ప్రభువును సేవించు భాగ్యమును నేను కోల్పోవుచున్నాను. అదృష్టవంతులు కావున మీరింకను అట్టిభాగ్యము ననుభ వింపగలరు. శ్రీరంగనాథుని భజించుచు ఆతడు ప్రేమించువారిని మీరు ప్రేమించుచు సేవించుచు యానందింపగలరు. జగదీశుని కారుణ్యము మీకు లభింపగలదు" అని యాదరపూర్వకముగ యతిరాజు వచించెను.

తానారాధించు వరదరాజహయగ్రీవప్రభువుల విగ్రహములను పిల్లాన్ అను శిష్యప్రవరునకు ఆతడొసంగెను. తన ప్రధానశిష్యులందు డెబ్బదినలువురకు డెబ్బదినాలుగు శంఖములను అదే సంఖ్యగల చక్రములను ప్రసాదించి వారి నాతడు మతపాలకుల గావించినాడు. తామెఱిగిన దానిని ప్రజాళియందు వారు విరివిగా ప్రబోధించవలెననియు వారికృషికతన వైష్ణవమతము సమధికాభివృద్ధి నంది వటవృక్షమువలె వెలసి జగతియందు చిరస్థాయియై యుండవలెననియు రామానుజస్వామి వచించెను. ఈమతపాలకుల సంతతినుండియే వైష్ణవగురు పరంపర ఉదయించి బహుసంఖ్యాకుల నవిద్యనుండి యుద్ధరించెను.

శ్రీరామానుజస్వామి తనశ్రీభాష్యమునకు నాలుగుప్రతులను వ్రాయించి నలువురు ప్రధానశిష్యులకు వానిని ప్రసాదించి వానిలోని భావసామగ్రిని జిజ్ఞాసువుల మానసవిపణులందు జేర్చుడని వారి కాదేశ మొసంగెను. నమ్మా ళ్వారు శ్లోకములకు వ్యాఖ్యానమువ్రాసిన శిష్యప్రవరుడే తన భాష్యముతో శ్రీభాష్యమును భక్తులకు ప్రబోధించు నధికారమునందెను.

తమతమ నియమపాలనమందును కర్తవ్యనిర్వాహణమందును అంతే వాసులను బద్ధదీక్షితుల గావించి ఇక తనపని చెల్లినదనియెంచి యతిరాజు

మహాప్రయాణమునకై సంసిద్ధుడైనాడు. స్వామి యాలయసమ్ముఖమున కుశశయ్యపై మేనుచేర్చి ఎంబరు యూరువున శిరమిడి ఆంధ్రపూర్ణుని అంకతలమున పాదముల నుంచినాడు. మహాపూర్ణుని పాదుక లాతని చక్షుస్సమక్షమున నుంచబడినవి. యామునాచార్యుని పవిత్రపాదద్వయ మాతని హృదయమున పాదుకొలిపెను.

అనంతరము రామానుజస్వామి తనశరీరమునుండి వెలువడి కోటిసూర్య ప్రభాభాసురుడై దివిదేస జనెను. దివ్యశరీరమునుదాల్చి దేవగణమును లుచ్చరించు ప్రణుతివాక్కులకు చెవులొగ్గి అమరగణపరివృతుడై విరజాతీరముజేరి అందుండిచని సహస్రమణిస్తంభవిరాజితంబైన మహాగారము ప్రవేశించి అనంతఅద్భుతద్యుతులను వెలారించు సింహాసనమున నాసీనుడైయున్న వైకుంఠపతి పదసరోజములపై నిజమౌళి నునిచి పరమపరితోషసంభరితాత్ముడాయెను.

దేవగాయకు లాతనిచుట్టుజేరి సంకీర్తన మాచరించి నృత్య మొనరించిరనియు అమరవధూటీమణులు ఆతనిపై పూలవాన కురిపించిరనియు సిద్ధసాధ్యయక్ష కిన్నరకింపురుష విద్యాధర గంధర్వాదులు స్వాగతగీతిక లాలపించిరనియు ఊర్ధ్వలోకముదాటి పవిత్రవిరజాకూలము నాతడు చేరె ముహూర్తమందు ముక్తినంది వైకుంఠమున ననంతకాలము అధివసించు మహనీయు లాదరానురాగముతో ఆతని నాలింగనమాచరించుకొనిరనియు పరమప్రమోదముతో అల్వాన్ రామానుజస్వామి చరణకమలములను కన్నులనద్దుకొని కవుంగిలించుకొని ఆనందాశ్రువులతో వానిని ప్రక్షాళించెననియు ఇరువురును పరితోషముతో ప్రసంగించుకొనిరనియు వైకుంఠపతి బహుభంగుల యతిరాజు నాదరించి ఆతని నక్కున జేర్చుకొని "పెక్కేండ్లు వైకుంఠమునకు దూరస్థుడవై యుంటివి పలువురు సాధింపజాలరని కర్తవ్యము నీవు నిర్వహించితివి. ఒకప్పుడు శఠకోపస్వామి పలికిన నుడువులు సత్యము లయ్యెను. అజ్ఞానాంధకారము పటాపంచలయ్యెను" అని వచించెననియు "తండ్రీ! నీకు సేవకుడనై భూతలమునకరిగి నీచే నిర్దిష్టమైన కర్తవ్యమును నెఱపితిని. నిన్ను భజించి నీకారుణ్యము నందువారికి సాధ్యముకాని కృత్యమేదియైన నుండునా? ఎట్టి క్రియలైనను నీమహామహిమవలన నివ్వటిలును" అని మస్తకన్యస్తహస్తుడై యతీంద్రుడు పలికెననియు ఈశ్వరసింహాసనముచుట్టు నిలిచిన దివ్యప్రేక్షకులు

హర్షధ్వనులు సలిపిరనియు వానిప్రతిధ్వను లానందతరంగములను సృష్టించె ననియు ప్రశాంతభావమున నావరితోపవీచికలు భూతలమున నధివసించిన భక్తవరేణ్యుల హృదయములందు ప్రవేశించెననియు వైష్ణవమతగ్రంథములు వాకొనుచున్నవి.

ఉత్తమనంబి ప్రభుని కప్పుడు వస్త్రమును ధరింపజేసి ఆలయమునుండి వెడలి దుఃఖితులై యుండిన అంతేవాసుల నాశ్వాసించి పురోభాగమందలి కర్తవ్యమును వారికి జూపెను. ఆచార్యుని శరీరమునకు శిష్యులపుడు పవిత్రోదకములచే స్నానముచేయించిరి. పంద్రెండు పవిత్రనామచిహ్నములతో గురువర్యుని కాయము నలంకరించిరి. ప్రభుపరిచ్ఛదమును శిరముచుట్టు చుట్టిరి. గంధంబంధురమాల్యపరంపర నాతని గళమువైచిరి. భక్తిభరితహృదయులై అనంతరము వారు ఆచార్యుని చరణరాజీవములను తమ శిరములమీదను రొమ్ముమీదను జేర్చికొని కన్నులకు వాని నద్దుకొనిరి. ఆచార్యులకు జ్ఞానపుత్రుడై తనరిన కురుకేశ్వరుడు 'బ్రహ్మమేధాసంస్కారముతో' అంత్యక్రియలు నెఱపెను.

శకాబ్దమున 1059 సంవత్సరమున క్రీ. శ. 1137 సంవత్సరమున మాఘమాసమున శుక్లపక్షమున దశమిదినమున శనివారమునాడు మధ్యాహ్నసమయమున యతిరాజు దివంగతుడాయెను.

"ఆత్మవత్సర్వభూతాని" అను వాక్కులోని మహితభావమునకు శ్రీరామానుజస్వామిజీవితమునకు ప్రత్యక్షదృష్టాంతము. ఎదుటివాడు బ్రాహ్మణుడైనను చండాలుడైనను ధనవంతుడైనను నిరుపేదయైనను పండితుడైనను పామరుడైనను మిత్రుడైనను శత్రువైనను యతిరాజువలన సమానాదరము నందుచు వచ్చిరి. ఈ యంశమును దృష్టాంతీకరించుటకు ఆతని జీవితమునుండి బహుళ సంఘటనములను పేర్కొనవచ్చును.

కొలందిమంది శిష్యులతో దూరప్రయాణమునలిపి యొకనాడు రామానుజస్వామి స్వస్థానమునకు మరలివచ్చుచుండగా త్రోవలో చీకటిపడెను. కొందఱు దొంగలు ఆచార్యుని అతని శిష్యులను విలోకించి అంధకారమున వారిని చిత్తమువచ్చినట్లు కొట్టి వారి మూటముల్లెల నూడవెఱుక నుద్దేశించిరి. ఆపదనెట్లో గ్రహించి కడువడిగ నడుగులువైచి పరివ్రాజకులు సమీపమందలి యొక

పల్లెలో ప్రవేశించిరి. అది మాలపల్లె. స్వామికిని శిష్యులకును నాటి నిశీథినీ సమయమున ఆపల్లెయే ఆశ్రయ మాయెను. దొంగలబాధ బడకుండ పంచములు వారి నారేయి బహుభంగుల కాపాడిరి. మఱునాడు ప్రాతఃకాలమున లేచి ఆశ్రయమిచ్చిన మిత్రుల సెలవుగొని స్వామియును శిష్యులును స్వస్థానము దెస పయనమైరి. పంచమమిత్రులు చాలదూరము వారి వెన్నంటిపోయి మార్గమధ్యమున వారి కెట్టివిపత్తు ఘటిల్లకుండు నేర్పాటులు గావించిరి. పంచముల వలన తానందిన ఆదరానురాగములకు మిగుల నలరి రామానుజస్వామి "బిడ్డలారా! మీ సత్కారమునకు సంతసించితిని. నావలన మీకువలసిన సేవ ఎద్దియేని యున్నచో తెలుపుడు మీ వాంఛితమును దీర్చెదను" అని సాదరముగ వారితో పలికెను.

చేతులుజోడించి పంచములు "స్వామీ! జగదీశుడు అధికులకును అల్పులకును కూడ తండ్రియేకదా! మేముకూడ సర్వేశుని బిడ్డలమే కదా? ఆలయములో ప్రవేశించి మాతండ్రిని కన్నులార గాంచి ఆతనిని సేవించు భాగ్యము మాకు లభించుటలేదు. అంటరానివారమని మమ్మునేకులు తఱిమికొట్టుచున్నారు" అని గద్గదస్వరమున వారు పలికిరి. వారి మాటలను వినినంతన రామానుజస్వామిగుండె నీరైనది. చేతులెత్తి అనుకంపతో వారి నాశీర్వదించి ప్రేమపురస్సరముగ స్వామిజీ వారి కిట్లనియె. "తనయులారా! నాశిష్యుల యుసుఱులను నాయుసుఱులను మీరు కాపాడితిరి. తలదాచుకొనుటకై మాకు కొంత చోటొసగితిరి. అపాయమును నెట్టివేసితిరి. మీ యుపకారమునకు ప్రత్యుపకృతి యొనర్చుట నాకర్తవ్యము. నేనిపుడు మేల్కోట్‌లో వసింతును. మీరచటికి రండు. మీయభీష్టమును పడయగలరు. ఇతరులతో చిత్తమువచ్చినట్లు మీరు వీథులయందు సంచరింపగలరు. కల్యాణసరోవరమున స్నానమాచరించి వైష్ణవచిహ్నములను దాల్పగలరు. ఆలయమున దైవపీఠము వఱకుపోయి స్వామికి పండ్లను పూవులను సమర్పించి మీరచ్చో నాతనిని సేవింపగలరు., ఆలయప్రాకారములందును ఆగారములందును ప్రాంగణములందును మసలి దినమంతయు సంపూర్ణముగ నందు కడపివేయగలరు. ఆలయాధికారులు మిమ్ము నతిథులుగా గణించి భోజనాదులొసగి మిమ్ముసత్కరింతురు. మఱునాడు మీరు మీస్వస్థానమునకు మరలిపోవచ్చును. మిమ్ము

చూచుటవలనగాని మిమ్ము స్పృశించుటవలనగాని ఎవ్వరికిగాని ఎట్టిదోషము గాని వాటిలనేరదు. బేలూరు శ్రీరంగపట్టణములందుకూడ మీకిట్టి యాదరానురాగములు లభింపగలవు."

స్వామీజీమాటలు విని పంచములు పరమానందభరితులైరి. యతిరాజు ప్రేమమయుడు. దయామయుడు. ఆతనిభావమును నేడెందఱో మనన మొనరింతురు.

శ్రీరామానుజస్వామి జీవితచరిత్రమందలి సర్వాంశములను తెలుపుట కిందు తావులేదు. ప్రధానాంశములను మాత్రము వివరించుట కర్తవ్యము.

ప్రాచీవిజ్ఞానవిభవమునకు బాదరాయణుని బ్రహ్మసూత్రములును ఉపనిషత్తులును భగవద్గీతయును ఎట్టిభావశబలతను చేకూర్చినవో తత్త్వవేత్త లెఱుగుదురు. వీనియందలి వైజ్ఞానికపూరమును మనసార గ్రోలి వ్యక్తిగతప్రతిభననుసరించి వేర్వేఱు వ్యాఖ్యలను వ్యక్తీకరించిన మహామేధావులు శ్రీశంకర రామానుజులు. ఈతనికంటె నాతడధికుడనియు నాతనికంటె నీతడధికుడనియు తలప జెల్లదు. అద్వైత సిద్ధాంతమునకు జనకుడు శ్రీశంకరభగవత్పాదుడు. నిర్గుణబ్రహ్మమును గుఱించిన వివరణము ఈతని సిద్ధాంతమున ప్రాముఖ్యమును పడసినది. మాయను గుఱించిన సంక్షేపోల్లేఖనము బృహదారణ్యక శ్వేతాశ్వతరోపనిషత్తులందు గలదు. కాని విశేషముగ తన ప్రత్యేకప్రతిభను ప్రయోగించియే శ్రీశంకరుడు తన మాయావాదమును సృష్టించెను. శంకరప్రోక్త బ్రహ్మన్ వ్యక్తి కాదు. బ్రహ్మన్‌లో నైక్యమగుటయే జీవుడు సంసారవిమోచనమునందుట యని శ్రీశంకరుని ప్రబోధము.

వైష్ణవమతమును స్థాపించిన శ్రీరామానుజస్వామి ప్రత్యేకపథమును త్రొక్కినాడు. శ్రీశంకరునిసిద్ధాంతమునకును యూరపుఖండమున దరువాతప్రభవించిన సిద్ధాంతములకును శ్రీరామానుజస్వామి సిద్ధాంతము వేఱైనది. అద్వైతమును ఈత డాపాదించుట నిక్కమే కాని బ్రహ్మన్ "అనంతకల్యాణగుణసాగరుం" డను విశేషణయుతుండని శ్రీరామానుజస్వామి వచించెను. కావున నీతని సిద్ధాంతము విశిష్టాద్వైత మన బరగినది. శ్రీరామానుజస్వామి బ్రహ్మనునొకవ్యక్తిగా పేర్కొనెను. ఈతని సిద్ధాంతమును పరిశీలించినపుడు పరమనిర్గుణ, పరమసగుణబ్రహ్మనుల వ్యత్యాసము గోచరింపదు. జీవు డీశ్వరునందులీనమై

తనవ్యక్తిత్వమును కోల్పోవునని రామానుజస్వామి విశ్వసింపలేదు. సంసార బాధలనుండి తొలగి జీవుడు వైకుంఠమున అనంతానందమున నోలలాడునని ఈతడు తెలిపెను. తన "శ్రీభాష్యము" న ఈతడు బ్రహ్మమును విష్ణువనియు నారాయణుడనియు బేర్కొనెను. జీవాత్మ ప్రత్యేకవ్యక్తిత్వము కలదయ్యు బ్రహ్మమునుండి వేఱుకాదనియు ఈతనిప్రబోధము నిప్పునకును నెరసులకును గల భేదాభేద సంబంధమును జ్ఞప్తికిదెచ్చును. జీవేశ్వరుల వియ్యము ప్రకారప్రకారి సంబంధమనియు శారీరశారీరి సంబంధమనియు శేషాశేషి భావమనియు ఈతడు తెలిపెను. బ్రహ్మసూత్రముల వ్యాఖ్యానమే ఈతని 'శ్రీభాష్యము' 'వేదాంతదీప' 'వేదాంతసార' ములయందు ఈతని తత్త్వబోధయొక్క సంక్షేపవివరణముకలదు. దశోపనిషత్తులయందలి మీగడ తఱకలు ఈతని వేదాంతసంగ్రహమందు గలవు. భగవదారాధన ప్రయోగ వివరణము 'నిత్యగ్రంథము' న గలదు. గద్యత్రయములో దైనికాభ్యాస మునకు వలయు వైజ్ఞానికసామగ్రి కలదు. భగవద్గీతావ్యాఖ్య ఈతని గీతా భాష్యమున వెలయుచున్నది. రామానుజస్వామితత్త్వప్రబోధ మీయేడుగ్రంథ ములయందు వఱలుచున్నది. స్వామిజీ అద్భుతపాండితికిని అనల్పమైన తార్కిక తాత్త్వికశక్తికిని అనిర్వచనీయమైన రచనాకౌశలమునకును ఈగ్రంథ ములు ప్రత్యక్షప్రమాణములై యొప్పుచున్నవి. శ్రీశంకరునికికూడ ముందటి వారైన బోధాయన ద్రవిడాచార్యగుహదేవకపర్దిప్రభృతుల సంప్రదాయమున కంజలిఘటించుచు శ్రీరామానుజస్వామి స్వతంత్రశక్తిని సహజప్రజ్ఞను నైసర్గికప్రతిభను వ్యక్తీకరించి విజయభేరిని మ్రోగించెను. బహుసంఖ్యాకుల ముక్తికై ఈతని హృదయము పరితపించుటచే బహుసంఖ్యాకుల కవగాహ మగు సిద్ధాంతమునే ఈతడు వ్యక్తీకరించెను. జటిలభావమునకు రూపచూపు లొసగి సామాన్యుల యాకళింతకుసయితము వానినందించి సౌందర్యసందీపిత కావ్యరచనకు అక్కఱయైన వైజ్ఞానికసామగ్రిని కళావస్తునిచయమును ప్రసా దించిన మహనీయగుణగరిష్ఠుడు శ్రీరామానుజస్వామి. ఇట్టి మహామేధావులు ఇట్టి మహారచయితలు ఇట్టిపవిత్రచరిత్రులు ఇట్టిమహిమోపేతులు మానవలోక మున నరుదుగా జన్మింతురు. తపసుకతన మననముకతన ధ్యానముకతన నిదిధ్యాస నముకతన శిథిలముకాని సమాధికతన ప్రార్థనముకతన ఏకాగ్రదృష్టికతన గభీర

పర్యాలోచనముకతన నిశితపరిశీలనముకతన అద్భుతమైన భావనాశక్తికతన వైజ్ఞానికపటుత్వముకతన సౌందర్యోపాసనముకతన సత్యవ్రతముకతన ఆనందోపాసనముకతన మధురభావచింతనముకతన పవిత్రజీవితనిర్వాహణముకతన పరిణతి నందిన హృదయమం దుదయించుభావములు అమృతకలశమువలె ననంత కాలము నిలువజాలును. మనుష్యాంతరంగ మెంత మహిమోపేతమైనది! స్థిరముకాని శరీరావరణమున ననంతకాలము నిలువజాలు భావభువనము లెట్లు సృష్టింపబడుచున్నవి! క్రమసిద్ధినిగాంచి కవీంద్రులైన మునీంద్రులే ఇట్టి సృష్టి గావింపజాలుదురు. మునియైన వానిమాట ముల్లోకములందు విద్యుత్తువలె పయనింపజాలును. ఇది శమంతకమునకు కాంతిని కౌస్తుభమునకు సౌందర్యమును నెరవీయజాలును. సూర్యమయూఖమునకు వెలుగును చంద్రకిరణమునకు చల్లదనమును బదులీయగలదు. మానససరోవరమునకు ప్రశాంతమును దివిజకల్లోలినికి మధురనిస్వనమును పూలరాశికి పరిమళమును వసరమకు సౌందర్యమును సింధువునకు గభీరతను ప్రకృతికి లావణ్యమును రత్నాకరమునకు రత్నములను నెరవీయజాలును. సత్యానందీప్తమైన యీనుడువు విజ్ఞానుల రసనములను రంగస్థలము లొనరించుకొనును. అనేకసీమలందు పెక్కుయుగములందు ఇది మనియుండును. సాహిత్యక్షేత్రమున దీనికి చిరస్థానము లభించితీరును. ఈనుడువు అమరజీవి. ముని మానసమున నుదయించిన తలంపు ఎన్నెన్నిఘట్టములందు ప్రశస్తినందుచున్నదో చింతింపుడు. జగతికి విజ్ఞానభిక్షపెట్టునది ఈభావమే. దీనితో తలసూపు సాహితియే! మునివచననిచయమే భారత మహావిజ్ఞానసృష్టి యాయెను. పురాణయుగమున వఱలిన మునివృషభుల నుడువులు భారతీజిజ్ఞాసువులకు కంఠస్థములైనవి. చరిత్రయుగమున వర్ధిల్లిన శ్రీశంకర రామానుజస్వాములు మునిసంప్రదాయము ననుష్ఠించి తాము మహామునులై మేధానిధులై అసంఖ్యాకులకు మహితబోధామృతమును ధారవోయుటేగాక అనంతకాలము నిలువజాలు సాహిత్యమును సృష్టింపగలిగిరి. అమూల్యభావముల భాండారము ఈసాహిత్యము శ్రీశంకరుని, శివానందలహరి "సౌందర్యలహరి" మున్నగు గ్రంథరాజములను విలోకింపుడు. పూర్వోక్తరామానుజ గ్రంథములందలి భావమహత్త్వమును సౌందర్యరాశిని మాధుర్యవిభవమును భావనాశక్తిని పరీక్షింపుడు.

ఆంధ్రకవితా ప్రపంచమున కవిత్రయమునకెంత ప్రాముఖ్యమున్నదో భారతతాత్త్వికవసుంధరలో మతాచార్యత్రయమునకు అంత ప్రాముఖ్యము కలదు. వ్యాసభట్టారకుని బ్రహ్మసూత్రములకు భాష్యమును చెప్పుటలో నీముగ్వురి యభిప్రాయములయందు వ్యత్యాసములు గోచరించినవి. వీనిని విపులముగా సవిమర్శనముగా నిందు వివరించుట కవకాశములేకున్నను పైన తెలిపిన చొప్పున నిక నొకటి రెండు యంశములు వారివారి దృక్పథములను తెలుపుటకై యిందు ఉల్లేఖింపబడును.

శ్రీశంకరరామానుజు లీశ్వరతత్త్వము నెట్లు పరిశీలించిరో కొంతవఱకు యిదివరలో తెలుపబడినది. ఈశ్వరుడు నిత్యుడని దయామయుడని గుర్వోగ్గురు డని శ్రీశంకరుడు వచించెను. "నిత్యశుద్ధబుద్ధస్వభావసర్వజ్ఞస్వరూపకారణ పరాణి" — బ్రహ్మసూత్ర శంకరభాష్యము.

శ్రీశంకరుడు నిర్గుణోపాసనమునకు అగ్రస్థానమునకు సగుణోపాసనమునకు ద్వితీయస్థానము నొసగినాడు. భీముడు సగుణోపాసనమున నారితేఱినాడు అనియు, అర్జునుడు నిర్గుణోపాసనమున సిద్ధహస్తుడై జగదీశుడైన శ్రీకృష్ణునకు సన్నిహితుడాయెననియు "భగవద్గీత" యొక్క అంతరార్థమును పరిశీలించి నపుడు తెలియగలదు. ఇట్లనిన శుద్ధబుద్ధ సచ్చిదానందమయ బ్రహ్మమొకడును సగుణోపాసకు డుపాసించు సాకారుడగు భగవాను డింకొకండును నని తలంప రాదు. "స ఈశ్వరః అనిర్వచనీయ ప్రేమస్వరూపః" అని భక్తుడు భగవంతుని ప్రస్తుతించుతఱి వేదాంతి "తత్రనిరతిశయం సర్వజ్ఞబీజమ్ — అని గంభీరస్వర మున వచించును. అతీంద్రియమైన బ్రహ్మము నుపాసించుట సామాన్యునకు సాధ్యముకాదు. సామాన్యుని యాకళింతకు సహితము ఈశ్వరతత్త్వము నందిం చుట శ్రీరామానుజస్వామి యాశయమైనది.

తనతపసు కతన ఉపాసకుడు "సోహమ్" అనజాలునని శ్రీశంకరుడు వచించెను; భ్రమరకీటన్యాయమున తన భావమును చక్కగ వ్యక్తీకరించెను.

"జగద్వ్యాపారవర్జమ్ ప్రకరణా దసన్నిహితత్వాచ్చ" అను సూత్ర మున వ్యాసభట్టారకుడు సృజనాది శక్తిమాత్రము పడయజాలక అనంత శక్తియందును అనంతజ్ఞానమందును విశేషభాగమును ముక్తుడు పొందగలడని వచించినాడు. రామానుజస్వామి పూర్వోక్త సూత్రమునకు వ్యాఖ్యదెలుపుచు

నిట్లనెను. "సర్వేశ్వరత్వమును, అసాధారణమైన సృష్టిశక్తియును ముక్తినొందిన వాని యైశ్వర్యమున జేరునా? లేక ఈశ్వర సాక్షాత్కారమునందుట మాత్రమే అతనికి సాధ్యమా? ...... ఈశ్వరుని స్వభావము గ్రహించువారు బ్రహ్మాత్మానుభవమును పడయుదురు జగన్నియమనశక్తి వీరికి సాధ్యముకాదు...' ఎవ్వనిలో నుండి సమస్తభూతములు జనించుచున్నవో ఎవ్వనివలన నవియన్నియు మనుచున్నవో లయానంతరము ఎవనిలో చేరుచున్నవో వానినిగుఱించి తలంపుము. ఆజిజ్ఞాస బ్రహ్మమునకు సంబంధించినది' అని శ్రుతివచించుచున్నది. జగదీశ్వరత్వము బ్రహ్మలక్షణమేయని దీనివలన గ్రహించుచున్నాము—ఆదియందు బ్రహ్మమొక్కటియే యుండెను. పదపడి అది బహుళమాయెను—వరుణ సోమ పర్జన్యాదులు క్షత్రులు...' తొలుత నారాయణుడు మాత్రమే యుండెను. ఈశాన్యుడుగాని బ్రహ్మగాని సూర్యుడుగాని లేడు, ధ్యానము ముగిసినపిదప ఒక కన్యను దశేంద్రియములను పడసినాడు...' అతడు జగన్నియమనకర్తయని శ్రుతులు తెలుపుచున్నవి. ముక్తునిగుఱించిన యుల్లేఖనము వీనికథనమున లేదు."

పూర్వోక్త బ్రహ్మసూత్రముయొక్క రామానుజభాష్యమును మాత్రకలో పరిశీలింపనగును. "కింముక్తస్యైశ్వర్యం జగత్సృష్ట్యాది పరమపురుషాసాధారణమ్ సర్వేశ్వరత్వమపి ఉదతద్రహితం కేవలపరమపురుషామభవ విషయమితి సంశయః। కింయుక్తమ్? జగదీశ్వరత్వమపీతి, కుతః? 'నిరంజనః పరమంసామ్యముపైతి' (ముండక) ఇతి పరమపురుషేణ పరమసామ్యాపత్తి శ్రుతేః। సత్యసంకల్పత్వశ్రుతేః। నహిపరమసామ్యత్వే సత్యసంకల్పత్వే సర్వేశ్వరా సాధారణ జగన్నియమనేనవినోపద్యేతే। అతః సత్యసంకల్పత్వ పరమసామ్యాపత్తయే సమస్త జగన్నియమన రూపమపిముక్తస్యైశ్వమతి ఏవం ప్రాప్తే ప్రచక్ష్మహే—జగద్వ్యాపార వర్జమితి జగద్వ్యాపారః—నిఖిలచేతనా చేతన స్వరూపస్థితి ప్రవృత్తిభేదనియమనమ్ తద్వర్జమ్ — నిరస్తనిఖిలతిరోధానస్య నిర్వ్యాజ బ్రహ్మాత్మానుభవరూపం ముక్తస్యైశ్వర్యం। కుతః? ప్రకరణాత్। నిఖిల జగన్నియమనంహి పరంబ్రహ్మ ప్రకృతామ్నాయతే — 'యతోవా ఇమాని భూతాని జాయన్తే యేనజాతాని జీవన్తి। యత్ప్రయం త్యభిసంవిశన్తి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మ' ఇతి॥ యద్యేతన్నిఖిల జగన్నియమనమ్ ముక్తానామపిసాధారణంస్యాత్, తతశ్చేదం జగదీశ్వరత్వరూపం బ్రహ్మలక్షణం ననంగచ్ఛతే।

అసాధారణస్య హిలక్షణత్వం। తథా।—సదేవ సోమ్యేదమగ్ర అసీదేక మేవాద్వితీయం తదైక్షత బహుస్యాం ప్రజాయామేతి తత్తేజోఽసృజత ' (ఛాందోగ్య) ' బహ్మావా ఇదమేక మేవాగ్ర ఆసీత్ తదేశకం సన్నవ్యభవత్ తచ్ఛ్రేయో రూపమత్య సృజతక్షత్రమ్। యాన్యేతాని దేవక్షత్రాణి ఇన్ద్రో వరుణః సోమోరుద్రః పర్జన్యోయమో మృత్యురీశాన ఇతి ' (బృహదారణ్యక) ఆత్మావా ఇదమేక ఏవాగ్రఆసీత్, నాన్యత్కించనమిషత్। సఈక్షతలోకాన్న సృజాఇతి। సఇమాన్ లోకానసృజత ' (ఐతరేయ) ' ఏకోహవై నారాయణ ఆసీన్న బ్రహ్మేనేశానోనసూర్యః। సఏకాకీనరమత। తస్యధ్యానాన్తస్యైకాకన్యా దశేన్ద్రియాణి ' (మహో) ఇత్యాదిషు ' యఃపృథివ్యాంతిష్ఠన్ ' పృథివ్యా అన్తరః ఇత్యారభ్యయ ఆత్మనితిష్ఠన్ ' (బృ) ఇత్యాదిషు చ నిఖిలజగన్నియ మనం పరమపురుషం ప్రకృత్యైవశ్రూయతే। అసన్నిహితత్వాచ్ఛ। నచైతేషు నిఖిలజగన్నియమన ప్రసఙ్గేషుముక్తస్యసన్నిధాన మస్తి,యేనజగద్వ్యాపార స్తస్యాపిస్యాత్."

మధ్వసిద్ధాంతము వేఱుతీఱైనది. భగవంతునకు జీవుడు అధీనుడు. పరి పూర్ణస్వాతంత్ర్యముగాని అనంతశక్తిగాని జీవునకు అసాధ్యమని మధ్వా చార్యుడు ముక్తకంఠముతో పలికెను. తనయభిప్రాయములను బలపఱుచు ప్రమాణములను పేర్కొని బ్రహ్మసూత్రముల కీతడు వ్యాఖ్యానము వ్రాసెను.

నిరంతరసంస్మరణమును నిరంతరతైలధారకు (ఒక పాత్రమునుండి వేఱొక పాత్రలోనికి పోయబడు నూనెయొక్క-ధారకు) రామానుజస్వామి పోల్చినాడు. "ఇట్టి ధ్యానముకతన భవబంధములు తొలగును. ఇది మోక్షోపాయమని స్మృతులు వచించుచున్నవి" అని యతిరాజు వాకొనినాడు.

భారతతాత్త్వికవిహాయసమున శంకర రామానుజ మాధ్వ మహాభాష్య కారులు ముగ్వురును దివ్యజ్యోతులవలె తేజరిల్లుచున్నారు. మేధాశక్తిని హృదయశక్తిని వీరివలె వృద్ధిజేసికొనినవారు మనుష్యత్వము మహిమాన్విత మైనదని వీరివలె ఋజువుచేసినవారు మానవులలో నరుదుగా నుదయింతురు. వీరిభాష్యములందు వ్యత్యాసములు గోచరించిననేమి? మానవుని ముముక్షు వునిజేసి ఈశ్వర సమక్షమున జేర్చుట వీరి జీవితపరమావధి యయ్యెను.

శ్రీశంకర శ్రీరామానుజస్వాముల సిద్ధాంతముల కవగతులైన చదువరులు శ్రీమధ్వాచార్యుల సిద్ధాంతమునుగూడ హృదయంగమ మొనరించుకొను టొప్పు.

వేదవతీమధ్యగేహులీతని తలిదండ్రులు. వీరి కిరువురుకొడుకులును ఒక కొమరితయు గలిగిరి. దురదృష్టవశమున పుత్రద్వయము పరమపదించిన వెనుక వాయుదేవుడు వీరికడుపున క్రీ. శకము 1199 సంవత్సరమున బుట్టెనని పలువురు విశ్వసించిరి. భావికాలమున మధ్వాచార్యుడనబరగిన ఈమూడవపుత్రుడు చిఱుతప్రాయమున వాసుదేవుడని పిలువబడెడువాడు. శైశవమున నీత డూరి బడిలో చదివెనుకాని వీనికి చదువంటలేదు. కుస్తీ మొదలైన వ్యాయామక్రియలందు నేరిమి నాతడు చూపుచుండువాడు. కాలక్రమమున నీతనికి సరస్వతీ ప్రసన్నత లభించెను. ఈతని హృదయమున చక్కని పరిణామము పొడసూపెను. శాస్త్రపఠనమున ఆరితేఱి అచ్యుతప్రకాశుడనబరగిన కొండొక యద్వైతవేదాంతి నాశ్రయించి యాతని యంతేవాసియై వానికటాక్షము కతన, తనయిరువదియైదవయేట, దీక్షనంది పూర్ణప్రజ్ఞాభిధేయమును పడసెను. కాలక్రమమున నీతడు అవంతేశ్వరమఠాధిపతియై ఆనందతీర్థుడను నవ్యనామముతో నొప్పెను. క్రీ. శ. 1238 వ వత్సరమున నీతడు వైజ్ఞానికయాత్రకై పయనమైనాడు. తిరువేంద్రము, విష్ణుమంగళము, శ్రీరంగము, రామేశ్వరము, ఉడిపి మున్నగుప్రదేశములందు సంచరించి పండితప్రకాండులతో తర్కయుద్ధములు గావించినాడు. విద్యాశంకరాదులతో నీతడు శాస్త్రవాదములు సలిపినాడు. అన్నివేళలందు నీతడు విజయు డాయెనని తెలుపజెల్లదు. అన్నిసమయములందు ప్రతిపక్షులు యాహ్వానము నీతడు మన్నించెనని వచింపలేము. అద్వైతవాదుల కీతడు ప్రతిద్వంద్వియాయెను. శృంగేరీపీఠాధిపతికీతడు నెచ్చెలి కాడు. సుమారు ముప్పదేండ్లు కడచినపిదప నీత డార్యావర్తపర్యటనమునకై బయలుదేరెను. ఈతని మహత్త్వమెఱిగిన మహనీయు లీతని బూజించిరి. కాని అద్వైతవాదమునే ఆరాధించిన వారీమహాత్ముని కొద్దిచూపులతో చూచిరి. అవజ్ఞతోపాటు అత్యాచారమీతని మార్గాన దలపడినది. గోవా మున్నగుచోటులందు నిరపాయముగ కాలముగడపి యీతడు హిమగిరిక్షేత్రములను దర్శించినాడు. అన్యభాషలతో కొంతపరిచితి నందినాడు. హరిద్వార

మందును, బదరీనారాయణక్షేత్రమందును కొంతకాలము వసించి అనంతరము మధ్వాచార్యుడు చాలుక్యపురమైన కల్యాణనగరమున కరిగెను. కాలక్రమమున పద్మనాభతీర్థుడని ప్రశస్తినందిన మధ్వమతబోధకుడు అచ్చో నీతని శిష్యుడాయెను. ఈయంతేవాసి పూర్వనామము శోభనభట్టు. మధ్వాచార్యుని ప్రథమాచార్యుడు ద్వైతసిద్ధాంతమును శిరసావహించెను. పదపడి ఉడిపియందు విష్ణ్వాలయమును స్థాపించి ఆపురమున శ్రీమధ్వాచార్యుడు తనపీఠమును నెలకొలిపినాడు. పలువురుశిష్యు లచ్చోజేరిరి. స్థానస్థానములందు ప్రబోధము సలుపుచు వచ్చినను నాదంతరమున నీతడు విశేషకాలమును కడపెననియు రమారమి ఎనిమిదివత్సరము లీతడు గురుస్థానమున నధివసించెననియు, నూటనాలుగేండ్లు మనియుండి అనంతరము దివి నలంకరించెననియు మాధ్వసంప్రదాయగ్రంథము లుగ్గడించుచున్నవి.

గీతాభాష్యము, గీతాతాత్పర్యనిర్ణయము, తత్త్వప్రకాశిక, న్యాయవివరణము, ప్రమాణలక్షణము, ఉపాధిఖండనము, కథాలక్షణము, తత్త్వవివేకము, విష్ణుతత్త్వనిర్ణయము, ప్రపంచమిథ్యాత్వవాదఖండనము, భాగవత తాత్పర్యనిర్ణయము, యమకభారతము, ద్వాదశస్తోత్రము, మహాభారత తాత్పర్యనిర్ణయము, సదాచారస్మృతి, కృష్ణామృతమహార్ణవము, తత్త్వసంఖ్యానము, తంత్రసారసంగ్రహము, మున్నగు గ్రంథములు మధ్వమహాముని రచించెను. ‘కేన’ ‘ప్రశ్న’ ‘ఈశ’ ‘కఠ’ ‘మండూక్య’ ‘ముండక’ ‘తైత్తిరీయ’ ‘బృహదారణ్య’ ఛాందోగ్యోపనిషత్తులకును కొన్ని ఋగ్వేద సూత్రములకును ఈమహామేధావి వ్యాఖ్యానములను వ్రాసెను. ‘అనువ్యాఖ్యాన’ ‘అనుభాష్య’ ‘ఉత్త్వోద్యోతము’ ‘ప్రమాణలక్షణము’ ‘పూర్ణప్రజ్ఞభాష్యము’ మున్నగు గ్రంథములును ఈతని రచనములే.

విష్ణునామాంకన భజననామకరణములకు మధ్వాచార్యుడు విశేష ప్రాముఖ్యము నొసగెను. వైకుంఠప్రాప్తియే ముక్తి యని ఈతని మతము. జీవుడు సేవకుడనియు అస్వతంత్రుడనియు జీవుని జ్ఞానము పరిమితమైనదనియు జీవేశ్వరులు భిన్నులనియు కొందఱు వైకుంఠమునజేరి నారాయణసాన్నిధ్యమున అనంతానందమున నోలలాడుదురనియు నియతముగ కొందఱు సంసారమున భ్రమింతురనియు కొంద అనంతనరకముల యాతనమందుదురనియు

శ్రీమధ్వాచార్యుడు వాకొనెను. పాపులు అనంతనిరయమున మ్రగ్గుచుందురనియు పుణ్యాత్ము లనంతకాలము ఈశ్వరసామ్రాజ్యమున ఆనందము నందుచుందురనియు క్రైస్తవమతము తెలుపుచున్నది. మధ్వమతసిద్ధాంతమునకును క్రైస్తవమతసిద్ధాంతమునకును కొంత పోలికయున్నది. యాగమములయందు జరుగు పశుహింసనుసయితము మధ్వప్రభువు ప్రతిఘటించెను. ఉపవాసవిధికి ప్రాముఖ్యము నిచ్చినాడు. ఈసిద్ధాంతమునకును జైనమతసిద్ధాంతమునకును కొంత సామ్యము కలదు. శ్రీవిష్ణువు సకలసద్గుణ శంశోభితుండనియు త్రిమూర్తులం దీతడే శ్రేష్ఠుండనియు ఈతని శక్తి అనంతమనియు ముక్తిప్రదాత యీతడేయనియు శ్రీమధ్వాచార్యుడు వచించెను. త్యాగమువలన సేవవలన భక్తివలన ధ్యానమువలన సంయమశక్తివలన ఆత్మసమర్పణమువలన వేదాధ్యయనమువలన మానసిక వాచిక కాయక భజనములవలన (దాన, పరిత్రాణ, పరిరక్షణ, సత్య, సిత, ప్రియవాక్యకతన, స్వాధ్యాయనాది భజనవిధములవలన) జ్ఞానయుత భక్తియుత వైరాగ్యయుత కర్తవ్యనిర్వాహణమువలన, మానవుడు ముక్తినందునని ఈతడు వచించెను. నిర్వాణముక్తి జీవన్ముక్తుల నీతడు విశ్వసింపలేదు. ముక్తినందుటకు మున్ను ఈశ్వరగుణోత్కర్షమును గుఱించిన జ్ఞానమును జడజీవనభేద, జడేశ్వరభేద, జీవేశ్వరభేదములను గురించిన జ్ఞానమును ముముక్షువులు పడయవలెను. శ్రీశంకరమతమునకు శ్రీమధ్వుని మతము ప్రతికూలమైనది. ఉపాధివాద అభేదవాద మాయావాదములను జగత్తుమిథ్యయను వాదమును ఈతడు ప్రతిఘటించినాడు. కనులయెదుటదోచు దృశ్యము మిథ్యయని శంకరమతము చాటుచున్నది. అదిమిథ్యకాదు సత్యమేయని మధ్వాచార్య సిద్ధాంతము ఘోషించుచున్నది. జ్ఞానము సవికల్పకమనియు జ్ఞాతృజ్ఞేయములులేకున్న కలుగదనియు శ్రీమధ్వాచార్యుడు వాకొనెను. జ్ఞానము నిర్వికల్పకమనియు భేదరహితమైనదనియు శ్రీశంకరుడు వచించెను. మాధ్వసిద్ధాంతమున భేదము నిత్యమైయుండ శాంకరసిద్ధాంతమున నౌపాధికమైనది. 'సోహమ్' అనిన శ్రీశంకరుడు జీవబ్రహ్మములకు వ్యత్యాసము లేదనినాడు. భేద మున్నదనియే శ్రీమధ్వాచార్యుని మతము. జీవబ్రహ్మలకు సేవకసేవ్యభావమున్నదనియు జీవుడు అణువనియు బ్రహ్మము పూర్ణమనియు శ్రీరామానుజ మధ్వాచార్యులు ఏకగ్రీవముగ వచించిరి. పంచవిధోపాసన

కతన నలవడు జ్ఞానరూపమైన భక్తి ముక్తిప్రదాయిని యని విశిష్టాద్వైత ద్వైతాచార్యులు పలికిరి. ఆత్మానుసంధానమునకు శ్రీశంకరుడు ప్రాముఖ్యము నొసగినాడు. జ్ఞానమే మోక్షోపాయమని ఆతడు నొక్కి వక్కాణించెను. జగత్తు భగవంతునిచే నియమింపబడినదని శ్రీమధ్వాచార్యుడు వచింప, నదిబ్రహ్మమని జ్ఞానితలచునని శ్రీరామానుజుడు పలికెను. శంకరభగవత్పాదుడు జగత్తు మిథ్యయని వచించెను.

పలువురకు భక్తి సుసాధ్యము మధ్వరామానుజులు నిర్దేశించిన మార్గమునందు సామాన్యులుకూడ నడచిపోగలరు.

క్రమపరిణతి నభిలషించు సాధకుడు మహాభాష్యకారులు వ్యక్తీకరించిన మూడు సిద్ధాంతములను ఆదరదృష్టితో వీక్షింపవలెను. ఆధునికులైన యోగులు శ్రీరామకృష్ణపరమహంస ప్రభృతులు ఉచితసందర్భములం దీమూడింటికిని సమన్వయము గలిగించి ఉపాసకులకు తగుప్రబోధముల నొసగిరి.

మధ్వప్రవచనము గౌడీయ వైష్ణవులకును వల్లభప్రభృతులకును ప్రీతి గొలిపినది. కావున శుద్ధాద్వైత వాదభావమందును, అచింత్య భేదాభేదవాదమందును ద్వైవభావఛాయలు విశేషముగా ప్రవేశించినవి.

శుద్ధాద్వైతవాదమును బాలకృష్ణోపాసనమును ప్రశస్తికి దెచ్చినవాడు శ్రీవల్లభాచార్యుడు. బ్రహ్మమును, జీవుడు శుద్ధులని ఈతడు వచించుటచే నీతని సిద్ధాంతమునకు శుద్ధాద్వైతవాదమను పేరువచ్చెను. జగత్తు బ్రహ్మముగా పరివర్తనమైనను అవికృతముగానుండును గావున "అవికృత పరిణామవాద" మనియు గూడ నిది పిలువబడుచుండును. ఈతడు అవలంబించిన సంప్రదాయమునకు మూలపురుషుడు వేదభాష్యకారులలో నొక్కండైన విష్ణుస్వామి యనియు జ్ఞానదేవ నాథదేవ త్రిలోచనులు పదపడి ఈసంప్రదాయము ననుసరించి చనిరనియు 'అష్టప్రహారసేవ' వల్లభునిచే విధింపబడినదనియు మన తాత్త్విక గాథలు తెలుపుచున్నవి.

## ద్వైతాద్వైతవాదము

ఇది సనకాది సంప్రదాయమునుండి ఆవిర్భవించినదని విజ్ఞుల యభిప్రాయము. క్రీస్తుశకము పదునొకొండవ శతాబ్దమున త్రిలింగసీమయం-

జనించిన నియమానందు డీసిద్ధాంతమును వ్యాపింపజేసెను. బృందావనస్థ ధృవక్షేత్రము ఈసిద్ధాంత ప్రబోధకుల ప్రధానకేంద్రమై యుండెడిది. ఈసంప్రదాయమువారు నియమానందుడు సూర్యుని యవతారమని తెలుపుచుందురు. ఈతనికి భాస్కరుడు నింబార్కుడు నింబాదిత్యుడు అను నామాంతరములు కలవు. నారదుడు తన యాచార్యుడని ఈతడు తెలుపుచుండువాడు. హరివ్యాసకేశవభట్టు ప్రభృతు లీతని శిష్యులు. ఈతని సిద్ధాంత మీతనిచే రచింపబడిన సూత్రభాష్యమైన 'వేదాంతపారిజాత సౌరభ' మను గ్రంథమున వ్యక్తీకరింపబడినది.

నింబార్కుడు సమన్వయదృష్టిగల మహాత్ముడు. ద్వైతాద్వైతవాదులు కలహించుకొనుచుండగా నిరుపక్షముల వారికి సమన్వయము గలిగింప నీతడు నిశ్చయించినాడు. బ్రహ్మమునుండి జీవుడు భిన్నుడును అభిన్నుడును అని, బ్రహ్మము అనంతము అచింత్యమునని సూర్యబింబమునుండి వెడలు కిరణముల కరణి కడలినుండి వచ్చు కెరటాలలీల జీవేశ్వరులు భిన్నాభిన్నులని బ్రహ్మము సగుణము నిర్గుణమునని, భక్తియే ముక్తిని ప్రసాదించు సాధనోపాయమని ఈతడు ముక్తకంఠముతో వచించినాడు. ఈతని సిద్ధాంతము ననుసరించి నడచువారికి శ్రీమద్భాగవతము ప్రధానగ్రంథమాయెను. శ్రీరాధాకృష్ణుల యుగళమూర్తి వారి కుపాస్యము.

ఈతని సిద్ధాంతము నెక్కువగా గ్రహించినవారు గౌడీయవైష్ణవులు కాని వీరు నిర్వచించిన సిద్ధాంతము అచింత్యభేధాభేదవాదము. వీరికిని శ్రీమద్భాగవతము ప్రధానగ్రంథమాయెను. రాధాకృష్ణయుగళమూర్తిని వీరును నుపాసింతురు. నింబాదిత్యుని మతమునందుకంటె గౌడీయవైష్ణవమతమున రాధకు విశేషప్రాముఖ్యముకలదు. గౌడీయవైష్ణవులు బ్రహ్మమధ్యగౌఢ సంప్రదాయముననుసరించి చరించుచుందుమని వచింతురు. రామానుజ మధ్వ సంప్రదాయములందు గోచరించు ప్రభుదాససంబంధము గౌడసంప్రదాయమున ప్రవేశించినది. కాని శ్రీకృష్ణచైతన్యునియందు దాస్యభక్తి కేవలము దాస్యభక్తియై నిలువలేదు; వాత్సల్యసఖ్యమధురరూపముల కెంతేని ప్రాముఖ్యము లభించినది.

అధర్మమును వినాశమొనరించుటకును ధర్మమును సంరక్షించుటకును భాగవతధర్మమును భగవద్భక్తికిని ప్రజాహృదయములందు నెలకొలుపుటకును విశేషముగ విజృంభించుచున్న విపరీతమతములను విదళించుటకును ఒకపుడు గోకులమందు అవతరించినట్లే భగవంతుడు నవద్వీపమును శ్రీకృష్ణచైతన్యుడై యవతరించెనని వినుచుందుము. అచిత్ జగతినుండి చిత్ జగత్తులోనికి మానవులను దోడ్కొనిపోవుటయు సంసారబంధమునుండి వారిని తొలగించుటయు నీతని యాశయములు. వంగదేశమున నదియామండలమున శాంతిపురమున వసించిన నిత్యానందుడను పరమభక్తునకు శ్రీచైతన్యుడు కనిష్ఠసోదరుడు. ఇరువురసోదరుల ఆశయముల మహోత్కృష్టములు. చాలకాలము వీరు బృందావనమున వసించిరి. ఆతావు భక్తిభరితమై వెలసినది. మీరాభాయి ప్రభృతుల నాకర్షించినది.

శ్రీశంకరాదులవలె శ్రీచైతన్యుడు భారతదేశమున స్థానస్థానములందు సంచరించి ప్రతికూలవాదుల పండితులనెందఱినో యోడించెను. శ్రీచైతన్యుడు దాక్షిణాత్యమున విజయయాత్ర సలిపెను. సుమారు నాలుగువందలముప్పదేండ్లకు మున్నితడు గోదావరీతీరమందలి గోవుపాదక్షేత్రమున కరుదెంచెను. కావున నేడు గౌడీయవైష్ణవులు అచ్చోటున చక్కని మఠమును స్థాపించిరి.

భారతతాత్త్వికక్షేత్రమున శ్రీచైతన్యునకు మహోత్కృష్టమైనస్థానము కలదనుట నిస్సంశయము. ఒక్కొక్కమతప్రవక్త ఒక్కొక్కవిధముగ నీశ్వరునకును మానవునకును గలసంబంధమును నిర్వచించెను. జగదీశుని 'తండ్రీ' యని సంబోధించిన ఋషికుంజరు లుండిరి. శ్రీరామకృష్ణాదులు ఈశ్వరునందు మాతృస్వరూపమును విలోకించిరి. "మాతా" "దుర్గా" "జగద్ధాత్రీ" "అంబా" అని సంబోధించుచు వీరు ఆత్మవిస్మృతి నందుచుండిరి. వీరిసంపర్కము మఱింత సన్నిహితమైనదనుట నిక్కము. దాస్యభక్తితో సంతృప్తినందినవారు కొందరు కలరు. శ్రీచైతన్యప్రభువు జగదీశునితో మఱింత సన్నిహితమైన సంపర్కము నలవఱచికొనినాడు. దండకారణ్యమున శ్రీరాముని దివ్యరూపమును విలోకించి ముగ్ధులైనఋషులు ఆతని సన్నికటసంపర్కమును కాంక్షించి శ్రీకృష్ణున కర్ధాంగలక్ష్ములైరి. గోపీభాగ్యమెంత యుత్కృష్టమైనదో! ఈమహాభాగ్యము నాత్మజీవితమున నలవఱుచుకొనిన మహాత్ముడు శ్రీకృష్ణ

చైతన్యుడు. భగవంతునకు పట్టమహిషినని మురిసిన మహానీయుడాతడు. "నాథా నాథా" యని తన్మయనృత్యమొనరించిన మహాత్ముడాతడు. సంకీర్తన నృత్యభజనలాతని ప్రబోధదృష్టాంతములందు ప్రాముఖ్యము నందినవి. భక్తి భరితమైన ఉద్వేగము ప్రణయబంధురమైన ఉద్వేగము తన్మయభావము పర మానందము ఉదాత్తజీవమునకు మహిమోపేతజీవితమున కెట్లవసరములో ఆమహాత్ముని జీవితమహాత్త్వమును హృదయంగమ మొనరించుకొనినపుడు మనము గ్రహింతుము. మననధ్యాననిది ధ్యానసప్రార్థనసమాధులు పారమార్థిక జీవితమునకును ఉత్కృష్టగుణవృద్ధికిని ఎట్లావశ్యకములో గానన్పత్యాదులును అట్లే ఆవశ్యకములు. త్యాగరాజ జయదేవ నారాయణతీర్థక్షేత్రజ్ఞదీక్షితాదుల జీవితములను ఈసత్యమునే దృష్టాంతీకరించుచున్నవి. దేవగాయకుడును దేవ ఋషియునునైన నారదుడు ఈసత్యమును ఎట్లు స్వీయజీవనమున నిరూపించి నాడో యెఱుంగమా. త్రిమూర్తులు లలితకళల కాదిగురువులు. "కమలభవ నర్తనుడని" వ్యాసుడు చతుర్ముఖుని గురించి తెలిపెను. మహాదేవుడు నట రాజయ్యెను. శ్రీవిష్ణువు శ్రీకృష్ణుడై మురళీధరుడై తన గానలహరిచే భువన ములను నింపలేదా! రాసలీలచే లోకములను అలరింపలేదా? లలితకళ లింద్రి యముల నుద్రేకించుననియు ఇవి భక్తులకు దూరస్థములై యుండవలెననియు వచించువాక్కులు సత్యేతరములు. సగుణోపాసనము లలితకళారాధనమునకు సహపాఠి. సగుణోపాసనమునకు దైనికజీవనమున ప్రాముఖ్యమొసగిన వైష్ణవ మతాచార్యులు ఆధ్యాత్మికజీవితమునకు లలితకళాసంపర్కము అక్కఱైనదని తలంచిరి. ఆనందోపాసనమందును భావవ్రతమందును రసానుభూతియందును తన్మయత్వమందును శ్రీకృష్ణచైతన్యుని జీవితము పరిపూర్ణత్వసిద్ధి నందినది- శ్రీకృష్ణచైతన్యుని మహోద్యమము విశేషించి భక్తియోగమునకు సంబంధించి నది. మార్గములు వేరైనను వీరియాశయములు మహోదారములై నాటి సీమలయందు కల్యాణమండపములను నెలకొలిపినవి.

ద్రమిడ గుహదేవ టంక అశ్మరథ్య శ్రీవత్సాంకులు శ్రీరామానుజ స్వామికి పూర్వమే ఒకవిధముగ విశిష్టాద్వైత వాదమును నిర్వచించియుండిరి. వీరివాదములలోని భావదుందుభులు శ్రీరామానుజస్వామి హృదయమున ప్రతిధ్వనించెను. యతిరాజు సిద్ధాంతమునుండి వెడలిన భావధ్వనులు ప్రపంచ

మందలి మహామనీషుల హృదయములనుండి ముఖరితములైనవి. మన యతిరాజు ప్రతిభను వర్ణింపవలెననిన ఆమహనీయుని ప్రజ్ఞావిశేషములను ప్రస్తుతింపవలెననిన విశిష్టాద్వైతమందలి దివ్యదీపకళికకు జేజేలుపాడి సాహితీ జగతిలో వెలుగువెల్లువను వెలారింపవలెననిన హిమగిరిబోలు ఆతని హృదయమునుండి జాలువారిన భావజహ్నవిని సంస్తుతింపవలెననిన ఆమహాత్ముని స్మరించినంతన ఆతని పవిత్రనామము నుచ్చరించినంతన చిత్తమున పొంగి పొరలు భావపరంపరను వ్యక్తీకరింపవలెననిన వేయేల శ్రీరామానుజస్వామి చరిత్రను సమగ్రముగ చిత్రింపవలెననిన ఉద్గ్రంథముల నెన్నెని సృష్టించ వలయును. మహత్తర తపశ్శక్తి కతన హృదయస్థ మహాద్భుత ప్రతిభను కోటిమడుంగులు వృద్ధిచేసి సజీవుడై యున్నపుడే ఆత్మపీఠమును వైకుంఠమున నెలికొలిపి శ్రీపతితో ముద్దుముచ్చటలాడి అమరగణమునకు సయిత మాచార్యుడై సౌందర్యోపాసనమున నమృతసూతికి సహపాఠియై మధురభావ సుధాకలశము నాత్మహృది నిడికొని అమృతపుత్రుడై అఖిలవిశ్వహృదయమున అమరజీవియై దివ్యబృందావనమున వనమాలిక మిగులగూర్చు నెచ్చెలియై నిజాత్మను కలహంసగావించి మురళీగానలహరియందు దేలించి తానెంతయు మురిసి, శ్రీరామాజస్వామి ముల్లోకములకు ముద మొనగూర్చెడు వాడయ్యెనుగదా. ఐహికోన్నతికై దేవులాడక స్వకీయసాంసారిక పురోభివృద్ధికై నడుములుకట్టక ఆధ్యాత్మిక విభూతినంది తమభాగ్యమును తామే యనుభవింపక ఒరులకు పంచియిచ్చి పరార్థజీవులై ఈశ్వరసేవ మానవసేవలందు సిద్ధహస్తులై ఈమహనీయ గుణగరిష్ఠులు వఱలిరి. శ్రీరామానుజుడు భగవంతుని వక్షస్థలమున కౌస్తుభమై వెలుగొందినాడు. సాధారణమానవుడై పుట్టినజీవి తన తపశ్శక్తికతన తనస్థితప్రజ్ఞకతన తనదృఢనిశ్చయముకతన తన వజ్రసంకల్పముకతన కోటిసూర్యులకు గురుండుకాగలడని ఋజువొనరించిన మహాద్భుత గుణగరిష్ఠులు మన శంకరరామానుజులు.

విశిష్టాద్వైతసిద్ధాంతము యతిరాజు తరువాతి యాచార్యుల ప్రబోధము వలన నెట్లువృద్ధియైనదో తెలుపుటకొంత యావశ్యకము. శ్రీరామాజస్వామి యనంతరము పూర్వోక్త సిద్ధాంతమును బలవత్తర మొనరించిన ప్రజ్ఞాధురీణుడైన దేశికాచార్యుని గుఱించిన సంక్షేపోదంతము నిందు తెలుపుట కర్తవ్యము.

హైందవమతచరిత్రపాఠకులలో కొందఱికిమాత్రము శ్రీ వేదాంత దేశికాచార్యస్వామి నామధేయము పరిచితమైనది. శ్రీరామానుజస్వామి యనంతరము విశిష్టాద్వైతమతమును శత్రుదుర్భేద్య మొనరించిన శక్తిసంపన్ను డాతడు.

ఆతని తండ్రి అనంతసూరి; తల్లి తోతారాంబ. ఆమె ఆత్రేయరామానుజు డను మహావిద్వాంసుని సోదరి. వేదాంతదేశికునకు వేంకటనాథుడను నామాంతరము కలదు. కంజీవరమునకు సమీపమునందుగల తుప్పిల్ అను గ్రామమున నాతడు క్రైస్తవశకము 1269 సంవత్సరమున పుట్టినాడు. బాల్యకాలమందే ఉపనిషత్తులందును తమిళప్రబంధములందును వివిధభారత తాత్త్వికశాఖలందును అద్భుతమైన పాండితినందినాడు. విద్వన్మణియైన మాతులచెంత ఆత డాప్రజ్ఞను పడసియుండును. ఇరువదేండ్లకుమున్నె సమస్తశాస్త్రములందును సర్వకళల యందును ఆరితేఱితినని స్వీయవిరచిత "సంకల్పసూర్యోదయ" నాటకమందలి ప్రథమాంకములోని పదినేనవశ్లోకమున నాతడు తెలుపుకొనినాడు. విజ్ఞాన యాత్రికుడై పరిభ్రమింపవలెనను వాంఛ అచిరములో ఆతని హృదయమున తలయెత్తినది. పయనమై మునిముఖ్యుల దృష్టి నాకర్షించు బదరికాశ్రమమును జేరుకొని కొంతకాల మందు వసించినాడు.

తత్త్వశాస్త్రమతశాస్త్రములందేకాక సాహిత్యకళయందు శ్రీదేశికాచార్యులు అనల్పమైన ప్రజ్ఞను ప్రకటించెను. శతాధికగ్రంథములం దాతని ప్రజ్ఞ మహోజ్జ్వలమై వెలసినది. మాతృభాషయైన తమిళమునందును, సంస్కృతమునందును ఆతడు సమానమైన ప్రజ్ఞను ప్రకటించినాడు. ఆతని వచనములు గంభీరభావబంధురములై సర్వాంగసుందరములై వెలసినవి.

"తత్త్వముక్తకలాప" మను స్వీయరచితగ్రంథమున కాతడు "సర్వార్థసిద్ధి" యను వ్యాఖ్యానమును వ్రాసినాడు. "శ్రీభాష్యము" నుండి మీగడ తఱకలను తీసి "అధికారసారావళి" ని సృష్టించినాడు. భావగంభీర్యమునకు శైలిసౌందర్యము దీటై ఆతని శ్లోకములందు వెలయుచుండును. యతిరాజు "గీతాభాష్యము" నకు చక్కని భాష్యమైన "తాత్పర్యచంద్రిక" ను వ్రాసి ఆతడు విశేషప్రశస్తి సందినాడు. "న్యాయసిద్ధాంజనము" ను ముగించిన పిదప పూర్వోత్తరమీమాంసలకు సమీక్షను వ్రాసినాడు. "యతిరాజ

సప్తతి" యందు శ్రీరామానుజస్వామిని ప్రస్తుతించినాడు. "పంచరాత్ర రక్ష; రహస్యరక్ష; సచ్చరితరక్ష" అను వాని గ్రంథములందు శ్రీవైష్ణవుల దైనికనియమములను దైనికాచారములును కౌశలముతో పరిశీలింపబడినవి. ఆతని పురాణగ్రంథములలో "యాదవాభ్యుదయము" మిగుల ప్రసిద్ధి పడసినది. యశస్విలకుడైన అద్వైతపండితుడు అప్పయ్యదీక్షితులు ఈగ్రంథ మందలి భావశబలతకు మిగుల నచ్చెరువంది దానికి అమూల్యమైన భాష్యమును వ్రాసినాడు.

దివ్యదీపకళికవలె తేజరిల్లిన కాళిదాసుమహాకవి ప్రతిభకు శ్రీదేశికా చార్యులు అంజలిఘటించినాడు. "కవిసార్వభౌము డాత" డని చాటినాడు. "మేఘదూత" ను అనుకరించి సంస్కృతమున "హంససందేశము"ను రచించి నాడు.

ఆశుకవనమున నాత డజేయుడైనాడు. "కవిసింహ" బిరుదును వహిం చుట కాత డర్హుడుకాడని కొందరు పండితులు పలికినపుడు తన ప్రజ్ఞను బహు భంగుల ప్రకటింపసాగినాడు. మహాప్రభుపుపాదుకలను దృష్టియం దిడికొని "పాదుకాసహస్ర" మను వేయిపద్యములు ఆశువుగా రచించి ప్రతికూల వాదుల కెంతయు నాశ్చర్యమును కలిగించినాడు.

స్వతంత్రమార్గము ననుసరించియే యాతడు "సంకల్పసూర్యో దయము" రచించినాడు. అది పదియంకముల వేదాంతనాటకము. శ్రీదేశి కాచార్యుల ఆశయము లెంత ఉదారములైనవో ఈగ్రంథము చెప్పక చెప్పు చున్నది. ఇందలి ప్రధానభావము మానవముక్తికి సంబంధించినది. పామర జనరంజకములైన శృంగారవీరకరుణారసములనుగాక శాంతరసమున కాతడు ఈయుద్గ్రంథమున ప్రాముఖ్య మొసగినాడు. శృంగారరౌద్రరసముల నాతడు కొద్దిచూపుతో చూచెనని నటికి సూత్రధారు డొసగిన ప్రత్యుత్తరము వ్యక్తీక రించుచున్నది. మానవయాతనను మాపుచేయునది శాంతరసమని యాతని యభిప్రాయము.

భావనమందును సునిశితపరిశీలనమందును గభీరచింతనమందును పటుత్వ మహత్త్వములతో నొప్పు కవిత్వమందును ఆతనికిగల శక్తిసామర్థ్యములను గమనించియే మనీషు లాతనిని "కవితార్కికసింహ" డని "సర్వస్వతంత్ర స్వతంత్రు" డనియును ప్రస్తుతించిరి.

ఇచ్ఛగించినచో ఆతడు మహైశ్వర్యసంపన్నుడై సమస్తభోగములను అనుభవింపజాలువాడు. రాజన్యుల దాక్షిణ్యము నాతడు కొద్దిచూపుతో చూచువాడు. పోతనామాత్య త్యాగరాజస్వాములవలె దేశికాచార్యులు ఆత్మ గౌరవమునకెంతేని విలువగట్టినాడు. ఆతని యంతరంగమిత్రుడును సుప్రసిద్ధ పండితరేణ్యుడునైన విద్యారణ్యుడు విజయనగర ఆస్థానమున ప్రవేశింపుమని కోరినపుడు "వాంఛలు లేనివానికి రాజాదరము గడ్డిపరకవంటిదే" అని యాతడు పలికినాడు. "లేని స్వర్ణఛత్రముక్రింద నీవు నిలుచుటపాడి" యని విద్యారణ్యస్వామి పలికినపుడు "ఆకలిబాధతీర్చుటకు కళ్ళములోని కొలదిపాటి గింజలు చాలవా చెరువులోని దోసెడునీరు దాహముతీర్చి ఉసురులను నిలుపదా? అనాయాసముగా తెరువునదొరకు గుడ్డపేలిక కౌపీనము కాజాలదా? భాగ్యభోగము లెందుకు; జానెడు పొట్టకై రాజులను దేవురింపనేల? అని దేశికస్వామి ప్రత్యుత్తరమొసంగినాడు. విద్యారణ్యస్వామి అప్పుడైనను తన పట్టును విడిచినవాడుకాడు. బుక్కరాయమహీపతిని రాజధాని కనతిదూర మందలి కొండొకప్రదేశమునకు గొనివత్తుననియు అచ్చో వానిని గలసికొను మనియు మిత్రున కాతడు హితవొసగినాడు. అపుడుకూడ దేశికాచార్యులు 'ససేమిరా' యనినాడు. "ఇట్టిభోగములు మాసాంప్రదాయమునకు సరి పడవు. విత్తనము నాకేల, తండ్రి నాకిచ్చినదేమియునులేదు, ధనార్జనమునకై నేనెన్నడును నడుము గట్టియుండలేదు. హస్తిగిరిపై కంచిపతి శ్రీవరదరాజ స్వామి ప్రసాదించిన పరమార్థము నాకుకలదు అదియే నాకు పదివేలు" అని జలదగంభీరమున దేశికస్వామి పలికినాడు.

గృహస్థుడై యుండియు యతీంద్రులకు నీసుకొలుపు త్యాగము నాతడు చూపినాడు. విద్యారణ్యస్వామి ఆశ్చర్యాన్వితుడైనాడు. అట్టిమహనీయగుణ గరిష్ఠుడు తనకుమిగుల గూర్చునెచ్చెలి యైనందులకు పరమానందభరితుడై నాడు. ఆతని హృదయమహత్త్వమును హృదయంగమ మొనరించుకొనినదాది ఘనతరాదరానురాగముల జూపుచు వానికి మఱింతసన్నిహితుడై మెలగ దొడగినాడు. ప్రజలిచ్చు తండులములతో కుటుంబపోషణ మొనరించుకొనుచు భావాంబరవిహారియై ఐశ్వర్యవంతులు స్వప్నమందైన నెఱుగని యానందమును దేశికాచార్యులు పొందుచుండెను.

ఆతని పాండితి యెంతదొడ్డదియో అతని చరిత్రకూడ అంతదొడ్డదియే యని తెలుపజెల్లును. మూర్తీభవించిన నమ్రత దేశికాచార్యులని చెప్ప నొప్పును. ఆతడు విశాలహృదయుడు. శాంతమూర్తి. ఆతని వ్యక్తిత్వమునకు ఘనతరమహిమను చేకూర్చినవి శాంతసహనములు.

"శృతప్రకాశిక" ను విధ్వంసమునుండి కాపాడి దేశికాచార్యులు వైష్ణవ మతమున కెంతేని మేలుగావించినాడు. సుప్రసిద్ధతత్త్వవేత్త సుదర్శనభట్టాచార్యుడు యతిరాజు శ్రీభాష్యమునకు వ్రాసిన టీకయిది. అల్లావుద్దీన్ సేనాధిపతియైన మాలికాఫర్ క్రైస్తవశకమున 1327 సంవత్సరమున శ్రీరంగముపై దండెత్తినపుడు, తాండవనృత్యము సేయుచు ఎందఱెందఱినో కబళించు మృత్యుదేవత నోటబడుటకుముందు ఆమహాపండితుడు తనయుద్గ్రంథమును ఇరువురు బిడ్డలను దేశికాచార్యుని చేతులయందుబెట్టి పురమునుండి వెడలి పొమ్మని వానిని కోరెను. మిత్రుని శిశువులను గ్రంథముగైకొని దేశికస్వామి మైసూరు రాష్ట్రమున కరిగి కొంతకాలము కడచినపిదప శ్రీరంగమునకు మరలినాడు.

తన జీవితమందలి విశేషభాగమును దేశికాచార్యులు శ్రీరంగమందును తిరవహీంద్రపురమందును ఆదర్శగృహస్థుడై కడపినాడు. వృద్ధుడైనపిదప తాత్త్విక చర్చలకు మనసీయక ఆతడు నిశ్చలధ్యానమునందును అవిచలిత సమాధియందును విశేషకాలము ఆత్మవిస్మృతుడై యుండువాడు! రామానుజ స్వామివలె దీర్ఘజీవియై అనంతరమాతడు దివ్యబృందావనమున ప్రవేశించినాడు.

జిజ్ఞాసువులకు ముఖ్యముగ గృహస్థులైన జిజ్ఞాసువులకు శ్రీదేశికాచార్యుల జీవితము ఆదర్శప్రాయమైనది. ముముక్షువు గార్హస్థ్యజీవనమునకు నీరువదల నక్కరలేదని ఈమహాత్ముని చరిత్రమువలన గ్రహింతుము. ఈతని శక్తి సర్వతోముఖమైనది. త్రిమతాచార్యులమేలిదృష్టాంతమున కంజలి ఘటించి శ్రీదేశికాచార్యుడు వఱలెను. భవతారకములైన భావములను స్వీయరచనములందు వజ్రాలవర్షమట్లు కురియించి తమ తమ జీవితాంగణము లందు వైకుంఠ కైలాసములను ప్రతిష్ఠించి వారు ధన్యజీవులైరి.

---

# ౬౧

# బుద్ధభగవానుడు

---

“మ. ఒరుబాగుం దనబాగుగా, నటులె యోగోగుంగ భావించుకొం
చొరుచేతం దన కప్రియంబు లెవి యౌనో యట్టి వెన్నండ వె
వ్వరికిం జేయక సాధుజీవనమునన్ వర్తించు నీభక్తుం డీ
శ్వర ! నిర్మోహజగత్కుటుంబుండు తుదిం బ్రాపించుం గైవల్యమున్.”

చరిత్రయుగమున గౌతమబుద్ధున కీడువచ్చు త్యాగమూర్తి నింకొక్కరుని గనజాలము.

లుంబినీవనమున మహామాయకడుపునపుట్టి కపిలవస్తుపురభర్త శుద్ధోదనునకు లేక లేక కలిగిన కూర్మిపట్టియై గారాబముతో పెరిగి సర్వవిద్యలం దారితేఱి మహదైశ్వర్యసంపన్నుండై మేలిమేడలందు మనలి రతనాలరాసులందు చరించి అశేషవిభవమున కధిపతియై అనూనభోగములను పిడికిటబట్టజాలియు, జగతిలో జరామరణము లుండుటగాంచి వసుంధరవనటకాటపట్టని యెఱింగి యైహికైశ్వర్యమునురోసి రాజ్యలక్ష్మినిబాసిసౌందర్యలక్ష్మియైన అర్ధాంగలక్ష్మిని వీడి అనుంగుపుత్రుడైన రాహులుని రత్నదీపికాకాంతిపూరమున జననీహస్తస్పర్శయందు సౌందర్యసందీపితుడై వెలయుచుంట నొక్కతూరి విలోకించి చిత్తమందలి వ్యామోహమును దూరీకృతమొనరించి కన్నతండ్రి శుద్ధోదనుని చింతను దలపక సవతితల్లి ప్రజాపతివంతను యోచింపక శృంగారమును కాలదన్ని వైరాగ్యమును వరించి అర్ధనిశీథినీసమయమున నిజభవనమునుండి నిర్గమించి రాజవసనములను మేలిదువ్వలువలను పట్టుపుట్టములను భూరిమాయాంగదతారహారములను పరిచారకున కొసగి వాని కౌపీనమును తానుదాల్చి పైడిపాత్రలకు బదులు మట్టిమూకుడు చేబూని తన మహాత్యాగముకతన ముముక్షువులకును మునీంద్రులకును ఈసుబుట్టించి తన హృదయమహత్త్వముచే త్రిమూర్తులకన్నులకు సయితము మిఱుమిట్లుగొలిపి పరివ్రాజకచక్రవర్తియై అరణ్యములబడి పోయిపోయి సామాన్యగురువులకి ప్రబోధమున నాత్మశాంతి

నందక గయాక్షేత్ర పరిసరమున బోధిద్రుమముచెంత నాఱేండ్లు కఠోరతప మొనరించి దివ్యాలోకము నాలోకించి తోడన సమ్యక్సంబుద్ధుడై సారనాథ మున కరిగి, మృగదావమున కౌండిన్యునకును మఱి నలువురు విప్రులకును ప్రథమోపదేశమును ప్రసాదించి స్థానస్థానములందు పరిభ్రమించి మహత్తర మతసత్వములను జిజ్ఞాసువులకు ప్రబోధించి ఆనంద ఉపాలిమున్నగు శిష్యుల చేతులకు కొంగ్రొత్తదీపికలొసగి తమసావృతములైన ప్రదేశముల నాలోక సందీపితము లొనరించి పరార్థజీవియై ఈమహాత్ముడు మానవకోటికి పూజ్యుడై నిఖిలయుగములం దారాధ్యుడై వఱలినాడు. సిద్ధార్థచరిత్రసింహావలోకన మెవ్వరిహృదయమును ఉత్తాలభావతరంగములతో నింపదు? ఎంద ఱెందఱి గుండియ లుద్వేగభరిత మొనరింపదు? ఈమహాత్యాగి భాసురచరిత్రనాలోకించి "సరిగంచు నెఱిమించు చల్వవల్వలు దాల్చు లలితుండు కావిశాటులు ధరించె" నని కవీంద్రు లెంద ఱెంద ఱాతనిని ప్రస్తుతించుటలేదు.

జరామరణములు యాతనను కలిగించుననియు వాంఛ దుఃఖజనక మనియు వాంఛారహితుడు దుఃఖాంతమును గావించుననియు దుఃఖాంతమే నిర్వాణమనియు శాక్యముని వచించినాడు. శృంగారమును కఠోరమైన వైరాగ్య మును గాక మధ్యమార్గమును మానవు డనుసరింపవలెనని ఈతడు ప్రబోధించి నాడు. శారీరకమైన హింస ఉద్దేశసిద్ధికి తోడుపడదని స్వానుభవమువలన నీతడు గ్రహించినాడు. 'సమ్యగ్దృష్టి' సమ్యక్సంకల్పము, సమ్యగ్వాక్కు, సమ్యగాజీవము, సమ్యక్కర్మము, సమ్యగ్వ్యాయామము, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి' అను అంగములు అష్టాంగమార్గమున నిర్వాణప్రాప్తి గలిగించు నని శాక్యసింహు డనినాడు. ఈతడు అత్యాచార దురాచారములకు విరోధి యైనాడు. ప్రాణిహింసను ప్రతిఘటించినాడు. కర్మవాదమును సమర్థించినాడు. వేదమతసంస్కారము నభిలషించినాడు. జన్మాంతరము లున్నవని విశ్వసించి నాడు. నిర్వాణప్రాప్తికి బుద్ధుడును ధర్మమును సంఘమును శరణ్యము లనినాడు. ఆత్మసంయమమునకు జితేంద్రియత్వమునకు నిర్మలజీవితమునకు నైతికోన్నతికి బుద్ధభగవానుడు ప్రాముఖ్యత నొసగినాడు. ఈతడు ప్రబోధించినది నాస్తిక మతమని కొందఱు అపోహపడుచుందురు. దేవుడు లేడని యాతడెన్నడును పలుకలేదు. హృదయమందలి పంకిలమును ముందుగ ముముక్షువు కడిగివేయ

వలెనని ఈతడు పలికినాడు. తనభావమును కథాపరంపరలో నీతడు వ్యక్తీక రించినాడు. ఒకడు వనముగుండా పోవుచుండగా వాడియైన అమ్ము ఎందుండియో వచ్చి వాని రొమ్మున నాటుకొనినపుడు, నేలకూలి ఆనిర్భాగ్యుడు బాణము వేసినినవాని కులగోత్రములను బాణనిర్మాణమును గుఱించిన ఉదంతమును అరయగోరునా లేక వాడియమ్మును తొలుత తనరొమ్మునుండి యూడవెఱికించుకొన చూచునా యని ఈశ్వరతత్త్వమునుగూర్చి తనప్రధానశిష్యులలో నొక్కండు ప్రశ్నించినపుడు గౌతమబుద్ధుడు మరల ప్రశ్నించినాడు. వర్తమాన యాతనమును తొలగించుకొనియే జిజ్ఞాసువు పరతత్త్వమును గుఱించిన ప్రసంగమునకు మనసు నిచ్చునను ధ్వని ఈకథాంశమందు కలదు.

సర్వజాతులవారికిని స్త్రీ పురుషులను సమానదృష్టితో వీక్షించి తన మతమునందలి సత్యములను వారి మానసాంజలులందు బుద్ధభగవానుడు పోసినాడు. ఆతడు సంబోధియైన యైదేండ్లకు న్యగ్రోధవనమున ఆతని పినతల్లియైన మహాప్రజాపతి గౌతమభిక్షునీదీక్ష నందినది. ఆమెదృష్టాంత మనేకులకు మేలు బంతియైనది. గౌతమబుద్ధిని సన్నిహితబంధువులు యశోధరాప్రభృతులు, సుందరీనందులు, శుద్ధోదనరాహులులును తరువాత దీక్షనందిరి.

ఆనంద ఉపాలి మున్నగువారు శాక్యమునికి కడుంగడు సన్నిహితులైన అంతేవాసులు. బుద్ధప్రబోధసుధాసారసేచనమున వీరు బద్ధదీక్షితులైరి.

బౌద్ధమత ధర్మబీజములు హిందూధర్మబీజములట్లు గిరికందరములందును వనములందును ఆరామములందును నదీతీరములందును నాటుకొని మహామహీరుహములై తమశాఖలను ఉపశాఖలను బహుళసీమలందు ప్రసాదింపజాలెను. మహీపతియొక్కండు బడుగుజడదారియై ప్రబోధించిన మహితసత్యములు మఱికొందఱు మహీపతుల హృదయములందింకి వారిని జడదారుల గావించివైచెను. బింబిసార అశోక హర్ష కనిష్కులు బౌద్ధరాజర్షులై పరార్థజీవులై మహిమోపేతులై బౌద్ధధర్మ సంస్థాపనకై ఎన్నెన్నియో వ్యవస్థలు గావించిరి. బర్మా, సయాము, సింహళము, బేబిలన్, చైనా, టిబెట్టు దేశముల కా రాజర్షులు బౌద్ధపరివ్రాజకులను పుత్తెంచి యాతని శాసనము నాయాసీమలయందు ప్రతిష్ఠించిరి. చైనా మున్నగు సీమలనుండి విజ్ఞానయాత్రికులు అష్టకష్టములకు లోనై మనదేశమున కరుదెంచి బౌద్ధమతధర్మమును హృదయంగమ మొనరించుకొని నాటి భారత నాగరకతా మహిమను బహుళభంగుల ప్రస్తుతించి తమ

ప్రస్తుతిని ప్రపంచ చరిత్రయందు ప్రవేశింపజేసిరి. దూరదేశములనుండి నేడును బౌద్ధయాత్రికులు శాక్యముని జన్మభూమి కరుదెంచుచుందురు. సిద్ధార్థుడే బోధిద్రుమము చెంత కఠోరతపమొనరించి దివ్యాలోకము నవలోకించినాడో ఏపవిత్రభూరుహముచెంత రెండు సహస్రాబ్దులు తథాగతుని చరణకమలముల నుద్దేశించి చాగిల్రమ్రొక్కినవో, ఏయశ్వత్థవృక్షముచెంత బౌద్ధవిజ్ఞానలహరి సౌందర్యాంహారియై అవిరతముగ స్రవించినదో ఏతరువు నాడును నేడును జగతియందలి తరువులలో తలమానికమై తనరారి భావబంధుర మహోపన్యాసము నొనగుచున్నదో ఆపవిత్ర ప్రదేశమున నేడును బౌద్ధయాత్రికులు—విదేశీయులైన యాత్రికులు మస్తకన్యస్తహస్తులై నిమీలితనేత్రులై

"జ్ఞానప్రపూర్ణుడైన భగవంతునకు నమస్సులు
జ్ఞానప్రపూర్ణు ... ...
జ్ఞానప్రపూర్ణుడైన ... ...
బుద్ధుని శరణువేడెదను
ధర్మముయొక్క శరణువేడెదను
సంఘముయొక్క శరణువేడెదను
రెండవపర్యాయము బుద్ధుని శరణువేడెదను.
రెండవ పర్యాయము ధర్మముయొక్క శరణు వేడెదను.
రెండవ పర్యాయము సంఘముయొక్క శరణు వేడెదను.
మూడవమారు బుద్ధుని శరణు వేడెదను.
మూడవ మారు ధర్మముయొక్క శరణు వేడెదను.
మూడవ మారు సంఘముయొక్క శరణు వేడెదను.
ఏప్రాణినైనను హింసింపనని ప్రమాణముచేయుచున్నాను.

చౌర్యభావముతో ఏవస్తువునైనను అంటనని ప్రమాణము నొనరించుచున్నాను.

కామసంబంధమైన మిథ్యాచారముల ననుష్ఠింపనని ప్రమాణము చేయుచున్నాను.

ఏరీతి సురాపానమునైనను చేయనని ప్రమాణము చేయుచున్నాను.

అని గంభీరగళనాదముతో భక్తిభరితహృదయులై పలుకుచుందురు. ఈపవిత్రవాక్కులను వారు పలుమారు పునశ్చరణ మొనరించుచుందురు.

ధర్మమే సత్యమనియు సత్యమేధర్మమనియు మన యుపనిషత్తులు గురు గంభీరస్వరమున పలికినవిగదా! ధర్మప్రతిష్ఠకై మహాత్యాగ మొనరించిన గౌతమబుద్ధుడు జగతియందలి సత్యాన్వేషులందు అగ్రపీఠము నలంక రించినాడు.

సుప్రసిద్ధులైన అధునాతన ఆంధ్రసారస్వత ఉపాసకులు తిరుపతి వెంకట కవుల "బుద్ధ చరిత్ర" యందును వారి శిష్యులైన పింగళ కాటూరి కవులు "సౌందరనందము" నందును బౌద్ధధర్మాశయములను కడుంగడు కౌశలముతో వ్యక్తీకరించిరి.

"చ. అమృతరసంబు వెల్లివిరియంగ మహాత్ముడు బుద్ధుఁ డెల్లలో
కములకు జ్ఞానబోధమొనకఁబునఁ జేయుచునుండ సూర్యుఁ డ
స్తమితుఁడుగాక భూధరనితంబ సమీపతలంబులంధ ని
క్కము వసియించుచు న్వినియెఁగాని తలంపడు కాలధైర్యమున్"

"ఉ. జ్ఞానము నెల్లవారికినొసంగెడి బుద్ధుని బుద్ధుడాత్మ భా
షానుగతిన్వచించు వచనావళి యాదటనాలకించు నా
నానరజాతికిందగ వినంబడుచుండె స్వకీయదేశ భా
షానియతిన్మహాత్ముల కసాధ్యములుంగలుగంగ నేర్చునే" (బుద్ధచరిత్రము)

"గీ. ప్రేమకన్న సత్యములేదు భిక్షువులకు
పరమసత్యముకన్న సుందరములేదు
లభ్యమైతి సౌందర్యలాలసుడవీవు
రసమయములేను మనవిహారమ్ములింక.

"గీ. తీయతలఁపులు మొదలంట ద్రెంపుమనుచు
హృదయమూనమ్ము త్రుంపుమం చే వచింపఁ
బ్రేమశూన్యము గాదోయి భిక్షుగుణము
జీవకారుణ్యమే మాకు జీవకట్ట" (సౌందరనందము)

బుద్ధభగవానుని జీవితము మహామహిమోపేతము అనుట సత్యము. ఉత్కృష్ట ఆదర్శపదీప్తమైనదనుట తథ్యము. ఉజ్జ్వలభావమండితమైనదనుట నిక్కము. సౌందర్యమాధుర్య సౌమనస్యసమన్వితమైనదనుట యథార్థము. అందలి పరమార్థమును గ్రహించి ధన్యజీవులమై భవ్యపథగాములమగుట మన పవిత్రకర్తవ్యము.

---

౬౨

# శ్రీ త్యా గ రా జ స్వా మి



"ఉ. సామమనోజ్ఞ గానమును సల్పుచు సాధుమిళింద బృంద మెం
దామెత లొందుచుండు నిగమాంత సుధారసవద్వచోప్సర
స్సీమలఁ గమ్మవాసనల సీధువు వేనఁదొరంగుచుండుఁ ద
త్కోమల పాదపద్మములకున్ బ్రణతుల్ పొనరింతు వేకువన్"

నారద ప్రహ్లాదాది పౌరాణిక మహాభక్తుల మేలి దృష్టాంతముమీదను బమ్మెర పోతన భద్రాచల రామదాసాది చారిత్రక భక్తవరేణ్యుల భవ్యజీవిత విధానములమీదను కన్నుంచి అస్తమయమెఱుగని సప్తఋషిమండలమువలె వెలుగొందు ఉదారాశయములపై చూడ్కినిలిపి ఆత్మహృదయమును ఆలోక సందీపిత మొనరించి స్వీయజీవిత తత్త్వమునకు సాహిత్యపటుత్వమును సంగీత మహత్త్వమును తోడ్పొనరించి మహిమోపేతుడై మహనీయ గుణగరిష్ఠుడై గృహస్థుండయ్యు భాగవతులందు తలమానికమై కళోపాసకులందు శమంతకమై సారస్వతాచారులలో శిరోరత్నమై ఆనందవ్రతులలో కౌస్తుభమై గాయక సార్వభౌముడై శ్రీరామచంద్రునకు సన్నిహితుడై అసంఖ్యాకుల హృదయము లం దారాధ్య దైవతమైన త్యాగరాజస్వామి ఆంధ్రుడు. కవియై వేదాంతియై గాయకుడై భక్తుడై తాత్వికుడై ఆచార్యుడైన ఈమహాత్ముని జీవితోదంతము నందలి ప్రధానాంశములను పరికింతురుగాక.

త్యాగరాజు క్రీ. శ. 1759 సంవత్సరమున భూతలమున నవతరించి 1847 లో పరాభవ సంవత్సరమున పుష్యబహుళ పంచమి తిథియందు బుధ వారమునాడు స్వస్థలమైన వైకుంఠమును జేరుకొనినాడు. జగతీశునకు ప్రీతి గొలుపుచు తన దీర్ఘజీవితము నీతడు మహిమోపేత మొనరించినాడు.

ఇతడు పండితవంశమున పుట్టినాడు. త్యాగరాజుతండ్రి రామబ్రహ్మము. తల్లి శాంతమ్మ. తాత గిరరాజుకవి. మురికినాటిశాఖకుచేరిన బ్రాహ్మణుండు. ఇంటిపేరు కాకర్లవారు. భారద్వాజసగోత్రికుడు. తంజావూరును రెండవ షాజీ

యను మహారాష్ట్రరాజు పాలించునపుడు గిరిరాజుకవి తేని యనుగ్రహమును సంపాదించినాడు. తిరువళ్ళూరు అనుపల్లెలో వసించువాడు. సంస్కృతాంధ్రము లందు మేటిపండితుడు. ఇతని తాతముత్తాతలు నాయకరాజుల కాలమున తంజావూరు రాష్ట్రమునకరిగి యందు స్థిరపడిరి. వీరు సదాచారసంపన్నులయిన కుటుంబీకులు. గిరిరాజున కైదుగురు కొడుకులు. అయిదవవాడు రామ బ్రహ్మము. సంస్కృతాంధ్రములయందు అందెవేసిన చెయ్యి. భక్తుడు; వేదాంత కీర్తనలు రచించిన ప్రతిభాశాలి. వీని కిరువురు తనయులు కలిగిరి. పెద్దవాడు జ్యపేశను. తిరువళ్ళూరుస్వామి నారాధించువాడు కావున స్వామి నామధేయ ముతో రామబ్రహ్మ మాతనిని పిలుచుచుండువాడు. రెండవబాలుడే త్యాగ రాజు. కొంతకాలమైనపిదప పిల్లల చదువుకొఱకు కావేరీతీరమందలి తిరువ య్యారుకు రామబ్రహ్మము వెడలినాడు. పంచనదమనియు తపస్తీర్థమనియు ప్రసిద్ధికెక్కిన ఆయూరున సంస్కృతపాఠశాల యుండెను. అల్కొండారుదేవు డాప్రదేశమున వెలయుటచే అది పుణ్యక్షేత్రమాయెను. శైశవమును త్యాగ రాజందు గడపుటచేసి ఆచోటు పైవానికి మిక్కిలి మక్కువ కలిగెను. అందు వెలసిన ధర్మసంవర్ధనీపంచనదేశ్వరుల నాతడు బహుభంగుల ప్రస్తుతించినాడు. ఆక్షేత్రమున త్యాగరాజు సంస్కృతాంధ్రములను చక్కగ నభ్యసించెను. నైసర్గికప్రతిభానమన్వితుడగుటచేసి అప్పటినుండియు కృతులను కీర్తనలను రచించి రాల్లఱగునట్లు పాడుచుండువాడు. సనాతనధర్మపరాయణుడై సనాతన మతశాసనములను శిరసావహించువాడు. దల్లిదండ్రులయెడ మిక్కిలి భక్తిగలిగి వర్తించువాడు. వారిని సీతారాములట్లు చూచుచుండువాడు. "శ్రీరామ స్వరూపుడనదగు రామబ్రహ్మార్యసుతుడ రాగరహితుడ" నని అతడే చెప్పు కొనినాడు.

తనయులకు వివాహములైనపిదప శాంతమ్మరామబ్రహ్మములు దివం గతులైరి. త్యాగయ్య భార్య కమలాంబ సుశీల.

తండ్రి యారాధించుచుండెడి విగ్రహములను భక్తిభరితహృదయుడై త్యాగరా జారాధించుచుండువాడు. నిత్యము రామసంకీర్తన మాచరించు చుండువాడు. ఆతని భక్తియును గానవిద్యాకౌశలమును పలువుర నాకర్షించెను. పెక్కుచోటులనుండి జిజ్ఞాసువు లరుదెంచి శిష్యులై ఆతని చరణోపాంతమున

నధివసింపసాగిరి.. కాని త్యాగయ్య జిజ్ఞాసువులందు చక్రవర్తియై మోక్షము నకు మార్గదర్శకుడు కాజాలు గురువర్యునకై తపింపదొడగినాడు. ఇట్లుండ కాంచీపురమునుండి కొంతకాలమున కొకమహాత్ము డరుదెంచి ఆతనికి తారక మంత్ర ముపదేశించెను. తొంబదియాఱుకోట్ల పర్యాయము లాతడు తారక మును పునశ్చరణ మాచరించినాడు. నిరంతరరామసంస్మరణ రామసంకీర్తన ములకతన శ్రీరామచంద్రు డాతనికి ప్రత్యక్షమాయెను. తదనంతర మాతనికి నారాయణసంకీర్తన మాచరించుచు నారదుడు దర్శనమిచ్చి "స్వరార్ణవ" మను సంగీతగ్రంథమును ఆదరానురాగములతో వానికిచ్చి గానమహత్త్వ మును లోకమున చాటుమనిచెప్పి యదృశ్యుడాయెను.

త్యాగరాజు జీవితవిధానము అసంఖ్యాలకు ప్రీతిగొలిపినను ఆతని యన్నకును వదినెకును ఈర్ష్య గలిగించెను. సంకీర్తనము వారికిష్టములేక పోయెను. పాపము త్యాగయ్యను వారు పెక్కురీతుల బాధింపసాగిరి. విభాగ మునకై అన్న తొందరపెట్టగా తనభాగమునుకూడ వానికి సమర్పించి త్యాగయ్య చేతులు కడిగికొనినాడు. సీతారామలక్ష్మణుల విగ్రహములే తన యాస్తివస్తువులని హృదయపూర్వకముగా నాతడు విశ్వసించినాడు.

కమలాంబ గొనములప్రోవు; మహాపతివ్రత. భర్తవలెనే భక్తిపూర్వక ముగా శ్రీసీతారాములను నిరంతరము సేవించుచుండెడిది. విభాగానంతర మునకూడ కమలాంబాత్యాగయ్యలకు జ్యపేశనుదంపతుల యధికారము తప్ప లేదు. త్యాగరాజు అన్నకొడుకును కుమార్తెయు ఆతని చరణములచెంతనే యుండి చెవులార గానామృతమును గ్రోలుచుండువారు. తల్లి ఆదృశ్యము చూచి సహించెడికాదు. ఆమెయాజ్ఞను మీరుటకు జ్యపేశను సాహసించు వాడుకాడు. ఆమె హుకుము తలదాల్చి యొకనాటి నిశీథమున నాతడు త్యాగ రాజు పూజించు విగ్రహములను కావేరిలో పాఱవైచెను. మూర్తులను గానక త్యాగయ్య మిక్కిలి దుఃఖించెను. అన్నచేసినపని యని యెఱింగి నదిలోపడి పిచ్చివానివలె విగ్రహముల నాతడు వెతుకదొడగినాడు. కాని లాభము లేక పోయెను. స్వప్నమున రామచంద్రు డాతనికి గోచరించి విగ్రహములున్నతావ లము నాతనికి తెలిపినాడు. నిర్దిష్టప్రదేశమున విగ్రహములను గాంచి పరమ

ప్రమోదమున వానిని శిరమునదాల్చి భక్తు లాశ్చర్యాన్వితులై వీక్షింప తన్మయనృత్యము చేయసాగెను.

తంజావూరు రాజైన శరభోజీ త్యాగరాజు ప్రశస్తినెఱిగి ఆతనివలన గ్రంధకృతి నందవలెనని నిశ్చయించెను. ఐహికసంపదను కడకంటితో నైనను చూడనొల్లక తాగయ్య మానవమాత్రునకు కృతినిచ్చుట కంగీకరింపలేదు. ఉద్దేశసిద్ధినందని శరభోజి త్యాగయ్యను బంధించి పీడింపదలచినాడు. ఈయభిప్రాయము వాని మనసున తలసూపినంతన దుస్సహమైన శూలబాధకాతడు గుఱియైనాడు. తన యాతనకారణమెఱిగి పశ్చాత్తాపముచే శుద్ధాత్ముడైన యనంతరమాతడు తాపవిముక్తి నందెను. తిరువాన్కూరు ప్రేడైన తిరునాళ్ళు త్యాగయ్య శిష్యుడైన కన్నయ్య భాగవతునివలన తాగరాజు మహిమోదంతమును విని ఆమహాత్ముని గేయములను ఆతని సముక్షమున విన నువ్విళ్లూరినాడు. త్యాగరాజును తనసమ్ముఖమునకు గొనిరమ్మని తన ఆస్థానగాయకుడైన వడివేలును పంపినాడు. ధనధాన్యములును బిరుదములును పసదనములును తేని వలన లభించుననియు రాజు వేడికోలును మన్నించి ఆస్థానమునకు దయచేయుమనియు వడివేలు త్యాగరాజును ప్రార్థించెను. "నాకు వలసినది పరమార్థముకాని యీయర్థముకాదు, నేనిట్టి సమ్మానములు కాంక్షింపను" అని తాగయ్య ప్రేమపూర్వకముగా ఆగంతువును పంపివేసెను.

త్యాగరాజు నిజమందిరమున రామమందిరము నిర్మించినాడు. వారమున కొకసారి యాతడు రామసంకీర్తన మొనరించుచు నలువలంకులందును గానలహరిని వెలారించుచు నగరమున చరించువాడు. భక్తిపూరిత చిత్తులై ఆతని మ్రోల సాగిలపడి ఆతనిపై పూలుచల్లి పుణ్యాంగన లామహాత్మునకు హారతులొసంగువారు. భిక్షాటనమువలన తానుపడసిన తండులములతో త్యాగరాజు తనకుటుంబమును తనశిష్యబృందమును పోషించువాడు.

మతముమీాది విశ్వాసమును గోల్పడి కలుషమున పొరలాడు ప్రజలను ఉద్ధరించుటకై ఉద్భవించి పరిత్రాణదక్షుడై త్యాగరా జొప్పెను. సముజ్జ్వలమైన దృష్టాంతము కట్టెదుట గోచరించుచుండ కనులమూసికొని పంకిలమున నిలుచుట కెవ్వ రీయకొందురు? రామభక్తుడయ్యు సమస్త దేవతలను సన్నుతించిన తాగయ్య సమస్తమతములను ఆదరదృష్టితో వీక్షించువాడు. సర్వ

మతములదృష్టి గల లక్ష్యమొక్కటియే యనియు మార్గములు వేఱైనను, ఉదాత్తమైన ఉద్దేశమొక్కండే యనియు ఆతని ప్రబోధము. గీతాచార్యుని భావమునాతడెట్లు హృదయంగమ మొనరించుకొనెనో యూహింపుడు. నిష్కామ భక్తి మోక్షదాయకమని త్యాగరాజు బోధించినాడు. 'రామకథాసుధారస పానము' ను ఆతడు బహుభంగుల నుగ్గడించినాడు. ఆతని కృతులు నిర్మలనీతి గర్భితములై ఆధ్యాత్మికవిభూతికి నిధానములై యుండును. త్యాగయ్య గేయములు కమ్మతెమ్మెరలవలె కలస్వర మొనరించుచు నిభృతగిరిమార్గమున నల్లన స్రవించు సెలయేళ్ళలీల నిస్తబ్ధనిశీథినీముహూర్తమున కోయిలకుత్తుకనుండి మెల్లగ జాల్వారు సుధాబిందుసందోహము చాడ్పున శ్యామసుందరుని మురళి నుండియు వాణీపాణియందలి వీణియనుండియు వెలారు మధురగీతములట్లు శ్రోతలమనసులకు అనంతానందమును ప్రసాదించును.

తీర్థయాత్రలపై త్యాగరాజస్వామికి ప్రీతిమెండు. కంచి, మధుర, నాగపురము, శ్రీరంగము, మధ్యార్జునక్షేత్రము మున్నగు తీర్థములకు తఱుచుగ పోవుచు కామాక్షి మీనాక్షి నీలాయితాక్షి శ్రీరంగస్వామి మహాలింగస్వామి వరదరాజస్వామి మొదలైన వేల్పులను సేవించి గేయపరంపరలతో సంస్తుతించువాడు. శ్రీవెంకటేశ్వరస్వామిని కీర్తించుచు ఏడుకొండలెక్కి తిరుమల కేగినాడు. పూజారులు స్వామికెదురుగ తెరకట్టినారట. తెర తొలగించుటకై రుసుమును కోరిరట. నిరుపేదయైన త్యాగయ్య పైక మెట్టులీయగలడు. "తెరతీయగరాదా తిరుపతి వెంకటరమణ" అని తాగయ్య పాడదొడగినాడు. ఆధ్యాత్మికమైన ఆవేశముతో త్యాగరాజు గాన మొనరించుచుండ జవనిక తనంతటదాను తొలగిపోయెనట, ఆదృశ్యము నవలోకించి అచటి వారాశ్చర్యాన్వితులైరి.

తీర్థభ్రమణ మొనరించి మరలునపుడు మార్గమధ్యమున నొక యడవిలో కొందఱు చోరులు త్యాగయ్యను శిష్యులను చూచిరి. సుందర మొదలియారను భక్తుడు తనయింట నాతని కొంతకాలము పూజించి పాలకిలో నాసీనుజేసి స్వామి శిష్యులకు కొందఱు పరిజనులను-తోడిచ్చి నాటి పయనమున సాగనంపి యుండెను. ఆమహాత్ముడు ధనమును స్వీకరింపువాడుకాడని యెఱిగి ఆతడెఱుగకుండ దైవసేవకొఱకును గురుసేవకొఱకును వ్యయింపుమని తెలుపుచు కొంత

ధనమును మొదలియారు స్వామిశిష్యుల కొసగినాడు. అంతేవాసు లాపైక మును దాచియుంచిరి. దూరమునుండి రాలురువ్విన దొంగలు కొలదినిముస ములలో వారిని సమీపించిరి. చోరులను గుఱితించి త్యాగరాజు "నాయన లారా! మాకడ నీశిబికమాత్రము కలదు. దీనిని గొనిపొండు" అని పలికెను. మొదలియారు పైకమిచ్చినట్లును శిష్యులు దానిని దాచినట్లును ఆతడెఱుగడు కదా. విపత్తును గ్రహించి ధనమును గుఱించిన వృత్తాంతమును అంతేవాసులు ఆచార్యునకు విన్నవించిరి. అది యెఱిగి ధనమును చోరులకు సమర్పింపుడని తాగయ్య శిష్యులతో చెప్పెను. ఆమాటలువిని చోరనాయకుడు అనుతాప ముచే పొగులుచు త్యాగరాజు పాదములపై బడి "మహాత్మా! మిమ్ము గుఱు తింపక మీకెగ్గుచేసితిమి. మీపై రాలు రువ్వితిమి. దుష్టుడనై నేను రువ్విన రాలు నాకే తగిలినవి. ఎవరో ఇద్దరు సుందరగాత్రులు నాకు దర్శనమిచ్చిరి. అంతరంగికముగ అపూర్వమైన అనుభూతి నందితిని. కటాక్షించి మమ్ము క్షమింపుడు" అని పలికెను. "నాయనా! నీవు అదృష్టవంతుడవు. శ్రీరామ లక్ష్మణుల సందర్శనము నీకు లభించినది. వారిని సేవింపుచు పవిత్రవర్తనుడవై మెలంగుము" అని త్యాగరాజస్వామి దొంగల యొడయనికి హిత వొసంగెను.

ఈవిధమున త్యాగబ్రహ్మ బహుసంఖ్యాకులకు భక్తిమార్గము జూపుచు శ్రీరామసంకీర్తన మొనరించుచు శిష్యగణపరివృతుండై కొంతకాలమునకు నిజగృహము చేరుకొనెను.

త్యాగరాజు కీర్తి విస్తరించినకొలది ఆతని శిష్యసంఖ్య విస్తరింపసాగి నది. పలువు రాతని సేవించి ధన్యులుకాదొడగిరి.

గేయరచనమందేకాక పద్యరచనయందును త్యాగయ్య సిద్ధహస్తుడు. కీర్తనములనేగాక సంగీతనాటకములనుకూడ నీతడు రచించినాడు. ఈ రీతి నాటకములను ఈతనికిమున్ను సంస్కృతమున రచించిన కవులు కొందఱుకలరు. పంద్రెండవ శతాబ్దమున జయదేవుడు రచించిన "గీతగోవింద" మున ఏతా దృశరచనాంకురము కలదు. దక్షిణభారతమున నిట్టి రచనలు పదునెనిమిదవ శతాబ్దమున తలసూపినవి. ఈరచనములను గావించినవారిలో త్యాగరా జగ్ర గణ్యుడు. "ప్రహ్లాదభక్తవిజయము" "నౌకాచరిత్రము" లీతడు రచించిన సంగీతనాటకములు. మొదటి గ్రంథమున భక్తిభావము తొలుకాడుచుండును.

రెండవ దానియందు భక్తికి శృంగారమధురభావములు సహకరింపబడినవి. త్యాగరాజు ఆంధ్రుడేయయ్యు ఈతని గేయములు తమిళులందు ప్రసిద్ధములైన ట్లాంధ్రులకు కాకపోవుట శోచనీయము. మహిమోపేతమైన జీవితమునుండియే పవిత్రమైన హృదయమునుండియే మహత్తరమైన రచనలు భవ్యభావబంధుర రచనలు సృష్టియగు ననుటకు త్యాగయ్య కృతులు తార్కాణములు. మాధుర్య పూరితహృదయుడు సౌందర్యసందీపితచిత్తుడు ముక్తిని ముంజేతికంకణమొన రించుకొన జాలునని ఈ మహాత్ముని జీవితతత్త్వమును హృదయంగమమొనరించు కొనినవారు గుర్తింపజాలుదురు.

కట్నములను కానుకలను కైకొనక రామకైంకర్యముమీదనే మనసుంచి నిక్కముగ త్యాగులందు రాజే యై ఆత్మగౌరవమును ధృవనక్షత్రమునకు సహ పాఠిజేసి స్వీయస్వాతంత్ర్యమును మంచుమలపునాదికి నెచ్చెలిగావించి ఆత్మ భావములను రత్నాకరములకు చెలిమికత్తెలగావించి తారార్కచంద్రులకు మేలుబంతులు కాజాలు పదపంక్తులు రచించి భూతలనారదుడై కరివరదునకు సన్నిహితుడై అమరులయందగ్రపీఠస్థలి నలంకరించి ఆంధ్రజనయిత్రికి అమం దానందమును గొలిపిన మహామహిమోపేతుడు త్యాగరాజస్వామి.



## ౬౩

# శ్రీ వేమనయోగి



"కం. దేవా! దేవా! యని వా
పోవునతనివెంట నంటిపోవుచునుండున్
దేవుండు క్రేపువెంబడి
నావుప్రధావించునట్టు లారూపమునన్."

మనుష్యజీవితము శరీరమానసఆత్మలవలన నడుపబడుచుండును. శరీరాభివృద్ధి తొలుత నారంభమగును. శైశవమున కొన్నియేండ్లు కడచినపిదప మానసాభివృద్ధి ఆరంభమగును. సామాన్యులందీయభివృద్ధి యెనిమిదవయేట నుండి స్పష్టముగ గోచరించును. కావుననే ఉపనయము ఈవయసున జరుపబడును. నవ్యచక్షువు అపు డున్మీలనమగును. పదునాఱవయేటనుండి శరీరాభివృద్ధి ధృతగతి యిరువదినాలవయేటివరకు సాగును. తదనంతర మది నిలుచును. శరీరాభివృద్ధి ఆగినపిదపకూడ మానసము వృద్ధియగును. దానికి సముచితమైన పని కల్పించితిమేని జీవయాత్ర దీర్ఘమగును. ఆత్మశక్తి లేక ఆధ్యాత్మికశక్తి సామాన్యులందు నాలుగు దశాబ్దులు కడచినవెనుక వృద్ధియగుట కారంభమగును. క్రమసాధనవలన నిది యద్భుతవృద్ధినందును. శరీరమానసాభివృద్ధుల నిది యతిక్రమింపగలదు. కొందఱు ఆధ్యాత్మికమైన జిజ్ఞాసనెఱుగక తమ జీవయాత్రను సాగింతురు. అత్యల్పసంఖ్యాకులు శైశవబాల్యములందే ఆధ్యాత్మికశక్తిని చూపుదురు. శ్రీశంకరు డెనిమిదవయేటను యేసు పదునాఱవయేటను ఈశక్తిని చూపగలిగిరి. హృదయమును కదలించు తీవ్రసంఘటనము లెదురొ్కనినపుడును, కొండొకమహాత్ముని ఉజ్జ్వలదృష్టాంతము గోచరించునపుడు, ఏసమయమందైన మానవుడు ఆధ్యాత్మికపీఠముమీది కెగయజాలును. సముజ్జ్వలమైన ఆధ్యాత్మికశక్తిచే శరీరమానసములు తేజస్సునందగలవు. పంకమున పడి పొరలాడువారు సయితము అపూర్వానుభవము కతన ఆంతరంగిక పరివర్తనము నందగలరు. స్త్రీలోలుడైన తులసీదాసు రామదాసన్యోనుగదా!

శోచనీయమైన తన ప్రవర్తనమున తన జీవితమందలి కొంతభాగమును వ్యర్థ మొనరించినపిదప వేమన, యోగి యైనాడు. జ్ఞానచక్షువునందినాడు. ఆంధ్ర జగతికి జ్ఞానభిక్ష పెట్టినాడు.

యోగుల హృదయపరిణతి అద్భుతమైనది. వారి మానసములు ఒక్క రీతిగా పనిచేయుచుండునుగావున వారిభావములందును వాక్కులందును ఎంతేని సామ్యము గోచరించును. వారి పరిశీలనాశక్తి మహాద్భుతమైనది. బ్రహ్మాండ మందలి యేయంశమైనను వారి పరిశీలనమునుండి దాటిపోజాలదు. సుపరిచిత ప్రకృతినుండి ఉచితదృష్టాంతములను పేర్కొనియు ఉపమలను కైకొనియు ఉదాత్తమైన సత్యములతో వానిని సంధించి అవలీలమైన ఆకళింతకు వాని నందింతురు. దొడ్డభావములను కథలవలన బోధింతురు. ఉపమలను కనుగొనుట యందును, దృష్టాంతములను సృష్టించుటయందును, వేమనయోగి ఆరితేఱి నాడు. ఒకకంటిని మనుష్యహృదయమందును, రెండవకంటిని ప్రకృతి హృద యమందును జొనిపి ఆణిముత్యమువంటి సత్యము నీతడు కనుగొనును. బంగారు నగయందు వజ్రపుతునుకను జొనుపునట్లు తాను కనుగొన్న సత్యమును ఈతడు చిన్ని పద్యములయందు స్థగిత మొనరించినాడు. కావున వేమనకృతపద్య పరంపర చక్కని నగలమూటయని చెప్పజెల్లును. మనసు నలరించు జాను తెనుగు పదములతో వెలయు వీని పద్యములు సులభ కంఠస్థయోగ్యము లగుటచే ఆంధ్రవసుంధరయం దవి, విశేషప్రశస్తి ప్రచారములను బడసినవి. ఆంధ్రజాతి మనియున్నంతకాలము ఆంధ్రసాహితి సజీవమై యున్నంతకాలము ఆంధ్రజనయిత్రి చల్లనితల్లియై యున్నంతకాలము ఆంధ్రప్రతిభ ప్రజానంతమై యున్నంతకాలము వేమన రచిత పద్యరత్నములు సానలదీసిన జాతిరత్నములై వెలయగలవు.

వేమనయోగి సుప్రసిద్ధ కొండవీటి రెడ్డివంశమున జనించినాడు. ఆంధ్రదేశ చరిత్రయందును ఆంధ్రవాఙ్మయ చరిత్రమందును, రెడ్డిసోదరులకు ప్రభాకలితమైన స్థానముకలదు. ఆంధ్రవిప్రులవలె రెడ్డిసోదరులలో పెక్కు శాఖలవారు కలరు. వేమన పంటరెడ్డికులమున పుట్టినాడు. ఈశాఖవారు శైవులు. లలితకళలను ఆంధ్రసాహితిని వీరు ఆరాధించిరి. రెడ్డిరాజుల ఆది పురుషుడు దొంతిఆదిరెడ్డి, వ్యవసాయమువలన జీవితము కడపువాడు, కాల

క్రమమున రెండు విచిత్రకారణములవలన నీత డతులైశ్వర్యమున కధినాథుడై నాడు. రెడ్డిరాజులలో సుమారు చివరవాడని చెప్పదగిన అనువేమారెడ్డి క్రీ. శ. 1396 లో నేలికయయ్యెను. ఇరువదియెనిమిదేండ్లు ఈతడు చక్కగా పరిపాలించెను. ఈతని యనంతరమున ఈతని సోదరుడు రాచవేమారెడ్డి క్రీ. శ. 1424 లో సింహాసనము నధిష్ఠించి నాలుగేండ్లు పాలించి తన సేనాధిపతియైన చౌదరియెల్లప్పవలన పరాజితుడైనాడు. అనువేమారెడ్డి కనిష్ఠ సోదరుడే మన కథానాయకుడైన వేమనయోగి. ఈతని చరిత్ర పరిశీలించుతఱి అనువేమారెడ్డి భార్య లక్ష్మీనరసాంబను స్మరింపవలెను. ఆమె పావనగుణశోభిత. వేమనయోగికి జ్ఞాననేత్ర మొసంగినది యీయమయే. మఱది నీమె కడుపున బుట్టిన బిడ్డకంటె మిన్నగ చూచుచుండెను.

తొలుదొలుత వేమన దుర్వృత్తికే దారితీసినాడు. వివాహమాడక వేశ్యాలోలుడైనాడు. దివాణమున భోజనమొనరించి వెలవెలదియింట కాలక్షేపము చేయువాడు. సముచితప్రబోధము సలిపి నరసాంబ వేమన్నను గణిక నుండి దూరస్థునిజేసెను. కాని వేమన్న సోమరియై మసలువాడు. దివాణము వారికి నగలు చేయుటకై నియోగింపబడిన అభిరామ లక్ష్మణు లను కంసాలి సోదరుల యంగడి కరిగి అనుదిన మాత డందు కొంతసేపు గడపువాడు. ఈయంగడి కోటయావరణమునందే కలదు. అంగడి కరిగి సోదరుల పనిపాటలను పరీక్షించువాడు. అభిరాము డాలస్యముగా పనిలోనికి వచ్చువాడు. వేమన్న యీ ఆలస్యమునకు క్రుద్ధుడగువాడు. విలంబనహేతువును మాటిమాటికి నడుగువాడు. "స్వామీ! స్నానసంధ్యాదులను నిర్వహించి పనిలోనికి వచ్చుచుందును. కావున నాలస్య మగుచున్నది. మన్నింపుడు" అని యాత డనువాడు. ఆలస్యకారణము నరయవలెనని వేమన నిశ్చయించినాడు.

ఒకనాటి ప్రాతఃకాలమున మేలుకాంచి అభిరాముని గృహమున కెదుట గుబ్బుగ పెరిగిన చెట్టుమఱుగునదాగి వానిజాడలను కనిపెట్టసాగినాడు. ఉదయమునలేచి అభిరాముడు ఉత్తరదిశకు రమారమి రెండుమైళ్ళు నడచి కాల్యకృత్యములు దీర్చుకొని కాసారమున స్నానమాచరించి సూర్యున కర్ఘ్యమొసగి సుమారు గంటసేపు నిమీలితనేత్రుడై జగదీశుని ధ్యానించి సరోవరమునుండి లేచి ఆదూరమునయున్న పర్వతగుహలో ప్రవేశించినాడు. యోగీంద్రుడొకడు

అచట తప సొనరించుచుండెను. ధ్యానము ముగిసిన యనంతరము శివయోగి కనులు తెఱచి సమ్ముఖమున నిలచియున్న భక్తవరుని విలోకించి అత్యాదరమున "వత్సా! నీభక్తిశ్రద్ధలు నా కెంతేని ముదముగొలిపినవి. రేవు ప్రభాతమున నీవిచటికి ఎప్పటియట్లు స్నాతుడవై రమ్ము. నీకు తత్త్వోపదేశము గావించి జీవయాత్రను ముగించెదను. నీవు తప్పక రావలయును సుమీ!" అని నొక్కి చెప్పెను. "స్వామి చిత్త మెట్లో యట్లగుగాక" యని అభిరాము డనినాడు. అభిరాముని వెనుకబోయి అత డొనరించిన క్రియాపరంపర పరికించి చరచర బోయి వేమన ఎప్పటివలె అంగడిలో నధివసించినాడు. మఱునాడు శివయోగి కడ తానే యుపదేశమంది తానే ధన్యుడను కావలెనని వేమన నిశ్చయించినాడు. అభిరాము నెట్లయిన మర్నాడు ప్రాతఃకాలమున నంగడియందే నిలిపి యుంచవలెనని నిశ్చయించుకొని అందులకు అక్కఱైన ఉపాయము రోయుచు వదినె యొద్దకరిగి మరుచటిదినమున ప్రాతఃకాలమున అభిరాముడు తనదుకాణము నందే యుండునట్లు కట్టడచేయుమని వేమన ఆమెను వేడినాడు. ఆమెయు నీతని కోరికప్రకారము కట్టడగావించెను.

పాప మభిరాముడు గొప్పచిక్కులో పడిపోయినాడు. వేమన తలచిన తంత్రము వేమన్నకు మాత్రమే తెలియును. ప్రభాతమునలేచి కాలకృత్యములు నిర్వర్తించుకొని అభిరాముడు పోవు సరస్సునకు పోయి స్నానమాడి గుహాయందు ప్రవేశించి శివయోగిమ్రోల నాతడు సాగిలపడినాడు. జపము ముగించి శివయోగి కన్నులు తెఱచి క్రొత్తవానిని "నీవు ఎవ్వడవు" అని ప్రశ్నించినాడు. "మహాత్మా! నేను అభిరాముని శిష్యుడను. మిక్కిలి తొందరయైనపనిని ముగించుటకై ఆత డీసమయమున కోటలో నుండవలసి వచ్చెను. కావున నన్ను తమపాలికి పంపెను" అని వేమన ప్రత్యుత్తర మొసగినాడు. "దురదృష్టవంతుడు మంత్రోపదేశభాగ్యము గోల్పోయినాడు. నేనిక తడయుటకు వీలులేదు. జీవయాత్రను ముగించుసమయ మాసన్నమగుచున్నది. మహామంత్రమును నీ కుపదేశించెదను రమ్ము" అని చెప్పి వేమన నాల్కపై కొన్ని బీజాక్షరములను లిఖించి వానికన్నులు తుడిచి చూడమనినాడు. వేమన కన్నులు ప్రభాకలితము లయ్యెను. "ఇక నీ విందుండి పొమ్ము" అని చెప్పి శివయోగి అదృశ్యుడైనాడు.

ఇక వేమన్న తొల్లింటి వేమన్న కాడు. శివయోగికటాక్షమున లభించిన హస్తమస్తకయోగము మహిమోపేతమై ఆతని కంతర్దృష్టి ప్రసాదించినది. బీజాక్షరములు రసనముపై లిఖింపబడిన ముహూర్తమునందే ఆతడు మహాకవి యైనాడు. అభిరామునివలన క్షమాభిక్ష పడయనిచో తానందిన శక్తి వ్యర్థమగు నని ఆతడు "తమకటాక్షముకతన ఈజన్మమున కృతార్థుడ నైతిని, అజ్ఞాన తిమిరమును పాఱదోలితిరి" అని పలుమాఱు అభిరామునితో వచించినాడు.

జితేంద్రియుడై ముక్తాత్ముడై తన ప్రబోధములను వేమన పద్యసహస్రము లను చెప్పదొడగినాడు. ప్రతిపద్యమందును తుదిపాదమున కృతజ్ఞతా పూర్వకముగ అభిరాముని యభిధేయము నుచ్చరించువాడు.

యోగుల చరిత్రలయందును విచిత్రాంశములు తలసూపుచుండును. వేమన చరిత్రమందుకూడ నట్టి విచిత్రాంశములు కలవు.

యోగియైన వేమన ఉన్మాదుడైనాడని ఆతని తల్లి తలచినది. వివాహ మాడుమని యామె పెక్కుసారులు వానిని ప్రార్థించినది. జేష్ఠపుత్రునిచే చెప్పించినది. కాని వేమన అందుల కియ్యకొనలేదు. వారణాసికిపోయి గంగలో స్నానమాచరించినయెడల వాని పిచ్చి పోవునని ఆమె యూహించినది. వానిని కాశీ పంపవలెనని ప్రయత్నించినది. ఆ ప్రయత్నము వృథయైనది. అంతట తానే విశ్వేశ్వరధామమునకు జని మహాదేవుని సేవించి శివకటాక్షమున కుమారుని మతిని మరలింపగలనని ఆమె ఆశపడినది. తల్లిమెడలో నొక రాగి రేకును గట్టి "అమ్మా! యాత్రయందును ఈశ్వరసేవయందును సంపూర్ణ విశ్వాసము గలిగియుంటివేని ఈ రేకు బంగారురే కగును" అని వేమన పలికి నాడు. కాశీయాత్ర కరిగి సంవత్సరములో నామె మరలివచ్చినది. వేమన రాగిరేకును పరీక్షించినాడు. అది బంగారు కాలేదు. "అమ్మా! నీభక్తిశ్రద్ధ లందు లోప మున్నది సుమీ! లేకున్న నెందున్న నందే వారణాసిని సృష్టించు కొనజాలియుందువు" అని పలికి రేకుతీసి దానిపై వేమన్న కొన్ని జలబిందు వులు పోసినాడు. తృటిలో నది బంగారుగామారి యెల్లఱ నాశ్చర్యాన్వితులను జేసెను.

ఒకనాడు వేమన యొక రాగిపైసను షేలికయైన తన యన్నకిచ్చి తనకు సేద్యము చేయ నిచ్చకలిగినదనియు పైసకుమాఱుగా యెకరము భూమిని

తనకిమ్మనియు వానిని వేడెను. అగ్రజుడు నవ్వి యూరకొనెను. వాని యర్థాంగి "వేమన సామాన్యుడని యోచింపకుడు. ఆతని యభీష్టము నెఱవేర్పుడు" అని ప్రాణపతిని ప్రార్థించినది. జేడక్లేకావించెను. ఆభూమిని దున్ని పుల్లని ఖర్బూజా గింజలను వేమన చల్లినాడు. అచిరమున పొలమందు పెద్ద మొక్కలగుంపు తోచినది. మొక్కలు పండ్లతో వెలయుచుండెను. పనిదొరకక నేడ్చుచు నెనుబదేండ్ల పేదరాలొకర్తుక యిరువురు మనుమలతో దారినిపోవుచుంట గాంచి జాలిగొని వేమన తన పొలమున నామెకు పనియిచ్చి పగలంతయు పని చేయించుకొని, యొక్క పండును మాత్రము కూలిగా నామె కొసగెను. దానిని చూచి మనుమలు కోపోద్దీపితులై బలముకొలది దానిని నేలపై విసరివేసిరి. అందుండి బంగారువిత్తనములు యీవలపడినవి. వారు పరమానందభరితులైరి. మఱునాడు మరల ముువ్వురును వేమనపొలమున పనిచేయుటకై పోయిరి. ఈ యుందతమును విని మఱికొందఱు కూలివాండ్రును పనికై యచటికిపోయిరి. దినాంతమున వేమన యొకొక్కనికి యొకొక్క పండొసగినాడు. కొందఱు కూలివాండ్రు కొన్నిపండ్లను అపహరించి చల్లగ నింటికి గొనిపోయిరి. పిమ్మట వారు వానిని తెఱచి గింజలనుతీసిరి. వేమన యొసగిన పండ్లయందుమాత్రము బంగారువిత్తులున్నవి. దొంగలింపబడిన పండ్లలో చేదుగింజలేయున్నవి.

మఱునాడు వేమన్న అన్నపాలికరిగి తనపొలమును పంటను పరీక్షింప రమ్మనివేడెను. పరివారసహితుడై యాతడు క్షేత్రమును చూచుటకై వెళ్ళి నాడు. పండ్లప్రోవులు రెండు గోచరించినవి. అన్న యరుదెంచినంతన వేమన ప్రోవులను స్పృశించినాడు. తోడనేయవి బంగారుప్రోవులైనవి. ఏలికయును తక్కినవారును అచ్చెరువందిరి.

కొన్నియేండ్లు గడచినపిమ్మట వేమన పరివ్రాజకుడై స్థానస్థానములందు సంచరించుచు రత్నరాసులవలె పద్యరాసులను వెదజల్లసాగినాడు. నాలుగువేల పద్యములు నేడు జిజ్ఞాసువులకు లభించినవి. మఱెన్నిపద్యములు త్యాగయ్య కృతులవలె నింకను ఆవిష్కరణమున కందలేదో తెలుపజాలము.

ఇందందు కొంతకాలము పరిభ్రమించి వేమన్న కతరుపల్లిలో కొంత కాలము వసించినాడు. శిష్యులుకొంద ఱాతని నాశ్రయించిరి. సహజధోరణితో అతడు వారిహృదయములో బోధామృతమును ధారపోసినాడు. పదపడి

ఆమహాత్ముఁడు పరమపదించినాడు. ఆతని యస్థులపై అంతేవాసులు సమాధిని నిర్మించిరి. ఏటేట నచట వేమనోత్సవములు జరుగుచుండును.

ఆంధ్రసాహితీవసుంధరయందు వేమనయోగి కవితాశక్తికి గలస్థానము ప్రత్యేకమైనది. స్వీయవ్యక్తిత్వమునకు స్వీయరచనమునందును స్వీయరచనమునకు స్వీయవ్యక్తిత్వమునందును ఆటపందిరి నెలకొలిపిన మహనీయుడాతడు. అనుకరణ అనుసరణ అనువాదములకు కలనైన నాతడు మనసిచ్చి యెఱుగడు. ఇట్లు మనసిచ్చినవారిసంఖ్యయే ఆంధ్రకవులలో అధికముగా కలదుగదా! శబ్దాడంబరముగాని అలంకారపరంపరగాని ఆతడు కాంక్షించి యెఱుగడు. వివిధరాగరంజితములైన దృశ్యములను మనశ్చక్షుస్సమక్షమున ప్రత్యక్షము చేయుట వాని యాశయముకాదు.

ఉత్కృష్టరచనము ఉదాత్తజీవితానుభూతియం దుద్భవించు నను వాక్కునకు వేమన రచనము సముజ్జ్వలమైన తార్కాణము. బంగారునాణెములకై స్వీయమేధను స్వీయస్వాతంత్ర్యమును విక్రయించి స్వకీయప్రతిభ నొరుల హుకుమునకు తాకట్టుపెట్టి ఆత్మవ్యక్తిత్వము నొరులకు కట్నముగా జదివించి మనుష్యరూపుదాల్చిన యంత్రమై యుండువాని రచన మెట్లుండును? వీని వచనము కర్కశమైన యంత్రశబ్దమున క్రీడై యుండదా? రాజన్యుల దాక్షిణ్యముపై బుద్ధినిలిపి రచనలొనరించినవారు ఏలికల రుచులు వలచురీతిని తమ కృతులను సృష్టించిరికదా! స్వాతంత్ర్యముండినగాని నైసర్గికప్రతిభ పని చేయదు. స్వీయప్రజ్ఞను గుఱించిన జ్ఞానము ఆత్మవిశ్వాసము ధైర్యము సాహసము ప్రతిభాప్రకాశమును పురికొలుపు సంయుక్తశక్తులు. ఒకరికటాక్షమును కాంక్షింపనివాని హృదయమునందే ఇట్టిప్రతిభ దివ్యప్రదీపమై ప్రకాశించును. ఏలిక తనయుడేయయ్యు ఏలిక తమ్ముఁడేయయ్యు వేమన ధనధాన్యములనుగాని మడిమాన్యములనుగాని భాగ్యభోగ్యములనుగాని కాంక్షించి యెఱుగడు. కావున వాని మనశ్శక్తియును ఆత్మశక్తియును మహోజ్జ్వలములై ఉత్కృష్ట సాహిత్యమును సృష్టింపజాలినవి.

వేమనపద్యములు అద్వైతభావబంధురములై యుండును. సంయమ సాధనములవలన వాని మేధాశక్తియును తోడ్తోడన అంతర్దృష్టియును బాహ్యదృష్టియును కడుంగడు నిశితమైనని. తాత్త్వికుడయ్యు వేదాంతియయ్యు

క్లిష్టతాత్త్వికసమస్యలను పరిశీలించుటకుగాని చర్చించుటకుగాని ఆతడు నడుముగట్టలేదు. శ్రీశంకర రామానుజ మధ్వప్రభృతులబోలు తజ్ఞుడీతడు కాడు. శృంగారము నతిక్రమించి వైరాగ్యమున నిలిచి జీవితరహస్యములను సమగ్రముగ హృదయంగమ మొనరించుకొనిన జ్ఞాని యీతడు. వేమన పద్యములు అసంఖ్యాకులగు ప్రజల హృదయములందు శతాబ్దులనుండి ప్రతిధ్వనించుచున్నవి. పామరుల యాకళింతకుకూడ లొంగు సులభసరళశైలి యందు వేమన తనభావములను వ్యక్తీకరించెను. దీర్ఘవాక్యములును కఠినసమాసములును పామరులను సాహితీజగతినుండి తఱిమికొట్టును. చిన్నివాక్కులో చిన్నిపద్యములో తన యనుభవములును, పామరానుభవములును వ్యక్తీకరించి వేమన పామరులకు, సమస్తజాతులకు సన్నిహితుడైనాడు. కామియును కీర్తికామియును గాక నిస్వార్థప్రేమ నసంఖ్యాకులకు చూపుచు వఱలిన మహాత్ముడీ వేమన. ఆంధ్రసాహితీవసుంధరయందును, ఆంధ్రజాతి హృదయమందును దివ్యమందిరమును నెలకొలుపుకొనిన మహాశిల్పి యీతడు. ఒకప్పుడు పంకిలమున క్రిమియై పడియుండియు తపసుకతన మనుష్యుడు జగదీశుని సమక్షమున మహోజ్జ్వలపీఠస్థలి నందగలడని రూఢిచేసిన మహిమోపేతు డీతడు. జాతిసముద్భవుడు కాకున్నను జీవితమహత్త్వముకతన అగ్రజులకును అమరులకును కూడ ఆరాధ్యుడై అనంత కాలదిగ్వలయమున అస్తమయమెఱుగని మహాజ్యోతి కాగలడని నిరూపించిన మహాద్భుతగుణగరిష్ఠు డీ వేమన.

---

౨౪

# శ్రీ శారదాదేవి

"క. వాతూలతూలమృదుసిత
చేతసనుఖశయ్యఁ గేలుఁ జివురులఁ బదకం
జాతమ్ములొత్తు త్రిజగ
న్మాత భువనరక్షఁ దనుపుతండ్రి! భజింతున్"

ఆధునిక అధ్యాత్మికవసుంధరలో అగ్రస్థానము నలంకరించిన సీమంతినీ చూడామణి పరమహంసదేవుని అర్ధాంగలక్ష్మి శ్రీశారదాదేవి కలకత్తాకు పశ్చిమదిక్కున బంకూరాజిల్లాలో అమోదర్‌నదికి అనతిదూరమునగల జయరామబాటియను చిన్నపల్లెయందు క్రీస్తుశకము 1853 సంవత్సరమున డిశంబరు ఇరువదిరెండవ తేదీని జనన మందెను. ఈమెతల్లి శ్యామసుందరదేవి పావన గుణశోభితయైన ఇల్లాలు. తండ్రి రామచంద్రముఖోపాధ్యాయుడు. నిరుపేదయైన బ్రాహ్మణుడు. రామభక్తుడు. వైదికవృత్తిని నెఱపుచు ఇంచుక సేద్యము చేయుచు సంయుక్తకుటుంబభారమును వహించువాడు.

బాల్యమున శారదాదేవి ఇంటిపనులను చక్కగా నేర్చికొనినది. తోడి బాలికలతో కలసి యల్లరి చేయక కాళీపూజయం దామె మిక్కిలి మక్కువ జూపెడిది. తమ్ముల నామె ప్రతిదినము గ్రామపాఠశాలకు గొనిపోవు చుండెడిది. ఆకాలములో బాలికల విద్యనుగుఱించి పల్లెలలో నెవ్వరు నంతగా శ్రద్ధ వహించెడువారు కారు. కావున బడికిపోయి చదువవలసినయక్కఱ శారదకు లేదనియే ఆమెతలిదండ్రు లూహించిరి. కాలక్రమమున నామెయే స్వప్రయత్నమున వాచకము నేర్చుకొనినది. చదువుట నేర్చినను ఆమె వ్రాయుట అభ్యసింపలేదు. ఇట్లనుటచే ఆమెకు మాధ్యము శరణ్యమాయె నని తలపరాదు. అక్కరములనుండి శా కున్నను పలువిధము లగుపథములగుండ పల్లెప్రజలు జ్ఞానము నందుచుందురు. పురాణకాలక్షేపము వలననేమి హరికథలవలననేమి వీథినాటకములవలననేమి భాగవతప్రదర్శనములవలన నేమి ఆలయమహోత్సవ

ములవలననేమి పూజలవలననేమి పురస్కారములవలననేమి దైనికాచారముల వలననేమి గృహవాతావరణమువలననేమి సంఘజీవితమువలననేమి భారత గ్రామప్రజలు విజ్ఞానము నార్జించుచుందురు. పవిత్ర వాతావరణమున పుట్టి పెరిగిన శారదాంబ ఈరీతివ్యవస్థలవలన హిందూరమణికి అక్కరయైన విద్యా బుద్ధుల నందెను. తల్లిదండ్రులు పుణ్యావర్తను లగుటచేతను మహాత్ముడు చిన్న నాడే పతి యగుటచేతను ఆమె యదృష్టవంతురాలు ఆయెను. ఇట్టి హేతుసంప ర్కము లామె పవిత్రచరిత్రకు హేతువు లయ్యెను.

వివాహసమయమున శారదాదేవివయసు అయిదేండ్లుమాత్రమే; శ్రీరామకృష్ణునివయసు ఇరువదిమూడేండ్లు. భర్తసంయమి. వానచినుకులకై కుత్తుక నొడ్డు చాతకమువలె భార్య ఉదారాశయములకై మానసాంజలి నొడ్డి నది. ఆత డాదర్శగురువై యుండ నీమె ఆదర్శశిష్యురాలై అనల్పమైన ఆధ్యాత్మికభూతి నంద సాగినది.

క్రీస్తుశకము 1836 సంవత్సరమున కామారపుక్కరిణిగ్రామమున ఖుదీ రాముచట్టోపాధ్యాయుని మూడవపుత్రుడై జనించిన రామకృష్ణుడు 1855 లో దక్షిణేశ్వరమున కాళీయాలయమున పూజారి యాయెను. నిరంతరము ధ్యాన తత్పరుడై యుండిన రామకృష్ణునిమనసును ప్రాపంచికసుఖములదెస మరల్ప సమకట్టి ఆతని జననీజనకులు సోదరుడును క్రీ. శ. 1858 లో నతనిని స్వగ్రామ మునకు గొనిపోయి వివాహయత్నము జేయసాగిరి. తమ యత్నము నాతడు ప్రతిఘటించు నని వా రడలిరి. "జయరామబాటి యనుపల్లెయందు రామ చంద్రముఖోపాధ్యాయునిగృహమునకు పోయి చూడుడు. నా యర్ధాంగలక్ష్మి కాజాలుబాలిక నందు గాంచగలరు" అని రామకృష్ణుడు వారితో పలికెను. వారట్లే పోయి బాలికను చూచిరి. అయిదేండ్లప్రాయముగలది. యని వారు సంశయించిరి కాని రామకృష్ణుని యుద్దేశ మెఱిగి రామచంద్రముఖోపాధ్యా యుని యభిప్రాయముకూడ నట్టిదియే యగుడు వివాహము జరుప వారు నిశ్చయించిరి. రామేశ్వరచట్టో పాధ్యాయుడు రామచంద్రునకు మూడువందల రూకలను చెల్లించెను. క్రీ. శ. 1859 లో పాణిగ్రహణము జరిగెను.

దక్షిణేశ్వరమున వసించుచు రామకృష్ణుడు ఒకప్పుడు కడుపునొప్పిచే బాధపడి స్వగ్రామమునకు మరలెను. శారదవయ సపుడు పదునాలుగేండ్లు

భర్త స్వగ్రామమున జేరినంతన ఆమెయును అచటి కరిగి ఆతనికి శుశ్రూషలు చేయుచుండెడిది. ఆమెతో చెప్పి రామకృష్ణుడు తన కిష్టమైనకూరలు చేయించు కొనుచుండువాడు. ఆతనికి తాంత్రికశిక్షణ మొసంగిన యోగేశ్వరి (బ్రాహ్మణి) ఉష్ణపదార్థములను వండి శారదకు పెట్టుచుండెడిది. బ్రాహ్మణిని రామకృష్ణుడు "అమ్మా" యని పిలుచువాడు. కావున నత్తగారివరుస నున్న యోగేశ్వరి యిచ్చిన ఉష్ణవ్యంజనములను మౌనము వహించి కన్నీటి నల్లన దుడిచికొనుచు శారద తినుచుండెడిది.

మఱినాలుగేండ్లు కడచినవి. భర్తచెంత వసించి ఆతనికి సేవ చేయవలె నని శారద మిక్కిలి మక్కువ పడెను. తనశరీరమే తాను మఱచి ఈశ్వరిని సేవించురామకృష్ణునకు పెండ్లాముతలంపే లేదు. ఊరివారు కొందఱు శ్రీచైతన్యుని జన్మదినమున గంగాస్నానమునకై కలకత్తాకు పయనమైరి. వారితో పయనమై నిజేశుని గలసికొనవలె నని శారద తలంచినది. కూతు నుద్దేశమును గ్రహించినతండ్రి తానుకూడ నామెవెంట వత్తునని పయన మాయెను. ప్రయాణము సాగించి యొకనాడు జామురాత్రి కడచినపిదప శారదయును తండ్రియును దక్షిణేశ్వరమును జేరుకొనిరి. పరమహంస ఆదరానురాగములతో అర్ధాంగిని వీక్షించి తనతల్లితో మందిర మందలి కొండొకయాగారమున నామె వసించుటకు వలసిన వ్యవస్థ గావించినాడు. శ్రీరామకృష్ణుని గుఱించి జయరామ బాటిమున్నగుప్రదేశములయందు కొన్నిపిచ్చియూహాలు చెలరేగి శారదామ తల్లికిని యామెతండ్రి మున్నగువారికిని దుస్సహమైన సంతాపము కలిగించెను. పరమహంస ఉన్మాదుడైన దిగంబరుడైనాడని ఆయాయూరులందలిప్రజలు చెప్పుకొను చుండువారు. కూతురుకై మిగులబొగులుచు రామచంద్రముఖోపాధ్యాయుడు ఆమెవెన్నంటి యల్లునికడకు విచ్చేసెను. జామాత ఉన్మాదుడు కాక సంయమీంద్రు డని యెఱిగి ఆతడు పరమానందభరితుడైనాడు. శారదాదేవియు నెంతో పరితోష మందెను. వీరిహృదయములు ఆధ్యాత్మికవిభూతితో నలరారినవి కావుననే పరమహంస మహాత్ము డని యెఱిగి సంతసించిరి.

శ్రీశారదాదేవిజీవితమందును శ్రీరామకృష్ణపరమహంస జీవితమందును ప్రధానముగ సతీపతులు గమనించవలసిన ఉదాత్తగుణము వారి నిగ్రహశక్తి. ప్రపంచమును త్యజించి వేర్వేఱుమార్గముల ననుసరించి వారు నిర్జనారణ్యము

లందు వసింప నరుగ లేదు. ఒక్కచోటున వసించియు సీతారాములు శారీరక సౌఖ్యములకు అంత్య బెట్టినట్లు దక్షిణేశ్వరమున నిరువురును కలసియున్నను శారదారామకృష్ణులు విషయవాంఛను విజృంభింపనిచ్చిరి కారు. దిగ్విజయముగ వానప్రస్థమును నిర్వహించినాడు. ఆత్మనిగ్రహమున ఆరితేఱినయువతి అర్ధాంగ లక్ష్మి యగుట పరమహంస అదృష్టము. దక్షిణేశ్వరమున ఆఱునెలలు శారదా దేవిని తనచెంత శయనించుట కాత డంగీకరించినాడు. దృష్టిని 'బ్రహ్మన్' లో నిబద్ధ మొనరించి 'బ్రహ్మన్' నెడల సంపూర్ణవిశ్వాసము గలవ్యక్తికి భార్యవలన తపోభంగము కలుగనేర దని రామకృష్ణునిఆచార్యుడైన తోతాపురి వానితో పలికియుండెను. గురువాక్కును స్మరించుచు అందలిభావమును శ్రీరామకృష్ణుడు ఆత్మజీవితమును అనుష్ఠింపసాగెను.

శ్రీ శారదాదేవి సంతానవతి కాలేదని ఆమెదగ్గఱిచుట్టములును నెచ్చెలులును విచారించుచుండువారు. ఒకనాడు అల్లుడు వినుచుండగా శ్యామ సుందరిదేవి "నాబిడ్డ శారద యొకపిచ్చివానికి ఇల్లాలైనది. సంసారసుఖము లేమో ఆమె యెఱుంగదు. ఆమెకడుపున నొకకాయ యైనను కాయలేదు" అని పలికెను. ఆమాటలువిని చిఱునవ్వుతో శ్రీరామకృష్ణుడు "అమ్మా! మీ రందులకై చింతింప వలదు మీఅమ్మాయికి యెందఱెందఱో బిడ్డలు కలుగుదురు. రేయింబవళ్ళు 'అమ్మా! అమ్మా!' అని పిలుపు వినునప్పటికి ఆమెకు విసువు పుట్టును" అని వచించెను. ఆమెకు బిడ్డలు పుట్ట లేదని యెంద ఱెందఱు చింతించినను అట్టిచింత కెన్నడును శ్రీశారదాంబ హృదయమున తా వొసగలేదు.

పరమహంసప్రకృతికి ఆతనియర్ధాంగిప్రకృతి ప్రతికూల మైనది కాదు. కావుననే ఆతనిసాధన నిరంతరాయముగా సాగినది. ఆమె నూతనముగ దక్షిణేశ్వరమున కరుదెంచినపుడు శ్రీరామకృష్ణుడు "నన్ను మాయలోని కీడ్చివేయుదువా?" అని యామె ప్రశ్నించెను. "అట్లేల గావింతును? ఆధ్యాత్మికపథమున మీకు చేయూత నొసగుటయే నాయాశయము" అని ఆమె నిమునమైన తడయక ప్రత్యుత్తర మొసగెను.

క్రీ. శ. 1873 సంవత్సరమున దక్షిణేశ్వరమున 'ఫలహారిణికాళికా పూజ' జరుపవలసి యుండెను. ఆనాటి నిశీథినీసమయమున పూజకువలసిన

సంభారములను దెప్పించి శారదాదేవిని పరమహంస జాము కడచినపిదప నూతన వస్త్రములతో నలంకరించి ఆమెముఖమున తిలకము దిద్ది పూజాపీఠమున నాసీన జేసి మృష్టాన్నమును తాంబూలమును ఆమెకు ప్రసాదించి అవాక్కై యున్న ఆమెయందు జగద్ధాత్రి నావాహనము జేసి పరమహంస పూజ గావింప నారంభించెను. శారదాంబ అత్తఱి గభీరసమాధియందు ఆత్మ విస్మృత యయ్యెను. పూజానంతరమున పరమహంసయు నట్టిస్థితిని జెందెను. ఉపాసకుడును, ఉపాస్యదేవతయును ఉండవలసినస్థితి మహర్షులచే నుగ్గడింపబడిన స్థితి అట్టిదేకదా!

సమాధినుండి మేలు కాంచి సంతృప్తుడై "జగన్మాతా!" యని మంత్రోచ్చారణ మొనరించుచు ఆమెపాదములపై సాగిలపడినాడు.

పూజ ముగిసినపిదప సమాధినుండి మాతృదేవి మేల్కాంచి ఆచార్యునకు ఆంతరంగికముగ ప్రణమిల్లి స్వీయాగారమునకు తరలెను.

భక్తసేవ భార్యకు ముక్తిదాయక మని హిందూమతము వాకొనుచున్నది. అడవియందు యేకాంతవాసము సలిపి మహాతప మొనరించు మునిచంద్రుని ఆధ్యాత్మికప్రభావముకంటె పతిసేవ సలిపి పవిత్రమైన సంసారకర్తవ్యమును నిర్వహించిన సతి వడసిన ఆధ్యాత్మికశక్తి ఘనతర మైనదని తెలుపు సుప్రసిద్ధభారతకథ ఎల్లఱకును విదితమే. భర్త మహనీయగుణగరిష్ఠు డైనపుడు భార్య వడయు ఆధ్యాత్మికవిభూతి అనిర్వచనీయము. పతియే దైవ మని భావించి ఆతని సేవింపుచు ఆతని ప్రబోధములకు వీను లొగ్గి ఆమె అశేషాభ్యుదయము నందెడిని.

ఆధ్యాత్మిక మైన ఉద్వేగముతో శ్రీరామకృష్ణుడు బోధ చేయుచుండ మేలిముసుగు జారు టెఱుగక తన్ను తాను మఱచి తెల్లవారువఱకు నిలిచి ఆమె మానసాంజలి నొడ్డుచుండెడిది. "చందురుని ఎల్లఱును 'మామా' అని ఆనందముతో పిలచుచుందురు. .చంద్రునివలె ఈశ్వరు డెల్లఱకు సన్నిహిత బాంధవుడు. ఆతని యనురాగ మందుటకు ఎల్లవారికిని హక్కు కలదు. నీదృష్టి ఈశ్వరునిదెస మరల్పుము. జగదీశు నంది ధన్యురాలవు కాజాలుదువు" అని శ్రీరామకృష్ణుడు డామె కుదోధించువాడు. దేవియొక్క బహుళశక్తులను రూపములను గుఱించి వివిధమంత్రముల నాతడు ధర్మపత్ని కుపదేశించు

వాడు. కాలక్రమమున నామెకూడ సమాధిస్థితి నందుచుండెడిది. మధుర మురళీరవము వినవచ్చినపుడును, ప్రశాంతనిశీథినీముహూర్తమున నిండుచందురు నునుసోగవెన్నెలను విలోకించినపుడును భావమననము చేసినకొలది హృదయ మాధ్యాత్మికోద్వేగభరిత మైనకొలది తన్ను తాను మఱచి ప్రాణపతివలె నామెయును దివ్యానుభూతి నందుచుండెడిది. ధ్యానము అవిరతమై అవిచ్ఛిన్నమై యొండునెడల ఉపాసకుడు జగదీశు నాత్మహృదయమున నవలోకించి ఆతనిగంభీరభాషణములను వినజాలు ననియు విశాలమైన ఆతని మానసదిశావలయమున భాసురభావద్యుతి తళ్కొత్తినంతన నది క్రియాపరిణతి నందగల దనియు ఉపాసకుని ఉల్లమపుడు శాంతిసుధాసంసిక్త మగు ననియు ఆత్మహృదయమున నధివసించుజగదీశుడు సమస్త మానవుల హృదయములందును దీనులహృదయములందును దిక్కులేనివారి హృదయములందును విరాజిల్లుచునే యుండు ననియు; ఈయంశమున కవగతమైనవానిమానసము అడకువతో నొప్పు ననియు; స్వానుభూతివలన నెఱిగి ఆచార్యుని అంతేవాసినులలో నొకర్తుకయు తనకు మిగులనన్నిహితయు నైన యొకయోగినితో శారదాదేవి చెప్పుచుండెడిది.

పరమహంసశిష్యులవలె శ్రీశారదాదేవియు భర్తవలన బహుళ ప్రబోధముల నందుచుండెడిది. ఈప్రబోధములును ఉపదేశములును గంభీర భావబంధురములై మేక్సుముల్లర్ ప్రభృతుల ప్రశంసను క్రీ. శ. 1898 లోనే పడసినవి. బుద్ధ ఏసు మున్నగు మహాప్రవక్తలవలె శ్రీరామకృష్ణుడు తన యుపదేశములను నీతిపాఠములను హృద్యమైన కథలతోడను చిత్తముల నాకర్షించు ఉపమలతోడను లోకోక్తులును సూత్రములు కాజాలిన మహిత భాషణములతోడను శిష్యప్రకరమునకు కఱపినాడు. శ్రీశారదాదేవి హృదయము నవి విజ్ఞానసందీపిత మొనరించినవి.

వంట మున్నగు నింటిపనులను ఆమె యతికౌశలముతో నిర్వహించెడిది. అతిథులసంఖ్య అధిక మైనకొలది ఆమె శ్రమయును అధికము కాజొచ్చెను. భర్తకు శుశ్రూష నెఱపుటకు తా నభిలషించినంతసమయము లభించుట లే దని ఆమె దుఃఖించెడిది. ఆహార మిడువేళయందు పతిసాన్నిధ్యమున నుండుట కామెకు కొంతయవకాశము లభించెడిది. పతికి మిగుల నిష్టమైన పదార్థములను ఆతనికై ఆమె వండుచుండెడిది.

సాంసారికసుఖములను దరి జేరనీయకున్నను పరమహంసదేవుడు తన యర్ధాంగలక్ష్మిని అత్యాదరముతో వీక్షించుచు ఆమెకు సంప్రీతిని కలిగించుటకై మక్కువ పడుచుండువాడు. నగలపై ఆమెకు కోరిక కలిగె ననువిషయము నెట్లో ఆతడు గ్రహించి తాను స్వర్ణమును ముట్టువాడు కాకున్నను ఆమె యీప్సితసిద్ధికై ఆతడు తగువ్యవస్థ గావించెను. శ్రీరామకృష్ణునకు మాసమునూసము ఏడురూకలు గుడియాస్తినుండి లభించుపర్పాటును మధురనాథుడు కావించెను. ఈరూక లొకపెట్టియందు వేయబడుచుండెడివి. పేటికలో మూడువందలరూకలు కూడియుండె నని విని వానితో భార్యకు శ్రీరామకృష్ణుడు ఆభరణములు చేయించెను. ప్రీతితో శారదాదేవి వానిని దాల్చినను పతి వ్యాధిపీడితుడైనంతన మురుగులనుతక్క తక్కినవానిని దీసివైచెను.

శారదాదేవి యొకసారి పుట్టినింటికి వెళ్ళియుండగా శ్రీరామకృష్ణునకు ఆహారసౌకర్యము సరిగా జరుగనందున తనయిబ్బంది తెలుపుచు నామెను కదలి రమ్మని పరమహంస కబురు పంపెను.

పుట్టినింటనుండి దక్షిణేశ్వరమునకు మరలునపుడు మాతాజీ పెక్కుయిక్కట్టులు పడవలసివచ్చెను. ఈయిక్కట్టుల నీమె యెదుర్కొనినవిధమును పరిశీలించితిమేని ఈమెధైర్యసాహసము లెట్టివో గ్రహింపజాలుదుము. అడవిగుండా శారదాదేవి తనయూరివారితో నడచుచుండెను. ప్రొద్దుగ్రుంకుటకు మున్నే తారకేశ్వరమును చేరుకొనవలె నని కడువడిగ వారు నడువదొడగిరి. మాతాజీ వారితో నడువజాలకపోయెను. "నీవీరీతిగా నడుగులు వైచితి వేని జాముర్రాత్రిలోగా తారకేశ్వరమును చేరుకొనజాలము బందిపోటులబారి పడెదము" అని వారామెతో వచించిరి. తనవలన వారు విపత్తును పడరాదనియు తనకై తడయవల దనియు వారిని తాను తరువాత తారకేశ్వరమున కలసికొనెద ననియు తెలిపి ఆమె వారిని పంపివైచి తనశక్తిననుసరించి నడువసాగినది. ఎంతయత్నించినను ఆమె ప్రొద్దుగ్రుంకునప్పటికి అరణ్యమందలి అర్ధభాగమును మాత్రము దాటజాలినది. అరణ్యమధ్యమున అంధకారమున ఆమె నిలువబడినది. ఆమెగుండెలు అడలుతో దడదడ లాడదొడగినవి. అపుడు భయంకరాకారు డొకడు చేత నొకగద్ద బూని కడువడిగ ఆమెదెస కరుదెంచి "ఎవరు అక్కడ" అని కర్కశస్వరమున ప్రశ్నించెను. మఱొకవ్యక్తి కొంత

దూరమునుండి వానిదెస నరుదెంచుచుండెను. దడదడలాడుగుండియల నెట్లో యడచి ధైర్యము దెచ్చుకొని మాతాజీ జాలిగొలుపులీల ఆభయంకరాకారు నితో నిట్లు పలికెను. "తండ్రీ! నాతోడివారు నన్నువదలి వడివడిగ వెడలి పోయిరి. చీకటిలో తెన్ను దప్పితిని. దయయుంచి వారికడకు నన్ను గొని పోయెదవా? నీయల్లుడుగారు దక్షిణేశ్వరాలయమున నున్నవారు. వారి కడకు పోవుచున్నాను. అచ్చటికి నావెంట నీవు వత్తువేని ఆయన యెంతో ఆనందించును."

ఇంతలో రెండవవ్యక్తి ముందటి కరుదెంచెను. అమె యాడుది. అమె బందిపోటువాని భార్య యని శారదాదేవి యూహింప గలిగెను. ఆమెను చూచినంతనే దేవికి ధైర్యసాహసములు కలిగెను. ఆమెచేతులు పట్టుకుని "అమ్మా; నేను నీబిడ్డను. శారదను. నేను ఘోరకష్టమున బడితిని. నాఅదృష్ట మున నాఅమ్మవైన నీవును నాఅయ్యవైన ఈతడును నాకిచట అగపడితిరి. మీరు అగపడకున్నయెడల నాగతి యేమై యుండునో గదా!" అని దీనముగా పలికెను.

ఆమాటలు దంపతులహృదయములను కరగించెను. తమబిడ్డన ట్లామెను వారు ఆదరింపసాగిరి "అమ్మా! ఈచీకటిలో నీవు ప్రయాణము సాగింపలేవు." అని అనురాగానుకంపములతో పలికి వారామెను మెల్లగా గ్రామమందలి యొకఅంగడికి గొనిపోయి ఆమెకై ఫలహారములు కొనిరి. బందె పోటువానిపెండ్లాము తన వలువలతో నామెకై మెత్తనిప్రక్క నేర్పఱచి దానిపై ఆమెను పన్నుండజేసి కన్నబిడ్డవలె నాటిరేయి ఆమెను కాపాడెను.

మఱునా డాదంపతులు కడుభద్రముగా నామెను తారకేశ్వరమునకు గొనిపోయి యొకయంగడియందు దామెకు విడిది నేర్పఱచి సముచితమైన భోజన వ్యవస్థ జరపిరి, కడచినసాయంసమయమున వనములో నామెను విడిచివచ్చిన వారు అంగడియందామెను గలసికొనిరి, పిమ్మట దస్యుదంపతుల సెలవు గైకొని తోడివారితో నామె పయనమును సాగించెను.

స్వతస్సిద్ధముగ మనుష్యహృదయము భవ్యభావభరిత మైనది. మనుజు డీశ్వరాంశసంభూతుండే కదా! మానవు డొక్కొక్కప్పుడు దస్యుడై దురాత్మ గ్రుడై గోచరించినను వానిహృద్వీణాతంత్రిని ఏపుణ్యమూర్తియైనను మీటుచో

మధురనిస్వనము కర్ణగోచర మగుట నిస్సంశయము. ఆతనియంతరంగమున నణగియున్న ప్రణయపూరము అనురాగస్పర్శకతన నవిళరముగ జాల్వారుట తథ్యము. కత్తిపోటునకు సాధ్యముకానిపని కరుణకు శక్య మగును. ఆగ్రహము వలన చెడిపోవుపని అనుగ్రహమువలన సాధింపబడును. అనురాగానుకంపలు అఖిలలోకములందును అజేయములే. అగ్నిశిఖలకు నసాధ్యములైనకృత్యములు పుష్పదళస్పర్శవలన సుసాధ్యము లగును. దుష్టశక్తిని దునుమాడునది దుష్ట శక్తి కాదు. మఱి ప్రణయశక్తి. మాధుర్యస్పర్శకతన విషోరగము పరమ ప్రమోదమున ఫణమెత్తి యాడును. ఆదర్శరచయితలు సౌందర్యమాధుర్య ములమహత్త్వము నుగ్గడింతురు. ప్రపంచసారస్వతక్షేత్రమున విజయధ్వజ మెత్తునది ప్రణయమే కదా! జయడిండిమమును మ్రోగించునది సదాశ కదా! ఉత్కృష్టసాహిత్యసృష్టికిని ఉదాత్తజీవితవిధానమునకును శ్రీశారదాదేవి పరమహంసబోలు మహనీయగుణగరిష్ఠుల సముజ్జ్వలదృష్టాంతములే మేలు బంతులు కా జాలును.

దక్షిణేశ్వరమున మాతాజీ గడపుసుభదినములు క్రమక్రమముగ కడ ముట్టసాగినవి. క్రీ. శ. 1885 లో గ్రీష్మకాలమున పరమహంసకంఠమున కురుపు లేచెను. చికిత్సకై యాతడు కలకత్తాయందలి శ్యామపుష్కరిణికి గొనిపోబడెను. అచట స్త్రీలువసించుటకై ప్రత్యేకమైన యేర్పాటు లేకుండుటచే శారదాదేవి తొలుత భర్త ననుగమింపలేదు. కాని భర్తృసేవకై ఆమె హృదయ మువ్విళ్ళూరుచుండెను. ఇబ్బందులకు తల యొగ్గి ఆమె పోయి పరమహంసకు శుశ్రూష చేయసాగినది. తరువాత వైద్యులసలహా ననుసరించి శ్రీరామకృష్ణునిశిష్యులు క్రీ. శ. 1885 సంవత్సరమున డిశంబరు పదునొకండవ తేదీ నా డాతనిని కలకత్తాకు అనతిదూరముననున్న కాశీపూర్‌కు గొనిపోయి యొకతోటయందలి యింటిలో విడియించిరి. శారదాదేవి పతి ననుసరించి అచటి కరిగి బహుభంగుల నాతనికి సేవచేసెను.

వైద్యు లెంతయత్నించినను అంతేవాసులును అర్ధాంగియును నెంతసేవ చేసినను పరమహంసకు వ్యాధితగ్గు చిహ్నము లెవ్వియును గోచరింప లేదు. కావున నీశ్వర కారుణ్యమందే శరణ్యమును గాంచగోరి శ్రీశారదాదేవి తారకేశ్వరమున కేగి అచటియాలయమున మహాదేవుని సేవించి ఆహారపానీ

యములను వర్జించి తనపతిని రక్షింపు మని ఈశ్వరుని ప్రార్థింపుచు భగవంతుని ముందు సాగిలపడి యుండెను. ఈసంఘటనము నుల్లేఖించుచు ఆమె యిట్లు తెలిపెను. "రెండవనాటి నిశీథినీసమయమున నొక శబ్దమువిని ఉలికిపడితిని. ఎవరో కుండలవరుసను ఒక్క దెబ్బతో బ్రద్ద లొనరించుచున్నట్లు నాకుతోచెను. కొంతసేపటికి నాకు చైతన్యము కలిగెను. 'భర్తయెవరు; భార్యయెవరు? ఇహాలోకమున బంధువు లెవరు? ఏల నుసురుల నిట్లు శరీరమునుండి వెడలగొట్టు చుంటిని?' అను తలంపులు తటిత్తులవలె నపుడు నా మానసదిశావలయమున తళ్కొత్తినవి. నాప్రభువుమీది మమకారము అపుడు నన్ను బాసిపోయినది. మానసమున విరక్తిభావము ప్రవేశించినది. మఱునాడు కాశీపూర్ తోటకు పోతిని."

క్రీ. శ. 1886 సంవత్సరమున ఆగష్టుపదునాఱవ తేదీని సోమవారము నాడు ప్రాతఃకాలమున పరమహంస పరమపదించెను. ఆమె మఱికొంతకాలము కాశీపురమండలితోటలోనే వసించినది. పరమహంసయస్థులను అందు పూజించుచుండువారు. దివంగతు డగుటకు కొన్నిదినములకుమున్న పరమ హంస తనయర్ధాంగి నుద్దేశించి "వీనికి (అనగా తనకు) చూచుటకు సాధ్యము కాని తీర్థములను నీవు సేవింపుము" అని పలికెను. పతి యుద్దేశ మునననుసరించి అతడు పరలోకగతు డైనపిదప శారదాదేవి యాత్రార్థము పయనమాయెను.

క్రీ. శ. 1886 సంవత్సరమున ఆగష్టు 30 తేదీనాడు ఆమె పయన మైనది. బృందావనమున కరుగుచు సుప్రసిద్ధతీర్థస్థానములను మహాక్షేత్రము లను నామె సందర్శించినది. కాశీయందు శ్రీవిశ్వేశ్వరాలయమున సాయంసమ యమున స్వామిసేవ జరుగుసమయమున శారదాదేవి పరమహంసదేవునివలె తన్మయత్వము నందినది. చాలసేపు దివ్యభావానుభూతియం దాత్మవిస్మృతి నందియుండెను. ఈపర్యాయము వారణాసిలో నామె వసింపుచుండగా నొక నాడు సుప్రసిద్ధయోగీంద్రుడు పండితప్రవరుండునునైన శ్రీ భాస్కరానంద స్వాములవారిని మాతాజీ దర్శించెను. ఈసందర్శనమునుగుఱించి కాలక్రమ మున నామె యిట్లు పలికెను. "బృందావనమునకు బోవుచు వారణాసియందు శ్రీ భాస్కరానందస్వాములవారిని సందర్శింప నరిగితిని. అపుడు నామానసిక దుస్థితి దుస్సహ మై యుండెను. నా ప్రభువు అంతకుమున్నే పరమపదించెను.

గదా! శ్రీస్వాములవా రపుడు దిగంబరులై యుండెను. ఇతరస్త్రీలను నన్నును జూచి స్వామిజీ 'అమ్మలారా! తొట్రుపడకుడు. మీయందఱి యందును నేను జగద్ధాత్రిని చూచుచున్నాను. మీరు బిడియపడనేల?' అని ప్రశాంతభావముతో పలికెను. ఆహా! ఆస్వామి యెట్టివాడో; ఎంతమహాత్ముడో; ప్రాపంచకభావములకు బారుగ నెట్లతీతుడై వెలయుచున్నాడో; శీతాతపములయందు సయితము దిగంబరుం డయి యుండువాడు."

బృందావనమున కామె యరుగునపుడు పరమహంస మరల నామెకు ప్రత్యక్షమాయెను. పరమపదించుటకుమున్ను శ్రీరామకృష్ణు డామెకు స్వర్ణ నిర్మితమైన తన యిష్టకవచము నామె కొసగెను. అనుదినము దానిని పూజించుచు ఆమె చేతిపై దాల్చుచుండెను. యాత్రలో ధూమశకటమున నామె పయనించుచు నిదురించుచుండెడిది. ఇష్టకవచ మామెకరమున వెలయుచునే యున్నది. ఈవిషయమున ఆమె యిట్లు పలికెను. "బండికిటికీగుండా నన్నవలోకించుచు ప్రభువు ప్రత్యక్ష మాయెను. 'నీయొద్ద నా యిష్టకవచ మున్నది. దానిని పోగొట్టుకొందు వేమోసుమీ!' అని వారు వచించిరి" తోడనే ఆమె లేచి తాయెతును దీసి తనరేకు పెట్టెలో దాచెను. ఆపేటికయందే పరమహంసదేవుని ప్రతిమ నామె భద్రపఱచి యుంచెను. అనంతర మామె ఆకవచ మును బెలూరుమఠాధిపతుల కందజేసెను.

శ్యామసుందరుని భజించుచు శ్రీశారదాదేవి బృందావనమున నొక వత్సర ముండెను. పదంపడి అనుచరసహితయై హరిద్వారమున కరిగి పవిత్ర భాగీరథీతోయమున బ్రహ్మకుండమున నిజేశునియస్థులుకొన్ని కలిపి సంతుష్టాంతరంగ యాయెను. అనంతర మామె జయపురమున కరిగెను. పిదప పుష్కర తీర్థమును సేవించెను. తరువాత ప్రయాగ పోయి త్రివేణికి పరమహంస శిరోజములకు సమర్పించెను.

క్రీ. శ. 1887 సంవత్సరమున ఆగస్టుమాసమున శారదాదేవి అనుచర సహితయై కలకత్తా జేరుకొనెను.

యాత్రలు సలిపి కలకత్తాకు మరలినపిదప రెండుదినములుమాత్రము ఆనగరమున నుండి బర్ద్వాన్‌ద్వారా కామారపుష్కరిణికి పోవుటకై పయన మాయెను. రానున్నదుస్థితిఛాయలు మార్గమధ్యమందే ఆమెను మార్గా

నెను. చేత పైకమేమియును లేనందున బార్ద్వాన్‌నుండి ఉచలన్‌వఱకు పదునాఱు మైళ్ళ మేర నామె నడువవలసివచ్చెను. కామారపుష్కరిణి చేరినంత నాయూరివారు "ఏంతచోద్యము! ఎంతవిడ్డూరము! ఎంతసాహసము! ఎంత తెగువ! వితంతువై యింకను మురుగులను వదలలేదు, ఎఱ్ఱంచుబట్ట కట్టుట మానలేదు." అని పెక్కు తెఱగుల ఆమెను చూచి దుర్విమర్శనలను చేయసాగిరి. శ్రీరామకృష్ణుని బాల్యసంగిణియైన ప్రసన్నమయి వారిని వారించుచు "పరమహంస పత్ని కేవలము దేవత, ఆమె సామాన్యమానవి యని తలచుట తప్పు" అని పలుకుచుండెడిది.

ఆదినములలో శారదాదేవి పడినదారిద్ర్యబాధ దుస్సహ మయినది. ఎవరితోడను పడయుక తానొకర్తుక దినములు కడపవలసివచ్చెను. తన యవసానసమయమున శ్రీరామకృష్ణుడు "నేను పరమపదించినపిదప కామార్పుష్కరిణికి పొమ్ము, నీకేమిదొరికిన దానిని భుజింపుము, పిదప హరినామస్మరణ మొనరించుచు కాలక్షేపము చేయుము" అని తన యర్ధాంగి నుద్దేశించి పలికెను. ఆమె జీవితమున పతివచనములు తూచాతప్పక కార్యరూపములు దాల్చినవి. పరిస్థితు లింకను దుర్భరము లైనవి. ఆమెచేత గాసైన లేకుండెను. దైనికాహారముకొఱకై నేలనుద్రవ్వి స్వయముగా కాయగూఱలను ఆమె ధరిత్రీదేవినుండి పడయుచుండెడిది. కేవలము వీనినే భుజించి ఆమె యూరకుండవలసివచ్చెడిది. వడ్లను తానే దంపి బియ్యమును తయారొనరించుకొని అన్నమును వండి పరమహంసఆత్మకు నివేదనము సమర్పించి తాను భుజించెడిది. కటికిపేదరికమున ప్రుగ్గువారికి సయితము లభించుఉప్పును కొనుటకైన ఆమెచేత నొకదమ్మిడియైన నుండెడిది కాదు. ఈశ్వరేచ్ఛకును ఈశ్వరాజ్ఞకును తల యొగ్గి దుర్దాంతమైన తనదుస్థితినిగుఱించి ఎవ్వరికిని తుదకుతన కన్న తల్లికైనను ఆమె యొకమాటయైనను చెప్పెడిది కాదు. పుట్టినింటికి రమ్మని తల్లి శ్యామసుందరిదేవి ఆమెను పెక్కుమాఱులు బ్రతిమాలినదికాని శారదాదేవి అందుల కియ్యకొనలేదు. దురంతమైన దుస్థితినిగుఱించి కిక్కురు మనలేదు. ఆమె దారిద్ర్యమును గుఱించిన ఉదంతము యెవ్వరికిని తెలియకుండుటకు ఆమె మానసహానములే హేతువులు. తనను గమనించుచు తనభర్త తనచెంగట వసించుచుండె ననుభావము ఆమెకు ధైర్యస్థైర్యములను ప్రసాదించుచుండెను.

కామారపుష్కరిణిలో నొకసంవత్సరము వసించించి యామె కలకత్తాకు పోయెను. అచట భాగ్‌బజారుభాగమున శ్రీశారదానందస్వామి "ఉద్బోధన కార్యాలయమును" స్థాపించెను. శారదాదేవి వసించుట కందు వలసిన వ్యవస్థ చేయబడెను.

క్రీ. శ. 1893 సం॥రమున శ్రీశారదాదేవి 'పంచతప' మను పవిత్రక్రియ నెఱపెను. ఆమె యాధ్యాత్మికశక్తి విశేషపరిణతి నందెను. ఒక్కొక్కప్పు డామె సమాధిస్థితియం దుండెడిది. ఆమె నిర్వికల్పకసమాధియం దుండుట గని భక్తు లాశ్చర్యాన్వితు లగుచుండువారు. ఒక్కొక్కపుడు శ్రీశారదా దేవికి పరమహంసదివ్యస్వరూపము గోచరించుచుండెడిది. ఒక్కొక్కపు డొక్కొక్క యుద్దేశ మాస్వరూపసందర్శనమున ద్యోతక మగుచుండెడిది. శారదాదేవి వానిని తృటిలో గ్రహించెడిది.

శ్రీశారదాదేవి ఆత్మశక్తి గుఱితించినమహిళ "నే గోరినముహూర్త మున కీశ్వరసాక్షాత్కారము లభించితీరును. ఈప్రాపంచకక్రియాకలాప మంతయును మహామాయాఖేలన మేయని నే నెఱుంగుదును. ఇచ్ఛగించినచో నేనీశరీరమును తృటిలో పరిత్యజింపగలను. నా నిక్కంపుప్రకృతి యెట్టి దో నేనుమనియుండగా నెవ్వరు నెఱుంగజాలరు" అని యామె సన్నిహితులతో చెప్పుచుండెడిది.

ఆమెయుపదేశములు భావబంధురమ్లై యుండెడివి. తనను సందర్శింప వచ్చినభక్తుల నామె సేవించుచుండును. వారి కాహారపానీయముల నొసగి ఎంగిలి యని సంశయింపక విస్తరులను తానే తీసివేయుచు గిన్నెలను పళ్ళెములను తానే శుభ్రపఱుచుచుండెడిది. పాదప్రక్షాళనమునకై తానే ఉదకము పోయు చుండెడిది. భక్తులు సెలవు గైకొని నిష్క్రమించునపు డామె చాలదూరము వారివెంట బోయి అశ్రుపూరితలోచనయై వెనుకకు మరలుచుండెడిది. నిక్క ముగ శారదాదేవి భక్తులకు కన్నతల్లియే.

ఒరులపాపములను తాము గ్రహించుటకును ఒరులకు సేవ సలుపుటకును మహావ్యక్తులు మిక్కిలిమక్కువ పడుచుందురు. ఏసు తనశిష్యులపాదములను ప్రక్షాళన మొనరించుటకును తనభక్తులను సేవించుటకును సంశయింపలేదు. ఒరులపాపములను తాను వహించియే మహాత్ముడు శిలువపై తనయసువులను

బాసినాడు. ఘోరదుర్మరణముపాలబడుచు ప్రచండ దృష్టితో తననుహింసించు దురాత్ములపై నాతడు ప్రసన్న దృష్టిని సాధించినాడు. మతములు బహుళముగా నుండవచ్చును గాని మతప్రవక్త లందఱును మహనీయగుణగరిష్ఠులే. వారి ప్రబోధములు మధురప్రబోధపీయూషధారలతో తొలుకాడుచునే యుండును. వారి జీవితములు మహిమోపేతములు. వారి వాక్కులు ఉదారఆశయబంధుర ములు సమస్తమతాచార్యులును సైదోడులే. వారిని నిమిత్తమాత్రులజేసి కొని జగదీశుడు ఆత్మోద్దేశము వ్యక్తీకరించును. ఏసువలె శ్రీశారదాదేవి ఒరులపాపములను తాను గ్రహించెడివి. ప్రపంచమండలి త్యాగులందఱును ఈరీతిగనే వర్తించిరి. వారి జీవితములు భాస్వదాశయభాసురములై సౌందర్య సందీపితములై విలసిల్లినవి.

శారీరకముగ శారదాదేవి సౌష్ఠవసంపన్నయై సౌందర్యసందీప్తయై యుండెడిది. యువతియైయున్నపుడామె సురవధూటివలె నెనలేని హొయలున వెలయుచుండెడిది. ఆమెను విలోకించినంతమాత్రమున సంశయాత్ములమనసుల నుండి శంకలన్నియును అంతర్ధానము లగుచుండెడివి. అంతరంగములు ఆనంద శాంతుల పరిఢవిల్లుచుండెడివి.

పాపపంకిలమున పొరలి పొరలి కడకు పశ్చాత్తాప మంది ఒక యామిని శ్రీశారదాదేవిపాలి కరిగి అశ్రుభరితనేత్రములతో తనదోషములు నేకరువు పెట్టినంతన మాతృదేవి ప్రముదిచిత్తయై ఆమెను కౌగలించుకొని ఆమెకు అభయహస్త మొసగి ఆమెయుల్లమునకు చల్లదనము చేకూర్చెను. అనంతర మామెకు మాతృదేవి మంత్రోపదేశ మొనరించెను.

ధ్యాననిరతయై అనవరత మామె కాలక్షేపము చేయుచుండెడిదికాదు. సేవాధర్మమున మాతృదేవి అందెవేసిన చేయి. కరవు చెల రేగుచోటులందును, వరదలందును ప్రజలల్లాడు తావులందును అభాగులకు సేవ సలుప నామె మిక్కిలిమక్కువ పడుచుండెడిది.

విపత్తు లెదుర్కొనువేళలందు ఆమె అనల్పమైన ధైర్యసాహసములు వ్యక్తీకరించుచుండెడిది.

ఆడంబర మనున దేదియు ఆమె ఎన్నడు నెఱుంగదు. కడుంగడు సామాన్యాంబరములనే ఆమె ధరించుచుండెడిది. కుట్టిన బట్టలనుగాని పాదరక్షలను గాని ఆమె యెన్నడు వాడి యెఱుగదు. సాధారణఆహారమునే ఆమె ఆరగించుచుండెడిది.

అపుడవు డామెవ్యక్తీకరించుభావములందు వేదాంతసారము తొలు కాడుచుండెడిది. అద్వైతసిద్ధాంతము. నామె విశ్వసించుచుండెడిది కానిభక్తి మార్గము సర్వోత్కృష్టమైన దనియు నామె నమ్ముచుండెడిది. పవిత్రప్రణ యమువలన నీశ్వరకారుణ్యము లభించునని ఆమె యుద్దేశము. "మంత్ర తంత్రములవలనగాని శాస్త్రచర్చలవలనగాని వాదప్రతివాదములవలనగాని విశేషప్రయోజన మలవడదు. భక్తివలన నీశ్వరసామ్రాజ్యము కరస్థలామల కము కాగల" దని ఆమె వ్యక్తపఱచుచుండెడిది.

నిర్మలచిత్తమందే భక్తిభావము తలసూపును. ఆధ్యాత్మికక్రియాను ష్ఠానము అంతఃకరణశుద్ధి కలిగించు నని ఆమె యుద్దేశించుచుండెడిది. అట్టి యనుష్ఠానమువలన గతకర్మబంధములు తెగును; ఉపాసకుని జితేంద్రియుని చేయజాలును. వాతూలము మేఘములను వియత్తలమున చెల్లాచెద రొనరించు నట్లు ఈశ్వరనామ మైహికవాంఛలను పంచబంగాళము గావించును. గభీర ధ్యానము అంతరంగమున కాధ్యాత్మికశక్తిని చేకూర్చును. ఆధ్యాత్మికక్రియా నిర్వహణమునకు శ్రద్ధాభక్తు లక్కఱలైన వని యామె తెలుపుచుండెడిది. అవి చలితమైనజపమువలన భక్తునిచిత్తము మర్కటమువలెగాని మత్స్యమువలె గాని చలింపక సక్రమమార్గము ననుసరించును. గభీరధ్యాన మట్టిమానసము నకే సాధ్య మగును. సముజ్జ్వలశక్తితో కుండలిని వెలయును. శుభ్రాత్మజప నిష్ఠయం దున్నపుడు పవిత్రపదము తనంతదాను అంతరంగమునుండి ప్రణయ ధ్వనివలె అవిరతముగ వెలువడును. ఇట్టియాత్మగలవాడే సిద్ధుడగును. జపతప ములందు ఉపాసకుడు సిద్ధహస్తుడై మిన్నకొనియుండక పవిత్రకర్మక్షేత్రమందు ముందంజ వేయవలె నని ఆమె తెలుపుచుండెడిది.

అవసానకాలమున శ్రీశారదాదేవి బాలికచాడ్పున నుండెను. 'తీవ్ర జ్వరపీడితయైయున్నపుడుకూడ ఈశ్వరునకు సమర్పింపక ఆమె యేదియును గొనకుండెడిది. తనయంత్యముహూర్తము నామె గుఱుతించినది. పరమహంస పత్నియై పావనగుణశోభితయైన శ్రీశారదాదేవి క్రీ. శ. 1920 లో జూలై 20 తేదీనాడు దివంగత యాయెను. ఆపరమపతివ్రతపవిత్రస్మృతికి చిహ్నము లైన మందిరములు కలకత్తానగరపరిసరమున బెభూరుమఠమందును పురమందలి భాగ్‌బజారుభాగములోని ఉద్బోధనకార్యాలయమున ఆమెజన్మస్థలమైన జయ రామబాటియనుపల్లెయందును విలసిల్లుచున్నవి.

---

౬౫

# శ్రీ మళయాళ స్వాములు



మ. తెలియం ద్వన్మహిమాదు లుల్లమున సంధిల్లున్ భవద్భక్తి, భ
క్తిలభింపన్ నశియించు దుష్క్రియలు దుష్కృత్య ప్రణాశంబునన్
గలుగుం దావక భూర్యనుగ్రహ; మనుగ్రాహ్యుండుగా నీకు, ని
శ్చలతత్త్వజ్ఞత ముక్తిగాంచు నరుఁ; డీశా భక్తచింతామణి ''

శ్రీమళయాళస్వాములవారికి వాసస్థానమైన ఆశ్రమము శ్రీ వ్యాసాశ్రమమని వాసిగాంచినది. శ్రీస్వాములవారి వృత్తాంతము నెఱుఁగుటకుమున్న వారి పూతజీవితమునకు ఆటపందిరియైన ఆశ్రమమెట్టిదో పాఠకులు గ్రహించుట యుక్తము కావున దాని సంక్షేపోదంతము నిందు తెలుపుచున్నాను.

## (శ్రీ వ్యాసాశ్రమము)

చిత్తూరు మండలములో రేణిగుంటకును శ్రీకాళహస్తికిని నడుమ ఏర్పేడుకు సుమారు మైలుదూరమున ఈ యాశ్రమము వెలయుచున్నది. సుందరవనాలంకృతగిరుల దాపున కనువిందొనరించు కేదారములకుఱగట రమణీయమైన ప్రకృతికి పుట్టినిల్లైన తావున పవిత్రమై ప్రవిమలమై ప్రశాంతమైన వాతావరణమున నిది విలసిల్లుచున్నది. పూతభావపూరితమై పురాణప్రసిద్ధమైన గురుకులమున ప్రవేశించునట్లు ఇందు కాలిడినంతనే అపూర్వానుభూతినందు యాత్రికు డూహించును. ఇందు కాశీబుగ్గయను నొకతీర్థముకలదు. ఇది విశేషమహాత్మ్యము కలదని హిందువులు విశ్వసింతురు. దీని వృత్తాంతము శివపురాణమున గలదు. ఈపురాణమున శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యమునకు సంబంధించిన భాగమున జపాలమహిమోదంతఘట్టమున నది రోమశమహర్షి భరద్వాజమునికెఱింగించినట్లు తెలుపబడినది. వ్యాసమునీంద్రుడిందు తపసొనరించెనని పలువురు విశ్వసించుచుందురు. కాశీ కడనున్న గంగాస్రవంతినుండి యిచట తీర్థములోనికి నీరుబుకుచుండుననియు కావుననే యిది 'కాశీబుగ్గ'

యని ప్రసిద్ధినందినదనియు అనేకులు వచించుచుందురు. వ్యాసభట్టారకు డొకప్పుడు జాహ్నవియందు స్నానమాచరించుచుండగా ఆతని కమండలువు నీట గొట్టుకొనిపోయెనట. తనకుగలఆస్తి అట్లు సలిలముల గలసిపోవుటచే ఋషి మిగుల దుఃఖించి విరక్తుడై దక్షిణదిశగా పోయెనట. దక్షిణాపథమున సంచరింపుచు నొక యరణ్యమునవిడసి ఒకనాటి ప్రాతఃకాలమున నందలి తీర్థమున నాతడు స్నాన మాచరించుచుండెనట. ఆ చిన్న గుంటయందు మునీం ద్రుడు తన కమండలువును విలోకించెనట. గంగయందు మునిగిన కమండలువు అందు తేలెనట. పోయిన సర్వస్వము మరల చేజిక్కుటచే ఋషికుంజరుడు పరమానంద భరితుడాయెనట. వ్యాసుని తరువాతకూడ ఆ కమండలువు అందే యుంచబడినదనియు పిదపనది భద్రమొనరింపబడినదనియు నేడును అది యొకా నొక తావున నున్నదనియు కొందఱు చెప్పుకొనుచుందురు. శ్రీకాళహస్తీశ్వరుని సేవింపుచు కృష్ణద్వైపాయను డాప్రదేశమున వసించి తపసానరించియుండుటచే దీనికి వ్యాసాశ్రమమను పేరువచ్చినది.

మళయాళస్వామి పేరునుబట్టి వీరు మళయాళదేశస్థులని గ్రహింప గలము. బాల్యకాలమందే వీరు సన్యాసాశ్రముపై తమదృష్టిని సారించిరి. బుద్ధిపుట్టిన ముహూర్తమందే వీరు గృహమునువీడి పరివ్రాజకులై దక్షిణాపథ మున సంచారముచేయుచు యీ వెంకటాచలమునకుజని గోగర్భపరిసరదరీ ద్వారమున నితడు పండ్రెండు వత్సరములు అన్న పానీయములకును ఆహారనిద్ర లకును సాధ్యమైనంతదనుక అంతు బెట్టి తపసానరించెను. తమసాధనకతన మళ యాళస్వామి జితేంద్రియుడాయెను. హృదయస్థ సంశయములను దూరీకృతమొన రించి మునికులగటజేరి భక్తవరేణ్యులు స్వామిజీ చరణకమలములకు అవిరతముగ కానుకలనందింపసాగిరి. స్వామిజీ ప్రసన్న వదనముతో వానినవలోకించి తక్షణమే వానిని జగదీశునకు అప్పన మొనరించుచుండువారు. దీనులందును దరిద్రులందును వీరీశ్వరు నవలోకించుచుందురు. ఈశ్వరప్రీతికై స్వామిజీ ఆకానుకలను వీరి కొసగుచుందురు. భారతఋషి సంప్రదాయమున వీరికెంతేని మక్కువయుండుట నిక్కము. తనతపశ్శక్తి వలన ప్రాచీనఋషులవలెనే నేటియోగియు స్థితప్రజ్ఞ

నలవఱచుకొనగలడని వీరి విశ్వాసము. తొల్లింటి మహాపురుషుల జీవితాశయములను వీరు చక్కగా హృదయంగమ మొనరించుకొనిరి. తమ కుటీరములందే అశ్రాంతము ధ్యాననిష్ఠాగరిష్ఠులై యుంట వారి జీవిత పరమావధికాదని వీరు గ్రహించిరి.

పదునేడేండ్ల యైదుమాసములు శ్రీవెంకటేశ్వరస్వామి సమీపమున గోగర్భమునవసించి విశాలకర్మప్రాంగణమున ప్రవేశించుటకై అందుండివారు కదలిపోయిరి. పరివ్రాజకులై ఆర్యావర్తమందలి మహాక్షేత్రములను సేవించుచు వారు విశేషదూరమరిగిరి. పట్టుదల వీరికైసర్గికగుణము. సులభప్రయాణ సౌకర్యములు కనుపడుచున్నను కాలినడకనే వీరు దీర్ఘసంచార మొనరించిరి. కాశీలో దీక్షావస్త్రములను వీరు ధరించిరి. అనంగానందస్వాములను నభిధేయము నందిరి. అందుండి కాలినడకను ఏర్పేడు సమీపమందలి కాశీబుగ్గ క్షేత్రమును జేరుకొనిరి. ఇచ్చటి వ్యాసాశ్రమమునందలి సాంద్రవనమున చక్కని సంస్కారమును నెఱపిరి. రమ్యోద్యానరూపము దానికి చేకూర్చిరి. తొల్లింటి యాశ్రమరూపములు సౌందర్యమును పునరుద్ధరించిరి. అచిరములో దానిని గురుకులమొనరించిరి. పదునేడేండ్లకుమున్నె సంస్కృతపాఠశాలనందు నెలకొలిపిరి. వేదయుగమునందును పురాణయుగమునందును ఆశ్రమములు మహితభావముల కాశ్రయములై సౌందర్యనిలయములై ఆనందవ్రతులును భావోపాసకులకును దీక్షాగృహములై ఉత్కృష్టగ్రంథములకు పుట్టినిండ్లై విజ్ఞానకేంద్రములై వైకుంఠ కైలాసములకు సహపాఠులై విలసిల్లు ఔటతెగి అంతరదృష్టియందు వాని నవలోకించి వానికి ప్రతిరూపమగు ఆశ్రమమును నిర్మించవలెనని మళయాళస్వాములవారు నిశ్చయించిరి. వీరిభావశక్తి యెట్టి యద్భుతమైనదో క్రియాశక్తికూడ అట్లే యద్భుతమయినదే! తమ ఆశ్రమమును విజ్ఞానకేంద్రము నొనరించిరి. అది భజనమందిరమాయెననియు తెలుపనగును. పాఠశాలయందు విద్వాన్ పరీక్షావ్యవస్థయుండుట నిక్కమే! కాని పరీక్షలకై యేర్పడిన సంస్థమాత్రమే అదియని తలపరాదు. ఉన్నతాదర్శముల నారాధించువా రాచార్యులుగా నందు నియోగింపబడిరి. ధ్యానప్రార్థనప్రణాళికల ననుసరించి విద్యార్థులు శిక్షణమందుచున్నారు. నియమబద్ధజీవితములందువా రారి తేఱుచున్నారు.

వేకువజామున మూడు గంటలనుండి రాత్రి పదియగువఱకు ఆశ్రమమున వివిధక్రియాప్రణాళిక నిర్ణయమైనది. కాలకృత్యముల నిర్వర్తించి భక్తులు నాలుగు గంటలకు పరిసరగృహమున జేరుదురు. తెల్లవారువఱకు గీతాపారాయణము జరగుచుండును. అనంతరము స్వాములవారు తమధ్యానగృహమున కరుగుచుందురు. సాయంకాలమున వ్యాసకుటీరమున తాత్త్విక గోష్ఠి సలుపుచుందురు. వీరు విశేషించి గీతాప్రబోధమును సలుపుచుందురు.

విద్యార్థులకును భక్తులకును యాత్రికులకును ప్రత్యేకమైన వసతులు కలవు. వ్యాసకుటీరమున ఈశ్వరమందిరమున్నది. మందిరకుడ్యములపై వివిధ మతప్రవక్తల ప్రతిమలు రంగారియుండును. గోగర్భమున వసించుచప్పటినుండి విశ్వసనీయుడును వృద్ధుడునునైన అర్చకుడు మందిరమున పూజాదులు నెఱపుచుండును. సాయంకాలగీతాగోష్ఠి ముగిసినవెనుక విద్యార్థులు వ్యాసకుటీరమున జేరి వివిధభజనకీర్తనల నాలపింతురు. అనంతరమొక విద్యార్థి ముమ్మారు కంచుఢక్క వాయించును. ఆశ్రమనియమముల నుచ్చరించును. పిదప బాలురు తమ భోజనాలయమున ప్రవేశింతురు. సంయుక్తప్రార్థనముతో భోజనమారంభించి సంయుక్తప్రార్థనముతోడనే దానిని ముగింతురు. భోజనశాలనంటియే వంటగది యున్నది. సంబారముల యాగారము ప్రక్కనగలదు. ఎదుట నెత్తైన చోటున ధాన్యపుగాదె కలదు. కొంతదూరమున గోశాలకలదు. ఆశ్రమమున చక్కని గ్రంథభాండాగారమున్నది. కొలదిఫర్లాంగులలో ఉపాధ్యాయుల కుటీరములున్నవి. ఆశ్రమావరణమున మఱికొన్ని చిన్నకట్టడములు భక్తుల కొఱకు నిర్మింపబడినవి. పరిసరభూములు ఆశ్రమమునకు సంబంధించినవే. వీని సేద్యము జరుగుచుండును. రమ్యమైన ఉద్యానవనమున ఫలవృక్షములున్నవి. కాయగూరల పాదులును వెలయుచున్నవి. సమీపమున గోవులును ఎడ్లును కమతపుసామానులునుగలవు. స్వయంపోషణమునకు స్వయంకృషికిని ఆశ్రమ ఆదర్శస్థానము.

స్వామీజీయాశయము లీబాహ్యవ్యవస్థలందు రూపునందినవి. ప్రార్థనమునకును సేవాధర్మమునకును వీరు ప్రాముఖ్యమునొసగిరి. ధాన్యమననపఠనములకును ఉచితక్రియాప్రణాళికకును వారుజ్జీ కుదిర్చిరి. విద్యాదాన అన్నదానము లొనరించుతఱి వారు వర్ణభేదములను పాటించిరికారు. వేదవిద్యనందుటకు

ఎల్లరకు హక్కు గలదని వీరియభిప్రాయము. తమ స్వతంత్రభావముననుసరించియే వీ రాశ్రమనిర్మాణము గావించిరి. సనాతనధర్మము నారాధించుచు వీరు యుగ ధర్మమును మన్నించిరి. భారతదేశమున నానాస్థానములందు (ఖరగ్‌పురము; రాజమహేంద్రవరము; తాడేపల్లి; ఘంటసాలపాలెము; బందరు; ధరణి కోట; పేద్దపురము; మేనకూరు; కనుపర్తిపాడు; మేడపాడు; కొండమాచు కోనాపురములు; పెద్దేము; ముదునూరు మున్నగు ప్రదేశములు) ఆశ్రమ శాఖలను నెలకొలిపిరి. దక్షిణాఫ్రికా బర్మా మున్నగు సీమలందలి శిష్యవర్గము లకు సందేశముల పంపుచుందురు. ప్రస్తుతయుగము పత్రికాయుగమని యెఱిగి 'యధార్థభారతి' ని నెలకొలిపిరి. ప్రతిమాసమును తమ ప్రబోధములతో దానిని దేశాటనమునకై పంపుచుందురు. చిత్తూరుపురమున ఆశ్రమముద్ర ణాలయము కలదు.

ఆశ్రమభూమియందొక ప్రాచీనాలయము కలదు. దానిని పునరుద్ధరించు ప్రయత్నము జరగుచున్నది. కాశీబుగ్గకు సమీపమున రెండు తటాకము లున్నవి. సమీపమందలి కొండనెక్కి చూచినపుడు ఒకవంక వెంకటేశ్వర ధామమును నొకవంక శ్రీకాళహస్తీశ్వర క్షేత్రమును గోచరించును.

ఉద్గ్రంథప్రచురణము ఆశ్రమప్రణాళికలో మహిమోపేతమైనది. స్వాములవారు స్వయముగ బహుళగ్రంథముల నాంధ్రమున రచించి ప్రకటిం చిరి. మాతృభాష మళయాళవాణియైనను నాంధ్రమున వీరు చక్కని రచనా కౌశలమును వచఃకౌశలమును అలవఱుచుకొనిరి. ప్రతిభావంతులచే చక్కని మతగ్రంథములు వ్రాయించుచు వీరు ప్రకటించుచుందురు. మానవాత్మ సంస్కారము వారి ప్రధానాశయము. పైకమునకై వీరు ఎన్నడును ఎవ్వరిని ఆశ్రయించి యెఱుంగరు. వీరికి సంకల్పసిద్ధికలదు. వలసినసహాయ్యము తనంత దాను రెక్కలుకట్టుకొని యెగసివచ్చి వీరి చరణోపాంతమున వ్రాలును. భక్త వరేణ్యులు పలువురు ఆశ్రమక్రియావిభజన మొనరించి తమతమ కర్తవ్యము లను నిర్వహించుచుందురు.

ఆత్మసంయమమును గుఱించి ప్రబోధించి యూరకొనక శ్రీస్వాముల వారు దాని ననుష్ఠించి చూపుదురు. శీతాతపవర్షములందుసైతము సాధారణ కాషాయాంబరమునే వీరు ధరింతురు. సాధారణయానసముపై నుపవసించి

రాతిపలకపై వీరు శయనింతురు. అతిథుల కుచితసత్కారము లొనరించుటకై స్వామీజీ యాతురపడుచుండును. శ్రీమళయాళస్వాములవారు పరార్థజీవు లనుట నిస్సంశయము.

హిందూమతసముద్ధరణమును కాంక్షించు మహాత్ములయ్యు శ్రీస్వాముల వారు కేవలము హిందూభక్తులనే సేవింతురనియు పల్వురవలె హైందవేతర భక్తులను కొలదిచూపుతో చూతురనియు తలంపజెల్లదు. సమస్తమతప్రవక్తల ప్రతిమలను వ్యాసకుటీరభిత్తికలపై వీరు నెలకొలుపుటకు హేతువు ఆమహా నీయుల యాశయములనన్నిటిని ఆశ్రమవాసులు హృదయంగమమొనరించు కొనవలెనని వారు కాంక్షించుటే. సమన్వయదృష్టియును విశాలదృష్టియును వీరికి నైసర్గికములు.

శ్రీస్వాములవారి ఉపదేశములను కొన్నిటిని పాఠకులు పరిశీలింతురు గాక. ఒక్కొక్కరును వారివారి జీవనమునకు సాధ్యమైనంతవఱకు పాపము లేని పనిని శ్రద్ధతో చేయుట ధర్మము. ఈవిషయమున వారు విజయులైనచో లోకములో వారు విజయులే. వారివారి జీవనయాత్రచే ఒక్కొక్క ప్రాణి కైనను క్లేశము కలుగకుండునట్లాచరించుట పరమధర్మము. క్లేశము కలిగి నచో మరియొక విధమున నతడును దుఃఖితుడగును. అశాశ్వతమగు దేహ పోషణకొఱకు వేళల నేర్పఱచి అట్టిసమయములం దొకప్పుడైనను దైవప్రార్థన ధ్యానజపాదులకు అవకాశమేర్పఱచుకొనుటయే మానవజన్మమెత్తినవారందరి యొక్క ముఖ్యకర్తవ్యము.

అధర్మమార్గముచే పంచభక్ష్యపరమాన్నాదివస్తువులను భుజించి జీవిం చుటకంటె ధర్మమార్గములోనుండి అంబలి కూటినీరు—వీనితో జీవించుట శ్రేష్ఠ తమము. అధర్మమార్గక్షీరాన్నాదులు విషముకలిసినవని దృఢముగా నమ్మదగు. సాక్షాదపరోక్షజ్ఞానము కలిగినను యుక్తాహారము వివిక్తవాసము బ్రహ్మచింత నము అను నీరత్నత్రయమును శరీరపతనపర్యంతము విడువరాదు. విడిచిన వారు లోకమున కపకారము చేసినవారును గురుద్రోహులును నగుదురు. ఉత్తమకులమున జన్మించినవారియందు ఒక్కడైనను దానికి సరియైన సమస్త గుణములను అలవరచుకొనక తాను శ్రేష్ఠుండనని తలచినచో ఆ కులమును ఆ దేశమును పతనమగును. అలాగుననే తక్కువకులమని తలంచి ఉత్కృష

స్థితిని పొందుటకు అర్హతలేదని కొందరు తలచుచో వారి వంశమును రాజ్యమును దుఃఖములో మునుంగును. ఒకడు దేహేంద్రియాదిసుఖములలో నెంత యాసక్తు డగుచున్నాడో అట్టివాడు లోకములో అంత బద్ధుడగుటయేగాక దైవదూరస్థుడుకూడ నగుచున్నాడు. ఒకడు ఇంద్రియసుఖములలో నెంతవిరక్తు డగుచున్నాడో అంత లోకములో విముక్తుడగుటయేగాక దైవసన్నిధి జేరుచున్నాడు. సత్యము ధర్మము ఆత్మపారిశుధ్యము అను నివి అనుష్ఠించుటకును వీనిని లోకములో నిరాటంకముగా ఉపదేశించుటకును సన్యాసమేర్పడినదని ఎవ్వరును మరవరాదు. నీళ్ళచే నిప్పును చల్లార్చునట్లు శాంతముచే కోపమును సత్యముచే అసత్యమును ధర్మముచే అధర్మమును శ్రద్ధచే ఆలస్యమును జయింపవలెను. నావచే సముద్రమును దాటునట్లు విచారణజ్ఞానముచే సంసారమును ధ్యానముచే మాయను యోగముచే మనస్సును ధైర్యముచే లోకమును దాటవచ్చును. వర్షముచే దావాగ్ని శమించునట్లు భక్తిచే తాతపత్రయాగ్నియు ప్రేమచే ద్వేషబుద్ధియు అమృతత్వముచే మృత్యువు జ్ఞానముచే అజ్ఞానమును శమించును. జీవితమంతయు నియమబద్ధముగా నుండవలెను. దృఢసంకల్పము కలుగుదశనుండియే మానవత్వము ప్రారంభమగుచుండును. నియమములు మానవులకుగదా యేర్పడినవి. మృగములకు కాదుగదా. ఇట్టి ప్రయత్నము అంతరాత్మయందు ఎంతవఱకు కలుగలేదో అంతవఱకు అతడు ఎన్ని విద్యలు నేర్చినను మృగావస్థయందుండువాడే యగును. ఇది యెంతకెంత తీవ్రముగా పరిణమించునో అంతకంతకు పరిశుద్ధాత్ముడై మానవు డీశ్వరసమీపమును జేరుచుండును.

ఆత్మనియమము కావలయునా? ఆహారనియమము నవలంబించవలయును. నిశ్చలధ్యానము కావలయునా? నిర్మలభక్తిలో మునుగవలయును. అగాధనిష్ఠలో ప్రవేశింపవలయునా? అఖండజ్ఞానము కలుగవలయును. సోహం భావ ముదయించవలెనా? అహంభావము నశించవలయును. నిర్వికల్పసమాధి కలుగవలయునా? సవికల్పము క్షీణింపవలయును. సత్యజీవితము గడపవలయునా? అసత్యలోకమును తృణీకరించవలయును. పరమశాంతిలో జీవింపవలయునా? అశాశ్వతమును విడువవలయును. కరుణామృతములో బ్రతుకవలయునా? కారుణ్యము నవలంబించవలయును. విరక్తులై యుండవలయునా?

సంస్కారము నందవలయును. దైవప్రేమ కావలయునా? లోకమును ప్రేమించ వలయును. దైవమయుమై యుండవలయును. సాధించవలయునా? సాధనలో నమరవలయును. వృత్తులనెడు బీజములను దహింపజేయుటలో ప్రాణాయామ మనెడు అగ్నికి సమానమైనది మరియొండులేదు. మనస్సనెడు మాయా తమస్సును నశింపజేయుటలో ఆత్మజ్ఞానైకబోధ మనెడు భాస్కరోదయమునకు సదృశమైనది మఱియొకటిలేదు. అహంకార మనెడు రాక్షసుని సంహరించుటలో నిర్మలభక్తియనెడు భగవంతునకు సమానమైనది మఱియొకటి యుండబోదు. ఖేద మనెడు బాధను తొలగించుటలో కరుణ యనెడు దివ్యరసాయనామృతమునకు సమానమైనది మఱియొకటిలేదు. సంసార మనెడు మాయాపాశమును ఛేదించుటలో వైరాగ్యమనెడు వజ్రాయుధమునకు సరియైనది మఱియొండు లేదు. ప్రసన్నమయిన నిత్యసంతోషమును కలుగజేయుటలో శాంతమనస్సనెడు చంద్రోదయమునకు సాటియైనది వేఱొకటిలేదు. నియమనిష్ఠలన్నిటిలోను సంయమమునకు సమానమైనది మఱియొకటిలేదు. ఇంద్రియములనెడు మృగములను నిగ్రహించుటలో వ్రతానుష్ఠానమనెడు సింహమునకు సమానమైనది మఱియొకటిలేదు. తత్వబోధ మనెడు దివ్యజ్యోతిని స్థిరముగా నిలుపుటలో బ్రహ్మచర్యమనెడు ఓజస్సునకు సమానమైనది మఱియొకటి లేదు. మానవుడు నిర్భయుడై వెలుగవలసియుండిన సత్యనిష్ఠకు సమానమైన ఏకచక్రాధిపత్యము తక్క మఱియొకటిలేదు. ద్వైతమునశింపగా అద్వైతప్రభువై ప్రకాశింపవలసియుండిన దైవత్వమునొందుటతప్ప మఱియొక యుపాయములేదు. సర్వాత్ర విజయము నొందవలసియుండిన నియమితకృత్యమును నిశ్చితకాలములో చేయుట కంటె గత్యంతరములేదు. దయాస్వరూపుడును సత్యస్వరూపుడును అగు సర్వేశ్వరుని లేక నిత్యానందమగు శాశ్వతపదవిని వెదకుటలోను సాక్షాత్కారమందుటలోను ఇతరులకు బోధించుటలోను శ్రద్ధవహించుటయు ఈ యాశయసిద్ధికై సులభమార్గములను కనిపెట్టుటలో దీక్ష వహించి యుండుటయు తానుండు మతములో సత్యమునకు ధర్మమునకును మానవుల ఇహాభివృద్ధికిని ఆత్మసౌఖ్యము (మోక్షము) నకును ప్రతిబంధకములు కలుగజేయు శాస్త్రములుగాని ఆచారములుగాని యేవియైననుండిన వానిని పరిత్యజించుటయు పై జెప్పినవానికి అనుకూలమైన విషయములు ఎచటనైన కనుపించిన నవశ్యముగ వానిని గ్రహించు

టయు జిజ్ఞాసువుల కర్తవ్యములు. ప్రాణిహింస చేయకుండుటయు ప్రాణివధకు సంబంధించిన ఆహారమును మానుటయు గంజాయి నల్లమందు సురాపానము మొదలగు దోషపదార్థముల విడచి శుద్ధాహారుడై శుద్ధప్రవర్తకుడై బ్రహ్మ సాక్షాత్కారపర్యంతము గురూపదిష్టనిష్ఠలను తప్పక అనుష్ఠించెడు వ్రతమును మానవుడు పూనియుండవలెను. విషయవిరక్తి బ్రహ్మచింతన జీవకారుణ్య పరమశాంతముల నాత డనుష్ఠింపవలెను.

పంచశీలములు. 1. సచ్చింతనము. 2. సద్గ్రంథపఠనము. 3. సత్ప్రవర్తనము. 4. సత్కర్మము 5. సత్సంగము ; వీటిని చక్కగా అనుష్ఠించువారు అభ్యుదయము గాంచగలరు. పంచభూతాత్మకమైన దేహమునకు పంచభూతములు సమానావస్థలో నుండినపు డేరీతిగా సౌఖ్యమొదవునో శరీరస్థ పంచభూతములలో దేనియందైన లోపము పొడసూపినయెడల దేహమునకు కీడు వాటిల్లునట్లు పంచశీలములలో దేనికైన కొఱతగలిగినచో ఆత్మజ్ఞానానంద సిద్ధికి అవాంతరము కలుగును.




సంపూర్ణ భక్త విజయము
రెండవ సంపుటము
త్వరలో వెలువడనున్నది.

శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావు గారిచే
రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రింపఁబడినది—1958

# సంపూర్ణభక్తవిజయము

## రెండవ సంపుటము

ఇది అచ్చులో నున్నది. ఈ మొదటి సంపుటమువలెనే ఇదియు మృదుమధురశైలిలో రచించబడినది. గొప్పభక్తుల చరిత్ర లెన్నో యిందు గలవు. ఈ మొదటి సంపుటము చదివినవారు ఇదియు చదివిననే మిక్కిలి ఆనందించగలరు. ఈ రెండవ సంపుటమున చేర్చిన భక్తుల చరిత్రములు ఈ క్రింద చూపుచున్నాము.

౧. మాణిక్యప్రభువు
౨. నరిసిమెహాతా
౩. సంతోబా
౪. గోమాబాయి
౫. జనాబాయి
౬. నీలకంఠనాయనారు
౭. కాన్హోపాత్ర
౮. రాకాకుంబారు
౯. కన్నప్పనాయనారు
౧౦. కర్మాబాయి
౧౧. కూర్మదాసు
౧౨. శ్రీజయదేవుడు
౧౩. నళోబా
౧౪. షేక్ఫరీదు
౧౫. రసికకుమారుడు
౧౬. ఉద్ధవచిద్ఘనుడు
౧౭. గోరాకుంభారు

౧౮. నరసింహామేథ

౧౯. వాగీశనాయనారు

౨౦. పీపాబా

౨౧. స్పర్శభాగవతుడు

౨౨. సుందరమూర్తినాయనారు

౨౩. జోగాపరమానందుడు

౨౪. కూపాకుంభారు

౨౫. భానుదాసు

౨౬. రోహిదాసచాంభారు

౨౭. జ్ఞానసంబంధమూర్తినాయనారు

౨౮. పన్నాజీదాసు

౨౯. ధనాజాటుడు

౩౦. సేనానాపితుడు

౩౧. ఎరిభక్తనాయనారు

౩౨. శాంతబ్రహ్మణిరాజు

౩౩. పులక్పుకారు

౩౪. జయమల్లరాజు

౩౫. రామరాజు

౩౬. సుఖానందుడు

౩౭. లతీబుసాహేబు

౩౮. పుణ్యవతి

౩౯. దామాజీపండితుడు

౪౦. రామదాసు

౪౧. చాంగదేవుడు

౪౨. బహిరాపిసా

౪౩. ఓహారుదాసు

౪౪. నాగనాథుడు

౪౫. మనోహాహానసురదాసు

౪౬. బోధలబావా
౪౭. ఏకనాథస్వామి
౪౮. సాత్వికరాజు
౪౯. కేశవస్వామి
౫౦. త్రిలోచనదాసు
౫౧. లాడుబావా
౫౨. నాభాజీదాసు
౫౩. మాధవదాసు
౫౪. జ్ఞానదేవుడు
౫౫. వివేకానందస్వామి
౫౬. వాగీశనాయనారు
౫౭. తొండరడిప్పొడియాళ్వారు
౫౮. నమ్మాళ్వారు
౫౯. గోదాదేవి
౬౦. తిరుమంగై యాళ్వార్
౬౧. పెరియాళ్వార్
౬౨. రామతీర్థస్వామి
౬౩. హరివ్యాసుడు
౬౪. త్రిపురదాసు
౬౫. నానకుదాసు — ఇంకనూ మరికొన్ని.

---

ఈ రెండవ సంపుటము వెల రు **10/-**
పోస్టేజీ వేరు

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
**సరస్వతీ పవర్ ప్రెస్**
**రాజమహేంద్రవరము**